

# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
## ప్రథమ సంపుటము
## 1, 2 మండలములు


ఆంధ్రానువాదకర్త
కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

సంకలనకర్త - పరిష్కర్త - పూరణకర్త
బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"






ప్రచురణ :
పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. యస్.
కార్యనిర్వహణాధికారి

**తిరుమల తిరుపతి దేవస్థానములు**
**తిరుపతి**
**1981**



# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
## ప్రథమ సంపుటము
## 1, 2 మండలములు


ఆంధ్రానువాదకర్త
కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి

సంకలనకర్త - పరిష్కర్త - పూరణకర్త
బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
''కళా-ప్రపూర్ణ''






ప్రచురణ :
పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఏ. యస్.
కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి
1981




# SAMULA
# SRIMADANDHRA RUGVEDA SAMHITA

I VOLUME

1, 2 Mandalas

*Telugu Translation*

*by*

Kavyateertha

NEMANI VENKATA NARASIMHA SASTRY

Compiled, Edited
and completed
*by*
Brahmarshi
Dr. VADLAMUDI GOPALA KRISHNAIAH
Kala-prapurna

T. T. D. Religious Publication Series No. 108

*FIRST EDITION*

*Copies : 2,000*

Price : Rs. 100

*Published by :*
P. V. R. K. PRASAD, I. A. S.
*Executive Officer,*
*Tirumala Tirupati Devasthanams*
TIRUPATI
*Andhra Pradesh*




*Printed at :*
Swatantra Press
Bakaram
Hyderabad-500 048.



# విషయసూచిక

# తిరుమల తిరుపతి దేవస్థానముల ధర్మకర్తల మండలి

విజయీభవ !

కమలాకుచచూచుకకుంకుమతో
నియతారుణితాతులనీలతనో !
కమలాయతలోచన ! లోకపతే !
విజయీభవ ! వేంకటశైలపతే !

విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ।

యద్ భద్రం తన్న ఆ సువ॥

సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
ద్వితీయ సంపుటము - 747 పుట
5వ మండలము-82వ సూ-5వ ఋక్కు

దురితాలను నెపుడును మా, దరిని జేరనీయకుమా !
పరమభద్రపుంజము మా, పరముగాఁగ నీయుమా !॥

సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
ద్వితీయ సంపుటము - 748 పుట
ఫుట్ నోటులోనున్న ఋగనువాదము

# తొలిపలుకు

శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్, ఐ. ఎ. యస్.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

వేదములు పరమేశ్వర నిశ్శ్వసితరూపములు. నిత్యములై అపౌరుషేయములైన వాటిద్వారానే ఈ జగత్సృష్టి జరుగుచున్నది. అవి సకల లోకధర్మ సర్వస్వభూతములు. "కేవలము మానవులకేగాక దేవతలకుగూడ వేదములు సనాతనమైన జ్ఞాననేత్రములు. నాలుగు వర్ణములు, ముల్లోకములు, నాలుగు ఆశ్రమములు, జరిగిన, జరుగుచున్న, జరుగనున్న సకలలోక వ్యవహారములు వేదమాత ఒడిలోనే ప్రసిద్ధినందుచున్న"వను మను శాసనము భారతీయులమగు మనకు పరమప్రమాణము.

లోకములోని ప్రతిజీవియు తనకు 'అభీష్టము సిద్ధించవలెనని, అనిష్టము కలుగరాదని' సహజముగ భావించుచుండును. దీనికై ప్రత్యక్షముగనో, ఊహతోనో ఎన్నింటినో లౌకికోపాయములను అన్వేషించుచుండును. వాటితో తన అభీష్టసిద్ధికొఱకు ప్రవర్తించుచుండును. కాని శాశ్వతముగ ఇష్టప్రాప్తి కలుగవలెనన్నను, అనిష్టము పరిహరింపబడవలయునన్నను ఈ లౌకికోపాయము లుపయోగించవు. అలౌకికమైన ఉపాయము తప్పక కావలెను. ఈ అలౌకికోపాయమును తెలియజేయునదియే వేదమని మన సంస్కృతి బోధించుచున్నది.

ఈ వేదములు 1. ఋగ్వేదము, 2. యజుర్వేదము, 3. సామవేదము, 4. అథర్వవేదము అను భేదముతో నాలుగు విధములు. అందు యజుర్వేదము శుక్ల-కృష్ణ భేదముతో రెండు విధములు. ప్రపంచ పుస్తక భండారమునందే మొట్టమొదటి పుస్తకముగా ప్రాచ్యపాశ్చాత్య పండితులచే ప్రశంసింపబడిన ఋగ్వేదము ఈ పరంపరలో అద్వితీయమై ప్రథమస్థాన మలంకరించుచున్నది.

అర్థము ననుసరించి పాదవ్యవస్థ కలదానిని 'ఋక్' అందురు. ఈ ఋక్కుల చేరికయే 'ఋక్సంహిత' అనబడుచున్నది. వేదవ్యాసుడు గాసట బీసటగానున్న వేదమంత్రముల నన్నింటిని వేటికి వాటిని విడదీసి విడివిడిగ కూర్చినాడు. ఈ ఋక్సంహితలోని ఋక్కులే ఇతర వేదములలో చాలవఱకు కనబడుచున్నవి. కనుక ఋక్సంహితకు మిగిలిన వాటికంటె ఎంతయో ప్రాధాన్యమున్నది.

అర్థజ్ఞానములేక కేవలము వేదమును పారాయణము చేయుటవలన తగినంత ప్రయోజనము సిద్ధించదని వేదములే ఉద్ఘోషించుచున్నవి. సామాన్యులకు అర్థజ్ఞానము కలుగుట దుర్లభము. అధ్యయనాధ్యాపన పద్ధతిలో అర్థజ్ఞానమును సంపాదించుట ఏకొద్దిమందికోగాని కుదరదు. మాతృభాష అయిన తెనుగులో అనువాదము దొరికినచో నిజముగ ఆంధ్రులమైన మనమందఱము వేదార్థమును కనీస మొక దృక్కోణములోనైన గ్రహింపజాలుదుము. బహుశ్రమ సాధ్యమైన ఇట్టి మహాకార్యమును ఏ సంస్థ ప్రోత్సాహమును లేకయే నిస్స్వార్థముగ రాత్రింబవళ్ళు కృషిచేసి సాధించినవారు బ్రహ్మశ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు. ఆయన నిజమైన మహర్షియనుటలో అతిశయోక్తిలేదు.

శ్రీ శాస్త్రిగారు కావ్యతీర్థ బిరుద విభాసురులు. వీరు బరంపురము కళాశాలలో తెలుగు పండితులుగ పనిచేసి వైదిక వాఙ్మయముపైన నిశిత పరిశోధన జరిపినవారు. వైదిక వాఙ్మయమును అందఱకును అందుబాటులోనికి తీసికొనిరావలయునను సదుద్దేశ్యముతో ఋక్సంహితను చాలావఱకు పద్యములలోను అక్కడక్కడ గద్యమునందును అనువదించినారు. ఈ గ్రంథరచనచేసి సుమారు 50 సంవత్సరములు గడిచినవి. ఇది వెలుగును చూచు భాగ్యమునకు నోచుకొనలేదు. తిరుమల తిరుపతి దేవస్థానమువారు దీనిని ఏవిధముగానైనను ప్రకాశింపజేయవలయునని సంకల్పించినారు. ఆంధ్రదేశమునందు వైదిక వాఙ్మయమున బాగుగా కృషిచేసిన వారికి ఈ కార్యభారము నప్పగించిన బాగుండునని అభిప్రాయపడిరి. హైదరాబాదులోని ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము పరిశోధనాలయముల డైరక్టర్‌గా పనిచేసి విశ్రాంతి తీసికొనుచున్న బ్రహ్మర్షి, కళా-ప్రపూర్ణులు, వాఙ్మయమహోధ్యక్షులా

శ్రీ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారి కప్పగించవలయునని భావించి యీ కార్యభారము వారిపైనిడుట జరిగినది. వారి సంపాదకత్వమున కార్యక్రమము ప్రారంభమైనది.

మధ్యమధ్య ఎన్నివిఘ్నము లెదురైనను ఎట్టకేలకు తిరుమలేశుడైన శ్రీనివాస భగవానుని దివ్యాను గ్రహమువలన ఇప్పటికి దీనికొక స్వరూపమేర్పడినది. మొదటిభాగమును ఇప్పటికైనను ఈ రూపములో ఆంధ్ర దేశమున కందించు భాగ్యము తిరుమల తిరుపతి దేవస్థానమునకు కలిగినందుకు నేనెంతో సంతోషపడుచున్నాను.

ఇంతటి విజ్ఞాన భాండాగారమును తెలుగులో మనకందించి అజరామరకీర్తి నార్జించిన బ్రహ్మశ్రీ నేమాని వేంకటనరసింహశాస్త్రిగారికి తెలుగుజాతి ఎంతగానో ఋణపడియున్నది. వారికి శ్రీనివాసుడు ఆత్మశాంతి కలిగించ గలదని నా ధృఢవిశ్వాసము.

ఈ సంపాదన కార్యక్రమమును తమకున్న యావచ్ఛక్తిసామర్థ్యములను వినియోగించి శ్రీ వఝ్ఝమూడి గోపాలకృష్ణయ్యగారు సమర్థతతో కొనసాగించుచున్నారు. మూల ఋగ్వేదము తెలుగులిపిలో ఇంతవరకును ప్రక టితము కాలేదు. అందువల్ల శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహితను సమూలముగా ప్రకటించినచో మూలఋగ్వేదపఠన పరిశీలన పరిశోధనలపై ఆసక్తికలవారికి అత్యంత ప్రయోజనకారిగా నుండగలదని భావించి దీనిని సమూలముగా ప్రకటించుట జరుగుచున్నది. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వివిధ ఋగ్వేద ముద్రితప్రతులను వ్రాతప్రతులను పరిశోధించి పాఠాంతరములిచ్చిరి. పెక్కు 'ఖిల'మంత్రములను 'ఖిల' సూక్తములను తమ ఆంధ్రీకరణతోపాటు తొలి సారిగా మూలఋగ్వేదసంహితలో కలిపిరి. ఈ రూపముగా నీ ఋగ్వేదము సర్వమంత్ర సంకలితమై సమగ్రతను సంతరించుకున్నది. శ్రీ నేమానివారు ఆంధ్రీకరింపక అసంపూర్తిగా వదలివేసిన భాగములను శ్రీ వఝ్ఝమూడివారు పూర్తి చేసినారు. వీరు నిస్స్వార్థముగాచేసిన ఈ నిర్విరామ కృషిని అటు పండితలోకము, ఇటు సామాన్య ప్రజానీకము గుర్తించి అభినందించగలదని నా నమ్మకము. ఇంతటి కార్యక్రమమును నిర్వర్తించినందుకు వారిని అభినందించుచున్నాను.

ఇది ప్రథమ, ద్వితీయమండలములతోకూడిన మొదటిభాగము మాత్రమే. ముందుముందు ఇటువంటివి ఇంకను మూడుభాగములు ప్రచురించబడును.

ఈ పుస్తకము వెలుగు చూచుటలో అప్పుడప్పుడు వచ్చిన ఇబ్బందులను తప్పించి టి. టి. డి. ప్రజా సంబంధ శాఖాధికారి శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి త్వరితగతిని ముద్రణాది కార్యక్రమాలు జరిపించిరి. ఆయనకు నా అభినందనలు.

భారతప్రభుత్వ విదేశాంగశాఖా మంత్రిగా ఒక్క విదేశవ్యవహారాలలోనే కాక దేశ వ్యవహారాలలో నైతము అవిశ్రాంతముగా తలమునకలుగా వివిధ కార్యక్రమాలలో నిమగ్నులై యుండియు తమ అమూల్యమైన కాలమును కొంత వినియోగించి యీ గ్రంథమునకు "పరిచయము" వ్రాసిన బహు భాషాసాహితీకోవిదులును విమర్శకులును రచయితలునయిన గౌరవనీయులు శ్రీ పి. వి. నరసింహారావుగారికి మా వందనములు.

ఈ గ్రంథమునకు దయతో "ఆముఖము" వ్రాసిన ఆంధ్రప్రదేశ్ దేవాదాయ ధర్మాదాయ శాఖామాత్యులు గౌరవనీయులు శ్రీ పి. వి. చౌదరిగారికి మా వందనములు.

శ్రీ నేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులను ప్రచురణ నిమిత్తమై మా కందించిన రాజమండ్రి గౌతమీ గ్రంథాలయమువారికి మా కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఆంధ్రలోకమునకు అందించుచున్న వైదిక ప్రసూనమిది. ఆంధ్రు లందఱును దీని సౌరభాలను ఆఘ్రాణించి ఆనందించగలరని ఆశించుచున్నాను.

పి. వి. ఆర్. కె. ప్రసాద్,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# పరిచయము

శ్రీ పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖా మంత్రి, భారత ప్రభుత్వము

వేదములు మన ప్రాచీన భారతీయ మహర్షులు ద్రష్టలుగా అవతరింపజేసిన అపౌరుషేయ మహాసంపదలు. ''అనంతా వై వేదాః'' అని వేదమే పేర్కొన్నట్లు వాస్తవమునకు వేదము లనంతములు. అనంతములైన యీ వేదములలో మనకు లభ్యమైనవి కొన్ని మాత్రమే. మొదట వేదమొక్కటిగానే అవతరించగా దానిని చతుర్వేద ములగు ఋగ్వేద - యజుర్వేద - సామవేద - అథర్వ వేదములుగా వేదవ్యాస మహర్షి విభజించి ప్రచారక ప్రవక్త అయినట్లు ప్రసిద్ధి కలదు. వేదమును నాల్గు వేదములుగా విభజించి ప్రచార మొనరించిన తొలి మహర్షి పైలమహర్షి యని కొందరు భావింపగా కపిల మహర్షి యని మరికొందరు తలంచినారు. ఏకైకమైన వేదము చతుర్వేదములుగా విభజితమైనప్పటికిని చతుర్వేదములు సైతము మహత్తరాలైన బృహత్తర గ్రంథాలుగా నుండి అధ్యయన అధ్యాపన లకు క్లిష్టముగా నున్నందువల్ల మన మహర్షులే ప్రాచీన కాలములో ఋగ్వేదమును 21 శాఖలుగను, యజుర్వేదమును 101 శాఖలుగను, సామవేదమును సహస్రశాఖాత్మకముగను, అథర్వవేదమును నవసంఖ్యా పరిమిత శాఖలుగను విభజించివివిధ శిష్య బృందములకు ఒక్కొక్కశాఖ వంతున బోధించి విభిన్నశాఖలను పరివ్యాప్తి చెందించి ప్రచార మొనరించిరి. 21 శాఖలుగా విభజితమైన ఋగ్వేద శాఖలలో ఐతరేయ శాఖ - శాకల శాఖ - పౌఖియ శాఖ అన్న త్రివిధ నామాలతో నిర్దిష్టమైన ఒకే ఒక సంహితాగ్రంథము మనకు లభ్యమై విస్తృత ప్రచారము నొందినది. అత్యంత ప్రాచీన కాలమునుంచి ఒక్క ఋగ్వేదమే కాక మిగిలిన వేదశాఖలు కొన్ని మాత్రమే గురుశిష్య పరంపరగా అధ్యయన అధ్యాపనలతో గూడ సురక్షితముగా నిలిచియున్నవి. వేదాలు కేవలము గురుశిష్య పరంపరలో అధ్యయన అధ్యాపనల రూపములో మాత్రమే కాక ఆదినుండియు, వేదముల లేఖనమునకు సంబంధించిన 'లిపి' యేర్పడియున్న దనియు, పుస్తకరూపములో వ్రాసియుంచుటద్వారాకూడ మన మహర్షులు వేదములను రక్షించినారనియు డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్యగారు తమ పీఠికలో వివరించినారు. దీనివల్ల ప్రాచీన భారతీయ ఆర్షవాఙ్మయ వ్యవస్థ యెంత స్థిరముగా వెలుగొందినదో మనమూహించ వచ్చును.

ప్రస్తుతము భారతదేశములో విస్తృత ప్రచారములో నుండి మన కుపలభ్యమానమైన ఋగ్వేద ఐతరేయశాఖ కాత్యాయనముని సంపాదితమైనది. అధ్యయన రూపముగానే కాక గ్రంథరూపమునగూడ ఋగ్వేదములోని సూక్త ములకు, అధ్యాయములకు - అష్టకములకు - మండలములకు ఒకానొక క్రమవ్యవస్థ నేర్పరచిన వ్యక్తులలో కాత్యాయన మహర్షి ఒకరు. అనంతమైన వేదమునకు ఆద్యంతములు పేర్కొనుట సాధ్యము కాకున్నను అధ్యయన అధ్యాపనలకు ఏదో ఒక క్రమ వ్యవస్థ ఆవశ్యకము. అందువల్ల సకారణముగానే ప్రాచీనులొక క్రమ మేర్పరచిరి. సృష్టివ్యవస్థకు మూలము అగ్నికాబట్టి అగ్నిసూక్త మాదిగా ఋగ్వేద శాకల శాఖను ప్రాచీనులు రూపొం దించినారు. ఈ ఋగ్వేద శాకల శాఖ కాత్యాయనముని సంకలిత సంహితకు పూర్వమే సాంఖ్యాయన మహర్షి ఒక సంహితను, బాష్కల మహర్షి మరొక సంహితను, శౌనక మహర్షి వేరొక సంహితను రూపొందించినట్లు కొన్ని వివరాలతో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు పీఠికలో వివరించినారు. ఈ విషయము లన్నింటిని పరిశీలించగా

చరిత్రకారు లూహించిన కాలమునందే కాక అత్యంత ప్రాచీన వేదకాలములోనే భారతీయుల లేఖనాస్వరూపమై 'లిపి' చాల సువ్యవస్థితమై యున్నదని చెప్పక తప్పదు. లిపి - లేఖన వ్యవస్థయే లేనిచో ఋగ్వేదమందలి ఒకే ఒ శాఖకు ఇన్ని సంహితలు యేర్పడియుండెడివి కావు. కాగా వేదకాలమున లిపి ఉన్నదని నిస్సందేహము చెప్పవచ్చును.

యాస్కాచార్యుని నిరుక్తము వేదపదార్థములకు స్వచ్ఛమైన దర్పణము వంటిది. భాష్యకర్త లందరి సాయనాచార్యులు, స్కందాచార్యులు సుప్రసిద్ధులు. ఆంధ్రుడై పుట్టి పెరిగి క్రీస్తుశకము 15 వ శతాబ్దములో సు సాయనాచార్యులు రచించిన వేదభాష్యము ఒక్క ఆంధ్రదేశమునందే కాక ఆసేతుహిమాచల పర్యంతము పూర్వ నుంచి నేటివరకును విస్తృతప్రచారము నొంది పరమప్రామాణికమై శిరోధార్యముగా భావింపబడుచున్నది. ఆధు యుగములో నార్ష సంస్కృతీ ప్రచారమునకు వేదవాఙ్మయ ప్రచారమునకు శ్రీ దయానంద సరస్వతి చేసిన సే అమూల్యమైనది. శ్రీ దయానంద సరస్వతి విరచించిన వివిధ వేద భాష్య విమర్శనాది గ్రంథములు భారతదే మంతటను వివిధదేశ భాషలలో ననూదితములై బహుళప్రచారము నొందినవి.

ఆధునిక యుగములో లోకమాన్య శ్రీ బాలగంగాధర తిలక్ - డాక్టర్ రాయల్ - శ్రీ ధీరేంద్రన మహోపాధ్యాయ - శ్రీ పి. సి. సేన్ గుప్త - శ్రీ సి. ఆర్. దత్తు - వి. వి. కేత్కర్ - రాహుల్ సాంకృత్యాయ మొదలైన భారతీయులు శ్రీ జాకొబ్, డాక్టర్ ఫర్నెల్, డాక్టర్ వింటర్నిట్జ్, ప్రొఫెసర్ మాక్సుముల్ల హెచ్. జి. వెల్స్ - ప్రభృతి పాశ్చాత్య పండిత పరిశోధకులు వివిధ దృక్కోణాలలో పరిశోధనలు చేసి విమ పూర్వకమైన పెక్కు రచనలు చేసినారు. వేదాలను సేకరించి భద్రపరచి పండితులతో సుపరిష్కృతము కావిం ప్రచురించి విస్తృతముగా పండితప్రజల కందించుటకు కృషిచేసిన విదేశీయులలో మాక్సుముల్లర్ ప్రథముడు. వే విజ్ఞానముమీద, వేద సంస్కృతిమీద, వేదములమీద, మాక్సుముల్లర్‌కున్న గౌరవ మపారమైనది.

ప్రాచీనకాలమున చతుర్వేదములకు నెందరెందరో పండితులు భాష్యములు రచించిరి. కాని యవి యన్నిం వివిధ భారతీయ దేశ భాషలలోనికి అనూదితములై, ప్రకటితములై సులభముగా ప్రజల కందుబాటులోనికి రావలసి యవసర మెంతయును కలదు. విశ్వశాంతి సౌభాగ్యాలకు పెట్టని కోటలుగా వెలుగొందు బహుముఖమైన వేద విజ్ఞ రహస్యములు ప్రజల కందుబాటులో లేకుండ పోయినందువల్లనే మన అమూల్యమైన ప్రాచీన భారతీయ సంస్కృ దెబ్బతిన్నది. సాహితీ సంస్కృతులు జాతికి జీవనాడుల వంటివి. సాహితీ సంస్కృతులు ప్రజలకు దూరమైన జాతి నిర్వీర్యమైపోవును. అందువల్ల వేదములను వివిధ దేశభాషలలోని కనువదించి ప్రజల కందించుట చా అవసరమని ఈ శతాబ్దములోనే అనేకులు గుర్తించిరి. తత్ఫలితముగా అనేకులు ఆంగ్ల భాషలో విజ్ఞానప్రదములై విమర్శాగ్రంథములు వ్రాయగా శ్రీ దయానంద సరస్వతి హిందీలో పెక్కు గ్రంథములు విరచించిరి.

ఇట్టి యావశ్యకతను 50 సంవత్సరాలకు పూర్వమే గుర్తించి కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసిం శాస్త్రిగారు ఋగ్వేదమును చాలవరకు సాయన భాష్యానుసారముగా లలిత పద సంకలితమైన పద్య గద్యాత్మకము నాంధ్రీకరించిరి. శ్రీ నేమానివారు 1882 ప్రాంతములో జన్మించి 1932 లో హఠాత్తుగా కీర్తిశేషులయిరి. శ్రీ శా గారు సంస్కృతాంధ్ర, ఆంగ్ల, హిందీ, ఒరియా భాషలలో మంచి కవి. పండితులు. విమర్శకులు. పరిశోధకు వారు దాదాపు ఆరు సంవత్సరములపాటు రాత్రింబవళ్ళు కృషిచేసి బహుగ్రంథ పరిశీలనతో "శ్రీమదాంధ్ర ఋగ్వే సంహిత" అన్నపేరుతో ఋగ్వేద శాకల శాఖను చాలవరకు ఆంధ్రీకరించిరి. మధ్యమధ్య వివిధ సూక్తములలో

కొన్నికొన్ని ఋక్కులు, కొన్నికొన్ని సూక్తములు ప్రమాద వశమునను - కొన్ని ఋక్కులు, సూక్తములు దుర్గ్రాహ్యములుగా నున్నందువల్లను ఆంధ్రీకరించక విడిచిపెట్టిరి. వారు కీర్తిశేషులైన తరువాత వారి యాంధ్ర ఋగ్వేదసంహిత వ్రాతప్రతులు రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయములో భద్రపరుచబడగా వాటిని స్వీకరించి తిరుమల తిరుపతి దేవస్థానమువారు మూల వేదముతోసహా యీ ఆంధ్ర ఋగ్వేద సంహితను బ్రహ్మర్షి, వాఙ్మయ మహాధ్యక్ష బిరుదాంచితులు, నాకు చిరపరిచితులు నగు మిత్రులు డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ" గారిచేత సంకలనము చేయించి పరిష్కరింపించి లుప్తభాగ పూరణములు చేయించి ప్రకటించుట ముదావహమైన విషయము.

డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు సుప్రసిద్ధ పండిత పరిశోధకులు. గత ముప్పది సంవత్సరములుగ వివిధ శాస్త్రములలోను బహుముఖమైన వేద విజ్ఞానములోను నవిశ్రాంతముగా పరిశోధన లొనరించుచున్న మేధావి. పైగా అత్యంత హృదయంగమమైన లలిత కవిత రచియించగల మనీషి. కావ్యతీర్థ బిరుదాంచితులైన శ్రీ నరసింహశాస్త్రి గారి ఆంధ్ర ఋగ్వేదమును పరిష్కరించి శేషభాగ పూరణము చేసి మూల ఋగ్వేదముతో సంకలనము చేయు బాధ్యతను వారు వివిధ దృక్కోణములలో చక్కగా నిర్వహించి యీ బృహత్తరమైన సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను నాలుగు సంపుటాలలో రూపొందించినారు.

మూల ఋగ్వేదము సంపూర్ణముగా తెలుగులిపిలో ప్రచురణమగుట యిదే ప్రథమము. మూల ఋగ్వేద మును రూపొండించుటలో డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వివిధ ముద్రితప్రతులను వ్రాతప్రతులను తులనాత్మకముగా పరిశీలించి పాఠాంతరములను ఆయా సందర్భములలో ఫుట్‌నోట్‌లలో నిచ్చిరి. వేదము పదములమీదనేకాక సుప్ర తిష్ఠితమైన స్వరవ్యవస్థపైనసైతము నాధారపడియున్నది. స్వరము మారినచో నర్థముమారునని తత్ఫలితముకూడ భిన్నమగునని ప్రాచీన మహర్షులు చెప్పిరి. ఒక్క ఋగ్వేద శాకలశాఖకే బాష్కల సంహిత-సాంఖ్యాయన సంహిత శౌనక సంహిత-కాత్యాయనముని సంహిత అని నాలుగుభిన్నసంహిత లేర్పడినప్పుడు శబ్దముల విపరిణామములలోనే కాక స్వరముల విపరిణామములలోనుగూడ, మహర్షులలోనే అభిప్రాయభేదము లున్నవనుట స్పష్టము. ఈ వేద స్వరశబ్దవ్యవస్థల విషయమై మనమహర్షుల అడుగుజాడలలో ఆచరణపూర్వకముగా బహుముఖమైన పరిశోధనలు జరుపవలసియున్నది. ఈ పరిశోధనలలో నార్షవిజ్ఞానపు నిగ్గులు తేల్చుటకు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారిచ్చిన వివిధ పాఠాంతరము లెంతైనను నుపయుక్తములు కాగలవు.

వేదాలంకారాల విషయమై డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు పీఠికలో వ్రాసిన విషయములు మౌలికములు. మనకున్న అలంకారశాస్త్రములు తెలుగువ్యాకరణ దీపమువలె చాల చిన్నవి. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు చెప్పిన విధముగా వేదాలంకారాలవిషయమై అంతరాంతరాలలోనికి వెళ్ళి పరిశోధనలు చేయవలసియున్నది.

ఆధునికయుగములో ఖగోళశాస్త్రము కొత్తమలుపు తిరిగి ఆధునికవిజ్ఞానబలముతో గ్రహాంతరయానము నకు మార్గమును సుగమము చేసినది. ఇదియెంతయు ప్రశంసనీయము. గర్వకారణము. మన వేదర్షులు తమ తపస్సుతో ఓషధీమంత్రయోగాది విద్యలతో ఒక్క భూమ్యాకర్షణశక్తికి మాత్రమేకాదు, ఏగ్రహాకర్షణశక్తులకు సైతము లోబడక వాటి ఆకర్షణశక్తిని సైతము అరికట్టి కేవలమానసికశక్తితో గ్రహాంతరయానము నిత్యకృత్య ముగా నొనరించుకున్నట్లు చరిత్రయు వేదవిజ్ఞానములును చాటుచున్నవి. ఇటువంటి బహుముఖమైన వేదవిజ్ఞాన

ములో అసాధారణమైన మౌలికమైన పరిశోధనలుచేసి మహత్తరభారతీయ వేదవిజ్ఞానమును ప్రపంచము ముందుంచ వలసిన అవసరమెంతయు గలదు. ఈ దృష్ట్యా మూలవేద మంత్రశబ్ద, నిశ్శబ్ద శక్తులమీద బహుముఖముగా ఆచరణపూర్వకముగా పరిశోధనలు చేయుట కీ మూలఋగ్వేద మెంతయు నుపయుక్తము కాగలదు.

తిరుమల తిరుపతి దేవస్థానమువారు హిందూధర్మప్రచారమునకు బహుముఖాలుగా కృషి చేయుచున్నారు. అనేక గ్రంథములను ప్రచురించి చౌకధరలకు ప్రజల కందించుచున్నారు. వేదముల ప్రచారమునకు కూడ అనేక విధముల కృషి చేయుచున్నారు. వేదపండితులకు గౌరవవేతనములిచ్చి పోషించుట, వేదవిద్యార్థులకు ఉపకార వేతనము లిచ్చి వేదాభ్యాసమును ప్రోత్సహించుటయేకాక, ఆధునికతా ప్రభావమున క్రమక్రమముగా క్షీణించుచున్న వేదాధ్యయనవ్యవస్థను దృష్టిలోపెట్టుకొని వివిధవేదములను సస్వరముగా ప్రామాణికులైన పండితులచేత చదివించి టేప్‌రికార్డ్ కూడ చేయించి ముందుతరాలవారికోసమై పరిశోధనల నిమిత్తమై భద్రపరచుచున్నారు. చివరికి వేదముల నన్నింటిని నాంధ్రీకరింపజేసి సమూలముగా ప్రచురించి యేవిధమైన లాభాపేక్షయేకాదు తాము పెట్టిన పెట్టుబడి నైనను తిరిగి రాబట్టవలయునను దృష్టికూడలేకుండ చాలతక్కువవెలకు ప్రజలకందునట్లు చేయవలయునను సంకల్పముతో నీకృషికి సమకట్టినారు. ఇందుకు ప్రతిఫలముగానే యీ సమూల శ్రీమదాంధ్రఋగ్వేదసంహితను నాలుగు బృహత్తర సంపుటాలలో ప్రకటించుచున్నారు. ప్రథమ, ద్వితీయ మండలములతోనున్న ప్రథమ సంపుటమును తొలుత ప్రకటించుచున్నారు. తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠమండలములతోనున్న ద్వితీయ సంపుటము, సప్తమ, అష్టమ మండలములతోనున్న తృతీయసంపుటమును, నవమ, దశమమండలములతోనున్న చతుర్థసంపుటమునుకూడ నచిరకాలములోనే వెలువరింతురని ఆశించుచున్నాను.

ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను ప్రచురించుచున్నట్లే సమూల శ్రీమదాంధ్ర శుక్ల - కృష్ణ యజుర్వేద సంహితలను, సమూల శ్రీమదాంధ్ర సామవేద కౌథుమ-జైమిని-రాణాయనీయశాఖ సంహితలను కూడ ప్రామాణిక గ్రంథములుగా ప్రకటించవలసిన అవసరమెంతయు గలదు. ఏవో చిన్నచిన్న భాగములు తప్ప అథర్వవేద మింతవరకును మూలగ్రంథమే ముద్రితము కాలేదు. అయిదారు సంవత్సరముల క్రిందట ఒరిస్సా రాష్ట్రములో ఒక అథర్వవేద లిఖితప్రతి లభ్యమైనట్లు పత్రికలలో వార్త వచ్చినది. ఈ లిఖితప్రతి ఒరిస్సాప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో భద్రపరుపబడియున్నది. దీని నాంధ్రీకరింపజేసి అముద్రితముగనున్న మూలగ్రంథముతోపాటు ముద్రించి ప్రకటింపవలసిన అవసరమెంతేని కలదు. తిరుమల తిరుపతి దేవస్థానమువారు ఈ కర్తవ్య నిర్వహణలో కృతార్థులయి విజయవంతులు కాగలరని హృదయపూర్వకముగా నాశించుచున్నాను.

పి. వి. నరసింహారావు
విదేశాంగశాఖా మంత్రి
భారత ప్రభుత్వము

9, మోతీలాల్ నెహ్రూ మార్గ్
కొత్త ఢిల్లీ



శ్రీ పి. వి. చౌదరి
దేవాదాయ-ధర్మాదాయశాఖా మంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

# ఆముఖం

శ్రీ పి.వి. చౌదరి
దేవాదాయ-ధర్మాదాయ శాఖా మంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

వేదములు అపౌరుషేయములు. మన ప్రాచీన భారత సంపదలలో తలమానికమువంటి అమూల్య సంపదలుగా మన మహర్షులకు భగవద్దత్తాలై అవి అవతరించాయి. వేదం ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదం అని నాలుగు వేదాలుగా విభజితాలైన సంగతి అందరికీ తెలిసినదే. యజుర్వేదం శుక్లయజుర్వేదమనీ, కృష్ణయజుర్వేదమనీ రెండువిధాలుగా విభజితమైన సంగతికూడా సుప్రసిద్ధమైనదే. అత్యంత ప్రాచీనకాలంలో గురుశిష్య పరంపరగా గ్రహణ ధారణ శక్తులు క్రమంగా క్షీణదశను పట్టగా వేదాలను కాపాడడంకోసం వాటిని విభిన్న శాఖలుగా కొంతకొంత గ్రంథభాగాలను యేర్పరచి విభజించడం జరిగింది. ఈ శాఖలన్నీ అత్యంత ప్రాచీనకాలం నుంచీ ఆనువంశికంగా ఋషిపరంపరగా గురుశిష్య పరంపరగా శ్రద్ధాభక్తులతో అధ్యయనం చెయ్యబడ్డాయి. వేదాధ్యయనంపట్ల కొంత అనాదరదృష్టి అత్యంత ప్రాచీనకాలంలోనే యేర్పడినందువల్ల పెక్కు ఋగ్వేదశాఖలు నామమాత్రావశిష్టాలై పోయాయి. ఋగ్వేదంలోవున్న 21 శాఖలకుగాను ప్రస్తుతం యెనిమిది అష్టకాలతో పది మండలాలతోవున్న ఋగ్వేద శాకల శాఖ ఒక్కటే మనకు లభించింది.

వేదాలు మంత్రాత్మకాలు. ప్రళయకాలం తరువాత మహర్షులు ద్రష్టలుగా యీ వేదాలు స్మరింపబడినాయి. ఆ తరువాత గురుశిష్యపరంపరగా యివి సంరక్షింపబడుతూ ఈనాటికి గ్రంథరూపంలో కొంతవరకైనా ఉపలభ్యమానమయ్యాయి. ఈ అనంత విశ్వంలో బహుముఖ విజ్ఞానాత్మకమైన దర్శనీయ శ్రవణీయ మహత్తర సాహిత్యంగా విజ్ఞాన ప్రతిబింబకంగా వేదం విరాజిల్లుతున్నది. సృష్టి స్థితిలయకారకుడైన పరమేశ్వరుడు కొరడాపట్టి అత్యంత క్రమశిక్షణతో సృష్టివ్యవస్థను నడుపుతున్నట్లు ప్రతినిత్యం సూర్యోదయ అస్తమయాదులు గ్రహనక్షత్రాదుల చలన ఉదయ అస్తమయాలు జరుగుతూనే వున్నాయి. ఈ ఖగోళ వ్యవస్థలోని క్రమశిక్షణ అత్యంత ఆశ్చర్యకరమైన విషయం. శబ్దతరంగాలు నిశ్శబ్ద తరంగాలు కాంతితరంగాలు మూలకంగా అనేక శక్తులు వివిధ వ్యవస్థలలో ఉత్పన్నమవుతూ వుంటాయి. ఈ శక్తులను విశ్వస్వరూపంగా బహుముఖాలుగా ఆవిష్కరించి చూపగలిగింది ఒక్క వేదం మాత్రమే. నిరంతర మంత్రోచ్చారణచేస్తూ ఆ మంత్రాక్షరాధిదేవతా స్వరూప ధ్యానంతో తాము తరించడమే కాక లోకశాంతికీ లోకకళ్యాణానికీ దోహదం చేయగలశక్తి ఒక్క వేదతత్త్వజ్ఞునికే ఉంటుంది. ఇటువంటి వేద

విజ్ఞానాన్ని అవగతం చేసుకోవాలంటే అవగాహన చేసుకోవాలంటే వేద సాంప్రదాయం ప్రకారం వేదార్థాలను సూక్ష్మ బుద్ధితో గ్రహింపవలసి వుంటుంది. అనేక మెలకువంతో కూడిన యీ వేదాధ్యయన సంప్రదాయాలను సంరక్షించడం కోసం తిరుమల తిరుపతి దేవస్థానంవారు లక్షలు ఖర్చుపెట్టి సార్థకమైన ప్రయత్నాలెన్నో చేస్తున్నారు. ఎక్కడెక్కడో వున్న వేదపండితులకు వారు యే యే ప్రాంతాంలో వున్నప్పటికీ వేదాధ్యయనం కోసం వేదాధ్యాపనంకోసం వేదప్రచారంకోసం పండితులకు ఉపకార వేతనాలు యివ్వడం ద్వారా లక్షలాది రూపాయలు వెచ్చించి వేదసంరక్షణతో పాటు వేదప్రచారం కూడా చేస్తున్నారు. వేదాలకు అత్యంత ప్రాచీనకాలంలోనే యాస్క ప్రభృతులు వ్యాఖ్యా భాష్యాదులను విరచించారు. వివిధ ప్రాంతాలలో వివిధ మేధావంతులు విరచించిన విభిన్న భాష్యాలలో ఆంధ్రుడైన సాయనాచార్యులు రచించిన ఋగ్వేద భాష్యం భారతదేశమంతటా విస్తృతమైన ప్రచారం పొందింది. ఋగ్వేదాన్ని పరిష్కరించి అనేకమంది దేవనాగరి లిపిలో ప్రకటించారు. అయితే తెలుగు లిపితో మూలఋగ్వేదం ఇంతవరకూ ప్రచురితం కాలేదు. ఇప్పుడు తిరుమల తిరుపతి దేవస్థానంవారు హిందూధర్మ పరిరక్షణకోసం ప్రచారంకోసం అనేక విధాలైన పథకాలను ప్రవేశపెట్టి కృషిచేస్తున్నారు. వేదవిజ్ఞాన పరిరక్షణ ప్రచారాలకు మించి వేరొక హిందూధర్మ పరిరక్షణ ప్రచారాలున్నాయని మనం భావించలేము. ఈ పరిరక్షణ ప్రచార దృష్టితోనే మూలవేదాలను వాటి తెలుగు అనువాదాలను ప్రకటించాలని నిశ్చయించడం నిజంగా తెలుగువారి సాహిత్య చరిత్రలో సువర్ణాధ్యాయమనే చెప్పాలి. ఇందుకు ప్రాతిపదికగా మూల ఋగ్వేదంతోపాటు ఆంధ్రానువాద పద్యగద్యకృతి ముందుగా ప్రచురిస్తున్నందుకు మనం యెంతైనా గర్వపడాలి.

50 సంవత్సరాలకు పూర్వం బరంపురంలోని కళ్ళికోట కాలేజీలో సీనియర్ తెలుగు పండితులుగా పనిచేసిన కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారు దాదాపు 6 సంవత్సరాలు పైగా (1926 - 1932) అహరహం కృషిచేసి ఋగ్వేదం పదిమండలాలలోనూ దాదాపు చాలా భాగం పద్యగద్యాత్మకంగా తెలుగులో అనువదించి అది సంపూర్ణం కాకుండానే 1932లో కీర్తిశేషులయ్యారు. ఈ ఋగ్వేద సంహితను ఆంధ్రీకరించడానికి శ్రీ నేమానివారు అనేక భాష్యగ్రంథాలను ఆధునిక పరిశోధక విమర్శకులు వ్రాసిన వేదవిమర్శ గ్రంథాలను పరిశీలించారు. శ్రీ నరసింహశాస్త్రిగారు ఆంధ్ర సంస్కృత ఆంగ్లభాషలలో చక్కని పాండిత్యం కలవారు. వారెన్నెన్ని పరిశోధనా గ్రంథాలు పరిశీలించారో తమ అనువాద సందర్భంగా వివిధ సందర్భాలలో పేర్కొన్న ఫుట్‌నోటులను చూస్తే మనకు తేలికగా అవగాహన కాగలదు.

శ్రీ నరసింహశాస్త్రిగారు శ్రీ మదాంధ్ర ఋగ్వేదంలో స్వామీ దయానందసరస్వతి వేదభాష్య విషయాలనుకూడా పేర్కొన్న సందర్భాలు చూడగానే 40 సంవత్సరాలకు పూర్వం మా "నూతిమడుగు" గ్రామవాస్తవ్యులు శ్రీ యెల్లమరాజు నారాయణభట్టుగారు తెలుగులో అనువదించగా అనంతపురంజిల్లా పరిగి గ్రామస్తులయిన శ్రీ కొండూరు వెంకట సుబ్బయ్యగారు ప్రకటింపగా (1940 ప్రచురణ) నేను చిన్నతనంలోనే యెంతో శ్రద్ధగా, ఆసక్తితో చదివిన స్వామీ దయానందసరస్వతిగారి ఋగ్వేదాది భాష్యభూమికా గ్రంథం నాకన్నులలో మిలమిలలాడింది. ఆంధ్రానువాదం చెయ్యడంలో కేవలం సాయనాచార్యాదుల భాష్యాలను మాత్రమే కాక కొన్ని సందర్భాలలో శ్రీ దయానందసరస్వతి రచించిన భాష్యాన్నికూడా అనుసరించి శ్రీ నేమానివారీ యనువాదాన్ని విరచించారు.

శ్రీ నేమానివారి కవిత సరళమైనది. ధారాళమైనది. మృదుమధురమైనది. రామాయణ భారత భాగవతాది గ్రంథాలను ఆంధ్రీకరించిన విధంగా వేదాన్ని అనువదించడానికి వీలులేదు. రామాయణాది గ్రంథాలలో కథోపకథల వ్యవస్థలతో వివిధ సన్నివేశాలతో అనేక వర్ణనలు చేయడానికి వీలున్నది. కాని వేదం ఒక అనుస్యూతమైన కథాగమనం కల గ్రంథంకాదు. ఏ విధమైన కథాపరిపుష్టిలేని కేవల సాంకేతికమైన వేదాన్ని కవితారూపంలో ఆంధ్రీకరించాలంటే అంత సులభసాధ్యమైన పనికాదు. దశమండల విస్తృతమైన యిటు వంటి ఋగ్వేదాన్ని ఆంధ్రీకరించడం అసామాన్యమైన విషయం.

శ్రీ నరసింహశాస్త్రిగారి ఆంధ్రానువాద గ్రంథాన్ని మూల ఋగ్వేదంతోసహా ముద్రించాలని లుప్త భాగాలను పూర్తిచేయించి అసంపూర్ణంగావున్న పదవ మండలంలోని చివరి అధ్యాయాలను పూరణ చేయించి ముద్రింపించాలని తిరుమల తిరుపతి దేవస్థానంవారు నిర్ణయించి ఆ బాధ్యతను బ్రహ్మర్షి, వాఙ్మయమహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారికి అప్పగించడం ముదావహమైన విషయం. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు వారి జ్యేష్ఠకుమార్తె కుమారి జయశ్రీ సంపూర్ణ సహకారంతో ఈ సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితను లుప్తభాగ పూరణంతోపాటు దాదాపు రెండు సంవత్సరాల కాలంలో నాలుగు సంపుటాలుగా అహరహం శ్రమించి రూపొందించారు. ఈ నాలుగు సంపుటాలను డాక్టర్ గోపాలకృష్ణయ్యగారి నివాసగృహానికి 13-10-80 తేదీన వెళ్ళి నేను కొన్ని గంటలపాటు పరిశీలించి వారి బహుముఖ పరిశ్రమకు చాలా ముగ్ధుడనయ్యాను. డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు సుప్రసిద్ధ కవి పండిత పరిశోధకులు. 1971 లో ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు కళా-ప్రపూర్ణ బిరుదమునిచ్చి సంభావించిన సందర్భంగా అధికారపూర్వకంగా వెలువరించిన ప్రఖ్యాపన ప్రసంగంలో పేర్కొన్నట్లు "అనేకములగు సారస్వత పరిశోధన ప్రసక్తులలో ఎంత వారినయిన నెమర్కొనుట, ఔనని వారిచేతనే యొప్పించి మెప్పులందుట వీరి సారస్వత జీవితమున చాల ఘట్టములందు చూపట్టును.

సంస్కృతాంధ్రములలో ఛందోఽలంకార వ్యాకరణ లక్షణములందును, కావ్యనాటకాది బహుముఖ సాహితీ ప్రక్రియలందును, నాట్యసంగీతాది కళలయందును, జ్యోతిషాయుర్వేదాది శాస్త్రములందును, సాంఖ్యయోగాది దర్శనములందును, కామతంత్రమంత్ర శాస్త్రములందును, భాషావాఙ్మయ చరిత్రములందును, శ్రుతులందును, స్మృతులయందును, సరసకవితా నిర్మితియందును, చిత్రకవితా రచనమునందును వీరి బుద్ధి తుల్యమగు నుత్సాహముతో ప్రవేశింపగలదు. ప్రవేశించి వినోదింపగలదు. వీటి యన్నిటిని గూర్చి వీరు ప్రకటించిన పరిశోధన వ్యాసము లనేకములు గలవు. పొత్తుకలియని భిన్నభిన్న సారస్వత శాఖలను బరిశోధించుటలో ఇట్టి యాసక్తి, యింత ఏకాగ్రత, ఇట్టి యాత్మవిశ్వాసము, ఇంత సాహసమును ఏకవ్యక్తి నిష్ఠములయి గానంబడుట కష్టము. తొలుత గురువులతోనే వివాద వినోదము నుపక్రమించిన వీరు క్రమముగా అనుభవశాలులును, సుప్రసిద్ధ పరిశోధకులునయిన వజ్ఝలవారు, గిడుగువారు, నిడుదవోలువారు మున్నగు ప్రముఖులతో విమర్శసమరములు సాగించి వారి నొప్పించి తుదకు ఆ సంగ్రామ రంగములను క్రీడారంగములుగా పరిగణింపజేసిన పటుత్వముగల వారీ వడ్లమూడి వారు. బహుగ్రంథవిరచన, విమర్శ కళోపాసనా మహితులయి సరస్వతీ ప్రియపుత్రులయి విరాజిల్లి" కవిగాను పండిత పరిశోధకుడుగాను విభిన్న శాఖలలోనే కాక వేదవాఙ్మయంలోనూ వేదవిజ్ఞానంలోనూ పరిశోధనలుచేసి కళా-ప్రపూర్ణ

అనే ఆనరరీ డాక్టరేటుతో సంభావింపబడిన ఏకైక వేద కళా-ప్రపూర్ణులు డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు. ఇటువంటి డాక్టర్ గోపాలకృష్ణయ్యగారికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు ఋగ్వేద సంకలన-పరిష్కరణ - పూరణ బాధ్యతల నప్పగించడం యెంతైనా అభినందనీయం. ఆ బాధ్యతలను డాక్టర్ గోపాలకృష్ణయ్యగారు ప్రశంసనీయంగా నిర్వర్తించి శ్రీ నరసింహశాస్త్రిగారి కవితా ఝరితో మహత్తరమైన తమ కవితామృతాన్ని కలిపి నాలుగు బృహత్ సంపుటాలలో సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితను రూపొందించడం సంస్కృతాంధ్ర సాహిత్య చరిత్రలలో ఒక సువర్ణాధ్యాయంగా బహుధా ప్రశంసనీయమై నిలుస్తుందనడంలో సందేహం యేమాత్రమూ లేదు.

ప్రథమ, ద్వితీయ మండలాలతో ఆవిష్కృత మవుతున్న ఈ ఋగ్వేద ప్రథమ సంపుటాన్ని కవి పండితులు తదితరులు అధ్యయనంచేసి తమ విద్యావిజ్ఞానాలను అభివృద్ధి పరచుకుంటారని మిగిలిన 3, 4, 5, 6 మండలాలతో వున్న రెండవ సంపుటం- 7, 8 మండలాలతో వున్న మూడవ సంపుటం - 9, 10 మండలాలతో వున్న నాలుగవ సంపుటం కూడా అచిరకాలంలోనే వెలువడతాయని ఆశిస్తున్నాను.

పి. వి. చౌదరి
దేవాదాయ-ధర్మాదాయ శాఖా మంత్రి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

దుర్మతి ఉగాది
హైదరాబాదు
5-4-1981

# ఋగ్వేద సంహిత - ఆర్య ప్రతిభ

కావ్యతీర్థ
శ్రీ నేమాని వేంకట నరసింహ శాస్త్రి
( బరంపురము )

## 1. ఆర్యులెవరు ?

వేదవాఙ్మయమునందుఁగల ఆర్యశబ్దమునకుఁ బండితు లనేకవిధములగు నర్థములను గల్పించినారు. యాస్కాచార్యుని నిరుక్తమున "ఆర్య ఈశ్వరపుత్రః" (ని.పూ.ష. 8-26) ఆర్యుఁ డీశ్వర పుత్రుఁడని వివరణము కలదు. అనఁగా ఆర్యులు సర్వ సద్గుణాలంకారశోభితులని స్ఫుట మగుచున్నది. సాయణాచార్యుఁడు "ఆర్యం అరణీయం సర్వైర్గంతవ్యం" ఆర్యుఁడనఁగా సర్వ జనులచేఁ బొందఁదగిన వాఁడని యర్థము వెల్లడి చేసెను. మరియు "ఆర్యాన్ = విదుషో అనుష్ఠాతౄన్ ఋ. I-51-8 ఆర్యం = ఉత్తమం వర్ణం త్రైవర్ణికం. ఋ. III-34-9. ఆర్యాయ = యజ్ఞాది కర్మ కృతే యజమానాయ ఋ. I-25-2" మొదలగు ఆర్యశబ్ద నిర్వచనములు సాయణాచార్య కృతమగు ఋగ్వేద భాష్యమునఁ గలవు. ఇట్టి నిర్వచనములనుబట్టి చూడ ఆర్యులనఁగా విద్వాంసులనియు వైదికమార్గ పరులనియుఁ ద్రైవర్ణికశ్రేష్ఠులనియు యజ్ఞాది కర్మల ననుష్ఠించుటఁజేసి యుత్కృష్టులనియు భాష్యార్థమున స్పష్టమగుచున్నది. కాని యార్యులు వేరొండు దేశమునుండి వచ్చి భరతవర్షమున నుండు ననార్యుల నోడించి సప్తసింధు దేశము నాక్రమించుకొనినజాతివారని యెచ్చటను గానఁబడదు. ఆర్యుల కన్యదేశవాసిత్వ మాపాదించుటకుఁ దగిన యాధారము లెచ్చటను గానరావు. (ఈ విషయము ఆంధ్ర ఋగ్వేద సంహితా విశేషార్థములలోఁ గనఁదగును.)

## 2. ఆర్యుల ఔన్నత్యము

ఆర్యులు మహోన్నత పదవి ననుభవించిరి. వారి చరిత్రము చరిత్రాంశముగఁ గడు ముఖ్యము. ఆర్యులకు సంఘనిర్మాణములు వారి గృహకృత్యములు, వారి గాథలు, వారి గుణగణాదులు, వారి వేదాంతవాదనము, వారి భాషాజ్ఞానము, వారి ప్రతిభ, వారి యుద్ధనైపుణ్యము మొదలగునవి మహాచరిత్రమును సూచించుచున్నవి. ఆర్యుల యౌన్నత్యము భరతవర్షమందే కాక ఖండాంతరములయందును వ్యాపించినది. కాని యిపుడు అవస్థాంతరముల నొందినది. ఆర్యులలో నపుడు జాతిభేదమంతగా నంకురింపలేదు. తమ మాతృభూమియగు భరతఖండముయొక్క యఖండైశ్వర్యము ఆర్యులే యనుభవింపఁగల్గిరి. ఆర్యుల సంఘనిర్మాణములు, వారి గుణగణంబులు కడుంగడు శ్లాఘింపఁబడినవి. ఆర్యులే కొన్ని కారణములవలన అనార్యులయిరి.

కాని అనార్యులనువారు వేరొకజాతి గలవారు కారు. అనార్యు లార్యులకంటె మిక్కిలి సామర్థ్యము గలిగియుండుటకుఁ గొన్ని ప్రబల కారణములు కలవు. ఆర్యులకు వాంఛలు తక్కువ. కాఁబట్టి వారికి యంత్రసాధనము లెక్కువగా లేవు. ఆర్యులు భిన్న వృత్తు లవలంబించుటవలనఁ గ్రమముగా వారిలో వర్ణవిభాగ మేర్పడియుండెను. వారి రాజకీయ తంత్రములు వర్ణనాతీతములు. బలవంతులు సైన్యములను జేరఁదీయుచుండిరి. ఆర్యుల కిరీటములను గనినంతనే శత్రువులు భయకంపితు లగుచుండిరి. అక్కాల మునఁగల బ్రహ్మవాదినులు అప్పటి సంఘములను సంస్కరించుచుండిరి. ఆర్యుల సామర్థ్యమును జూపునట్టి యజ్ఞముతో నార్యుల జీవితమంతయు సంబంధించి యున్నది.

## 3. విజ్ఞానము

విజ్ఞానము శిల్పవిజ్ఞానమనియుఁ బదార్థ విజ్ఞానమనియుఁ రెండు విధములు. శిల్పవిజ్ఞానమునఁ జిత్రవిద్య, స్థపతివిద్య ప్రధాన ములైనవి. పదార్థవిజ్ఞాన మధ్యమున ముఖ్యముగాఁ జికిత్సవిద్య, రాసాయనికవిద్య, ఉద్భిద్విద్య అనునవి భూతత్వ విద్యలవలనఁ దెలిసికొనఁదగినవి. ఏతద్భిన్నములగు జ్యోతిషశాస్త్రము, గణితశాస్త్రము, సమరవిద్య, సంగీతవిద్య, తాడిత తత్వము, బాష్పీ యతత్వము మొదలగు విద్యలన్నియు విజ్ఞానకాండమున సంతర్భూతము లగుచున్నవి. సమరవిద్య (ధనుర్వేదము) పదార్థవిజ్ఞాన మున శేకాంశమగు చికిత్సావిద్య (ఆయుర్వేదము) రాగ రాగినీ సమన్వితమగు సంగీతవిద్య (గాంధర్వవేదము) అనునవి యుప వేదములనియుఁ (వేదమున కంగస్వరూపములుగ) జెప్పఁబడినవి. కాఁబట్టి తొలుత నీ శాస్త్రాంశముల సమాలోచింపవలయును.

## 4. యుద్ధవిద్య-దేవయానము-వ్యోమయానము

పౌరాణికార్యులు ప్రతిదినము యజ్ఞముఁ జేయుచుండిరి. ఆ యజ్ఞమునకు రాక్షసులు వచ్చి దానిని ధ్వంసము గావించు చుండిరి. అట్టి రాక్షసులను దూరముగఁ బారఁద్రోలుట కార్యులు ధనస్సులద్వారా బాణములఁ బ్రయోగించుచుండిరి. కావున ఆర్యులు యుద్ధవిద్య నభ్యసింపవలసి వచ్చెను. యజ్ఞక్షేత్రములందు వైదిక మంత్రములను బఠించునపుడు సామవేదతాన మావశ్యక మయ్యెను. కావున ఆర్యులు గాంధర్వవిద్యఁ దెలిసికొనవలసివచ్చెను. నానాజాతీయ పశుపక్షుల మాంసముల ద్వారా ఔషధాదు లుత్పన్నము లయ్యెను. శరీర స్థానవిద్య (Anatomy) వలన నార్యులు చికిత్సాశాస్త్ర పారదర్శులయిరి. పూర్వోక్తమగు ధనుర్వేదము కేవలము తత్కాలీనమగు యుద్ధము నిమిత్తమే వినియోగింపఁ బడలేదు. సాంఘిక, మత రాజకీయ యుద్ధసందర్భముల యందును నార్యులు మహాయుద్ధములొనర్చి తమ ధనుర్వేద పాండిత్యమును బ్రకటించినట్లు వేదములయందు స్పష్టముగాఁ గన్పట్టు చున్నది.

ఉపనిషద్యుగమందు విమానములున్నట్లు ప్రమాణములు కలవు. ప్రశ్నోపనిషత్తునందు విమానశబ్దముయొక్క వ్యుత్పత్త్యర్థ మిట్లున్నది. 'వి' అనఁగాఁ బక్షివలె 'మానము' పరిమాణము కలది అని. అది ప్రస్తుతముండు ఐరోప్లేన్ వంటిది అని యూహింపవచ్చును. వ్యోమయానమనఁగా 'వ్యోమ్ని = ఆకాశమందు, యానము = శబ్దము చేయునది అని కాని గతిగలది' యని యీ వ్యుత్పత్త్యర్థకరణమువలన స్పష్టపడుచున్నది. ఉపనిషద్యుగమందును విమానములు వాడుకచేయుచున్నట్టు నిశ్చయింప వచ్చును. ప్రశ్నోపనిషత్తునందే పిప్పలాదుఁడనెడు ఋషి తన ఛాత్రులచేత విమాన వ్యోమయానములఁగూర్చి ప్రశ్నింపఁబడఁగా నప్పుడు వాని వివరణములను నలుగురు ఛాత్రులకు వివరించినట్లు కలదు. మరియు నిట్టి యానములున్నట్లు ఋగ్వేద సంహిత యందలి కొన్ని ఋక్కులు సూచించుచున్నవి. ఆ విశేషములు మదీయాంధ్ర ఋగ్వేదమున వర్ణితములయ్యెను.

## 5. చికిత్సా శాస్త్రము

శరీరస్థానవిద్యమాత్రమె చికిత్సాశాస్త్రమం దంతర్భూతముకాక యింకఁబెక్కువిద్య లంతర్భూతములగుచున్నవి. ఆర్యుల ఆయుర్వేద శాస్త్రము ప్రపంచకమునందతిప్రాచీనతమ మైనది. ఈ చికిత్సా శాస్త్రమే విశేషముగ సుశ్రుతసంహితాగ్రంథ రూపమున బయలుదేరినది. ఆయుర్వేదమున కుపాంగరూపముగ, బ్రహ్మ లక్షశ్లోకములను రచించి శల్యతంత్రము, శాలాక్యతంత్రము, భూతవిద్యా తంత్రము, కౌమారభృత్య తంత్రము, కాయచికిత్సాతంత్రము, అగదతంత్రము మొదలగు నామముల విభజించినాఁడు. దేవదేవుఁడగు రుద్రుఁడు యజ్ఞసంభూత దేవతయొక్క శిరచ్ఛేదనముఁ జేయఁగా అశ్వికుమారద్వయము వచ్చి శల్యతంత్ర సాహాయ్యమున ఆ యజ్ఞదేవతకు మరల శిరస్సును సమకూర్చెను. ఋ I. 116-15 "సద్యో జంఘామాయసీం విశ్పలాయై ధనే హితే సర్తవే ప్రత్యధత్తం". అను మంత్రప్రమాణమువలన "ఖేలుని భార్యయగు "విస్పల" యను స్త్రీయొక్క పాదము యుద్ధమందు శత్రువులచేఁ గొట్టఁబడఁగా అశ్వికుమారులు వచ్చి అమెకు నయోమయ జంఘను దగిల్చిరి." అని విస్పష్ట మగుచున్నది. కక్షీవంతుని పుత్రికయు బ్రహ్మవాదినియునగు "ఘోష" యను యువతి కుష్ఠరోగాక్రాంతయయి వృద్ధవయస్సు పర్యంతము అవివాహితగా నుండెను. కాని శాస్త్రప్రసిద్ధులగు చికిత్సకులవలన ఆమె రోగవిముక్తయై పతిని బడసెను. మఱియు ఋ. I. 50-11 హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ. "(భాష్యము- హృద్రోగం హృదయగతం ఆంతరం రోగం, హరిమాణం శరీర గతం కాంతి హరణ శీలరోగమ్") మొదలగు ప్రమాణములనుబట్టి హృద్రోగము-అనఁగా హరిమాణ రోగము శ్వేతరోగము మొదలగునవి ఋగ్వేదమున నెక్కువగ నభివర్ణింపఁబడెను.

ఈ చికిత్సావిద్య భారతవర్ష నిజసంపత్తి. కాలక్రమమున నిది విదేశీయుల హస్తగత మయ్యెను. క్రీస్తు తర్వాత సప్తమ శతాబ్దమున నీ చికిత్సా శాస్త్ర మరబ్బులు సంగ్రహించిరి. ఇక్కాల శేషభాగమందే చరకసుశ్రుతములు అరబ్బీ భాషలోనికిఁ దర్జుమా చేయఁబడినవి. అరబ్బుల దేశములలోఁ బ్రసిద్ధిఁ గాంచిన "అల్ రాజిర" ( Alrazi ) అను నతఁడు 632 క్రీస్తు సంవత్సరమున మరణించెను. అతఁడు తన గ్రంథమున నాయుర్వేద మతి ప్రాచీనమని నుడివెను. అప్పటికి బహుశతాబ్దముల క్రిందటఁ బాశ్చాత్యులు ఈ చికిత్సా శాస్త్ర మూలమును సంగ్రహించిరి. ఈ సిద్ధాంతము పాశ్చాత్యుల యితిహాసమందు వర్ణితమయ్యెను. (History of Ancient Sanskrit literature. page. 427)

## 6. జ్యోతిష శాస్త్రము

ఆర్యులు సౌరసంవత్సరమానము, చంద్రకళయొక్క హ్రాసవృద్ధులు, రాశిచక్రము, గ్రహణ గణన మొదలగు జ్యోతిష తత్త్వములయం దధిక ప్రసిద్ధిని బడసియుండి రనుటకుఁ బ్రబల నిదర్శనములు కలవు. కాని యార్యభట్ట సిద్ధాంతము ననుసరించి గ్రీకులు జ్యోతిషశాస్త్రమును రచించిరి. దానివలననే రోమక సిద్ధాంతముగూడ జనించెను. గ్రీకుశబ్దమగు "హోర" నుండి వరాహమిహురుఁడు హోరా శాస్త్రమును రచించెను. ప్రాచీన హిందువులు జ్యోతిష విద్యను గ్రీకులవలన నేర్చుకొనిరని విదేశీయుల యభిప్రాయము. కాని యిట్లనుటకుఁ గారణములు కానరావు. సమగ్రార్యజగత్తునందు ఋగ్వేద మతిప్రాచీన గ్రంథమని పాశ్చాత్య పండితులునుయిత మొప్పుకొనిరి. ఇందుకు మాక్సుముల్లరు తన "Origin and Growth of India" అను గ్రంథమందుఁ గొన్ని విషయము లుదాహరించిరి.

ఋగ్వేదమందును భగవదారాధన కల్పమందట్లు కలదు. 'ఓ భగవాస్వంతా! మా ప్రజలు సకలాకర్షణాది నియమద్వారా పరస్పరము నాకర్షించుచున్నారు. ఆకర్షణ నియమముపంనసే భూమ్యాకాశము లున్నవి- "యదా తే మారుతీర్విశస్తుభ్యమింద్ర నియేమిరే, ఆదిత్తే విశ్వాభువనాని యేమిరే" ఋ. 8మం - 12 - 29 అను మంత్రము పై నంశమునకుం ప్రమాణము. సూర్యాది లోకముంపు అన్యలోకములకు ఆకర్షణాకర్ష్య స్థిరసంబంధము కలదు. "యదా సూర్యమమమ్ దివి శుక్రంజ్యోతి రధారయః, ఆదిత్తే విశ్వా భువనాని యేమిరే" ఋ. 8మం. 12 - 30 అను మంత్రము ప్రమాణమై యున్నది. ఋగ్వేదము నందే వేరొక స్థలమున గ్రహాదులతోం గలిసిన సూర్యునివలెం బరస్పరానంతశక్తి పరస్పర మాకర్షించుచుండును- అను నర్థమిచ్చు, ఋక్కు "ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్ అమృతం మర్త్యంచ హిరణ్యయేన సవితా రథేనా దేవోయాతి భువనాని పశ్యన్" అని అను మొదలగు ప్రమాణములు కలవు. కావున వేదప్రసిద్ధమగు నీ జ్యోతిషవిద్యను ఆర్యులవలన అరబ్బులు నేర్చుకొనిరి గాని అరబ్బులవలన ఆర్యులభ్యసించి యుండలేదనుట నిశ్చయము. సంస్కృత భాషాచరిత్రమును లెస్సగం బరికించినయెడల నార్య క్షేత్ర మందును ప్రసిద్ధిని బడసిన నీ జ్యోతిష విద్యను ఆర్యభట్టసిద్ధాంతమును బ్రహ్మగుప్తసిద్ధాంతమును అరబ్బులు తమ భాషలోనికిం బరివర్తనము గావించుకొనిరని పిదప నరబ్బులవలన నీ జ్యోతిషము నభ్యసించి పాశ్చాత్యులు జ్యోతిషశాస్త్ర పండితులయిరనియుం దెలుసు. ఇపుడు మనవారు పాశ్చాత్యులవలన జ్యోతిషమును బఠింపం దొడంగుచుండిరి. పైని వ్రాసిన యంశమునుగూర్చి మాక్సుముల్లరుగారు తమ గ్రంథమునందు స్పష్టముగా నుదాహరించినారు. ఇట్టి విశేషములను దెలిసికొనుట కార్యపండితు లెట్టి గ్రంథమును వ్రాసియుండ లేదు. మనకిట్టి జాతీయేతిహాస చరిత్రములు లేకపోవుటచే ఖండాంతర పండితులకు విపరీతాభిప్రాయములు కలుగుటకుం గారణ మయ్యెను.

## 7. భూగోళిక తత్త్వము

కదంబ పుష్పములు కేశ సమూహమును జుట్టుకొనినట్లు పృథ్విని నదములు, నదులు, గ్రామములు, సముద్రములు పర్వతములు మొదలగునవి చుట్టుకొనియున్నవి. "పృథ్వి కపిత్థమువలె గోళాకారమువలె నున్నది" అని క్రీ॥శ॥ 700 కాలమున రచింపంబడిన, సూర్య సిద్ధాంతమునందుం గలదు. మరియు 'రహినాల్డు' అను పోర్చుగీసు పండితుండు క్రీ॥శ॥ 15 శతాబ్దము నందు భూప్రదక్షిణముం జేసి భూమి గోళాకారముగ నున్నదని నిశ్చయించినాండు. పురాణ కారకులు భూమి సర్పముపై నున్న దని లిఖించిరి. కాని యది యజ్ఞతాజనిత భ్రమ కాని వేరొకటి కానేరదు. వేదము సనాతనాభ్రాంతశాస్త్రము. శాశ్వతమైనది. సత్యమైనది. నిరవయవ భావములోనున్నది. కాని పురాణ గ్రంథ సముదాయము వేదోక్త తత్త్వమును నగుణోదాహరణ సంయోగముచే సంగ్రథితమైనది. ఈ యుభయవిధ గ్రంథసముదాయము విరుద్ధసత్యములు కలవి. ఆ విరుద్ధ సత్యములలో వేదసత్యము బల వత్తరమైనది. యుక్తియుక్తమైనది. స్వప్రమాణ మైనది. వేదజ్ఞానము యొక్క సూక్ష్మాధ్యాత్మిక మర్మమునకుం బురాణ కారకులు స్థూలోపమాన సంయోగమున వ్యాఖ్యలు వ్రాసినారు. సామాన్య పాఠకులు పౌరాణికులు కావ్యాలంకారముల ప్రకృతార్థమును బోధపరచుకొన లేకుండ భ్రమపడుచున్నారు. 'పృథివి యనంతుని మస్తకముపైంగలదు. అనంతనాగునిపై విష్ణుమూర్తి శయనించెను." ఈవాక్యముల నిజార్థములను సూక్ష్మదృష్టితో విమర్శించిన యెడలం బృథివ్యధిష్ఠాన తత్త్వము దెలిసికొన సాధ్యమగును. "నాగ" మనంగా నాకాశమని యర్థమెరుంగవలయును. ఆకాశము విష్ణువు శయనస్థానము లేదా విష్ణువు అధిష్ఠాన మని తెలిసికొనవలయును" ఇట్టి యర్థములను వెల్లడిం జేయకయే పురాణ కర్తలు అనంత నాగము విష్ణువు శయనస్థానమని యభిప్రాయ పడిరి. ఆ పురాణ కర్తలే ఆకాశమును విష్ణుపదము (వియద్విష్ణు పదం) అని పలికిరి. విష్ణుపదమున కర్థము సర్వవ్యాపకమైనది యగు తత్త్వమని గ్రహింపవలయును. విష్ణువున కేది యధిష్ఠాన క్షేత్రమో అనగా నే యనంత నాగమో (న అగః, నాగః, న గచ్ఛతి

ఇతి నాగః,) (స్థావర వృక్ష పర్వతాదయః) (నాస్తి యగో యస్మాదితి నాగః) నాగ శబ్దవ్యుత్పత్త్యర్థము ద్వారా ఆకాశమును గ్రహింపవలయును. వృక్షపర్వతాదులు వృద్ధి క్షయాది సమన్వితములు. వాటికి క్షయము కలదు. నాగమనఁగా గతి. అట్టి గతిలేనిది ఏకమాత్రము ననంతమును సర్వాధారమునగు ఆకాశమని యెఱుంగవలయును. దానినే పృథివ్యాధిష్ఠాన క్షేత్రమని వర్ణించవలసి యుండఁగాఁ బౌరాణిక కవి గణము రూపకచ్ఛలమున నట్లు వర్ణించిరి.

## 8. ధర్మమే సభ్యతకు మూలము

ధర్మమే సభ్యతకుఁ బ్రాణము. ఈ ధర్మజ్ఞాన తేంప్రమందు ఆర్యసభ్యత విశేషరూపమున సముత్పాదిత మగునట్టి తఁటి జగత్తునం దితిహాసములు బయలుదేరినవి. ఇవియే విశేష లాభములను గలుగఁజేసినవి. ఆర్యఋషుల ధర్మతత్త్వ సమాలోచనమును బరీక్షింపఁగా వారి ప్రాచీన జ్ఞానవిజ్ఞానములు, వారి ధర్మజ్ఞానవృత్తులు వెల్లడి యగుచున్నవి. సూర్యుఁడు, చంద్రుఁడు, ఇంద్రుఁడు మొదలగు దేవతల ప్రీతినిమిత్తము యజ్ఞము చేయుట. ఆ యజ్ఞముయొక్క ప్రయోజనము యజ్ఞోపకరణముల సమాలోచనము మొదలగు వానిని విశేష సూక్ష్మదృష్టితోఁ బరిశోధించినచో హిందూధర్మమున సాకారోపాసనము కలదా లేదాయను సందేహము జనింపక మానదు. ఋగ్వేద సూక్త వర్ణితులగు దేవతల స్తోత్రములను బరిశీలించినపక్షమున నింద్రాది దేవతలు మూర్తులు కలిగియున్నట్లును, సాకారులగు నా దేవతలను ఋషులు పూజించునట్లును గన్పట్టుచున్నది. ఆర్యఋషులకుఁ బ్రత్యక్షమగు నింద్రాదులను సంబోధించి వారు మాట్లాడినట్లు పెక్కు స్థలములఁ గలదు. కావున నింద్రాదుల మూర్తిపూజ నప్పటివారు సేయుచుండిరనియే మనము నిశ్చయింపవలయును. అటులు కాకుండిన సాకారధర్మోపాసనా పద్ధతియొక్క అక్షత మాహాత్మ్యము నష్టమగును. మంత్ర తంత్ర సమన్విత పూజానుష్ఠాన మనునది అపరిమాణజ్ఞాన ప్రవాహమును, అతులనీయ విజ్ఞానఖనియు నగుచున్నది. అథర్వవేదమందు, శతపథబ్రాహ్మణమునందు నిట్లు కలదు. "యజ్ఞ మొనర్చుటకాని, సూర్యచంద్రాదుల యువాసనముగాని ఇంద్రరూపియగు నొక మానవుని పూజించుటగాని లోకహితార్థమే యగుచున్నది. యజ్ఞ మొనర్చినచో నగ్ని ప్రజ్వలింపఁజేయఁబడును. అగ్నిశిఖలవలన ధూమము జనించును. ఆ ధూమము (అగ్నిబాష్పము) ఊర్ధ్వభాగమునకుఁ బోయి వాయుసహితమగును. ఈ వాయువు ఆకాశమునఁగల వృష్టిజలకణసమూహమును నిర్దోషముగఁజేయును. అగ్నిలో ఘృతము మొదలగు హోమ ద్రవ్యములు, కస్తూరిలోనగు సుగంధ వస్తువులు హోమము చేయఁబడఁగా నవి దగ్ధములై సూర్యాకర్షణశక్తి వలన ధూమము బాష్పాకారమున ఆకాశస్థిత వాయువుతో సంక్రమించి దానిని సుగంధయుక్తముగాఁ జేయును. పదార్థముయొక్క జలీయాంశ నామము బాష్పము. ఏది శుష్కభాగమో యది పృథివియొక్క యంశము. ఈరెండు పరస్పరము సంయుక్తములై ధూమాకారమునఁ బరిణమించును. ఏ యాకాశమునం దీ ధూమము మేఘరూపమునఁ బరిణమించునో యాయాకాశమండలమునుండి వర్షము కురియును. "ద్రవ్యాణాం తు క్రియార్థానాం సంస్కారః క్రతు ధర్మస్స్యాత్" అ11-పా. 8-3 సూ 6. "అగ్నేర్వై ధూమో జాయతే" శత. కాం.53.3—. మొదలగునవి పై వివరించిన విషయములకుఁ బ్రామాణములు. ఏది పదార్థరూపమున నుండునో యది బాష్పరూపమున నూర్ధ్వ భాగమునకుఁ బోయి ఘనీభూతమున వర్షరూపమునఁ బడుచున్నది. ఇట్టిదే వస్తువుయొక్క యవినశ్వరతత్త్వ మనఁబడును. వస్త్వవినశ్వరతత్త్వమనెడు నీ సిద్ధాంతము నార్యు లెరుంగక పోలేదు. యజ్ఞములయందుఁ బ్రజ్వలితాగ్ని సంయోగమువలన పృథ్వీ నిమ్నభాగ ముత్తప్తము కాఁగా జలకణసమూహ మూర్ధ్వ భాగమునకుఁ బోయి వృష్టిని గలుగఁజేయును. వృష్టివలన నోషధులు జనించును. ఓషధులవలన అన్నము సంభవించును. అన్న పరిపాకమున ధాతువు పుట్టును. ధాతువువలన శరీరము కలుగును. శరీరమువలనఁ గర్మక్షమత యుద్భవిల్లును. లేదా కర్మ ముద్భవించును. ఇదియే యజ్ఞ ప్రయోజనము. వేదము యొక్క మాహాత్మ్య రక్షయే వేదోచ్చారణ ఫలము. ప్రణవ మంత్రము ద్వారా భగవంతుని స్తుతి కూడ సంభవించును. యజ్ఞతలమున వేది నిర్మింపఁబడును. యజ్ఞవేది యున్నతముగ నుండును. కావున నచ్చటనుండి ధూమము శీఘ్రముగఁ బైకిఁ బోవఁగల్గును. కుశలచే యజ్ఞవేది పరిష్కృత మగును. ఇట్టి యజ్ఞకరణమువలన లోకమునకుఁ బ్రయోజనము కలదు. ఆర్య వంశీయులారా ! ఆర్యుల శ్రేష్ఠ దేవతలలో నొకఁడగు నింద్రుని బూజించుట, యజ్ఞరూప పూజ ననుష్ఠించుట మొదలగునవి ఆర్యుల భావమును, ఆర్యుల విజ్ఞాన కాండములోనఁగలవాని నెట్లు స్ఫుటీకరించుచున్నవో గుర్తింపుఁడు. ఆర్యుల భావము లెట్టి స్థూలోపమా సన్నిబద్ధములైనవో యెట్టి దేవోపాసనా ప్రకార సన్నివేశ గ్రథితములైనవో గమనింపుఁడు.

## 9. భూగోళిక తత్వలేశము

గ్రీకు పండితులు భరత వర్షమునకు రాకపూర్వము ఆర్యభట్టు సూర్యునకు నాల్గుదిక్కుల పృథివి ప్రదక్షిణము చేయుచున్నది ం తత్వము "చలా పృథ్వీ స్థిరా భాతి" అను సందర్భమున ప్రకటించెను. దాని ననుసరించియె పాశ్చాత్య పండితు లీ సిద్ధాం ను ప్రకటింపఁగల్గిరి. భాస్కరాచార్యుఁడు (క్రీ॥శ॥ 1118) పృథివి మధ్యాకర్షణతత్వమును సప్తసింధు దేశమునకు బోధించి ్చాత్య కీర్తిధ్వజమును గడల్చెను. పాశ్చాత్యు లీ తత్వమును గనిపెట్టకపూర్వము చిరకాలము క్రిందటనే ఆర్యభట్టుఁ డీసత్య ప గ్రంథస్థముగా నొనర్చెను. తత్పూర్వమునందే పృథ్వి సూర్యమండలమందుఁ (భూగోళో వ్యోమ్ని తిష్ఠతి) గలదను తత్వ ప సూర్య సిద్ధాంతమందు వ్రాసియుండెను.

## 10. గణిత శాస్త్రము

ఆర్యులకు గణిత శాస్త్రజ్ఞాన మగాధ సాగరమువలె నుండెను. "ఏకా చ మే తిస్రశ్చ మే పంచ చ మే- (యజు. అధ్యా.18) వలగు మంత్రములయం దీశ్వరునిచే సంకబీజరేఖా గణితము ప్రకాశిత మయ్యెను. ఏకార్థ వాచిక సంఖ్య ఏకముతోఁ సినచో రెండగును. ఆ యొకటి రెండుతోఁ గూడినయెడల మూఁడగును. ఆ రెండు రెండుతోఁ గలిపిన పక్షమున నాలుగగును. ) పరస్పర సంయోగాది క్రియలచే ననేకాంకముల మూలమున గణితవిద్య సిద్ధించుచున్నదని తలంపవచ్చును. పై మంత్ర దు బహు చ కారము లుండుటచే ననేకగణిత విద్యలున్నట్లు తోచుచున్నది. కనుకనే జ్యోతిషము వేదాంగమని చెప్పఁబడెను. యంక సంఖ్య నిశ్చిత సంఖ్యాత పదార్థములయందుఁ బ్రవర్తించుచున్నది. అజ్ఞాత పదార్థజ్ఞానముకొఱకు బీజగణితముపయోగింపఁ ంచున్నది. అ$^{2}$ క$^{3}$ ఇత్యాది సంకేతములచేత నిట్టి మంత్రములవలన బీజగణితమేర్పడుచున్నది. అ$^{2}$-గ్న$^{3}$-ఆ$^{1}$-యా$^{2}$-హి. సామ.వే.ఛ- 1; ఖ-1-ఏక క్రియా ద్వ్యర్థకరీ బభూవేతి న్యాయమున స్వసంకేతాంకములచే బీజగణితము కూడ సాధింపఁబడును. "ఇయం వేదిః ి అంతః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః" "సోమో వృష్ణో అశ్వస్య రేతో... యజు-23-మం.92 మొదలగు ్త్రములయందు రేఖాగణితము ప్రకాశింపఁజేయఁబడుచున్నది. వేదులయొక్క యాకృతుల వలన రేఖాగణితోపదేశము సంభవించు న్నది. కావున సంకబీజరేఖాగణితములు మూఁడును వేదములయందు వర్ణితములయ్యెను.

## 11. విమానాది విద్య

"అనారంభణే తదవీరయేథాం అనాస్థానే......... నావం మా తస్థివాంసమ్" ఋగ్వేదము- ఓ మనుష్యులారా! ర్వోక్తములగు ప్రయత్నములచేఁ జేయఁబడిన సిద్ధయానములవలన ఆరంభణరహితము, స్థాతుమశక్యము, హస్తాలంబనా ్యమానమునగు సముద్రమందుఁగాని అంతరిక్షమందుఁగాని కార్యసిద్ధికొఱకు వెడలవలయును. "అశ్వినా దధతుః"లోనగు మంత్ర న భోగమెట్లు కలుగునో యట్లు సమస్త మనుష్యులు ప్రవర్తింపవలయును అని భావము కలదు. సమ్యక్ ప్రయుక్తములగు ్ని జలాశ్వములచేత శుక్లవర్ణముగల బాష్పాఖ్యాశ్వమును శీఘ్రగమనముకొఱకు శిల్పవిద్యావిధుల నెరుగు మనుష్యుల సాహాయ్య న యానములు సాధింతురు. అవి మాటిమాటికి సుఖకరములగును. "సచాగ్న్యాఖ్యో నాజీ వేగవాన్ (హోద్వః) యానం గ్గే శీఘ్ర వేగేన గమయితాం అస్థిపౌ ద్వపౌ ద్వ పతంగా వశ్వి నామ్నీ" నిఘంటు అ 1. ఖండ - 14. అగ్నియనెడు వాజి వేగము ంది యను మొదలగునది స్ఫురించుచున్నది. "పయః పయో" మొదలగు మంత్రమున నీ యర్థము స్ఫురించుచున్నది. మధుర ి గల రథమునందు వజ్రతుల్యములగు చక్రసమూహములు కళా యంత్రయుక్తములై శీఘ్రగమనార్థము మూఁడింటిని జేయవల యును. అట్లే శిల్పులచేతను మూఁడు స్తంభములు సిద్ధము చేయించవలయును. సకల కళాస్థానార్థులగు శిల్ప విద్వాంసులందరు ముగుణ విశిష్టమగు సుఖముయొక్క కామనా సిద్ధిని జేసికొనుచుండిరి.........అనఁగా మూఁడు రాత్రులచేతను మూఁడు దినము చేతను గడుదూరమైన మార్గమును సయితము పొందించుచున్నారు. "తిర్యో అశ్వినా" మొదలగు ఋగ్వేదమంత్రమునకు దయా ందసరస్వతి యిట్లర్థము లిఖించెను. భూమి సముద్రాంతరిక్షములయందు గమనార్థ మేయానము వర్ణింపఁ బడినదో యటిది సిద్ధము

చేయవలయును. అనఁగా నట్టిది అయస్తామ్రరజిత ధాతుత్రయముచేఁ జేయఁదగినది. ఆత్మయు, మనస్సునునెట్లు శీఘ్రముగ వెడలి వచ్చుచుండునో యట్లే కళాప్రేరితములగు నగ్ని వాయువుల మూలమున నా యానము శీఘ్రముగఁ బోవును. మరల వచ్చును. మరియొక ఋగ్వేద మంత్రమునకు దయానంద సరస్వతియె యిట్లర్థమును వ్రాసిరి. ఋ. అష్ట-1 అధ్యా-3. మంత్ర-8— "అరిత్రం వాం" మొదలగు మంత్రమున కర్థమిది. స్తంభసాధన యుక్తము, అతివిస్తీర్ణము, అగ్న్యశ్వ యుక్తము, మహాసముద్రమును దాటుటకు వేగవంతమునగునట్టి యానమని తెలిసికొనవలయును. "వియేభ్రాజాతే" ఋ.అష్ట 1. అధ్యా. 6. మంత్రము 4 "అనోనావావతీనాం" "కృష్ణం నియానం హరయస్సుపర్ణా" "ద్వాదశప్రథయశ్చక్రమేక" మిత్యాది మంత్రములు జలయాన నిర్మాణాదులను సూచించుచున్నవి. "కృష్ణం నియాన" మను మంత్రమునకు దయానందసరస్వతి భాష్యమున నిట్లుకలదు- ఓ మనుజులారా ! శోభనపతన శీలములగు (హరులు) అగ్న్యాద్యశ్వములు జలపాత్రాచ్ఛాదితములై అధస్థాత్ జ్వాలారూపములై యింధనములచేఁ బ్రజ్వాలితములై కళాకౌశల భ్రమణ యుక్తములుగాఁ జేయఁబడినయెడల, పృథివీమయము నిశ్చిత ద్యోతమానాత్మకమగు నాకాశమునుగూర్చి యెగురుచున్నవి. ఆ యానములయందుఁబ్రథులు (ప్రథయః) సర్వకళాయుక్తులగు నరులను ధరించుటకు ద్వాదశ సంఖ్యగ నుండవలయును. వాని మధ్యమున సర్వకళా భ్రమణార్థము చక్రముల నమర్పవలయును. మధ్యమాయవ ధారణార్థము మూఁడు యంత్రముల రచింపవలయును. వాటితోఁగూడ మూఁడు వందల శంకువుల నమర్పవలయును. యంత్ర కళల రచించి యుంచవలయును. ఆ కళలు చలనార్హములు అచలనార్హములునై యుండవలయును. షష్టి సంఖ్యాకములగు కళాయంత్రములు స్థాపింపవలయును— ఇట్టియర్థము గల మంత్రములు వేదములందుఁ జాలఁగలవు. అట్టి మంత్రవిచారము నిచ్చటఁ జేసి యున్నచో గ్రంథము విస్తారమగునను భీతిచే విరమింపవలసివచ్చెను.

## 12. తాడితతత్త్వము (సమ్మోహన విద్య)

తాడితతత్త్వ విద్య ఆర్యుల యౌన్నత్యమును జాటుచున్నది. ఋగ్వేదమునఁ దాడితవిద్యా ప్రభావము బీజరూపమున నభివర్ణింపఁబడెను. ఋ. అష్ట.1 - అధ్యా - 8. మంత్ర. 21. "యువం పేదవే పురువార మశ్వినా" మొదలగు మంత్రమునకు భాష్యముఁ జేయుచు నిందుఁదాడితతత్త్వము లేదా తారవిద్యా బీజము కలదని నిర్ణయించిరి - "ఓ మనుజులారా ! అశ్వులయొక్క గుణములతోఁ గూడికొనినది, బహువిద్వాంసుల స్వీకర్తవ్యము బహుగుణసంయుతము, అగ్ని గుణ విద్యున్మయము, శుద్ధధాతు నిర్మితము ప్రాప్తవిద్యుత్ప్రకాశము, రాజసేనా కార్యములయందు దుస్తరమైనది మాటిమాటికి సర్వక్రియలయందు యోజనీయమునగు "తార"యను యంత్రమును మీరు సాధింపుఁడు. ఆ యంత్రము పరమోత్తమ వ్యవహారసిద్ధికొరకుపయోగించును. అది స్పర్ధమానులగు శత్రువులఁ బరాభవించుటకు స్వకీయవీరులు జయమునందుటకుఁ బరమోత్తమమైనది. మనుష్యుల కార్యాకార్యముల నహించుటకుఁ దగినది. సూర్యునివలె దూర వ్యవహారములనుగూడఁ బ్రకాశింపఁ జేయుటకతి సమర్థమైనది. పృథివీ విద్యుదాఖ్యాశ్వులను సాధించి ఆ తారాఖ్య యంత్రమును సాధింపుఁడు. ఇట్టి వేదోక్త తాడితతత్త్వము జ్వాజ్వల్యమానమైయున్నట్లు ఆర్యు లెరుంగుదురు.

## 13. ప్రకాశ్య ప్రకాశ విషయము

"సత్యే నోత్తంం చితా భూమిః, సూర్యేణోత్తంం భితా ద్యౌః", (కాండ.14-అను 1.మంత్ర-1) ఇత్యాద్యథర్వణ వేదమంత్రమందు "కస్వి దేకాకీ చరతి" (యజు-అ.23. మం 9, 10) అను మంత్రమందును బ్రకాశ్య ప్రకాశక విషయము కలదని దయానంద సరస్వతి లిఖించెను. చంద్రపృథివ్యాది లోకములకు సూర్యుఁడు ప్రకాశకుఁడై యుండెను. ఈ భూమి నిత్యస్వరూపమగు బ్రహ్మ స్తంభితమై ఆకాశ మధ్యమున వాయువుచేతను, సూర్యునిచేతను, ధారితమై యుండెను. అట్లే దివము సూర్యునిచేత ధారితమైయుండెను. కాల సూర్యులచే ద్వాదశ మాసములు, త్రసరేణువులు బలవంతములగుచున్నవి. ద్యోతమానాత్మకమగు సూర్య ప్రకాశమును జంద్రుఁడాశ్రయించి యుండెను. అనఁగాఁ బ్రకాశించుచున్నాఁడని భావము. చంద్రలోకాదులకు స్వయం ప్రకాశములేదు. చంద్రాది లోకములన్నియు సూర్యప్రకాశముచేఁ బ్రకాశితము లగుచున్నవి. చంద్రలోకముతోఁ గూడఁ గిరణములు కలిసిన పిమ్మట బయలుదేరి భూమిని బొంది బలహీనములగుచున్నవి. అంతరిక్ష దేశమందుఁ బృథివి సూర్యప్రకాశమున కెంత ఆవరణమును గల్పించునో అంత ప్రదేశమునం దధికశీతలత్వముండును. అచ్చట సూర్యకిరణ పతనము లేకుండుటచే శీతలత్వము విస్తారముగ నుండును. చంద్రుని ప్రకాశముచేతను, సోమాద్యోషధులచేతనుఁ బృథ్వి పుష్టిని గాంచుచున్నది మొదలగు విశేషములు వేదములందుఁ గలవు.

## 14. బాష్పీయ తత్త్వము

తాడిత తత్త్వ సంపర్కమువలన బాష్పీయతత్త్వ మేర్పడుచున్నది. తాడిత తత్త్వములేనిది బాష్పీయతత్త్వము శూన్యమగును. బాష్పీయతత్త్వముయొక్క జ్ఞానము లేనిది బాష్పీయ శకటము అర్ణవయానము మొదలగునవి సంభవింపవు. అర్ణవయానములు లోనగుప్రసంగములు పూర్వ మార్యులకుండెడివను వ్రాత లిప్పటి వారి కాశ్చర్యమును కలిగింపకమానవు. ప్రాచ్య దేశములందుఁ దయారగుచున్న విద్యుచ్ఛకటములు అర్ణవయానములు మొదలగునవి పాశ్చాత్య విజ్ఞానమువలన సిద్ధములగుచున్నవని మన నిశ్చయము.

కాని మన పూర్వ గ్రంథములందు విపులముగా యున్న యీ విద్యాజ్ఞానమును మనము గుర్తెరింగినచో మనము సత్వి నిశ్చయమును కూర్చుకొనవలసియుండును.

## 15. అశ్వశబ్ద విచారము

అశ్వ శబ్దము యొక్క మూలవ్యుత్పత్తివలన జనించు అర్థమును తెలిసికొనవలసియున్నది. ప్రాణివాచి కాశ్వ శబ్దముతో విజ్ఞాన శబ్దముఁ జేర్పవలయును. అపుడశ్వ తత్వము విజ్ఞాన రూపమున నిర్ణయించుట కవకాశమున్నది. ఋగ్వేదము సమస్తార్య జాతివారి కతి ప్రాచీన గ్రంథము. అక్కారణమున ఆర్య భాషాశబ్దములు సమిష్టి రూపమున ప్రాచీనతమములును, నిఘంటుప్రాయము లును నగుచున్నవి. ఆధునికులు ప్రాచీన శబ్దములయొక్క యర్థములను సరిగ గుర్తింపనేరకపోవుటచే ఋగ్వేద శబ్దము లన్నియు యౌగికములని వచించుచున్నారు. ఆచార్యుఁడగు మాక్సుముల్లరు "ఋగ్వేదోక్తములగు నామవాచకము లన్నియు సంజ్ఞాసూచకములు కాని విశేష్యశబ్ద విశిష్టములు కానేరవు. ఇతర పద్య గ్రంథములఁగల శబ్దములిట్టు యౌగికములై సౌందర్య పుష్టిని గలుగఁ జేయఁజాలవు. మరియు నీ ఋగ్వేదమునఁగల ప్రతిశబ్దము నాధ్యాత్మికతా పరిపూర్ణము. అశ్వశబ్దము అస్ = భక్షణే అను ధాతువువలన జనించు చున్నది. ఇది యాన చాలనాది వ్యవహార సందర్భముల జలాగ్ని వాయువుల సంపర్కమునసత్యపహృత మయ్యెను.

మహామతి చర్జూసింహుఁడు వైదికాశ్వ శబ్దమునకుఁ దాడితము, ఆకర్షణము, తాపము అను నర్థముల వ్యవహరించెను. ఇట్లే రశ్మిశబ్దము గత్యర్థమునందును అజశబ్దము జన్మరహితార్థమందును ఇంద్రపదము శాసనకారి వ్యక్త్యర్థమునందును నుపయోగించెను. కాని యాధునికులు కిరణము, భాగలము, ఇంద్రనామక వ్యక్తి అని క్రమముగా నర్థమును గల్పించిరి. ఈ విధముననే ఋగ్వేద పదములకు మూలార్థములను స్వీకరింపక పౌరాణికులు స్థూలార్థానుసారముగ భాష్యములను వ్రాసిరి.

ఋగుక్తమగు నశ్వశబ్దమునకు భారవాహియగుఁ బశ్వర్థమున నుపయోగించలేదు. అశ్వవిద్య, తాడితాకారమున సర్వ వ్యాపకతా విజ్ఞానార్థ సూచకముగ ఋగ్వేదమునఁగలదు. "అశ్వం నత్యావారవసుమ్ విదధా ఽగ్నిం నమోభిః" ఋ. మండ 1. సూ. 27-1; శతపథ బ్రాహ్మణమునందు "వృషో అగ్నిః అశ్వో" ఇత్యాది సందర్భమునను పూర్వోక్తాశ్వశబ్దార్థము కలదు. మరియునొక్కచోటఁ బూర్వోక్తాశ్వరథ నిర్మాణవ్యాపారము ఋగ్వేదమున వ్యక్తమగుచున్నది. "తిరోన్ని అశ్వినా యజతా దివేదివే పరి త్రిధాతు పృథివీమశాయతమ్। త్రిసో నాసత్యా రథ్యా పరావత. ఆత్మేవ వాతః స్వసరాణి గచ్ఛతమ్" ఋ. అష్ట 1. అధ్యా 3. సూ 34. ఋ 8." అరిత్రం వాం దివస్పృథు తీర్థే సింధూనాం రథః। ధియా యుయుజ్ర ఇన్దవః॥ ఋ. అష్ట 1. అధ్యా 3. సూ 46. ఋ 8. భూమియందు, జలమందు, ఆకాశమందుఁజరించునిమిత్తము పూర్వోక్తమగుయాన మావశ్యకము. ఆ పరిత్రిధాతు వనఁగా లోహము తామ్రము, కాంస్యము ఈ మూఁడు విధములగు ధాతువుల ద్వారా యది సిద్ధమగును. అయ్యది "ఆత్మేవ వాతఃశ్వః" అది మనసువలె ద్రుతగామియై భూగోళము మధ్యను జరించును. మూఁడు విధములగు యానముల మధ్యలను మూఁడువిధములగు జలాశయములుండును. ఆ జలాశయములందు జలము సంపూర్ణముగ నుండును. అట్లుండిన యెడల ఆ యానములు మనస్సువలె మిక్కిలి ద్రుతగాములైయుండును. అగ్నివాయుజలసంయోగమువలన రథము శీఘ్రగామి యగును. "త్రిస్రః క్షపః త్రిరహాతి" మొదలగు మంత్రమందును నిట్లే వర్ణింపఁబడెను. మరియు "మనోజువో యన్మరుతో రథేష్వా వృతవ్రాతాసః పృషతీరయుగ్ధ్వమ్" ఋ.అష్ట 1. అధ్యా 6. సూ 85. ఋక్కు 4. అను మంత్రమును బూర్వోక్తసిద్ధాంతమునే వెల్లడిచేయుచున్నది. ఈ విషయమును ఛర్జూసింహుఁడు తన గ్రంథమునందు ఋగ్వేదమంత్రముల కనువాదముచేయుసందర్భమున నిట్లు వ్రాసిరి-వైజ్ఞానికులు కార్యమాచరించుట కేతాపమా శ్యకమో ఆతాపమునే యావశ్యక మనెదరు. ఆతాపము (Heat) తాడితము (Electricity) ఆకర్షణము (Magnetism) ఈ త్రిగుణాన్వితమగు శక్తి గుణము ప్రధానముగ గలది. మహావ్యక్తి వర్గము, విచారకర్తలు, శాసనకర్తలు, విజ్ఞానలోకము కార్యకారి యంత్రవిజ్ఞాన వేత్తలునగు పండితులు పూర్వోక్తమగు శక్తిని నుపేక్షించిరి. అట్లుపేక్షింపఁగూడదు. యజుర్వేదమునందు "సోమ మదః అగ్నిష్వాత్తా, బర్హిదః సోమవాః హవిర్భుజః ఆజ్యపాః సుకాలినః యమరాజాశ్చేతి" అనుష్టుపమున "అగ్నిష్వాత్తా" అనఁగా యంత్రకారులని యర్థమును గ్రహింపవలయును. పైఁజెప్పిన అష్టవిధ పితరులలో నొకవిధమగు వారు యంత్రజ్ఞాన విశిష్టసంపన్న వ్యక్తులని తెలిసికొనవలసియుండును. కాఁబట్టి ఆర్యుల కనుపమాన యంత్రజ్ఞానమున్నదని యే సర్వవిధముల నిశ్చయింపవలసియుండును. లోకోప కారకమగు యంత్రజ్ఞానముగ* (దీని నార్యు లుపయోగించియుందురు.)

కావ్యతీర్థ
నేమాని వేంకట నరసింహశాస్త్రి
బరంపురం

* 15A సంఖ్యగల వ్రాతప్రతిలో శ్రీ నేమాని వారు స్వహస్తముతో లిఖించిన యీ "ఋగ్వేదసంహిత-ఆర్యప్రతిభ"లోని చివరి వాక్యమగు "లోకోపకారకమగు యంత్రజ్ఞానముగ" ననునంతవరకేయున్నది. తరువాతి భాగము శిథిలమైనది. వ.గో.కృ.



బ్రహ్మర్షి

వాఙ్మయ మహోధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా - ప్రపూర్ణ"

# పీఠిక

బ్రహ్మర్షి
వాఙ్మయమహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

'అనంతా వై వేదాః' అన్న వాక్యం ప్రకారం వేదం అనంతమైంది. పౌరుషేయమైన దానికి దేనికైనా అంతమనేది వుండి తీరుతుంది. అపౌరుషేయ సామాన్య దేవతా వ్యవస్థలో ఆద్యంతాలకు కొన్ని సందర్భాలలో పరిమితి వున్నా అనంతమైన దానికి పౌరుషేయత్వాన్ని ఉద్ఘాటించడం యే పరిస్థితులలోనూ ప్రామాణికం కానేరదు. అనంతతత్వం యెప్పుడున్నదో అపౌరుషేయత్వం అప్పుడే వుంటుంది. మొట్టమొదట వేదం ఏకైకంగానే అవతరించగా దానిని వ్యాసమహర్షి ఋక్, యజుస్, సామ, అథర్వ వేదాలుగా నాలుగు విభాలుగా విభజించినట్లు అనుస్యూతమైన పురాణవాక్కు వున్నది. అత్యంత ప్రాచీనకాలంలో ఋగ్వేదం 21 శాఖలుగానూ, యజుర్వేదం 101 శాఖలుగానూ, సామవేదం 1000 శాఖలుగానూ, అథర్వవేదం 9 శాఖలుగానూ విస్తృతవ్యాప్తి నొందినట్లు అవి ఋషి పరంపరగా అధ్యయనం చేయబడినట్లు ఆర్షవాఙ్మయ సంప్రదాయవేత్తలు భావించడం జరిగింది. 21 శాఖలతో విస్తృతమైన ఋగ్వేదశాఖలలో 'ఐతరేయ శాఖ' అని పిలువబడే ఏకైకశాఖమాత్రమే ప్రస్తుతం ఉపలభ్యమానమయినది. ఈ 'ఐతరేయశాఖ'కు 'శాకల శాఖ' అని 'పౌఝియ శాఖ'అని నామాంతరాలున్నాయి. 101 శాఖలతో విస్తృతమైన యజుర్వేదంలో తైత్తిరీయ-మైత్రాయణీయ-కాణ్వ-మాధ్యందిన శాఖలు నాలుగు మాత్రయే ఉపలభ్యమానమయ్యాయి. యజుర్వేదం శుక్లయజుర్వేదం కృష్ణయజుర్వేదమని రెండు వేదాలుగా ఆర్షవిజ్ఞానం దృష్ట్యా విభజితంకాగా అసలు కృష్ణయజుర్వేదం వేదం కానేకాదనీ కృష్ణయజుర్వేదం పేరుతో సంహితా భాగం లేనేలేదనీ ఒక అంధవిశ్వాసం కొందరిలో పాతుకుపోయింది. మూల యజుర్వేద సంహితాభాగాన్నే ఆర్ష ఖగోళ విజ్ఞానం దృష్ట్యా రెండుగా విభజించి శుక్లయజుర్వేద-కృష్ణయజుర్వేద నామాలతో పేర్కొనడం జరిగింది. సహస్ర శాఖాత్మకమైన సామవేద శాఖలలో కౌథుమ-జైమిని-రాణాయనీయ శాఖలు మూడు లభించాయని అనేకమంది భావించారు. కౌథుమ శాఖకు-ఛందోగశాఖ అనీ, జైమిని శాఖకు-తలవకారశాఖఅనీ, నామాంతరాలున్నట్లు కూడా భావించడం జరిగింది. ఉపలభ్యమానమైన ఈ సామవేదశాఖలను పరిశోధిస్తే కౌథుమ-జైమినిశాఖలు రెండూ రాణాయనీయ శాఖలో అంతర్భాగాలేనని సాధికారికంగా తేటతెల్లమైనది. ఈ విషయంగురించి నా పరిశోధనా రచన "వాఙ్మయ మహాధ్యక్షుని సామవేద విశ్వరూప ప్రదర్శన" గ్రంథంలో సప్రామాణికంగా చర్చించడం జరిగింది- సామవేద 'వాంకార శాఖ' ఒకటి అయిదు సంవత్సరాల క్రిందట నాకు శ్రీకాకుళంలో ఒకరు బహూకరించగా దానిని ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ అండ్ రిసర్చి ఇన్స్టిట్యూట్‌లో భద్రపరచడం జరిగింది. కాగా సామవేద సహస్ర శాఖలలోనూ రాణాయనీయ-వాంకార శాఖలు రెండుమాత్రమే ఉపలభ్యమానమయ్యాయని మనం భావించవలసివున్నది. 9 శాఖలతో విస్తృతమైన అథర్వవేద శాఖలలో శౌనక-పిప్పలాద శాఖలు రెండు మాత్రమే లభించాయి. శౌనకశాఖను అధ్యయనం చేసినవారు వ్రేళ్లమీద లెక్కపెట్ట దగినవారు మాత్రమే భారతదేశంలో వుండగా పిప్పలాదశాఖ అధ్యయనం చేసినవారు ఒక్కరుకూడా లేరు. ఈ పిప్పలాద శాఖ తాళపత్ర గ్రంథాల రూపంలో లభించడం మన అదృష్టమనే చెప్పాలి.

వేదాలు కేవల అధ్యయన అధ్యాపన పరంపరలతో మాత్రమే పరిరక్షింపబడ్డాయని చాలామంది భావిస్తారు కాని అది వాస్తవం కాదు. లిపి అన్నది వేద అవతరణతోనే యేర్పడి వున్నట్లు ఉపనిషద్వేద ప్రమాణాలతో చెప్పవచ్చును.

"చతుష్కపర్దా యువతిః సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే ।
తస్యాం సుపర్ణా వృషణా నిషేదతుర్యత్ర దేవా దధిరే భాగధేయమ్ ॥"

(ఋగ్వే. 10 మం-114సూ-3ఋక్కు)

నామాఖ్యాతోపసర్గనిపాతలతోపాటు దీప్యమాన వర్ణావయవాలగురించి పేర్కొనబడినట్లున్న ఈ ఋక్కువల్ల వేదావతరణతో లిపికూడా రూపొంది వున్నదని మనం ప్రామాణికంగా భావించవలసివున్నది. కాగా వేదావతరణ ప్రారంభకాలంనుంచీ కూడా వేదం కేవలం అధ్యయన అధ్యాపన రూపాలతో మాత్రమేకాక లిపిగ్రంథస్వరూపంలోసైతం తాళపత్రాదిరూపాలలో ప్రచారం పొంది భద్రపరచబడిందనికూడా మనం భావించవలసివున్నది.

## వేద కాలం

మాక్సుముల్లర్ చంద్రగుప్తుని జన్మకాలం ఆధారభూతం చేసుకుని గౌతమ బుద్ధునికి పూర్వమే అంటే క్రీ.పూ. 500 సంవత్సరాలకు పూర్వమే వేదాలున్నాయని ఊహించి పేర్కొన్నాడు. వేదాలలోని వివిధ ఘట్టాలు 200 (రెండువందల) సంవత్సరాల తేడాతో ప్రారంభమై ఉంటాయని ఊహించి వేదకాలం - అంటే ఋగ్వేద ప్రారంభకాలం క్రీ.పూ. 2000-3000 సంవత్సరాల వరకూ ఉంటుందని నిర్ణయించాడు.

మాక్సుముల్లర్ వెల్లడించిన అభిప్రాయానికి విరుద్ధంగా డాక్టర్. వింటర్నిట్జుగారు రెండువందల సంవత్సరాల తేడాకు మారుగా వెయ్యి సంవత్సరాలు మొదలు మూడువేల సంవత్సరాలవరకు - మధ్యలో 1500-2000 సంవత్సరాల నుంచుకొని అంతర్ కాలాలుగా ఊహించడానికి చాలా ఆధారాలున్నాయని పేర్కొన్నాడు.

పి. సి. సేన్‌గుప్త **Chronology of Vedas** అనే తన పరిశోధనా గ్రంథంలో ఋగ్వేదంలోని ఋక్కులు ఆధారంగా గణితశాస్త్రానుగుణంగా నిర్ణయించడానికి ప్రయత్నం చేశాడు.

"ఆథర్వణా యాశ్వినా దధీచే ఉశ్వ్యం శిరః ప్రత్యైరయతమ్।
స వాం మధు ప్ర వోచదృతాయన్ త్వాష్ట్రం యద్ దస్రావపి కక్ష్యం వామ్ ॥"

(ఋగ్వే : 1మం-117సూ-22ఋక్కు)

ఈ ఋక్కుకు "అథర్వణుని పుత్రుడైన దధీచి శిరస్సును తొలగించి అశ్వశిరస్సును అశ్వినీదేవత లతికించడంవల్ల దధీచి తాను తొలుత మాట ఇచ్చిన విధంగా మహర్షి త్వష్టనుంచి తాను తెలుసుకున్న వసంత విద్యను అశ్వినీదేవతలకు ఉపదేశించాడు" అని అర్థమని శ్రీ సేన్‌గుప్త భావించి వేదాలలో పేర్కొనబడిన వసంతకాల మాసముల నామములైన మధు, మాధవీ శబ్దముల ననుసరించి వేదకాలాన్ని ఊహించడానికి ప్రయత్నం చేశాడు. మేషరాశిలో సూర్యుని అక్షాంశ సగటుగతి క్రీ.శ. 1964వ సంవత్సరం నాటికి 3,064 సంవత్సరాలవుతాయని క్రీ. శ. 1931వ సంవత్సరం నాటికి ఈ సూర్యమండలం అక్షాంశ లంబరేఖ సగటుగతి ననుసరించి 36°, 41′, 50″+40°,50′, 44″=81°, 31′, 38″ అని లెక్కకట్టి సూర్య సంబంధ గమన పరివర్తనాన్ని గుర్తిస్తే 5,925 సంవత్సరాలు గతించి ఉంటాయని దీనిప్రకారం వేదకాలం క్రీ. పూ. 3,995 సంవత్సరాలనికూడా సేన్‌గుప్త పేర్కొన్నాడు.

"ఉభా దేవా దివి స్పృశేంద్రవాయూ హవామహే । అస్య సోమస్య పీతయే॥"

(ఋగ్వే: 1 మం: - 23 సూ-2 ఋక్కు)

"అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష।
వాశ్రా ఇవ ధేనవః స్యన్దమానా అఞ్జః సముద్రమవ జగ్మురాపః॥"

(ఋగ్వే: 1 మం - 32 సూ-2 ఋక్కు)

ఈ ఋక్కుల ననుసరించి దేవేంద్రుడు వేసవికాలంలో వృత్రసంహారుడైన మఘానుడుగా నూరాడన్న భావాన్ని గ్రహించి ఈ మార్పు వేదకాలంలో సూర్యగమనానుసారంగా ఉదయించే మఖానక్షత్రంతో జరుగుతుంది కాబట్టి సూర్యగమనానుసారంగా మఖా నక్షత్ర అక్షాంశరేఖను గణిస్తే 6,100 సంవత్సరాల అంతరమేర్పడుతుందికాబట్టి ఈ ఋక్కులు విరచించబడిన కాలం క్రీ. పూ. 4.170 సంవత్సరాలని శ్రీ సేన్‌గుప్త అభిప్రాయపడ్డారు.

సూర్యుని గమనాన్ని అనుసరించి లుబ్ధక నక్షత్ర **DOGSTAR** గమనాన్నిబట్టి వామదేవుడు ఋషిగా ఉన్న ఈ క్రింది ఋక్కు క్రీ. పూ. 2,760 సంవత్సరాల నాటిదని శ్రీసేన్‌గుప్త అభిప్రాయం వెల్లడించారు.

> "అగ్నిం దూతం ప్రతి యదబ్రవీతనాశ్వః కర్త్వోరథ ఉతేహ కర్త్వః।
> ధేనుః కర్త్వాయువశా కర్త్వాద్వారాని భ్రాతరను వః కృత్వేమసి॥
>
> (ఋగ్వే: 1 మం - 161 సూ-3ఋక్కు)

భారతగాథ ఆధారంగా ఇంద్రుడు రాక్షసులతో యుద్ధంచేసి భాద్రపదమాస శుక్లపక్ష ద్వాదశీ శ్రవణా నక్షత్రంలో విజయం సంపాదించాడు కాబట్టి దీనికి పూర్వకాలమైన క్రీ. పూ. 4,900 సంవత్సరాలు వేదకాలం కావచ్చునని శ్రీసేన్‌గుప్త గారు అభిప్రాయ పడ్డారు. అంతేకాదు.

> "త్వం గోత్రమఙ్గిరోభ్యోఽవృణోరపో తాత్రయే శతదురేషు గాతువిత్।
> ససేన చిద్విమదాయావహో వస్వా జావద్రిం వావసానస్య నర్తయన్॥"
>
> (ఋగ్వే: 1 మం - 51 సూ-3 ఋక్కు)

> "ఋభుర్భరాయ సంశిశాతు సాతిం సమర్యజిద్వాజో అస్మాగ్ం అవిష్టు।
> తన్నో మిత్రో వరుణో మామహంతా మదితిః సింధుః పృథివీ ఉతద్యౌః॥"
>
> (ఋగ్వే: 1 మం - 111 సూ-5 ఋక్కు)

> "యువంరేభం పరిషూతేరురుష్యథో హిమేన ఘర్మం పరితప్తమత్రయే।
> యువం సయోరవసం పిప్యథుర్గవి ప్రదీర్ఘేణ వందనస్తార్యాయుషా॥"
>
> (ఋగ్వే: 1 మం - 119 సూ-6ఋక్కు)

అన్న ఋగ్వేదంలోని ఋక్కుల నాధారంచేసుకొని సూర్యగ్రహణాన్నిగురించి సూర్యాతపానికి ఓర్చుకొనలేక కరిగిపోతున్న హిమాలయాల చాటున అత్రిమహర్షి దాక్కున్న విషయాన్ని పేర్కొంటూ ఇటువంటి హిమాలయాతపపరిస్థితి తూర్పున సూర్యుడు మేషరాశిలో ఉదయించే కాలంలోనే జరుగుతుందని భావించి ఈ సమయం క్రీ. పూ. 4,000 సంవత్సరాలు ఋగ్వేద కాలమని నిర్ణ యించాడు.

శ్రీ వి. వి. కేట్కార్ ఋగ్వేదకాలం గురించి ప్రస్తావిస్తూ 'తైత్తరీయ బ్రాహ్మణం'లో ఉన్న 3-4-1-5 సూక్తాలను బట్టి 'తిష్య' (పుష్యమి) నక్షత్రానికి ఎదురుగా ఉండి దానిని మరుగుపరుస్తున్న గురుగ్రహ వ్యవస్థను వర్ణించడాన్నిబట్టి క్రీ. పూ. 4,650 సంవత్సరాలు అయివుంటుందని పేర్కొన్నాడు.

ఖగోళ శాస్త్రాలను దృష్టిలోపెట్టుకొని బాలగంగాధరతిలక్ - జాకోబీవంటి పరిశోధకులు వేదకాలం క్రీ. పూ. 4500 సంవత్స రాలకు పూర్వమేనని అభిప్రాయపడ్డారు.

మరికొంతమంది చరిత్ర పరిశోధకులు మహాభారతాన్ని దృష్టిలో పెట్టుకొని వేదకాల నిర్ణయాన్ని చేయాలని ప్రయత్నించారు. భారత యుద్ధకాలంలో ఉత్తర గర్భంలో వున్న పరీక్షిత్తుకు మగధదేశమహారాజైన నందుని పట్టాభిషేక కాలానికి మధ్య 1500

సంవత్సరాలకాలం గడిచిపోయిందని కాశ్మీర రాజుల చరిత్రగ్రంథమైన "రాజతరంగిణి" పేర్కొంటున్నది. నందుని పట్టాభిషేక క్రీ.పూ 425 సంవత్సరంలో జరిగిందని చరిత్రకారులు నిర్ణయించారు. కాబట్టి పరీక్షిత్తు జననం 1500 + 425 = 1925 క్రీస్తు పూర్వపు సంవత్సరాలవుతాయి. భారతకాలం ఇప్పటికి 1925 + 1980 = 3905 సంవత్సరాదిలవుతాయి. కాగా భారత కాలాని పూర్వం రాముని కాలం 500 సంవత్సరాలని-సూత్రకాలం రామునికాలంకంటే 500 సంవత్సరాలకు పూర్వమని-బ్రాహ్మణాలకాల సూత్రకాలంకంటె వెయ్యి సంవత్సరాలు పూర్వమని-బ్రాహ్మణాలకాలంకంటె వెయ్యి సంవత్సరాలకు పూర్వం వేదాలావిర్భవించాయ ఊహించి 3905 + 3000 = 6905 అని కొందరభిప్రాయపడ్డారు.

భారత యుద్ధానంతరం కలియుగం ప్రారంభమైనదని కలియుగం ప్రారంభమై 5080 సంవత్సరాలు ఇప్పటికిగడిచాయ 5080 + 3000 = 8080 సంవత్స రాలకు పూర్వం వేదాలవతరించాయని మరికొందరభిప్రాయపడ్డారు. కాని పైన ఉటంకించబడి సూత్ర బ్రాహ్మణాల కాల వ్యవధిని సప్రామాణికంగా పొడిగించే అవకాశం ఉన్నదని మరికొందరు ఋగ్వేదకాలం క్రీ. పూ. 10,00 సంవత్సరాలనుండి 25,000 సంవత్సరాలవరకు వెనుకకు తీసుకొని పోవచ్చునని కొందరు పరిశోధకులు భావించారు.

ధీరేంద్రనాథ మహోపాధ్యాయగారు వేదకాలంగురించి ఖగోళశాస్త్రరీత్యా క్రీ.పూ. 30,000 సంవత్సరాలని నిర్ణయించా ఋగ్వేదం పదవ మండలంలోని 86వ సూక్తంలోవున్న వృషాకపి ఋక్కునుబట్టి వసంతఋతు సంబంధమైన విషువ సంక్రాంతి మృగశిరా నక్షత్రంలో ఉన్నట్లు వర్ణించబడిందని కాగా వసంత విషువత్ కాలమంటే మృగశిరా నక్షత్రంలో రాత్రీపగ సమానంగా ఉండేరోజు క్రీ.పూ 30,000 సంవత్సరాలకు ముందు ఏర్పడిందని లెక్కలుకట్టి శ్రీ ధీరేంద్రనాథ మహోపాధ్యాయగా వసంత విషువత్సంక్రాంతిని దృష్టిలో పెట్టుకుని నిర్ణయించారు.

క్రీ.పూ. 2000 సంవత్సరాలనాడు ఆర్యులు భారతదేశానికి వలస వచ్చారని కొందరు చారిత్రక పరిశోధకులు భావించి దృష్ట్యా వేదకాల నిర్ణయాన్ని చేయ సమకట్టారు. "ఇటువంటి ఊహలమీద ఆధారపడి వేదకాల నిర్ణయం చేసేటట్లయితే ఎవరి ఇ వచ్చినట్లు వారు క్రీ.పూ. '0' నుండి '500' సంవత్సరాలవరకు కూడా తీసుకొనివెళ్ళవచ్చు నని కాగా ఈ చరిత్ర పరిశోధక ఊహలు అప్రామాణికాలని డాక్టర్. వింటర్నిట్జు చాలా తేలికగా త్రోసివుచ్చారు.

మరికొందరు పరిశోధకులు ఖగోళవర్ణనలు ఆధారంగా వేదకాలాన్ని నిర్ణయించాలని ప్రయత్నం చేశారు. ఋగ్వేదంల కొన్ని ఋక్కులలో దక్షిణ భారతదేశాన్ని పంజాబు, కాశ్మీరు, గాంధార దేశాలనుంచి వేరుచేస్తూ దక్షిణ మహాసముద్రాన్ని అరేబియ సముద్రంతో బంగాళాఖాతం కలుపుతున్న సముద్రపు పాయ ఒకటి ఉన్నట్లు తెలుస్తున్నదని ఈసముద్రపుపాయ కొన్ని వే సంవత్సరాలుగా గంగామైదానాలలో పరివ్యాప్తి చెంది ఉన్నదని ఖగోళ శాస్త్రజ్ఞుడైన శ్రీ వాడియా పేర్కొన్నారు.

ఇప్పటికి 50,000 సంవత్సరాలనుంచీ 25,000సంవత్సరాలవరకూవున్న భారతదేశ పటాన్ని **H.G.WELLS** రూపొంది వారు. ఈపటంలో పైన ఉటంకించబడిన సముద్రపుపాయ స్పష్టంగా చిత్రీకరించబడింది. కాగా ఋగ్వేదపు ఋక్కులు కనీసం క్రీ పూ 25,000 సంవత్సరాలనాటివని చెప్పవచ్చునని అభిప్రాయపడ్డారు. గంగాప్రాంతంలోవున్న ఈ సముద్రపుపాయ క్రమంగా ఇంకి పో యి గంగామైదానంగా మారిపోయిందని ఇదే ఆర్యుల సంస్కృతీ నాగరికతలకు ఆలవాలమని మరికొందరు పరిశోధకులు భావించా

కొందరు భూగర్భ శాస్త్రవేత్తలు ఇప్పటికి 2,00,000 సంవత్సరాలకు పూర్వం హిమయుగకాలమని- ఈ హిమయుగకాలా 50,000 సంవత్సరాలకు పూర్వమే అంటే 2,50,000 సంవత్సరాలకు పూర్వమే ఋగ్వేదం అవతరించిందని అభిప్రాయపడ్డారు.

అయితే పాశ్చాత్య భూగర్భశాస్త్రవేత్తలు మాత్రం మానవ జనన అభివృద్ధి క్రమ పరిణామ పరిశీలనతో హిమయుగా పూర్వం మానవులుండటం అసంభవమని కాగా మానవజాతి హిమయుగంలో అవతరించి ఉంటుందని కొందరు పేర్కొన్నారు. అం గాక ఋగ్వేదంలో ఈ క్రింది ఋక్కులలో హిమయుగవర్ణన ఉన్నట్లు వారు భావించారు.

> విదుష్టే అస్య వీర్యస్య పూరవః పురో యదింద్ర శారదీరవాతిరః సాసహానో అవాతిరః ।
> శాసస్తమింద్ర మర్త్యమయజ్యుం శవసస్పతే ।
> మహీమముష్ణాః పృథివీమిమా అపో మందసాన ఇమా అపః ॥

(ఋగ్వే: 1మం-131సూ-4ఋక్కు)

"అధ్వర్యవో౽ప ఇతా సముద్రమపాం నపాతం హవిషాయజధ్వమ్ ।
స వో దదదూర్మిమద్యా సుపూతం తస్మై సోమం మధుమంతం సునోత ॥
(ఋగ్వే : 10మం-30సూ-3ఋక్కు)

"యో అనిధ్మో దీదయదప్స్వ౨న్తర్యం విప్రాస ఈళతే అధ్వరేషు ।
అపాం నపాన్మధుమతీరపో దా యాభిరింద్రో వావృధే వీర్యాయ" ॥
(ఋగ్వే : 10 మం-30సూ-4ఋక్కు)

"భీభత్సూనాం సయుజం హంసమాహురపాం దివ్యానాం సఖ్యే చరంతం।
అనుష్టుభమను చర్చూర్యమాణమింద్రం నిచిక్యుః కవయో మనీషా" ॥
(ఋగ్వే : 10మం-124సూ-9ఋక్కు)

వాతస్యాశ్వో వాయోః సఖాఽథో దేవేషితో మునిః।
ఉభౌ సముద్రావా క్షేతి యశ్చ పూర్వ ఉతాపరః।
(ఋగ్వే .10మం-136సూ-5ఋక్కు)

ప్రళయంనుంచీ మంచునుంచీ వివిధ ప్రాణికోటిని సంరక్షించడానికై తండ్రియైన 'జీమా' ఒక కందకాన్ని త్రవ్వినట్లుగా పర్షియన్ మతగ్రంథమైన "జెండు అవెస్తా" గ్రంథంలో పేర్కొనడం జరిగింది. జెండు అవెస్తా గ్రంథంకంటే ఋగ్వేదం చాలా ప్రాచీనకాలపు గ్రంథమని అందరూ నిర్వివాదంగా ఆమోదించారు.

గ్రీకు చరిత్రానుసారంగా పర్షియన్ రాజైన **ZERVES** క్రీ.పూ. 480వ సంవత్సరంలో ఉన్నాడనీ ఈ **ZERVES** గ్రీకుల మీద దండయాత్ర చేశాడనీ ఈ దాడికి పూర్వమే 6000 సంవత్సరాల క్రిందట పర్షియన్ మతగ్రంథమైన 'జెండు అవెస్తా' గ్రంథ కర్త అయిన జోరాస్టర్ జీవించాడనీ తెలుస్తున్నది. ఈ సిద్ధాంతం ప్రకారం ఇప్పటికి $6000 + 480 + 1980 = 8,460$ సంవత్సరాలకు పూర్వం జోరాస్టర్ జీవించినట్లు దృఢంగా చెప్పవచ్చును. దీనికి అతి ప్రాచీనకాలమైన హిమయుగంలో 'జీమా' నివసించి ఉండవచ్చును. ఆకాలం 10,000 లేదా 30,000 లేదా 80,000 సంవత్సరాలయి ఉండవచ్చునని విభిన్నమయిన అభిప్రాయాలు తొంగి చూచాయి. ఋగ్వేదంలో వర్ణింపబడిన హిమయుగ వర్ణన ఈ సంవత్సరాలకంటే చాలా ప్రాచీనమైనదని కొందరభిప్రాయపడ్డారు. దీని కనుగుణంగా పాశ్చాత్య భూగర్భ శాస్త్రవేత్తలు రెండు హిమయుగాలు గడిచినట్లు గుర్తించిన విషయాన్ని కొందరు ఎత్తి చూపుతున్నారు. అమెరికా భూగర్భ శాస్త్రవేత్తల సిద్ధాంతం ప్రకారం ఇప్పటికి నాలుగు హిమయుగాలు గడిచినట్లు వూహించబడుతున్నది. ఏది యేమైనా ప్రథమ హిమయుగ కాలమైన 80,000 సంవత్సరాలకు అతి ప్రాచీనకాలంలోనే వేదాలున్నాయని కొందరు భావిస్తున్నారు.

హిమయుగాల మధ్య ఇంగ్లండులోని 'ససెక్సు' లో (**PILT-DOWN**) శిలాయుగంలోని మానవుడు సంచరించిన ప్రదేశాలలో లభించిన పుర్రెల ఎముకలనుబట్టి ప్రాచీన మానవుని జీవితకాలం 50,000 సంవత్సరాలని కొందరు భావించారు. యూరప్ ఖండంలోని ప్రాచీన మానవుని కాలం 2,00,000 సంవత్సరాలకు పూర్వపుదేనని కొందరు వైజ్ఞానికులు భావించారు. ఆనాటి మానవుడు గుహా నివాసం చేస్తూ వేటాడడం వివిధ అవసరాలలో అగ్నిని వినియోగించడం కూడా బాగా తెలిసిన వాడేనని ఈ వైజ్ఞానికులభిప్రాయపడ్డారు. "శిలాయుగపు మానవుడిని త్రోసిపుచ్చిన మొట్టమొదటి మానవుడు హిమయుగంలోనే ఉన్నాడని అప్పటినుంచి క్రమంగా మొక్కలు పెంచుకోడానికి వ్యవసాయాది కార్యక్రమాలు నిర్వర్తించడానికి సరియైన వసతులు యేర్పడి ఉన్నాయని హెచ్. జి. వెల్స్ (**H. G. WELLS**) అభిప్రాయపడ్డారు.

కృతయుగంలో మానవులు దేశద్రిమ్మరులుగా ఉన్నారని 'ఐతరేయ బ్రాహ్మణం' పేర్కొంటున్నట్లు కొందరు విమర్శకులు భావించారు. ఆ కాలంలో సుమేరువు (మేరుపర్వతం) ప్రాంతంలో అంటే ఉత్తర ధ్రువ ప్రాంతంలో అతిగా మంచుకప్పి ఉండడం చేత ఆ ప్రాంతాన్ని ఆర్యులు విడిచిపుచ్చి ప్రాచీన ఆర్యావర్తంలోని గంగాతీర ప్రాంతాలలో సారవంతమైన మైదానాలలో తమ స్థిర

నివాసం ఏర్పరచుకొన్నట్లు కొందరు పరిశోధకులు పేర్కొన్నారు. మేరుపర్వత ప్రాంతంలోని ఆర్యులు రెండుతెగలుగా విడిపో ఒక తెగవారు యూరప్ ప్రాంతానికి వెళ్ళగా రెండవతెగవారు సింధులోయవైపు వచ్చినట్లు కనపడుతున్నదని ఈ రెండుపర్గాలవా తరలిన కాలం క్రీ.పూ. 25,000 సంవత్సరాలకు అతిప్రాచీన కాలపుదేనని కొందరు విమర్శకులు భావించారు.

ఈ వాదాలన్నీ ఈ విధంగా వుండగా కె. ఎస్. రామస్వామిశాస్త్రివంటివారు వేదకాలం క్రీ. పూ. 6,000 సంవత్సరాల మొదలు 10,000 సంవత్సరాలవరకూ అయివుండవచ్చునని తమ అభిప్రాయాన్ని వెల్లడించారు.

శ్రీ సేన్‌గుప్త శ్రీ కేట్కార్ గార్లు ఖగోళశాస్త్రరీత్యా పేర్కొన్న వేదకాల నిర్ణయాలు పరమప్రామాణికాలుగా భావించడానికి వీ లేదు. రాశిచక్రంలో సూర్యునిగతి ఏకైక ఆవృత్తికి సంబంధించిందికాదు. అందువల్ల సూర్యసంబంధగమన పరివర్తనాన్నిబట్టి వే కాల నిర్ణయంచేయడం ప్రామాణికం కానేరదు. మేషరాశిలో సూర్యుని అక్షాంశ సగటుగతిగురించి లెక్కలు కట్టడానికి సూర్యు ఒక్కసారి మాత్రమే అక్షాంశగతిని పొందుతాడని కాదుగదా! ఈ సూర్య సంబంధగమన పరివర్తనం యెన్నెన్నిసార్లు జరిగిం చెప్పలేం కదా! దేవేంద్రుడు వేసాకాలంలో వృత్రసంహారుడైన మఘానుడుగా మారాడనేభావం గ్రహించినా ఈ మఘానుడుగా మార మనేది ఏకైక పర్యాయానికి బద్ధంకాకుండా చక్రనేమిక్రమంలో అనేక పర్యాయాలు జరుగుతూనే వుంటుంది కాబట్టి శ్రీ సేన్‌గు అంచనాప్రకారం క్రీ. పూ. 4170 సంవత్సరాలని పేర్కొనడం ప్రామాణికం కానేరదు. భారతగాథ ఆధారంగా ఇంద్రుడు భాద్రప శుక్ల ద్వాదశి శ్రవణా నక్షత్రంలో రాక్షసులతో యుద్ధంచేసి విజయం సంపాదించి వుండవచ్చుగాని ఇది వేదకాల నిర్ణయానికి తోడ ఉదు. ఇంద్రు డొకడేకాదు గదా! ఒక్క ఇంద్రుడు మాత్రమే రాక్షసులతో యుద్ధం చేయలేదుకదా! అదేవిధంగా శ్రవణా నక్షత్ర యుక్తమైన భాద్రపద శుక్ల ద్వాదశి ఒకే పర్యాయం రావాలని కూడా లేదు. ఈ అనంత కాలగమనంలో చక్రనేమిక్రమంలో ఎన్ని పర్యాయాలైనా రావచ్చును. అందువల్ల యిది కూడా వేదకాల నిర్ణయానికి తోడ్పడుతుందనుకొనడం పొరపాటు.

తిష్య (పుష్యమి) నక్షత్రానికి ఎదురుగావుండి దానిని మరుగుపరుస్తున్న గురుగ్రహ వ్యవస్థనుబట్టి వేదకాలాన్ని నిర్ణయించ డానికి వీలులేదు. గురుగ్రహం సృష్టిప్రారంభమైన తరువాత పుష్యమీనక్షత్రానికి ఎదురుగా వుండడమనేది ఒక్కసారే జరగలేదు. ఎన్నవసారి పుష్యమీనక్షత్రానికి ఎదురుగా గురుగ్రహంవుందో వేదర్షి వర్ణించివుంటే అది వేదకాల నిర్ణయానికి తోడ్పడి వుండేది. ఆ విధంగా వేదర్షి వర్ణించలేదుకాబట్టి ఈ అనంతకాలగమనంలో గురుగ్రహం ఎన్నిసార్లయినా పుష్యమికి ఎదురుగా చక్రనేమి క్రమంలో తన చలనాన్నిబట్టి నిలువవచ్చునుకాబట్టి యిది వేదకాల ప్రాచీనతా నిర్ణయానికి తోడ్పడదు. వసంతఋతు సంబంధమైన విషువత్ సంక్రాంతి మృగశిరా నక్షత్రంలో వున్నట్లు ఋగ్వేదం 10 వ మండలంలోని 86 వ సూక్తంలోవున్న వృషాకపి ఋక్కునుబట్టి క్రీ. పూ. 30,000 సంవత్సరాలకు పూర్వం వేదాలవతరించాయని ధీరేంద్రనాథ మహోపాధ్యాయ పేర్కొన్న విషయం కూడా ప్రామా ణికం కాదు. వసంత విషువత్తు చక్రనేమి క్రమంలో 72 సంవత్సరాలకు ఒక డిగ్రీవంతున వెనుకపడుతూ (ఏడాదికి 50 1/4 వికలలు) 25,920 సంవత్సరాలకు తిరిగి యథాస్థానాన్ని జేరుతూనే వుంటుంది. అందువల్ల మృగశిరా నక్షత్రంలో విషువత్ సంక్రాంతి క్రీ. పూ. 30,000 సంవత్సరాలనాడే వుందని మనం భావించనవసరంలేదు. ఈ మృగశిరా విషువత్ సంక్రాంతి క్రీ. పూ. 55,920 సంవత్సరాల నాటిదీ కావచ్చు, 81, 840 సంవత్సరాల నాటిదీకావచ్చు, 1,07,760 సంవత్సరాల నాటిదీకావచ్చు. అంతకు పూర్వపు కాలపుది ఎప్పటిదైనా కావచ్చు. ఖగోళశాస్త్రాలనుబట్టి ఈ అవకతవకలతోకూడిన నిర్ణయాలు చేయడంచేతనే భూగర్భశాస్త్రవేత్తల వేదకాల నిర్ణయానికి వీరి నిర్ణయానికి 2,50,000 సంవత్సరాల తేడాతో కూడిన అగాధం యేర్పడింది.

ఈ క్రింది ఋక్కులలో శతహేమంతాలు శతశరత్తుల ప్రసక్తి వుండడంవల్ల ఆయా ఋతువులు విభిన్నదశలలో చైత్ర మాసంతో వుండడంవల్ల అవి తొలి ఋతువులుగా భావింపబడి వర్ణింపబడ్డాయని కొందరు విమర్శకులు భావించారు. ఇది సరికాదు.

"అర్వద్భిరగ్నే అర్వతో నృభిర్నృన్ వీరైర్వీరాన్ వనుయామా త్వోతాః।
ఈశానాసః పితృవిత్తస్య రాయో విసూరయః శతహిమా నో అశ్యుః॥

(ఋగ్వే: 1 మం-73 సూ-9 ఋక్కు)

శతమిన్నుశరదో అన్తి దేవా యత్రా నశ్చక్రా జరసం తనూనామ్,
పుత్రాసో యత్ర పితరో భవన్తి మా నో మధ్యా రీరిషతాయుర్గన్తోః॥
(ఋగ్వే: 1 మం-89 సూ-9 ఋక్కు)

ఈ ఋక్కులలో సామాన్య దృష్టితో శత హేమంతాలు శతశరత్తులు అనేపదాలు నూరు నూరు సంవత్సరాలకు సాంకేతికాలుగా పేర్కొనబడ్డాయేకాని వేరుకాదు. వసంత విషువత్ చలనంవల్ల చైత్రమాసం చక్రనేమిక్రమంలో క్రమానుగతంగా ఒకదానివెంట ఒకటిగా అన్ని ఋతువులలోనూ వస్తుంది. అది కూడా ఋతు ప్రారంభం మాత్రమే అవ్వాలని ఎక్కడాలేదు. తొలి మధ్య అంత్య దశలు కాని వాటి పూర్వాపరదశలు కాని ఏదైనా చైత్ర శుద్ధ పాడ్యమి కావచ్చును. అయినప్పుడు చైత్రమాసంలో హేమంత ఋతువూ శరదృతువూ రావడంలో ఆశ్చర్యంలేదు. అయితే ఈ ఋక్కులలో శత హేమంతాలు శతశరత్తులను పేర్కొనడం కేవల శత సంవత్సర నిర్దేశకాలుగానే కాని ఉగాది నిర్దేశకాలుగా మాత్రంకాదు. శత హేమంతములు శతశరత్తులు అనడంలో ఆశీర్వచన దృష్టి వుందన్నా అది ఉగాది నిర్దేశకత్వాన్ని ప్రస్తావించదు. ఒకవేళ ఆశీర్వచనంలో ఋతు నిర్దేశంచేసినా అది ఆశీర్వచన ఋతుకాల నిర్దేశకం అవుతుందేకాని ఉగాది నిర్దేశకం కాదు. ఎవరు ఆశీర్వదించినా ఆశీర్వదిస్తున్నకాలంనుంచీ నూరు సంవత్సరాలు జీవించాలనే ఆశీర్వదిస్తారు కాని ఉగాదినుంచి నూరు సంవత్సరాలు జీవించవలసిందని ఆశీర్వదించరు గదా ! అందువల్ల ఈ శత హేమంత శత శరత్తుల ప్రస్తావన చైత్రశుద్ధపాడ్యమీ నిర్దేశకం కానేరదు. ఈ దృష్ట్యా చైత్రమాసంలో హేమంత ఋతువునూ శరదృతువునూ దృష్టిలో పెట్టుకుని వసంత విషువత్ చలనస్థితిని గుర్తించి వేదకాల నిర్ణయంచేయడం సాహసమే అవుతుంది. ఈ ఋతు వ్యవస్థ కూడా ఒక ఆవృత్తితో నిలిచిపోయేది కాదుగదా ! కాగా శాస్త్రీయమైన పద్ధతిలో వేదాలకు కాలనిర్ణయం చెయ్యగలమనే దృష్టి శాస్త్రీయ మైనదిగా నిలపడం కష్టం. అందువల్ల సృష్టి వ్యవస్థను దృష్టిలో పెట్టుకుని సృష్టి ప్రారంభదశలో వేదాలను ఆర్షదృక్కుతో ద్రష్ట లుగా అతిప్రాచీన కాలంలో వేదర్షులు గుర్తించారని చెప్పవలసి వుంటుంది.

## తొలి ఋషి యెవరు ?

అనంతమైన వేదానికి వాస్తవానికి ఆద్యంతాలనేవి వుండవు. వేదం అనంతమైనపుడు యిది ఆది యిది అంతం అని చెప్పే అవకాశం వుండదు. అయితే ఉపలభ్యమానమైన వేదభాగంలో అష్టక-అధ్యాయ-మండల-అనువాక- సూక్తాది భేదాలతో ఆద్యంతాలను సంప్రదాయసిద్ధంగా కేవలం గ్రంథ అధ్యయన వ్యవస్థను దృష్టిలో పెట్టుకుని మన ప్రాచీనులేర్పరచారు. ఈ దృష్ట్యా ఋగ్వేదంలో తొలి సూక్తానికి "మధుచ్ఛందా వైశ్వామిత్రః" అని "విశ్వామిత్రుని కుమారుడు మధుచ్ఛందుడు" తొలి ఋషిగా అగ్నిసూక్తద్రష్టగా సంప్రదాయ సిద్ధంగా పేర్కొనడం జరుగుతున్నది. వాస్తవానికి వేదర్షులలో విశ్వామిత్రుడు తొలి ఋషి కానేకాడు. అయినప్పుడు విశ్వామిత్రుని పుత్రుడైన మధుచ్ఛందుడు తొలి ఋషి అనుకోనడం పొరపాటే కాగలదు. నిజానికి విశ్వామిత్రనామకులైన ఋషులు అనేకమంది వేదకాలంలోనూ-బ్రాహ్మణాలకు పూర్వకాలంలోనూ-పురాణాల కాలంలోనూ విభిన్నులుగా వున్నారు. లోతుగా పరిశీలిస్తే సప్తఋషులలో పేర్కొనబడిన విశ్వామిత్రునికీ మిగిలిన విశ్వామిత్రులకూ సంబంధమున్నట్లు కనపడదు. గాధిపుత్రుడైన విశ్వామిత్రుడొకడు-ప్రగాధపుత్రుడైన విశ్వామిత్రుడు మరొకడు-జమదగ్ని పుత్రుడైన విశ్వామిత్రుడు వేరొకడు-విభిన్నులైన ముగ్గురు విశ్వామిత్రులు వేదర్షులుగా కనిపిస్తున్నారు. గాలవుని గురువుగా వుండి మాధవిని భార్యగా స్వీకరించిన ఇక్ష్వాకు కాలంలోని విశ్వామిత్రు డొకడు-గాలవునికి తండ్రియైన విశ్వామిత్రుడు వేరొకడు వున్నారు. త్రిశంకు, హరిశ్చంద్రుల కాలంలోని విశ్వామిత్రుడొకడు-మేనక ద్వారా శకుంతలనుకన్న విశ్వామిత్రుడు మరొకడు-అంబరీషుని కాలంలో వున్న విశ్వామిత్రుడొకడు-తన తపస్సుకు భంగం కలిగించ డానికి వచ్చిన దేవవేశ్య రంభను శిలయై పడివుండవలసిందని శపించిన విశ్వామిత్రుడొకడు వున్నారు. దశరథుని కాలంలో వుండి రామలక్ష్మణులకు అస్త్రశస్త్రాది వేదవిద్యలను నేర్పిన విశ్వామిత్రుడు వేరొకడు-బల, అతిబల వంటి వేదవిద్యలు తెలియక ఆహారం ఉపలభ్యంకాని దశలో కుక్కమాంసంసైతం భక్షించిన విశ్వామిత్రుడు కూడా వేరొకడున్నాడు. రాక్షసులను సమర్థిస్తూ అవసరమైతే రాక్షసులను సృష్టిస్తూ దేవ యజ్ఞయాగాది కర్మలకు విరోధిగా నిలిచిన విశ్వామిత్రుడుకూడా వున్నాడు. వందమంది పుత్రులు కలిగి శునశ్శేపుణ్ణి కాపాడిన విశ్వామిత్రుడు వేద విశ్వామిత్రుడు కాడు. త్రిశంకు-హరిశ్చంద్రుల కాలంలోనివాడుకాని అంబరీషుని

కాలంలోనివాడుకాని అయివుంటాడు. త్రిశంకు-హరిశ్చంద్రులు-అంబరీషుడు వేదకాలంలోని వారుకారు. అందువలన వేద వున్న విశ్వామిత్రునికి మధుచ్ఛందుడనే పుత్రుడున్నట్లు కనపడదు. విశ్వామిత్ర మధుచ్ఛందాది పుత్రులకు తదితర పు శునశ్శేపునికి సంబంధించిన కథ వేద విశ్వామిత్రునికి సంబంధించింది కానేరదు. వేదవిజ్ఞానాన్ని లోతుగా పరిశీలిస్తే నః గాని పశుహింసతోకాని కూడిన యజ్ఞాలు వేదకాలంలో వున్నట్లు కనపడదు. మామూలుగా "మధుచ్ఛందా వైశ్వామిత్రః కొన్ని సూక్తాలకు విశ్వామిత్ర పుత్రుడైన మధుచ్ఛందసుడు ఋషిగా సంప్రదాయసిద్ధంగా పేర్కొనడం జరుగుతున్నది. మధుచ్ఛంద శబ్దం సకారాంత పదంగా ఉపయోగించబడినా అనంతరకాలంలో అకారాంత పుంలింగ పదంగానూ-మధుచ్ఛంద అకారాంత పుంలింగపదంగా కూడా ప్రయోగితమయ్యాయి. తెలుగులో సకారాంతపదం ప్రాతిపదిక అయినా మధుచ్ఛందసుడు చ్ఛందుడు రెండురూపాలూ అవుతాయి. అకారంత పుంలింగ పదాలయిన మధుచ్ఛందస-మధుచ్ఛంద శబ్దాలమీద కూడా యీ రూపొందుతాయి. సాంతపద ప్రాతిపదికగా మధుచ్ఛందస్సు రూపంగా కూడా లేకపోలేదు. అయితే శ్రీ నేమాని వేంకట నరసిం గారు మాత్రం మధుచ్ఛంద ఋషి నామాన్ని పేర్కొనడంలో 'మధుచ్ఛందసు(డు' రూపమేకాక "మధుచ్ఛందుడు" రూపః "మధుచ్ఛంధసుడు, మధుచ్ఛంధుసుడు మధుచ్ఛందుసుడు" రూపాలు కూడా ప్రయోగించారు. అందువల్ల ఈ మధుచ్ఛంద శబ్ద సంస్కృతమూల ప్రతులలో వివిధ రూపాంతరాలలో వున్నట్లు కనిపిస్తున్నది. వాస్తవానికి కొన్ని ప్రాచీన ఋగ్వేద వ్రాతప్ర "మధుచ్ఛందా-వై-శ్వామిత్రః" అన్నపాఠం కనిపిస్తున్నది. మరికొన్ని ప్రతులలో 'శ్వామిత్రాః' అనికూడా కనిపిస్తున్నది. అప్ప సూక్తద్రష్టలు "మధుడు-ఛందుడు-శ్వామిత్రుడనే ఋషులుగా పేర్కొన్నట్లు కాగలదు. వ్రాతలో పొరపాటుగా భావించినా శ్వా పుత్రులు మధుచ్ఛందులని కూడా భావించడానికి అవకాశం వున్నది. 'వై' అనేది అనేక సందర్భాలలో 'చ'-'తు' అన్న అ ప్రయుక్తం కాకపోలేదు. అదేవిధంగా మధుచ్ఛందా-వై-అని 'వై'ని ప్రయోగించగా దానిని 'శ్వామిత్ర' శబ్దంతో కలిపి వైశ్వా శబ్దంగా భావింపబడినట్లు కనిపిస్తున్నది. పక్షాంతరంలో మధు-ఛంద-వైశ్వ (విశ్వఋషి కుమారుడు)-మిత్రఋషులు నలుగురూ ఆయాసూక్తద్రష్టలు కావచ్చును. విశ్వామిత్రుని కుమారుడైన మధుచ్ఛందుడు ఋగ్వేద తొలి సూక్తమైన అగ్నిసూక్తానికి అనడానికి వీలులేదు కాబట్టి ఈ అగ్నిసూక్త ఋషి విషయమై యింతగా చర్చించవలసి వచ్చినది.

వేదద్రష్టలైన ఋషులలో అంగిరసమహర్షి అతని వంశీకులు ఆదిద్రష్టల పరంపరలలోనివారుగా కనిపిస్తున్నారు, అర్షవి దృష్ట్యా సృష్టిప్రభవ గణాంక సంవత్సరాలను పరిశీలిస్తే స్వాయంభువ మన్వంతరంలో 1,44,000 సంవత్సరం మొదలు 1,7 సంవత్సరాలవరకూ వున్న మధ్యకాలంలో అంగిరసాది మహర్షులు వేదద్రష్టలై ఆవిష్కరించి అపౌరషేయాలైన ఆ దేవవే పౌరుషేయాలని భ్రమ కల్పించేట్లుగా మానవుల చెవుల్లోవేసి నోళ్ళల్లో నానేటట్లుచేసి మనకు జ్ఞానభిక్ష పెట్టినట్లు కనిపిస్తున్నది. వేదాలు దైవదత్తాలుగా అంగిరసాది వేదర్షి మండల దృష్టాలుగా ఇప్పటికి 196,93,49,060 సంవత్సరాలకు 197,10,77,080 సం రాలకు మధ్యకాలంలో యీ కల్పంలో భూలోకంలో ఆవిష్కృతమయినట్లు కనిపిస్తున్నది. అంగిరసుడు అతని కుమారులైన తీర్కీర్తి, బృహజ్జ్యోతి, బృహద్బ్రహ్మ, బృహన్మనసుడు, బృహస్పతి, సంవర్తనుడు, ఉతథ్యుడు, బృహన్మంతుడు, బృహద్భా మొదలైనవారు భానుమతి, రాక, సినీవాలి, గుహువు, అర్చిష్మతి, మహిష్మతి, యోగసిద్ధి అనే పేర్లుగల ఎనిమిదిమంది పు వేదద్రష్టలుగా ఋషి-ఋషికలుగా వెలుగొందారు. అంగిరసుని పౌత్రులు, ప్రపౌత్రులుకూడా అనేకమంది వేదద్రష్టలైన మ లున్నారు.

## వేదాలు పౌరుషేయాలా? అపౌరుషేయాలా?

సర్వవిద్యలకు మూలం సరస్వతి అని చిరకాలంగా భావించడం పూజించడం జరుగుతున్నది. మరొకవంక చతుర్వే బ్రహ్మచతుర్ముఖాలనుంచి వెలువడ్డాయని అత్యంత ప్రాచీనకాలంనుంచీ విశ్వసిస్తున్నాము. వైయ్యాకరణులను దృష్టిలో పెట్టుక నృత్తావసానంలో నటరాజు ఢక్కానినాదంనుంచి భాషాక్షరాలన్నీ తద్రూపంగా శబ్దజాల వాఙ్మయాదులు అవతరించాయని సాంప్రద సిద్ధమైన బలీయమైన అభిప్రాయమొకటున్నది. వీరందరినీ కాదని విద్యలకధినాధుడుగా విఘ్నేశ్వరుడుండనేవున్నాడు. మిగి విద్యల భాషల సంగతి ఎట్లావున్నా వేదాలుమాత్రం బ్రహ్మచతుర్ముఖాలనుంచి వెలువడ్డాయని చిరంతనంగా సంప్రదాయ సిద్ధ విశ్వాసం ఒకటున్నది. వాస్తవం పరిశీలిస్తే బ్రహ్మకు వేదాలను ప్రసాదించినవాడు శ్రీమహావిష్ణువుగా కనిపిస్తున్నాడు. అంతేకా

వేదవిజ్ఞానానికి వేదసంపదకు యెప్పుడు విపత్తు వచ్చినా వాటిని రక్షించి తిరిగి బ్రహ్మకు ప్రసాదించి సృష్టి జ్ఞానభిక్షను పెట్టినవాడు కూడా శ్రీమహావిష్ణువుగానే కనిపిస్తున్నాడు. మహావిష్ణువు ద్వైతుడు అద్వైతుడు ద్వైతాద్వైతుడుకూడా. కాగా కాలమూల కారకుడై కాలాతీతుడై కాలాంతకుడైనవాడుకూడా మహావిష్ణువేనని వేదం ఘోషిస్తున్నది. విష్ణ్వవతారరూపుడైన శ్రీకృష్ణుడు యశోదకు తన నోట్లో విశ్వాన్నంతటినీ చూపించి నేను విశ్వాతీతుడను ద్వైతుడను అని నిరూపించాడు. కౌరవసభలోనూ అర్జునునికి గీతోపదేశ సందర్భంలోనూ తన విశ్వరూప ప్రదర్శనచేసి తన అద్వైతతత్వాన్ని ఒకటికి రెండుసార్లు నిరూపించాడు. ఈ రెండింటికి భిన్నంగా మహావిష్ణువు వామనావతారరూపంలో కేవలం మూడు పాదాలతో మాత్రమే మొత్తం సృష్టిరూపమైన విశ్వాన్నంతటినీ ఆక్రమించి ఈ విశ్వమంతా నా పాదాలు మాత్రమేననీ అద్వైతతత్వాన్నీ త్రిపాద్విభూతి భిన్నమైన మిగిలిన తన స్వస్వరూప దేహభాగం విశ్వాతీత మైనదనీ కాగా తాను ద్వైతుడననీ-ఈ ఒక్క వామనావతారరూపంలోనే తన ద్వైతాద్వైత తత్వాన్ని నిరూపించాడు.

"త త్తదితదిదస్య పౌంస్యం గృణీమసీనస్య త్రాతురవృకస్య మీళ్హుషః।
యః పార్థివాని త్రిభిరిద్ విగామభిరురు క్రమిష్టోరు గాయాయ జీవసే॥"
(ఋగ్వే: 1 మం-155 సూ-4 ఋక్కు)



"ద్వే ఇదస్య క్రమణే స్వర్దృశోఽభిఖ్యాయ మర్త్యో భురణ్యతి।
తృతీయమస్య నకిరా దధర్షతి వయశ్చన పతయన్తః పతత్రిణః॥"
(ఋగ్వే: 1 మం-155 సూ-5 ఋక్కు)

"చతుర్భిః సాకం నవతిం చ నామభిశ్చక్రం న వృత్తం వ్యతీగ్ం రవీవిపత్।
బృహచ్ఛరీరో విమిమాన ఋక్వభిర్యువా కుమారః ప్రత్యేత్యాహవమ్॥"
(ఋగ్వే: 1 మం-155 సూ-6 ఋక్కు)

ఈ ఋక్కులలో ద్వైతాద్వైతుడై కాలాతీతుడైన విష్ణుస్వరూపంగురించి చక్కగా వర్ణించడం జరిగింది. వామనావతారం గురించి మూడడుగుల పరివ్యాప్తిగురించి విశ్వవ్యాప్తిత్వంగురించి ఋగ్వేదంలో అనేక సందర్భాలలో వర్ణించడం కీర్తించడం జరిగింది. కాని కాలతీతుడైన మహావిష్ణువును కాలాధినేతగా 'చతుర్భిః సాకం నవతించ' యిత్యాది ఋక్కులో ఒక్కదానిలో మాత్రమే వర్ణించడం జరిగింది. ఈ ఋక్కులో పేర్కొన్న తొంభైనాలుగు కాల విభాగాల గురించి సాయనాచార్యులు "సంవత్సర ఏకః। అయనే ద్వే। పంచ ఋతవః। ద్వాదశ మాసాః। చతుర్వింశత్యర్ధమాసాః। త్రింశ దహోరాత్రాః। అష్టౌ యామాః। ఏకస్మిన్ దినే పర్యా వర్తమానాని మేషాదీని ద్వాదశ లగ్నానీతి మిలిత్వా చతురధిక నవతి సంఖ్యాకా నవీ విపత్।". అని 1-సంవత్సరం, 2-అయనాలు, 5-ఋతువులు, 12-మాసాలు, 24-పక్షాలు, 30-అహోరాత్రాలు, 8-యామాలు, 12-రాశులుగా పేర్కొనడం జరిగింది. వాస్తవానికి ఆర్ష ఖగోళ విజ్ఞానం దృష్ట్యా కల్పాలు-3, మనువులు-14, చతుర్యుగాలు-4, సంవత్సరం-1, అయనాలు-2, నాభులు-3, ఋతువులు-6, మాసాలు-12, పక్షాలు-2, తిథులు-30, ఆదిత్యసోమాది వారాలు-7, రాత్రింబవళ్ళు-2, యామాలు-8 మొత్తం తొంభైనాలుగు అనంత కాలావయాలుగా పరిగణనకు రావలసివున్నది. కల్పాలను మన్వంతరాలనూ చతుర్యుగాలనూ, వారాలు-పక్షాలు-రాత్రింపగళ్ళు-అయనాలువంటి వాటిని విడిచిపెట్టి 30 అహోరాత్రులనూ చతుస్సంధ్యలను కలిపి 94 సంఖ్యను సరిపెట్టవచ్చునుగాని ఋది సంవత్సరకాల బద్ధమై తదతీత చతుర్యుగ మన్వంతర కల్పకాల వివర్జితమైన వ్యవస్థకు మాత్రమే పరిమితమైనదిగా రూపొందు తుంది. అందువల్ల కల్పమన్వంతరాదులను వారాలతో రవ్యాదిసప్త గ్రహాదులను కాల బద్ధాలుగా పరిగ్రహించడంలో ఎంతో సార్థకత వున్నది. సాయనాచార్యులు 6 ఋతువులకు మారు పంచఋతువులను మాత్రమే పేర్కొనడం సరికాదు. వేదాలలో అనేక సందర్భాలలో షడృతువుల ప్రశంస చేయబడింది. షడృతు ప్రసక్తితోపాటు పంచఋతు ప్రసక్తి కూడా ఈ క్రింది ఋక్కులో చేయబడింది.

"పంచపాదం పితరం ద్వాదశాకృతిం దివ ఆహుః పరే అర్ధే పురీషిణమ్।
అథే మే అన్య ఉపరే విచక్షణం సప్తచక్రే షళర ఆహురర్పితమ్॥"
(ఋగ్వే: 1 మం-164 సూ-12 ఋక్కు)

షడృతు వ్యవస్థ సామాన్యమైనది. పంచఋతు వ్యవస్థ లుప్తమాస యుక్తమైన సంవత్సరములోని ఋతువ్యవస్థకు సంబంధించింది. అధిక మాసయుక్త సంవత్సరంలో పూర్వాపర ఋతువులలో యేదో ఒకదానికిగాని అటుసగం యిటుసగంగాగాని అధికమాసం ఋతువ్యవస్థకు లోబడివుంటుంది. అదేవిధంగా ఒక మాసం లుప్తమయినప్పుడు మిగిలినమాసం నామమాత్రంగా ఋతువ్యవస్థకు చిహ్నమై పూర్వాపర ఋతువులలో యేదో ఒకదానికిగాని చెరిసగంగాగాని బద్ధమై కలిసిపోవడం జరుగుతుంది. అప్పుడు లుప్తమాస యుక్తమైన సంవత్సరానికి అయిదు ఋతువులు మాత్రమే పరిగణనకు వస్తాయి. విశేషవ్యవస్థలో వచ్చే యీ అయిదు ఋతువులను సంవత్సర భాగాలుగా సామాన్య ఋతువులుగా పరిగ్రహించడానికి వీలులేదు. అందువల్ల సాయనాచార్యుల పంచఋతు పరిగణన ప్రామాణికం కానేరదు. పంచఋతు వ్యవస్థ లుప్తమాస సంవత్సరానికి సంబంధించిందని గుర్తించక కొందరు విమర్శకులు యిది ధ్రువఖండ ఋతువ్యవస్థావర్ణనమని భ్రమపడడం జరిగింది. 'షడుద్యామా ఋషయో దేవజాః' అంటూ దైవీయాలైన ఋతువులు ఆరు అని షడృతు సాంప్రదాయాన్ని ఉద్ఘాటించిన ఋగ్వేద వ్యవస్థను సరిగా గుర్తించక కొన్ని బ్రాహ్మణ గ్రంథాలలోసైతం సామాన్యంగా పంచఋతు వ్యవస్థ వున్నట్లు పొరపాటున పేర్కొనడం జరిగింది. లుప్తమాస యుక్త సంవత్సరగతమైన ఋతువ్యవస్థను గుర్తించక పోవడంవల్లనే ఈ పొరపాటు జరిగినట్లు కనిపిస్తున్నది. ఋతువులకు ఆరింటికీ త్రినాభి వ్యవస్థ మూలకందం. అందువల్ల కాల చక్రంలో ఉష్ణ-జల-శీత-నాభి వ్యవస్థను ఏ పరిస్థితులలోనూ విస్మరించడానికిగాని విసర్జించడానికిగాని వీలులేదు. "త్రినాభి చక్ర మజరమనర్వం"--- "త్రీణి నభ్యానిక ఉతచ్చికేత" అంటూ దీర్ఘతముడు పేర్కొన్నట్లు నాభివ్యవస్థకూ కాలచక్రానికీ అవినాభావమైన సంబంధమున్నది. నాభి వ్యవస్థ ఒక్క ప్రాణికోటికేకాదు దేవకోటికేకాదు కాలానికికూడా ప్రాణప్రదమైనది. బ్రహ్మ విష్ణు నాభికమలం నుంచే కదా సంజనితుడయ్యాడు. కాగా నాభి వ్యవస్థను విస్మరించడం కాలవ్యవస్థను కాదనడమే కాగలదు. త్రిపాద్విభూతుడై కాలాధినేతగా-కాలాంతకుడుగా-కాలాతీతుడుగా వెలుగొందే శ్రీమహావిష్ణువు ఋగ్వేద ఋషి పేర్కొన్నట్లు మొత్తం విశ్వసృష్టికే మూల భూతుడూ ఆధారభూతుడుకూడా. అటువంటి విష్ణుమాయావిలాసంలో ఒకలీలగా బ్రహ్మ విష్ణువువద్దనుంచి వేద విజ్ఞానాన్ని పరిగ్రహించి సృష్టివ్యవస్థను కొనసాగించాడు. లౌకిక వ్యవస్థలో చతుర్వేదాలూ బ్రహ్మచతుర్ముఖాలనుంచి వెలువడ్డాయని మనం భావించినా అలౌకిక వ్యవస్థలో వాటికి మూలకారకుడు మూలాధారభూతుడు శ్రీమహావిష్ణువేనని ఆమోదించక తప్పదు. కాగా వేదాలు పౌరుషేయాలుగాకాక అపౌరుషేయాలుగానే సుప్రతిష్ఠిత వ్యవస్థతో వెలుగొందుతాయి. అపౌరుషేయాలైన వివిధ వేద ఋక్కులను అంగిరసాది సహస్రాధికులైన వేదర్షులు తమ దివ్యజ్ఞానంతో దర్శించి లోకానికి వేదాలను ప్రసాదించారేకాని వారు వేదస్రష్టలూకారు కర్తలూ కారు. వేదద్రష్టలు మాత్రమే.

వేదద్రష్టలైన ఋషులను పేర్కొనడంలో అనేకమంది రాజర్షులున్నట్లు ఆనువంశికంగా ప్రాచీనకాలంనుంచీ పొరపాటున పేర్కొనడం జరిగింది. ఇటువంటివారిలో ఋజ్రాశ్వ-అంబరీష-సహదేవ-భయమాన-సురాధులవంటివారు రాజర్షులని వారు వేదర్షులని పేర్కొనడం జరిగింది. విశ్వామిత్రుడుకూడా రాజర్షిగా సుప్రసిద్ధుడొకడున్నాడు. రాజర్షులందరూ యజ్ఞయాగాది కర్మలు నిర్వర్తించినవారే కాని వేదర్షులుకారు. రాజర్షి స్థాయినుంచి బ్రహ్మర్షిస్థాయి కందుకున్నవారే వేదర్షులు కాగలరు. పరశురాముడు వేదర్షి అవునో కాదో చెప్పలేము కాని 'ఇదం బ్రాహ్మ్యం ఇదం క్షాత్రం' అని బ్రహ్మర్షిస్థాయినుంచి రాజర్షిస్థాయికి మాత్రమేకాదు రాజస్థాయికిసైతం దిగజారిపోవడం జరిగింది. అనేకమంది క్షత్రియులను సంహరించినందుకు పాపపరిహారంగా "పూర్వదుర్గతి నాశినీ" సిద్ధిని పరశురాముడు పొందివుండవచ్చునుగాని అతనిలో చివరిక్షణంవరకూ రాజసగుణం చావలేదని కళ్యాణానంతరం సీతాసమేతుడై వస్తున్న శ్రీరామచంద్రుని మీదికి దాడికి వెడలడంవల్లనే రుజువవుతుంది. ఒక విశ్వామిత్రుడు "ఇదం క్షాత్రం ఇదం బ్రాహ్మ్యం" అనక పోయినా రాజవ్యవస్థనుంచి రాజర్షి వ్యవస్థకూ, రాజర్షిస్థాయినుంచి మహోన్నతమైన బ్రహ్మర్షిస్థాయికీ చేరుకున్నాడు. కాదన్నవారిచేతనే అనిపించుకున్నాడు. పరశురాముడు బ్రహ్మర్షిస్థాయినుంచి రాజస్థాయికి భ్రష్టమైన పతన వ్యవస్థకు తార్కాణంకాగా విశ్వామిత్రుడు రాజవ్యవస్థనుంచి బ్రహ్మర్షివ్యవస్థకు అభ్యుదయం చెందడం పవిత్రపుణ్యాభ్యుదయ ఉన్నత వ్యవస్థకు చిహ్నం. వేదర్షియై జమదగ్ని కుమారుడైన భార్గవుడొకడున్నాడుగాని రామునికాలంలో ఉన్న జమదగ్ని కుమారుడై పరశురాముడనబడిన భార్గవుడూ యితడూ ఒక్కరు కాదు. శ్రీరామచంద్రుని కాలంలోని భార్గవుడు వేదర్షి కాడు. పరశురాముడు విష్ణ్వంశావతారమన్నది వేరేవిషయం. వేదర్షులైన బ్రహ్మర్షులే ఋగ్ద్రష్టలుగా పరిగణనకు వస్తారుగాని రాజర్షులు బ్రహ్మర్షులుగానూ పరిగణనకురారు. వేదర్షులుగానూ పరిగణనకు రారు. అయితే దేవతలపేర్లు మానవులు పెట్టుకున్నట్లు వేదర్షుల పేర్లు బ్రహ్మర్షుల పేర్లు మామూలు రాజులుకూడా భక్తి గౌరవాభిమాన

భావాలతో తమసంతానానికి పెట్టడంజరిగింది. అంతమాత్రంచేత రాజుల నామాలూ రాజర్షులనామాలూ చూచివారు వేదర్షులని మనం భ్రమపడకూడదు .వృషాగిర మహారాజ పుత్రులుగా భావింపబడుతున్న ఋజ్రాశ్వ-అంబరీష-సహదేవ-భయమాన-సురాధులు రాజర్షులని కాక వేదర్షులనే మనం గుర్తించవలసివున్నది. ఒక వేళ రాజర్షిస్థాయినుంచి బ్రహ్మర్షిస్థాయి నందుకున్న విశ్వామిత్రుడిని వేదర్షిగా మనం గుర్తించవలసివస్తే బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడినే పరిగణిస్తాముకాని బ్రహ్మర్షిస్థానాన్ని పొందనటువంటి కేవలరాజైన విశ్వామిత్రుడిని కాని రాజర్షియైన విశ్వామిత్రుడినికాని యేపరిస్థితులలోనూ పరిగ్రహించలేము. రాజర్షులను వేదర్షులుగా గుర్తించడం జరిగితే మనకు సూక్తాలూ ఋక్కులూ లభ్యంకాకపోవచ్చునుగాని సహస్రాధికంగావున్న సూర్య చంద్రవంశ రాజర్షులందరూ వేదర్షులై కూర్చుంటారు. ఇది యే దృష్టితో చూచినా ఆమోద యోగ్యంకాదు.

వేదద్రష్టల కాలానంతరం గురుశిష్య పరంపరలోనూ వంశానుగత పరంపరలలోనూ ఋగధిదేవతల విషయమై అనేక అభిప్రాయ భేదాలు తొంగిచూచాయి. కాత్యాయనముని విరచితమైన ఋగధిదేవతాది విషయాలను భారత దేశంలోని పండితమండలి పఠన పాఠనాదులలోనేకాక లేఖన పరిశీలనలో సైతం అనుసరించడం జరుగుతున్నది. కాత్యాయనమునికి భిన్నంగా ఇతర ఋషులు అనేకులు ఋగధిదేవతలుగా భావించిన దేవతలున్నట్లు కౌషీతకి బ్రాహ్మణం-ఐతరేయ బ్రాహ్మణం-కౌషీతక్యారణ్యకం-ఐతరేయఆరణ్యకం-ఆశ్వలాయన సూత్రం-బృహద్దేవతాగ్రంధం-ఉద్గీత గ్రంధం-సాయనభాష్యం-స్కందభాష్యం వంటి గ్రంథాలలో ప్రాచీన ఋషుల మతంగా పేర్కొనడం జరిగింది. కాత్యాయనముని నిర్దిష్ట దేవతలకు భిన్నంగా సాంఖ్యాయన - శౌనకాదుల సంహితాపాఠాలలో అనేక దేవతలను పేర్కొనడం జరిగింది. ఈ సందర్భంగా ఆయా ఋక్కులలో ఉపయోగించబడిన వివిధ విభిన్న దేవతావాచకాలకు పరస్పర విరుద్ధాలైన అర్థాలను కూడా పేర్కొనడం జరిగింది. ఆప్రీసూక్తం పేరుతో కొందరు ఇధ్మాది రూపాలలోవున్న అగ్నిని మాత్రమే గ్రహింపగా మరికొందరు సమిద్ధోగ్ని, తనూనపాత్తు, నరాశంస, ఇళ, బర్హి, దేవీర్ద్వార. ఉషాసానక్త, దైవ్యహోతారప్రచేతసులు, సరస్వతి ఇళా భారతులు, త్వష్ట, వనస్పతి, స్వాహాకృతులు, ఇంద్రుడు వంటి విభిన్న దేవతలను గ్రహించడం జరిగింది. విశ్వేదేవతల విషయమై కొన్నిసందర్భాలలో కేవలం స్వాహాకృతాగ్నులు పరిగ్రహింపబడగా కొన్నిసందర్భాలలో ఇంద్ర, వాయు, బృహస్పతి, మిత్రాగ్ని, భగాదిత్యమరుద్గణాలు, పూష, ఆప, వంటి దేవతలుసైతం పరిగ్రహించడం జరిగింది. మరికొన్ని సందర్భాలలో ఋతుదేవతలు-దేవతలు-భగ-మిత్ర-అదితి-దక్ష - మరుదర్యమ-వరుణ-సోమాశ్వి-సరస్వతులు-వాత-పృథివి - దివి-అగ్ని-అశ్వినులు ఇంద్రుడు-పూష-తార్క్ష్య-బృహస్పతి-ఆదిత్యబ్రహ్మణస్పతులతోపాటు కొన్నిసందర్భాలలో విష్ణువు, వనస్పత్యాది ఓషధులుసైతం పరిగ్రహించడం జరిగింది. ఒక వర్గరూపంలోగాని ఒక గణరూపంలోగాని ఆప్రీ దేవతలకు విశ్వేదేవతలకు ఖచ్చితమైన పరిగణన లేకుండాపోయింది.

దీనికితోడు దేవతల నామాలు అత్యంత ప్రాచీన కాలంలోనే ఋషులు, ఋషికల్పులు, తమ సంతానానికి పెట్టుకొనడంవల్ల ఋషి యెవరో దేవత యెవరో గుర్తించడం కష్టసాధ్యంగా తయారయింది. కొన్ని సందర్భాలలో దేవతనామం ఋషినామం అభిన్నంగా ఉండడంవల్ల ఋగధిదేవత వేరు - దేవతా నామవాచ్యుడైన ఋషివేరు అన్నసంగతి గుర్తింపక అనేక విధాలైన తికమకలకు లోనుకావడం జరిగింది. సంభాషణాపూర్వకమైన ఋక్కులతోవున్న సూక్తాలన్న అభిప్రాయం యేర్పడిన సూక్తాల ఋష్యధిదేవతల విషయమై చాలా తికమక లేర్పడ్డాయి. ఋగ్వేదం ప్రథమ మండలం 165 వ సూక్తానికి మరుత్తులు, ఇంద్రుడు దేవతలుగా మాత్రమే కాక మరుత్తులు,అగస్త్యుడు,ఇంద్రుడు ఋషులుగాసైతం పేర్కొనడం జరిగింది. ఇక్కడ ఋషిదేవతల నామాలలో సాజాత్యం వున్నందువల్ల వేదద్రష్టలైన ఋషులకు సూక్తగత ఋగధిదేవతలకు సంభాషణ జరిగినట్లు పెక్కుమంది భాష్యకర్తలు భావించడం జరిగింది. అందువల్ల ఈ దృష్టితోనే ఋక్కులకు భాష్యాలు కూడా విరచించడం జరిగింది. కాగా మరుదింద్రుల మధ్య జరిగిన అర్షవిజ్ఞాన పరమైన సంభాషణా విషయాలు కేవల లౌకికులై దేవ నామకులైన మానవ ఋషికి దేవతకు మధ్య జరిగిన సంభాషణగా భాష్యం వ్రాయబడి ఋక్కుల గౌరవాన్ని తెలియకుండానే కించపరచడం జరిగింది. ఇదేవిధంగా ప్రథమ మండలంలోని 126 వ సూక్తానికి కక్షీవంతుడు, భావయవ్య, రోమశలు ఋషులుగాను - భావయవ్య; రోమశలు దేవతలుగాను పేర్కొనబడి రోమశ, భావయవ్యల సంభాషణలతో కూడిన సూక్తంగా పేర్కొనబడింది. రోమశ భావయవ్యులు పేరుకు దేవతలుగా పేర్కొనిబడినా కేవల మానవమాత్రులైన

నాటి సంభాషణలు వలెనే ఋక్కులు ఆవతరించినట్లు భావింపబడి వేద అపౌరుషేయ వ్యవస్థకు భిన్నంగా భాష్యాలు వ్రాయబడ్డాయి. కేవలమానవ నామాల సాజాత్యంవల్ల ఆర్షవిజ్ఞానాన్ని దృష్టిలో పెట్టుకొనకపోవడంవల్ల భ్రమ ప్రమాదాలకు లోనై ప్రాచీను లీపొరపాట్లు చేసినట్లు కనిపిస్తున్నది. వాస్తవానికి బ్రహ్మణస్పతి, బృహస్పతులు వేరు. అయినప్పటికీ భాష్యకర్తలు కొందరూ తరువాతి కాలంలోని విమర్శకులు కొందరూ బ్రహ్మణస్పతి, బృహస్పతులిరువురూ ఒక్కరేయని పొరపాటున భావించడం జరిగింది. బ్రహ్మణస్పతి, బృహస్పతులు ఋషిపుత్రులుకూడా లేకపోలేదు. కేవలం మానవ నామాలలోనేకాక దేవతలలోనైతం వీరికి విభిన్నత్వం ఉన్నది. బృహస్పతి దేవగురువు. బ్రహ్మణస్పతి శ్రీమహావిష్ణువు. వేదర్షులలో తొలివాడైన అంగిరసుని పుత్రులలో ఉతథ్య ప్రభృతులకు సోదరుడైన బృహస్పతి దేవతల గురువైన బృహస్పతి ఒక్కరేనని కొందరు పేర్కొన్నారుగాని అది వాస్తవం కాదు. బ్రహ్మణస్పతి సోమేంద్రులతో కలిసిన సందర్భాలుండగా, బృహస్పతి సోమేంద్ర దక్షిణలతో కలిసిన సందర్భాలు ఉన్నాయి. అంగిరస పుత్రుడు బృహస్పతి మరొకడు కలడని కూడా ఒక అభిప్రాయం వుంది. అంగిరసుని పుత్రుడైన బృహస్పతి వేదర్షిగా ప్రసిద్ధుడై అతని పుత్ర పౌత్రులుకూడా వేదర్షులుగా వెలుగొందడం జరిగింది. అనేక ఋక్కులకు బృహస్పతి అధిదేవతగా పేర్కొనడం జరిగింది. వేదర్షియైన బృహస్పతి వేదదేవతలలో ఒకడని పేర్కొనడం వేదప్రామాణికతనే నిరాకరించడం కాగలదు. అందువల్ల అనేక ఋక్కులకధిదేవతయైన బృహస్పతి దేవగురువేకాని అంగిరసమహర్షి పుత్రుడు కాడు. బృహస్పతి బుద్ధికధిపతేకాని బ్రహ్మజ్ఞానానికి బ్రహ్మకూ అధిపతికాడు. బ్రహ్మణస్పతి అనదగిన బ్రహ్మాధిపతి ఆ బ్రహ్మలకు మూలభూతుడైన శ్రీమహావిష్ణువేకాని అన్యుడుకాడు. ఈ దృష్ట్యా బ్రహ్మణస్పతి-బృహస్పతులు విభిన్నులని భావించి మహావిష్ణువే బ్రహ్మణస్పతిగా ఆయా ఋక్కులకు తిరిగి విశేష భాష్యాలు వ్రాయవలసి వున్నది.

ఋషి పరంపరలో గురుశిష్య పరంపరలో అధ్యయన అధ్యాపనలలో వచ్చిన తేడాలవల్ల అసలు అర్షవిజ్ఞానమే క్రమంగా కనుమరుగవుతూ వచ్చింది. వివిధ సూక్తాలకు ఋక్కులకు ద్రష్టలైన ఋషుల విషయంలో అభిప్రాయ భేదాలు వచ్చినందువల్ల యిబ్బందియేమీ పెద్దగా వుండదు గాని ఋగధిదేవతల విషయమై ఋషి పరంపరలో అభిప్రాయభేదాలు రావడంవల్ల కేవలం ఋగర్థాల విషయంలోనే కాక, ఋఙ్మంత్ర లక్ష్యసిద్ధి ప్రయోగోపసంహార పరిజ్ఞాన విషయంలోనే కాక, ఆమంత్రప్రయోగ బలాబలాల విషయంలో కూడా ఆచరణలలో నిరూపించుకోలేని అభిప్రాయభేదాలు అనేకం తొంగిచూచాయి. కాగా వేదవిజ్ఞానం అర్షవిజ్ఞానం నామమాత్రావశిష్టమవుతూ వచ్చింది. ఈ పరిస్థితులలో వేదవిజ్ఞాన పరిశీలన కొరవడినందువల్ల ఆర్షవిజ్ఞాన ఆభాసపూర్వకంగా మొదట ఆర్యజాతిని తరువాత ద్రావిడజాతిని భ్రమప్రమాదాలకు లోనై పరికల్పనచేసి ఆయాజాతుల సంస్కృతీ సంప్రదాయాల పేరుతో కథలు, గాథలూ అనేకం ప్రచారం చేయడం జరిగింది.

## అపౌరుషేయత్వాన్ని అపహాస్యంపాలుచేసి ఏకైకమైన భారతజాతిని ఛిన్నాభిన్నం చేసిన ఆర్యజాతి పరికల్పన ! - అపభాష్యాల అవతరణ !

వాస్తవానికి వేదవాఙ్మయంలో ఆర్యజాతిగురించి యెక్కడా ప్రస్తావించబడలేదు. వేదాలలో మానవులలో ఆర్యులనే ప్రత్యేక తెగ ఉన్నట్లు యెక్కడా పేర్కొనడం జరుగలేదు వేదవాఙ్మయంలో ఆర్యశబ్దం యెక్కడ వాడబడినా భగవంతుడు-ఆదిత్యుడు-సూర్యుడు-వంటి అర్థాలలోనే ప్రయుక్తమైంది. మానవపరమైన ఆర్యజాతి ప్రసక్తి వేదంలో లేదన్న సంగతి గుర్తించని పండితులు కొన్ని అప్రామాణికాలైన గ్రంథవిషయాలు ఆధారంగా భ్రమప్రమాదాలకులోనై ఆర్యశబ్దానికి మానవులలో ఒక తెగవారనే అర్థంచెప్పడం జరిగింది. వాస్తవానికి వేదంలో ఆర్య-ద్రావిడాది జాతుల ప్రసక్తిలేకుండా భారత వర్షీయులైన భారతప్రజల ప్రశస్తి విస్పష్టంగా చేయబడింది. ఈ సందర్భంగా భరత-భారత-భారతీవంటి శబ్దాలు భరతి-భరతే వంటి రూపాలు అనేక సందర్భాలలో ప్రయుక్తమయ్యాయి. ఈ శబ్దాలన్నిందికీ పరస్పర సంబంధం వున్నదని ప్రాచీన ఆధునిక శబ్ద శాస్త్రవేత్తలనేకమంది భావించారు. మరుత్సు భారతీ (1 మం-142-9); భారతీళే సరస్వతి (188-8); హోత్రా భారతీ (2 మం-1-11); భారతీ విశ్వతూర్తిః (3-8); భారతాఽగ్నే (7-1-5); భరద్వాజ్రియ (14-1); ఏతం భరత (14-2); న్యా వృణగ్ భరతా (14-7); భరతశ్రుతయేన్ద్రాజ్రియ (14-8); భరతే ధనా (26-3); బర్హిష్మద్భరతస్య (36-2); ఏతం భరత (37-1); భారతీభారతీభిః (3-4-8); భారతా రేవదగ్నిం (23-23); త్వా భారతాః (33-11);

అతారిషుర్భరతా (33-12); భారతం జనమ్ (53-12); భరతస్య పుత్రా (53-24); భారతీ దక్షిణాభిః (62-3); అగ్నిర్భారతః (4 25-4); భరతేభ్యః (5-11-1); భరచ్చక్రమేతశః (31-11); భరతే అప్రతీతః (32-9); భరత చారుపక్రమ్ (43-?); భరతాయ వాజం (54-14); భరతో వాజిభిః (6-16-14); భరతో వృత్రహా (16-19); భరతా వసువిత్తమమ్ (16-41); భారతీ భారతీభిః (7-2-8); భరతా శృణోత (41-1); భరత వాజయన్త (8-100-3); భరతే శూరో (9-94-3); భరత సమప్సుజిత్ (106-3); భరత నిష్కృతమ్ (10-40-6); భరతే వేపో (46-8); భరత శ్లోకమద్రయః (76-4); భరత భాగమృత్వియం (100-2); భరతే ధనా (147-4); భరతా జాతవేదసమ్ (176-2); ఇత్యాది ప్రయోగాలలో భరత-భారతాది శబ్దాలు అనేక సందర్భాలలో ప్రయుక్తాలయ్యాయి. తృతీయమండలం 53వ సూక్తం 12వ ఋక్కులో 'భారతం జనమ్' అని భారతీయుల విషయం భారత ప్రజలుగా విస్పష్టంగా ప్రయుక్తమైనది.

మామూలుగా శకుంతలాదుష్యంతుల కుమారుడైన భరతునివల్ల భారతవర్షం - భారతదేశం అని పేర్లు వచ్చినట్లు విమర్శకులు భావిస్తూవుంటారు. ప్రాచీన భారతీయ సాహిత్యాన్ని పరిశీలిస్తే భరతశబ్దంచేత ప్రసిద్ధులైన వ్యక్తులు అనేకమంది వున్నారు. నాట్యశాస్త్ర కర్త భరతుడొకడు - దశరథునికి పుత్రుడై రామలక్ష్మణులకు సోదరుడైన భరతుడొకడు - సత్యాశంయువుల పుత్రుడైన భరతుడొకడు - శకుంతలా దుష్యంతుల పుత్రుడైన భరతుడొకడు-జయంతి ఋషభనాధుల పుత్రుడైన భరతుడొకడు-భరద్వాజుని సోదరుడైన భరతుడొకడు - భరద్వాజుణ్ని పెంచి పెద్దచేసిన భరతుడొకడు - వేరొక భరద్వాజునితో యజ్ఞంచేయించిన భరతుడొకడు - అంగిరసమహర్షి పుత్రుడైన భరతుడొకడు-యింకా సత్యాశంయువుల కొడుకైన భరతుని కుమారుడైన భారతుడు మరొకడు - సూర్యవంశపురాజైన యుగసంధికి పుత్రుడైన భరతుడు వేరొకడు ఈ విధంగా భరత నామకులనేకమంది వున్నారు. తొలుత మన మహర్షులు కేవల ఖగోళపరిశోధనలలోనే ఆసక్తిని చూపిస్తూ జీవితం గడుపుతున్నవారికి భరతనామం పెట్టినట్లు కనిపిస్తున్నది. భరత వర్షానికి ఆపేరు ఎప్పుడువచ్చిందోచెప్పలేము కాని హిందూపురాణాల ప్రకారంగాని జైనపురాణాల ప్రకారంగాని పరిశీలిస్తే ఋషభనాధుని కుమారుడైన భరతునిపేరుమీద భరతవర్షం అనేపేరు వచ్చినట్లు స్పష్టపడుతున్నది. క్రమంగా భరతవర్షమే భారత వర్షంగాను కొంత దేశపరిమితితో భరతదేశంగాను భారతదేశంగాను వ్యవహృతమైనట్లు స్పష్టపడుతున్నది. భరతుని తండ్రియైన ఋషభనాధుని కాలంలోనూ అంతకు పూర్వమూ భరతవర్షం "అజనాభం" అనే పేరుతో వ్యవహృతమైనట్లు ద్యోతకమవుతున్నది. ప్రాచీన కాలంలో ఆర్యావర్త శబ్దానికి "భగవంతునిచేత ఆవృతమైనది"-అని అర్థం చెప్పబడి విశ్వనిర్దేశకంగా సృష్టినిర్దేశకంగా ఆర్యావర్త శబ్దం ప్రయోగింపబడుతూ వచ్చింది. కాని ఋషభనాధుని తరువాత అతని జ్యేష్ఠకుమారుడైన భరతుడు మొత్తం "అజనాభ" దేశాన్ని అంటే భరతవర్షాన్ని పరిపాలించగా భరతుని సోదరులైన కుశావర్తుడు-ఇలావర్తుడు-ఆర్యావర్తుడు మొదలైనవారు భరతవర్షంలోని వివిధ రాష్ట్రాలను పరిపాలించగా వారివారి పేర్లమీద కుశావర్తం-ఆర్యావర్తం-ఇలావర్తంవంటి రాష్ట్ర నామాలు యేర్పడడం జరిగింది. ఋషభనాధుని కుమారుడైన ఆర్యావర్తుని తరువాతే భగవద్వాచకమైన 'ఆర్య' శబ్దమూ, విశ్వసృష్టివాచకమైన 'ఆర్యావర్త'పదమూ మానవపరంగాను భరతవర్షాంతర్గతమైన రాష్ట్రపరంగాను వ్యవహృతమైనట్లు స్పష్టపడుతున్నది. ఈ ఋషభనాధుని కుమారుడైన ఆర్యావర్తుని పేరుమీదనే అనంతర కాలంలో భ్రమప్రమాదాలకులోనై ఆర్యజాతి పరికల్పింపబడినట్లు ఆ ఆర్యావర్తుడు పరిపాలించిన రాష్ట్రమే ఆర్యావర్తమైన ప్రత్యేకదేశంగా అనేక విధాలైన ఊహలతో పేర్కొనబడినట్లు కనిపిస్తున్నది. మొట్టమొదట ఆర్యశబ్దానికి యాస్కుడు "ఈశ్వరుని పుత్రు"డని మాత్రమే అర్థంచెప్పాడు. ఈ అర్థం కూడా ఋషభనాధుణ్ణి దృష్టిలో పెట్టుకుని మొదట రూఢమైనట్లు కనిపిస్తున్నది. ఋషభనాధుడు హరిహరనాధులకు చిహ్నం. అజనాభాన్ని పరిపాలిస్తున "నాభి" పుత్రసంతతి కోరి తపస్సు చేయగా మహావిష్ణువే నాభికి పుత్రుడై పుడతాడు. అతడికి ఋషభనాధుడనే పేరు పెట్టడం జరిగింది. ఋషభనాధుడనే పేరు మహేశ్వరునికి చిహ్నం. మహావిష్ణువు రూపాంతర జన్మ ఋషభనాధుడు. అందువల్ల ఋషభనాధుడు జన్మనుబట్టి నామాన్నిబట్టి విష్ణు మహేశ్వరులకు చిహ్నంగా భగవంతుడుగా భావింపబడ్డాడు. అటు విష్ణువుగాను ఇటు ఈశ్వరుడుగాను యెన్నబడ్డాడు. ఋషభనాధుని కుమారుడు ఆర్యుడుకాబట్టి ఋషభనాధుడు ఈశ్వరుడుకాబట్టి ఆర్యుడంటే ఈశ్వరుని పుత్రుడని యాస్క ప్రభృతులు అర్థం వ్రాశారు. ఈశ్వరుడూ ఈశ్వరుని పుత్రుడూ పవిత్రులూ-పూజనీయులూ-గౌరవనీయులూకాబట్టి ఆర్యశబ్దానికి క్రమంగా పవిత్రుడు-పూజనీయుడు-గౌరవనీయుడు మొదలుగాగల అర్థాంతరాలేర్పడ్డాయి. అలౌకిక సంస్కృతానికి భిన్నంగా అవతరించిన బ్రాహ్మణారణ్యకాల కాలానికే ఆర్యజాతి సంస్కృతుల భ్రమ ప్రబలి ప్రాచుర్యం పొందినందువల్ల బ్రాహ్మణారణ్యకాలాలలోనే ఆర్య శబ్దానికి మానవ వాచకార్థాలు

యేర్పడినందువల్ల స్మృతులు మొదలైన అనంతర లౌకిక వాఙ్మయంలో ఆ మానవార్థాలు రూఢమై జాతివాచకాలుగా తిష్ఠవేసుకున్నాయి. తత్ఫలితంగా వేద వాఙ్మయంలో యెక్కడాలేని, మానవులలో వాస్తవానికి యెక్కడా లేనటువంటి ఆర్యజాతి ఒకటున్నట్లు భ్రమప్రమాదాలతో పరికల్పించడం జరిగింది. ఈ దృష్ట్యా ఋషభనాథుని కుమారుడైన ఆర్యుడు పరిపాలించిన నాటి భరతవర్షంలో అంతర్భాగమై ఒక రాష్ట్రమైన ఆర్యావర్తంలోని ప్రజలు ఆర్యులుగాను వారున్నరాష్ట్రం ఆర్యావర్తంగాను భావించడం జరిగింది. ఈ ఆర్యజాతి పరికల్పనా ప్రభావంతో వేదర్షులు ఆర్యులనీ వేదాధ్యయన పరులు ఆర్యులనీ కేవలం ఆపోహతోకూడిన అభిప్రాయాన్ని బహుముఖాలుగా కల్పించడం జరిగింది. ఈ రూపంగా చివరికి వేదా లపౌరుషేయాలని విశ్వసించి ఆరాధించేవారుకూడా ఆర్యాభిమానంతో వేదాలలో ఆర్యుల వర్ణన వున్నదని ఆర్యవిద్యా విజ్ఞాన సంస్కృతీ సంపదల అభివర్ణన బహుముఖంగా వున్నదని భావించి తదనుగుణమైన వేదార్థాలను ప్రవచించి ప్రచారంచేసి వివిధ భాష్యాల అవతరణకు కారకులై చివరికి వేదాలు మానవ విరచితాలనే అభిప్రాయాన్ని పాదు కొల్పేట్లు చేయడం జరిగింది. ఈ ఆర్యాభిమానులైన వీరందరికీ కేవలం ఆర్యులను పూజిస్తున్నాం - గౌరవిస్తున్నాం - ఆర్య సంస్కృతీ వైభవాన్ని ప్రశంసిస్తున్నాం - ఆరాధిస్తున్నాం - ప్రచారం చేస్తున్నామనే అభిప్రాయమే తప్ప ఈ రూపంగా అలౌకికమై అఖండ విజ్ఞాన ఖనియైన వేదవాఙ్మయాన్ని కేవల లౌకిక వాఙ్మయస్థాయికి దిగజార్చుతున్నామనే అభిప్రాయమే కలగలేదు. అందువల్ల వేదా లపౌరుషేయాలని భగవద్దత్తాలని వేదర్షులు వేదద్రష్టలేకాని వేదస్రష్టలూ రచయితలూ కారని ఒకవంక ఉద్ఘోషిస్తూనే మరొకవంక ఆర్య జాతికీ ఆర్య సంస్కృతులకూ వేదాలు ప్రతిబింబకాలని వాటిని సర్వవిధాలా మానవార్యులపరంచేసి ఆ వేదాలనే అప్రామాణికాలుగా మానవ విరచితాలుగా తాము అనుకోకుండానే అప్రయత్నంగానే ధ్రువపరచడం జరిగింది.

వేదవాఙ్మయంలో ఆర్యుల పాలనగురించి సామ్రాజ్యవైభవంగురించి ధ్రువఖండ యాత్ర - విదేశ ప్రయాణాదులగురించి వర్ణితమైనట్లు పేర్కొనడం జరిగింది. అంతేకాదు. ఆర్యుల కాలంలోనే ప్రజాస్వామ్యం కూడా వున్నదని అవివాహిత కన్యలు తండ్రి యింట్లోనే ఉండి ఆస్తిహక్కు ననుభవించేవారని విధవలు రాజసభకు వెళ్ళి ఆస్తిహక్కు సంపాదించేవారని పుత్రులతోపాటు దత్తపుత్రులు కూడా వుండేవారని వేదంలో అభివర్ణించబడినట్లు ఈ ఆర్యాభిమానులు భావించడం జరిగింది. ఆర్యసంబంధంగా వంధిమాగధులు-కంసాలివారు - మంగలివారు - తలపాగాలు - వింజామరాలు - ధనస్సులు - బాణాలు - కవచాలు - యుద్ధాలు - యుద్ధ గుఱ్ఱాలుమాత్రమే కాక ఆర్యుల వివిధ పురాలు - పట్టణాలు - మేడలు - స్వర్ణమయపురాలు - ఇనుపఇళ్ళు - మట్టియిళ్ళు - బహుద్వార గృహాలు-బంగారు నాణాలు - వివిధ లోహాలు - రోళ్లు - రోకళ్లు - బట్టలనేత-పడుగు - కండె మొదలైనవి దొంగతనం - వ్యభిచారం వంటి విషయాలు అంటు రోగాలు - కుష్ఠురోగం వంటివి వివిధ ఔషధాలతోపాటు ఉదకరూపౌషధాలు - శవాలను దహనం చేయడం - పాతిపెట్టడం - ప్రేత శరీరాలు-శ్మశానం-మొదలైనవాటి వర్ణనలు వేదవాఙ్మయంలో ప్రతిబింబించి వున్నాయని ఈ వేదాభిమానుల మనుకునే ఆర్యాభి మానులు భావించారు. ఆర్యుల వివిధ వ్యవసాయ వర్ణనలతోపాటు విత్తనాలు చల్లడం - భూమి కొలకర్రల విషయం - గోసంపదల వర్ణన - పశుపోషణ విషయం - గోవులకాపరి వర్ణనలుకూడా వేదంలో వున్నట్లు భావించడం జరిగింది. వివిధయజ్ఞాలు వైదికధర్మ పరాలని భావించినా ప్రాణి హింసామయంగా యజ్ఞాలు చేయడంకూడా వేదప్రోక్తమైన ధర్మంగా పేర్కొనడం జరిగింది. ఈ రూపంగా ఆర్యజాతి అభివర్ణన సంస్కృతీవైభవ సంకీర్తనం వేదవాఙ్మయంలో అనేక సందర్భాలలో వివిధ ఋక్కులలో ప్రతిబింబిత మైనదని పేర్కొంటూ చివరికి వేదాల అపౌరుషేయత్వాన్ని ఔన్నత్యాన్ని తమకు తెలియకుండానే ఆత్మహత్యా సదృశంగా దెబ్బతీయడం జరిగింది. వాస్తవానికి మనమహర్షుల విజ్ఞానందృష్ట్యా వేదవాఙ్మయంలో హింసాపూరితాలైన యజ్ఞాలకు అసలు స్థానమే లేదు. బ్రాహ్మణ గ్రంథాలలో ప్రాణిహింసతో కూడిన వివిధ యజ్ఞాల విశేషాల ప్రసక్తి వున్నదంటే వేదవిజ్ఞానమనబడే ఆర్షవిజ్ఞానం కనుమరుగైపోయిన తరువాత - అపార్థాలకులోనై ఆర్షవిజ్ఞానస్థానాన్ని ఆక్రమించిన ఆర్యవిజ్ఞానం పరివ్యాప్తి చెందిన తరువాతనే అవి అవతరించాయని చెప్పక తప్పదు. బ్రాహ్మణ గ్రంథాలలో ఆర్యజాతి ప్రసక్తి ఉన్నదంటే ప్రస్తుతం 'కనోజు' దేశమని పిలవబడే 'పాంచాల' దేశం, 'విదేహ' దేశాలు (బీహారు) కాశీదేశం (బెనారస్ చుట్టు ప్రదేశాలు) వంటివి ఆర్యుల పరిపాలనలో వున్నట్లు బ్రాహ్మ ణాలలో అభివర్ణితమై వున్నదంటే ఇవి బ్రాహ్మణాల అర్వాచీనతకు అప్రామాణికతకూ ప్రబల సాక్ష్యాలుగా నిలుస్తాయేగాని ఆర్యజాతి ఉనికిని ఏ పరిస్థితులలోనూ ప్రస్థాపించలేవు. వాస్తవానికి వేదకాలంలో ఏకైక భారతజాతి మాత్రమే వున్నది కాని మానవులలో ఆర్యజాతి అని ప్రత్యేకంగా ఒకజాతి లేనేలేదు. ఇదేవిధంగా ద్రావిడజాతి అనేదికూడా ప్రాచీనకాలంలో ఉన్నట్లు కనపడదు. ద్రావిడ భాషకు తొట్టతొలి వ్యాకరణకర్త అగస్త్యమహర్షి అని అంటారు. అగస్త్యమహర్షి ఆర్యుడూకాడు అనార్యుడూకాడు ద్రావిడుడూకాడు.

నూటికి నూరుపాళ్ళూ భారతీయుడైన మహర్షి. ఉత్తర భారతంనుంచి వింధ్యను దాటి దక్షిణభారతావనికి అగస్త్యుడువచ్చి స్థిరపడ్డాడన్న విషయాన్ని దృష్టిలో పెట్టుకుంటే ప్రాచీనకాలంలో ఆర్య ద్రావిడ జాతిభేదాలు కాని దేశభేదాలు కాని లేవని ధ్రువపడుతుంది. ఋషభనాథుని కుమారుడైన ఆర్యరాజు పేరుమీద ఆర్యజాతి పరికల్పితమైనట్లే ప్రాచీనకాలంలో ద్రవిడుడనేరాజు కారణంగా అతని పేరుమీద ద్రావిడజాతి పరికల్పితమైనట్లు కనిపిస్తున్నది. కేవల భ్రమప్రమాదాలకులోనై పరికల్పితాలైన ఆర్య ద్రావిడ జాతులు కారణంగా ఏకైకమైన భరతఖండం ఉత్తరదక్షిణాపథాల పేరుతో ఆర్య ద్రావిడ దేశాల పేరుతో పరస్పర విరుద్ధజాతులుగా రెండుగా విడిపోయింది. ఆర్షవిజ్ఞానందృష్ట్యా వేదఖగోళ విజ్ఞానం దృష్ట్యా సృష్టి ప్రతిబింబకమై సార్థకమైన విశేషార్థంతో ఋగ్వేదంలోని పురుష సూక్తం అవతరించింది. ఈ వాస్తవిక విజ్ఞానాత్మకమైన విశేషార్థాన్ని విడిచిపెట్టి కేవలం తర్కానికిసైతం నిలువలేని విపరీతార్థాలనుచెప్పి అతి ప్రాచీనకాలంలోనే వివిధాలైన విభిన్నవర్ణాలను కల్పించడంద్వారా ఏకైకమైన భారతజాతిని భిన్నాభిన్నం చేయడం జరిగింది. పురుషసూక్తమంత్రాలకు చెప్పిన విపరీతార్థాలవల్ల వాటిని అనుసరించడంవల్ల భారతజాతి యెంతగా భిన్నాభిన్నమైందో చెప్పాలంటే చిరకాలంగా నిలిచివున్న ఆర్షవిజ్ఞాన విరుద్ధమై వేదఖగోళ విజ్ఞానవిరుద్ధమైన నేటి వర్ణవ్యవస్థలే తార్కాణం. వేదవిజ్ఞాన విరుద్ధమైన యీ పరికల్పిత వర్ణవ్యవస్థలను చూచే విశిష్టాద్వైత మతప్రవక్తయైన శ్రీరామానుజాచార్యులవారు ప్రస్తుతం దేశంలోవున్న వర్ణవ్యవస్థలన్నీ అశాస్త్రీయాలనీ ఆర్షేయాలుకావనీ మానవజాతిలో నీచోచ్చకులాది భేదాలేవీ లేవనీ యెలుగెత్తి చాటారు. నిజానికి పురుషసూక్త వర్ణితుడైన పురుషుడు సహస్రశిరస్సులు సహస్రనేత్రాలు సహస్రపాదాలు కలవాడుకాదు. ఇక్కడ సహస్రశబ్దంచేత అనేక సంఖ్యను పరిగ్రహించాలే తప్ప దీనికి వెయ్యి అనే అర్థం చెప్పుకోకూడదు. సూర్యుణ్ణి సహస్రకిరణుడంటాము. సహస్రకిరణుడంటే వెయ్యికిరణాలుకలవాడు అని అర్థంకాదు. ఇక్కడ సహస్రశబ్దంచేత 'అసంఖ్యాకమైన' అనేఅర్థం పరిగృహీతమవుతుందేగాని వెయ్యిసంఖ్యకు పరిమితమనికాదు. అదేవిధంగా సహస్ర శీర్షలోని సహస్రశబ్దం కేవలం సహస్రసంఖ్యకే పరిమితమైనది కానేరదు. ఇక్కడ సహస్రశబ్దం కేవలం సహస్రసంఖ్యకే పరిమితమైనదైతే ద్విసహస్రనేత్రాలు ద్విసహస్రపాదాలూ ఆ దేవపురుషునకున్నాయని పేర్కొనబడి వుండేది. వాస్తవానికి ఈ సహస్రశిరనేత్ర పాదాలకు ఒక క్రమమనేదిలేదు. ఇక్కడే ఆర్షఖగోళ విజ్ఞానరహస్యం యిమిడివున్నది. రావణాసురునికి దశశిరస్సులు ఇరవైబాహువులు ఉన్నట్లుగా ఈ దేవపురుషునికి శిరస్సులు బాహువులు వరుసనేవుండవు. అనంత విశ్వరూపంగా ఈ శిరస్సులు నేత్రాలు పాదాలూ అన్ని దిక్కులలోను పరివ్యాప్తిచెందివుంటాయి. ఆర్షఖగోళ విజ్ఞానదృష్టితో "బ్రాహ్మణోఽస్య ముఖమాసీత్" ఇత్యాది మంత్రానికి సరైన అర్థం చెప్పాలంటే ఈ విధంగా చెప్పవలసివుంటుంది. "బ్రహ్మజ్ఞానియైనవాడే బ్రాహ్మణుడు. ఈ బ్రహ్మజ్ఞానియైన బ్రాహ్మణుడు విశ్వరూప పురుషుని ముఖమనదగిన నక్షత్రాల ప్రభావంతో సంజనితుడవుతాడు. బ్రహ్మజ్ఞానియైన ఆ బ్రాహ్మణుడే ఆ విశ్వరూప ప్రజాపతికి ముఖం వంటివాడు అవుతాడు. ఇక క్షత్రియుల విషయం. వాస్తవానికి సరియైన పరిపాలకుడెవడైనా "నావిష్ణుః పృథివీపతిః"గా వర్ణింపదగినవాడే. లోకకంటకులైన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు రావణాసురుడు కంసుడు మొదలైనవారంతా ప్రజాపరిపాలకులే. కాని ఈ దుష్టపరిపాలకులందరూ విష్ణ్వంశాసంభూతులు మాత్రంకారు. ఎవరి రాజ్యంలో దుష్టశిక్షణ శిష్టరక్షణ జరుగుతూ ప్రజలందరూ యేవిధమైన కష్టనష్టాలు లేకుండా సుఖసంతోషాలతో ఓలలాడుతూ వుంటారో యే రాజ్యంలో ధర్మం నాలుగుపాదాలా నడుస్తూ వుంటుందో ఆ ప్రజాపరిపాలకుడే నిజమైన క్షత్రియుడు-అటువంటి విష్ణ్వంశగల క్షత్రియుడు-రాజు-పరిపాలకుడు విశ్వరూప ప్రజాపతియొక్క బాహువులనదగిన నక్షత్రప్రభావంతో సంజనితుడవుతాడు. దుష్టశిక్షణ శిష్టరక్షణలతో న్యాయధర్మబద్ధమైన పరిపాలనచేస్తూ విష్ణ్వంశగల ఆ ప్రజాపరిపాలకుడే విశ్వరూపప్రజాపతికి బాహువులవంటివాడవుతాడు. న్యాయధర్మబద్ధమైన పదార్థవాణిజ్యాది వ్యవహారాలతో ప్రజలందరికీ ఉపయోగకరమై క్షేమంకరమైన వస్త్వాదులను సమకూర్చే వైశ్యుడు విశ్వరూపప్రజాపతికి ఊరువులనదగిన నక్షత్రప్రభావంతో సంజనితుడవుతాడు. అటువంటి సద్ధర్మవ్యాపారం సాగించి లోకక్షేమంకరుడై అలరారే వైశ్యుడు విశ్వరూపప్రజాపతికి తొడలవంటివాడే అవుతాడు. పరిశుద్ధమైన ప్రక్రియలతో పరిశ్రమతో మొత్తం ప్రజాజీవన వ్యవస్థకు కృషికి స్థానంగా మానవాభ్యుదయ పురోగమనాలకు మూలభూతుడైన శూద్రుడు విశ్వరూప ప్రజాపతికి పాదాలనదగిన నక్షత్రప్రభావంతో సంజనితుడవుతాడు. ప్రజాక్షేమంకరమైన బహుముఖకృషికారకుడుగా సంజనితుడైన శూద్రుడు ఆ విశ్వరూపప్రజాపతికి పాదములవంటివాడవుతాడు. ఇందుకు భిన్నమైన విపరీతార్థాన్ని చెప్పడంవల్ల భారతజాతి పతనానికీ భిన్నాభిన్నత్వానికీ దారితీసిన ప్రస్తుతవర్ణవ్యవస్థను ఖండించి శ్రీరామానుజాచార్యులవారు ఆర్షేయమైన వేదవిజ్ఞానాన్ని ప్రతిబింబించారు.

# వేదాలలో అష్టవికృతుల వైశిష్ట్యం

పదక్రమవిశేషజ్ఞో వర్ణక్రమవిచక్షణః। స్వరమాత్రావిశేషజ్ఞో గచ్ఛేదాచార్యసంపదమ్॥
సంహితాపాఠతః పుణ్యం ద్విగుణం పదపాఠతః। త్రిగుణం క్రమపాఠేన జటాపాఠేన షడ్గుణమ్॥

అని వరాహ పురాణం అష్టవికృతులగురించి పేర్కొంటున్నది దేవస్వరూపమైన వేదం మొట్టమొదట ఏకైకమేననడం నిర్వివాదాంశమైన విషయం. వేద సర్వస్వ పతనం దానిని చతుర్వేదాలుగా విభజించడం రూపంగానే కాక అతి ప్రాచీనకాలంలోనే విభిన్న శాఖలుగా సైతం విడదీసి విభిన్నకుటుంబాల వారికి వాటిని నేర్పడం ద్వారాకూడా అనేక వంశాలవారు ఆయా వంశానుక్రమంగా వేదవాఙ్మయాన్ని కొంతవరకు రక్షించడం జరిగింది. అనంతమైన వేదవాఙ్మయంలో ఏ న కుపలభ్యమానాలైన వేదభాగాలు అత్యల్పాలనే చెప్పవచ్చును.

అసలు వేదమంతా మొట్టమొదట ఏకైకమై ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వవేదాల పేరుతో దానిని విభజించడం జరిగినా ఈ నాలుగు వేదాలలోనూ వున్న మంత్రాలన్నీ విఛందాలైనా సఛందాలైనా అన్నీ మంత్రా లనేకాక ఋక్కుల పేరుతోనూ పిలవదగినవే. శుక్ల, కృష్ణ యజుర్వేదాలలోని వాటిని మంత్రాలని మాత్రమే ప్రత్యేకించి కొందరంటారుగాని అవికూడా ఋక్శబ్దనామకాలే. ఋగ్వేదంలోని మంత్రాలన్నీ ఋక్కులేనన్న సంగతి విస్పష్టం. వివిధ సామవేద శాఖలలోవున్న మంత్రాలు కూడా ఋక్కులుగానే వ్యవహరించబడతాయని సామవేదజ్ఞులందరికీ విస్పష్టంగా తెలిసిన విషయమే. అదే విధంగా అథర్వవేదంలోని మంత్రాలను సహితం ఋక్కులుగానే పేర్కొనడం జరుగుతుంది. కాని కొందరు తెలియని పరిశోధకులు పేర్కొన్నట్లు ఋగ్వేదంలోని మంత్రాలను 'ఋక్కు' లనీ, యజుర్వేదంలోని, మంత్రాలను 'యజుస్సు'లనీ, సామవేదంలోని మంత్రాలను 'సామా'లని మాత్రమే పేర్కొన్నట్లు చెప్పడం వాస్తవంకాదు. అష్టవికృతులగురించి వాటిలోవున్న ఉపభేదాల గురించి సోదాహరణంగా ఈ క్రింద ఉటంకిస్తున్నాను.

సంహితాలక్షణమ్ — పరః సన్నికర్షః సంహితా। (అష్టాధ్యాయ్యాం 1/4/109 పాణినిః)

(వర్ణానామతిశయితః సంనిధః సంహితా సంజ్ఞః స్యాత్)

### 1. సంహితామన్త్రః

ఓషధయఃసంవదన్తేసోమేనసహరాజ్ఞా। యస్మై కృణోతి బ్రాహ్మణస్తం రాజన్పారయామసి॥
(ఋ-10మం-97సూ-22 ఋ)

పదచ్ఛేదపూర్వకో మంత్రపాఠః.

ఓషధయః సం వదన్తే సోమేన సహ రాజ్ఞా। యస్మై కృణోతి బ్రాహ్మణస్ తం రాజన్ పారయామసి॥

పదసంహితాలక్షణమ్

పదవిచ్ఛేదోఽసంహితః॥ (ప్రాతిశాఖ్యసూత్రే కాత్యాయనః)

### 2. పదపాఠః

ఓషధయః। సం। వదన్తే। సోమేన। సహ। రాజ్ఞా। యస్మై। కృణోతి। బ్రాహ్మణః। తం। రాజన్। పారయామసి॥

క్రమలక్షణమ్।

క్రమేణ పదద్వయస్య పాఠః। క్రమపాఠో 'యోగరూఢాసంహితా' ఇత్యుచ్యతే। 'క్రమఃస్మృతిప్రయోజనః'
(ప్రా-సూ-4/18 కాత్యాయనః)

### 3. క్రమపాఠః

ఓషధయః సం। సం వదంతే। వదంతే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా॥
యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి॥

### 4. పఞ్చసన్ధిః — పఞ్చసంధి-లక్షణమ్

అనుక్రమశ్చోత్క్రమశ్చ వ్యుత్క్రమోఽభిక్రమస్తథా। సంక్రమశ్చేతి పఞ్చైతే జటాయాం కథితాః క్రమాః॥

క్రమః = 1 + 2, 2 + 3. ఉత్క్రమః = 2 + 2, 3 + 3. వ్యుత్క్రమః = 2 + 1; 3 + 2.

అభిక్రమః = 1 + 1; 2 + 2. సంక్రమః = 1 + 2; 2 + 3.

| క్రమః | ఉత్క్రమః | వ్యుత్క్రమః | అభిక్రమః | సంక్రమః |
|---|---|---|---|---|
| 1-2 | 2-2 | 2-1 | 1-1 | 1-2 |
| ఓషధయః సం। | సం సం। | సమోషధయః। | ఓషధయ ఓషధయః। | ఓషధయః సం। |
| సం వదన్తే। | వదన్తే వదన్తే। | వదన్తే సం। | సం సం। | సం వదన్తే। |
| వదన్తే సోమేన। | సోమేన సోమేన। | సోమేన వదన్తే। | వదన్తే వదన్తే। | వదన్తే సోమేన। |
| సోమేన సహ। | సహ సహ। | సహ సోమేన। | సోమేన సోమేన। | సోమేన సహ। |
| సహ రాజ్ఞా। | రాజ్ఞా రాజ్ఞా। | రాజ్ఞా సహ। | సహ సహ। | సహ రాజ్ఞా। |

రాజ్ఞేతి రాజ్ఞా।

'తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి'। (ఋ- మ- 3/62/10) ఇత్యస్య పఞ్చసన్ధిః।

తత్సవితుః। సవితుస్సవితుః। సవితుస్తత్। తత్తత్। తత్సవితుః।

సవితుర్వరేణ్యం। వరేణ్యం వరేణ్యం। వరేణ్యం సవితుః। సవితుస్సవితుః। సవితుర్వరేణ్యం।

వరేణ్యం భర్గః। భర్గోభర్గః। భర్గో వరేణ్యం। వరేణ్యం వరేణ్యం। వరేణ్యం భర్గః।

భర్గో దేవస్య। దేవస్య దేవస్య। దేవస్య భర్గః। భర్గో భర్గః। భర్గో దేవస్య।

దేవస్య ధీమహి। ధీమహి ధీమహి। ధీమహి దేవస్య। దేవస్య దేవస్య। దేవస్య ధీమహి। ధీమహీతి ధీమహి। (ఏవమగ్రేఽపి)

### వికృతి—లక్షణాని

శైశిరీయే సమామ్నాయే వ్యాడినైవ మహర్షిణా। జటాద్యా వికృతీరష్టౌ లక్ష్యన్తే నాతివిస్తరమ్॥

జటా మాలా శిఖా రేఖా ధ్వజో దండో రథో ఘనః । అష్టౌ వికృతయః ప్రోక్తాః క్రమపూర్వా మహర్షిభిః ॥

అష్టౌ వికృతయః క్రమపూర్వా భవన్తి । తాసు జటా-దండ-సంజ్ఞకే ద్వే వికృతీ ముఖ్యే । యత ఏతాభ్యామేవాన్యా వికృతయః సంభవన్తి ।

తత్ర జటాం శిఖాఽనుసరతి । తథా చ దండం మాలా-రేఖా-ధ్వజ-రథా-అనుసరన్తి । ఘనస్తు జటాదండావనుసరతి ।

### 1. జటా — ప్రథమం జటా-లక్షణమ్

అనులోమవిలోమాభ్యాం త్రివారం హి పఠేత్ క్రమమ్ । విలోమే పదవత్సంధిః అనులోమే యథాక్రమమ్ ॥

### ద్వితీయం జటా-లక్షణమ్

క్రమే యథోక్తే పదజాతమేవ ద్విరభ్యసేదుత్తరమేవ పూర్వమ్ । అభ్యస్య పూర్వం చ తథోత్తరే పదే ఽవసానమేవం హి జటాభిధీయతే ॥

జటా = అనులోమః 1—2 + విలోమః 2 — 1 + అనులోమః
1—2 ॥ (క్రమః 1—2 + వ్యుత్క్రమః 2—1 + సంక్రమః 1—2)

### జటాపాఠః

ఓషధయస్ సం, సమోషధయ, ఓషధయస్ సమ్ ॥ సం వదన్తే, వదన్తే సం, సం వదన్తే ॥

వదన్తే సోమేన, సోమేన వదన్తే, వదన్తే సోమేన ॥ సోమేన సహ, సహ సోమేన, సోమేన సహ ॥

సహ రాజ్ఞా, రాజ్ఞా సహ, సహ రాజ్ఞా ॥ రాజ్ఞేతి రాజ్ఞా ॥

యస్మై కృణోతి, కృణోతి యస్మై, యస్మై కృణోతి ॥ కృణోతి బ్రాహ్మణో, బ్రాహ్మణః కృణోతి, కృణోతి బ్రాహ్మణః॥
బ్రాహ్మణస్తం, తం బ్రాహ్మణో, బ్రాహ్మణస్తం ॥ తం రాజన్, రాజంస్తం, తం రాజన్ ॥
రాజన్పారయామసి, పారయామసి రాజన్, రాజన్పారయామసి ॥ పారయామసీతి, పారయామసి ॥

## 2. మాలా

మాలాయా ద్వౌ భేదౌ పుష్పమాలా-క్రమమాలా చేతి ।

### క్రమ-మాలా-లక్షణమ్

బ్రూయాత్క్రమవిపర్యాసావర్ధర్చస్యాదితోఽన్తతః । అన్తం చాదిం నయే దేవం క్రమమాలేతి గీయతే ॥

### 1. క్రమ-మాలా

ఓషధయః సం । రాజ్ఞేతి రాజ్ఞా ॥ సం వదన్తే । రాజ్ఞా సహ ॥ వదన్తే సోమేన । సహ సోమేన ॥
సోమేన సహ । సోమేన వదన్తే ॥ సహ రాజ్ఞా । వదన్తే సం ॥ రాజ్ఞేతి రాజ్ఞా । సమోషధయః ॥

యస్మై కృణోతి। పారయామసీతి పారయామసి ॥ కృణోతి బ్రాహ్మణః। పారయామసి రాజన్ ॥
బ్రాహ్మణస్తం। రాజంస్తం॥ తం రాజన్। తం బ్రాహ్మణః ॥ రాజన్పారయామసి। బ్రాహ్మణః కృణోతి ॥
పారయామసీతి పారయామసి॥ కృణోతి యస్మై ॥

### క్రమ-మాలా

| | | | |
|---|---|---|---|
| ఓషధయః సం। | 1 | 2 | రాజ్ఞేతి రాజ్ఞా। |
| సం వదన్తే। | 3 | 4 | రాజ్ఞా సహ। |
| వదన్తే సోమేన। | 5 | 6 | సహ సోమేన। |
| సోమేన సహ। | 7 | 8 | సోమేన వదన్తే। |
| సహ రాజ్ఞా। | 9 | 10 | వదన్తే సం। |
| రాజ్ఞేతి రాజ్ఞా। | 11 | 12 | సమోషధయః। |
| యస్మై కృణోతి। | 13 | 14 | పారయామసీతి పారయామసి। |
| కృణోతి బ్రాహ్మణః। | 15 | 16 | పారయామసి రాజన్। |
| బ్రాహ్మణస్తం। | 17 | 18 | రాజంస్తం। |
| తం రాజన్। | 19 | 20 | తం బ్రాహ్మణః। |
| రాజన్ పారయామసి। | 21 | 22 | బ్రాహ్మణః కృణోతి। |
| పారయామసీతి పారయామసి। | 23 | 24 | కృణోతి యస్మై। |

### క్రమ-మాలా

| | ఆదితోఽన్తతః | (అన్తం చాదిం నయేత్) | | | (ఆదితోఽన్తతః) | (అన్తం చాదిం నయేత్) | |
|---|---|---|---|---|---|---|---|
| 1. | 1 ఓషధయః సం | రాజ్ఞేతి రాజ్ఞా | 6 | 2. | 7 యస్మై కృణోతి | పారయామసీతి పారయామసి | 12 |
| | 2 సం వదన్తే | రాజ్ఞా సహ | 5 | | 8 కృణోతి బ్రాహ్మణః | పారయామసి రాజన్ | 11 |
| | 3 వదన్తే సోమేన | సహ సోమేన | 4 | | 9 బ్రాహ్మణస్ తం | రాజస్తం | 10 |
| | 4 సోమేన సహ | సోమేన వదన్తే | 3 | | 10 తం రాజన్ | తం బ్రాహ్మణః | 9 |
| | 5 సహ రాజ్ఞా | వదన్తే సం | 2 | | 11 రాజన్ పారయామసి | బ్రాహ్మణః కృణోతి | 8 |
| | 6 రాజ్ఞేతి రాజ్ఞా | సమోషధయః | 1 | | 12 పారయామసీతి పారయామసి | కృణోతి యస్మై | 7 |

## 2. పుష్పమాలా——పుష్పమాలా-లక్షణమ్

మాలా మాలేవ పుష్పాణం పదానాం గ్రన్థిసీ హి సా। ఆవర్తన్తే త్రయస్తస్యాం క్రమవ్యుత్క్రమసంక్రమాః॥
జటావదేవ పుష్పమాలా భవతి। తత్ర ప్రతిపాదం విరామ ఇతికారశ్చేతి విశేషః। కేచిచ్చ పుష్పమాలాయామితికారం పదసన్ధి స్థానేఽపి వదన్తి। యథా-"సమోషధయ" ఇతి 'సమ్ ఓషధయః'। "బ్రాహ్మణస్తం" ఇతి "బ్రాహ్మణః తమ్"। "రాజస్తం" ఇతి "రాజన్ తమ్"। ఇత్యాదిః।

| | (క్రమః) విరామః | (వ్యుత్క్రమః) విరామః | (సంక్రమః) విరామః |
|---|---|---|---|
| 1 | ఓషధయః సం | సమోషధయః | ఓషధయః సం। |
| 2 | సం వదన్తే | వదన్తే సం | సం వదన్తే |
| 3 | వదన్తే సోమేన | సోమేన వదన్తే | వదన్తే సోమేన |
| 4 | సోమేన సహ | సహ సోమేన | సోమేన సహ |
| 5 | సహ రాజ్ఞా | రాజ్ఞా సహ | సహ రాజ్ఞా |
| 6 | రాజ్ఞేతి రాజ్ఞా | | |
| 7 | యస్మై కృణోతి | కృణోతి యస్మై | యస్మై కృణోతి |
| 8 | కృణోతి బ్రాహ్మణః | బ్రాహ్మణః కృణోతి | కృణోతి బ్రాహ్మణః |
| 9 | బ్రాహ్మణస్తం | తం బ్రాహ్మణః | బ్రాహ్మణస్తం |
| 10 | తం రాజన్ | రాజంస్తం | తం రాజన్ |
| 11 | రాజన్పారయామసి | పారయామసి రాజన్ | రాజన్పారయామసి |
| 12 | పారయామసీతి పారయామసి। | | |

## 3. శిఖా——శిఖా - లక్షణమ్

పదోత్తరాం జటామేవ శిఖామార్యాః ప్రచక్షతే। ఓషధయః సం, సమోషధయ, ఓషధయః సం, - వదన్తే।
సం వదన్తే, వదన్తే సం, సం వదన్తే, - సోమేన। వదన్తే సోమేన, సోమేన వదన్తే, వదన్తే సోమేన, - సహ।
సోమేన సహ, సహ సోమేన, సోమేన సహ, - రాజ్ఞా। సహ రాజ్ఞా, రాజ్ఞా సహ, సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।
యస్మై కృణోతి, కృణోతి యస్మై, యస్మై కృణోతి, - బ్రాహ్మణః। కృణోతి బ్రాహ్మణో, బ్రాహ్మణః కృణోతి, కృణోతి బ్రాహ్మణస్ తమ్।
బ్రాహ్మణస్తం,తం బ్రాహ్మణో, బ్రాహ్మణస్తం, - రాజన్। తం రాజన్, రాజంస్తం, తం రాజన్, - పారయామసి।
రాజన్పారయామసి, పారయామసి రాజన్, రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి।

## 4. రేఖా——రేఖా - లక్షణమ్

క్రమాద్ ద్విత్రిచతుష్పఞ్చపదక్రమముదాహరేత్। పృథక్పృథగ్విపర్యస్య లేఖామాహుః పునః క్రమాత్॥

పూర్వార్ధస్య -

2 (పదద్వయం) = ఓషధయః సం। సమోషధయః। ఓషధయః సం॥
3 (పదత్రయం) = సం వదన్తే సోమేన। సోమేన వదంతే సం। సం వదన్తే॥
4 (పదచతుష్కం) = వదన్తే సోమేన, సహ రాజ్ఞా। రాజ్ఞా సహ సోమేన వదన్తే। వదన్తే సోమేన॥ సోమేన సహ। సహరాజ్ఞా। రాజ్ఞేతిరాజ్ఞా॥

ఉత్తరార్ధస్య :-

2 = యస్మై కృణోతి। కృణోతి యస్మై। యస్మై కృణోతి॥

3 = కృణోతి బ్రాహ్మణస్తం। తం బ్రాహ్మణః కృణోతి। కృణోతి బ్రాహ్మణః॥

4 = బ్రాహ్మణస్తం రాజన్ పారయామసి। పారయామసి రాజంస్తం బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం॥
తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి॥

[యద్వా సర్వస్య మన్త్రస్య]

2 (పదద్వయం) = ఓషధయః సం। సమోషధయః। ఓషధయః సమ్॥

3 (పదత్రయం) = సం వదన్తే సోమేన। సోమేన వదన్తే సం। సం వదన్తే॥

4 (పదచతుష్కం) = వదన్తే సోమేన సహ రాజ్ఞా। రాజ్ఞా సహ సోమేన వదన్తే। వదన్తే సోమేన॥

5 (పదపఞ్చకం) = సోమేన సహ రాజ్ఞా యస్మై కృణోతి। కృణోతి యస్మై రాజ్ఞా సహ సోమేన। సోమేన సహ।

6 (పదషట్కం) = సహ రాజ్ఞా యస్మై కృణోతి బ్రాహ్మణస్తం। తం బ్రాహ్మణః కృణోతి యస్మై రాజ్ఞా సహ। సహ రాజ్ఞా॥

7 (పదసప్తకం) = రాజ్ఞా యస్మై కృణోతి బ్రాహ్మణస్తం రాజన్ పారయామసి। పారయామసి రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై రాజ్ఞా। రాజ్ఞా యస్మై॥ యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి॥

## 5. ధ్వజః — ధ్వజ-లక్షణమ్

బ్రూయాదాదేః క్రమం సమ్యగన్తాదుత్తారయేద్యది। వర్గే చ ఋచి వా యత్ర పఠనం స ధ్వజః స్మృతః॥

| (ఆదేః క్రమః) | (అన్తాదుత్తారణం) | (ఆదేః క్రమః) | (అన్తాదుత్తారణం) |
|---|---|---|---|
| 1 ఓషధయః సం। | 2 పారయామసీతి పారయామసి। | 13 యస్మై కృణోతి। | 14 రాజ్ఞేతి రాజ్ఞా। |
| 3 సం వదన్తే। | 4 రాజన్ పారయామసి। | 15 కృణోతి బ్రాహ్మణః। | 16 సహ రాజ్ఞా। |
| 5 వదన్తే సోమేన। | 6 తం రాజన్। | 17 బ్రాహ్మణస్తం। | 18 సోమేన సహ। |
| 7 సోమేన సహ। | 8 బ్రాహ్మణస్తం। | 19 తం రాజన్। | 20 వదన్తే సోమేన। |
| 9 సహ రాజ్ఞా। | 10 కృణోతి బ్రాహ్మణః | 21 రాజన్ పారయామసి। | 22 సం వదన్తే। |
| 11 రాజ్ఞేతి రాజ్ఞా। | 12 యస్మై కృణోతి। | 23 పారయామసీతి పారయామసి | 24 ఓషధయః సం। |

### అత్ర విశేషః

1. అత్ర ధ్వజస్య పఠనక్రమోఽత్ర్యేః పదస్యైతః ।
2. యథా మన్త్రస్యైకస్యైవం ధ్వజో భవతి. తథైవ పఞ్చ-షట్-సప్త మన్త్రసంఖ్యాకస్య వర్గస్యాప్యేవమేవ ధ్వజో భవతి। తత్ర వర్గాదిస్థితస్య పదద్వయస్య వర్గాన్తస్థేన పదేన ద్విరుక్తేనేతికార సహితేన చ సంబన్ధో జ్ఞాతవ్యః । యథా 'అగ్నిమీళే......ఆ గమదితి ఆ గమత్' ఇతి ప్రథమస్య వర్గస్య ఋగ్వేదస్య ధ్వజో బోద్ధవ్యః ।

## 6. దండః — దండ-లక్షణమ్

క్రమముక్త్వా విపర్యస్య పునశ్చ క్రమముత్తరమ్ ।
అర్ధర్చాదేవముక్తోఽయం క్రమదండోఽభిధీయతే ॥

### పూర్వార్ధస్య

2 ఓషధయః సం॥ సమోషధయః । 3 ఓషధయః సం । సం వదన్తే ॥ వదన్తే సమోషధయః ।

4 ఓషధయః సం । సం వదన్తే । వదన్తే సోమేన ॥ సోమేన వదన్తే సమోషధయః ।

5 ఓషధయః సం । సం వదన్తే । వదన్తే సోమేన । సోమేన సహ ॥ సహ సోమేన వదన్తే సమోషధయః ।

6 ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా॥ రాజ్ఞా సహ సోమేన వదన్తే సమోషధయః।

ఓషధయః సం। సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా॥ రాజ్ఞేతి రాజ్ఞా ।

ఉత్తరార్ధస్య-

2 యస్మై కృణోతి॥ కృణోతి యస్మై । 3 యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః॥ బ్రాహ్మణః కృణోతి యస్మై।

4 యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం॥ తం బ్రాహ్మణః కృణోతి యస్మై।

5 యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్॥ రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై।

6 యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి॥ పారయామసి రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై। యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి॥ పారయామసీతి పారయామసి।

## 7. రథః — రథ-లక్షణమ్

పాదశోఽర్ధర్చశో వాపి సహోక్త్యా దండవద్రథః।

రథస్త్రివిధః। ద్విచక్రస్త్రిచక్రశ్చతుశ్చక్రశ్చేతి। తత్ర ద్విచక్రో రథోఽర్ధర్చశో భవతి। త్రిచక్రస్తు రథః ప్రతిపాదే సమాన పద సంఖ్యాయుతస్య గాయత్రీఛన్దస్కస్యైవ మన్త్రస్య భవతి। చతుశ్చక్రో రథస్తు పాదశ ఏవ భవతి।

### 1. ద్విచక్రో రథః (అర్ధర్చశః)

| (పూర్వార్ధః) | (ఉత్తరార్ధః) |
|---|---|
| 1. 1 ఓషధయః సం। | యస్మై కృణోతి। (ప్రథమ ఏకపాత్క్రమః) |
| సమోషధయః। | కృణోతి యస్మై। (వ్యుత్క్రమః) |
| 2. 1 ఓషధయః సం। | యస్మై కృణోతి। (ద్వితీయో ద్విపాత్క్రమః) |
| 2 సం వదన్తే। | కృణోతి బ్రాహ్మణః। (ద్వితీయో ద్విపాత్క్రమః) |
| వదన్తే సమోషధయః। | బ్రాహ్మణః కృణోతి యస్మై। (వ్యుత్క్రమః) |
| 3. 1 ఓషధయః సం। | యస్మై కృణోతి। (తృతీయస్త్రిపాత్క్రమః) |
| 2 సం వదన్తే। | కృణోతి బ్రాహ్మణః। ” |
| 3 వదన్తే సోమేన। | బ్రాహ్మణస్తం। ” |
| సోమేన వదన్తే సమోషధయః। | తం బ్రాహ్మణః కృణోతి యస్మై। (వ్యుత్క్రమః) |
| 4. 1 ఓషధయః సం। | యస్మై కృణోతి। (చతుర్థశ్చతుష్పాత్క్రమః) |
| 2 సం వదన్తే। | కృణోతి బ్రాహ్మణః। ,, |
| 3 వదన్తే సోమేన। | బ్రాహ్మణస్తం। ,, |
| 4 సోమేన సహ। | తం రాజన్। ,, |
| సహ సోమేన వదన్తే సమోషధయః। | రాజంస్తం బ్రాహ్మణః కృణోతి యస్మై। (వ్యుత్క్రమః) |

| పూర్వార్ధః | ఉత్తరార్ధః | |
|---|---|---|
| 5. 1 ఓషధయః సం। | యస్మై కృణోతి। (పఞ్చమః పఞ్చపాత్ క్రమః) | |
| 2 సం వదన్తే। | కృణోతి బ్రాహ్మణః। | ,, |
| 3 వదన్తే సోమేన। | బ్రాహ్మణ స్తం। | ,, |
| 4 సోమేన సహ। తం రాజన్। | | ,, |
| 5 సహ రాజ్ఞా। రాజన్ పారయామసి। | | ,, |

రాజ్ఞేతి రాజ్ఞా। పారయామసీతి పారయామసి। (సమాప్తిః)

## 2 ద్విచక్రో రథః

అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్। హోతారం రత్నధాతమమ్॥ ఋ - 1-1-1

అయం దేవాయ జన్మనే స్తోమో విప్రేభిరాసయా। అకారి రత్నధాతమః॥ ఋ - 1-20-1

మన్త్రద్వయస్య సహోక్త్యాఽపి ద్వి చక్రో రథో భవతి। సహోక్తి పాఠభేదేన సద్ద్విధా విభజ్యతే॥ తత్ర ప్రథమ :-

(ఋ - 1-1-1) (ఋ - 1-20-1)

1. అగ్నిమీళే। అయం దేవాయ॥
   ఈళేఽగ్నిం। దేవాయాయం॥

2. అగ్నిమీళే। ఈళే పురోహితం॥ అయం దేవాయ। దేవాయ జన్మనే॥
   పురోహితమీళేఽగ్నిం। జన్మనే దేవాయాయం॥

3. అగ్నిమీళే। ఈళే పురోహితం। పురోహితం యజ్ఞస్య॥
   అయం దేవాయ, దేవాయ జన్మనే। జన్మనే స్తోమః॥
   యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం। స్తోమో జన్మనే దేవాయాయం॥

4. అగ్నిమీళే। ఈళే పురోహితం। పురోహితం యజ్ఞస్య।
   'పురోహితమితి పురఃఽహితం'। యజ్ఞస్య దేవం॥
   అయం దేవాయ। దేవాయ జన్మనే। జన్మనే స్తోమః। స్తోమో విప్రేభిః॥
   దేవం యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం॥ విప్రేభిః స్తోమో జన్మనే దేవాయాయం॥

5. అగ్నిమీళే। ఈళే పురోహితం। పురోహితం యజ్ఞస్య।
   పురోహితమితి పురఃఽహితం। యజ్ఞస్య దేవం। దేవమృత్విజం॥
   అయం దేవాయ। దేవాయ జన్మనే। జన్మనే స్తోమః। స్తోమో విప్రేభిః। విప్రేభిరాసయా॥
   ఋత్విజం దేవం యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం॥
   ఆసయా విప్రేభిః స్తోమో జన్మనే దేవాయాయం॥

6. అగ్నిమీళే। ఈళే పురోహితం। పురోహితం యజ్ఞస్య।
   'పురోహితమితి పురఃఽహితం'। యజ్ఞస్య దేవం। దేవమృత్విజం॥
   అయం దేవాయ। దేవాయ జన్మనే। జన్మనే స్తోమః।
   స్తోమో విప్రేభిః। విప్రేభిరాసయా।
   ఋత్విజమిత్యృత్విజం। ఆసయేత్యాసయా॥

7. హోతారం రత్నధాతమం । అకారి రత్నధాతమః ॥ రత్నధాతమం హోతారం । రత్నధాతమోఽకారి ॥
హోతారం రత్నధాతమం । అకారి రత్నధాతమః ॥
రత్నధాతమమితి రత్నఽధాతమం । రత్నధాతమ ఇతి రత్నఽధాతమః ।

### 3. ద్విచక్రోరథః

పూర్వోక్తయోర్ద్వయోర్మన్త్రయోః సహోక్త్యా ద్విచక్రో రథో భవతి । తస్య ద్వితీయః ప్రకారో యథా-

(ఋ - 1-1-1) (ఋ - 1-20-1)

1. (1) అగ్నిమీళే । అయం దేవాయ ॥
ఈళేఽగ్నిం । దేవాయాయం ॥

2. (1) అగ్నిమీళే । అయం దేవాయ ॥
(2) ఈళే పురోహితం । దేవాయ జన్మనే ॥
పురోహిత మీళేఽగ్నిం । జన్మనే దేవాయాయం ॥

3. (1) అగ్నిమీళే । అయం దేవాయ ॥
(2) ఈళే పురోహితం । దేవాయ జన్మనే ॥
(3) పురోహితం యజ్ఞస్య । జన్మనే స్తోమః ॥
యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం ॥ స్తోమో జన్మనే దేవాయాయం ॥

4. (1) అగ్నిమీళే । అయం దేవాయ ॥
(2) ఈళే పురోహితం । దేవాయ జన్మనే ॥
(3) పురోహితం యజ్ఞస్య । జన్మనే స్తోమః ॥
'పురోహితమితి పురఃఽహితం' ।
(4) యజ్ఞస్య దేవం । స్తోమో విప్రేభిః ॥
దేవం యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం ॥
విప్రేభిః స్తోమో జన్మనే దేవాయాయం॥

5. (1) అగ్నిమీళే। అయం దేవాయ॥
(2) ఈళే పురోహితం। దేవాయ జన్మనే॥
(3) పురోహితం యజ్ఞస్య। జన్మనే స్తోమః॥
పురోహితమి పురఃఽహితం
(4) యజ్ఞస్య దేవం। స్తోమో విప్రేభిః॥
(5) దేవమృత్విజం। విప్రేభిరాసయా॥
ఋత్విజం దేవం యజ్ఞస్య పురోహితమీళేఽగ్నిం।
ఆసయా విప్రేభిః స్తోమో జన్మనే దేవాయాయం।

6. (1) అగ్నిమీళే। అయం దేవాయ॥
(2) ఈళే పురోహితం। దేవాయ జన్మనే॥
(3) పురోహితం యజ్ఞస్య। జన్మనే స్తోమః॥
'పురోహితమితి పురః ఽ హితం',
(4) యజ్ఞస్య దేవం। స్తోమో విప్రేభిః॥
(5) దేవ మృత్విజం। విప్రేభిరాసయా॥
(6) ఋత్విజమిత్యృత్విజం। ఆసయేత్యాసయా॥

7. (1) హోతారం రత్నధాతమం। అకారి రత్నధాతమః॥ రత్నధాతమం హోతారం। రత్నధాతమోఽకారి॥
హోతారం రత్నధాతమం। అకారి రత్నధాతమః॥
రత్నధాతమమితి రత్నఽధాతమం । రత్నధాతమ ఇతి రత్నఽధాతమః ॥

### 4. త్రిచక్రో రథః

విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే। ఇన్ద్రస్య యుజ్యః సఖా॥ (ఋ-1-22-19)
ఇత్యస్య త్రిపదాగాయత్రీఛన్దస్య మన్త్రస్య ప్రతిపాదం సమానపదసంఖ్యాత్వాత్త్రిచక్రోరథో భవతి. యథా...

| | (ప్రథమః పాదః) | (ద్వితీయః పాదః) | (తృతీయః పాదః) |
|---|---|---|---|
| 1. (1) | విష్ణోః కర్మాణి। | యతో వ్రతాని। | ఇంద్రస్య యుజ్యః। (ప్రథమఃక్రమః) |
| | కర్మాణి విష్ణోః। | వ్రతాని యతః। | యుజ్య ఇంద్రస్య। (వ్యుత్క్రమః) |
| 2. (1) | విష్ణోః కర్మాణి। | యతో వ్రతాని। | ఇంద్రస్య యుజ్యః। (ద్వితీయః క్రమః) |
| (2) | కర్మాణి పశ్యత। | వ్రతాని పస్పశే। | యుజ్యః సఖా। (ద్వితీయః క్రమః) |
| | పశ్యత కర్మాణి విష్ణోః। | పస్పశే వ్రతాని యతః। | సఖా యుజ్య ఇంద్రస్య। (వ్యుత్క్రమః) |
| | (ప్రథమః పాదః) విష్ణోః కర్మాణి। | కర్మాణి పశ్యత। | పశ్యతేతి పశ్యత। (సమాప్తిః) |
| | (ద్వితీయః పాదః) యతో వ్రతాని। | వ్రతాని పస్పశే। | పస్పశ ఇతి పస్పశే। (సమాప్తిః) |
| | (తృతీయః పాదః) ఇంద్రస్య యుజ్యః। | యుజ్యః సఖా। | సఖేతి సఖా। (సమాప్తిః) |

### 5. చతుశ్చక్రో రథః

చతుశ్చక్రో రథశ్చతుష్పాన్మన్త్రస్య పాదశో భవతి, యథా...

| | (ప్రథమ పాదః) | (ద్వితీయః పాదః) | (తృతీయః పాదః) | (చతుర్థః పాదః) |
|---|---|---|---|---|
| 1. (1) | ఓషధయః సం। | సోమేన సహ। | యస్మై కృణోతి। | తం రాజన్। (ప్రథమః క్రమః) |
| | సమోషధయః। | సహ సోమేన। | కృణోతి యస్మై। | రాజంస్తం। (వ్యుత్క్రమః) |
| 2. (1) | ఓషధయః సం। | సోమేన సహ। | యస్మై కృణోతి। | తం రాజన్। (ద్వితీయః క్రమః) |
| (2) | సం వదన్తే। | సహ రాజ్ఞా। | కృణోతి బ్రాహ్మణః। | రాజన్పారయామసి। (ద్వితీయః క్రమః) |

వదంతే సమోషధయః। రాజ్ఞా సహ సోమేన। బ్రాహ్మణః కృణోతి యస్మై। పారయామసిరాజంస్తం। (వ్యుత్క్రమః)
(ప్రథమః పాదః) ఓషధయః సం। సం వదన్తే। వదంత ఇతి వదన్తే। (సమాప్తిః)
(ద్వితీయః పాదః) సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా। ,,
(తృతీయః పాదః) యస్మై కృణోతి। కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణ ఇతి బ్రాహ్మణః। (సమాప్తిః)
(చతుర్థః పాదః) తం రాజన్। రాజన్పారయామసి। పారయామసీతి పారయామసి। ,,

### 8. ఘనః

ఘనశ్చతుర్విధః। ఘనో ఘనవల్లభశ్చ। తౌ చ ప్రత్యేకం ద్విధా భవతః।

### 1. ప్రథమం-ఘన-లక్షణమ్

అన్త్యాత్క్రమం పఠేత్పూర్వమాది పర్యన్తమానయేత్।
ఆదిక్రమం నయేదన్తం ఘనమాహుర్మనీషిణః॥

(1) పూర్వార్ధస్య (అన్తాదాదిపర్యన్తమ్)

1. రాజ్ఞేతి రాజ్ఞా। సహ రాజ్ఞా। సోమేన సహ। వదన్తే సోమేన। సం వదన్తే। ఓషధయః సం -
(ఆదితోఽన్తపర్యన్తమ్)
సం వదన్తే। వదన్తే సోమేన। సోమేన సహ। సహ రాజ్ఞా। రాజ్ఞేతి రాజ్ఞా।

(2) ఉత్తరార్ధస్య (అన్తాదాదిపర్యన్తమ్)

2. పారయామసీతి పారయామసి। రాజన్ పారయామసి।
తం రాజన్। బ్రాహ్మణస్తం। కృణోతి బ్రాహ్మణః। యస్మై కృణోతి - (ఆదితోఽన్తపర్యన్తమ్)
కృణోతి బ్రాహ్మణః। బ్రాహ్మణస్తం। తం రాజన్। రాజన్ పారయామసి। పారయామసీతి పారయామసి।

## 2. ద్వితీయం-ఘన-లక్షణమ్

శిఖాముక్త్వా విపర్యస్య తత్పదాని పునః పఠేత్। అయం ఘన ఇతి ప్రోక్త (ఇత్యేష్టౌ వికృతీః పఠేత్)॥

| | శిఖాపాఠః | | తస్య విపర్యాసః | తత్పదానాం పునఃపాఠః |
|---|---|---|---|---|
| ఓషధయః సం | సమోషధయ | ఓషధయః సం వదన్తే | వదన్తే సమోషధయ | ఓషధయః సం వదన్తే॥ |
| సం వదన్తే | వదన్తే సం | సం వదన్తే సోమేన | సోమేన వదన్తే సం | సం వదన్తే సోమేన॥ |
| వదన్తే సోమేన | సోమేన వదన్తే | వదన్తే సోమేన సహ | సహ సోమేన వదన్తే | వదన్తే సోమేన సహ॥ |
| సోమేన సహ | సహ సోమేన | సోమేన సహ రాజ్ఞా | రాజ్ఞా సహ సోమేన | సోమేన సహ రాజ్ఞా॥ |
| సహ రాజ్ఞా | రాజ్ఞా సహ | సహ రాజ్ఞా॥ | రాజ్ఞేతి రాజ్ఞా॥ | |

2. యస్మై కృణోతి కృణోతి యస్మైయస్మై కృణోతి బ్రాహ్మణో బ్రాహ్మణః కృణోతి యస్మై యస్మై కృణోతి బ్రాహ్మణః ॥
కృణోతి బ్రాహ్మణోబ్రాహ్మణః కృణోతి కృణోతి బ్రాహణస్తం తం బ్రాహ్మణః కృణోతి కృణోతి బ్రాహ్మణస్తం ॥
బ్రాహ్మణస్తం తం బ్రాహ్మణో బ్రాహ్మణస్తం రాజన్ రాజంస్తం బ్రాహ్మణో బ్రాహ్మణస్తం రాజన్ ॥
తం రాజన్ రాజంస్తం తం రాజన్ పారయామసి పారయామసి రాజంస్తం తం రాజన్ పారయామసి ॥
రాజన్ పారయామసి పారయామసి రాజన్ । రాజన్ పారయామసి ॥ పారయామసీతి పారయామసి ।

### ఘనపాఠః

ద్వితీయ ఘనలక్షణస్యాన్యదుదాహరణమ్ ।

(1 శిఖాపాఠః; 2 తస్యవిపర్యయః, 3 తత్పదానాం చ పునః పాఠో ఘనః)

గాయన్తి త్వా గాయత్రిణోఽర్చన్త్యర్క మర్కిణః । బ్రహ్మాణస్త్వా శతక్రత ఉద్వంశమివ యేమిరే ॥ (ఋ-1-10-1)

### 1. ప్రథమోఽర్ధః

1. గాయంతి త్వా, త్వా గాయంతి, గాయంతి త్వా, గాయత్రిణో, గాయత్రిణస్త్వా గాయంతి। గాయంతి త్వా గాయత్రిణః ॥
2. త్వా గాయత్రిణో, గాయత్రిణస్త్వా, త్వా గాయత్రిణో, అర్చంత్య, ఉర్చంతి గాయత్రిణస్త్వా। త్వా గాయత్రిణోఽర్చంతి ॥
3. గాయత్రిణోఽర్చంత్య,- ఉర్చంతి గాయత్రిణో, గాయత్రిణోఽర్చంత్యర్కమ-ఉర్కమర్చంతి గాయత్రిణో,
గాయత్రిణోఽర్చంత్యర్కమ్ ॥

4. అర్చంత్యర్కమ-ఽర్కమర్చంత్య-ఽర్చంత్యర్కమ-ఽర్కిణో; ఽర్కిణోఽర్చమర్చంత్యం-ఽర్చంత్యర్కమర్కిణః ॥
5. అర్కమర్కిణో, ఽర్కిణోఽర్కమ-ఽర్కమర్కిణః॥ అర్కిణ ఇత్యర్కిణః॥

## 2. ద్వితీయోఽర్ధః

1. బ్రహ్మాణస్త్వా, త్వా బ్రహ్మాణో, బ్రహ్మాణస్త్వా, శతక్రతో;
   శతక్రతో త్వా బ్రహ్మాణో, బ్రహ్మాణస్త్వా శతక్రతో॥
2. త్వా శతక్రతో, శతక్రతో త్వా, త్వా శతక్రత,
   ఉదుచ్ఛతక్రతో త్వా। త్వా శతక్రత ఉత్॥
3. శతక్రత ఉదుచ్ఛతక్రతో, శతక్రత ఉద్వంశమివ;
   వంశమివోచ్ఛతక్రతో, శతక్రత ఉద్వంశమివ॥ శతక్రతో ఇతి శతఽక్రతో॥
4. ఉద్వంశమివ, వంశమివోదుద్వంశమివ, యేమిరే;
   యేమిరే వంశమివో దుద్వంశమివ యేమిరే॥
5. వంశమివ యేమిరే, యేమిరే వంశమివ, వంశమివ యేమిరే॥
   వంశమివేతి వంశమ్ ఽ ఇవ। యేమిర ఇతి యేమిరే॥

## పఞ్చసన్ధియుక్తో ఘనపాఠః। (ఘనవల్లభః)

పదద్వయస్య క్రమోత్క్రమవ్యుత్క్రమాభిక్రమసంక్రమైః పఞ్చసన్ధిపాఠో భవతి।
అనులోమవిలోమానులోమైర్జటాపాఠో జాయతే।
జటాయా సహోత్తరపదపాఠేన శిఖాపాఠో భవతి।
క్రమముక్త్వా, విపర్యస్య, పునశ్చ క్రమపాఠే కృతే ధ్వజో భవతి। జటా దండాభ్యాం ఘనపాఠః సిద్ధ్యతి।
సర్వమేవైతత్పఞ్చసంధియుతే ఘనపాఠే ఘనవల్లభే సముచ్చయేన సంగచ్ఛతే।
పఞ్చసంధియుతేన అన్తాదాదిపర్యంతమాదేరన్తపర్యంతం చ పాఠేన ద్వితీయో ఘనవల్లభః సిద్ధ్యతి।
పరా మే యన్తి ధీతయో గావో న గవ్యూతీరను। ఇచ్ఛన్తీరురుచక్షసమ్॥ (ఋ-1-25-16)

(1) పరా మే।మే మే।మే పరా। పరా పరా। పరా మే॥
    పరా మే, మే పరా,పరా మే, యంతి; యంతి మె పరా, పరా మే యంతి॥
(2) మే యంతి। యంతి యంతి। యంతి మే। మే మే। మే యంతి॥
    మే యంతి, యంతి మే, మే యంతి, ధీతయో; ధీతయో యంతి మే, మే యంతి ధీతయః॥
(3) యంతి ధీతయః। ధీతయో ధీతయః। ధీతయో యంతి। యంతి యంతి। యంతి ధీతయః॥
    యంతి ధీతయో, ధీతయో యంతి, యంతి ధీతయో, గావో; గావో ధీతయో యంతి, యంతి ధీతయో గావః॥
4. ధీతయో గావః। గావో గావః। గావో ధీతయః। ధీతయో ధీతయః। ధీతయో గావః।
   ధీతయో గావో, గావో ధీతయో, ధీతయో గావో, న; న గావో ధీతయో, ధీతయో గావో న॥
5. గావో న। న న। న గావః। గావో గవః। గావో న॥
   గావో న, న గావో, గావో న, గవ్యూతీ; ర్గవ్యూతీర్న గావో, గావో న గవ్యూతీః।
6. న గవ్యూతీః। గవ్యూతీర్గవ్యూతీః। గవ్యూతీర్న। న న। న గవ్యూతీః।
   న గవ్యూతీ, ర్గవ్యూతీర్న, న గవ్యూతీరఽన్వ; ఽను గవ్యూతీర్న, న గవ్యూతీరను॥
7. గవ్యూతీరను। అన్వను। అను గవ్యూతీః। గవ్యూతీర్గవ్యూతీః।
   గవ్యూతీరను గవ్యూతీరన్వఽనుగవ్యూతీర్గవ్యూతీరను॥ అన్విత్యను॥

8. ఇచ్ఛంతీరురుచక్షసం। ఉరుచక్షసమురుచక్షసం। ఉరుచక్షసమిచ్ఛంతీః।
ఇచ్ఛంత్యిరిచ్ఛంతీః। ఇచ్ఛంతీరురుచక్షసం॥
ఇచ్ఛంతీరురుచక్షసమురుచక్షసమిచ్ఛన్తీరిచ్ఛన్తీరురుచక్షసమ్॥ ఉరుచక్షసమిత్యురుఽచక్షసం॥

పఞ్చసంధియుక్తో జటాపాఠః

| పఞ్చసంధిపాఠః। | జటాపాఠః |
|---|---|
| 1. పరా మే। మే మే। మే పరా। పరా పరా। పరా మే॥ | పరా మే, మే పరా, పరా మే॥ |
| 2. మే యంతి। యంతి యంతి। యంతి మే। మే మే। మే యంతి॥ | మే యంతి, యంతి మే, మే యంతి॥ |
| 3. యంతి ధీతయః। ధీతయో ధీతయః। ధీతయో యంతి। యంతి యంతి। యంతి ధీతయః॥ | యంతి ధీతయో, ధీతయో యంతి, యంతి ధీతయః॥ |
| 4. ధీతయో గావః। గావో గావః। గావో ధీతయః। ధీతయో ధీతయః। ధీతయో గావః॥ | ధీతయో గావో, గావో ధీతయో, ధీతయో గావః॥ |
| 5. గావో న। న న। న గావః। గావో గావః। గావో న॥ | గావో న, న గావో, గావో న॥ |
| 6. న గవ్యూతీః। గవ్యూతీర్గవ్యూతీః। గవ్యూతీర్న। న న। న గవ్యూతీః॥ | న గవ్యూతీర్గవ్యూతీర్న న గవ్యూతీః॥ |
| 7. గవ్యూతీరను। అన్వను। అను గవ్యూతీః। గవ్యూతీర్గవ్యూతీః। గవ్యూతీరను॥ | గవ్యూతీరన్వను గవ్యూతీర్గవ్యూతీరను॥ అన్విత్యను॥ |
| 8. ఇచ్ఛంతీరురుచక్షసం। ఉరుచక్షసమురుచక్షసం। ఉరుచక్షసమిచ్ఛంతీః। ఇచ్ఛంతీరిచ్ఛంతీః। ఇచ్ఛంతీరురుచక్షసం॥ | ఇచ్ఛంతీ రురుచక్షస మురుచక్షస మిచ్ఛంతీ రిచ్ఛంతీ రురుచక్షసం। ఉరుచక్షస మిత్యురుఽచక్షసం॥ |

(ఏవమేవ పఞ్చసన్ధియుక్తాః సర్వా అపి వికృతయః పఠ్యన్తే వేదవిద్భిః।)

ఇవి ఋగ్వేద పఠనంలోని అష్టవికృతుల విశేషాలు. ఋగ్వేదాష్ట వికృతులకు కొంత భిన్నంగా – యజుర్వేదాష్ట వికృతులలో వైదికంగా–శాస్త్రీయంగా–సాంప్రదాయ సిద్ధంగా అత్యంత ప్రాచీన కాలంలోనే నేంకొన్ని విశేషాలు మరికొన్ని వున్నాయి. ఈ గ్రంథం ఋగ్వేదం కాబట్టి యిక్కడ పదాదిఘనాంతంగా ఋగ్వేద అష్టవికృతులగురించి మాత్రమే తెలియజేయబడింది. వాస్తవానికి "ఘన"మంటే మేఘమని అర్థం. మేఘంలో "జ్యోతిస్సలిలమరు" దాది శక్తులున్నట్లే నిజమైన ఘనాపాఠీ సైతం తత్తచ్ఛక్తియుతుడై విరాజిల్లి వేద విజ్ఞాననిధిగా కృషి చెయ్యగలడు. మేఘంవలెనే ఋక్కులను కామరూపాలుగా మెలచగలడు బహుఫలితాల నీయగలడు.

మహర్షుల అడుగుజాడల్లో విశ్వరూపమనదగిన వేదవిజ్ఞానాన్ని అవగాహన చేసుకోవాలంటే అనుభూతికి తెచ్చుకోవాలంటే సూక్తస్వరూప స్వభావాలను సూక్తాధిదేవతల స్వరూప స్వభావాలను సూక్తాధిదేవతల పరంగా వివిధ ఋక్కులలో వున్న మంత్రాల స్వరూపస్వభావాలను బహుముఖంగా అవగాహన చేసుకొనవలసివున్నది. వాక్శుద్ధితోపాటు వాక్సిద్ధిని – బహుముఖ మంత్రసిద్ధిని వాటి శక్తుల ప్రయోగ ఉపసంహార పద్ధతులను ఆచరణ పూర్వకంగా ప్రయోగించి చూడడమేకాక ఇతరులకు బోధించి వారిచేతకూడా ఆచరింపచేసేశక్తిని పొందేవిధంగా వేదవిజ్ఞానంలో స్వతంత్రంగా మౌలికమైన పరిశోధనలు చేయవలసివున్నది.

మంత్రసిద్ధి ప్రయోగ ఉపసంహార పూర్వకమై బహుముఖమైన అఖండ విజ్ఞానానికి స్థానభూతమైన యీ వేదమంత్ర సాహిత్య విషయమే కకావికలైన స్థితిలో అస్తవ్యస్తమైనప్పుడు వేదమంత్రాలతో పడుగుపేకలుగా అవినాభావ సంబంధం కలిగివున్న వేద భాషాచ్ఛందోఽలంకారాదుల విషయమై పరిశోధనాజ్ఞానం స్వస్వరూప జ్ఞానం విస్మృతమవడంలో ఆశ్చర్యమేమీలేదు.

# వేద భాషాచ్ఛందోఽలంకార విషయాలు

మంత్రసిద్ధి ప్రయోగాది విషయాలలోనే శ్రద్ధ వహించక ఆయువుపట్టులను విడిచిపెట్టిన ప్రాచీనులు వేదభాష స్వరూపస్వభావాల విషయంలోను లింగవచన వ్యవస్థావిషయాలలోను ఆత్మనేపద పరస్మైపదస్వరూపస్వభావాల విషయంలోను వాటి నిర్ణీతవ్యవస్థలగురించి పరిశోధించి ఆయువుపట్టులను పట్టుకొనాలనే దృష్టి విలుప్తంకావడంలో విడ్డూరమేమీలేదు. అసలు వేదభాషకు దేవభాష అనీ అమరభాష-అమృతభాష-ఇత్యాది నామాలు సార్థకంగా యేవిధంగా ఏర్పడ్డాయో తెలుసుకోవాలంటే ఆ భాషాస్వరూపస్వభావాలగురించి బహుముఖమై ఆచరణపూర్వకమైన పరిశోధనలు చెయ్యవలసి వున్నది. వివిధ శబ్దాలకు పుం స్త్రీ నపుంసక లింగాల వ్యవస్థను యేర్పరచి నిర్ణయించడంలోను కొన్ని శబ్దాలకు పుం స్త్రీ ఉభయలింగాలను, మరికొన్ని శబ్దాలకు పుం నపుంసక ఉభయలింగాలను, వేరొక కొన్నిశబ్దాలకు స్త్రీ నపుంసక ఉభయలింగాలను, మరింకా కొన్ని శబ్దాలకు పుంస్త్రీ నపుంసక త్రిలింగవ్యవస్థను నిర్ణయించడంలోనూవున్న సార్థకమైన ఆంతర్యమేమిటో గ్రహించవలసి వున్నది. కొన్ని శబ్దాలకు ఏక ద్వి బహువచనాలను మూడింటినీ, కొన్నిశబ్దాలకు ఏకద్వివచనాలను రెండింటినీ, మరికొన్నింటికి ఏకబహువచనాలను రెండింటినీ, మరికొన్ని సందర్భాలలో ద్విబహువచనాలను, విశిష్టంగా కొన్నికొన్ని సందర్భాలలో నిత్యైకవచనాలను, నిత్యద్వివచనాలను, నిత్య బహువచనాలను నిర్ణయించడంలోవున్న వైజ్ఞానికమైన ఆంతర్యాలను గ్రహించడమేకాక అవ్యయశబ్దస్వరూప స్వభావాల తద్భిన్నశబ్ద వ్యయాత్మకత్వాన్ని తిరుగులేనివిధంగా సార్థకంగా పరిశీలించవలసివున్నది. కృత్తద్ధిత ప్రత్యయాల సహజత్వాన్నేకాక స్త్రీ ప్రత్యయ విభిన్నస్వరూప స్వభావాలగురించికూడా పరిశోధించవలసివున్నది. వేదభాషలో ఆత్మనేపద పరస్మైపద ప్రత్యయాల సార్థకమైన స్వరూప స్వభావాలేమిటో ! లౌకిక సంస్కృతభాషలో కొన్ని సందర్భాలలో ఈ ఆత్మనేపదప్రత్యయాలు కేవల పరస్మైపదాలుగాను పరస్మైపదప్రత్యయాలు కేవల ఆత్మనేపదాలుగాను ఏవిధంగా ఎందువల్ల మార్పుచెంది వైదికవ్యవస్థావిరుద్ధంగా స్థిరీభూత మవడం జరిగిందో! అంతరాంతరాలలోకివెళ్ళి పరిశీలించవలసివున్నది. ఈవిధంగా లింగవచనస్త్రీ కృత్తద్ధితప్రత్యయ ఆత్మనేపద పరస్మైపద క్రియల విషయంలో వాటివ్యవస్థకు మూలభూతమైవున్న ఆర్షసిద్ధాంతాలను పరిశోధించిగ్రహించినపుడు అనంతఅమేయ లౌకికాలౌకిక శక్తులకు ఆలవాలమైన మంత్రశబ్ద నిశ్శబ్దశక్తుల విషయాలు చాలావరకూ అవగతమవుతాయి. అసలు మంత్రసిద్ధి ప్రయోగాదులకు సంబధించిన వైజ్ఞానికసాంప్రదాయాలనే మన ప్రాచీన భారతీయులు నిలబెట్టుకోలేనప్పుడు బహుముఖభాషావిజ్ఞానాలు విస్మృతాలవడంలో విడ్డూరం లేదు.

వేదఋక్కుల పఠన గానాలకు మంత్రసిద్ధిప్రయోగోపసంహారాలకు ఛందవ్యవస్థకు ఉన్న అవినాభావ సంబంధాలగురించి సరైన ఆచరణపూర్వకమైన పరిశోధన ప్రాచీనకాలంలోనే జరిగినట్లు కనిపించదు. ఋగ్వేద, యజుర్వేద, సామ, అథర్వవేదాలలో కనిపించే ఏకైకస్వరూపంకల ఋక్కులకు వివిధవేదాలలో విభిన్న ఛందస్సులను పేర్కొన్న సందర్భా లనేకం వున్నాయి. ప్రాచీన కాలంలో క్రౌష్టుకి-యాస్క-తాండి-సైతవ - కాశ్యప-రాతమాండవ్య-ఆపస్తంభ-సాంఖ్యాయనప్రభృతులు ఛందస్సుల విషయమై అనేక విధాలయిన మతాంతరాభిప్రాయాలను వెల్లడించారు. సాంఖ్యాయనమహర్షి శ్రౌతసూత్ర గ్రంథంలో ముప్పయి ఛందస్సులనుమాత్రమే పేర్కొనగా ఆ తరువాతివారు వివిధఛందోఽక్షర సంఖ్యలతో ముప్పయి యెనిమిది విభిన్నఛందస్సులను పేర్కొనడంజరిగింది. ప్రాచీన మంత్రశాస్త్రుల దృష్ట్యా బీజాక్షరాలనిపించుకున్న అక్షరాలన్నిటికీ ప్రత్యేకంగా ఒక్కొక్క అక్షరానికి ఒక్కొక్క ఛందస్సువంతున పేర్కొనడంకూడా జరిగింది. రకరకాలుగా వున్న ఈ బీజాక్షర ఛందస్సులలోసైతం ప్రాచీనకాలంలోనే అభిప్రాయభేదాలు రాకపోలేదు. కొన్ని బ్రాహ్మణగ్రంథాలలో అక్షరన్యూన ఆధిక్యతలవల్ల ఛందోహాని జరుగదనికూడా పేర్కొనడం జరిగింది. శుక్లయజుర్వేదంలో కొంతమంది దేవతలకు బహుదేవతలకు కొన్నికొన్ని అక్షరాలను ప్రత్యేకంగా నిర్దేశించడం జరిగింది. ఈ అక్షర దేవతా సంఖ్యా నిర్దేశక మంత్రాలు చాలా పరిమితంగా వున్నందువల్ల కోట్లాదిగావున్న సమస్తదేవతలగురించి విభిన్న సంఖ్యాక్షర నిర్దేశితాలుగా పేర్కొన్న వేదమంత్రాలు అనేకం అసలు మనకు ఉపలభ్యమానాలే కాలేదని చెప్పవలసివుంటుంది. ఈ పరిస్థితుల్లో పింగళనాగాది ప్రాచీనఛందశ్శాస్త్రవేత్తలు గాయత్రీ మొదలైన ఛందోవిశేషాలగురించి ప్రామాణికమైన విషయాలు ఉటంకించారని చెప్పడానికి వీలు లేదు. ఛందో మంత్రాలలో ఛందస్సుల నామాలన్నీ గానమూలకాలుగాకూడా ఏర్పడ్డాయన్న ఆర్షదృక్పథంతో పరిశోధించవలసివున్నది. ఒకే కీర్తనను అనేక రాగాలలో విభిన్న రాగాలలో పాడినట్లు సామవేదశాఖలలోని ఋక్కులను వివిధరాగాలలో గానం చెయ్యవచ్చును

అదేవిధంగాఋగ్యజురథర్వవేదాలలోని ఋక్కులను వివిధరాగాలలో ఒకేపద్యాన్ని పాడినట్లుగా పాడవచ్చును. పద్యం ప్రాథధానిస్తే కీర్తనపాడడానికి ఎటువంటి తేడావుంటుందో ఋగ్యజురథర్వవేదాలలోని ఋక్కులు గానంచేయడానికి, సామవేదంలోని ఋక్కులు గానంచేయడానికి అటువంటి తేడావుంటుంది. అందువల్ల ఒక ఛందస్సులో వుందనుకున్న మంత్రం మరొక ఛందస్సులోకి మారవచ్చునన్నమాట. ఉదాహరణకు "తత్సవితుర్వరేణియమ్, భర్గోదేవస్య ధీమహి, ధియో యో నః ప్రచోదయాత్" అనే ఋక్కు మామూలుగా గాయత్రీఛందంలోవున్నప్పటికీ దాన్ని జగతీఛందంలోకి కూడా కూర్చుకొని పఠించవచ్చును. అప్పుడు పాదానికి ఎనిమిది అక్షరాల వంతున త్రిపాద గాయత్రిగావున్న మంత్రం పాదానికి పన్నెండు అక్షరాలవంతున జగతీఛందంలో ద్విపాదిగా రూపొందుతుంది. ఈ విషయాన్ని ఈక్రింది ఋక్కులో స్పష్టంగా వక్కాణించడం జరిగింది.

"జగతా సిన్ధుం దివ్యస్తభాయద్ రథంతరే సూర్యం పర్య పశ్యత్।
గాయత్రస్య సమిధస్తిస్ర ఆహు స్తతోమహ్నా ప్రరిరిచే మహిత్వా॥"

(ఋగ్వే: 1 మండ-164 సూ-25 ఋక్కు)

ఇదేవిధంగా ఈ క్రింది మంత్రంలో సామవేదంలోని మంత్రములను గాయత్రితో గానం చేయగా వాటిని ఋగాదివేద ఋక్కులుగా త్రిష్టుప్ ఛందస్సులోనూ, ద్విపదా చతుష్పదలుగానూ మాత్రమేకాక సప్తవిధ ఛందస్సులలో సైతం గానం చెయ్యవచ్చునని పేర్కొనడం జరిగింది.

"గాయత్రేణ ప్రతి మిమీతే అర్కమర్కేణ సామ త్రైష్టుభేన వాకమ్।
వాకేన వాకం ద్విపదా చతుష్పదాఽక్షరేణ మిమతే సప్తవాణీః॥"

(ఋగ్వే: 1 మం-164 సూ-24 ఋక్కు)

వాస్తవానికి సంగీతం సామవేద జన్యమని అంటారు కాని మూలం వేదమే. సంగీత స్వరాలన్నీ ఉదాత్త, అనుదాత్త, స్వరితాలనుంచి సంజనితాలైనవే. స. రి. గ. మ. ప. ద, ని స్వరాలకు అన్నింటికీ మూలభూతంగా వివిధ ఛందస్సులున్నాయని పాచీన ఆర్ష సంగీత శాస్త్రాలు పేర్కొనగా ప్రతి ఛందస్సుకూ సంగీత స్వరశ్రుతులున్నాయని ఆర్ష ఛందశ్శాస్త్రాలూ పేర్కొన్నాయి. వేదానికి సంగీతానికీ ఛందస్సుకూ వున్న సంబంధ బాంధవ్యాల గురించి "వాఙ్మయమహాధ్యక్షుని సామవేద విశ్వరూప ప్రదర్శన" అనే నా పరిశోధనా గ్రంథంలో కూలంకషంగా చర్చించడం జరిగింది. పైన ఉదాహరించిన "గాయత్రేణప్రతి" ఇత్యాది మంత్రంలో ద్విపద చతుష్పద పదాలు ప్రయోగించడం జరిగింది. ద్విపద, త్రిపద, చతుష్పద, షట్పద ఇత్యాది ఛందస్సులను అందరూ దేశి ఛందస్సులను కొనడం జరుగుతున్నది కాని అవన్నీ వేదప్రోక్తాలే. ద్విపదలు, త్రిపదలు, చతుష్పదలు, షట్పదలు ఉన్నట్లు శుక్లయజుర్వేదంలో విస్పష్టంగా పేర్కొనడం జరిగింది. ఛందో నామాలతోపాటు ద్విపదాదులను పేర్కొన్న ఆ మంత్రాలివి.

గాయత్రీ త్రిష్టుబ్ జగత్యనుష్టుప్ జక్త్యాసహ।
బృహత్యుష్ణిహా కకుప్సూచీభిః శమ్యన్తుత్వా॥
ద్విపదాయాశ్చతుష్పదా త్రిపదాయాశ్చ షట్పదాః।
విఛన్దాయాశ్చ సఛన్దాః సూచీభిః శమ్యన్తుత్వా॥

(శు. యజు-23 వ అధ్యా-33-34 మం)

"ద్విపదాయాశ్చతుష్పదాః" ఇత్యాది మంత్రంలో "విచ్ఛన్దాయాశ్చ సచ్ఛన్దాః" అని విస్పష్టంగా విఛందాలను సఛందాలను ప్రామాణికంగా ఉద్ఘాటించడం జరిగింది. ఆధునిక యుగంలో ఛందోబద్ధాలు కానటువంటి వచనకవితలుగాను గద్యగేయ కవితలుగాను ఫ్రీవర్సుగాను ప్రచారంచేయబడుతున్నవన్నీ వినూతన ప్రక్రియలు కానేకావు. (చూడు-వాఙ్మయ మహాధ్యక్షుని పరిశోధనా వాఙ్మయం, 'మార్గ-దేశి', 128 పుట మొదలు 178 పుట వరకు)-ఇవన్నీ ఋగ్వేద యజుర్వేద సామ అథర్వవేదాలలో ప్రయోగపూర్వకంగా

పరిగర్భితాలై ఉన్నవే. వాస్తవానికి ఏకాక్షరోత్తరాధికంగావున్న ఉక్తాత్యుక్తాది లౌకిక ఛందస్సుల పాదాక్షర నియమాలకు వేదాలలో ఉన్న మంత్రాలలోని ఛందస్సులకు పాదాలకు అక్షరనియమాలకు అసలు సంబంధమేలేదు. లభిస్తున్న వేదవాఙ్మయాన్ని పరిశీలిస్తే ఒకే ఛందస్సు పేరుతో విభిన్న పాదాక్షరాలు కలిగిన మంత్రాలు అసలు సాజాత్యమే లేకుండా సహస్రాధికంగా కనిపిస్తున్నాయి. దీనికితోడు సంగీత సప్తస్వరాలకు సంబంధించిన ఛందస్సులు భిన్నంగానూ వివిధ ఛందస్సులలోనుంచి ఉద్భవించిన సంగీత సప్త స్వరాలు భిన్నంగానూ కనిపిస్తున్నాయి. ఉదాత్తానుదాత్తాది స్వరాలకు సంగీతస్వరాలకు వివిధ ఛందస్సులకు ఉన్న పరస్పర సంబంధాన్ని దృష్టిలో పెట్టుకుని-ఛందోనామ స్వరూప స్వభావాలను దృష్టిలోపెట్టుకుని అంతరాంతరాలలోకి వెళ్ళి బహుముఖమైన పరిశోధన చేసినప్పుడే వైదిక ఛందో రీతుల వైశిష్ట్యం ఆవిష్కృతమవుతుంది. ఘనాపాఠీలైన వేదపండితులు వేదపఠనంలో గొప్పవారని మనం అనుకొనడమేగాని వారి వేదపాఠిత్వం కేవలం సంహితాపఠనానికి కొంతవరకూ ఉదాత్తాది స్వరవ్యవస్థకు మాత్రమే పరిమిత ప్రామాణికత్వం కలది-వాస్తవానికి వేదచ్ఛందస్సులకు విధించిన సంగీత శ్రుతివ్యవస్థ వారి పఠనంలో మచ్చుకైనా కానరాదు. కాగా ఘనాపాఠీల వేదపఠనం ప్రామాణికం కానేకాదు. ఇంక వేదాలంకారాల విషయానికి వద్దాము.

ఋగ్వేదం తొలి వాఙ్మయమూ తొలిగ్రంథమూ అయినందువల్ల ఉపమ - ఉపమాగర్భితమైన రూపకాలంకారమూ-రూపకాతిశయోక్త్యాద్యలంకారాలు బహుళంగాను విరళంగాను ఉపయుక్తాలయ్యాయని పరిశోధకులు భావించారు. ఋగ్వేదంలో ప్రయుక్తాలయిన ఉపమాద్యలంకారాలుగా పరిశోధకులు గుర్తించినవి ఈ క్రిందివిధంగా వున్నాయి. ఈ అలంకారోదాహరణల సందర్భంగా ఉదాహరిస్తున్న ఋగనువాదాలన్నీ శ్రీ నేమానివారి ఆంధ్రఋగ్వేద సంహితలోనివే.

"ఆ పూష చ్చిత్ర బర్హిషమాఘృణే ధరుణం దివః।
అజా నష్టం యథా పశుమ్॥ (ఋగ్వే: 1 మం-23 సూ-13 ఋక్కు)

గద్యము॥ పశుపాలకులనేక కర్మలచే పశువులను పోషించి దుగ్ధాదులచే మనుష్యాదులను సుఖపెట్టుచుండునటుల నా సూర్యలోకము విచిత్రలోకములతోఁ గూడికొనియున్నది. ఆకాశమును అచ్చటఁగల పదార్థములను స్వకిరణములచే నాకర్షణ రూపమునఁ బోషించి సర్వప్రాణుల సుఖపెట్టుచున్నవి."

"వి మృళీకాయ తే మనో రథీరశ్వం న సందితమ్।
గీర్భిర్వరుణ సీమహి॥" (ఋగ్వే : 1 మం - 25 సూ - 3 ఋక్కు)

సీ॥ హయముల రథిచాల నాదరించెడునట్లు కరుణించు మమ్ముఁ ఓ వరుణదేవ !-

పరా హి మే విమన్యవః పత న్తివస్య ఇష్టయే । వయోన వస తీరుప॥
(ఋగ్వే : 1 మం-25 సూ - 4 ఋక్కు)

సీ॥ "పక్షులు గూళుల పజ్జఁజేరెడు భంగి వదలకుందుము నిన్ను వరుణదేవ"-

"పరా మే యంతి ధీతయో గావో న గవ్యూతీరను।
ఇచ్ఛంతీరు రుచక్షసమ్"॥
(ఋగ్వే : 1 మం - 25 సూ - 16 ఋక్కు)

చ॥ "మనుజులకెల్ల నన్నము సమానముగాఁ గొని యిచ్చువాని నే
ననయము పొందుచుండెదను నావులు మందల పట్టు చేరు మాడ్కిని"-

"సం ను వోచావహై పునర్హోతే మే మధ్వాభృతమ్।
హోతేవ క్షదసే ప్రియమ్"॥

(ఋగ్వే : 1మం - 25సూ - 17 ఋక్కు)

సీ॥ "ఋక్కును నాహోతరీతిగాఁ బ్రియమౌ హవిస్సు నాస్వాదింప స్వీకరించి"॥

"అస్మా ఇదు ప్ర భరా తూతుజానో వృత్రాయ వజ్రమీశానః కియేదాః।
గోర్న పర్వ వి రదా తిరశ్చేష్యన్నర్ణాంస్యపాం చరధ్యై॥

(ఋగ్వే: 1మం-61సూ - 12 ఋక్కు)

గీ॥ "మాంస ఖండంబు లమ్మెడు మనుజులెట్లు, పశువులం జంపివైతురో పాపమనక
యటుల వృత్రుని వధియించి యధికశక్తి"॥

"అధి పేశాంసి వపతే నృతూరివా పోర్ణుతే వక్ష ఉస్రేవ బర్జహమ్।
జ్యోతిర్విశ్వస్మై భువనాయ కృణ్వతీ గావో న వ్రజం వ్యుషా ఆవర్తమః॥

(ఋగ్వే : 1మం - 92సూ - 4ఋక్కు)

ఉ॥ నాపితకేశ పాశమును నాశముఁ జేసడురీతి లోక సం
స్థాపితమైన చీకటిని జయ్యనఁగొట్టుచు సర్వగోగణం
బోపి పయఃప్రదేశమును నొప్పుగఁ జూపెడునట్లు రూపముఁ
జూపుచు గోవు గోష్ఠమున శోభిలుమాట్కి నుషస్సు వెల్గెడిన్॥

ఈ 92వ సూక్తంలో అనేకఋక్కులలో ఉపమాలంకారా లున్నట్లు విమర్శకులు భావించారు.

"సూర్యో దేవీముషసం రోచమానాం మర్యో న యోషా మభ్యేతి పశ్చాత్"

(ఋగ్వే : 1మం-115సూ-2ఋక్కు)

ఉ॥ భాసుర రూపముం గలుఁగు భార్యను యౌవనవంతుఁడట్లు పే
రాస నుషోఽంగనం దగిలి యంచిత సూర్యుఁడు వచ్చుచుండుటన్॥

"కన్యేవ తన్వా శాశదానాగ్ం ఏషి దేవి దేవ మియక్షమాణమ్।
సంస్మయమానా యువతిః పురస్తాదావిర్వక్షాంసి కృణుషే విభాతీ"

(ఋగ్వే : 1మం - 123సూ - 10ఋక్కు)

సీ॥ "కన్యకారత్నంబుకరణి వస్త్రములేక శోభిల్లుచున్నావు శోభతోడ"॥

"అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానామ్।
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ ని రిణీతే అప్సః"

(ఋగ్వే : 1మం - 124సూ - 7ఋక్కు)

సీ॥ అతివ వస్త్రాదుల నందంగఁగోరుచు జనకుని యొద్దకుఁ జనెడు మాట్కి
విధవ భర్తృధనంబు వేడుటకై రాజసభకుఁ దప్పక తాను జనెడు మాట్కి"॥

ఇత్యాది అనేక ఉపమాలంకారములతోపాటు

"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరి షస్వజాతే।
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభి చాకశీతి॥"

(ఋగ్వే : 1మం - 164సూ - 20ఋక్కు)

క॥ కలవొక తరువునఁ బలురె, క్కలపి పులుపు లొక్కరూపు కలవు చెలిమితోఁ
గలియుచు రెండొక్కఁడింపొ, ఫలమదినుం దినకయొండు భాసిలు నెలమిన్॥

వంటి రూపకాతిశయోక్త్యలంకారాలుకూడా వున్నాయని అనేకమంది పరిశోధకులు భావించారు.

"యథా వాతో యథావనం యథాసముద్ర ఏజతి।
ఏవా త్వం దశమాస్య సహావేహి జరాయుణా॥

(ఋగ్వే : 5మం - 78సూ - 8ఋక్కు)

గీ॥ ప్రసవవేదనఁ బడుచున్న పడతి యోని, నెట్లు విపృత మొనర్చునో యటు వనస్
తి మయపేటిక! విపృతమై తివిరిసప్త, బధ్నివిముక్తిని జేయుము పరమకృపను॥"

ఇత్యాది ఏహ్యామైన నీచోపమాలంకారా లున్నట్లుకూడా మరికొందరు భావించారు. అశ్వినీదేవతాదులను దొంగలతో పోల్చినందుకే నీచోపమ అని కొందరు భావించినపుడు ఈ ఏహ్యామైన నీచోపమగురించి యేమని విచారించాలి ? భరత, వామన, మమ్మట, దండి, విద్యానాథ, జయదేవ, అప్పయదీక్షితాదులు క్రమంగా శబ్దాలంకారాలను అర్థాలంకారాలను పెంచారని చాలామంది విమర్శకులు భావించారు గాని వాస్తవానికి అలంకారాలు వేలు లక్షలూకావు కోట్లకొలది వున్నాయి. వీటిలో పెక్కింటిని వేదం ప్రతిబింబించింది. ఈ అలంకారాలు అనేకం గుర్తింపబడకపోవడం వల్ల అవి అనామకాలుగా వుండవచ్చును గాని ఈ అలంకారాలకొక పరిమితసంఖ్య లేదు. పాత్రకొలది నీరన్నట్లుగా వేదాలంకార సముద్రం నుంచి ఎవరిశక్తికొద్ది వారు గ్రహించారు. అవి మూడు మొదలు మూడు వందలవరకైనా లేవు. ఎన్నో శాస్త్రగ్రంథాలను ఆర్షగ్రంథాలను పరిశీలించినదండి పేరుకు తన కావ్యదర్శనిలో 35 అలంకారాలను చూపించినా "నపర్యంతో వికల్పానామ్ రూపకోపమయోరతః, దిఙ్మాత్రం దర్శితం ధీరైరనుక్త మనుమీయతాం"అని అలంకారాల అసంఖ్యాకత్వాన్ని వక్కాణించాడు. అలంకారాలెన్నెన్నివున్నా ప్రాచీనులు అన్నింటికీ ఉపమాలంకారమే మూలమనగా రాజశేఖరుడు "ఉపమా కవి వంశస్య మాతైవేతి మతిర్మమ" అని ఉపమ కవి వంశానికే మాతగా ఉద్ఘాటించాడు. ఉపమను ఊరికావల వుంచమన్నట్లు అతిశయోక్తి ఒక్కటే అలంకారాలన్నిటికీ మూలమని భామహ-హేమచంద్ర మమ్మటాదులు పేర్కొన్నారు. ఉపమ అతిశయోక్త్యలంకారాలలో ఏది తొలిఅలంకారమంటే దేనికదే తొలిదని చెప్పవలసివుంటుంది. ఇది రెండు గ్రామాలకు మధ్యవుండే దూరం వంటిది. ఆవూరుకు ఈవూరు ఎంతదూరమో ఈవూరుకు ఆవూరూ అంతేదూరం అన్నటువంటిది అన్నమాట. ఇక్కడ ఆద్యంతాలున్నవనుకొంటే వున్నాయి. లేవనుకొంటే లేవు. ఛందశ్శాస్త్రంలో ప్రస్తారం గురువులతో ప్రారంభమైతే లఘువులతో ముగియగా లఘువులతో ప్రారంభమైతే గురువులతో ముగుస్తుంది. ఇదేవిధంగా అలంకారప్రస్తారంలో ఉపమ తొలిదైతే అతిశయోక్తి చివరిదై అతిశయోక్తి తొలిదైతే ఉపమ తుదిదవుతుంది. లఘువులేనిదే గురువులేదని తెలిసికూడా గురువుకే గురుత్వమిచ్చినట్లుగానే అతిశయోక్తిలేనిదే ఏ అలంకారమూలేదని తెలిసీకూడా ఉపమయే అలంకారాలమాత అన్నారు. లఘువులేనిదే గురువులేకపోయినా గురువులో లఘువు అంతర్భూతమే. ఇదేవిధంగా అతిశయోక్తిలేకపోతే ఉపమలేకపోయినా ఉపమలో అతిశయోక్తి అంతర్గతమైవున్న దనే చెప్పాలి.గురులఘువులుగాని గురువులుగాని లఘువులుగానిలేకుండా వృత్తాలూ తదితర పద్యాలూ లేనివిధంగానే ఉపమాతిశయోక్తులు గాని ఉపమాగాని అతిశయోక్తిగానిలేకుండా ఏ అలంకారమూ రూపొందదనే స్పష్టపడుతుంది.ఈరహస్యాన్ని గుర్తించనందువల్ల ప్రాచీన కాలంలోనే అలంకారోత్పత్తి వ్యవస్థ వర్గవిభజనతో స్పష్టమైన రాజమార్గంలో పడనందువల్ల కకావికలై పోయింది.ఆర్షదృష్టిలోఈ వర్గవ్యవస్థ ఒక అగాధమైనది. వేదాలంకారాలలో అసలు ఉపమాలంకారమే చిత్రాదిభేదాలతో ద్వాదశవిధాలు. ఈద్వాదశవిధాలుకూడా పూర్ణలుప్తల పేరుతో రెండువిధాలుగా వున్నాయి. ఈ పూర్ణలుప్తలలోకూడా సామాన్యదృష్టిలో 360భేదాలు, విశేషదృష్టిలో 1440భేదాలువున్నాయి. ఈ ఆంతర్యాన్ని గ్రహించినప్పుడే అలంకారాలు'సౌందర్యమలంకారః'వంటి అలంకారాలనిగాని 'అలంక్రియతే అనేనేత్యలంకారః' వంటి అలంకారాలనిగాని కాక నిత్యసత్యశ్రీ విశ్వవిరాడ్లలితాలలితా అలంకారం లంకకానిదని "నఞ్" సమాసంగా ఆర్షవిజ్ఞానదృష్టితో వేదవిజ్ఞాన ఆంతర్యాన్ని అవగాహనచేసుకొనడం జరుగుతుంది. సృష్టిస్వభావద్యోతకమయిన ఈ అలంకారవ్యవస్థగురించి ఆర్షదృష్టితో పరిశీలించవలసినది అనంతంగా వున్నది. వాస్తవానికి దివ్యచక్షువుతో చూచినప్పుడు లక్ష్మి సరస్వతి పార్వతివంటి దేవశిఖామణులు

పరిపూర్ణచంద్రాననలుగా ఉపమ చంద్రునకు సంబంధించినదిగా గోచరం కాగలదు. వాస్తవానికి ఉపమాశబ్దంలోని 'ఉప'ను ఉపసర్గగాను 'మ'శబ్దాన్ని చంద్రార్థకశబ్దంగాను గుర్తించినపుడు సమస్తాలంకారలోకాన్ని ఆర్షదృష్టితో ఏవిధంగా పర్యావలోకనం చెయ్యాలో మనకు కొంతైనా అర్థమవుతుంది. ఈ పరిస్థితిలో వేదాలంకారాలగురించి సాధికారికంగా మాట్లాడాలనుకొనడం పొరపాటే కాగలదు.

నిజానికి వేదభాష మంత్రసాహిత్య ఛందోలంకారాల వ్యవస్థగురించిన పరిజ్ఞానం కేవలం భారతదేశంలోనేకాదు అతి ప్రాచీన వేదర్షుల సంతతి అనిపించుకున్న ఆంధ్రులలో కూడా కొన్నిసహస్రాబ్దాలకు పూర్వమే విలుప్తమయిపోయినట్లు స్పష్టపడుతున్నది.

## ఆంధ్రుల ప్రాచీనత - వేదవాఙ్మయం

ఈ అనంత సృష్టిలో సృష్టి ప్రారంభదశలోనే వేదావిష్కరణలోనే ఆర్షకుటుంబీకులుగా దివ్యజ్యోతులుగా తెలుగువారు వెలుగొందారని చెప్పవచ్చును.జైన పురాణాల ప్రకారం జైనమత తీర్థంకరులలో మొట్టమొదటి తీర్థంకరుడైన ఋషభనాథుడికి అత్యంతపూర్వకాలంనుంచీ తెలుగువారున్నట్లు తెలుస్తున్నది. ఋషభనాథుని పెద్దకొడుకు పేరు భరతుడు. రెండవకొడుకు పేరు బాహుబలి. ఋషభనాథుని మరణానంతరం భరతుడు రాజ్యాధినేతకాగా బాహుబలి వింధ్యకు దక్షిణంలోవున్న ఆంధ్రదేశాన్ని పరిపాలించాడని జైనపురాణాలు చెబుతాయి. జైనపురాణాల ప్రకారం దాదాపు దక్షిణదేశమంతా ఆంధ్రదేశంగా పూర్వం పరిగణించేవారని కూడా స్పష్టపడుతున్నది.

మామూలుగా పరిశోధకులందరూ తెలుగువారి ప్రాచీనతనుగురించి వక్కాణించాలంటే ఆంధ్రుల ప్రసక్తివున్న "తస్యహ విశ్వామిత్రస్యైకశతం పుత్రా ఆసుః పంచాశత్ ఏకజ్యాయాం సో మధుచ్ఛందసః పంచాశత్ కనీయాంసః, తద్యేజ్యాయాం సోన తే కులమ్ మేనిరే, తాన్ అనువ్యాజహారన్ తాన్ వః ప్రజా భక్షీస్తేతి త ఏతేఽంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి, వైశ్వామిత్రా దస్యూనామ్ భూయిష్ఠాః" అన్న ఐతరేయబ్రాహ్మణంలోని వాక్యాలను ఉదాహరించి తన ఆజ్ఞప్రకారం శునశ్శేపుణ్ణి అన్నగా ఆమోదించని తన యాభైమంది పుత్రులనూ ఆంధ్రులలో చండాలులుగా జీవించవలసిందని శపించినట్లు అందువల్ల అప్పటికే ఆంధ్రజాతి సుప్రతిష్ఠితమై వున్నట్లు పేర్కొంటూవుంటారు. శపించబడిన విశ్వామిత్రపుత్రులు ఆంధ్రులలో మేచ్ఛులుగానో చండాలులుగానో జీవించాలని కుక్కమాంసం తినేవారితో కలిసి జీవించవలసిందనీ శపించినట్లుకూడా పాఠాంతరాలున్నాయి. ఏమైనా విశ్వామిత్రుడు తన పుత్రులను ఆంధ్రులలో నీచులైన చండాలులుగానో మ్లేచ్ఛులుగానో జీవించవలసిందని శపించాడేగాని ఆంధ్రులుగా జీవించవలసిందని కాదు. అంటే దీనివల్ల విశ్వామిత్రునికాలంనాటికే ఆంధ్రులలో వర్ణవిభేదాలు పాతుకునిపోయి నీచఉచ్చాది వ్యవస్థలు పూర్తిగా ఏర్పడివున్నాయని మనకు అర్థం అవుతున్నది. కాగా విశ్వామిత్రునికాలం నాటికే ఆంధ్రజాతి సుప్రసిద్ధమై బహుముఖంగా వున్నదని చెప్పవలసివుంటుంది. విశ్వామిత్రులనేకమంది వున్నట్లు గతంలోనే పేర్కొనడం జరిగింది. గాధిమహర్షులు, రాజులూ యెందరో వున్నారు. వేదర్షియైన శునశ్శేపుడూ తద్భిన్నులైన శునశ్శేపులుకొందరూ కనిపిస్తున్నారు. వందమంది కొడుకులనుకన్న విశ్వామిత్రుడు త్రిశంకు హరిశ్చంద్రుల కాలంలోనివాడు గాని, అంబరీషునికాలంలోనివాడుగాని అయివుండాలి. వారు ఎప్పటివారో చెప్పడం అంత సులభమైన పనికాదు. ఏమైనా అనేక వేల సంవత్సరాలకు పూర్వమే ఆంధ్రజాతి సాహితీ సంస్కృతులతో మూడు పూవులూ ఆరు కాయలుగా విరాజిల్లిందని చెప్పవచ్చు. గతంలో జైనపురాణాల ప్రకారం ఋషభనాథుని కుమారుడైన బాహుబలి ఆంధ్రదేశాన్ని పరిపాలించినట్లు గ్రహించాం.

వేదవాఙ్మయాన్ని తరచిచూస్తే ఆంధ్రులకు మూలపురుషుడు బ్రహ్మమానసపుత్రుడైన అంగిరసమహర్షిగా కనిపిస్తున్నాడు.అంగిరసునికిబృహత్కీర్తి-బృహజ్జ్యోతి-బృహద్బ్రహ్మ-బృహన్మనసుడు-బృహస్పతి-సంవర్తనుడు-ఉతథ్యుడు-బృహన్మంతుడు-బృహద్భానుడు మొదలైనవారు కుమారులు,భానుమతి-రాక-సినీవాలి-గుహూ-అర్చిష్మతి-మహిష్మతి-మహాసుతి-యోగసిద్ధి మొదలైనవారు పుత్రికలు కలిగారు. ఉతథ్యుని కుమారుడు దీర్ఘతముడు. దీర్ఘతము లనేకమంది వున్నారు. పుట్టంధుడవడంవల్ల అతడికి దీర్ఘతముడనే పేరు వచ్చినట్లు పురాణకథలున్నాయి. సూర్యాది మహాగ్నిగోళాలనుసైతం నేత్రాలతో చూస్తూ ఖగోళవేధ చేసి పరిశోధనలు చేసినందువల్ల అతడంధుడయ్యాడనికూడా పురాణకథ లేకపోలేదు. అతిదీర్ఘమైన దేహం వున్నవాడుకాబట్టి దీర్ఘతమునికి మొదట ఆపేరువచ్చినా

చ్చివుండవచ్చును. ఈ దీర్ఘతముని కుమారులే అంగ-వంగ-కళింగ-ఆంధ్రులుగా పేర్కొనబడినట్లు కనిపిస్తున్నది. అందువల్ల దీర్ఘ తముడూ అతని తండ్రి తాతలూ ఆంధ్రులనే చెప్పవలసివుంటుంది. దీర్ఘతముని కుమారులలో ఉశికకుమారుడైన కక్షీవంతుడు, గౌత ముడు, పురుచ్ఛేపుడు వేదర్షులుగా సుప్రసిద్ధులు. దీర్ఘతముని సోదరుడైన బృహస్పతి యొక్క కుమారుడు భరద్వాజుడు వారివారి పుత్రపౌత్ర ప్రపౌత్రాదులు శతాధికంగా వున్నారు.

ఆంధ్ర శబ్దానికి అంధ = చీకటిని, రః = నాశనంచేసేవాడనీ, అంధ = నీటిమీద, రః = గమనం కలవాడు అనీ, అంధ = అన్నం, రః = హస్తంగా కలవాడు అంటే "అన్నదాత" అనీ ప్రధానమయిన మూడర్థాలున్నాయి. "అంగిర"శబ్దానికి 'అగ్ని-తేజస్సు'అని అర్థాలు. అంగిరుని మనుమలైన తెలుగువారికి "చీకటిపోగొట్టేవారు-తేజస్వరూపులు" అనే అర్థంలో ఆంధ్రశబ్దం రూపొందడం సహజమే. వేదవిజ్ఞానీ అంధుడూ అయిన దీర్ఘతముణ్ని తమతల్లి ఆజ్ఞప్రకారం అతని కొడుకులు బంధించి తట్టలో కూర్చోబెట్టి నదిలో విడిచిపెట్టగా, దీర్ఘతముడు తన తపశ్శక్తితో నదిలో మునిగిపోకుండా నీటిమీద తేలుతూ ప్రయాణంచేసిన సంగ తిని దృష్టిలో పెట్టుకుంటే 'ఆంధ్ర' శబ్దానికి 'నీటిమీద గమనం కలవాడు' అని అర్థం చెప్పడంలోని ఔచిత్యాన్నికూడా మనం గ్రహించవచ్చును. తెలుగువారు అతి ప్రాచీనకాలంనుంచీ వరి సేద్యంచేసి ధాన్యాన్ని పండించి ఇతరులకు ఆహారపదార్థాలు సరఫరా చెయ్యడంలో అగ్రేసరులుకాబట్టి 'అన్నహస్తం' కలవాడు 'అన్నదాత' అని అర్థంలో ఆంధ్రశబ్దం రూపొందడం కూడా సార్థకమైన విషయం. వేదసాహిత్య ఆవిష్కరణలోనే ఆంధ్రులు ప్రముఖమైన పాత్ర వహించారు. కాబట్టి అత్యంత ప్రాచీనులైన తెలుగువారిలో వేద ఋషి గోత్రకర్తలు ప్రవరకర్తలు వున్నారనడంలో అయదార్థమేమీలేదు. గోత్రకర్తలైన ఋషులు ప్రవరకర్తలైన ఋషులు ఎంద రున్నారంటే సమాధానంచెప్పడం చాలా కష్టం. మొట్టమొదట సప్తర్షులు వేదద్రష్టలుఅయిన మహర్షులు గోత్రకర్తలుగా ప్రవరకర్త లుగా నిలిచారనుకున్నా వారి వారి పుత్రపౌత్రప్రపౌత్రాదు లనేకమందిని గోత్రకర్తలుగా ప్రవరకర్తలుగా ఎవరికి తోచినట్లు వారు పరిగణించడంవల్ల వేలూ లక్షలూ కోట్లాదిగా ఊహించనంతమంది జనాభానుమించినంతమంది గోత్రకర్తలైన ఋషులున్నట్లు ప్రాచీనకాలంలో భావించారు. "గోత్రాణాంతు సహస్రాణి ప్రయుతాన్యర్బుదానిచ" అని బోధాయనుడు గోత్రసంఖ్యను పూరికే పేర్కొనలేదు. ప్రాచీనకాలంలో గోత్రప్రవరులు ఒకటేనని కొందరు భావించగా గోత్రంకంటే ప్రవర భిన్నమైనదని ఒకే గోత్రంలో ముఖ్యులైన వ్యక్తులు ప్రవరకర్తలుగా నిలిచారని కొందరు భావించారు. ఒకే గోత్రంలో అనేక ప్రవరలుండగా ఒకే ప్రవరకు అనేక గోత్రాలూ వున్నాయి. అందువల్లనే గోత్రంచేత ప్రవర-ప్రవరచేత గోత్రమూ రెండూ పరిగ్రహింపబడి సమానార్థకాలుగాకూడా భావింప బడ్డాయి. ఆదిఋషి గోత్రకర్తలలో కశ్యప - ఆత్రేయ - అంగిరస - కౌశిక - వశిష్ట-భృగు-అగస్త్య-మహర్షులు ముఖ్యులుగా కనిపి స్తున్నారు. ప్రస్తుతం ఏడవ మన్వంతరమైన వైవస్వత మన్వంతరం జరుగుతున్నదికాబట్టి ప్రతిమన్వంతరానికీ విభిన్నులైన సప్త ఋషులుంటారు కాబట్టి ఏడు మన్వంతరాలకూ సంబంధించి $7 \times 7 = 49$ మంది ఋషులు తొలి గోత్రకర్తలుగా అవతరించారని చెప్పవచ్చు. ఉపలభ్యమానమైన వేదవాఙ్మయాన్ని బట్టిచూస్తే వేదద్రష్టలైన ఋషులు సహస్ర సంఖ్యకైనా పరిమితం కాలేదు. అయి నప్పుడు "గోత్రాణాంతు సహస్రాణిప్రయుతాన్యర్బుదాని చ" అని బోధాయను డన్నాడంటే అది అతిశయోక్తి అన్నైనా అనాలి లేదా "అనంతావై వేదాః" అన్న వేదవాక్యాన్ని దృష్టిలోపెట్టుకుని చెప్పబడిందనైనా అనాలి. అత్యంత ప్రాచీనకాలంలో ఆయా ఋషిగోత్రజులైనవారు తత్తదృషి పరంపరగా లభ్యమానమయిన వేదాధ్యయన అధ్యాపనత్వాలను నెరవేరుస్తూ వుండేవారు. క్రమంగా ఋషి గోత్రజులైన బ్రాహ్మణులలోనే వేద అధ్యయన అధ్యాపనత్వాలు తగ్గిపోవడంవల్ల మిగిలిన కొద్దిమందిలోనే కొందరు ఒక వేదాన్ని కొందరు రెండు వేదాలను మరికొందరు మూడు వేదాలను వేరొక కొందరు నాలుగు వేదాలను సైతం అధ్యయనంచేసి అధ్యా పనం చేస్తూ వుండడంవల్ల తెలుగు వారిలో వేదులవారు - ద్వివేదులవారు - త్రివేదులవారు-చతుర్వేదులవారు అంటూ ఆయా గృహ నామాలేర్పడ్డాయి. వేదులవారు సాధారణంగా సామవేదులవారు. కొందరు వేదులవారే లోక వ్యవహారంలో తమయింటిపేరు ద్వివేదులగా వ్యవహరిస్తారు. కాని దస్తావేజులవంటి అధికార పత్రాలలోమాత్రం వేదులవారనే వ్యవహరిస్తేనే అవి చెల్లుతాయనీ ద్వివేదులవారుగా వ్యవహరిస్తే వాటికి చెల్లుబాటులేదనీ అభిజ్ఞులంటారు. వేదులవారు తొలుత రెండువేదాలలో పండితులుకాబట్టి వారికి ద్వివేదుల వారని గృహనామం వచ్చివుంటుంది. అసలు 'వేది' శబ్దం వుండగా "వేదుల" అని బహువచనరూపం గృహనామంగా యేర్పడడం చూస్తేనే తొలుత వేదులవారు అనేక వేదాలలో పండితులై వుంటారని ఊహించవచ్చు. పూర్వం వేదులవారు భిన్న వేదాలలోకాకపోయినా సామవేద

విభిన్నశాఖలలోనైనా పండితులై వుండేవారని చెప్పకతప్పదు.వీటికితోడు ఋగ్వేదం-యజుర్వేదం-సామవేదం-అథర్వవేదం గృహనామాలుగా వున్నవారు వుండనేవున్నారు.యజుర్వేద,అథర్వవేద గృహనామాలు ప్రస్తుతం మృగ్యాలు కావచ్చును. వేదాలవారు అటువైదికులలోను ఇటు వైష్ణవులలోనూ వున్నారు. వివిధ వేదశాఖా అధ్యయన అధ్యాపనలవల్ల బ్రాహ్మణులలో వివిధ శాఖాభేదాలు కూడా పూర్వమే అవతరించాయి. వీటన్నింటివల్ల ప్రాచీనకాలంలో తెలుగువారిలో వేదాధ్యయన అధ్యాపనలు యెంత విస్తృతంగా జరిగాయో ఊహించవచ్చును. ప్రాచీనకాలంలో వేదాధ్యయనం చేసిన వారంతా ఘనాపాఠీలుగానే వుండేవారని వేదాధ్యయనం మొదలుపెట్టినవారు కేవల సంహితాభ్యాసంతోనో పదాంతంగానో క్రమాంతంగానో జటాంతంగానో అధ్యయనంచేసి ఆపివేయకుండా ఘనాంతం వరకూ అధ్యయనంచేసి వేదపండితులనిపించుకునేవారనీ తెలుస్తుంది. ఉత్తర భారతీయులలో క్రమాంతంగానో జటాంతంగానో మాత్రమే అధ్యయనంచేసి ఆపివేసేవారు ప్రాచీనకాలంలో అత్యధికంగా వుండేవారు. ఘనాంతంగా అధ్యయనం చేసినవారు సకృత్తుగానే ఉండేవారు. కాగా ద్విపాఠీలు-త్రిపాఠీలు ఉత్తర భారతంలో ప్రాచీనకాలంలోనే అవతరించారు. సంహితతోపాటు పదక్రమాలు అధ్యయనం చేసినవారు ద్విపాఠి కాగా-పదక్రమ జటాంతాధ్యయనం చేసినవారు త్రిపాఠిగా ఎన్నడం జరిగింది. ప్రాచీన ఆంధ్రులలోని వేదపండితులలో క్రమాంత జటాంత స్వాధ్యాయన పరులన్నా అటువంటి వారిని వేదపండితులుగా గుర్తించి పెద్దపీట వేసేవారు కాదు కేవలం ఘనాపాఠీలైన వారికే వేదపండితుడనే గౌరవం దక్కేది. అందువల్లనే తెలుగు వారిలో వేదాల, ద్వివేదుల, త్రివేదుల, చతుర్వేదుల వంటి గృహనామాలూ ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం వంటి గృహనామాలూ ఏర్పడ్డాయేగాని ద్విపాఠి, త్రిపాఠి వంటి గృహనామా లేర్పడలేదు.

తెలుగు వారైన వేదఋషులు వేదద్రష్టలై అనేక వేద భాగాలను ఆవిష్కరించిన తరువాత వేలాది సంవత్సరాలుగా తరువాతి తెలుగువారు వంశపరంపరగానో గురుపరంపరంగానో చాలావరకూ వేదవాఙ్మయాన్ని కంఠస్థంచేస్తూ గ్రంథస్థంచేస్తూ నిలుపుకుంటూ వచ్చారు.వేదాలన్నిటిలో కృష్ణయజుర్వేదానికి క్రీ.శ. 1189 ప్రాంతంలో జ్ఞానయజ్ఞం అనే పేరుతో "అనుముల భట్ట భాస్కర మిశ్రు"డనబడే ఆంధ్రుడుమొట్టమొదటి భాష్యం రచించాడు. ఈ మిశ్రుడు తైత్తరీయ సంహితాబ్రాహ్మణాలు రెండింటికీకూడా సంపూర్ణమైన భాష్యాలు రచించాడు.తరువాత సాయనాచార్యులు వేదవాఙ్మయానికి తలమానికంగా తెలుగు వెలుగుగా కీర్తిపొంది 72సంవత్సరాలు జీవించి క్రీ.శ. 1315-1380 మధ్యకాలంలో నాలుగు వేదాలకూ భాష్యరూపాలైన అనేక వ్యాఖ్యాగ్రంథాలు రచించాడు. సాయనాచార్యులు రచించిన వేద వాఙ్మయ భాష్యగ్రంథాలు ఇవి. (1) తైత్తరీయ సంహితాభాష్యం (2) ఋగ్వేద సంహితాభాష్యం (3) సామవేద సంహితాభాష్యం (4) అథర్వవేద సంహితాభాష్యం. (5) శుక్లయజుర్వేద సంహితా భాష్యం. (6) శుక్ల యజుర్వేద బ్రాహ్మణ భాష్యం. (7) తైత్తరీయ బ్రాహ్మణ భాష్యం. (8) తైత్తరీయారణ్యక భాష్యం. (9) ఋగ్వేద బ్రాహ్మణ భాష్యం. (10) ఐతరేయ బ్రాహ్మణ భాష్యం (11) ఐతరేయ ఆరణ్యక భాష్యం. (12) సామవేద బ్రాహ్మణ భాష్యం. (13) పంచవింశ మహాబ్రాహ్మణ భాష్యం. (14) షడ్వింశ బ్రాహ్మణ భాష్యం. ఇత్యాదిగా వేదవాఙ్మయానికి తదనుసంధానవాఙ్మయానికీ సంబంధించిన భాష్యాలున్నాయి. ఈ వైదిక వాఙ్మయ గ్రంథాలేకాక వివిధ శాస్త్రగ్రంథాలనుసైతం సాయనాచార్యుడు విరచించాడు. క్రీ.శ. 1347 నుండి 1355 వరకూ కంపరాయలవద్ద మంత్రిగా వుండి కంపరాయలు దివంగతుడవగా అతని పుత్రుడైన సంగముని పేర రాజ్యపాలనచేస్తూ క్రీ.శ. 1364 నాటికి విద్యాబుద్ధులతో సంగముని పెద్దవాణ్ని చేసి అతనిరాజ్యభారం అతనికప్పచెప్పి క్రీ.శ. 1364 నుండి 1379 వరకూ బుక్కరాయలువద్ద మంత్రిగా వుండి అతడు దివంగతుడు కాగా రాజ్యానికి వచ్చిన అతని కుమారుడైన ద్వితీయ హరిహరరాయలవద్ద మంత్రిగా వుండి క్రీ.శ. 1387లో సాయనాచార్యులు తనువుచాలించినట్లు చరిత్ర చెపుతున్నది. దక్షిణ భారత దేశానికి గుండెకాయవంటి రాజ్యస్థానమనిపించుకున్న విజయనగర - విద్యానగర రాజ్యంలో హరిహర - బుక్కరాయాదుల పాలనాకాలంలో సాయనాచార్యులు అసాధారణమైన పాండితీప్రజ్ఞా పాటవాలతో విరచించిన వేదభాష్యాలు యావద్భారతదేశంలోనూ అపూర్వంగా విశేషమైన ప్రచారాన్ని పొందడమేకాక విశిష్టమైన స్థానాన్నికూడా పొందగలిగాయి.

అపూర్వ అమేయ విజ్ఞాననిధి అయిన వేదవాఙ్మయాన్ని వేదభాష్యాదివాఙ్మయాలనూ తెలుగులో వెలువరించాలనే ప్రయత్నాలు-పరిశోధనా రచనలు చెయ్యాలనే ప్రయత్నాలు గత 60, 70 సంవత్సరాలుగా అనేక విధాలుగా జరిగాయి. తత్ఫలితంగా శ్రీ అచ్యుతుని వెంకటాచలపతి గారి "వేదభూమి"అనే పరిశోధనారచన వెలువడింది. శ్రీ కల్లూరి చంద్రమౌళి గారి"వేదామృతము"-

హరి సోదరులు విరచించిన "భారతీ నిరుక్తి" మొదలైనవి విమర్శనాగ్రంథాలుగా వెలువడ్డాయి. స్వామీ దయానంద సరస్వతి "ఋగ్వేదాది భాష్యభూమిక" అనే పరిశోధనాగ్రంథాన్ని విరచించగా ఎల్లమరాజు నారాయణ భట్టుగారు (అనంతపురంజిల్లా నూతిమడుగు వాస్తవ్యులు) చక్కని తెలుగులో అనువదించగా క్రీ.శ. 1940లో 650 పుటల గ్రంథంగా అవతరించింది. తరువాత స్వామీ దయానందసరస్వతి శుక్లయజుర్వేద సంహితకు వ్రాసిన టీకావ్యాఖ్యాదులు సమూలంగా స్వర సహితంగా శ్రీ అన్నే కేశవార్య శాస్త్రిగారు 1958-1962 మధ్యకాలంలో పూర్తిగా తెలుగులో అనువాదంచేసి ప్రకటించారు. 1958 లోనే శ్రీశగిరీశ నరేశుడనే (G.N Sreesa) హైదరాబాదు నివాసియైన తెలుగువ్యక్తి అథర్వవేదాన్ని కొన్నికొన్ని తెలుగు పదభయ వాక్యాలతో వ్యాఖ్యాపూర్వకమైన విశేషాలతో తెలుగు లిపిలో ప్రకటించాలని ప్రయత్నించారు గాని అది సంపూర్ణంగా వెలువడలేదు. శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి గారు గుంటూరు జిల్లా రేపల్లెతాలూకాలోని వినయాశ్రమం పక్షాన వేదాలను తెలుగులో అనువదింపించి ప్రకటించాలని దృఢదీక్షతో కృషి చేశారు. తత్ఫలితంగా బంకుపల్లి మల్లయశాస్త్రి గారిచేత వచనరూపంలో తెలుగులో అనువదింపించి ప్రథమ ద్వితీయాష్టకాలు మాత్రం ప్రకటించడం జరిగింది. కాని శ్రీ మల్లయ్య శాస్త్రిగారి తెలుగు అనువాదం కనీసం సాయనాచార్య కృత ఋగ్వేద భాష్యానికైనా న్యాయం చేకూర్చేదిగా లేదని విమర్శలు రావడంతో ఆ ప్రచురణ అనివార్యంగా ఆగిపోయింది. శ్రీ మల్లయశాస్త్రిగారు యజుర్వేద సామవేద అథర్వ వేదాలకుసైతం తెలుగు అనువాదం చేశారని కొందరు అనుచరులు చెప్పడమేతప్ప అవి గ్రంథరూపంలో ఉపలభ్యమైనట్లు కూడా కనపడదు. అసలు నామమాత్రంగా సామవేద కౌథుమ-జైమిని శాఖలు లభించాయేతప్ప సరియైన సామవేద శాఖ ఒక్కటి కూడా ఇంతవరకూ ప్రచురితంకాలేదు. బహుముఖగానరూపిణియైన సామవేద వాణీస్వరూప స్వభావాలను దృష్టిలో పెట్టుకున్నప్పుడు సామవేదానికి తెలుగులో సరైన అనువాదం చెయ్యడం అంతసులభసాధ్యమయిన పనికాదు. సుసాధ్యమయిన పని కూడా కాదు. వాస్తవానికి మహత్తరమైన మన వేదఋషుల విజ్ఞానాన్ని వేదమంత్ర స్వభావాలను దృష్టిలోపెట్టుకున్నప్పుడు వేద మంత్రాలకు వివిధదేశభాషలలో అనువాదం చెయ్యడమేకాదు చివరికి సంస్కృతంలోనైనా అర్థం వ్రాయడమనేది అసాధ్యమైన విషయం. వివిధ మంత్రశబ్ద నిశ్శబ్ద శక్తుల సిద్ధి ప్రయోగ ఉపసంహారాలేవో వాటి విశేష వివరణలేవో మంత్ర భాష్యంలో వివరించవలసింది పోయి మంత్ర అర్థం పేరుతో అక్కరలేని విషయాల జోలికి వెళ్లి అవసరమైన అతిముఖ్య విషయాలను విడిచిపెట్టి ఎందుకూ కొరగాకుండా వేదగౌరవాన్నే దెబ్బతీయగల అప్రామాణికాలై అసంబద్ధాలైన భాష్యాలను ప్రాచీనులు రచించారు.నిజానికి మంత్ర భాష్యమంటే ఆ మంత్రా న్నేవిధంగా సిద్ధిపొందాలి?వివిధరూపాలలో వుండే ఆ సిద్ధి ఫలితాలేమిటి? ఆ సిద్ధులవల్ల మానవుడు సంపాదించే శుభాశుభ ఫలితాలేమిటి ? వాటి ప్రయోగోపసంహారాలకై అనుసరించవలసిన పద్ధతులేమిటి ? సర్వలోక క్షేమంకోసం వేద విజ్ఞానాన్ని యే విధంగా ఉపయోగించాలి ? మొదలైన విషయాలను వివరించినప్పుడు ఆర్షవిజ్ఞానానికి వేదవిజ్ఞానానికి న్యాయం జరుగుతుంది. దేశ భాషలలో అనువాదం చెయ్యడమంటే తమ బుద్ధికి తోచినవిధంగా శబ్దాలకు అర్థాలు వ్రాయగలరు గాని ఆయా శబ్దశక్తుల ప్రభావాన్ని గాని శబ్దశక్తినిగాని దేశభాషలలోకి తేలేరుగదా ఒక శబ్దాన్ని ధ్వనిసహితంగాగాని ధ్వనిరహితంగా నిశ్శబ్దంగాగాని అవిచ్ఛిన్నంగా ఉచ్చరించడంవల్ల వచ్చే ఫలితాలు ఆయా అర్థాలు ఉచ్చరించడంవల్ల వస్తాయనుకొనడం ముఖయంత్ర అక్షరశబ్ద నిశ్శబ్దశక్తుల ప్రభావంతెలియక పోవడమే అవుతుంది. ఈ దృష్ట్యా ఋగ్వేదాదులకు ప్రామాణికాలనదగిన భాష్యాలేవీ ప్రాచీనకాలంలోనే అవతరించలేదు. వేద ఋషుల విజ్ఞానానికి విదూరంగా అవతరించినప్పటికీ ఆర్షేయమైన అలౌకిక మంత్ర బహుముఖ శక్తులను సాధించడలలో అన్వేషించడంలో ఆసక్తి కనపరచని లోకం గతానుగతికంగా వేదాలకిచ్చిన గౌరవాన్నే ప్రామాణిక అప్రామాణికత్వాలతో సంబంధం లేకుండా పురాణ గాథా సమన్వయ దృష్టితో తుష్టితో పుష్టితో సాయనాదుల భాష్యాలను శిరోధార్యాలుగా భావించింది. దానితో బహుముఖమైన వేద విజ్ఞానం పరిశోధనాదృష్టికే దూరమైపోయింది. రామాయణ మహాభారత భాగవతాది సంస్కృత గ్రంథాలను ప్రాచీనకవులు తెలుగులోకి అనువదించిన పద్ధతిలోనే సాయనాచార్య ప్రభృతుల భాష్యాలను దృష్టిలో పెట్టుకుని శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత అనే పేరుతో తెలుగులో పద్య గద్యాత్మకంగా ఆంధ్రీకరించాలని దీక్షబూని చాలావరకూ కృతకృత్యులయినవారు శ్రీ నేమాని వేంకట నరసింహ శాస్త్రిగారు.

# శ్రీ నేమాని వారి వంశాదిక విషయాలు

శ్రీ నేమానివారు వైదిక బ్రాహ్మణులు. వేగినాటివారు. భారద్వాజ గోత్రులు. వేగినాటి బ్రాహ్మణులంటే కృష్ణాగోదావరీనదీ తీరప్రాంతవాసులనే అర్థం.రాజరాజనరేంద్రుడు పరిపాలించిన కృష్ణాగోదావరీనదీ తీరదేశాన్ని పూర్వం వేగిదేశం అనేవారు. ఆ వేగిదేశ వాసులు వేగినాటివారు. నేమానివారి తాతముత్తాతలు కృష్ణాగోదావరీవాసులై శ్రీకాకుళం జిల్లా "నివగాం" గ్రామానికి తరలివెళ్ళడం జరిగింది. శ్రీ మదాంధ్ర ఋగ్వేదసంహితలోని అధ్యాయాంత్యాలలోనూ అష్టకాంత్యాలలోనూ వ్రాసిన గద్యప్రకారం శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రిగారి వంశాదిక విషయాలు ఈవిధంగా తెలుస్తున్నాయి. శ్రీ నరసింహశాస్త్రిగారి తాతగారిపేరు వేంకటేశ్వరశాస్త్రి శ్రీ నరసింహశాస్త్రిగారు సీతమ్మ సంగమేశ్వరశాస్త్రి దంపతుల కుమారుడు. శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత గద్యప్రకారం శ్రీ నరసింహశాస్త్రిగారి వంశవృక్షం ఈ క్రిందివిధంగా ఉన్నది.

**1**

భారద్వాజ గోత్రం
|
నేమాని వంశం
|
వేంకటేశ్వరశాస్త్రి
|
సంగమేశ్వరశాస్త్రి
భార్య
సీతమ్మ
|
వేంకటనరసింహశాస్త్రి
(శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితాకర్త)

శ్రీ నరసింహశాస్త్రిగారి పెదతల్లిగారి మనుమలైన శ్రీ గుమ్మలూరు సత్యనారాయణగారు తెలియజేసిన విషయాల ప్రకారంగాను, శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ షష్టిపూర్తి ప్రత్యేకసంచికలో శ్రీ పిడపర్తి రామకృష్ణారావుగారు రచించగా ప్రకటితమైన "బహుముఖ ప్రజ్ఞాశాలి-శ్రీ గుమ్మలూరు" అన్న వ్యాసవిషయాలనుబట్టి ఆంధ్రఋగ్వేద సంహితాకర్త శ్రీ నరసింహశాస్త్రిగారి పితామహ-మాతామహుల వంశాలు ఈ క్రిందివిధంగా తెలుస్తున్నాయి.

**2**

భారద్వాజ గోత్రం
|
నేమాని వంశం
|
వేంకటేశ్వరశాస్త్రి
|
సంగమేశ్వరశాస్త్రి (భార్య సీతమ్మ)
|

వేంకటనరసింహశాస్త్రి
భార్య
చిట్టెమ్మ అనబడే మహాలక్ష్మి
(శ్రీ. ఆం. ఋ. సం. కర్త)
(నిస్సంతు)

బలరామశాస్త్రి
|
సంగమేశ్వరరావు | కుమార్తె-1 | కుమార్తె-2 | కుమార్తె-3 | కుమార్తె-4

శ్రీ

సంగాం అగ్రహారంలో
ఉపద్రష్టవారి వంశం




ఆంధ్ర ఋగ్వేద సంహితాకర్త అయిన శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి గారికి సంతానంలేదు. శ్రీ నరసింహశాస్త్రిగారి తమ్ముడైన బలరామశాస్త్రి గంజాం జిల్లాలో రైల్వేస్టేషన్ మాష్టరుగా ఉద్యోగం చేశారు. నరసింహశాస్త్రిగారి తమ్ముని కుమారుడూ, బలరామశాస్త్రిగారి కుమారుడూ అయిన శ్రీ సంగమేశ్వరరావు రైల్వేడిపార్టుమెంటులోనే గార్డుగా ఖుర్దారోడ్డులో ఉద్యోగం చేశారు. శ్రీ సంగమేశ్వరరావుగారికిసంతానంలేదు.శ్రీ నేమానివారి మాతామహులైన ఉపద్రష్టవారు సంగాం అగ్రహారం నివాసులు. శ్రీ నేమాని వారు ఆంధ్రఋగ్వేద సంహితలో అవతారికయేదీ ప్రత్యేకంగావ్రాయలేదు. అందువల్ల నేమానివారి పూర్వవంశీకుల కవితాపాండితీ పతిభాదులగురించిగాని గురువుల గురించిగానివిద్యాభ్యాసాదివిశేషాలగురించిగానిఏమీతెలియడంలేదు.శ్రీనేమానివారిస్వగ్రామం శ్రీకాకుళం జిల్లా బొబ్బిలితాలూకా †'నివగాం'గ్రామం. వారు పుట్టినతేదీ తెలియరాలేదు. ఆంధ్రఋగ్వేద సంహితాకర్త అయిన వేంకట నరసింహ శాస్త్రిగారు కాశీ హిందూ విశ్వవిద్యాలయంనుంచి సంస్కృతంలో "కావ్యతీర్థ" పట్టం పొందారు. 23-3-1909తేదీన బరంపురంలోని కళ్ళికోట కాలేజీలో సీనియరు తెలుగుపండితులుగా ఉద్యోగంలో జేరి 29-6-1932వరకూ ఉద్యోగంలోవుండి తన విధి నిర్వహణలోనే

* నేమానివారి పెదతల్లి కుమారుడైన శ్రీ నరసింహశాస్త్రి సుప్రసిద్ధ పండిత పరిశోధకులైన శ్రీమాన్ పరవస్తు రంగాచార్యులు గారి శిష్యులు. తర్క-వేదాంత పండితులు. ఈ గుమ్మలూరు నరసింహశాస్త్రి గారు సంగాంనుంచి పర్లాకిమిడికి తరలివచ్చి పర్లాకిమిడి హైస్కూలులో 1920-1935 వరకూ సంస్కృత పండితులుగా పనిచేశారు. గుమ్మలూరు నరసింహశాస్త్రిగారి భార్య కామమ్మ. బొంతావారిఆడపడుచు. కామమ్మనరసింహశాస్త్రి దంపతుల కుమార్తె అయిన నారాయణమ్మను శతాధిక గ్రంథకర్త, కవితా పితామహ శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి (1837 - 1897) మనుమడైన పార్వతీశ్వరశాస్త్రి B.A.,Lt. గారికిచ్చి వివాహం చేశారు. ఈ పార్వతీశ్వరశాస్త్రిగారు 1940లో కీర్తిశేషులయ్యారు. కామమ్మ నరసింహశాస్త్రుల పెద్దకొడుకు పేరు రంగనాధస్వామి. తన గురువైన రంగాచార్యులగారిమీద ఉన్న భక్తికొద్దీ తమ ప్రథమ పుత్రుడికి యీపేరు పెట్టుకొనడం జరిగింది. రెండవకుమారుడు సత్యనారాయణ. ఈ సత్యనారాయణగారు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలలో వ్యవసాయశాఖకుసంబంధించి అనేక వుద్యోగాలు చేశారు. వ్యవసాయశాస్త్ర పరిశోధకుడుగా రచయితగా కవిగా కీర్తి గడించారు.

† ఇప్పుడు పాలకొండ తాలూకా.

కాలేజీలో విద్యార్థులకు పాఠం చెపుతూనే హఠాత్తుగా మెదడులో నరాలు తెగిపోవడంతోపాటు పక్షవాతపు మూర్ఛవచ్చి స్పృహలేని స్థితిలో హాస్పటలులో ఒక రోజువుండి 30-6-1932 గురువారంనాడు కీర్తిశేషులయ్యారు. అప్పటికి వారి వయస్సు సుమారు 50 సంవత్సరాలుండవచ్చును. కళ్ళికోట కాలేజీ రికార్డులలో మాత్రం ఎన్.వి.ఎన్.శాస్త్రి గారని వ్యవహరించేవారు. శ్రీనరసింహశాస్త్రి గారిని ఆరోజుల్లో బరంపురంలో పెద్దలందరూ సాధారణంగా నేమానివారు అని అనేవారు. కాని నేమానివారికి 'ఆవడలు' (పెరుగులో పూరబెట్టిన గారెలు)చాలా ప్రీతిపాత్రమైనందువల్ల 'పెరుగుగారె మాష్టారు'అనికూడా పిన్నలు పెద్దలూ అంటూవుండేవారు.మామూలుగా నేమానివారు భోజనప్రియులుకారు. అత్యధికంగా ఉపాహారప్రియులు. చిరుతిళ్ళు ఎక్కువగా తినేవారు. కారాకిల్లీ అత్యధికంగా వేసు కుంటూ వుండేవారు. మామూలుగా పిల్లలు తమలపాకులు వేసుకుంటుంటే "తమలపాకులు వేసుకుంటే చదువు సరిగారాదు. నాలుక బండబారిపోతుంది. తమలపాకులు వేసుకొనవద్దు"అని సంప్రదాయ వైద్యజ్ఞానంకల పెద్దలు పూర్వకాలంలో నివారించడం సుప్రసిద్ధ మైన విషయం.నేమానివారికి చిన్నతనంనుంచి కారాకిల్లీవేసుకొనే అలవాటు వున్నందువల్ల సహజంగానే నాలుక మొద్దుబారిపోయింది.అందు వల్ల వారి ఉచ్చారణలో మాటలు స్వచ్ఛతకు భిన్నంగా మొద్దుగా వచ్చేవి. అయినా శ్రీనేమానివారు సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, ఒరియా, హిందీభాషల్లో మంచి పండితులు. విమర్శకులు. కవి. ఒరిస్సా రాష్ట్ర సరిహద్దు ప్రాంతాలలో పుట్టి పెరిగినందువల్ల శ్రీనేమాని వారికి మాతృభాష అయిన తెలుగుతోపాటు సహజంగానే ఒరియాకూడా వచ్చింది. కాశీలో వుండి కావ్యతీర్థ పరీక్షకు చదివినందువల్ల హిందీలోకూడా పాండిత్యం సహజంగానే అబ్బింది. ఇంగ్లీషులో డిగ్రీలేవీ సంపాదించకపోయినా స్వయంకృషితో ఆంగ్లంలోకూడా పాండిత్యం సంపాదించారు.

శ్రీ నేమానివారు 23-3-1909న కళ్ళికోట కాలేజీలో రు. 30-2-40 జీతం స్కేలుమీద తెలుగుపండితులుగాచేరారు. 1856లో జిల్లా హైస్కూలుగా చేయబడిన యీ పాఠశాలలో మద్రాసు విశ్వవిద్యాలయం మెట్రిక్యులేషన్ ఎక్జామినేషనుకు తరగతులుకూడా ప్రారం భించబడ్డాయి. 1878లో ఎఫ్.ఎ. క్లాసులు ప్రారంభించబడటంతో దీనిని ఇంటర్మీడియట్ కాలేజీగా అభివృద్ధిచేసి 'నేటివ్‌కాలేజీ' అనే పేరుతో మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధం చేయడం జరిగింది.ప్రభుత్వ అధ్వర్యంలో నడుస్తున్న ఈ హైస్కూలును సెకండ్ గ్రేడ్ కాలేజీగాచేసి 17-4-1887న జిల్లా కలెక్టర్ అధ్యక్షతను యేర్పడిన ఒక కమిటీకి అప్పగించడం జరిగింది. క్రమంగా కాలేజీ హైస్కూళ్ళ నిర్వహణకూ ఉద్యోగులకు జీతాలివ్వడానికీ చాలా యిబ్బందులు యేర్పడగా అప్పటి కళ్ళికోట*జమీందారయిన రాజా హరి హర మర్దరాజదేవ్‌కూ కాలేజీకి నేటివ్‌కాలేజీ అనే పేరు తీసివేసి కళ్ళికోట కాలేజీ అనే పేరుపెడితే ఉపాధ్యాయుల జీతాలకై ప్రతినెలా రు. 200/- విరాళంగా ఇవ్వగలనని కాలేజీ పరీక్షా ఫలితాలు సంతృప్తికరంగావుంటే శాశ్వతనిధిని, ఆదాయాన్ని యేర్పాటు చేయగలనని చెప్పడం, ఆతర్వాత పెద్ద ప్రజా బహిరంగ సభలో నేటివ్ కాలేజీని కళ్ళికోట కాలేజీగా పేరుమార్చాలని తీర్మానం చేయడం, తరువాత ప్రభుత్వ అనుమతితో కళాశాల పేరు మార్చడం- కళ్ళికోట రాజావారు తనమాటప్రకారం విరాళం ఇవ్వడం కూడా జరిగింది.మామూ లుగా నెలకు రు. 200/- ఇవ్వడమేకాక 15-2-1894న ఆరోజుల్లో సంవత్సరానికి రు. 5000/- నికరాదాయం వచ్చే భూమి వ్రాసి యివ్వడమే కాక 13-7-1896న రు. 3000/- విరాళంతోపాటు లక్షరూపాయల శాశ్వతనిధినికూడా విరాళంగాయిచ్చి కళ్ళికోట రాజా

* కళ్ళికోట— కళ్ళి అంటే ఒరియాలో 'విస్తరి' అని అర్థం. కళ్ళికోట జమీందారీలో వారి పూర్వులు విస్తర్లలో విపరీతంగా అన్నదానం చేసినందువల్ల విస్తర్లకోట అనే అర్థంలో "కళ్లికోట" అనే పేరు సార్థకంగా వచ్చివుండవచ్చును. బరంపురం పట్టణానికి సుమారు 40 కి.మీ. దూరంలో కళ్ళికోట మహారాజాగారేర్పరచిన 'రంభ' అనే వూరు వున్నది. జలపాత ఉష్ణ గుండాలతో సహజ సుందర మనోహరమైన ప్రకృతి శోభతో ఈ "రంభ" విరాజిల్లుతూ వుంటుంది. నేను బరంపురం వెళ్ళి నప్పుడు- "రంభ అనేపేరు యెందుకు పెట్టారనుకుంటున్నారు" అని కళ్ళికోట కుమారరాణి శ్రీమతి సుజ్ఞానకుమారిగారిని (డబుల్ ఎమ్. ఎ., ఒరిస్సా శాసనసభ మాజీ శాసన సభ్యురాలు) అడిగితే "ఊర్వశి, మేనక, రంభలు ఉన్నారు గదా! వారిలో 'రంభ' పేరు పెట్టివుంటారని మేము అనుకుంటాము" అని ఆమె అన్నారు. అపుడు "రంభ అంటే అరటిచెట్టు అనీ అరటి ఆకు అనీ అర్థా లున్నాయి. కళ్ళి అంటే విస్తరి అని అర్థం కదా! విస్తరికంటే సుందరమైనది, నవనవలాడేది, మృదువైనది అరటి ఆకు కదా! అందువల్ల 'రంభ' అని పేరుపెట్టి వుంటారు" అని నేనంటే శ్రీమతి సుజ్ఞానకుమారి చకితురాలై "చాలా బాగుంది. ఈ అర్థం వున్నదని యింతవరకూ మాకు ఏ కవిపండితులూ చెప్పలేదు." అని అన్నారు.



గారు కాలేజీని మరింతగా అభివృద్ధిచేశారు. అంతేకాదు భూరి విరాళంతో కళ్ళికోట మహారాజా ఎడ్యుకేషన్ ట్రస్ట్ అనేపేరుతో ఒక ట్రస్టును యేర్పాటుచేసి అనేక పాఠశాలలు, ఉన్నతపాఠశాలలు నెలకొల్పారు. భూరి విరాళం యిచ్చిన ఈ రాజాగారిని యావజ్జీవితం (1893 నుంచి 1909 వరకు) కాలేజీకమిటీకి గౌరవాధ్యక్షులుగా యెన్నుకొనడం జరిగింది. శ్రీ హరిహరమర్దరాజదేవ్ తెలుగువారైన వెలమలు. కళాశాల కమిటీ అధ్యక్షులుగా ఆరోజుల్లో జిల్లా కలెక్టర్‌గా యెవరువుంటే వారేవుండేవారు. ఈ పద్ధతి 25-4-1920 వరకూ నడిచింది. తరువాత శ్రీ హరిహర మర్దరాజదేవ్ కుమారుడైన శ్రీరామచంద్ర మర్దరాజదేవ్ కమిటీ అధ్యక్షులయ్యారు. ఈ కాలేజీ ప్రభుత్వ అధీనంనుంచి పౌరసంఘ అధీనంలోకి వచ్చినప్పటినుంచి ఉపాధ్యక్షులుగా ఎన్నికైనవారిలో అధికసంఖ్యాకులు తెలుగువారే. కళాశాల పాలకవర్గంలో కార్యవర్గసభ్యులుగాకూడా అనేకమంది తెలుగువా రుండేవారు. 9-1-1906నుంచి 27-7-1914 వరకూ **W.V.L.** వెంకట్రామయ్య **B.A.,B.L.** గారు కాలేజీ కమిటీకి ఉపాధ్యక్షులుగా వున్నారు. మన మాజీ భారత రాష్ట్రపతి శ్రీవరాహగిరి వెంకటగిరిగారి తండ్రి శ్రీ జోగయ్య పంతులుగారు 25 సంవత్సరాలు కాలేజీ కమిటీ కార్యవర్గసభ్యులుగాను, 13 సంవత్సరాలు (1914-1927)*కమిటీ ఉపాధ్యక్షులుగాను పనిచేశారు. జోగయ్యపంతులుగారు కళ్ళికోటకాలేజీవిద్యార్థి. ఈ కాలేజీలోనే కొంతకాలం ఉపాధ్యాయులుగా కూడా పనిచేశారు. అప్పుడు కార్యవర్గసభ్యులైన శ్రీ జోగయ్యపంతులు ఉపాధ్యక్షులైన శ్రీ వెంకట్రామయ్యగార్ల సహాయంతో శ్రీ నేమానివారు కళ్ళికోట కాలేజీలో తెలుగుపండితపదవి నలంకరించారు. మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి ఆంధ్రా యూనివర్సిటీకి, ఆంధ్రయూనివర్సిటీనుంచి ఉత్కళ యూనివర్సిటీకి అనుబంధిత్వాలు మారినా మద్రాసు-ఆంధ్ర-ఒరిస్సా రాష్ట్రాల అంతరాగ్యంగా వున్నా 1944 వరకూ కళ్ళికోట కాలేజీ సెకండ్ గ్రేడ్ కాలేజీగానే వుండిపోయింది. ప్రజలకోరికమీద అప్పటి ఒరిస్సా గవర్నరు ఉత్తర్వుతో 1944లోనే కళ్ళికోట కాలేజీ ఉత్కళ యూనివర్సిటీకి అనుబంధితంగా డిగ్రీకాలేజీగా రూపొందింది. అంటే కళ్ళికోట కాలేజీలో శ్రీనేమానివారు తెలుగుపండితులుగాను, సీనియర్ తెలుగుపండితులుగానుపనిచేసిన 23-3-1909, 30-7-1932 సంవత్సరాల మధ్యకాలంలో ఎఫ్. ఎ. మొదటి, రెండవ సంవత్సరాలుమాత్రమే వున్నాయన్నమాట. శ్రీనేమానివారు తెలుగు పండితులుగా పనిచేసిన 23 సంవత్సరాలలోను ఎఫ్. ఎ. క్లాసుల్లో వారి శిష్యులైన అనేకమంది వ్యక్తులు న్యాయవాదులుగా, మేజిస్ట్రేటులుగా, జిల్లాజడ్జీలుగా, ఉపాధ్యాయులుగా వివిధ రాష్ట్ర కేంద్రప్రభుత్వాలలో విభిన్న ఉద్యోగులుగా పనిచేసి రిటైరయిపోయి 80సంవత్సరాలు దాటిన వయోవృద్ధులు కూడా అనేకమంది వున్నారు. ఆ రోజులలో కేవలం ఎఫ్. ఎ. మాత్రమే వున్నందువల్ల ఉపాధ్యాయులకు పూర్తికాలం పని సరిపెట్టడంకోసం హైస్కూలులో ఉన్నత తరగతులకు పాఠాలు చెప్పే బాధ్యతకూడా అప్పగించేవారు. ఆ విధంగా

* శ్రీ జోగయ్య పంతులుగారు స్థానిక రాజకీయాలు కారణంగా 1927 నవంబరు 8వ తేదీన కాలేజీ కమిటీ ఉపాధ్యక్షపదవినుంచి విరమించుకోగా శ్రీ రామకృష్ణ రావుగారు ఉపాధ్యక్షులుగా ఎన్నికయ్యారు. శ్రీజోగయ్య పంతులుగారు ఉపాధ్యక్ష పదవినుంచి విరమించిన సందర్భాన్ని పురస్కరించుకొని కళ్ళికోటకాలేజీ కమిటీ సభ్యులతోను కాలేజీ ఉద్యోగులతోనుసహా కలిపి ఒక గ్రూపు ఫొటో తీయడం జరిగింది. అప్పుడు కళ్ళికోట కాలేజీలో ప్రధాన ఆంధ్రోపాధ్యాయులుగా వున్న శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి గారుకూడా యీగ్రూపుఫొటోలో వున్నారు. 1927కు పూర్వంనుంచి నేటివరకూ కళ్ళికోట మహారాజా ఎడ్యుకేషన్ ట్రస్ట్ ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తూ శ్రీ నేమాని వారిని బాగాయెరిగివున్న శ్రీ జగన్నాథపాత్రోగారు ఈ గ్రూపుఫొటోలో వున్న శ్రీ నేమానివారిని చూపించారు. 1927లో తీసిన ఈ గ్రూపుఫొటోను కళ్ళికోట కాలేజీ హైస్కూలు శతాబ్యుత్సవాల సందర్భంగా 1958లో ప్రకటించిన సంచికలో ముద్రించడం జరిగింది. శ్రీ నేమాని వారిని బాగా యెరుగున్న పెద్దలనేకమంది ఆ ఫొటో నేమాని వారిదేనని ధ్రువపరిచారు. అంతేకాదు. శ్రీ నేమానివారు బరంపురంలో 23 సంవత్సరాలపాటు అద్దెకున్న యింటి యజమాని - కళ్ళికోట కాలేజీలో F.A.లో శ్రీ నేమానివారి శిష్యుడూ అయిన శ్రీ పులుగుర్త కృష్ణమూర్తిగారు వారి సతీమణి శ్రీమతి కామేశ్వరమ్మగారు మాత్రమే కాక శ్రీ నేమానివారి పెదతల్లిగారి మనుమడైన శ్రీ గుమ్మలూరి సత్యనారాయణగారుకూడా యీ ఫొటోను గుర్తించి ధ్రువపరచడం జరిగింది. గ్రూపు ఫొటోనుంచి ఎన్‌లార్జ్‌మెంట్‌తో శ్రీ నేమానివారి ఫొటో సరిగా రానందువల్ల ఆ ఫొటోను చూచి ప్రముఖ చిత్రకారుడు శ్రీ శీలావీర్రాజు వేసిన రేఖాచిత్రాన్ని ఈ గ్రంథంలోనే ప్రత్యేకంగా ముద్రించడం జరిగింది.

శ్రీ నేమాని వారికి 4 వ ఫారం, 5 వ ఫారం, 6 వ ఫారం లేదా మెట్రిక్ లేదా ఎస్. ఎస్. ఎల్. సి. క్లాసుల్లో శిష్యులైనవారుకూ అనేకమంది వున్నారు. అప్పటి నేమాని వారి శిష్యులంతా యిప్పుడు షష్టిపూర్తి చేసుకున్నవారు, యెనభైయవపడి, తొంభైయవ దాటిన వారే!

బరంపురంలో శ్రీ నేమానివారికి స్వగృహమంటూ యేదీలేదు. గుండుమళ్ళవారి వీధిలోవున్న శ్రీ పులుగుర్త కృష్ణమూ గారి యింట్లో ఒక భాగంలో శ్రీ నేమానివారు కీర్తిశేషులయ్యే వరకూ అద్దెకు వున్నారు. శ్రీ కృష్ణమూర్తిగారు నేమానివారికి ఎఫ్.ఎ వరకూ శిష్యులు కూడా. కృష్ణమూర్తిగారి యిల్లు దక్షిణాభిముఖంగా రెండు ముఖద్వారాలతో రెండు భాగాలుగా వుంటుంది. పశ్చిమ భాగంలో శ్రీ నేమానివారు అద్దెకున్నారు. వచ్చే కేవలం నలభై రూపాయల జీతంతో అద్దె యింట్లోనే వుంటూ శ్రీ నేమానివారి కుటుంబ పోషణ చెయ్యడం కష్టంగానే వుండేది. పైగా పాశ్చాత్యదేశాలలోని విద్యాలయాలలోవలె కళ్లికోట కాలేజీలో కూడా వేసవి సెలవులలో ఉపాధ్యాయులకు జీతాలిచ్చేవారుకాదు. 1922 లో ఆర్థికమైన ఒడిదుడుకులకు తట్టుకోలేక శ్రీ నేమానివారు యిబ్బందిపడి నూరు రూపాయల అప్పుకై కాలేజీ కమిటీవారికి అప్లికేషన్ పెట్టగా 25-4-1922 న ఆ అప్పు మంజూరుచేయడం జరిగింది శ్రీ నేమానివారు, శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారు అనే మరొక తెలుగు పండితునితో కలిసి వేసవి సెలవుల్లో కూడా తమకు జీతాలు ఈయవలసిందిగా కోరుతూ27-3-1927న కళ్లికోటకాలేజీ కమిటీవారికి అప్లికేషను పెట్టగా కమిటీవారు ఆ అభ్యర్థనను త్రోసిపుచ్చారు. ఎవరో ఒక ఉపాధ్యాయుడు అతిబరువుగావున్న కాంపోజిషన్ పుస్తకాలకట్టను మోసుకువస్తుంటే ఒక కొంటె కోణంగి విద్యార్థి "మాష్టారూ! గాడిద బరువు మోస్తున్నారా?" అని అంటే "ఒక్క గాడిదబరువుకాదు. డెబ్భై గాడిదల బరువురా!" అని ఘటికుడైన ఆ ఉపాధ్యాయుడు సమాధానం చెప్పాడన్న జోకు సుప్రసిద్ధమైనదే. ఆ రోజుల్లో శ్రీ నేమానివారికి కూడా కట్టలుకొద్దీవున్న కాంపోజిషన్ పుస్తకాలు దిద్దడం తన విధికి మించినశ్రమగా తలకుమించినశ్రమగా వుండేది. "మాకు మామూలుగా వున్న పాఠాలు చెప్పే కార్యక్రమానికితోడు ఈ కాంపోజిషన్ పుస్తకాలు దిద్దేపని చాలా అధికంగావుంది. మామూలు పనివేళలకంటే కూడా ఎక్కువ కాలం కాంపోజిషన్లు దిద్దడానికి వినియోగించవలసివస్తున్నది. కాబట్టి మాకు అధికంగా ప్రత్యేక జీతం (స్పెషల్ ఎలవెన్స్) ఇప్పవలసిం"దని కోరుతూ శ్రీ ఎమ్. వి. శాస్త్రి అనే మరొక అధ్యాపకునితో కలిసి శ్రీ నేమానివారు 17-9-1926 న కాలేజీ కమిటీ వారికి అప్లికేషన్‌పెట్టగా వారి అభ్యర్థనలో న్యాయంవున్నదని భావించి కొద్దిగా అలవెన్సును మంజూరు చేయడం జరిగింది. శ్రీనేమాని వారు యిటువంటి ఆర్థిక దుస్థితిలోకూడా తన పరిశోధనల నిమిత్తం ఆంధ్ర ఋగ్వేద రచనా నిమిత్తమై కాశీ, బొంబాయిలనుంచి అనేక పుస్తకాలు కొని తెప్పించుకొనేవారు. శ్రీ నేమానివారి భార్య అయిన శ్రీమతి మహాలక్ష్మిగారు ఆంధ్ర ఋగ్వేద రచనకోసం కాలం వృథా చెయ్యవద్దనీ అసలే ఆర్థికమైన యిబ్బందులలోవుండగా ఈ పుస్తకాలన్నీ కొని తెప్పించడం దండుగమారి పని అనీ ఈ రచనా వ్యాసంగం మానివేసి శుభ్రంగా ప్రైవేటులు చెప్పుకుంటే కుటుంబపోషణ సుఖంగా జరగడానికి మరికొంత ఆదాయం వస్తుందనీ రోజూ పోరు పెట్టేవారని శ్రీ నేమానివారి పెదతల్లిగారైన శ్రీమతి విశాలమ్మగారికి మనుమలైన శ్రీ గుమ్మలూరి సత్యనారాయణగారివల్ల తెలిసింది. శ్రీ నేమానివారు కాలేజీలో ఎఫ్. ఎ. తరగతిలో 28-6-1932 వ తేదీ బుధవారంనాడు పాఠం చెపుతూ ఉండగా హఠాత్తుగా మెదడులో నరాలు తెగిపోయి పక్షవాతపుమాయ మూర్ఛవచ్చి పడిపోయి స్పృహకోల్పోగా బరంపురం పెద్ద హాస్పటల్లో చేర్చగా ఆ మర్నాటివరకూ అపస్మారకమైన అచేతన స్థితిలోనేవుండి 30-6-1932 గురువారంనాడు కీర్తిశేషులయ్యారు. శ్రీ నేమానివారు కీర్తిశేషులయిన వార్త అప్పటి ఏకైక తెలుగు దినపత్రిక ఆంధ్రపత్రిక 6-7-1932 తేదీపత్రికలో బరంపురం లేఖ అన్న శీర్షికతో ఈ క్రింది విధంగా ప్రకటించబడింది.

## బరంపురం లేఖ

—"సుప్రసిద్ధ సంస్కృత విద్వాంసులును బరంపురంలోని కళ్లికోట కళాశాలలో ప్రధాన ఆంధ్ర ఉపాధ్యాయులును అనేక గ్రంథముల రచించిన వారునగు బ్రహ్మశ్రీ కావ్యతీర్థ నేమాని వేంకటనరసింహశాస్త్రిగారు అకాలముగ ఆకస్మికముగ గత బుధవారమునాడు కాలేజీలో నుండగా పక్షవాతపు మాయమూర్ఛవచ్చి వెంటనే స్పృహపోయి పెద్ద ఆసుపత్రిలో వేయబడి ఆ అచేతన స్థితిలోనే సుమారొకరోజంతయునుండి మరణించిరి. వీరి శవోత్సవం గురువారము అనేకమందిచే సగౌరవముగా జరిగెను.

మరునాడు శుక్రవారం 4 గంటలకు కాలేజీలో ప్రిన్సిపాలు ఉపాధ్యాయులందరును చేరి కీ. శే. కావ్యతీర్థుని పాండిత్యమును గుణగణములను కొనియాడి కీర్తించి ఒక సానుభూతి తీర్మానమునుచేసి, దుఃఖముతోనున్న యతని భార్య కంపిరి.

కావ్యతీర్థుని రచనలో ఋగ్వేద ఆంధ్రీకరణము శాశ్వతముగానుండి, కీర్తి సంపాదింప దగినది." —*

6-7-1932 ఆంధ్రపత్రిక దినపత్రిలో ప్రకటించిన యీ వార్తవల్ల 30-6-1932 న నేమానివారు కీర్తిశేషులవ్వగా ఆ మర్నాడు అంటే 1-7-1932 న శుక్రవారంనాడు సాయంత్రం 4 గం. లకు కళ్లికోట కాలేజీ ప్రిన్సిపాలు అధ్యక్షతన విద్యార్థులు ఉపాధ్యాయులు సమావేశమై శ్రీ నేమానివారి అకాల మరణానికి సంతాప తీర్మానంచేసి వారి భార్య శ్రీమతిమహాలక్ష్మిగారికి పంపినట్లు స్పష్టపడింది. తరువాత 14-7-1932న కళ్లికోట కాలేజీ కమిటీ వారు కేవలం శ్రీ నేమానివారి మరణాన్ని దృష్టిలో పెట్టుకుని కండోలెన్సు మీటింగు యేర్పాటుచేసి అప్పటికమిటీ ఉపాధ్యక్షులైన రామకృష్ణరాథోగారి అధ్యక్షతను సమావేశమై శ్రీ నేమానివారి మృతికి సంతాప తీర్మానం చేసినట్లు బరంపురంలోని అనంత భవన్‌లోవున్న కళ్లికోట మహారాజా ఎడ్యుకేషన్ ట్రస్ట్ ఆఫీసులోని కళ్లికోట కళాశాల రికార్డ్సులో ఈ క్రింది విధంగా రికార్డు చేయబడింది.

**Resolution No. 14.**

**Proceedings of the Khallikota College Managing Committe, Berhampur, Dated 14-7-32.**

**"The Committee records its sense of sorrow on the sudden demise of the Senior Telugu Pandit Mr. N. V. N. Sastry and its appreciation of his long and Conscientious service to the College."**

**(Sd) R. K. RATHO**
**(Ramakrishna Ratho)**
**Vice President**
**14-7-1932.**

శ్రీ నేమానివారి మరణానంతరం వారి భార్య చిట్టెమ్మ అనబడే శ్రీమతి మహాలక్ష్మిగారికి నేమానివారి ప్రావిడెంటు ఫండు క్రింద మొత్తం రు. 607-9 అణాలు నాలుగు దఫాలుగా యివ్వడం జరిగింది.

* నేను శ్రీ నేమానివారి జీవిత విశేషాలు సేకరిస్తూ ఆంధ్ర పత్రిక అధినేత, సంపాదకులు అయిన శ్రీశివలెంక రాధాకృష్ణ గారిని కలిసి ఆంధ్ర ఋగ్వేద విషయం చెప్పి "శ్రీ నేమానివారు 1932 జూన్‌లో కీర్తిశేషులయ్యారు. ఈ సందర్భంగా అప్పటి ఆంధ్రపత్రిక దినపత్రికలో ఏమైనా వార్త ప్రకటించబడిందేమో వెతికించ వలసింది"గా కోరడం జరిగింది. "ఆ వార్త లభిస్తే శ్రీనేమానివారు ఏరోజున చనిపోయారో తెలుస్తుంది. ఒకవేళ లభిస్తే చనిపోయే నాటికి వారి వయస్సు కాని పుట్టిన తేదీకాని లభించ వచ్చుకూడా"అని శ్రీ రాధాకృష్ణగారికి నేను చెప్పాను. శ్రీ రాధాకృష్ణగారు విజయవాడ, మద్రాసు, హైదరాబాదుల్లో వున్న ఆంధ్ర పత్రికలు వెతికించి లభ్యంకాకపోగా-1932 వ సంవత్సరం దినపత్రికలు న్యూఢిల్లీలో మైక్రోఫిల్ముకోసం పంపబడ్డాయని గ్రహించి 1932 జూన్, జులై దినపత్రికలలో శ్రీ నేమాని వారి మరణవార్త ప్రకటితమైనదేమో అన్వేషించవలసిందిగా కోరి ఆ బాధ్యతను శ్రీ భావరాజు కామేష్‌గారికి అప్పగించారు. శ్రీ కామేష్‌గారు అక్కడి దినపత్రికలు వెతికి 6-7-1932 ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రకటితమైన శ్రీ నేమానివారి మరణవార్తతోవున్న బరంపురం లేఖను శ్రీ రాధాకృష్ణగారికి పంపడం జరిగింది. శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితగురించి శ్రీ మహీధర జగన్మోహనరావుగారు 1972 లో రాజమండ్రిలో ప్రకటించిన కరపత్రంలోని విషయాలను బరంపురం లేఖతోసహా మరికొన్ని విషయాలను కలిపి "ఆంధ్ర ఋగ్వేద సంహితాకర్త నేమాని వేంకట నరసింహశాస్త్రి" అనే శీర్షికతో ఒక చిన్న వ్యాసాన్ని ఆంధ్రపత్రిక (దినపత్రిక) 16-5-1981 శనివారంనాటి విజయవాడ ఎడిషన్‌లోను, 20-5-1981 బుధవారంనాటి హైదరాబాదు ఎడిషన్‌లోను ప్రకటించడం జరిగింది. చాలా శ్రమ తీసుకుని శ్రీ నేమానివారి మరణవార్తను వెతికించి సేకరించిన ఆంధ్రపత్రిక అధినేతలు సంపాదకులు అయిన శ్రీ రాధాకృష్ణగారికి నా కృతజ్ఞతలు.

# నేమానివారి రచనలు-ఆంధ్ర ఋగ్వేదసంహిత

శ్రీ నేమానివారు సంస్కృత-ఆంధ్ర-ఆంగ్ల-హిందీ-ఒరియా భాషల్లో మంచి దొక్కశుద్ధిగల పాండిత్యంకలవారని మొదటే తెలియజేశాను. 'సావిత్రి' అనే సంభాషణా పూర్వకమైన తెలుగుగ్రంథాన్ని నేమానివారు రచించగా అది ముద్రితమైనది. 'వనమాలి' అనే ఒరియా నవలనుకూడా నేమాని వారు తెలుగులోకి అనువదించి ప్రకటించారు. ఈ రెండు పుస్తకాలూ తాము చూచామని నేమాని వారి పెదతల్లి మనుమలైన శ్రీ గుమ్మలూరు సత్యనారాయణగారు నాకు తెలియజేశారు. 'వనమాలి' తొలిపలుకులో "నవలా రచనా ప్రక్రియ" విదేశీయం కాదనీ స్వదేశీయమేననీ నేమానివారు తమ అభిప్రాయాన్ని తెలియజేసినట్లుకూడా గుమ్మలూరు వారు చెప్పారు. సంస్కృతంలో అవతరించిన 'కాదంబరి' నవలతో సరితూగగల రచన ప్రపంచ సాహిత్యంలోనే యింతవరకూ మరొకటి అవతరించలేదు. అందువల్ల నవలారచనా ప్రక్రియ భారతీయమే దేశీయమేనన్న నేమానివారి అభిప్రాయం నిర్ద్వంద్వంగా సమర్థనీయం. ప్రసిద్ధ సాహిత్య పత్రిక 'భారతి' 1924 ఏప్రియల్ సంచికలో 'ధర్మతత్వము' అనే శీర్షికతో విమర్శనాత్మకంగానూ పరిశోధనాత్మకంగానూ శ్రీ నేమానివారు రచించిన వ్యాసం ప్రకటించబడింది.

నేమానివారు దాదాపు అయిదు సంవత్సరాలు అహోరాత్రాలు శ్రమించి తమకు శాశ్వత కీర్తిని ప్రతిష్ఠాపించగల పద్య గద్యాత్మకమైన ఆంధ్ర ఋగ్వేద సంహితను మధ్య మధ్యలో కొన్నికొన్ని ఋక్కులను సూక్తాలను అనువదించకుండా విడిచిపెట్టినా-దశమమండలంలో 136 వ సూక్తంవరకు (అష్టమాష్టకం-సప్తమాధ్యాయం - 136 వ సూక్తం) అనువాదంచేసి-మిగిలిన సప్తమాధ్యాయ భాగం-అష్టమాధ్యాయమూ అనువదించకుండానే హఠాత్తుగా కీర్తిశేషులయ్యారు. ఈ ఋగ్వేదాంధ్రానువాదాన్ని నేమానివారు 1926 లో ప్రారంభించినట్లు కనిపిస్తున్నది. నేమానివారు తెల్లవారుజాముననే లేచి రచనచేసేవారు - రాత్రిబాగా ప్రొద్దుపోయేదాకా కూడా వ్రాసేవారు - తాము అద్దెకున్న యింట్లో సాధారణంగా ముఖద్వారం ప్రక్కగావున్న కిటికీదగ్గర తూర్పుగా తిరిగికూర్చుని ఆంధ్ర ఋగ్వేద రచన చేసేవారు.

1927 జూన్ నెలలో ముఖలింగంలో కళింగ వర్ధంతి జరిగింది. ఈవర్ధంతిలో పాల్గొనడానికి అప్పటికి విరచితమైవున్న ఆంధ్ర ఋగ్వేద భాగంతోసహా ముఖలింగం వచ్చి నేమానివారుఒక బంధువులయింట్లోవుండగా అదే సభలలో పాల్గొనడానికివచ్చిన కవిసమ్రాట్ శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు నేమానివారిని దర్శించి ద్వితీయాష్టకంలోని కొన్నిపద్యాలను తీసుకొనివాటిని తమ 'జయంతి' పత్రికలో (సంపుటము-1.సంచిక-2.)ప్రకటించారని తెలియవచ్చింది.ఈ కళింగవర్ధంతిలో పాల్గొన్న శ్రీపందిరి మల్లికార్జునరావుగారు కూడా నేమానివారిని దర్శించిఆంధ్ర ఋగ్వేదంలోని మొట్టమొదటి అయిదు పద్యాలు తీసుకుని ఆ రోజుల్లో వారి సంపాదకత్వం క్రింద రాజమండ్రి నుంచి వెలువడుతున్న"సుభాషి"మాసపత్రికలో(1927 నవంబరు)'ఋగ్వేద సంహిత'అన్న శీర్షికతోప్రకటించారు.ఇంతకుమించి నేమానివారుసజీవులైవుండగా ఆంధ్ర ఋగ్వేదంలోని పద్యాలేవీ ప్రచురితం కాలేదు.1932జూన్ 30వతేదీన నేమానివారు హఠాత్తుగా కీర్తిశేషులయిన తరువాత ఈఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతి సంపుటాలను తనకీయవలసిందని నేమానివారి పెదతల్లి మనుమలైన శ్రీగుమ్మలూరు సత్యనారాయణగారు నేమానివారి భార్య మహాలక్ష్మిగారిని అడుగగా ఆమె అందుకు నిరాకరించారట. ఈ విషయాన్ని శ్రీ సత్యనారాయణగారే నాకు స్వయంగా చెప్పారు. నేమానివారి మరణానంతరం సత్యనారాయణగారి బావగారైన శ్రీ మండపాక పార్వతీశ్వర శాస్త్రి,**B. A. L. T.**, గారి కృషివల్ల ఈ ఆంధ్ర ఋగ్వేదసంహిత వ్రాతప్రతులు రాజమండ్రిలోని గౌతమీగ్రంథాలయానికి శ్రీమతి మహాలక్ష్మిగారు బహూకరించడం జరిగింది. 1970 లో గౌతమీ గ్రంథాలయానికి గౌరవకార్యదర్శిగా నియమితులయిన శ్రీ మహీధర జగన్మోహనరావుగారు నేమానివారి బృహద్రచన యీ శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత ప్రథమ మండలంలోని 1వ సూక్తం మొదలు 9వ సూక్తంలోని 5 వ పద్యంవరకు వున్న పద్యాలను ఋక్సంఖ్యలు లేకుండా 8 పేజీలుగా ఒక కరపత్రమూ, ప్రథమాష్టకం అష్టమాధ్యాయంలో వున్న 113 వ సూక్తం మొదలు 115 వ సూక్తంలోని 4 వ ఋగనువాదమైన సీసపద్యంలోని సీసం నాలుగు పాదాల వరకు మాత్రమే 8 పేజీలతో మరొక కరపత్రమూ 1972 లో అచ్చువేయించి రెండవ కరపత్ర ప్రారంభంలో ఈ గ్రంథ ప్రచురణకై ఆర్థిక సహాయం చేయవలసిందని విజ్ఞప్తి చేస్తూ యీ బృహద్రచనగురించి నాలుగు మాటలు వ్రాశారు. శ్రీ జగన్మోహనరావు గారు వ్రాసిన మాటలను యథాతథంగా యిక్కడ ఉదాహరిస్తున్నాను.

—" కీ. శే. నే. నరసింహశాస్త్రిగారు బరంపురంలోని కళ్లికోటరాజా కళాశాల సంస్కృతాధ్యాపకులుగానుండి యీ గ్రంథము 1929లో పూర్తిగావించిరి. వారి అకాల మరణానంతరము యీ వ్రాతప్రతి శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి కృషి వలన రాజమండ్రి, శ్రీ గౌతమీ గ్రంథాలయమున భద్రపరచబడినది. ఇదియొక అపూర్వ గ్రంథరాజము. ఇది అచ్చుకాకుండుట ఆంధ్రుల దౌర్భాగ్యము. దీనిలో 10,066* పద్యములు, 150 పుటలు పీఠిక, 150 పుటలు పదానుక్రమణిక, 150 పుటలు విషయ వివరణము గలవు. రాయల్ సైజున 1500 పుటలగును. 40 ఏండ్లుగా యీ అమూల్య వ్రాతప్రతి సురక్షితముగ నుండుట మన అదృష్టమే. దీనిని అచ్చువేయించుటకై భారత ప్రభుత్వము, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, సాహిత్య అకాడమీ, వదాన్యులు సహాయమొనర్ప గోరుచున్నాము. ఇట్లు మహీధర జగన్మోహనరావు,గౌరవ కార్యదర్శి, గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి"

శ్రీ జగన్మోహనరావుగారు ప్రకటించిన కరపత్రంలోని పై విషయాలలో కళ్ళికోట కాలేజీలో తెలుగు పండితులుగా పనిచేసిన నేమానివారిగురించి సంస్కృతాధ్యాపకులుగా వ్రాయడంతోపాటు మరికొన్ని పొరపాట్లున్నాయి ఈపొరపాట్లగురించి వివరించేముందు అసలు ఆంధ్ర ఋగ్వేద సంహితవ్రాతప్రతి సంపుటాలగురించి తెలుసుకొనడం అవసరం-

## వ్రాతప్రతుల సంపుటాలు

ఆంధ్ర ఋగ్వేదరచనాసందర్భంగా అజ్ఞాత వ్యక్తులు నలుగురూ శ్రీ పి. వి. రమణమూర్తి అనే కవి పండితులొకరూ (ఒకచోట పి.రమణమూర్తి అని మాత్రమే వున్నది.)కొన్నికొన్ని భాగాలకు లేఖకులుగా పనిచేశారు. ఆంధ్రఋగ్వేదసంహిత అత్యధిక భాగం నేమానివారి స్వహస్తంతో వ్రాయబడిందే.ఈ ఆంధ్ర ఋగ్వేద సంహిత మొత్తం 16 వ్రాతప్రతులలో వున్నది. ఈ 16 వ్రాత ప్రతులలోను12సంపుటాలుఅంటే1,2,3,4,5,6,9,10,11,12,13,14సంపుటాలు 12"×8" సైజులోను మిగిలిన 7,8,15a,15bసంఖ్యలు గల నాలుగు సంపుటాలు 8"×8" సైజులోను వున్నాయి. ఈ వివిధ సంపుటాలలో ఒక్కొక్క సంపుటంలోనూ వున్న పేజీల సంఖ్య, అష్టకాలు, మండలాలు, అధ్యాయాలు, అధ్యాయాల రచనముగిసిన ప్రదేశాలు,తేదీల వివరాలూ సంపుటాల సంఖ్యలతోసహా యీ క్రింద పట్టికలో యివ్వడం జరుగుతున్నది—

| సంపుటం- సంఖ్య | మొత్తం - పేజీలు | అష్టకం - | మండలం- | అధ్యాయం - | అధ్యాయం ముగిసిన పేజీ - | అధ్యాయం ముగిసిన తేదీ - | స్థలం |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 368 | 1 | 1 | 1 | 97 | - | - |
| ,, | ,, | 1 | 1 | 2 | 145 | - | - |
| ,, | ,, | 1 | 1 | 3 | 187 | - | - |
| ,, | ,, | 1 | 1 | 4 | 227 | - | - |
| ,, | ,, | 1 | 1 | 5 | 271 | - | - |
| ,, | ,, | 1 | 1 | 6 | 313 | - | - |
| ,, | ,, | 1 | 1 | 7 | 365 | - | - |
| ,, | ,, | 1 | 1 | 8 | 41 | - | - |
| 2 | 368 | 2 | 1 | 1 | 53 | 25-10-1930@ | - |
| ,, | ,, | 2 | 1 | 2 | 105 | - | - |
| ,, | ,, | 2 | 1 | 3 | 155 | 24-10-1930@ | - |
| ,, | ,, | 2 | 1 | 4 | 205 | - | - |

* 1981-5-16, 20 తేదీలలో ఆంధ్రపత్రిక దినపత్రికలో ప్రకటితమైన "ఆంధ్ర ఋగ్వేద సంహితాకర్త నేమాని వేంకట నరసింహశాస్త్రి" అన్న వ్యాసంలో —"దీనిలో 10,666 పద్యాలున్నట్లు" అని ప్రకటించారు. శ్రీ జగన్మోహనరావుగారు ప్రకటించిన కరపత్రంలో 10,066 అనే వుండగా పొరపాటున 666గా పడినట్లు ఆంధ్రపత్రిక సంపాదకులు శ్రీ శివలెంక రాధాకృష్ణగారు నాతో చెప్పారు.

@ ఇది నేమానివారు తమ రచనాభాగాన్ని పునః పరిశీలించి సవరణలు చేసి మెరుగులు దిద్దడం పూర్తిచేసిన తేదీ.

| సంపుటం సంఖ్య | మొత్తం పేజీలు | అష్టకం సంఖ్య | మండలం సంఖ్య | అధ్యాయం సంఖ్య | అధ్యాయం ముగిసిన పేజీ | అధ్యాయం ముగిసిన తేదీ | ముగిసిన స్థలం |
|---|---|---|---|---|---|---|---|
| 2 | 368 | 2 | 2 | 5 | 255 | - | - |
| ,, | ,, | 2 | 2 | 6 | 309 | - | - |
| ,, | ,, | 2 | 2 | 7 | 357 | - | - |
| 3 | 178 | 2 | 3 | 8 | 43 | - | - |
| ,, | ,, | 3 | 3 | 1 | 95 | 21-11-1927 | - |
| ,, | ,, | 3 | 3 | 2 | 139 | 18- 7-1927 | బరంపురం |
| 4 | 274 | 3 | 3 | 3 | 13 | 6- 8-1927<br>16-10-1930@ | ,, |
| ,, | ,, | 3 | 4 | 4 | 57 | 20- 8-1927 | ,, |
| ,, | ,, | 3 | 4 | 5 | 101 | ⁑4- 8-1927@ | ,, |
| ,, | ,, | 3 | 4 | 6 | 147 | 15- 9-1927 | ,, |
| ,, | ,, | 3 | 4 | 7 | 191 | 27- 9-1927<br>12-10-1930@ | ,, |
| ,, | ,, | 3 | 5 | 8 | 237 | 8-10-1927 | ,, |
| 5 | 272 | 4 | 5 | 1 | 23 | 4-11-1927 | ,, |
| ,, | ,, | 4 | 5 | 2 | 79 | 8-12-1927 | ,, |
| ,, | ,, | 4 | 5 | 3 | 133 | 19- 1-1928 | ,, |
| ,, | ,, | 4 | 6 | 4 | 191 | 5- 2-1928 | ,, |
| ,, | ,, | 4 | 6 | 5 | 247 | 19- 2-1928 | ,, |
| 6 | *78 | 4 | 6 | 6 | 16 | 17- 3-1928 | ,, |
| ,, | ,, | 4 | 6 | 7 | 56 | 14- 6-1928 | చీకటి |
| ,, | ,, | 4 | 6 | 8 | 78 | - | - |
| 7 | *164□ | 5 | 7 | 1 | 42 | 28- 3-1928 | బరంపురం |
| ,, | ,, | 5 | 7 | 2 | 84 | 15- 4-1928 | ,, |
| ,, | ,, | 5 | 7 | 3 | 128 | 18- 4-1928 | ,, |
| ,, | ,, | 5 | 7 | 4 | 163 | 24- 5-1928 | చీకటి |
| 8 | *147∞ (164-311) | 5 | 7 | 5 | 202 | 25- 5-1928 | - |

@ ఇది నేమానివారు తమ రచనాభాగాన్ని పునః పరిశీలించి సవరణలు చేసి మెరుగులు దిద్దడం పూర్తి చేసిన తేదీ.

⁑ చూ. 58 వ పేజీలోని 15b ఫుట్‌నోటు.

* 6, 7, 8, 10, 12, 15a సంపుటాలలో పేజీల క్రమసంఖ్య కాగితాలకు ఒకప్రక్కనే వెయ్యడం జరిగింది. మిగిలిన 1, 2, 3, 4, 5, 9. 11, 13, 14, 15b సంపుటాలలో పేజీల క్రమసంఖ్యను కాగితాలకు రెండువైపులా వెయ్యడం జరిగింది.

□ ఈ 7 వ సంపుటంలో 150 వ పేజీ తరువాత 151 వెయ్యకుండా ఒక పేజీ పొరపాటున విడిచిపెట్టి తరువాతి పేజీలో 151 సంఖ్య వెయ్యడం జరిగింది. అందువల్ల యీ సంపుటంలో నేమానివారు వేసిన సంఖ్య ప్రకారం పేజీల సంఖ్య 163 తో ముగియగా ఒక పేజీని అధికంగా కలిపి 164 పేజీలున్నట్లు పేర్కొనడం జరిగింది.

∞ ఈ 8 వ సంపుటంలో 290 వ పేజీ తరువాత 291 వెయ్యకుండా ఒక పేజీ పొరపాటున విడిచిపెట్టి తరువాతి పేజీలో 291 సంఖ్య వెయ్యడం జరిగింది. అందువల్ల 164 వ పేజీతో ప్రారంభమై 310 వ పేజీతో ముగియగా 311 వ పేజీతో ముగిసినట్లు భావించడం జరిగింది. నేమానివారి సంఖ్యల ప్రకారం యీ సంపుటంలో 146 పేజీలున్నట్లుకాగా ఒక పేజీ అధికంగా కలిపి 147 పేజీలున్నట్లుగా పేర్కొనబడింది.

| సంపుటం సంఖ్య | మొత్తం పేజీలు | అష్టకం సంఖ్య | మండలం సంఖ్య | అధ్యాయం సంఖ్య | అధ్యాయం ముగిసిన పేజీ | అధ్యాయం ముగిసిన తేదీ | ముగిసిన స్థలం |
|---|---|---|---|---|---|---|---|
| 8 | 147 (164-311) | 5 | 7 | 6 | 241 | - | - |
| ,, | ,, | 5 | 8 | 7 | 281 | 30- 5-1928 | చీకటికోట |
| 9 | 328 | 6 | 8 | 1 | 61 | 18-10-1928 | బరంపురం |
| ,, | ,, | 6 | 8 | 2 | 115 | 19-10-1928 | ,, |
| ,, | ,, | 6 | 8 | 3 | 175 | 23-10-1928 | ,, |
| ,, | ,, | 6 | 8 | 4 | 253 | 29-10-1928 | ,, |
| ,, | ,, | 6 | 8 | 5 | 303 | 2-11-1928 | ,, |
| 10 | *128 | 6 | 8 | 6 | 13 | 7-11-1928 | ,, |
| ,, | ,, | 6 | 9 | 7 | 38 | 11-11-1928 | ,, |
| ,, | ,, | 6 | 9 | 8 | 64 | 17-11-1928 | ,, |
| ,, | ,, | 7 | 9 | 1 | 91 | 27-11-1928 | ,, |
| ,, | ,, | 7 | 9 | 2 | 120 | 21-12-1928 | ,, |
| 11 | 254 | 7 | 9 | 3 | 27 | 12- 1-1929 | ,, |
| ,, | ,, | 7 | 9 | 4 | 89 | 29- 1-1929 | బ్రహ్మపురము |
| ,, | ,, | 7 | 10 | 5 | 161 | 14- 2-1929 | ,, |
| ,, | ,, | 7 | 10 | 6 | 229 | 4- 3-1929 | బరంపురం |
| 12 | *67 | 7 | 10 | 7 | 23 | 22- 4-1929 | ,, |
| 13 | 272 | 8 | 10 | 1 | 77 | 6- 6-1929 | సాలూరు |
| ,, | ,, | 8 | 10 | 2 | 145 | 2- 7-1929 | బరంపురం |
| ,, | ,, | 8 | 10 | 3 | 209 | 13- 7-1929 | ,, |
| 14 | 364 | 8 | 10 | 4 | 11 | 29- 7-1929 | ,, |
| ,, | ,, | 8 | 10 | 5 | 67 | 9- 8-1929 | ,, |
| ,, | ,, | 8 | 10 | 6 | 127 | 18- 8-1929 | ,, |
| ψ15 b | 60 | 3 | 4 | 5 | 59 | 1- 8-1927ψ | ,, |
| ,, | 132 | — | ఋషిదేవతల పట్టికలు | | — | 10- 8-1930 | ,, |
| | | | | | | 11- 8-1930 | |
| 15 a | 90 | | ఋగ్వేద సంహిత - ఆర్యుల ప్రతిభ | | | — | ,, |

* 6, 7, 8, 10, 12, 15a సంపుటాలలో పేజీల క్రమసంఖ్య కాగితాలకు ఒకప్రక్కనే వెయ్యడం జరిగింది. మిగిలిన 1,2,3, 4,5,9,11,13,14,15b సంపుటాలలో పేజీల క్రమసంఖ్యను కాగితాలకు రెండువైపులా వెయ్యడం జరిగింది.

ψ 3వ అష్టకంలోని (4వ మండలం) 5వ అధ్యాయం 15b సంపుటంలో మొదట చిత్తుగా వ్రాయబడి (5వసూక్తం మొదలు 17వ సూక్తంలో 14వఋక్కు వరకు) తిరిగి నాలుగవ సంపుటంలో శుద్ధంగా వ్రాయబడింది. 15b సంపుటంలోని ఈ 5వ అధ్యాయప్రారంభంలో 21-8-1927 3P M. అనీ ఈ ఎక్సర్‌సైజు ముగింపుపేజీలో 59)1-8-1927 10P.M. అని నేమానివారే స్వయంగా వ్రాశారు. 21-8-1927 అని గ్రంథం ప్రారంభంలో వేసిన నేమానివారు గ్రంథం చివరిపేజీలో 1-8-1927 అని పొరపాటుగా వేసివుంటారు. ఇదే సంపుటంలో 9వపేజీలో 24-8-1927, 15, 21 పేజీలలో 26-8-1927, 29వ పేజీలో 27-8-1927- 9½ P.M. అని, 37వ పేజీలో 28-8-1927, 43వ పేజీలో 29-8-1927, 49వ పేజీలో 30-8-1927అని తేదీలను నేమానివారు స్వయంగానే వ్రాశారు. 1వపేజీ మొదలు 49 పేజీవరకు 21, 24, 26, 27, 28, 29, 30 తేదీలను క్రమంగా వేసిన నేమానివారు 59వ పేజీలో

15b సంపుటంలోవున్న తొట్టతొలి రెండు కాగితాలూ ఋషిదేవతల పట్టికలూ తప్ప మిగిలిన సంపుటాలన్నింటిలోను సాధారణంగా కాగితానికి ఒక ప్రక్కనే వ్రాయడం జరిగింది. కొన్నికొన్ని సందర్భాలలో ఫుట్‌నోటులు ఎడమప్రక్క పేజీలో వ్రాయడం జరిగింది. మరికొన్నిచోట్ల అక్కడక్కడా కుడి ప్రక్క పేజీలో వ్రాసినవి చిత్తుగా తప్పులతో వున్నప్పుడు వాటిని కొట్టివేసి ఎడమప్రక్కనున్న పేజీలో శుద్ధంగా వ్రాయడం కూడా జరిగింది. మొత్తం 16 సంపుటాలలోను ప్రతి సంపుటంలోనూవున్న ఖాళీగా విడిచిన పేజీలతో సహా మొత్తం పేజీల సంఖ్యలూ-వేయబడిన పేజీల సంఖ్యలూ ఈ క్రింద చూపబడుతున్నాయి. వ్రాయబడిన పేజీలలో ప్రతి కాగితానికీ ఒకవైపునే వ్రాయడం జరిగింది. కాబట్టి వ్రాయబడిన పేజీలు సగానికి తగ్గించుకుని పరిగణించుకోవాల్సి వుంటుంది. ఇంతకుముందు పేర్కొన్నట్లు ఫుట్‌నోట్లు సకృత్తుగా సాపుగా వ్రాయబడిన పద్యాలు ఉన్న యెడమప్రక్క పేజీలు ఇందులో పరిగణనకు రాలేదు.

| సంపుటం - సంఖ్య | మొత్తం - పేజీలు | వ్రాయబడిన-వ్రాసిన పేజీలు - నుంచి-వరకు | పేజీల మొత్తం సంఖ్య | సంపుటం - సంఖ్య | మొత్తం - పేజీలు | వ్రాయబడిన-వ్రాసిన పేజీలు - నుంచి-వరకు | పేజీల మొత్తం సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 368 | 3- 41* | 353 | 11 | 254 | 5-253 | 249 |
| | | 51-365 | | 12 | 134 | 1- 67 | 67 |
| 2 | 368 | 3-365 | 363 | 13 | 272 | 5-271 | 267 |
| 3 | 178 | 7-175 | 169 | 14 | 364 | 5-183 | 179 |
| 4 | 274 | 5-271 | 267 | 15a | 90 | 1- 45 | 45 |
| 5 | 272 | 5-271 | 267 | 15b-1△ | 60 | 1- 60 | @32 |
| 6 | 156 | 1- 78 | 78 | 15b-2△ | 52 | ::2- 9 | 8 |
| 7 | 328 | 1-163 | 163 | | | 43- 50 | 8 |
| 8 | 294 | 164-310 | 147 | 15b-3△ | 40 | 1- 2 | 2 |
| 9 | 328 | 9-327 | 319 | | | 11- 30 | 20 |
| 10 | 256 | 4- 64 | 61 | | | 39- 40 | 2 |
| | | 68-128 | 61 | 15b-4△ | 40 | 1- 28∵ | 28 |

మొత్తం 16 సంపుటాలలోను 4,128పేజీలుండాగా 3,156 పేజీలు వ్రాయబడివున్నాయి. ఇంతేకాదు. వివిధ సంపుటాలలో శుద్ధంగా వ్రాయబడిన పద్యగద్యాలతోఉన్న యెడమప్రక్క పుటలు 96 ఉన్నాయి. అనేకసంపుటాలలో వివిధ సందర్భాలలో వ్రాయబడిన ఫుట్‌నోట్లతో కూడిన 138 యెడమప్రక్క పేజీలున్నాయి. ఆయాసంపుటాలలో పద్యగద్యాలు, ఫుట్‌నోట్లు వ్రాయబడినయెడమ ప్రక్క పేజీల వివరాలను తరువాతి పేజీలో యిస్తున్నాను.

---

వేసిన 1-8-1927వ తేదీని పొరపాటునవేసివుంటారనేది నిస్సందేహమైన విషయం. మూడవ అష్టకంలోని 4 వ అధ్యాయం 20-8-1927నపూర్తిఅయింది. అందువల్ల 21-8-1927న పంచమాధ్యాయం రచన ప్రారంభించడం వాస్తవికమే అయివుంటుంది.పంచమాధ్యాయం 17వసూక్తంలోని 14వఋక్కు అనువాదం 1-9-1927న ముగిసినట్లు వ్రాయడానికి మారుగా పొరపాటున 1-8-1927 అని వేసివుంటారు. 4వ సంపుటం తృతీయాష్టకంలోని షష్ఠాధ్యాయ రచన 15-9-1927న పూర్తిఅయింది. అందువల్ల 4వ సంపుటంలో శుద్ధంగా వ్రాయబడిన 5వ అధ్యాయం 4-9-1927న వ్రాయడం పూర్తికాగా పొరపాటున నేమానివారు4-8-1927అని వేసివుంటారు.

* 3-41 అంటే 3వ పేజీనుంచి 41వపేజీవరకూ అని గ్రహించాలి. ఈ పట్టికలో మిగిలిన అన్నిచోట్లా యీ విధంగానే గ్రహించాలి.

△ ఈ 1,2,3,4 లు 15b సంపుటంలోని ఎక్సర్‌సైజు పుస్తకాలు.

@ ఈపుస్తకంలో మొదటి రెండు కాగితాలూ వెనుకాముందూ రెండువైపులా వ్రాయబడివున్నాయి. అందువల్ల 30పేజీలకు మారుగా 32 పేజీలను గ్రహించడం జరిగింది.

:: 2వపేజీలో రెండు అంకితం పద్యాలు చిత్తుగా వ్రాయబడి కొట్టివేయబడివున్నాయి.

∵ చివరిరెండు పేజీలలో 5 విభిన్న ఋక్కులకు అనువాదపద్యాలున్నాయి.

| సంపుటం సంఖ్య | పద్యగద్యాలున్న యెడమప్రక్క పేజీలు | పద్యగద్యాల మొత్తంసంఖ్య | ఫుట్ నోట్లున్న యెడమప్రక్క పేజీలు | ఫుట్ నోట్ల మొత్తంసంఖ్య |
|---|---|---|---|---|
| 1 | 6 | 7 | 43 | 42 |
| 2 | *4 | 4 | 21 | 24 |
| 3 | *8 | 9 | 5 | 6 |
| 4 | @17 | 14 | 10 | 11 |
| 5 | ⩩12 | 7 | 10 | 10 |
| 6 | ± 4 | 3 | 1 | 1 |
| 7 | △15 | 20 | 20 | 18 |
| 8 | 14 | 14 | 8 | 7 |
| 9 | 7 | 8 | 11 | 8 |
| 10 | 4 | 4 | 6 | 5 |
| 11 | 1 | 1 | 3 | 3 |
| 12 | 2 | 2 | — | — |
| 13 | ○8 | 7 | 20 | 14 |
| 14 | 6 | 6 | 12 | 11 |
| | 108 | 106≈ | 170 | 160 |

* ఈ సంపుటంలో ఒక పేజీలోనే ఋగనువాదమూ ఫుట్‌నోటూ రెండూ ఉన్నందువల్ల యీ పేజీని ఒక్క పద్యగద్యాల పేజీ లోనే కలిపి లెక్కించి ఫుట్‌నోటు పేజీగా పరిగణించలేదు.

@ ఈ సంపుటంలో ఒక పేజీలో ఒక సీసపాదమూ, రెండు వేరువేరు పేజీలలో ఒక్కొక్క ఉత్పలమాలపాదమూ వ్రాయబడి న్నాయి. ఒక్కొక్కపాదంవంతున ఉన్నవి పూర్తిపద్యాలు కావుగాబట్టి వీటిని కుడిప్రక్క పేజీలోనే పద్యగద్య గణనలోకి తీసి 'నడం జరిగింది. అయితే వ్రాయబడిన పేజీల విషయంలో ఈ యెడమప్రక్క పేజీలుసైతం యిక్కడ పరిగ్రహీతాలయ్యాయి.

⩩ ఈ సంపుటంలో మూడు వేరువేరు పేజీలలో ఒక్కొక్క ఉత్పలమాల పద్యపాదమూ, మరొక పేజీలో చంపకమాల పద్య 'దమూ, యింకొక పేజీలో ఒక గీత పద్యపాదమూ, వేరొక పేజీలో మూడు కంద పద్యపాదాయూ వ్రాయబడిఉన్నాయి. ఈ యెడమ ప్రక్క పేజీలు యిక్కడ వ్రాయబడిన పేజీలుగా పరిగణితంకాగా అసంపూర్ణపద్యాలు కుడిప్రక్క పుటల్లోనే క్రమసంఖ్యలో పరిగణిత మయ్యాయి.

± ఈ సంపుటంలో ఒక యెడమప్రక్క పేజీలో ఉత్పలమాలా పద్యపాదం ఒక్కటి వ్రాయబడింది. ఈ పేజీని యెడమ ప్రక్క వ్రాయబడిన పేజీగా గ్రహించినా పద్యం మాత్రం పూర్తిగా లేదుకాబట్టి యెడమవైపు పేజీలోని పద్యంగా గ్రహించలేదు. మామూలుగా కుడిప్రక్క పేజీలోని క్రమసంఖ్యలోనే యీ పద్యం కలిసివున్నది.

△ ఈ సంపుటంలో రెండు యెడమవైపు పేజీలలో ఋగనువాదాలు ఫుట్‌నోట్లు రెండూ ఉన్నందువల్ల యీ రెండు పేజీలను పద్యగద్యాల పేజీలలోనే కలిపి పరిగణించడంవల్ల ఫుట్‌నోట్ల పేజీలలో వీటిని పరిగ్రహించలేదు.

○ ఈ సంపుటంలో ఒక యెడమప్రక్క పేజీలో గీత పద్యపాదాలు రెండు వ్రాయబడ్డాయి. ఈ పేజీని యెడమవైపు వ్రాయబడిన పేజీగా పరిగణించి పద్యపాదాలు యెడమప్రక్క వ్రాయబడిన పూర్తిపద్యంగా గ్రహింపబడలేదు.

≈ యెడమప్రక్క పేజీలలో వ్రాయబడినవని చూపించిన యీ 106 పద్యగద్యాలూ మామూలుగా గ్రంథంలో పద్యగద్య క్రమసంఖ్యలో అంతర్భూతమై వున్నవే-సాధారణంగా గ్రంథమంతా ఒకవైపునే కుడిప్రక్క పేజీలలో వ్రాయబడినందువల్ల మొత్తం వ్రాసిన పుటల పరిగణనకై యెడమప్రక్క పుటలలో యెన్ని పుటలలో పద్యగద్యాలూ ఫుట్‌నోట్లూ వ్రాయడం జరిగిందో తెలుపడానికై ఈ పట్టికలు యివ్వడం జరిగింది.

పద్యగద్యాలు, ఫుట్‌నోట్లు వ్రాయబడిన యెడమప్రక్క పేజీలు వివిధ సంపుటాలలో మొత్తం అన్నీ 108+170=278 ఉన్నాయి. కాగా 16 సంపుటాలలోనూ వ్రాయబడిన కుడియెడమ ప్రక్క పేజీలన్నీ కలిపి 3, 154+278=3,432 పేజీలన్నమాట. 15b సంఖ్యగల సంపుటంలో నాల్గవ ఎక్సర్‌సైజు పుస్తకంలోవున్న సూక్త ఋషిదేవతల పట్టిక తరువాతి కాగితంముందుప్రక్క పేజీలోనూ, దానివెనుకవైపునవున్న యెడమప్రక్క పేజీలోనూ అయిదు విభిన్న ఋగనువాద పద్యాలున్నాయి. ఈ రెండుపేజీలు 3,156పేజీల సంఖ్యలోనే కలిపివేయడం జరిగింది. మొదటి ఎక్సర్‌సైజు పుస్తకంలోని తొలి రెండు కాగితాల యెడమ ప్రక్క పేజీలు రెండూ కూడా యీ 3,156 పేజీల సంఖ్యలోనే కలపడం జరిగింది.

## లేఖకులు — దస్తూరీలు

ఆంధ్ర ఋగ్వేదసంహిత వ్రాతప్రతి సంపుటాలు మూడింటరెండువంతులు గ్రంథం శ్రీనేమానివారి స్వకీయమైన దస్తూరీలోనే వున్నది. నేమానివారి దస్తూరీ అనేక విధాలుగా వున్నది. నెమ్మదిగా పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసినప్పుడు ఒక విధంగానూ, చిన్న చిన్న అక్షరాలతో వ్రాసినప్పుడు మరొకవిధంగానూ, గబగబా వ్రాసినప్పుడు గొలుసుకట్టుతో వేరొక విధంగానూ వున్నది. (శ్రీనేమానివారి ఇంగ్లీషు - తెలుగు దస్తూరీలు 62-63 పేజీలలో చూడవచ్చును.)

వ్రాతపతి సంపుటాలలోవున్న వివిధ దస్తూరీలనుబట్టి కొన్నికొన్ని పుటలకు నల్గురు అజ్ఞాతవ్యక్తులూ కొన్ని పుటలకు శ్రీ పి. రమణమూర్తి లేఖకులుగా పనిచేసినట్లు స్పష్టపడుతున్నది. వివిధసంపుటాలలోవున్న ఆయా భిన్నవ్యక్తుల దస్తూరీల వివరాలివి.

1వ. అజ్ఞాతవ్యక్తి దస్తూరీ:— ఆంధ్ర ఋగ్వేద సంహితారచనలో తొలిదశలో ఒక అజ్ఞాతవ్యక్తి లేఖకులుగా పని చేశారు. 1వ సంపుటం 51వ పేజీ మొదలు 365వ పేజీ వరకూ 3వ పేజీనుంచి 41వ పేజీవరకూ (ఆంధ్ర ఋగ్వేద గ్రంథరచనా ప్రారంభం 51వ పేజీలోనే జరిగింది. 365వ పేజీ తరువాతి గ్రంథభాగం సంపుటంలో మొదట విడిచిన పేజీలలో 3వ పేజీ మొదలు 41వ పేజీవరకు వ్రాయబడింది.) 2వ సంపుటంలో 3వ పేజీ మొదలు 43వ పేజీ వరకు, 45వ పేజీ మొదలు 47వ పేజీ వరకు, 61, 63 పేజీలు, 67 మొదలు 73 వరకు, 89 మొదలు 137 వరకు, 143 మొదలు 219 వరకు, 223 మొదలు 241 వరకు, 245 మొదలు 255 వరకు, 259 మొదలు 275 వరకు, 279 మొదలు 305 వరకు-3వ సంపుటంలో 5వ పేజీ మొదలు 43 వరకు, 75 మొదలు 85 వరకు, 91 మొదలు 105వరకు ఈ అజ్ఞాత వ్యక్తి దస్తూరీ వున్నది. 1,2,3 సంపుటాలకు మాత్రమే ఈ అజ్ఞాతవ్యక్తి లేఖకులుగా పనిచేయడం జరిగింది. మిగిలిన సంపుటాలలో ఈ లేఖకుని దస్తూరీలేదు. (ఈ తొలి అజ్ఞాతవ్యక్తి దస్తూరీని 64 వ పేజీలో చూడవచ్చును.)

పా.వెం.ర.మూర్తి దస్తూరీ —: శ్రీరమణమూర్తిగారి పేరు ఒకచోట (రెండవ సంపుటం 59వ పుట) ఇంగ్లీషులో *P. Ramana Murthai అనీ, మరొకచోట (నాల్గవసంపుటం 45వ పుట)*పా ర. మూ. అనీ, వేరొకచోట (నాల్గవసంపుటం 171వ పుట) *పా. వెం. ర. మూ. అనీ తెలుగులో రమణమూర్తిగారి దస్తూరీలోనే ఉన్నది. రమణమూర్తిగారి దస్తూరీ తొలిసంపుటంలో లేదు. 2వ సంపుటం-43 మొదలు 45వరకు, 47మొదలు 61వరకు, 65మొదలు 67వరకు, 75 మొదలు 79వరకు,139 మొదలు 141 వరకు, 219 మొదలు 223 వరకు, 241మొదలు 245వరకు, 257మొదలు 259వరకు,275మొదలు 279వరకు-3వ సంపుటంలో 45 మొదలు 75వరకు, 85మొదలు 91వరకు, 167మొదలు175వరకు-4వ సంపుటంలో 5మొదలు 21 వరకు, 25 మొదలు 271 వరకు-5వసంపుటంలో 249మొదలు 272 వరకు రమణమూర్తిగారు లేఖకులుగా పనిచేశారు. వ్రాత పతి 9వ సంపుటంలో 8వ మండలంలో 13వ సూక్తంలోని 20, 21 ఋగనువాదాలు (20పుట) 24, 25, 26 ఋగనువాదాలు (23పుట) రమణమూర్తిగారి దస్తూరీలో ఉన్నాయి. 2, 3సంపుటాలలో ఒక్కొక్క పేజీలో కొంతభాగం అజ్ఞాతవ్యక్తి వ్రాయగా కొంతభాగం రమణమూర్తిగారు వ్రాసిన సందర్భాలు వున్నాయి. 2వ సంపుటంలోని 43, 45, 47 పేజీలు ఇటువంటివే. ఈవిధంగా ఉభయుల దస్తూరీలువున్న పేజీలను రెండు చోట్లా చూపించడం జరిగింది. (శ్రీ రమణమూర్తిగారి దస్తూరీలను 65, 66, 67 పేజీలలో చూడవచ్చును.)

* P. అంటే వచ్చే యింటిపేర్లు శతాధికంగా వున్నాయి. కాని "పా"తో ప్రారంభమయ్యేవి పాకనాటి, పాటిబండ్ల, పాటూరి, పాతకోట, పాతూరి, పామర్తి, పారనంది, పాలవేకరి, పాల్కురికి, పావులూరి మొదలయిన యింటిపేర్లు కొన్ని వున్నాయి.

210 e.g. Paraskara Grihya Sutra (II·17·9) we learn that Sita the furrow goddess, is the wife of Indra. Is it then an untenable conjecture that Rama the hero of the Ramayana is in his original conception, like Arjuna, the hero of the Mahabharata, only a new edition of Indra battling the the demons of drought? The myth of Indra has thus been mixed up with the epic which describes the historic conquest of Southern India!

But though the Ramayana is historically valueless as a narrative of events still, like the Mahabharata, it throws side lights on the state of ancient society in India and the story of the epic therefore needs [illegible]

[illegible]

[illegible]

శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితాకర్త కావ్యతీర్థ శ్రీ నేమాని వెంకటనరసింహశాస్త్రిగారి ఇంగ్లీషు-తెలుగు దస్తూరీలు - శ్రీ నేమానివారి తెలుగు సంతకం కూడా చిట్టచివర చూడవచ్చును. వ్రాతపతి-4వ సంపుటం - 210వ పేజీ.

3వ. అజ్ఞాతవ్యక్తి దస్తూరీ :— 8వ. సంపుటం అంతా చీకటిపట్టణంలోను చీకటికోటలోను వ్రాయబడింది. ఈ సంపుటంలో శ్రీ నేమానివారి దస్తూరీతోపాటు వేరే యిద్దరు వ్యక్తుల దస్తూరీలుకూడా వున్నాయి. ఈ మూడవ అజ్ఞాతవ్యక్తి దస్తూరీ వ్రాతప్రతి 8వ సంపుటంలో 167వ పేజీ మొదలు 280 వరకూవున్న కొన్ని పేజీలలో అక్కడక్కడా వున్నది.

[illegible]

3వ. అజ్ఞాతవ్యక్తి దస్తూరీ—వ్రాతప్రతి— 7వ సంపుటం— 243వ పేజీ.

1, 2, 3, 4సంపుటాలలో అక్కడక్కడా నేమానివారు స్వహస్తంతో వ్రాసిన పద్యాలూ ఫుట్‌నోట్లూ వున్నాయి. నేమానివారే స్వహస్తంతో చేసిన సవరణలు అనేకం వున్నాయి. 5వ సంపుటంలో మొదటిపేజీనుంచి 249పేజీవరకు నేమానివారి దస్తూరీవుండగా ఆతరువాత 252వ పేజీవరకు రమణమూర్తిగారి దస్తూరీ వున్నది. 7వ సంపుటంలో141 మొదలు 145వ పేజీవరకూవున్న మరొక అజ్ఞాతవ్యక్తి దస్తూరీ 8వ సంపుటంలోవున్న యిద్దరు అజ్ఞాతవ్యక్తుల దస్తూరీలుతప్ప మిగిలిన గ్రంథభాగం అంతా అంటే 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15a, 15b సంపుటాల గ్రంథమంతా నేమానివారి స్వహస్తవిలిఖితమే! వివిధ సంపుటాలలోనూ వున్న ఫుట్‌నోటులన్నీ కేవలం శ్రీనేమానివారి దస్తూరీలోనే వున్నాయి.

ఈ సంపుటభాగాల లేఖకులు పి. రమణమూర్తి అన్నా, పా. ర. మూ అన్నా, పా. వెం. ర. మూ. అన్నా ఒకేఒకవ్యక్తిగాని భిన్నవ్యక్తులు కానేకారు. 2,3,4, 5సంపుటాలలో పి. రమణమూర్తి పేరుతోను, పా.ర.మూ.పేరుతోను, పా.వెం,ర.మూ పేరుతోనూ నిర్దిష్టమైన దస్తూరీ అంతా రమణమూర్తి గారిదే. అయితే ఈ రమణమూర్తిగారు తననుతాను వెంకటరమణమూర్తిగా సైతం ఉటంకించారు. ఇంటిపేరు విషయంలో "పా"అంటే'పారనంది'వారని కొందరనగా'పామర్తి'వారని కొందరన్నారు.పారనంది వెంకటరమణమూర్తిగారు బరంపురంలోని కల్లికోట కాలేజీకి అనుబంధితమైవున్న హైస్కూలులో 28-1-1931వ తేదీనుంచి శ్రీ పసుమర్తి కృష్ణమూర్తిగారి స్థానంలో తెలుగుపండితులుగా నియమితులై పనిచేశారు. జనవరి 28వతేదీనుంచి పారనందివారు పనిచేసినా వారి ఉద్యోగం యిచ్చిన ఆర్డరుమాత్రం 28-1-8931వ తేదీనుంచి అమలులోకివచ్చేటట్లుగా 6-7-1931వతేదీన యివ్వడం జరిగింది. తరువాత వీరు కళ్ళికోట కళాశాలలో తెలుగుపండితు లయ్యారు. ఈ పారనంది వెంకటరమణమూర్తిగారు పండితులు కవికూడా. "మేఘ సందేశము, కమలకుమారి, సువర్ణస్పర్శ" మొదలైన గ్రంథాలు విరచించారు. మేఘసందేశము కాళిదాసు మేఘసందేశానికి చక్కని పద్యాత్మకమైన అనువాదం. వీరిది శ్రీకాకుళం జిల్లా మందసా, రాణిగాం. వీరు 10-7-1890లో జన్మించి యిటీవలనే నాలుగు సంవత్సరాల క్రిందట 1977లో కీర్తిశేషులయ్యారు. తెలుగుపండితులుగా పారనందివారి నియామకం నేమానివారు జీవించివుండగానే జరిగింది. పారనందివారు 1931లో తెలుగుపండితులుగా నియమితులయ్యారంటే పూర్తిగా 40యేళ్ళునిండిన తరువాతనే వారి కీవుద్యోగం లభించిందన్నమాట. ఆంధ్రవిశ్వకళా పరిషత్తువారు వివిధకవుల కవితలతో 1980లో ప్రకటించిన 'నవకవిత' సంపుటంలో పారనందివారి మేఘసందేశంలోని పద్యాలు కొన్ని ప్రకటించి కవి పరిచయంగా వారు భాషాప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణులయినట్లు వ్రాశారు. పారనందివారు "ఉభయభాషాప్రవీణ"కాక "భాషాప్రవీణ" పరీక్షలో మాత్రమే ఉత్తీర్ణులయివుంటే 1938 తరువాతనే వారు భాషాప్రవీణ పట్టం సంపాదించారనుకోవాలి. ఆంధ్ర విశ్వకళాపరిషత్తువారు తాము నిర్వహిస్తున్న ఉభయభాషాప్రవీణ పరీక్షను 1938లో రద్దుచేసి దానిస్థానంలో విద్యాప్రవీణ-భాషాప్రవీణ పరీక్షలను ప్రవేశపెట్టారు. పారనందివారు భాషాప్రవీణ పరీక్షలో ఉత్తీర్ణులయ్యేవరకూ బహుశా యోగ్యతాపత్రంలేని (అన్‌క్వాలిఫైడ్) తెలుగుపండితులుగా పనిచేసి వుంటారని భావించవలసివుంటుంది. ఈ పారనందివారే నేమానివారికి లేఖకులుగా పనిచేశారని అనుకుందామా అంటే 1928లో 5వ సంపుటం పూర్తిచేసేవరకూ లేఖకులుగా పనిచేసిన వీరు హఠాత్తుగా యెందువల్ల మానివేశారో 6, 7, 8, 9, 10, 11, 12, 13, 14, 15a, 15b సంపుటాలు వ్రాయడంలో వీరి దస్తూరీ (9వ సంపుటంలో 5పద్యాలు మినహా) లేకుండా యీ సంపుటాలన్నీ (7వ సంపుటంలో 141 నుంచి 145వ పేజీవరకు తప్ప) నేమానివారే యెందువల్ల వ్రాసి పూర్తిచేశారో తెలియదు. కళ్ళికోట కళాశాలలో పనిచేసిన రమణమూర్తిగారూ నేమానివారికి లేఖకులుగా పనిచేసిన రమణమూర్తిగారూ ఒక్కరే అవునో కాదో ధ్రువపరచుకోవాలంటే ఆంధ్రఋగ్వేద సంహితలోని రమణమూర్తిగారి దస్తూరీని కళ్ళికోట కాలేజీలో పనిచేసిన రమణమూర్తిగారి దస్తూరీతో సరిపోల్చిచూడవలసివున్నది. ఈ దస్తూరీలు పోల్చిచూచేఅవకాశం నాకు లభించలేదు. కాలేజీ తెలుగుపండితులైన రమణమూర్తిగారి దస్తూరీ ఆంధ్రఋగ్వేద లేఖకులైన రమణమూర్తిగారి దస్తూరీ ఒకటిగానేవుంటే యీ పారనందివారే నేమానివారి లేఖకులని విశ్వసించవచ్చు. ఒకవేళ నేమానివారివద్ద లేఖకులుగా పనిచేసినవారు పారనందివారుకాక పామర్తి వెంకటరమణమూర్తిగారని అనుకున్నా-9వ సంపుటంలో 5పద్యాలు యీ రమణమూర్తిగారి వ్రాతలోవున్నా-వారైనా మరి 5వ సంపుటం తరువాత యెందువల్ల లేఖకులుగా పనిచేయలేదో తెలియదు. బహుశా నేమానివారికి యీ లేఖకులకు అభిప్రాయభేదాలు వచ్చివుండవచ్చు. లేదా రమణమూర్తిగారు బరంపురం విడిచి యేదైనా గ్రామాంతరమైనా వెళ్ళిపోయివుండవచ్చు. ఇదేవిధంగా మొట్టమొదట లేఖకులుగా పనిచేసిన అజ్ఞాతవ్యక్తి 3వ సంపుటం తరువాత లేఖకులుగా యెందువల్ల పనిచేయలేదో తెలియదు. ఈవివిధలేఖకుల దస్తూరీలన్నీ శ్రీనేమానివారి దస్తూరీతోసహా బ్లాకులు చేయించి యీ పీఠికలో వివిధపుటల్లో ముద్రించడం జరిగింది.

ఇంక శ్రీ జగన్మోహనరావుగారు ఆంధ్రఋగ్వేద సంహితారచనగురించి కరపత్రంలో ప్రకటించిన విషయాలు సమగ్రమైన పరిశీలనచేసి వ్రాసినవికావన్న విషయానికి వద్దాము. కళ్లికోట కాలేజీలో ఉద్యోగరీత్యా శ్రీ నేమానివారు ప్రధానాంధ్రపండితులుగాని ప్రధాన సంస్కృతపండితులుకారు.వారు కాలేజీలో సీనియర్ తెలుగుపండిట్‌పదవి నిర్వహించారు.నేమానివారు 1926లో ఆంధ్రఋగ్వేద సంహితా రచనకు శ్రీకారంచుట్టినా దాన్ని 1929 ఆగస్టునాటికి మూడువంతులు పైగా వ్రాసినా మిగిలిన గ్రంథం 1932 జూన్‌వరకు పూర్తి కానేలేదు. ఈ ఆంధ్రఋగ్వేదసంహిత వ్రాతప్రతి సంపుటాలు శ్రీనేమానివారి అకాలమరణానంతరం శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారి కృషివల్ల గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడ్డాయని శ్రీ జగన్మోహనరావుగారు వ్రాసిన విషయం యదార్థంకాదు. అవి శ్రీ మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి కృషివల్ల గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడ్డాయి. నేమానివారు హఠాత్తుగా కీర్తిశేషులయింది 1932 జూన్ 30వ తేదీన గదా! ఆరోజుల్లో పంచాగ్నులవారు మద్రాసు క్వీన్‌మేరీ మహిళా కళాశాలలో తెలుగుపండితులుగా పనిచేసేవారు. పంచాగ్నులవారు యశోధరుని జయమంగళవ్యాఖ్యతోవున్న వాత్స్యాయన కామసూత్రాలకు తేటతెల్లమయిన తెలుగు వివరణ వ్రాసి 1930లో ద్వితీయముద్రణంగా ప్రకటించినందువల్ల అనేకమంది పెద్దలు "మహిళాకళాశాలలో తెలుగుపండితులుగా ఉద్యోగం చేస్తూ కామశాస్త్రభాష్యాలువ్రాసి ముద్రిస్తున్నా"రని పంచాగ్నుల వారిని విమర్శించడం జరిగింది. అందువల్ల ఆ కళాశాల వుద్యోగం నుంచి తప్పుకోవాలనే ప్రయత్నంలోవుండి కృతార్థులై పంచాగ్నులవారు-బరంపురం కళ్ళికోటకాలేజీలో హఠాత్తుగా కీర్తిశేషులైన నేమానివారి స్థానంలో నాలుగు నెలల తరువాత 11-11-1932వ తేదీన సీనియర్ తెలుగుపండితులుగా నియమితులై మద్రాసు క్వీన్ మేరీ మహిళాకళాశాలలో ఉద్యోగంనుంచి విరమించి కళ్ళికోట కాలేజీలో చేరడం జరిగింది. శ్రీ నేమానివారు కళ్లికోట కళాశాలలో ఉద్యోగంలో వుండగానే 6-7-1931 తేదీన తెలుగుపండితులుగా నియమితులైన శ్రీ పారనంది వెంకటరమణమూర్తిగారితోపాటు శ్రీ విశ్వనాథ వరాహనరసింహశాస్త్రిగారిని కూడా అదే తేదీనుంచి తెలుగుపండితులుగా నియమించడం జరిగింది. నేమానివారు కీర్తిశేషులయ్యేనాటికి పారనందివారు విశ్వనాథవారు యిద్దరూ తెలుగుపండితులుగా వుద్యోగంలోవున్న వ్యక్తులే. అయినా నేమానివారి స్థానంలో సీనియర్ తెలుగుపండితులుగా వీరిద్దరిలో యే ఒక్కరినీ నియమించకుండా కళ్ళికోట కాలేజీకమిటీవారు లబ్ధప్రతిష్ఠులు అనుభవజ్ఞులు అన్న దృష్టితో శ్రీ పంచాగ్నులవారినే నియమించడం జరిగింది. నేమానివారి మరణానంతరం వారి భార్య శ్రీమతి మహాలక్ష్మి తనకు సంతానం లేనందువల్ల,బరంపురంలో స్వగృహంకూడా లేనందువల్ల, ఆమె సాలూరులోవున్న తోబుట్టువులయింటికి వెళ్ళిపోవడంజరిగింది. ఎక్కడో మద్రాసులోవుండి నేమానివారు కీర్తిశేషులయిన నాలుగునెలలతరువాత బరంపురంవచ్చిన పంచాగ్నుల వారికృషివల్ల-నేమానివారి భార్య శ్రీమతి మహాలక్ష్మితో ముఖపరిచయమైనాలేని పంచాగ్నుల వారికృషివల్ల-ఈ వ్రాతప్రతులు గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడినాయనడం వాస్తవం కాదు. శ్రీమండపాక పార్వతీశ్వరశాస్త్రి గారికి అప్పటి ఆంధ్రపత్రికాధిపతులైన శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారితో అత్యంత సన్నిహితమైన పరిచయం వున్నది. శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారు శ్రీ నాగేశ్వరరావుగారికి ఒక లేఖవ్రాసి శ్రీనేమానివారి "ధర్మతత్వము"అనే వ్యాసం పంపగా దానిని శ్రీనాగేశ్వరరావుగారు 1924 ఏప్రిల్ భారతిలో ప్రకటించారు. కేవలం బంధుత్వం మాత్రమేకాక గౌరవాభిమాన పూర్వకమైన సాన్నిహిత్యంకూడా వున్న శ్రీ పార్వతీశ్వరశాస్త్రిగారి కృషివల్లనే ఈ ఆంధ్ర ఋగ్వేద సంహిత లిఖితప్రతులు గౌతమీగ్రంథాలయంలో భద్రపరచబడివుంటాయనడంలో సందేహంలేదు. నేమానివారిఅకాల మరణానంతరం వారి భార్య శ్రీమతి మహాలక్ష్మిగారు ఆంధ్రఋగ్వేదసంహిత వ్రాతప్రతులను రాజమండ్రిలోని గౌతమీగ్రంథాలయానికిచ్చి నేమానివారి వద్దనున్న వివిధముద్రిత గ్రంథాల నన్నింటినీ బరంపురంలోని గ్రంథాలయానికి బహూకరించారు.

—"దీనిలో 10, 066 పద్యములు, 150 పుటల పీఠిక, 150 పుటల పదానుక్రమణిక, 150 పుటల విషయ వివరణము గలవు"- అని శ్రీ జగన్మోహనరావుగారు కరపత్రంలో ప్రకటించిన విషయంకూడా వాస్తవ విరుద్ధం. నేమానివారు ఆంధ్ర ఋగ్వేద సంహితకు ప్రత్యేకంగా పీఠిక అనేపేరుతో యేమీ వ్రాయలేదు. "ఋగ్వేద సంహిత-ఆర్యులప్రతిభ" అన్న శీర్షికతో ఒకేవైపున 45 పుటలలో శ్రీ అచ్యుతుని వెంకటాచలపతిరావుగారు రచించి ప్రకటించిన "వేదభూమి"వంటి గ్రంథాలను దృష్టిలో పెట్టుకుని విషయ వివరణతో విరచించడం జరిగింది. ఇది కాగితానికి ఒకప్రక్కనే వ్రాయబడినందువల్ల ఖాళీపేజీలనుకూడా లెక్కపెడితే మొత్తం తొంభై పేజీల సంపుటం. ఈ ఆర్యుల ప్రతిభగురించివున్న గ్రంథాన్ని 15a సంపుటంగాను, సూక్తఋషిదేవతల పట్టికగల సంపుటాన్ని 15b సంపుటంగాను పరిగణించడం జరిగింది. ఈ 15b సంఖ్యగల సంపుటం 60 పేజీల ఎక్సర్‌సైజ్ బుక్కు ఒకటి-అట్టమీద 40 పేజీలని ఉన్నా

52పేజీలతో ఎక్సర్‌సైజు బుక్కు మరొకటి-ఒక్కొక్కటి 40 పేజీలలో వున్న ఎక్సర్‌సైజు బుక్కులు రెండుకలిపి మొత్తం 192 పుటలతో బైండు చేయబడి వున్నది. ఈ 15b సంపుటంలోని మొదటి 60 పేజీల ఎక్సర్‌సైజు పుస్తకంలో ఋగ్వేద ఆంధ్రానువాదం తృతీయాష్టకంలోని పంచమాధ్యాయం (5 వ సూక్తం) మొదలు 17వ సూక్తంలోని 14వ ఋక్కువరకు, చిత్తుగా వ్రాయబడి వున్నది. ఈ పంచమాధ్యాయమంతా 4వ సంపుటంలో 59వ పేజీనుంచి 101 వపేజీ వరకు,అనుస్యూత గ్రంథంగా శుద్ధంగా వ్రాయబడి వున్నది. 52-40-40 పేజీల వంతునవున్న మిగిలిన మూడు ఎక్సర్‌సైజు పుస్తకాలలోను సూక్తసంఖ్యలు ఋషిదేవతల పట్టికలూ వున్నాయి. ఈ ఎక్సర్‌సైజు పుస్తకాలలో పేజీల సంఖ్యలు సరిగా క్రమబద్ధంగా వేయబడలేదు. మొదటి 52 పేజీల ఎక్సర్‌సైజు పుస్తకంలోని రెండవ పేజీలో అంకితం పద్యాలు చిత్తుగా వ్రాయబడి కొట్టివేయబడి వున్నాయి. శుద్ధంగా వ్రాయబడిన అంకితం పద్యాలున్న కాగితం శిథిలమైపోయి ఉంటుంది. మూడవదైన 40 పేజీల ఎక్సర్‌సైజు పుస్తకంలో చివరినుంచి 12పేజీలు ఖాళీగా విడిచి పెట్టబడి అంతకు ముందున్న రెండు పేజీలలో ప్రత్యేకంగా భిన్నభిన్నస్థలాలలోవున్న అయిదు ఋక్కులను అయిదు పద్యాలలో అనువదించి వ్రాయడం జరిగింది. ఈ సంపుటంలో కొన్ని పుటలలో నేమానివారే వేసినట్లుగా కనిపిస్తున్న పుటల సంఖ్యలు చూస్తే మరికొన్ని పేజీలుకాని- మరి రెండు ఎక్సర్‌సైజు పుస్తకాలుకాని పోయివుండవచ్చునని అనిపిస్తున్నది. 60 పేజీలున్న ఎక్సర్‌సైజు పుస్తకంలోని 59వ పేజీలో 17 వ సూక్తంలోని 14వ ఋగనువాదాన్ని ముగించి "see other book" అని ఇంగ్లీషులోను, "సశేషము" అని తెలుగులోను, శ్రీ నేమానివారే వ్రాయడం జరిగింది. అందువల్ల తృతీయాష్టకం పంచమాధ్యాయం 17 వ సూక్తంలోని 15వ ఋగనువాద పద్యం మొదలు మరికొంత అనువాద గ్రంథాన్ని వేరే రెండు ఎక్సర్‌సైజు పుస్తకాలలో వ్రాసి వీటిని సాపు ప్రతిగా తృతీయాష్టకం మూడవ అధ్యాయం (3 వ మండలం) 54 వ సూక్తంలోని 13వ ఋక్కు మొదలు చతుర్థాష్టకం (4వ మండలం) ప్రథమాధ్యాయం 28 వ సూక్తంలోని 6వ ఋక్కు వరకూ, అనుస్యూతంగా సక్రమంగా 4వ సంపుటంలో వ్రాసినందువల్ల మిగిలిన రెండు ఎక్సర్‌సైజు పుస్తకాలను (బహుశా మరీ చిత్తుగా వ్రాసివుండడంవల్ల) నేమానివారే తీసివేసి వుండవచ్చును. 15b సంపుటంలో వున్న సూక్త ఋషి దేవతల పట్టికలను చూచి యిది మొత్తం 180 పేజీలతో వున్న సంపుటం అవడంవల్ల 150 పుటలు పదానుక్రమణిక వున్నట్లు జగన్మోహనరావుగారు అపోహపడి వ్రాసివుంటారు. వాస్తవానికి నేమానివారు 7, 8 మండలాలు తప్ప మిగిలిన మండలాలన్నీ అత్యధికంగా పద్యాత్మకంగానే అనువాదం చేశారు. అక్కడక్కడా సకృత్తుగా మాత్రమే గద్యరచన నుపయోగించారు. వ్రాతప్రతి 7, 8 సంపుటాలలో పంచమాష్టకం పూర్తిగా ఆంధ్రీకరించబడివున్నది. ఈ 7, 8 సంపుటాలలో వివిధ ఋక్కులు 1229 గద్యాలుగా అనువాదం చేయబడగా పద్యాలుగా కేవలం 28 మాత్రమే రచింపబడ్డాయి. 15a, 15b సంఖ్యగల చిన్నసైజున్న సంపుటాలవలె అదే సైజులో గద్యమయంగావున్న 7, 8 సంపుటాలనుచూచి సరిగా పరిశీలించకుండా - 163 పేజీలతో వున్న 7 వ సంపుటాన్ని "150 పుటలు పీఠిక" గల గ్రంథంగాను, 164నుంచి 311 పేజీలుగా వున్న 8 వ సంపుటాన్ని చూచి "150 పుటలు విషయ వివరణము" గల సంపుటంగాను, జగన్మోహనరావుగారు భ్రమపడి వ్రాసివుంటారు. (8వ సంపుటంలో 164వ పేజీకి యెడమ ప్రక్కన ఉన్న పేజీలో దేవత-ఋషి-ఛందస్సుల వినియోగ విషయకమైన శ్లోకాన్ని దాని తెలుగు వివరణను శ్రీనేమానివారు వ్రాశారు.)

## పద్యగద్యాల సంఖ్య

ఆంధ్ర ఋగ్వేద సంహితా సంపుటాలలోవున్న పద్యగద్య సంఖ్యలను నేమానివారు కొన్నికొన్ని సందర్భాలలో క్రమంగా వేయడంలో పొరపాటుగా వేశారు. కొన్ని సందర్భాలలో పొరపాటున క్రమసంఖ్య తక్కువ వెయ్యడం కొన్ని సందర్భాలలో యెక్కువ వెయ్యడం జరిగింది. ఆంధ్ర ఋగ్వేదంలో వున్న పద్యగద్యాల సంఖ్య నేమానివారు యిచ్చిన లెక్కల ప్రకారం రెండంకితం పద్యాలతో కలిపి 10,657. కాని పొరపాటున యెక్కువ తక్కువలుగా వేసిన సంఖ్యలన్నింటినీ పరిశీలించి సరిచేసి చూస్తే ఆంధ్ర ఋగ్వేద సంహితలో వున్న మొత్తం పద్యగద్యాల సంఖ్య 15b సంపుటంలో చివరిపేజీలోవున్న 4వ మండలం-40వ సూక్తంలోని 5వ ఋగనువాద పద్యంతోను, (మిగిలిన 3 ఋగనువాద పద్యాలూ 1వ మండలంలోని సూక్త ఋగనువాద పద్యాలలో కలపడం జరిగింది.) యజుర్వేదంలోని (40వ అధ్యా. 8 మంత్రం) మంత్రానువాద పద్యంతోను,రెండంకితం పద్యాలతోనుసహా కలిపి 10,614కు తరిగింది. నేమానివారు వివిధ సంపుటాలలో పద్యాల క్రమసంఖ్యను కప్పదాట్లుగా పొరపాటుగా వేశారు. 6వ సంపుటంలో 47వపేజీలో చిట్టచివరి పద్యానికి 141 సంఖ్యవేసి దాని తరువాతి పద్యానికి 48వ పేజీలో 142సంఖ్య వెయ్యడానికిమారుగా 153 పొరపాటున వేశారు. 7వ సంపుటంలో 154వ పేజీ చివరి పద్యానికి 109 సంఖ్యవేసి దాని తరువాతి పద్యానికి 155వ పేజీలో 110 వెయ్యడానికి

మారుగా 1౭0 వేశారు. 9వ సంపుటం చివరిపుట 325లో పద్యం 73 సంఖ్యతో ముగియగా 10వ సంపుటం ప్రారంభంలో 4వ పేజీలో 159 సంఖ్యతో పద్యక్రమం ప్రారంభమైనది. .0వ సంపుటం చివరి పేజీ అయిన 118లో 50 సంఖ్యతో పద్యం ముగియగా 11వ సంపుటం 5వ పుటలో పద్యక్రమసంఖ్య 107తో ప్రారంభమైనది. 11వ సంపుటంలో చివరిపేజీ అయిన 253లో చివరి పద్యం 76 సంఖ్యతో ముగియగా 12వ సంపుటం 1వ పేజిలో 120తో పద్యక్రమసంఖ్య మొదలైనది. అందువల్ల నేమానివారి పద్యగద్య సంఖ్యల మొత్తంలో కొంత ఆధిక్యత యేర్పడింది. అయితే నేమానివారు వేసినసంఖ్యనే అనేకసందర్భాలలో తిరిగి వెయ్యడమూ, కొన్ని సందర్భాలలో 2,3 పద్యాలకు అసలు క్రమసంఖ్యలు వెయ్యకుండా విడిచిపెట్టి కప్పదాటుగా ఆ తరువాతి పద్యాన్ని(క్రమసంఖ్యతో) కలపడంకూడా జరిగింది. ఈ హెచ్చుతగ్గుల నన్నింటినీ సరిచేసి చూడడంవల్ల నేమానివారి సంఖ్యకూ అసలు సంఖ్యకూ 44మాత్రమే తేడా వచ్చింది. అందువల్ల మొత్తం ఆంధ్ర ఋగ్వేదంలో 10,066 పద్యాలు వున్నాయని శ్రీ జగన్మోహనరావుగారు వ్రాయడం యదార్థం కాదు. నేమానివారు మండలాలవారీగా సూక్తాల క్రమసంఖ్య నిస్తూ అధ్యాయాల వారీగా పద్యగద్యాల క్రమసంఖ్య నివ్వడం జరిగింది. అధ్యాయాలు అష్టకాలకు సంబంధించినవేగాని మండలాలకు సంబంధించినవి కావు. సూక్త క్రమసంఖ్య మండలాలకు సంబంధించిందేకాని అష్టకాలకూ అధ్యాయాలకూ సంబంధించిందికాదు. అసలు మూలవేదంలోనే ఈ సూక్తమండల అష్టకాల విషయంలో ఈ వ్యత్యస్తత ప్రాచీన కాలంలోనే యేర్పడింది. నేమానివారుకూడా మండలాలలోని సూక్త క్రమసంఖ్యకే ప్రాధాన్యం యిచ్చినందువల్ల ముద్రణలో ఆంధ్రానువాద పద్యగద్యాల క్రమసంఖ్యనుకూడామండలాల వారీగానే-సంస్కృత ఋక్కుల క్రమసంఖ్యల కనుగుణంగా-సవరించి ముద్రించడం జరిగింది. నేమానివారు ఎనిమిది అష్టకాలలోను తాము అనువాదం చేసిన వివిధ అధ్యాయాల లోని పద్యగద్యాలకు హెచ్చుతగ్గులతో కూడిన పొరపాట్లతో వ్రాతప్రతుల్లో ఈ క్రింది విధంగా క్రమసంఖ్యను వెయ్యడం జరిగింది.

| అష్టకం-సంఖ్య- | అధ్యాయం-సంఖ్య - | పద్య/గద్యాల సంఖ్య | అష్టకం-సంఖ్య- | అధ్యాయం-సంఖ్య - | పద్య/గద్యాల సంఖ్య | అష్టకం-సంఖ్య- | అధ్యాయం-సంఖ్య - | పద్య/గద్యాల సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 1 | 156 | 3 | 7 | 153 | 6 | 4 | 238 |
| ,, | 2 | 143 | ,, | 8 | 162 | ,, | 5 | 161 |
| ,, | 3 | 131 | 4 | 1 | 192 | ,, | 6 | 205 |
| ,, | 4 | 111 | ,, | 2 | 198 | ,, | 7 | 195 |
| ,, | 5 | 123 | ,, | 3 | 192 | ,, | 8 | 184 |
| ,, | 6 | 134 | ,, | 4 | 195 | 7 | 1 | 183 |
| ,, | 7 | 162 | ,, | 5 | 200 | ,, | 2 | 198 |
| ,, | 8 | 114 | ,, | 6 | 167 | ,, | 3 | 180 |
| 2 | 1 | 145 | ,, | 7 | 190 | ,, | 4 | 190 |
| ,, | 2 | 150 | ,, | 8 | 145 | ,, | 5 | 213 |
| ,, | 3 | 159 | 5 | 1 | 143 | ,, | 6 | 194 |
| ,, | 4 | 154 | ,, | 2 | 148 | ,, | 7 | 228 |
| ,, | 5 | 157 | ,, | 3 | 163 | ,, | 8 | 212 |
| ,, | 6 | 167 | ,, | 4 | 150 | 8 | 1 | 217 |
| ,, | 7 | 149 | ,, | 5 | 147 | ,, | 2 | 177 |
| ,, | 8 | 143 | ,, | 6 | 146 | ,, | 3 | 183 |
| 3 | 1 | 163 | ,, | 7 | 168 | ,, | 4 | 200 |
| ,, | 2 | 143 | ,, | 8 | 173 | ,, | 5 | 181 |
| ,, | 3 | 151 | 6 | 1 | 171 | ,, | 6 | 195 |
| ,, | 4 | 144 | ,, | 2 | 152 | ,, | 7△ | 167△ |
| ,, | 5 | 151 | ,, | 3 | 184 | 8 | 63 | 10,655 |
| ,, | 6 | 164 | | | | | | |

నేమానివారు అధ్యాయాలవారీగా వేసిన పద్యగద్యాల సంఖ్యలలోని పొరపాట్ల నన్నింటినీ సవరించి సరిచేసి రూపొందించిన పద్యగద్యాల సంఖ్య వివిధ అష్టకాధ్యాయాల వారీగా తరువాతి పుటలో యివ్వడం జరుగుతున్నది.

△ అష్టమాష్టకంలో 7 వ. అధ్యాయం (10 వ మండలం) 136 వ సూక్తంలోని 7 వ ఋగనువాదంపర్యంతమాత్రమే శ్రీనేమాని వారు తమ ఆంధ్రానువాదాన్ని విరచించారు.

| అష్టకం | అధ్యాయం | పద్య/గద్యాలసంఖ్య |
|---|---|---|
| 1 | 1 | 156 |
| ,, | 2 | 143 |
| ,, | 3 | 131 |
| ,, | 4 | 111 |
| ,, | 5 | 126 |
| ,, | 6 | 137 |
| ,, | 7 | 162 |
| ,, | 8 | 115 |
| 2 | 1 | 147 |
| ,, | 2 | 152 |
| ,, | 3 | 160 |
| ,, | 4 | 154 |
| ,, | 5 | 168 |
| ,, | 6 | 172 |
| ,, | 7 | 152 |
| ,, | 8 | 143 |
| 3 | 1 | 164 |
| ,, | 2 | 143 |
| ,, | 3 | 151 |
| ,, | 4 | 145 |
| ,, | 5 | 152 |
| ,, | 6 | 164 |
| ,, | 7 | 153@ |
| ,, | 8 | 163 |
| 4 | 1 | 191 |
| ,, | 2 | 199 |
| ,, | 3 | 194 |
| ,, | 4 | 197 |
| ,, | 5 | 200 |
| ,, | 6 | 167 |
| ,, | 7 | 188 |
| ,, | 8 | 150 |

| అష్టకం | అధ్యాయం | పద్య/గద్యాలసంఖ్య |
|---|---|---|
| 5 | 1 | 144 |
| ,, | 2 | 157 |
| ,, | 3 | 168 |
| ,, | 4 | 146 |
| ,, | 5 | 149 |
| ,, | 6 | 144 |
| ,, | 7 | 166 |
| ,, | 8 | 183 |
| 6 | 1 | 173 |
| ,, | 2 | 156 |
| ,, | 3 | 190 |
| ,, | 4 | 241 |
| ,, | 5 | 162 |
| ,, | 6 | 124 |
| ,, | 7 | 195 |
| ,, | 8 | 184 |
| 7 | 1 | 186 |
| ,, | 2 | 199 |
| ,, | 3 | 127 |
| ,, | 4 | 194 |
| ,, | 5 | 216 |
| ,, | 6 | 197 |
| ,, | 7 | 186 |
| ,, | 8 | 214 |
| 8 | 1 | 217 |
| ,, | 2 | 183 |
| ,, | 3 | 189 |
| ,, | 4 | 206 |
| ,, | 5 | 187 |
| ,, | 6 | 203 |
| ,, | 7 | 174 |
| 8 △ | 63 :: | 10,610 |

శ్రీ రమణమూర్తిగారు రచించిన మూడు పద్యాలను (వ్రాతప్రతి. 2 వ సంపుటం-59 వ పుట. ప్రథమ మండలం - 139 వ సూక్తం 4 వ ఋగనువాదం. ముద్రణ ప్రతి. ప్రథమ సంపుటం-429 వ పేజీ 16 వ పద్య వ్రాతప్రతి-4 వ సంపుటం-45 వ సంపుటం 4 వ మండలం-2 వ సూక్తం-13 వ ఋగనువాదం-ముద్రణ ప్రతి-ద్వితీయ సంపుటం-254 పేజీ-43 వ పద్యమూ, వ్రాతప్రతి. 4 వ సంపుటం-171 వ పుట-4వ మండలం-40 వ సూక్తం-5 వ ఋగనువాదం-ముద్రణప్రతి-ద్వితీయ సంపుటం-409 పేజీ 486పద్యమూ) తీసివేస్తే నేమానివారు విరచించిన పద్యగద్యాల నికరసంఖ్య అంకితం పద్యాలతో కలిపి 10,610. దీన్ని యజుర్వేద మంత్రపద్యంతో సహా కలిపితే 10,611 పద్యగద్యాలు కాగలవు.

@ 3 వ అష్టకం (4 వ మండలం) 40 వ సూక్తంలోని 5 వ ఋగనువాదపద్యానికి పాఠాంతరంగా నేమానివారు మరొక పద్యాన్ని 15b సంపుటంలోని 4వ ఎక్సర్‌సైజుబుక్కులోవున్న ఋషిదేవతల పట్టిక చివరిపేజీకి వెనుకప్రక్క పేజీలో వ్రాశారు. దీన్ని కూడా యీ అధ్యాయం పద్య సంఖ్యలో కలపడం జరిగింది.

△ ఇది ఆంధ్ర ఋగ్వేదంలోవున్న మొత్తం అష్టకాల సంఖ్య. అష్టమాష్టకం సంపూర్ణంగా లేదు.

:: ఇది ఆంధ్రఋగ్వేదంలోని మొత్తంఅధ్యాయాలసంఖ్య. 8 వఅష్టకంలోని 7 వఅధ్యాయం అసమగ్రం. 8వఅధ్యాయం మొత్తం లేదు.

# ఆంధ్ర ఋగ్వేద సంహిత :
# అనువాద పరిశ్రమ

నేమానివారు ఋగ్వేదాన్ని ఆంధ్రీకరించడానికి-రచన ప్రారంభించడానికి పూర్వం దాదాపు పది సంవత్సరాలపాటు అనేక గ్రంథాలు చదవడం రూపంగా బహుముఖమైనపరిశ్రమ చేసినట్లు అర్థమవుతున్నది. ఋగ్వేద ఆంధ్రీకరణరచన ప్రారంభించింది 1926లో. అంతకుపూర్వం దాదాపు పది సంవత్సరాలపాటు కాశీనుంచి బొంబాయినుంచి ఋగ్వేదానికి సంబంధించిన అనేకగ్రంథాలను కొని తెప్పించుకున్నారు. 1922 ఏప్రియల్ నెలలో కళ్ళికోట కాలేజీ కమిటీవారి నుంచి నూరు రూపాయలు అప్పుతీసుకున్నది బహుశా తమకు అవసరమైన పుస్తకాలు కొనడానికే కావచ్చును. ఆంధ్రఋగ్వేదం ప్రథమమండలం 163వ సూక్తప్రారంభంలో నేమానివారు వ్రాసిన "యజ్ఞాశ్వమనగ నీటిలో సంచరించు సూర్యుడని కొందరు భాష్యకారుల యభిప్రాయము" (వ్రాతప్రతి-2వ సంపుటం-124వ పుట-ముద్రణప్రతి-ప్రథమ సంపుటం-519 పేజీ-)అన్న ఫుట్‌నోటులో "కొందరు భాష్యకారుల అభిప్రాయము" అని వ్రాయడంచూస్తే సాయన-స్కంద-దయానంద సరస్వతుల భాష్యాలతోపాటు మరెన్నిభాష్యాలు వారు చదివారో ననిపిస్తుంది. తమ కవసరమైన పుస్తకాలను కొన్నింటిని బరంపురంలోని గ్రంథాలయంనుంచికూడా తీసుకున్నారు. ఈ సందర్భంగా నేమానివారెన్ని గ్రంథాలను పరిశీలించారో ఆంధ్ర ఋగ్వేద సంహితలో వారు వ్రాసిన 160 ఫుట్‌నోట్లనుబట్టి గ్రహించవచ్చును. ఆరోజుల్లో శ్రీ దువ్వూరి సాంబశివ దక్షిణామూర్తిశాస్త్రిగారు అనే న్యాయవాది ఒకరు బరంపురంలో వుండేవారు. ఆయన సంస్కృతంలో గొప్ప పండితులు. అనేక విమర్శనా గ్రంథాలు పరిశోధనాగ్రంథాలు తెప్పించి చదువుతూవుండేవారు. దక్షిణామూర్తిశాస్త్రిగారు 1872లో పుట్టి 1921లో కీర్తిశేషులయ్యారు. దక్షిణామూర్తిశాస్త్రిగారు నేమానివారికి అనేక సంస్కృత ఆంగ్లగ్రంథాలు యిచ్చారట. 1932లో నేమానివారు కీర్తిశేషులయిన తరువాత దక్షిణామూర్తిశాస్త్రిగారి కుమారులైన శ్రీ వెంకటసూర్యనారాయణమూర్తిగారు (ప్రస్తుతం వీరి వయస్సు 80 సంవత్సరాలు) నేమానివారుంటున్న యింటికివెళ్ళి "మానాన్నగారిచ్చిన పుస్తకాలు తిరిగి మా కిచ్చి వేయవలసిం"దని నేమానివారి భార్య శ్రీమతి మహాలక్ష్మిగారి నడుగగా "మావద్దవున్న ముద్రణగ్రంథాలన్నీ బరంపురం గ్రంథాలయాని కిచ్చివేశాము. మీనాన్నగారిచ్చిన పుస్తకాలుకూడా మా పుస్తకాలతోపాటు గ్రంథాలయాని కివ్వడం జరిగింది" అని ఆమె సమాధానం చెప్పినట్లు శ్రీ సూర్యనారాయణమూర్తిగారు తెలియజేశారు. బరంపురానికి సమీపంలోనే వున్న 'చీకటి పట్టణం'లో చీకటి రాజాగా శ్రీ రాజారాధామోహన్ రాజేంద్రదేవ్ అనే జమీందారుండేవారు. ఆయన ఒరియా, సంస్కృతం, ఇంగ్లీషు మొదలైనభాషల్లో గట్టిపండితులు. స్వయంగా రచయిత. కవి కూడా. చాలా నిరాడంబరంగావుండేవారు. కవి పండిత కళాపోషకుడు. ఏవిధమైన ప్రచారార్భాటాలూ లేకుండా కవి పండితుల కనేకమందికి ఆయన అనేకవిధాల సహాయం చేశారు. శ్రీ రాజేంద్రదేవ్‌గారి చీకటికోటలో పెద్ద గ్రంథాలయం వుండేదట. శ్రీ రాజేంద్రదేవ్‌గారు నేమానివారిని గౌరవాదరాలతో సంభావించి ఆంధ్రఋగ్వేదరచనను పూర్తిగా ప్రోత్సహించారు. అందువల్ల నేమానివారికి చీకటికోట రాజాగారి గ్రంథాలయంకూడా బాగా ఉపయోగపడిందనేచెప్పాలి. నేమానివారు చీకటిపట్టణంలో కొన్నిరోజులూ చీకటికోటలోనే కొన్నిరోజులూవుండి తమ ఆంధ్రఋగ్వేద రచనకు అవసరమైన గ్రంథాలను పరిశోధించి తమ అనువాదాన్ని కొనసాగించారు.

నేమానివారు ఆంధ్రఋగ్వేదరచనలో తొలి అధ్యాయం మొదలు ఎనిమిదవ అష్టకంలోని 7వ అధ్యాయంలో తమ రచనముగిసే వరకు ఒకదాని తరువాత ఒకటిగా క్రమంగా అధ్యాయాలను రచించలేదు. కొన్నికొన్ని అధ్యాయాలను భాగాలను అనువదించడం కష్టమనుకున్నప్పుడు తాత్కాలికంగా వాటిని విడిచి తేలికగావున్న భాగాలను మొదట పూర్తిచేసి ఆ తరువాత కష్టంగావున్న భాగాల విషయంలో అనేక గ్రంథాలను పరిశీలించి ఒక అవగాహనకువచ్చి లోగడవిడిచిన భాగాలు పూర్తిచేసుకుంటూ వచ్చారు. ప్రథమాష్టకంలో 8 అధ్యాయాలుండగా ప్రథమ ద్వితీయాధ్యాయాలను మొదట అనువాదంచేసి, తరువాత 3,4,5,6 అధ్యాయాలను అనువదించకుండా, 7వ అధ్యాయానువాదాన్ని పూర్తిచేసి, ఆ తరువాత మిగిలిన అధ్యాయాల రచనచేసినట్లు స్పష్టపడుతున్నది. మొట్టమొదట అనువాదం చెయ్యడంలో వేదంలోవున్న అధ్యాయాలను తెలుగులో అధ్యాయాలుగా కాక ఆశ్వాసాలుగా పేర్కొనాలని నేమానివారు భావించి ఆవిధంగా అధ్యాయాంతాలలో ఆశ్వాసం ముగిసినట్లుగా గద్యలు వ్రాశారు. ఆగద్య యిది.

—"ఇయ్యది శ్రీ భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచితకృతులలో ఋగ్వేదంబున ప్రథమాష్టకములో ప్రథమాశ్వాసము ముగిసెను."—

ఇదేవిధంగా ద్వితీయ, సప్తమాధ్యాయాంతాలలో కూడా "ద్వితీయాశ్వాసము ముగిసెను - సప్తమాశ్వాసము సంపూర్ణము" అని ఆశ్వాసశబ్దంతోనే ఇదేవిధమైన గద్యలున్నాయి. (వ్రాతప్రతి-ప్రథమసంపుటం-97,145,365పుటలు)-ఆ తరువాత ప్రస్తుతం యీ

గ్రంథంలో అధ్యాయాంతాలలో ముద్రితమైవున్నట్లుగా "శ్రీ భారద్వాజగోత్ర" ఇత్యాదిగా గద్యలు వ్రాయడం జరిగింది. ప్రథమ, ద్వితీయ, సప్తమాధ్యాయాలకు ప్రథమ, ద్వితీయ, సప్తమాశ్వాసాలుగా గద్యలువ్రాసి ఆ తరువాత ప్రథమాష్టంకంలో అన్ని అధ్యాయాలను అధ్యాయాలుగానే పేర్కొంటూ మొట్టమొదట వ్రాసిన గద్యనే వ్రాయడం జరిగింది. అంటే ప్రథమాష్టకంలోని 1,2,7 అధ్యాయాలను అశ్వాసాలుగా పేర్కొంటూ మొదట గద్యలువ్రాసినా-ఆ తరువాత అధ్యాయాలను అధ్యాయాలుగానే పేర్కొంటూ గోత్ర పితామహాదుల నామాలులేని గద్యలనే వ్రాయడం జరిగింది. ప్రథమాష్టకంలోని ఎనిమిది అధ్యాయాల గద్యలూ యీవిధంగానేవున్నా అశ్వాసాలుగా పేర్కొంటూ 1, 2, 7 అధ్యాయాల తుదినే గద్యలు వ్రాయడం జరిగింది. ఆతరువాత అశ్వాసాల స్థానంలో అధ్యాయాలు చోటుచేసుకున్నా మొత్తం గద్యలస్వరూపమే మారిపోయింది. మొట్టమొదట వ్రాసిన గద్యల్లో నేమానివారు 1, 2, 7అధ్యాయాలను మాత్రమే అశ్వాసాలుగా పేర్కొనడమూ మిగిలిన అధ్యాయాలను అధ్యాయాలుగానేపేర్కొనడమూ చూస్తే అశ్వాస శబ్ద ప్రయోగమున్న 1, 2, 7అధ్యాయాలను మొట్టమొదట ఆంధ్రీకరించినట్లు స్పష్టపడుతున్నది.

తృతీయాష్టకంలోని ప్రథమాధ్యాయాన్ని మొదట రచించకుండా ద్వితీయాధ్యాయంనుంచి అష్టకాంతంవరకూ క్రమంగా రచన పూర్తిచేసి-ఆ తరువాత చతుర్థాష్టకంలోని ప్రథమాధ్యాయం వ్రాసిన పిదప తాము మొదట విడిచిపెట్టిన తృతీయాష్టకంలోని ప్రథమాధ్యాయాన్ని నేమానివారు విరచించారు.

చతుర్థాష్టకంలో ద్వితీయాధ్యాయం మొదలు షష్ఠాధ్యాయాంతంవరకూ మొదట రచన పూర్తిచేసి - సప్తమ అష్టమాధ్యాయాలను రచించకుండా-పంచమాష్టకంలోని ఎనిమిది అధ్యాయాల రచననూ పూర్తిచేసి-ఆ తరువాత చతుర్థాష్టకంలో సప్తమ అష్టమాధ్యాయాల రచనకు పూనుకొని సప్తమాధ్యాయాన్ని పూర్తిచేసి అష్టమాధ్యాయంలో (6వ మండలం) 59వ సూక్తం తుదివరకూ రచించి చివరి రెండు సూక్తాలను ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టారు. (చూడు. వ్రాతప్రతి. 6వ సంపుటం.78పుట 7వ సంపుటం-1పుట) ఈ చివరి రెండు సూక్తాలూ విడిచి పెట్టబడి వ్రాతప్రతి 7వ సంపుటంలో 6వ మండలంలోని 62వ సూక్తంతో పంచమాష్టకంలోని ప్రథమాధ్యాయం ప్రారంభించబడింది.

చతుర్థాష్టకంలో 7వ అధ్యాయాన్ని 8వ అధ్యాయాన్ని రచించడం కష్టసాధ్యంగా నేమానివారికి కనిపించింది. అదేవిధంగా పంచమాష్టకంలోని4 5,6,7 అధ్యాయాలను అనువదించడంకూడా కొన్ని గ్రంథాలను పరిశీలించి చెయ్యవలసిన అవసరం యేర్పడింది. అందువల్ల చీకటిరాజాగారి కోటలోవున్న గ్రంథాలయంలోని అవసరమైన పుస్తకాలను పరిశీలిస్తూ అయిదవ అష్టకంలోని 4వ అధ్యాయాన్ని "చీకటి" పట్టణంలో విరచించి 5, 6, 7, 8 అధ్యాయాలను చీకటికోటలో విరచించారు. 4వ అష్టకంలోని 7వ అధ్యాయాన్ని అసంపూర్ణంగా విరచించిన 8వ అధ్యాయాన్ని చీకటి పట్టణంలోవుండి విరచించారు. చీకటిలోను చీకటికోటలోను అనేకపుస్తకాలను పరిశీలించి ఈ భాగాలు పూర్తిచెయ్యడానికి నేమానివారికి వేసవిసెలవులు చాలా ఉపయోగపడి సద్వినియోగమయ్యాయి. అష్టమాష్టకంలోని ప్రథమాధ్యాయాన్ని వేసవిసెలవుల్లో సాలూరులోని బంధువుల యింటికి వెళ్ళినప్పుడు రచించారు. చీకటిలోను చీకటికోటలోను సాలూరులోను విరచించిన అధ్యాయాలు మినహా(4వ అష్టకం7,8అధ్యాయాలు-5వ అష్టకం4,5,6,7,8అధ్యాయాలు-8వ అష్టకం ప్రథమాధ్యాయంతప్ప) మిగిలిన ఆంధ్రఋగ్వేద గ్రంథమంతా బరంపురంలోనే నేమానివారు వ్రాయడం జరిగింది. వివిధ అష్టకాలలోని ముందువెనుకలుగా వ్రాయబడిన అధ్యాయాలేవేవో రచన జరిగినస్థలాలూ తేదీలూ యిచ్చిన పట్టికను 56-57 పేజీలలో చూచి తెలుసుకొనవచ్చును.

## అనువదించకుండా నేమానివారు<br>విడిచిన ఋక్కులు – సూక్తాలు

శ్రీ నేమానివారు ఋగ్వేదాన్ని ఆంధ్రీకరించడంలో కొన్ని సూక్తాలలో కొన్నికొన్ని ఋక్కులను ఆంధ్రీకరించకుండా పొరపాటున విడిచిపెట్టడం జరిగింది. వివిధ మండలాలలోవున్న కొన్ని సూక్తాలకు సూక్తాలనే ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టడంకూడా జరిగింది. వాలఖిల్యసూక్తాల అనువాద సందర్భంలో ఖిలసూక్తాలుకాక - అసలు ఖిలసూక్తాల ప్రస్తావన చెయ్యకుండానే - వాలఖిల్యసూక్తాలు పదకొండుతోనూ కలిపి ఋగ్వేదంలో మొత్తం 1028 సూక్తాలున్నాయని పేర్కొన్న శ్రీ నేమానివారు దశమమండలం చివరిభాగంలో 55 సూక్తాలను ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టడమేకాక-ఆరవ మండలంలో-రెండు సూక్తాలను (60-61 సూక్తాలు), యెనిమిదవ మండలంలో నాల్గుసూక్తాలను (91-92-93-94-సూక్తాలు), తొమ్మిదవ మండలంలో రెండు సూక్తాలను (84-85 సూక్తాలు), దశమ మండలంలో (సప్తమాధ్యాయంలో)రెండుసూక్తాలను (25-26సూక్తాలు) అసలు అనువదించకుండా పూర్తిగా విడిచి

పెట్టారు. నేమానివారు అసలు వనుపదించకుండా సంపూర్ణంగా విడచిన సూక్త్యాలసంఖ్య 65- అంతేకాదు. ఇంకా వివిధ మండలాలలో విభిన్న సూక్తాలలో అనేక ఋక్కులను కూడా ఆంధ్రీకరించకుండా శ్రీ నేమానివారు విడిచిపెట్టారు. ఖిలసూక్తాలనబడినవాటి జోలికి గాని ఖిలమంత్రాలనబడినవాటి జోలికిగాని శ్రీనేమానివా రసలు వెళ్లనేలేదు. ఖిలమంత్రాలలో చేర్చడానికి అవకాశంవుండీకూడా చేర్చ కుండా నేమానివారు ఆంధ్రీకరించిన "అసూర్యా నామ తే లోకాః"(యజుర్వేదం-40వ అధ్యా-3వ మం) ఇత్యాదిఋక్కును "గాఢమైన తమము గ్రమ్మిన" ఇత్యాది గీతపద్యంగా అనువదించి 15b సంపుటంలో ప్రత్యేకించి విడిగావ్రాశారేతప్ప దానిని ఖిలమంత్రంగా యే సూక్తంలో చేర్చాలో అసలు వ్రాయనేలేదు.

నేమానివారు ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టిన వివిధసూక్తాలలోని ఋక్కులను-సూక్తాలను-వాటిని నేనాంధ్రీకరిస్తూ రచించిన ఆయా పద్యగద్యాల సంఖ్యలను వివరాలతో యీక్రింద పేర్కొనడం జరుగుతున్నది.

| వ్రాతప్రతి - సంపుటం | పేజీ - సంఖ్య | మండలం - సంఖ్య | సూక్తం - సంఖ్య | విడిచిన - ఋక్సంఖ్య | పూరణ - పద్య/గద్యాలు |
|---|---|---|---|---|---|
| 1 | 241 | 1 | 65 | 5 | 1 ∵ |
| 1 | 261 | 1 | 75 | 5 | 1 ∵ |
| 1 | 295 | 1 | 89 | 9 | 1 |
| 1 | 351 | 1 | 108 | 11,13 | 2 |
| 1 | 37 | 1 | 120 | 11 | 1 |
| 2 | 9 | 1 | 123 | 7 | 1 |
| 2 | 79 | 1 | 144 | 2 | 1 |
| 2 | 97 | 1 | 154 | 5 | 1 |
| 4 | 51 | 4 | 3 | 16 | 1 |
| 4 | 53 | 4 | 4 | 3 | 1 |
| 4 | 75 | 4 | 9 | 8 | 1 |
| 4 | 177 | 4 | 42 | 10 | 1 |
| 4 | 187 | 4 | 48 | 5 | 1 |
| 4 | 201 | 4 | 54 | 6 | 1 |
| 4 | 207 | 4 | 57 | 2 | 1 |
| 5 | 237 | 6 | 16 | 4 | 1 |
| 6 | 41 | 6 | 45 | 3 | 1 |
| 6 | 60 | 6 | 48 | 22 | 1 |
| *7 | — | 6 | 60 | 1–15@ | 15 |
| *7 | — | 6 | 61 | 1–14 | 15 |
| 7 | 124 | 7 | 38 | 1– 8 | 9 |
| 7 | 129 | 7 | 40 | 6 | 1 |
| 7 | 137 | 7 | 44 | 5 | 1 |
| 8 | 186 | 7 | 70 | 5 | 1 |

∵ ఇక్కడ నేమానివారు సీసపద్య పాదాలు నాలుగు వ్రాసి గీతపద్యం రచించలేదు. అందువల్ల గీత పద్యాన్ని నేను విరచించి పూరించడం జరిగింది.

* ఋగ్వేదంలో 6వ మండలంలో వున్న 60,61 సూక్తాలను శ్రీ నేమానివారు ఆంధ్రీకరించలేదు. వ్రాత ప్రతి 7వ సంపుటంలో 62వ సూక్తంతో ప్రారంభమైన తొలి పేజీనుంచి 1,2,3 మొదలైన పేజీల క్రమసంఖ్యలను శ్రీనేమానివారే స్వయంగావేశారు.అంతకు ముందు కొన్నికాగితాలుకూడా వ్రాయకుండా విడిచిపెట్టబడి వున్నాయి.60,61 సూక్తాలను నేమానివారాంధ్రీకరించివుంటే ఈ అనువాద భాగం వ్రాత ప్రతి 6వ సంపుటం చివరగాని, 7వ సంపుటం మొదటగాని వ్రాసేవారు. ఈ అనువాదభాగం వ్రాతప్రతుల్లోలేదు.

@ 1-15 అంటే ఒకటవ ఋక్కు మొదలు 15 వ ఋక్కువరకూ అని గ్రహించాలి. ఈ పట్టికలో మధ్యలో—అని డాష్ పెట్టిన ఋతర సందర్భాలలో సైతం యీ విధంగానే ఆయా ఋక్కు మొదలు ఆయా ఋక్కులవరకూ అని గ్రహించాలి.

| వ్రాతప్రతి సంపుటం | పేజీ సంఖ్య | మండలం సంఖ్య | సూక్తం సంఖ్య | విడిచిన ఋక్సంఖ్య | పూరణ పద్య/గద్యాలు |
|---|---|---|---|---|---|
| 9 | 75 | 8 | 23 | 3 | 1 |
| 9 | 75 | 8 | 23 | 4,5,6 | 1△ |
| 9 | 185 | 8 | 46 | 33 | 1 |
| 9 | 277 | 8 | 72 | 18 | 1 |
| 9 | 327 | 8 | 91 | 1–7 | 17 |
| 10 | 2 | 8 | 92 | 1–33 | 32 |
| 10 | 2 | 8 | 93 | 1–34 | 33 |
| 10 | 3 | 8 | 94 | 1–12 | 12 |
| 10 | 85 | 9 | 63 | 10 | 1 |
| 10 | 128 | 9 | 84 | 1–5 | 10 |
| 11□ | — | 9 | 85 | 1–12 | 24 |
| 11 | — | 9 | 86 | 1–21 | 42 |
| 11 | 9 | 9 | 86 | 32 | 1 |
| 11 | 253 | 10 | 24 | 5–6 | 2 |
| 12 | 1 | 10 | 25 | 1–11 | 22 |
| 12 | 1 | 10 | 26 | 1– 9 | 18 |
| 12 | 1 | 10 | 27 | 1– 7 | 14 |
| 12 | 21 | 10 | 32 | 2– 3 | 3 |
| 12 | 67 | 10 | 45 | 7–12 | 6 |
| 14 | 183 | 10 | *136 (138) | 7 | 1@ |

△ 8వ మండలం 23వ సూక్తంలోని 4,5,6 ఋక్కులను శ్రీనేమానివారు ఆంధ్రీకరిస్తూ వ్రాసిన అత్యంతదీప్తిచే సిత్యాదిగాగల సీసపద్యంలో సీసపాదాలను మూడుపాదాలనుమాత్రమే విరచించి నాల్గవ సీసపాదాన్ని విరచించలేదు. (చూడు వ్రాతప్రతి-9వ సంపుటం-75వ పేజీ) కాబట్టి యీపాదం నేను విరచించి పూర్తిచెయ్యడం జరిగింది.

□ ఈ 11వ సంపుటంలో వ్రాత 5వ పేజీలో నవమమండలంలోని 86వ సూక్తగతమైన 22వ ఋగనువాదంతో ప్రారంభమైనది.

* ఈ సమూల శ్రీ మదాంధ్రఋగ్వేదసంహితలో వివిధ ఋగ్వేద మూలప్రతులలో వున్న ఖిలమంత్రాలను ఖిలసూక్తాలను ఆయా సందర్భాలలో కలిపి ఋక్కుల క్రమసంఖ్యను సూక్తాల క్రమసంఖ్యను తదనుగుణంగా మార్చడం జరిగింది. అందువల్ల మూల ఋగ్వేదంలోనే కాక ఆంధ్రఋగ్వేదంలోకూడా సూక్తాల సంఖ్య తగువిధంగా యీ సంకలన ముద్రణ ప్రతిలో మార్చడం జరిగింది. శ్రీ నేమానివారి ఋగ్వేద ఆంధ్రానువాదం దశమ మండలంలో 136వ సూక్తానువాదంతో ముగిసింది. మూల ఋగ్వేదంలో 10వ మండలంలో 128వ సూక్తం తరువాత వరుసనే రెండు ఖిలసూక్తాలను వాటి ఆంధ్రీకరణను ఆంధ్రఋగ్వేదంలో చేర్చడం జరిగింది.కాగా 129, 130 సంఖ్యలతో ఖిల సూక్తాలు ఆంధ్రీకరణలో చోటుచేసుకోగా నేమానివారు ఆంధ్రీకరించిన 129,130,131,132,133,134, 135,136, సంఖ్యలుగల మూలసూక్తాలు 131,132,133,134,135,136,137,138 సంఖ్యలుగల సూక్తాలుగా మార్పుచెందాయి.అందువల్ల నేమానివారు 6ఋక్కులను సంపూర్ణంగాను 7వ ఋక్కును అసంపూర్ణంగాను అనువదించిన అనువాద గ్రంథంలో చివరి సూక్తంగా ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతిలో (14వ సంపుటం, 183 పేజీ) వున్న 136వ సూక్తం 138వ సూక్తంగా మార్పు చెందింది. ఈ కారణం చేతనే యీ పై పట్టికలో 136వసూక్తసంఖ్య దగ్గర బ్రాకెట్లలో 138వ సంఖ్యకూడా యివ్వడం జరిగింది.

@ దశమండలంలో 136వ సూక్తంలోని (ఖిల సూక్తాలతో కలిపితే 138వ సూక్తం)7వ. ఋగనువాదంగా శ్రీనేమానివారు రెండు గీత పద్యాలు విరచించినట్లు కనిపిస్తున్నది. వీటిల్లో రెండవగీతమైన "క్రింద స్రవియించు విధమున" ఇత్యాది గీత పద్యం మూడు పాదాలలోని అసమగ్రంగా ఉన్నది. బహుశః నాల్గవ పాదం వ్రాయడం నేమానివారు మరచిపోయివుండవచ్చును. అందువల్ల ఈ గీతం నాల్గవ పాదాన్ని నేను విరచించి పూరించడం జరిగింది. (చూ-వ్రాతప్రతి-14వ సంపుటం. 183వ పేజీ) ఈ అసమగ్ర పద్యంతోనే శ్రీ నేమానివారికవిత దశమండలంలో ముగిసింది. ఈ పాదంతో మొదలుపెట్టి దశమండలంలో మిగిలిన సూక్తాలన్నింటినీ 137వ సూక్తం మొదలు-పూర్వపు ఖిలసూక్తాలతో కలిపితే 139వ సూక్తంమొదలు-చిట్టచివర ఖిలసూక్తాలతో కలిపి 198వ సూక్తం వరకూ నేనాంధ్రీకరించి ఆంధ్ర ఋగ్వేద సంహితను పూరించడం జరిగింది.

## శ్రీ నేమానివారు దశమ మండలంలో ఆంధ్రీకరించకుండా విడిచిన వివిధసూక్తాలలోని ఋక్కులు - సూక్త సంఖ్యలు - నేను పూరిస్తూ విరచించిన పద్యగద్యాలు

| మండలం - సంఖ్య | సూక్తం - సంఖ్య | ఋక్కు - సంఖ్య | పూరణ పద్య/ గద్యాలు | మండలం - సంఖ్య | సూక్తం - సంఖ్య | ఋక్కు - సంఖ్య | పూరణ పద్య/ గద్యాలు |
|---|---|---|---|---|---|---|---|
| 10 | 139 | 1-7 | 7 | 10 | 169 | 1-5 | 6 |
| 10 | 140 | 1-6 | 12 | 10 | 170 | 1-5 | 6 |
| 10 | 141 | 1-6 | 10 | 10 | 172 | 1-4 | 7 |
| 10 | 142 | 1-6 | 10 | 10 | 173 | 1-4 | 5 |
| 10 | 143 | 1-6 | 6 | 10 | 174 | 1-4 | 4 |
| 10 | 144 | 1-8 | 13 | 10 | 175 | 1-4 | 5 |
| 10 | 146 | 1-6 | 8 | 10 | 176 | 1-4 | 4 |
| 10 | 147 | 1-6 | 6 | 10 | 177 | 1-4 | 4 |
| 10 | 148 | 1-6 | 6 | 10 | 178 | 1-6 | 8 |
| 10 | 149 | 1-6 | 7 | 10 | 179 | 1-5 | 5 |
| 10 | 150 | 1-5 | 7 | 10 | 180 | 1-4 | 4 |
| 10 | 151 | 1-5 | 9 | 10 | 181 | 1-4 | 5 |
| 10 | 152 | 1-5 | 7 | 10 | 182 | 1-3 | 6 |
| 10 | 153 | 1-5 | 5 | 10 | 183 | 1-3 | 4 |
| 10 | 154 | 1-5 | 6 | 10 | 184 | 1-3 | 3 |
| 10 | 156 | 1-5 | 5 | 10 | 185 | 1-3 | 6 |
| 10 | 157 | 1-5 | 5 | 10 | 186 | 1-3 | 3 |
| 10 | 158 | 1-5 | 5 | 10 | 187 | 1-3 | 5 |
| 10 | 159 | 1-5 | 8 | 10 | 188 | 1-3 | 5 |
| 10 | 160 | 1-5 | 5 | 10 | 189 | 1-3 | 4 |
| 10 | 161 | 1-5 | 5 | 10 | 190 | 1-3 | 3 |
| 10 | 162 | 1-5 | 6 | 10 | 191 | 1-3 | 3 |
| 10 | 163 | 1-6 | 6 | 10 | 192 | 1-5 | 5 |
| 10 | 164 | 1-5 | 7 | 10 | 193 | 1-3 | 3 |
| 10 | 165 | 1-5 | 10 | 10 | 194 | 1-3 | 3 |
| 10 | 166 | 1-6 | 7 | 10 | 195 | 1-3 | 3 |
| 10 | 167 | 1-6 | 6 | 10 | 196 | 1-4 | 5 |
| 10 | 168 | 1-5 | 7 | | | | |

శ్రీనేమానివారు ఋగ్వేద ఆంధ్రీకరణకై బహుముఖమైన పరిశ్రమచేసి కేవలం తాను మొదట ఆంధ్రీకరించిన దానితోనే తృప్తి పడక అనేకసార్లు దానిని సింహావలోకనం చేసుకుంటూ వచ్చారు. కేవలం తనకు సరతృప్తికరమైన ఋక్కుల భావనాబలం యేర్పడి తేనేతప్ప వాటి ఆంధ్రీకరణ తృప్తిగా చేసేవారుకాదు. సరియైన పరిశీలన-పరిశోధనా చేసేవరకూ అనువాదానికి సమకట్టేవారేకాదు. తమకు కొరుకుడుపడని వాటిని-అధ్యాయాలకు అధ్యాయాలనే-తగు పరిశ్రమచేసేవరకూ వాటికి సంబంధించిన పుస్తకాలు లభించే వరకూ అనువదించకుండా నిలిపి తరువాతి భాగాల అనువాదానికి ఉపక్రమించేవారు. ఇందుకు శ్రీ నేమానివారు 'చీకటి'లోను 'ఓకటి కోట'లోనూ అనువదించిన భాగాలు ప్రత్యక్షప్రమాణాలు. 1930-1931సంవత్సరాలలో శ్రీ నేమానివారి ఆరోగ్యం అంతగా బాగుండక గతంలోవలె అహరహం కృషిచేసి అనువదించడం మానివేశారు.1930నుంచి నేమానివారు కీర్తిశేషులయ్యేవరకూ తరచుగా అనారోగ్యానికి

గురవుతూ వచ్చారని కళ్ళికోటరాజా ఎడ్యుకేషన్ ట్రస్ట్ ఆఫీసులో గుమస్తాగా పనిచేస్తున్న శ్రీ జగన్నాథ పాత్రోగారూ శ్రీనేమాని వారు నివసించిన యింటియజమాని శ్రీ పులుగుర్తి కృష్ణమూర్తి దంపతులూ తెలియజేశారు. 1930లో నేమానివారు ఆంధ్రఋగ్వేద రచన ఆపివేసినా అసలు బొత్తిగా పనిచెయ్యలేదనిగాని ఆంధ్రఋగ్వేదరచనా విషయమే పట్టించుకొనలేదనిగాని చెప్పడానికి వీలులేదు. లోతుగా పరిశీలించిచూస్తే 1930లో శ్రీ నేమానివారికి మరికొన్ని ప్రామాణికమైన ఋగ్వేదప్రతులు తదితరగ్రంథాలూ లభించినట్లూ వారు వాటి నన్నిటినీ పరిశీలించినట్లూ అర్థమవుతున్నది. తాము ఆంధ్రీకరించిన ప్రథమ, ద్వితీయ, తృతీయ మండలాలను 1930 చివరి భాగంలో పునఃపరిశీలనచేసి తమ రచనకు తామే మరికొన్ని మెరుగులు దిద్దారు. ఈ మెరుగులు దిద్దడంలో అనేకవిధాలుగా పాఠాలను మార్చి వ్రాశారు. ఈవిధంగా మెరుగులు దిద్దడంలో నేమానివారు ప్రథమ, ద్వితీయ మండలాలలో చివరి పాఠంగా నిలిపిన పాఠాలను అసలు రచనలోనే యథాతథంగా వుంచి ముద్రించి-సవరించిన పాఠాలకు మూలకందాలైన తొలిపాఠా లన్నింటినీ ఈ ముద్రిత ప్రథమ సంపుటంలో తొలిపాఠాలుగానే ఫుట్‌నోటుల్లో చూపించడం జరిగింది. ఈ తొలిపాఠాలను చూస్తేనే తమ రచనకు మెరుగులు దిద్దడానికి నేమానివారు యెంతశ్రమపడ్డారో మనం ఊహించుకొనవచ్చును. ప్రథమ, ద్వితీయ, తృతీయ మండలాలను పునఃపరిశీలించి మెరుగులు దిద్దడం 12-10-1930వ తేదీవరకూ పూర్తిచేసి వారే ఆతేదీవేసి రివైజ్డు(**Revised**) అని ఇంగ్లీషులో వ్రాశారు.ఇదేవిధంగా వ్రాతప్రతి 6వ సంపుటంలో కూడా (6వ మండలంలో) శ్రీ నేమానివారు అనేక సవరణలు చేశారు. 1930లో తొలి యెనిమిది మాసాలూ ఋగ్వేదంలో వివిధసూక్తాల ఋషిదేవతలకు సంబంధించి సరియైన ఋషిదేవతల పట్టికను రూపొందించాలని అభిప్రాయపడి అనేక ప్రామాణిక గ్రంథాలను పరిశీలించి ఋషిదేవతల పట్టికలు ప్రామాణికంగా రూపొందించారు. ఈకృషి 1930 ఆగస్టువరకూ జరిగిందని తెలపడానికి 15b సంపుటంలోని సూక్తఋషిదేవతల పట్టికలతోకూడిన చివరిరెండు ఎక్సర్‌సైజు పుస్తకాలమీద శ్రీనేమానివారే వేసిన 10-8-30, 11-8-30 తేదీలు ప్రత్యక్ష ప్రమాణంగా వున్నాయి. ఈ ఋషిదేవతల సూచికలో వున్న వివిధ ఋషిదేవతల నామాలన్నీ చాలావరకు ప్రామాణిక ఋగ్వేదప్రతులలోని ఋషిదేవతల నామాలతో సరిపోతున్నాయి. ఆంధ్ర ఋగ్వేద సంహితారచనలో వివిధ మండలాలలో వ్రాయబడిఉన్న ఋషిదేవతల నామాలను కొన్ని కొన్ని సందర్భాలలో ప్రామాణిక గ్రంథస్థ ఋషిదేవతలతో తులనాత్మకంగా సరిపోల్చిచూస్తే తేడాలు వస్తున్నాయి. అనేకసందర్భాలలో శ్రీ నేమానివారే స్వయంగా రూపొందించిన ఋషిదేవతల సూచికలోవున్న ఆయాసూక్త ఋషిదేవతలు ఆంధ్రఋగ్వేద సంహితాసూక్త ఋషిదేవతలతోనే భేదిస్తున్నాయి. ఈవిధంగా ప్రామాణిక గ్రంథాలలోని ఋగ్వేద సూక్త ఋషిదేవతలకూ ఆంధ్ర ఋగ్వేద సంహితలోని సూక్త ఋషిదేవతలకూ నేమానివారిచ్చిన సూక్త ఋషిదేవతల పట్టికలోని ఋషిదేవతలకూ వున్న విభిన్నత్వాన్ని ఆయా సూక్త సందర్భాలలో ఫుట్‌నోటుల్లో వివరించడం జరిగింది. అనేక సందర్భాలలో ఆంధ్రఋగ్వేద సంహితలో వ్రాయబడిన ఋషిదేవతలు పొరపాటుగా వుండడం - ఋషిదేవతల పట్టికలో యిచ్చినవే చాలావరకు ప్రామాణికమైనవిగా వుండడంచూస్తే ఆంధ్ర ఋగ్వేద రచనా సందర్భంలో నేమానివారు అనుసరించిన మూల ఋగ్వేద ప్రతి ప్రామాణికమైనది కాదని స్పష్టపడుతున్నది. శ్రీనేమానివారి ఆరోగ్యం సరిగాలేనందువల్లనే తమకై తాము రూపొందించిన ప్రామాణికమైన సూక్త ఋషిదేవతల పట్టికతో ఆంధ్ర ఋగ్వేద సంహితలోని సూక్త ఋషిదేవతలను తామే సరిపోల్చిచూచి సంహితా భాగంలోని సూక్త ఋషిదేవతలను తాము రూపొందించిన సూక్త ఋషిదేవతల పట్టిక కనుగుణంగా సవరించలేకపోయారు.

అంతేకాదు. శ్రీనేమానివారు 1930 లో ఆంధ్ర ఋగ్వేద సంహితలోని తొలిభాగాలను కొన్నింటిని పునఃపరిశీలించి మెరుగులు దిద్దినా, తాము రచించిన మొత్తం గ్రంథాన్ని అనారోగ్య కారణాలవల్లనే అసలు మూల ఋగ్వేదంతో సరిపోల్చి తులనాత్మకంగా పరిశీలన చెయ్యలేక పోయారు. తత్ఫలితంగా తాము యేయే సూక్తాలలో యెక్కడెక్కడ యేయే ఋక్కులను అనువదించకుండా విడిచి పుచ్చారో! యేయే ఋగనువాదాలకు భ్రమ ప్రమాదాలకులోనై ఋక్సంఖ్యలను పొరపాటుగా వేశారో ! చివరికి యేయే సూక్త సంఖ్యలను పొరపాటుగా వేశారోకూడా పునఃపరిశీలనచేసి ఆయా దోషాలను గుర్తించి తగువిధంగా మూల ఋగ్వేదానుగుణంగా సవరించకుండా విడిచి తుది మెరుగులు దిద్దలేకపోయారు. శ్రీనేమానివా రే యే సూక్తాలలో యేయే ఋగనువాదాల సందర్భంలో ఋక్సంఖ్యలను హెచ్చు తగ్గులకులోనై పొరపాటుగా వేశారో మూలంతో సరిపోల్చిచూచి పొరపాట్లను గుర్తించి ఆయా ఋగనువాదాల సందర్భంలోనే నేను వాటిని ఫుట్‌నోట్లలో తెలియజేశాను. పొరపాటున అనువదించకుండా విడిచిన ఋక్కుల్ల విషయం ఫుట్‌నోటుల్లో తెలియజెయ్యడమే కాక ఆయా ఋక్కులకు నేను అనువాదాలను విరచించి పూరించడంకూడా జరిగింది.

శ్రీ నేమానివారి కవిత మృదుమధురమైనది. ధారాళమైనది. భారతరామాయణాది గ్రంథాల ఆంధ్రీకరణవలె మౌలికమైన స్వతంత్రభావవ్యవస్థకు స్థానం లేకపోయినా అనుస్యూతకథా సంబద్ధం కాకపోయినా దశసహస్రాధికమైన పద్యగద్యాలతోకూడిన ఈ మహత్తరగ్రంథాన్ని ఆంధ్రీకరణగా రూపొందించడంలో శ్రీనేమానివారు తమకున్నవేదవిజ్ఞానపరిధిలో ఋషికల్పులుగా తపోదీక్షతో కృషిచేసి అజరామరు లయ్యారు. ఆంధ్రఋగ్వేదసంహితారచనలో శ్రీనేమానివారు రచించినమొత్తం పద్యగద్యాలు 10,614. వీటిల్లో 1,988 గద్యాలరూపంలోనూ - 8,626 పద్యాల రూపంలోనూ వున్నాయి. అనేకమందిపెద్దలు ఆరోజుల్లో ఆంధ్రఋగ్వేదసంహితను మొత్తం సరళమైన తెలుగువచనంలోనే రచించవలసిందిగా నేమానివారికి సలహా యిస్తూవుండేవారట. కాని పద్యాత్మకంగానే ఆంధ్రీకరించాలని నేమానివా రభిప్రాయపడి మిత్రుల సలహాలను కాదనలేక అక్కడక్కడా గద్యాలుకూడా రచిస్తూ వచ్చారు. అంతేకాదు. 6వ మండలంలోని 62వ సూక్తంమొదలు 8వ మండలంలోని 11వ సూక్తాంత్యంవరకూ నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు వివిధఋక్కులను వచనాలుగానే విరచించారు. ఈ భాగమంతా పంచమాష్టకమే. ఈ పంచమాష్టకానువాదంలో వివిధ ఋగను వాదాలుగా 1,229 గద్యాలుండగా కేవలం 23 మాత్రమే పద్యాలున్నాయి. 1931-1932 సంవత్సరాలలోకూడా ఋగ్వేదాన్ని వచనంలోనే అనువదించవలసిందని అందరూ సలహా చెప్పేవారట. చివరికి పారనంది వెంకటరమణమూర్తిగారితోపాటు 6-7-1931వ తేదీన కళ్ళికోటకాలేజీలో తెలుగుపండితులుగా నియమితులయిన శ్రీవిశ్వనాథ వరాహనరసింహశాస్త్రిగారుకూడా మిగిలినఋగ్వేదభాగాన్ని సరళవచనంలోనే ఆంధ్రీకరించవలసిందిగా నేమానివారిని ఒత్తిడిపెట్టారట. దీనినిబట్టి నేమానివారు కీర్తిశేషులయ్యేవరకూ ఋగ్వేద దశమమండల శేషభాగాన్ని ఆంధ్రీకరించలేదనే చెప్పవలసివుంటుంది.

శ్రీనేమానివారు కేవలదశమమండలంలో 137వ సూక్తంమొదలు తుదివరకూవున్న గ్రంథభాగమేకాక మామూలుగా వివిధమండలాలలో తా మనువదించిన సూక్తాలలోనే వున్న మధ్యమధ్యఋక్కులను భ్రమప్రమాదాలకులోనై పొరపాటున అనువదించలేదు. ఖిల సూక్తాలా ఋక్కులా చేరనటువంటి మూల ఋగ్వేదంలోని 137వ సూక్తంమొదలు 191వ సూక్తాంత్యంవరకూ వున్న 250 ఋక్కులను విడిచిపెట్టడంతోపాటు వివిధమండలాలలోని విభిన్నసూక్తాలలోవున్న 230 ఋక్కులనుకూడా ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టారు. అంటే మూలఋగ్వేదంలోని 480 ఋక్కులను నేమానివారు ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టారన్నమాట. మామూలుగా ప్రచురితమైన మూల ఋగ్వేదానికి భిన్నంగా వివిధ సూక్తాలలోని ఖిలమంత్రాలు అనేకఋక్కులతోవున్న ఖిలసూక్తాలలోని మంత్రాలు మొత్తం 315అధికంగా వున్నాయి. ఈ మంత్రాలను అసలు నేమానివారు పట్టించుకోనేలేదు. మొత్తం ఖిలమంత్రాలనుకూడా కలిపితే నేమానివారు ఆంధ్రీకరించని ఋక్కులసంఖ్య 795కు పెరిగింది. నేమానివారు ఆంధ్రీకరించకుండావిడిచిన 480 ఋక్కులనూ నేను 604 పద్యగద్యాలలో ఆంధ్రీకరించి పూరించడం జరిగింది. అత్యధికంగావున్న 315 ఖిలమంత్రాలనుకూడా మూలఋగ్వేదంలోకలిపి ఈ ఖిలమంత్రాలను 538 పద్యాలలో నేనాంధ్రీకరించడం జరిగింది. ఇంతేకాక వివిధఋక్కులకు నేమానివారుచేసిన ఆంధ్రీకరణకు భిన్నంగా ప్రత్యేకించి 101 అర్థాంతర పద్యాలుగా నేనాంధ్రీకరించడం జరిగింది. అంటే ఈ ఆంధ్రఋగ్వేదసంహితలో నేను విరచించిచేర్చిన ఋగనువాద పద్యగద్యాలు రెండు అంకితంపద్యాలతోకలిపి మొత్తం 1,245 అన్నమాట. నేమానివారు అసమగ్రంగా రచించిన 4 ఋగనువాదాలనుకూడా నేను పూరించడం జరిగింది. ఆంధ్రఋగ్వేదంలో కలపకుండా 15వ సంపుటంచివర శ్రీనేమానివారు విరచించిన యజుర్వేదఆంధ్రానువాద పద్యానికితోడు నేను విరచించిన విశిష్టమంత్రానువాద గీతికలనుకూడా కలిపితే నేను విరచించినపద్యగద్యాలు 1250 కాగలవు. మొత్తం ఆంధ్రఋగ్వేదసంహితలో శ్రీనేమానివారు విరచించిన వివిధపద్యగద్యాలూ అంకితంపద్యాలతోను యజుర్వేదమంత్రానువాద పద్యంతోను కలిపి 10,614. నేమానివారిపద్యాలూ నేను విరచించినపద్యాలూకలిపి చిట్టచివర ఋగ్వేదప్రశంసాపద్యంగా నేను స్వతంత్రంగా రచించిన పద్యాన్నికూడా కలిపితే ఆంధ్రఋగ్వేదసంహితలోని పద్యగద్యాల మొత్తంసంఖ్య 11,865 కాగలదు.

## అనువాదపద్ధతి

శ్రీ నేమానివారు ఋగ్వేద ఆంధ్రీకరణలోచేసిన పరిశ్రమ అసాధారణమైనదని చెప్పకతప్పదు. వేదాన్ని ఆంధ్రీకరించడంలో శ్రీ నేమానివారు నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు సాయణాచార్యవిరచితమైన భాష్యాన్నే ఆధారంగా తీసుకున్నారు. శ్రీ నేమానివారు కేవలం సాయనభాష్యాన్నేకాక స్కందభాష్యాన్ని దయానందసరస్వతిభాష్యాన్నికూడా పరిశీలించారు సకృత్తుగా కొన్నిసందర్భాలలో దయానంద

సరస్వతిభాష్యాన్ని అనుసరించి స్కందభాష్యాన్ని అనుసరించికూడా ఆంధ్రీకరించారు. సాయనభాష్యానుగుణంగా ఆంధ్రీకరణచేసినా దయానందసరస్వతిభాష్యభావాన్ని సైతం సక్రృత్తుగా ఆంధ్రీకరించి పేర్కొన్న సందర్భాలుకూడా లేకపోలేదు. కొన్నికొన్ని సందర్భాలలో అర్థాంతరపద్యాలనుకూడా విభిన్నభాష్యాలను దృష్టిలోపెట్టుకుని నేమానివారు విరచించడంజరిగింది. శ్రీనేమానివారు సాయనభాష్యాను సారంగాచేసిన అనువాదరచన గ్రంథమంతటా యెక్కడపడితే అక్కడ దృశ్యమాన మవుతూనేవుంటుంది. ఇందుకు ప్రత్యేకించి ఉదాహరణలు యీయనవసరంలేదు. దాదాపు గ్రంథమంతా ఉదాహరణేననిచెప్పవచ్చును. అయితే కొన్నికొన్ని సందర్భాలలో నేమానివారు సాయన భాష్యానికి భిన్నంగా విరుద్ధంగా ఆంధ్రీకరించిన సందర్భాలుకూడా లేకపోలేదు. యిందుకు ఉదాహరణగా ప్రథమమండలంలోని 64వ సూక్తంలోవున్న 1వ ఋగనువాదం, (175వ పుట, 19వ పద్యం) 65వసూక్తంలోవున్న 5వ ఋగనువాదం (180వ పుట, 27వ పద్యం) మొదలైనవాటిని పరిగ్రహించవచ్చు. శ్రీనేమానివారు బహుగ్రంథ పరిశోధనాపాటవంతోపాటు తత్వచింతనలోకూడా విశేషమైనఆసక్తి కలవారు. కేవలం ఆసక్తివుండడం మాత్రమేకాదు. తన్నుతాను పరబ్రహ్మసేవకుడుగాసైతం వర్ణించుకునేస్థితిలో తత్వచింతనస్థాయికి చేరుకున్నారు. ఈతత్వస్థితికిప్రతిబింబకంగా ఆంధ్రఋగ్వేదసంహిత ప్రథమాష్టకంలోని 8వఅధ్యాయం ముగిసినపుడు మొదట యీక్రిందివిధంగా గద్యం వ్రాశారు.

—"ఇయ్యది పరబ్రహ్మసేవక నేమాని వేంకటనరసింహశాస్త్రి ప్రణీతంబగు గ్రంథములో ఋగ్వేదంబున ప్రథమాష్టకమున నెనిమిదవయధ్యాయము ముగిసెను. పరబ్రహ్మార్పణమస్తు."–

మొదట ఈవిధంగాగద్యం వ్రాసిన నేమానివారు దీనిని కొట్టివేసి తరువాత వివిధఅధ్యాయాంతాలలో వ్రాసిన గద్యవలెనే తిరిగి గద్యను మార్చివ్రాశారు. ప్రథమాష్టకంలోని అష్టమాధ్యాయగద్యలో తత్వదృష్టితో పరబ్రహ్మసేవకులై "పరబ్రహ్మార్పణమస్తు" అన్నివాసిన శ్రీనేమానివారు మారినగద్యలలో భగవత్పాదారాధకులుగామారి "బ్రహ్మార్పణమస్తు" అనిముగించారు. ఇంత తత్వచింతనవున్నా ఋగ్వేదం అనువదించడంలో తత్వదృష్టితో వేదాంతపరంగా అనువాదం చెయ్యడానికి అవకాశాలున్నచోటకూడా నేమానివా రాదృష్టిని ఉపయోగించక పోవడానికికారణం ఊరవగాహంగా వున్నది. సాధారణంగా నేమానివారి ఋగ్వేద ఋగనువాదా లన్నీ ఋక్కులు స్తోత్రరూపాలేనన్న దృక్పథంతో విరచించబడ్డాయి. విభిన్న ఋగ్వేదఅధ్యాయాలను ఆంధ్రీకరించడంలో సులభంగావున్న అధ్యాయాలను మొదటఅనువదించి క్లిష్టంగావున్నభాగాలను మరికొన్నిగ్రంథాల పరిశీలన చేసిన తరువాతనే నేమానివారు అనువదించారనిగతంలోనే సాధికారికంగా నిరూపించడం జరిగింది. ఋగ్వేదం ఎనిమిదవమండలంలో 11వాలఖిల్యసూక్తాలు కనిపిస్తున్నాయి. సాయనుడు చూచిన ఋగ్వేదంలో వాలఖిల్యసూక్తాలు యెనిమిదిమాత్రమే వున్నట్లు సాయనాచార్యులు రచించిన ఐతరేయబ్రాహ్మణ టీకలో పేర్కొనడం జరిగింది. కనీసం ఈయెనిమిదివాలఖిల్యసూక్తాలకైనా సాయనాచార్యులు భాష్యంవ్రాయలేదనే అభిప్రాయం పండితమండలిలో వున్నది. కాని నేమానివారుమాత్రం వాలఖిల్య సూక్తాలను పదకొండింటినీ అవిభాష్యరహితంగావున్నందువల్ల చాలా శ్రమపడి ఆంధ్రీకరించినట్లు అష్టమమండలంలోని 49వ సూక్తం ప్రారంభంలో అంటే వాలఖిల్యసూక్తాలలోని తొలిసూక్తానికి ప్రారంభంలో ఉపోద్ఘాతంగా ఈ క్రిందివాక్యాలు వ్రాశారు.

—"49వసూక్తమునుండి 59సూక్తమువరకుగల 11సూక్తములు వాలఖిల్యప్రోక్తములు. సాయనాచార్యుడీవాలఖిల్యసూక్తములకు వ్యాఖ్యానముఁ జేయలేదు. అందుకుఁ గారణమును దెలుపలేదు. వీనిని భాషాంతరీకరించుట మిక్కిలి శ్రమసాధ్యము. ఐతరేయబ్రాహ్మణముల టీకలో సాయణుడిట్లువ్రాసెను. "ఎనిమిదిమాత్రము వాలఖిల్యుడు చెప్పిన సూక్తములు." కాని మాక్సిముల్లరు ప్రకటించిన గ్రంథమును దిలకించిన 11సూక్తములుగలవు. ఆలోచింపగా సాయణుఁ డేగ్రంథలిపిని దిలకించినాఁడోగాని యందు 8 సూక్తములుమాత్రమే గలవు. ఋగ్వేదసంహితాసూక్తములు సాయణునికాలమందు 1028సూక్తములని నిర్దేశింపవచ్చును. ఋగ్వేదసూక్తములను గణనసేయగా 1028సూక్తము లగును. వీనిని విడిచిపెట్టినయెడల 1017సూక్తము లగును." (వ్రాతప్రతి-9వసంపుటం–197వపుట)

ఐతరేయబ్రాహ్మణటీకలో 8వాలఖిల్య సూక్తా లున్నాయని పేర్కొన్నసాయనాచార్యులు వాలఖిల్యసూక్తాలకు కనీసం ఆ 8సూక్తాలకైనా భాష్యంవ్రాయకుండావుంటాడనటం విశ్వసించదగినదిగా కనపడదు. సాయనభాష్యవ్రాతప్రతులలో వాలఖిల్యసూక్తాలకు సాయనుడు

వ్రాసినభాష్యాన్ని వాలఖిల్యులపట్ల గౌరవభావంలేనివారు* తొలగించివుండవచ్చును. కాని సాయనాచార్యులు వాలఖిల్యసూక్తాలకు భాష్యం అసలు వ్రాయనేలేదనడం వాస్తవంగా కనపడదు. వాలఖిల్యసూక్తాలు ఎనిమిది మాత్రమేనా ? పదకొండా ? అన్నది వేరేవిషయం. కాని కాశీలోని ప్రభుత్వ సంస్కృతపాఠశాలలో భద్రపరచబడిన ఒకతాళపత్రగ్రంథంలో పదకొండు వాలఖిల్యసూక్తాలకు కేవలభావార్థంతో కూడినభాష్యం లభించింది. మామూలుగా సాయనాచార్యులు విరచించినభాష్యపద్ధతికీ శైలికీ ఈవాలఖిల్యసూక్తాల భాష్యశైలులకూ భిన్నత్వం వుండడంవల్ల యిది సాయనాచార్యకృతంకాదేమోనని కాశీపండితులే యెవరో వ్రాసివుంటారని కొందరు భావించారు. ఈభాష్య సముపేతంగా పదకొండువాలఖిల్యసూక్తాలను పూనాలోని వైదికసంశోధనామండలివారు ప్రకటించిన సాయనభాష్యసహితమైన ఋగ్వేద సంహితలో ముద్రించారు. ఈవాలఖిల్యసూక్తాల భాష్యాన్ని అనుసరించే నేమానివారు తమ ఆంధ్రఋగ్వేదంలో వాలఖిల్యసూక్తాలు పద కొండింటినీ ఆంధ్రీకరించారు. బహుశా నేమానివారుచూచిన మరొకఋగ్వేదప్రతిలోకూడా 1930కిపూర్వమే ఈభాష్యం ప్రచురితమై వుండవచ్చును. అందువల్లనే నేమానివారు ఈభాష్యాన్ననుసరించి 11వాలఖిల్యసూక్తాలనుకూడా ఆంధ్రీకరించేఅవకాశంలభించింది. మొత్తం మీద శ్రీ నేమానివారు ఋగ్వేదంలోని కొన్నికొన్ని అధ్యాయాలను అనువదించడంలో చాలాశ్రమపడినవిధంగానే ఈవాలఖిల్యసూక్తాల ఆంధ్రీకరణంకూడా వారికి చాలా శ్రమసాధ్యమయినట్లు "మిక్కిలి శ్రమసాధ్యము", అనివారువ్రాసినదానినిబట్టే మనం గ్రహించవచ్చును. ఈసందర్భంలో ఒకముఖ్యమైన విషయాన్ని మనం గుర్తించకతప్పదు. నేమానివారు ఋగ్వేదాన్ని ఆంధ్రీకరించడానికి ఎంతపరిశ్రమ చేశారో ఎంతగా కష్టపడ్డారోగాని వారి ఆంధ్రీకరణమాత్రం అలవోకగా అలతిఅలతిపదజాలంతో సర్వజనసుబోధకంగా కదళీపాకంగా ధారాళంగా నడచిందని మనం చెప్పక తప్పదు. ఇంత జనరంజకంగా సకలజనసుబోధకంగా సామాన్యగ్రాంధికభాషలో పద్యగద్యాత్మ కంగా ఈమహత్తర ఆంధ్రఋగ్వేదాన్ని నేమానివారు విరచించి తెలుగువారికి అందించడం, దాన్ని ఆంధ్రదేశంలో నివసిస్తున్న ఆంధ్రులకుమాత్రమే అంకితమిచ్చినా ఆంధ్రజాతిమొత్తం గర్వపడదగినవిషయం.

తన ఆంధ్రఋగ్వేదసంహితను మహోత్కృష్టకృతిగా నేమానివారు భావించారు. వాస్తవానికి వేదం ప్రపంచవాఙ్మయాలన్నింటికీ తలమానికంవంటిదని అనడంలో అతిశయోక్తి యేమీలేదు మహాభారతం ఐదవవేదంగా భావించబడింనంటే చతుర్వేదాలతర్వాత దానికి ఐదవస్థానం లభించిందన్నమాట సంస్కృతమూలవేదంతో సంస్కృతమూలమహాభారతాన్ని అసలు సరిపోల్చడానికే వీలులేదు. సంస్కృత మహాభారతంకంటే మూలవేదం అపూర్వమై అసాధారణమైన మహోత్కృష్టగ్రంథమనడం తిరుగులేని విషయం. అయితే నేమానివారి ఆంధ్ర ఋగ్వేదసంహితను తెలుగులో కవిత్రయం రచించిన ఆంధ్రమహాభారతంతో సరిపోల్చి కవిత్రయమహాభారతంకంటే నేమానివారి ఆంధ్ర ఋగ్వేదం గొప్పదనిచెప్పడం దుస్సాహసమే కాగలదు. నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగడల, మహాభారతంతో సరిపోల్చడానికి వీలు లేదని అన్నంతమాత్రంచేత, ఆంధ్రఋగ్వేదసంహిత ఆంధ్రమహాభారతంకంటే తక్కువస్థాయిగల గ్రంథం అన్నంతమాత్రంచేత, దైవీయమై అపౌరుషేయమైన సంస్కృతమూలవేద గౌరవానికి కలిగే విప్రతిపత్తి యేమీవుండదు. తిక్కన మహాకవి విరాటపర్వాదిగా మహాకవిత్వదీక్షావిధితో మహాభారతాన్ని ఒకేఒకకృతిగాకాక పద్యగద్యాలతో కూడిన అనేకకృతులుగా విరచించినట్లు తనకైతాను అవతారికలో "కావున భారతామృతము" ఇత్యాది పద్యంలో స్పష్టపరిచాడు.

* పెళ్ళిపీటలమీదవున్న పార్వతీపరమేశ్వరులను చూచిన బ్రహ్మకు రేతఃపతనంకాగా ఆరేతస్సునుంచి వాలఖిల్యులు పుట్టినట్లు బ్రహ్మవైవర్తపురాణం చెపుతున్నది.

స్వర్గంలో రంభాదిఅప్సరసలను చూచినపుడు బ్రహ్మకు రేతఃపతనంఅవడం, ఆరేతస్సును బ్రహ్మ కాలితోకప్పిపుచ్చడం, ఆరేతస్సు ఇసుకరేణువుల్లో కలవడం, ఆ యిసుకరేణువులతో కలసిన రేతస్సునుంచి వాలఖిల్యులుపుట్టడం జరిగిందని బ్రహ్మాండ పురాణంలోని ఒకకథవల్ల తెలుస్తున్నది. ఇటువంటి కథలను దృష్టిలోపెట్టుకుని వాలఖిల్యులను కొందరు పరిగణనకు తీసుకున్నట్లు కనపడదు. కాని ఇందుకుభిన్నంగా వాలఖిల్యులు అంగుష్ఠప్రమాణదేహులైనా కశ్యపప్రజాపతిశిష్యులనీ కేవలంశీర్షాసనంతోనే తపస్సుచేసి శాపానుగ్రహశక్తి సంపాదించి ఇంద్రుణ్ణిసైతం భయపెట్టినమహర్షులనీ మహాభారతంలోని ఒకకథ పేర్కొనగా వాలఖిల్యులు బ్రహ్మమానసపుత్రుడైన క్రతుమహర్షికి అతనిభార్యయైన క్రియ లేక సన్నతియందు పుట్టి నిత్యబ్రహ్మచారులై ఊర్ధ్వరేతస్కులై సూర్యరథాన్ని అధిరోహించి సంచరిస్తుంటారని బ్రహ్మాండపురాణంలోనే వున్న మరొకకథవల్ల తెలుస్తున్నది.

ఉ॥ కావున భారతామృతము కర్ణపుటంబుల నార(గోలి యాం
ధ్రావలి మోదముం బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదంబయిన చిత్తముతోడ మహాకవిత్వ దీ
క్షావిధి నొంది పద్యముల గద్యములన్ రచియించెదం గృతుల్ ॥
(ఆంధ్రమహాభారతం; విరాటపర్వం. 1. ఆ.30ప)

నిజానికి ఆంధ్రమహాభారతంలో ఒక్కొక్కఘట్టం ఒక్కొక్కకృతిగా పేర్కొనడానికితగిన కావ్యార్హతగలఘట్టాలు అనేకం ఉన్నాయి. ప్రత్యేక కావ్యార్హతతో యిటువంటికృతు లనదగినఘట్టాలు ఆంధ్రఋగ్వేదసంహితలో మచ్చుకు ఒక్కటైనాలేకపోయినా శ్రీనేమానివారుకూడా తిక్కనను ఆదర్శంగాపెట్టుకుని ఆంధ్రఋగ్వేదాన్ని అవతారికలో పద్యరూపంలో అనేకకృతులగ్రంథంగా అభివర్ణించి వ్రాయలేమగాని తమఅధ్యాయాంతగద్యలలోమాత్రం "నేమాని వేఙ్కటనరసింహశాస్త్రివిరచిత కృతులలో శ్రీమదాంధ్రఋగ్వేదసంహిత యందు" అని ఆంధ్రఋగ్వేదసంహితను "కృతులలో" అనడంద్వారా అనేకకృతులుగా పేర్కొన్నారు. 62అధ్యాయాలు పైగాఉన్న ఆంధ్ర ఋగ్వేదసంహితలోని ప్రతిఅధ్యాయమూ ఒకకృతి అని ఆమోదించడానికి మనకు యెటువంటిఅభ్యంతరమూ ఉండదుకాని తిక్కన భారత కృతులతోకాని, నన్నయ భారతరచనతోగాని, యెఱ్ఱాప్రెగడ భారతభాగరచనతోగాని, తులతూగగలగ్రంథమనిమాత్రం యేపరిస్థితుల లోనూమనం ఆమోదించలేము. 10,614పద్యగద్యాలతోవున్న శ్రీనేమానివారి ఆంధ్రఋగ్వేదసంహితను అనేకకృతులుగా బృహత్తరమైన కృతిగా భావించడానికిమాత్రం మనం వెనుకాడ నవసరంలేదు.

## ఆంధ్ర ఋగ్వేద సంహితలో వ్యాకరణచ్ఛందో విశేషాలు

శ్రీనేమానివారికి తెలుగులో డిగ్రీలంటూ లేకపోయినా మంచిపాండిత్యం వున్నది. అయితే 20వశతాబ్దం ప్రారంభంలో భాషా విషయకంగా జరిగిన అనేకవాదోపవాదాల ప్రభావం నేమానివారిమీద కొంతవున్నట్లు కనిపిస్తున్నది. నేమానివారు ఆంధ్రఋగ్వేదసంహితలో క్షీణ యుగపు ప్రబంధకవులు ప్రయోగించినవిధంగా వ్యాకరణవిరుద్ధప్రయోగాలు అనేకం చేశారు. ప్రథమేతరవిభక్తిశత్రర్థకచువర్ణాలలో వున్న 'ఉ'కారాలకూ 'ఇ'కాదులకూ భిన్నమైనటువంటి పెక్కుద్రుత ప్రకృతికపదాలకు, తద్ధర్మార్థకోకారాలకు, ద్రుతప్రకృతికాలైన 'ఉ'కారే తరస్వరాలకు, ఆశీరాద్యర్థకాలైన ద్రుతపూర్వక "అ"కారంవంటివాటికికూడా బుద్ధిపూర్వకంగా నేమానివారు అనేకసందర్భాలలో సంధి చేశారు. ఆధునికభాషావాదానికి ఉపబలంగా శ్రీనేమానివారు సాధురేఫ శకటరేఫలకున్న భిన్నత్వాన్ని ప్రత్యేకతను పరిగణించలేదు. శకటరేఫస్థానంలో స్వేచ్ఛగా సాధురేఫ నుపయోగించారు. అయితే అసలు శకటరేఫను ఉపయోగించలేదనడానికి వీలులేదు. కొన్నికొన్ని సందర్భాలలో శకటరేఫనుసైతం నేమానివారు వ్రాయకపోలేదు. అయితే యతిప్రాసల్లో మైత్రినిపాటించి, సాధురేఫ శకటరేఫయుక్త ఏకైక పదాలకుప్రాచీనకాలంలో విభిన్నార్థాలున్నా రేఫ శకటరేఫల అభిన్నత్వంవల్ల అభిన్నాక్షరశబ్దాలకు బహ్వర్థాలు ఉభయార్థాలు చెప్పడం జరుగుతుంది కాబట్టి శకటరేఫప్రత్యేకవ్యవస్థవల్ల ప్రయోజనం లేకుండాపోయింది. అందువల్ల కొన్నిసందర్భాలలో నేమానివారు శకటరేఫను వాడినందువల్ల ఆప్రయోగాలకు ప్రత్యేకప్రతిపత్తిఅంటూ యేమీలేదు. కాగా శ్రీనేమానివారు శకటరేఫస్థానంలో సాధారణంగా సాధురేఫను వాడడం దోషమేమీకాదు.

తెలుగుభాషలో అరసున్నతో అవసరంవున్నదా? లేదా? అనేవిషయంగురించి గతంలో అనేకవాదప్రతివాదాలు జరిగాయి. చివరికి వ్యావహారికభాషలో అరసున్నకు స్థానం లేకుండాపోయింది. అరసున్నవిషయమై జరిగినవివాదాలలో శ్రీమారేపల్లిరామచంద్రశాస్త్రిగారు (కవిగారు)ఒకప్రత్యేకమైన మార్గాన్ననుసరించారు. మారేపల్లివా రనుసరించినపద్ధతిలో ద్రుతప్రకృతికాలమీద పరుషాలకు సరళాలు చెయ్యకుండావుండడం ఆయాప్రదేశాలలో పరుషాలను పరుషాలుగానేవుంచి అవసరమనుకుంటే ద్రుతస్థానంలో అరసున్న పెట్టడం స్థిరాలకు పూర్వంలోకూడా ద్రుతానికి లోపంచేసినప్పుడు లోపించినద్రుతచిహ్నంగా అరసున్నవుంచడంవంటి పద్ధతులను రామచంద్రశాస్త్రిగా రనుస రించారు.అయితే రామచంద్రశాస్త్రిగారి ఈ పద్ధతిని తెలుగువారు ఆదరించలేదు. ఈపద్ధతికి ఏవిధమైనప్రోత్సాహమూ లభించలేదుకూడా.

కేనిని ఎవరూ అనుసరించకుండా "గతానుగతికో లోకః" అన్నట్లు పాతపద్ధతినే అనుసరించారు. శ్రీనేమానివారు తమఆంధ్రఋగ్వేద సంహితలో కొన్నికొన్ని సందర్భాలలో అరసున్నను వాడారు. అయితే రామచంద్రశాస్త్రిగారివలె ద్రుతప్రకృతికాలమీది పరుషాలకు సరళాలు చెయ్యకుండావుండలేదు. కాని కొన్నిసందర్భాలలోమాత్రం స్థిరాలకు పూర్వంలో లోపించినద్రుతస్థానంలో అరసున్న పెట్టారు. అయితే ఈవిధంగా ఒకనియమంగా సూత్రబద్ధంగా ప్రతిచోటా పెట్టలేదు. మామూలుగా ప్రాచీనప్రయోగాలలో సిద్ధసరళాలకూ స్థిరాలలో వర్గ యుక్కులకూ పూర్వంలోవున్న ద్రుతానికి పాక్షికంగా పూర్ణానుస్వారంరావడం కనిపిస్తుంది. వ్యాకరణకర్తలుకూడా వర్గయుక్సరళాలకు పూర్వంలోవున్న ద్రుతానికి పూర్ణబిందువునుకూడా విధించారు. కాని వర్గయుక్కులకు భిన్నమైన స్థిరాక్షరాలకు పూర్వంలోవున్న ద్రుతానికి పూర్ణబిందువును వ్యాకరణకర్తలెవరూ విధించలేదు. ప్రాచీనకవులెవరూ అటువంటిప్రయోగాలు చెయ్యనూలేదు. అయితే నేమానివారు మాత్రం కొన్నిచోట్ల యతిప్రాసస్థానాలలోనైనాకాదు మామూలుచోట్ల అంతస్థలకూ ఊష్మాక్షరాలకూ పూర్వంలోవున్న ద్రుతాన్ని సంశ్లేష రూపంగా వ్రాయడానికి వీలున్నా మామూలుగా దానికిపూర్ణబిందురూపం వ్రాశారు. ఈవిధంగా పూర్ణబిందువు వ్రాసింది కొన్నిసందర్భాలలో మాత్రమేగాని అన్నిసందర్భాలలోనూకాదు. స్థిరాలుపరమైనప్పుడు నేమానివారు ద్రుతసంశ్లేషరూపాలూ వాడారు-అరసున్నలేకుండా ద్రుత లోపంచేసినరూపాలూ వాడారు-కొన్నిచోట్ల ద్రుతలోపంచేసి అరసున్నపెట్టినరూపాలూ వాడారు. అయితే యిటువంటి అర్ధబిందు పూర్ణ బిందువ్యవస్థలను నిక్కచ్చిగా నియమపూర్వకంగా సూత్రబద్ధంగామాత్రం గ్రంథంలోఎక్కడా వాడలేదు. ఏనియమనిబంధనంకూ సూత్రానికీ సిద్ధాంతానికీ బద్ధంకాకుండావున్న యిటువంటివ్రాతలను యథాతథంగానే వుంచితే పాఠకులకు చికాకు కలిగించినవాళ్ళ మవు తామనేదృష్టితో మామూలు సాంప్రదాయబద్ధంగా వ్యాకరణసూత్రాల కనుగుణంగా సవరించడం జరిగింది. అందువల్ల సంధులలో అర సున్నలచేపతోను వర్గయుగితరస్థిరాలకు పూర్వంలోవున్న ద్రుతానికి పూర్ణబిందువును చేసేపేరుతోను పాఠకులు తికమకపడకుండా చెయ్యడం జరిగింది.

'కలుగు' ధాతువు సాధారణంగా నిర్బిందుకంగా కవిపండితలోకం భావిస్తుంది. కాని ప్రాచీనకాలంలో పరశురామపంతుల రామ మూర్తికవి తన "మనోహరశతకం" లోను, "శుకచరిత్ర" లోను - పరశురామపంతుల గురులింగమూర్తికవి తన "సీతారామాంజనేయ సంవాదం"లోనూ 'కలుగు'ను సబిందుకంగా పూర్ణబిందుయుక్తంగా ప్రయోగించడం జరిగింది.

ఉ॥ ... ... ... ... ... ... అ
లీల ననేకజీవులు గలింగి జగంబులు నిండియుండి...

మనోహరశతకము. 7 ప.

ఉ॥ ... ... ... ... ... నీ
పాలఁ గలుంగు మోక్షము .. ... ... ...

మనోహరశతకము. 31 ప.

ఉ॥ పినులకంటె జన్నిదము వ్రేలెడు బొజ్జ గలుంగు గుజ్జువాఁ
డే నానరించు కావ్యమున కెప్పు డవిఘ్నము సేయుఁ గావుతన్!॥

శుకచరిత్ర. 1 ఆ. 15 ప.

సుగంధివృత్తము॥ రామ రామ రామ రామ రామ రామ యంచుఁ ద
న్నామ కీర్తనంబుఁ జేసినన్ గలుంగు మోక్షమున్॥

సీతారామాంజనేయ సంవాదం. 1 ఆ. 15 ప.

లయగ్రాహి॥ సంగమును భంగముఁ గలుంగ కొకభంగిని వెలుంగునను నేనని కనుంగొనుము వత్సా !॥

సీతారామాంజనేయ సంవాదం. 2 ఆ. 133 ప.

ఇదేవిధంగా శ్రీనేమానివారుకూడా 'కలుగు' ధాతువును పూర్ణబిందుయుక్తంగా "కలుంగ" అని జగణంగా తరువాతి పుటలో ఉదాహరిస్తున్న "యువకుఁడ!" ఇత్యాది పద్యంలో ప్రయోగించారు.

చ॥ యువకుఁడ ! నీదురాక కడు నూర్జిత మంగళమిచ్చుచుండు నీ
సవములు సేయు వారలకుఁ జాల ననుగ్రహ మిత్తువీవు గౌ
రవమున వారికిన్ ధనము రత్నములన్ సుఖకార్యహస్యలన్
దివిరి కలుఁగఁజేసి కడుఁదేజముతోఁ జను వారియిండ్లకున్ ॥

శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత-చతుర్థమండలం-
4వ సూక్తం-6వ ఋగనువాదం
ద్వితీయసంపుటం-265 పేజీ-74వ పద్యం.

అందువల్ల నేమానివారి మతంలో 'కలుగు' సబిందుకమనిభావించి ఆంధ్ర ఋగ్వేదసంహితలో సాధారణంగా సబిందుకంగానే వుంచడం జరిగింది. నేమానివారు అన్నిచోట్లా నిర్దుష్టంగా సబిందుకంగా వ్రాయలేదుకాబట్టి దీనిని కొన్నికొన్నిచోట్ల మామూలుగా నిర్బిందుకంగాసైతం ఉపయోగించడం జరిగింది. ఇదేవిధంగా 'చూచు' ధాతువు నిర్బిందుకమని ప్రాచీనకాలంనుంచీ భావించబడుతున్నది. శ్రీకాకుళం- గంజాంజిల్లాల గిరిజనప్రాంతాలలోని ప్రజలు సాధారణంగా మాట్లాడే గ్రాంథికభాషాచ్ఛాయలున్న తెలుగులో- మనం మామూలుగా వాడుతున్నట్లుగా 'చూచాడు-చూచినాడు' అనికాకుండా "చూంచినాడు"అని పూర్ణబిందుయుక్తంగా ఉచ్చరిస్తారు. 'చూపించు-చూపెట్టు-చూపిచ్చు'అని మనం ఉపయోగించేవాటికిమారుగా శ్రీకాకుళం గంజాంజిల్లాల్లో కేవలం పామరులుమాత్రమేకాకుండా శిష్టులుకూడా "చూంబెట్టు" అని పూర్ణబిందురూపాన్నే వ్యవహరిస్తూ వుంటారు. అందువల్ల 'చూచు'ధాతువు ఒకప్పుడు సబిందుకంగానే వుండేదేమోనని అనిపిస్తున్నది. మామూలుగా గ్రాంథికభాషలోకూడా 'చూచు'మీద యేర్పడిన"చుఁడు"లో వ్యాకరణకార్యాలతో అర్ధబిందువును సాధించుకుంటాముగాని సహజంగా 'చూఁచు'ధాతువులో అరసున్న వుండబట్టే ఇక్కడ అరసున్నకుస్థానం లభించిందేమో నని అనిపిస్తున్నది. కేవలం పామరులు గిరిజనుల వ్యవహారంలోనేకాక శిష్టులలోకూడా యిది సబిందుకంగా నిలిచివుండడంవల్లకాబోలు శ్రీనేమానివారు 'చూఁచు' ధాతువును సబిందుకంగానే వివిధరూపాలలోకూడా వ్రాశారు. తప్పనిసరిగా ఈ బిందువ్యవస్థను నిరూపించే నిర్ధారణచేసే యతిప్రాస ప్రయోగాలకు స్థానమే లేదు కాబట్టి అవి లేకపోయినా నేమానివారు బుద్ధిపూర్వకంగా స్వయంగా సంబిందుకంగా వ్రాసినందువల్ల 'చూఁచు' ధాతువు సబిందుకంగా వుంచడంజరిగింది. సాధారణంగా "చూచు" నిర్బిందుకంగానే ప్రసిద్ధికాబట్టి ఈ గ్రంథంలో రెండువిధాలా అటు సంబిందుకంగానూ ఇటు నిర్బిందుకంగానూకూడా ఉపయోగించడంజరిగింది. వచ్చెడి, తెచ్చెడి, వచ్చెడు, తెచ్చెడు, ఇత్యాది కృదంత రూపాలలోని ఎడి, ఎడులు నిర్బిందుకాలే అయినా కొన్నిచోట్ల సకృత్తుగా నేమానివారు సబిందుకాలుగాసైతం వ్రాశారు.

శ్రీనేమానివారు సంస్కృతంలో ఉద్దండపండితులేఅయినా కొన్నికొన్నిసందర్భాలలో సంస్కృతవ్యాకరణ విరుద్ధమైన విశేష ప్రయోగాలుకూడా సకృత్తుగా చేశారు. వీటిల్లో కేవలం వృద్ధిసంధి చేయవలసిన చోటకూడా కావాలని బుద్ధిపూర్వకంగా- వృద్ధిసంధి రూపాన్ని ప్రయోగిస్తే వచ్చే యిబ్బందియేమీ లేకపోయినా గుణసంధినే చేశారు. ఇటువంటి విశిష్టప్రయోగాలగురించి ఆయా సందర్భాలలో ఫుట్‌నోట్లరూపంలో సూచించడం జరిగింది. సంస్కృతశబ్దప్రయోగాలవిషయంలో 'త'వర్గ ద్వితీయ చతుర్థాక్షరాల విశిష్టతను నేమానివారు పెద్దగా ప్రాధాన్యం యివ్వలేదు. కొన్నికొన్ని సందర్భాలలో 'శ-సల'ప్రత్యేకతను 'ట-త'ల ప్రత్యేకతను నేమానివారు పట్టించుకున్నట్లు కనపడదు. కేవలం మహాప్రాణం వాడవలసినచోట అల్పప్రాణాలు వ్రాసిన సందర్భాలు అనేకంవున్నాయి. వీటినన్నిటినీ యాదృచ్ఛికాలుగా భావించి విడిచిపెట్టవలసి వుంటుందికాబట్టి వీటికి ప్రత్యేకించి ఉదాహరణ లియ్యవలసినఅవసరం లేదనుకుంటాను.

శ్రీనేమానివారు ఆంధ్రఋగ్వేదసంహితారచనలో అంతర్దృష్టిగల ఛందశ్శాస్త్రవేత్తగా కొన్నివిశేషప్రయోగాలు చేశారు. మామూలుగా నల,నగ,సల,భ,ర,త,లు ఇంద్రగణాలని ఛందశ్శాస్త్రాలన్నీ ముక్తకంఠంతో పేర్కొన్నాయి. తేటగీతిలోకాని ఆటవెలదిలోకాని సీసపద్యం మొదలైన ఇంద్రగణాలు వాడవలసినపద్యాలు వేటిలోనైనాగాని ఇంద్రగణాలు ప్రయుక్తంకావాలంటే కేవలం నల,నగ,సల,భ,ర,త,లుమాత్రమే పరిగ్రాహ్యాలవుతాయి. కాని నేమానివారు ఇంద్రగణాలలో నల,నగ,సల,భ,ర,తలతోపాటు "నలలం-నహం-నవం-భలం-జలం-య-జ"గణాలు మొదలైనవాటిని ఇంద్రగణాలలోచేర్చి తేటగీతి-ఆటవెలది-సీసంవంటిపద్యాలలో స్వేచ్ఛగానిరాటంకంగా ఉపయోగించారు. అత్యధికంగా ఈగణాలను ఇంద్రగణాలలో చేర్చడంలో నేమానివారిదృష్టిలో మాత్రాసంఖ్యావ్యవస్థ పరిగణితమైవున్నట్లు కనిపిస్తున్నది. మామూలుగా ఇంద్రగణాలుగపేర్కొనబడిన నల,నగ,సల,భ,ర,త,గణాలలో నల,భ, గణాలు చతుర్మాత్రాగణాలు కాగా నగ,సల,

ర,త, గణాలుపంచమాత్రాగణాలు. చతుర్మాత్రాగణాలైన జ,స,గణాలురెండూ నల,భ,గణాలతోపాటు ఇంద్రగణాలుగా యెందుకు ప్రయుక్తం కాకూడదు ? అదేవిధంగా పంచమాత్రాగణాలైన నగ,సల,భ,ర,త,గణాలతోపాటు నలలం-భలం-నహం-నవం-(నలంమీద గురువు)-జలం-య-వంటి పంచమాత్రాగణాలుకూడా ఇంద్రగణాలుగా యెందుకు ప్రయోగితంకాకూడదు ? ఇటువంటి ప్రశ్నలకు-గణోత్పత్తిస్వరూప స్వభావాదిఆర్షవిజ్ఞానవిషయాలజోలికి మనం వెళ్ళకుండావుంటే –కేవలం మాత్రాగణన వ్యవస్థమీద ఆధారపడి మనం సమాధానం చెప్పవలసివుంటుందికాబట్టి నల,భ,గణాలతోపాటు ఇతరచతుర్మాత్రాగణాలూ, నగ,సల,ర,త,లతోపాటు తదితరపంచమాత్రాగణాలుకూడా ఇంద్రగణాలుగా ప్రయోగించడానికి సమర్హాలే. అటువంటిప్రయోగాలు సమర్ధనీయాలే అని మనం తర్కదృష్టితో సమాధానం చెప్పవలసివస్తుంది. ఈతర్కదృష్టితోనే నేమానివారు తమఆంధ్రఋగ్వేదసంహితలో మామూలు ఇంద్రగణాలతోపాటు జగణ, సగణాలకూ, నలల, భల, నహ, నవ, జల, య,గణాలకుసైతం స్థానంకల్పించి ప్రయోగించారు. అంతేకాదు. నగణంమీదగురువును, నగణంమీదలఘువును, సగణంమీదలఘువును, చేర్చి ఈమూడింటినీ ఇంద్రగణాలలో చేర్చారుకదా ! ఒక్కనగణంమీదనే గురువునూ లఘువునూ యెందుకు చేర్చాలి? సగణంమీద ఒక్కలఘువునుమాత్రమే యెందుకుచేర్చాలి? సగణ నగణాలమీద లఘువుచేర్చినట్లే రగణ-తగణ-యగణాలమీదకూడా లఘువును యెందుకుచేర్చకూడదు ? వాస్తవానికి మ,య,ర,స,త,జ,భ,న,గణాలు కేవలం మూడుగురువుల ప్రస్తారంనుంచి ఆవిర్భవించిన ఏకైకవర్గానికిచెందన గణాలుకదా! వీటిల్లో భ,ర,త,గణాలకుతుదిని గురువో,లఘువోచేర్చకుండాను న,గణానికి గురులఘువుల్లో ఒకదానినిచేర్చి సగణంమీద కేవలం లఘువునుమాత్రమేచేర్చి ఇంద్రగణాలుగా పరిగణించాలని యెక్కడవున్నది? నగణ, స,గణాలమీద లఘువునుచేర్చి ఇంద్రగణాలుగా స్వీకరించినట్లు మ,య,ర,త,జ,భ,గణాలమీదకూడా లఘువునుచేర్చి ఇంద్రగణాలుగా యెందుకు పరిగ్రహించకూడదు ? నగణంమీద గురువునుచేర్చి ఇంద్రగణంగా స్వీకరించినట్లు మ,య,ర,స,త,జ,భ,సప్తగణాలమీదకూడా గురువునుచేర్చి ఇంద్రగణాలుగా యెందుకు పరిగ్రహించకూడదు ? మామూలుగా 'మ'గణంలోనే ఆరుమాత్రలు ఉన్నాయి. అదేవిధంగా ఆరుమాత్రలున్న నహ-సవ-రల-తల-యల-గణాలనుసైతం ఇంద్రగణాలలో యెందుకు చేర్చుకోకూడదు ? ఇత్యాదిగాగల వివిధ తార్కిక దృక్పథాలతో శ్రీనేమానివారు ఇంద్రగణాలసంఖ్యను పెంచి నిరాఘాటంగా వివిధచతుర్మాత్రాత్మకగణాలను పంచమాత్రాత్మకగణాలను షణ్మాత్రాత్మకగణాలను ఇంద్రగణాలలో చేర్చి ప్రయోగించినట్లు స్పష్టపడుతున్నది. మాత్రాపరిమితితోకూడిన వ్యవస్థను దృష్టిలోపెట్టుకున్నప్పుడు ఇంద్రగణాలలో మరికొన్నిగణాలను చేరుస్తూ నేమానివారు వేసినముందడుగు సమర్ధనీయమే కాగలదు. శ్రీనేమానివారు ఇటువంటి విశిష్టగణ ప్రయోగాలుచేసిన ఆయాసందర్భాలలో వాటివిషయమై సాధారణంగా ఫుట్‌నోట్లరూపంలో సూచించడంజరిగింది. ఇటువంటి ప్రయోగాలను శ్రీనేమానివారు కొంతమౌలికమైన దృక్పథంతో ఆలోచించిచేసినట్లు కనిపిస్తున్నది.

శ్రీనేమానివారు ఛందశ్శాస్త్రంలో మామూలుకవులకంటే యెక్కువగానే కృషిచేశారు. 1911లో శ్రీతాపీ ధర్మారావుగారు కళ్లికోటకాలేజీలో ఉపాధ్యాయులుగా ఉన్నప్పుడు శ్రీతాపీ వారూ శ్రీనేమానివారూకలిసి ఇంగ్లీషులోఉన్న "బ్లాంక్‌వర్స్"వలె తెలుగులోకూడా పద్యకథలు వ్రాయాలనేదృష్టితో ప్రస్తారవ్యవస్థలో కొంత కృషిచేశారు. అయితే అందుకుతగిన సంగీతశాస్త్రపరిజ్ఞానం లేనందువల్ల వారు తలపెట్టినలక్ష్యం నెరవేరకపోయినా "చిత్రగీతమాలిక" అని తేటగీతి ఆటవెలదులను అవసరాన్నిబట్టి మార్చి పద్యకథలు వ్రాశారు. ఆపద్యకథ లేమైనాయో తెలియదు. శ్రీనేమానివారూ శ్రీతాపీవారూ కలిసిచేసిన యీనూతనప్రయోగవిషయంగురించి తెలియజేస్తూ శ్రీతాపీ ధర్మారావుగారు 1961లో డాక్టర్‌గిడుగు వెంకటసీతాపతిగారి "తెలుగులో ఛందోరీతులు" అన్నగ్రంథంమీద "శుభవార్త"అన్న శీర్షికతో వ్రాసిన తమఅభిప్రాయంలో యీక్రిందివిధంగా పేర్కొన్నారు.

-"బి. ఎ. పాసయి కళ్లికోటకాలేజీలో ఉపాధ్యాయుడుగా ఉన్నప్పుడు "50 ఏండ్లక్రితం" ఇంగ్లీషులోఉన్న Blank Verse లాంటిది తెలుగులోఉంటే పద్యకథలువ్రాసి విద్యార్థులకు పరీక్షలో ఇవ్వవచ్చుగదా అని నేనూ, కీ. శే. నేమాని నరసింహశాస్త్రిగారూ ఈప్రస్తారాలలో వేలుపెట్టాము. రెండునెలలు ఆదేపనిగా గడిపాము. ప్రయోజనము లేకపోయింది. బహుశా మాకు సంగీతపరిచయము తక్కువవడంచేతనే అనుకుంటాను. అప్పుడు తెలిసింది. ఈ'కీకారణ్య' భయంకరరూపము. వేలుచూపితే మనిషినే మింగివేసే మొసలిలాగ కనిపించింది. దీనితో వేగలేమని ఆప్రయత్నం విరమించుకున్నాము. (చిత్రగీతమాలిక అని ఆటవెలది తేటగీతులు అవసరప్రకారంమార్చి, రోకటిపాట లాగుండకుండాచేసి పద్యకథలు వ్రాసుకున్నాము.). - (తెలుగులో ఛందోరీతులు. xxxvi-xxxviiపుటలు.)

అందుకే నేమానివారు ఇంద్రగణాల మాత్రావ్యవస్థలను దృష్టిలోపెట్టుకుని వాటిసంఖ్యను మరింతగా విస్తృతంచేసి ఆంధ్రఋగ్వేద సంహితలో ఆచరణలో ప్రయోగించిమరీ చూపించారు.

ప్రాచీన ఛందశ్శాస్త్రకర్తలు గీతపద్యం తేటగీతి-ఆటవెలదులుగా రెండువిధాలని స్పష్టంగా వక్కాణించారు. మనం మామూలుగా తేటగీతినిమాత్రమే 'గీ॥' అని గీతపద్యంగా నిర్దేశిస్తూ ఆటవెలదిని 'ఆ॥వె॥' అని నిర్దేశిస్తూవుంటాము. ప్రాచీనలాక్షణికుల అభిప్రాయంప్రకారం ఆటవెలదినికూడా గీతపద్యంగా 'గీ॥' అని నిర్దేశించవచ్చును. ఈదృష్ట్యా శ్రీనేమానివారు అసలు ఆటవెలది అనేపేరునే వాడకుండా తేటగీతిని ఆటవెలదిని రెండింటినీకూడా సర్వేసర్వత్రా గీతపద్యాలుగా 'గీ॥'అనిమాత్రమే నిర్దేశించారు. ఇదిదోషం కానేరదు. అందువల్ల గీతపద్యాలుగా నిర్దేశించిన ఆటవెలదులను ఆటవెలదులుగా చూపకుండా శ్రీనేమానివారువ్రాసినట్లు 'గీ॥'అని గీతపద్యాలుగానే ముద్రణలో నిర్దేశించడం జరిగింది.

గురులఘువ్యవస్థలోను, సంధిలోను, ఋ, ౠ,ఌకు అత్యంతప్రాచీనకాలంనుంచీ ఒకప్రత్యేకస్థానం వున్నది. ౠకారం ఆదిగావున్న పదాలుమృగ్యాలుకాబట్టి 'ఋ'కారాదిపదాలలోని 'ఋ'వ్యవస్థలోని విశేషంగురించి మాత్రమే యిక్కడ ఉటంకించడం జరుగుతున్నది. సంధిలో ఋ-ౠలు, ర-లల తుల్యాలని తెలుగువ్యాకరణకర్తలు ప్రాచీనకాలంనుంచి ఎలుగెత్తి చాటారు. వాటిల్లో హల్త్వం వున్నందువల్లా అవి స్థిరాక్షరాలవంటివి అయినందువల్లా వాటికి పూర్వంలోవున్న ద్రుతానికి లోపసంశ్లేషలు విభాషగా వస్తాయి. అంతేకాదు. అతడు+ఋషి వంటి వాటిల్లో హ్రస్వ'ఉ'కారానికి పరమైన "ఋ"కారం 'ర'కారతుల్యంకాబట్టి సంధికూడా జరగకుండా నిరోధిత మవుతుంది. మామూలుగా 'ఋ'కారం అచ్చుకాబట్టి అదిహల్లులతో ప్రాణంవలె కలిసిపోతుంది. షట్ + ఋతువులు అన్నప్పుడు సంధిలో 'ట'కారం 'డ'కారంగా మారి 'డ'కారంతో ప్రాణమైన 'ఋ'కారం కలిసిపోయి 'షడృతువులు'అయి 'ఋ'కారం అచ్చేకాబట్టి 'ష'కారం లఘువుగానే పరిగణిత మవుతుంది. ఇదేవిధంగా సత్ + ఋభువులు అన్నప్పుడు సంధిలో 'త'కారం 'ద'కారంగానే మారి'ఋ' కారప్రాణంతోకలిసి 'సదృభువులు' అని అయినా 'స'కారం లఘువుమాత్రమే అవుతుందిగాని గురువుకాదు. నిజానికి షడృతు-సదృభు శబ్దాలలో డృ-దృలు కేవలం అజ్జిశిష్టాలేకాని అవి సంయుక్తాక్షరాలుకావు. అందువల్ల పూర్వాక్షరాలు లఘువు లవడం సహజం. కాని శ్రీనేమానివారు ఆంధ్ర ఋగ్వేద సంహితలోని ఈ క్రిందిపద్యాలలో షడృతు-సదృభు శబ్దాలను ప్రయోగిస్తూ డృ-దృలకు పూర్వంలోవున్న 'ష'కార 'స'కారాలను గురువులుగా ప్రయోగించారు.

చ॥ తలకొని సేద్యగాఁడు తన ధర్మముఁ దప్పక వడ్లుఁజల్లఁగా
వలసినభూమి దున్ని కడు వర్ధిలునట్టులు కాంతియుక్తుఁడై
మెలఁగెడు పూష యిష్టులకు మేలగు సోమలతా ప్రపంచముం
గలిఁగెడు షడ్ఋతూత్తములఁ గల్పనఁ జేయుచునుండెఁ జూఁడుఁడీ॥

ఆంధ్రఋగ్వేదసంహిత-ప్రథమమండలం
23వ సూక్తం-15వ ఋక్కు-
ప్రథమ సంపుటం-58వ పేజీ-35వ పద్యం

ఉ॥ ఎవ్వరు ఘోటకద్వయము నెంతయు హృష్టముగా నొనర్చిరో !
యెవ్వరు శక్రదేవునకు నేచిన యశ్వము లందఁజేసిరో !
యవ్విధ సద్ఋభుప్రవరు లంతట మిత్రులఁబోలి యెంతయున్
దవ్వున మాకు సర్వధనదాన మొసంగుత ! సంతసంబునన్ ॥

ఆంధ్ర ఋగ్వేద సంహిత-4వ మండలం
33 వసూక్తం - 10వఋక్కు-
ద్వితీయ సంపుటం - 388పేజీ - 418వ పద్యం

మామూలుగా వ్యావహారికభాషలో 'ఋ,ౠ'లను 'రు,లు'లుగా వ్యవహరించడం సామాన్యప్రజలలోనేకాక కవిపండితులలోకూడా చాలా కాలంనుంచీ వున్నది. ఈ విషయంగురించి నా పరిశోధనారచన ధ్వని-లిపి పరిమాణం లేక ప్రాచీనవాఙ్మయంలో వ్యావహారిక భాష అనే గ్రంథంలో వివరంగా చర్చించివున్నాను. 'ఋ-ౠ' లను 'రు-లు'లుగా ఉచ్చరించినంతమాత్రంచేత అవి ఇతరవ్యంజనాలతో కలిసినపుడు వాటిని "అక్రూరుడు-ఉగ్రుడు" ఇత్యాదిగాగల పదాలలోని సంయుక్తాక్షరాలవలె 'ప్రకృతి-వికృతి' ఇత్యాదిగాగల 'ఋ' కార స్వరయుక్తఅక్షరాలను ప్రక్రుతి-విక్రుతిఇత్యాదిగా రేఫసంయుక్తాక్షరయుక్తాలుగా ఊది ఉచ్చరించడమనేది యే దశలోనూ యేస్థాయిలోనూ లేదు. అందువల్ల 'ఋ-ౠ'లు 'రు-లు'లుగా ఉచ్చరించబడినా వ్రాయబడినా గణవ్యవస్థలో గురులఘుపరిగణనలో వాటికి సంయుక్తాక్షర ప్రతిపత్తి అటు గ్రాంధికంలోగాని ఇటు వ్యావహారికంలోగాని ఉపలభ్యమానం కాలేదు. భట్టోజీ దీక్షితులు "సిద్ధాంతకౌముది"లో 'ఋ' కారంలో రెండురేఫలున్నట్లు చెప్పాడు. "సిద్ధాంత కౌముది"లో 'ఋతిసవర్ణే ఋ వా' అనేవార్తిక సందర్భంలో "ఆద్యస్య (ఋకారస్య) మధ్యే ద్వౌ రేఫౌ తయోరేకామాత్రా అభితోఽజ్భక్తేరపరా" అని భట్టోజీ దీక్షితులు వ్రాశాడు. ఈ సందర్భములో 'ఋ' కారంలోఉన్న అజ్భాగవిశిష్టత యేమిటో, దాని ఉచ్చారణ ఇతర స్వరాలకంటె భిన్నంగా యేవిధంగాఉన్నదో భట్టోజీ దీక్షితులు వివరింపలేదు. భట్టోజీ దీక్షితునికాలంలో 'ఋ'కారాన్ని ద్విత్వరేఫ ముచ్చరించినట్లుగా ఒత్తి(నొక్కి) ఉచ్చరించేవారు. ఆ కారణంచేతనే అందులో (ఋకారంలో) రేఫభాగమున్నదని చెప్పడానికిమారుగా రెండు రేఫలున్నట్లు భట్టోజీదీక్షితులు చెప్పాడు. అయితే 'ఋ'కారంలో ఈ ద్విరేఫోచ్చారణ ఏనాడుభ్రష్టమై ఏకరేఫోచ్చారణ ప్రవేశించిందో చెప్పలేము. లేదా ద్విరేఫలు కలదిగా ఉచ్చరించడం భట్టోజీదీక్షితులు నివసించిన ప్రాంతీయంగా ఉన్న విశేషఉచ్చారణ అయినాఅయివుండాలి. 'ఋ-ౠ'లు 'ర-ల'ల తుల్యాలనీ 'ఋ'కారంలో రేఫఉచ్చారణవున్నదనీ గతంలోనే తెలుసుకున్నాము. అంతమాత్రంచేత హల్లుతోకూడినప్పుడు 'ఋ'కారాన్ని సంయుక్తాక్షరంగా వ్రాయడానికీ, ఉచ్చరించడానికీ అవకాశంవున్నా అసలైన సంయుక్తాక్షరంవలె ఊది ఉచ్చరించే పరిస్థితి ఏ దశలోనూ ఏ స్థాయిలోనూ లేదనికూడా గ్రహించాము. అయితే పైపద్యాలలో నేమానివారు 'షడృతు, సదృభు'అన్న శబ్దాలలోని "ష-స"లను గురువులుగా యేవిధంగా ప్రయోగించారని మనకుసందేహం రావడం సహజం. ఈ డృ-దృలను సంయుక్తాక్షరాలుగానే భావించి పూర్వాక్షరాలకు గురుప్రతిపత్తి నిచ్చి నేమానివారు ప్రయోగించారని కూడా మనకు తోచడం సహజం. కాని యిది యదార్థంకాదు. 'ఋ' కారంలో రేఫవ్యవస్థకు స్థానం వున్నందువల్ల షడృతు-సదృభు వంటి పదాలను షడ్ఋతు-సద్ఋభు ఇత్యాదిగా వ్యంజనాక్షరసహితాలుగా వ్రాయడానికి అవకాశం నిరాటంకంగా వున్నది. వ్యంజనాక్షరయుక్తమైన హ్రస్వప్రాణి మామూలుగా శాస్త్రీయంగానే గురువైపోతుంది. ఈ విధంగా 'ఋ'కారాది పదాలకు పూర్వంలోవున్న పదాంత్య వ్యంజనాక్షరాన్ని దేన్నైనా వ్యంజనంగానే వ్రాసేఅధికారం ఒక్క 'ఋ' కార పరకత్వంలోనే ఉన్నది. (మామూలుగా ఋ-ౠ వర్ణాలకు సవర్ణత్వం అత్యంత ప్రాచీనకాలంనుంచీ వున్నదికాబట్టి ఈ 'ఋ'వ్యవస్థ ౠ కారానికికూడా వర్తిస్తుంది.) త్వగింద్రియం-దిగంతరం-దిగంబరం-దురభిప్రాయం-నిరాడంబరం-సదభిప్రాయం-సమాదరణ ఇత్యాదిగాగల పదాలలో పూర్వపదాంత్య వ్యంజనంతో పరపదాది స్వరాన్ని నిర్ద్వందంగా ఖచ్చితంగా మేళనంచేసి వ్రాయాలేతప్ప 'త్వగ్ఇంద్రియం-దిగ్అంతరం-దిగ్అంబరం-దుర్అభిప్రాయం-నిర్ఆడంబరం-సద్అభిప్రాయం-సమ్ఆదరణ' ఇత్యాదిగా కేవల వ్యంజనాక్షర యుక్తాలుగా వ్రాయడానికి యే పరిస్థితులలోనూ వీలు లేదు. ఇందుకుకారణం పరపదాది స్వరాలలో హల్త్వంగాని హలంశగాని లేకపోడవమే. పరపదాది స్వరాలుగా ఇ-ఈ-(ఎ)-ఏ-ఉ-ఊ-(ఒ)-ఓ-ఉన్నా తెలుగు వ్యావహారికభాషా సిద్ధాంతంప్రకారం వ్యస్తోచ్చారణలో అవి 'య'కార 'వ'కారాది పదాలుగా మారినా పూర్వపదాంత్యవ్యంజనాలకు పరమైనప్పుడు వాటి ఆదిహల్త్వం మరిగిపోయి మొదటి అచ్త్వమే నిలిచి పూర్వపదాంత్యవ్యంజనంతో మామూలుగా యథావిధిగా మేళనం చెందుతుంది. అంటే త్వగింద్రియం-తదేకదృష్టి-హృదున్మాదం-సదోకస్సు ఇత్యాది పదాలలోని ఇంద్రియం-ఏకదృష్టి-ఉన్మాదం-ఓకస్సు ఇత్యాది అజాదిపదాలను 'యింద్రియం, యేకదృష్టి, వున్మాదం, వోకస్సు ఇత్యాది హలాదిపదాలుగా వ్యస్తంగా ఉచ్చరించడానికి వ్రాయడానికీకూడా అవకాశంవున్నా పూర్వపదాంత్య వ్యంజనాలతో మేళనం చెందినపుడు త్వగ్యింద్రియం-త్వగ్ యింద్రియం-తద్యేకదృష్టి-తద్ యేకదృష్టి-హృద్వున్మాదం-హృద్వున్మాదం-సద్వోకస్సు-సద్వోకస్సు ఇత్యాది పదాలుగా అటు ఉచ్చరించడానికిగాని యిటు వ్రాయడానికిగాని అవకాశం ఏమాత్రమూ లేదు. ఆవిధంగా ఉచ్చరించే వ్యవస్థకాని వ్రాసేవ్యవస్థకాని ఏకాలంలోనూ కూడాలేదనే చెప్పాలి. కాగా ఈ సందర్భంలో పదాది 'య'కార 'వ'కార హల్వ్యవస్థకుగాని సంయుక్తాక్షర వ్యవస్థాసిద్ధాంతానికిగాని అవకాశం లేదనికూడా చెప్పాలి. అయితే షడృతు-సదృభు ఇత్యాది శబ్దాలను 'ఉ'కార రేఫయుక్తాలుగా షడ్రుతు-సద్రుభు ఇత్యాదిగా ఉచ్చరించడానికి వ్రాయడానికికూడా ప్రాచీనకాలంనుంచి అవకాశం యేర్పడివుంది. మీదుమిక్కిలి షడృతు-సదృభువంటి శబ్దాలను "షడ్ఋతు

సద్ఋభు"వంటి వ్యంజనాక్షరయుక్తాలుగా సైతం వ్రాయడానికికూడా పూర్తిగా అవకాశంవున్నది. 'ఋ'కారపరకత్వంలో పూర్వస్వరంతో సంధిలేనపుడు 'ఋ'కారంలో హల్త్వం వున్నందువల్ల సంధ్యభావంలో యడాగమానికి అసలు అవకాశమేలేదు. షడృతు-సదృభువంటి శబ్దాలను వ్యంజనాక్షరయుక్తాలుగా షడ్ఋతు-సద్ఋభు అని వ్రాసినప్పుడు వ్యంజనంతోకూడిన పూర్వ హ్రస్వప్రాణి నిరాటంకంగా గురువే అవుతుంది కాబట్టి 'షడ్-సద్'లు గురువులుగానే పరిగణనకు వస్తాయి. అంటే ఇక్కడ సంధిలో సంయుక్తాక్షరవ్యవస్థకు స్థానంలేకపోయినా ఊది ఉచ్చరించడానికికూడా అవకాశంలేకపోయినా వ్యంజనంతోకూడిన పూర్వహ్రస్వప్రాణులు గురువులే అవుతాయన్నమాట. ఈదృష్టితోనే శ్రీనేమానివారు షడృతు-సదృభు శబ్దాలలోని 'షడ్-సద్' లను తద్వ్యంజనా వ్యవస్థతో కలిపి గురువులుగానే భావించి ప్రయోగించడం జరిగింది. ఆంధ్రసాహిత్య చరిత్రలో ఇవి వినూతన ప్రయోగాలే అయినా వీటిని అశాస్త్రీయాలనడానికి అవకాశం బొత్తిగాలేదు సరికదా ఇవి శాస్త్రీయప్రయోగాలేనని చెప్పడానికి సాధికారమై తర్కసహమైన ప్రామాణికావకాశాలున్నాయి.

ఋ-ౠ-ఌ-ౡలకు రు-రూ-లు-లూలవంటి ఉచ్చారణలు అతిప్రాచీనకాలంలోనే వచ్చినందువల్ల ఋ-రు, ఌ-లులకు వాటి సాజాత్య అక్షరాలకు యతిమైత్రి అతిప్రాచీనకాలంలోనే వచ్చిందని నా పరిశోధనా రచన 'ధ్వని-లిపి-పరిణామం లేక ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష' అన్నగ్రంథంలో సప్రామాణికంగా నిరూపించాను. అంతేకాదు. 'ఋ'కారానికి ఉత్వరేఫ ఉచ్చారణ యేర్పడినందువల్ల ఋ-రులకు భిన్నత్వం తెలియక ఋ స్వరయుక్తపదాలను హల్ "రు"కారయుక్తపదాలుగాను సహజంగా వున్న హల్ 'రు'కారయుక్తపదాలను అచ్చు ఋ కారయుక్తపదాలుగాను పొరపాటున భావించి ప్రాచీన కవిపండితులే తికమకలుపడి భ్రమప్రమాదాలకు లోనయ్యారనికూడా సప్రామాణికంగా ధ్వని-లిపి-పరిణామం లేక ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారిక భాష అనే గ్రంథంలో నేను నిరూపించడం జరిగింది. శ్రీనేమానివారు తమ ఆంధ్రఋగ్వేద సంహితలో ఋ-రులను తారుమారుగా స్వేచ్ఛగా వ్రాయడం జరిగింది. అంతేకాదు. అప్పకవివంటి లాక్షణికుడే తన 'అప్పకవీయంలో'

దావపావక ఖాది మా,ధన దాశార్హా! దనుజాంతకా!
దేవకీ ప్రియనందనా!, దివిషద్వంద్యా (ధ్రు)ధృవసన్నుతా!

అప్పకవీయం - 4 ఆ

అని సహజఉత్వరేఫలతోకూడిన 'ధ్రువ' శబ్దాన్ని లోకవ్యవహారంతో తికమకపడి 'ధృవ'గా ఋకారఅజ్విశిష్టంగా భావించి 'ధృ' కారంతో 'దే-ద' అక్షరాలకు యతిమైత్రిని పాటించాడు. ఇదేవిధంగా శ్రీనేమానివారుకూడా సహజ ఉత్వరేఫయుక్తమైన 'ద్రుత' శబ్దాన్ని 'ఋ' కార అజ్విశిష్టపదమని భావించి 'దృత'గావ్రాసి ఈ'దృ' కారానికి-తేవలో'తే' (దే) అక్షరానికి యతిమైత్రిని పాటించారు.

చ॥ దృతగమనంబువాఁడు కడుఁ దేవతో జలమిచ్చువాఁడు స
న్మతి గలవాఁడు మైత్రిగతమాన్యతఁ గూర్చెడువాఁడు సం, తత

ఆంధ్రఋగ్వేదసంహిత - ప్రథమమండలం
సూక్తం - 100, ఋక్కు - 5
ప్రథమసంపుటం - 274 వపుట - 33 వపద్యం

తెలుగు వ్యావహారికభాషలో ఇ-ఈ-ఎ-ఏ స్వరాలు ఆదిలోవున్నపదాలు యకారాదిపదాలుగా ఉచ్చరింపబడతాయి. ఎవడు-ఎవతె ఎర్రన్న-ఎంబన్న-ఎట్టిగుడి-ఎండమావులు మొదలైనపదాలు యెవడు-యెవతె-యెఱ్ఱన్న-యెంబన్న-యెట్టిగుడి-యెండమావులు అని ఉచ్చరింపబడి వ్రాయబడుతూవుంటాయి. అంతేకాదు. హ్రస్వవక్ర 'యె' కారాదిగా వున్న ఈపదాలు ఉచ్చారణలోను ఉచ్చారణ ప్రభావంతో వ్రాతలోనూ 'అ' కారస్వరయుక్తాలుగాసైతం "య" వర్ణంగా ఉచ్చరించబడి వ్రాయబడుతూ వుంటాయి. అంటే "యెవడు యెవతె-యెఱ్ఱన్న-యెంబన్న-యెట్టిగుడి-యెండమావులు ఇత్యాదిపదాలు "యవడు-యవతె-యఱ్ఱన్న-యంబన్న-యట్టిగుడి-యండ మావులు" ఇత్యాది అత్వవిశిష్ట 'య' వర్ణాదిపదాలుగా ఉచ్చరితాలై వ్రాయబడుతుంటాయన్నమాట. ఇటువంటి వ్యావహారికభాషోచ్చారణా

ప్రభావానికి లోనైన ప్రాచీనకవులు కొందరు సహజంగా వకారాదిపదాలుగావున్నవాటిని 'య' వర్ణాదిపదాలుగా భావించి ఆ'య' వర్ణంతో మైత్రిగల అక్షరాలతో యతిని పాటించి ప్రయోగించారు.

గీ॥ యజ్ఞనామాత్యు ననుజన్ముఁ దహిపభూష, ణాంఘ్రి...॥ శృం. శా-1ఆ

క॥ ఏవలో, కావా ప్తిం బడసెఁగాదె: యంబన నాచేన్॥ శివ. త. సా. 425 ప.

క॥ నిబ్బరపుఁ గవిత లబ్బుట, యబ్బురమా! యెఱుకగన్న యఱగుడికన్నా!॥
కన్నశతకం. 1ప.

ఆ॥ వె॥ యండమావు లుదకమైనట్లు తాజీవు...॥
పరశురామశతకం. 94ప.

గీ॥ యవతయేనియు వెన్నుని యౌవనాఢ్య...॥ కాశిం. ప. 2ఆ. 115ప.

ఈ ప్రాచీనకవులవలెనే శ్రీనేమానివారు కూడా వ్యావహారికప్రభావానికిలోనై 'ఎవ్వడు' అని అజాదిగావున్నశబ్దాన్ని 'యవ్వడు'అని అత్వవిశిష్ట 'య' వర్ణాదిపదంగా యీక్రిందిపద్యం తొలిపాదంలో ప్రారంభంలోనే యతిస్థానంలో వాడి 'యవ్వడు'లోని 'య'వర్ణానికి తరువాతి 'అందు'లోని 'అ'కార అచ్చుకు యతిని సరిపెట్టుకున్నారు.

గీ॥ యవ్వఁడంతరిక్షమందు వైద్యుతరూప,మున నిషణ్ణుఁడగునొ: ఘను డతండు:
హోత యగుచుఁ బ్రీతిజాతుఁడై గుణగణ, పూజితుండుకాఁడె ? పూర్ణగతిని ॥

ఆంధ్ర ఋగ్వేద సంహిత-10వ మండలం
46వ సూక్తం, 1వ ఋగనువాదం
వ్రాతప్రతి-13వ సంపుటం-5వ పుట

ఈసందర్భంలో చెప్పవలసిన విశేషం ఒకటున్నది. ఈపద్యం తొలిపాదంలో 'యవ్వఁడు'లోని'య'వర్ణానికి తరువాతి 'అందు'లోని హ్రస్వ 'అ'కారానికి యతిమైత్రి పాటించినట్లు స్పష్టంగా కనబడుతున్నా నేమానివారు తాముపద్యం వ్రాయడంలో "ఎవ్వఁడంతరిక్షమందు" అని హ్రస్వ'ఎ'కారాదిగానే వ్రాశారు. 'ఎవ్వఁడు' శబ్దం ఉచ్చారణలో 'యవ్వఁడు'గా శ్రవణగోచరమవడంవల్ల అత్వానికియతి సరిపెట్టుకున్నారే గాని తీరా వ్రాయవలసివచ్చేసరికి యతిసంగతి మరచిపోయి సలక్షణంగా వ్యాకరణరీత్యా 'ఎవ్వఁడు' అని అజాదిగానే వ్రాసినట్లు స్పష్ట పడుతున్నది. నిజానికి యీమొదటిపాదంలోవున్న వాక్యంలోని 'అందు'ప్రత్యయాన్ని తొలగించి "ఎవ్వడంతరిక్ష మెనసి వైద్యుత రూపమున" అని'ఎనసి'అసమాపకక్రియను వినియోగించి సలక్షణంగా శాబ్దికయతి ప్రయోగాలతో వ్రాయవచ్చును. కాని శ్రీనేమాని వారు యిటువంటి సవరణ యేదీచెయ్యలేదు. ఈ యతివిశేషాలగురించి నాపరిశోధనారచన 'ధ్వని-లిపి-పరిణామం లేక ప్రాచీన వాఙ్మయంలో వ్యావహారికభాష' అన్న గ్రంథంలో మరింత తేటగా వివరంగా చర్చిడం జరిగింది.

ఉ-ఊ-ఒ-ఓలు ఆదిలోవున్న పదాలు వ్యావహారికభాషలో 'వ'కారాదిపదాలుగా అతిప్రాచీనకాలంనుంచీ ఉచ్చరింపబడుతూ వున్నందువల్ల ప్రాచీనకవు లనేకమంది ఉ-ఊ-ఒ-ఓలతోపాటు వాటి మైత్ర్యక్షరాలతోసహా శాబ్దికాలైన సహజ వు-వూ-వొ-వోలకు యతిమైత్రిని పాటించి ప్రయోగించడం జరిగింది. ఈ యతిమైత్రీవ్యవస్థ గురించి నేను ధ్వని-లిపి-పరిణామం లేక ప్రాచీనవాఙ్మయంలో వ్యావహారికభాష అన్న నా పరిశోధనాగ్రంథంలో సోదాహరణంగా సప్రామాణికంగా వ్రాయడం జరిగింది.

చ॥ అనయము భక్తు లీశ్యకులు లంచును వేదము లాద్విజోత్తముల్
విన నుతియింపఁ గుక్కఁ జదివించిన హావినహాళ్ళికల్లి దే
వునకు ననుంగువాఁడనని వుత్సుకతన్ నుతియింతు భక్తహృ
ద్వనజ విహారలోల ! బసవా ! బసవా ! వృషాధిపా !॥ వృషాధిపశతకం. 98 ప.

"వొక్కని డించి పోవుటయును భీతిల్లి" నవనాథ చరిత్ర. 92 పుట.

"వుండంగఁ దగిన తావులను విశ్వాస్యు..." నవనాథచరిత్ర. 177పుట.

ద్విపద॥ "వోజమై జరయుఁ జావునుఁ దెవుల్లేని"
"వుడిపి కోలాని పోవుచునుండి......" ద్విపదభారతం - 21-41 పుటలు.

ఈయతులు వ్యావహారిక భాషాప్రభావంతో ప్రయుక్తా లయ్యాయని చారిత్రకంగా తెలియజెప్పడానికి ఉత్సుకత-ఒక్కని-ఉండంగ-ఓజమై-ఉడిపి పదాలను వుత్సుకత-వొక్కని-వుండంగ-వోజమై -వుడిపి అని 'వ'కారహలాదిపదాలుగా చూపించడం జరిగిందికాని ఈపదాలను వ్యాకరణసిద్ధాంతప్రకారం"య"డాగమయుక్తాలుగా"యుత్సుకత-యొక్కని-యుండంగ-యోజమై-యుడిపి"అనిగాని లేక కేవలఅజాది పదాలుగాగాని వ్రాసి దేవునకు-పోవుట-తావు-చావు-పోవుచు శబ్దాలలోని శాబ్దికమైన సహజ'వు'కారానికి యతి సరిపెట్టుకొనడం జరిగింది. ఇదేవిధంగా ఆంధ్రఋగ్వేదసంహితలో శ్రీనేమానివారుకూడా వాయువుశబ్దంలోని 'వు'కారానికి ఉచితశబ్దంలోని'ఉ'కారంతో లేదా యడాగమంతోకూడిన 'యు'కారంతో యతిమైత్రిని పాటించారు. ఇక్కడ 'ఉచిత'శబ్దాన్ని 'వుచిత'శబ్దంగా 'వ'కారహలాదిపదంగా భావించి యతి మైత్రిని పాటించారనుకున్నా వచ్చేయిబ్బంది యేమీలేదు. వ్రాతలోమాత్రం యడాగమంతోకూడిన రూపాన్నే నేమానివారువ్రాశారుకాని 'వ'డాగమంతోకూడిన రూపాన్ని వ్రాయలేదు. ఏమైనా అలాక్షణికమని భావించిన వు-ఉ(యు)ల మైత్రిని కొందరు ప్రాచీనకవులవలెనే నేమానివారుకూడా పాటించారు.

గీ॥ ఏకచక్రరథంబు సమిద్ధసప్త,సంఖ్యగల యశ్వరాజముల్ చక్కనైన
సప్తసంఖ్యాఖ్యతో నొప్పు చారువాయు,వును ధరించుచునున్నవి యుచితరీతి ॥

ఆంధ్రఋగ్వేదసంహిత-ప్రథమమండలం
సూక్తం-164-ఋక్కు-2
ప్రథమసంపుటం-533వ పుట-82వ పద్యం

ఇదేవిధంగా శాబ్దికమైన 'వు'వర్ణానికి సంధిలోవున్న ఉ-ఊ-ఒ-ఓలకుకూడా ప్రాచీనకవులు కొందరు సామాన్యయతిమైత్రిని పాటించడం జరిగింది.

చ॥ విను మగధేశ్వరుండెపుడు విప్రజనావళియందు భక్తియున్
వినయముఁ గల్గి యెద్దియును వేఁడినచో వృథసేయకిచ్చుఁ గా
వునఁ దగ నర్జునుండును జవనోద్భవుఁ డేనును బ్రాహ్మణాకృతిం
జని రణ భిక్ష వేఁడిన వశంవదుఁడై యతఁ డిచ్చుఁ గోరికల్॥

భాగ.దశమ ఉ. 715 ప

తేగీ॥ గగనమందుండి యొకఁ డార్తుఁడగుచు వచ్చి,నందనందను పాదారవిందములకు
వందనము చేసి ఆనకదుందుభిని మ,హోగ్రుఁడై పట్టితెచ్చె సాల్వుఁడు గడఁగి ॥

భాగ.దశమ.ఉ. 900 ప

క॥ ... ... ... ని
ల్వుఁడని కూర్చుండఁజేయ రత్నపయుతులై ..."

బసవపురాణం. 1 ఆ 152 ప

మ॥ అనినన్ గర్దభిపల్కె- నీవనుట తథ్యం బీవు శాస్త్రార్థ చిం
తను గర్మంబొనరింతుగాని విను మంతస్సారహీనుండ వె
ట్లనినన్ భూసుతకాంత మంగలికి నెయ్యంబార నిన్గాంచెఁ గా
వునఁ జందాలుఁడవౌదు సందియము లేదూహింప నిప్పట్టునన్ ॥

ధర్మఖండం. 3 అ. 82 ప

చ॥ పలుకులఁ దన్నుఁ దాఁ బొగడఁ బాతక మందు రటుండెఁ దారకా
వలి సికతా ప్రజంబు హిమవారి కణంబులు లెక్క పెట్టఁగా
నలవడుఁగాని యేను వసుధామరకోటికి దానమిచ్చుగో
వుల గణుతింప ధాతయును నోపఁడు మాధవ ! యేమిసెప్పుదున్! ॥

భాగ.దశమ.ఉ. 461 ప

ఇదేవిధంగా శ్రీనేమానివారుసైతం "నీవు"లోని 'వు'వర్ణానికి 'జేయనుందువు'లోని నువర్ణసంధిగత ఉకారానికీ యతిమైత్రినిపాటించి ఈక్రిందిపద్యం వ్రాశారు.

క॥ ఘనమగు జ్యోతిస్తతిచే, దినకరుఁడెటు ప్సృష్టిచయము దిశల కనుపునో
ఘన బ్రహ్మణస్పతీ ! నీ,వును మంత్రతనులట్లఁ జేయ నుందువు ప్రీతిన్ ॥

ఆంధ్రఋగ్వేదసంహిత-ద్వితీయమండలం
సూక్తం-23, ఋక్కు-2
ప్రథమసంపుటం- 744వ పేజీ- 238వ పద్యం

ప్రామాణికులైన ప్రాచీనకవులు కొందరు కేవలస్వరయతిని ప్రయోగించారు. కేవలస్వరయతి అంటే రాముడు మొదలైన పదాక్షరాలలోవున్న కేవలస్వరానికిమాత్రమే యతి వెయ్యడం. ఇటువంటి యతిప్రయోగంగురించి 1950-1951 సంవత్సరాలలో 'అప్పకవీయ వివరణ విమర్శనా లేశము'అన్న శీర్షికతో 'త్రిలిజ్గ' వారపత్రికలో నేను వ్రాసిన వ్యాసపరంపరలోని 24వ వ్యాసంలోనూ, 'కరుణశ్రీ' శ్రీజంధ్యాల పాపయ్యశాస్త్రిగారి సంపాదకత్వాన 1951లోగుంటూరునుంచి వెలువడిన 'సుభాషిణి' సాహిత్యమాసపత్రికలోనూ, నేను ఛందోదర్పణంగురించి (ఆసంతుని ఛందస్సు) వ్రాసిన పరిశోధనాత్మకాలైన విమర్శావ్యాసాలలోనూ, నారదీయపురాణ† అమృత నవనీతం (మహామథనసారామృతం)లోనూ, సప్రామాణికంగా సోదాహరణంగా చర్చించివున్నాను.

† నారదీయపురాణం - ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సులైబరీ అండ్ రిసర్చిఇనిస్టిట్యూట్ ప్రచురణ.

ఉ॥ చాల దళంబుగాఁ బ్రధుల చంపకకీలనఁ బొల్చు బొందుఁడో
మాలె లనంగఁ బంచి మహిమండలిఁ జీఱుచు వ్రాలి గ్రంథ మూ
ర్ఛాలసయైన భృంగతతినాఁ దుదకప్పమరన్పులావళుల్
వ్రీలి గెలల్ సుగంధి కదళీవనపంక్తుల నొప్పు నప్పురిన్ ॥

ఆముక్తమాల్యద. 1.ఆ. 69ప.

పై పద్యంలో మూడవపాదంలో 'మూర్ఛాలస' అన్నప్పుడు 'అలస' శబ్దంలోని అకారానికి 'నాన్'అన్నప్పుడు 'నా'కారంలోవున్న 'ఆ'కారానికి కేవలస్వరయతిని వేయడం జరిగింది. నారదీయపురాణకర్త అల్లాడునరసింహకవికూడా లాక్షణికులు గుర్తించనటువంటి ఈకేవలస్వరయతిని అనేకసందర్భాలలో ప్రయోగించాడు.

గీ॥ తరులతాకుంజ ఖగ మృగతతుల నడిగి, గగన భూవారి పవన తేజోఽంతరముల ॥

(నార. 31పు. 169ప.)

ఈపైతేటగీతిలోని రెండవపాదంలో గగనశబ్దగతమైన తొలి'గ'కారంలోని 'అ'కారానికి 'తేజోఽంతర'అన్నప్పుడు పూర్వరూప సంధిలో గూఢమైవున్న 'అంతర'శబంలోని'అ'కారానికి కేవలస్వరయతిగా విశిష్టంగా ఒకవిశేష యతిప్రయోగం చేయబడినది.

నారదీయపురాణం 100వ పుట, 35వ పద్యమయిన సీసంలోని యీక్రింది రెండవపాదంలో

సీ॥ "అన్యగాథలు మాని నారాయణుని నభోఽభ్యంతరాళమున గానం బొనర్ప"

నభోభ్యంత అన్నప్పుడు 'భ్య'లోని 'య'కారానికి 'గానం'అన్నప్పుడు 'న'వర్ణంలోని 'అ'కారానికి కేవలస్వరయతి ప్రయోగించబడింది. ఈసందర్భంలో అభ్యంతరశబ్దాన్ని 'అభి+అంతర'అని విభజించినప్పటికికూడా ఉపసర్గయతిదృష్ట్యా 'అంతర'లోని అకారస్వరానికి యతివేశాడనిఅనుకొన్నా 'న'వర్ణంలోని కేవల అకారస్వరానికి మాత్రమే యతిమైత్రిని పాటించాడని మనం ఆమోదించకతప్పదు.

చ॥ అలఘులు వీతరాగులు ... ... లా
జలుగొన .... ... ... వై
ద్యులువలె భూమిఁద్రిమ్మరుచుఁ బూర్ణదయాగుణవారిరాసులై ॥

నార. 373పుట. 240ప.

అన్నచంపకమాలలో మూడవపాదంలో యతిమైత్రిలో 'ద'కార'బ'కారాలకు అసలు సంబంధం లేనేలేదు. 'ద్యు'లోని 'యు'వర్ణానికో 'ఉ'స్వరానికో 'బూ'లోని 'ఊ'కారంతో కేవలస్వరయతిని నరసింహకవిప్రయోగించాడని మనం విస్పష్టంగా గుర్తించవలసివున్నది. ఇదేవిధంగా యీక్రిందితేటగీతి మూడవపాదంలో,

గీ॥ కాన గోవిందమాహాత్మ్యకథలయందు, నిరుప మానంద మొంది వర్ణించి సన్ను
తించి నర్తించినట్టి యా నియమపరుఁడు, పరమభక్తుండు ఘనుఁడు సద్భాగవతుఁడు ॥

నార. 453పుట. 41ప.

'సన్నుతించి' శబ్దంలోవున్న 'ఇంచు'లోని 'ఇ'కారానికి 'నియమ' శబ్దంలోని 'ని'వర్ణగతమైన 'ఇ'కారానికి కేవలస్వరయతిని పాటించాడు. ఒకవేళ యిక్కడ నరసింహకవి కేవలస్వరయతిని ప్రయోగించలేదని అనుకున్నా అగ్రాహ్యాలుగా కొందరు లాక్షణికులు తిరస్కరించిన'త-న'లమైత్రిని నరసింహకవి ఆమోదించి ప్రయోగించాడని మనం అంగీకరించవలసివస్తుంది. ఈప్రాచీనకవుల అడుగు జాడలలోనే శ్రీనేమానివారుకూడా ఆంధ్రఋగ్వేదసంహితలో కొన్నిసందర్భాలలో కేవలస్వరయతిని ప్రయోగించడం జరిగింది.

చ॥ సకలనియామకుండవయి చక్కనిసూక్తి నెరుంగువాఁడవై
యకలుషమైన సంతతికి నత్యధికంబుగఁ బ్రీతిఁజేసి యు
త్సుకులగు దైవభక్తులను నున్నతివంతులఁజేసి యున్నచో
నకలుష పుత్రపౌత్రులను నార్యబృహస్పతి! నిన్నువేఁడరే? ॥

ఆంధ్రఋగ్వేదసంహిత-ద్వితీయమండలం
సూక్తం-23, ఋక్కు-19
ప్రథమసంపుటం-747వ పేజీ-254వ పద్యం

ఈపైపద్యంలోని మూడవపాదంలో 'ఉత్సుకులు' అన్నశబ్దంలోని 'త్సు'లోవున్న కేవల'ఉ'కారస్వరానికి 'ఉన్నతి' శబ్దంలోని 'ఉ'కారస్వరానికి కేవలస్వరయతిని పాటించడం జరిగింది.

గీ॥ అశ్వియుగ్మమ: యోజితాశ్వముల సత్య. యానమున్ దెచ్చుచుండె నత్యాదరమున
జనకునకు సముఖంబుగ జన్యుఁడరుగు, నటుల నిష్టులు నీకయి యరుగుచుండు॥

ఆంధ్రఋగ్వేదసంహిత-తృతీయమండలం
సూక్తం-58, ఋక్కు-2
ద్వితీయసంపుటం-221వపేజీ-582వపద్యం

ఈపై పద్యంలోని తొలిపాదంలో వున్న 'అశ్వి' శబ్దంలోని 'అ' కారస్వరానికి 'యోజితాశ్వముల' అన్నప్పుడు "శ్వ" లోని కేవలస్వరానికీ యతిమైత్రిని పాటించడం జరిగింది.

అనేక వ్యాకరణవిశేషప్రయోగాలతోపాటు ఛందోవిశేషప్రయోగాలనుసైతం శ్రీనేమానివారు ఆంధ్రఋగ్వేదసంహితలో చెయ్యడం ద్వారా అనువాదంతోపాటు భాషాచ్ఛందోవిశేషప్రయోగాలలోసైతం ఒకానొక విశిష్టస్థానాన్ని సంపాదించుకున్నారు.

## విభిన్నఋగ్వేద సంహితలు :
## పరిష్కారణ — సంకలనం

వేదాలు వేదర్షులకాలంనుంచీ కేవలం వంశపారంపర్యంగానూ గురుశిష్యపారంపర్యంగాను కంఠస్థం చేయడంద్వారా మాత్రమే పరిరక్షితాలయ్యాయనడం పొరపాటు. వేదావతరణకాలంనుంచీ దానిఅవతరణతోపాటు లిపికూడా ఆవిష్కృతమైనట్లు, రూపొందించబడినట్లు, గతంలోనే పేర్కొనడంజరిగింది. ప్రస్తుతం మనకు ఉపలభ్యమానమయిన ఋగ్వేద ఐతరేయశాఖ కేవల అధ్యయనఅధ్యాపన కంఠోపాఠకులైన ఘనాపాఠీలవంటివారివల్లనేకాక లేఖనపూర్వకమైన లిపిగ్రంథాలతోసైతం అతిప్రాచీనకాలంనుంచీ పరిరక్షింపబడుతూ వచ్చింది. అత్యంతప్రాచీనకాలంలోనే యీ ఐతరేయ ఋగ్వేదసంహిత ఒక్కటే విశిష్టమైన విభిన్నపద్ధతులలో గ్రంథస్థమై రూపు దాల్చింది. ఈ ఐతరేయశాఖాఋగ్వేదం-బాష్కల సంహిత-సాంఖ్యాయన సంహిత-కాత్యాయన సంహిత-శౌనకసంహిత అని నాలుగు సంహితలుగా ఉన్నది. సాంఖ్యాయన మహర్షిని శాంఖ్యాయన మహర్షిగా సైతం కొందరు భావించారు. అతిప్రాచీనకాలంనుంచి మామూలుగా మన కుపలభ్యమానమై ముద్రితమై ప్రచారమైవున్న ఋగ్వేదసంహితగాని, భారతదేశంలోని వేదపండితులు గురువులద్వారా కంఠస్థం చేస్తున్న ఋగ్వేదంగాని, కేవలం కాత్యాయనముని ప్రచలితసంహితాగ్రంథంమాత్రమే. ఈ బాష్కల-సాంఖ్యాయన-కాత్యాయన-శౌనక సంహిత లన్నీ అష్టాష్టకాలతోనేవున్నా అష్టకాధ్యాయప్రారంభాలలోనూ అంత్యాలలోనూ సూక్త ఋక్సంఖ్యల పరిమితిలోనూ వీటిలో కొంత భిన్నత్వం వున్నది.

బాష్కల మహర్షి ఋగ్వేదాన్ని అష్టాష్టకాలుకల గ్రంథంగానే భావించి అష్టక విభజనను మాత్రం భిన్నంగా రూపొందించాడు.† 1వ మండలం 1వ సూక్తం 1వ ఋక్కు మొదలు 1 మండలం 93వ సూక్తం 12వ ఋక్కు వరకూ ప్రథమాష్టకంగాను- 1 మండలం 94వ సూక్తం 1వ ఋక్కు మొదలు 1 మండలం 115వ సూక్తం 6వ ఋక్కు వరకూ ద్వితీయాష్టకంగాను-1వ మండలం 116వ సూక్తం 1వ ఋక్కు మొదలు 1వ మండలం 139వ సూక్తం 11వ ఋక్కు వరకూ తృతీయాష్టకంగాను-1వ మండలం 140వ సూక్తం 1వ ఋక్కు మొదలు 8వ మండలం 50వ సూక్తం 10వ ఋక్కు వరకూ చతుర్థాష్టకంగాను-8వ మండలం 51వ సూక్తం 1వ ఋక్కు మొదలు 8వ మండలం 55వ సూక్తం 5వ ఋక్కు వరకూ పంచమాష్టకంగాను-8వ మండలం 60వ సూక్తం 1వ ఋక్కు మొదలు 8వ మండలం 94వ సూక్తం 12వ ఋక్కు వరకూ షష్ఠాష్టకంగాను-8వ మండలం 95వ సూక్తం 1వ ఋక్కు మొదలు 10వ మండలం 88వ సూక్తం 18వ ఋక్కు వరకూ సప్తమాష్టకంగాను-10వ మండలం 88వ సూక్తం 19వ ఋక్కు మొదలు 10వ మండలం 191వ సూక్తం 4వ ఋక్కు వరకూ అష్టమాష్టకంగాను-రూపొందించాడు. 8వ మండలంలోని 58వ సూక్తంలోవున్న 1,2 ఋక్కులను సప్తమాష్టకం చివర ప్రత్యేకంగా పేర్కొని దశమమండలంలో చివరినుంచి రెండవదిగావున్న 15 ఋక్కుల ఖిలసూక్తాన్ని అష్టమాష్టకంలో ఖిలసూక్తంగానూ పరిశిష్టంగాను పరిగణించాడు బాష్కలుడు 8వ మండలంలోవున్న 56, 57, 58, 59 సూక్తాలను నాల్గింటినీ యిటు పంచమాష్టకంలోగాని అటు షష్ఠాష్టకంలోగాని చేర్చకుండా విడిచిపెట్టాడు. అయితే కొందరు ప్రాచీనులు ప్రత్యేకంగా బాష్కలసూక్తాలు 8 వున్నట్లు భావించారు.

సాంఖ్యాయన ముని విరచిత సంహితా భాగంలో† ప్రస్తుతం బాగా ప్రచలితమై సుప్రసిద్ధమైవున్న కాత్యాయనముని సంహితకు భిన్నంగా-ప్రథమమండలం 1వ సూక్తం 1వ ఋక్కు దగ్గరనుంచి 8వ మండలం 48వ సూక్తం 15వ ఋక్కు వరకూ ఒక గ్రంథభాగంగానూ-8వ మండలం 49వ సూక్తం 1వ ఋక్కు మొదలు 8వ మండలం 59వ సూక్తం 7వ ఋక్కు వరకూ వేరొక భాగంగానూ-8వ మండలం 60వ సూక్తం 1వ ఋక్కు నుంచి 10వ మండలం 191వ సూక్తం 4వ ఋక్కు వరకూ మరొక భాగంగానూ- రూపొందివున్నది. సాంఖ్యాయనమహర్షి 11 వాలఖిల్య సూక్తాలను ప్రత్యేకించి వాలఖిల్య సూక్తాలుగా అసలు గుర్తించనేలేదు. ఈ వాలఖిల్య సూక్తాలన్నింటినీ అసలు ఋగ్వేదసంహితా భాగాలుగానే యితరసూక్తాలవంటివిగానే భావించాడు. వాస్తవానికి సాంఖ్యాయనుడు వాలఖిల్య సూక్తాలను ప్రత్యేక సూక్తాలుగా పరగణించకపోవడం సర్వవిధాలా సమంజసం. సమర్థనీయంకూడా. వాలఖిల్యులు దర్శించిన సూక్తాలు వాలఖిల్యసూక్తాలైతే దీర్ఘతముడు దర్శించినవి దీర్ఘతను సూక్తాలు-వామదేవుడు దర్శించినవి వామదేవసూక్తాలు అవుతాయి. ఇదే పద్ధతిలో యేయేసూక్తాలను యేయేఋషి దర్శించాడో ఆఋషిపేరుమీద ఆ సూక్తం పిలువబడవచ్చును. అయినప్పుడు ఇతరఋషులు దర్శించిన సూక్తాలను వేరుగా పరిగణించకుండా వాలఖిల్య సూక్తాలను వేరుగా పరిగణించడంలో ఔచిత్యం బొత్తిగాలేదు. కాగా సాంఖ్యాయన మహర్షి వాలఖిల్యసూక్తాలను ఋగ్వేదాంతర్గతసూక్తాలుగా ఇతరసూక్తాలవంటివాటిగానే పరిగణించడం సత్యసన్నిహితమైనపని. ఋగ్వేదం దశమమండలం తుదిని ఖిలసూక్తాలుగా భావించబడిన సూక్తాలలో చివరినుంచి రెండవదిగా 15 ఋక్కులుగల ఒకేఒకసూక్తంగా వున్న దాన్ని సాంఖ్యాయనుడు నాలుగు ఖిలసూక్తాలుగా భావించాడు. మామూలుగా 15 ఋక్కులతోవున్న యీసూక్తాన్ని నాలుగు సూక్తాలుగా విభజించి - "తచ్ఛమ్ యోరా వృణీమహే" ఇత్యాదిగావున్న పదిహేనవ ఋక్కును 5వ ఋక్కుగా భావించి యీ 5 ఋక్కులతో తొలి సూక్తాన్ని - ''నైర్హస్త్యంసేనాదిర్ణమ్" ఇత్యాది ఋక్కు మొదలు మూడు ఋక్కులతో రెండవసూక్తాన్ని - "ప్రార్థ్వరాణాం" ఇత్యాది ఋక్కుతో 4 ఋక్కులనుకలిపి మూడవసూక్తాన్ని - "యదృషిః కశ్యపః" ఇత్యాదిఋక్కుతో 3 ఋక్కులుకలిపి 4వ సూక్తాన్ని-రూపొందించి నాలుగు సూక్తాలుగా పేర్కొన్నాడు.

కాత్యాయనముని ఋగ్వేదసర్వానుక్రమణిక పేరుతో సవివరమైన గ్రంథాన్నే ఋగ్వేదంగురించి విరచించాడు. ఈ గ్రంథంలో ఋషులగురించి ఛందస్సులగురించి పరిభాషావివరణపూర్వకమైన విషయాలు వ్రాయడమేకాక ప్రతిమండలంలోనూవున్న సూక్తఋషి అధిదేవతల వివరణతోపాటు ప్రతిసూక్తంలోనూ వున్న ఋక్కుల సంఖ్యలనుకూడా పేర్కొన్నాడు. ఈ రూపంగా ప్రతిమండలంలోనూ ప్రతిఅష్టకంలోనూవున్న మొత్తం ఋక్కులసంఖ్యలనుకూడా మండలాంత్యాలలోనూ అష్టకాంత్యాలలోనూ పేర్కొన్నాడు.

† ఈ సంహితలో అష్టక ప్రారంభ సూక్తాలుగానూ అష్టకాంత్య సూక్తాలుగానూ పేర్కొన్న సూక్తసంఖ్యలు మామూలుగా ఖిల సూక్తాలు కలవనటువంటి ఋగ్వేదంలోని సూక్తసంఖ్యలని గ్రహించాలి.

శౌనకాచార్యుడు ప్రత్యేకించి అన్ని మండలాలలోనూవున్న అనువాకక్రమాలను వివరిస్తూ ఒక్కొక్క అనువాకంలో యెన్నెన్ని సూక్తాలున్నాయో కూడా తెలుపుతూ ఋగ్వేదంలో 85అనువాకాలూ మొత్తం 1025సూక్తాలూ వున్నాయని తెలియజేశాడు. ఋగ్వేదంలో వర్గవిభజననుకూడా శౌనకమహర్షి ప్రవేశపెట్టాడుగాని ఆర్షవిజ్ఞానందృష్ట్యా యీవర్గవిభజనతో ఆచరణపూర్వకంగా లభించే ప్రత్యేక ప్రయోజన మంటూ యేదీలేదు. శౌనకుడు ఆర్షీసూక్తద్రష్టలను ఆర్షీసూక్తాలనూ దేవతాదివిశేషాలతో ప్రత్యేకంగా పేర్కొన్నాడు. అంతేకాక 'పరిభాషాఖండం' పేరుతో ఛందస్సంఖ్యలతోపాటు విశేషాలను తెలియజేస్తూ అనేక ఉదాహరణలనుకూడా యిచ్చాడు.

శౌనక కాత్యాయను లిద్దరూకూడా మామూలుగా ఋగ్వేదంలో 1017 సూక్తాలున్నాయనే చెప్పారు. 1017సూక్తాలకు శౌనకుడు 8బాష్కలసూక్తాలను కలిపి వాలఖిల్యసూక్తాలను అసలు పరిగణించకుండా మొత్తం 1025 సూక్తాలున్నాయన్నాడు. కాత్యాయన మహర్షి బాష్కల సూక్తాలను అసలు పరిగణనలోకే తీసుకోకుండా 11వాలఖిల్యసూక్తాలనుమాత్రం పరిగ్రహించి 1017కు కలిపి 1028 సూక్తాలున్నాయన్నాడు. శౌనకమహర్షికి వాలఖిల్యసూక్తాలపట్ల అనేకమందివలె గౌరవభావం లేకపోవచ్చును. అందువల్ల వాలఖిల్య సూక్తాలను శౌనకుడు విడిచిపెట్టివుండవచ్చును. కొందరు గౌరవించకుండా పరిత్యజించిన వాలఖిల్యసూక్తాలను సైతం మహర్షిద్రష్టాలైన వేదసూక్తాలుగానే ఋగ్వేదంలోకలిపిన కాత్యాయనముని బాష్కలసూక్తాలను యెనిమిదింటినీ పరిగణనలోకి తీసుకొనకపోవడం ప్రామాణిక మైనచర్యగా కనిపించదు. వాస్తవానికి సంహితాకర్తగా బాష్కలునికున్న ఉన్నతస్థానం వాలఖిల్యులకు లేదు. వాలఖిల్యసంహిత అంటూ ప్రత్యేకంగా యేదీలేదుకదా! బాష్కలుడు మామూలుమహర్షికాడు. పైలమహర్షి శిష్యుడు. ఒకసిద్ధాంతంప్రకారం పైలమహర్షి వద్దనుంచి తొలుత ఋగ్వేదాన్ని నేర్చుకుని దాన్ని నాలుగువిధాలుగా విభజించి తన శిష్యులైన బోధ్యుడు-యాజ్ఞవల్క్యుడు-పరాశరుడు-అగ్నిమిత్రుడు అనే నలుగురికి బోధించినట్లు పురాణాలవల్లతెలుస్తున్నది. అటువంటి బాష్కల సూక్తాలను కాత్యాయనముని పరిగ్రహించక పోవడం సమంజసం కాదు. కాత్యాయన ముని ప్రచలితమైన ఋగ్వేదసూక్తసంఖ్య ప్రపంచంలో అనేకముద్రితప్రతులద్వారా బహుళ ప్రచారం పొందింది. అందువల్ల కాత్యాయనముని యిచ్చిన సూక్తపరిగణనాభాగాన్ని ఉదాహరించవలసిన అవసరం లేదనుకుంటాను. అయితే శౌనకమహర్షి మొత్తం ఋగ్వేదంలోవున్న సూక్తాలసంఖ్యను బాష్కలసూక్తాలసంఖ్యతోసహా వక్కాణిస్తూ రచించగా అప్రసిద్ధంగా వున్న శ్లోకాలనుమాత్రం యీ క్రింద పేర్కొంటున్నాను.

—"ఏకాధికా స్స్యున్నవతిః శతం (191) చ వదంతి వై మణ్డలమాదితో యత్।
చత్వారింశత్త్రీణి (43) చాహుర్ద్వితీయం సూక్తే (62) చ షష్టిం చ తృతీయమాహుః॥
అష్టాపంచాశదపి (58) యచ్చతుర్థం సప్తాధికాశీతిరతః (87) పరం స్యాత్।
పంచాధికా (75) సప్తతిరుత్తరం తు చత్వారి వాసిష్ఠమథో శతం (104) చ॥
ద్వేచైవ సూక్తే నవతి (92) చ విద్యాదథాష్టమం నవమం వై శతం (114) స్యాత్।
చతుర్దశత్వాహు రథాధికాన్యప్యాద్యే యదుక్తం దశమే (191) తథైవ॥
ఏతత్ సహస్రం దశ సప్త (1017) చైవాష్టావతో బాష్కలకేఽధికాని (1025)"—

మామూలుగా మూలఋగ్వేదసూక్తాలు 1017 మాత్రమేనని శౌనక కాత్యాయను లిద్దరూ ఆమోదించిన విషయమే. శౌనకుడు 8 బాష్కల సూక్తాలను అధికంగా గ్రహించి 11 వాలఖిల్య సూక్తాలను విడిచిపెట్టగా-కాత్యాయనముని 11 వాలఖిల్య సూక్తాలను అధికంగా గ్రహించి 8 బాష్కల సూక్తాలను విడిచిపెట్టాడుకాబట్టి, శౌనకునిసూక్తాలలో 11 వాలఖిల్యసూక్తాలను-కాత్యాయనునిసూక్తాలలో 8బాష్కల సూక్తాలను కలిపినట్లయితే యీ ఉభయుల పరిగణనలోనూ ఋగ్వేదంలోని మొత్తం సూక్తాలసంఖ్య 1036 కాగలదు. ఊరకే సూక్తాలపరిగణనలో 8 బాష్కలసూక్తాలున్నట్లు భావించడమేకాని సందేహానికాస్కారంలేకుండా వివాదాస్పదంకాకుండా ప్రామాణికమైన సూక్తాలని చెప్పడానికి వీలైన బాష్కలసూక్తాలు ఉపలభ్యం కానేలేదు. అయినా అనేక గ్రంథాలను పరిశోధించి 13ఖిలసూక్తాలను యీఋగ్వేదసంకలనంలో వివిధ సందర్భాలలో చేర్చడం జరిగింది. వివిధమండలాలలోవున్న అనేకసూక్తాలలో కొన్నికొన్ని ఖిలమంత్రాలనుకూడా చేర్చడం జరిగింది. ఖిలమంత్రమన్నా ఖిలసూక్తమన్నా ప్రాచీనకాలంలో అనేకఅర్థాలు చెప్పడం జరిగింది. కల్పసూత్రాలలో వినియోగం పేర్కొనబడని మంత్రసూక్తాదులు ఖిలమంత్రసూక్తాదులుగా వ్యవహృతాలయినట్లు కొందరు తలంచగా ఋషిపరంపరలో పద క్రమ జట ఘనాది పాఠాలు విలుప్తాలై విస్మృతాలై కేవలం మూలంమాత్రమే పఠింపబడగా అది "ఖిల భాగ''మనబడినట్లు మరికొందరు భావించారు. కాని "పర శాఖీయం స్వశాఖాయా మపేక్షా వశాత్ పఠ్యతే తత్ ఖిల ముచ్యతే ఇతి ఖిలలక్షణమ్" అని ప్రాచీనులు ఖిలలక్షణం ప్రవచించారు. ఇతరశాఖాగత మంత్రజాలం సందర్భవశాత్తూ అవసరంకొద్దీ స్వశాఖలోకి పరిగృహీతమయితే అది ఖిలసూక్త మనబడుతుంది.

అంటే ఒకశాఖలోవున్న సూక్తాన్ని అదిలేని మరొకశాఖలోకి పరిగ్రహించినట్లయితే దాన్ని ఖిలసూక్తమంటారన్నమాట. అది మొత్తం సూక్తంకాకుండా సూక్తానికి తక్కువయిన మంత్రాలు పరిగృహీతాలయితే అవి ఖిలమంత్రా లనబడతాయి. ఈఖిలమంత్ర ఖిలసూక్తాలను కొందరు ప్రక్షిప్తాలని భావించగా మరికొందరు అధికపాఠాలుగానూ, వేరొక కొందరు పరిశిష్టాలుగానూ భావించారు. ఏది యేమైనా యీసూక్తాలను పరిగ్రహించినవారూ వున్నారు. పరిహరించినవారూ వున్నారు. ఆధ్యవిజ్ఞానదృష్ట్యా వేదవిజ్ఞానం దృష్ట్యా పరిశోధనచేస్తే యీమంత్రసూక్తాలు విజ్ఞాన భరితాలేననీ పరిగ్రాహ్యాలేననీ పరిహరణీయాలు కావనీ తేటతెల్లమవుతుంది. అందువల్ల యీ సమూలశ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితలో వివిధ "ఖిల" మంత్రాలతోపాటు "ఖిల" సూక్తాలనుసైతం సమ్మేళనం చేయడం జరిగింది. వీటిల్లో ప్రక్షిప్తాలనదగినవాటిని వేదభాగంలో కలపకుండా ఫుట్‌నోటులోనే యివ్వడం జరిగింది. ఈఋగ్వేదంలో అధికంగా జేర్చిన వివిధ "ఖిల" మంత్ర "ఖిల" సూక్తాలను నేను ఆంధ్రీకరించి ఆయాసందర్భాలలో ఆంధ్రఋగ్వేదసంహితలో కలపడంకూడా జరిగింది. ఈఋగ్వేదంలో వివిధగ్రంధాలను పరిశోధించి నూతనంగా చేర్చిన ఖిలమంత్రాల ఖిలసూక్తాలసంఖ్యలనూ మద్విరచితమై అనువాదంగా అవతరించిన తెలుగు పద్యగద్యాలసంఖ్యలనూ యీక్రిందిపట్టికలో యివ్వడం జరుగుతున్నది ఇందులో యేయేమండలంలో యేయేసూక్తాలలో విడిగా ఖిలమంత్రాలు కలిశాయో యెన్నెన్ని ఖిలమంత్రాలు కలిశాయో వాటి అనువాదసంఖ్యతోసహా వివరించడం జరుగుతున్నది.

| మండలం | సూక్తం | ఖిలమంత్రాలసంఖ్య | పద్యగద్యాలు | మండలం | సూక్తం | ఖిలమంత్రాలసంఖ్య | పద్యగద్యాలు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 192* | 3 | 3 | 9 | 67 | 21 | 42 |
| 1 | 193* | 10 | 15 | 9 | 114 | 6 | 12 |
| 2 | 33* | 8 | 8 | 10 | 9 | 1 | 2 |
| 2 | 44 | 6 | 7 | 10 | 75 | 1 | 2 |
| 5 | 44 | 1 | 1 | 10 | 85 | 6 | 12 |
| 5 | 49 | 3 | 3 | 10 | 103 | 2 | 4 |
| 5 | 51 | 2 | 2 | 10 | 106 | 1 | 2 |
| 5 | 84 | 1 | 4 | 10 | 127 | 23 | 46 |
| 5 | 88* | 5 | 5 | 10 | 129* | 12 | 24 |
| 5 | 89* | 5 | 7 | 10 | 130* | 48 | 96 |
| 5 | 90* | 15 | 25 | 10 | 145* | 13 | 26 |
| | | †31 | 32† | 10 | 155* | 11 | 22 |
| 6 | 44 | 3 | 3 | 10 | 165 | 1 | 2 |
| 6 | 48 | 2 | 3 | 10 | 171* | 26 | 52 |
| 7 | 35 | 6 | 6 | 10 | 189 | 3 | 6 |
| 7 | 55 | 12 | 13 | 10 | 192 | 1 | 1 |
| 7 | 96 | 1 | 1 | 10 | 197* | 15 | 30 |
| 7 | 103 | 1 | 1 | 10 | 198* | 7 | 14 |
| 9 | 3 | 2 | 4 | | | | |

* ఈ గుర్తుగల సూక్తాలు అసలు ఋగ్వేదంలో యింతవరకూ చేర్చబడకుండావున్నా పూర్తిసూక్త ప్రతిపత్తికల సూక్తాలు-ఆయా సూక్తగతాలైన ఋక్కులెన్నివున్నాయో వాటిసంఖ్య యెదురుగాయివ్వడంజరిగింది. మిగిలినవి ఖిలమంత్రాలు. ఈ సూక్తాలలో అధికంగాచేర్చిన ఖిలఋక్కులెన్నో ఆ సంఖ్యలను ఆయాసూక్తాలకు యెదురుగా పేర్కొనడంజరిగింది.

† అత్యంత ప్రసిద్ధమైన శ్రీ సూక్తం 15 ఋక్కులతో ఋగ్వేదం పంచమమండలంలో ఖిలసూక్తంగా వున్నది. ఈ ఖిలసూక్తాన్ని 90వ సూక్తంగా యిచ్చి 15 ఋక్కులను 25 పద్యాలలో నేను ఆంధ్రీకరించడం జరిగింది. ఈ శ్రీ సూక్తంలోవున్న 15 ఋక్కులకు తోడు ఋగాభాసాలైన 31 శ్లోకాలు ప్రక్షిప్తాలుగా చేరివున్నాయి. ఈ 31 శ్లోకాలను మూల శ్రీసూక్తంక్రింద ఫుట్‌నోట్‌లో పేర్కొని 32 పద్యాలలో నడిచిన నా ఆంధ్రీకరణకూడా ఆంధ్రీకృత శ్రీసూక్తం ఫుట్‌నోట్ క్రిందనే యివ్వడం జరిగింది. అందువల్లనే 15 ఋక్కులను వాటి అనువాద పద్యాలైన 25 ఆంధ్రీకరణ పద్యాలను ఇక్కడ ప్రత్యేకంగాచూపించి ప్రక్షిప్త శ్లోకాలను వాటి నా అనువాద పద్యాలనుకూడా ప్రత్యేకంగా చూపించడం జరిగింది.

11 వాలఖిల్యసూక్తాలతోసహావున్న 1028 సూక్తాలతో ప్రత్యేకసూక్తాలుగా పరిగణించబడిన 13 ఖిలసూక్తాలనుకూడా కలిపి నక్షత్తే ఋగ్వేదం సూక్తాలుమొత్తం 1041 కాగలవు. ఇతర సూక్తాలలో కలిపిన అధికసంఖ్యలోవున్న ఖిలమంత్రాలను ప్రత్యేకసూక్తాలు గానె పరిగణనలోకితీసుకుంటే మరొక 7సూక్తాలు ఖిలసూక్తాలుగా రూపొంది మొత్తం1048సూక్తాలు కాగలవు. ప్రత్యేకసూక్తాలుగా పరిగణించడానికి వీలైన ఒక్కొక్క సూక్తంలోవున్న అధిక ఋక్కులివి. 2వ మండలంలో 44 సూక్తంలో 6 ఋక్కులు, 7వ మండలంలో 35వ సూక్తంలో 6 ఋక్కులు, 7వ మండలంలో 55 సూక్తంలో 12ఋక్కులు, 9వ మండలంలో67వ సూక్తంలో 21ఋక్కులు, 9వ మండలంలో 114వ సూక్తంలో 6ఋక్కులు, 10వ మండలంలో 85వ సూక్తంలో 6ఋక్కులు, 10వమండ లంలో 127వ సూక్తంలో 23 ఋక్కులు కలిశాయి. వివిధమండలాలలో ఆయాసూక్తాలలో కలిసిన యీ ఖిలమంత్రాలను ప్రత్యేక సూక్తాలుగా భావించినా వచ్చే యిబ్బంది యేమీ లేదు.

వివిధసూక్తాలలో చేర్చిన "ఖిల"మంత్రాలుగాని ప్రత్యేక ఖిల సూక్తాలలో యిచ్చిన ఖిలమంత్రాలుగాని -5వ మండలం 90వ సూక్తంలో ఫుట్‌నోటులో యీయబడిన ఋగాభాసశ్లోకాలు 31కాక- ఖిలమంత్రాలు మొత్తం 284. ఈ "ఖిల"మంత్రాలకు నేను విర చించిన అనువాదపద్యాలు 506. 5వమండలంలోని 90వ సూక్తంలో ప్రక్షిప్తాలుగా యిచ్చిన 31శ్లోకాలనుకూడా విడిగా 32 పద్యాలుగా ఆంధ్రీకరించి ఫుట్‌నోటులోనే యివ్వడం జరిగింది. ప్రక్షిప్త అప్రక్షిప్త ఖిలమంత్రాలు 315కాగా వాటికి ఆంధ్రీకరణగా నేను విర చించిన పద్యాలు మొత్తం 538. ఇవి కేవలం ఖిలమంత్ర అనువాదాలు మాత్రమే. ఇవి గతంలో నే నిచ్చిన మద్విరచిత పద్యసంఖ్య అయిన 1250లో యీ538కూడా కలిసివున్నది.

ఋగ్వేదంలో వాలఖిల్య సూక్తమంత్రాలతోసహా కలిపివున్న 10,552 ఋక్కులతో వివిధసందర్భాలలో ప్రామాణికాలైన ఖిలమంత్రాలుగా గ్రహించిన 284 ఋక్కులనూ కలిపితే ఋగ్వేదంలోమొత్తం 10,836 ఋక్కు లున్నట్లుకాగలదు. 5వమండలంలోని 90వ సూక్తంలో ఫుట్‌నోటులో యివ్వబడిన 31 మంత్రాభాస శ్లోకాలను యిందులోకలపకుండా పరిత్యజించడం జరిగింది-అందువల్ల యివి 10,836 ఋక్కులలో కలిసిలేవు.

మూల ఋగ్వేదసంహితను రూపొందించడంలో విభిన్నాలైన అనేకముద్రితప్రతులను వ్రాతప్రతులను తులనాత్మకంగా పరిశీలించి పరిశోధించి పరిష్కరించడం జరిగింది. అనేక వ్రాతప్రతులలోనేకాక కొన్నికొన్ని ముద్రితగ్రంథాలలోసైతం 'థ-ధ'లకు అభిన్నత్వం పాటించడం జరిగింది అదేవిధంగా 'ఒ-ళ'ల విషయంలోను 'శ-స'లవిషయంలోనూ వ్యత్యస్తత యేర్పడివున్నది. 'శ-స'ల విషయంలో 'వశిష్ఠ'శబ్దం 'శ'కారయుక్తంగానూ 'స'కారయుక్తంగానూకూడా రెండురూపాలలోనూ ప్రాచీనకాలంలోనే ప్రామాణికత్వాన్ని సంతరించు కున్నది. 'స్పృష్టి'శబ్దం'శృష్టి'శబ్దంగాసైతం ప్రాచీనఋక్కులలోప్రయుక్తమైవుంది. ఋచలలో తార్మారుకూడా లేకపోలేదు. 'అ'కార ప్రశ్లేష చిహ్నంగా ఽ అన్నదానికిమారుగా S అన్నదానినీ ఆకారప్రశ్లేషకు చిహ్నంగాఽఽ-అన్నవాటికి మారుగా SS అన్నవాటినీ ముద్ర ణలో వినియోగించడం జరిగింది. అకారప్రశ్లేషకు చిహ్నంగా S అన్నదానిని, ఆకారప్రశ్లేషకు చిహ్నంగా SS అన్నవాటిని ప్రాచీనవ్రాత ప్రతుల్లో ఉపయోగించేవారు. స్థలాభావంచేత యితర వేదభాషావిషయాలను యిక్కడ చర్చించడంలేదు.

మేము యీ మూల ఋగ్వేదాన్ని పరిశోధించి రూపొందించడంలో వివిధవ్రాతప్రతులలో గోచరించిన అనేకపాఠాంతరాలను ఫుట్‌నోట్లరూపంలో యివ్వడం జరిగింది. కేవలం శాబ్దికాలైన పాఠాంతరాలను మాత్రమేకాక ఉదాత్తాదిస్వరాలను సంబంధించిన పాఠాంతరాలనుకూడా యివ్వడం జరిగింది. అనేకపాఠాంతరాలలో అక్షరశబ్దభేదాలేకాక అతిసున్నితమైన అకారప్రశ్లేషలతోకూడిన పాఠాంతరాలు పెక్కు లభించాయి. మామూలుగా ఋక్కులో లేనటువంటి అకారప్రశ్లేషతోకూడిన పాఠాంతరమంటే అది అనుస్యూతంగా ప్రవచించబడుతున్నఅర్థానికి విభిన్నమైన విశిష్టమైన అర్థాన్నిస్తుందని గ్రహించాలి. అనేకఋక్కులలో యీఅకారప్రశ్లేషలతోవచ్చే అర్థవిశేషవైభిన్న్యాలదృష్ట్యా ఋక్స్వరూపస్వభావాలగురించి ఆర్షవిజ్ఞానదృష్ట్యా వేదవిజ్ఞానదృష్ట్యా బహుముఖమైన పరిశోధనలు చేయవలసివున్నది. వేదవిజ్ఞానం అనంతమైనది. అగస్త్యుడు సముద్రాలన్నింటినీ పుక్కిలించినట్లు మన వేదర్షులు అనంతవేదవిజ్ఞానంనుంచి ఒకపరిమితపరిధులో యీవేదశాఖల రూపంగా మనకు జ్ఞానభిక్ష పెట్టారు. అనంతవిశ్వంలో సముద్రా లెటువంటివో అనంతవేదవిజ్ఞానంలో మనకు లభించిన వేదవిజ్ఞానం అంతమాత్రమైనదే. బహుముఖమైన వేదవిజ్ఞానంలో మౌలికమైన పరిశోధనలు జరపడానికి తెలుగువారికి

అవకాశం కల్పించాలనేదృష్టితోనే తెలుగులిపిలో మూలఋగ్వేదాన్నికూడా స్వరసహితంగా వివిధపాఠాంతరాలతో అందించడం జరుగుతున్నది. నిజానికి అనేకమంది విమర్శకులు పేర్కొన్నట్లు చరిత్రపేరుతో సంస్కృతిపేరుతో మనకు లభించినవేదవిజ్ఞానం "ఆర్షవిజ్ఞాన"మేకాని "ఆర్యవిజ్ఞానం"మాత్రం కాదు. అసలు"ఆర్యజాతి"అంటూ మానవులలో ప్రత్యేకజాతి యేదీలేదు. ఉన్నది భారతజాతి ఒక్కటే. అసలు "ఆర్యజాతి" అనేదే లేనప్పుడు ఆర్యుల్లో ప్రాచీనభారతీయులు ధ్రువఖండప్రాంతానికి తరలివెళ్ళినప్పుడు రచించబడిన ఋక్కులు ఋగ్వేదంలో వున్నాయన్నప్రాచ్యపాశ్చాత్యవిమర్శ పరిశోధకుల వ్రాతలు ప్రామాణికాలెవిధంగాఅవుతాయి? అసలు వేదాలే అపౌరుషేయాలన్నప్పుడు ఆ అపౌరుషేయాలైనవేదాలలో ఆ మానవులైన ఆర్యులగురించో వారి నివాసస్థలాలగురించో వారి ప్రయాణవిషయాలగురించో వర్ణించబడిందనడం అవాస్తవికమేగదా! ఆర్యుల లేదా భారతీయుల ధ్రువప్రాంత నివాస విషయాలను స్పష్టపరుస్తున్నాయని యీవిమర్శ పరిశోధకులు ఉదాహరించిన వివిధఋక్కులకు వేదఖగోళంప్రకారం మౌలికంగా ప్రామాణికాలై విజ్ఞానపరమై శాస్త్రీయమైన అర్థాలుచెప్పవలసివున్నది. ఈఅర్థాలతోకూడిన ఆర్షఖగోళ విషయాలను నా మహత్తర పరిశోధనారచన "ఋగ్వేద దివ్యాలోకనం" అనేగ్రంథంలో సప్రమాణంగా వివరంగా చర్చించి నిరూపించివున్నాను. ఋగ్వేదంలో భారతీయుల ధ్రువప్రాంత నివాసంగురించి వర్ణితమైనదన్న విషయాన్ని నిర్ద్వంద్వంగా అప్రామాణికమని నా యీ పరిశోధనారచనలో తిరుగులేనివిధంగా త్రోసిపుచ్చడం జరిగింది. ఆర్యవిజ్ఞానంపేరుతో ఉటంకించబడిన ప్రతిభావంతమైన వివిధ మంత్రప్రయోగాలన్నీ కేవల భారతీయ అనంతవేదవిజ్ఞాన ఆకాశంనుంచి ఆర్షవిజ్ఞాన ప్రతిబింబకాలుగా ప్రసారితమై ప్రచలితమైన ఉల్కలవంటివి మాత్రమే. గతంలో నేను పేర్కొన్నట్లు అనంతవిజ్ఞానఖనియై అపౌరుషేయమైన వేదంలో మామూలు మానవుల, ఆర్యులనబడినమానవుల, జీవితసరళి-వారి మంచిచెడులు-కష్టసుఖాలు-తెలివితేటలు – వైద్యాదివిషయాలు-సోమరసాదులతోపాటు కల్లుతోసహా గుజ్జుపుగిట్టలనుంచి తీయబడిన మాదక ద్రవ్యంకూడా అభివర్ణితమైనదనిచెప్పడం వేదాలు కేవలం అపౌరుషేయాలనడానికి వుపయోగపడుతుందేతప్ప వేదవిజ్ఞానానికి వెలుగు బాటలను తీర్చిదిద్దలేదు గతంలో వేదవిజ్ఞానం అంటేయేమిటో తెలియక అంధానుగతితో కేవల లౌకికదృక్పథంతో వేదానికి అనేకమంది భాష్యాలు విరచించారు. ఈభాష్యాలలో మిగిలిన భాష్యాలగురించి పెద్దగా చెప్పవలసిందేమీలేదుకాని అత్యంతప్రామాణికమైన భాష్యంగా భారతదేశమంతటా ప్రచారంపొంది ఒక సమున్నతస్థానం సంపాదించిన సాయనభాష్యం ప్రత్యక్షరప్రమాణంకాదని దోషజుష్టాలైన అనేక విషయాలు అందులో అడుగడుగునా వున్నాయని గత 20 సంవత్సరాలలోనూ, "ఆంధ్రప్రభ" దినపత్రికలోనూ, "గోలకొండపత్రిక" దినపత్రికలోనూ అనేకానేక వ్యాసాలువ్రాసి, ఆకాశవాణి హైదరాబాదుకేంద్రంనుంచి అనేకప్రసంగాలు చేసి నేను నిరూపించాను వేదర్షులవిజ్ఞానం అనంతమైనదనీ అగాధమైనదనీ నిరూపించడానికి వేదవిజ్ఞానంలో ఆచరణపూర్వకమై అనుభవపూర్వకమై ప్రయోగాత్మకమైన పరిశోధనలు అనేకంచేసి ప్రకటించాను. నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు సాయనభాష్యంమీదనే ఆధారపడి అవతరించిన శ్రీ వేమానివారి ఆంధ్రఋగ్వేద సంహితను పఠించడంద్వారా సాయనభాష్యంలో యేమున్నదో తెలుగువారికి తెలుసుకొనడానికి పూర్తిగా అవకాశం లభిస్తుందన్నదృష్టితోనే యీ ఆంధ్ర ఋగ్వేద సంహితను నేను మూలఋగ్వేదంతో సంకలనంచేసి పరిష్కరించి పూరణకావించడం జరిగింది. వాక్స్వాతంత్ర్యం భావప్రకటనాస్వాతంత్ర్యం అన్నది ప్రతిప్రాణికీ జన్మహక్కు. అందువల్ల మనకు యిష్టంకాని అభిప్రాయాల ప్రకటనకు మనవ్యతిరేకతను చెప్పవలసిన పనిలేదు. అన్నిభావాలను తర్కసహంగా సత్యాన్వేషణాదృష్టితో లోకంముందు పెట్టిమరీ యేది మంచో యేదిచెడో యేదిపరిగ్రహించవలసిందో యేదిపరిత్యజించవలసిందో తిరుగులేనివిధంగా అజయ్యమైనపద్ధతిలో తెలియ జెప్పవలసిన అవసరం యెంతైనా వున్నది. ఇటువంటికృషి జరిగినపుడే మహారాజఫణి విలసిత-రవి శశికళా విరాజమాన మహావిష్ణు విశ్వరూప-నిత్య-సత్యశ్రీ-జయశ్రీ-సంశోభితమైన మహత్తర వేదవిజ్ఞానం పవిత్రవేదవిజ్ఞానం బహుముఖంగా ఆవిష్కృత మవుతుంది. ఇంతటి విశాల దృక్పథంతోనే యీసమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితను నేను రూపొందించడం జరిగింది.

## కేవలం దైవలీలగా<br>రక్షణపూర్వకంగా లభించిన<br>సంకలన–పరిష్కరణ–పూరణబాధ్యతలు

ఈసమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణబాధ్యలు నాకు కేవలం దైవలీలగా లభించాయనే చెప్పాలి. ఆంధ్ర ఋగ్వేద సంహిత పరిష్కరణ-పూరణబాధ్యతలు లభించడం-అదికూడా రక్షణపూర్వంగా లభించడం మరీ దైవలీలగా కేవలం

ఒక కృష్ణలీలగా-విష్ణుమాయగా దృగ్గోచరమవుతున్నది. రక్షణపూర్వకంగా నాకు లభించిన యీపరిష్కరణ-పూరణ బాధ్యతకు సంబంధించిన ఆ కథ యిది.

1945 నుంచి 1950 వరకూ పశ్చిమగోదావరిజిల్లా కొవ్వూరులోవున్న ఆంధ్రగీర్వాణవిద్యాపీఠంలో నేను భాషాప్రవీణ చదివాను. విద్యార్థిదశలోనే వ్యాకరణఛ్ఛందాలలో ఘటికుడనని విమర్శకుడననీ పరిశోధకుడననీ కీర్తి గడించాను. ఒకవంక గోదావరినది యివతల కొవ్వూరులో భాషాప్రవీణ ప్రిలిమినరీ చదువుతూనే గోదావరినది అవతల రాజమండ్రిలోవున్న ఆర్యవైశ్యసేవాసదనంలోని మహిళా సంస్కృత కళాశాలలో ప్రిలిమినరీ-ఫైనల్ విద్యార్థులకు వ్యాకరణం ఛందస్సులు పాఠంచెప్పేవాడిని. విద్యార్థిదశలోనే నా కలవడిన పరిశోధనావిమర్శా దృక్పథాలు కారణంగా ప్రాచీనతాళపత్రగ్రంథాలను, కాగితపు వ్రాతప్రతులను, సేకరించే కార్యక్రమంకూడా చేపట్టాను. ప్రతిసంవత్సరం ఆంధ్రగీర్వాణవిద్యాపీఠంలో గణపతి నవరాత్ర్యుత్సవాలు జరపడం ఆసందర్భంగా అనేకమందిప్రముఖులను ఆహ్వానించి ప్రవన్యాసాలు యేర్పాటుచేయడం జరుగుతూవుండేది. ఒకసంవత్సరం యీవుత్సవాలకు కవిసార్వభౌమ, శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి గారిని ఆహ్వానించగా వారితో నాకు పరిచయంయేర్పడింది. శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారికీ నాకూ వయస్సులో చాలా తేడా వున్నప్పటికీ వారు నన్నొక అనుంగుమిత్రుడుగా భావించి గౌరవించేవారు. 1951 ఫిబ్రవరి11 తేదీన మా స్వగ్రామమైనకృష్ణాజిల్లా కపుతరంలో జరిగిన మా వివాహ మహోత్సవ సందర్భంగా శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారు నన్నుకవిగా, పండితుడుగా, విమర్శకుడుగా అభివర్ణించిప్రశంసిస్తూ ఆశీర్వచన పద్యాలు విరచించి వారే వాటిని రాజమండ్రిలో ముద్రింపించి వారి మనిషిద్వారా వివాహసమయానికి మా గ్రామం పంపించారు. దీనినిబట్టి శ్రీకృష్ణమూర్తిశాస్త్రిగారికి నాపట్ల యెంతటి గౌరవాభిమానా లుండేవో గ్రహించవచ్చును. నా విద్యార్థిదశలోనే ఆంధ్రగీర్వాణవిద్యాపీఠ గ్రంథాలయంలోని వివిధ కావ్య పురాణ శాస్త్రగ్రంథాలన్నీ విమర్శనా దృష్టితో పరిశీలించాను. ఛందశ్శాస్త్రాలలో అభివర్ణితమైన గణాధిదేవతలు, గణరాసులు,గణగ్రహనక్షత్రాలు,అమృతాక్షరవిషాక్షరాలు, అక్షరాలపంచభూతాత్మకత్వాలు, అక్షరాధిదేవతలు, అక్షరరాసులు, అక్షరనక్షత్రాలు, వాటి శుభాశుభఫలితాలు మొదలైనవిషయాలను చూచినతర్వాత అవినాభావసంబంధంకల కామ, తంత్ర, మంత్ర, ఖగోళ, జ్యోతిషాయుర్వేదాది శాస్త్రాలను, షడ్దర్శనాలను, ఉపనిషత్తులుమొదలైనవాటిని స్వయంగా అధ్యయనంచేసి సత్యాన్వేషణా దృష్టితో, విషయగ్రహణాదృష్టితో బహుముఖమైన పరిశోధన చేశాను. ఈ బహుముఖమైనపరిశోధనే ఆతరువాత వేదవాఙ్మయవిజ్ఞానాల పరిశోధనకు దారితీసింది. ఆరోజుల్లో రాజమండ్రిలోని గౌతమీగ్రంథాలయానికి పాలకవర్గ అధ్యక్షులుగా శ్రీ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారే వుండేవారు. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారితో నాకున్న సాన్నిహిత్యం కారణంగా గౌతమీ గ్రంథాలయంలోవున్న అనేక గ్రంథాలను విమర్శా దృష్టితోచదివి పరిశోధించేఅవకాశం నాకులభించింది. గ్రంథాలయంలోని యేపుస్తకం కావాలన్నా తులనాత్మకపరిశీలనకు యేయేపుస్తకాలు యెన్నెన్నిపుస్తకాలు కావలన్నానే నున్నచోటుకి తీసుకునివెళ్ళి చదివి తిరిగియిచ్చేపద్ధతిమీద నాపరిశోధన కొనసాగించడానికి శ్రీకృష్ణమూర్తి శాస్త్రిగారు సర్వస్వతంత్రమైన అవకాశం నాకు యిచ్చారు.

గౌతమీ గ్రంథాలయంలో అనేకవేల ముద్రిత గ్రంథాలతోపాటు పెక్కుతాళపత్ర గ్రంథాలు, కొన్ని కాగితపు వ్రాతప్రతులు కూడా వుండేవి. 1949 సంవత్సరం చివరిభాగంలో గౌతమీ గ్రంథాలయంలోని తాళపత్ర గ్రంథాలను, కాగితపు వ్రాతప్రతులను పరిశీలించుదామనే దృష్టితో అప్పుడు లైబ్రేరియన్‌గావున్న శ్రీ వెంకటస్వామిగారిచేత వ్రాతప్రతులున్న చెక్కబీరువా తెరపించాను. బీరువా తెరిచిందే తడవుగా అనేక వ్రాతప్రతులు క్రమరహితంగా చిందరవందరగా పడివుండి ఉప్పురికినట్లుగా చెమ్మగిల్లి బూజూ చెదలూ పట్టి వుండడం గమనించి పరిస్థితి తెలియజెప్పి వెంటనే శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారిని గ్రంథాలయానికి తీసుకొని వచ్చాను. శ్రీ కృష్ణమూర్తిశాస్త్రి గారు ఆ వ్రాతప్రతుల పరిస్థితిని చూచి విచారపడి వాటి నన్నింటినీ దులిపించి మరొక బీరువాలో అప్పటికి తోచిన పద్ధతిలో సర్దించారు. ఆ సందర్భంలోనే శ్రీ నేమాని వెంకటనరసింహశాస్త్రిగారు విరచించిన శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంపుటాలను నేను మొట్టమొదటిసారిగా చూడడం జరిగింది. 1949లో పదమూడు ఆంధ్రఋగ్వేద సంహిత సంపుటాలు ఋషిదేవతలపట్టికలున్న మరొక సంపుటమూ మొత్తం 14 సంపుటాలు లభించాయి. ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతులలో 7వ. సంపుటమూ "ఋగ్వేదసంహిత-ఆర్యులప్రతిభ" అన్న శీర్షికతో శ్రీ నేమానివారు విరచించిన విమర్శనా వ్యాసంవున్న 15a సంఖ్యగల సంపుటమూ 1949లో మాకు కనిపించలేదు. "ఈ 14 సంపుటాలనైనా రక్షించగలిగాం"అనే తృప్తి అప్పుడు మాకు కలిగింది. ఎంతైనా వేదంవేదమేకదా ! ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతులను సరైనక్రమంలోపెట్టి పరిశీలించడంవల్ల మధ్యలో 7వ సంపుటంలేదని మేమప్పుడే గుర్తించగలిగాముకాని "ఋగ్వేదసంహిత-ఆర్యుల

ప్రతిభ"అన్న వ్యాసంతో మరొకసంపుటం వున్నదన్నసంగతి ఆరోజుల్లో మాకు తెలియనే తెలియదు. ఈవిధంగా అనేక వ్రాతప్రతులతో నేమానివారి ఆంధ్రఋగ్వేదసంహిత మూల వ్రాతప్రతి సంపుటాలను పధ్నాలుగింటినికూడా కాపాడడం జరిగింది. ఆ తరువాత తెలుగు సాహిత్యంలో చరిత్రను సృష్టించగల గ్రంథంగా అవతరించిన ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతులు అప్పటికే కొంత దెబ్బతిని వున్నట్లు కనబడటంవల్ల వాటికి మరొకప్రతి తయారుచేస్తే బాగుంటుందని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారికి నేను తెలియజెప్పగా "గ్రంథాలయానికి డబ్బు లేదు. ఆ పుస్తకాలను రక్షించినకీర్తి మీదే-అట్లాగే వాటికి కాపీవ్రాసేపని మీరే చేపట్టి ఆ పుణ్యంకూడా మీరే కట్టుకోకూడదా ?" అని శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారు నాతో అన్నారు. దానిమీద "సరే"నని చెప్పి 1950-1951-1952 సంవత్సరాలలో ఆంధ్రఋగ్వేదసంహితకు కాపీవ్రాసేపని పూర్తిచేశాను. ఈ ప్రతివ్రాయడంలో నా అర్ధాంగి శ్రీమతి శశికళకూడా నాతో పూర్తిగా సహకరించారు. ఋగ్వేదఆంధ్రాను వాదం 6వ మండలంలోని 62వ సూక్తం మొదలు 7వ మండలంలోని 59వ సూక్తాంత్యంవరకూ-అంటే పంచమాష్టకంలోని ప్రథమా ధ్యాయం మొదలు చతుర్థాధ్యాయం తుదివరకూవున్న 7వ సంపుటం మినహా మిగిలిన ఆంధ్రఋగ్వేద సంహిత సంపుటాలన్నింటినీ ఋషి దేవతల పట్టికలతోసహా మేము కాపీవ్రాయడం జరిగింది. 7వ సంపుటంలోని పంచమాష్టక గత చతురధ్యాయాలను "ఋగ్వేదసంహిత-ఆర్యుల ప్రతిభ"అన్న విమర్శనావ్యాసాన్ని అప్పుడు మేము కాపీవ్రాయడం జరుగలేదు. అప్పుడా పుస్తకాలే అసలు మాకు కనుపించ లేదుకదా! అప్పుడు గౌతమీ గ్రంథాలయంలో యెన్నెన్నో వ్రాతప్రతులను రక్షించినా మిగిలినవన్నీ ఒకయెత్తు యీ ఆంధ్రఋగ్వేద సంహిత మరొకయెత్తుగా నేను భావించాను. ఆంధ్రఋగ్వేద సంహితను చదివినతర్వాత సాయనభాష్యాన్నిసయితం పరిశీలించి అసలైన వేద విజ్ఞాన పరిశోధనకు పూనుకొన్నాను. తత్ఫలితంగా అనేకగ్రంథాలను పరిశీలించినతర్వాత వేదవాఙ్మయంమీద మొట్టమొదట 1954 జూన్‌నెలలో "వేదామృతము"అన్న శీర్షికతో ఒక వ్యాసం వ్రాసి ''ఆంధ్రపత్రిక" (దినపత్రిక) అధిపతులూ సంపాదకులూ అయిన మిత్రులు శ్రీ శివలెంక శంభు ప్రసాద్‌గారికి పంపగా వెంటనే దాన్ని 24-6-1954వ తేదీ 'ఆంధ్రపత్రిక' (దినపత్రిక)లో ప్రకటించటం జరిగింది. 1955 జూన్ నాటికి వివిధ విషయాలమీద శతాధికమైన విమర్శనవ్యాసాలు నేను వివిధ పత్రికలలో ప్రకటించినా వేద వాఙ్మయంమీద మొట్టమొదట నేను వ్రాసినవ్యాసం యీ "వేదామృతము" అన్నదే. వేదకాల నిర్ణయాల విషయమై వివిధ విమర్శకుల అభిప్రాయాలు ప్రామాణికాలు కావని వ్రాస్తూ "యెవరు వేదకాల నిర్ణయం చేసినా ఆయా కాలాలలో వేదాలు వుండి వుండవచ్చును అని నిర్ణయించారేగాని "ఆయా కాలాలకు పూర్వం వేదాలు లేవు" అని నిర్ణయించలేకపోయారు" అని మొట్టమొదట యీ వ్యాసంలోనే పేర్కొన్నాను. నేమానివారి ఆంధ్రఋగ్వేద సంహిత దశమమండలంలోని 137వ సూక్తం మొదలు అష్టమాధ్యాయాంతంవరకూ అను వదించబడకుండా అసమగ్రంగా వుండడం గమనించి 137 సూక్తంమొదలు దశమ మండలం చివరివరకూ 1957లో నేను పద్య గద్యమయంగా ఆంధ్రీకరించి పూరించాను. నేను పూరించిన భాగం తుదిని అంటే దశమ మండలానికి అష్టమాష్టకానికి చివర ఆంధ్ర ఋగ్వేద సంహితను నేను పూరించినట్లు గూఢంగా తెలియజేస్తూ మదీయ వాఙ్మయ మహావృక్ష బిరుద సంపూర్ణ నామాక్షర గర్భితంగా యీ క్రింది సీసపద్యం విరచించాను.

సీ॥ ఏ వాక్కునైన స్వవాఙ్మయామృతమందు నయగార మొలకంగ నమక చమక
స్వాహాగతు లెనయ నధ్వవస్థితి నిల్పు చక్షయమ్ముగ వెల్గ నవని వేద
మొల్ల నెనయకయె యోమూదుచును నుంచు బాడినొప్పెడి మహాప్రాణశక్తి
నే గోప్రశక్తుల నేపాటి యెరిగెనో యల సాయనుండు తా బ్రాకృతమతి
గీ॥ దృష్ణమెయి వ్రాసె భాష్యాలు తియ్యనౌచు, బ్రతుకు సంస్కృత శవ జీవ భాషలోన
నందు ఋగ్వేదమును దాను నాంధ్రభాష, నిలిపె నేమాని వంశజుం డరసియరసి
సరస వేంకట నరసింహశాస్త్రి చాల, గావ్యతీర్థ బిరుదమొప్పు గాలగతిని
బోవ బూర్తిగా నక్షర భూతయతిని, నిల ద్వితీయుండుగను నద్వితీయమతిని॥

ఈ పైసీసపద్యంలో తొలిపాదంనుంచి నాల్గుసీసపాదాలలోనూ తొలిగీతపాదంలోనూ ప్రాసయతిస్థానాలలో మొదటనుంచి క్రమంగా వాఙ్మయ మహావృక్ష, వడ్లమూడి గోపాలకృష్ణయ్య అన్నబిరుదసహిత సంపూర్ణ నామంలోని ఒక్కొక్క అక్షరాన్ని పొదిగి మదీయ బిరుదంతో కూడా గృహనామసహితంగా నా నామాన్ని పరిగర్భితం చెయ్యడం జరిగింది. (సీసపద్యం మూడవ పాదంలో మాత్రం ఉత్తరార్ధంలో గృహనామం ముగింపు చిహ్నంగా చివరి ప్రాసయతి స్థానాన్ని నామాక్షరవిరహితంగా విరామం యిచ్చి విడిచిపెట్టడం జరిగింది.)

1957లో ఆంధ్రఋగ్వేద సంహిత తుదిభాగాన్ని పూరించడానికి ముందు మూలఋగ్వేదంతో మొత్తంగ్రంథాన్ని సరిపోల్చి చూడవలసిన ఆవశ్యకత నాకు యేర్పడలేదు. అందువల్ల నేమానివారు వివిధమండలాలలో ఆంధ్రీకరించకుండా అనేకఋక్కులను సూక్తాలను విడిచిన విషయం నాదృష్టికి రాలేదు. కాగా దశమమండలంలోని తుదిభాగమైన నేమానివారి రచన శిథిలమైపోయి కాలగర్భంలో కలిసిపోయి వుంటుందనే అభిప్రాయంతోనే పోయినభాగమనే దృష్టితోనే దాన్ని నేను పూరించడం జరిగింది. 1979లో తిరుమల తిరుపతిదేవస్థానంవారు సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత సంకలన-పరిష్కరణ-పూరణ బాధ్యతలు నాకప్పగించి ఆంధ్రఋగ్వేదసంహిత వ్రాతప్రతులు నాకప్పగించినతర్వాత మూలఋగ్వేదంతో తులనాత్మకంగా యీ ఆంధ్రఋగ్వేదాన్ని పరిశీలించడం జరిగింది. ఈ పరిశీలనలో శ్రీనేమాని వారు అనేక ఋక్కులను, సూక్తాలనుకూడా వివిధ మండలాల్లో ఆంధ్రీకరించకుండా విడిచిపెట్టారని బయటపడింది. చివరికి నేను 1957లో పూరించిన దశమమండలంలోని తుదభాగాన్ని అసలు శ్రీనేమానివారు రచించనేలేదని-శ్రీనేమానివారు రచించగా శిథిలమైవుంటుం దని 1957లో నేనభిప్రాయపడినవిషయం వాస్తవం కాదనికూడా తేటతెల్లమైనది.

1957 తరువాత వేదవాఙ్మయంలో సత్యాన్వేషణదృష్టితో నేను కేవలం మౌలికమైన విషయపరిశోధనలు చెయ్యడమేకాక వేదవిజ్ఞానంలో ఆర్షవిజ్ఞానంలో ఆచరణపూర్వకమైన బహుముఖపరిశోధనలుకూడా చెయ్యడం మొదలుపెట్టాను.

1958లో నా వ్యావహారికభాషా వ్యాకరణాన్ని రాజమండ్రిలోని "అద్దేపల్లి అండ్ కో" వారికిచ్చి దానిని ప్రకటించేదృష్టితోవారి సరస్వతీపవర్‌ప్రెస్సులో ముద్రించేనిమిత్తమై నాల్గునెలలు నేను రాజమండ్రిలో వుండవలసివచ్చింది. అప్పుడు గౌతమీగ్రంథాలయంలో 1950 ప్రాంతాలలో లైబ్రేరియన్‌గా పనిచేసిన శ్రీవెంకటస్వామి వార్థక్యంతో రిటైర్‌కాగా - మరొకవ్యక్తి లైబ్రేరియన్‌గా నియమితులై పనిచేస్తున్నారు. బహుశా యీరెండవ లైబ్రేరియన్ పేరు తెన్నేటి రామశంకరం అయివుండవచ్చునని నాకు గుర్తు. శ్రీశంకరంగారు ఆరోజుల్లో పుస్తకాలభద్రతవిషయంలో చాలాజాగ్రత్త తీసుకున్నారు. అప్పుడు గౌతమీగ్రంథాలయానికి నేను వెళ్ళి గ్రంథాలయవిషయంలో శ్రీశంకరంగారు తీసుకుంటున్నశ్రద్ధకు నాసంతోషాన్ని వ్యక్తంచేసి ముద్రిత గ్రంథాలన్నిటినీ విషయవిభాగంచేసి సబ్జక్ట్‌వైజ్‌గా ఒకక్రమంలోపెట్టడం మంచిదని సలహాయిచ్చాను. అప్పటి నాసలహామేరకు శ్రీశంకరంగారు గ్రంథాలయంలోని గ్రంథాలనన్నింటినీ పునః పరిశీలించి కలగాపులగంగావున్న పుస్తకాలను సబ్జక్ట్‌వైజ్‌గా విడదీసి ఒకక్రమంలోపెట్టడం మొదలుపెట్టారు. ఈ గ్రంథాలపునఃపరిశీలనలో 1949లో మాకుకనిపించని ఆంధ్రఋగ్వేదసంహిత 7వ. సంపుటమూ దానితోపాటు "ఋగ్వేదసంహిత - ఆర్యుల ప్రతిభ" అన్నవ్యాసం వున్న 15a. సంపుటమూ ముద్రణగ్రంథాలలోకలిసిపోయి లభించాయి. కనిపించని 7వ సంపుటం-"ఆర్యులప్రతిభ"వ్యాసంతోసహా లభించి నందుకు నేనెంతో సంతోషించాను. ఈరెండు వ్రాతప్రతులూ ఆంధ్రఋగ్వేదసంహితలో భాగాలని లైబ్రేరియన్‌కు తెలియజెప్పి ఈ రెండిం టినీ మిగిలిన 14 వ్రాతప్రతులతోను చేర్చి అన్నింటినీ ఒకేచోట పెట్టించాను. అయితే అప్పటికే వేదాలలో నాపరిశోధనాదృక్పథం మారి నందువల్ల ఆంధ్రఋగ్వేదసంహితలోని 7వ సంపుటాన్ని "ఆర్యులప్రతిభ" వ్యాసాన్ని నేను కాపీ వ్రాయలేదు. కాని ఆంధ్రఋగ్వేద సంహిత 14వ్రాతప్రతులను 1949లో కాపాడిన నేను 1958లో వాటికి సంబంధించిన మిగిలినరెండు సంపుటాలను ప్రత్యేకించి సంహితా భాగమైన పంచమాష్టకంవున్న 7వ సంపుటాన్ని అసలు పుస్తకాలతో చేర్చగలిగినందుకు మరింత సంతోషించాను..

1958 చివర నారచనలైన తీరనిఋణం(నాటిక)-వ్యావహారికభాషా వ్యాకరణం-బాలన్యాయదర్శనం-గ్రంథాల ఆవిష్కరణజరిగిన తరువాత కొన్నిరోజులకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హిందూధర్మాదాయ దేవాదాయశాఖలో "ఆరాధన"పత్రికకు నేను ఎడిటర్‌గా నియమితుడ నయ్యాను. నేను ఆరాధనకు ఎడిటర్‌గావున్న దాదాపు మూడుసంవత్సరాల కాలంలోను నేను వివిధ వేదమంత్రాలకు అనేకవిధాలైన మాత్రాచ్ఛందస్సుల్లోను సరళవచనాలుగాను ఆంధ్రానువాదాలు రచించాను. ఆ అనువాద గీతికలు, వచనాలు సమూలంగా ప్రతినెలా ఆరాధనలో ప్రకటిస్తూ వచ్చాను. ఈ వేదమంత్రానువాద గీతికలను వచనాలను "వేద నాదాలు"అన్న గ్రంథంగా రూపొందించి 1961లో ఒక గ్రంథంగా ప్రకటించా లనుకున్నాను. కాని ఆర్థికమైన యిబ్బందులవల్ల ప్రకటించలేకపోయాను. ఈ "వేద నాదాలు" గ్రంథంనుంచి నాపరిచయ వాక్యాలతో 1961లో ప్రకటితమైన డా. గిడుగు వేంకట సీతాపతిగారి"తెలుగులో ఛందోరీతులు" అన్న పరిశోధనా రచనలో వివిధగతులలో విశిష్టంగా నడచిన నా ఋగనువాద గీతికలను కొన్నిటిని డాక్టర్ సీతాపతిగారే యెన్నుకొని ఉదాహరించారు.

క్రమ క్రమంగా వివిధ వేదభాషల్లో పరిశ్రమచేసి బహుముఖమైన వేద విజ్ఞానాన్ని గుర్తించి సాయనాచార్యుని వేదభాష్యం ప్రామాణికంకాదని అనేక వ్యాసాలద్వారాను ఆకాశవాణి ప్రసంగాలద్వారాను నేను నిరూపిస్తూ వచ్చాను. 1961లో ఆంధ్రప్రదేశ్

ప్రభుత్వ సమాచార పౌర సంబంధాలశాఖలో "ఆంధ్రప్రదేశ్" ఎడిటర్‌గా నేను నియమితుడనయ్యాను. ఆ తరువాత దాదాపు మూడు సంవత్సరాలకు ఆ వుద్యోగంనుంచి విరమించగా ఆకాశవాణి హైదరాబాదుకేంద్రంలో స్పోకెన్‌వర్డ్ ప్రొడ్యూసర్‌గా 1965 మార్చిలో నేను నియమితుడనవడం జరిగింది. ఆతరువాత 1968 సెప్టెంబర్‌లో ఆపదవినుంచి కారణాంతరాలవల్ల విరమించాను.

నేను విద్యార్థిదశనుంచి సేకరిస్తూ నావద్ద భద్రపరచిన వివిధ తాళపత్రగ్రంథాలు కాగితపువ్రాతప్రతులు అనేకంవుండేవి. ఆకాశవాణి వుద్యోగంనుంచి విరమించినతర్వాత నేను కుటుంబసమేతంగా మా స్వగ్రామం వెళ్లదలచి నేను కష్టపడితిరిగి ధనవ్యయంచేసి సేకరించిన ప్రాచీన వ్రాతప్రతులను యెవరికైనా యివ్వడం నాకు యిష్టంలేకపోయినా నాకు తలబరువుగా - భద్రపరచడం - కష్టసాధ్యంగా వున్నందువల్ల వ్రాతప్రతుల నన్నింటినీ ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీవారికి విరాళంగా యివ్వదలచి ఆవిషయం అప్పటి దాని కార్యదర్శి శ్రీదేవులపల్లి రామానుజరావుగారికి తెలియజేశాను. శ్రీరామానుజరావుగారు నా వద్దవున్న తాళపత్రగ్రంథాలు స్వీకరించటానికి ఆమోదించి "కాగితపు వ్రాతపతులను భద్రపరచటం కష్టం. వాటివల్ల అంత వుపయోగంకూడా వుండదేమో! అవి మాకు వద్దు". అని మర్యాదగా తమ అనామోదాన్ని తెలియజేశారు. అప్పుడు నావద్దవున్న నూటడెబ్భైయొక్క తాళపత్రగ్రంథాలను సాహిత్యఎకాడమీవారికి విరాళంగా యిచ్చి శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహితతోసహా నావద్దవున్న వివిధ కాగితపు వ్రాతప్రతులను ఆరోజుల్లో నాకు కష్టసుఖాల్లో చేదోడువాదోడుగా వుంటున్న శ్రీగోగినేని శేషగిరిరావుగారికి యిచ్చివేసి మానసికమైన బాధతోనే అప్పటి నా బరువు వదిలించుకున్నాను. తమ కుటుంబ పరిస్థితులూ ఆర్థిక పరిస్థితులూ కలిసివస్తే నాచేతనే పరిష్కరింపించి శ్రీ నేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహితను మరిరెండు ఆయుర్వేద గ్రంథాలను యెప్పటికైనా ప్రకటించాలనే అభిప్రాయంలో శ్రీ శేషగిరిరావుగారు ఉండేవారు. వారి ఆర్థికపరిస్థితి మెరుగవనూ లేదు. గ్రంథాలముద్రణ జరగనూలేదు.

1976 లో ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌కు నేను డైరెక్టర్‌ను అయిన తరువాత శ్రీ శేషగిరిరావుగారికి నామమాత్రపు ప్రతిఫలం యిచ్చి వారివద్దవున్న కాగితపు వ్రాతప్రతులను శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతపతులతోసహా స్వీకరించి మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో భద్రపరచడం జరిగింది. ఆదేవిధంగా 1968 లో నేను సాహిత్య ఎకాడమీకి విరాళంగా ఇచ్చిన 171 తాళపత్ర గ్రంథాలనుకూడా ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌కు తెప్పించి భద్రపరచడం జరిగింది. మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలోవున్న యీ ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతులు మొత్తం నలభైయేడు ఎక్సర్‌సైజ్ పుస్తకాలలో 3745 నుంచి 3791 వరకూ వున్న ఆక్సేషన్ నెంబర్లతో వున్నాయి.

నిజానికి ఋగ్వేదానికి సాయనాచార్యులు రచించిన భాష్యం ప్రామాణికమైనది కాదని నేను అనేక వ్యాసాలద్వారా నిరూపించినా నూటికి తొంభైతొమ్మిదిపాళ్ళు సాయన భాష్యంమీదనే ఆధారపడి అనువాదంచేసిన శ్రీ నేమానివారి ఆంధ్రఋగ్వేద సంహితను ప్రచురించి వేదంపట్ల సాయనాచార్యుల కున్నటివంటి అభిప్రాయా లెటువంటివో తెలుగువారు తెలుసుకొనే అవకాశం కల్పించడం చాలా అవసరమని నేను భావించాను. ఈ దృష్ట్యా మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీలో భద్రపరచబడిన మేము వ్రాసిన ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతులకుతోడు రాజమండ్రిలోని గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడివున్న శ్రీనేమానివారి ఆంధ్రఋగ్వేదసంహిత మూలవ్రాతప్రతులనుకూడా మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీకి తీసుకొనివచ్చి మొత్తం గ్రంథాన్ని పరిష్కరించి మూలఋగ్వేదంతోసహా సంకలనంచేసి ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌పక్షాన ప్రకటించడం సముచితంగా వుంటుందని భావించాను. యీదృష్టితో గౌతమీగ్రంథాలయం పాలక మండలి అధ్యక్ష కార్యదర్శులతో మాట్లాడి ఆంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతుల మూలసంపుటాలను తీసుకొని వద్దామనే అభిప్రాయంతో 1977 మార్చినెలలో నేను రాజమండ్రి వెళ్ళడం జరిగింది. అక్కడ గౌతమీ గ్రంథాలయం పాలకవర్గ అధ్యక్షుల్ని కలిసి విషయంచెప్పగా అందుకు వారు "ఆ పుస్తకాలను ముద్రించి ప్రకటించాలనే దృష్టితో తిరుమల-తిరుపతి దేవస్థానంవారు ఆంధ్రఋగ్వేద సంహితను ముద్రించి ప్రకటించిన తర్వాత వ్రాతప్రతి సంపుటాలను తిరిగి గౌతమీ గ్రంథాలయానికి అప్పగించే కండిషన్ మీద ఎగ్రిమెంట్‌బాండ్ వ్రాసి 25-10-1976 తేదీన తీసుకొనివెళ్ళడం జరిగిం''దని నాకు తెలియజేశారు. వ్రాతప్రతిసంపుటాలలో కొన్నిపుస్తకాలలో కొన్నికొన్ని పేజీలు బాగా పాతవి అవడంవల్ల శిథిలమై విరిగిపోయివున్నాయనికూడా నాకు తెలియజేశారు. దానికి "నేను కాపీవ్రాసిన వ్రాతప్రతి మరొకటి కూడా హైదాబాద్ మాన్యుస్క్రిప్ట్స లైబ్రరీలో వున్న"దని నేనుచెప్పగా "మీరు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ పక్షాన ప్రచురిస్తే యింకా మంచిది. మీరు తిరుపతివెళ్ళి మాట్లాడితే బాగుంటుంది" అని వారు అన్నారు. ఆ తరువాత 1977 ఏప్రిల్ నెలలో శ్రీనేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహిత ప్రచురణ విషయమై అప్పటికే వ్రాతప్రతులు స్వీకరించి ఆరునెలలు అయినందువల్ల తిరుపతిలోపని యేవిధంగా

జరుగుతున్నదో చూడాలని అనుకున్నాను. ఆ తరువాత తిరుపతివెళ్ళి శ్రీనేమానివారి శ్రీమదాంధ్రఋగ్వేద సంహిత వ్రాతప్రతుల సంపుటాలకు ప్రతి వ్రాయకుండానే మూల వ్రాతప్రతుల ననుసరించే ముద్రణకార్యక్రమం కొనసాగించే పరిస్థితులలో వుండగా ఆ ప్రయత్నాన్ని ఆపి తిరిగి మూల వ్రాతప్రతులను నేను మరొకసారి దైవికంగానే సంరక్షించడం జరిగింది. అనంతరం దేవస్థానం బోర్డు అధ్యక్షులు శ్రీ సి. అన్నారావు, ఎగ్జిక్యూటివ్‌ఆఫీసర్ శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజు IAS గార్లు యిద్దరూ నాతో అన్నివిషయాలూ చర్చించి అప్పటి కప్పుడు ముద్రణా కార్యక్రమంజరుపకుండా నిలిపివేశారు. తరువాత ఋగ్వేద ప్రచురణ విషయమై "తెలుగు లిపిలో సంస్కృత ఋగ్వేదము అసలు ముద్రితం కాలేదనీ నేమానివారి ఆంధ్రఋగ్వేదసంహితతోపాటు మూలఋగ్వేదాన్నికూడా సంకలనంచేసి స్వరయుక్తంగా ప్రకటించడం చాలా ఉత్తమం" అని నేను వారికి సలహా యివ్వగా- అందుకు వారు సంతోషంతో ఆమోదించారు. ఆ తరువాత శ్రీ అన్నారావు, శ్రీ రాజగోపాలరాజుగార్లు సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితను ప్రచురించే విషయమై అనేక దృక్కోణాల నుంచి ఆలోచించి సాధకబాధకాలను అన్నిటినీ అవలోకనంచేసి ఆ గ్రంథ సంకలన-పరిష్కరణ-పూరణబాధ్యతలను నాకే అప్పగించాలని నిర్ణయం చేసినట్లు తెలియజేశారు. "వేదం వచ్చినవారికి తెలుగు కవిత్వంరాదు. తెలుగు కవిత్వం వచ్చినవారికి వేదం తెలియదు. సకల శాస్త్రాలూ అవలోడించి వేదాలలో పరిశోధనచేసి అన్నివిషయాలూ తెలిసినవారు మీరే! అందువల్ల మీకే యీ బాధ్యతను అప్పగించ దలచాం" అనికూడా నాకు తెలియజేశారు. అప్పుడు ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత-సంకలన-పరిష్కరణ-పూరణ బాధ్యతలను స్వీకరించడానికి నేను నా ఆమోదాన్ని సంతోషంతో తెలియజేశాను. 1977 ఏప్రిల్ నెలలో దేవస్థానం ప్రెస్సులో ముద్రణ ప్రారంభం కాకుండానే కార్యక్రమం ఆగిపోయిన తరువాత దాని ప్రచురణకు సంబంధించిన బాధ్యతలన్నీ నాకప్పచెప్పే నిర్ణయాలుచేసి అందుకు తగువిధమైన చర్యలు తీసుకొనడంలో దాదాపు సంవత్సరంన్నరకాలం గడిచిపోయింది. ఇంతలో - మిత్రులు శ్రీ జలగం వెంగళరావుగారి గౌరవాభిమానాలు కారణంగా 1975 జనవరి 1వతేదీ నుంచి నేను ఆధిపత్యంవహిస్తున్న ఆంధ్రప్రదేశ్ గవర్నమెంట్ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్ డైరెక్టర్ పదవి కాంట్రాక్టును కొన్ని కారణాలవల్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1979 మార్చి 1వ తేదీ నుంచి పొడిగించకపోవడంతో నేనా డైరెక్టర్ పదవినుంచి తప్పుకున్నా ఈ సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణబాధ్యతల మహాయజ్ఞం మాత్రం నన్ను విడిచిపెట్టలేదు. నా కవితా పాండితీగరిమలూ ప్రతిభా వ్యుత్పత్తులూ నాకు డైరెక్టర్ పదవితోరాలేదు కదా! ఇంతలో తిరుమల-తిరుపతి దేవస్థానంబోర్డు అధ్యక్షులుగావున్న డాక్టర్ శ్రీ అన్నారావుగారి స్థానంలో అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ రెవిన్యూ కార్యదర్శి డాక్టర్ ఎన్. రమేశన్ I A.S, M.A.,P hd.గారు అధ్యక్షులవడం, అప్పుడు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా వున్న శ్రీ పి.ఎస్. రాజగోపాలరాజు I.A S గారు బదిలీకాగా, శ్రీ పి.వి ఆర్.కె. ప్రసాద్ 1.A.S. గారు ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా నియమితులు కావడం జరిగింది డాక్టర్ రమేశన్, శ్రీ ప్రసాద్‌గార్లు ఇతర బోర్డు సభ్యులు గతంలో బోర్డు చేసిన నిర్ణయం ప్రకారం సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణబాధ్యతలను నాకే అప్పగిస్తున్నట్లుగా తిరిగి నిర్ణయంచేసి నాకు తెలియజేయడమేకాక ఆ నిర్ణయాన్ని అమలుపరుస్తూ శ్రీ నేమానివారు విరచించగా రాజమండ్రి గౌతమీ గ్రంథాలయంలో భద్రపరచబడిన ఆంధ్ర ఋగ్వేద సంహిత పదహారు వ్రాతప్రతుల సంపుటాలను 1979 మే 10వ తేదీన తిరుమల - తిరుపతి దేవస్థానం పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్ శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి M.A గారి ద్వారా నాకప్పగించడం జరిగింది. 1949 నుంచి 1977 వరకూ జరిగిన గత 28 సంవత్సరాలలోనూ ఆంధ్ర ఋగ్వేద సంహిత సంపుటాలను రెండుసందర్భాలలో నేను రక్షించడం జరిగిందంటే, చివరికి వీటి పరిష్కరణ బాధ్యతలతోపాటు మూలఋగ్వేద సంకలనంతోసహా రూపొందించే బాధ్యతకూడా నాకే లభించిందంటే అది కేవలం దైవలీలకాక మరేమనాలి? ఈ దైవీయమైన మహత్తర కార్యక్రమాన్ని కేవలం దైవకార్యంగానే భావించి నేను నిర్వర్తించాను. ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణ-కార్యక్రమాలు పూర్తి చేయటానికి ముందు సంస్కృత ఋగ్వేదాన్ని నేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహితను కాపీ చేయవలసివున్నది గదా! ఈ కార్యక్రమం పూర్తి చేయడానికి నాఅర్ధాంగి శ్రీమతి వడ్లమూడి శశికళ, నా జ్యేష్ఠకుమార్తె కుమారి వడ్లమూడి జయశ్రీ B.Sc. కుమారి కొల్లి టాన్యారాణి B.Com, శ్రీ సుర్ల సూర్యనారాయణమూర్తి (భాషాప్రవీణ), కుమారి పి. కళావతి (భాషాప్రవీణ), శ్రీమతి హనుమార రంగనాయకమ్మ B.Sc, కాపీవ్రాసే కార్యక్రమాన్ని నిర్వర్తించారు. శ్రీమతి శశికళ తప్ప మిగిలినవారందరూ సముచితవేతనాలతో యీ కార్యక్రమాన్ని నిర్వర్తించగా శ్రీమతి శశికళ మాత్రం యేవిధమైన ప్రతిఫలాపేక్ష లేకుండా వేతనం తీసుకోకుండా కేవలం భక్తిప్రపత్తులతోనే యీ కార్యక్రమాన్ని నిర్వర్తించారు. అందరికంటే అత్యధికంగా కుమారి జయశ్రీ రాత్రింబవళ్ళు అవిశ్రాంతంగా కృషిచేయడం జరిగింది. వీరందరికీ నా

హృదయపూర్వకమైన శుభాకాంక్షలు. కుమారి జయశ్రీ కేవలం కాపీ వ్రాయడంలోనే కాక యీ గ్రంథాన్ని సంకలనం చెయ్యడంలోను అనేక మూల ఋగ్వేద ప్రతులతో సరిపోల్చిచూడడంలోను పరిష్కరణ పూరణ కార్యక్రమాలలోనూ శ్రీమతి శశికళ తోడుకాగా గత రెండు సంవత్సరాలుగా అహరహం అహోరాత్రాలు నాతో పరిశ్రమించడం జరిగింది. అందుకు వీరుభయులకూ నా హృదయపూర్వకమైన శుభాకాంక్షలు.

శ్రీనేమానివారి ఆంధ్ర ఋగ్వేద సంహితను రూపొందించడంలో- 30 సంవత్సరాల క్రిందట మేము వ్రాయగా ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసర్చ్ ఇన్స్టిట్యూట్‌తో భద్రపరచిన ఆంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులతో సరిపోల్చి చూచి నేమానివారి వ్రాతప్రతులలో కాగితాలు బాగా పాతవైనందున శిథిలమైపోయిన సందర్భాలలో ఓ-యం-ఎల్ ప్రతులలోవున్న సరియైన పూర్తి పాఠాలనుగ్రహించి ఆ విషయం ఆయాపుట్ నోట్లలో తెలియపరచడం జరిగింది. శ్రీనేమానివారు తమ ఆంధ్ర ఋగ్వేద సంహితను ఆంధ్రదేశంలో నివసిస్తున్న ఆంధ్రులకు అంకితంయిస్తూ రెండు సీసపద్యాలు చిత్తుగా వ్రాసి వాటిని మరొకచోట సాపుగా వ్రాసి మొదట చిత్తుగావ్రాసినవాటిని కొట్టివేశారు. ఈ చిత్తుగావ్రాసిన పద్యాలు వ్రాతప్రతి 15b సంపుటంలో మొదటిపుటలో ఉన్నాయి. సాపుగా వ్రాసిన పద్యాలుకూడా యీ 15b సంపుటంలోనే మరొక పేజీలో ఉండాలి కాని ఆ కాగితం శిథిలమైపోయింది. అయితే ఈ అంకితం పద్యాలను కూడా మేము వ్రాసినప్రతిలో యిదివరకేవ్రాసిఉన్నందువల్ల వాటిని గ్రహించి ముద్రించడం జరిగింది. ఓ-యం-యల్‌లోని ఆంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతులతో ఈ ఆంధ్ర ఋగ్వేదమూలవ్రాతప్రతులను సరిపోల్చి చూడడానికై - మొట్టమొదట నాకై నేనే డైరక్టర్‌గా యేర్పరచిన నియమావళిప్రకారం ఓ. యం. యల్. డైరక్టర్ అనుమతి తీసుకుని కుమారి జయశ్రీ సహకరించగా వాటిని తులనాత్మకంగా పరిశీలించాను. ఈ పరిశీలనకై అనుమతించిన ఓ.యం.యల్ అధికారులకు నా కృతజ్ఞతలు.

తిరుమల తిరుపతి దేవస్థానంవారు వేదవాఙ్మయ పరిరక్షణకు-బహుముఖమైన ప్రచారానికి – కంకణంకట్టుకుని అనేక రూపాలలో కృషిచేస్తున్నారు. పెక్కు యితర కృషులతోపాటు వేదవాఙ్మయ ముద్రణ ప్రచారాలకుసైతం ప్రాధాన్యంయిచ్చి చాలా వ్యయప్రయాసలకోర్చి దీక్షగా పరిశ్రమిస్తున్నారు. ఈ మహత్తరకార్యక్రమంలో భాగంగానే ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రచురణ జరుగుతున్నది. కాగా ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ-ద్వితీయమండలాలతో యీ ప్రథమ సంపుటాన్ని-తృతీయ, చతుర్థ, పంచమ, షష్ఠ మండలాలతో ద్వితీయ సంపుటాన్ని-సప్తమ, అష్టమ మండలాలతో తృతీయ సంపుటాన్ని - నవమ, దశమ మండలాలతో చతుర్థ సంపుటాన్ని ఒకదానితరువాత ఒకటిగా నాలుగు సంపుటాలలో తిరుమల - తిరుపతి దేవస్థానంవారు ముద్రించి ఆవిష్కృతం చేస్తున్నారు.

ఈ సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణ కార్యక్రమాలు నిర్వర్తించడంతోనే నా వేదవాఙ్మయ విజ్ఞాన పరిశోధనలకు నేను స్వస్తివాచకం చెప్పడంలేదు. మామూలుగా గత ముప్పై సంవత్సరాలుగా భగవత్కృపతో దినదినాభివృద్ధిగా అభ్యుదయముఖంలో-బహుముఖాలుగా కొనసాగుతున్న నా వేదవిజ్ఞాన పరిశోధనలు, మన మహర్షుల-వేదర్షుల అడుగుజాడలలో ఆచరణపూర్వకంగా కొనసాగుతున్న నాపరిశోధనలు, నిరవధికంగా-నిరాటంకంగా-నిరంతరమూ కొనసాగుతూనే వుంటాయని నేను సవినయంగా మనవి చేస్తున్నాను. మొట్టమొదటినుంచీ కేవలం దైవప్రేరణతోనే దైవానుగ్రహంతోనే నే నీ ఆర్ష విజ్ఞాన పరిశోధనలు చేస్తున్నానని కూడా సవినయంగా మనవి చేస్తున్నాను.

నిజానికి ఈ సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత సంకలన-పరిష్కరణ-పూరణ బాధ్యతలు రక్షణపూర్వకంగా దైవలీలగానే నాకు లభించినా యీబాధ్యతను నాకప్పగించాలని ఆచరణలో తొలుత బీజంవేసిన డాక్టర్ శ్రీ సి. అన్నారావు, శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజు I.A.S. గార్లకు దానిని అమలుపరచి ఆచరణలోచేసిచూపించిన డాక్టర్ ఎన్.రమేశన్ I.A.S, శ్రీపి.వి.ఆర్.కె.ప్రసాద్ I.A.S గార్లకూ అప్పటి బోర్డుసభ్యులకు, ప్రస్తుతం బోర్డు అధ్యక్షులైన శ్రీ బి. నాగిరెడ్డిగారికి తదితర బోర్డుసభ్యులకూ నాహృదయపూర్వకమైన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. సమూల శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత ప్రథమ సంపుటాన్ని అనేక శ్రమలకోర్చి ముద్రించిన స్వతంత్రప్రెస్ అధిపతులైన శ్రీమతి కందనాతి ఉషారెడ్డి, శ్రీ కందనాతి చెన్నారెడ్డి దంపతులకు నాహృదయపూర్వకమైన శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

హైదరాబాద్
న్యూ నల్లకుంట
తొలి ఏకాదశి
12-7-1981

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

# శుభాశంస!

౧

సామాన్యకుటుంబమున న
సామాన్యతఁబుట్టి పెరిగి శశ్వచ్ఛక్తిన్
సామాజిక నవ చైత
న్యామృతుఁడగు నాగిరెడ్డి నభినందింతున్॥

౨

పండిన వయసున నిండగు
గుండెలు మెండుగను నేడు కొండల గుడులై
పండఁగ నధ్యక్షుండై
రెండింతల కీర్తి నాగిరెడ్డి వెలిఁగెడున్॥

౩

ఒకవంక వేదాల యకలంక నాదాలు
విమలశక్తుల నిండి విస్తరిల్ల
నొకవంక శాస్త్రాలు వికసించు మార్గాల
వేలువేలుగఁ బూలు వెల్లివిరియ
నొకవంక సాహిత్య సకల శాఖలు వేరు
వేరు రూపులు దాల్చి వెలుఁగుచుండ
నొకవంక సంగీత చకిత నృత్యరవళుల్
చెవులు గింగురుమంచుఁ జెలఁగుచుండ
వరల బహుముఖాలఁ దిరుమల తిరుపతి
దేవళముల నెల్లఁ దీర్చిదిద్ది
శాశ్వతంపుఁ గీర్తి సకలదిశల వెల్గ
శ్రీ బి. నాగిరెడ్డి శ్రీల నేలు॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ఐ. ఏ. ఎస్.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు



# అభినందన!

## 1

కడు వేదవిస్తృతిఁ గపిలర్షియా ? కాఁడు
వేదప్రచార సంవాది యతఁడు!
పారాడు నార్ష విద్యారణ్యుఁడా? కాఁడు
వేద సద్ఘోష సమ్మోదుఁ డతఁడు!
రాజరాజనరేంద్ర రాణ్మౌళియా ? కాఁడు
వేదవిజ్ఞాన సంప్రీతుఁ డతఁడు!
మనుమసిద్ధిని బోలు మనుజేంద్రుఁడా ? కాఁడు
పండిత కవి పక్షపాతి యతఁడు!
అతఁడు శ్రీవేంకటేశ భక్తాగ్రగామి
గోపికార్ధాంగిప్రియుఁడు సద్గుణ గణుండు!
అలర పీ.వి.ఆర్.కె. ప్రసాదుఁ డమరుఁడయ్యెఁ
దెలుఁగు దేవవేదమ్మును వెలుఁగఁజేసి॥

## 2

పీ. వీ. ఆర్. కె. ప్రసాదుఁ డ
నావిలుఁడై కామ్యకర్మ లలరించుచు నా
శ్రీవేంకటేశు నర్చలఁ
గావించుచు ముక్తిగనుత! గాఢ సుభక్తిన్॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహోధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"





అసూర్యా నామ తే లోకా అన్ధేన తమసావృతాః।

తాగ్ంస్తే ప్రేత్యాపి గచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః॥

యజుర్వేద సంహితా-40 అధ్యా-3మం.

గీ॥ గాఢమైన తమము గ్రమ్మిన యట్టు లో
కము లసూర్యము లనఁగలవు కొన్ని
ఆత్మఘాతమందు నాచరించినవారు
వానిఁ జెందువారు మేను విడిచి॥

కావ్యతీర్థ
నేమాని వేంకటనరసింహశాస్త్రి



యదద్య కచ్చ వృత్రహన్నుదగా అభి సూర్య।

సర్వం తదిన్ద్ర తే వశే॥

ఋగ్వేద సంహితా-8మం-93సూ-4ఋక్కు

చరాచరాత్మరూపకా !

సమస్తజగద్దీపకా !

అజ్ఞాన తిమిరనాశకా !

అఖిలలోకజాల కాల

సర్వస్వము నీవశమై

సంచరించుఁ బరమాత్మా !॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"





## ఆశీస్సు

సమూల
శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
సంకలన—పరిష్కరణ—పూరణల
మహత్తర కార్యక్రమంలో
అనవరతం—అహరహం—అహోరాత్రులు
నాతోపాటు
అవిశ్రాంతంగా కృషి చేసిన
నా జ్యేష్ఠకుమార్తె
చిరంజీవి—సౌభాగ్యవతి
కుమారి వల్లమూడి జయశ్రీ బి.యస్‌సి.కి
భగవంతుడు
దీర్ఘాయురారోగ్య సౌభాగ్యభాగ్యముల నొసగి
కాపాడుగాక !

బ్రహ్మర్షి
వాఙ్మయ మహోధ్యక్ష
డాక్టర్ వల్లమూది గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"





తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి

మొదటివరుస యెడమనుండి కుడికి : శ్రీ సైదయ్య ఎమ్.ఎల్.ఎ., శ్రీ వై. వి. రామిరెడ్డి బి.ఎ.బి.ఎల్., శ్రీ బి. నాగిరెడ్డి (అధ్యక్షులు), శ్రీ కె. వీరారెడ్డి, శ్రీ ఈ. ఎన్. జోషి.

రెండవవరుస యెడమనుండి కుడికి : శ్రీ బి. సత్యనారాయణ, శ్రీ పి. ఎస్. రాజగోపాలరాజు ఐ. ఎ. ఎస్. (దేవాదాయ-ధర్మాదాయశాఖ కమీషనర్), శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాద్ ఐ. ఎ. ఎస్. (కార్యనిర్వహణాధికారి), శ్రీమతి కె. ప్రభావతమ్మ ఎమ్. ఎల్. ఎ., శ్రీ ఆర్. సాంబశివరావు.

మూడవవరుస యెడమనుండి కుడికి : శ్రీ ఎన్. సూర్యప్రకాశరావు బి.ఎ. ఎమ్.ఎల్.ఎ., శ్రీ హెచ్. ఆర్. బసవరాజు.



దివ్యో గన్ధర్వో భువనస్య యస్పతిరేక

ఏవ నమస్యో విక్ష్వీడ్యః ।

తం త్వా యామి బ్రహ్మణా దివ్య దేవ

నమస్తే అస్తు దివి తే సధస్థమ్ ॥

-అథర్వవేదము

ఈ విశ్వసర్వస్వ మేలు నా పరమాత్మ
ప్రణతులకు నర్హుఁడౌ, బ్రణుతులకు నర్హుఁడగు
వేదమంత్రజ్ఞాన విషయాలతో నతని
బొంది మోక్షానంద మందండి! పొందుగా ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా - ప్రపూర్ణ"





ఓమ్

# సమూల
# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత
## ప్రథమ సంపుటము
## 1, 2, మండలములు





ఆంధ్రానువాదకర్త

కావ్యతీర్థ

## నేమాని వేంకట నరసింహ శాస్త్రి

సంకలనకర్త - పరిష్కర్త

పూరణకర్త

బ్రహ్మర్షి

వాఙ్మయ మహాధ్యక్షి

## డాక్టర్ వడ్లమూడి గోపాల కృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"






# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

అంకితము

## ఆంధ్రులకు

కావ్యతీర్థ

నేమాని వేంకటనరసింహశాస్త్రి

బ్రహ్మర్షి

వాఙ్మయమహాధ్యక్ష

డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య

"కళా-ప్రపూర్ణ"

1

సీ॥ ఐతరేయ బ్రాహ్మణాది వర్ణిత వైభవోపేత దేశమై యుండె నెద్ది ?
రాజనరేంద్ర సంపూజిత పద నన్నయకవి భూషిత మౌచు నమరె నెద్ది ?
కృష్ణరాయనిపేరఁ గృతులు రచించిన కవ్యష్టకముతోడఁ గ్రాలె నెద్ది ?
కావ్య నిర్మాణ సంకల్పనచణులైన కవివతంసుల నెల్లఁగలిఁగె నెద్ది ?
తే॥గీ॥ యఖిల జనులకుఁ గ్రొత్తదైనట్టి శక్తిఁ, బుట్టఁజేసిన గ్రంథముల్ పొందె నెద్ది
యట్టి మాయాంధ్ర దేశమునందుఁ గలుఁగు, నాంధ్రులకు దీని నర్పింతు నంకితముగ ॥

2

సీ॥ రాజరాజ నరేంద్ర తేజః ప్రసక్తిచే నన్నయ ఫణతులు మున్నె వెలిఁగె
శ్రీరామ మహిమంబుచేతఁ బోతనమంత్రి భాగవతం బిలఁ బాడుకొనియెఁ
గృష్ణరాయనివల్లఁ గీర్తిఁగాంచిన పెద్దనాదుల కృతులెల్ల నతిశయించెఁ
గడు రెడ్ల సంపద కలిమిచేఁ దెన్గున శ్రీనాథ కావ్యంబు శ్రీలుగాంచె
తే॥గీ॥ నట్టి మాయాంధ్ర దేశంబునందుఁ గల్గు, నూతన సుశక్తి పుత్రుఁడు పూతమతిని
నన్నుఁ దనియింపఁజేయుచున్నాఁడు తెనుఁగు, వేదమును నాదరింపఁడే ! వేయిపాళ్లు ॥



కావ్యతీర్థ

నేమాని వేంకటనరసింహశాస్త్రి



ఆ॥వె॥ దేవ వేద వేద దేవైక్యమై వెల్గు, వేద మనువదింప వాద మగునె ?
శబ్ద మనువదించు శబ్ద శక్తుల నెవ్వఁ, డనువదించునోయి! యమృతగతిని ॥

4

సీ॥ ప్రభవించి వేలేళ్ల విభవమ్ముతో నుండి శుక్లశక్తిని మహాశోభ నొంది
యల ప్రమ దౌత్యము లలరార సృజన శక్త్యతివిపులగతి సహస్ర వత్స
రాళు లెన్నెన్నియో యధిగమింపఁగఁ బృథ్విపైఁ బ్రజోత్పత్తి సుప్రాభవముగ
నాపైని నాంగిరుఁ డవతరించుచు నాంధ్ర జాతికి మూలమై చదలునంట
తే॥గీ॥ వేద విద్య విస్తృతి దీప్తవిమల శక్తి, దీర్ఘతముఁడాదిగ మును లుదీర్ణతగను
నాంధ్రులకును మత్కృత సుకృతాంధ్రదేవ, పద్యపారిజాతాల నర్పణమొనర్తు ॥

బ్రహ్మర్షి
వాఙ్మయ మహాధ్యక్ష
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"



ఓమ్

సమర్పణ

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## ప్రథమం మండలమ్

ప్రథమోऽష్టకః—ప్రథమోऽధ్యాయః

అనువాకః—1, సూక్తమ్—1

ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః*

దేవతా—అగ్నిః

ఛన్దః—గాయత్రీ

ఓమ్

(1) అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్। హోతారం రత్నధాతమమ్ ॥ 1

(2) అగ్నిః పూర్వేభిరృషిభిరీడ్యో నూతనైరుత। స దేవాగ్ం ఏహ వక్షతి ॥ 2

(3) అగ్నినా రయిమశ్నవత్ పోషమేవ దివేదివే। యశసం వీరవత్తమమ్ ॥ 3

(4) అగ్నే యం యజ్ఞమధ్వరం విశ్వతః పరిభూరసి। స ఇద్ దేవేషు గచ్ఛతి ॥ 4

(5) అగ్నిర్హోతా కవిక్రతుః సత్యశ్చిత్రశ్రవస్తమః। దేవో దేవేభిరా గమత్ ॥ 5

(6) యదఙ్గ దాశుషే త్వమగ్నే భద్రం కరిష్యసి। తవేత్ తత్ సత్యమఙ్గిరః ॥ 6

(7) ఉప త్వాగ్నే దివేదివే దోషావస్తర్ధియా వయమ్। నమో భరన్త ఏమసి ॥ 7

(8) రాజన్తమధ్వరాణాం గోపామృతస్య దీదివిమ్। వర్ధమానం స్వే దమే ॥ 8

(9) స నః పితేవ సూనవేऽగ్నే సూపాయనో భవ। సచస్వా నః స్వస్తయే ॥ 9

* ఋషిరాద్యో మధుచ్ఛందః। స విశ్వామిత్ర పుత్రః (పా)

గణేశాయ నమః

శ్లో॥ యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽఖిలం జగత్
నిర్మమే తమహం వన్దే విద్యాతీర్థ మహేశ్వరమ్ ॥

ఓమ్

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

ప్రథమాష్టకము—ప్రథమాధ్యాయము

* అనువాకము—1—సూక్తము—1

† ఋషి—విశ్వామిత్ర పుత్రుఁడగు మధుచ్ఛందసుఁడు[1]

దేవత—అగ్ని

(1) శ్లో॥ అగ్నిమీళే మహాదేవ మృత్విజం హోతృనామకమ్ ।
ఇష్టేః పురోహితం యాగ ఫలరత్నాదిధారిణమ్ ॥ 1

(2) గీ॥ పూర్వ నూతన మునులచేఁ బొగడఁదగిన, యగ్నిహోత్రుఁడు ప్రీతితో యజ్ఞమునకు
దేవతలఁ[2] బిలిచికొని వచ్చి దివిరి వారి, కమిత హవ్యము నొసఁగుచు నమరుఁగాక ! ॥ 2

* శ్రీమదాంధ్రఋగ్వేదసంహితాకర్త్రియగు శ్రీ నేమానివారు తమ యనువాద గ్రంథములలో ననువాకములను సరిగా వ్రాయలేదు. కొన్నిచోట్ల వ్రాసిరి. కొన్నియెడలఁ బొరపాటుగా సంఖ్య లిచ్చిరి. పెక్కుచోట్ల నస లనువాకములను వ్రాయనేలేదు. కాని సంస్కృతమూలము ననుసరించి యనువాకములసంఖ్యల నీ తెలుఁగు గ్రంథమున పైతము వ్రాయుట జరిగినది. వ.గో.కృ.

† అవిదిత్వా ఋషిం ఛందో దైవతం యోగమేవ చ। యే ధ్యాపయేజ్జపేద్వాపి పాపీయాన్ జాయతే తు సః ॥

అర్థము-దేవత ఋషిఛందస్సుల వినియోగమును చెలిసికొనక యేమంత్రమునైనను బఠించువాఁడును, జపముచేయువాఁడును బాపియగును. మరియు నార్షేయ బ్రాహ్మణ (ఆరేయ-1) మనుస్మృతియందును మంత్రముల కన్నిటికి ఋషిమొదలగునవి కలవు. వాని నన్నిటిని చెలిసికొనవలయును. కావున నేయుద్గ్రంథమునైనను ఋషి మొదలగునవి చెలిసికొని పఠింపవలయును. నే.వేం.న.శా.

దేవత-ఋషి-ఛ్ఛందస్సులగురించిన ప్రామాణికముగఁ బరమవైజ్ఞానికముగ నార్షవిజ్ఞానమున కనుగుణముగా వ్రాసిన యీ పుట్‌నోటు వాక్యములు శ్రీనేమానివారు తొట్టతొలిసంపుటములోఁ బ్రథమమండల ప్రప్రథమసూక్తములోఁగల దేవతాదులవద్దనే వ్రాసి యున్నచో నెంతయో సముచితముగా నుండెడిది. కాని శ్రీనేమానివారు స్వయముగా శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత 7వ మండలములోని (పంచమాష్టకము) పంచమాధ్యాయము ప్రారంభమైన (8వ సంపుటము 164వ పుటలో) 60వ సూక్తములోని దేవతవద్ద పుట్‌నోట్ గుర్తుపెట్టి పూర్వపుఁబుటలో (ఎడమ ప్రక్కన) నీపుట్‌నోటు వ్రాసి పొట్టి సంతకము పెట్టిరి. వ.గో.కృ

1. శ్రీనేమానివారు వివిధ సూక్తములఋషిగా (ప్రథమ-దశమ మండలములు) "మధుచ్ఛందసుఁడు" రూపమేకాక "మధుచ్ఛందుఁడు" రూపముతప్ప "మధుచ్ఛంధసుఁడు, మధుచ్ఛంధసుఁడు, మధుచ్ఛందసుఁడు" రూపములు కూడ వ్రాయుట జరిగినది. (చూ. పీఠిక) వ గో.కృ.

2. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.

(3) క॥ నుతియింపఁబడిన యనలుఁడు, ప్రతిదిన మభివృద్ధిఁజెందుఁ ప్రబల యశస్సున్
సుతులన్ భృత్యుల నొసఁగెడు, నతులిత ధనరాశి నిచ్చు యజమానునకున్ ॥ 3

(4) గీ॥ నాల్గు దిక్కులయందును నాల్గురూప, ములనుగొని యగ్నిహోత్రుఁడు వెలుఁగుచుండ
†యజ్ఞవిఘ్నము లన్నియు నంతరించు, యజ్ఞమే తృప్తిఁగలిఁగించు నమరతతికి ॥ 4

(5) క॥ కవి, హోత, సత్యవంతుఁడు, వివిధ యశస్సంపదాళి వెలసెడు వాఁడున్
నవదీప్తి వెలుఁగు ననలుం; డవితథముగ వచ్చుఁగాక యాగంబునకున్ ॥ 5

(6) గీ॥ అగ్నిహోత్రుఁడ: నీకయి యధికహోమ, ములనుజేసెడు వారలు ముదముతోడ
నిచ్చుద్రవ్యము లన్నియుఁ బెచ్చుఁబెరిగి, నీకె యుపయోగపడుచుండె నిర్మలాత్మ! ॥ 6

(7) క॥ ప్రతిదినము రెండువేళల, మతిమంతుల మగుచు మేము మాన్య స్తుతులన్
నతిపూర్వకముగఁ జేయుచు, సతతము నీచెంతఁ జేరఁజాలుదు మనలా! ॥ 7

(8) గీ॥ అధ్వరంబుల రక్షించి యఖిలయాగ, కర్మఫలముల నొసఁగుచు ఘనతఁజెందు
యజ్ఞశాలాస్థలంబుల నధికవృద్ధిఁ, బొంది యనలుఁడ! మానతు లందుకొనుము ॥ 8

(9) క॥ అడుగఁ దిరుగుచునుండెడి, బిడ్డలకున్ మేలుసేయఁ బితవలె నగ్ని!
దొడ్డవగు కీడుఁ గొట్టుచు, నష్టములేకుండ శుభము లందింపవొకో! ॥ 9

## సూక్తమ్—2

### ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

### దేవతా—1-3 వాయుః, 4-6 ఇంద్ర-వాయూ, 7-9 మిత్రా-వరుణౌ

### ఛందః—గాయత్రీ

(1) వాయవా యాహి దర్శతేమే సోమా అరంకృతాః । తేషాం పాహి శ్రుధీ హవమ్ ॥ 10

(2) వాయ ఉక్థేభిర్జరన్తే త్వామచ్ఛా జరితారః । సుతసోమా అహర్విదః ॥ 11

(3) వాయో తవ[1] ప్రపృఞ్చతీ ధేనా జిగాతి దాశుషే । ఉరూచీ సోమపీతయే ॥ 12

(4) ఇన్ద్రవాయూ ఇమే సుతా ఉప ప్రయోభిరా గతమ్ । ఇన్దవో వాముశన్తి హి ॥ 13

(5) వాయవిన్ద్రశ్చ చేతథః సుతానాం వాజినీవసూ । తావా యాతముప ద్రవత్ ॥ 14

† ఆహవనీయ, మార్జాలీయ, గార్హపత్య, అగ్నిధ్రీయములను నాలుగు నామములతో నాల్గుదిక్కులయందు నగ్ని వెలుఁగుచున్నాఁడు; (నే.వేం.న.శా.) 1. ప్రపృఞ్చతీ (పా)

(6) వాయవిన్ద్రశ్చ సున్వత ఆ యాతముప నిష్కృతమ్। మక్ష్విత్థా ధియా నరా ॥ 15

(7) మిత్రం హువే పూతదక్షం వరుణం చ రిశాదసమ్। ధియం ఘృతాచీం సాధన్తా ॥ 16

(8) ఋతేన మిత్రావరుణావృతావృధావృతస్పృశా। క్రతుం బృహన్తమాశాథే ॥ 17

(9) కవీ నో మిత్రావరుణా తువిజాతా ఉరుక్షయా। దక్షం దధాతే అపసమ్ ॥ 18

## సూక్తము—2

ఋషి—మధుచ్ఛందసుఁడు

దేవత—1-3 వాయువు, 4-6 ఇంద్ర వాయువులు

7—9 మిత్రా వరుణులు †

(1) గీ॥ వాయువా! రమ్ము! వేవేగ వలసినంత, సోమముం దీసియున్నాము నీమ మలరఁ
బిలుపు నాలించి మాకెల్లఁ బెద్ద వగుచుఁ, దగిన సోమ రసంబును ద్రావిపొమ్ము! ॥ 10

(2) క॥ యజనముఁ జక్కఁగఁ దెలిసిన, యజమానుఁడు ఋత్విజులును యజ్ఞమునందున్
విజయముఁగోరుచు నిన్నే, భజియింపుచునుండిరయ్య! పవనుఁడ! రావే! ॥ 11

(3) గీ॥ సోమ రసమును వర్ణించు సూక్త వాక్కు, సోమయాజిని వెండియు సోమ రసము
గ్రోలుటకు నిన్నుఁ బిలిచెడు గుణ గరిష్ఠుఁ, జేరుచున్నది నీయాన చిత్తగింపు ॥ 12

(4) గీ॥ మీకు సోమరసం బెల్ల మించునటుల, సిద్ధముగఁ జేసియున్నాము చిత్తగింపుఁ
డా రసము మిమ్ముఁ బ్రీతితో నభిలషించుఁ, గాన వాయువ! యింద్రుఁడా! గదలిరండు! ॥ 13

(5) గీ॥ ఇంద్రుఁడా! వాయుదేవ! మీ రిద్ద రెలమి, యాగములఁ జేయువారల నాశ్రయించు
వారలును సోమ రస రుచిఁ బడసినట్టి, వారలును గాన వేగంబు చేరుఁడివట ॥ 14

† తెలుఁగు అనువాదములోఁ బొరపాటున 7-8 ఋక్కులకు ఇంద్రవాయువులు దేవతలని పేర్కొనుట జరిగినది. (వ్రాతప్రతిం I సంపుటము. 53 పుట) 9వ ఋక్కునకు దేవతను బేర్కొననేలేదు. కాఁగా మూలమునననుసరించి దేవతలుటంకింపఁబడినవి. వ.గో.కృ.

(6) గీ॥ సోమరసమును దీసెడి సోమయాజి, సోమరసమును ద్రావంగ శోభతోడ
వచ్చియుండిన మీరలు మెచ్చునట్లు, కర్మలన్నియు ముగియవె నిర్మలాత్మ! ॥ 15

(7) *గీ॥ సకల వస్తువులను జక్కఁబెట్టెడువానిఁ, బూతు వర్షదాతఁ బూజ్యు రవిని
విఘ్నకరుల నెల్ల వెన్నాడుచుం జాల, వారి నిచ్చునట్టి వరుణుఁదలఁతు ॥ 16

(8) క॥ యాగాధిపులగు మీరలు[1], యాగమునకు నరుగఁదెంచి యజ్ఞములు తగన్
సాగెడునట్టులు సేయుచు, యాగఫలము నిచ్చి చనుఁడి! యప్పతిసూర్యుల్! ॥ 17

(9) క॥ లోకోపకార దక్షులు, పాకార్యప్పతులు చాల బల సంపత్తిన్
వీఁక నభివృద్ధిఁజేయుచు, మాకుఁ సత్కర్మ నిచ్చి [2]మరలుఁడు ప్రీతిన్ ॥ 18

## సూక్తమ్—3

ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

దేవతా—1–3 అశ్వినౌ, 4–6 ఇంద్రః, 7–9 విశ్వే దేవాః, 10–12 సరస్వతీ

ఛందః—గాయత్రీ

(1) అశ్వినా యజ్వరీరిషో ద్రవత్పాణీ శుభస్పతీ । పురుభుజా చనస్యతమ్ ॥ 19

(2) అశ్వినా పురుదంససా నరా శవీరయా ధియా । ధిష్ణ్యా వనతం గిరః ॥ 20

(3) దస్రా యువాకవః సుతా నాసత్యా వృక్తబర్హిషః । ఆ యాతం రుద్రవర్తనీ ॥ 21

(4) ఇంద్రా యాహి చిత్రభానో సుతా ఇమే త్వాయవః । అణ్వీభిస్తనా పూతాసః ॥ 22

* ఛందశ్శాస్త్రమునననుసరించి గీతము తేటగీతి ఆటవెలఁది అని రెండు విధములుగాఁ బేర్కొనఁబడినది, ఈ దృష్ట్యా శ్రీ నేమానివారు మొత్తము తెలుఁగు ఋగ్వేదానువాద పద్యములలోని ఆటవెలఁదుల నన్నింటిని గీతములుగా "గీ" అని నిర్దేశించిరి, ఇది దోషము కానేరదు వ.గో,రా.

1. వైదిక ధర్మముల యొక్క యత్యంత ప్రాచీనమగు ధర్మము యజ్ఞమయముగనుండెను, అనఁగాఁ గర్మప్రధానముగ నుండెను. కాని యా ప్రాచీన ధర్మ స్వరూపము భక్తి ప్రధానమనిగాని జ్ఞానప్రధానమనిగాని యోగప్రధానమైనది అనిగాని కాదని వేదసంహిత వల్లను బ్రాహ్మణములవల్లను దేలుచున్నది. ఈ యజ్ఞయాగాది కర్మపరమగుధర్మమే గీతలందుఁజెప్పఁబడినది. ఇట్టిధర్మము జైమినీయ మీమాంసా సూత్రమున శాస్త్రము పద్ధతిగా నిర్ణయింపఁబడినది, మీమాంసయను పేరు క్రొత్తదియైనను యాగాదిధర్మాలు ప్రాచీనము లైనవియే. కాని యీ కర్మకాండము పిదప జ్ఞానకాండము బయలుదేరినవి, కావున రెండును ప్రాచీనములైనవే, అక్కాలమందే రెండు కక్షలేర్పడినవి. నే. వేం న.శా.

2. మానుగఁజనుఁడీ! (తొ.పా.)

(5) ఇంద్రా యాహి ధియేషితో విప్రజూతః సుతావతః । ఉప బ్రహ్మాణి వాఘతః ॥ 23

(6) ఇంద్రా యాహి తూతుజాన[1] ఉప బ్రహ్మాణి హరివః । సుతే దధిష్వ నశ్చనః ॥ 24

(7) ఓమాసశ్చర్షణీధృతో విశ్వే దేవాస[2] ఆ గత । దాశ్వాంసో దాశుషః [3]సుతమ్ ॥ 25

(8) విశ్వే దేవాసో[4] అప్తురః సుతమా గన్త తూర్ణయః । ఉస్రా ఇవ స్వసరాణి ॥ 26

(9) విశ్వే దేవాసో అస్రిధ ఏహిమాయాసో అద్రుహః । మేధం జుషన్త వహ్నయః ॥ 27

(10) పావకా నః సరస్వతీ వాజేభిర్వాజినీవతీ । యజ్ఞం వష్టు ధియావసుః ॥ 28

(11) చోదయిత్రీ సూనృతానాం చేతన్తీసుమతీనామ్ । యజ్ఞం దధే సరస్వతీ ॥ 29

(12) మహో అర్ణః సరస్వతీ ప్ర చేతయతి కేతునా । ధియో విశ్వా వి రాజతి ॥ 30

## సూక్తము—3

ఋషి—విశ్వామిత్ర పుత్రుఁడగు మధుచ్ఛందసుఁడు

దేవత—1-3 అశ్విదేవతలు,* 4-6 ఇంద్రుఁడు, 7-9 విశ్వే దేవతలు

10-12 సరస్వతి

(1) క॥ వరుణుఁడ! సూర్యుఁడ! మీరలు, కరములు సాపుకొని మాకుఁ గలిఁగిన హవ్యం
బరమర లేకయె కొనుచుం, బరువడిఁ గర్మతతిఁ జేయఁ బనుపుఁడు మమ్మున్ ॥ 19

(2) గీ॥ ఉరుకర్మలు గలవారలు, నరు లశ్వులు[1] బుద్ధి విభవ నందితభ కుల్
పరమకృత వేద నుతులన్, వివరముగా వెఱుఁగరండు! వేగమె మీరల్! ॥ 20

(3) క॥ వారిత కిల్బిషులగు మీ, కే రిల సమమైనవార లీ జగమందున్[2]
ఘూరు లగు శత్రు జనులం, గూరియఁబెట్టంగ మీకుఁ గార్యముకాదే ? ॥ 21

1. జానఽఉప, 2. దేవాసఽఆగత, 3. సుతమ్, 4. దేవాసోఽఅప్తురః (వ్రా ప్ర.)

* అశ్వినీదేవతలు అని ప్రయోగింపవలసియుండఁగా శ్రీ నేమానివారు "అశ్విదేవత" లనియే గ్రంథమందంతటను వాడిరి. పైఁగా బహుత్వములో "అశ్విలార!" అని ఉత్వరహితముగా సైతము ప్రయోగించిరి. ఇట్టిచోట "అశ్వులార!" అని సవరింపఁ బడినది. వ.గో.కృ.

1. "అశ్వులు!" ఇత్యాదిగాఁగల అరగాగమరహిత సంబోధనా బహువచన ప్రయోగము మధ్యమ పురుషయోగములోఁజేయఁ బడినట్లు గుర్తింపనగును. ఇటువంటి ప్రయోగము లనేకము లీగ్రంథమునఁగలవు. వ.గో.కృ.

2. "జగమందుం" అని ద్రుత పూర్ణబిందుపురూపము మూలములో వ్రాయఁబడినది.

గీ॥ వేరుతోఁగోసి భూమిపై విస్తరించి, పరుపఁబడినట్టి దర్భపైఁ బరమభక్తి
నుంపఁబడినట్టి సోమంబు నుచితరీతి, నానుటకు రండు: వేవేగ నశ్వులార: ॥ 22

(4) గీ॥ శోభ[1] నొప్పెడు పరిశుద్ధ సోమ లతలఁ, బిండితీసిన రస మెల్లఁ బెంపుతోడ
నిన్నుఁ గోరుచునుండె నో సన్నుతాంగ!, యింద్రుఁడా! రమ్ము! వేగమే యిచ్చతోడ ॥ 23

(5) క॥ మతిచేఁ బొందం దగుదువు, మతిమచ్చోదితుఁడ వగుచు మా రసమునకై
స్తుతులన్ వినుచున్ శీఘ్రం, బతులిత దయతోడ రావె! యమరాధీశా! ॥ 24

(6) క॥ హరులం గూడుచు శక్రుఁడ!, త్వరితము రావేమి? బ్రహ్మధర్మం బెఱుఁగన్[2]
మఱి మా యజ్ఞమునం గల, గురుహవ్యముఁ గైకొనంగఁ గోరితిమి నినున్ ॥ 25

(7) క॥ మనుజులను యాగకర్మలఁ, బనివడి రక్షించునట్టి[3] ఫలము నొసఁగుచున్
జను లొసఁగు సోమరసమున్, [4]గనుఁగొని గ్రోలుటయె మీ సుకార్యమునుండీ! ॥ 26

(8) క॥ దినమున సూర్యుని ఘృష్ణులు, తనరుచు నేతెంచునట్లు తద్దయు దయతో
ననుమానము విడనాడుచు, ఘనమగు సోమమును ద్రావఁ [5]గదలుఁడు మీరల్ ॥ 27

(9) క॥ విశ్వేదేవతలారా!, విశ్వమునకు మేలుసేయ వెడలెడు వారల్
నశ్వరము లేని వారలు, విశ్వ హవిస్సులను గొనఁగ వేగము రారే! ॥ 28

(10,11,12) సీ॥ పారిశుద్ధ్యంబును బరమాన్నధనముల నిచ్చు సరస్వతి! యిపుడు రావె!
యజమానులకుఁజాల నన్నాదు లందించి మఖమును నెఱవేర్ప మగువ! రావె!
మానవుల్ సత్యంబు మరువనట్టులుసేసి వెలయు సరస్వతి! వేగ రావె!
కర్మలు జనులకుఁ గలిఁగించుదానవై కర్మలఁబోషింపఁ గదలి రావె!
గీ॥ దేవతా[6] రూపమున నీవు తిరుగుచుండి, సర్వజనులకుఁ బ్రీతితోఁ జాల జలము
నిచ్చుచున్నావు సత్కర్మ లింపుగల్గి, జరుగునట్టులు సేయుచు[7]సాగి రావె! ॥ 29

## అనువాకః—2, సూక్తమ్—4

### ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

### దేవతా—ఇంద్రః

### ఛందః—గాయత్రీ

(1) సురూపకృత్నుమూతయే సుదుఘామివ గోదుహే । జుహూమసి ద్యవిద్యవి ॥ 31

(2) ఉప నః సవనా గహి సోమస్య సోమపాః పిబ । గోదా ఇద్ రేవతో మదః ॥ 32

1. శోభఁనొప్పెడు అని మూలములో భకారము తరువాత అర్ధానుస్వారముంచఁబడినది. 2. బెఱుఁగం అని యిక్కడ మకారమునకుఁ బూర్వమునఁ బూర్ణబిందువే ప్రయోగింపఁబడినది. ఇట్లేపెక్కుచోట్ల స్థిరములకుఁబూర్వము బిందువుంచఁబడెను. 3. యజ్ఞఫలదులు మీరల్ (తొ.పా.) 4. మునుగొని పానంబుసేత ముఖ్యమునుండీ! (తొ.పా.) 5. గదలుచురండీ! (తొ.పా.) 6. దేవతా రూపనదివయి (తొ.పా.) 7. జరిగిరావె! (తొ.పా.)

(3) అథా తే అన్తమానాం విద్యామ సుమతీనామ్ । మా నో అతి ఖ్య ఆ గహి ॥ 33

(4) పరేహి విగ్రమస్తృతమింద్రం పృచ్ఛా విపశ్చితమ్ । యస్తే సఖిభ్య ఆ వరమ్ ॥ 34

(5) ఉత బ్రువన్తు నో నిదో నిరన్యతశ్చిదారత । దధానా ఇంద్ర ఇద్ దువః ॥ 35

(6) ఉత నః సుభగాగ్ం అరిర్వోచేయుర్దస్మ కృష్టయః । స్యామేదింద్రస్య శర్మణి ॥ 36

(7) ఏమాశుమాశవే భర యజ్ఞశ్రియం నృమాదనమ్ । పతయన్ మందయత్సఖమ్ ॥ 37

(8) అస్య పీత్వా శతక్రతో ఘనో వృత్రాణామభవః । ప్రావో వాజేషు వాజినమ్ ॥ 38

(9) తం త్వా వాజేషు వాజినం వాజయామః శతక్రతో । ధనానామింద్ర సాతయే ॥ 39

(10) యో రాయోఽవనిర్మహాన్త్సుపారః సున్వతః సఖా । తస్మా ఇంద్రాయ గాయత ॥ 40

## అనువాకము—2 సూక్తము—4

## ఋషి—మధుచ్ఛందసుఁడు

## దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ పాలఁ బిండువాఁడు పాలఁ బిండుటకయి, యావుఁ బిలుచునట్టు లాదరమున
సకల కర్మచయము సఫలతఁ జెందింప, వేడుకొందు మేము వేడ్క నింద్ర! ॥ 30

(2) క॥ సవనమునకు రమ్మింద్రుఁడ!, యవితథముగ సోమ రసము నానుము! ప్రీతిన్
నవసోమరసముఁ ద్రాగిన, [1]వివిధానుల గోవు లెల్ల వెలయుమ మాకున్ ॥ 31

(3) గీ॥ మంచి బుద్ధులఁ బొందంగ మరఁగి మేము, నిన్ను వేడుచునున్నాము నిర్మలాత్మ!
మమ్ము మీరక యేవేళ మనసుఁ గలిఁగి, రమ్మ! మా[2]యొద్ద కో యింద్ర! రమ్మ! నీవు॥ 32

1. గవులధికము కలుగుఁగదర ఖల నాశకుఁడా! (తొ.పా.) నవగోపులు కలుగుఁగదర ఖలనాశకుఁడా: (తొ.పా.) నవ గోవులన్న పాదములోయతి భంగము. 2. మాయొద్దకో దేవరాజ! నీవు (తొ.పా.)

(4) క॥ నుడువులు తడఁబడకుండఁగఁ, గడు నింద్రస్తుతులఁ జేయఁగలవో! లేవో!
కడు బుద్ధిశాలి ధనదుని, నడుగుము యజమాన! వేగ[1] నధికప్రీతిన్ ॥ 33

(5) క॥ ఎల్లప్పుడు ఋత్విగ్గణ, మ్ముల్ల మలర నుతిని జేయ నూకొని దానిన్
బ్రల్లదమని తలఁచెడు వా, రెల్లరు గృహములను విడచి యేగుఁ డెచటికేన్ ॥ 34

(6) క॥ ధనవంతు లనుచు శత్రువు, లనవరతము మమ్ముఁ బొగడ[2]నఖిలులు మిత్రుల్
ధనవంతు లనుచు మమ్ముల, ననవలవదె? మేము నీకు నన్యులమె? హరీ! ॥ 35

(7) క॥ సవన త్రయములయందుం, దివిజేంద్రుఁడు పొందునదియుఁ దీరుగ నానా
సవనైశ్వర్య ప్రదమౌ, నవ సోమ రసంబు నిమ్ము నాకస్థునకున్ ॥ 36

(8) గీ॥ లీలతో[3] సోమరసమును గ్రోలి వృత్ర, ముఖ్య రాక్షసులన్ నీవు మొత్తి వారి
భండనములందు యోధులౌ భక్తవరులఁ, [4]గాచితివి నీవు శక్రుఁడా! కరుణఁబూని ॥ 37

(9) గీ॥ పెక్కు యజ్ఞము లొనరించి పేరు నొంది, నట్టి యమరాధివీరుఁడా! యమిత ధనము
గోరి హవ్యము లన్నియుఁ గూర్చి నీకు, నందఁజేయుచునున్నార మందుకొనుము! ॥ 38

(10) గీ॥ యజ్ఞకర్తకు నెచ్చెలియైన వాని, యజ్ఞసూచకు నింద్రుని నార్యులార!
మనల రక్షించుపనికయి మరువకుండ, మతులతో వేడుకొనరారె? యతుల భక్తి ॥ 39

## సూక్తమ్—5

ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

దేవతా—ఇంద్రః

ఛందః—గాయత్రీ

(1) ఆ త్వేతా ని షీదతేంద్రమభి ప్ర గాయత । సఖాయః స్తోమవాహసః ॥ 41

(2) పురూతమం పురూణామీశానం వార్యాణామ్ । ఇంద్రం సోమే సచా సుతే ॥ 42

(3) స ఘా నో యోగ ఆ భువత్ స రాయే స పురంధ్యామ్ । గమద్వాజేభిరా స నః ॥ 43

(4) యస్య సంస్థే న వృణ్వతే హరీ సమత్సు శత్రవః । తస్మా ఇంద్రాయ గాయత ॥ 44

(5) సుతపావ్నే[1] సుతా ఇమే శుచయో యన్తి వీతయే । సోమాసో దధ్యాశిరః ॥ 45

1. వేగనుచితమతితోన్ (తొ.పా. యతిభంగము) 2. నఖిల సుమిత్రుల్ (తొ.పా.) 3. బాగుగా సోమరసమునుద్రాగి (తొ.పా.)
4. గాచితివి శక్రదేవుఁడా (తొ పా.) 1. పాత్నే (వ్రా.ప్ర)

(6) త్వం సుతస్య పీతయే సద్యో వృద్ధో అజాయథాః । ఇంద్ర జ్యైష్ఠ్యాయ సుక్రతో ॥ 46

(7) ఆ త్వా విశంత్వాశవః సోమాస ఇంద్ర గిర్వణః । శం తే సంతు ప్రచేతసే ॥ 47

(8) త్వాం స్తోమా అవీవృధన్ త్వాముక్థా శతక్రతో । త్వాం వర్ధంతు నో గిరః ॥ 48

(9) అక్షితోతిః సనేదిమం వాజమింద్రః సహస్రిణమ్ । యస్మిన్ విశ్వాని పౌంస్యా ॥ 49

(10) మా నో మర్తా అభి ద్రుహన్ తనూనామింద్ర గిర్వణః । ఈశానో యవయా వధమ్ ॥ 50

## సూక్తము—5

### ఋషి—మధుచ్ఛందసుఁడు

### దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ మంత్ర పాఠకులార! యోమాన్యులార!, శీఘ్రముగ మీరు దర్భలఁజేరవచ్చి
యందుఁగూర్చుండి సోమము నానునపుడె, చక్కఁగ నుతింపుఁ డింద్రుని శక్తి మీర ॥ 40

(2) క॥ మీరందఱు రసపానముఁ, బ్రారంభింపఁగనె శత్రుబాధకు నింద్రున్
మీరిన శక్తింగొలువుం, డేరీ మీసాటి వార లిలలోఁ [1]జెపుఁడీ! ॥ 41

(3) గీ॥ పూర్వమందులేని పురుషార్థములు మమ్ముఁ, జెందునట్లు వజ్రి చేయుఁగాక!
ధనము మరియు యోగ్యదారలఁ గల్గించి, యీయఁదగిన దాని నిచ్చుఁగాక! ॥ 42

(4) గీ॥ ఎవని యరదము గుఱ్ఱము లెదుటఁబడఁగ, వెఱచి పరుగిడుచుందురో వివిధ వైరు
లట్టి యింద్ర[2]మహాత్ముని నమితభక్తి, పూర్వకంబుగ వేడుఁడు పూజ్యులార! ॥ 43

(5) క॥ అమరేంద్రునికొఱకై కడు విమలంబగు సోమరసము [3]విస్తరముగ స
త్క్రమ పద్ధతిఁదీయుచు నిపు, డమరిచియున్నార మిచట నందుఁడు! దానిన్ ॥ 44

1. వారలిలలోఁగలరే (తొ.పా.) 2. లట్టిదేవాధిరాజును నమితభక్తి (తొ.పా) 3. విస్తారముగాఁ గ్రమపద్ధతి (తొ.పా.) ఇక్కడ మూలవ్రాతప్రతిలో "పద్ధతి" అని ప్రయోగితమైనది. "ఝయోహోఽన్యతరస్యామ్" అను పాణిని సూత్రమువల్ల మహాప్రాణము వైకల్పికముగా వక్కాణింపఁబడినది. జగద్ధితము-జగద్ధితమువలె పద్ధతి-పద్ధతి ద్విరూపములుండును. కాని తెలుఁగు ప్రయోగములలోను వ్యవహారములోను మహాప్రాణాదేశరూపము మాత్రమే యేకైకముగా (నిత్యమన్నట్లు) నుపయోగింపఁబడుచున్నది. ఛందశ్శాస్త్రములలో యతివిషయములో వైకల్పికయతులలో నీ మహాప్రాణవైకల్పికాదేశ విషయము దృష్టిలోఁబెట్టుకొని ఉభయ యతిని నామోదించుట జరిగినది. కాని శ్రీ నేమానివారు ప్రత్యేకించి వైకల్పిక రూపమగు "పద్ధతి" రూపమును యతిస్థానము కాకపోయినను బ్రయోగించుట మనము ప్రత్యేకముగా గుర్తింపవలసియున్నది. వ.గో.కృ.

(6) క॥ కామముఁదీరఁగ సోమము, [1]నీమముతోఁ ద్రావ నీవు నఖిలామర సు
స్తోమమునఁ బెద్ద యగుట క, నీమోత్సాహంబు గల్గి చెలఁగితివి హరీ! ॥ 45

(7) క॥ ఎప్పుడు త్రాగెదవో యని, మెప్పు గనిన సోమరసము మేల్కొనియుండెన్
దప్పక యీ సోమంబే, యొప్పుగ సుఖ మిచ్చు నీకు నుచితజ్ఞానీ! ॥ 46

(8) గీ॥ సామ ఋగ్వేద మంత్రముల్ చాలినంతఁ, దుష్టిఁగలిఁగించి యుండెను దొల్లి నీకు
నట్టులనె మేము సేసెడు నఖిలనుతులు, సంతసంబును గలిఁగింపఁజాలుఁగాక! ॥ 47

(9,10) గీ॥ అఖిలశక్తులతోఁగూడి యమరియున్న, నన్నమును నందుకొనుఁగాక నమరవిభుఁడు
కంటకముఁబోలు శాత్రవగణమువలనఁ, జావు లేకుండ మముఁజేయు శక్రదేవ! ॥ 48

## సూక్తమ్—6

ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

దేవతా—1-3 ఇంద్రః, 4,6,8,9, మరుతః, 5,7 మరుతః ఇంద్రశ్చ, 10 ఇంద్రః

ఛందః—గాయత్రీ

(1) యుంజంతి బ్రధ్నమరుషం చరంతం పరి తస్థుషః। రోచంతే రోచనా దివి ॥ 51

(2) యుంజంత్యస్య కామ్యా హరీ విపక్షసా రథే। శోణా ధృష్ణూ నృవాహసా ॥ 52

(3) కేతుం కృణ్వన్నకేతవే పేశో మర్యా అపేశసే। సముషద్భిరజాయథాః ॥ 53

(4) ఆదహ స్వధామను పునర్గర్భత్వమేరిరే। దధానా నామ యజ్ఞియమ్ ॥ 54

(5) వీళు చిదారుజత్నుభిర్గుహా చిదింద్ర వహ్నిభిః। అవింద ఉస్రియా అను ॥ 55

(6) దేవయంతో యథా మతిమచ్ఛా విదద్వసుం గిరః। మహామనూషత శ్రుతమ్ ॥ 56

(7) ఇంద్రేణ సం హి దృక్షసే సంజగ్మానో [1]అబిభ్యుషా। మందూ సమానవర్చసా ॥ 57

(8) అనవద్యైరభిద్యుభిర్మఖః సహస్వదర్చతి। గణైరింద్రస్య కామ్యైః ॥ 58

1. నీమముఁతోఁద్రావుటకయి నిర్జరవీరా! (తొ.పా.) 1. అబిభ్యుషా (బ్రా ప్ర.) అభిభ్యుషా (సా ) అవిభ్యుషా (మా.)

(9) అతః పరిజ్మన్నా గహి దివో వా రోచనాదధి। [1]సమస్మిన్నృంజతే గిరః ॥ 59

(10) ఇతో వా సాతిమీమహే దివో వా పార్థివాదధి। ఇంద్రం [2]మహో వా రజసః ॥ 60

## సూక్తము—6

### ఋషి—మధుచ్ఛందసుఁడు*

దేవత—1-3 ఇంద్రుఁడు, 4,6,8,9, మరుత్తులు, 5-7 మరుత్తులు, ఇంద్రుఁడు, 10 ఇంద్రుఁడు

(1) †క॥ అనిలాగ్ని రూపములతో, ననుపమగతి వెలుఁగు నింద్రు నందఱుఁ బ్రీతిన్
ఘనమగు యజ్ఞంబులలో, ననయ ముపాసించుచుందు రతఁ డంతటఁగా ॥ 49

(2) గీ॥ అందఱుం గోరఁదగినట్టి యరుణకాంతిఁ, గల్గినట్టియు సారథిఁగల్గినట్టి
యఖిల జవసత్వయుక్త హయద్వయంబుఁ, గట్టుచున్నారు బండికిఁ గదలకుండ ॥ 50

(3) గీ॥ భానురూపుఁడవగునింద్ర! భానువితతి, జ్ఞాన మర్పించుచున్నది జనులకెల్ల
గోచరముగాని వస్తువుల్ గోచరించు, నట్లు చేయుచునున్నది యతిశయముగ ॥ 51

లేక

గీ॥ భానురూపేంద్రుఁ డుదయింపఁ బ్రాణులన్ని, చేతనముఁ బొందుచున్నవి చింత వీడి
కంటఁబడనట్టివస్తువుల్ గానఁబడుచు, వెలుఁగుచున్నవి మిగుల నుర్వీతలాన ॥ 52

(4) సీ॥ వర్షంబు కురిసిన వలసిన పంటలు [1]మెండుగ జగతిని బండుచుండుఁ
బంటలు పండిన భాగ్యంబు లబ్బును దానిచే నన్నంబు తఱుగకుండు
నన్నసమృద్ధిచే యజ్ఞముల్ నెఱవేరు యాగంబులంజాల నన్నమగును
గాన మరుత్తులు [2]ఘనమగుప్రీతిని, బ్రతివత్సరంబునఁ బ్రకృతియందు
గీ॥ వర్షకాలము గతియింప వారికొఱకు, నన్నమునకును గొప్పదౌ జన్నమునకు
మేఘమండలమును నెల్ల మేలుఁగొలిపి, వారిఁ గురిపించుచుండుఁ దా వలసినట్లు ॥ 53

1. సమస్మింజతే (వ్రా.ప్ర.) 2. మవేచాకాదజసః (వ్రా.ప్ర.)

† శ్రీనేమానివారు ప్రథమమండలములోని 6వ సూక్తములోని తొలిఋక్కును దోషయుక్తముగఁ బునరుక్తార్థ వాచక పదములతోఁ గందపద్యముగా రచించిరి. (చూడు. 1వ సంపుటము. 63వ పుట. 49 పద్యము.) తొలుత "అనలాగ్ని వాయురూపము" అని వ్రాసి అనల-అగ్ని శబ్దము లేకార్థకములగుట గమనించి "అనిలాగ్ని వాయురూపము" అని రచయితయే సవరించెను. "అనిల-వాయు" పదములు పర్యాయపదములన్న సంగతి గుర్తింపక యీ పొరపాటుచేసిరి. మీఁదుమిక్కిలి రెండవపాదమున- "లను వెలిగెఁ....నింద్రదేవు నందఱుఁ బ్రీతిన్" అని ల-నలకుయుతిని బ్రయోగించుటతో యతి భంగమేర్పడినది. నాల్గవపాదములో "ఉపాసించుచుఁదు రంతట నతఁడే" యనుమాటలు ససందర్భముగను నన్వితములుగను నుపయోగింపఁబడినవి. వ.గో.కృ.

1. పండుగ జగతిని మెండుగాను (తొ.పా.) 2. కాదనకెప్పుడు (తొ.పా.)

(5) గీ॥ దుర్గమ స్థానములకయి నిర్గమించి, వితతబలయుక్తమైన మారుతముతోడఁ
గూడి గుహయందు నున్నట్టి గోగణంబుఁ, [1]బొందియుంటివి నీ వింద్ర! పొలుపుమిగుల॥ 54

(6) క॥ అతిమహిమఁ దెలుపు విత్తము, శ్రుతముంగల మారుతమును సూనృతులారా!
మతిమంతు నింద్రునింబలె, నతిభక్తిని వేడుకొనరె! యత్యాతురులై ॥ 55

(7) గీ॥ తుల్యకాంతులు నిత్య సంతుష్టమతులు, మీరలున్ శక్రదేవుఁడు [2]మారుతములు!
నిర్భయుండగు నింద్రుని నేస్తమూని, వచ్చియుండినఁ [3]జూఁడమె? మెచ్చునట్లు ॥ 56

(8) గీ॥ నిష్కళంకులు దాతలు నిత్యశుభద, మారుతములార! మిమ్ముల మరువఁగలమె?
మేముసేసెడు యజ్ఞంబు [4]మిమ్ము నింద్రుఁ, దృప్తిఁబరచునుగాకఁ దా వ్యాప్తిఁగాంచి ॥ 57

(9) క॥ ఆకాశంబున నమరుల, లోకంబున మరి[5]యు సూర్యలోకమునను నే
లోకంబున నున్న నుతుల్, [6]భీకరముగ నాలకింపఁ బెద్దలుకారే! ॥ 58

(10) క॥ దివినుండిన భువినుండినఁ, జివరకు నెచ్చోటనున్నఁ జేతను[7]ధనమున్
జవమునఁ గొనితెచ్చినచో, వివిధనుతులఁ జేయఁగలము [8]వేల్పులు! మీకున్ ॥ 59

## సూక్తమ్—7

### ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః
### దేవతా—ఇంద్రః, ఛందః—గాయత్రీ

(1) ఇంద్రమిద్గాథినో బృహదింద్రమర్కేభిరర్కిణః । ఇంద్రం[1] వాణీరనూషత ॥ 61

(2) ఇంద్ర[2]ఇద్ధర్యోః సచా [3]సంమిశ్ల ఆ వచోయుజా । ఇంద్రో వజ్రీ హిరణ్యయః ॥ 62

(3) ఇంద్రో దీర్ఘాయ చక్షస ఆ సూర్యం రోహయద్ దివి । వి గోభిరద్రిమైరయత్ ॥ 63

(4) ఇంద్ర[4] వాజేషు నోఽవ సహస్రప్రధనేషు చ । ఉగ్ర[5] ఉగ్రాభిరూతిభిః ॥ 64

(5) ఇంద్రం వయం మహాధన ఇంద్రమర్భే హవామహే । యుజంవృత్రేషు[6] వజ్రిణమ్ ॥ 65

---

1. బొందితివి నీవు శక్రుఁడా! (తొ.పా.) 2. మారుతంబ! (తొ.పా.) ఈ సంబోధనార్థకమైన తొలిపాఠము సరియగుపాఠము. రచయిత స్వయముగ "మారుతములు" అని సవరించి ప్రశ్నార్థకముంచెను. మారుతములారా? అనునర్థములో మారుతములు! (లూ! అని వ్యవహారములో నుపయోగించునట్లు) అని ప్రయోగించవచ్చునా లేదా యను సందేహము వచ్చి ప్రశ్నార్థకముంచి యుండవచ్చును, (వ.గో.కృ.) 3. చూఁడమె (మూ.పా.) 4. మీకునింద్రు, నకను దృప్తిని గలిగించు నవవిధముగ (తొ.పా.) 5. వ్రాతప్రతిలో నిటువంటి చోట్ల రేఫశకట రేఫములకు భిన్నత్వము పాటింపఁబడలేదు. 6. ప్రాకటముగ నాలకింపఁప్రాజ్ఞులు కాదే (తొ.పా.) 7. జేతంధనముం (తొ.పా.) 8. వేయివిధములన్ (తొ.పా.) సవరించిన "వేల్పులు! మీకున్" అన్న పాఠములో వేల్పులు! అవి సంబోధనార్థకముగానే వేల్పులార! అనుటకు మారు ప్రయోగింపఁబడినది. వ.గో.కృ.

1. ఇంద్ర, 2. ఇంద్రఽ, 3. సంమిశ్లీఽ, 4. వాజే నో వన, 5. ఉగ్రఽ, 6. దజ్రిణమ్, (వా.ప్ర)

(6) స నో వృషన్నముం చరుం సత్రాదావన్నపా వృధి । అస్మభ్యమప్రతిష్కుతః ॥ 66

(7) తుంజేతుంజే య ఉత్తరే స్తోమా ఇంద్రస్య వజ్రిణః । న వింధే[1] అస్య సుష్టుతిమ్ ॥ 67

(8) వృషా యూథేవ వంసగః కృష్టీరియర్త్యోజసా । ఈశానో[2] అప్రతిష్కుతః ॥ 68

(9) [3]య ఏకశ్చర్షణీనాం వసూనామిరజ్యతి । ఇంద్రః పంచ క్షితీనామ్ ॥ 69

(10) [4]ఇంద్రం వో విశ్వతస్పరి హవామహే జనేభ్యః । అస్మాకమస్తు కేవలః ॥ 70

సూక్తము—7

ఋషి—మధుచ్ఛందసుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ సరసు లుద్గాత లందఱు సామములను, హోతృగణ మెల్ల ఋక్కుల నుచితరీతి
సద్యజుస్సున నధ్వర్యు సంచయంబు, స్తోత్రములఁ జేసియుండిరి శుభకరేంద్ర ॥ 60

(2) క॥ ఘనమగు వజ్రంబుంగొని, తనువున నగలెల్లఁబెట్టి తాఁజెప్పఁగనే
వినునట్టి హరులు గల్గిన, ఘనవాహను, డెల్లయెడలఁ గనఁబడుచుండున్ ॥ 61

(3,4,5,6) సీ॥ జనులెల్ల నేవేళఁగనులఁ జూఁచెడునట్లు, [1]హరి దివి సూర్యుని నమరఁజేయు
[2]వైరి విచ్ఛేదియౌ వజ్రి జయంబులఁ గదనంబులందెల్లఁగలుఁగఁజేయు
నెక్కువగానైనఁ దక్కువఁగానైన [3]విత్తము ధరణిపై వెలయఁజేయు
ద్రవ్యంబు లేకుండఁ దద్దయు జేసెడు పరమ శత్రువులను బారఁ[4]జేయుఁ
గీ॥ గాంక్షితార్థంబు లిచ్చెడు [5]ఘనయశుండు, వర్షమంతటఁబడఁజేసి వారివలనఁ
బంటలన్నియుఁ జక్కఁగాఁబండఁజేయు, [6]నంతటన్ నాస్తిపదమును నరుగఁజేయు ॥ 62

(7) క॥ ఫలదముల[7] దేవతాంతర, ములఁ గొనియాడంగఁదగిన ముఖ్య స్తవముల్
లలి నింద్రుని బొగడుటకై, నలవియె యేవేళనైన నవి య వ్యర్థములే! ॥ 63

(8) క॥ సుందరవృషభం బావుల, నందముగాఁ బొందునటుల నందఱికి ధనం
బందించెడు ప్రభువర్యుఁడు, చిందులఁ ద్రొక్కుచును మమ్ముఁ[8]జేరుతఁ బ్రీతిన్ ॥ 64

1. విందేs 2. ఈశానోsఅప్ర 3 యఽఏక 4. ఇంద్రవో (ప్రా.ప్ర.)

1. రవినుంచె వింద్రుఁడు దివిని వెలుఁగ 2. వైరివిచ్ఛేదకః వజ్రధరా! నీవు జయమును గలిఁగించు జన్యములను 3. ధనమును గలిఁగించు ధరణిపైని 4. ద్రోలు 5. ఘనయశుండః 6. మనకునాస్తిపదంబును నమరవిభుఁడః (తొ పా) 7. ఫలదులగు (తొ పా.) 8 జేరుఁగావుతన్ (తొ.పా. గణభంగము)

(9) క॥ మనుజతతిం బోషించుచు, ధనమును నభివృద్ధిఁబరచు ధన్యుం డింద్రుం
[1]డనయముఁ [2]బంచక్షితులను, మనుచుఁ గృపాయత్తమయిన మతిని వెలుఁగుచున్ ॥ 65

(10) గీ॥ మానవులకంతె నింద్రుఁడు మాన్యుఁడగుచు, నధికదయఁగల్గియుండుట కధికతు[3]ష్టిఁ
బిలుచుచున్నాము వానిని బెంపుతోడ, మాకుఁ గేవలుఁడయి యుండుఁగాక నతఁడు ॥ 66

## అనువాకః—3, సూక్తమ్—8
ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః
దేవతా—ఇంద్రః, ఛందః—గాయత్రీ

(1) ఏంద్ర సానసిం రయిం సజిత్వానం సదాసహమ్ । వర్షిష్ఠమూతయే భర ॥ 71

(2) ని యేన ముష్టిహత్యయా ని వృత్రా రుణధామహై । త్వోతాసో న్యర్వతా ॥ 72

(3) ఇంద్ర త్వోతాస ఆ వయం వజ్రం ఘనా దదీమహి । జయేమ సం యుధి స్పృధః ॥ 73

(4) వయం శూరేభిరస్తృభిరింద్ర త్వయా యుజా వయమ్ । సాసహ్యామ పృతన్యతః ॥ 74

(5) మహాఁ[1]ఇంద్రః పరశ్చ ను మహిత్వమస్తు వజ్రిణే । ద్యౌర్న ప్రథినాశవః ॥ 75

1. డనయంబు నైదుజాతుల (తొ.పా.)

2. ఇచ్చటఁ బంచక్షితి శబ్దము కలదు. వేరు కొన్నిస్థలములఁ బంచకృష్టి శబ్దముకలదు. ఈ శబ్దమునకు సాయనాచార్యులు బ్రాహ్మణాది నాల్గుజాతులవారును నిషాదజాతివారనియు నర్థమువ్రాసిరి. కాని ఆ యర్థముకంటెఁబంచదేశవాసులు పంచవిధజనులని యర్థమే సమంజసముగాఁ దోచుచున్నది. ఈ పంచవిధజనులు నిరాడంబరులై కృషిఁజేసికొనుచు నిరాడంబరముగా జీవించుచుండిరి. అని వ్రాయుచు సి. ఆర్. దత్తుగారు తమ ఎర్లీఇండియన్ సివిలిజేషన్ అను గ్రంథమున ఇట్లు వ్రాసిరి. "ఋగ్వేదఋక్కులన్నియు పంజాబుదేశముననే వర్ణించుచున్నవి. పంజాబు దేశముతప్ప, ఇతరదేశములు ఆర్యులకుఁదెలియవట. గంగా, యమునా తీరముల వర్ణన యొక్కస్థలముననే కలదు. కొన్ని శతాబ్దముల తర్వాత నార్యులు భిన్న భిన్న రాజ్యముల సంపాదింపఁగల్గిరి. బ్రాహ్మణ ములనాఁటికి ప్రస్తుతపు ఢిల్లీకి చుట్టుగల కురుదేశము లార్యులపాలనములోనే యున్నవి. ప్రస్తుతము కనోజ్ దేశమని పిలువఁబడు పాంచాల దేశము ఆర్యులు పరిపాలించినట్లు బ్రాహ్మణములవల్లఁ దెలియుచున్నది. విదేహదేశములు (బీహార్) కాశీదేశము (బనారస్ చుట్టుకొని ఉన్నదేశములు) ఆర్యులు పాలించినట్లు బ్రాహ్మణములు ప్రమాణములు.........కాని దక్షిణహిందూదేశ ప్రసంగము మాత్రము బ్రాహ్మణములలోఁ గానరాదు. కాని ఐతరేయ బ్రాహ్మణమున ఆంధ్రుల ప్రసంగముకలదు. (అందుకుఁగారణము పండితు లూహింతురుగాక) దక్షిణ హిందూదేశము ఆనాఁడు ఘోరమృగముల కాలమగు మహారణ్యమగుటయే యిందుకుఁగారణము.

సూత్రవాఙ్మయ కాలమునకు దక్షిణ హిందూదేశమున హిందూమహారాజ్యము లేర్పడినవి. కొన్ని సూత్రములు దక్షిణదేశము నందే రచింపఁబడినవి. ఇట్లు భిన్న భిన్న కాలములయందు రచింపఁబడిన వాఙ్మయములు భిన్న భిన్న దేశములున్నట్లు చెప్పుచున్నవి."—సి.ఆర్. దత్తు (వే.వేం.న.శా.)

3. ప్రీతిఁ (తొ.పా.) 1 మహాఁఇంద్ర (వ్రా.ప్ర.పా.)

(6) సమోహే వా య[1] ఆశత నరస్తోకస్య సనితౌ । విప్రాసో వా ధియాయవః ॥ 76

(7) యః కుక్షిః సోమపాతమః సముద్ర[2] ఇవ పిన్వతే । ఉర్వీరాపో న కాకుదః ॥ 77

(8) ఏవా హ్యస్య సూనృతా విరప్శీ గోమతీ మహీ । పక్వా శాఖా న దాశుషే ॥ 78

(9) ఏవా హి తే విభూతయ[3] ఊతయ[4] ఇంద్ర మావతే । సద్యశ్చిత్ సంతి దాశుషే ॥ 79

(10) ఏవా హ్యస్య కామ్యా స్తోమ[5] ఉక్థం చ శంస్యా । ఇంద్రాయ సోమపీతయే ॥ 80

## అనువాకము—3, సూక్తము—8
## ఋషి—మధుచ్ఛందసుఁడు
## దేవత—ఇంద్రుఁడు

(1) క॥ అందఱుఁగోరం దగినది, తొందఱగా శత్రువితతిఁ దొలగించునదౌ
సుందరమగు ధనరాశిని, [1]నందించుచు మాకు నింద్రః యవనం బిడుమాః ॥ 67

(2) క॥ ధనమున్ భటులన్ హయములఁ, గొని శత్రుగణంబు మేము కూల్పఁదగుట కా
ధనభట హయముల నీయన్, వినయముతో వేడుకొనమె? [2]విశ్వప ! నిన్నున్ ॥ 68

(3) క॥ ఘనవజ్రంబుం గైకొని, యనయము శత్రువులనెల్ల నణఁచుచు ననిలో
ఘనముగ జయముం బొందుదు, మనఘా ! రక్షించి మాకు నర్థం బిడుమాః ॥ 69

(4) క॥ శూరులు నాయధధారులు, వీరులునగు భటులతోడ వెలసిన మమ్ముం
జేరిన నీ వవలీలన్, మారణముం జేయఁగలము మా శత్రువులన్ ॥ 70

(5) గీ॥ అధిక బలవంతుఁడగుఁగాక నమరవిభుఁడు, [3]పరముఁడగుఁగాక గుణములపక్కిచేత
నాకసంబెంత విరివిని[4]నమరుచుండు, నంతవిరివియగుంగాక నతనిసేన ॥ 71

(6) గీ॥ యుద్ధవిజయముఁగోరెడి యుత్తమునకు, ధారణాశక్తిఁగల్గు మేధావి కిలను
బుత్రభిక్షను గోరు సత్పురుషులకును, నిష్టముల నిచ్చుచుండు నా యింద్రుఁడెలమి ॥ 72

1. సమో హే వా యః (వ్రా.ప్ర.పా.) 2. సముద్రః (వ్రా.ప్ర.పా.) 3. విభూతయః (వ్రా ప్ర.పా.) 4. ఊతయః (వ్రా.ప్ర.పా.) 5. స్తోమః (వ్రా.ప్ర.పా.)

1. నందించుచు నెల్లవేళలందుఁ బ్రోవుమాః (తొ.పా. గణభంగము) 2. విశ్వాధ్యక్షః (తొ.పా.) 3. పరుఁడు నగుఁగాక (తొ.పా.) 4. విరివిని నందుచుండు (తొ.పా.)

(7) గీ॥ నోటియందుఁగల్గు నూటవిధంబున, నింద్రునాలుకెప్పు నె[5]ండకుండు।
శక్రునుదరమెపుడు సంద్రంబువలెఁబరి, పూర్ణమగుచు నుండుదీర్ణముగను॥ 73

(8) గీ॥ గోవుల నొసంగునదియును గొప్పదియును, నైన హరిసూనృతంబెల్ల హవ్యదునకుఁ
జెట్టువేసినవానికిఁ జెట్టుఫలము, ప్రీతిఁగలిగించునట్టులు ప్రియమొసంగు॥ 74

(9) గీ॥ ఇట్టి సు[6]విభూతులన్నియు నింద్రదేవ! హవ్యమిచ్చెడు నరు[7]లకు నధికభద్ర
దాయకములౌచు నొప్పునుదగినయ[8]ట్టి, సకలసంపదలొడఁ గూర్పుశక్ర! మా[9]కు॥ 75

(10) గీ॥ అతి[10]మధురసోమమును ద్రావహరినిగోరి, సామగాన పరంపర, సరసవేద
మం[11]త్రజాలము లంతట మాన్యపురుష, పఠనయోగ్యములయ్యెడు భక్తితోడ॥ 76

## సూక్తమ్—9

### ఋషిః—మధుచ్ఛందావైశ్వామిత్రః

### దేవతా—ఇంద్రః, ఛందః—గాయత్రీ

(1) ఇంద్రేహిమత్స్యన్ధసో విశ్వేభిః సోమపర్వభిః। మహాఁ[1]గ్ం అభిష్టిరోజసా॥ 81

(2) ఏమేనం సృజతాసుతేమంది మింద్రాయమందినే। చక్రిం విశ్వానిచక్రయే॥ 82

(3) మత్స్వాసుశిప్ర మందిభిః స్తోమే భిర్విశ్వచర్షణే। సచైషు సవనేష్వా॥ 83

(4) అసృగ్రమింద్రతేగిరః ప్రతిత్వాముదహాసత। అజోషావృషభం పతిమ్॥ 84

(5) సంచోదయ చిత్రమర్వాగ్రాధ[2] ఇంద్రవరేణ్యమ్। అసదిత్తేవిభుప్రభు॥ 85

(6) అస్మాన్త్సుతత్ర చోదయేంద్రరాయే రభస్వతః। తువిద్యుమ్న యశస్వతః॥ 86

(7) సంగోమదింద్ర వాజవదస్మే పృథుశ్రవోబృహత్। విశ్వాయుర్ధేహ్యక్షితమ్॥ 87

(8) అస్మేధేహిశ్రవో బృహద్ద్యుమ్నం సహస్రసాతమమ్। ఇంద్ర[3]తారథి నీరిషః॥ 88

5. నాలుకెప్పుడెండకుండు (వ్రా.ప్ర.పా) సముచ్చయలోపమైన నర్థమేవ్యత్యస్తమగును, వ.గో.కృ. 6. ఇట్టివివిభూతు (తొ.పా.) 7. నరునకు (తొ.పా.) 8. యట్లు (తొ.పా.) 9. శక్రదేవ: (తొ.పా.) 10. అమరపతి: సోమరసమెల్లనానుటకయి 11. మంత్రములుకొరకు... పురుష [తొ.పా.] 1. మహాఁగ్ం ऽ (వ్రా.ప్ర.పా.) 2. రాధऽ (వ్రా.ప్ర.పా.) 3. ఇంద్రవారథి (వ్రా.ప్ర.పా.)



(9) వసోరింద్రం వసుపతిం గీర్భిర్గృణంత ఋగ్మియమ్ । హోమ గంతారమూతయే ॥ 89

(10) సుతేసుతే న్యోకసేబృహద్ బృహత[4] ఏదరిః । ఇంద్రాయ శూషమర్చతి ॥ 90

## సూక్తము—9

### ఋషి—మధుచ్ఛన్దసుఁడు*

### దేవత—ఇంద్రుడు

(1) గీ॥ ఇంద్రుఁడా! వచ్చివేవేగనిష్టమైన, సోమరూపాన్నమునఁ జాలశోభనంది
జవముచే గొప్పవాఁడవై శత్రువులను, న[1]ఁడఁచెదవుగాక బాధనడఁచిపెట్టి ॥ 77

(2) క॥ సంతసముం గలిఁగించుచు, వింతపనులనెల్లఁజేయ వేట్కఁగొలుపుచుం
జింతలెడఁబాపుసోమము, సంతోషికి దేవపతికిఁ జయ్యననిడుఁడీ ! 78

(3) క॥ చక్కని నాశికవాఁడా ।, మిక్కిలి మానుతులనెల్ల మేకొనుచువెసన్
మక్కువతో సవనములకు, నెక్కువగా రాగదయ్య । యిష్ట[2]లతోడన్ ॥ 79

(4) గీ॥ ఆశ్రితార్థప్రదాతవు యజ్ఞపతివి, యమరలోకాధివాసివియైననీకు
భక్తియుక్తముగాఁజేయఁబడిననుతులు, చేరినవియప్పుడే నిన్నుఁజిత్తగింపు॥ 80

(5) క॥ స్పృహణీయంబతిచిత్రం, బిహభోగప్రాప్తికార్యహేతువునగునా
బహుళధనరాశికెల్లన్, మహిత పతివికానధనముమాకిమ్మహరీ! ॥ 81

(6) గీ॥ అధికధనవంత! శక్రుఁడా! యశముగోరి, యజ్ఞముంజేయనున్నారమతులభక్తి।
గానధనరాశులన్ మాకుఁగలుగఁజేసి, యజ్ఞకర్మలఁజేయుటకై విధింపు॥ 82

(7) క॥ పశువులకునన్నమునకున్, యశమునకుంబ్రతుకునకునునాశ్రయమగునా
విశదమగుధనముమాకున్, వశమగునటుచేయవయ్య! వాసవవిభుఁడా! ॥ 83

(8) క॥ వితతమగుకీర్తిసంపద, సతతము తఱుగంగనట్టి[3]సత్యధనంబున్
హితములగు ధాన్యరాశుల, ప్రతిదినమునొసంగుమాకుఁబర[4]మాన్నముతోన్॥ 84

(9) క॥ ధనసంరక్షకుఁడగుచున్, ఘనమగుమంత్రార్థమెల్లఁగాంచుచుఁబ్రీతిన్
ఘనవాహనుఁడగు హరిమా, ధనమునురక్షింపవేగదర్శనమిడఁడే! ॥ 85

(10) గీ॥ శాశ్వతస్థానమందుండు శక్రునికయి, సోమమాయత్తపరచుచునీమమలర
సోమరసమింద్రునకు బలశోభలిచ్చుఁ, గాకయనివేడుచున్నాఁడు ఘనపురుషుఁడు ॥ 86

4. బృహతS [వా౹.వ౹.పా.] * విశ్వామిత్రపుత్రుఁడగు మధుచ్ఛందసుఁడు (సం.మూ.) 1. నణఁచిబాధలఁదీర్చ వేయతులశక్తి. [తొ.పా.]
2. యిష్ఠ [వ్రా.వ్రా.పా.] 3. చాలినధనమున్ [తొ. పా.] 4. భక్తముతోడన్ [తొ.పా.]



## సూక్తమ్—10

### ఋషిః—మధుచ్ఛందా వైశ్వామిత్రః

### దేవతా—ఇంద్రః

### ఛందః—అనుష్టుప్

(1) గాయంతిత్వా[1]గాయత్రిణోఽర్చన్త్యర్కమర్కిణః। బ్రహ్మా[2]ణస్త్వాశతక్రత[3]ఉద్ వంశమివయేమిరే॥ 91

(2) యత్సానోః సానుమారుహ[4]ద్ భూర్యస్పష్టకర్త్వమ్। తదింద్రో[5]అర్థంచేతతియూథేనవృష్ణిరేజతి॥ 92

(3) యుక్ష్వాహికేశినాహరీ వృషణాకక్ష్యప్రా। అథాన[6]ఇంద్రసోమపాగిరాముపశ్రుతించర॥ 93

(4) ఏహిస్తోమాగ్ం[7]అభిస్వరాఽభిగృణీహ్యారువ। బ్రహ్మచనోవసోసచేంద్రయజ్ఞంచవర్ధయ॥ 94

(5) ఉక్థమింద్రాయశంస్యం వర్ధనంపురునిష్షిధే। శక్రోయథాసుతేషుణోరారణత్సఖ్యేషుచ॥ 95

(6) తమిత్ సఖిత్వఈమహేతంరాయేతంసువీర్యే। సశక్ర[8]ఉతనః శకదింద్రోవసుదయమానః॥ 96

(7) సువివృతం సునిరజమింద్రత్వాదాతమిద్యశః। గవామపవ్రజం వృధికృణుష్వరాధో[9]అద్రివః॥ 97

(8) న[10]హిత్వారోదసీ[11]ఉభే[12]ఋఘాయమాణమిన్వతః। జేషఃస్వర్వతీరపఃసంగా[13]అస్మభ్యంధూనుహి॥ 98

(9) ఆశ్రుత్కర్ణశ్రుధీహవంనూచిద్దధిష్వమేగిరః। ఇంద్రస్తోమమిమంమమకృష్వాయుజశ్చి[14]దంతరమ్॥ 99

(10) విద్మాహిత్వావృషంతమం వాజేషుహవనశ్రుతమ్। వృషంతమస్యహూమహఊతింసహస్రసాతమామ్॥ 100

(11) ఆతూన[15]ఇంద్ర[16]కౌశికమందసానః సుతంపిబ। నవ్యమాయుఃప్రసూతిరకృధీసహస్రసామృషిమ్॥ 101

(12) పరిత్వాగిర్వణోగిర ఇమాభవంతువిశ్వతః। వృద్ధాయుమను వృద్ధయోజుష్టాభవంతుజుష్టయః॥ 102

---

1. త్వా s [వ్రా.ప్ర.] 2. బ్రహ్మాణ [వ్రా.ప్ర.] 3. క్రతs [వ్రా.ప్ర.] 4. మారుకాద్భూర్య (వ్రా.ప్ర.) 5. తదింద్రోఽ (వ్రా.ప్ర.) 6. అథానs (వ్రా.ప్ర.) 7. గ్ంs (వ్రా.ప్ర.) 8. సశక్రs [వ్రా.ప్ర.] 9. రాధోs 10. నహిత్వా 11 రోదసీs 12. ఉభే 13. సంగాs అస్మభ్యం [వ్రా.ప్ర.] 14. చిరంతరమ్ [వ్రా.ప్ర.] 15. ఆతూనs. 16. కౌశిక (వ్రా.ప్ర.)

## సూక్తము 10

### ఋషి—మధుచ్ఛందసుఁడు*

### దేవత ఇంద్రుఁడు

(1) ఉ॥ గాయకులెల్ల[1] సామముల గానముఁజేయుచు నుండి రింద్రుఁడా!
[2]మాయలు లేక ఋ[3]క్తతుల మాన్యులు పూజలొనర్చు చుండి ర
త్యాయత బ్రహ్మముఖ్యులు మహానిజవంశముఁగాచునట్లు నీ
వాయుజనాది సత్క్రియ[4]ల నెంతయుఁగాచుట చెప్పకుందుమే॥ 87

(2) క॥ సమముగఁగొండలనెక్కుచు, సమిధలసోమములఁదెచ్చి సవనము సేయన్
విమనస్క పురుషులుండఁగ, సమయమెఱిఁగి వచ్చుచుండు శక్రుఁడుప్రీతిన్॥ 88

(3) గీ॥ యౌవనముచేతవెలయుచునధికమైన, దేహపుష్టినిగలిగిన దివ్యహయము
లను రథంబునకుంబూన్చి లక్ష్యముంచి, యజ్ఞవాటికి రారాదెయ[5]మర! నీవు॥ 89

(4) గీ॥ మంచి యధ్వర్యుకృతయజుర్మంత్రములను, ఋతహోతలశస్త్రసంజాతములను
జెలఁగునుద్గాతృసామముల్ చెవినిబెట్టి, యాగఫలక్తములంగూర్చుమమరవిభుఁడ! 90

(5) గీ॥ నుతులనాలకించి సుతమిత్రగణముతో, మాటలాడునట్లు మనము శక్ర
దేవుశస్త్రవితతి దివ్య తరంబుగ, వేదవలయునెపుడు వివిధగతుల॥ 91

(6) క॥ ధనమును నధికబలంబున్ । ఘనమగు మిత్రత్వకలనఁగాంచుటకై నే
ననయము హరిసేవింపనె, కను,గొన నన్యుఁడగు విభుని గలలోనైనన్॥ 92

(7) క॥ ఇక్కడనెక్కడనైనను, నెక్కడనేకొఱఁతలేక యింపగునన్నం
బెక్కువగుధనముమరియున్, మిక్కిలిగోగణము నిమ్మమేయచరిత్రా! ॥ 93

* విశ్వామిత్రపుత్రుఁడగు మధుచ్ఛందసుఁడు (సం.మూ.) †లంత (తొ.పా.)

2 ఋక్తతులు (ఋగ్వేదము) ఈ వేదప్రాచీనతఁగూర్చి పాశ్చాత్య పండితులిట్లభిప్రాయపడిరి. "ఋగ్వేదాదులతి ప్రాచీనములగు వాఙ్మయ నిదర్శనములు ............ బ్రాహ్మణులయొక్క పవిత్రములగు మంత్రములు, ప్రపంచవాఙ్మయము నందద్వితీయము విలసిల్లుచున్నవి. నేటివరకు వానిని సంరక్షించియుంచుట మహాశ్చర్యకరము'' అని ఋ. సంహిత

వేదములు విద్వాంసులందఱకుఁగొన్ని శతాబ్దములవరకుఁటని కల్పించఁగలవు. మానవజాతియొక్క గ్రంథభాండారములో నతిపురాతనములై సర్వకాలములయందు విరాజిల్లఁగలవు—ప్రొఫెసరు మాక్సుముల్లరు. (నే.వేం.న.శా.)

సూచన-వేదవాఙ్మయమునకుఁ బ్రపంచవాఙ్మయములో నద్వితీయ స్థానముకలదనుట వాస్తవమె.కానివాని రక్షణవిషయము మహాశ్చర్యకరమైనదిగా ఋగ్వేదసంహిత పేర్కొన్నట్లు వ్రాయుటసరికాదు. వేదవాఙ్మయ మనంతము. మనకుపలభ్యమానమైన వాఙ్మయముకంటె ననుపలభ్యమానమైన భాగములేయత్యధికములనుట నిర్వివాదాంశము. (వ.గో.కృ.)

3. ఋక్కులనుమానుగ (తొ. పా.) 4. సత్క్రియచయంబులుకాచుట (తొ.పా.) 5. యమరనాథ! (తొ.పా.)

(8) ఉ॥ వైరుల నష్టఁబెట్టు శుభ వాసవశక్తిని భూ నభంబు లే
తీరుననైనఁజూచుటకుఁదెన్నుఁగనుంగొనలేకయుండ ని
స్సారుల మేము[1]పావన విశాలమహత్వ మదెట్లుచూతు మా
పై రులఁ జేయువర్షమును బాలను నిచ్చెడు నాల నీయుమా॥ 94

(9) గీ॥ సర్వదిక్కులఁ జెవి గల శక్రదేవ!, వినుము! పిలుపును నుతులను వీను లలర
సఖుని పలుకులువలెఁ జాల సరసమైన, వాక్యముల నాలకించుచు వరము లిమ్ము! ॥ 95

(10) క॥ కోరినకోర్కెల నిచ్చుచుఁ, బోరున శత్రువులఁ బలముఁబోఁగొట్టి మమున్
జేరఁగ బహుధన మీయం, జీరుచునున్నాము నిన్నుఁజిత్తంబలరన్ ॥ 96

(11) ఉ॥ వేగము వచ్చి మాదెసకు వెల్గెడు సోమరసంబుఁ ద్రాగుచున్
భోగ నిమిత్త కర్మలను బొందఁగ నెక్కువు నాయువున్ మహా
త్యాగముఁజేయు విత్తమును దద్ద నొసంగుము నాకు నెప్పుడున్
సాగు నతీంద్రియత్వముల సత్యగుణా! దయసేయు మా కొగిన్ ॥ 97

(12) క॥ కర్మలలో మా చేసెడు, నిర్మల నుతులన్ని చేరి నిరతము నిన్నుం
గర్మగతమైన నాయువు, నర్మిలి మా కిత్తుగాక [2]యజ్ఞాధిపతీ! ॥ 98

## సూక్తమ్—11

ఋషిః—జేతా మాధుచ్ఛన్దసః

దేవతా—ఇంద్రః

ఛన్దః—అనుష్టుప్

(1) ఇంద్రం[1] విశ్వా అవీవృధంత్ సముద్రవ్యచసం గిరః । రథీతమం రథీనాం వాజానాం సత్పతిం పతిమ్ ॥ 103

(2) సఖ్యే త[2] ఇంద్ర వాజినో మా భేమ శవసస్పతే । త్వామభి ప్ర ణోనుమో జేతారమపరాజితమ్॥ 104

(3) పూర్వీరింద్రస్య రాతయో న వి దస్యన్త్యూతయః । యదీ వాజస్య గోమతః స్తోతృభ్యో మంహతే మఘమ్॥ 105

(4) పురాం భిందుర్యువా కవిరమితౌజా[3] అజాయత । ఇంద్రో విశ్వస్య కర్మణోధర్తా వజ్రీపురుష్టుతః ॥ 106

1. తావక (తొ.పా.) 2. యమరస్తుత్యా! (తొ.పా.)

1. ఇంద్ర విశ్వాఽఅవీ (వ్రా.ప్ర.) 2. సఖ్యే తఽ (వ్రా.ప్ర.) 3, తౌజాఽ అజాయత (వ్రా.ప్ర.)

(5) త్వం వలస్య గోమతో ऽపావరద్రివో బిలమ్ । త్వాం దేవా[1] అబిభ్యుషస్ తుజ్యమానాస[2] ఆవిషుః ॥ 107

(6) తవాహం శూర రాతిభిః ప్రత్యాయం సింధుమావదన్ । ఉపాతిష్ఠంత [3]గిర్వణో విదుష్టే తస్య కారవః ॥ 108

(7) మాయాభిరింద్ర మాయినం త్వం శుష్ణమవాతిరః । విదుష్టే తస్య మేధిరాస్ తేషాం శ్రవాంస్యుత్తిర ॥ 109

(8) ఇంద్రమీశానమోజసాభి స్తోమా[4] అనూషత । సహస్రం యస్య రాతయ[5] ఉత వా సంతి భూయసీః[6] ॥ 110

## సూక్తము—11

ఋషి—మధుచ్ఛందసుఁడనువానిపుత్త్రుఁడు జేతయనువాఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ అన్నం బిచ్చుచు జనులకుఁ, గ్రన్నన సజ్జనులనెల్లఁగాచెడు నింద్రున్
మన్ననల నందఁజేయుచు, నెన్నదె ? సంస్తోత్రసమితి యింపు దలిర్పన్ ॥ 99

(2) ఉ॥ నీదయవల్ల నన్నమును నిత్యముఁబొందితిమయ్య! యింద్రుఁడా!
కాదనకుండ శత్రువులఁగాజియఁబెట్టి సమిద్ధశక్తితో
లేదనకుండ మా కభయలీల నొసంగిన నిన్ను భక్తితో
భేదము లేని సంస్తుతుల బిట్టు నుతించుచునుందు మెంతయున్ ॥ 100

(3) ఉ॥ దేవవిభుండు [1]స్తోతలకు దివ్యధనంబు నొసంగు టబ్బమే?
కావున ఋత్విగాళికయి కాంచనముల్ మరి [2]విత్తరాసులన్
గోవుల నిచ్చువాని కొనఁగూర్చును విస్తర సర్వ[3]సంపదన్
వావిరి విత్తసంచయము వజ్రధరుండు విశేష [4]మైత్రితోన్ ॥ 101

(4,5,6) సీ॥ పట్టణంబులనెల్లఁబాడుఁజేసెడువాఁడు యౌవనవంతుఁడై యమరువాఁడు
బుద్ధిబలంబుచేఁబొగడొందఁబడువాఁడు విస్తార బలమున వెలయువాఁడు
సర్వ కర్మంబుల సాగనిచ్చెడువాఁడు ఖిదురంబుఁజేఁబట్టి వెలయువాఁడు
దివ్య గోవులనెల్లఁదెచ్చియిచ్చినవాఁడు నిఖిల[5]బాధాతతి నెట్టువాఁడు
గీ॥ ధనముఁగోరెడి పురుషులు దరికిఁజేర, నెన్నొ ధనరాశులను బ్రీతి నిచ్చువాఁడు
మెచ్చి మాయిచ్చు సోమంబు నిచ్చగించి, కాంక్షితార్థంబు నిడుఁగాకఁ గరుణఁబూని ॥ 102

1. దేవాః 2. నాసఽ (ప్రా.ప్ర.) 3. గిర్వాణో (ప్రా.ప్ర.) 4. స్తోమాఽ 5. రాతయః 6. భూయసీః (ప్రా.ప్ర.)

1. భక్తులకు (తొ.పా.) 2 ధాన్యరాసులన్ (తొ.పా.) 3. ధాన్యసంపదన్ (తొ.పా.) 4. ప్రీతితోన్ (తొ.పా.)
5. నిర్జర బాధల (తొ.పా.)

(7) గీ॥ మాయగల శుష్ణరాక్షసు మంటఁగలిపి, జగముఁ బాలించితివి నీవు [1]సరసదేవః
మహిమ నెఱిఁగి యుపాసించు మానవులకు, నన్నవస్త్రాదుల నొసంగు టబ్రమగునె॥ 103

(8) క॥ ఘనమగు నాశ్రితకోటికి, ధనదాన మొసంగునట్టి ధర్మాత్ముని ని
న్ననయముఁగర్మలయందుం, గనుఁగొని నుతియింపఁగలము కాంక్షిత ఫలదా ॥ 104

అనువాకః—4 సూక్తమ్—12

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—అగ్నిః, 6—ప్రథమపాదస్య (నిర్మథ్యా హవనీయౌ) అగ్నీ

ఛందః—గాయత్రీ

(1) అగ్నిం దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్ । అస్య యజ్ఞస్య సుక్రతుమ్ ॥ 111

(2) అగ్నిమగ్నిం హవీమభిః సదా హవంత విశ్పతిమ్ । హవ్యవాహం పురుప్రియమ్ ॥ 112

(3) అగ్నే దేవాగ్ం[1] ఇహా వహ జజ్ఞానో వృక్తబర్హిషే । అసి హోతా న[2] ఈడ్యః ॥ 113

(4) తాగ్ం[3] ఉశతో వి బోధయ యదగ్నే యాసి దూత్యమ్ । దేవైరా సత్సి బర్హిషి ॥ 114

(5) ఘృతాహవన దీదివః ప్రతి ష్మ రిషతో దహ । అగ్నే త్వం రక్షస్వినః ॥ 115

(6) అగ్నినాగ్నిః సమిధ్యతే కవిర్గృహపతిర్యువా । హవ్యవాట్[4] జుహ్వాస్యః ॥ 116

(7) కవిమగ్నిముప స్తుహి సత్యధర్మాణమధ్వరే । దేవమమీవచాతనమ్ ॥ 117

(8) యస్త్వామగ్నే హవిష్పతిర్దూతం దేవ సపర్యతి । తస్య స్మ ప్రావితా భవ ॥ 118

(9) యో[5] అగ్నిం దేవవీతయే హవిష్మాగ్ం[6] ఆవివాసతి । తస్మై పావక మృళయ ॥ 119

(10) స నః పావక దీదివోఽగ్నే దేవాగ్ం[7] ఇహా వహ । ఉప యజ్ఞం హవిశ్చ నః ॥ 120

1. శక్రిదేవః (తొ.పా.)

1. గ్ంఽఇహా. 2. నఽఈడ్యః. 3. గ్ంఽఉశతో. 4. హవ్యవాన్. 5. యోఽఅగ్నిం 6. గ్ంఽఆవివాసతి.
7. దేవాగ్ంఽఇహా (వ్రా.ప్ర.)

(11) స నః స్తవాన[1] ఆ భర గాయత్రేణ నవీయసా । రయిం వీరవతీమిషమ్ ॥ 121

(12) అగ్నే శుక్రేణ శోచిషా విశ్వాభిర్దేవహూతిభిః । ఇమం స్తోమం జుషస్వ నః ॥ 122

### †అనువాకము—4, సూక్తము—12

ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

దేవత—అగ్ని *

(1) క॥ త్రాతయయి దేవతలకున్, దాత యగుచు నున్నవాని, దోరపు ధనమున్
స్తోతల కిచ్చెడు నగ్నిం, బ్రీతిమెయిం జూఁడఁగలము పిన్నల మగుచున్ ॥ 105

(2) క॥ భజమానవహ్ని[1] ప్రీతిన్, యజమానుఁడొసంగు హవ్య మంతయుఁ గొనుచుం
బ్రజలం బరిపాలించుచు, యజమానులు తన్నుఁబిల్వ నాలింపందే! ॥ 106

(3) గీ॥ అరణియందుఁబుట్టి యంతట వెలిఁగెడు, నగ్నిదేవ! దర్భ లమరియుండె
హవ్యమందుకొనుట కమరులఁబిలువుము, హవ్యవాహనా! దయానిధాన! ॥ 107

(4) గీ॥ వహ్నీ! నీవు రాయబారివి కావునఁ, ద్రిదివమునకు నేగి దేవగణము
మేలుకొలిపి వారి మేలగు నిష్టికిఁ, బిలుచుకొనుచు రమ్ము [2]పెంపుమీర ॥ 108

(5) క॥ ఆజ్యాహుతినే ప్రీతిన్, భోజ్యముగాఁగొనెడు నగ్ని! భువనములోనం
ద్యాజ్యమగు శత్రుమండలిఁ, బూజ్యముగాఁజేసి యిష్టిఁ బోషింపఁగదే! ॥ 109

(6,7,8,9,10) సీ॥ రక్షించుచున్ సర్వరమ్య గృహంబులఁ గవిగా వెలింగెడు ఘనుఁడెవండొ!
శాశ్వత యౌవన సంపత్తి నొప్పుచు హవ్యంబు నొందెడు నధిపుఁడెవఁడొ!
హవ్యంబుఁ గొనఁజాలు నాస్యంబుఁగల్గిన యాహవనీయుఁడై యమరునెవఁడొ!
సత్యధర్ముండయి జగతివెల్గుచు సదా [3]స్తోతలనెల్లఁదాఁ జూచునెవఁడొ!
గీ॥ యట్టియగ్ని కడుంబ్రీతి హవ్యములను, నిచ్చువారికి సుఖముల నిచ్చి యాగ
ములకు దేవాళి నెల్లను బిలిచికొనుచు, వచ్చి హవ్యము వారికి నిచ్చుఁగాక! ॥ 110

1. స్తవానః ఆ (ప్రా.ప్ర.)

† వ్రాతప్రతి ప్రథమ సంపుటములో మూఁడనువాకములు వ్రాయఁబడినవి. ఆ తరువాత ననువాకములను నేసంపుటమందును శ్రీనేమానివారు వ్రాయలేదు. కావున సంస్కృత మూలము ననుసరించి యనువాకముల సంఖ్యకాడఁ బేర్కొనఁబడినది. వ.గో.కృ

* సంస్కృతమూలములో 6వ ఋక్కు ప్రథమపాదమునకు "నిర్మథ్యా హవనీయ" ములనెడి ద్వివిధాగ్నులు దేవతలుగఁ బేర్కొనఁబడినవి. వ.గో.కృ

1. భజమాన వీతిహోత్రుఁడు (తొ.పా.) 2. పిన్నవాఁడ! అని వ్రాతప్రతిలోనున్నది అగ్నిదేవుని జిన్నవాఁడు బేర్కొనుట సముచితముకాదని "పెంపుమీర"గా సవరింపఁబడినది. 3. స్తుతులనెల్లఁగాపాడునెవఁడొ (తొ.పా.)

(11) క॥ గాయత్రీ ఛందంబున, ధ్యేయుఁడవై సంతసించి తిరముగ మాకున్
సాయముగ శూరపుత్రుల. నీయుము ధనమిత్రసమితి నీయుము వహ్నీ! ॥ 111

(12) క॥ తెల్లనికాంతుల వెలుఁగుచు. నెల్లసుమంత్రములతోడ నిష్టికి సురలం
జల్లఁగఁ బిలిచెదునగ్నీ!, మెల్లఁగ మా నుతులనెల్ల మేకొనవలదే?॥ 112

## సూక్తమ్—13

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా-(ఆప్రీసూక్తం, అగ్నిరూపా దేవతాః) 1-ఇధ్మఃసమిద్ధోఽగ్నిర్వా. 2-తనూనపాత్. 3-నరాశంసః, 4-ఇళః. 5-బర్హిః, 6-దేవీర్ద్వారః, 7-ఉషాసానక్తా, 8-దైవ్యా హోతారా ప్రచేతసౌ. 9-తిస్రోదేవ్యఃసరస్వతీళాభారత్యః, 10-త్వష్టా, 11-వనస్పతిః, 12-స్వాహాకృతయః.

ఛందః—గాయత్రీ

(1) సుసమిద్ధోన ఆవహ దేవాగ్ం[1] అగ్నేహవిష్మతే। హోతః పావకయక్షిచ ॥ 123

(2) మధుమంతం తనూనపాద్ యజ్ఞందేవేషునః కవే। అద్యాకృణుహివీ[2]తయే ॥ 124

(3) నరాశం సమిహప్రియమస్మిన్ యజ్ఞ[3] ఉపహ్వయే। మధుజిహ్వంహ విష్కృతమ్ ॥ 125

(4) అగ్నేసుఖతమే రథే దేవాగ్ం[4] ఈళిత ఆవహ। అసిహోతామనుర్హితః ॥ 126

(5) స్తృణీత బర్హిరానుషగ్ ఘృతపృష్ఠం[5] మనీషిణః। యత్రామృతస్య చక్షణమ్ ॥ 127

(6) విశ్రయన్తామృతావృధో ద్వారోదేవీర సశ్చతః। అద్యానూనం చయష్టవే ॥ 128

(7) నక్తోషాసా సుపేశసా[6]స్మిన్ యజ్ఞ[7] ఉపహ్వయే। ఇదంనో బర్హిరాసదే ॥ 129

(8) తాసుజిహ్వా[8] ఉపహ్వయే హోతారా దైవ్యాకవీ। యజ్ఞంనో యక్షతామిమమ్ ॥ 130

1. గ్ంఽఅగ్నే, 2. తీతయే, 3. యజ్ఞఽఉప, 4. గ్ంఽ ఈళితఽఆవహ. 5. పృష్ఠ (వ్రా.ప్ర.) 6. సుపేశసాస్మిన్ (పా) 7. యజ్ఞఽఉప (వ్రా.ప్ర.) 8. జిహ్వాఽఉప (వ్రా.ప్ర.)

(9) ఇళా సరస్వతీ మహీతిస్రో దేవీర్మయోభువః । బర్హిః సీదంత్వస్రిధః ॥ 131

(10) ఇహత్వష్టార మగ్రియం విశ్వరూపముపహ్వయే । అస్మాకమస్తు కేవలః ॥ 132

(11) అవసృజావనస్పతే దేవదేవేభ్యోహవిః । ప్రదాతురస్తు చేతనమ్ ॥ 133

(12) స్వాహాయజ్ఞం కృణోతనేంద్రాయ [1]యజ్వనోగృహే । తత్రదేవాగ్ం[2] ఉపహ్వయే ॥ 134

## సూక్తము—13

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—ఋక్కునందుఁజెప్పబడు నాయాదేవతలు*

(1,2,3,4) సీ॥ సునమిద్ధుఁడనుపేర శోభ లందెడువహ్నీ! పూజనొనర్పుము! పూజ్యతముల
నగ్నీ! తనూనపాత్తనెడు నామంబుతో హవ్యతృప్తులఁ జేయు మమరవరుల
ననల! నరాశంసుఁడనుపేరుతోఁబోయి పక్వము చేయుము! భక్తతతుల
నీవె వారిని బిల్వ నియతుఁడవగుటచే దివికేగి పిలువుము! దివిజవరుల
గీ॥ వీతిహోత్రుండ! మాపయిఁ బ్రీతిఁబూని, దేవతల యొద్దకుంబోవు దివ్యమైన
రథముపై వారి రమ్మని [1]రాణఁజెలఁగఁ, బిలుచుకొనిరావె? యిష్టికిఁ బెద్దవగుచు ॥ 113

(5) క॥ ఘనమగు బర్హిస్సనియెడు, ననలుండే దర్భలందు [2]నడుగిడునొకఁడున్
సునిశితమగు దర్భలపై, ననువుగఁ బాత్రంబు నుంచనౌను [3]మహాత్ముల్! ॥ 114

(6) క॥ ద్వారాభిమాన దేవత, లారా! యజ్ఞాభిమానులారా! ప్రీతిన్
మీరాటంకముఁ జెప్పక!, ద్వారములందెఱచి యచటఁ దప్పక నిలుఁడీ! ॥ 115

(7) క॥ నక్తోషస్సులు![4] మీరున్, వ్యక్తముగా వేదిపైనిఁ బరచిన కుశ నా
సక్తిమెయిఁజేరి యజ్ఞము, రక్తిగ నెఱవేర్చి మమ్ము రక్షింపుండీ! ॥ 1 6

1. యజ్వినో, 2. గ్ంఽఉప (ప్రా.ప్ర.)

* ఈ సూక్తమంతటికి వివిధరూపాగ్నులు దేవతలు. ఈ సూక్తమునకు సంస్కృతమున ద్వాదశ విధాగ్నిదేవతలు గలరు 1. ఇధ్మలేదా సమిద్ధాగ్ని, 2. తనూనపాదగ్ని, 3. నరాశంసాగ్ని, 4. ఇళాగ్ని, 5. బర్హ్యగ్ని 6. దేవీర్ద్వారాగ్ని, 7. నక్తోషస్సులు 8. దైవీయహోతార ప్రచేత సాగ్నులు, 9. సరస్వతీ ఇళాభారతీ దేవీరూపాగ్నులు, 10. త్వష్టాగ్ని, 11. వనస్పత్యగ్ని, 12. స్వాహా కృత్యగ్నులు. ఈ వివిధాగ్నులను ననువాదపద్యములలో నాయాసందర్భములలోఁజేర్కొనఁ బడినవి. వ.గో.కృ.

1, రహిఁజెలంగ (తొ.పా.) 2 నడుగుఁబెట్టునా (తొ.పా. గణభంగము) 3. ఋత్విజుల్ (తొ.పా. గణభంగము)
4. నక్తోషస్సులారా అను సంబోధనార్థకముగ నిది ప్రయుక్తము.

(8,9,10,11,12) సీ॥ దైవ్యహోతలఁ బేరధరఁ గీర్తిగన్న య, గ్నులువచ్చి యిష్టికేగుదురుగాక
భారతీదేవియు భవ్యసరస్వతి, యిళతోడనిష్టిఁ జేయింత్రుగాక
త్వష్టయనం బేరఁదనరారు నగ్నిదే, వ్యఁడు యజ్ఞమునకు వచ్చెడునుగాక
చారువనస్పతి సకలహవ్యంబుల, నోపిదేవతలకు నొసఁగుఁగాక

గీ॥ స్వాహయను నగ్నితోనిష్టి జరుగుఁగాక, జన్నముల కమరులను బిల్వఁజనుఁడువీఁక
తృప్తినొందింపుఁ డింద్రుని దివ్యమైన, యజ్ఞహవ్యముచేత నో యజ్వలార ! ॥ 117

## సూక్తమ్. 14

ఋషిః మేధాతిథిః కాణ్వః

*దేవతా—విశ్వేదేవాః (విశ్వైర్దేవైఃసహితోఽగ్నిః) 3—ఇంద్రవాయు బృహస్పతి మిత్రాగ్ని పూషభగాదిత్యమరుద్గణాః, 10—విశ్వదేవాగ్నీంద్రవాయు మిత్రధామాని, 11—అగ్నిః,

ఛందః—గాయత్రీ

(1) ఏభిరగ్నే దువోగిరో విశ్వేభిః సోమపీతయే । దేవేభిర్యాహియక్షిచ ॥ 135

(2) ఆత్వా కణ్వా[1] అహూషత గృణంతి విప్రతేధియః । దేవేభిరగ్న[2] ఆగహి ॥ 136

(3) ఇంద్రవాయూ బృహస్పతిం మిత్రాగ్నిం పూషణంభగమ్ । ఆదిత్యాన్ మారుతం గణమ్ ॥ 137

(4) ప్రవోభ్రియంత[3] ఇందవో మత్సరామాదయిష్ణవః । ద్రప్సా మధ్వశ్చమూషదః ॥ 138

(5) ఈళతే త్వామవస్యవః కణ్వాసోవృక్తబర్హిషః । హవిష్మంతో [4] అరంకృతః ॥ 139

(6) ఘృతపృష్ఠా మనోయుజోయే త్వావహంతి వహ్నయః । ఆదేవాంత్సోమ పీతయే ॥ 140

(7) తాన్యజత్రాగ్ం[5] ఋతావృధోఽగ్నే పత్నీవతస్కృధి । మధ్వః సుజిహ్వపాయయ ॥ 141

* విశ్వేదేవాః (పూ) 1 కణాః. 2. రగ్న s. 3 భ్రియంతs. 4. ష్మంతోs. 5. గ్ంs. (ప్రా.ప్ర.)

(8) యేయజత్రాయ[6] ఈడ్యాస్ తేతే పిబంతుజిహ్వయా । మధోరగ్నేవ షట్కృతి ॥ 142

(9) ఆకీం సూర్యస్యరోచనాద్ విశ్వాందేవాగ్ం[7] ఉషర్బుధః । విప్రోహోతేహ వక్షతి ॥ 143

(10) విశ్వేభిః సోమ్యం మధ్వఽగ్న[8] ఇంద్రేణవాయునా । పిబామిత్రస్యధామభిః ॥ 144

(11) త్వంహోతా మనుర్హితోఽ గ్నేయజ్ఞేషుసీదసి । సేమంనో[9] అధ్వరంయజ ॥ 145

(12) యుక్ష్వాహ్యరుషీరథే హరితోదేవ రోహితః । తాభిర్దేవాగ్ం[10] ఇహావహ ॥ 146

## సూక్తము—14

### ఋషి—కణ్వపుత్రుఁడు మేధాతిథి.

### దేవత అగ్ని*

(1) గీ॥ మేమొసర్చుపూజ మిక్కిలిఁగొనుటకు, నాలకించుటకును, నఖిలనుతుల,
విబుధవరులతోడ విచ్చేసి యిచటకు, యజ్ఞపూర్తిఁజేయు [1]మగ్ని ! నీవు ॥ 118

(2) క॥ ఘనమగు నుపకారంబులఁ, గొనియాడుచునున్న సౌమ్యకోవిదులు నినుం
గనుఁగొని పిలుచుచు నుండిరి, మును[2]కొని దేవతలతోడ ముదమునరావే ! ॥ 119

(3) క॥ వాయువుని [3]నింద్రదేవుని, వాయుసఖుల మిత్రభగుల వరమారుతమున్
ధ్యేయుఁడగు పూషదేవు న, మేయము[4] పూజింపవయ్య ! మించినవేడ్కన్ ॥ 120

(4) క॥ మీకొఱకు సోమలతలం, దేకువతోఁ ద్రచ్చిరసము తీసితిమి తగన్[5]
శ్రీకరుల చమసపాత్రల, నాకాధిపులార ! గొనుచు నయముగరారే ! 121

(5) క॥ దర్భాసనములఁ బఱచుచు, నిర్భయముగ హోమమునకు నిఖిలహవిస్సున్
నిర్భరముగఁ జేఁబట్టుచు, నిర్భయులగు సురలకొఱకు నిన్వేడరొ[6]కో ! ॥ 122

6. జత్రాయఽ. 7. గ్ంఽ, (ద్రా.ప్ర) 8. మధ్వగ్న (పా.) మధ్వగ్నఽ ఇంద్రేణ (ద్రా.ప్ర.) 9. నోఽఅధ్వ (ద్రా.ప్ర.)
10. గ్ం ఇహా (ద్రా.ప్ర.)

*దేవత-విశ్వేదేవతలు- 3ఇంద్రవాయు బృహస్పతి మిత్రాగ్ని పూషభగాదిత్యమరుద్గణములు. 10-విశ్వేదేవాగ్నీంద్రవాయు మిత్రధామములు. 11-అగ్ని (పా) మాక్సుముల్లర్ ప్రకటించిన ప్రతిలో మొత్తము సూక్తమంతటికి విశ్వేదేవతలు మాత్రమే దేవతలుగాఁజేర్కొనఁబడిరి. వ.గో.కృ.

1. అగ్నిదేవ! (తా.పా.) 2. మునికొని (ద్రా.ప్ర.పా.) 3. శక్రదేవుని (తా.పా.) 4. గాఁబూజఁజేయుమీబుధవినుతా! (తా.పా.)
5. గం చేకొనుఁడు చమసపాత్రలం, నాకాధిపులార ! యదియె నా (న్యా) యముసుండీ ! (తా.పా.) 6. వేడరుకో ! (ద్రా. ప్ర. పా)

(6,7,8) సీ॥ ఎంతటి నైనను నీవ్వఁజాలినవియుఁ, దలఁచిన మాత్రానఁ దరిచేపచ్చు
నవియు నౌ వాజుల నమరియుండెడు బండి, పైఁదీసికొనిరమ్ము భవ్యసురల
నింద్రాదులన్ వేగనింతులతోఁగూడ, యజ్ఞంబునకుఁదెమ్ము హవ్యవాహ !
యేరి భాగములను వారు గైకొనినట్టు, లాశీర్వదింపుమీయమరదూత !

గీ॥ యెవ్వ రీ యజ్ఞమునఁ బూజనెవరు నుతుల, సందఁగల్గుచున్నారొ యట్టివారు
ఘనవషట్కార శబ్దము విననతోడ, వారికిన్ సోమమందింపువ[7]హ్ని ! నీవు ॥ 123

(9) గీ॥ అరసికా[8]ల్య కాలమందు దేవాళిని, మేలుఁగొలిపి నుతులమేధగల్గు
నగ్ని నాకలోక మధిగమించెడివారిఁ, బిలుచుఁగాక వేగఁబెద్దయగుచు ॥ 124

(10) క॥ దయ్యన వాయ్వాదులతో, నెయ్యముఁగొని సూర్యదేవు నేత్రముఁగొనుచుం
దియ్యని సోమరసంబును, నయ్య ! కొనుము యజ్ఞమందు నాదిత్యులతోన్ ॥ 125

(11) గీ॥ యజ్ఞమున హోతృవరులంద అరణియందు, నిన్నుఁ బుట్టించినారలు నన్నుతాంగ !
హోమ కార్యములన్నియు హోతవగుచు, నిర్వహింపుము యాగమగ్ని ! విభుండ ! 126

(12) క॥ చలమున "రోహిత్త" నియెడు, బలవాజులఁ గూర్చి పెద్ద బండికెనగ్ని !
పిలుచుకొనిరమ్ము విబుధుల, నిలనీకిది పాడిగాదె యిద్ధచరిత్రా ! ॥ 127

## సూక్తమ్—15

### ఋషిః—మేధాతిథిః కాణ్వః

### దేవతా—(ప్రతిదైవతం ఋతుసహితమ్) 1-ఇంద్రః, 2-మరుతః, 3-త్వష్టా; 4-అగ్నిః. 5-ఇంద్రః, 6-మిత్రావరుణౌ, 7-10—ద్రవిణోదాః, 11-అశ్వినౌ, 12-అగ్నిః,

### ఛందః—గాయత్రీ

(1) ఇంద్రసోమం పిబ[1]ఋతునాऽऽత్వా విశన్త్విందవః । మత్సరాసస్తదోకసః ॥ 147

(2) మరుతః పిబత[2] ఋతునా పోత్రాద్ యజ్ఞం పునీతన । యూయం హిష్ఠాసుదానవః ॥ 148

(3) అభియజ్ఞం గృణీహినోగ్నావో నేష్టః పిబ[3]ఋతునా । త్వంహిరత్నధా[4]అసి ॥ 149

(4) అగ్నేదేవాగ్ం[5] ఇహా వహసాదయా యోనిషుత్రిషు । పరిభూష పిబ[6]ఋతునా ॥ 150

7. వహ్నిదేవః. [తొ.పా.] 8. యుషఃకాలమందు [తొ. పా, గణభంగము] వ. గో. కృ.
1. పిబs. 2. పిబతs. 3. పిబs. 4.ధాs అసి. 5. గ్ంs. 6. పిబs ఋతు [ద్రా.పఠ.]

(5) బ్రాహ్మణాదింద్ర రాధసః పిబా సోమమృతూగ్ంరను[7]। తవేద్ధి సఖ్యమస్తృతమ్ ॥ 151

(6) యువం[8] దక్షం ధృతవ్రత మిత్రావరుణ దూళభమ్ । ఋతునాయజ్ఞమాశాథే ॥ 152

(7) ద్రవిణోదా ద్రవిణసో గ్రావహస్తాసో[9] అధ్వరే । యజ్ఞేషు దేవమీళతే ॥ 153

(8) ద్రవిణోదా దదాతు[10]నోవసూ నియాని శృణ్విరే । దేవేషుతా వనామహే ॥ 154

(9) ద్రవిణోదాః పిపీషతి జుహోత ప్రచతిష్ఠత । నేష్ట్రా[11]దృతుభిరిష్యత ॥ 155

(10) యత్త్వాతురీయ మృతుభిర్ద్రవిణోదో యజామహే। అధస్మానో దదిర్భవ ॥ 156

(11) అశ్వినాపిబతం మధుదీద్యగ్నీ శుచివ్రతా । ఋతునా యజ్ఞవాహసా ॥ 157

(12) గార్హపత్యేన సన్త్య[12] ఋతునా యజ్ఞనీరసి । దేవాన్ దేవయతేయజ ॥ 158

## సూక్తము—15

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—ఋతువులు (అయినను ప్రతిఋక్కునందును వేర్వేరుగ దేవతలు ప్రతిపాదింపఁబడుదురు)*

(1,2,3,4,5,6) సీ॥ వా[1]సవుఁడా : సోమపానంబు సేయుము, ఋతుదేవతలతోడ నతులఁ బ్రీతి
మారుతమా : పుణ్యమాన్య పోతునిగూడి, పానంబుసేయుము పరమరసము
ధనరత్నదాత ! యో త్వష్టఁడా : వేవేగఋతువులతోఁ ద్రాగుమతులరసము
శోభనాగ్ని : నీవు సుస్థానములయందు, సురలతోఁ ద్రావుము సోమరసము

గీ॥ బ్రాహ్మణాచ్ఛంసి యనువాని పాత్రనుండి, యింద్రుఁడా : సోమమును ద్రావుమీవు మరియు
వరుణుఁడా : మిత్రదేవుఁడ : వైరిగణముఁ, గొట్టి యజ్ఞఫలంబులఁ గూర్పరండు ॥ 128

(7) క॥ ప్రకృతియనెడు యజ్ఞంబున, వికృతిష్టిన్ విబుధగణము విత్తము కొఱకై
సుకృతినినిచ్చెడు సోమముఁ, బ్రకృతము తీయంగనుండి ప్రార్థించునినున్ ॥ 129

7. రను (మా) 8. యువదక్షం, (వ్రా. ప్ర.) 9. సోs. 10. దదాతుర్నోవసూని. 11. నేష్టా. 12. sఋతు (వ్రా. ప్ర.

* 1. ఇంద్రుఁడు 2. మరుత్తు 3. త్వష్ట 4. అగ్ని 5. ఇంద్రుఁడు 6. మిత్రావరుణులు 7-10. ద్రవిణోదసులు 11. అశ్వినీదేవతలు 12. అగ్ని. ఇవి యితరదేవతలు. వ. గో. కృ. 1. పాకహరాః, పావనుఁడా (తౌ. పాఠములు).

(8) గీ॥ యజ్ఞమునకు వలయు నఖిలధనంబును, నొసఁగుఁగాక నగ్నియుచితరీతి :
నగ్నిదత్తమైన నా ద్రవ్యమనసుర, గణముఁజాలఁ బ్రీతిగనునుగాక ॥ 130

(9,10,11,12) సీ॥ ఋత్విజుల్ : జ్వలనుఁడు ఋతువులతోఁగూడి, నేతృపాత్రను గొనినిష్ఠతోడ
సోమంబుద్రావుచు శోభించుచుండెడు, వెడలుఁడు మీరలు వేడ్కమీర
ఋతువుల, నిన్ను, సన్మతితోడఁ బూజింతు మగ్నిదేవా! మాకు నర్థమిడవె ।
యశ్వులారా : మీరలఖిల సోమరసంబు, త్రాగియంతటను సంతసముగొనుఁడు

గీ॥ గార్హపత్యుండవై నీవు కదలివచ్చి, యజ్ఞముల నెల్ల నెరవేర్చి యమరువరుల
కఖిలపూజలు సేయుమా : యర్థమొసఁగఁ, బురుషులకు నగ్నిదేవుఁడా : పుణ్యచరుఁడ : 131

## సూక్తమ్—16

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—ఇంద్రః

ఛందః—గాయత్రీ

(1) ఆ త్వావహంతు హరయో వృషణం సోమపీతయే । ఇంద్రత్వాసూర చక్షసః ॥ 159

(2) ఇమా ధానా ఘృతస్నువో హరీ[1] ఇహోప వక్షతః । ఇంద్రం సుఖతమే రథే ॥ 160

(3) ఇంద్రం ప్రాతర్హవామహ[2] ఇంద్రం ప్రయత్యధ్వరే । ఇంద్రం సోమస్యపీతయే ॥ 161

(4) ఉప నః సుతమా గహి హరిభిరింద్ర కేశిభిః । సుతే హి త్వా హవామహే ॥ 162

(5) సేమం నః స్తోమమా గహ్యుపేదం సవనం సుతమ్ । గౌరో న తృషితః పిబ ॥ 163

(6) ఇమే సోమాస[3]ఇందవః సుతాసో అధి బర్హిషి । తాగ్ం[4] ఇంద్ర సహసే పిబ ॥ 164

(7) అయం తే స్తోమో [5]అగ్రియో హృదిస్పృగస్తు శంతమః । అథా సోమం సుతం పిబ ॥ 165

1. హరీఽఇహో 2. మహఽ 3. ఽఇంద 4. గ్ంఽ 5. ఽఅగ్రి (ద్రా.ప్ర.)

(8) విశ్వామిత్స్వనం సుతమింద్రో మదాయ గచ్ఛతి । వృత్రహా సోమపీతయే ॥ 166

(9) సేమం నః కామమా పృణ గోభిరశ్వైః శతక్రతో । స్తవామ త్వా స్వాధ్యః ॥ 167

## సూక్తము—16

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—అగ్ని*

(1) ఉ॥ కోరినకోర్కెలెల్ల సమఁగూర్చెడి వేలుప ! నీవు వాజులం
గూరిచికొంచు బండిపయిఁ గూర్మిని సోమము ద్రావవచ్చుచో
శూరునిబోలి యంతటను శోభలఁదేలెడు నిన్ను ఋత్విజుల్
నేరిమిమీర మంత్రముల నీ మహిమంబుల నుగ్గడింపరే ॥ 132

(2) ఉ॥ వేదికయందు సంతతము విశ్రుతహోమ నిమిత్తమై కడున్
సాదర మొప్పఁజల్లఁబడుఁ జక్కని ధానములొప్పెఁ గావునన్
మోదముతోడ గుఱ్ఱములఁ బూన్చు రథంబును నెక్కి జంభ భే
దీ ! దయసేయు మీ యెడకుఁ దృప్తిగ మాసవనంబుఁ జూడఁగన్ ॥ 133

(3) గీ॥ మూఁడువేళల యందగు మూఁడు సవనములకుఁ బిల్తుము నిన్నొగి ముదముతోడ
నందు సంజను జరిగెడు సవనమునకు, సోమమును ద్రావ రారమ్ము సురవిభుండ ! ॥ 134

(4) గీ॥ సోమలతలను దచ్చియు సోమరసము, దీసియున్నారమింద్రుఁడా ! దివ్యమైన
యానమునునెక్కిరమ్ము మా యజ్ఞమునకు. వచ్చి సోమంబుఁద్రావుము మెచ్చునట్లు ॥ 135

(5) ఉ॥ సోమరసప్రధానమగు సుందరకర్మకు వచ్చి యందులో
నీమముతోఁబఠింపఁబడు నిర్మల సంస్తవ మాలకించి మా
నేమముగోరి సోమమును జెచ్చెర గౌరమృగంబుఁబోల్కినో
హో ! మహనీయ ! ద్రావుము మహోజ్జ్వలశోభఁజెలంగనెంతయున్॥ 136

(6) గీ॥ యాగవేదిని గలయట్టి యమలపాత్ర, సంస్థితంబగుసోమంబుఁజక్కఁగొనుము
సోమరసమును ద్రాగినచోఁద్వదీయ, దేహమెంతయుశోభించుదివిజనాథ!॥ 137

* తెలుఁగు వ్రాతప్రతిలో (1సంపుటము 89పుట) నగ్నిదేవత పేర్కొనఁబడినది. సంస్కృత మూలములలో నింద్రుఁడుదేవతగాఁబేర్కొనఁబడినది. అనువాదపద్యములలో నగ్నికిపూటుగా నింద్రుఁడే పరిగృహీతుఁడైనాఁడు. కావునఁబ్రమాదవశమున నగ్నిదేవతగాఁదెలుఁగులో వ్రాయఁబడియుండనగు. వ.గో.కృ.

(7) గీ॥ శ్రేష్ఠమైనసుతులు చక్కఁగఁజెవికెక్కి, నీమనంబుఁ బ్రీతినిండుగానదె
స్తుతులువినినసీవు సోమరసం[1]బెల్ల, సుఖమునిచ్చుఁగాకసొగసుకాఁడ॥ 138

(8) గీ॥ శత్రునాశకుఁడగు మహాశక్రుఁడధిక, సోమపానమునొనరించి సోమరసముఁ
గలుగు కర్మనిమిత్తమైకదలిపోవు, చున్నవాఁడదె చూడుఁడీ[2]సూరులార॥ 139

(9) గీ॥ [3]గోవులను నశ్వములనిచ్చికొలఁదిలేని, కాంక్షితంబులఁదీర్పుముఘన[4]మహేంద్ర!
యెల్ల వేళల నిను[5]గడునుల్లమలరఁ, దలఁచుచుంటిమి సుజన సంస్తవ చరిత్ర॥ 140

## సూక్తమ్—17

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—ఇంద్రావరుణౌ.

ఛందః—గాయత్రీ,

4—5, పాదానిచృత్ [5 హ్రసీయసీవా] గాయత్రీ,

(1) ఇంద్రావరుణయోరహం సమ్రాజోరవ[1] ఆ వృణే। తా నో మృళాత[2] ఈదృశే॥ 168

(2) గంతారా హి స్థోऽవసే హవం విప్రస్య మావతః। ధర్తారా చర్షణీనామ్॥ 169

(3) అనుకామం తర్పయేథామింద్రావరుణ రాయ[3]ఆ। తా వాం నేదిష్ఠమీమహే॥ 170

(4) యువాకు హి శచీనాం యువాకు సుమతీనామ్। భూయామ వాజదావ్నామ్॥ 171

(5) ఇంద్రః సహస్రదావ్నాం వరుణః శంస్యానామ్। క్రతుర్భవత్యుక్థ్య[4]ః॥ 172

(6) తయోరిదవసా వయం సనేమ ని చ ధీమహి। స్యాదుత ప్రరేచనమ్॥ 173

(7) ఇంద్రావరుణ వామహం హువే చిత్రాయ రాధసే। అస్మాంత్సు జిగ్యుషస్కృతమ్॥ 174

1. రసంబుబెల్ల (ప్రా.ప్ర.పా. గణభంగము. అర్థరహితము) వ.గో.కృ. 2. చోద్యమలర [తొ. పా.] 3. ఆవులను నశ్వములనిచ్చి యధికమైన (తొ.పా.) 4. ఘనహాయుండ!, 5. మేమదియుల్లమలరఁ (తొ.పా.)

1. s అవృణే. 2. s ఈదృశే. 3. s ఆ. 4. ఉక్థ్యః (ప్రా.ప్ర.)

(8) ఇంద్రావరుణ నూను వాం సిషాసంతీషుధీష్వా। అస్మభ్యం శర్మ యచ్ఛతమ్ ॥ 175

(9) ప్ర వామశ్నోతు సుష్టుతిరింద్రావరుణ యాం హువే। యామృధాథే సధస్తుతిమ్ ॥ 176

## సూక్తము—17

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—ఇంద్రావరుణులు

(1,2,3,4,5) సీ॥ మా వేడుకోలంది మమ్ములఁ బ్రోచుచు సౌఖ్యావహులమమ్ముఁ జలుపరేమి?
మాచేయు స్తోత్రాళిమదిలోనఁబెట్టుచు యజమానరక్షకై నరుఁగరేమి?
తోరంపుధనమిచ్చి తుష్టినొందింపుచు భక్తులనెల్లఁగాపాడరేమి?
సుఖకరంబైన మాసోమంబునందుచుఁ బరమకృపాదృష్టి[1]ఁ బరుపరేమి?

గీ॥ మఖహితా! దాతవు గదయ్య! యఖిలమునకు, వరుణ! స్తుత్యుండవు గదయ్య! వరుసమాకు
మనుజులకు రక్షనిచ్చెడి మాన్యులార!, రాజకాంతిని వెలుగుచు రండు మీరు॥ 141

(6) క॥ సందేహము లేకుండం, బొందుదు మమరేశ! వరుణపూర్ణకరుణచే
నందమగుధనమునంతయు, విందులకైగాక యాగవిస్తృతికొఱకై॥ 142

గీ॥ ధనములోనఁ గొంతఁదగు వెచ్చఁబెట్టుచు, దాచియుంపఁగలము తక్కినదియు
మరియు సంతకంటె విరివిగ విత్తంబు, వజ్రివరుణవలనఁగలుఁగు॥ 143

(7) గీ॥ వివిధ ధనమునొసఁగ వేడుకొందుము మేము, శక్రదేవ! వరుణ! శక్తిఁగొలఁది
పిలుపు నియ్యకొనుచు బీరంపుటక్కతో, శత్రువులను దుర్మించు శక్తినిండు॥ 144

(8) క॥ వరుణేంద్రులార! మిమ్ముం, గరము భజించెదము మమ్ముఁగరుణించి వెసం
బరమ సుఖంబొడఁగూర్చుచుఁ, జిరయశముంగలుఁగ నిండు చిత్తంబలరన్॥ 145

(9) గీ॥ ఇంద్ర! వరుణ! మిమ్ము నింపగునుతులను, బిలుచుచుంటి మిపుడు పెంపుతోడ
సంతసింపఁజేయుఁ జక్కని ఋక్కులు, మిమ్ముఁ బొందుచుండు మిక్కుటముగ॥ 146

1. దృష్టఁ (తా.పా.)

అనువాకః—5, సూక్తమ్—18

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—1-3 బ్రహ్మణస్పతిః, 4-ఇంద్రో బ్రహ్మణస్పతిః సోమశ్చ, 5-బ్రహ్మణస్పతిః సోమ-ఇంద్రో దక్షిణాచ, 6-8-సదసస్పతిః, 9-సదసస్పతిర్నరాంశసో వా.

ఛందః—గాయత్రీ

(1) సోమానం స్వరణం కృణుహి బ్రహ్మణస్పతే । కక్షీవంతం య[1]ఔశిజః ॥ 177

(2) యోరేవాన్ యో[2]అమీవహా వసువిత్ పుష్టివర్ధనః । స నః సిషక్తు యస్తురః ॥ 178

(3) మా నః శంసో[3] అరరుషో ధూర్తిః ప్రణ[4]ఙ్ మర్త్యస్య । రక్షా ణో బ్రహ్మణస్పతే ॥ 179

(4) సఘా వీరో న రిష్యతి యమింద్రో బ్రహ్మణస్పతిః । సోమో హినోతి మర్త్యమ్ ॥ 180

(5) త్వం తం బ్రహ్మణస్పతే సోమ[5]ఇంద్రశ్చ మర్త్యమ్ । దక్షిణా పాత్వంహసః ॥ 181

(6) సదసస్పతిమద్భుతం ప్రియమింద్రస్య కామ్యమ్ । సనిం మేధామయాసిషమ్ ॥ 182

(7) యస్మాదృతే న సిధ్యతి య[6]జ్ఞో విపశ్చితశ్చన । స ధీనాం యోగమిన్వతి ॥ 183

(8) ఆదృధ్నోతి హవిష్కృతిం ప్రాంచం కృణోత్యధ్వరమ్ । హోత్రా దేవేషు గచ్ఛతి ॥ 184

(9) నరాశంసం సుధృష్టమమపశ్యం సప్రథస్తమమ్ । దివో న సద్మమఖసమ్ ॥ 185

1 యఽ 2. యోఽఅమీ, 3 శంసోఽ, 4. ప్రణఙ 5. సోమఽఇంద్ర, 6. యజ్ఞో (ప్రా ప్ర.)

అనువాకము—5 సూక్తము—18

ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

దేవత—1-5 బ్రహ్మణస్పతి, 6—9 సదసస్పతి *

(1,2,3,4,5) సీ॥ బ్రహ్మణస్పతి! నీవు పరమౌశిజునిమాడ్కి వన్నెకెక్కెడునట్లు నన్నుఁజేయు!
బ్రహ్మణస్పతి! నీవు బలవంతుఁడవు చాల ధనవంతుఁడవుకాదె! దాతవగుచు
బ్రహ్మణస్పతి! మమ్ము వైరులు దూషింపకుండునట్టులు సేయు ముచితవృత్తి
బ్రహ్మణస్పతి! నిన్ను వజ్రిని సోముని నాశ్రయించినవాఁడు హానిగనునె?
గీ॥ బ్రహ్మణస్పతి! నీవు మా పాపములను, గొట్టి రక్షింపరమ్మ! మమ్మెట్టులైన
నట్టులే యింద్రసోము లత్యధికమైన, [1]దక్షిణయుఁ బ్రోచెదరుగాకఁదనివితీర॥ 147

(6) క॥ సదయుఁడగు నింద్రవిభునకు, ముదముం గలిగించువాఁడు మోక్షప్రదుఁడున్
మది కెక్కువాఁడునగు నా, సదసస్పతి బుద్ధినొసఁగి చక్కఁగఁ జనఁడే! ॥ 148

(7) క॥ సదసస్పతి లేకుండిన, నెదనైనఁ దలంపఁగలమె?[2] యిష్టిం జేయన్
సదసస్పతి మా యజ్ఞము, [3]ముదమున సఫలంబు సేసి ముదముసుగనుతన్ ! ॥ 149

(8) క॥ మదకర హవ్యం బొసఁగిన, పిదపన్ యజమాన యజ్ఞపీడాతతిఁ దాఁ
దుదముట్టింపంగల యా, సదసస్పతి పురుషకీర్తిఁ జక్కఁబఱచఁడే? ॥ 150

(9) క॥ ఘనుఁడగు నాసదసస్పతి, ఆనవర సంస్తూయమానచారుగుణుఁ మే
మనయము శాస్త్రమువలనం, గనుఁగొంటిమి విబుధులార! కానరె? వానిన్ ॥ 151

సూక్తమ్—19

ఋషి—మేధాతిథిః కాణ్వః

దేవతా—అగ్నిర్మరుతశ్చ

ఛందః—గాయత్రీ

(1) ప్రతి త్యం చారుమధ్వరం గోపీథాయ ప్ర హూయసే । మరుద్భిరగ్న[1] ఆ గహి ॥ 186

(2) నహి దేవో న మర్త్యో మహస్తవ క్రతుం పరః । మరుద్భిరగ్న ఆ గహి ॥ 187

* సంస్కృత మూలములో దేవతలు చాల భిన్నముగానున్నవి. 1-3 బ్రహ్మణస్పతి, 4-ఇంద్రబ్రహ్మణస్పతి సోమదేవతలు. 5-బ్రహ్మణస్పతి సోమ ఇంద్ర దక్షిణదేవతలు. 6-8 సదసస్పతి, 9-సదసస్పతి లేదా నరాశంసుఁడు, తెలుఁగనువాదరచనలో మాత్రము సంస్కృతమూలములలోఁ గల దేవతలనైత ముటంకింపఁబడినవి. వ.గో కృ. 1. దక్షిణయుఁ బ్రోచుఁగాక యత్యంత మిలను (తొ.పా.) 2. గలఁడె? వ్రా.ప్ర పా. 3 ముదమున సఫలంబుసేయ బుద్ధిదలఁచుతన్ (తొ.పా.) 1. రగ్నs. (వ్రా.ప్ర.)

(3) యే మహో రజసో విదుర్విశ్వే దేవాసో[2] అద్రుహః । మరుద్భిరగ్న ఆ గహి ॥ 188

(4) య[3] ఉగ్రా[4] అర్కమానృచురనాధృష్టాస[5] ఓజసా । మరుద్భిరగ్న ఆ గహి ॥ 189

(5) యే శుభ్రా ఘోరవర్పసః సుక్షత్రాసో రిశాదసః । మరుద్భిరగ్న ఆ గహి ॥ 190

(6) యే నాకస్యాధి రోచనే దివి దేవాస[6] ఆసతే । మరుద్భిరగ్న ఆ గహి ॥ 191

(7) య[7]ఈంఖయంతి పర్వతాన్ తిరః సముద్రమర్ణవమ్ । మరుద్భిరగ్న ఆ గహి ॥ 192

(8) ఆ యే తన్వంతి రశ్మిభిస్ తిరః సముద్రమోజసా । మరుద్భిరగ్న ఆ గహి ॥ 193

(9) అభి త్వా పూర్వపీతయే సృజామి సోమ్యం మధు । మరుద్భిరగ్న ఆ గహి[8] ॥ 194

ఇతి ప్రథమోఽష్టకే ప్రథమోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—19

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—అగ్నివాయువులు

(1) గీ॥ సుప్రసిద్ధయాగ సోమపానము సేయఁ, బిలుచుచుండిమగ్ని! [1]ప్రీతినిన్ను
మారుతంబుతోడ మాయిష్టికై వచ్చి, కొఱతలన్నిఁదీర్చి కోర్కెలిమ్ము॥ 152

(2) చ॥ క్రతువులు నీసమక్షమునఁ గౌతుకమొప్పఁగఁ జేయువారలే
క్రతువుల దేవమండలికి గౌరవ హవ్యములిచ్చు వారలే
మతిఁ గలవారు, నీకు నవమానముఁ జేసెడివారు నింద్యులై
గతులను బొందకుండుదురు కాన మరుత్తులతోడ రాఁగదే॥ 153

2. సోs. 3. యs. 4. ఉగ్రాs 5. సs. 6. సsఆసతే. 7. యs (వ్రా.ప్ర.) 8. వ్రాతప్రతిలోఁదొలి ఋక్కులోఁదప్ప మిగిలిన ఋక్కులలోఁజివర ''అగ్ని ఆ గహి'' అన్న పదములు విడిచి వ్రాయఁబడినవి. అనఁగాఁదొలి ఋక్కులలో వలెనే చివరి పదములన్ని ఋక్కుల చివరను నూహ్యములై పఠింపనగునని తాత్పర్యము. వ.గో.కృ. 1. పెద్దవగుట (తొ.పా.)

(4.5.6) సీ॥ మేఘంబులన్నియు మిన్నుటంబుగఁ గూర్చి నిప్పునట్టులు సేయ నెఱుఁగువారు
వరలుచుండెడివారు వర్షదానంబుల జగదుపకారము సలుపువార
లాకాశ వీథిలో సంతతం బిరుగుచు నింపుగా వర్షంబు నిచ్చువారు
ఘోర నాదంబును గుఱిపించి వానలు శత్రునాశమునకై జరుగువారు

గీ॥ రవికి మీఁదుగ నుండెడి దివిని వెలుఁగు, వారలగు వాయువులతోడ వచ్చిరమ్మ
యజ్ఞముం జూచి వెడలవె యగ్ని²నీవు:. కాంక్షితార్థంబులీయవె కాంచనాభ:॥ 154

(7.8) గీ॥ మేఘములఁ బాఱఁద్రోలుచ మోఘ³బలస. ధాను ధృష్టులఁ గూడుచు దివ్యమైన
వర్షమిచ్చుచు నుండెడి వాయుగణము. తోడఁగూడుచు రావేమి తొల్త నగ్ని:॥ 155

(9) గీ॥ నీవనాదినుండి నిరతము సేసెదు, సోమపానమునకు సూరట లెన్న
మారుతంబులతోడ మాయిష్టికై వచ్చి, సోమరసముఁ ద్రావు సొగసుకాఁడ:॥ 156

ఇయ్యది
శ్రీభారద్వాజగోత్ర, శ్రీవేంకటేశ్వరపౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేంకట నరసింహశాస్త్రి విరచితకృతులలో
శ్రీమదాంధ్ర ఋగ్వేదసంహిత యందుఁ
ప్రథమాష్టకమునఁ ప్రథమాధ్యాయము
సమాప్తము

---

యగ్నిదేవ: 3. మోఘమైన (తా.పా.)

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమం మండలమ్

ప్రథమోఽష్టకః—ద్వితీయోఽధ్యాయః

### సూక్తమ్—20

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—ఋభవః

ఛందః—గాయత్రీ

(1) అయం దేవాయ జన్మనే స్తోమో విప్రేభిరాసయా । అకారి రత్నధాతమః ॥ 1

(2) య ఇంద్రాయ వచోయుజా తతక్షుర్మనసా హరీ । శమీభిర్యజ్ఞమాశత ॥ 2

(3) తక్షన్ నాసత్యాభ్యాం పరిజ్మానం సుఖం రథమ్ । తక్షన్ ధేనుం సబర్దుఘామ్ ॥ 3

(4) యువానా పితరా పునః సత్యమంత్రా[1] ఋజూయవః । ఋభవో విష్ట్యక్రత ॥ 4

(5) సం వో మదాసో[2] అగ్మతేంద్రేణ చ మరుత్వతా । ఆదిత్యేభిశ్చ రాజభిః ॥ 5

(6) ఉతత్యం చమసం నవం త్వష్టుర్దేవస్య నిష్కృతమ్ । అకర్త చతురః పునః ॥ 6

(7) తే నో రత్నాని ధత్తన త్రిరా సాప్తాని సున్వతే । ఏకమేకం సుశస్తిభిః ॥ 7

(8) అధారయంత వహ్నయో ఽభజంతసుకృత్యయా । భాగం దేవేషు యజ్ఞియమ్ ॥ 8

1. మంత్రాఽ 2. సోఽ (ప్రా.ప్ర.)

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము—ద్వితీయాధ్యాయము

#### సూక్తము—20

ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

దేవతలు—ఋభువులు

(1) కII మానవులు తపోనిష్ఠం, బూని ఋభుప్రవరులయిరి పూజ్యులు వారల్
జ్ఞానప్రదమౌ స్తోత్రము, వీనులతో విని విశేష విత్తమొసఁగరే॥ 1

(2) కII చక్కని హరియను వాజిని, సక్కజముగ సృష్టిఁజేసి యమరపతికిఁ వా
మెక్కువగ నిచ్చి ఋభువులు, చక్కని కర్మతతినిష్ఠి జరిపిరి ప్రీతిన్॥ 2

(3) కII ఎల్లెడ ననర్గళంబుగఁ, దెల్లముగాఁ బోవునట్టి తేరుం బాలం
బెల్లుగ నిచ్చెడు గోవుల, నల్లసితాశ్వులకు నిచ్చియుండిరి ఋభువుల్॥ 3

(4) ఉII సారముఁగల్గు మంత్రముల శక్తినెఱింగిన వారలై కడుం
ధీరులఁబోలి కార్యములఁ దీరుచుకొంచు నిరంతరంబు నెం
తో రహినెల్లెడన్ వెలుఁగుఁ దోరఁపు మంత్ర[1] సుశక్తిచేతఁ జె
న్నారుచుఁ దల్లిదండ్రుల నొనర్చిరి యౌవ[2]నవంతు లట్లుగన్ 4

(5) గీII ద్వాదశాదిత్యులకు లసద్వాసవునకు, నల[3]మరుత్తులకున్ మీకును నచ్చమైన
సోమరసముంపఁబడెనిట శూరులార!, పుష్టినిచ్చెడి దీనిని బుచ్చుకొండు॥ 5

(6) గీII త్వష్ట నిజబుద్ధి బలమిచేతను నొకండు, చమసపాత్ర రచించె నబ్రముగ నపుడు
శిష్యులగు[4] ఋభువులద్దానిఁ జేతఁ గొనుచు, నలు[5]విధంబు నొనర్చి చెలఁగిప్రీతి॥ 6

(7) ఉII మీరలు మాప్రశస్తనుతి మించిన వేట్కనునాలకించుచున్
సారసమైన సోమము నొసంగెడు యాజకపూరుషాళికిం
గోరిన వస్తుసంపదను గూర్చెడు రత్నములెన్నియేని స
ద్గౌరవ కర్మలందిడుచుఁ గాంచుఁడు కీర్తిని సౌఖ్యసంపదన్॥ 7

1. మంత్రప్రభావరీతిఁ (తొ.పా.) 2. యవ్వన (వ్రా.ప్ర.పా.) 3. మారుతమునకు మీకును మహితమైన [తొ.పా.] 4. ఇక్కడఁ బంచలఘుగణమింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ. 5. నలు విధంబులొనర్చి దెంతయునుబ్రీతి (తొ.పా. యతిభంగము.) వ.గో.కృ.

(8) చ॥ పొరిఁబొరి చావుపుట్టువులఁబొంది ఋభుప్రకరంబు శక్తి సు
ర్వర సలవానిఁగెల్చి యమరత్వముగాంచుచు వెలఁగలి వా
విరిఁ బగయాగ కర్మముల వేడ్క నొసప్పుచు దేవతాళితో
సరిగ సమస్త హవ్యములఁ జాలఁగ నొందిరి సంతసంబునన్॥ 8

## సూక్తమ్—21

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా—ఇంద్రాగ్నీ

ఛందః—గాయత్రి

(1) ఇహేంద్రాగ్నీ ఉప హ్వయే తయోరిత్ స్తోమ ముశ్మసి । తా సోమం సోమపాతమా ॥ 9

(2) తా యజ్ఞేషు ప్ర శంసతేంద్రాగ్నీ శుంభతా నరః । తా గాయత్రేషు గాయత ॥ 10

(3) తా మిత్రస్య ప్రశస్తయ[1] ఇంద్రాగ్నీ తా హవామహే । సోమపా సోమపీతయే ॥ 11

(4) ఉగ్రా సంతా హవామహ[2] ఉపేదం సవనం సుతమ్ । ఇంద్రాగ్నీ[3] ఏహ గచ్ఛతామ్ ॥ 12

(5) తా మహాంతా సదస్పతీ[4] ఇంద్రాగ్నీ రక్ష ఉబ్జతమ్ । అప్రజాః సన్త్వ[5]త్రిణః ॥ 13

(6) తేన సత్యేన జాగృతమధి ప్రచేతునే పదే । ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతమ్ ॥ 14

## సూక్తము—21

ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

*దేవత—ఇంద్రుఁడు, అగ్ని

(1) గీ॥ యజ్ఞకర్మకొఱకు నగ్నీంద్రులఁ భక్తిఁ బిలిచి వారినుతులఁ బ[1]లుకుచుండు
సోమపానరతులు శుభదేవతలు మీరు, సోమమెల్లఁ ద్రాగి సొగసుఁగనరె॥ 9

1. ప్రశస్తయఽ ఇంద్రాగ్నీ 2. మహఽ 3. ఇంద్రాగ్నీఽ 4. సదస్పతీఽ 5. సన్త్వత్రిణః (పా.ప్ర.)

* తెలుఁగు మూలములో 1వ సంపుటము 101వ పుటలో 21వ సూక్తమునకు దేవతలు పేర్కొనఁబడలేదు, సంస్కృతమూలము ననుసరించి దేవతలిక్కడఁ బేర్కొనఁబడినవి. వ.గో.కృ. 1. బిలుపుచుండు (తా. పా.)

(2) క॥ అసఘములగు ఋక్కులతో, వినయముగా నింద్రవహ్ని విశ్వేశుల ప్రా
ర్థనమున్ సల్పుచు వా²రిని, బనిగొని భూషింపుడతుల బుద్ధిన్ మీరల్॥ 10

(3,4,5) సీ॥ పిలుచుచుంటిమి మేము ప్రీతినింద్రాగ్నుల, సోమపానముఁజేసి శోభఁ జెలఁగఁ
బిలుచుచుంటిమి మేము ప్రీతినింద్రాగ్నుల యాగనాశకులను సాగనంపఁ
బిలుచుచుంటిమి మేము ప్రీతినింద్రాగ్నుల యజ్ఞాభిముఖముగా నరుగఁదేరఁ
బిలుచుచుంటిమి మేముప్రీతినింద్రాగ్నుల జన్నంబుసేవింప వన్నెమీరఁ
గీ॥ బరమగుణవంతులను సభాపాలకులను, బిలుచుచున్నాము రక్షసిపిండుఁగొట్టి
నరులు సంతానహీనులౌనట్లు సేయఁ, బిలుచుచుంటిమి వారలఁబ్రియము తోడ॥ 11

(6) క॥ ఫలముండుననుచు మాకుం, గలశక్తిం దలఁచి యాగకర్మలు సేయన్
ఫలభోగసాధకంబగు, సలనాకపదంబు మాకు నందింపుండీ॥ 12

## సూక్తమ్—22

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా-1-4 అశ్వినౌ, 5-8 సవితా, 9-10 అగ్నిః, 11-దేవ్యః, 12-ఇంద్రాణీ వరుణాన్యగ్నాయ్యః, 13-14 ద్యావాపృథివ్యౌ, 15-పృథివీ, 16-విష్ణుర్దేవా వా, 17-21 విష్ణుః

ఛందః—గాయత్రీ

(1) ప్రాతర్యుజా వి బోధయాశ్వినావేహ గచ్ఛతామ్ । అస్య సోమస్య పీతయే ॥ 15

(2) యా సురథా రథీతమోభా దేవా దివిస్పృశా । అశ్వినా తా హవామహే ॥ 16

(3) యా వాం కశా మధుమత్యశ్వినా సూనృతావతీ । తయా యజ్ఞం మిమిక్షతమ్ ॥ 17

(4) నహి వామస్తి దూరకే యత్రా రథేన గచ్ఛథః । అశ్వినా సోమినోగృహమ్ ॥ 18

(5) హిరణ్యపాణి మూతయే సవితారముప హ్వయే । స చేత్తా దేవతా పదమ్ ॥ 19

2. పెంఢియు (తా.పా.)

(6) అపాం[1] నపాతమవసే సవితారముప స్తుహి । తస్య వ్రతాన్యుశ్మసి ॥ 20

(7) విభక్తారం హవామహే వసోశ్చిత్రస్య రాధసః । సవితారం నృచక్షసమ్ ॥ 21

(8) సఖాయ[2]ఆ ని షీదత సవితా స్తోమ్యో ను నః । దాతా రాధాంసి శుంభతి ॥ 22

(9) అగ్నే పత్నీరిహా వహ దేవానాముశతీరుప । త్వష్టారం సోమపీతయే ॥ 23

(10) ఆ గ్నా[3] అగ్న[4] ఇహావసే హోత్రాం యవిష్ఠ భారతీమ్ । వరూత్రీం ధిషణాం వహ ॥ 24

(11) అభి నో దేవీరవసా మహః శర్మణా నృపత్నీః । అచ్ఛిన్నపత్రాః సచంతామ్ ॥ 25

(12) ఇహేంద్రాణీముపs హ్వయే వరుణానీం స్వస్తయే । అగ్నాయీం సోమపీతయే ॥ 26

(13) మహీ ద్యౌః పృథివీ చ న [5]ఇమం యజ్ఞం మిమిక్షతామ్ । పిపృతాం నో భరీమభిః ॥ 27

(14) తయోరిద్ [6]ఘృతవత్ పయో విప్రా రిహంతి ధీతిభిః । గంధర్వస్య ధ్రువే పదే ॥ 28

(15) స్యోనా పృథివి భవానృక్షరా నివేశనీ । యచ్ఛా నః శర్మ సప్రథః ॥ 29

(16) అతో దేవా[7] అవంతు నో యతో విష్ణుర్విచక్రమే । పృథివ్యాః సప్త ధామభిః ॥ 30

(17) ఇదం విష్ణుర్వి చక్రమే త్రేధా ని దధే పదమ్ । సమూఢ్హమస్య పాంసురే ॥ 31

(18) త్రీణి పదా వి చక్రమే విష్ణుర్గోపా[8] అదాభ్యః । అతో ధర్మాణి ధారయన్ ॥ 32

(19) విష్ణోః కర్మాణి పశ్యత యతో వ్రతాని పస్పశే । ఇంద్రస్య యుజ్యః సఖా ॥ 33

1. అపా నపాత (వ్రా ప్ర.) 2. సఖాయs (వ్రా.ప్ర.) 3. అగ్నాs. 4అగ్నాs ఇహా (వ్రా.ప్ర.) 5. నs ఇమం
6. ఘృతవత్. 7. దేవాs. 8. గోపాs. (వ్రా.ప్ర.)

(20) తద్ విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః । దివీవ చక్షురాతతమ్ ॥ 34

(21) తద్ విప్రాసో విపన్యవో జాగృవాంసః సమింధతే । విష్ణోర్యత్ పరమం పదమ్ ॥ 35

## సూక్తము—22

### ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి

### దేవత—1-4-అశ్విదేవతలు, 5-8 సూర్యుఁడు, 9-10 అగ్ని 11-దేవతలు, 12-14 భూమ్యంతరిక్షములు, 15-పృథివి, 16-21 విష్ణువు*

(1,2,3,4,5) సీ॥ అధ్వర్యుపుంగవా! యశ్విదేవతలను మేలుఁగొల్చినవారు మేలఁగరారె!
రమణీయ[1]నాకస్థరథికులారా! మీరు సుందరరథమెక్కి చూడరారె!
సరసాశ్వులార! మీ సత్యవాక్కులతోడ నిష్ఠను జరిపింపనెంచిరారె!
యశ్విదేవతలార! యజమానగృహమిటఁ గలదు వీక్షింపంగఁ గదలిరారె!
గీ॥ స్వరముంబూనిసవితృఁడా! సాగివచ్చి, బ్రహ్మవై యజ్ఞకర్మకుఁ బ్రస్తుతింప
నరుఁడుపొందఁగఁగోరిననశ్వరమగుఁ, బదముఁజూపుటకై రావె యెదనుదలఁచి॥ 13

(6) క॥ ఉదకంబులనెండించుచు, సదయుండయి సవిత మమ్ము సంరక్షింపన్
ముదమున మాయజ్ఞమునకుఁ, గద[2]లెదునటు చేయవయ్య కళ్యాణాత్మా!॥ 14

(7) క॥ బ్రతుకునకుఁబనికివచ్చెడు, నతులిత చిత్రార్థమెల్ల నందించుచు స
న్మతితో వెలుంగుచుండెడు, మతిమంతుని సవితృదేవు మన్నింపవలెన్॥ 15

(8) క॥ నెచ్చెలులగు ఋత్వి[3]క్తతి!, సచ్చేతముతోడ మాసుసవనస్థలికిన్
విచ్చేసి[4]రవి, సువిత్తము, నిచ్చుటకై వే[5]డుఁడతని నెంతయు భక్తిన్॥ 16

(9,10,11) సీ॥ అగ్ని! శచీదేవి నార్యశత్రునితోడ యజ్ఞంబునకు వేగ నునుపరాదె!
శిల్పి కార్యములలో శ్రేష్ఠుఁడౌ త్వష్టను యజ్ఞంబునకు వేగ నునుపరాదె!
దేవభార్యలతోడ దివ్య భవత్కాంత యజ్ఞంబునకు వేగ నునుపరాదె!
భరతుని యిల్లాలు భారతీదేవిని యజ్ఞంబునకు వేగ నునుపరాదె!
గీ॥ వాహనముగల్గు వారలు ప్రజలనేలు, వారలగు దేవప[6]త్నుల వాణిఁగూడ
మా[7]సుయజ్ఞము రక్షింప మనసుఁదీర, సోమమును ద్రావనంపవె సొగసుకాఁడ! ॥ 17

* తెలుఁగు వ్రాతప్రతిలో 1వ సంపుటము (103వ పుట) లో 22 సూక్తములోఁగొన్ని ఋక్కులకు దేవతలు సరిగా వ్రాయఁబడలేదు- సంస్కృత మూలము ననుసరించి 12వ ఋక్కునకు ఇంద్రాణి వరుణాగ్నులు దేవతలు-16వ ఋక్కునకు విష్ణువు లేదా దేవ అను దేవత-17 మొ 21 వఱకు ఋక్కులకు విష్ణువు దేవత. తెలుఁగుమూల వ్రాతప్రతిలోఁ బొరపాటున 12వ ఋక్కునకు దేవతను వ్రాయలేదు. వ.గో.కృ.

1. స్వర్గస్థ రథికులారా! 2. గదలుచురా వేడవయ్య కళ్యాత్మా! (త్మన్) 3. ఋత్విజ్ఞులు 4. సూర్యువిత్తము 5. వేడుఁడతఁడు నిచ్చెడు మనకున్ 6. దేవప్రియలలో వాణితోడ 7. మాదుయజ్ఞము. (తా.పా.)

(12) గీ॥ మాయొసఁగు సోమరసము సమ్మతముతోడఁ, గ్రోలి రక్షించుటకు రమ్ము గోత్రభేది!
వరుణ వహ్నుల ప్రియురాంఁడ్రు వచ్చుటకయి, పిలుచుచున్నాఁడ నిష్టికిఁ బ్రీ[8]తివారి॥ 18

(13) గీ॥ పూజ్యురాలగు స్వర్దేవి, భూమిదేవి, కర్మలన్నియు నెరవేర్చి కరుణ తోడ
వర్షము నొసంగి పైరులు వర్ధిలంగఁ, జేసి పోషించి మమ్ము ర[9]క్షింత్రుగాక॥ 19

(14) గీ॥ ఆకసంబందు నుండెడు నంతరిక్ష, భూమి దేవతలకు జనుల్ పూజలిడుచు
వారి దయచేత నుదకముఁబడసి ఘృతము, చందమునఁద్రావుచున్నారు జగతిలోన॥ 20

(15) క॥ †బహు యోజన విస్తారా! బహునాయుత శత్రునివహ బంతనదక్షా!
మహి సర్వభూతవాహా! మహిత ధనంబొసఁగి మమ్ము మన్నింపఁగదే॥ 21

(16) గీ॥ పూనిగాయత్రి మొదలగుపూర్ణ ధామ, సప్తకంబును విష్ణువున్ సరస తతిని
నాక్రమించిన భూతలమందు నుండు, మమ్ము రక్షింపుఁగాక నామారుత[1]ములు॥ 22

(17,18,19) సీ॥ ‡గాయత్రి మొదలగు ఘనధామములచేత నాక్రమించెడు నెవ్వఁడఖిల జగము
మూఁడు పాదములచే మూఁడు లోకములను నాక్రమించెడు నెవ్వఁడఖిల భూమి
ధర్మములంగావ ధరణీ తలంబంత నాక్రమించెడు నెవ్వఁడఖిల ధరణి
జంగమస్థావర జగతీతలంబెల్లఁ బాలించు నెవ్వఁడు పరమతుష్టి
గీ॥ నట్టి విష్ణు[2]ని మహిమంబు లతిశయించి, కలిగియుండుటచేతనే కర్మలన్ని
జరుపఁగలవారమైతిమి జగతిలోన, ఋత్విజులు! గనుఁడు[3] విష్ణు నహీన మహిమ॥ 23

(20) గీ॥ అంతట వెలుంగుచుండెడు నాకసమును, నేత్రములు సూచు విధమున నెమ్మితోడ
విశ్వమంతట వెలిఁగెడు విష్ణు పదము, సూరులందఱుఁదప్పక చూడఁగలరు!॥ 24

(21) క॥ వాగర్థంబులలోపల, నేగతిఁ జొరపడనివార, లెంతయునుతులన్
రాగమునఁజేయు మీరలు, సాగుచు సద్విష్ణు పదము సరిచూపరొకో!॥ 25

8. ప్రియముతోడ. 9 రక్షింపుగాక (తొ.పా.)

† ఈ ఋక్కునకు దయానంద సరస్వతి గారు భిన్న భావమును వ్రాసినారు. "భూగర్భ విద్యా మూలమున గుణములచేఁ దెలియఁబడిన భూమియే మూర్తిమంతులకు నివాసస్థానము. సహేతువగు బహురత్న ప్రదయగుచున్నది." అని (దయానంద సరస్వతి గారి భావము.) (నే.వేం.న.శా)

కేవలములౌకిక దృక్పథముతో వ్రాయఁబడిన దయానంద భాష్యము సైతము నితర ప్రాచీన భాష్యములవలెనే యప్రామాణికమని వేద విజ్ఞానము దృష్టితోనే నిరూపింపనగును. వ.గో.కృ. 1. మారుతంబు (తొ.పా.)

‡ ఈ మూఁడు ఋక్కులను దయానందసరస్వతి వేరుగ వ్యాఖ్యాన మొనర్చి యిట్లు భావార్థమును వ్రాసెను. "పరమేశ్వరుఁడీ సంసారమందు పృథివీమయము, అంతరిక్షస్థమగుంద్రసరేణ్వాదిమయము ప్రకాశమయము అణుత్రివిధ జగత్తును రచించెను. ఈజగత్తులకు నీ మూఁడే యాధార భూతములు. అంతరిక్షమేది గలదో యదే భూమ్యాదులకు వర్ధకము, ఈశ్వరుఁడులేనిది యెవ్వఁడును దేనిని జేయలేఁడు." అని చెప్పెను. ఈ ఋక్కులయర్థము వామనావతారాభిప్రాయముతో వర్ణింపఁబడుటవలన పూర్వపశ్చిమ పర్వతస్థుఁడగు విష్ణువుండెను అని మిథ్యార్థములో చాయనుఁడు, విలసన్ మొదలగు వారు వర్ణించిరని ఆక్షేపించినారు.—దయానందుఁడు (నే. వేం. న. శా.)

సూచన—శ్రీ మహావిష్ణువు ద్వైతుఁడు నద్వైతుఁడు ద్వైతాద్వైతుఁడును నగును. వేదమంత్రార్థములను సరిగా నవగాహన చేసికొననందువల్లఁ బెక్కురు పెక్కులగు నప్రామాణికాభిప్రాయములు వెల్లడించిరి. (చూ.పీఠిక) వ.గో.కృ.

2. నట్టి విష్ణు ప్రభావంబులతిశయించి (తొ. పా.) 3. ఇక్కడఁ బంచలఘుగణమిందగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ.

## సూక్తమ్ 23

ఋషిః—మేధాతిథిః కాణ్వః

దేవతా-1వాయుః, 2-3 ఇంద్రవాయూ, 4-6 మిత్రావరుణౌ, 7-9 ఇంద్రోమరుత్వాన్. 10-12 విశ్వేదేవాః,

13-15పూషా, 16-22, 23 (పూర్వార్ధస్య) ఆపః, 23 (ఉత్తరార్ధస్య), 24 అగ్నిః *

ఛందః—1-18 గాయత్రీ, 19 పురఉష్ణిక్, 21 ప్రతిష్ఠా. 20, 22-24 అనుష్టుప్.

(1) తీవ్రాః సోమాస[1] ఆ గహ్యాశీర్వంతః సుతా[2] ఇమే । వాయో తాన్ ప్రస్థితాన్ పిబ ॥ 36

(2) ఉభా దేవా దివిస్పృశేంద్రవాయూ హవామహే । అస్య సోమస్య పీతయే ॥ 37

(3) ఇంద్రవాయూ మనోజువా విప్రా హవంత[3] ఊతయే । సహస్రాక్షా ధియస్పతీ ॥ 38

(4) మిత్రం వయం హవామహే వరుణం సోమపీతయే । జజ్ఞానా పూతదక్షసా ॥ 39

(5) ఋతేన యావృతావృధావృతస్య జ్యోతిషస్పతీ । తా మిత్రావరుణా హువే ॥ 40

(6) వరుణః ప్రావితా భువన్ మిత్రో విశ్వాభిరూతిభిః । కరతాం నః సురాధసః ॥ 41

(7) మరుత్వంతం హవామహ[4] ఇంద్రమా సోమపీతయే । సజూర్గణేన తృంపతు ॥ 42

(8) ఇంద్రజ్యేష్ఠా మరుద్గణా దేవాసః పూషరాతయః । విశ్వే మమ శ్రుతా హవమ్ ॥ 43

(9) హత వృత్రం సుదానవ[5] ఇంద్రేణ సహసా యుజా । మా నో దుఃశంస[6] ఈశత ॥ 44

(10) విశ్వాన్ దేవాన్ హవామహే మరుతః సోమపీతయే । ఉగ్రా హి పృశ్నిమాతరః ॥ 45

* 23, 24. అగ్నిః. (పా) 1. సోమాసః 2. సుతాః. 3. హవంతః. 4. మహః ఇంద్ర. 5. నవః 6. శంసః (వ్రా.ప్ర.)

(11) జయతామివ తన్యతుర్మరుతామేతి ధృష్ణుయా । యచ్ఛుభం యాథనా నరః ॥ 46

(12) హస్కారాద్ విద్యుతస్పర్యతో[7] జాతా[8] అవంతు నః । మరుతో మృళయంతు నః ॥ 47

(13) ఆ పూషంచిత్రబర్హిషమాఘృణే ధరుణం దివః । అజా నష్టం యథా పశుమ్ ॥ 48

(14) పూషా రాజానమాఘృణిరపగూళ్హం గుహా హితమ్ । అవిందచ్చిత్రబర్హిషమ్ ॥ 49

(15) ఉతో స మహ్యమిందుభిః షడ్ యుక్తాగ్ం[9] అనుసేషిధత్ । గోభిర్యవం న చర్కృషత్ ॥ 50

(16) అంబయో యంత్యధ్వభిర్జామయో[10] అధ్వరీయతామ్ । పృంచతీర్మధునాపయః ॥ 51

(17) అమూర్యా[11] ఉప సూర్యే యాభిర్వా సూర్యః సహ । తా నో హిన్వంత్వధ్వరమ్ ॥ 52

(18) అపో దేవీరుప హ్వయే యత్ర గావః పిబంతి నః । సింధుభ్యః కర్త్వం హవిః ॥ 53

(19) అప్స్వంతం[12]రమృతమప్సు భేషజమపాముత ప్రశస్తయే । దేవా భవత వాజినః ॥ 54

(20) అప్సు మే సోమో[13] అబ్రవీదంతర్విశ్వాని భేషజా । అగ్నించ విశ్వశంభువమాపశ్చ విశ్వభేషజీః ॥ 55

(21) ఆపః పృణీత భేషజం వరూథం తన్వే౩ మమ । జ్యోక్ చ సూర్యం దృశే ॥ 56

(22) ఇదమాపః ప్ర వహత యత్ కించ దురితం మయి । యద్ వాహ మభిదుద్రోహ యద్ వా శేప[14] ఉతానృతమ్॥ 57

(23) ఆపో[15]అద్యాన్వచారిషం రసేన సమగస్మహి । పయస్వానగ్న[16] ఆ గహి తం మా సం సృజ వర్చసా ॥ 58

(24) సం మాగ్నే వర్చసా సృజ సం ప్రజయా సమాయుషా ।

విద్యుర్మే[17] అస్య దేవా[18] ఇంద్రో విద్యాత్ సహ[19] ఋషిభిః ॥ 59

7. స్పర్యతో (పా.) 8. జాతాఽ అవంతు (బ్రా.ప్ర.) 9. గ్ంఽ 10. మయోఽ 11. అమూర్యాఽ 12. అప్స్వంతరిత 13. సోమోఽ 14. శేపఽ 15. ఆపోఽఅద్యా 16. నగ్నఽ 17. విద్యుర్మేఽఅస్య 18. దేవాఽ 19. సహఽఋషిభిః (బ్రా.ప్ర.)

## సూక్తము—23

ఋషి—కణ్వపుత్రుఁడగు మేధాతిథి.

దేవత-వాయుదేవత, 2,3 ఇంద్రవాయువులు 4,6 మిత్రావరుణులు.

7-9,మరుద్గణవిశిష్టుఁడగు నింద్రుఁడు 10-12 విశ్వేదేవుఁడు, 13-15 పౌష్ణుఁడు,

16-22 ఉదక దేవత 23,24-అగ్ని

(1) ఉ॥ చక్కని సోమవల్లికలఁ జాల మథించి రసంబుఁదీసి పె
నమ్మక్కువ పేర్మిచే నునిచినార ముదీచిని వేదిమీఁద నా
చక్కని నీదు దృష్టులఁబసారముఁ జేయుచు వాయుదేవ! సోం
పెక్కఁగఁద్రావుచో బలమహీనముగా గడియింతు వెంతయున్॥ 26

(2,3,4,5,6) సీ॥ వేయికన్నులతోడ వెలయుచుండెడివారి మానసవేగులై మసలువారి
నమరలోకమువారి యజ్ఞేశులగువారి వాయ్వింద్రులనఁబేరఁబరఁగువారిఁ
బలుకువినంగనే ప్రత్యక్షమగువారి సత్యవాక్యములతో జరుగువారిఁ
గర్మఫలంబులుగలిగించువారి నహీనతేజస్సుననిచ్చువారి

గీ॥ వరుణ మిత్రులఁ పేరులఁబరఁగువారిఁ, బిలుచుచున్నాము తన్మది పిచ్చలింప
[1]నేచిమమ్ముల వారలుఁబ్రోచి యధిక, [2]విత్తమొసఁగుత సత్కృపాయత్తులగుచు॥ 27

(7) క॥ కామముదీరఁగ సోమము, నామోదముతోడఁద్రావ నమరపతీ! నీ
వామారుతముంగొనుచున్, వే మా[3]వేదికనుజేర విచ్చేయవాకో!॥ 28

(8) గీ॥ మీకు ముఖ్యుఁడు శక్రుండు మీకుఁబూష, యెంతయుంగూర్చువారలు సంతసమును
భక్తితత్పరతంజేయు ప్రార్థనంబు, లాలకింపుఁడు దాని నత్యతిశయమున॥ 29

(9) క॥ బలవంతులైన మీరలు, బలభేదికి సాయపడుచు బహురీతులుగాఁ
జలమూని యజ్ఞహంతలఁ, దొలఁగింపుచు మాకు బాధఁదొలగింపుండీ!॥ 30

(10,11) చ॥ వసుమతి పుత్రులున్ మరియు వైరులఁగెల్చెడివారు మీర లీ
యసదృశయాగ కర్మలకు హవ్యములంగొనవచ్చు వేళలన్
వెస జయమందు యోధు లతివీరరవంబులు పల్కునట్టుగా
విసువక యజ్ఞకర్తలకు వేడుక పుట్టెడు మాటలాడుఁడీ! ॥ 31

(12) క॥ వెలిఁగెడు వారై యితరుల, వెలిగించెడు వారు గగనవీథులలోనన్
లలిఁబుట్టినట్టివారలు, పొలుపార సుఖంబు మాకుఁ బొందింపుండీ!॥ 32

1. నేచిమమ్ములనెంతయు, 2. విత్తమొసఁగుతమేల్గృపాయత్తులగుచు, 3. మా వేదికను నరుఁగవేకడుఁ బ్రీతిన్. (తా. పా.)

(13) ఉ॥ తప్పియరణ్య భూములను దాటిన సత్పథరాజ మెంతయే
†న్దప్పక యాగ కర్మలను ధన్యులు తెప్పెడురీతిఁ బూషుఁడా!
యొప్పుగదర్పుఁజేఁగొనుచు నొయ్యదివంబున నుండి నీవు మా
ర్చెప్పక సోమ వేల్లికలఁ జెప్పెరఁదెమ్ము విశాలకాంతితోన్॥ 33

(14) గీ॥ కొండగుహవలె మరుగున నుండునాక, వీథిలో నెచ్చటనొ దాఁగివెలయుచున్న
సోమలతలను గుళలను శోభగాంచు, పూషక*నుగొని యుంటఁదాబూజ్యుఁడయ్యె॥ 34

(15) చ॥ తలఁకొని సేద్యగాఁడు తనధర్మముఁ దప్పక వడ్లుఁజల్ల కా
‡వలసిన భూమిదున్ని కడు వర్థిలు నట్టులు కాంతియుక్తుఁడై
మెలఁగెడు పూషయిష్టులకు మేలగు సోమలతా ప్రపంచముం
గలిగెడు ⸸షడ్ఋతూత్తములఁ గల్పనఁ జేయుచునుండెఁ జూడుఁడీ॥ 35

(16,17,18,19) సీ॥ బంధువుఁ దమకైన బంధువులకు మేలుచేయునట్టులు మేలునేయునవియు
నాలకెల్లన్ మంచి పాలుండునట్టులు పాయక తమిదయఁ జేయునవియు
నిఖిల యాగంబుల నెఱవేర్పు మాకెల్ల మాతృభూతంబులై మసలునవియు
నాదిత్య జన్మలై యజ్ఞంబుఁజేయించి సంతసంబును మాకుఁజలుపునవియు
గీ॥ నమృతముంగల్గునవియును నాకలికగు, నన్నముంజేయు నవియును నౌషధంపు
శక్తిఁగలవియునైన నాజలధినిష్ట, దేవతా రూపములు మమ్ముఁగావుఁగాక॥ 36

(20) గీ॥ zవిశ్వశంభువు నానగ్ని వివిధరూప, భేషజౌషధు లెంతే నశేషముగను
నీటిలోఁబుట్టెనని నాకు నిష్టతోడ, సోముఁడెంతయుఁ జెప్పెడు సూక్తివలన॥ 37

(21) క॥ దేవతలారా! మీరలు, కావలసిన మందులన్నిఁ గలిగించి మమున్
గావుఁడు దీర్ఘాయుష్యం, బేవిధముననైన నొసఁగుఁడెంతయుఁ బ్రీతిన్॥ 38

† ఈ ఋక్కునందుపమాలంకారము-పశుపాలకులనేక కర్మలచే పశువులను పోషించి దుగ్ధాదులచే మనుష్యాదులను సుఖపెట్టుచుండునటుల నా సూర్యలోకము విచిత్రలోకములతోఁగూడికొనియున్నది. ఆకాశమును, అచ్చటఁగల పదార్థములను స్వకిరణములచే నాకర్షణ రూపమునఁ బోషించి సర్వ ప్రాణుల సుఖపెట్టుచున్నవి.—దయానందుఁడు (నే.వేం.న.శా.) * పూషకనుగొంటరీతిచేఁ బూజ్యుఁడయ్యె - (తా.పా.)

‡ వడ్లుచల్లుట కనువగు భూములను దున్నుట మొదలగు వ్యవసాయ పద్ధతులానాటి వారికి బాగుగఁ దెలియుననుట కిట్టివి వేదములందుండుటచే సస్యకాల విజ్ఞానము హైందవులవల్లనే మిగిలినజాతివారలలవరించుకొనినట్లు డాక్టరు రాయల్ (Dr. Royal) గారు తలంచుచున్నారు. (నే.వేం.న.శా.)

⸸ షడ్ఋతూత్తముల అనునప్పుడు ''షడృతు'' గావున షకారము లఘువేయగును. కాని యిక్కడ విశిష్టముగా గురువుగా ప్రయుక్తమైనది. చూ. పీఠిక, వ.గో.కృ.

సూచన—అలంకారము లఁగూర్చియు పశుపాలకత్వాదివిషయములఁగూర్చియు వ్యవసాయాదులఁగూర్చియు దయానంద సరస్వతి, డా॥ రాయల్ ప్రభృతులు వెలువరించినభావము లు వేద విజ్ఞానము దృష్ట్యా ప్రామాణికములు కానేరవు. ఇట్టివి చాలా స్వల్పవిషయములు. వ.గో.కృ.

z. సర్వపదార్థములు స్వగుణములచేతను ప్రకాశింపఁజేసికొనునట్టు లోషధిగణపుష్టికారకుఁడగు చంద్రమస్సు ఓషధిగుణగణ గ్రాహ్యములను ప్రకాశింపఁజేయుచు సర్వోషధిహేతువులగునప్పటి స్వాంతర్గతము సకల కళ్యాణ హేతువునగు స్ననయిత్నువును ప్రకటింపఁజేయుచున్నది.

— దయానంద సరస్వతి (నే.వేం.న.శా.)

(22) చ॥ చరితములెన్నిం జేసిన దోషములేమి యొనర్చియుండినన్
చరితము బుద్ధిచే నైన ద్రోహ మబుద్ధిగనైనఁ జేసినన్
నరమనృతంబులాడినను గర్వము సంబరనిందఁ జేసినన్
వరగున వానినన్నిటిని సాగఁగఁ జేయుఁడు నీవి దేవతల్॥ 39

(23) గీ॥ వారి ఘోరములో మేము వర్తిలంగ. నవభృథస్నాన మొనరించి యలరినాము
జలనివాసుఁడ! యోయగ్ని: చలముడిడి. మాకు వర్చస్సులను నీయుమా! మునాస॥ 40

(24) క॥ ‡జనఁగుము దీర్ఘాయుష్యం. బొసఁగుము సంతానకలన నొసఁగుము బలమున్
వినవ్యక కర్మల నన్నిటి. వెనదేవగణంబెఱుంగ వేదస్తుత్యా!॥ 41

## అనువాకః—6 సూక్తమ్—24

ఋషిః—ఆజీగర్తిః శునఃశేపః సకృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః*

దేవతా—†కః (ప్రజాపతిః). 2 అగ్నిః. 3-5 సవితా. 5 భగోవా, 6-15 వరుణః.

ఛందః—1.2.6-15 త్రిష్టుప్. 3-5 గాయత్రీ

(1) కస్య నూనం కతమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ।

కో నో మహ్యా[1] అదితయే పునర్దాత్ పితరం చ దృశేయం మాతరం చ॥ 60

† నన్నిటినిఁ బెంచుఁడు మీరలు (తా.పా. యతిభంగము) వ.గో.కృ.

‡ ఈ వేద సంహితయందుఁ జెప్పబడ్డ ప్రార్థనలన్నియుఁ గామ్యములుగానే కన్పట్టుచున్నవి. యజ్ఞయాగాది కర్మలన్నియుఁ గామ్య కర్మలుగ వెలసినట్లు తెల్పును. భాగవత పురాణమందును "ఓ యీశ్వరా: నాకది కావలయును ఇది కావలయును" అని ప్రార్థించునపుడుండు భక్తి నిర్హేతుకమగును. ఇట్టివానివలన పూర్ణమగు చిత్తశుద్ధి రానేరదు. చిత్తము పూర్ణముగా శుద్ధి కానిచో మోక్షప్రాప్తికాటంకము కలుగక మానదు. (సే. వేం. న. శా.)

సూచన—కారణ కార్య పూర్వకమైనది సృష్టి. కారణకార్యములులేనిదే అసలు సృష్టియేలేదు. కారణ కార్యములున్నప్పుడేదో యొక కామ్య ముండక తప్పదు. చివరికి మోక్షగామిత్వమును గామ్యమే యగును. నిష్కామియై "జరుగనున్నది జరుగక మాన" దనుకొనుటయో "ఏమి జరిగిన మనకేమి? జరుగవలసినది జరుగనిమ్ము" అనునది పైకి నిర్లిప్తతను వెలిబిచ్చను ప్రయత్నరహితము నిష్ప్రయోజకమునగు తాత్కాలిక వ్యవస్థా స్థితిపై నాధారపడుట యొకవిధముగ నసమర్థతయు వేరొకవిధముగ విశిష్టమైన కామ్యమునయితీరును. కారణకామ్యములేనిదే సృష్టిలేదని తాత్పర్యము. వ.గో.కృ.

* సకృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః అని పాఠాంతరముగా మాక్సుముల్లర్ ప్రతిలోనున్నది. కానికొన్ని గ్రంథములలో 24వ సూక్తము మొదలు 30వ సూక్తమువఱకు నిందున్నట్లే యున్నది. ఒక విధముగా నాలోచించినచోఁ గృత్రిమముగా (నియోగమువలన) విశ్వామిత్రునివల్ల దేవరాతుఁడుగా నజీగర్తి భార్యకు జనించిన వానిని ఆజీగర్తియగు (అజీగర్తునిపుత్రుఁడగు) శునశ్శేపుఁడుగాఁ బ్రాచీనులు కొందరు భావించినట్లు కన్పట్టును. శునశ్శేప శబ్దము శునశ్శేఫ శబ్దముగా నైతము మహా ప్రాణయుక్తముగా నుపయోగింపఁబడినది. వ.గో.కృ.

† (ప్రజాపతిః) అన్నపాఠము కొన్ని ప్రతులలో లేదు. 1. కోనోమహ్యాః. (ప్రా.ప్ర.)

(2) అగ్నేర్వయం ప్రథమస్యామృతానాం మనామహే చారు దేవస్య నామ ।

స నో మహ్యా[2] అదితయే పునర్దాత్ పితరం చ దృశేయం మాతరం చ ॥ 1

(3) అభి త్వా దేవ సవితరీశానం వార్యాణామ్ । సదావన్ భాగమీమహే ॥ 62

(4) యశ్చిద్ధి త ఇత్థా భగః శశమానః పురా నిదః । అద్వేషో హస్తయోర్దధే ॥ 63

(5) భగభక్తస్య తే వయముదశేమ తవావసా । మూర్ధానం రాయ[3] ఆరభే ॥ 64

(6) నహి తే క్షత్రం న సహో [4]న మన్యుం వయశ్చనామీ పతయంత[5] ఆపుః ।

నేమా[6] ఆపో అనిమిషం చరంతీర్న యే వాతస్య ప్రమినంత్యభ్వమ్ ॥ 65

(7) అబుధ్నే రాజా వరుణో వనస్యోర్ధ్వం స్తూపం దదతే పూతదక్షః ।

నీచీనాః స్థురుపరి బుధ్న[7] ఏషామస్మే[8] అంతర్నిహితాః కేతవః స్యుః ॥ 66

(8) ఉరుం హి రాజా వరుణశ్చకార సూర్యాయ పంథామన్వేతవా[9]ఉ ।

అపదే పాదా ప్రతిధాతవేఽకరుపవక్తా హృదయావిధశ్చిత్ ॥ 67

(9) శతం తే రాజన్ భిషజః సహస్రముర్వీ గభీరా సుమతిష్టే[10] అస్తు ।

బాధస్వ దూరే నిరృతిం పరాచైః కృతం చిదేనః ప్ర ముముగ్ధ్యస్మత్ ॥ 68

(10) అమీ య[11] ఋక్షా నిహితాస[12] ఉచ్చా నక్తం దదృశ్రే కుహ [13]చిద్ దివేయుః ।

అదబ్ధాని వరుణస్య వ్రతాని విచాకశచ్చంద్రమా నక్తమేతి ॥ 69

---

2. మహ్యాఽ అదితయే 3. రాయఽ. 4. సహమన్యుం, 5. యంతఽ, 6. నేమాఽఆపోఽ. 7. బుధ్నఽ 8. అస్మేఽ, 9. తవాఽఉ 10. సుమతిష్టేఽ అస్తు, 11. అమీయఽ. 12. నిహితాసఽఉచ్చా. 13. చిద్. (ప్రా.ప్ర.)

(11) తత్ త్వా యామి బ్రహ్మణా వందమానస్ తదా శాస్తే యజమానో [14]హవిర్భిః ।

అహేళమానో వరుణేహ బోధ్యురుశంస మా న[15] ఆయుః ప్ర మోషీః ॥ 70

(12) తదిన్నక్తం తద్ దివా మహ్యమాహుస్ తదయం కేతో హృద[16] ఆ వి చష్టే ।

శునఃశేపో యమహ్వద్ గృభీతః సో[17] అస్మాన్ రాజా వరుణో ముమోక్తు ॥ 71

(13) శునఃశేపో హ్యహ్వద్ గృభీతస్ త్రిష్వాదిత్యం ద్రుపదేషు బద్ధః ।

అవైనం రాజా వరుణః ససృజ్యాత్ విద్వాగ్ం[18] అదబ్ధో వి ముమోక్తు పాశాన్ ॥ 72

(14) అవ తే [19]హేళో వరుణ నమోభిరవ యజ్ఞేభిరీమహే [20]హవిర్భిః ।

క్షయన్నస్మభ్యమసుర ప్రచేతా రాజన్నేనాంసి శిశ్రథః కృతాని ॥ 73

(15) ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం వి మధ్యమం శ్రథాయ ।

అథా వయమాదిత్య వ్రతే తవానాగసో[21] అదితయే స్యామ ॥ 74

## అనువాకము—6, సూక్తము—24

### ఋషి—అజీగర్తపురుషుఁడు శునశ్శేపుఁడు *

### దేవత-1 ప్రజాపతి†, 2-అగ్ని, 3-5 సవిత, 6-15 వరుణుఁడు

(1) క॥ దేవతలలోన నెవ్వని, గావుమనుచు వేడుకొందుగాక యెవండీ
చావున్ బాపును? పితరుల, నేవిధిఁగనుగొందుననుచు నేడ్చెను భీతిన్॥ 42

14. హవిర్భిః (పా) 15. నమానఽఆయుః. 16. హృద్యఽఅవిచష్టే 17. సోఽ. 18. గ్ంఽ. 19. హేళోవరుణ (వ్రా.ప్ర.)
20. హవిర్భిః (పా) 21. నాగసోఽ (వ్రా.ప్ర.)

* ఈ ఋషిగురించి సంస్కృతమూలము 24వ సూక్తము క్రింద వ్రాసిన ఫుట్‌నోట్ చదువుకొననగును. వ.గో.కృ.

† సంస్కృతములో "కః (ప్రజాపతిః)" అని పాఠాంతరము కలదు. వ.గో.కృ.

(2,3,4,5) సీ॥ చిత్రభానుఁడ! నన్ను జీవింపఁజేయుచోఁ దల్లిదండ్రుల్గాఁడఁబరలవాఁడ!
కోరినకోరికల్ గూర్చువాఁడా! సూర్య! ప్రాణంబులిచ్చిన బ్రతుకువాఁడ!
పూజ్యప్రభాకర! పొలుపొందువిత్తము నిఖిల మిచ్చిన నేను నిలుచువాఁడ!
బ్రతికింపఁజేసిన భాస్కర! ధనమంది యోపిసుఖంబుల నొందువాఁడ!
గీ॥ నని ఋనశ్శేపుఁడెంతయు నధికభీతి, యూపమునఁగట్టఁబడి పరితాపమొంది
దేవతలనెల్ల వేఁడుచు దీనుఁడగుచు, బ్రహ్మమొదలగు వారలఁ బ్రస్తుతించె॥ 43

(6,7) సీ॥ గగనమందుఁజరించు ఘనపక్షిజాతినీ పోఁడిమి, బలమును బొందలేదు
నీవు కోపించిన నిస్సారమగుడేగ తత్తరపాటునఁదాళలేదు
సత్వరంబుగఁబోవు సలిల ప్రవాహంబు నీలావుముందఱ నిలువలేదు
వేగవంతములలో వేగవంతంబైన గాలిని న్గదిలింపఁజాలలేదు
గీ॥ గగనమందుండు నీదగు ఘనగభస్తి, జాలము లధోముఖంబుగాఁజరుగుచుంటఁ
ప్రాణభయమును బాయుచుబ్రతుకఁగలను, కాంతిమద్వరుణుఁడా! నన్నుఁగావుమయ్య॥ 44

(8) చ॥ రవిరథవాజి. పోవుటకు రమ్య తరంబుగఁద్రోవఁజేసి యా
రవికిరణాళివెల్గుటకు రాజిత భూమిని నంతరిక్షముం
గవియుచుఁజక్కఁబెట్టుచును గాంతులతో వరుణుండ! నీవు నా
వివరములెల్లఁజూచుటకు వేగము రావలదే ప్రియంబుగన్॥ 45

రేక

గీ॥ హంసదేవున కెలమి రెండయనములను, వరలునట్టులు సేసిన వరుణదేవుఁ
దరిగణంబుల భేదించి యఖిలమైన, సౌఖ్యసంపదనిచ్చుచు జరుగుఁగాక॥ 46

(9) ఉ॥ నీకడ మంచులన్నియును నిల్చె ననుగ్రహ బుద్ధియెక్కువై
ప్రాకుచు సన్నివై పులకుఁబల్మరు పోవుగభీరవృత్తితో
భీకర పాపదేవతలబిట్టు కదల్చియదల్చుచుండి య
స్తోకములైన పాపముల స్రుక్కఁగఁజేయు[1]దుగాక వైద్యుఁడా!॥ 47

(10) చ॥ అగణిత శౌర్యధైర్యవిభవాన్విత! యోవరుణప్రభూత్తమా!
†గగనమునందు ఋక్షములు గన్పడుచుండుట రాత్రులందు నీ
జగములవెల్గఁజేయునల చంద్రుఁడు వెల్గుట నీదుకర్మలే
ద్విగుణిత కాంతితో వెలుఁగు దివ్యభవత్ప్రవనెన్నశక్యమే॥ 48

1. జేయుము వైద్యపుంగవా! (తొ,పా,)

† నక్షత్రలోకముల నెవరు రచించిరి? ఎవరిచేత ధరింపఁబడుచున్నవి? ఇవ్వి రాత్రి యగపడును. పగలు కనఁబడవు. ఇవి యెక్కడికేగును? (ఈ ప్రశ్నలకు సమాధానమిది) నక్షత్రములకు స్వతః ప్రకాశము లేదు. ఇవి సూర్య ప్రకాశముచే వెలుంగును, ఇవి యెచ్చటకుఁబోవు, దివ సమందాధ్రియమాణములై యుండి రాత్రి సూర్యకిరణ ప్రకాశమానములయి చూడఁబడును, ఇట్టికర్మలన్నియు నీశ్వరునివే అని భావము.
దయానందుఁడు, (నే, వేం. న, శా.)

సూచన—నక్షత్రములఁ గూర్చిన దయానందాదుల భావము సరికాదు, అసలు నక్షత్రతారా విభజనమే వేదవిరుద్ధము—స్త్రీ పురుష నక్షత్రముల గురించి వర్ణించినది వేదమే. సర్వకాల సర్వావవస్థలయందును నసలు సూర్యుని వెలుగు తగులక యెల్లప్పుడును జీకటిగానుండు గోళములున్నట్లు వేదమే వక్కాణించినది. వ. గో. కృ.

(11) ఉ॥ యాగముఁజేయువాఁడు కడునాయువు గోరిన రీతినాయువున్
వేగమె పొందఁగల్గి నిను వేయివిధంబుల వేడుచుంటి నో
భోగపరాయణా! వరుణ! పూర్ణములైన మదీయ సంస్తుతిన్
రాగమెలర్పగా వినుచు రంజిలి యాయువు నాకొసంగుమా॥ 49

(12) చ॥ వరుణుని రాత్రులుంబవలు[2]వర్ధిలఁజేసిన వారలాయువుం
బరమధికంబుగాంతురని [3]పల్మరుఁదెల్పుచు నాదుచిత్తమా
వరుణునె వేడుకొమ్మని నిబంధనచేసెడు పేర్మిఁగాన, నో
వరుణుఁడ! నాదుమొఱ్ఱవిని బంధవిముక్తుని జేయవే ననున్ 50

(13) గీ॥ కఠినముగ మూఁడు తావులఁగట్టఁబడిన, నాశునశ్శేపుఁడెంతయు ననఘుఁడైన
వరుణదేవునిఁగొనియాడి వర్ధిలంగఁ, బాశబంధవిముక్తిని బడయుఁగాక॥ 51

(14) చ॥ సతులొనరించి యజ్ఞముల నవ్యహవిస్సులనందఁజేసి నీ
యతులిత కోపమంతయును నాపి భవద్దయనొందినారమో!
మతియుతరాజ! ప్రాజ్ఞతను మాకృత యజ్ఞపుఁ గీడులన్నియుం
జతురత మీరఁగొట్టి బెలుచన్ మము నుద్ధరణంబుసేయుమా॥ 52

(15) గీ॥ మీఁద మధ్యను గ్రింద నిరాదరమునఁ, గట్టఁబడినట్టి త్రాళలఁగత్తిరించి
నిరపరాధుల మముఁబ్రోవ నిన్నుఁగూర్చి, సాంగయజ్ఞములంగడు వంగఁగలము॥ 53

## సూక్తమ్—25

ఋషిః—ఆజీగర్తిః శునశ్శేపః సకృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః

దేవతా వరుణః

ఛందః—గాయత్రీ

(1) యచ్చిద్ధి తే విశో యథా ప్ర దేవ వరుణ వ్రతమ్ । మినీమసి ద్యవిద్యవి ॥ 75

(2) మా నో వధాయ హత్నవే జిహీ[1]ళానస్య రీరధః । మా హృణానస్య మన్యవే ॥ 76

(3) వి మృళీకాయ తే మనో రథీరశ్వం న సందితమ్ । గీర్భిర్వరుణ సీమహి ॥ 77

(4) పరా హి మే విమన్యవః పతన్తి వస్య[2]ఇష్టయే । వయో న వసతీరుప ॥ 78

2. వర్ణన (తా.పా.) 3. మాటికి (తా.పా.)
1. జిహేళా. 2. వస్యఃఇష్టయే. (ప్రా.ప్ర.)

(5) కదా క్షత్రశ్రియం నరమా వరుణం కరామహే । మృళీకాయోరుచక్షసమ్ ॥ 79

(6) తదిత్ సమానమాశాతే వేనంతా న ప్ర యుచ్ఛతః । ధృతవ్రతాయ దాశుషే ॥ 80

(7) వేదా యో వీనాం పదమంతరిక్షేణ పతతామ్ । వేద నావః సముద్రియః ॥ 81

(8) వేద మాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః । వేదా య[3] ఉపజాయతే ॥ 82

(9) వేద వాతస్య వర్తనిమురోర్ఋష్వస్య బృహతః । వేదా యే[4] అధ్యాసతే ॥ 83.

(10) ని షసాద ధృతవ్రతో వరుణః పస్త్యా3స్వా । సామ్రాజ్యాయ సుక్రతుః ॥ 84

(11) అతో విశ్వాన్యద్భుతా చికిత్వాగ్ం[5] అభి పశ్యతి । కృతాని యా చ కర్త్వా ॥ 85

(12) స నో విశ్వాహా సుక్రతురాదిత్యః సుపథా కరత్ । ప్ర ణ[6]ఆయూంషి తారిషత్ ॥ 86

(13) బిభ్రద్ ద్రాపిం హిరణ్యయం వరుణో వస్త నిర్ణిజమ్ । పరి స్పశో ని షేదిరే ॥ 87

(14) న యం దిప్సంతి దిప్సవో న ద్రుహ్వాణో జనానామ్ । న దేవమభిమాతయః ॥ 88

(15) ఉత యో మానుషేష్వా యశశ్చక్రే[7] అసామ్యా । అస్మాకముదరేష్వా ॥ 89

(16) పరా మే యంతి ధీతయో గావో న గవ్యూతీరను । ఇచ్ఛంతీరురుచక్షసమ్ ॥ 90

(17) సం ను వోచావహై పునర్యతో మే మధ్వాభృతమ్ । హోతేవ క్షదసే ప్రియమ్ ॥ 91

(18) దర్శం ను విశ్వదర్శతం దర్శం రథమధి క్షమి । ఏతా జుషత మే గిరః ॥ 92

(19) ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృళయ । త్వామవస్యురా చకే ॥ 93

3. వేదాయ ఽ ఉపజాయతే 4. వేదాయేఽ అధ్యా॰ 5. గ్ంఽ. 6. ప్రణఽ 7. చక్రేఽఅసామ్యా॰ (బ్రా.ప్ర.)

(20) త్వం విశ్వస్య మేధిర దివశ్చ గ్మశ్చ రాజసి । స యామని ప్రతి శ్రుధి ॥ 94

(21) ఉదుత్తమం ముముగ్ధి నో వి పాశం మధ్యమం చృత । అవాధమాని జీవసే ॥ 95

## సూక్తము—25

### ఋషి—శునశ్శేపుఁడు

### దేవత—వరుణుఁడు

(1,2,3,4,5) సీ॥ మానిన కర్మకై మన్నించి మాచేత వ్రతములు సేయించు వరుణదేవ!
దోషజ్ఞుఁడవుకాన దొసఁగులు సవరించి వధపాలుసేయకు వరుణదేవ!
హయముల రథి చాల నాదరించెడునట్లు కరుణించు మమ్ముల వరుణదేవ!
పక్షులు గూళుల పజ్జఁబాెెడు భంగి వదలకుండుమునిన్ను వరుణదేవ!

గీ॥ బలము గలిగినవాఁడవు వరుణదేవ!, మా[1]కు వరములు నీయ సమర్థుఁడీవ
కనుక మా యాగకర్మల కడకురమ్ము, శుభనుతుల నెల్లవినిమాకు సౌమ్మనిమ్ము॥ 54

(6) గీ॥ పుణ్య యాగంబు లెందెల్ల పుణ్యపురుష, దత్తహ[2]వ్యము ఘనులు మిత్రావరుణులు
హవ్యభాగములందుచు నడ్డులిడక, మెలఁగుచుందురుగాక సన్మిత్రులగుచు॥ 55

(7) క॥ జలములలో నివసించియు, జలములఁజరియించునోడ జాడలదివిపై
వెలసెడు పక్షిపదంబులఁ, దెలసిన వరుణుండ! మాకు[3]దిష్టమొసఁగుమా!॥ 56

(8) గీ॥ మానవులఁగ్గలుచైత్రాది మాసములను, నబ్దమధ్యను జనియించునధికమాస
కలన నెఱిఁగినవాఁడతికర్మధారి, యైన వరుణుండు బంధంబులడఁచుఁగాక॥ 57

(9,10,11,12) సీ॥ కరువలి మార్గంబు గగనాధివాసుల నెఱిఁగియుంటివిగదా వరుణ దేవ!
మర్త్యుల మేలుకై మంచిమార్గము సేయ నెఱిఁగియుంటివిగదా వరుణ దేవ!
సామ్రాజ్యసిద్ధికై సదమలాత్మను జేర నెఱిఁగియుంటివిగదా వరుణ దేవ!
యఖిల జనుల్ సేయు యజ్ఞాది [4]కర్మల నెఱఁగియుంటివిగదా వరుణ దేవ!

గీ॥ తావకాద్భుతచర్య ధర్మమెరుఁగఁ, బండితుడు గోరుచున్నాఁడు ప్రాజ్ఞ! నాదు
బంధములద్రుంచి సన్మార్గపరునిజేసి, యాయు వభివృద్ధిఁ బొందింపు మదితిపుత్ర! ॥ 58

1. మాకు వరములనీ సమర్థుఁడవు నీవ (తొ.పా. యతిభంగము) వ.గో.కృ. 2. హవ్యఁములన్ (తొ.పా. గణభంగము) వ.గో.కృ.
3. ఉద్దిష్టశబ్ద రూపాంతరము. వ.గో.కృ. 4. క్రతువుల (తొ.పా.)

(13) క॥ బలసిన దేహంబంతట, విలసిత కవచంబుఁదొడఁగి విపులజ్యోతిః
లలితముగఁ బర్వఁజేయుచుఁ, జెలిమింగొనివచ్చి నన్నుఁజేరఁగవలదే॥ 59

(14) గీ॥ చంపనుంకించి వచ్చిన శత్రువితతి, నెవనిఁజూడంగ వెరచునో యేపుఁదక్కి-
ద్రోహులెవనికిఁగీడులు దొడరిచేయ, వెఱతురో వాఁడు మము గాంతి పఱచుఁగాక॥ 60

(15,16) చ॥ మనుజులకెల్ల[2] నన్నము సమానముగాఁగొనియిచ్చు వాని నే
ననయము పొందుచుండెదను నావులుమందలపట్టుచేరుచూ
ట్కి-ని, ఘనమైన యన్నము కడిందిగఁగల్పనఁజేసి యాతఁడే
పనిపడి తెచ్చియిచ్చుత నపార కృపామతి మాకునెప్పుడున్॥ 61

(17) క॥ బలితాంజస్సవనంబునఁ, జెలఁగెడు మధుహవ్యమంతఁజేఁగొనినాకుం
గలబంధము తొలఁగించిన, నలఘు వినోదమున మాటలాడఁగ వచ్చున్॥ 62

(18,19,20,21) సీ॥ విశ్వసందర్శకు వీక్షించితినిగదా, రక్షింపవచ్చిన రాజుగాన
తద్రథంబును నేను దర్శించితినిగదా యుర్విపై మెఱయుచునుండెఁగాన
నేఁజేయునుతివాఁడు నిత్యమెరుఁగునగదా భక్తరక్షకుఁడని పరఁగెఁగాన
కరుణించి సుఖములంగలుఁగజేయును గదా ప్రభువయిమమ్ముఁగాపాడుఁగాన

గీ॥ విశ్వమంతట దానయై వెలుఁగుచుండి, తిరుగుచుండును గావున[3]వరుణుఁడిపుడు
తనదు రక్షాప్రతిజ్ఞను దలఁచి తలఁచి,[4] మూఁడు పాశములన్ ద్రుంచి ముక్తినిడుత॥ 63

## సూక్తమ్—26

### ఋషిః—ఆజీగర్తిః శునఃశేపః సకృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః

### దేవతా—అగ్నిః

### ఛందః—గాయత్రీ

(1) వసిష్వా హి మియేధ్య వస్త్రాణ్యూర్జాం పతే । సేమం నో[1] అధ్వరం యజ ॥ 96

(2) ని నో హోతా వరేణ్యః సదా యవిష్ఠ మన్మభిః । అగ్నే దివిత్మతా వచః ॥ 97

(3) ఆ హి ష్మా సూనవే పితాపిర్యజత్యాపయే । సఖా సఖ్యే వరేణ్యః ॥ 98

2. కెల్లవేళల సమంచితభక్తమునిచ్చు 3. తిరముగలుగ మాదురక్షా ప్రతిజ్ఞను మరువకుండ 4. మూఁడు పాశములంద్రుంచి ముక్తినిడుత (తా.పా.)
"ముఁడుపాశమున్" అని సవరించిన వ్రాతప్రతి పాఠము గణవచనదోషయుక్తము, వ.గో.కృ.

1. సేమంనోऽ. (వ్రా.ప్ర.)

(4) ఆ నో బర్హీ రిశాదసో వరుణో మిత్రో[2] అర్యమా । సీదంతు మనుషో యథా ॥ 99

(5) పూర్వ్య హోతరస్య నో మందస్వ సఖ్యస్య చ । ఇమా[3] ఉ షు శ్రుధీ గిరః ॥ 100

(6) యచ్చిద్ధి శశ్వతా తనా దేవందేవం[4] యజామహే । త్వే[5] ఇద్ధూయతే హవిః ॥ 101

(7) ప్రియో నో[6] అస్తు విశ్పతిర్హోతా మంద్రో వరేణ్యః । ప్రియాః స్వగ్నయో[7]వయమ్ ॥ 102

(8) స్వగ్నయో హి వార్యం దేవాసో దధిరే చ నః । స్వగ్నయో మనామహే ॥ 103

(9) అథా[8] న ఉభయేషామమృత మర్త్యానామ్ । మిథః సంతు ప్రశస్తయః ॥ 104

(10) విశ్వేభిరగ్నే[9] అగ్నిభిరిమం యజ్ఞమిదం వచః । చనో ధాః సహసో యహో ॥ 105

## సూక్తము—26

### ఋషి—శునశ్శేపుఁడు

### దేవత—అగ్ని

(1) క॥ యాగా[1]ధ్యక్షుఁడవై నీ, వేగినవర్తించుచున్న నిష్టులు పెలుచన్
సాగుచు సఫలములై కడు, యాగార్హా ! కల్గుఁగఁజేయు యజ్ఞములుతగన్॥ 64

(2) గీ॥ నిత్యయౌవన! యనలుఁడా! నిత్యశోభ, గల్గుమంటలతోఁగూడి వెల్గుచుండి
యజ్ఞములకెల్ల హోతవై యఖిలకర్మ, సఫలముగఁజేసిపొందుము సరసనుతుల॥ 65

(3) క॥ జనకుఁడవు నాత్మజుండను, ఘ[2]నసఖునకు సఖునివలెను ఘ[3]నబంధువుకున్
ఘనబంధువురీతిగ నా, కనయము శుభమిచ్చి ప్రోవనయ్యెడునీకున్॥ 66

(4) క॥ మిత్రుఁడు వరుణార్యములున్, శత్రువులంబారఁద్రోలి శౌర్యముతోడన్
మిత్రులయి బ్రహ్మయజ్ఞము, చిత్రముగా మమ్ముఁబొందఁజేసి వెలుఁగుతన్॥ 67

2. మిత్రోఽఅర్యమా 3. ఇమాఽఉషు 4. దేవంయజామహే (దేవశబ్దము పునరుక్తముకాలేదు.) 5. త్వేఽఇద్ధూయ 6. ప్రియోనోఽఅస్తు
7. స్వగ్నయోమనామహే 8. అథాఽన 9. రగ్నేఽఅగ్ని (ప్రా.ప్ర.)

1. యాగములకధిపువైనీ 2. తన 3. దనబంధులకున్. (తా.పా.)

(5) గీ॥ నీవుపెద్దవు హోతవు నీవు సంత, సించి యుండిన యజ్ఞము చెల్లఁగాదె!
మే మొనర్చెడు స్తుతిని[4]నమేయ కృపను, వినుచుఁగృ[5]తకృత్యముగఁ జేయు వేల్ప! నీవు ॥ 68

(6) క॥ ప్రతిదినము దేవతాళికి, నతులితభక్తిని నొసంగు [6]హవ్యంబెల్లన్
మతిమంతుఁడ! నీలో నా, హుతి చేయంబడునుగాదె ! హుతవహ! వింటే ॥ 69

(7) క॥ జగతిన్ ద్రాతవు హోతవు, మగఁటిమిఁగలవాఁడవగ్ని! మాకిష్టుఁడవై
తగినట్టులు వర్తించిన, నగణితగుణ! మనము ప్రియుల మగుదుముకాదే ॥ 70

(8) క॥ అనలముగల సత్పురుషులు, వినయముతో నాదు హవ్య విస్తారములం
గొని వర్తించుటచేతనె, యనలముగలవారమైతి మగ్నీ! వినవే ॥ 71

(9) క॥ కర్మలు ముగిసినపిదపన్, మర్మము లేకుండ మనము మైత్రింగొనుచున్
నిర్మల సంభాషణముల, నర్మిలి సమయంబు పుత్తు[7]మగ్నీ! దేవా॥ 72

(10) క॥ బలపుత్రుఁడ! యనలుఁడ! మా, వలసన్ జనియించునుతుల వావిరి వినుచుం
జలమున విని యస్నంబును, గలిఁగింపుము ! మాకునె[8]పుడుఁ గరుణఁదలిర్పన్ ॥ 73

## సూక్తమ్—27

### ఋషిః—ఆజీగర్తిః శునఃశేపః స కృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః
### దేవతా—1-12 అగ్నిః, 13-విశ్వేదేవాః *
### ఛందః—1-12 గాయత్రీ, 13-త్రిష్టుప్

(1) అశ్వం న త్వా వారవంతం వందధ్యా[1] అగ్నిం నమోభిః । సమ్రాజంతమధ్వరాణామ్ ॥ 106

(2) స ఘా నః సూనుః శవసా పృథుప్రగామా సుశేవః । మీఢ్వాగ్ం[2] అస్మాకం బభూయాత్ ॥ 107

(3) స నో దూరాచ్చాసాచ్చ ని మర్త్యాదఘాయోః । పాహి సదమిద్ విశ్వాయుః ॥ 108

(4) ఇమమూ షు త్వమస్మాకం సనిం గాయత్రం నవ్యాం సమ్ । అగ్నే దేవేషు ప్ర వోచః ॥ 109

(5) ఆ నో భజ పరమేష్వా వాజేషు మధ్యమేషు । శిక్షా వస్వో[3] అంతమస్య ॥ 110

4. స్తుతులనమేయ. 5. గృతకృత్యులఁగఁజేయ వేల్ప ! ప్రోడ! 6. హవ్యమంతయున్. 7. మంటరానివిభూ! 8 నెపుడు కాదనకుండన్. (తొ.పా.)

* దేవాః (పా.) 1. వందధ్యాఽఅగ్నిం. 2. మీఢ్వాగ్ంఽ అస్మాకం. 3. వస్వోఽఅంతమస్య. (వ్రా.ప్ర.)

(6) విభక్తాసి చిత్రభానో సింధోరూర్మా[4] ఉపాక ఆ । సద్యో దాశుషే [5]క్షరసి ॥ 111

(7) యమగ్నే పృత్సు మర్త్యమవా వాజేషు యం జునాః । స[6]యంతా శశ్వతీరిషః ॥ 112

(8) నకిరస్య సహంత్య పర్యేతా కయస్య చిత్ । వాజో[7] అస్తి శ్రవాయ్యః ॥ 113

(9) స వాజం విశ్వచర్షణిరర్వద్భిరస్తు తరుతా । విప్రేభిరస్తు సనితా ॥ 114

(10) జరాబోధ తద్ వివిడ్ఢి[8] విశేవిశే యజ్ఞియాయ । స్తోమం రుద్రాయ [9]దృశీకమ్ ॥ 115

(11) స నో మహాగ్ం[10] అనిమానో ధూమకేతుః పురు[11]శ్చంద్రః । ధియే వాజాయ హిన్వతు ॥ 116

(12) స రేవాగ్ం[12] ఇవ విశ్పతిర్దైవ్యః కేతుః శృణోతు నః । ఉక్థైరగ్నిర్బృహద్భానుః ॥ 117

(13) నమో మహద్భ్యో నమో[13] అర్భకేభ్యో నమో యువభ్యో నమ[14] ఆశినేభ్యః ।

యజామ దేవాన్ యది శక్నవామ మా జ్యాయసః శంసమా వృక్షి దేవాః ॥ 118

## సూక్తము—27

### ఋషి—శునశ్శేపుఁడు

### దేవత–1-12 అగ్ని. 13–విశ్వేదేవులు*

(1,2,3,4,5) సీ॥ వాలాభిశోభిత వాజినివలె నిన్ను స్తుతియించెదము మేము శోభనందు
తోకతో గుఱ్ఱంబు దోమఁదోలినయట్టి మంట మా శత్రుల మంటఁగలుపు
కామితార్థములిచ్చి కరుణించి మమ్ముల నందగాఁడా! సుఖంబంచఁజేయు
విశ్వమంతటఁ దేఁగి వెలయుచుండెడివాఁడ! వైరియశోరాశిఁబాడుసేయు
గీ॥ మభయమొసఁ[1]గుచు స్తోత్రల నాచరించు. మమరగణముండు దేవ వాసమునకేగు
చెలఁగు గాయత్రమౌ ఛంద మెలమిఁజెప్పు. మఖిలసుఖములు మిత్రగణాళికొసఁగు ॥ 74

4. రూర్మాs ఉపాకsఆ (వ్రా.ప్ర.) 5. క్షరసి (సా పా) 6. సంయితా (వ్రా.ప్ర) 7. వాజోకఅస్తి 8. వివిడ్ఢి 9. దృశకమ్,
10. గ్ంs 11. పురశంద్రః 12. గ్ంs 13. నమోs 14. నమs శినేభ్యః (వ్రా.ప్ర.)

* దేవులు (పా.) 1. మొసఁగియు భక్తుల (తొ.పా.)

(6) చ॥ జనులు నదీజలంబులను జాలిన[2]పన్నిటఁబెక్కురీతులన్
† బనిఁగొని సస్యభూములకుఁబంపు విధంబునఁజిత్రభానుఁడా!
ధనమును నీదుసా[3]తలకుఁదద్దయు నిచ్చుచు సంతసంబుపే
ర్మినినొ[4]సరింపఁబోలును సుమీ నవసంపు ఫలంబులందఁగన్॥ 75

(7) క॥ పోరునకు నెవనిఁబుత్తువొ, పోరునరక్షింతు వెవనిపాలుపారంగం
గేరుచు నాయజమానుం, డారూఢిగ నన్నదాతయగును ధరిత్రిన్॥ 76

(8) గీ॥ వైరినాశక! త్వ[5]త్స్తోత్ర పరులుమిగుల, ఉయముఁగొందుచునుందురు జగ[6]తి నన్న
బలమసామాన్యమైఁజాల వెలుఁగుచుండుఁ, గాన[7]నన్న మొసంగుము కనకవర్ణ!॥ 77

(9,10,11,12) సీ॥ అశ్వసంఘంబుతో ననులవాటించుచు నిష్టిఫలంబులనిచ్చుఁగాక,
పురుషులుచేసెడు పుణ్యయజ్ఞములను సఫలంబు నొందింపజరుగుఁగాక,
గ్రూరుఁడై ననువాఁడు కుటిలతవిడనాఁడి నిత్యప్రసన్నుఁడై నిలుచుఁగాక
గుణములప్రోఁకయైఁగూర్చుచు దీప్తుల వివిధకర్మలను గావించుఁగాక
గీ॥ వందిమాగధనుతులను‡ వసుమతీశుఁ, డాత్రతో నాలకించెడునట్లు దేవ
మాతయసుజాఁడు మానవత్రాతయైన, వాఁడునగునగ్ని మానుతుల్ వడయుఁగాక॥ 78

(13) ఉ॥ వందము దేవతావళికి వందము తక్కువ దేవతాళికిన్
వందము యౌవనాఢ్యులకు వందము వృద్ధులకెల్లఁబెట్టుచున్
వందిగవిత్తమొందికడు ధన్యులమై చరియించుచున్నచో
వెండియు యజ్ఞముల్ జరిపి వేల్పుల నేమునుతింపకుందుమే॥ 79

2. యంతము. రీతిని. (తొ.పా.)

† నదులు నదీజలంబులను గాలువుల ద్వారా కేదారములలోఁ బ్రవేశింపజేయునట్లుండుటవలన నార్యులు వ్యవసాయ విద్య బాగుగ నెరింగి యుండిరనుటకు సందేహములేదు. వారు దీడులను బొలములుగాఁ గట్టి నాగళ్ళతో మెత్తగాదున్ని నదీజలములను గాలువలద్వారా ప్రవేశింపఁజేయుచుండిరి. వ్యవసాయ పద్ధతి మిగిలిన జాతులవారార్యులనుండియే నేర్చుకొనిరని డాక్టరు రాయలు మొదలగు వారు వ్రాసియున్నారు. (నే.వేం.న.శా.)

సూచన—ఇటువంటి భావములన్నియు సరియైన వేదమంత్రార్థములను గ్రహింపక వెలువరించినవే. వేదములు పౌరుషేయములని యామోదించి వానికిఁగొందరు ప్రాచ్యప్రాశ్చాత్య పండితులూహించిన కాలమును-దేశకాల వ్యవస్థలను నామోదించుటవల్ల వేదములు భూమండల లేదా ఆర్యావర్త వ్యవస్థకుఁ బరిమితమగును. విశ్వరూపములైన వేదము లింత సంకుచితవ్యవస్థకు లోనైనవనుట అత్యంత ప్రమాదభరితమైన విషయము, అప్రామాణికమైన విషయమునుగాఁగలదు. వ.గో.కృ.

3. భక్తులకు (తొ.పా.) 4. నొసరింపు (వ్రా.ప్ర.పా.). 5. తావకభక్తవరులు 6. జగతిభక్తి 7. భక్తి. (క్తి?) నొ (మొ?) మొసంగుము (తొ.పా.)

‡ వందిమాగధనుతులు–రాజువద్ద వందిమాగధులు రాజు చెంతనుండి యా రాజునుస్తుతించుచు తచ్ఛత్రువును నిందించుచున్నట్లు పురాణములలోఁ గల వర్ణనలకిట్టి మంత్రములే యాధారములై యుండవలయును. సర్వపురాణేతిహాసములకు వేదములే మూలమనుట మనపురాణ కర్తల యభిప్రాయమిదియేయని తోచుచున్నది. —నే॥వేం॥న॥శా॥.

సూచన—అసలిక్కడ మూలమంత్రార్థము నాంతర్యమెఱుఁగుచో వందిమాగధుల ప్రసక్తియే అప్రసక్తమగుమ. పురాణములు కథారూపమునఁ బరమ ప్రమాణికములు కానేకావు. అవియన్నియు ఖగోళసృష్టి వ్యవస్థారూపమునఁగేవలము సాంకేతికములు మాత్రమే యగును. ఈ దృష్ట్యా వానిని వేరుగా వైజ్ఞానిక దృక్పథముతో సమన్వయించుకొనవలయును. వ.గో.కృ.

## సూక్తమ్—28

ఋషిః—ఆజీగర్తిః శునఃశేపః సకృత్రిమోవైశ్వామిత్రో దేవరాతః

దేవతా—1-4 ఇంద్రః, 5-6 ఉలూఖలమ్, 7-8 ఉలూఖలముసలే. 8-ప్రజాపతిర్హరిశ్చంద్రః, (అధిషవణ) చర్మ సోమోవా.* ఛందః—1-6 అనుష్టుప్, 7-9 గాయత్రీ.

(1) యత్ర గ్రావా పృథుబుధ్న[1] ఊర్ధ్వో భవతి సోతవే। ఉలూఖలసుతానామ[2]వేద్వింద్ర జల్గులః ॥ 119

(2) యత్ర ద్వావివ జఘనాధిషవణ్యా కృతా। ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః ॥ 120

(3) యత్ర నార్యపచ్యవముపచ్యవం చ శిక్షతే। ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః ॥ 121

(4) యత్ర మంథాం[3] విబధ్నతే రశ్మీన్ యమితవా[4] ఇవ। ఉలూఖలసుతానామవేద్వింద్ర జల్గులః ॥ 122

(5) యచ్చిద్ధి త్వం గృహేగృహ[5] ఉలూఖలక యుజ్యసే। ఇహ ద్యుమత్తమం వద జయతామివ దుందుభిః॥ 123

(6) ఉత స్మ తే వనస్పతే వాతో వి వాత్యగ్రమిత్। అథో[6] ఇంద్రాయ పాతవే సును సోమములూఖల ॥ 124

(7) ఆయజీ వాజసాతమా తా హ్యుచ్చా విజర్భృతః। హరీ[7] ఇవాంధాంసి బప్సతా ॥ 125

(8) తా నో[8] అద్య వనస్పతీ[9] ఋష్వావృష్వేభిః సోతృభిః। ఇంద్రాయ మధుమత్ సుతమ్ ॥ 126

(9) ఉచ్ఛిష్టం చమ్వోర్భర సోమం పవి[10]త్ర ఆ సృజ। ని ధేహి గోరధి త్వచి ॥ 127

* అధిషవణ చర్మ (సోమోవా) (పా). 1. బుధ్నః. 2. సుతనామవేద్వింద్ర (బ్రా.ప్ర.) 3. మంథావిబధ్నతే. 4. వాఇవ. 5. గృహఽఉలూఖలక. 6. అథోఽఇంద్రాయ. 7. హరీఽఇవా 8. తానోఽ 9. వనస్పతీఽ 10. పవిత్రఽ 11. వధేహి (బ్రా.ప్ర.)

## సూక్తము—28

### ఋషి—శునశ్శేపుఁడు

దేవత—1-4 ఇంద్రుఁడు, 5-6 ఉలూఖలము, 7-8 ఉలూఖల ముసలములు 9-హరిశ్చంద్రుఁడు, అధిషవణుఁడు, చర్మఁడు, సోముఁడు వీరిలోనెవ్వఁడైన నొకఁడు

(1) క॥ పెద్దదగు మొదలు [1]కలుఁగుచుఁ, దద్దయునెత్తైన[2]శిలను దగ సోమలతన్
ముద్దగ రోటంద్రచ్చఁగ, నొద్దికవచ్చిన రసంబు నొయ్యంగనరే! ॥ 80

(2) క॥ పిరుదులవలె విస్తృతిఁగొని, కరముఁ బ్రకాశించు రాళ్ళ ఘర్షణ[3]వల్లన్
విరివిగవచ్చిన సోమము[4], సరవిగఁజవిఁజూఁచి చూఁచి జరు[5]గవె? యింద్రా! ॥ 81

(3) క॥ శాలకు వచ్చుట పోవుట, వాలాయములేక యెచట వధువు పడసెనో!
చాలగ నచ్చుఁదీసిన, మేలగు సోమమును[6] ద్రావి మెలఁగుము శక్రా! ॥ 82

(4) క॥ వాటమగు గుఱ్ఱమున్వలె, సూటిగఁగవ్వంబుఁగట్టి సోమ లతికలఁ
నీటుగఁ ద్రచ్చఁగవచ్చిన, మేటిరసము రోటఁగలదు మెసఁగుము[7]దేవా! ॥ 83

(5) గీ॥† ఓయులూఖల! యిండ్లలోనుండియున్న, విజయియగు రాజు విజయము వెలయఁజేయు
దుందుభినిఁబోలు శబ్దము దూరముసకుఁ, బోవునట్టులు చేయు! నీ పుణ్యముండు ॥ 84

(6) గీ॥ రోలుగా నున్న వృక్షమా! రూఢికెక్కు, వాయువంతట వీచుచుఁబరఁగుచుండె
నోయులూఖల! పురుహూతుఁడుచితరీతిఁ, ద్రావ సోమరసంబును దరికిఁజేర్చు ॥ 85

(7) క॥ వినుఁడో! రోకలి!రోలా!, ఘనముగ నిష్టులకు మీరు కారణులగుచున్
సెనగలు[8]లోనగువానిం, దిను నుచ్చైశ్రవముమాట్కి దిట్టలుకారే! ॥ 86

(8) క॥ ముసలోలూఖలకీవిని, నసమానముగా వెలుంగు[9]నగములు! ప్రీతిన్
వెసఁద్రచ్చు సాధనముతో, మెసలుచుఁడియ్యని రసంబు[10]మీరలొసఁగుఁడీ!॥ 87

(9) క॥ సోమము దీయఁగమిగిలిన, సోమలతలఁ దాచిపెట్టి శుభరథముపయిన్,
స్థోమముగనున్న[11]లతికలు, సీమమొతోసుంచెనెద్దునెఱి చర్మముపై ॥ 88

---

1. కలఁటయు. 2. రా యిదగఁగొనిలతలన్, 3. ఘర్షణద్రచ్చున్, 4. రసమున్, 5. జడిగుముశక్రా! 6. రసమెల్లఁద్రావి 7. శక్రా!(తొ.పా.)

† ఉలూఖలము, ముసలములు, సమిధ, బర్హిస్సు, ప్రణీతపాత్ర, స్థాలి, ఉపాపాత్రి, లేక ప్రకోణి, స్రుక్కుస్రువము, కృష్ణాజినము ఇట్టివన్నియు యాగకర్మ సంబంధమున ఋగ్వేదమునఁ జెప్పఁబడినవి. (నే.వేం న.శా.)

8. మొదలగువానిం, 9. నాపాదపముల్, 10. మీరలీయరే (తొ.పా.) గణభంగము, 11. లతలన్ (తొ.పా.)

## సూక్తమ్—29

ఋషిః—ఆజీగర్తిః శునఃశేపః స కృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః

దేవతా—ఇంద్రః.

ఛందః—పంక్తిః

(1) యచ్చిద్ధి సత్య సోమపా[1] అనాశస్తా[2] ఇవ స్మసి ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 128

(2) శిప్రిన్ వాజానాం పతే శచీవస్తవ దంసనా ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 129

(3) ని ష్వాపయా మిథూదృశా సస్తామబుధ్యమానే ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 130

(4) ససంతు త్యా[4] అరాతయో బోధంతు శూర రాతయః ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 131

(5) సమింద్ర గర్దభం మృణ నువంతం పాపయాముయా ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 132

(6) పతాతి కుండృణాచ్యా దూరం వాతో వనాదధి ।

ఆ తూ న[3] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 133

1. సోమపాఽ, 2. అనాశస్తాఽఇవ, 3. ఆతూనఽ ఇంద్ర, 4. త్యాఽ (ప్రా.ప్ర.)

(7) సర్వం పరిక్రోశం జహి జంభయా కృకదాశ్వమ్ ।

ఆ తూ న[1] ఇంద్ర శంసయ గోష్వశ్వేషు శుభ్రిషు సహస్రేషు తువీమఘ ॥ 134

## సూక్తము—29

ఋషి—శునఃశేపుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ చెలువుగ సోమపానమును జేయుచు సత్యము పల్కువాఁడవై
తలఁపకు మాకు దోషముల ధన్యుల మౌదుమటయ్య! మేము నీ
చెలుల కసంఖ్య గోవులను శ్రేష్ఠహయంబులనిచ్చి పేర్మితో
మెలఁగుచు మమ్ముఁగాచునెడ మిత్రుఁడ! నిన్ను నుతింపకుందుమే? ॥ 89

(2) చ॥ అలఘుబలాభిరాముఁడ! సమంచితనాశిక గల్గువాఁడ! ని
శ్చలమగునన్నదాత! శ్రితసంతతికిన్ విభవంబొసంగుచీ
యిలను సహస్ర సంఖ్యలయి యేపుగ[2] వెల్గి చరించునట్టి[3] గో
వులనెఱివెల్గు వాజులను బొందఁగఁజేయుచు మమ్ముఁగావవే! ॥ 90

(3) చ॥ అల యమదూతికా ద్వితయ మంటుచు మమ్ముల ముట్టకుండ ని
శ్చలమగు నిద్ర వారల కొసంగి యిటుల్ తుదముట్టఁజేయుమీ
యిలను సహస్ర సంఖ్యలయి యేపుగ[2] వెల్గిచరించునట్టి [3]గో
వుల నెఱివెల్గు వాజులనుఁ బొందఁగఁజేయుచు మమ్ముఁగావవే! ॥ 91

(4) చ॥ చలమునఁగీడు సేయునల శత్రులకెల్లను నిద్రఁగూర్పు మే
మలినములేని మానవుల మాంద్యముఁ గొట్టుచు దేవదేవుఁడా!
యిలను సహస్ర సంఖ్యలయి యేపుగ[2] వెల్గి చరించునట్టి [3]గో
వుల నెఱివెల్గు వాజులను బొందఁగఁజేయుచు మమ్ముఁగావవే! ॥ 92

(5) చ॥ అలరెడు రాసభంబుగతి నార్చుచు నింద్యలఁబల్కు వైరులన్
జలమునఁబట్టి వారిజము సన్నిధి కంపఁగఁబోలు నింద్రుఁడా!
యిలను సహస్ర సంఖ్యలయి యేపుగ[2] వెల్గి చరించునట్టి [3]గో
వుల నెఱివెల్గు వాజులను బొందఁగఁజేయుచు మమ్ముఁగావవే! ॥ 93

---

1. ఆ తూ నస ఇంద్ర 2. యేద్దెర, 3. యావుల (తొ.పా.)

(6) చ॥ వెలఁగుచు వాయువెల్లెడలఁ జెచ్చెర వీచుచునుండెఁగానఁ దద్
ద్బలమును గొట్టి దవ్వునకు దానిని బంపుము చిత్తశుద్ధితో
నిలను సహస్ర సంఖ్యలయి యే[1]పుగవెల్గి చరించునట్టి గో[2]
వుల నెఱివెల్గు వాజులను బొందఁగఁజేయుచు మమ్ముఁగావవే॥ 94

(7) చ॥ వెలవెలఁబోవు మాపయిని వేయివిధంబులఁ గోపగించు నా
బలియగు శత్రుసంతతికి బాధలుపెట్టుచు నిత్యతుష్టితో
నిలను సహస్ర సంఖ్యలయి యేపుగ[1]వెల్గి చరించునట్టి గో[2]
వుల నెఱివెల్గు వాజులను బొందగఁజేయచు మమ్ముఁగావవే॥ 95

## సూక్తమ్—30

ఋషిః—ఆజీగర్తిః శునశ్శేపః స కృత్రిమో వైశ్వామిత్రో దేవరాతః
దేవతా—1-16 ఇంద్రః, 17-19 అశ్వినౌ, 20-22 ఉషాః
ఛందః—1—10,12-15, 17-22 గాయత్రీ, 11-పాద నిచృద్గాయత్రీ, 16—త్రిష్టుప్.

(1) ఆ వ[1] ఇంద్రం క్రివిం యథా వాజయంతః శతక్రతుమ్। మంహిష్ఠం సించ[2] ఇందుభిః॥ 135

(2) శతం వా యః శుచీనాం సహస్రం వా సమాశిరామ్। ఏదు ని[3]మ్నం న రీయతే॥ 136

(3) సం యన్మదాయ శుష్మిణ[4] ఏనా హ్యస్యోదరే। సముద్రో న వ్యచో దధే॥ 137

(4) అయము తే సమతసి కపోత[5] ఇవ గర్భధిమ్। వచ[6]స్తచ్చిన్న ఓహసే॥ 138

(5) స్తోత్రం రాధానాం పతే గిర్వాహో వీర యస్య తే। విభూతిరస్తు సూనృతా॥ 139

(6) ఊర్ధ్వస్తిష్ఠా న[7] ఊతయే౽స్మిన్ వాజే శతక్రతో। సమన్యేషు బ్రవావహై॥ 140

(7) యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే। సఖాయ[8] ఇంద్రమూతయే॥ 141

1. యేడ్తెర, 2. యావుల (తొ.పా.)

1. ఆవః, 2. సించఽఇందుభిః, 3. నిమ్నం, 4. శుష్మిణః, 5. కపోతః, 6. వచతచ్చిన్నః, 7. నఽఊతయే, 8. సఖాయః. (వ్రా.ప్ర.)

(8) ఆ ఘా గమద్యది శ్రవత్ సహస్రిణీభిరూతిభిః । వాజే[9]భిరుప నో హవమ్ ॥ 142

(9) అను ప్రత్నస్యౌకసో హువే తువిప్రతిం నరమ్ । యం తే పూర్వం పితా హువే ॥ 143

(10) తం త్వా వయం విశ్వవారా ऽऽశాస్మహే పురుహూత । సఖే వసో జరితృభ్యః ॥ 144

(11) అస్మాకం శిప్రిణీనాం సోమపాః సోమపావ్నామ్ । సఖే వజ్రిన్త్సఖీనామ్ ॥ 145

(12) తథా తదస్తు సోమపాః సఖే వజ్రిన్ తథాకృణు । యథా త[10] ఉశ్మసీష్టయే ॥ 146

(13) రేవతీర్నః సధమాద[11] ఇంద్రే సంతు తువివాజాః । క్షుమంతో యాభిర్మదేమ ॥ 147

(14) ఆ ఘ త్వావాన్ త్మనాప్తః స్తోతృభ్యో ధృష్ణవియానః । ఋణోరక్షం న చక్రయోః ॥ 148

(15) ఆ యద్ దువః శతక్రతవా కామం జరితౄణామ్ । ఋణోరక్షం న శచీభిః ॥ 149

(16) శశ్వదింద్రః పోప్రుథద్భిర్జిగాయ నానదద్భిః శాశ్వసద్భిర్ధనాని ।

స నో హిరణ్యరథం[12] దంసనావాన్ త్స నః సనితా సనయే స నోऽదాత్ ॥ 150

(17) ఆశ్వినావశ్వావత్యేషా యాతం శవీరయా । గోమద్ దస్రా హిరణ్యవత్ ॥ 151

(18) సమానయోజనో హి వాం రథో దస్రావమర్త్యః । సముద్రే[13] అశ్వినేయతే ॥ 152

(19) న్యఘ్న్యస్య మూర్ధని చక్రం రథస్య యేమథుః । పరి ద్యామన్యదీయతే ॥ 153

(20) కస్త[14] ఉషః కధప్రియే భుజే మర్తో[15] అమర్త్యే । కం నక్షసే విభావరి ॥ 154

9. వాజాభి. 10. తऽ ఉశ్మసీష్టయే. 11. సధమాదऽ ఇంద్రే. 12. రథదం. 13. సముద్రేऽ 14. కస్తऽ 15. మర్తోऽ (ప్రా.ప్ర.)

(21) వయం హి తే అమన్మహ్యా[16]ऽऽన్తాదా పరాకాత్ । అశ్వే న చిత్రే[17] అరుషి ॥ 155

(22) త్వం త్యేభిరా గహి వాజేభిర్దుహితర్దివః । అస్మే రయిం ని ధారయ ॥ 156

## సూక్తము—30

### ఋషి—శునశ్శేపుఁడు

### దేవత—1-16 ఇంద్రుఁడు. 17-19 అశ్విదేవతలు, 20-22 ఉషస్సులు

(1,2,3,4) సీ॥ నీటిచే గర్తంబు నిండునట్టులు సోమరసముచే నింద్రుఁడు[1]రాణనొప్పు
నీరు పల్లమునందు నిల్చుకై వడి నింద్రునాశిరయుత సోమమధిగమించు
నీరు సంద్రంబును నింపు రీతిగ సోమ మింద్రుని కుక్షి[2]ని నింపుచుండు
పూర్వోక్తమగు సోమపుణ్య రసంబెల్ల మాన్యులకుంజాలమాంద్యమిచ్చు

గీ॥ గర్భముంబొందియున్నట్టి ఘనకపోత, మాడ పావురముంగూర్చి యరుగునట్టు
లింద్రుఁడే సోమరసమున కేఁగువాఁడొయుట్టిరసముంచితిమిగదా! యజ్ఞములను॥ 96

(5) క॥ ధనపరిపాలక! శూరుఁడ!, యొనర్చఁగ నిష్టార్థవితతి నొసఁగెడువాఁడా!
ఘనమగునీ యైశ్వర్యం, బనయము సత్యమగుఁగాక నా[3]లింపునుతిన్॥ 97

(6) క॥ శతయాగకర్త! యస్మత్కృత యుద్ధములందు నీవుప్రీతిఁజెలంగన్
వ్రతమూనిరక్షనిచ్చిన, ని[4]తరాంశములందుఁబల్కె మే[5]నిను ప్రీతిన్॥ 98

(7) క॥ ప్రతి యోగమందుఁబనికిం, బ్రతిబంధకమైనయపుడుబల్లిదుఁడగు నా
శతయాగునింద్రదేవుని, నుతియించెడుఁగాక జనుఁడనూనప్రీతిన్॥ 99

(8) గీ॥ వినియుండెనేని యింద్రుఁడు, ఘనమగు నాహ్వానమంతగావత్సలతన్
మునిఁగొని సంరక్షణనిడి, [6]ఘనమగునన్నంబు నీయఁగ్రాలఁడె యెదుటన్॥ 100

(9) క॥ జనకుని యజ్ఞనిమిత్తము, ఘనపూరుష శాలలకును గదలునెవండో
వినయముగ నేను వానిని, మునుఁబిలుచుచునుంటి యాగమునకుంబ్రీతిన్॥ 101

(10) గీ॥ కలితమనుజాళి కర్మాధికారణుండ! విశ్వవరణీయ! పురుహూత! విత్తవంత!
సఖుఁడ! తావకస్తో[7]తల సరసనుతుల, వినఁగనెంతేని నిన్నునే వేడుకొనెదు॥ 102

16. అమన్మహ్యః. 17. చిత్రేऽ (వ్రా.ప్ర.)

1. నింద్రుఁడా ర (మః) ణనొప్పు (తొ.పా.) 2. కుక్షిలోనిండియుండు (తొ.పా.) 3. యాలింపు (వ్రా.ప్ర.పా.) 4. యితరాంశము (వ్రా.ప్ర.పా.)
5. మనసలరన్. (తొ.పా.) 6. పన్నిఁగొనియన్నంబునీయపజ్ఞనిలువఁడే (తొ.పా.) 7. భక్తుల, (తొ.పా.)

(11) గీ॥ సోమపానాదరా! యింద్ర! సోమపాన, రతులమగు మా[8]కిలం దయ రాజిలంగ
గౌర[9]వము గల్గిచాలఁ బ్రకాశమొందు, గోగణ మొసంగి ప్రోవు! లోకులు నుతింప ॥ 103

(12,13 సీ॥ సోమపానరతుండు సుసఖుండు వృత్రారికోరిన కోరికల్ గూర్మినిచ్చు
14,15,16) వితత సంతోషసంభృతుఁడై న[10]యింద్రుండు పాలనిచ్చెడుగొప్ప యాలనిచ్చు
నింద్రసమానుఁడౌ నితరదేవత వచ్చి యాదరించును మాకు నాలనిచ్చు
నిఱుసుపైఁ జక్రముల్ దిరిగి వచ్చెడులాగు నిష్టార్థములు హరి యెలమినిచ్చు
గీ॥ స్తోత్రపాఠక కాంక్షితాస్తోకసుఖముఁ జాలసంతోష బుద్ధియై శక్రుఁడెలమి
నిరుసుతో బండి తిరిగెడు కరణిఁ[11]జాల, ధన్యులగువారి కెంతేని ధనము నిచ్చు ॥ 104

(17) చ॥ కడుపుల నిండ మేతఁగొని కౌతుకమారఁగ నూపిరింగడుం
గడు వెడలించు సప్తములఁగల్గిన బంగరుబండిపైనిఁ దా
వడివడి పోయి శత్రువుల వస్తువులన్నిటిఁ దెచ్చి యిచ్చు దే
వుఁడు కనకంపుఁ బెన్రథముఁబొల్పెసలారఁగ మా కొసంగుతన్ ॥ 105

(18) గీ॥ అశ్విదేవతలార! మాయజ్ఞములకు, వచ్చి యశ్వాన్నములు మాకు నిచ్చి గృహము
గోహిరణ్యాత్మకంబు నెక్కుడుగఁజేయుఁ,డని శునశ్శేపుఁడడిగె నయ్యశ్వి[12]వరుల ॥ 106

(19) క॥ చక్కని దగురథమొక్కటి, నెక్కుచుఁ జరియింపఁ[13]గల్గు దిరువురి రథమున్
నిక్కముగఁ దా నుదీచిని, జుక్కల మార్గమునఁబోవు[14]సూరులు కనుఁడీ! ॥ 107

†గీ॥ అశ్విదేవతలార! మీ యరదమునకు, రెండుచక్రములుండె నఖండితముగ
నొకటి గిరిమూర్ధమున నుండు నొప్పిదముగ, నొకటి నాకంబు [15]చుట్టుచు నొనరఁబోవు ॥ 108

(20) క॥ నీకుంబ్రియముంజేసెడు, రాకడగల పురుషుఁడెవ్వఁడు రమ్యోషస్సా!
నాకసతీ! నీవెవ్వనిఁ, దేకువతోఁబొందఁగలవు! తిరమగు నిష్ఠన్ ॥ 109

(21) క॥ వ్యాపనశీలా! చిత్రా!, యోపికతో వెలుఁగు దాన వుష్యల్లీలో
ద్దీపితమగు నీ మహిమం, బే పురుషం డెరుగఁగలఁడ హీన చరిత్రా! ॥ 110

(22) గీ॥ రమ్యుషోదేవి! యిటకు బిరానఁజేత, నన్నముంగొని చిల్కు దయార్ద్రబుద్ధి
నని శునశ్శేపుఁ డశ్వుల నధికభక్తి, వేడుకొన వారు బంధముల్ విప్పిరంత ॥ 111

8. మమ్ములందయ 9. గణతలన్ గల్గి, 10. శక్రుండు, 11. వజ్రి. 12. నులను (తొ.పా.) 13. గలరుహితముగఁదమదౌ, మక్కువగువధంబువధిని. 14. చోద్యముగనుఁడీ!. (తొ పా.) 15. చుట్టునునొప్పిపోవు (తొ పా)

† ప్రథమ మండలము 30వ సూక్తములో మొత్తము 22 ఋక్కులు మాత్రమే యుండఁగా శ్రీ నేమానివారు పొరపాటున 23 ఋక్కులున్నట్లు భావించి ఋక్సంఖ్యలిచ్చిరి. 108-109-110-111 పద్యములు క్రమముగా 20-21-22-23 ఋక్కుల కనువాదములుగా వ్రాతప్రతిలోఁ బేర్కొనిరి. (చూ. వ్రాతప్రతి-1వ. సంపుటము-133 పుట-) కాని 107-108 పద్యములు రెండును 19వ ఋక్కునకే యనువాదములు. 109-110-111 పద్యములు క్రమముగా 20-21-22 ఋక్కుల కనువాదములు-వ.గో.కృ.

అనువాకః—7, సూక్తమ్—31

ఋషిః—హిరణ్యస్తూప ఆంగిరసః

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ, 8,16,18 త్రిష్టుప్

(1) త్వమగ్నే ప్రథమో[1] అంగిరా ఋషిర్దేవో దేవానామభవః శివః సఖా ।

తవ వ్రతే కవయో విద్మనాపసో ऽజాయంత మరుతో భ్రాజదృ[2]ష్టయః ॥ 157

(2) త్వమగ్నే[3] ప్రథమో అంగిరస్తమః కవిర్దేవానాం పరి భూషసి వ్రతమ్ ।

విభుర్విశ్వస్మై భువనాయ మేధిరో ద్విమాతా శయుః కతిధా చిదాయవే ॥ 158

(3) త్వమగ్నే ప్రథమో మాతరిశ్వన[4] ఆవిర్భవ సుక్రతూయా వివస్వతే ।

అరేజేతాం రోదసీ హోతృవూర్యే[5] ऽసఘ్నోర్భారమయజో మహో వసో ॥ 159

(4) త్వమగ్నే మనవే ద్యామవాశయః పురూరవసే సుకృతే సుకృత్తరః ।

శ్వాత్రేణ యత్ పిత్రోర్ముచ్యసే పర్యా ऽऽ త్వా పూర్వమనయన్నాపరం పునః ॥ 160

(5) త్వమగ్నే వృషభః పుష్టివర్ధన ఉద్యతస్రుచే భవసి శ్రవాయ్యః ।

య ఆహుతిం పరి వేదా వషట్కృతిమేకాయురగ్రే విశ ఆవివాససి ॥ 161

(6) త్వమగ్నే వృజినవర్తనిం నరం సక్మన్ పిపర్షి విదథే విచర్షణే ।

యః శూరసాతా పరితక్మ్యే ధనే దభ్రేభిశ్చిత్ సమృతా హంసి భూయసః ॥ 162

1. ప్రథమోऽఅంగిరాऽఋషి. 2. దృష్టయః 3. త్వమగ్నేऽ, 4. నऽ. 5. పూర్వేऽ. (వ్రా.ప్ర.)

(7) త్వం తమగ్నే అమృతత్వ ఉత్తమే మర్తం దధాసి శ్రవసే దివేదివే ।

యస్తాతృషాణ ఉభయాయ జన్మనే మయః కృణోషి[6] ప్రయ ఆ చ సూరయే ॥ 163

(8) త్వం నో అగ్నే సనయే ధనానాం యశసం కారుం కృణుహి స్తవానః ।

ఋధ్యామ కర్మాపసా నవేన దేవైర్ద్యావాపృథివీ ప్రావతం నః ॥ 164

(9) త్వం నో అగ్నే పిత్రోరుపస్థ ఆ దేవో దేవేష్వనవద్య జాగృవిః ।

తనూకృద్ బోధి[7] ప్రమతిశ్చ కారవే త్వం కల్యాణ వసు విశ్వమోపిషే ॥ 165

(10) త్వమగ్నే ప్రమతిస్త్వం పితాసి నస్ త్వం వయస్కృత్ తవ జామయో వయమ్ ।

సం త్వా రాయః శతినః సం సహస్రిణః సువీరం యంతి వ్రతపామదాభ్య ॥ 166

(11) త్వామగ్నే ప్రథమమాయుమాయవే దేవా అకృణ్వన్ నహుషస్య విశ్పతిమ్ ।

ఇళామకృణ్వన్ మనుషస్య శాసనీం పితుర్యత్ పుత్రో మమకస్య జాయతే ॥ 167

(12) త్వం నో అగ్నే తవ దేవ పాయుభిర్మఘోనో రక్ష తన్వశ్చ వంద్య ।

త్రాతా తోకస్య తనయే గవామస్యనిమేషం రక్షమాణస్తవ వ్రతే ॥ 168

(13) త్వమగ్నే యజ్యవే పాయురంతరో ఽనిషఙ్గాయ చతురక్ష ఇధ్యసే ।

యో రాతహవ్యో ఽవృకాయ ధాయసే కీరేశ్చిన్ మంత్రం మనసా వనోషి తమ్ ॥ 169

(14) త్వమగ్న ఉరుశంసాయ వాఘతే స్పార్హం యద్ రేక్ణః పరమం వనోషి తత్ ।

ఆధ్రస్య చిత్ ప్రమతిరుచ్యసే పితా ప్ర పాకం శాస్సి ప్ర దిశో విదుష్టరః ॥ 170

6. కృణోపి (ద్రా.,ప్ర.) 7. కృద్వేధి (ద్రా.,ప్ర.)

(15) త్వమగ్నే ప్రయతదక్షిణం నరం వర్మేవ స్యూతం[1] పరి పాసి విశ్వతః ।

స్వాదుక్షద్మా యో వసతౌ స్యోనకృజ్ జీవయాజం యజతే సోపమా దివః ॥ 171

(16) ఇమామగ్నే శరణిం మీమృషో న ఇమమధ్వానం యమగామ దూరాత్ ।

ఆపిః పితా ప్రమతిః సోమ్యానాం[2] భృమిరస్యృషికృన్ మర్త్యానామ్ ॥ 172

(17) మనుష్వదగ్నే అంగిరస్వదంగిరో యయాతివత్ సదనే పూర్వవచ్ఛుచే ।

అచ్ఛ యాహ్యా వహా దైవ్యం జనమా సాదయ బర్హిషి యక్షి చ ప్రియమ్ ॥ 173

(18) ఏతేనాగ్నే బ్రహ్మణా వావృధస్వ శక్తీ వా యత్ తే చకృమా విదా వా ।

ఉత ప్ర ణేష్యభి వస్యో అస్మాన్ త్సం నః సృజ సుమత్యా వాజవత్యా ॥ 17‹

## అనువాకము—7. సూక్తము—31

### ఋషి—అంగిరసపుత్రుఁడు హిరణ్యస్తూపుఁడు

### దేవత—అగ్ని

(1) చ॥ అనలుఁడ! మూలపూరుషుఁడ వాద్యుఁడవి[1]ంక మహాంగిరోభిధం
గనికడు దేవతాత్వమును గాంచుచు దేవగణంబులోన నీ
వనయము మంగళప్రదుఁడవౌచును మిత్రుఁడవైతి వామరు
ద్గణములు నీ వ్రతంబులనె గాంచిరి సద్గుణధీ ప్రభాదులన్ ॥ 1

(2) శా॥ లోకానుగ్రహబుద్ధిచే ననలుఁడా! లోకంబులో నూతనా
శ్లోకాకారము లొంది నావరణులన్ స్తుత్యుండవై పుట్టి పె
న్నోకం బెక్కు—విధంబులం దిరుగుచుర్వింబుద్ధితోఁ జెల్గుచున్
నాకావాసుల కర్మ సంచయములన్ న్యాయంబుగాఁ జూడవే ॥ 1

1. స్యూతం 2. సోమ్యానా (ప్రా.ప్ర.)

1. నంగిరసాభిధానుం. (లొ.పా.)

(3) ఉ॥ వాయువుకంటె ముఖ్యుఁడవు వర్ధిత తావకకర్మలన్నిటిం
జేయు మహానుభావులకుఁ జిత్తములో నగుపించువాఁడవున్
ధ్యేయ భవత్ప్రతాపమును దిన్నగఁ గానఁగలేరు మానవుల్
మాయురె! సర్వ[2]జీవులకు మాన్యుఁడవౌదుగదా! స్వభానుఁడా! ॥ 114

(4) ఉ॥ కర్మలుచేయువాఁ డెలమిఁగాంచెడు నాకపదంబటంచు నీ
వర్మిలిబోధఁ జేయవొకొ, యామనువంశ నృపాళమౌళికిన్
ధర్మముగాఁ బురూరవుని ధన్యునిగా నొనరించినాఁడవో!
కర్మలరేఁడ! స్తో[3]తలను గావఁగలేదె ఫలంబు లిచ్చుచున్ ॥ 115

(5) గీ॥ అరణి మథనంబువలన నీవమరియుండ, నిన్నుఁగొనిపోయి వేదికివన్నెమీరఁ
బూర్వ పశ్చిమ దిక్కులఁబొందుపఱచి, యుంచెదరు వీతిహోత్రుఁడా! నిండుప్రీతి ॥ 116

(6) సీ॥ కోరినకోరికల్ గొనసాగునట్టులు ధనమునిచ్చెడు ధన్యతముఁడెవండొ ?
దర్విని(జేపట్టు తత్త్వజ్ఞగణముచే నుతియింపఁబడు శక్తియుతుఁడెవండొ ?
స్వాహావషట్కృతుల్ సరిపల్కువారికి సచ్చేతమున సన్నమిచ్చునెవఁడొ ?
రమ్యసదాచార రహితుఁడౌ వానిని సన్మార్గమునఁ బెట్టఁజాలునెవఁడొ ?
గీ॥ యట్టియనలుఁడ! నీసహాయ్యంబుఁగోరి, ప్రథితశౌర్యాన్వితంపు టావహములోనఁ
జొచ్చివీరులు శౌర్యవిస్ఫూర్తిఁగాంచు, విజయమగునొకొ! తెల్పుమో వేఁడివేల్ప!॥ 117

(7) చ॥ అనలుఁడ! నీదుదాసులకు నత్యధికంబగు మోక్షమెంతయున్
ఘనముగనీయ వార లతిగౌరవమందుచు నుండిరయ్య స
జ్జనుఁడెవఁ డాదరంబుఁగొని సత్పశులాభము పుత్రలాభముం
దనమదిఁగోరు నాజనుఁడు తప్పక వాని సుఖంబులందెడున్ ॥ 118

(8) ఉ॥ పెక్కుగుదానముల్ సలిపి పెద్ద యశస్సును బొందఁగల్గువాఁ
డొక్క కుమారునినైన దయనొప్పుగ నిమ్మటు లీయవానిచేఁ
దక్కువకాని యాగములఁదద్ద[4]యుఁ బ్రీతినొనర్చి మేము నీ
కెక్కువతృప్తిఁ జేసెద మహీన పరాక్రమ! యగ్నిహోత్రమా!॥ 119

(9) ఉ॥ తల్లియుఁదండ్రి నాదగు నుదారరసా గగనద్వయంబులో
నుల్లసిత ప్రభావముననుండి వెలుంగుచు, నిమ్ము పుత్ర, శో
భిల్లెడు పూరుషావళికిఁ బెద్దగు బుద్ధులు చెప్పఁగల్గుదీ
వెల్లరకున్ సుమంగళ! యహీన పరాక్రమ! యగ్నిహోత్రమా! ॥ 120

(10) క॥ వినుసజ్జన సంగతుఁడవు, ఘనకర్మల నెల్లనీవు కాచుచునాకున్
ధనమును నొసఁగుచు యాగము, నొనరుచు మతిఁగలుగఁజేయవోయి గుణనిధీ!॥ 121

2. సర్వప్రాణులకు; 3. భక్తులను; 4. దద్దయుఁజేయ. (తో.పా.)

(11,12) సీ॥ నహుషుఁడగు రాజనహుషునకావేళ సేనాధిపతివయి వెలుఁగలేదె !
ఋషివంశ జాతుఁడౌ మనురాజునకు నిళాపుత్రికవై నీవు పుట్టలేదె !
పుత్రికవై పుట్టి పుణ్యసూక్తులతోడ ధర్మముల్ చెప్పుచుఁ దనియలేదె !
మారక రాతయా మహితాంపురసునకుఁ బుత్రుఁడవై నీవు పొడమలేదె !
గీ॥ నీదు సంరక్షణముచేత నిఖిలధనముఁ, గలుగుమమ్ములఁ బుత్రులఁ గరుణఁబూని
గోవులన్ వలె రక్షించిగూర్చి సౌఖ్య, మధిక సంతృప్తులుగఁజేయు మగ్ని! నీవు ॥ 122

(13) ఉ॥ నిష్కళంక యాజ్ఞికుల నేర్పునఁగాచి హరించివై రులం
బావక! వెల్గుచుంటి వెడఁబాయక నేత్రములట్టి మంటలన్
సేవకరాశి కర్మలను జేయఁగఁ జేసి నుతించువారి స
ద్భావము నీ వె[5]రుంగుదువు పాలకధర్మమదేగదా! భువిన్ ॥ 123

(14,15) సీ॥ నుతియింపఁదగినట్టి మతిమంతుఁడ[6]ర్థము నందినట్టు లెయర్థమఖిలషింతు
వన్నివిధంబుల నాశ్రితులకునెల్లఁ బరిపాలనత్వంబుఁ బడయఁగలవు
కావుతెల్వినిగల్గు నీవు పూరుషునిచే నింపగుకర్మ చేయింపఁగలవు
విగ్రహమఁబోఁగొట్టి దిట్టవై దిక్కులఁ జూపరులకునీవు చూపఁగలవు
గీ॥ సర్వ విషయములందెల్ల సఖుఁడ! నీవు. వర్మవలెఁ గాచుచున్నావు కర్మకరుని
సతిఫలంపు నన్నమిచ్చుచు యజ్ఞములను, నిన్నుఁద[7]నియింపఁ జేయువాఁడెన్నఁబడును ॥ 124

(16) ఉ॥ అంచిత సోమయజ్ఞముల నాదరమొప్పఁగఁజేయు వారి కి
వెంచిశుభంబులిచ్చి కడు హెచ్చుగఁగర్మలఁ బోధచేసి ర
క్షించితివగ్ని! నీ దయిననేవను వీడుచు దూరదేశ మే
తెంచుట దోషమే యగును దీనులలోపము లెన్నకుండుమా! ॥ 125

(17) క॥ మనురాజయయాత్యాదుల, యనఘేష్టులకెల్ల నెలమి నరిఁగిన యట్లే
చనుచీవు యజ్ఞశాలకు, వినయమునం దేవతలకు విందులొసఁగుమా! ॥ 126

(18) గీ॥ జ్ఞానశక్తుల కొలఁది వైశ్వానరుండ!, నుతులఁజేసితిమవి నీవు మతులఁబెట్టి
ధనముఁగలవారమను కీర్తినొసరఁగూర్చి, సుమతులనుమమ్మఁ జేయుమో సొగసుకాఁడ! 127

5. వెల్లిగుత్తెరుఁగు పాలకధర్మ 6. మతిమంతుఁడర్థమా నర్థమొందినరీతి నభిలషింతు 7. నిన్నుఁదృప్తినిజేయువాఁడెన్నఁబడును. (తా,పా.)

## సూక్తమ్—32

### ఋషిః—హిరణ్యస్తూప ఆంగిరసః

### దేవతా—ఇంద్రః

### ఛందః—త్రిష్టుప్

(1) ఇంద్రస్య ను వీర్యాణి ప్ర వోచం యాని చకార ప్రథమాని వజ్రీ ।

అహన్నహిమన్వపస్తతర్ద ప్ర వక్షణా అభినత్ పర్వతానామ్ ॥ 175

(2) అహన్నహిం పర్వతే శిశ్రియాణం త్వష్టాస్మై వజ్రం స్వర్యం తతక్ష ।

వాశ్రా ఇవ ధేనవః స్యందమానా అంజః సముద్రమవ జగ్మురాపః ॥ 176

(3) వృషాయమాణోऽవృణీత సోమం త్రికద్రుకేష్వపిబత్ సుతస్య ।

ఆ సాయకం మఘవాదత్త వజ్రమహన్నేనం ప్రథమజామహీనామ్ ॥ 177

(4) యదింద్రాహన్ ప్రథమజామహీనామాన్మాయినామమినాః ప్రోత మాయాః ।

ఆత్ సూర్యం జనయన్ ద్యాముషాసం తాదీత్నా శత్రుం న కిలా వివిత్సే॥ 178

(5) అహన్ వృత్రం వృత్రతరం వ్యంసమింద్రో వజ్రేణ మహతా వధేన ।

స్కంధాంసీవ కులిశేనా వివృక్ణాऽహిః శయత ఉపపృక్ పృథివ్యాః ॥ 179

(6) అయోద్ధేవ దుర్మద ఆహి జుహ్వే మహావీరం తువిబాధమృజీషమ్ ।

నాతారీదస్య సమృతిం వధానాం సం రుజానాః పిపిష ఇంద్రశత్రుః ॥ 180

(7) అపాదహస్తో అపృతన్యదింద్రమాస్య వజ్రమధి సానౌ జఘాన ।

వృషో వధ్రిః ప్రతిమానం బుభూషన్ పురుత్రా వృత్రో అశయద్ వ్యస్తః ॥ 181

(8) నదం న భిన్నమముయా శయానం మనో రుహాణా అతి యంత్యాపః ।

యాశ్చిద్ వృత్రో మహినా పర్యతిష్ఠత్ తాసామహిః పత్సుతః శీర్బభూవ ॥ 182

(9) నీచావయా అభవద్ వృత్రపుత్రేంద్రో అస్యా అవ వధర్జభార ।

ఉత్తరా సూరధరః పుత్ర ఆసీద్ దానుః శయే సహవత్సా న ధేనుః ॥ 183

(10) అతిష్ఠంతీనామనివేశనానాం కాష్ఠానాం మధ్యే నిహితం శరీరమ్ ।

వృత్రస్య నిణ్యం వి చరంత్యాపో దీర్ఘం తమ ఆశయదింద్రశత్రుః ॥ 184

(11) దాసపత్నీరహిగోపా అతిష్ఠన్ నిరుద్ధా ఆపః పణినేవ గావః ।

అపాం బిలమపిహితం యదాసీద్ వృత్రం జఘన్వాగ్ం అపతద్ వవార॥ 185

(12) అశ్వ్యో వారో అభవస్తదింద్ర సృకే యత్ త్వా ప్రత్యహన్ దేవ ఏకః ।

అజయో గా అజయః శూర సోమమవాసృజః సర్తవే సప్త సింధూన్ ॥ 186

(13) నాస్మై విద్యున్న తన్యతుః సిషేధ న యాం మిహమకిరద్ హ్రాదునిం చ ।

ఇంద్రశ్చ యద్ యుయుధాతే అహిశ్చోతాపరీభ్యో మఘవా వి జిగ్యే॥ 187

(14) అహేర్యాతారం కమపశ్య ఇంద్ర హృది యత్ తే జఘ్నుషో భీరగచ్ఛత్।

నవ చ యన్ నవతిం చ స్రవంతీః శ్యేనో న భీతో అతరో రజాంసి ॥ 188

(15) ఇంద్రో యాతో ऽవసితస్య రాజా శమస్య చ శృంగిణో వజ్రబాహుః ।
సేదు రాజా క్షయతి చర్షణీనామరాన్ న నేమిః పరి తా బభూవ ॥ 189

ఇతి
ప్రథమాష్టకే ద్వితీయాధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—32

### ఋషి—అంగిరసపుత్రుఁడగు హిరణ్యస్తూపుఁడు

### దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ ఘనముగ మేఘమండలముఁగూరియఁ బెట్టి పయస్సుభూమిపైఁ
దనివిగఁగల్గునట్టుగను దత్తరపాటునఁగొండ వెల్లువల్
మునుఁగొని పాఱునట్లుగను ముఖ్యముగా నొనరించి వెల్గు నా
ఘనరథవజ్రిచర్యలను గౌతుకమొప్ప నుతింపకుందుమే॥ 128

(2) ఉ॥ పాయక విశ్వకర్మ ఘనవజ్రము నీకు నొసంగ దానిచేఁ
దోయదపంక్తి[1]గొట్టితివి తోయ[2] మదెంతయుఁబర్వఁబెట్టి యం
భఃయను నిస్వనంబునెడఁబాయక చేసెడునావు, పెయ్యకై
పోయెడునట్టు లబ్ధికయి పోయెడు చూచితె పాకశాసనా!॥ 129

(3) చ॥ పొలుపుగ నాలపోతువలెఁబొంగిన నింద్రుఁడు సోమకాంక్షచే
నిలఁగల నాత్రికద్రుకుల నిష్టులకై చని సోమమంత ని
శ్చలముగఁ[3]ద్రావి వజ్రమును శత్రుహరంబగు దానిఁబట్టి స
ద్బలమున ముఖ్యమేఘమును బంతముతోఁబడఁగొట్టలేదఁటే!॥ 130

(4) గీ॥ మేఘములలోన మిన్నలౌ మేఘములను, గొట్టిరాక్షసులంగొట్టి సూర్య
కల్యగగనంబులకుఁగాంతిఁగలుఁగఁజేసి, మించితివి శత్రుపంక్తి నిర్జించియింద్ర!॥ 131

1. పఙ్క్తి (ప్రా.ప్ర) 2. తోయదమెంతయు 3. నిశ్చలముగఁజేసి (తొ.పా.)

(5) మ॥ తగవజ్రంబును జేతఁబూని యరులందార్మారుగాఁజేసి చ
క్కఁగ వృత్రాసురబాహు యుగ్మమును వే ఖండింపఁ దద్ధస్తముల్
నగశాఖాద్వితయంబుమాడ్కిఁ బుడమిన్నాదంబుతోఁబడ్డ పె
న్పగలంబొందుచువాఁడు వృక్షమువలెన్ వ్రాలెన్ భువిన్శక్రుఁడా!॥ 132

(6) క॥ దుర్వారవృత్రహతకుఁడు. గర్వంబును బొంది యమరకాంతుంబిలువన్
సర్వపరాక్రముఁడాహరి, నిర్వాపణమొందఁజేయ నేర్వఁడెనాఁడున్॥ 133

క॥ మదముగల వృత్రహతకుఁడు, కదనమున జయింపఁబడఁగఁగంపితుఁడగుచున్
మదముఁజెడి నదులఁబడఁగన్, నదిగట్టులు రాళ్ళు చెట్లు నాశనమయ్యెన్॥ 134

(7) చ॥ కరములు కాళ్ళుకొట్టఁబడి కంపితుఁడై యరి, పేడివాఁడు దాఁ
బురుషునితోడ సామ్యమును బొందఁబ్రయత్నముసేయు మాడ్కి, నా
హరినెదిరింపఁ[1]బూనుటకు యత్న మొనర్పఁగ వజ్రివాని మూ
పురమునఁ[2]గొట్టఁగానతఁడు భూమిపయింబడి[3]పోయె దీనతన్॥ 135

(8,9) సీ॥ మహిమచే వృత్రుండు మహి ననావృష్టి బాధనుగల్పనముసేయఁదత్క్షణమున
[4]నింద్రుఁడు వాని నతంద్ర వృత్తి నిజంప వారిని వర్షించె వారిదములు
నీటివెల్లువగముల్ నెఱిమించి ప్రవహింప శత్రువఁజిక్కె[5]నాశత్రుచెంత
†వానిని రక్షింప వ్రాలిన తన్మాత వజ్రాహతినిఁ గొట్టఁబడ్డయపుడు
గీ॥ తల్లిపుత్రుని కడఁబడి తనువుఁబాసె, చెలఁగి చెంగట వత్సశోభిలఁగ భూమిఁ
బండుకొను గోవుమాడ్కిఁ గన్పడుచునసుర, చెప్పశక్యమె యప్పటిచిత్రములను॥ 136

(10) గీ॥ అమరనాథుని వజ్రప్రహారకలన, నీటిమధ్యమునంబడి నిర్జరారి
దీనుఁడయి చేయునదిలేక దిక్కుమాలి, యసువులంబాసె యుండఁడెయంబు[6]వులను॥ 137

(11) చ॥ మునుపొకవేళ నాలగణమున్ ఫణి మోసముచేతఁ గొంచుఁబో
యిన నవిదుష్టవృత్రుఁడు మహింబడకుండగఁ[7]జేయువారిఁబె
న్కనుక వహించి నీవె యవనీతల మొందఁగఁజేసి మేఘరా
జినవప[8]యస్సులం గుఱియఁజేయవె యింద్రుఁడ! శక్తిసాంద్రుఁడా!॥ 138

(12) ఉ॥ వాజులునై జవాలముల వ్రాలెడు నీఁగలఁదోలుకొన్నయ
ట్లాజినివృత్త దానవుని నవ్వలకున్ వడిఁద్రోలి నీవు వి
భ్రాజిత గోవులంగొనుచు బంధురకీర్తి నిగంటివిందుద్రుఁడా!
యాజిని నీకు నేపురుషుఁడడ్డఁబడంగలవాఁడొ చెప్పుమా!॥ 139

1. వృత్రుఁడు ప్రయత్నమొనర్పఁగ వజ్రియే (పే?) నె 2. ఁగోపియైయతఁడు (తొ.పా.) 3. భిన్నగాత్రుఁడై (తొ,పా.)
4, శక్రుఁడు వానిని జంపనవ్వారిగ. 5. ఁదచ్చరణములను (తొ.పా.)
† ఇంద్రుఁడు వృత్రుని జంపునపుడు వాని తల్లి పుత్రుని రక్షించుటకు వచ్చి పుత్రునిచెంత వ్రాలఁగా (వృత్రుఁడు) వజ్రాహతిచేఁ గొట్టఁబడెను. నే.వేంన.శా,
6. యంబులోన (తొ.పా.) 7, పడకుండఁబెన్కనుకవహించి వానినవనీత 8. నవనీరదుల్ (తొ.పా.)

(13) గీ॥ త్వష్టతనకోపవశమునసృష్టిఁజేయు, వృత్రుఁ జక్కాడియున్ నీవు పేరుఁగనుట
సప్తసింధువు లెలమినిసంచరించు, చుండెఁగద భూమిలోన నఖండితముగ॥ 140

శా॥ వృత్రేంద్రుల్ గదనంబు సేయునెడ నావృత్రుండు వృత్రారిపైఁ
జిత్రం బొప్పఁగ వర్షమున్ మెఱు*పులన్ సృష్టించి పంపంగ నే
మాత్రంబుం జలియింపకిందుఁడు వెసన్ మాయాదులంబన్ని సం
స్తోత్రం బందెడునట్లు వానిని గడున్ సుక్కంగఁదాఁ జేయఁడే॥ 141

(14) క॥ నవనవతి నదులుదాఁటుచు, వివిధ గతుల డేగఁగరణి వృత్రుని ననిలో
హననముఁజేయఁ[1]గ జగతిన్, జనియించిన నీకు నింక[2]శక్తు లెవరిలన్॥ 142

(15) సీ॥ వజ్రాయుధముఁబూని వైరిసంఘమునెల్ల నిశ్శేషముగఁ జంపు నిపుణుఁడెవఁడొ!
జంగమంబులకును స్థావరంబులకును నశ్వంబులకు మేటియధిపుఁడెవఁడొ!
పోతులకును నాలపోతులకును బెద్ద రాజైన సంపూర్ణతేజుఁడెవఁడొ!
శకటనేమి తదీయ చక్రారములకునాధార మట్లాధార ధీరుఁడెవఁడొ!

గీ॥ జంగమస్థావరాత్మక సకలలోక, జాలములకెల్ల శరణమైచాలునెవఁడొ:
యట్టి[3]యింద్రుఁడు శత్రులనడఁచిపెట్టి, లీలలోకంబులన్నింటి నేలఁదొడఁగె॥ 143

ఇయ్యది

శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర

సంగమేశ్వరపుత్ర సీతాంబా గర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక

నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో

శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ

బ్రథమాష్టమున ద్వితీయాధ్యాయము

సమాప్తము

---

* మెఱుపులక్షణంబుగాఁ బంపనే (తొ.పా. యతిభంగము) వ.గో.కృ. 1. జేయఁభయించెద. (తొ.పా.) 2. నీకంటె శక్తివంతులు లేరని తాత్పర్యము. 3. యట్టి విగత శత్రువుఁడాసురాధిపుండు. (తొ.పా.)

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## ప్రథమ మండలమ్

ప్రథమోऽష్టకః—తృతీయోऽధ్యాయః

### సూక్తమ్—33

ఋషిః—హిరణ్యస్తూప ఆంగిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ఏతాయామోప గవ్యంత ఇంద్ర మస్మాకం సు ప్రమతిం వావృధాతి ।

అనామృణః కువిదాదస్య రాయో గవాం కేతం పరమావర్జతే నః ॥ 1

(2) ఉపేదహం ధనదామప్రతీతం జుష్టాం న శ్యేనో వసతిం పతామి ।

ఇంద్రం నమస్యన్నుపమేభిరర్కైర్యః స్తోతృభ్యో హవ్యో అస్తి యామన్ ॥ 2

(3) ని సర్వసేన ఇషుధీగ్ంరసక్త సమర్యో గా అజతి యస్య వష్టి ।

చోష్కూయమాణ ఇంద్ర భూరి వామం మా పణిర్భూరస్మదధి ప్రవృద్ధ ॥ 3

(4) వధీర్హి దస్యుం ధనినం ఘనేనగ్ం ఏకశ్చరన్నుపశాకేభిరింద్ర ।

ధనోరధి విషుణక్ తే వ్యాయన్నయజ్వానః సనకాః ప్రేతిమీయుః ॥ 4

(5) పరా చిచ్ఛీర్షా వవృ[1]జుస్త ఇంద్రా[2]ऽయజ్వానో యజ్వభిః స్పర్ధమానాః ।
ప్ర యద్ దివో హరివః స్థాతరుగ్ర నిరవ్రతాగ్ం అధమో రోదస్యోః ॥ 5

(6) అయుయుత్సన్ననవద్యస్య సేనామయాతయంత క్షితయో నవగ్వాః ।
వృషాయుధో న వధ్రయో నిరష్టాః ప్రవద్భిరింద్రాచ్చితయంత ఆయన్ ॥ 6

(7) త్వమేతాన్ రు[3]దతో జక్షతశ్చాయోధయో రజస ఇంద్ర పారే ।
అవాదహో దివ ఆ దస్యుముచ్చా ప సున్వతః స్తువతః శంసమావః ॥ 7

(8) చక్రాణాసః పరీణహం పృథివ్యా హిరణ్యేన మణినా శుంభమానాః ।
న హిన్వానాసస్తితిరుస్త ఇంద్రం పరి స్పశో అదధాత్ సూర్యేణ ॥ 8

(9) పరి యదింద్ర రోదసీ ఉభే అబుభోజీర్మహినా విశ్వతః సీమ్ ।
అమన్యమానాగ్ం అభి మన్యమానైర్నిర్బ్రహ్మభిరధమో దస్యుమింద్ర ॥ 9

(10) న యే దివః పృథివ్యా అంతమాపుర్న మాయాభిర్ధనదాం పర్యభూవన్ ।
యుజం వజ్రం వృషభశ్చక్ర ఇంద్రో నిర్జ్యోతిషా తమసో గా అదుక్షత్ ॥ 10

(11) అను స్వధామక్షరన్నాపో అస్యాऽవర్ధత మధ్య ఆ నావ్యానామ్ ।
సధ్రీచీనేన మనసా తమింద్ర ఓజిష్ఠేన హన్మనాహన్నభి ద్యూన్ ॥ 11

1. వవృజుస్త. 2. ఇంద్రాయ. 3. ప్రుదతో (ప్రా.ప్ర.)

(12) న్యావిధ్యదిలీబిశస్యదృహ్ళా వి శృఙ్గిణమభినచ్ఛుష్ణమింద్రః ।

యావత్తరో మఘవన్ యావదోజో వజ్రేణ శత్రుమవధీః పృతన్యుమ్ ॥ 12

(13) అభి సిధ్మో అజిగాదస్య శత్రూన్ వి తిగ్మేన వృషభేణా పురోఽభేత్ ।

సం వజ్రేణాసృజద్ వృత్రమింద్రః ప్ర స్వాం మతిమతిరచ్ఛాశదానః ॥ 13

(14) ఆవః కుత్సమింద్ర యస్మిఞ్చాకన్ ప్రావో యుధ్యంతం వృషభం దశద్యుమ్ ।

శఫచ్యుతో రేణుర్నక్షత ద్యాముచ్ఛ్వైత్రేయో నృషాహ్యాయ తస్థౌ ॥ 14

(15) ఆవః శమం వృషభం తుగ్ర్యాసు క్షేత్రజేషే మఘవచ్ఛ్విత్ర్యం గామ్ ।

జ్యోక్ చిదత్ర తస్థివాంసో అక్రఞ్ఛత్రూయతామధరా వేదనాకః ॥ 15

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము—తృతీయాధ్యాయము

### సూక్తము—33

ఋషి—అంగిరసపుత్రుఁడుహిరణ్యస్తూపుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ దేవతలార! రాక్షసులు తేకువతోఁగొను గోగణంబులం
[1]గావఁగనిచ్చవుట్ట సురకాంతుని యొద్దకు రండు శత్రుఁడా
గోవులఁ దెచ్చియిచ్చి మనకుందనివారధనంబు వచ్చుమే
ల్దొవలఁజూపఁగల్గి సరిత్రోవలఁ బెట్టును[2]దుష్ట చిత్తుఁడై ॥ 1

1. దేవడియిచ్చవుట్ట సురదేవునియొద్దకు (పాఠాంతరము) 2. పెట్టును + తుష్టచిత్తుఁడై

(2) ఉ॥ పోరుతటస్థమైనపుడు ప్రోవుమటంచు మహానుభావు లే
తీరున శత్రు వంచకుని దేవునిగోరిరొయట్లు వాని నే
స్వీరునిబోలి సంస్తుతుల వేయివిధంబుల వేడుకొంచు వేఁ
బారెడు వేగ తప్పనతిపట్టును జేరెడురీతిఁ జేరుదున్॥ 2

(3) ఉ॥ ఆయుధపాళి నీకుఁగల దంచిత సైనికులెంచఋండిరో
మాయయిపన్ను రాక్షసుల మర్దనఁజేయుచు గోగణంబులన్
నాయముఁగల్గువ స్తకుఁడు సవ్యఫలంబులఁ గోరుకై వడిం
బాయకతెచ్చి తత్ఫలము పన్నుగఁ గోరకయుండు మింద్రుఁడా!॥ 3

(4) ఉ॥ మారుతచోదనంబులను మన్ననఁ జేయుచు నీచ శత్రులన్
మారణసేసితీవుహరి! మానుగవజ్రపుధార చేతనా
కారణమూని తప్పటులు క్రమ్మరనిష్టిని బాడుసేయ నే
తేరఁగ నీవు వారిని వధింపవె తావక విక్రమంబులన్॥ 4

(5) గద్యము†—"హరి" యను నశ్వముగలవాఁడవును, యుద్ధమునందు వెనుకకుఁ దిరుగనివాఁడవును శౌర్యము గలవాఁడవునగునోయింద్రుఁడా! నీవు వృత్రాసురుని భటులను రోదసులనుండి దిగువం బడునటులఁ జేయునపుడు, యజ్ఞముఁజేయు వారిని బాధించువారు వెన్నిచ్చిపారిరి. 5

(6) ఉ॥ వృత్రుని దుష్టసైన్యము మహేంద్రుని మార్కొని చంపనుండ నా
శత్రుపరంపరాళి దివిజప్రభుఁడేయఁగ వారు భీతిచేఁ
జిత్రముగాను బర్విడరె చేయునదెద్దియు లేక పేడి వాఁ
డాత్రముఁగల్గు శూరునకు నాగకలేక చలించుకై వడిన్ ॥ 6

(7) గీ॥ ఏడ్చుచున్ నవ్వుచున్నట్టి వృత్రహతకు, నంతరిక్షంబునందునె హత్యఁజేసి
సోమరసమును దీయుచు స్తుతులొనర్చు, పురుషయాగంబుఁ జూడఁబోవో మహాత్మ!॥ 7

(8) గీ॥ అరులభృత్యులు భూమిని న్నాక్రమించి మణ్యలంకృతదేహులై మసలుచుండ
నింద్రుడెంతయు నల్కతో వృత్రభటుల, భాస్కరుని గూడుకొని వేగఁబాఱద్రోలె॥ 8

† శ్రీ మదాంధ్ర ఋగ్వేదములో రచయిత వచనముగాననువదించినవానిని "గద్యములు"గాఁ బేర్కొనెను. ప్రథమాష్టకము— తృతీయాధ్యాయము 33వ సూక్తములోని 5వ ఋక్కునకుఁ దెలుఁగుననువాదముగా మొదట రచయిత యీ క్రింది ఉత్పలమాలను రచించి పిదపఁ గొట్టివేసి గద్యమును వ్రాసెను. (చూఁడు. 1వ. సంపుటము—147వ. పుట.)

ఉ॥ రోదసి నీవుతద్భటులఁ ద్రోయఁగ వారు నభంబునుండి దు
ర్వాదముఁ జేయుచుంబడుచు భక్తుల యజ్ఞము పాడుసేయ ను
న్మాదుల పోల్కివర్తిలఁగ మౌన్యుఁడ! వారినిఁగష్టపెట్టుచో
వేదనఁ బొందిపర్విడరె? వీపులు వెన్కకుఁ దిప్పి తొంచఋన్॥

(9) ఉ॥ సర్వము నాక్రమించుకొని సర్వహితంబుగ రాజ్యమేలుచుం
గర్వమువీడి పూరుషులు కానక యర్థము మంత్రసంగతిన్
నిర్వహణంబుఁబూని నిను నేర్పున వేడఁగవారిఁ గూడ నే
గర్వములేక కావవొక గర్విత వృత్రునిద్రుంచి యింద్రుఁడా!॥ 9

(10) చ॥ పనిగొని వృత్రదానవుఁడు పాయక మేఘముఁ గట్టిపెట్టఁగా
ఘనమగుసస్యపూరములు కాంతిదొలంగిన వానలేమిచే
తనునపుడింద్ర! వచ్చి శతధార, మొగిళ్లను బిట్టుగొట్టఁగాఁ
గనలుచు నవ్వి యీయవటె కాంక్షితసిద్ధికి వారిపూరముల్!॥ 10

(11) చ॥ చక్కని మేఘమండలము చాలగ నీకుల వంపభూమిపైఁ
దక్కవకాని వెల్లువలుతద్దయుఁ బారుచునుండ వానిలోఁ
జిక్కుచు వృత్రదానవుఁడు చిత్తమునన్ భయమొంది యుండఁగాఁ
గక్కసమూని దేవపతి! కారియఁబెట్టవె వానినెంతయున్ ॥ 11

(12) గీ॥ బొరియలో దాగుకొనియున్న భూరిశత్రు, యోధులన్ సంహరించుచు యుద్ధభూమి
యందుఁగల వృత్రశత్రుని నెందులేని, శక్తిఁజక్కాడవే దేవ! శక్ర! నీవు॥ 12

(13) క॥ శత్రువుల బింకమడఁచుచు, వృత్రునిపైఁబడుచు వానివెసఁజంపి మహా
కుత్రిమపురములనన్నిటిఁ, జిత్రముగా నాశనంబుఁజేయవొకొ హరీ!॥ 13

(14,15) సీ॥ స్తుతిపాఠములచేత నుతియింపఁగోరెడి కుత్సితునకుఁగడుఁ గూర్చినావు
తన వైరితోఁబోరు దండిదశద్యువు ప్రతినయొనర్చిగాఁపాడినావు
వైరి భయంబున వారిలో బ్రుంగెడు శ్విత్రపుత్రుని దరిఁజేర్చినావు
దుమ్ముమీఁదికిఁబోయి దొరలునట్టులు పెక్కు జైత్రయాత్రలఁగూడజరిపినావు
గీ॥ నీకు సాహాయ్యముంజేయ నీటినుండి, శ్విత్రపుత్రు బయల్పడఁ జేసినావు
కయ్యమునకెప్డు కాల్దువ్వ కఠిన శత్రు, సుతులఁ జక్కాడి సద్యశస్సు గనినావు॥ 14

## సూక్తమ్—34

### ఋషిః—హిరణ్యస్తూప ఆంగిరసః

### దేవతా—అశ్వినౌ

### ఛందః—జగతీ, 9, 12 త్రిష్టుప్

(1) త్రిశ్చిన్నో అద్యా భవతం నవేదసా విభుర్వాం యామ ఉత రాతిరశ్వినా ।

యువోర్హి యన్త్రం హిమ్యేవ వాససో ఽభ్యాయంసేన్యా భవతం మనీషిభిః ॥ 16

(2) త్రయః పవయో మధువాహనే రథే సోమస్య వేనామను విశ్వ ఇద్ విదుః ।
త్రయః స్కంభాసః స్కభితాస ఆ రభే త్రిర్నక్తం యాథస్త్రిర్వశ్వినా దివా ॥ 17

(3) సమానే అహన్ త్రిరవద్యగోహనా త్రిరద్య యజ్ఞం మధునా మిమిక్షతమ్ ।
త్రిర్వాజవతీరిషో అశ్వినా యువం దోషా అస్మభ్యముషసశ్చ పిన్వతమ్ ॥ 18

(4) త్రిర్వర్తిర్యాతం త్రిరనువ్రతే జనే త్రిః సుప్రావ్యే త్రేధేవ శిక్షతమ్ ।
త్రిర్నాంద్యం వహతమశ్వినా యువం త్రిః పృక్షో అస్మే అక్షరేవ పిన్వతమ్ ॥ 19

(5) త్రిర్నో రయిం వహతమశ్వినా యువం త్రిర్దేవతాతా త్రిరుతావతం ధియః ।
త్రిః సౌభగత్వం త్రిరుత శ్రవాంసి నస్ త్రిష్ఠం వాం సూరే దుహితా రుహద్ రథమ్ ॥ 20

(6) త్రిర్నో అశ్వినా దివ్యాని భేషజా త్రిః పార్థివాని త్రిరు దత్తమద్భ్యః[1] ।
ఓమానం శంయోర్మమకాయ సూనవే త్రిధాతు శర్మ వహతం శుభస్పతీ ॥ 21

(7) త్రిర్నో అశ్వినా యజతా దివేదివే పరి త్రిధాతు పృథివీమశాయతమ్ ।
తిస్రో నాసత్యా రథ్యా పరావత ఆత్మేవ వాతః స్వసరాణి గచ్ఛతమ్ ॥ 22

(8) [2]త్రిరశ్వినా సింధుభిః సప్తమాతృభిస్ త్రయ ఆహావాస్త్రేధా హవిష్కృతమ్ ।
తిస్రః పృథివీరుపరి ప్రవా దివో నాకం రక్షేథే ద్యుభిరక్తుభిర్హితమ్ ॥ 23

1. దత్తమద్భ్యః. (బ్రా.ప్ర.) 2. త్రిరశ్వినా (పా.సా.మా.)

(9) క్వ౧ త్రీ చక్రా త్రివృతో రథస్య క్వ౧ త్రయో వంధురో యే సనీళాః ।

కదా యోగో వాజినో రాసభస్య యేన యజ్ఞం నాసత్యోపయాథః ॥ 24

(10) ఆ నాసత్యా గచ్ఛతం హూయతే హవిర్మధ్వః పిబతం మధుపేభిరాసభిః ।

యువోర్హి పూర్వం సవితోషసో రథమృతాయ చిత్రం ఘృతవంతమిష్యతి ॥ 25

(11) ఆ నాసత్యా త్రిభిరేకాదశైరిహ దేవేభిర్యాతం మధుపేయమశ్వినా ।

ప్రాయుస్తారిష్టం నీ రపాంసి మృక్షతం సేధతం ద్వేషో భవతం స[3]చాభువా ॥ 26

(12) ఆ నో అశ్వినా త్రివృతా రథేనాऽర్వాఞ్చం రయిం వహతం సువీరమ్ ।

శృణ్వంతా వామవసే జోహవీమి వృధే చ నో భవతం వాజసాతౌ ॥ 27

## సూక్తము—34

### ఋషి—హిరణ్యస్తూపుఁడు*

### దేవత—అశ్విదేవతలు

(1) చ॥ పగలును రాత్రి యెప్పుడెడఁబాయక యుండినయట్లు ప్రీతితో
వెగటులుమాని యిద్దఱును వీఁకఁజరింతురు, మీ రథంబు లీ
జగములఁదిర్గు మీకు[1] నగుజాగములోక విసిద్ధమౌను నో
యుగళమ! మూఁడు వేళలను యోచన సేయక రండు కర్మకున్॥ 15

3. సచభువా. (బ్రా.ప్ర.)

* సంస్కృతమూలములో "హిరణ్యస్తూప ఆంగిరసః" అని పూర్వసూక్తములకున్నట్లుగానే అంగిరసపుత్రుఁడు హిరణ్యస్తూపుఁడని యున్నది. ఆంధ్రానువాదములో 34 - 35వ సూక్తములకు ఋషి కేవల హిరణ్యస్తూపుఁడుగాఁ (ఎవరిపుత్రుఁడో తెలియనట్లు) చెప్పఁబడినది. వ.గో.కృ.

1. మీవయినజాగము లోకప్రసిద్ధమౌను (తా.పా.)

(2) ఉ॥ మూఁడగుచక్రముల్ గలిగి ముద్దులుగుల్కెడి పెద్దబండిపైఁ
బోఁడిగ సర్వభక్ష్యములు పొందుగఁబెట్టుచు విశ్రమించుచున్
నాఁడు హిమాంశు వేనలకునడ్చిన పెళ్ళికినేగినట్టులే
నేఁడును రాత్రియుంబవలునేచి రథంబును నె[2]క్కిరండొగిన్॥ 16

(3) గీ॥ మూఁడు సవనములకు మీరు మోదమలర, వచ్చి తప్పులు మన్నించి మెచ్చఁదగిన
హవ్యభాగముపైఁ దీయనైనరసముఁ, జల్లియన్నము మాకిండు జాణలార!॥ 17

(4) చ॥ తరచుగ మా గృహంబులకుఁ దప్పకవచ్చుచు [3]మీరు నేమముం
గరుణమెయింగనుంగొను చనారతమున్ సుసహాయసంపదన్
వరుసగఁ జేయువారలను వర్ధిలఁజేయుచు యజ్ఞకర్మలన్
విరివిగనేర్పి కర్మఫల విత్తము లిచ్చుచునన్న మీయుఁడీ॥ 18

(5) క॥ ముమ్మాటికి ధనమీయుఁడు, ముమ్మాటికి యజ్ఞమునకు మోదితులగుచున్
సమ్మానిత విబుధులతో, ముమ్మాటికిరండు మాకు మోదముకలుగన్॥ 19

పాఠాంతరము

క॥ గొప్పదియగు ధనమీయుఁడు, మెప్పువడయు యాగమునకుమించిన వేడ్కం
దప్పక విబుధావళితో, నెప్పుడు వచ్చెదరొమీర లెఱుఁగఁగవశమే!॥ 20

గీ॥ మీత్రిచక్రరథంబుపై మిహిరపుత్రి, కూడఁగూర్చుండి వెలిఁగెడుఁ గొదువలేక
మాకు సౌభాగ్యములఁ గూర్చి మామనముల, మంచి మార్గములంబెట్టుఁడంచితముగ॥ 21

(6) గీ॥ అఖిలలోకంబులంగల్గు నౌషధముల, నిచ్చి† వాతాదిదోషముల్ హెచ్చకుండ
శంయు వనువాని కిచ్చిన సౌఖ్యమస్మ, దీయపుత్రుల కొసఁగరే[1]యిపుడు సురలు!॥ 22

2. నెక్కియేగుఁడీ! (తొ.పా.) 3. మాదునేమమం, (తొ.పా.)

† వాతాదిరోగములు—ఆర్యులవైద్య శాస్త్రము విషయమై డాక్టర్ ఫర్నెల్‌దొర యిట్లువ్రాసెను. "బ్రిటిషువారడవి మనుష్యులవలె గోచీలైనను బెట్టుకొన చేతకాక దిరుగుచున్న సమయమున ఆర్యవైద్యులు సమస్తవైద్యశాఖలయందఖండమైనట్టియు నసదృశమైనట్టియు విజ్ఞానమును సంపాదించి తేజరిల్లు చుండినట్లు కనపడుచున్నది. ఆయుర్వేదమునకు మూలము వేదములె. ఆయుర్వేదసిద్ధాంతములను బ్రకటించెడు గ్రంథములలో జరకసుశ్రుతములను రెండు గ్రంథములు గలవు. ఇవి జగద్విఖ్యాత గ్రంథములు. ఈ రెండు గ్రంథములను బెగ్దాదుకలీఫా 950 A.D. సంవత్సరమున అరబ్బీ భాషలోనికి తర్జుమాచేయించెను. 531 A.D.లో నోషిర్వార్ రాజునకు సమకాలికుఁడగు బారుజోయా సాహెబు ఇండియాకు వచ్చి వైద్యము నేర్చుకొనెను. చరకము. సుశ్రుతము, వాగ్భటము టిబెట్ భాషలోనికిఁ బరివర్తనము చేయఁబడెను. చరకము పారసీభాషలోనికి మార్చఁబడెను, ల్యాటిన్ భాషలో నున్న వైద్యగ్రంథములో సహితము చరకముదాహరింపఁబడినది. గ్రీకువైద్యులు పాముకాటునకు మందు నెరుఁగనందున అలగ్జాండరు చక్రవర్తి భారతీ వర్షమునుండి భిషగ్వరులను దెప్పించుకొనుచుండి తదీయాస్థానమున నుంచుకొనుచుండెను. అట్టి ఆయుర్వేదము నేఁడు క్షీణించుట చూడ నే భారతీయుఁడాశ్చర్యపడఁడు? (నే.వేం.న.శా.)

సూచన—దేవవేద వైద్య విషయ విజ్ఞానమందుఁజరకసుశ్రుతములు పరమాణు మాత్రములు. చరకసుశ్రుతములే తలమానికములైనచో వేద విజ్ఞానమెంతటిది కావలయును? వ.గో.కృ.

1. దివిజులార! (తొ.పా. ఈ సందర్భమున సవరించిన పాఠములో "సురలు!" అన్న శబ్దము సంబోధనార్థకముగానే ప్రయుక్తమైనది. ఇట్టి ప్రయోగములు వ్యావహారిక భాషా ప్రభావమున వచ్చినవి) వ.గో.కృ.

(7) ఉ॥ ప్రాణమరుత్తు దేహములఁ బ్రాకెడు రీతిని నశ్వులార! సు
స్థానపు రమ్యవేదికల చక్కటి మీరలు విశ్రమించుచుం
ప్రీణనకక్ష్య భాగముల ప్రీతి నమర్చిన ధర్భశయ్యలం
బ్రాణసుఖంబు గల్గుటకుఁబండుకొనుండు దయామయాత్ములై ॥ 23

(8) చ॥ దినముల రాత్రులంగలుగఁ దీర్చుచులోకము లెల్లఁదిర్గు నా
దినకరుఁగాచు వారలరు దివ్యులు మీరలు మీనిమిత్తమై
ఘనములు సప్తమాతృకుల కమ్మని నీళులచేత జన్యమౌ*
ననుపమకాంతి సోమరసమందుఁడు ద్రోణములందు వెల్గెడిన్॥ 24

(9) చ॥ అరదము పైవసించి శుభయాగ నిమిత్తము వచ్చుచుండ మీ
యరదము రూపు చక్రముల యందము చందము పెద్దకొయ్య కిం
పరయఁగఁ గట్టురాసభము లయ్యవి యానజవంబుచేతమే
మెరుగము దస్రులార! తమరెచ్చటికెప్పుడు వచ్చుచుందురో!॥ 25

(10) గీ॥ కల్యకాలంబునకు ముందెకదలు రథము, రథముపైనెక్కి మీరు బిరానవచ్చి
సోమపానాభిలాషులై శోభలందు, యజ్ఞసోమరసంబును నందుకొనుఁడు॥ 26

(11) చ॥ దివమున నంతరిక్షమున దివ్య పయస్సున నున్న దేవతల్†
సవనముఁజేయు మాకడకుఁ జయ్యనవచ్చి సుసోమజన్యమౌ
ద్రవమును ద్రాగి పాపములఁద్రచ్చుచు నాయువునిచ్చి కాచుచుం
గవిసెడువైరులం దునిమికాంతిని బొందుఁడు సీమలందొాగిన్ ॥ 27

(12) గీ॥ వేగముగఁబోవు రథముపై వీఁకనెక్కి, వచ్చిమాకిందు పుత్రసంవర్ధనంబు
స్తుతులవిని శత్రువులనెల్ల స్రుక్కఁజేసి, యనికి సాహాయ్యమునుఁజేయుఁ డశ్వులార!॥ 28

* ఆంధ్రానువాదము-34వ సూక్తములో 7-8వ ఋక్కులనువదించినపుడు నావు ప్రతివ్రాయుటలో 153వపుటలోనున్న 23వ పద్యమగు ఉత్పలమాల మూఁడవ పాదముగా పొరపాటున 8వ ఋక్కనువాదపద్యమగు చంపకమాలలోని 3వ పాదము వ్రాయఁబడి కొట్టివేయఁబడినది. వ.గో.క

† వేదమున వర్ణింపఁబడిన దేవతలు ముప్పదిముగ్గురని వేదమునఁ జాలచోట్లఁగలదు. ఆధర్వణ వేదమందును 10-7-13, 10-7-23 దేవత ముప్పది ముగ్గురనియే కలదు. ఐతరే.బ్రా. 13-23 త్రయస్త్రింశద్దేవాః (దేవతలు 33రు) అని కలదు. దీనిని బట్టి చూచినను దేవతలు 33రని స్పష్టమగుచున్నది. ఈ ముప్పదిముగ్గురు దేవతలే పారసీకులకుఁగూడఁగలరు. వారిని రతులనెదరు. వారు జరదూష్ట్రచేత నిర్మింపఁబడి మతాచారముఁ సంరక్షించు కర్తలట. మనవారలు ''సప్తద్వీపా వసుంధరా''అనిరి. (భూమి యేడు ద్వీపములుగా విభజింపఁబడెను) ఇట్టి యభిప్రాయమునే పారసీకులు ప్రకటించియున్నారు. మేరుపర్వతము విషయమై మన వర్ణనలు వారి వర్ణనలనుబోలియున్నవి. వారివేదగ్రంథములను వారు ''వెండిడాడు'' అంటారు. వెండిడాడు అనుపదము సంస్కృతమునుండి వచ్చినది. వి-దేవత్త అనుధ్వనికి వికృతిరూపము. వెండిదాడుఅనఁగా దేవతా విధ్వంసార్థము నిర్ణయింపబడినగ్రంథము. ఇంకనెన్నియో సాదృశ్యములు కలవు. (నే.వేం.స.శా.)
(చూఁడు. ప్ర.మం. 54సూ. 3వ ఋక్కు తెలుఁగు పుట్‌నోట్. వ.గో.కృ.)

1. బొందుతనెల్లసీమలన్ (తొ.పా.).

## సూక్తమ్ — 35

ఋషిః—హిరణ్యస్తూప ఆంగిరసః

దేవతా—1 (పాదానాంక్రమేణ) అగ్నిః, మిత్రావరుణౌ, రాత్రిః, సవితాచ 2-11 సవితా

ఛందః—త్రిష్టుప్, 1,9 జగతీ

(1) హ్వయామ్యగ్నిం ప్రథమం స్వస్తయే హ్వయామి మిత్రావరుణావిహావసే ।
హ్వయామి రాత్రీం జగతో నివేశనీం హ్వయామి దేవం సవితారమూతయే ॥ 28

(2) ఆ కృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యం చ ।
హిరణ్యయేన సవితా రథేనాఽఽ దేవో యాతి భువనాని పశ్యన్ ॥ 29

(3) యాతి దేవః ప్రవతా యాత్యుద్వతా యాతి శుభ్రాభ్యాం యజతో హరిభ్యామ్ ।
ఆ దేవో యాతి సవితా పరావతోఽప విశ్వా దురితా బాధమానః ॥ 30

(4) అభీవృతం కృశనైర్విశ్వరూపం హిరణ్యశమ్యం యజతో బృహంతమ్ ।
ఆస్థాద్ రథం సవితా చిత్రభానుః కృష్ణా రజాంసి తవిషీం దధానః ॥ 31

(5) వి జనాఞ్ఛ్యావాః శితిపాదో అఖ్యన్ రథం హిరణ్యప్రఉగం వహంతః ।
శశ్వద్ విశః సవితుర్దైవ్యస్యోపస్థే విశ్వా భువనాని తస్థుః ॥ 32

(6) తిస్రో ద్యావః సవితుర్ద్వా ఉపస్థాఁ ఏకా యమస్య భువనే విరాషాట్ ।
ఆణిం న రథ్యమమృతాధి తస్థురిహ బ్రవీతు య ఉ తచ్చికేతత్ ॥ 33

(7) వి సుపర్ణో అంతరిక్షాణ్యఖ్యద్ గభీరవేపా అసురః సునీథః ।
క్వేదానీం సూర్యః కశ్చికేత కతమాం ద్యాం రశ్మిరస్యా తతాన ॥ 34

(8) అష్టౌ వ్యఖ్యత్ కకుభః పృథివ్యాస్ త్రీ ధన్వ యోజనా సప్త సింధూన్ ।
హిరణ్యాక్షః సవితా దేవ ఆగాద్ దధద్రత్నా దాశుషే వార్యాణి ॥ 35

(9) హిరణ్యపాణిః సవితా విచర్షణిరుభే ద్యావాపృథివీ అంతరీయతే ।
అపామీవాం బాధతే వేతి సూర్యమభి కృష్ణేన రజసా ద్యామృణోతి ॥ 36

(10) హిరణ్యహస్తో అసురః సునీథః సుమృళీకః స్వవాగ్ం యాత్వర్వాఙ్ ।
అపసేధన్ రక్షసో యాతుధానానస్థాద్ దేవః ప్రతిదోషం గృణానః ॥ 37

(11) యే తే పంథాః సవితః పూర్వ్యాసో ऽరేణవః సుకృతా అంతరిక్షే ।
తేభిర్నో అద్య పథిభిః సుగేభీ రక్షా చ నో అధి చ బ్రూహి దేవ ॥ 38

## సూక్తము—35

### ఋషి—హిరణ్యస్తూపుఁడు

### దేవత—సవితృఁడు*

(1) గీ॥ జగములకు నిద్రఁగూర్చెడు క్షపను సవితృ, వరుణవహ్నుల మిత్రునిభక్తిమీర
మాయొనర్చెడు సవన సమక్షమునకు, వచ్చుట కొనర్తుమిప్పుడాహ్వాన మేము॥ 29

* సంస్కృతమూలములో ఁదొలి ఋక్కులో 1వ పాదమున కగ్ని, 2వ పాదమునకు మిత్రావరుణులు, 3వ పాదమునకు రాత్రి, 4వ పాదమునకు సవితదేవతలుగాను 2వ ఋక్కునుండి తుదివఱకు సవిత దేవతగాను పేర్కొనఁబడినది. తొలిఋక్కున కనువాదపద్యములో నైతము (చూ. 29వ పద్య జగములకు నిత్యాది.ప.) సంస్కృతమూలముతోని దేవతలెల్లరుఁ బేర్కొనఁబడిరి గాని క్రమరాహిత్య దోషమేర్పడినది. వ.గో.కృ.

(2) క॥ బంగరురథంబు నెక్కుచు, సింగారం బొప్ప నభముసీమఁ దిరుగుచుం
బొంగుచు భువనములం గను, మంగళతర దినకరుండు మా కగుపడుతన్ ॥ 30

(3) చ॥ తెల్లని గుఱ్ఱముల్ గలుఁగుతేజును నెక్కుచు సూర్యుఁడెంతయుం
బెల్లగుపేర్మి భక్తజనభీతి నడంచుచు మూఁడువేళలం
జల్లఁగ నన్ని వైపులకుసాగుచుఁ బూజితుఁడౌచు నిప్పు డీ
చెల్లెడు యజ్ఞ కర్మలను జేరుచునుండెను జూడుఁడీ! జనుల్ ॥ 31

(4) ఉ॥ పెక్కగు రూపముల్ గల్గిఁగి పెంపు వహించెడి రంగుబొమ్మలన్
మిక్కిలినొప్పు మేల్రథముమీఁద వసించుచు లోకమంతటం
జిక్కెడు నంధకారమును జెచ్చెరఁగొట్టుచుఁ జిత్రభానుఁ డే
దిక్కునఁజూఁడ వెల్గెడిని దివ్యజనాళి సమర్చితాంఘ్రుఁడై ॥ 32

(5) క॥ శితపాదంబుల నొప్పుచు, నతివేగయుతంబులైన [1]యమల శ్యావా
తతి మున్నె వెల్గు వెనుకఁ, బ్రతిసూర్యుఁడు జగముఁ గాంతి పర్థిలఁజేయున్ ॥ 33

(6) చ॥ అరయఁగ రెండులోకములు హంసుని చెంత వసించుచుండె నా
వర గగనంబు మూఁడవది పాపజనావళి కెల్ల నద్ది దు
ర్భర యమలోక మా వెలుఁగు రాశులు భాస్కరునానియుండు నా
యరదము చీల నానుకొనునట్టుల వాని మహత్త్వ మెట్టిదో! ॥ 34

(7) క॥ జగములకుఁ బ్రాణ మొసఁగుచు, గగనంబున నైజ చలన కాంతి జగంబుల్
ధగధగమని వెలిఁగించెడు, నొగి రవి యిపుడెచట నుండునో! యీ నిశిలోన్ ॥ 35

†(8,9) సీ॥ తన సుఖంబునుజీవి[2] తాను బొందెడునట్లు చిత్తంబుతో సరిఁజేయుఁవాడు
[3]వివిధములౌదిశల్ వెలిఁగించి ప్రాణుల చిత్తంబులకుఁ బ్రీతిఁజేయువాఁడు
సప్తమాతృకలను సకల జగంబుల వెలొంపఁగాఁ జేయఁగలువాఁడు
తన్నుపాసించెడు ధన్యాత్ములనునెల్లఁజేరి కరంబు రక్షించువాఁడు
గీ॥ తనకుఁదానె వెలింగెడు ధన్యుఁడైన, సూర్యుఁ డీ యజ్ఞవాటి కస్తోక కరుణ
వచ్చి యజమానులకుఁ బ్రియ మిచ్చివేగ, రత్నములొసంగుఁగాక! సద్యత్నమునను ॥ 36

(10) చ॥ కనకముఁ జేతఁబట్టుకొని కామితమర్త్యుల కెల్ల నిచ్చుచున్
దను భజియించు వారలకుఁ దప్పక సౌఖ్యము గలఁజేయుచుఁ
[4]ఘనముగఁబ్రాణవంతులకుఁ గమ్మని ప్రాణములిచ్చుచున్ మహా
ధనమును గల్గు భాస్కరుఁడు తద్దయుఁగాచుచునుండె[5]సర్వముఁ ॥ 37

1. హంసశ్యావా (తొ.పా.) 2. తమతమ సుఖములు తాము పొందెడునట్లు 3. వివిధమౌదిక్కుల (తొ.పా.) 4. ఘనముగు 5. చూఁడిఁ డీ! (తొ పా.) † ఋగ్వేదము ప్రథమమండలము 35వ సూక్తములో మొత్తము 11 ఋక్కులున్నవి. శ్రీ నేమానివారు పూర్తిగా 11 ఋక్కులను నాంధ్రీకరించినను దమ వ్రాతప్రతిలోఁ బ్రమాదవశమున 10 ఋక్కులనే యనువదించి నట్లు ఋక్సంఖ్యలను బొరపాటుగా నిచ్చిరి. 36వ పద్యము 8, 9 ఋక్కుల కనువాదముగాఁగా 8వ ఋక్కున కనువాదమనియుఁ దత్క్రమమునఁ దదుపరి పద్యములు 9, 10 ఋక్కులకుఁ గ్రమముగా ననువాదములనియుఁ జేర్కొనిరి. (మూ-వ్రాతప్రతి-1వ సంపుటము-157వ పుట) కాని 36వ పద్యము 8, 9 ఋక్కులకును, 37వ పద్యము 10వ ఋక్కునకును, 38వ పద్యము 11వ ఋక్కునకును ననువాదములు. వ.గో.కృ.

(11) ఉ॥ నీ వరుదెంచు మార్గములు నిర్మల భావమునొందె ముందుగాఁ
గావున సిద్ధమార్గమునఁగాంచనయానము నెక్కి యిప్పుడే
కావఁగవచ్చి మాకుఁగల కాంక్షితముల్ సరిగూర్చి సూర్యుఁడా!
దేవత లెల్లమెచ్చులిడి దీవన లిచ్చెడునట్లు చేయుమా! ॥ 38

అనువాకః—8, సూక్తమ్—36

ఋషిః—కణ్వో ఘౌరః

దేవతా—అగ్నిః, 13-14 యూపో వా

*ఛందః—ప్రగాథః—విషమాబృహత్యః, సమాః సతోబృహత్యః

(1) ప్ర వో యహ్వం పురూణాం విశాం దేవయతీనామ్ ।

అగ్నిం సూక్తేభిర్వచోభిరీమహే యం సీ[1] మిదన్య ఈళతే ॥ 39

(2) జనాసో అగ్నిం దధిరే సహోవృధం హవిష్మంతో విధేమ తే ।

స త్వం నో అద్య సుమనా ఇహావితా భవా వాజేషు సంత్య ॥ 40

(3) ప్ర త్వా[2] దూతం వృణీమహే హోతారం విశ్వవేదసమ్[3] ।

మహస్తే సతో వి చరంత్యర్చయో దివి స్పృశంతి [4]భానవః ॥ 41

(4) దేవాసస్త్వా వరుణో మిత్రో అర్యమా సం దూతం ప్రత్నమింధతే ।

విశ్వం సో అగ్నే జయతి త్వయా ధనం యస్తే దదాశ మర్త్యః ॥ 42

* ప్రగాథః, బార్హతమ్. (పా) 13. ఉపరిష్టాద్బృహతీ. (ఐ. బ్రా.) 1. సీమిదన్య ఈళతే (వ్రా.ప్ర.) 2. ప్రత్వాం, 3. వేదస, 4. భానవే (వ్రా.ప్ర.)

(5) మంద్రో హోతా గృహపతిరగ్నే దూతో విశామసి ।

త్వే విశ్వా సంగతాని వ్రతా ధ్రువా యాని దేవా అకృణ్వత ॥ 43

(6) త్వే ఇదగ్నే సుభగే యవిష్ఠ్య విశ్వమా హూయతే హవిః ।

స త్వం నో అద్య సుమనా ఉతాపరం యక్షి దేవాంత్సువీర్యా ॥ 44

(7) తం ఘేమిత్థా నమస్విన ఉప స్వరాజమాసతే ।

హోత్రాభిరగ్నిం మనుషః సమింధతే తితిర్వాంసో అతి స్రిధః ॥ 45

(8) ఘ్నంతో వృత్రమతరన్ రోదసీ అప ఉరు క్షయాయ చక్రిరే ।

భువత్ కణ్వే వృషా ద్యుమ్న్యాహుతః క్రందదశ్వో గవిష్టిషు ॥ 46

(9) సం సీదస్వ మహాఁ అసి శోచస్వ దేవవీతమః ।

వి ధూమమగ్నే అరుషం మియేధ్య సృజ ప్రశస్త దర్శతమ్ ॥ 47

(10) యం త్వా దేవాసో మనవే దధురిహ యజిష్ఠం హవ్యవాహన ।

యం కణ్వో మేధ్యాతిథిర్ధనస్పృతం యం వృషా యముపస్తుతః ॥ 48

(11) యమగ్నిం మేధ్యాతిథిః కణ్వ ఈధ ఋతాదధి ।

తస్య ప్రేషో దీదియుస్తమిమా ఋచస్ తమగ్నిం వర్ధయామసి ॥ 49

(12) రాయస్పూర్తి స్వధావోఽస్తి హి తే ఽగ్నే దేవేష్వాప్యమ్ ।

త్వం వాజస్య శ్రుత్యస్య రాజసి స నో మృళ మహాగ్ం అసి ॥ 50

(13) ఊర్ధ్వ ఊ షు ణ ఊతయే తిష్ఠా దేవో న సవితా ।

ఊర్ధ్వో వాజస్య సనితా యదఞ్జిభిర్వాఘద్భిర్విహ్వయా[1]మహే ॥ 51

(14) ఊర్ధ్వో నః పాహ్యంహసో ని కేతునా విశ్వం సమత్రిణం దహ ।

కృధీ న ఊర్ధ్వాఞ్చరథాయ జీవసే విదా దేవేషు నో దువః ॥ 52

(15) పాహి నో అగ్నే రక్షసః పాహి ధూర్తేరరాణ్ణః ।

పాహి రీషత ఉత వా జిఘాంసతో బృహద్భానో యవిష్ఠ్య ॥ 53

(16) ఘనేవ విష్వగ్వి జహ్యరావ్ణస్ తపుర్జంభ యో అస్మధ్రుక్ ।

యో మర్త్యః శిశీతే అత్యక్తుభిర్మా నః స రిపురీశత ॥ 54

(17) అగ్నిర్వవ్నే సువీర్యమగ్నిః కణ్వాయ సౌభగమ్ ।

అగ్నిః ప్రావన్ మిత్రోత మేధ్యాతిథిమగ్నిః సాతా ఉపస్తుతమ్ ॥ 55

(18) అగ్నినా తుర్వశం యదుం పరావత ఉగ్రాదేవం హవామహే ।

అగ్నిర్నయన్నవవాస్త్వం బృహద్రథం తుర్వీతిం దస్యవే సహః ॥ 56

1. విహ్వయమహే. (వ్రా.ప్ర.)

(19) ని త్వామగ్నే మనుర్దధే జ్యోతిర్జనాయ శశ్వతే ।

దీదేథ కణ్వ ఋతజాత ఉక్షితో యం నమస్యంతి కృష్టయః ॥ 57

(20) త్వేషాసో అగ్నేరమవంతో అర్చయో భీమాసో న ప్రతీతయే ।

రక్షస్వినః సదమిద్ యాతుమావతో విశ్వం సమత్రిణం దహ ॥ 58

### అనువాకము—8 సూక్తము—36

ఋషి—ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు.†

దేవత—అగ్ని, 13-14 అగ్ని లేక యూపము*

(1) గీ॥ దేవతానుగ్రహముఁగోరు దివ్య[1]జనుల, నెల్లఁగాపాడఁగల్గెడు నిద్ధ చరిత్రు
మునివరస్తుత్య నగ్ని సన్ముదముతోడ, సూక్తముల వేఁడుకొనెదము సుగుణులార! ॥ 39

(2) క॥ యజమానులు [2]నిను వేఁడుచు, నిజబలములఁ బొంది రపుడె నిరతము మేమున్
భజియింతుము నిను దాతా!, విజయుఁడవై రమ్ము! మాకు విత్త మొసంగన్ ॥ 40

(3) క॥ సురలకు హోతవు దాతవు, సురలోకముఁబొంది నీదు శోభిత రశ్మల్
కరము వెలిఁగించుచుండెదు, నరమరలేకుండ నిన్ను యాచింతుమయా! ॥ 41

(4) క॥ వరుణుఁడు మిత్రార్యములును, నరుడుగ నినువెలుఁగఁజేసి యమరిరి[3] భూమిం
గరము సుహవ్యంబిచ్చెడు, గురుపురుషుఁడు ధనమునొంది గురువగునగ్నీ! ॥ 42

† ఇక్కడఁ గణ్వుఁడు కణ్వ వంశములోనివాఁడు. ఋగ్వేదము యొక్క యెనిమిదవ మండలమంతయు నీ కణ్వులనువారుచ్చ
...చినట్టులే కలదు. కాని వారి జాతిగురించి యేమియుఁ దెలియదు. విష్ణుపురాణము (IV. 19) మరియు భాగవత పురాణమును
X-20.6-7) గణ్వుఁడు క్షత్రియ వంశీయుండగు పురువు యొక్క వంశమునకుఁ జెందినవాఁడని చెప్పుచున్నది. అజామీఢుని
...నఁ గణ్వుఁడుద్భవించెను. వానివలన మేధాతిథి పుట్టెను. మేధాతిథివలనఁ గణ్వనీయ బ్రాహ్మణులు కలిఁగిరనియు విష్ణుపురాణము
V-6) చెప్పుటవలనఁ గణ్వులు బ్రాహ్మణులనికూడఁ దెలియుచున్నది. (నే.వేం.వ.శా.)

* ఆంధ్రానువాదమునందుఁ బ్రథమాష్టకము తృతీయాధ్యాయము 3 6వ సూక్తమునకు దేవత (1వ. సంపుటము 157 పుట.)
యఁబడలేదు. కాని యనువాద పద్యములలో నగ్నిదేవతగురించి మాత్రమే కాక 13-14 ఋక్కుల యనువాదపద్యములలో
...షముతోపాటుగ నగ్నికూడఁ బేర్కొనఁబడినది. వ.గో.కృ.

1. దివ్యప్రజల (తొ.పా.) 2. నినువేడియు (తొ.పా.) 3. యమరిరియవనిం. (తొ.పా.)

(5) ఉ॥ సంతసమందఁజేసెదవు సర్వగృహంబుల నేలువాఁడ వ
త్యంతము దేవతల్ జరుపు ధర్మ పురస్కృత కార్యమంత నీ
వెంతయుఁజూఁచువాఁడ వమరేశ్వర దూతవు నిత్యదాతవుం
జింతన మాని మాకడకుఁజేరుము! వేగమె హవ్యవాహనా! ॥ 43

(6) గీ॥ నిండు యౌవనముంగల్గు నీవు సర్వ, హవ్యములనెల్లఁ గొనిపోయి యఖిలసురల
కర్పణముఁజేయుచుంట మా హవ్యములను. నీకు నర్పించుచుంటి మగ్ని! సభక్తి ॥ 44

(7) గీ॥ స్వప్రకాశుఁడవగు నీకు సర్వజనులు, హోమములు చేయుచున్నారు హోతవగుట
శత్రు నిరసనముంగోరి సప్తహోతృ, గణము నిన్[1] వెలుఁగఁజేయగాఁగడఁగినారు ॥ 45

(8) చ॥ పొలుపుగ నీ సహాయమును బొందుచు దేవతలంతఁ బోఁడిమిన్
వెలిఁగెడువైరి బృందమునువేగమ త్రోలి సుఖంబు లిచ్చుచున్
జ్వలనుఁడ! గోనిమిత్తమగు జన్నములన్ సకిలించు వాజులన్
వలయుధనంబు కణ్వునకు వర్ధిలఁజేయు చభీష్ట మీయవే! ॥ 46

(9) గీ॥ కుశలపైఁ గూరుచుండుము! గుణగణాఢ్య!, ప్రజ్వలింపుము! దివిజుల ప్రతిభఁగోరి
చూడఁదగినట్టి ధూమంబు చోద్య మలరఁ, జెదరునట్టులుచేయు! నిస్సీమముగను ॥ 47

(10) చ॥ మనువునుగావ దేవతలు మానుగ నీకు సపర్యఁజేయరే!
ఘనుఁడగుకణ్వ మౌని నినుఁగాంచి ధనంబును నీయలేదఁటే!
వినయముతో సురాధిపుఁడు వేడుటలేదఁటె! నీదుప్రాపు నే
జనవరుఁడుండు నీదయిన[2] జన్నము సేయక హవ్యవాహనా! ॥ 48

(11) చ॥ పనిఁగొని కణ్వ మౌని యల పావన సూర్యునినుండి యెంతయున్
ఘనమగు కాంతిఁదీసి జ్వలనా! యది నీయెడ నుంపనప్డు నీ
వనయము వెల్గుచున్ జగమునంతయు వెల్గఁగఁ జేయుచుంట మే
మనయము నిన్ను వేడమఁటె! యత్యధికంబగు మంత్రరాజులన్ ॥ 49

(12) క॥ అన్నప్రదాత వగ్ని!, యన్నమునకుఁ బతివి నీకు నమరుల నెయ్యం
బెన్నఁగఁగలదని విందుము, మన్నించి సుఖంబు నిమ్మ! మా కీజగతిన్ ॥ 50

(13) క॥ యూపమునకు ఘృతమధికం, బోపికతోఁ జక్కఁబూయ నున్న జనులతో
నేపుఁగొని నిన్నుఁ బిలుతుము, చూఁపుము మా కన్నమిపుడు [3]సూర్యమహాత్మా! ॥ 51

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది. వ గో.కృ. 2. నీదైన. (బ్రా.ప్ర.పా. గణభంగము)
3. సూర్యోన్నతుఁడా. (తొ.పా.)

(14) శా॥ యూపాంతర్గత! యగ్నిదేవ! వినుమా! యుత్కృష్టరూపుండవై
పాపంబుల్ హరించువాఁడవయి మా పాపంబులం గొట్టుమా!
యేపుంబొందుచు లోకమెల్లెడల మే మీక్షింపఁగాఁజేయు! స
ద్రూపంబుంగొని యన్నమీయుము! లసద్రూపాత్మ! దేవాళికిన్ ॥ 52

(15) గీ॥ రాక్షసుల బాధఁదొలఁగించి రక్ష నిమ్మ!, ధనమొసంగని ధూర్తులఁ ద్రచ్చి మాకు
హింసలను జేయువారిని హింసఁబెట్టు, మగ్ని! సంపూర్ణ యౌవన! యధికకిరణ! ॥ 53

(16) క॥ తపనుఁడ! ఘనవస్తువువలె, విపులముగా శత్రువులను విచ్ఛిన్నులుగా
[1]నపమర్దనముంజేయుచు, రిపులసమర్థులుగ నుండురీతిని [2]గనుమా! ॥ 54

(17) క॥ రక్షకుఁ[3]బిలుతురు నిన్నే, రక్షించుట నీవు వహ్ని! రాజత్కణ్వున్
రక్షించుట మేధ్యాతిథి, రక్షించుట ధనము నిచ్చి రమ్యపురుషులన్ ॥ 55

(18) క॥ అనలుఁడు తనతోనుండెడి, ఘనుఁడగు తుర్వసుని యదువు ఘనతుర్వీతిం
బనిగొని చోరులఁజంపన్!, వినయముతోఁ [4]బిలువరమ్మ! వేగమె యిటకున్ ॥ 56

(19) క॥ జ్యోతీరూపుఁడవగు నిను, ఖ్యాతిగ మనుచక్రవర్తి ఘనయజ్ఞమునం
బ్రీతిగ నునిచెను గణ్వుని, యాతుర హవ్యములను వెలుఁగ నౌటను నగ్ని! ॥ 57

(20) క॥ భీమంబులు బలయుతములు, నీమంటలు వాని యెదుట నిలువఁగ వశమే
భీములగు యాతుధానుల, సోమించి దహింపు! శత్రుశూరులతోడన్ ॥ 58

## సూక్తమ్—37

ఋషిః—కణ్వో ఘౌరః

దేవతా—మరుతః

ఛందః—గాయత్రీ

(1) క్రీళం వః శర్ధో మారుతమనర్వాణం రథేశుభమ్। కణ్వా అభి ప్ర గాయత ॥ 59

(2) యే పృషతీభిరృష్టిభిః సాకం వాశీభిరఞ్జిభిః। అజాయన్త స్వభానవః ॥ 60

(3) ఇహేవ శృణ్వ ఏషాం కశా హస్తేషు యద్ వదాన్। ని యామఞ్చిత్రమృఞ్జతే ॥ 61

1. నపమర్దన గావించుచు (తో.పా.)   2. రీతిఁజేయుమా! (తొ.పా. గణభంగము.)   3. గోరెదరగ్ని! (తొ.పా.)
4. బిలువవేగ విచ్చేయవుకో! (తొ.పా.)

(4) ప్ర వః శర్ధాయ ఘృష్వయే త్వేషద్యుమ్నాయ శుష్మిణే । దేవత్తం బ్రహ్మ గాయత ॥ 62

(5) ప్ర శంసా గోష్వఘ్న్యం క్రీళం యచ్ఛర్ధో మారుతమ్ । జమ్భే రసస్య వావృధే ॥ 63

(6) కో వో వర్షిష్ఠ ఆ నరో దివశ్చ గ్మశ్చ ధూతయః । యత్ సీమంతం న ధూనుథ ॥ 64

(7) ని వో యామాయ మానుషో దధ్ర ఉగ్రాయ మన్యవే । జిహీత పర్వతో గిరిః ॥ 65

(8) యేషామజ్మేషు పృథివీ జుజుర్వాగ్ం ఇవ విశ్పతిః । భియా యామేషు రేజతే ॥ 66

(9) స్థిరం హి జానమేషాం వయో మాతుర్నిరేతవే । యత్ సీమను ద్వితా శవః ॥ 67

(10) ఉదు త్యే సూనవో గిరః కాష్ఠా అజ్మేష్వత్నత । వాశ్రా అభిజ్ఞు యాతవే ॥ 68

(11) త్యం చిద్ ఘా దీర్ఘం పృథుం మిహో నపాతమమృధ్రమ్ । ప్ర చ్యావయంతి యామభిః ॥ 69

(12) మరుతో యద్ధ వో బలం జనాగ్ం అచుచ్యవీతన । గిరీగ్ంరచుచ్యవీతన ॥ 70

(13) యద్ధ యాన్తి మరుతః సం హ బ్రువతేఽధ్వన్నా । శృణోతి కశ్చిదేషామ్ ॥ 71

(14) ప్ర యాత శీభమాశుభిః సన్తి కణ్వేషు వో దువః । తత్రో షు మాదయాధ్వై ॥ 72

(15) అస్తి హి ష్మా మదాయ వః స్మసి ష్మా వయమేషామ్ । విశ్వం చిదాయుర్జీవసే ॥ 73

## సూక్తము—37

ఋషి—ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు

దేవత—మరుత్తు

(1) గీ॥ కణ్వకులవార్ధి సంజాత ఘనులు మీర, లధికతరమగు బలమును నధిగమింపఁ
గాంక్ష కలదేని మిక్కిలి కాంతిఁగలుఁగ, వాయువును వేడుకొనుఁడు ! తాత్పర్యమెసఁగ ॥ 59

(2) క॥ మచ్చలుగల జింకలపై, నుచ్చధ్వనిఁ జేసికొనుచు నొప్పుగనగలన్
మెచ్చికొని తొడిగికొని యా, వచ్చుమరుద్గణము ప్రీతి వర్ణింపుఁడొగిన్ ॥ 60

(3) క॥ ఆరయ రణమధ్యంబున, వేరు గతుల శౌర్యములను వెలయించెడు స
న్మారక హస్తకళంబుల, మీరిన రావముల విందు మిచట[1]మెలఁగుచున్ ॥ 61

(4) క॥ సహజ స్వభావయుతముం, గుహనాయుత శత్రుకీర్తిఁ గూల్చెడుదానిన్
సహజ బలశాలినంతట, విహరించు మరుద్గణంబు వేడుటతగదే ॥ 62

(5) క॥ ఉల్లసి[2]త మరుత్పంక్తికిఁ, దల్లికిమారుగను బాలఁదగనిచ్చి తదీ
యోల్లములఁజల్లఁజేసిన, పెల్లగు గోమహిమనిపుడె పేర్కొనుఁడు బుధుల్ ॥ 63

(6) క॥ మేలగు వృక్షాగ్రమువలె, వాలాయము[3] లేక భూమి వలయమునంతన్
మీలో నొకఁడే కదలపఁ, జాలెడుపటు శక్తికల్గు జాణయెవండో ॥ 64

(7) ఉ॥ గట్టిగ వీచినట్లయిన కారడవుల్ మఱివృక్షరాజముల్
మిట్టలు పల్లముల్ గలుగు మేదురపర్వత పంక్తులన్నియుం
గట్టడివీడి పెల్లగిలి కంపన మొందుచునుండు నందుచే
గట్టిగ వేశ్మరాజములఁ గట్టుచునుండిరి మానవోత్తముల్ ॥ 65

(8) క॥ మీ మీ గమనములంగని, భూమికడున్ వడఁకుచుండు భువి జీర్ణుండౌ
భూమిపతి, శత్రుభీతిని, నమేయముగ[4] వడఁకుచుండు నాయా యెడలన్ ॥ 66

(9) క॥ నాకమున భూమిలోపల, మీకుంగల బలమునెల్ల మిగుల నునుపఁగా
నాకసము కదలకుండెడు, వీఁక నెగురు పక్షిచయము వినువీథిఁదగన్ ॥ 67

(10) గీ॥ అచ్చటచ్చటఁ దిరుగుచు నచ్చముగను, మాటలాడింపఁ జేయును మారుతంబు
వాయు సంచారముననీరు వర్ధిలంగ, వంగిత్రావఁగఁగల్గెను వానినాలు ॥ 68

(11) క॥ గగనమున మేదు[5]రములై, తొగలుగనున్నట్టి నీలతోయదపంక్తిన్
దగు వర్షమిచ్చు రీతిని, నొగిఁజలియింపంగఁ జేయు మోమారుతమా! ॥ 69

(12,13,14,15) సీ॥ గగనంబు పైనుండు ఘనులు వర్షింప మీస్థిరగమనంబునఁ జేయఁగలరు
బలవంతులగుటచేఁ బ్రాణులు తమపనుల్ నెఱవేర్చునట్లులు నేర్పఁగలరు
వీచునప్పుడుపుట్టు విస్తారశబ్దముల్ చెవులకువిందుగాఁ జేయఁగలరు
పటుజవయుక్త సద్వాహనంబుల నెక్కి యజ్ఞభూమికి మీర లరుగఁగలరు
గీ॥ బుద్ధిశాలురు కణ్వులు బుద్ధిచేయు, ఘనతరంబగు నుతునిఁజేఁగొనఁగలారు
పరమభక్తులమగు మేము బ్రతుకుటకయి, [6]యాయువును మారుతములార! యందనిండు॥ 70

1. మిచటనుండియే. (తొ.పా.) 2. ఉల్లసిత మారుతమునకు (తొ.పా.) 3. వాలాయములేక = నిర్బంధరహితముగా (ఈ అర్థమును సూచించుటకై వ్రాతప్రతిలో వాలాయశబ్దమునకుఁ గ్రిందగీతగీసి ప్రక్కన "నిర్బంధము" అని పేర్కొనఁబడినది. వ.గో.కృ. 4. నమేయముగా వడఁకుచుండు (వ్రా.ప్ర.పా. గణభంగము) నమేయముగా వడఁకునట్లునాయాయెడలన్ (తొ.పా.) గణభంగదోషయుక్తము. వ.గో.కృ. 5. మేదురంబగు (తొ.పా.) 6. మారుతమ! యాయువొసఁగ సమర్థులీరు. (తొ.పా.) వ.గో.కృ.

## సూక్తమ్—38

### ఋషిః—కణ్వోఘౌరః

### దేవతా—మరుతః

### ఛందః—గాయత్రీ

(1) కద్ధ నూనం కధప్రియః పితా పుత్రం న హస్తయోః । దధిధ్వే వృక్తబర్హిషః ॥ 74

(2) క్వ నూనం కద్ వో అర్థం గన్తా దివో న పృథివ్యాః । క్వ వో గావో న రణ్యన్తి ॥ 75

(3) క్వ వః సుమ్నా నవ్యాంసి మరుతః క్వ సువితా । క్వో౩ విశ్వాని సౌభగా ॥ 76

(4) యద్ యూయం పృశ్నిమాతరో మర్తాసః స్యాతన । స్తోతా వో అమృతః స్యాత్ ॥ 77

(5) మా వో మృగో న యవసే జరితా భూదజోష్యః । పథా యమస్య గాదుప ॥ 78

(6) మో షు ణః పరాపరా నిరృతిర్దుర్హణావధీత్ । పదీష్ట తృష్ణయా సహ ॥ 79

(7) సత్యం త్వేషా అమవన్తో ధన్వఞ్చిదా రుద్రియాసః । మిహం కృణ్వన్త్యవాతామ్ ॥ 80

(8) వాశ్రేవ విద్యున్మిమాతి వత్సం న మాతా సిషక్తి । యదేషాం వృష్టిరసర్జి ॥ 81

(9) దివా చిత్ తమః కృణ్వన్తి పర్జన్యేనోదవాహేన । యత్ పృథివీం వ్యున్దన్తి ॥ 82

(10) అధ స్వనాన్మరుతాం విశ్వమా సద్మ పార్థివమ్ । అరేజన్త ప్ర మానుషాః ॥ 83

(11) మరుతో వీళుపాణిభిశ్ చిత్రా రోధస్వతీరను । యాతేమఖిద్రయామభిః ॥ 84

(12) స్థిరా వః సన్తు నేమయో రథా అశ్వాస ఏషామ్ । సుసంస్కృతా అభీశవః ॥ 85

(13) అచ్ఛా వదా తనా గిరా జరాయై బ్రహ్మణస్పతిమ్ । అగ్నిం మిత్రం న దర్శతమ్ ॥ 86

(14) మిమీహి శ్లోకమాస్యే పర్జన్య ఇవ తతనః । గాయ గాయత్రముక్థ్యమ్ ॥ 87

(15) వన్దస్వ మారుతం గణం త్వేషం పనస్యుమర్కిణమ్ । అస్మే వృద్ధా అసన్నిహ ॥ 88

## సూక్తము—38

### ఋషి—ఘోరపుత్రుఁడు కణ్వుఁడు

### దేవత—మరుత్తులు

(1,2,3,4) సీ॥ తండ్రి పుత్రునివలెఁ దగ్గఱఁదీయుచు నుపలాలనముఁజేసి యుంచలేదె!
మీరెటనున్నారొ మీరేడ పోదురో స్వర్గలోకమునకు జరిగినారె!
భూమిని విడనాడి పోకుండనుండరే గోవులవలె మిమ్ముఁ గొలువలేమె!
పశురూపధనమేడ ? ప్రజలును దామేడ ? మణులు తా మేడనోమారుతంబ!
గీ॥ సంపదను [1]దెలియఁజేసెడు సర్వవస్తు, సముదయంబేడ నుండెనో ? సరసులార!
మీరు మానవసంతతి వారలైన, ముక్తినొందును మీదగు భక్తవితతి ॥ 71

(5) గీ॥ గడ్డిఁదిను [2]పశువు ప్రీతిని గడ్డివిడువ, కుండునట్టులు తాఁబురుషుండెవండు
తావకంబగు నుపచారతతిని విడువఁ, దతఁడు యమపురికేగక యలరు[3]సుండు ॥ 72

(6,7,8,9) సీ॥ బలశాలి వరులలో బలవంతుఁడైన యానిరృతి యాశలతోడ నీల్గుఁగాక
రుద్రపాలితమగు భద్రమారుతమెల్ల వర్షముంగురిపించి వరలుఁగాకఁ
గ్రొత్తగానీనిన గోవునార్పులభంగి నురుములు పెల్లుగా వరలుఁగాక
మారుతంబురుములతో రహిమీరంగ వానను గురిపించి వరలుఁగాక,
గీ॥ బగటివేళల సయితము మొగుళులన్ని, యాకసంబంతఁగప్పుచు నతిశయించి
పుడమి యంధత్వమునఁబడి పొక్కునటుల, చీకటులు క్రమ్మవిధమును జేయుఁగాక ॥ 73

(10) క॥ మారుతములు గర్జించుచు, సారముతో వీచునపుడు సకలజగతి ని
స్సారములగు సదనంబులు, నీరస మానవులతోడ నెటి[4]ఁగదలుసుమా! ॥ 74

(11) క॥ అరయ మరుత్తులు దృఢతర, కరములుగల వారలవుచుఁ గల్లోలవతీ
వరములను నాశ్రయించుచు, నిరతము చరియింత్రుగాత నిర్మలబుద్ధిన్ ॥ 75

1, 2. ఈ రెండు నెడలఁ బంచలము గణమును నింద్రగణముగాఁ బ్రయోగించుట జరిగినది. వ.గో.,కృ. 3. (చుమా: చుండుట) సుమా సుండువంటి వానికి మూలము. 4. నెట్టకదలవే (తొ.పా)

(12) క॥ మీరథములు సుస్థిరములు, మీరథముల గుఱ్ఱములు నమేయములౌ మీ
వీరంబులఁ గనపరచుచు, నారధికపు వాగె లందుఁడా[1]ర్యులు: మీరల్ ॥ 76

(13) గీ॥ మంత్రమును హవ్యమందుంచు మారుతమును, జిత్రభానుని మిత్రుఁబవిత్రరీ[2]తి
తోడ నొజ్జలు వివిధ సంస్తుతులవలన, వేడెదరుగాకఁ గడుఁగడువేడ్క మీర ॥ 77

(14) క॥ నీవే యొక సంస్తోత్రము, భావనచేఁ దెలిసికొనుచుఁ బఠియించి తగం
జీవనము గుఱియునట్టులు, పావన గాయత్రిఁగూడఁ బఠియింపవొకో: ॥ 78

(15) క॥ వెలుఁగునది పొగడఁదగినది, పలువురకుం బూజ్యమైన భవ్యమరుత్తున్
సులలితముగఁ బూజించినఁ, దలఁచి మరుత్సంచయంబు దయఁగాంచు సుమా: ॥ 79

## సూక్తమ్ 39

ఋషిః—కణ్వోఘౌరః

దేవతా- మరుతః

*ఛందః—ప్రగాథః—విషమాబృహత్యః, సమాః సతోబృహత్యః

(1) ప్ర యదిత్థా పరావతః శోచిర్న మానమస్యథ ।

కస్య క్రత్వా మరుతః కస్య వర్పసా కం యాథ కం హ ధూతయః ॥ 89

(2) స్థిరా వః సన్త్వాయుధా పరాణుదే వీళూ ఉత ప్రతిష్కభే ।

యుష్మాకమస్తు తవిషీ పనీయసీ మా మర్త్యస్య మాయినః ॥ 90

(3) పరా హ యత్ స్థిరం హథ నరో వర్తయథా గురు ।

వి యాథన వనినః పృథివ్యా వ్యాశాః పర్వతానామ్ ॥ 91

1. డయ్యా: కరములన్ (తొ.పా.) ఇక్కడ "ఆర్యులు" ఆర్యులారా: అనునర్థములో సంబోధనార్థకముగా ప్రయోగింపఁబడినది.
2. వాక్కు।తోడనొజ్జలువివిధ సంస్తుతులొనర్తు (ర్తు9) కాత నిస్సీమభక్తిసంప్రీతులగుచు॥ (తొ.పా,) వ్రాయసగాఁడెవరోగాని మూలములో ఒనర్తు9 వంటిచోట్ల పెక్కుసందర్భములలో "ర్తు" అనునక్షరము వ్రాయుటజరిగినది. పూర్వము క్రావడిని ‿ గుర్తుతోను వట్రువసుడి గుర్తును దలక్రిందుచేసి 9 గాను నిర్దేశించెడివారు. ఈ తలక్రిందుగా వ్రాయవలసిన వట్రువసుడి గుర్తును సీవాఁతరి వట్రువసుడిగానే వ్రాసివేయుట జరిగినది. వం.గో.కృ,

* ప్రగాథః బార్హతమ్—(పా)

(4) నహి వః శత్రుర్వివిదే అధి ద్యవి న భూమ్యాం రిశాదసః ।

యుష్మాకమస్తు తవిషీ తనా యుజా రుద్రాసో నూ చిదాధృషే ॥ 92

(5) ప్ర వేపయన్తి పర్వతాన్ వి విఞ్చన్తి వనస్పతీన్ ।

ప్రో ఆరత మరుతో దుర్మదా ఇవ దేవాసః సర్వయా విశా ॥ 93

(6) ఉపో రథేషు పృషతీరయుగ్ధ్వం ప్రష్టిర్వహతి రోహితః ।

ఆ వో యామాయ పృథివీ చిదశ్రోదబీభయన్త మానుషాః ॥ 94

(7) ఆ వో మక్షూ తనాయ కం రుద్రా అవో వృణీమహే ।

గన్తా నూనం నోఽవసా యథా పురేత్థా కణ్వాయ బిభ్యుషే ॥ 95

(8) యుష్మేషితో మరుతో మర్త్యేషిత ఆ యో నో అభ్వ ఈషతే ।

వి తం యుయోత శవసా వ్యోజసా వి యుష్మాకాభిరూతిభిః ॥ 96

(9) అసామి హి ప్రయజ్యవః కణ్వం దద ప్రచేతసః ।

అసామిభిర్మరుత ఆ న ఊతిభిర్గన్తా వృష్టిం న విద్యుతః ॥ 97

(10) అసామ్యోజో బిభృథా సుదానవోఽసామి ధూతయః శవః ।

ఋషిద్విషే మరుతః పరిమన్యవ ఇషుం న సృజత ద్విషమ్ ॥ 98

## సూక్తము—39

### ఋషి—ఘోరపుత్రుఁడు కణ్వుఁడు

### దేవత—మరుత్తులు

(1) ఉ॥ దేవుఁడు తీక్ష్ణదీధితుఁడు దివ్యకరోద్ధిత తేజమంతయున్
భూవలయంబు పైకెపుడుఁ బొల్పెసలారఁగఁ బంపునట్లుగా
స్థావర జంగమంబులను జాలఁగ[1]దల్చు మరుద్గణంబ! మా
కేవలనైన నిద్ధబలమిచ్చి కృతార్థులుగా నొనర్పుమా! ॥ 80

గీ॥ బలముతోమీరు పుడమిపై మెలఁగుచున్న, జనులు యాగంబులన్ మీకు జరుపఁగలరె
యప్పుడెవ్వరు మిమ్ముల నాశ్రయింత్రు, కాన మెల్లఁగవీచుమో గాలులార! ॥ 81

(2) క॥ మీకుఁగల యాయుధంబులు, మీకుంగల బలము కలిమి మేదినిలో స్తు
త్యాకరమై వెలుఁగొందవె, నాకాధిప! శత్రుగణ వినాశముకొఱకై ॥ 82

(3) చ॥ బహువిధశాఖి శాఖలను భగ్నమొనర్చుచుఁగాన నాశి భూ
రుహముల మధ్యభాగముల రూఢిగఁజొచ్చుచు నెల్లవేళలం
గుహలుగలట్టి కొండలకు గొబ్బునఁబోయి దిగంతరంబులన్
బహుగతులం జరించుతను బా[2]వన మారుతమంత నేతయై ॥ 83

(4) గీ॥ అచలమందు మఱియు నంతరిక్షంబందు, నరయమీకుఁగలదె యరిగణంబు
యుష్మదీయ పూర్ణయోగంబునన్ మాకు, బలము వృద్ధిఁ బొందవలయు వేగ ॥ 84

(5) ఉ॥ మేరుమహీధర ప్రముఖమేదుర పర్వతముల్ చలింపఁగా
సారమహీరుహావళియుఁజాలగఁ గంపనమొంద మీరు స
ద్వీరన[3]రాభి యుక్తులయి వేయివిధంబుల సంచరింపుఁడీ
యోరిమివీడి మత్తజనులుర్విఁ జరించెడు కైవడిన్ వడిన్ ॥ 85

(6) క॥ సురు[4]చిరతను మృగయువతులు, సరసముగాఁ బూన్పఁబడి యెసంగురథముపై
సరసులు మీరు మరుత్తులు!, యరుదెంచిన జనులు భీతినందెదరుసుఁడీ॥ 86

(7,8,9,10) సీ॥ మాకు రక్షలనిచ్చి మన్నించినట్లు మా పుత్రులరక్షకై పూనవలయు
మాపైకివచ్చెడి మానవవైరిని బలమును నడఁచి పంపంగవలయు
వైద్యుతాగ్ని ప్రభల్ వాననంపెడురీతి గాలులుమాకిలఁ గలుగవలయు
సంపూర్ణబలరాశి సాంగత్యమును గల్గఁజేసి మమ్ములను రక్షింపవలయు

గీ॥ వైరిమీఁదికి బాణముల్ వైచునట్టి, మునిజన ద్వేషులంజంపఁ జనెడునట్టి
హంతకుని సృష్టిఁజేయుచు హవ్యములను, వరుసఁగొని గోర్కెలిచ్చి ప్రోవంగవలయు ॥ 87

1. జాలఁగదల్చెడు మారుతంబ! (తొ.పా.) 2. చరించుతను (వ్రా.ప్ర.పా.) చరింగెడుత (తొ.పా.) 3. ప్రజావిశిష్టులయి. (తొ.పా.
4. కరమరుదుగ (తొ.పా.)

## సూక్తమ్—40

### ఋషిః—కణ్వోఘౌరః

### దేవతా—బ్రహ్మణస్పతిః

### *ఛందః—ప్రగాథః—విషమా బృహత్యః, సమాః సతో బృహత్యః

(1) ఉత్తిష్ఠ బ్రహ్మణస్పతే దేవయంతస్త్వేమహే ।

ఉప ప్ర యన్తు మరుతః సుదానవ ఇంద్ర ప్రాశూర్భవా సచా ॥ 99

(2) త్వామిద్ధి సహసస్పుత్ర మర్త్య ఉపబ్రూతే ధనే హితే ।

సువీర్యం మరుత ఆ స్వశ్వ్యం దధీత యో వ ఆచకే ॥ 100

(3) ప్రైతు బ్రహ్మణస్పతిః ప్ర దేవ్యేతు సూనృతా ।

అచ్ఛా వీరం నర్యం పఙ్క్తిరాధసం దేవా యజ్ఞం నయన్తు నః ॥ 101

(4) యో వాఘతే దదాతి సూనరం వసు స ధత్తే అక్షితి శ్రవః ।

తస్మా ఇళాం సువీరామా యజామహే సుప్రతూర్తిమనేహసమ్ ॥ 102

(5) ప్ర నూనం బ్రహ్మణస్పతిర్మంత్రం వదత్యుక్థ్యమ్ ।

యస్మిన్నింద్రో వరుణో మిత్రో అర్యమా దేవా ఓకాంసి చక్రిరే ॥ 103

(6) తమిద్ వోచేమావిదథేషు శంభువం మంత్రం దేవా అనేహసమ్ ।

ఇమాం చ వాచం ప్రతిహర్యథా నరో విశ్వేద్ వామా వో అశ్నవత్ ॥ 104

* ప్రగాథః చార్హతమ్. (పా)

(7) కో దేవయన్తమశ్నవజ్ జనం కో వృక్త బర్హిషమ్ ।

ప్రప్ర దాశ్వాన్ పస్త్యాభిరస్థితాఽన్తర్వావత్ క్షయం దధే ॥ 105

(8) ఉప క్షత్రం పృఞ్చీత హన్తి రాజభిర్భయే చిత్ సుక్షితిం దధే ।

నాస్య వర్తా న తరుతా మహాధనే నార్భే అస్తి వజ్రిణః ॥ 106

## సూక్తము—40

### ఋషి—ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు*

### దేవత—బ్రహ్మణస్పతి

(1) గీ॥ బ్రహ్మణస్పతి దేవ! మా ప్రార్థనలను, సాదరంబుగ నాలింపు సరసమతిని
బ్రహ్మణస్పతిఁ గూడుచు వాసవుండు, సోమరసమును ద్రావవచ్చుతనుప్రీతి ॥ 88

(2) క॥ మనుజుఁడునిను బలపుత్రుఁడ!, వినయమునన్వేఁడుచుండు విత్తముకొఱకై
ఘనులైన మరుత్తులు తా, మనయము స్తో[1]తలకునిచ్చు నాయాధనముల్ ॥ 89

(3) గీ॥ బ్రహ్మణస్పతి మ[2]మ్ముఁబొంది వరలుఁగాక, నలసరస్వతి ప్రత్యక్ష మగునుగాక
దేవతలు వీరవైరి వధించికరుణ, మనుజ హిత యాగమునకు మ[3]మ్మనుపుఁగాక ॥ 90

(4) ఉ॥ పావన మానవావళికి భద్రమహోముని పంక్తి కెప్పుడే
నేవిధినైన విత్తమును నిచ్చెడివానికిఁ గీ[4]ర్తికాంత సు
స్థావరమై చెలంగుతఁ[5] బ్రశస్తుఁడు పూరుషుఁడిష్టసిద్ధికై
దేవత, వీరయోధయుత దివ్యనిశాసతి, వేఁడు[6]గాకొగిన్ ॥ 91

(5) గీ॥ పాకశాసన ముఖ్యులౌ పండితులకుఁ, దానమెయ్యది యుండెను దలఁచిచూడ
నట్టి మంత్రవరంబంత నధిక[7]తుష్టి, బ్రహ్మణస్పతి పల్కెను బరమభక్తి ॥ 92

* సంస్కృతమూలములో "కణ్వోఘౌరః'' అని ఘోరపుత్రుఁడగు కణ్వుఁడని కలదు, ఆంధ్రానువాద మూలములో (1వ. సంపుటము 171వ పుటలో)ని 40వ సూక్తమునకు ''ఘోరపుత్రుఁడు కణ్వపుత్రుఁడు'' ఋషిగాఁగలదు. ఇది పొరపాటు కావచ్చును. లేదా వేరేదైన సంస్కృత మూలములో నిరువురు ఋషులు పేర్కొనఁబడియుండ నగును. అయినను ఘోరపుత్రుని పేరు కణ్వపుత్రునిపేరు పేర్కొనని లోపముండితీరును, ఈ లోపమును దృష్టిలోనుంచుకొనియే లభ్యములైన మూలములననుసరించి పై విధముగా సవరింపఁబడినది. వ.గో.కృ.

1. భక్తులకు నిచ్చునాయాధనముల్. (తొ.పా.) 2. మముఁబొందలవయునలువ, రాణి ప్రత్యక్షమై విరాజిల్లవలయు (తొ.పా.యతిభంగము) వ.గో.కృ. 3. మమ్మనుపవలయు (తొ.పా.) 4. గీర్తిభామిని (తొ.పా.) 5, చెలంగుగద చయ్యన (తొ,పా.) 6. వేడఁగావలెన్ (తొ.పా,) 7 ప్రీతి. (తొ.పా.)

(6) క॥ సురహితమగు మంత్రంబున్[8], వరయజ్ఞములందు మేము వర్ణించెదమో
సురవీరులార! యస్మ, ద్విరచితమగు మంత్రవాక్కు వేగఁబలుకుఁడీ! ॥ 93

(7,8) సీ॥ బ్రహ్మణస్పతి భక్తవరులను రక్షించు సోమయజ్ఞములకు శోభఁగూర్చు
సోమిదమ్మనుగూడు సోమయాజిని దేవయజన దేశంబున కరుఁగఁజేయు
పశుపాదులంగూడి వైరులంద్రుంచుచు యజమానులను యుద్ధమందుఁబ్రోచు
వజ్రాయుధము గల్గువాఁడయి యనిలోన సారమతిందాను సంచరించు
గీ॥ గొప్ప యుద్ధములకునైనఁ గొంకకచను, [9]జల్ప యుద్ధమునైనను జక్కఁబెట్టు
నెవ్వఁడీతని యధికారమేవగించు, నెవ్వఁడీతని దరిఁజేరి యేపుఁజూపు ॥ 94

## సూక్తమ్—41

ఋషిః—కణ్వోఘౌరః

దేవతా—వరుణమిత్రార్యమణః, 4-6 ఆదిత్యాః

ఛందః—గాయత్రీ

(1) యం రక్షన్తి ప్రచేతసో వరుణో మిత్రో అర్యమా । నూ చిత్ స దభ్యతే జనః ॥ 107

(2) యం బాహుతేవ పిప్రతి పాన్తి మర్త్యం రిషః । అరిష్టః సర్వ ఏధతే ॥ 108

(3) వి దుర్గా వి ద్విషః పురో ఘ్నన్తి రాజాన ఏషామ్ । నయన్తి దురితా తిరః ॥ 109

(4) సుగః[1] పన్థా అనృక్షర ఆదిత్యాస ఋతం యతే । నాత్రావఖాదో అస్తి వః ॥ 110

(5) యం యజ్ఞం నయథా నర ఆదిత్యా ఋజునా పథా । ప్ర వః స ధీతయే నశత్ ॥ 111

(6) స రత్నం మర్త్యో వసు విశ్వం తోకముత త్మనా । అచ్ఛా గచ్ఛత్యస్తృతః ॥ 112

8. మంత్రంబిది. (తొ.పా.) 9. స్వల్పయుద్ధము (వ్రా.ప్ర.పా.)
1. సుగా పన్థా (వ్రా.ప్ర.)

(7) కథా రాథామ సఖాయః స్తోమం మిత్రస్యార్యమ్ణః । మహి ప్సరో వరుణస్య ॥ 113

(8) మా వో ఘ్నంతం మా శపన్తం ప్రతి వోచే దేవయన్తమ్ । సుమ్నైరిద్ వ ఆ వివాసే ॥ 114

(9) చతురశ్చిద్ దదమానాద్ బిభీయాదా నిధాతోః । న దురుక్తాయ స్పృహయేత్ ॥ 115

## సూక్తము—41

### ఋషి—ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు

### * దేవత—1-3, 7-9 వరుణుఁడు, 4-6 ఆదిత్యులు

(1,2) క॥ వరుణాది రక్షితుండగు, నరుఁడుదునుము శత్రువులను నాయకుఁడగుచున్
వరుణాదులు ధనమిడెదరు, వరుణాది సురక్షితుండు వర్ధిలునెపుడున్ ॥ 95

(3) క॥ వరుణుండాదిగ రాజులు, తిరముగయజమాన శత్రుతీవ్రతను మహా
దురితౌఘములన్ వెండియు, నరి పట్టణములనునెల్ల న[1]డఁచి వెలుఁగుతన్ ॥ 96

(4,5.6,7,8) సీ॥ యాగార్థులగుమీరు యాగమార్గంబెల్ల సుగమంబుఁ జేసికొంచును వెలుఁగుఁడు
చవిఁజూడ యోగ్యమౌ సరసహవిస్సును గడుపార మెసఁగి సౌఖ్యంబుఁగనుఁడు
పరిశుభ్ర మార్గముం బట్టునట్టుల హవ్యమెంతేని భక్షించి తృప్తిఁగొనుఁడు
భవదీయ రక్షిత భక్తులందఱకయి రత్నరాశులఁ గూర్మిఁ గ్రాలనిండు
గీ॥ మిత్రుఁడా![2] వరుణదేవ! మీ స్తోత్రములను, భీతిచేనొండె శాపాదిభీతినొండె
నేము రచియింప[3]కుందుము నీమమలర, సర్థ వాంఛనొనర్తుము ప్రార్థనంబు ॥ 97

(9) ఉ॥ చంపెడివానినైన మఱి శాపమునిచ్చెడి వానినైన వేఁ
జ[4]ంపుమటంచుఁ బల్కుట విచార దురుక్తియెగాన దానికే
వంపును లేక భీతిఁగొను భక్తుఁడు, నాల్గు కపర్దకంబులన్
సొంపుగ నాడుదాఁక,ఁగడుజూదరి తా భయ మొందునట్లుగాన్ ॥ 98

* సంస్కృతములో 1,2.3,7,9 ఋక్కులకు వరుణ మిత్రార్యమలు దేవతలుఁగాఁ బేర్కొనఁబడినది. ఆంధ్రానువాదములో 4-6 ఋక్కులకు భిన్నములైన యీ ఋక్కులకు వరుణుఁడొక్కఁడే దేవతగాఁ బేర్కొన్నను ననువాదపద్యములో వరుణాది అని ఆదిశబ్దము ప్రయోగింపఁబడినది. ఇది గమనార్హము. వ.గో.కృ. 1. నరిపట్టణములను నెల్లనడచుచుగాతన్ (తొ.పా.) 2. ఇక్కడ నింద్రగణమునకు మారు చంద్రగణమైన 'భలము' ప్రయుక్తమైనది వ.గో.కృ. 3. నుండోపహితలు (తొ.పా. పాదమసమగ్రము.) 4. వేజంపపటంచు (వ్రా.ప్ర.పా.) "చంపుము" అను నర్థమున వ్యావహారిక భాషాప్రభావమున నీప్రయోగము చేయఁబడినది. వ.గో.కృ.

## సూక్తమ్—42

ఋషిః—కణ్వోఘౌరః

దేవతా—పూషా

ఛందః—గాయత్రీ

(1) సం పూషన్నధ్వన స్తిర వ్యంహో విముచో నపాత్ । సక్ష్వా దేవ ప్ర ణస్పురః ॥ 116

(2) యో నః పూషన్నఘో వృకో దుఃశేవ ఆదిదేశతి । అప స్మ తం పథో జహి ॥ 117

(3) అప త్యం పరిపన్థినం ముషీవాణం హురశ్చితమ్ । దూరమధి స్రుతేరజ ॥ 118

(4) త్వం తస్య ద్వయావినో ఽఘశంసస్య కస్య చిత్ । పదాభి తిష్ఠ తపుషిమ్ ॥ 119

(5) ఆ తత్ తే దస్ర మన్తుమః పూషన్నవో వృణీమహే । యేన పితౄనచోదయః ॥ 120

(6) అధా నో విశ్వసౌభగ హిరణ్యవాశీమత్తమ । ధనాని సుషణా కృధి ॥ 121

(7) అతి నః సశ్చతో నయ సుగా నః సుపథా కృణు । పూషన్నిహ క్రతుం విదః ॥ 122

(8) అభి సూయవసం నయ న నవజ్వారో అధ్వనే । పూషన్నిహ క్రతుం విదః ॥ 123

(9) శగ్ధి పూర్ధి ప్ర యంసి చ శిశీహి ప్రాస్యుదరమ్ । పూషన్నిహ క్రతుం విదః ॥ 124

(10) న పూషణం మేథామసి సూక్తైరభి గృణీమసి । వసూని దస్మమీమహే ॥ 125

## సూక్తము—42

### ఋషి—ఘోరుఁడు*

### దేవత—మరుత్తులు†

(1) గీ॥ జలవిమోచన హేతుకః జలదపుత్ర! మాకుఁబ్రత్యక్షముగ నుండి మాకు విఘ్న
హేతువగు పాపమునుగొట్టి హెచ్చరించి, మా నివాసంబులకుఁ జేర్చుమమ్ముఁ బూష!॥ 99

(2) క॥ బాముల(బెట్టెడు దుష్టుఁడు, కామనచే ధనము గొనెడు కష్టాత్మకుఁడుం
దామసుఁడౌ వృకరాజును, సోమించి తొలంగఁజేయు సుస్థిరమతితోన్ ॥ 100

(3,4,5,6,7,) సీ॥ దారులనడిగట్టు తస్కరుంజేఁబట్టి దూరదేశములకుఁ దోలవేమి ?
ద్వివిధాపహారకు ద్వేషిని భవదీయ చరణంబుచే వెసఁజంపవేమి ?
యంగిరః పితరుల నాదరించిన భంగి మమ్ముల రక్షింప మరలవేమి ?
సౌభాగ్యవంతుఁడా! స్వర్ణమయాయుధ సిరుల సిద్ధంబుగాఁ జేయవేమి ?
గీ॥ కష్టములఁబెట్టు నరులఁ జక్కాడవేమి?, పరమ శుభమార్గమునమమ్ముఁ బంపవేమి ?
నిఖిల మానవగణ దర్శనీయదేవ!, యరసి రక్షింపవేమి మహానుభావ! ॥ 101

(8,9,10) సీ॥ ఓషధీలతచేత నొప్పారు భూమికినొంపుగా మమ్ముల నంపవలదె!
‡మార్గమందుఁ జరించుమాకు వేరొక దుఃఖసరణి రాకుండగాఁ జలుపవలదె!
కోరిన వస్తువుల్ గొమరొప్పనిచ్చుచు దీక్షంబుగా మమ్ముఁ దీర్పవలదె!
మధురాన్నములతోడ మాకుక్షినింపుచు నుపకారఫలమును నొందవలదె!
గీ॥ పూష! నినుఁదిట్టమెప్పుడు ఁబూర్ణమైన, సూక్తితతి వేడుకొనెదము శోభగలుగ
ధనకనక వస్తువాహన ధాన్యములను, నీయుమని యడుగుచున్నార మీయవలదె!॥ 102

* ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు అని సంస్కృత మూలప్రతులలో నున్నది. దీనికి ఋషిని ఘోరుఁడుగాఁ బేర్కొనుట ప్రమాదభరితమో ప్రత్యంతర ప్రామాణికమో కావచ్చును. వ.గో.కృ.

† సంస్కృతమూలములో "పూష" దేవతగా ఁబేర్కొనఁబడినది. అనువాదములో మరుత్తులని పేర్కొన్నను అనువాద రచనలో "పూష" శబ్దము సైతముపయోగింపఁబడినది. వ.గో.కృ.

‡ మార్గమందుఁజరించు— ఈ మంత్రములనుబట్టి ఆర్యులు స్థిరముగా నొకదేశమున నివసించువారు కారనియు దేశదిమ్మరులనియుఁ గొందరు పాశ్చాత్యపండితుల యభిప్రాయము. కాని యట్లనుట యవివేకము. వేదమంత్రముల యంతట నార్యులకుఁ బురములు, స్వర్ణమయపురములు సుక్షేత్రములు, శతస్తంభాట్టాలికలు, యజ్ఞమందిరములు, న్యాయస్థానములు మొదలగునవి కలవని వర్ణింపఁబడుచుండఁగా వారట్లేల యోహించిరో తెలియదు వారిలోఁ గొందరు రాజ్యసంపాదనేచ్ఛతో నితర దేశములకు వలస పోయినపుడా దేశపరిస్థితులు వారికి సరిపడనందున నీసూక్తముల మరుత్తులను ప్రార్థించి యుండవచ్చును. (నే.వేం.న.శా.)

సూచన— ఈ సూక్తము కేవలము లౌకికార్థదాయకమన్న దృష్టితో నీ విమర్శ చేయఁబడినది. ఆర్యుల స్వర్ణమయాది పురముల వర్ణన కలదన్న ఋక్కుల విషయమెంత వాస్తవికమో యిదియునంతియే వాస్తవికము. వ.గో.కృ.

## సూక్తమ్—43

### ఋషిః—కణ్వోఘౌరః

### దేవతా—రుద్రః, 3 రుద్రః మిత్రావరుణౌచ, 7-9 సోమః

### ఛందః—గాయత్రీ, 9 అనుష్టుప్.

(1) కద్ రుద్రాయ ప్రచేతసే మీ[1]ఢ్హుష్టమాయ తవ్యసే । వోచేమ శంతమం హృదే ॥ 126

(2) యథా నో అదితిః కరత్ పశ్వే నృభ్యో యథా గవే । యథా తోకాయ రుద్రియమ్ ॥ 127

(3) యథా నో మిత్రో వరుణో యథా రుద్రశ్చికేతతి । యథా విశ్వే సజోషసః ॥ 128

(4) గాథపతిం మేధపతిం రుద్రం జలాషభేషజమ్ । తచ్ఛంయోః సుమ్నమీమహే ॥ 129

(5) యః శుక్ర ఇవ సూర్యో హిరణ్యమివ రోచతే । శ్రేష్ఠో దేవానాం వసుః ॥ 130

(6) శం నః కరత్యర్వతే సుగం మేషాయ మేష్యే । నృభ్యో నారిభ్యో గవే ॥ 131

(7) అస్మే సోమ శ్రియమధి ని ధేహి శతస్య నృణామ్ । మహి శ్రవస్తువినృమ్ణమ్ ॥ 132

(8) మా నః సోమపరిబాధో మారాతయో జుహురన్త । ఆ న ఇందో వాజే భజ ॥ 133

(9) యాస్తే ప్రజా అమృతస్య పరస్మిన్ ధామన్నృతస్య ।

మూర్ధా నాభా సోమ వేన ఆభూషన్తీః సోమ వేదః ॥ 134

1. మీళహుష్ట (వా.ప్ర.) మీఢుష్ట (సా.మా.)

## సూక్తము—43

†ఋషి—ఘోరపుత్రుఁడగు కణ్వుఁడు

* దేవత—రుద్రుఁడు, 3—రుద్రమిత్రావరుణులు, 7—9. సోముఁడు

(1,2) గీ॥ మానసాహ్లాదకరుఁడగు మాన్యరుద్ర, దేవు భజియించెదము మేము కావుమనుచు
నశ్వమానవ సంతతి కఖిలమునకు, నదితిరుద్రియమిడుఁగాతమెదఁదలంచి॥ 103

(3) క॥ మిత్రా వరుణుల పగిదిన్, మైత్రింగొని రుద్రుఁడధిక మహాత్మ్యమునం
జిత్రముగమమ్ము నెఱుఁగుత, స్తోత్రంబుల నందుకొనెడి సురగణమువలెన్॥ 104

(4) గీ॥ ‡ఉదకరూపౌషధములకు నుత్తమాధ్వ, రంబులకు సూక్తులకుఁ గూడరాయఁడైన
రుద్రుయాచింతు మెప్పుడు భద్రమతిని, నిష్టమానవ జాతికి హితముఁగోరి॥ 105

(5) క॥ బంగరువలె, రవిలాగు వె, లింగెడు రుద్రుండు, సకలలీలాస్పదులౌ
రంగ[1]త్సుర వర్గములో, నం గడునుత్తముఁడె సద్గుణంబుల నెంచన్॥ 106

(6,7,8,9) సీ॥ అశ్వమేషములకు నంగనా[2]మణులకు నరులకు సుఖముచెన్నారఁజేసి
జనశతకమునకుఁ జారుధనంబిచ్చి, యధికముగా వారి నాదరించి
సోమారిబృందంబు సీమమలరఁద్రుంచి సవనకర్తలకు సచ్ఛక్తినిచ్చి
మరణవర్జితుఁడవై మఖమున కరుదెంచి యుత్తమవేదిక నుండవచ్చి
గీ॥ భక్తిగణములఁజేరిచి పరిధవిల్లి, కూర్మితోహారలకుఁ బెంపుఁగోరి యొసఁగి
యవ్యయానంద సుఖములనందఁజేసి, సోముఁడా! వారికీయుము సోమరసము॥ 107

## అనువాకః—9 సూక్తమ్—44

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః*

దేవతా—అగ్నిః, 1-2 అగ్నిః. అశ్వినౌ, ఉషాశ్చ.

† ఛందః—ప్రగాథః— విషమాబృహత్యః, సమాః సతోబృహత్యః

(1) అగ్నే వివస్వదుషసశ్ చిత్రం రాధో అమర్త్య ।

అ దాశుషే జాతవేదో వహా త్వమద్యా దేవాగ్ం ఉషర్బుధః ॥ 135

† ఆంధ్రానువాదములో (1వ సంపుటము-177వ పుటలో) 43వ సూక్తమునకు ఋషి- దేవతలు వ్రాయఁబడలేదు. కాని యనువాదపద్యములలో మాత్రము సంస్కృత మూలమునననుసరించి యిచ్చిన దేవతల విషయమే కలదు. వ.గో.కృ.

‡ ఉదకరుపౌషధములు—ఇట్టి యౌషధముల నెరింగియున్న ఆర్యుల వైద్యవిద్య యెంతవరకభివృద్ధి గాంచినదో పాఠకులే తెలిసికొనెదరు గాక. (నే.వేం.న.శా.)

సూచన—ఇతరౌషధముల దృష్టితోఁ జూచినప్పుడీ యుదకౌషధములు గొప్పవికానేకావు. ఇది మాటవరసకు వ్రాసినమాట. అసలీ ఋక్కుల కున్న యర్థమేవేరు. వ.గో.కృ.

1. మంగళకరత్రిదశులలో (తొ.పా.) 2. నంగనామణులకు (వ్రా.ప్ర.పా.)

* ప్రస్కణ్వునకు మారుగా "పారస్కర" ఋషికొన్నిట ఁపేర్కొనఁబడినాఁడు. వ.గో.కృ. † ప్రగాథః బార్హతమ్. (పా.)

(2) జుష్టో హి దూతో అసి హవ్యవాహనో ऽగ్నే రథీరధ్వరాణామ్ ।

సజూరశ్విభ్యాముషసా సువీర్యమస్మే ధేహి శ్రవో బృహత్ ॥ 136

(3) అద్యా దూతం వృణీమహే వసుమగ్నిం పురుప్రియమ్ ।

ధూమకేతుం భాఋజీకం వ్యుష్టిషు యజ్ఞానామధ్వరశ్రియమ్ ॥ 137

(4) శ్రేష్ఠం యవిష్ఠమతిథిం స్వాహుతం జుష్టం జనాయ దాశుషే ।

దేవాగ్ం అచ్ఛా యాతవే జాతవేదసమగ్నిమీళే వ్యుష్టిషు ॥ 138

(5) స్తవిష్యామి త్వామహం విశ్వస్యామృత భోజన ।

అగ్నే త్రాతారమమృతం మియేధ్య యజిష్ఠం హవ్యవాహన ॥ 139

(6) సుశంసో బోధి గృణతే యవిష్ఠ్య మధుజిహ్వః స్వాహుతః ।

ప్రస్కణ్వస్య ప్రతిరన్నాయుర్జీవసే నమస్యా దైవ్యం జనమ్ ॥ 140

(7) హోతారం విశ్వవేదసం సం హి త్వా విశ ఇన్ధతే ।

స ఆ వహ పురుహూత ప్రచేతసో ऽగ్నే దేవాగ్ం ఇహ ద్రవత్ ॥ 141

(8) సవితారముషసమశ్వినా భగమగ్నిం వ్యుష్టిషు క్షపః ।

కణ్వాసస్త్వా సుతసోమాస ఇంధతే హవ్యవాహం స్వధ్వర ॥ 142

(9) పతిర్హ్యధ్వరాణా మగ్నే దూతో విశామసి ।

ఉషర్బుధ ఆ వహ సోమపీతయే దేవాగ్ం అద్య స్వర్దృశః ॥ 143

(10) అగ్నే పూర్వా అనూషసో విభావసో దీదేథ విశ్వదర్శతః ।

అసి గ్రామేష్వవితా పురోహితో ऽసి యజ్ఞేషు మానుషః ॥ 144

(11) ని త్వా యజ్ఞస్య సాధనమగ్నే హోతారమృత్విజమ్ ।

మనుష్వద్ దేవ ధీమహి ప్రచేతసం జీరం దూతమమర్త్యమ్ ॥ 145

(12) యద్ దేవానాం మిత్రమహః పురోహితో ऽన్తరో యాసి దూత్యమ్ ।

సిన్ధోరివ ప్రస్వనితాస ఊర్మయో ऽగ్నేర్భ్రాజన్తే అర్చయః ॥ 146

(13) శ్రుధి శ్రుత్కర్ణ వహ్నిభిర్దేవైరగ్నే సయావభిః ।

ఆ సీదన్తు బర్హిషి మిత్రో అర్యమా ప్రాతర్యావాణో అధ్వరమ్ ॥ 147

(14) శృణ్వన్తు స్తోమం మరుతః సుదానవో ऽగ్నిజిహ్వా ఋతావృధః ।

పిబతు సోమం వరుణో ధృతవ్రతో ऽశ్విభ్యాముషసా సజూః ॥ 148

## అనువాకము - 9, సూక్తము 44

### ఋషి—ప్రకణ్వుఁడు*

### దేవత—అగ్ని

(1) గీ॥ చావులేనివాఁడ! సర్వసంపత్కర!, వహ్ని! యుషసు[1] దేవివలన మాకుఁ
జిత్రమైన ధనముఁ జేర్చి యుషఃకాల, మందుఁ బిలువుమయ్య! యమరవరుల॥ 108

* కణ్వపుత్రుఁడగు ప్రస్కణ్వుఁడని సంస్కృతమూలము. కాని తెలుఁగు మూలవ్రాతప్రతిలో సకారరహితముగా ''ప్రకణ్వుఁడు'' అనియే పేర్కొనఁబడినది, ఇది లేఖక ప్రమాదము కానోపు. ప్రస్కణ్వునకుఁ బారస్కరుఁడని నామాంతరమున్నదేమో ! వ.గో.కృ. 1. యుషో దేవివలన (వ్రా. ప్ర. పా. గణభంగము). వ.గో.కృ.

(2) మ॥ సురదూతుండవు హవ్య వాహనుఁడవున్ శోభిల్లు యాగాళికి
స్సురథప్రాయుఁడ వౌచునశ్వికులతో శోచిస్సుతోఁ గూడుచుం
గురు వీర్యాంచిత సుందరాన్న ధనముంగూర్మిం బ్రసాదించుచున్
సరవింగాఁచుచు మమ్ముఁ జాలధనము సౌఖ్యంబు మాకీయుమా ! ॥ 109

(3,4,5,6) సీ॥ బహుజనప్రియుఁడవు భాస్వంతుఁడవు ధూమరూపధ్వజుండవు రూఢ మతివి
సంతతగతుఁడవు స్వాహాప్రియుఁడవు జాత వేదుండవు చారు మతివి
వార్తా హరుండవు బహుయష్టికరుఁడవు వాసహేతుండవు వరద మతివి
విశ్వపాలకుఁడవు వివిధ హవ్యవహుండ వమృతుండవమలుఁడవమరపతివి
గీ॥ కర్మకాల ప్రబోధితకర్మ కారి,వఖిల హోమాధికారివి హవ్యదాతృ
పురుషులకుఁ బ్రీతిఁ జేసెడు పూజ్య తముఁడ, వైన నిను వేడుకొనెదమో! హవ్యవాహ! ॥ 110

(7,8) సీ॥ మాయూహలనెఱింగి మాకణ్వపుత్రుని జిరజీవిగా సంతసింపు మనుము
హోతవై సర్వార్థదాతవై సురలను యాగంబునకు వెస సాగు మనుము
హోమగణంబుల సోమంబు లందించు పురుషుల యశమునుఁ బొందు మనుము
కమనీయ కర్ముల కణ్వాసపుత్రుల వేరుగానిన్ను సేవింపు మనుము
గీ॥ ప్రత్యుషః కాలమున దిన రాజముఖ్య, నిర్జరుల నెల్లఁ బ్రీతిని పిలువు మనుము
యాగ మార్గప్రదర్శక! యగ్నిదేవ! యరసిమముఁ బ్రోవు మనుము మహానుభావ !॥ 111

(9) క॥ పురుష కృతయాగ పతివై, సురవార్తాహరుఁడవగుచు శోభాన్వితమౌ
వరదేవతాగణంబును, బరసోమరసంబుకొఱకుఁ బంపుము వహ్నీ ! ॥ 112

(10) గీ॥ అనల! నీవెంత ధన్యాత్ముఁ డౌదు వొక్కొ!, పెక్కుషః కాల దీప్తిని ధిక్కరించి
దర్శనీయుండవగుటచే ధర్మబుద్ధి, యజ్ఞకర్మ పురోహితుండగుద వీవు ॥ 113

(11) గీ॥ యాగనిష్పాద కుండవు యష్టవింక, జ్ఞానవంతుండ వరివయోహానికరుఁడ
వనితలఁచి యజ్ఞశాల ని న్నునిచినాము, మరణ రహితుండవైయుండుమా ! ధరిత్రి ॥ 114

(12) మ॥ వరమిత్రాళికిఁ బూజకుండవగుచున్ వర్తించుచున్ వేదిపై
సురలోకాళికినెల్ల దూతవగుచున్ శోభిల్లు దౌత్యంబులం
గరమందుంచి సురాళికిం గొనెడు నీకాంతి ప్రదార్చిస్తతుల్
కరమబ్ధిం జనియించు నూర్మికల రాకం[1]బోలి వైశ్వానరా ! ॥ 115

(13) మ॥ వినుమా ! మాటలు దేవబృందములతో విచ్చేయు మా వేదికిన్
గనుమా ! మిత్ర సమస్త నిర్జరతతిం గౌతూహలం బొప్పఁగా
వినయంబార విశేష గౌరవముతో[2] విశ్వామరాళిన్ సురా !
పనిఁగొంచుంగుశనిర్మితాస్తరణపై భాసిల్లఁగాఁ జేయుమా ! ॥ 116

1. రాకంబోఊరావంబుతోన్ (తొ.పా.) 2. వీతెంపు (చు:) ఁడంచున్ గడున్ (తొ.పా.)

(14) గీ॥ అగ్నిజిహ్వలుగల యట్టి యస్మదీయ, మారుతగణంబు మానుతుల్ మరచు నెట్లు
వరుణదేవుండు సురలతోఁ గరుణఁబూని, సోమ పానంబు సేయఁడా నీమమలర॥ 117

## సూక్తమ్—45

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—అగ్నిః, 10 (ఉత్తరార్ధస్య) దేవాః

ఛందః— అనుష్టుప్

(1) త్వమగ్నే వసూగ్ంరిహ రుద్రాగ్ం ఆదిత్యాగ్ం ఉత।

యజా స్వధ్వరం జనం మనుజాతం ఘృతప్రుషమ్॥ 149

(2) శ్రుష్టీవానో హి దాశుషే దేవా అగ్నే విచేతసః ।

తాన్ రోహిదశ్వ గిర్వణస్ త్రయస్త్రిం[1]శతమా వహ॥ 150

(3) ప్రియమేధవదత్రివజ్ జాతవేదో విరూపవత్ । అంగిరస్వన్మహివ్రత ప్రస్కణ్వస్య శ్రుధీ హవమ్॥ 151

(4) మహికేరవ ఊతయే ప్రియమేధా అహూషత । రాజన్తమధ్వరాణామగ్నిం శుక్రేణ శోచిషా॥ 152

(5) ఘృతాహవన సన్త్యేమా ఉ షు శ్రుధీ గిరః । యాభిః [2]కణ్వస్య సూనవో హవన్తేఽవసే త్వా॥ 153

(6) త్వాం చిత్రశ్రవస్తమ హవన్తే విక్షు జన్తవః । శోచిష్కేశం పురుప్రియాఽగ్నే హవ్యాయ వోఢవే॥ 154

(7) ని త్వా హోతారమృత్విజం దధిరే వసువిత్తమమ్ । శ్రుత్కర్ణం సప్రథస్తమం విప్రా అగ్నే దివిష్టిషు॥ 155

1. త్రయస్త్రీ శతమావహ (వ్రా. ప్ర.) 2. కాణ్వస్య (వ్రా.ప్ర.)

(8) ఆ త్వా విప్రా అచుచ్యవుః సుతసోమా అభి ప్రయః ।

బృహద్ భా బిభ్రతో హవిరగ్నే మర్తాయ దాశుషే॥ 156

(9) ప్రాతర్యావ్ణః సహస్కృత సోమపేయాయ సన్త్య।

ఇహాద్య దైవ్యం జనం బర్హిరా సాదయా వసో॥ 157

(10) అర్వాఞ్చం దైవ్యం జనమగ్నే యక్ష్వ సహూతిభిః ।

అయం సోమః సుదానవస్ తం పాత తిరో అహ్న్యమ్॥ 158

## సూక్తము—45

ఋషి—ప్రకణ్వుఁడు, కణ్వుఁడు*

దేవత—అగ్ని, దేవతలు†

(1,2,3,4,5,) సీ॥ ఆదిత్యవసువుల నమరగణంబులఁ బ్రాణులభజియింపు పరమభక్తి
మూఁడు పదులమీఁద ముగ్గురౌనమరుల సేవింపు చుండుము చిత్తమలర
నంగిరస్సుల మొఱ నాలకించినభంగిఁగణ్వజు మొఱ విను కరుణఁ బూని
సవనాది సత్క్రియాచరణులౌ ఋషులను గాపాడువారలఁగరము ప్రీతి
గీ॥ నాజ్యసంహూయమాన ! యోయఖిల ఫలద !, కణ్వపుత్రులవలె మేము కాంక్షితార్థ
ఫలములంగోరి చేసెడు బహుళ మధుర, సన్నుతులఁ [1]చెవులఁ బెట్టుమా! సవన దేవ!॥ 118

(6) గీ॥ దీప్తరూపకేశు దినమణి సంకాశు, వివిధ హవ్యదాతవి త్త[2]వంతుఁ
బ్రీతికరుని నిన్నుఁ బ్రేమచే మునులెల్ల, వేడుచుండిరయ్య వివిధ[3] నుతుల ॥ 119

* కణ్వపుత్రుఁడైన ప్రస్కణ్వుఁడని యీ 45 సూక్తము మొదలు 50వ సూక్తముతో సహా ఆరు సూక్తములకు ఋషిగా సంస్కృతమూల గ్రంథములలో వివిధ ప్రతులలోనున్నది. కాని ఆంధ్రానువాదములో మాత్రము 45-46 సూక్తములకుఁ బ్రికణ్వకణ్వులిద్దరును ఋషులుగాను, 47వ సూక్తమునకుఁ గణ్వపుత్రుఁడు ప్రస్కణ్వుఁడుగాను, 48 వ సూక్తమునకుఁగేవల ప్రస్కణ్వుఁడును, 49 వ సూక్తమునకుఁ గేవల కణ్వుఁడు మాత్రమే ఋషిగాను 50 వ సూక్తమునకుఁ దిరిగి గేవలప్రస్కణ్వుఁడే (48 వ సూక్తమునకు వలె) ఋషిగాను జేర్కొనఁబడినది. వ.గో.కృ.

† 10 వ ఋక్కులోని ఉత్తరార్ధమునకు మాత్రము దేవత దేవతలుగా సంస్కృతమూలములో ఁజేర్కొనఁబడినది. వ.గో.కృ.

1. ఫలములనుగోరి మాచేయు బహుళమయిన, స్తవములను జెవులఁబెట్టుమా! సవనదేవ (తొ. పా.) ఈ 118 వ సీసగీత పద్యము చివరి పాదములోఁ దొలిపాఠమందు సవరించిన పాఠమందును సైతము పంచలఘువుల గణమింద్రగణముగా నుపయోగింపఁబడినది. వ.గో.కృ.
2. విత్తదాత (తొ.పా.) 3. విత్తవంతః (తొ.పా.)



(7) క॥ ఓపికతో యజమానులు, రూపసి, వసువి త్తవంతు, రోచిష్మంతున్
దీపించెడు [4]ఋత్విజునిన్, స్థాపించిరి యజ్ఞకర్మ తలములయందున్ ॥ 120

(8) క॥ కరతలముల హవ్యములం, దిరముగ ధరియించి విప్రధీరులు ప్రీతిం
గరమన్నముఁ గాంక్షించుచుఁ, బరి విధముల వేడికొనరె భాస్వదవనమున్ ॥ 121

(9) క॥ బలమథన జాతరూపుఁడు, కులనివసనకారకుండు కూర్మిన్ సురలం
గలితోషఃకాలంబునఁ, గల [5]దర్భలఁ జేర్చితానుగావుతఁ బ్రీతిన్ ॥ 122

(10) గీ॥ దివ్యులకుఁ బ్రాణికోటికి హవ్యములను, నేకరీతిగ నొసఁగవె యిన సమాన!
సోమరస మిచ్చటనెయుండె సురగణంబ!, త్రావుఁడిప్పుడె దానినిఁ దనివిఁ దీర ॥ 123

## సూక్తమ్—46

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—అశ్వినౌ

ఛందః—గాయత్రీ

(1) ఏషో ఉషా అపూర్వ్యా వ్యుచ్ఛతి ప్రియా దివః। స్తుషే వామశ్వినా బృహత్॥ 159

(2) యా దస్రా సిన్ధుమాతరా మనోతరా రయీణామ్। ధియా దేవా వసువిదా॥ 160

(3) వచ్యన్తే వాం కకుహాసో జూర్ణాయామధి విష్టపి। యద్ వాం రథో విభిష్పతాత్॥ 161

(4) హవిషా జారో అపాం పిపర్తి పపురిర్నరా। పితా కుటస్య చర్షణిః॥ 162

(5) ఆదారో వాం మతీనాం నాసత్యా మతవచసా। పాతం సోమస్య ధృష్ణుయా॥ 163

(6) యా నః పీపరదశ్వినా జ్యోతిష్మతీ తమస్తిరః। తామస్మే రాసాథా మిషమ్॥ 164

(7) ఆ నో నావా మతీనాం యాతం పారాయ గన్తవే। యు[1]ఞ్జాథామశ్వినా రథమ్॥ 165

4. ఋత్విజుని (తొ.పా.) 5. గలదర్భలఁ జేర్చుకావుతప్రీతిన్ (తొ.పా.) ఇటువంటి తొలిపాఠములు చూడగా గ్రంథకర్తకుఁ గందపద్యలక్షణమునకు మూలమైన ఆర్యలను పైత్రము వ్రాయవలయునను సంకల్పమున్నదేమో అనిపించునుగాని రచయిత స్వహస్తముతోనే కందముగా సవరించి వేయుట గమనార్హము. వ.గో.కృ. 1. యుఞ్జాథాము (ప్రా.ప్ర.)

(8) అరిత్రం వాం దివస్పృథు తీర్థే సిన్ధూనాం రథః। ధియా యుయుజ్ర ఇన్దవః॥ 166

(9) దివస్కణ్వాస ఇన్దవో వసు సిన్ధూనాం పదే। స్వం వవ్రిం కుహ ధిత్సథః॥ 167

(10) అభూదు భా ఉ అంశవే హిరణ్యం ప్రతి సూర్యః వ్యఖ్యజ్జిహ్వయాసితః॥ 168

(11) అభూదు పారమేతవే పన్థా ఋతస్య సాధుయా। అదర్శి వి స్రుతిర్దివః॥ 169

(12) తత్తదిదశ్వినోరవో జరితా ప్రతి భూషతి। మదే సోమస్య పిప్రతోః॥ 170

(13) వావసానా వివస్వతి సోమస్య పీత్యా గిరా। మనుష్వచ్ఛంభూ ఆ గతమ్॥ 171

(14) యువోరుషా అను శ్రియం పరిజ్మనోరుపాచరత్। ఋతా వనథో అక్తుభిః॥ 172

(15) ఉభా పిబతమశ్వినోభా నః శర్మ యచ్ఛతమ్। అవిద్రియాభిరూతిభిః॥ 173

ఇతి

ప్రథమోఽష్టకే తృతీయోఽధ్యాయ

స్సమాప్తః

## సూక్తము—46

### ఋషి - ప్రకణ్వుఁడు, కణ్వుఁడు

### దేవత — అశ్వినులు*

(1) గీ॥ గగనమందెచ్చటనొ పుట్టి కారుకొనిన, చీఁకటినిగొట్టెఁ గల్యంబు రాకతోడ
నగుట హెచ్చుగ వెల్గెడు నశ్వులార!, రండు సవనంబుఁ జూడఁ బ్రార్థన మొనర్తు॥ 124

(2,3,4,5,6) సీ॥ సంద్రంబునం బుట్టి చక్కని రూపొంది యశ్వులారా! మీరలమరినారు!
సరసరథంబెక్కి స్వర్గంబునకు నేఁగి యందంబుగా నుతులందినారు!
జలమును బుట్టించు జలజ మిత్రుని హవ్యమంది తృప్తినిఁ జాల నందినారు!
బుద్ధిచోదకమైన పూజ్య సోమముఁ గ్రోలి తీవ్రరూపమునొంది తిరిగినారు!

2. వ వ్రం (వా.ప్ర.) * అశ్విలు (వా. ప్ర. పా.) ఆంధ్రానువాదములో అశ్వ-అశ్వినీ శబ్దములు సమాన పదములుగా నుపయోగింపఁబడినవి. వ.గో.కృ.

గీ॥ దుఃఖ దారిద్ర్యతమమును ద్రోలునట్టి, వీర్యరసరూపదీప్తితో వెలయునట్టి
యన్న మిచ్చుటకై వచ్చి మన్ననలను, నందికొనిపొందు కాంతిమదశ్వులార ! ॥ 125

(7) గీ॥ అశ్వరాజములను నరదంబునకుఁ బూన్చి, పుడమిఁ జేరరండు పూజ్యులార !
మీ కటాక్షరూప నౌకపై నెక్కుచు, సంతరింతు దుఃఖసలిల నిధిని ॥ 126

(8) గీ॥ గగనసీమకంటెఁ గడు విస్తృ[1]తంబైన, గగన సాధనంబుగలదు మీకు
మీ సుకర్మవలన మించిన సోమంబు, వెల్గుచుండె నిపుడు వేదిమీఁద ॥ 127

(9) ఉ॥ అల్లదె సూర్యరశ్మి కడు నాకసమందున వెల్గుచుండఁగా
నల్లదె వాసహేతువగు నౌషసదీధితి రేఁగి యుండఁగా
నుల్లము పల్లవించుటకు నూర్ధ్వముగాఁ జనుదేరకుండగాఁ
జల్లని యశ్వులార ! యికఁ జాలముసేసెద రేలఁ జెప్పరే ! ॥ 128

(10) గీ॥ కల్య కాంతికొఱకుఁ గాంతులు చెలరేఁగె, రవి హిరణ్యకాంతి రాణనొందె
నగ్నివర్ణమంత నసితమై యుండెడు, మీదు రాక కిదియె మేలుకాదె ! ॥ 129

(11) క॥ ముదమున భాస్కరు దేవుం, డుదయాద్రికిఁ బోవుదారి యుపయుక్తమగున్
ముదిరెన్ దినకర కాంతులు, సదయులరై చేరరండు సవనంబునకున్ ॥ 130

(12,13,14,15) సీ॥ ఎవ్వరి రక్షణ మేపార మానవస్తోత్రంబులకు నెల్ల పాత్రమగునొ ?
యెవ్వని శోభచే మవ్వంపు కల్యంబు కాంతివంతంబయి గ్రాలనగునొ ?
యెవ్వరు చనుదేర నీ సోమరసమెల్ల నుతులను మేటి పాత్రతను గనునొ ?
యేరికి రాత్రుల నిష్టహవిస్సులు కోరిక కోరైక్యలై గొమరుగనునొ ?
గీ॥ యట్టి యశ్వద్వయము వచ్చి యధి[2]కతుష్టి, సోమపానంబుఁ జేయుచు శోభలంది
మన్ననలతోడ రక్షలు మా కొసంగి, సుఖపరంపర నిచ్చి ప్రో[3]చెడునుగాక ॥ 131

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబా గర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమునఁ దృతీయాధ్యాయము
సమాప్తము

---

1. విస్తృతం (వా.ప్ర.పా) 2. యధికముగను. 3. ప్రోచుదురుగాక (ప్రా. వ. పా.) అమహాదర్శకమైన "అశ్వద్వయము" కర్తగావున మహాదర్శక క్రియ ప్రయుక్తమగుట యెబ్బెట్టుగానుండును. కాన సమహత్తద్ధర్మార్థకముగా సార్థకముగా నీ సవరణచేయఁబడెను. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ప్రథమోఽష్టకః—చతుర్థోఽధ్యాయః

### సూక్తమ్—47

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—అశ్వినౌ

* ఛందః—ప్రగాథః—విషమాబృహత్యః, సమాః సతోబృహత్యః

(1) అయం వాం మధుమత్తమః సుతః సోమ ఋతావృధా।

తమశ్వినా పిబతం తిరోఅహ్న్యం ధత్తం రత్నాని దాశుషే॥ 1

(2) త్రివన్ధురేణ త్రివృతా సుపేశసా రథేనా యాతమశ్వినా।

కణ్వాసో వాం బ్రహ్మ కృణ్వన్త్యధ్వరే తేషాం సు శృణుతం హవమ్॥ 2

(3) అశ్వినా మధుమత్తమం పాతం సోమమృతావృధా।

అథాద్య దస్రా వసు బిభ్రతా రథే దాశ్వాంసముప గచ్ఛతమ్॥ 3

(4) త్రిషధస్థే బర్హిషి విశ్వవేదసా మధ్వా యజ్ఞం మిమిక్షతమ్।

కణ్వాసో వాం సుతసోమా అభిద్యవో యువాం హవన్తే అశ్వినా॥ 4

* ప్రగాథః బార్హతమ్ (పా)

(5) యాభిః కణ్వమభిష్టిభిః ప్రావతం యువమశ్వినా।

తాభిః ష్వ౧స్మాగ్ం అవతం శుభస్పతీ పాతం సోమమృతావృధా। 5

(6) సుదాసే దస్రా వసు బిభ్రతా రథే పృక్షో వహతమశ్వినా।

రయిం సముద్రాదుత వా దివస్పర్యస్మే ధత్తం పురుస్పృహమ్। 6

(7) యన్నాసత్యా పరావతి యద్ వా స్థో అధి తుర్వశే।

అతో రథేన సువృతా న ఆ గతం సాకం సూర్యస్య రశ్మిభిః॥ 7

(8) అర్వాఞ్చా వాం సప్తయోఽధ్వరశ్రియో వహన్తు సవనేదుప।

ఇషం పృఞ్చన్తా సుకృతే సుదానవ ఆ బర్హిః సీదతం నరా॥ 8

(9) తేన నాసత్యా గతం రథేన సూర్యత్వచా।

యేన శశ్వదూహథుర్దాశుషే వసు మధ్వః సోమస్య పీతయే॥ 9

(10) ఉక్థేభిరర్వాగవసే పురూవసూ అర్కైశ్చ ని హ్వయామహే।

శశ్వత్ కణ్వానాం సదసి ప్రియే హి కం సోమం పపథురశ్వినా॥ 10

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము—చతుర్థాధ్యాయము

### సూక్తము—47

ఋషి—కణ్వపుత్రుఁడు, ప్రస్కణ్వుఁడు

దేవత—అశ్విదేవతలు*

(1) గీ॥ అశ్విదేవతలార ! యదిగో[1] సోమరసంబు, గ్రోలుఁడయ్య మీరు కోర్కె మీర
సోమదాతలకయి సొంపుగ ధనరత్న, దానమిడుఁడు వేడ్క ధర్మబుద్ధి ॥ 1

(2) గీ॥ ఆనతోన్నత రూపము నధికరుక్మ, యుక్తమునునైన రథమెక్కి యొక్కమారు
కణ్వపుత్రుల మంత్రంపుఁగలన వినుట, నధికసంతుష్టి విచ్చేయుఁ డశ్వులార ! ॥ 2

(3) గీ॥ మా స్తవం[2]బులెల్ల మన్నించి యశ్వులు !, సోమయాజి గృహము సొరుట లెస్స
సోమరసము గ్రోలి సొంపుగ మీరలు, ధనము నీయ రండు దాతలగుట ॥ 3

(4,5,6,7) సీ॥ త్రిస్థాన దర్భోద్ధవిస్తారరసమును, యజ్ఞశాలకు మీరలంపవలయుఁ
గమనీయ దీధితుల్ గలుగుకణ్వాసుల వేలువేలగు మొఱల్ వినఁగవలయుఁ
బ్రియుఁడువదాన్యుఁడౌ ప్రియజన సుతునకు, నిష్టాన్నధనముల నీయవలయుఁ
గణ్వమహర్షి ని గరుణించునట్టులు నిత్యము మముఁ గరుణింపవలయు
గీ॥ నధిక దూరమునంగల యశ్వు[3]లార !, సత్యదేవతలార ! యో సదయులార !
రవి కిరణజాలములతోడ రమ్యరుక్మ, రథముపై నెక్కి చెంతకురండు ప్రీతి ॥ 4

(8,9,10) సీ॥ అధ్వరశ్రీలొప్పు నశ్వంబులనుగొని సవనాభిముఖముగా సాగుఁగాక !
నన్న[4] ప్రదాతమౌ నశ్వపుత్రుల జంటయుచ్చ దర్భలమీఁద నుండుఁగాక !
రవికిరణ విరాజి రథముపైనాజంట వచ్చి యన్నము యాజికిచ్చుఁగాక !
శస్త్రములంబూని సరసులుకొనియాడు సంస్తుతి హితముగా జరుగుఁగాక !
గీ॥ శోభనప్రద కణ్వుల సోమరసము, గ్రోలుటకు రండటంచిప్డు కోరినార
మధికధనవంతమౌనశ్వ యుగ్మమెలమి, నింపుమీరఁగ మమ్మురక్షించుఁ[5]గాక॥ 5

* అశ్వినులు అని సంస్కృతమూలము ననుసరించి భావింపఁదగును. వ.గో.కృ. 1. ఇట్టియెడల సామాన్యముగా గో అని దీర్ఘమే ప్రయుక్తము కాఁదగును గాని గ్రంథకర్త పెక్కుచోట్ల హ్రస్వప్రయోగము చేసెను. వ.గో.కృ. 2. మాదువేడికోలు (తొ.పా.) 3. యశ్విలార ; (వ్రా.ప్ర.పా.) 4. యన్నప్రదాతయౌ 5. రక్షింపుగాక. (వ్రా.ప్ర.పా.)

## సూక్తమ్—48

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—ఉషాః

* ఛందః—ప్రగాథః — విషమాబృహత్యః, సమాఃసతో బృహత్యః

(1) సహ వామేన న ఉషో వ్యుచ్ఛా దుహితర్దివః ।

సహ ద్యుమ్నేన బృహతా విభావరి రాయా దేవి దాస్వతీ ॥ 11

(2) అశ్వావతీర్గోమతీర్విశ్వసువిదో భూరి చ్యవన్త [1]వస్తవే ।

ఉదీరయ ప్రతి మా సూనృతా ఉషశ్ చోద రాధో మఘోనామ్ ॥ 12

(3) ఉవాసోషా ఉచ్ఛాచ్చ ను దేవీ జీరా రథానామ్ ।

యే అస్యా ఆచరణేషు దధ్రిరే సముద్రే న శ్రవస్యవః ॥ 13

(4) ఉషో యే తే ప్ర యామేషు యుఞ్జతే మనో దానాయ సూరయః ।

అత్రాహ తత్ కణ్వ ఏషాం కణ్వతమో నామ గృణాతి నృణామ్ ॥ 14

(5) ఆ ఘా యోషేవ సూనర్యుషా యాతి ప్రభుఞ్జతీ ।

జరయన్తీ వృజనం [2]పద్వదీయత ఉత్పాతయతి పక్షిణః ॥ 15

(6) వి యా సృజతి సమనం వ్యర్థినః పదం న వేత్యోదతీ ।

వ[3]యో నకిష్టే పప్తివాంస ఆసతే వ్యుష్టౌ వాజినీవతి ॥ 16

* ప్రగాథః దార్హతమ్ (పా) 1. వస్తివే. (వా.ప్ర.) 2. ఏద్వదీయత (వా.ప్ర.) 3. బయో (వా.ప్ర.)

(7) ఏషాయుక్త పరావతః సూర్యస్యోదయనాదధి।

శతం రథేభిః సుభగోషా ఇయం వి యాత్యభి మానుషాన్॥ 17

(8) విశ్వమస్యా నానామ చక్షసే జగజ్ జ్యోతిష్కృణోతి సూనరీ।

అవ ద్వేషో మఘోనీ దుహితా దివ ఉషా ఉచ్ఛదప స్రిధః॥ 18

(9) ఉష ఆ భాహి భానునా చన్ద్రేణ దుహితర్దివః।

ఆవహన్తీ భూర్యస్మభ్యం సౌభగం వ్యుచ్ఛన్తీ దివిష్టిషు॥ 19

(10) విశ్వస్య హి ప్రాణనం జీవనం త్వే వి యదుచ్ఛసి సూనరి।

సా నో రథేన బృహతా విభావరి శ్రుధి చిత్రామఘే హవమ్॥ 20

(11) ఉషో వాజం హి వంస్వ యశ్చిత్రో మానుషే జనే।

తేనా వహ సుకృతో అధ్వరాగ్ం ఉప యే త్వా గృణన్తి వహ్నయః॥ 21

(12) విశ్వాన్ దేవాగ్ం ఆ వహ సోమపీతయే ऽన్తరిక్షాదుషస్త్వమ్।

సాస్మాసు ధా గోమదశ్వావదుక్థ్యగముషో వాజం సువీర్యమ్॥ 22

(13) యస్యా రుశన్తో అర్చయః ప్రతి భద్రా అదృక్షత।

సా నో రయిం విశ్వవారం సుపేశసము[1]షా దదాతు సుగ్మ్యమ్॥ 23

1. మంహే (వా.ప్ర.)

(14) యే చిద్ధి త్వామృషయః పూర్వ ఊతయే జుహూరేఽవసే మహి।

సా నః స్తోమాగ్ం అభి గృణీహి రాధసోషః శుక్రేణ శోచిషా॥ 24

(15) ఉషో యదద్య భానునా వి ద్వారావృణవో దివః।

ప్ర నో యచ్ఛతాదవృకం పృథు చ్ఛర్దిః ప్ర దేవి గోమతీరిషః॥ 25

(16) సం నో రాయా బృహతా విశ్వపేశసా మిమిక్ష్వా సమిళాభిరా।

సం ద్యుమ్నేన విశ్వతురోషో మహి సం వాజైర్వాజినీవతి॥ 26

## సూక్తము—48

ఋషి—ప్రస్కణ్వుఁడు

దేవత—ఉషస్సు

(1,2,3) సీ॥ ద్యోదేవతాపుత్రితోరంపు ధనమిచ్చి దినముఖముల మాకుఁదీర్పుమమ్మ
యో యుషస్సా! మాకు నోపియన్నముఁబెట్టి ధాత్రివై పశువులదాన మిమ్మ!
ప్రాభాతదేవత! బహ్వాశ్వగోవులు చెందునట్టులు మమ్ముఁ జేయుమమ్మ!
ప్రియహితవాక్యముల్ ప్రీతితోఁ గఱపుచు హెచ్చైనరథము మాకీయుమమ్మ!
గీ॥ అబ్ధిబేహారి రథముల ననుపునట్లు, శుభరథంబుల ననుపుచు శోభతోడ
నుదయమును జేసియుంటివి యుచితరీతిఁ, జేసియున్నావు చేయుదు చిత్తమలర॥ 6

(4) గీ॥ నీదుగమనానుసారులై నిష్ఠతోడ, దానములు నేయుచున్నారు దాతలెల్ల
దాతలిచ్చుచుషస్సునె ధరఁబ్రశంసఁ, గొందురని కణ్వమునివాక్యమందులేదె॥ 7

(5) గీ॥ భార్య యింటిని గాపాడు పగిదినీవు, సర్వమును జూచుచుందు విస్తారశక్తి
జంగమ గణంబుషస్సునెజరనుబొందుఁ, బక్షిచయమంత మేల్కొని పారుచుండు॥ 8

(6) గీ॥ కర్మకరులెల్ల కర్మకై కదలునట్లు, యాచకులు ప్రభుని చెంతకు నరుఁగునట్లు
నీడ[1]ములనుండి పక్షులు నిర్గమించు. నట్లుచేసి యుషఃకాలమెటకొయేగె॥ 9

1. "రడయోరభేదః" అను సూత్రానుసారముగ నిక్కడ రడల కభిన్నత్వమును బాటించి నీరార్థకముగా "నీడ" శబ్దము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

(7) గీ॥ సుభగకల్యకాంత శోభయెలర్పంగ, రథశతంబు నెక్కి-రయముమీర
విష్ణుపదమునుండి వెడలుచునుండెడు, మానవాధిరాజ్య మధ్యమునకు ॥ 10

(8,9) సీ॥ తల్లి ! యుషోదేవి ! ధనవతి ! శుభనేత్ర ! యిష్టార్థములనెల్ల నీయవమ్మ !
తల్లి ! యుషఃకాంత ! ధరననిష్టంబులు దూరంబుగాఁ బోవఁద్రోలవమ్మ !
తల్లి ! యుషోనారి ధర్మస్వరూపిణి ! స్థిరకీర్తితోఁ బ్రకాశింపవమ్మ !
తల్లి ! యుషోయోష ! తరణిచంద్రులమాట్కి-దివస సౌభాగ్యంబుఁదీర్పవమ్మ !
గీ॥ విశ్వమంతయుఁజేసెడు వేయివిధము, లగునమస్కా-రరీతుల నందవమ్మ !
జంగమాత్మకమైనట్టి జగమునంత, వెలుఁగునట్టులుచేసి శోభిల్లవమ్మ ! ॥ 11

(10) గీ॥ ప్రాణిచేష్టనంబు ప్రాణధారణమును, నీదు శక్తియందు నిలిచియుంట
మా స్తవం[2]బులెల్ల మన్నించి తమమేది, పూర్ణరథమునెక్కి-ప్రోడ ! రమ్మ ॥ 12

(11) గీ॥ అగ్నినిర్వాహకములగు నగ్నులన్ని, నిన్నుఁగొనియాడుచున్నవి నియమమలర
నధ్వరంబుల, వారికినందఁజేసి, హవ్యలక్షణమగు నన్నమందు తల్లి ! ॥ 13

(12,13, 14,15) సీ॥ సోమపానార్థము సురలను రప్పించి యజ్ఞగృహంబున కనుపవమ్మ !
యశ్వగోయుతమును నధికశోభన వీర్యయుక్తమౌ నన్నంబు నుంపవమ్మ !
శత్రునాశక వికాశాన్వితమై విశ్వ వరణీయధనమును వదులవమ్మ !
మంత్రద[3]ర్శులుపొందు మర్యాదమాకిచ్చి మానుతులందుష్టిఁ బూనుమమ్మ !
గీ॥ పూర్వదక్షిణ దిగ్భాగపూర్ణమైన, నంధకారంబుఁబోఁద్రోలి యతిప్రశస్త
భాసమానంబు మిత్రవిభాసితంబు, నైనసదనంబు మాకిచ్చి యరుగవమ్మ ! ॥ 14

(16) గీ॥ వివిధగోవుల వలెమాకు విత్తమిచ్చి, యఖిల శత్రువులంగొట్టి యశమునిమ్మ
భక్తవృద్ధిని గలిగించి భక్తవరుల, కొనర సౌఖ్యపరంపర నొసఁగవమ్మ ! ॥ 15

## సూక్తమ్—49

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—ఉషాః

ఛందః—అనుష్టుప్

(1) ఉషో భద్రేభిరా గహి దివశ్చిద్ రోచనాదధి।వహన్త్వరుణప్సవ ఉప త్వా సోమినో గృహమ్॥ 27

2. మాదువేడుకోలు (తొ.పా.) 3. మంత్రద్రష్టలు (తొ.పా. గణభంగభీతి. వ.గో.కృ.)

(2) సుపేశసం సుఖం రథం యమధ్యస్థా ఉషస్త్వమ్।తేనా సుశ్రవసం జనం ప్రావాద్య దుహితర్దివః॥ 28

(3) వయశ్చిత్ తే పతత్రిణో ద్విపచ్చతుష్పదర్జుని। ఉషః ప్రారన్నృతూగ్ంరను దివో అన్తేభ్యస్పరి॥ 29

(4) వ్యుచ్ఛన్తీ హి రశ్మిభిర్విశ్వమాభాసి రోచనమ్। తాం త్వాముషర్వసూయవో గీర్భిః కణ్వా అహూషత॥ 30

## సూక్తము—49

### ఋషి—కణ్వుఁడు

### దేవత — ఉషస్సు

(1) గీ॥ శోభనీయ[1]ములౌ మార్గశోభలంది, దీప్యమానాధ్వమునుబట్టి దిగుముషస్స !
యరుణవర్ణాంచితంబులౌనాలు నిన్ను, సోమవసతికిఁ జేర్చు నుషోమతల్లి ! ॥ 16

(2) గగనపుత్రిక ! యోయుషఃకాలదేవి !, రమ్యరుక్మమయంబైన రథమునెక్కి-
శోభనహవిస్సుతోఁగూడు సోమయాజి, సదనమునకయిచేరుమా ! సత్వరముగ ॥ 17

(3) గీ॥ శుభ్రవర్ణ ! నీవు శోభగాంచుటఁజేసి, యంధకారమెల్ల నంతరించు
నరులఁ[2]బోలె గోగణంబులు పక్షులు, చేష్టలందుచుండుఁ జిత్తమలర ॥ 18

(4) గీ॥ అంధకారమెల్ల నావలఁబోఁద్రోలి, వెల్గునిచ్చుచుంటివీవు కాన
వసువుఁగోరు కాణ్వవరలుషఃకాలమా !, స్తుతులొనర్పఁగలరు సూక్తితోడ ॥ 19

## సూక్తమ్—50

### ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

### దేవతా—సూర్యః*

### ఛందః—గాయత్రీ, 10-13 అనుష్టుప్

(1) ఉదు త్యం జాతవేదసం దేవం వహన్తి కేతవః।దృశే విశ్వాయ సూర్యమ్॥ 31

(2) అప త్యే తాయవో యథా నక్షత్రా యన్త్యక్తుభిః।సూరాయ విశ్వచక్షసే॥ 32

1. పేయములౌ (ప్రా.ప్ర.పా.) 2. నరులబోలె (ప్రా.ప్ర.పా.)
* (11-13 రోగఘ్న ఉపనిషదః-13 అన్త్యోఽర్ధర్చః ద్విషద్ఘ్నః.) (పా)

(3) అదృశ్రమస్య కేతవో వి రశ్మయో జనాగ్ం అను। భ్రాజన్తో అగ్నయో యథా॥ 33

(4) తరణిర్విశ్వదర్శతో జ్యోతిష్కృదసి సూర్య। విశ్వమా భాసి రోచనమ్॥ 34

(5) ప్రత్యఙ్ దేవానాం విశః ప్రత్యఙ్ఙుదేషి మానుషాన్। ప్రత్యఙ్ విశ్వం స్వర్దృశే॥ 35

(6) యేనా పావక చక్షసా భురణ్యన్తం జనాగ్ం అను। త్వం వరుణ పశ్యసి॥ 36

(7) విద్యామేషి రజస్పృథ్వహా మిమానో అక్తుభిః। పశ్యఞ్జన్మాని సూర్య॥ 37

(8) సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య। శోచిష్కేశం విచక్షణ॥ 38

(9) అయుక్త సప్త శున్ధ్యువః సూరో రథస్య నప్త్యః। తాభిర్యాతి స్వయుక్తిభిః॥ 39

(10) ఉద్ వయం తమసస్పరి జ్యోతిష్పశ్యన్త ఉత్తరమ్। దేవం దేవత్రా సూర్యమగన్మ[3] జ్యోతిరుత్తమమ్॥ 40

(11) ఉద్యన్నద్య మిత్రమహ ఆరోహన్నుత్తరాం దివమ్।హృద్రోగం మమ సూర్య హరిమాణం చ నాశయ॥ 41

(12) శుకేషు మే హరిమాణం రోపణాకాసు దధ్మసి। అథో హారిద్రవేషు మే హరిమాణం ని దధ్మసి॥ 42

(13) ఉదగాదయమాదిత్యో విశ్వేన సహసా సహ।

ద్విషన్తం మహ్యం రన్ధయన్ మో అహం ద్విషతే రధమ్॥ 43

3. సూర్యమగగ్మ (ద్రా.ప్ర.)

## సూక్తము—50

### ఋషి—ప్రస్కణ్వుఁడు

### దేవత—సూర్యుఁడు*

(1) గీ॥ లోకమునఁగల్గు భూతాళివీఁకతోడ, హంసపుత్రుని దర్శింప నాదరమున
జాతవేదుని సూర్యుని సౌరకిరణ, జాలమాకస వీథిలో లీలనునిచె ॥ 20

(2) గీ॥ సర్వలోకము వెలిఁగించు సౌరకాంతి, యెదుటఁబడఁ దస్కరులు భీతినేఁగుమాట్కి
రిక్కలన్నియు రాత్రితో నొక్కమారె, దిక్కులేకుండఁబోవును దేజముడిగి ॥ 21

(3) క॥ దీపించెడు వహ్నులవలె, దీపించెడు నీదు రమ్యదీధితులు తగం
దీపింపఁజేయుజగమును, †నోపిశుభంబులను గూర్పుమో సప్తాశ్వా ! ॥ 22

(4) గీ॥ కడునిజోపాసకులరోగకలనదీర్తు, నిఖిలజీవులకిల దర్శనీయుఁడౌదు
శీతకిరణాదులకుఁ గాంతిఁజేర్చువాఁడ !, వాకసంబంత వెలిఁగింతు వదితిపుత్ర ! ॥ 23

(5) గీ॥ అమరవశులౌ మరుత్తుల యభిముఖముగ, మానవాభిముఖంబుగ మాన్యవిశ్వ
దేవలోకాభిముఖముగఁ దేజరిల్లి, యుదయమొందెద వనలుఁడా ! యూర్ధ్వదిశను ॥ 24

(6) గీ॥ సూర్యుఁడా ! సర్వచోదక ! చోద్యమైన, నీదు కిరణాళికాంతులు మేదురముగ
భూతజాతము వహియించు భూమినెల్ల, నేచివెలిఁగించుచున్నవహీనగతిని ॥ 25

(7) గీ॥ ప[1]వలురాతిరిఁజేయుచు బహుళభూత, జాతములువెల్గునట్టులు జగతిఁజేసి
విపులగగనంపువీథికి వీఁకపోవు, చున్నవాఁడవుదేవ ! సూర్యుండ ! నీవు ॥ 26

(8) గీ॥ సర్వదీపక ! యాదిత్య ! సప్తరశ్మి, రాజి, రసహారిశీల విరాజమాన
తేజమనియెడు వేణితోఁదేజరిల్లి, నిన్నుఁ గొనిపోవుచున్నది నేర్పు[2]మెఱయ ! ॥ 27

* 11-13 ఋక్కులకు దేవతల విషయమై యున్న యభిప్రాయభేదమును సంస్కృత మూలములోని దేవత కిచ్చిన ఫుట్‌నోట్‌చూచి గ్రహించునది. వ.గో.కృ.

† సూర్యునకు సప్తాశ్వుఁడను నామము కలదు. ఈ శబ్దమునకుఁ బురాణములయందు ఏడు గుఱ్ఱములు గలవాఁడని యర్థము కల్పించిరి. కాని వేదములయందు అశ్వశబ్దమునకు 'కిరణము' అని యర్థము. అనఁగా సూర్యుఁడేడురంగులుగల కిరణములు కలవాఁడని యర్థము తెలుచున్నది. ప్రస్తుతపు సూర్యకిరణములను "కోల" అద్దము ద్వారా ప్రసరింపఁజేసి యందేడు రంగులున్నట్లు కనుగొనియున్నారు. తమ విజ్ఞానశక్తిచే సూర్య కిరణములలో నేడు రంగులున్నవని యెంతయో కష్టపడి కనుగొనిన సిద్ధాంతము (Prismatic Colour Vigyor) మన ఋగ్వేద శ్రోతలకెన్నఁడో తెలియును. అథర్వవేదమందును "సప్తసూర్యస్యరశ్మయః" (సూర్యుని కిరణములేడు విధములు) అనుచున్నారు. ఇట్లెన్ని విషయములో యెరింగి అధ్యాత్మ చక్షుస్సుతో వస్తుజాలమునంతయు నెఱింగిన మన పూర్వులు పిచ్చివారని, మనకు బోధించెడు నీ నాటి మన విద్యావిధానము జాతీయతను నిర్మూలించుచున్నది. (సే.వేం.న.శా.)

సూచన—ఈ విశిష్టదృక్పథముతోనే గాక బహుముఖమైన వైజ్ఞానిక దృక్పథములలో వేద వాఙ్మయమును నాచరణపూర్వకముగాఁ బరిశోధించి నప్పుడసలైన దేవ వేద వేద దేవ విజ్ఞానము మహారాజ ఫణి రవి శశి కృష్ణ జయశ్రీ సత్యశ్రీ సంశోభితమని నిరూపితమగును. వ.గో.కృ.

1. బవలు (వ్రా.ప్ర.పా.) 2. నేర్పుమీర (తొ.పా.)

(9) గీ॥ అరదమటునిట్టు, జేయని[3] యశ్వసప్త, కమును బూన్చినరథమును సముచితముగ
నెక్కి యాగంబునకు వచ్చు నినునకెలమి, నీయవలె యజ్ఞభాగంబమేయ[4] భక్తి ॥ 28

(10) గీ॥ పాపరహితు, దాత, భవ్యచారిత్రుని, గాంతివంతునఖిల కర్మసాక్షి
స్తోత్రపాత్రుఁడైన సూర్యదేవుని సదా, స్తుతినొనర్తుమేము సూక్తితోడ ॥ 29

(11) గీ॥ సర్వసమదీప్తిదా ! సూర్య ! సత్యదేవ !, వేగనుదయించి నభమునకేగి నాదు
బాహ్యాప్రైవర్ణ్య హృద్రోగబలమునిపుడె, పా[5]పిరక్షింపవయ్య సద్భావమలర ॥ 30

(12) గీ॥ అస్మదీయ హరిద్వర్ణమంతఁదీసి, శుకములకు శారికలకు విశుద్ధకాంతి
లలిత హరితాళవృక్షములకును నిడుదు, నదియు నచ్చట సుఖముండియందమొందు ॥ 31

(13) గీ॥ భాస్కరుఁడు విశ్వకాంతితోఁబరిఢవిల్లి, యుదయసౌభాగ్య గరిమను నొందెనిపుడు
రోగశత్రులగణము నిర్మూలనంబు, చేయశక్తుఁడు కర్మసాక్షియె నిజంబు ॥ 32

## అనువాకః—10, సూక్తమ్—51

### ఋషిః—సవ్యఆంగిరసః*

### దేవతా—ఇంద్రః

### ఛందః—జగతీ, 14-15 త్రిష్టుప్

(1) అభి త్యం మేషం పురుహూతమృగ్మియ మిన్ద్రంగీర్భిర్మదతా వస్వో అర్ణవమ్।

యస్య ద్యావో న విచరన్తి మానుషా భుజే మంహిష్ఠమభి విప్రమర్చత॥ 44

(2) అభీమన్వస్త్స్వభిష్టిమూతయో ఽన్తరిక్షప్రాం తవిషీభిరావృతమ్।

ఇన్ద్రం దక్షాస ఋభవో మదచ్యుతం శతక్రతుం జవనీ సూనృతారుహత్॥ 45

3. యాడఁగుఱ్ఱములను నేడింటిఁ బూన్చ శోభిలెడు రథము (తొ.పా.) 4. బమేయబుద్ధి (తొ.పా.) 5. బాపి (వ్రా.ప్ర.పా.)

* ఈ 51వ సూక్తము నుండి 57వ సూక్తమువఱకు నాసూక్తముగూడఁ గలిపి "ప్రస్కణ్వుఁడే" ఋషిగా వ్రాతప్రతిలోనున్నది. వ.గో.కృ.

(3) త్వం గోత్రమఙ్గిరోభ్యోఽవృణోరపోతాత్రయే శతదురేషు గాతువిత్।
ససేన చిద్ విమదాయావహో వస్వాజావద్రిం వావసానస్య నర్తయన్॥ 46

(4) త్వమపామపిధానావృణోరపా[1]ఽధారయః పర్వతే దానుమద్ వసు।
వృత్రం యదిన్ద్ర శవసావధీరహిమాదిత్ సూర్యం దివ్యారోహయో దృశే॥ 47

(5) త్వం మాయాభిరప మాయినోఽధమః స్వధాభిర్యే అధి శుప్తావజుహ్వత।
త్వం పిప్రోర్నృమణః ప్రారుజః పురః ప్ర ఋజిశ్వానం దస్యుహత్యేష్వావిథ॥ 48

(6) త్వం కుత్సం శుష్ణహత్యేష్వావిథా[2]ఽరన్ధయోఽతిథిగ్వాయ శమ్బరమ్।
మహాన్తం చిదర్బుదం ని క్రమీః పదా సనాదేవ దస్యుహత్యాయ జజ్ఞిషే॥ 49

(7) త్వే విశ్వా తవిషీ సధ్ర్యగ్ఘితా తవ రాధః సోమపీథాయ హర్షతే।
తవ వజ్రశ్చికితే బాహ్వోర్హితో వృశ్చా శత్రోరవ విశ్వాని వృష్ణ్యా॥ 50

(8) వి జానీహ్యార్యాన్ యే చ దస్యవో బర్హిష్మతే రన్ధయా శాసదవ్రతాన్।
శాకీ భవ యజమా[3]నస్య చోదితా విశ్వేత్ తా తే సధమాదేషు చాకన॥ 51

(9) అనువ్రతాయ రన్ధయన్నపవ్రతానాభూభిరిన్ద్రః శ్నథయన్ననాభువః।
వృద్ధస్య చిద్ వర్ధతో ద్యామినక్షతః స్తవానో వమ్రో వి జఘాన సందిహః॥ 52

1. రపాధారయః పర్వతే. 2. విథారన్ధయో. 3. యజమానస్య (ప్రా.ప్ర.)

(10) తక్షద్ యత్ త ఉశనా సహసా సహో వి రోదసీ మజ్మనా బాధతే శవః।

ఆ త్వా వాతస్య నృమణో మనోయుజ ఆ పూర్యమాణమవహన్నభి శ్రవః॥ 53

(11) మన్దిష్ట యదుశనే కావ్యే సచాగ్ం ఇన్ద్రో వఙ్క్రూ వఙ్కుతరాధి తిష్ఠతి।

ఉగ్రో యయిం నిరపః స్రోతసాసృజద్ వి శుష్ణస్య దృంహితా ఐరయత్ పురః॥ 54

(12) ఆ స్మా రథం వృషపాణేషు తిష్ఠసి శార్యాతస్య ప్రభృతా యేషు మన్దసే।

ఇన్ద్ర యథా సుతసోమేషు చాకనో ఉన[1]ర్వాణం శ్లోకమా రోహసే దివి॥ 55

(13) అదదా అర్భాం మహతే వచస్యవే కక్షీవతే వృచయామిన్ద్ర సున్వతే।

మేనాభవో వృషణశ్వస్య సుక్రతో విశ్వేత్ తా తే సవనేషు ప్రవాచ్యా॥ 56

(14) ఇన్ద్రో అశ్రాయి సు[2]ధ్యో నిరేకే పజ్రేషు స్తోమో దుర్యో న యూపః।

అశ్వయుర్గవ్యూ రథయుర్వసూయురిన్ద్ర ఇద్రాయః క్షయతి ప్రయన్తా॥ 57

(15) ఇదం నమో వృషభాయ స్వరాజే సత్యశుష్మాయ తవసేఽ[3]వాచి।

అస్మిన్నిన్ద్ర వృజనే సర్వవీరాః స్మత్ సూరిభిస్తవ శర్మన్త్స్యామ॥ 58

1. చాకనో నవాణం (వా.ప్ర.) 2. సుధ్యే. (వ్రా.ప్ర.) 3. వతవసేఽవచి (వ్రా.ప్ర.)

## అనువాకము—10, సూక్తము—51

### ఋషి—అంగిరసకుమారుఁడు సవ్యుఁడు

### దేవత—ఇంద్రుఁడు

(1) సీ॥ ఇనదీధితులఁ బోలి యెసఁగిన క్రియలచేఁ బ్రజలకు హితమిచ్చి ప్రబలెనెవఁడు ?
మేషరూపమునొంది మేధాతిథినిజేరుకొని సోమరసమును గ్రోలెనెవఁడు ?
వేదఋక్కులచేత వినుతింపఁబడె నెవ్వఁడర్థవంతులలోన నధికుఁడెవఁడు ?
యజమానతతిచేత నర్చితుండెవ్వఁడు వర్షకారకుఁడని వరలునెవ్వఁ
గీ॥ డట్టిమేధా విరాజితు నమరసే[1]వ్య, మానపాదాబ్జ యుగ్మని మానధనుని
యజ్ఞమూర్తిని దుశ్శత్రుహానికరుని, నింద్రుఁబూజింపుఁడిప్పుడో ఋభువులార ! ॥ 33

(2) క॥ శూరులలో నొక్కఁడవని, వీరులలో మేటివనుచు వేయివిధములన్
గోరిమహేం[2]ద్రుఁడ! నిన్నున్, వీరమరుద్గణముపంపె వృత్రుని వధకై ॥ 34

(3,4,5,6) సీ॥ ఏసందియములేక యింద్రుఁడంగిరసుల కపవృష్టిదోషంబులాపినాఁడు
శతయంత్ర బాధిత[3]చాత్రమహర్షిని దప్పించి యసురులఁద్రచ్చినాఁడు
విమదమౌనికి బహు విత్తాన్నములు వేడ్కనిప్పించి మెప్పులనొప్పినాఁడు
విజయాభిలాషియౌ వేరొక్కఋని వంకఁజేరి జయంబులఁజేర్చినాఁడు
గీ॥ కుత్సమౌనిని రక్షింపఁగోరినాఁడు, శంబరుని యుద్ధభూమికిఁజేరినాఁడు
దస్యుహతముగావించి యర్బుదునమర విభుఁడు, †దస్యు పక్షంబువారిని దన్నినాఁడు ॥ 35

(7,8) సీ॥ పాకశాసన ! నీకు బలముండుటంజేసి యరిమండలంబుల నడఁచవలయు
బాహుద్వయంబున వజ్రముండుటఁజేసి శత్రుగణంబులఁ జంపవలయు
నార్యుల నుడువులనాలించుటంజేసి దుష్టుఁడౌ శంబరుఁద్రుంపవలయు
యజమాను, వ్రతపూర్తి యగునంతవఱకధ్వరాళి విఘాతంబు నాపవలయు
గీ॥ వృత్ర శత్రుండవయి చాలవిత్తమంది, నిజగృహంబెల్ల నేర్పున నింపవలయు
భాస్కరుని బాధనంతయుఁబాపి మేఘదోషపుంజము దూరముఁద్రోలవలయు ॥ 36

1. శేవ్యమాన (ప్రా.ప్ర.పా.) 2. గోరికొనియాడి నిన్నున్, (తొ.పా.) 3. శాత్రమహర్షిగా సంస్కృతమూలము. చాత్రపాఠాంతరముకావగు. వ.గో.కృ.

† దస్యులనఁగా వేదకర్మల ద్వేషించువారు. ఇట్టివారిని శిక్షింపుమని స్తోత్ర మంత్రములు వేదమందుఁ బెక్కుగలవు. ఇట్టి ప్రార్థనలు వేదమందంతటను గలవు. ఇట్టివానిని పునరుక్తిగా నిశ్చయింపఁగూడదు. ఆంగ్లభాషలోఁజరిత్ర (History Repeates it self) తిరిగి, తిరిగి నెమరు వేయుచుండునందురు. (చరిత్ర పునరావృత్తమగుననుభావము వెల్లడింప వలయునని రచయిత భావము. వ.గో.కృ.) అట్లనుటఁ జేసి గతించిన పరిస్థితులే చక్రనేమి క్రమముగఁ జుట్టిచుట్టి వచ్చుచుండుననుట. నాఁడు యాగధ్వంసదీక్షితులగు పారసీకార్యులు బ్రహ్మద్వేషమవలంబించిన విధముగానే నేఁటి కాలమున విప్రక్షయ దీక్షితులైన కొందరు బ్రహ్మద్వేషమును దలఁగట్టుకొనుచున్నారు. కాని వారెంత బాపుకొనిరో వీరును నంత బాపుకొందురని మాకు జాలికలుగుచున్నది. (నే.వేం.న.శా.)

(9,10) సీ॥ వృద్ధుఁడవై యున్న వృద్ధినొందుచునుండి భక్త ప్రియుండవై పరఁగినావు !
కర్మబాహ్యులనెల్ల ఖండించి వారలఁ గర్మవశలుగఁ జేయఁగలిఁగినావు !
వమ్రు[1]ఁడు కాంక్షించువల్మీక వపఁగొని తెచ్చివానికి నాఁడెయిచ్చినావు !
స్వర్గగతుండవై సక[2]లాసురులఁద్రుంచి నిర్జరరాజ్యంబు నిలిపినావు !
గీ॥ కావ్యుఁడెంతయు నీ[3]శక్తిఁ గ్రాలఁజేయ, నీదు బలమెల్ల తీక్ష్ణమై నిలిచియుండ
వాయువేగంబుగల వారువములనెలమి, నెక్కి[4]వేంచేయుదువుగాక నింద్ర ! నీవు ॥ 37

(11) క॥ †ఉశనసుని నుతులఁజేతన్, వశుఁడై యింద్రుండు వాన వదలిన పిదపం
బశుతుల్యశుష్ణ పురముల, వశముఁగఁజేకొనఁడె వర్ష వారులచేతన్ ॥ 38

(12,13) సీ॥ శర్యాతిదత్తమౌ సకల సోమరసంబు త్రాగి సంతసముచేఁదనిసినావు
యాగంబులంగల భాగంబులంగొని వృచయాఖ్యునకుఁగొంత నిచ్చినావు
వృషణాశ్వసంజాత వీరపుత్రికఁజూచి, కోరని కోర్కెనుగోరినావు
స్వారాజ్య ధర్మంబుఁ జక్కఁజేయుటఁజేసి యమరుల సంస్తుతులందినాఁడ
గీ॥ విట్టి నీ[5]కృత్యములనెల్ల నిచటకాదు, సర్వయాగతలంబుల సంస్తుతింపఁ
బడుచునుండు మహేంద్రుఁడా ! బండిపైని, వచ్చి సోమంబుఁగ్రోలు మవ్వారిగాఁగ ॥ 39

(14) గీ॥ అధికదారిద్ర్య దోషంబులంటియుంట, నక్వగోతతి వసువుల కాశపడుచు
దాతయౌనింద్రదేవుఁడు ధన్యుడైన, నీకులంగిరసుల నాశ్రయింపవలసె ॥ 40

(15) గీ॥ రమ్యబలయుక్త ! తేజోవిరాజమాన!, యరినిషూదన ! దండము లందికొనుము
భటులఁగూడియుఁ దావక భవనమందు, నందనులు మేము ప్రీతితో నుందుమయ్య! ॥ 41

1. బభ్రుఁడు (తొ.పా.) 2. సకల దనుజుల. (తొ.పా.) 3. నీమీఁదఁగన్నయుండ, శవుఁడు బ్రహ్మాండ ఖండంబు సరవిఁగప్ప (తొ.పా.)
4. వేంచేయుమింద్రుఁడా యొక్కమారు (తొ. పా.)

† ఉశనసుఁడనువాఁడు వీరుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. వీరారాధనయే ప్రధానముగాఁగల్గు నార్యులకుఁ జాలమంది వీరపురుషులే దైవతములుగాఁ బరికింపఁబడుచున్నారు, మనము "యము"ఁడను పేరుతోఁ బిలువఁగా పారసీకులు 'ఇము'ఁడను పేరుపయోగించుచున్నారు. "కావ్య, ఉశన"సులు అని మనము పిలుచువారిని ''కావ్య, ఉశా'' సులని పారసీకులు పిలుచుచున్నారు. "వివస్వాను''ని వారు 'వివహ్వానుఁడ'ని పిలుచుచున్నారు. ఇట్లే చాలచోట్ల పారసీకుల, ఐందవార్యుల వీరపురుషనామధేయములుచూడసమన్వయించుచున్నవి.కావునహైందవార్యులకుఁబారసీకార్యులకుఁ గొంతకాలమునకు దేశకాల పరిస్థితులనుబట్టి ప్రబల విరోధములేర్పడినట్లు కన్పట్టుచున్నది, పారసీకులు సరస్వతిని హరహ్వతిగాఁ బిలుతురు. నే.వేం,న,శా.

సూచన :— ఇది వేదభాషా శబ్దపరిణామ విషయము-ఈ పరిణామము దేశకాల పరిస్థితులపై నాధారపడి జరిగినదేయైనను సార్థకముగా జరిగినదో నిరర్థకముగా జరిగినదో లోతుగా బహుముఖముగాఁ బరిశోధింపవలసి యున్నది. వ, గో. కృ.

5. ఇట్టినీకృత్యములనెల్ల (వ్రా.ప్ర.పా.).

## సూక్తమ్—52

### ఋషిః—సవ్య ఆఙ్గిరసః

### దేవతా—ఇంద్రః

### ఛందః—జగతీ, 13, 15 త్రిష్టుప్

(1) త్యం సు మేషం మహయా స్వర్విదం శతం యస్య సుభ్వః సాకమీరతే।
అత్యం న వాజం హవనస్యదం రథమేన్ద్రం వవృత్యామవసే సువృక్తిభిః॥ 59

(2) స పర్వతో న ధరుణేష్వచ్యుతః సహస్రమూతిస్తవిషీషు వావృధే।
ఇన్ద్రో యద్ వృత్రమవధీన్నదీవృతముబ్జన్నర్ణాంసి జర్హృషాణో అన్ధసా॥ 60

(3) స హి ద్వరో ద్వరిషు వవ్ర ఊధని చన్ద్రబుధ్నో మదవృద్ధో మనీషిభిః।
ఇన్ద్రం తమహ్వే స్వపస్యయా ధియా మంహిష్ఠరాతిం స హి పప్రిరన్ధసః॥ 61

(4) ఆ యం పృణన్తి దివి సద్మబర్హిషః సముద్రం న సు[1]భ్వః స్వా అభిష్టయః।
తం వృత్రహత్యే అను తస్థురూతయః శుష్మా ఇన్ద్రమవాతా అహ్రుతప్సవః॥ 62

(5) అభి స్వవృష్టిం మదే అస్య యుధ్యతో రఘ్వీరివ ప్రవణే సస్రురూతయః।
ఇన్ద్రో యద్ వజ్రీ ధృషమాణో అన్ధసా భినద్ వలస్య పరిధీఀరివ త్రితః॥ 63

(6) పరీం ఘృణా చరతి తిత్విషే శవో ఽపో వృత్వీ రజసో బుధ్నమాశయత్।
వృత్రస్య యత్ ప్రవణే దుర్గృభిశ్వనో నిజఘన్థ హన్వోరిన్ద్ర తన్యతుమ్॥ 64

1. వేసుభ్వ (వ్రా. ప్ర.)

(7) ప్రాదం న హి త్వాన్యృషన్త్యూర్మయో బ్రహ్మాణీన్ద్ర తవ యాని వర్ధనా।
త్వష్టా చిత్ తే యుజ్యం వావృధే శవస్తతక్ష వజ్రమభిభూత్యోజసమ్॥ 65

(8) జఘన్వాగ్ం ఉ హరిభిః సంభృతక్రతవిన్ద్ర వృత్రం మనుషే గాతుయన్నపః।
అయచ్ఛథా బాహ్వోర్వజ్రమాయస మధారయో దివ్యా సూర్యం దృశే॥ 66

(9) బృహత్ స్వశ్చన్ద్రమమవద్ యదుక్థ్యం మకృణ్వత భియసా రోహణం దివః।
యన్మానుషప్రధనా ఇన్ద్రమూతయః స్వర్నృషాచో మరుతోఽమదన్ను॥ 67

(10) ద్యౌశ్చిదస్యామవాగ్ం అహేః స్వనాదయోయవీద్ భియసా వజ్ర ఇన్ద్ర తే।
వృత్రస్య యద్ బద్బధానస్య రోదసీ మదే సుతస్య శవసాభినచ్ఛిరః॥ 68

(11) యదిన్న్విన్ద్ర పృథివీ దశభుజిరహాని విశ్వా తతనన్త కృష్టయః।
అత్రాహ తే మఘవన్ విశ్రుతం సహో ద్యామను శవసా బర్హణా భువత్॥ 69

(12) త్వమస్య పారే రజసో వ్యోమనః స్వభూత్యోజా అవసే ధృషన్మనః
చకృషే భూమిం ప్రతిమానమోజసో ఽపః స్వః పరిభూరేష్యా దివమ్॥ 70

(13) త్వం భువః ప్రతిమానం పృథివ్యా ఋష్వవీరస్య బృహతః పతిర్భూః।
విశ్వమాప్రా అన్తరిక్షం మహిత్వా సత్యమద్ధా నకిరన్యస్త్వావాన్॥ 71

(14) న యస్య ద్యావాపృథివీ అను వ్యచో న సిన్ధవో రజసో అన్తమానశుః।
నోత స్వవృష్టిం మదే అస్య యుధ్యత ఏకో అన్యచ్చకృషే విశ్వమానుషక్॥ 72

(15) అర్చన్నత్ర మరుతః సస్మిన్నాజౌ విశ్వే దేవాసో అమదన్ననుత్వా।

వృత్రస్య యద్ భృష్టిమతా వధేన ని త్వమిన్ద్ర ప్రత్యానం జఘన్థ॥ 73

## సూక్తము—52

### ఋషి—సవ్యుఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1,2,3,4,5,6) సీ॥ తటినీ జలంబులఁదారుమారుగఁజేయు, వైరిబలంబుల వంచెనెవ్వఁడొ ?
శత్రుంజయుండయి, చంద్రప్రభుండయి, సోమవర్ధితుఁడగు శూరుఁడెవఁడొ ?
శోభనావయవ సంశోభిమరుద్గణ, వశమున నెంతేని వరలునెవఁడొ ?
త్రితుఁడుపరిధలట్లు తీక్ష్ణబలాసురు నాసోమరసశక్తి నడఁచెనెవఁడొ
గీ॥ వారి సముదాయముంగొని వైరిమిగుల, శబ్దముంజేయుచుండఁగ శక్తితోడ
వజ్రమున వానిఁగొట్టె నెవ్వండొవానిఁబిలిచి, సోమరసంబు నర్పింపుఁడెలమి ॥ 42

(7,8,9) సీ॥ సలిల ప్రవాహముల్ సరసుఁజేరెడుభంగిఁ, బుణ్య మంత్రములు నిన్నొందుచుండఁ
ద్వష్టచే దత్తమైతనరారు వజ్రంబు త్వద్బాహుతలమున వరలుచుండ
శత్రువునగు మూఢ వృత్రాసురు[1]వధింప నశ్వముపైనెక్కి- యరుఁగుచుండ
నాహ్లాదకంబయి యలరు సామమునిన్ను వృత్రుని భయముచే వేఁడుచుండఁ
గీ॥ ప్రాణరూపములగు మరుత్పంక్తివేడ్క-, నిర్భరానంద సుఖరీతి నీకుఁ గలుఁగ
హెచ్చరించిన వజ్రమునెత్తికొనుచు, నరిగినాఁడవు వృత్రుని హననమునకు ॥ 43

(10) గీ॥ స్వర్గమంతయు వృత్రుని స్వనమువలన, సంచలింపంగఁదొడఁగెను శాంతివీడి
సోమరసపానమత్తత శోభిలంగ, వృత్రవధమునుజేయవే వృత్రవైరి ! ॥ 44

(11) గీ॥ అమరలోకంబునకు నిర్భయంబుసేయ, వృత్రహతకుని వధియించితీవు వజ్రి!
యాకసంబెంత విస్తృతి నందుచుండె, నంత విస్తృతి వృత్రుని హననమందె ॥ 45

(12) గీ॥ గగనమందుండి భూలోకకలననెల్ల, [2]నస్మదీయుల రక్షకై యనుపుచుంటి
వంతరిక్షంబునకు మఱి యమరలోక, మునకుఁ బ్రతినిధివై యుంటి ఘనహాయుండ! ॥ 46

* అంగిరసపుత్రుఁడైన సవ్యుఁడని సంస్కృత మూలప్రతులలోఁగలదు. వ.గో.కృ. 1. వృత్రు (త్రుః) నివధియింప (తా.పా.) 2. మాదు రక్షణకై జేసి మనుపుచుంటి (తా.పా.)

†(13,14, సీ॥ స్వర్లోక భూలోక సౌఖ్యంబునకు నీవె ప్రతినిధి వైతివి ప్రజ్ఞమీర
15) నాకసంబున భూమియందున సింహపుతేజంబు మించితి తేజమలర
వృత్రాదులన్ నీవు విపుల బలంబున మించితి వతిశక్తి మించి వెలుఁగ
భవదీయకీర్తిని బరులు బొందనియట్లు చరియించితివి శక్తి చాలఁగ్రాల
గీ॥ జంగమ స్థావరంబులౌ జగములన్ని, నీ యధీనంబులై యుండె నిన్నెఱుంగ
శక్యమెటులౌను జెప్పుము ! శక్రదేవ!, సాటి యెవ్వారు? నీకు నీజగమునందు ॥ 47

## సూక్తమ్—53

ఋషిః—సవ్య ఆఙ్గిరసః
దేవతా—ఇంద్రః
ఛందః—జగతీ, 10-11 త్రిష్టుప్.

(1) న్యూ౩ షు వాచం ప్ర మహే భరామహే గిర ఇన్ద్రా౩య సదనే వివస్వతః ।
నూ చిద్ధి రత్నం ససతామివావిదన్న దుష్టుతిర్ద్ర౩విణోదేషు శస్యతే ॥ 74

(2) దురో అశ్వస్య దుర ఇన్ద్ర౩ గోరసి దురో యవస్య వసున ఇనస్పతిః ।
శిక్షానరః ప్రదివో అకామకర్శనః[1] సఖా సఖిభ్యస్తమిదం గృణీమసి ॥ 75

(3) శచీవ ఇన్ద్ర౩ పురుకృద్ద్యుమత్తమ తవేదిదమభితశ్చేకితే వసు ।
అతః సంగృభ్యాభిభూత ఆ భర మా త్వాయతో జరితుః కామమూనయీః ॥ 76

(4) ఏభిర్ద్యుభిః సుమనా ఏభిరిన్దుభిర్నిరున్ధానో అమతిం గోభిరశ్వినా ।
ఇన్ద్రే౩ణ దస్యుం దరయన్త ఇన్దుభిర్యుతద్వేషసః సమిషా రభేమహి ॥ 77

† ఋగ్వేదము ప్రథమ మండలము 52వ సూక్తములో మొత్తము 15 ఋక్కులుండఁగా 14 ఋక్కులు మాత్రమే యున్నట్లును "స్వర్లోక భూలోక"ఇత్యాది సీసపద్యము 13,14 ఋక్కులకు మాత్రమె యనువాదమైనట్లును వ్రాతప్రతిలోఁ బొరపాటుగ వ్రాయఁబడినది. (చూ-వ్రాతప్రతి. 1వ. సంపుటము. 205 పుట) కాని యీ సీసపద్యము 13, 14, 15 ఋక్కులు మూఁడింటికిని ననువాదము. వ.గో.కృ.

1. అకామకర్మనః (వ్రా.ప్ర.)

(5) సమిన్ద్ర రాయా సమిషా రభేమహి సం వాజేభిః పురుశ్చన్ద్రైరభిద్యుభిః ।
సం దేవ్యా ప్రమత్యా వీరశుష్మయా గోఅగ్రయాశ్వావత్యా రభేమహి ॥ 78

(6) తే త్వా మదా అమదన్ తాని వృష్ణ్యా తే సోమాసో వృత్రహత్యేషు సత్పతే ।
యత్ కారవే దశ వృత్రాణ్యప్రతి బర్హిష్మతే ని సహస్రాణి బర్హయః ॥ 79

(7) యుధా యుధముప ఘేదేషి ధృష్ణుయా పురా పురం సమిదం హంస్యోజసా ।
నమ్యా యదిన్ద్ర సఖ్యా పరావతి నిబర్హయో నముచిం నామ మాయినమ్ ॥ 80

(8) త్వం కరఞ్జముత పర్ణయం వధీస్తేజిష్ఠయాతిథిగ్వస్య వర్తనీ ।
త్వం శతా వఙ్గృదస్యాభినత్ పురో ఽనానుదః పరిషూతా ఋజిశ్వనా ॥ 81

(9) త్వమేతాఞ్జనరాజ్ఞో ద్విర్దశా[1]ఽబన్ధునా సుశ్రవసోపజగ్ముషః ।
షష్టిం సహస్రా నవతిం నవ శ్రుతో ని చక్రేణ రథ్యా దుష్పదావృణక్ ॥ 82

(10) త్వమావిథ సుశ్రవసం తవోతిభిస్తవ త్రామభిరిన్ద్ర తూర్వయాణమ్ ।
త్వమస్మై కుత్సమతిథిగ్వమాయుం మహే రాజ్ఞే యూనే అరన్ధనాయః ॥ 83

(11) య ఉదృచీన్ద్ర దేవగోపాః సఖాయస్తే శివతమా అసామ ।
త్వాం స్తోషామ త్వయా సువీరా ద్రాఘీయ ఆయుః ప్రతరం దధానాః ॥ 84

1. ద్విర్దశాబన్ధునా (ప్రా.ప్ర.)

## సూక్తము—53

### ఋషి—సవ్యుఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ దాతృత్వమున నొప్పుదగు మరుద్గణమెల్ల నిన్నుఁదనియింపంగ నేర్వలేదు
వజ్రాయుధముతప్ప వజ్రి! యింకేదియు ఘోరవృత్రాసురుఁ గొట్టలేదు
దానవధనమంత దానంబు మాకీయ శక్ర! యెవ్వనికైన శక్తిలేదు
హయగోగణంబుల నందింప మాకిల నెంతేని నెవనికి నేపులేదు
గీ॥ హ[1]యసుదాతవు పశుదాత వధికవస్తు, దాతవై వసుధన మణిదాతవైన
నీకు[2] యజ్ఞగృహంబున నున్నతముగ, సన్నుతులు చేతుమయ్య! యోశక్రదేవ! ॥ 48

(3) క॥ ధనమంతయు నీదేయగు, ధనముప్రసాదించు మాకుఁ దద్దయుఁబ్రీతిన్
ధనకాంక్షనెల్లఁదీ[3]ర్పుము, మునిజన సంస్తోత్రపాత్ర! ముఖ్యచరిత్రా! ॥ 49

(4) క॥ చరువు పురోడాశంబున్, వరసోమరసంబు గొనుచు వర్ధిల్లెడు నో
సురపతి[4]! మాదారిద్ర్యము, సరగునఁబోఁగొట్టి మిగుల సౌఖ్యంబిడుమా! ॥ 50

(5) గీ॥ శత్రుహింసక చాతురీచణము మిగుల, దీప్తిమంతంబునగు నీదుధీవిశేష
మును, బలంబును, ధనముఁ నమోఘమంచు, గాంచి పూనితిమయ్య! యీకార్యమునకు ॥ 51

(6,7,8,9) సీ॥ సోమరసంబుతో సొంపారు చరువెల్ల భక్షించి భక్షించి బలసినావు
యుద్ధశీలుండవై యౌద్ధత్యముంబూని యరిపురంబుల నష్టపరచినావు
నముచిమాయలఁగొట్టి సముచితంబుగవాని శిరము వజ్రంబుచేఁజీల్చినావు
దివిజారి వధనిమిత్తీభూతముగఁగొని యధ్వరోపద్రవ మడఁచినావు
గీ॥ పర్ణయ[5] ప్రముఖరాజులఁబంతగించి, శక్తి వజ్రములన్ శక్ర! చంపినావు
సుశ్రవోరాజునీకు[6] సంస్తుతులఁజేయ, వానిశత్రువులంగొట్టఁ బూనినావు ॥ 52

(10,11) ఉ॥ రాజితకీర్తి! సుశ్రవసురాజ్యమునంతను నిల్పినావు వి
భ్రాజిత తుర్వయాణ విభుభావముఁగిన్కను బెంచినావు ప
త్తేజ మెలర్ప మిత్రుల సుధీరులుగా నొనరించినావు నీ
రాజపదంబు నెన్నుచు విరాజిలుచుంటిమి శక్ర దేవుఁడా! ॥ 53

* అంగిరస పుత్రుఁడైన సవ్యుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ. 1. అశ్వసుదాతవు (తౌ.పా. గణభంగము. లేక యింద్ర గణమునకు మారు "జల"ప్రయోగము. వ.గో.కృ.) 2. నిన్ను యజ్ఞగృహంబున సుస్నితముగ. (తౌ.పా.) 3. దీర్పవె (తౌ.పా.) దీర్ప (ర్పు?) ము. (వా.ప్ర.పా.) 4. సురపతి!మాదు దరిద్రత. (తౌ.పా.) 5. ప్రముఖశబ్దములో "ప్ర"వర్ణమునుదేల్చి పలుకవలయు. కాఁగా "పర్ణయ" శబ్దములోని "య" లఘువగును. లేక యింద్రగణమునకుమారుగా "భల" మువయోగింపఁబడెననియెన్నవగు. వ.గో.కృ. 6. నీకు నుతి సుంతఁజేయ (తౌ.పా.)

## సూక్తమ్—54

ఋషిః—సవ్య ఆఙ్గిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ, 6, 8-9, 11 త్రిష్టుప్

(1) మా నో అస్మిన్ మఘవన్ పృత్స్వంహసి నహి తే అన్తః శవసః పరీణశే।

అక్రన్దయో నద్యో౩ రోరువద్ వనా కథా న క్షోణీర్భియసా సమారత॥ 85

(2) అర్చా శక్రాయ శాకినే శచీవతే శృణ్వన్తమిన్ద్రం మహయన్నభిష్టుహి।

యో ధృష్ణునా శవసా రోదసీ ఉభే వృషా వృషత్వా వృషభో న్యృఞ్జతే॥ 86

(3) అర్చా దివే బృహతే శూష్యం౧ వచః స్వక్షత్రం యస్య ధృషతో ధృషన్మనః।

బృహచ్ఛ్రవా అసురో బర్హణా కృతః పురో హరిభ్యాం వృషభో రథో హి షః॥ 87

(4) త్వందివో బృహతః సాను కోపయో౭వ త్మనా ధృషతా శమ్బరం భినత్।

యన్మాయినో వ్రన్దినో మన్దినా ధృషచ్ఛితాం గభస్తిమశనిం పృతన్యసి॥ 88

(5) ని యద్ వృణక్షి శ్వసనస్య మూర్ధని శుష్ణస్య చిద్ వ్రన్దినో రోరువద్ వనా।

ప్రాచీనేన మనసా బర్హణావతా యదద్యా చిత్ కృణవః కస్త్వా పరి॥ 89

(6) త్వమావిథ నర్యం౧ తుర్వశం యదుం౧ త్వం౧ తుర్వీతిం వయ్యం శతక్రతో।

త్వం రథమేతశం కృత్వ్యే ధనే త్వం పుర॰ నవతిం దమ్భయో నవ॥ 90

(7) స ఘా రాజా సత్పతిః శూశువజ్జనో రాతహవ్యః ప్రతియః శాసమిన్వతి।

ఉక్థా వా యో అభిగృణాతి రాధసా దానురస్మా ఉపరా పిన్వతే దివః॥ 91

(8) అసమం క్షత్రమసమా మనీషా ప్ర సోమపా అపసా సన్తు నేమే।

యే త ఇన్ద్ర దదుషో వర్ధయన్తి మహి క్షత్రం స్థవిరం వృష్ణ్యం చ॥ 92

(9) తుభ్యేదేతే బహులా అద్రిదుగ్ధాశ్చమూషదశ్చమసా ఇన్ద్రపానాః।

వ్యశ్నుహి తర్పయా కామమేషామథా మనో వసుదేయాయ కృష్వ॥ 93

(10) అపామతిష్ఠద్ధరుణహ్వరం తమో ఽన్తర్వృత్రస్య జఠరేషు పర్వతః।

అభీమిన్ద్రో నద్యో వవ్రిణా హితా విశ్వా అనుష్ఠాః ప్రవణేషు జిఘ్నతే॥ 94

(11) స శేవృధమధి ధా ద్యుమ్నమస్మే మహి క్షత్రం జనాషాళిన్ద్ర తవ్యమ్।

రక్షా చ నో మఘోనః పాహి సూరీన్ రాయే చ నః స్వపత్యా ఇషే ధాః॥ 95

## సూక్తము—౫౪

### ఋషి—శవ్యుఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ పాపఫలభూత సంగ్రామ పద్ధతులను, దావక బలంబు నెదిరించు ధన్యుఁడెవఁడు?
నీదుశక్తిని జవిఁగొని నిఖిల జగము, భీతినొందుచునుండె విఖ్యాతివీడి॥ 54

* ఆంధ్రానువాద గ్రంథము వ్రాతప్రతిలో (1వ. సంపుటము 209వ పుటలో) విస్పష్టముగా "శవ్యుడు" అని "శ" వర్ణముతో ఋషి పేర్కొనఁబడినాఁడు. ఇది పొరపాటున వ్రాయఁబడెనో బుద్ధి పూర్వకముగా వ్రాయఁబడెనో తెలియదు. సంస్కృత (ముద్రిత) మూల ప్రతులలో "సవ్య ఆంగిరసః" అని అంగిరస పుత్రుఁడైన సవ్యుఁడు ఋషిగా నుటంకింపఁబడినాఁడు. వ.గో.కృ.

(2) గీ॥ శత్రుధర్షకమైనట్టి శక్రశక్తి, జగమునంతయు సాధించెఁ, జాతురిమను
గాననధ్వర్యులందఱుఁ గౌతుకమునఁ, బూనుదుఱుగాక వృత్రారి పూజలకయి ॥ 55

(3) గీ॥ †స్వచ్ఛయశుఁడు సర్వశత్రు భయంకరుం, డశ్వ[1]రథపురస్కృతాసురజయి
యైన నింద్రమూర్తి కఖిల సుఖంబులు, కలుగుఁగాక ననుచుఁ బలుకవలయు ॥ 56

(4,5,6) సీ॥ శంబర హతకుని జంపువేళనభంబు కదలునట్టులు చేయఁగలిగినావు
రసముల నెండించు రవిమండలముపైని వర్షము వర్షించి వరలినావు
చూతఫలాళికి సుందరమృదు భావమం[2]దించు వాఁడవై యలరినావు
ఘర్మకాలమునందుఁ గర్మసాక్షికి జలములను నందించుచు మెల్గఁగినావు
గీ॥ యజ్ఞనాయక! నీకంటెనధికుఁడెవఁడు,? నీవె సర్వాధికారివి నిగమవేద్య!
బహువిధ ప్రాజ్ఞుఁడవుప్రయ్య బాధకుండ, వట్టి నీవందుకొనరాదె! యఖిలనుతుల ॥ 57

(7,8) చ॥ బలమసమానమై తనరి భవ్యసురాళిని గాఁచుచుండె, నీ
లలిత విశుద్ధబుద్ధి, సువిలాసవిశేషమహత్వ చాతురీ
కలిత మనోజ్ఞమై చెలఁగెఁ, గర్మకరుల్ భవదీయ పుంస్త్వమున్
బలమును హెచ్చుఁజేయఁదగఁబల్కిరి, శత్రు వినాశ దీక్షకై ॥ 58

(9) ఉ॥ సోమరసంబునీకొఱకు సొంపుగఁదెచ్చితిమయ్య! యింద్రుఁడా!
కామము పూర్ణమౌనటులఁగమ్మఁగఁగ్రోలుము దానిఁ[3]జిత్త మెం
తే ముదమొందునట్టుల ననింద్య చరిత్రుఁడ! యోపవిత్రుఁడా!
సేమ మొసంగుచున్ మిగుల శీఘ్రము మాకు ధనంబు నీయుమా! ॥ 59

(10) శా॥ ఈ లోకత్రయమాక్రమించుకొని యావృత్రాసురుండుండఁగాఁ
గాలాకారముతోడఁజీఁకటులు శంకాతంకలేకుండగా
లోలాభ్రంబులఁగప్పునప్పుజలముల్ సుంతేని లేకుండుచో
వాలాయంబుగ వృత్రునిం దునుముచున్ వర్షంబు నీవీయవే! ॥ 60

† అసురుఁడు పారసీకులు - పారసీకార్యులు మనలకు "దేవత"లను పేరు పెట్టునప్పుడు దేవతా శబ్దమునకు ఎట్లు సర్వదూష్యమగుర్థమును జెప్పిరో అట్లే పారసీకులు తమ మతమునకు అసుర మతమనియు తామసురులమనియు నెప్పుడు పిలుచుకొనసాగిరో అప్పుడే "అసుర" శబ్దార్థము హైందవార్యులవల్ల సర్వదూష్యముగా మారినది. ప్రథమ దశలో నసురశబ్దమునకుఁ జక్కని యర్థముండెను. మన యార్యులకు ముఖ్యదైవతమగు నింద్రునకు అసురుఁడను విశేషణముగలదు. అసుమంతుఁడనఁగా బలవంతుఁడని యర్థము. (సే.వేం.న.శా)

గమనిక—ఒక్క "అసుర" శబ్దము మాత్రమేకాదు. దాదాపు వేదములలోని శబ్దములన్నియు సంఘవ్యవస్థనుబట్టి యర్థపరిణామమునకు గుఱియైనవి, దానికిఁదోడు శబ్దములు వేదములలోనే రకరకాలుగా మార్పునొందినవి. ఇది ప్రత్యేకముగాఁ బరిశోధింపవలసిన యత్యంత పరమ వైజ్ఞానిక విషయము. వ.గో.కృ. [విశేష విషయములకై చూఁడు. తెలుఁగు 34వ సూక్తము 11వ ఋగనువాదము 92వ పుట ఫుట్‌నోటు, 139వ సూక్తము 11వ ఋక్కు ఫుట్‌నోటు] వ.గో.కృ.

1. "దశ్వపురస్కృతుండసురుఁడు జయి" అని 54వ సూక్తములోని 3వ ఋక్కునకనువాద పద్యమైన (1వ, సంపుటము 209వ పుట, 56వ పద్యము) ఆటవెలఁది రెండవపాదము గణభంగ దోషముతోనున్నది. కావున "దశ్వరథ పురస్కృతాసురజయి" అని లక్షణయుక్తముగా నుండునట్లు సవరింపబడినది. వ.గో.కృ.

2. నందించువాయువలరినావు (తొ.పా.) 3. దానిచిత్తమెంతే (వ్రా.ప్ర.పా.)

(11) మ॥ వినుమో! నిర్జరశత్రునాశక! మహావీర్యంబు మా కిచ్చుచున్
ఘనమౌక్షాత్ర బలంబుఁగీర్తియుఁగడుంగల్పించుచున్ వర్షమున్
ధనసంపత్తియు నశ్వవృద్ధియును [1]నందం బొప్పఁగా నిచ్చి మ
మ్మనయంబుం దయఁజూఁడుమందుము బుధాధ్యక్షా! శచీవల్లభా! ॥ 61

## సూక్తమ్—55

ఋషిః—సవ్య ఆఙ్గిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ

(1) దివశ్చిదస్య వరిమా వి ప్రప్రథ ఇన్ద్రం న మహ్నా పృథివీ చన ప్రతి ।
భీమస్తువిష్మాఞ్చర్షణిభ్య ఆతపః శిశీతే వజ్రం తేజసే న వంసగః ॥ 96

(2) సో అర్ణవో న నద్యః సముద్రియః ప్రతి గృభ్ణాతి విశ్రితా వరీమభిః ।
ఇన్ద్రః సోమస్య పీతయే వృషాయతే సనాత్ స యుధ్మ ఓజసా పనస్యతే ॥ 97

(3) త్వం తమిన్ద్ర పర్వతం న భోజసే మహో నృమ్ణస్య ధర్మణామిరజ్యసి ।
ప్ర వీర్యేణ దేవతాతి చేకితే విశ్వస్మా ఉగ్రః కర్మణే పురోహితః ॥ 98

(4) స ఇద్ వనే నమస్యుభిర్వచస్యతే చారు జనేషు ప్రబ్రువాణ ఇన్ద్రియమ్ ।
వృషా ఛన్దుర్భవతి హర్యతో వృషా క్షేమేణ ధేనాం మఘవా యదిన్వతి ॥ 99

(5) స ఇన్మహాని సమిథాని మజ్మనా కృణోతి యుధ్మ ఓజసా జనేభ్యః ।
అధా చన శ్రద్ దధతి త్విషీమత ఇన్ద్రాయ వజ్రం నిఘనిఘ్నతే వధమ్ ॥ 100

1. నాకందంబుతో నిచ్చి (తొ.పా. యతిభంగము.)

(6) స హి శ్రవస్యుః సదనాని కృత్రిమా క్ష్మయా వృధాన ఓజసా వినాశయన్ ।

జ్యోతీంషి కృణ్వన్నవృకాణి యజ్యవే ఽవ సుక్రతుః సర్తవా అపః సృజత్ ॥ 101

(7) దానాయ మనః సోమపావన్నస్తు తే ఽర్వాఞ్చా హరీ వన్దనశ్రుదా కృధి ।

యమిష్ఠాసః సారథయో య ఇన్ద్ర తే న త్వా కేతా ఆ దభ్నువన్తి భూర్ణయః ॥ 102

(8) అప్రక్షితం వసు బిభర్షి హస్తయోరషాళ్హం సహస్తన్వి శ్రుతో దధే ।

ఆవృతాసోఽవతాసో న కర్తృభిస్తనూషు తే క్రతవ ఇన్ద్ర భూరయః ॥ 103

## సూక్తము—55

### ఋషి--సవ్యుఁడు *

### దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ విష్ణుపదముకంటె విరివి నీ సచ్ఛక్తి, మహియుఁ దక్కువగును మహిమచేత
దేవరాజ! పవిని దీక్ష్ణంబుగాఁజేయు, మెద్దుకొమ్మువలె నహీనగతిని ॥ 62

(2) చ॥ వననిధివోలె నీవు బుధపాలక! శత్రుని—రితాంబువుల్
గొనుచు విశాలభూమిపయి గొబ్బన నింపుచునుండి పేర్కతోఁ
బనిగొని సోమపానమును బంత మెలర్పఁగఁజేసి సంతసం
బున నుతులంగొనంగఁబరిపూర్ణమనస్కుఁడ వాటలేదొకో? ॥ 63

(3) చ॥ ఎవఁడతివర్షణార్థమయి యేపునఁగొట్టును మేఘరాశి నిం
కెవఁడు ధనాధినాథులగు నీశ్వరులన్ నియమించుచుండుఁ దా
మెవనిని వృత్రు నాజి బుధులెంతయునుంత్రు పురస్థలిం దదీ
య విబుధపాలకుం బిలువుఁడార్యులు యాజ్ఞికులెల్లసూక్తులన్ ॥ 64

* అంగిరసపుత్రుఁడు సవ్యుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ.

(4) గీ॥ †మౌనముద్రను ధరియించుమౌనిజనులు. నెవని నుతియించుచుంద రహీనగతిని
వాఁడు నిజజనులకు నెల్ల బలము యాగ, సక్తినొసఁగునుగాతసు రక్తి మెఱయ ॥ 65

(5) క॥ జనులను రక్షించుటకై. పనిఁగొనియింద్రుండు స్వీయబలయుక్తుండై
యని మెసలకుఁబోవుటచే. ననయము నుతిపాత్రుఁడయ్యె యంచతికెపుడున్ ॥ 66

(6) చ॥ బలమున శత్రుపట్ట[1]ణముఁబాపుచు సూర్యముఖగ్రహంబులం
జలమునఁబట్టి బాధలసుశక్తి నిగొట్టుచు మట్టుపెట్టుచుం
దలకొని యజ్ఞకర్తలకుఁదద్దయు వృష్టిని గల్గఁజేయుచున్
సొలయకవృద్ధిఁబొంది నిజశూరతఁజూపవె నీవు శక్రుఁడా! ॥ 67

(7,8) సీ॥ సోమపానప్రియాస్తోక మానసమునీకభిమతఫలదమై యలరుచుండఁ
దావకాశ్వంబులు తద్దయుఁబ్రీతితో యాగాభిముఖములై సాగుచుండ
నియమనచాతురీనిత్యసంపదతోడ నేర్పున సారథి నిలచియుండఁ
బ్రాతికూల్యచ్ఛేదబహుదక్షలౌ నీదు వివిధాయుధాధిపుల్ వెలయుచుండ
గీ॥ బలధనంబులు రెండును బలసియుండఁ. బెక్కుక్రతువులు తనువుసఁబిక్కటిల్ల
వృత్రవధకర్మలన్నియు విస్తరిల్ల. సాటియెవ్వఁడు నీకోయి[2]శక్రదేవ! ॥ 68

## సూక్తమ్—56

ఋషిః—సవ్య ఆఙ్గిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ

(1) ఏష ప్ర పూర్వీరవ తస్య చమ్రిషో ऽత్యో న యోషాముదయంస్త భుర్వణిః।

దక్షం మహే పాయయతే హిరణ్యయం రథమావృత్యా హరియోగమృభ్వసమ్॥ 104

(2) తం గూర్తయో నేమన్నిషః పరీణసః సముద్రం న సంచరణే సనిష్యవః।

పతిం దక్షస్య విదథస్య నూ సహో గిరిం న వేనా అధి రోహ తేజసా ॥ 105

† మౌనముద్రను ధరియించి మౌనిజనులు-మునివృత్తి నవలంబించుట పురాణములలో వర్ణితమయ్యెను. అంతకుఁబూర్వమీ మునివృత్తి లేదని కొందఱనెదరు. కాని యీ మంత్రమువల్లనట్టి మర్యాద ఆర్యదేశమందుండినట్లు తెలియుచున్నది. (నే.వేం.న.శా.)

సూచన—మౌనముద్ర అన్నది ప్రత్యేకమైన (ముని) వృత్తికాదు. దీనికిఁ గాలపరిమితియులేదు. ఇది బుద్ధి మనోవ్యవస్థలపై నాధారపడి యుండును. ఏ నియమమైనను మన యవసరముల ననుసరించి కృష్ణలీలగా విష్ణుమాయగా మన మేర్పరుచుకొన్నవే యనుట నిస్సందేహమైన విషయము. వ.గో.కృ. 1. వీటులను (తొ.పా.) 2. నీకీవిశాలజగతి (తొ.పా.)

(3) స తుర్వణిర్మహాగ్ం అరేణు పౌంస్యే గిరేర్భృష్టిర్న భ్రాజతే తుజా శవః ।
యేన శుష్ణం మాయినమాయసో మదే దుధ్ర ఆభూషు రామయన్ని దామని ॥ 106

(4) దేవీ యది తవిషీ త్వావృధోతయ ఇన్ద్రం సిషక్త్యుషసం న సూర్యః ।
యో ధృష్ణునా శవసా బాధతే తమ ఇయర్తి రేణుం బృహదర్హరిష్వణిః ॥ 107

(5) వి యత్ తిరో ధరుణమచ్యుతం రజో ऽతిష్ఠిపో దివ ఆతాసు బర్హణా ।
స్వర్మీళ్హే యన్మద ఇన్ద్ర హర్ష్యాహన్ వృత్రం నిరపామౌబ్జో అర్ణవమ్ ॥ 108

(6) త్వం దివో ధరుణం ధిష ఓజసా పృథివ్యా ఇన్ద్ర సదనేషు మాహినః ।
త్వం సుతస్య మదే అరిణా అపో వి వృత్రస్య సమయా పాష్యారుజః ॥ 109

## సూక్తము—56

ఋషి—సవ్యుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ బడబను గ్రీడకై పిలుచు బాడబరీతిని నీవు శక్రుఁడా!
తడఁబడకుండ సోమరసధారను దెమ్మనిచెప్పి వేడ్కతో
వడివడివచ్చి సుందర సువర్ణవికార రథంబు నెక్కి చొ
ప్పడ యజమాన చ త్తమగు భవ్యరసంబనురక్తిఁ గ్రోలుమా! ॥ 69

(2) ఉ॥ స్వాభిమత ప్రసూనములఁ జక్కఁగ నేరుటకై ప్రజాతతుల్
ప్రాభవమొప్పఁ బర్వతముపైకి గతించెడునట్లు నౌకలన్
శోభిత నావికావితతిచొప్పడ సింధువుఁజేర్చురీతి న
త్యాభవెలుంగు నింద్రునకు నందఁగఁజేయుఁడు సంస్తవంబులన్ ॥ 70

* అంగిరసపుత్రుఁడగు సవ్యుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ.

(3) గీ॥ వైరినే బలమునుగొని బంధనమున, నెఱినిబద్ధునిగాఁజేసె నిర్జరుండు
శత్రుహింసకమైనయా శక్రబలము, మెండుగాసుండుఁగాకఁబెన్గొండమాట్కి ॥ 71

(4) ఉ॥ కాటుకయట్టి చీఁకటులు క్రమ్మగఁజేసి జనాళికెప్పుడుం
బాటులుకల్గఁజేసి కడుబాధలు పెట్టెడి వృత్రశత్రు కా
రాటముపెట్టు శక్తుల విరాజిత శక్రుఁడు రక్షణార్థమై
సూటిగ వజ్రముంగొనుచు శోషిలఁజేసెడుఁగాక వైరులన్ ॥ 72

(5) ఉ॥ వైరినిరోధితంబయిన వారిని, ప్రాణుల జీవనార్థమై
కోరిరయంబునం జనుల కోర్కెలఁ దీర్పఁగఁ దెచ్చినాఁడ వా
నీరము దిక్కులందునిచి నీమముతో ఖలవృత్రదానవుం
జేరివధించితీవు హరిచెప్పఁగ శక్యమెనీదు శక్తులన్ ॥ 73

(6) గీ॥ సోమపానజాత శోభచేఁగడునుబ్బి, శిలనుబూని వృత్ర శిరముఁగొట్టి
దివమునుండి జలముఁదెచ్చి భూతలమున, నుంచుచుంటి వింద్ర! యోర్పుతోడ ॥ 74

## సూక్తమ్—57

ఋషిః — సవ్య ఆఙ్గీరసః

దేవతా — ఇంద్రః

ఛందః — జగతీ

(1) ప్ర మంహిష్ఠాయ బృహతే బృహద్రయే సత్యశుష్మాయ తవసే మతిం[1] భరే ।
అపామివ ప్రవణే యస్య దుర్ధరం రాధో విశ్వాయు శవసే అపావృతమ్ ॥ 110

(2) అధ తే విశ్వమను హాసదిష్టయ ఆపో నిమ్నేవ సవనా హవిష్మతః ।
యత్ పర్వతే న సమశీత హర్యత ఇన్ద్రస్య వజ్రః శ్నథితా హిరణ్యయః ॥ 111

(3) అస్మై భీమాయ నమసా సమధ్వర ఉషో న శుభ్ర ఆ భరా పనీయసే ।
యస్య ధామ శ్రవసే నామేన్ద్రియం జ్యోతిరకారి హరితో నాయసే ॥ 112

1. మతిభరే (బ్రా. ప్ర.)

(4) ఇమే త ఇన్ద్ర తే వయం పురుష్టుత యే త్వారభ్య చరామసి ప్రభూవసో ।
నహి త్వదన్యో గిర్వణో గిరః సఘత్ క్షోణీరివ ప్రతి నో హర్య తద్ వచః ॥ 113

(5) భూరి త ఇన్ద్ర వీర్యం౧ తవ స్మస్యస్య స్తోతుర్మఘవన్ కామమా పృణ ।
అను తే ద్యౌర్బృహతీ వీర్యం మమ ఇయం చ తే పృథివీ నేమ ఓజసే ॥ 114

(6) త్వం తమిన్ద్ర పర్వతం మహాముఱం వజ్రేణ వజ్రిన్ పర్వశశ్చ కర్తిథ ।
అవాసృజో నివృతాః సర్తవా అపః సత్రా విశ్వం దధిషే కేవలం సహః ॥ 115

## సూక్తము—57

### ఋషి—సవ్యుఁడు*

### దేవత—ఇంద్రుఁడు†

(1) మ॥ పలుదానంబులు సేయువాని ఫలదుంభాస్వత్స్వరూపాత్మకుం
బలవంతున్ గుణరాజ మానమహిమున్ భావించెదన్, నిమ్నగా
జలవేగంబును నాపరాని పగిదిన్ జంభారి బాహుద్ధమౌ
బలముంగొట్టుట కష్టసాధ్యముగదా ! భావింప నెంతేనియున్ ॥ 75

* అంగిరస పుత్రుఁడగు సవ్యుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ.

† భోగాజుకాయి శాసనము క్రీ॥ శ॥ పూర్వము 1400—ఈ శాసనము 1907 సం॥మున కప్పడోసిషా దేశములో (ఏష్యామైనరు) హూగో వింక్లరు (Hugo Vinckler) అను జర్మను విద్వాంసునకు భూమిలో దొరికినది. ఈ శాసనమందలి భాష యేమో తెలియుటలేదు కాని యిందు ఇంద్ర,వరుణ, నాసత్య శబ్దములు కలవు. దీనిని బట్టుకొని పలువురు వ్రాసికులాడిరి, కాని యిది క్రీ॥శ॥ పూర్వము 1400 B.C. కాలము నాటిదేకాని యంతకంటెఁ బురాతన కాలమునాటిదికాదు. అంతకు ముందే యిండియానుండి పారసీకులు తరిమివేయఁబడినట్లు నిదర్శనములున్నవి. వారి దైవతములు చాలవఱకు హిందూదైవతములు. ఈ శాసనము పారసీకులదో లేక తత్సంబంధజాతిదో లేక యిండియానుండి యచ్చటికి వలసపోయిన ఆర్యశాఖకు సంబంధించినదో స్పష్టముగాఁ దెలియదు. ఆర్యశాఖకు సంబంధించిన వారిదై యుండునేమో. అందు హిందూదేవతలు దూషింపఁబడిరో, భూషింపఁబడిరో తెలియదు. అందుఁగల భాష తెలియలేదఁట. ఆర్యదేవత పూజించెడు పారసీకాది జాతులవారు వేదకాలము నాటికే యచ్చట కేగిరి. కాన నీశాసనము వారిదికానోపును. ఇట్లుండ "దబిస్టాన్ పత్రము"లో హిందూరాజులు బాక్ట్రియాలో క్రీ॥ శ॥ పూ॥ 5000 ఏండ్లకాలమునకే రాజ్యము చేసియుండలేదా? కావున నీశాసనము వారిదై యుండనోపు— వేదభూమి (నే.వేం.న.శా)

(గమనిక-శ్రీ, నే.వేం.వ.శా. గారు వేదభూమితొలి ముద్రణప్రతి (1936 జులై) పరిశీలించిరి. ఈ పైనుదాహరించిన విషయము 1950లో ప్రకటితమైన ద్వితీయముద్రణ ప్రతిలో 202-203 పుటలలోనున్నది. ఇది వెంకట్రామ అండ్ కో ఏలూరువారి ప్రచురణ. వేదభూమి గ్రంథకర్త : అచ్యుతుని వెంకటాచలపతిరావు) వ.గో.కృ.

(2) మ॥ చలమారన్ భవదీయ రుక్మమయ వజ్రాఘాత మూలంబుసన్
ఖలుఁడౌ వృత్రుఁడు ప్రాణముల్ విడువ శంకాతంక లేకుంటచే
నలరీసర్వము నీదు జన్నమునకై యాగోద్ధ కర్మంబులున్
లలినిమ్నంబునకేగు జీవనములీలన్ నిన్నుఁ బొందుంగదా ! ॥ 76

(3) గీ॥ సాదులశ్వంబులంగొని స్వాభిలషిత, దేశములకెట్లు చేర్తురో తిరముగలుగ
స్వీయతేజస్సు నింద్రుండు చేర్చు[1]నట్లు, స్వాభిహిత హవ్యలాభ ప్రసాద[2]మునకు ॥ 77

(4) గీ॥ పెక్కుజనుల నుతులకెక్కువాఁడ! ధనాఢ్య !, యాగముల నొనర్తుమయ్య ! నీకు
భూత సంస్తవములఁ భూమికోరినయటు, మా స్తవం[3]బుఁగొనుము మాన్యచరిత! ॥ 78

(5) మ॥ తలఁపన్ శక్రుఁడ ! నీదు వీర్య మతివిస్తారం బనంతంబునై
వెలసెన్. మేమును దావకీనులము. రావే ! కోరికల్ దీర్పవే !
తలపేలేదిలె విస్తృతాంబరమునీ తత్వంబుఁ బాటించు భూ
తలమున్భీతి మనస్కమై నిలుచు సద్యద్వీర్య మూలంబునన్ ॥ 79

(6) గీ॥ వజ్రి ! వజ్రమునుంగొని వాసిఁగాంచుఁ, గొండలన్నిటిఁగొట్టితి పిండిగాను
సరణిఁ గల్పించితివి నీవు సకలమునకుఁ, జెప్ప శక్యమె నీశక్తి నెప్పుడైన ॥ 80

## అనువాకః—11, సూక్తమ్—58

### ఋషిః—నోధాగౌతమః

### దేవతా—అగ్నిః

### ఛందః—జగతీ, 6-9 త్రిష్టుప్

(1) నూ చిత్ సహోజా అమృతో ని తున్దతే హోతా యద్ దూతో అభవద్ వివస్వతః ।

వి సాధిష్ఠేభిః పథిభీ రజో మమ ఆ దేవతాతా హవిషా వివాసతి ॥ 116

(2) ఆ స్వమద్మ యువమానో అజరస్తృష్వవిష్యన్నతసేషు తిష్ఠతి ।

అత్యో న పృష్ఠం ప్రుషితస్య రోచతే దివో న సాను స్తనయన్నచిక్రదత్ ॥ 117

1. చేర్చునెపుడు. (తా.పా.) 2. ప్రసాదాదిమ (తా.పా.) 3. మాదునుదుఁగొనుము. (తా.పా.)

(3) క్రాణా రుద్రేభిర్వసుభిః పురోహితో హోతా నిషత్తో రయిషాళమర్త్యః ।

రథో న విక్ష్వృఞ్జసాన ఆయుషు వ్యానుషగ్వార్యా దేవ ఋణ్వ[1]తి ॥ 118

(4) వి వాతజూతో అతసేషు తిష్ఠతే వృథా జుహూభిః సృణ్యా తువిష్వణిః ।

తృషు యదగ్నే వనినో వృషాయసే కృష్ణం త ఏమ రుశదూర్మే అజర ॥ 119

(5) తపుర్జమ్భో[2] వన ఆ వాతచోదితో యూథే న సాహ్వాగ్ం అవ వాతి వంసగః ।

అభివ్రజన్నక్షితం పాజసా రజః స్థాతుశ్చరథం భయతే పతత్రిణః ॥ 120

(6) దధుష్ట్వా భృగవో మానుషేష్వా రయిం న చారుం సుహవం జనేభ్యః ।

హోతారమగ్నే అతిథిం వరేణ్యం మిత్రం న శేవం దివ్యాయ జన్మనే ॥ 121

(7) హోతారం సప్త జుహ్వో౩ యజిష్ఠం యం వాఘతో వృణతే అధ్వరేషు ।

అగ్నిం విశ్వేషామరతిం వసూనాం సపర్యామి ప్రయసా యామి రత్నమ్ ॥ 122

(8) అచ్ఛిద్రా సూనో సహసో నో అద్య స్తోతృభ్యో మిత్రమహః శర్మ యచ్ఛ ।

అగ్నే గృణన్తమంహస ఉరుష్యోర్జో నపాత్ పూర్భిరాయసీభిః ॥ 123

(9) భవా వరూథం గృణతే విభావో భవా మఘవన్ మఘవద్భ్యః శర్మ ।

ఉరుష్యాగ్నే అంహసో గృణన్తం ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 124

1. ఋణ్వతి (వ్రా.ప్ర.) 2. తపుర్జమ్భావన (వ్రా.ప్ర.)

## అనువాకము—11, సూక్తము—58

### ఋషి—నోధస్సు *

### దేవత—అగ్ని

(1) చ॥ బలమునఁబుట్టినా వమృత పావన జన్ముఁడ వీజగంబులో
పల, యజమాన దేవతల పజ్జకు దూతగఁజేరి హవ్యమున్
లలిఁగొని మేటి యంబరతలంబున వెల్గు సృజింపఁజేసి యు
జ్జ్వలతరవహ్ని ! యొప్పితివి చాలఁగ నిర్జరసేవఁ జేయుచున్ ॥ 81

(2) మ॥ ముదిమింజెందక వృక్ష గుల్మవితతిన్ మూర్కొంచు భక్షించుచుం
బదడుంజేయుచుఁ గాష్ఠజాతముల సత్పర్యాప్త తేజంబుమై
ముదముంజెందిన యశ్వరాజముగతిన్ మూర్తంబుతో నంతటం
గదియంబోవుచు వహ్నివెల్గెడుఁ గడుం గాంభీర్య శోభాదులన్ ॥ 82

(3,4) సీ॥ హవ్యంబులంగొను నమరహోతృ వరుండు రుద్రాదులకు సత్పురోహితుండు
స్వర్గలోకస్థుండు శత్రుధనాపహారకుఁడయి యెంతేనిఁగ్రాలువాఁడు
వరుణాది పర్జితుం డరిలోకహింసకుం డమలచరిత్రుండు విమలమూర్తి
వాయు సంచలితుండు వనవృక్ష వాసుండు జిహ్వాభియుక్తుండు చిత్రమూర్తి
గీ॥ కాననంబులఁగల చెట్లఁగాల్చువాఁడు, కృష్ణ మార్గాభియాయియై కెరలువాఁడు
దీప్తకీలుండునగు నగ్నిదేవుఁడధిక, ధనమునిచ్చును[1]గాతఁ దాత్పర్యమెసఁగ ॥ 83

(5) గీ॥ వృషము కదుపుఁజేరు విధమున ననలుండు, నడవిచెట్లపైకి నరుగువాఁడు
కీలముఖమువాఁడు గాలిచేఁగంపించు, భూతములకునెల్ల భీతిదుండు ॥ 84

(6) చ॥ మనుజులలో వసించు భృగుమౌనులు దివ్యపదంబుఁ గోరుచున్
వినయముతోడ నిన్గదిసి వేడిరి రత్న ధనంబులోడుతన్
ఘనతర హోతవున్ మిగులఁ గార్యకరుండవుగాన నిన్ను స
న్మునులు సృజించినారు పరిపూతములౌ తమ మంత్రవాక్కులన్ ॥ 85

(7) గీ॥ సప్తహోత లెవనిఁజక్కఁగఁబిలుచుచు, యాగములను నడప నేగఁగలరొ!
యట్టి యగ్నిదేవు నాశ్రయించి సమస్త, యాగఫలము ప్రీతి నందఁగలము ॥ 86

---

* గౌతమునిపుత్రుఁడు నోధస్సు అని సంస్కృతమూలము. 60వ సూక్తములోని 5వ ఋక్కును బరిశీలించినచో నోధస్సు గౌతముని పుత్రుఁడు కాఁడనియు గోతమునిపుత్రుఁడనియు స్పష్టమగుచున్నది. గోతముని పుత్రుఁడును గౌతముఁడనఁబడవచ్చును గదా! ఈ దృష్ట్యా నోధస్సు సాయనాచార్యాదులు భావించినట్లు గౌతముని పుత్రుఁడైన నోధస్సుకాక గోతమునిపుత్రుఁడైన నోధస్సు గాఁదలఁపనగును. నోధమహర్షిని నోధస్సుగాను నోధుఁడుగాను నాంధ్రానువాదములో నుపయోగించుట జరిగినది. వ.గో.కృ.

1. నిచ్చుత మాకు (తొ.పా.)

(8,9) సీ॥ బలమును మా కిమ్ము బలపుత్రకుఁడపౌట సుఖదుండవవుటను సుఖము నీయు!
ప్రసన్నవర్ధితుఁడవై యలరారుచుండుట నాదరంబున మాకు నన్న మిమ్ము!
పాలకుఁడవుటను[1] పాపంబులంగొట్టి శక్తిచేతను మాకు సౌఖ్య మిమ్ము!
పాపాత్మదుశ్శత్రు బాధకుండవుటను[2] గర్మజ ధనుఁడవై కదలి రమ్ము!
గీ॥ నిన్ను నుతియించువారికి నిఖిలసుఖము, నిచ్చువాఁడవు బలవంత! మెచ్చునట్టు
లిపుడు వచ్చెదునట్టులే యెపుడు రమ్ము!, నిజబలోపాత్తధనద! యో నిత్యశుభద! ॥ 87

## సూక్తమ్—59

ఋషిః—నోధా గౌతమః

దేవతా—అగ్నిర్వైశ్వానరః

ఛందః—త్రిష్టుప్

(1) వయా ఇదగ్నే అగ్నయస్తే అన్యే త్వే విశ్వే అమృతా మాదయన్తే ।
వైశ్వానర నాభిరసి క్షితీనాం స్థూణేవ జనాగ్ం ఉపమిద్ యయన్థ ॥ 125

(2) మూర్ధా దివో నాభిరగ్నిః పృథివ్యా అథాభవదరతీ రోదస్యోః ।
తం త్వా దేవాసోఽజనయన్త దేవం వైశ్వానర జ్యోతిరిదార్యాయ ॥ 126

(3) ఆ సూర్యే న రశ్మయో ధ్రువాసో వైశ్వానరే దధిరేఽగ్నా వసూని ।
యా పర్వతేష్వోషధీష్వప్సు యా మానుషేష్వసి తస్య రాజా ॥ 127

(4) బృహతీ ఇవ సూనవే రోదసీ గిరో హోతా మనుష్యో౩ న దక్షః ।
స్వర్వతే సత్యశుష్మాయ పూర్వీర్వైశ్వానరాయ నృతమాయ యహ్వీః ॥ 128

1. పాలకుఁడవవుత (తొ.పా.) 2. బాధకుండవౌట (తొ.పా.)

(5) దివశ్చిత్ తే బృహతో జాతవేదో వైశ్వానర ప్ర రిరిచే మహిత్వమ్ ।

రాజా కృష్టీనామసి మానుషీణాం యుధా దేవేభ్యో వరివశ్చకర్థ ॥ 129

(6) ప్ర నూ మహిత్వం వృషభస్య వోచం యం పూరవో వృత్రహణం సచన్తే ।

వైశ్వానరో దస్యుమగ్నిర్జఘన్వాగ్ం అధూనోత్ కాష్ఠా అవ శమ్బరం భేత్ ॥ 130

(7) వైశ్వానరో మహిమ్నా విశ్వకృష్టిర్భరద్వాజేషు యజతో విభావా ।

శాతవనేయ శతినీభిరగ్నిః పురుణీథే జరతే సూనృతావాన్ ॥ 131

## సూక్తము—59

ఋషి—నోధుఁడు*

దేవత—అగ్ని†

(1) గీ॥ అగ్నులెల్లరు నీవయై యమరియుందు, రమరమహిమను మరణంబు నంద వీవు
స్థూణివలె[1] గృహధరుండవై స్తుతులఁబొందు, మఖిల నృ జఠరరూప! యో యగ్నిదేవ! ॥ 88

(2) గీ॥ అగ్నులన్నియు నీవయై యమరియుందు[2], భూమి సంరక్షకుండవు భూమి విభుఁడ
వమరులందఱు వేడ్కతో నార్యులకయి, నిన్ను సృష్టించి రెప్పుడో! నేర్పుమీర ॥ 89

(3) క॥ కిరణములు సూర్యునకుబలె, మరణరహిత! వహ్ని దేవ! మానుగ వసువుల్
గిరిగత ధనంబులన్నియు, ధరలో నీయందెకలవు తగఁజూడంగన్ ॥ 90

(4) గీ॥ రోదసీ కుహరమంత[3] నిరూఢగతిని, విరివియయ్యెను దన పుత్రవృద్ధికొఱకు
వంది ధనికుని నుతియించుభంగి జనులు, వేడుచుండిరి వేడ్కతో వేల్ప! నిన్ను ॥ 91

(5) శా॥ ఆకాశంబున మించియుండు భవదీయాకార మాహాత్మ్యముల్
వీఁకన్ మానుషపాలకుండవగుచున్ వీర్యంబుచే వైరులన్
సోకంగొట్టి తదీయ విత్తచయమున్ సూక్ష్మంబుగాఁదెచ్చుచున్
నాకావాసుల కీయలేదె? యనలా! నష్టంబు లేకుండఁగన్ ॥ 92

* గౌతమునిపుత్రుఁడు నోధుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ. † వైశ్వానరాగ్ని అని సంస్కృతమూలము. వ గో.కృ.
1. ఇంద్రగణమునకుమారు పంచలఘుగణము ప్రయుక్తమైనది. వ.గో.కృ. 2. యమరియుంద్రు (ప్రా.ప్ర.పా.) 3. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల"ము గాని "జల"ము గాని ప్రయుక్తమైనదని యెన్నదగును. వ.గో.కృ.

(6) మ॥ అనుమానంబును వీడి వృత్రకృత మేఘాకారముంగొట్టుటన్
ఘనవైశ్వానర! వర్షకాములు నిమం గాంక్షించుచున్నారు పా
వనకర్మ క్షయకారి దస్యుగణమున్ బందీకృతంజేసి పెన్
గినుకన్ శంబరుఁగొట్టి వారిచయముంగ్రిందం బడంజేయవే! ॥ 93

(7) క॥ శతవని పుత్రుని నుతులన్, మతివత్పరి[1]నోధ నుతియు మన్నించి తగన్
సతత ప్రకాశమున నీ, వతిమహిమం జాటుచుంటివగ్నీ! దేవా! ॥ 94

†గీ॥ విశ్వబాంధవుఁడవు వివిధభరద్వాజ, యాగములకు వేడ్కనేగువాఁడ
వధిక సత్యమూర్తి వగుదువు బిరబిర, సాగుమయ్య! యగ్ని! యాగమునకు ॥ 95

## సూక్తమ్—60

ఋషిః—నోధా గౌతమః *

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) వహ్నిం యశసం విదథస్య కేతుం సుప్రావ్యం దూతం సద్యోఅర్థమ్ ।
ద్విజన్మానం రయిమివ ప్రశస్తం రాతిం భరద్ భృగవే మాతరిశ్వా ॥ 132

(2) అస్య శాసురుభయాసః సచన్తే హవిష్మన్త ఉశిజో యే చ మర్తాః ।
దివశ్చిత్ పూర్వో న్యసాది హోతా ఽఽపృచ్ఛ్యో విశ్పతిర్విక్షు వేధాః ॥ 133

(3) తం నవ్యసీ హృద ఆ జాయమాన మస్మత్ సుకీర్తిర్మధుజిహ్వమశ్యాః ।
యమృత్విజో వృజనే మానుషాసః ప్రయస్వన్త ఆయవో జీజనన్త ॥ 134

1. నీధనుతియు (వ్రా.ప్ర.పా.) † ఋగ్వేదము ప్రథమమండలము 59వ సూక్తమున 7 ఋక్కులు మాత్రమే యుండఁగా నాంధ్రానువాదము వ్రాతప్రతిలోఁ (1వ. సంపుటము. 221 పుట) ప్రమాదవశమున 8 ఋక్కులున్నట్లు "విశ్వబాంధవుఁడవు" ఇత్యాది 95 పద్యము 8వ ఋక్కునకనువాదమైనట్లు పేర్కొనుట జరిగినది. ఈ పద్యము 7వ ఋగ్భాగమునకే యనువాదము. వ. గో. కృ.

* ఋషివిశేషములకై తెలుఁగు 58వ సూక్తము ఋషి కిచ్చినఫుట్‌నోటు (157 పుట.) చూఁడనగును. వ.గో.కృ.

(4) ఉశిక్ పావకో వసుర్మానుషేషు వరేణ్యో హోతాధాయి విక్షు ।

దమూనా గృహపతిర్దమ ఆగ్ం అగ్నిర్భువద్ రయిపతీ రయీణామ్ ॥ 135

(5) తం త్వా వయం పతిమగ్నే రయీణాం ప్ర శంసామో మతిభిర్గోతమాసః ।

ఆశుం న వాజంభరం మర్జయన్తః ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 136

## సూక్తము—60

### ఋషి—నోధుఁడు*

### దేవత—అగ్ని

(1) ఉ॥ యాగపతాకవై సకల హవ్యములంగొనిపోవు దూతవై
యేగతినైనహోతవయి యింపుగమంటికి మింటికింగడున్
రాగమెలర్పఁ[1]బుట్టి యతిరాజితకీర్తి వహించునిన్నులీ
లాగరిమంబుసంబవస లక్ష్మి భృగూత్తముఁ జెంతఁజేర్పదే!॥ 96

(2) ఉ॥ కామయమాన దేవతలు, కాంతహవిస్సులనిచ్చు యాజ్ఞికుల్
నీమమెలర్ప మన్ననల నిన్ను భజించుచు[2] నుంద్రువేళలన్
హోమనియామకుండవయి హోతవు[3] దాతవునౌచు సజ్జన
స్తోమముగాఁచు నిన్నునుపఁజూఁచెదరిష్టిగృహాంతరంబునన్ ॥ 97

(3,4,5) సీ॥ ప్రాణవాయు సముద్ధ ప్రబలాగ్ని హోత్రంబు పొందుగానుతులను నందుఁగాక !
మానుషోత్పాది[4]తుఁడౌ వీతిహోత్రుఁడు యజ్ఞనిమిత్తమై యలరుఁగాక !
వరణీయశీలుండు వసువునునగు నగ్నియాగ గృహంబునకేగుఁగాక !
దానవవిచ్ఛేద దక్షుండు గృహపతి ధనపతియై కడుఁదనరుఁగాక !
గీ॥ నశ్వ[5]మెక్కెడు వా[6]రలా యశ్వమునకు, మార్జనంబును జేసెడు మాట్కిస్వచ్ఛ
మైన యగ్నికి మార్జనమాచరించి, యిష్టికరులగ్నినే స్తుతియింత్రుగాక ॥ 98

* నోధుని గుఱించిన విశేష విషయములకై తెలుఁగు 58వ. సూక్తము ఋషి క్రిందనిచ్చిన ఫుట్‌నోట్ చూఁడదగును. చూ.పు 157. వ.గో.కృ.

1. జాతమయి (తొ.పా.) 2, నెల్లవేళలన్ (తొ.పా.) 3. దాతవునై జనస్తోమము. (తొ.పా.గణభంగము) వ.గో.కృ. 4. పాదితఁడే (బ్రా.ప్ర.పా) 5. యశ్వమెక్కెడు (బ్రా.ప్ర.పా.) 6. వారువాహన ప్రదేశమును గరంబుల మార్జనంబును మొనర్చునటుల యగ్నికి (తొ పా.)

## సూక్తమ్—61

ఋషిః—నోధాగౌతమః*

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) అస్మా ఇదు ప్ర తవసే తురాయ ప్రయో న హర్మి స్తోమం మాహినాయ ।

ఋచీషమాయాధ్రిగవ ఓహమిన్ద్రాయ బ్రహ్మాణి రాతతమా ॥ 137

(2) అస్మా ఇదు ప్రయ ఇవ ప్ర యంసి భరామ్యాఙ్గూషం బాధే సువృక్తి ।

ఇన్ద్రాయ హృదా మనసా మనీషా ప్రత్నాయ ప్రత్యే ధియో మర్జయన్త ॥ 138

(3) అస్మా ఇదు త్యముపమం స్వర్షాం భరామ్యాఙ్గూషమాస్యేన ।

మంహిష్ఠమచ్ఛోక్తిభిర్మతీనాం సువృక్తిభిః సూరిం వావృధధ్యై ॥ 139

(4) అస్మా ఇదు స్తోమం సం హినోమి రథం న తష్టేవ తత్సినాయ ।

గిరశ్చ గిర్వాహసే సువృక్తీన్ద్రాయ విశ్వమిన్వం మేధిరాయ ॥ 140

(5) అస్మా ఇదు సప్తిమివ శ్రవస్యేన్ద్రాయార్కం జుహ్వా౩ సమఞ్జే ।

వీరం దానౌకసం వన్దధ్యై పురాం గూర్తశ్రవసం దర్మాణమ్ ॥ 141

(6) అస్మా ఇదు త్వష్టా తక్షద్ వజ్రం స్వపస్తమం స్వర్యం౧ రణాయ ।

వృత్రస్య చిద్ విదద్ యేన మర్మ తుజన్నీశానస్తుజతా కియేధాః ॥ 142

* ఋషి విశేషవిషయములకు తెలుగు 58వ సూక్తము ఋషివిషయమై వ్రాసిన ఫుట్‌నోటు (157వ. పుట) చూడవలయు. వ.గో.కృ.

(7) అస్యేదు మాతుః సవనేషు సద్యో మహః పితుం పపివాఞ్చార్వన్నా ।

ముషాయద్ విష్ణుః పచతం సహీయాన్ విధ్యద్ వరాహం తిరో అద్రిమస్తా ॥ 143

(8) అస్మా ఇదు గ్నాశ్చిద్ దేవపత్నీరిన్ద్రాయార్కమహిహత్య ఊవుః ।

పరి ద్యావాపృథివీ జభ్ర ఉర్వీ నాస్య తే మహిమానం పరి ష్టః ॥ 144

(9) అస్యేదేవ ప్రరిరిచే మహిత్వం దివస్పృథివ్యాః పర్యన్తరిక్షాత్ ।

స్వరాళిన్ద్రో దమ ఆ విశ్వగూర్తః స్వరిరమత్రో వవక్షే రణాయ ॥ 145

(10) అస్యేదేవ శవసా శుషన్తం వి వృశ్చద్ వజ్రేణ వృత్రమిన్ద్రః ।

గా న వ్రాణా అవనీరముఞ్చదభి శ్రవో దావనే సచేతాః ॥ 146

(11) అస్యేదు త్వేషసా రన్త సిన్ధవః పరి యద్ వజ్రేణ సీమయచ్ఛత్ ।

ఈశానకృద్ దాశుషే దశస్యన్ తుర్వీతయే గాధం తుర్వణిః కః ॥ 147

(12) అస్మా ఇదు ప్ర భరా తూతుజానో వృత్రాయ వజ్రమీశానః కియేధాః ।

గోర్న పర్వ వి రదా తిరశ్చేష్యన్నర్ణాంస్యపాం చరధ్యై ॥ 148

(13) అస్యేదు ప్ర బ్రూహి పూర్వ్యాణి తురస్య కర్మాణి నవ్య ఉక్థైః ।

యుధే యదిష్ణాన ఆయుధాన్యృఘాయమాణో నిరిణాతి శత్రూన్ ॥ 149

(14) అస్యేదు భియా గిరయశ్చ దృళ్హా ద్యావా చ భూమా జనుషస్తుజేతే ।
ఉపో వేనస్య జోగువాన [1]ఓణిం సద్యో భువద్ వీర్యాయ నోధాః ॥ 150

(15) అస్మా ఇదు త్యదను దాయ్యేషామేకో యద్ వవ్నే భూరేరీశానః ।
ప్రైతశం సూర్యే పస్పృధానం సౌవశ్వ్యే సుష్విమావదిన్ద్రః ॥ 151

(16) ఏవా తే హారి[2]యోజనా సువృక్తీన్ద్ర బ్రహ్మాణి గోతమాసో అక్రన్ ।
ఐషు విశ్వపేశసం ధియం ధాః ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 152

ఇతి
ప్రథమోऽష్టకే చతుర్థోऽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—61

### ఋషి—నోధసుఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ శత్రుహింసకరుని సర్వజ్ఞు వృద్ధుని, స్తుతిసమాను వజ్రిమతినిఁగొలిచి
ధర బుభుక్షితునకుఁదగు నన్నమిడురీతి, హవ్యలక్షణాన్న మతనికిడుదు ॥ 99

(2,3,4) సీ॥ స్తోత్రపాఠకులట్లు సూక్తుల నింద్రునిగొలుతు నతఁడు వానిఁదెలియనటులఁ
బండితపుంగవ పాకశాసను వృద్ధిఁగోరుదుఁగోర్కెలఁగూర్చి మిగుల
రథకారకుఁడు నిజరథముఁబ్రేరేపించుమాట్కిఁ బ్రేరేపింతు మాన్యునుతుల
స్తోత్రార్హుఁడౌ వజ్రిసూరికి ఋక్కులనందఁజేయుదు ముదమొందునటుల
గీ॥ నధికమేధా విరాజితుఁడైన నింద్ర, దేవునకుఁగూర్తు హవ్యముల్ దివ్యభక్తి
శస్త్రరూపంబులౌ స్తోత్రశక్తులన్ని, నింద్రునకు నందఁజేతు నహీనమతిని ॥ 100

1. ఓణి (వ్రా.ప్ర.). 2. ఏవాతేహారియోజనా (వ్రా.ప్ర.)

* చూఁడు. తెలుఁగు 58వ. సూక్తము ఋషి ఫుట్‌నోట్. 157 వ పుట. వ.గో.కృ.

(5) ఉ॥ అన్నముఁగోరి యశ్వమును నందముగా నరదంబు ముందటం
ద్రగ్నన(గూర్చు పూరుషుఁడు గ్రాలు విధంబున, మంత్ర సంతతిం
బన్నుగఁ గూర్తు వాక్కులను, బట్టణనాశకు వీరు నింద్రునిన్
మన్ననమీరఁ గొల్చెదను మానుగ సంస్తుతి సంచయంబులన్ ॥ 101

(6) చ॥ అతిశయశోభఁగొంచు నలరారెడు వజ్రముఁజేతఁగొంచు స
న్మతిఁబ[1]రికించి శత్రుగణమంతయుఁ గొట్టెడువజ్రి[2] యెంతయుం
బతితుని వృత్రశత్రువును బాపి యశేష సురాధిపత్యముం
జతురతమీర నిల్పుకొనె స్వర్గపథంబున వేడ్క నెంతయున్ ॥ 102

(7) సీ॥ వృష్టిమూలంబున స్పష్టంబుగాఁ గడుఁ జెలువార సృషినిఁజేసి చేసి
సవన సంతతిలోన సరస సోమరసంబుఁ దగిన విధంబునఁద్రాగిత్రాగి
భవ్యాన్నముంబ్రీతి భక్షించి భక్షించి సర్వలోకములకు సాగిసాగి
యరిధనంబంతయు హరియించి హరియించి[3] యావరాహంబును నడఁచి యడఁచి
గీ॥ యేడు దుర్గమగిరులను బాడుసేసి, దివసరూపకయాగంబు దీద్దితీర్చి
యింద్రుడుండెడు సంప్రీతి నింద్రలోక, భద్ర సింహాసనమున సౌభాగ్యమలర ॥ 103

(8) గీ॥ వృత్ర సంహారముంగోరి విస్తృతమగు, గమనముంగోరి గాయత్రి కాంతితోడఁ
దేజమునరోచసిన్ మీరి తిరిగిన[4]ట్టి, యింద్రదేవునికొనియాడుఁడింపుతోడ ॥ 104

(9,10) సీ॥ వజ్రిమాహాత్మ్యంబు వర్ధిల్లుచున్ మూఁడులోకంబులన్ మించి ప్రాఁకుచుండె
సహజతేజః కళాసరిణిచే నింద్రుండు సకలకార్యములను జరుపుచుండె
వీరోత్తముండని విఖ్యాతిగుచు సర్వజన్నంబులకు వేగ జరుగుచుండె
మేఘంబులంగొట్టుమేదురవర్షముల్ క్షితిఁబడునట్లుగాఁ జేయుచుండె
గీ॥ యజ్ఞ యజమానదత్తమౌ హవ్యములను. నందుకొని సోమయాజికి నఖిలకర్మ
జన్యఫలముల నిచ్చుచుజగతి సర్వ, విధములన్ వెలుచుండె నా వేల్పురేఁడు ॥ 105

(11) మ॥ బలభిద్దీప్త బలంబుచేతనె యకూపారంబులుండెన్ భువిం
గలయేళ్లలన్నియుఁ బారుచుండె, ఖలుఁడాక్రవ్యాశి వృత్రుండు తా
బలమున్వీడి నశించి విత్తచయముంబాసెన్, మహాయాజ్ఞికుల్
ఫలముంబొందిరి యజ్ఞసంస్థలకడంభాసిల్లెఁదుర్వీతియున్ ॥ 106

1. సన్మతి పరికించి (వ్రా.ప్ర.పా.) 2. వజ్రి విమ్మటన్ (తా.పా. అతిశయశోభఁగొంచు నిత్యాదిపద్యములో రెండవపాదమున "మతి-(గణ) మంతయు" అనునప్పుడు అఖండయతి పాటింపఁబడినది. వ.గో.కృ.) 3. గొప్ప మేఘంబులఁ గొట్టికొట్టి (తా.పా.) సీసోపపాదమైన యీ తొలి పాఠమును గ్రంథకర్త పై విధముగా సిరాతోనే సవరించి క్రింద పెన్సిలుతో "మేఘమునకు మూలపదము వరాహము" అని ఒక వాక్యము వ్రాసెను. (1వ సంపుటము 225 పుట. 7 ఋక్కునకనువాదము 103వ పద్యము). వ.గో.కృ. 4. తిరిగినట్టు (వ్రా.ప్ర.పా.)

(12) గీ॥ మాం[1]స ఖండంబులమ్మెడు మనుజులెట్లు, పశువులం జంపివైతురో పాపమనక
నటుల వృత్రుని వధియించి యధికశక్తిఁ, బొలిచితివి నీవు దేవదేవుఁడవుకాన ॥ 107

(13) క॥ తిరముగ వజ్రముఁజేఁగొని, సురదేవుఁడు వచ్చుచుండెఁ జూచుచుమీరల్
సురుచిర సంస్తుతిఁజేయుఁడు, వరనుతి పాతకు[2]లు ! శత్రుబల హింసకునిన్ ॥ 108

(14) గీ॥ ఇంద్రభీతిఁజేసి యిలఁబర్వతములన్ని, నిశ్చలంబులగుచు నేలనుండె
నాకసంబు పుడమివీఁకఁ గంపించెను, నతుల నోధమానినుతులొనర్చె ॥ 109

(15) క॥ వినయముతో బహుధనపతు, లనయము కావించినారలాయాస్తుతులన్
ఘనవాహునకు నాతం, డనిలో రక్షించె "శశ్వ"యనువానిదయన్ ॥ 110

(16) మత్తకోకిల॥ గౌతమాదులు నేసియుండిన గౌరవస్తోత్రంబులం
బ్రీతినొందుచు భూరి విత్తము భీతిలేకయె యిమ్ము వి
ఖ్యాత కర్మ సులబ్ధమయ్యది కాంక్షతోఁగొని యింద్ర ! మా
యాతులం దొలఁగించి మమ్ములనిప్పుడే రక్షింపుమా ! ॥ 111

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబా గర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమునఁ జతుర్థాధ్యాయము
సమాప్తము

---

1. మాంసఖండంబులు—మాంసమునకై పశువులను జంపునాచార మున్నట్లు ఈ మంత్రార్థము వలన నూహింపవచ్చును. కాని యా కాలమందుఁ బశుహింస యుండెనా? లేదా? యనుటకుఁ బండితులే సదుత్తర మీయఁదగు.—నే॥వేం॥న॥శాస్త్రి

సూచన—హింసాహింసలకు నిర్వచనముచెప్పుట కష్టము. దేనికైనను పరిమిత పరిధులెవ్వరును నేర్పరచలేరు. హింస సృష్టిలో నైజముగా నున్నది. కాని వేదముపేరుతో యజ్ఞములపేరుతో నవతరించిన ప్రాణిబలిపూర్వకమైనహింస కేవలాజ్ఞాన విలసితము. వైద్యములో హింస అనివార్యము. కాన నీచర్చ మూఁడు నాలుగు మాటలలోఁ దేలునదికాదు. వ.గో.కృ. 2. పాతకులు-ఇది "పాతకులారా!" అను సంబోధనార్థకము. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ప్రథమోఽష్టకః—పఞ్చమోఽధ్యాయః

సూక్తమ్—62

ఋషిః—నోధాగౌతమః*

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ప్ర మన్మహే శవసానాయ శూషమాఙ్గూషం గిర్వణసే అఙ్గిరస్వత్ ।

సువృక్తిభిః స్తువత ఋగ్మియాయాఽర్చామార్కం నరే విశ్రుతాయ॥ 1

(2) ప్ర వో మహే మహి నమో భరధ్వమాఙ్గూష్యం శవసానాయ సామ।

యేనా నః పూర్వే పితరః పదజ్ఞా అర్చన్తో అఙ్గిరసో గా అవిన్దన్ ॥ 2

(3) ఇన్ద్రస్యాఙ్గిరసాం చేష్టౌ విదత్ సరమా తనయాయ ధాసిమ్ ।

బృహస్పతిర్భినదద్రిం విదద్ గాః సముస్రియాభిర్వావశన్త నరః ॥ 3

(4) స సుష్టుభా స స్తుభా సప్త విప్రైః స్వరేణాద్రిం స్వర్యో౩ నవగ్వైః ।

సరణ్యుభిః ఫలి[1]గమిన్ద్ర శక్ర వలం రవేణ దరయో దశగ్వైః ॥ 4

* ఋషి విశేషవిషయములకు నాంధ్రానువాదము 58వ సూక్తము ఋషి విషయమై 157వ పుటలోనున్న ఫుట్‌నోట్ చూడవలయును. వ.గో.కృ.

1. ఫలిగామిన్ద్ర. (వ్రా.ప్ర.)

(5) గృణానో అఙ్గిరోభిర్దస్మ వి వరుషసా సూర్యేణ గోభిరన్ధః ।

వి భూమ్యా అప్రథయ ఇన్ద్ర సాను దివో రజ ఉపరమస్తభాయః ॥ 5

(6) తదు ప్రయక్షతమమస్య కర్మ దస్మస్య చారుతమమస్తి దంసః ।

ఉపహ్వరే యదుపరా అపిన్వన్ మధ్వర్ణసో నద్యఁశ్చతస్రః ॥ 6

(7) ద్వితా వి వవ్రే సనజా సనీళే అయాస్యః స్తవమానేభిరర్కైః ।

భగో న మేనే పరమే వ్యోమన్నధారయద్ రోదసీ సుదంసాః ॥ 7

(8) సనాద్ దివం పరి భూమా విరూపే పునర్భువా యువతీ స్వేభిరేవైః ॥

కృష్ణేభిరక్తోషా రుశద్భిర్వపుర్భిరా చరతో అన్యాన్యా ॥ 8

(9) సనేమి సఖ్యం స్వపస్యమానః సూనుర్దాధార శవసా సుదంసాః ।

ఆమాసు చిద్ దధిషే పక్వమన్తః పయః కృష్ణాసు రుశద్ రోహిణీషు ॥ 9

(10) సనాత్ సనీళా అవనీరవాతా వ్రతా రక్షన్తే అమృతాః సహోభిః ।

పురూ సహస్రా జనయో న పత్నీర్దువస్యన్తి స్వసారో అహ్రయాణమ్ ॥ 10

(11) సనాయువో నమసా నవ్యో అర్కైర్వసూయవో మతయో దస్మ దద్రుః ।

పతిం న పత్నీరుశతీరుశన్తం స్పృశన్తి త్వా శవసావన్ మనీషాః ॥ 11

(12) సనాదేవ తవ రాయో గభస్తౌ న క్షీయన్తే నోప దస్యన్తి దస్మ ।

ద్యుమాగ్ం అసి క్రతుమాగ్ం ఇన్ద్ర ధీరః శిక్షా శచీవస్తవ నః శచీభిః ॥ 12

(13) సనాయతే గోతమ ఇన్ద్ర నవ్యమతక్షద్ బ్రహ్మ హరియోజనాయ।

సునీథాయ నః శవసాన నోధాః ప్రా[1]తర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 13

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము—పంచమాధ్యాయము

### సూక్తము—62

ఋషి—గౌతముఁడు. నోధుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ తుంగబలయుతుని మునిజన, మంగళజన సూక్తివినుతు, మహిమాన్వితు, స
ద్భంగిని బహు మంత్రంబుల, నంగిరసులఁబోలి వేడ్కనర్చింతుఁదగన్ ॥ 1

(2) చ॥ మహినిఁబడఙ్జు లాంగిరస మౌనులు గోవులు పొందుకై వడిన్
బహువిధ గోవులంబడయ భవ్యతరంబగు మంత్రసంతతిన్
బహుబలవంతునింద్రు బహుభంగుల నీమముతో భజించుచున్
రహిఁజెలఁగంగ మీరలు కరంబతనిన్ నుతియింత్రుగా[1] కొగిన్ ॥ 2

(3) క॥ దేవతల యాజ్ఞఁగై కొని. దేవశునిగమించి దివ్యధేనుతతిఁగనం
గా, వజ్రిదానికన్నముఁ, దావడి యీదేవగురుఁడు ద్రచ్చఁడె యద్రిన్ ॥ 3

(4) చ॥ నవదశవగ్వ భూసురుల నవ్యనుతుల్ గొని యప్సరోగణ
స్తవములకుబ్బి. తృప్తిఁగొని తద్దయుసారముఁగల్గు శక్రుఁడా!
జవమున నద్రి రాక్షసునిఁ జంపుచు మేఘునిఁగొట్టినావు నీ
యవితథ శబ్దమాత్రమది యందఱకున్ భయహేతువౌఁగదా! ॥ 4

1. ప్రతర్మక్షూ (ప్రా.ప్ర.)

* నోధాగౌతమః అని ఉపలభ్యమానములైన సంస్కృతమూల ప్రతులలోనున్నది. కాని యీ ఆంధ్రానువాద గ్రంథములో (1వ సంపుటము 229వ పుటలో) 62వ సూక్తమునకు "గౌతముఁడు. నోధుఁడు" ఇద్దరును ఋషులైనట్లు విస్పష్టముగా నుటంకింపఁబడినది. వ.గో.కృ.

1. నుతియింపఁగావలెన్ (తొ.పా.)

(5) గీ॥ అంగిరస్తూయమానుఁడవగుచుఁగల్వ, సూర్యపృష్ఠుల చీఁకటి సొబగుమాన్పి
పుడమినంతయు సమముగాఁ బొందుపఱచి, యంతరిక్షంబుఁ గాచితివయ్య! శక్ర! ॥ 5

(6) క॥ భంగయుతవారి పూరిత, గంగాది నదీ చతుష్క ఘనరూపములన్
శృంగారముగ సృజించితి, రంగత్కర్మములలోన రాజిలు నవియే ॥ 6

(7) ఉ॥ నిత్యము వెల్గుచున్ భువిని నిత్యము లగ్నము లౌచు వస్తుత
స్సత్యములైన భూతలము చారునభంబును వేరువేరుగా
సత్యమల ప్రభాకరుని యట్టులఁ జేయుచుశక్ర! యెంతయున్
స్తుత్యుఁడుగా వెలింగితివి [1]సుందర బాహు పరాక్రమంబునన్ ॥ 7

(8) మ॥ అమలోషస్సు విశుద్ధ కాంతియుతమై యాకాశవీథింగడున్
రమణీయాకృతిఁగల్గి యొప్పిబహుధా రాజిల్లుటన్, రాత్రియుం
గ్రమమొప్పన్ భువిఁ గృష్ణరూపయుతమై కాంతిప్రదంబౌట, యో
సుమనోదేవ! భవత్ప్రతాపముననే భాసిల్లుచుండుం గదా! ॥ 8

(9) క॥ అతి బలవంతుఁడ! యింద్రుఁడ!, యతియాగాంచితుఁడవగుచు యజమానులతో
నతిసఖ్యముఁ బోషించుచు, మతిమంతులనెల్లఁ గాచి మన్ననఁగొనుమా! ॥ 9

గీ॥ అపరిపక్వమైన యావులయందెల్లఁ, బక్వమైన యట్టి పాలనునిచి
కపిల వర్ణమైన కమనీయగోవుల, యెడలఁ దెల్లపాల నీ వునుపవా! ॥ 10

(10,11) సీ॥ చాలకాలమునుండి సమనివాసముఁ గల్గి గమనంబులన్ వీడి గణనకెక్కి
నిజ శక్తిఁగదలుచు నిత్యము రక్షించునేకపాణినిఁ బొంది యేపు మిగిలి
యంగుళులన్నియు నధికబలంబున దేవపత్నులఁ[2] బోలిదివ్య నొంది
ప్రీతినొందించుచు ఖ్యాతి మీరననసంఖ్య కర్మ కలాపంబుఁ గాచుచుండి

గీ॥ పతిని పత్నుల విధమున పరమమంత్ర, రాజములు నినుఁబొందు, విరాజమాన!
స్తోత్ర యోగ్యుండవగు నింద్ర! సూరిగణము, నిన్నుఁ జేరుచునుండెఁదా నియమమలర ॥ 11

(12) శా॥ నీ హస్తంబుననుండు సర్వధనమున్నిత్యంబు మాకీ[3]య నీ
మాహాత్మ్యంబున సంక్షయంబొరయదేమాత్రం, గ్రతుశ్రీతతుల్
సౌహార్దంబును, సూక్ష్మబుద్ధియు, మహాసంపత్తియుంగల్గి స
ద్బాహుప్రాభవ మొప్ప విత్తచయమున్ భావించి మాకీ[4]యుమా! ॥ 12

(13) క॥ గౌతమ పుత్రుఁడు మాకై, ఖ్యాతిమెఱయ బ్రహ్మ సూక్త కలన చదివెడుం
బ్రాతఃకాలంబందునఁ, బ్రీతిన్‌శక్రుండ! రమ్ము ప్రియవసుతతితోన్॥ 13

1. తొరపు బహుపరాక్రమంబునన్ (తొ.పా.) 2. పత్నులుబొంది (బ్రా.ప్ర.పా.) 3. మా కిచ్చుఁడో! (తొ.పా.) 4. మాకీయుమా (బ్రా.ప్ర.పా.)

## సూక్తమ్— 63

ఋషిః— నోధాగౌతమః*

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) త్వం మహాగ్ం ఇన్ద్ర యో హ శుష్మైర్ద్యావా జజ్ఞానః పృథివీ అమే ధాః ।

యద్ధ తే విశ్వా గిరయశ్చిదభ్వా భియా దృళ్హాసః కిరణా నైజన్ ॥ 14

(2) ఆ యద్ధరీ ఇన్ద్ర వివ్రతా వేరా తే వజ్రం జరితా బాహ్వోర్ధాత్ ।

యేనావిహర్యతక్రతో అమిత్రాన్ పుర ఇష్ణాసి పురుహూత పూర్వీః ॥ 15

(3) త్వం సత్య ఇన్ద్ర ధృష్ణురేతాన్ త్వమృభుక్షా నర్యస్త్వం షాట్ ।

త్వం శుష్ణం వృజనే పృక్ష ఆణౌ యూనే కుత్సాయ ద్యుమతే సచాహన్ ॥ 16

(4) త్వం హ త్యదిన్ద్ర చోదీః సఖా వృత్రం యద్ వజ్రిన్ వృషకర్మన్నుభ్నాః ।

యద్ధ శూర వృషమణః పరాచైర్వి దస్యూగ్ంర్యోనావకృతో వృథాషాట్ ॥ 17

(5) త్వం హ త్యదిన్ద్రారిషణ్యన్ దృళ్హస్య చిన్మర్తానామజుష్టౌ ।

వ్యగస్మదా కాష్ఠా అర్వతే వర్ఘనేవ వజ్రిఞ్[1]ఛ్నథిహ్యమిత్రాన్ ॥ 18

(6) త్వాం హ త్యదిన్ద్రార్ణసాతౌ స్వర్మీళ్హే నర ఆజా హవన్తే ।

తవ స్వధావ ఇయమా సమర్య ఊతిర్వాజేష్వతసాయ్యా భూత్ ॥ 19

* ఋషి విశేషవిషయములకు సాంధ్రానువాదము 58వ సూక్తము ఋషి విషయమై 157వ పుటలో ఫుట్‌నోట్ చూడవలయును. వ.గో.కృ.

1. వజ్రిఞ్ఛ్న (ద్రా.ప్ర.)

(7) త్వం హ త్యదిన్ద్ర సప్త యుధ్యన్ పురో వజ్రిన్ పురుకుత్సాయ దర్దః ।

బర్హిర్న యత్ సుదాసే వృథా వర్గంహో రాజన్ వరివః పూరవే కః ॥ 20

(8) త్వం త్యాం న ఇన్ద్ర దేవ చిత్రామిషమాపో న పీపఽయః[1] పరిజ్మన్ ।

యయా శూర ప్రత్యస్మభ్యం యంసి త్మనమూర్జం న విశ్వధ క్షరధ్యై ॥ 21

(9) అకారి త ఇన్ద్ర గోతమేభిర్బ్రహ్మాణ్యోక్తా నమసా హరిభ్యామ్ ।

సుపేశసం వాజమా భరా నః ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 22

## సూక్తము—63

ఋషి—నోధస్సు*

దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ చావునుగోరు[1] రాక్షసులఁ జంపెడి వేళలఁగ్గలునట్టి యా
తావక శౌర్యసంపదకుఁ దద్దయుఁ గంపము నొందెఁగొండ లా
రావముఁజేసె లోకము విరాజిలు సూర్య మరీచిరీతిగాఁ
గావుమటంచు వేఁడఁగనె కాచుటలేదటె వాని శక్రుఁడా! ॥ 14

(2) ఉ॥ ఎప్పుడు కర్మలంగలిగి యింపెసలారుచు రంగమంబులం
గొప్ప రథంబు ముందఱను గొబ్బునఁగూర్తువొ యుద్ధకేళికై
యప్పుడె నీదు హస్తమున నందఱు వజ్రమునుంచు రింద్రుఁడా ః
తప్పక దానిఁజేతఁగొని దాసవ పట్టణపంక్తిఁగొట్టవే ॥ 15

(3,4,5) సీ॥ సర్వోత్తముండవు సర్వారిజేతవు నరహితుండవు శత్రునాశకుఁడవు
ఋభువంశనేతవు వృద్ధశుష్ణహరుండపమల కుత్సునకీవెయతిశుభుఁడవు
[2]శత్రుహనన సముద్ధజయలక్షణంబైన కీర్తినిగలిఁగించి కెరలువాఁడ
వఖిల యుద్ధములందు నఖిల రాక్షసులను గొట్టువాఁడవు కోర్కెలిచ్చువాఁడ

1. పపీపఠః (వా.ప్ర.) * చూఁడు 157వ పేజీలోనున్న తెలుఁగు 58వ సూక్తము ఋషి ఫుట్‌నోట్ వ.గో.కృ. 1. ఈ సందర్భమున "చావునుగోరు" అనఁగా "నితరుల చావునుగోరెడి" అని అర్థము చెప్పుకొనవలసియున్నది. ఇది గ్రంథకర్త భావవ్యక్తీకరణ లోపము. వ.గో.కృ. 2. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల" ముపయుక్తమైనది. వ.గో.కృ.

గీ॥ వస్మ దశ్వంబులకునెల్లనడ్డుమాన్పి, దిక్కులందిరుగు[1]నట్టులఁ జక్కఁజేసి
ఖ్యాతిగలకుత్సముఖ్యులప్రీతికొఱకు, శత్రువధచేయుదువుగాక శక్ర! నీవు ॥ 16

(6) క॥ ఎన్నికగల పురుషులకున్, మన్ననఁగని ధనమొసంగుమా యుద్ధములన్
సున్నితులగు యోధులకుం, గ్రన్ననదరిఁజేరుమయ్య! కాపాడుటకై ॥ 17

(7,8,9,) సీ॥ పురుకుత్సు ప్రీతికై పోఁడిగశాత్రవపురసప్తకంబుతోఁ బోరితీవె ;
పతిసుదాసునికయి పలలాలశనుంజంపి కుశలట్లు ధనముగైకొంటివీవె ;
ఉదకంబునంతటఁబనిచిన భంగిని భక్తంబొసంగి కాపాడితీవె ;
ఉదకమిచ్చినరీతినుచ్చ జీవనమును దయఁజేసి సత్కృపందనరితీవె ;
గీ॥ గౌతమాది మునీశ్వరుల్ గౌరవమున, నిన్నుఁగొనియాడుచుండిరి నేర్పు[2]మెఱయఁ
గర్మసంపాదితద్రవ్య [3]ఘనతనంచ, దన్నముం దెచ్చి మాకిచ్చి యనుగుమింద్ర! ॥ 18

## సూక్తమ్—64

### ఋషిః—నోధాగౌతమః *

### దేవతా—మరుతః

### ఛందః—జగతీ, 15 త్రిష్టుప్

(1) వృష్ణే శర్ధాయ సుమఖాయ వేధసే నోధః సువృక్తిం ప్ర భరా మరుద్భ్యః ।
అపో న ధీరో మనసా సుహస్త్యో గిరః సమఞ్జే విదథేష్వాభువః ॥ 23

(2) తే[1] జజ్ఞిరే దివ ఋష్వాస ఉక్షణో రుద్రస్య మర్యా అసురా అరేపసః ।
పావకాసః శుచయః సూర్యా ఇవ సత్వానో న ద్రప్సినో ఘోరవర్పసః ॥ 24

(3) యువానో[2] రుద్రా అజరా అభోగ్ఘనో వవక్షురధ్రిగావః పర్వతా ఇవ ।
దృళ్హా[3] చిద్ విశ్వా భువనాని పార్థివా ప్ర చ్యావయన్తి దివ్యాని మజ్మనా ॥ 25

1. ఇంద్రగణమునకు మారు"భల"ము. వ.గో.కృ. 2. నేర్పుతోడ (కొ.పా.) 3. ఘనతమీఱ (తొ.పా.)

* ఋషి విశేషవిషయములకు 157వ. పుటలోనున్న తెలుఁగు 58వ సూక్తము ఋషి విషయమై వ్రాసిన ఫుట్‌నోట్ చూడవలయు. వ.గో.కృ.

1. యజ్ఞిరే (వ్రా.ప్ర.) 2. యువానీ (వ్రా.ప్ర.) 3. దృళహా (వ్రా.ప్ర.) దృఖ్హా (సా.మా.)

(4) చిత్రైరఞ్జిభిర్వపుషే వ్యఞ్జతే వక్షః సురుక్మాగ్ం అధి యేతిరే శుభే ।
అంసేష్వేషాం ని మిమృక్షురృష్టయః సాకం జజ్ఞిరే స్వ[1]ధయా దివో నరః ॥ 26

(5) ఈశానకృతో ధునయో రిశాదసో వాతాన్ విద్యుతస్తవిషీభిరక్రత ।
దుహన్త్యూధర్దివ్యాని ధూతయో భూమిం పిన్వన్తి పయసా పరిజ్రయః ॥ 27

(6) పిన్వన్త్యపో మరుతః సుదానవః పయో ఘృతవద్ విదథేష్వాభువః ।
అత్యం న మిహే వి నయన్తి వాజినముత్సం దుహన్తి స్తనయన్తమక్షితమ్ ॥ 28

(7) మహిషాసో మాయినశ్చిత్రభానవో గిరయో న స్వతవసో రఘుష్యదః ।
మృగా ఇవ హస్తినః ఖాదథా వనా యదారుణీషు తవిషీరయుగ్ధ్వమ్ ॥ 29

(8) సింహా ఇవ నానదతి ప్రచేతసః పిశా ఇవ సుపిశో విశ్వవేదసః ।
క్షపో జిన్వన్తః పృషతీభిరృష్టిభిః సమిత్ సబాధః శవసాహిమన్యవః ॥ 30

(9) రోదసీ ఆ వదతా గణశ్రియో నృషాచః శూరాః శవసాహిమన్యవః ।
ఆ వన్ధురేష్వమతిర్న దర్శతా విద్యున్న తస్థౌ మరుతో రథేషు వః ॥ 31

(10) విశ్వవేదసో రయిభిః సమోకసః సంమిశ్లాసస్తవిషీభిర్విరప్శినః ।
అస్తార ఇషుం దధిరే గభస్త్యోరనన్త శుష్మా వృషఖాదయో నరః ॥ 32

(11) హిరణ్యయేభిః పవిభిః పయోవృధ ఉజ్జిఘ్నన్త ఆపథ్యో౩ న పర్వతాన్ ।
మఖా అయాసః స్వసృతో ధ్రువచ్యుతో దుధ్రకృతో మరుతో భ్రాజదృష్టయః ॥ 33

1. స్వధాయా (వ్రా.ప్ర.)

(12) ఘృషుం పావకం వనినం విచర్షణిం రుద్రస్య సూనుం హవసా గృణీమసి ।

రజస్తురం తవసం మారుతం గణమృజీషిణం వృషణం సశ్చత శ్రియే ॥ 34

(13) ప్ర నూ సమర్తః శవసా జనాగ్ం అతి తస్థౌ వ ఊతీ మరుతో యమావత ।

అర్వద్భిర్వాజం భరతే ధనా నృభిరాపృచ్ఛ్యం క్రతుమా క్షేతి పుష్యతి ॥ 35

(14) చర్కృత్యం మరుతః పృత్సు దుష్టరం ద్యుమన్తం శుష్మం మఘవత్సుధత్త న ।

ధనస్పృతముక్థ్యం విశ్వచర్షణిం తోకం పుషేమ తనయం శతం హిమాః ॥ 36

(15) నూష్ఠిరం మరుతో వీరవన్త మృతీషాహం రయిమస్మాసు ధత్త ।

సహస్రిణం శతినం శూశువాంసం ప్రాతర్మక్షూ ధియావసుర్జగమ్యాత్ ॥ 37

## సూక్తము—64

### ఋషి—గోతముఁడు*

### దేవత—మరుత్తు

(1) గీ॥ నోధ! జనులకుఁ ఋష్ప[1]వినోదమొసఁగి, కోర్కెలిచ్చు మరుత్తుల కొలువుమయ్య!
అంజలిఘటించి ధీరుండనగుచునేను, మాన్యవాక్యంబులన్ వానిమదిఁదలంతు ॥ 19

(2) ఉ॥ వాయువులార! మీరు సురవర్మజులెంతయు నిద్ధ తేజులున్
మాయలుపన్ను రాక్షసుల మాపినవారలు రుద్రపుత్రులుం
దోయముఁజిమ్ము వారలును దోయజమిత్ర సమానులంచితా
మేయ పరాక్రమాఢ్యులరు మిక్కిలి వెల్గుచునుందురెప్పుడున్ ॥ 20

* సంస్కృతమూలములో నీ 64వ సూక్తమునకు నోధాగౌతమః అని ఋషిని బెక్కుప్రతులలో నుటంకింపఁగా నీ ఆంధ్రానువాదములో (1వ. సంపుటము. 235 పుట) నీ సూక్తమునకు గోతముఁడు ఋషిగాఁ బేర్కొనఁబడినది. వ.గో.కృ. 1, ఋష్పఫలాదులిచ్చి (తొ.పా. యతిభంగము లేదా ద-ధల ప్రాసయతి నామోదింపవలయు. సాయనాచార్యుని భాష్యానుగుణముగా "ఫల" శబ్దము నైతముండవలయు. అనువాదకర్త సాయను ననుసరింప లేదు. (వ.గో.కృ.)

(3,4) సీ॥ తరుణవయస్కులు ధర్మాత్ములనివార్య గతులు హవిర్విఘ్న ఘర్షకులును
పర్వతదేహులు పరరుద్రతనయులు సూక్తిపాఠకజనస్తుత్యమతులు
సర్వసర్వంసహాచారునభస్థిత ధనవశురాశులత్యధికబలులు
వర్ధనాలంకారవారదేహులు మణిహారులు ధీరులుదారవరులు
గీ॥ నౌ మరుత్తులు మీరలత్యధికశక్తి, నంసతలములఁగల నాయుధాళిఁబట్టి
యవతరింపుఁడు బలముననంతరిక్ష, సీమనిచ్చట కెంతేనిఁజిత్తమలర ॥ 21

(5) ఉ॥ స్తోత్రముఁజేయువారలకుఁ దూర్ణము విత్తమొసంగి నీటికిం
బాత్రములైన మేఘముల భవ్యజలంబుల భూమిమీఁదికిన్
యాత్రముతోడజారి పడునట్టులు నేసి తదీయ మాలికా
శాత్రవమెల్ల దూరముగ సాగెడునట్టులు సేయుఁడాశుగుల్! ॥ 22

గీ॥ ఓలిమరుత్పంక్తి జాలంబులేకుండ, మెఱపువాయువులను మెఱయఁజేసె (సి)
స్వర్గగోవునుండి చక్కనిపాలను, దీసి భూమిపైని దిఱగఁద్రోసె ॥ 23

(6) గీ॥ సాదులశ్వంబు శిక్షించు సరణిమీరు, వారిదంబుల శాసించి కోరిమాకు
ఋత్విజులు! యజ్ఞమునఁజాల నిద్ధఘృతము, విడుచునట్టులు వృష్టిని విడువరారె ॥ 24

(7) చ॥ ధృతగమసంబుఁబూని శుభదీప్తులతో విలసిల్లి ప్రాజ్ఞతా
యుతులయి పర్వతాళివలె యుక్తబలంబును గల్గియుండి సం
తతమును హస్తియూధములు ధారుణి వృక్షములెట్లు చీల్చునా
వితము మరుత్తులంద అతివేగము చెట్లను జీల్చు[1]చుండెడున్ ॥ 25

(8) చ॥ గిరుల గుహాంతరాళములఁ గేరెడు సింహములెట్లు శబ్దముల్
విరివిగఁజేయునట్టు లతి[2]వేగముఁ బూనుచువచ్చు వాయువున్
గరమురవంబుఁ జేయుచుఁ బ్రకాశముతో, సితబిందు సంతతిన్
రురువులుబోలి వెల్గుచతి రూఢిగ మీరలురండు ప్రీతితోన్ ॥ 26

గీ॥ శత్రుహింసకులయు సర్వజ్ఞులునునయి, పృషతినెక్కి యఖిల వృష్టి[3]తృప్తి
సహితులగుచు మీరు సరసఁజేరుఁడు మరుద్గణములార! మమ్ముగణనసేయ ॥ 27

(9) గీ॥ సహజ నిర్మలరూపంబు, సర్వజనులు, చూచుచుండెడి మెఱుపుల సోయగంబు
గనుగొనం బడునట్టులు కనకరథము, పైనిఁబోయెడి మిమ్ములఁగానఁగలరు ॥ 28

(10) క॥ ధనపతులతిబలవంతులు, ఘనతర బాణములు చేతఁగల్గెడి మీరల్
గొనకొని సోమరసమ్మం, గొనుటకు శీఘ్రంబురండు కోవిదులారా! ॥ 29

1. చీల్చుఁడీ! (తొ.పా. గణభంగము) 2. లతివేగసమాగతమైన వాయువున్ (తొ.పా.) 3. యఖిలతృష్టివృష్టి (వ్రా.ప్ర.పా, యతిభంగము) వృగతినెక్కిమీరు పరమవృష్టి (తొ.పా. యతిభంగము) పృషతినెక్కి యఖిల ప్రీతివృష్టి (తొ.పా.)

(11,12) సీ॥ చెట్లను గజములు చెఱచునట్టులు మహాపాదపంబులఁ బాడుచేయునెద్ది ?
సౌవర్ణ రథచక్ర సంఘర్షణంబునఁ గొండలఁబిండిగాఁ గొట్టునెద్ది ?
శత్రువారమునెల్లఁ జంపుచు బలమున దుష్టులకెల్లఁ దాఁ దొలఁగునెద్ది ?
వృష్టిజలంబుల వృద్ధిఁ బొందించుచు యా[1]గాభిముఖముగా సాగునెద్ది ?
గీ॥ యఖిలశోధకమగుచును నలరునెద్ది ?, పాంసుజాలమునెల్లను బఱచునెద్ది ?
యామరు[2]త్సంచయము ప్రీతి నఖిలమునులు, కోరి[3]భజియించెదరుగాకఁ గోర్కిమెఱయ ॥ 30

(13) క॥ మీరిన ధనసంపత్తిన్, వార[4]కఁ బ్రోతురొ యెవనిని వరలఁగఁ బ్రేమన్
ధీరుం డా పురుషుఁడు ధన, వారము పశుపుష్టిఁ గల్గి వ[5]ర్ధిల్లఁడొకో ! ॥ 31

(14,15) సీ॥ సకల కార్యకరుని సంగ్రామ కుశలుని దతబలాధికుని బుత్రకునినైన
సకల కార్యకరుని సంగ్రామ కుశలుని తతబలాధికునిఁ బౌత్రకునినైన
హితముగనిచ్చుచో హేమంతశతకంబు† జీవించివానిఁ బోషింతుమెలమి
వీరవర్ధితమునై విపులంబునగు సర్వసంపదఁ గొందుము సరసమతుల

1. యగాదిముఖము (వ్రా.ప్ర.పా.గణయతిభంగములు) వ.గో కృ. 2. యట్టి మారుతగణమును (తొ.పా.) 3. కోరిభజియింత్రు గావుతఁగోర్కిమీర (తొ.పా.) 4. వారకెవనికిచ్చి ప్రేమవరలఁబ్రోతురో! (వ్రా.ప్ర.పా. గణయతిభంగ దోషయుక్తము. వ.గో.కృ.) 5. వర్ధిల్లఁడుకో! (వ్రా.ప్ర.పా. అపపాఠము)

† హేమంత శతకము—ఆర్యులకు సంవత్సరము హేమంత ఋతువుతోఁ బ్రారంభమైయుండవలయును. ఈ సిద్ధాంతము ననుసరించియే కాఁబోలు శ్రీ కృష్ణభగవానుఁడు భగవద్గీతలో "మాసానాంమార్గశీర్షోహం" అని వచించియున్నాఁడు. ఆర్య జ్యోతిషగణిత (జ్యోతిర్గణిత) ప్రకారము సంవత్సరమునకు 365 రోజులు, 5 గంటలు, 50 నిమిషములు 36 సెకండ్లు (గా) తేలుచున్నది. (Lacailee) లాకైలీ దొరగారు గుణించిన గణితప్రకారము సంవత్సరమునకు 365 రోజులు 5 గంటలు, 48 నిమిషములు 48 సెకండ్లు వచ్చినది. మనయార్యుల లెక్కకు లాకైలీయొక్క లెక్కకు 1నిమిషము 46 సెకండ్లు వ్యత్యాసము (తక్కువ) ఉన్నది. సంవత్సరముయొక్క కాలపరిమాణము క్రమముగాఁ దగ్గివచ్చునని జ్యోతిష్య (జ్యోతిర్విదులందఱంగీకరించుచున్నారు.) లందరంగీకరించి యున్నారు. ఇట్టి సంవత్సర క్షైణ్యము పరిగణింపఁగా 4900 ఏండ్లకు $40\frac{1}{2}$ సెకండ్లు కాలము తగ్గుచుండునట. కావున ఆర్యగణిత సంవత్సరమునుండి ప్రస్తుత సంవత్సరములో 1 నిమిషము 46 సెకండ్లు తగ్గుటచే నార్యులు గణితము వేసి యిప్పటికి 13,000 సంవత్సరముల పైకాలము కావలెను. దానంజేసి ఆర్యజ్యోతిశ్శాస్త్రము ద్వాపరయుగములోనిదే కాని వేరుకాదు. ఇంద్రియముల కగోచరమైనట్టియు, నేత్రశక్తి లభ్యమైనట్టియు (మానవుని యూహాపోహలచే నలంఘ్యమైనట్టియు) నీ జ్యోతిశ్శాస్త్రమునందు 13,000 ఏండ్లక్రిందటనే యింత సునిశితములగు సారాంశముల నిర్ణయింపఁగల జాతియొక్క విజ్ఞానము (విజ్ఞానవికాసవిజృంభణము) అంతకుముందొక 13,000 సంవత్సరములు పరిశ్రమకలిగియున్ననే సంభవించునుగాని వేరుకాదు. ఏలననఁగా విజ్ఞానము మానవుని యందుదయించినపిమ్మట దినదిన ప్రవర్ధమానమై నానాటికి మెట్టుమెట్టెక్కి మహోన్నతికి రావలెనే గాని కొలదికాలములో హఠాత్తుగా పైనదుముకునట్టిదికాదని మేమిదివరకే వ్రాసియుంటిమి.) కాని సంభవింపనేరదు. మానవుని విజ్ఞానము క్రమముగా నభివృద్ధినిగాంచును, ఆర్యవైభవమపారము అసదృశము. — వేదభూమి (నే.వేం.న.శా.)

సూచన :—శ్రీమదాంధ్ర ఋగ్వేదము (1వ సంపుటము 238-240 పుటలలో) 64 సూక్తము 14-15 ఋక్కులకనువాదముగా విరచించిన తెలుఁగు సీసపద్యము మూఁడవ పాదము కడ ఫుట్‌నోట్‌గా— శ్రీ అచ్యుతుని వెంకటాచలపతి గారు వ్రాసిన వేదభూమి గ్రంథమునుండి యీ పైనుదాహరించిన విమర్శ విషయముదాహరింపఁబడినది. శ్రీ నేమానివారు వేదభూమి తొలి ముద్రణ ప్రతి చూచి (1936) పై ఫుట్‌నోటు నుటంకించిరి. వేదభూమి ద్వితీయ ముద్రణలో గ్రంథమున నక్కడక్కడ (గొన్నికొన్ని వాక్యములు మార్చఁబడినవి. పైనుదాహరించిన ఫుట్‌నోట్‌లో బ్రాకెట్లలో నీయఁబడిన వాక్యములు వేదభూమి (1936) తొలిముద్రణ ప్రతిలోలేవు. 1950వ సంవత్సరములోఁ బ్రకటితమైన ద్వితీయ ముద్రణ ప్రతిలో 140-141 పుటలలో మార్చి చేర్చి ప్రకటితములైనవి. ఈవిభిన్నతను పాఠకులు గుర్తింపవలయును—వేదభూమిలోని యీ "హేమంతశతక" చర్చ ప్రామాణికము కానేరదు. వ.గో.కృ.

గీ॥ ధన్యులైన మరు[6]త్తులు మాన్యకర్మ, ప్రాప్తధనమునుజేకొని దీప్తితోడ,
గల్యకాలంబునందునె కదలివచ్చి, మ[7]మ్ము రక్షింత్రుగాకవే సొమ్ములిచ్చి ॥ 32

## అనువాకః—12, సూక్తమ్—65

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—ద్విపదావిరాట్ †

(1) పశ్వా న తా[1]యుం, గుహా చతన్తం నమో యుజానం నమో వహన్తమ్ ।

సజోషా ధీరాః పదైరను గ్మన్నుప త్వా సీదన్, విశ్వే యజత్రాః ॥ 38

(2) ఋతస్య దేవా, అను వ్రతా గుర్భువత్ పరిష్టిర్ద్యౌర్న భూమ ।

వర్ధన్తీమాపః, పన్వా సుశిశ్విమృతస్య యోనా, గర్భే సుజాతమ్ ॥ 39

(3) పుష్టిర్న రణ్వా, క్షితిర్న పృథ్వీ గిరిర్న భుజ్మ, క్షోదో న శంభు ।

అత్యో నాజ్మన్, త్సర్గప్రతక్తః సిన్ధుర్న క్షోదః, క ఈం వరాతే ॥ 40

(4) జామిః సిన్ధూనాం, భ్రాతేవ స్వస్రామిభ్యాన్న రాజా వనాన్యత్తి ।

యద్ వాతజూతో వనా వ్యస్థాదగ్నిర్హ దాతి, రోమా పృథివ్యాః ॥ 41

6. మారుతగణంబు సంప్రీతిమాన్య కర్మ (తొ.పా.) 7. మమ్మురక్షించుఁగావుత (తొ.పా.)

† ఛందశ్శాస్త్రము ననుసరించి ద్విపద రెండు పాదములు కలది. అయినను ముద్రణలో నొక పాదముగలది గానే ముద్రితమైయున్నది. కాని ఏకైక పంక్తితోనున్న ద్విపదావిరాట్ ఛందోగత ఋక్కులన్నియు రెండు పాదములు గలవిగా గుర్తింపవలయును. అనఁగా ఋక్కు మధ్యలోఁ ప్రథమ పాదము ముగియునని గ్రహింపఁదగును. కాని ఋక్కులలెక్కలో రెండు ద్విపదలు ఒక ఋక్కుగా నొకరీతిని— మొత్తము ఋక్కుల సంఖ్యా పరిగణనలో నే ద్విపద కా ద్విపదయే ఋక్కుగా సంస్కృత ముద్రిత గ్రంథములలోఁగొన్నిట బరిగణింపఁబడినది. అనఁగా నీ 65వ సూక్తములో లెక్కకు 5ఋక్కులున్నట్లు చూపించినను మొత్తము ఋక్సంఖ్యా పరిగణనలోనివి 10 ఋక్కులుగా లెక్కకు వచ్చునని గ్రహింపఁదగును వ.గో.కృ.

1. నవాయుం (వా.ప్ర.)

(5) శ్వసిత్యప్సు, హంసో న సీదన్ క్రత్వా చేతిష్ఠో, విశాముషర్భుత్ ।

సోమో న వేధా, ఋతప్రజాతః పశుర్న శిశ్వా, విభుర్దూరేభాః ॥ 42

## అనువాకము—12, సూక్తము—65

### ఋషి—శక్తికుమారుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) ఉ॥ చోరుఁడు గోగణంబులను జోద్యముగా హరియించి భీతిచే
దూరమహీధ్రకందరముదూరి, తనంతట దాగునట్లుగా
నీరములందు దాగి కడు నేర్పుననుండెడు నిన్నుఁబ్రీతితో
ధీరులు దేవతల్ గనిరి దివ్యహవిఃప్రద! పావకోత్తమా! ॥ 33

(2,3) సీ॥ అభిమత ఫలవృద్ధియభిరామమౌ మాట్కి-రమణీయుఁ డెవ్వాఁడు రమ్యగతుల
విశ్వంభరామూర్తి విస్తారమగుభంగి వెలయునెవఁడు జఠర విస్తృతములఁ
బ్రాణులనెల్లను బర్వతంబులవలెఁ గాచునెవ్వఁడు యజ్ఞకర్మకరుల
నూర్జస్వలంబగు నుదకంబులాగున సుఖకరుండెవ్వఁడు శోభమిగుల
గీ॥ నిమ్నమునకును బోయెడి నీటికరణి, నిమ్నగామియు నెవ్వఁడు నిఖిల శత్రు
హా[1]ంతకుండెవ్వఁడో యట్టియగ్నిదేవుఁ, గోరివారించు నెవ్వఁడు కొఱతలేక ॥ 34

(4) ఉ॥ సోదరసోదరీ తతికి సొంపగు బంధుతఁగ్గల్గు కైవడిన్
సాదర సఖ్యముంగలిగెఁ జక్క-నినీటికి నీకు భూపతా
వాదమునన్, నృపాలుఁడరివారము శక్తినిఁగొట్టు నట్లుగా
నీదుమహత్వ సత్వమున నేర్పునఁగారడవిన్ దహింపుమా! ॥ 35

క॥ వా[2]తము ప్రబలుచునున్నన్, జాతచతుర్వేద! నీవు చయ్యనరోమ
వ్రాతమును గాల్చునట్టులు, జాతవనౌషధులనెల్లఁ జంపుదువు సుమా! ॥ 36

1. ఘాతక శబ్దమునకు మారుగ ననేక ప్రదేశముల నీ గ్రంథకర్త "హంతక" శబ్దమునే తెలుఁగు వ్యావహారిక భాషానుగుణముగాఁ బ్రయోగించినాఁడు. వ.గో.కృ. 2. వాత ప్రేరితమయ్యెడి. (తా.పా.)

(5) సీ॥ ప్రకృతి వర్గమునకుఁ బ్రబలతేజస్సులఁ జీఁకటి రాత్రులఁజేయువాఁడుఁ
చంద్రునివలె రమ్య సకలౌషధీతతిఁబుట్టించి మోదముఁ బొందువాఁడు
పశువు సంకుచితమై పడకలోఁగలరీతి నుదకమధ్యంబున నుండువాఁడు
గర్భస్థ[1] జంతువు కరణిఁ బ్రభూతమౌయవయవముల్ గల్గియలరువాఁడు
గీ॥ [2]విప్రకృష్టంబునై యొప్పు విపుల విశ్వ,మందు నంతటన్ వెలుఁగొందు నధికదీప్తి
నమలుఁ డగ్నిదేవుండు దా[3] సర్వభూత, జాలమును సదా రక్షించి సాకుఁగాక॥ 37

## సూక్తమ్—66

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—ద్విపదా విరాట్

(1) రయిర్న చిత్రా, సూరో న సందృగాయుర్న ప్రాణో, నిత్యో న సూనుః।

తక్వా న భూర్ణిర్వనా సిషక్తి పయో న ధేనుః, శుచిర్విభావా॥ 43

(2) దాధార క్షేమమోకో న రణ్వో యవో న పక్వో, జేతా జనానామ్।

ఋషిర్న స్తుభ్వా, విక్షు ప్రశస్తో వాజీ న ప్రీతో, వయో దధాతి॥ 44

(3) దురోకశోచిః, క్రతుర్న నిత్యో జాయేవ యోనావరం విశ్వస్మై।

చిత్రో యదభ్రాట్, ఛ్వేతో న విక్షు రథో న రుక్మీ, త్వేషః సమత్సు॥ 45

(4) సేనేవ సృష్టామం దధాత్యస్తుర్న దిద్యుత్, త్వేషప్రతీకా।

యమో హ జాతో యమో జనిత్వం జారః కనీనాం, పతిర్జనీనామ్॥ 46

1. గర్భస్థ జంతువుకరణిఁ బ్రభూతావయవయవముల్‌గల్గి యలరువాఁడు (వ్రా.ప్ర.పా.) 2. లుప్తభాగ పూరణకర్త-వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వఝ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ"—శ్రీమదాంధ్ర ఋగ్వేదము ప్రథమమండలము పంచమాధ్యాయములోఁగల 65వ సూక్తములోని 5వ ఋక్కును (అనఁగా ద్విపదా విరాట్ ఛందములోఁగల 9-10 ఋక్కులను) శ్రీ నేమానివారు పూర్తిగా ననువదింపలేదు. నాలుగు సీసపాదములు మాత్రమే వ్రాసి గీతమును (తేటగీతినిగాని ఆటవెలఁదినిగాని) వ్రాయక పద్యమునే పూరింపలేదు. కాఁగా "విప్రకృష్టంబు" విత్యాదిగాఁగల తేటగీతిని నేను రచియించి దీనిని బూరించితిని. వ.గో.కృ. 3. దాఁ(ప్రాణకోటి, సర్వవిధముల రక్షించి సాకుఁగాక (పాఠాంతరము. వ.గో.కృ.)

(5) తం వశ్చరాథా వయం వసత్యాస్తం న గావో నక్షన్త ఇద్ధమ్ ।

సిన్ధుర్న క్షోదః ప్ర నీచీరైనోన్నవన్త గావః స్వర్దృశీకే ॥ 47

## సూక్తము—66

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) గీ॥ సూర్యభంగిని వస్తువుల్ చూఁపువాఁడు, ప్రాణవాయువు[1] రీతిగఁ బ్రబల జీవ
నమును బొందించు వాఁడగు సముచితాగ్ని, వనములం గాల్చుచున్నాఁ డవారితముగ ॥ 38

క॥ జనకుని నౌరస పుత్రుఁడు, ఘనముగ నాకంబుఁజేర్చుకరణిని సర్వం
బనువుగ రథికునిఁ గొనిపో,యిన తెరఁగున[2] వనములే దహింపవె? యగ్నీ! ॥ 39

(2) చ॥ ధనములకెల్ల రక్షకుఁడు తత్క్షణ[3]పక్వ యవోపభోగ్యుఁడున్
జనములలోఁ బ్రశస్తుఁడును శాంతముని ప్రకరంబురీతిగా
వినయముతోడ దేవతల వేఁడెడివాఁడును శత్రుపంక్తి సం
హననముఁ జేయువాఁడు నగు నగ్ని మముం బలమిచ్చి కావుతన్ ॥ 40

(3) చ॥ సహచరినై జగేహమును జక్కఁగనుంచెడికైవడిన్ మహా
గృహము [4]నలంకరించి తగ నిష్టుల విఘ్నముఁ జేయువారికిన్
సహనములేక హింసలనుఁ జాలఁగఁగూర్చి విచిత్రకాంతిమ
ద్దహనుఁడు వెల్గుచున్ భువిని దద్దయుఁగాల్చుఁ దరు వ్రజంబులన్ ॥ 41

(4) సీ॥ సేనశత్రువులను జెఱచునట్టులు వైరి సేనానులనునెల్లఁ జెఱచునతఁడు
యుద్ధపరిక్షిప్త యోధబాణంబట్లు వీరుల భయపెట్టు వీరుఁడతఁడు
†లాజలఁబొందుచు [5]లలితకన్యల కన్నెఱికము లన్నియు నోపి ఱిమ్మనతఁడు
పతులను బడయని పడఁతుల కొకవేళ భర్తయైయుండిన భవ్యుఁడతఁడు

1. వాయువ (ప్రా.ప్ర.పా) 2. తెరఁగునఁ బెద్దయడవి నీవుకాల్పవే! (తొ.పా. గణభంగ దోషయుక్తము) వ.గో.కృ. 3. తక్షణ (ప్రా.ప్ర.పా.) 4. నలంకరించి క్రతుకర్మల విఘ్నముఁ జేయువారికిన్ (తొ.పా. యతిభంగము) వ.గో.కృ. 5. లలనామణుల కన్నెరికములన్నియు (తొ.పా.)

† (1) కన్య—విధి పూర్వకముగ నగ్నియందు లాజాది హోమమొనర్చి పరిగ్రహించినతోడనే భర్తకెంత వయస్సుగలదో యంతవయస్సుగలది యగుచున్నది. అప్పుడువయస్సునఁజిన్నదయ్యుఁగన్య తనభర్తకంటెఁబెద్దవారిచేతఁగూడ నమస్కరింపఁదగు చున్నది. ఇట్టి గౌరవము కన్యలకు నగ్నిసాక్షిగ వివాహమైన పిదపనే కలుఁగుచున్నది. కావున నగ్నికన్యలకుఁబెద్దరికమొసంగు వాఁడని చెప్పఁబడినది. (2) పెడ్లియగునంతవరకుఁ గన్యలకుఁజంద్రుఁడు భర్త. ఆవల గంధర్వుఁడు భర్త. ఆపైని నగ్నిభర్త.

గీ॥ స్తోతలకుఁ గోర్కెలను నిచ్చు దాతయతఁడు, వేల్పుతోడనె పుట్టిన వీరుఁడతఁడు
యాగములలోన నర్పించు హవ్యములను, బూని సురలకు సందించు హోతుఁడగ్ని ॥ 42

(5) గీ॥ పశు పురోడాశ వస్తు సంపత్తితోడ, నిన్నుఁబొందుచునున్నాము నిత్యమగ్ని!
పశువు లింటికి నుదకంబు పల్లమునకు, [1]జరుగునట్టుల నన్నిటన్ జ్వాలలేగు ॥ 43

## సూక్తమ్—67

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—ద్విపదా విరాట్

(1) వనేషు జాయుర్మర్తేషు మిత్రో వృణీతే శ్రుష్టిం[1] రాజేవాజుర్యమ్ ।

క్షేమో న సాధుః క్రతుర్న భద్రో భువత్ స్వాధీ ర్హోతా హవ్యవాట్ ॥ 48

(2) హస్తే దధానో నృమ్ణా విశ్వాన్యమే దేవాన్ ధాద్ గుహా నిషీదన్ ।

విదన్తీమత్ర నరో ధియంధా హృదా యత్ తష్టాన్ మన్త్రాగ్ం అశంసన్ ॥ 49

ఆ యగ్నియే ధన పుత్రాదులతోడ నా కన్యకను మనుష్యున కొసంగుచున్నాడు. (నే.వేం న.శా.)

గమనిక:— కన్యగానుండి వివాహము కానంతవఱకుఁ జంద్రుఁడు భర్తయనియు, నవివాహితయై రజస్వలయైయున్న పడఁతికి భర్త గంధర్వుఁడనియు, వివాహమైన పిదప నగ్నియే భర్తయను భావము ప్రాచీనులలోఁ గొందఱిలో నున్నట్లున్నది. పురుషునితో వివాహమైనను వీర్య మగ్నిరూపము గావునఁదద్వీర్యమువలనఁగల్గు సంతానాదులకన్నింటికిని నగ్నియే కారకుఁడని యొక భావము. వీర్యము కేవల సంతానోత్పత్తికేకాక బుద్ధిజ్ఞానబలపరాక్రమాదులన్నింటికిని మూలము. కాఁగాఁ గేవలసంతానమునకే కాక సమస్త సంపదలకును వీర్యరూపమగు నగ్నియే కారణమగుచున్నదని భావము. లేదా "అష్టవర్షా భవేత్కన్యా" అన్న సిద్ధాంతము ప్రకారముగా నెనిమిది వత్సరముల పర్యంతము కన్యకుఁ జంద్రుఁడు భర్తయనియు, నాపైని గంధర్వుఁడు భర్తయనియు (వివాహమైనను గాకున్నను) రజస్వలయైనతదుపరి వివాహమై లేదా వివాహమైనతదుపరి రజస్వలయై కాపురమునకు వచ్చినపిదప నగ్ని భర్త యనియు మన మహర్షుల భావము కావచ్చును. గంధర్వుఁడు వివిధ విలాసములకుఁ బ్రతీక. అష్టవర్షములు దాఁటిన పిదపనే కన్యకుఁ బ్రకృతి సిద్ధములై సహజాలంకారములై యలరారు కుచకచాద్యవయవాంగ సౌష్ఠవాదులేర్పడునుగదా! ఏః దృష్ట్వా గంధర్వుని నాథునిగా భావించియుండురు. వ.గో.కృ.

1. జరుగునటునన్నిటన్ జ్వాలలేగు (వ్రా.ప్ర.పా. గణభంగ దోషము) వ.గో.కృ.
1. శ్రుష్టి (వ్రా.ప్ర.)

(3) అజో న క్షాం దాధార పృథివీం తస్తమ్భ ద్యాం మన్త్రేభిః సత్యైః ।

ప్రియా పదాని పశ్వో ని పాహి విశ్వాయురగ్నే గుహా గుహం గాః ॥ 50

(4) య ఈం చికేత గుహా భవన్తమా యః ససాద ధారామృతస్య ।

వి యే చృతన్త్యృతా సపన్త ఆదిద్ వసూని ప్ర వవాచాస్మై ॥ 51

(5) వి యో వీరుత్సు రోధన్మహిత్వోత ప్రజా ఉత ప్రసూష్వన్తః ।

చిత్తిరపాం దమే విశ్వాయుః సద్మేవ ధీరాః సంమాయ చక్రుః ॥ 52

## సూక్తము—67

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) క॥ వనసంజాతుండగుచున్, మనుజుల సఖ్యంబుఁబడసి మాన్యుండగుచుం
బనిఁబూని యగ్నిహోత్రుఁడు, ఘన యజమానులను బొంది కార్యము సేయున్ ॥ 44

గీ॥ కర్మ కర్త భంగిఁగన్పాటుఁడవు దేవ, హోతవగుచు దేవ దూతవగుచు
†భవ్య కర్మములను భక్తితోఁజేయుచు, వెలుఁగుచుంటి వహ్ని! వేల్పువలెను ॥ 45

†కర్మములు :— ఈ కర్మశబ్దము "కృ" ధాతువువలనఁ బుట్టినది. కావున వానికి చేయుటయని కాని, నడవడియని కాని, వ్యాపార మనికాని యర్థము. ఈ సామాన్యార్థమే భగవద్గీతలయందుఁ గలదు. ప్రాచీన వైదికధర్మానుసారముగ యజ్ఞయాగాదికము నెట్లు చేయవలయునో యా విధులు భిన్నభిన్న విధులుగాఁ జెప్పఁబడిన విద్యలకు ఏకవాక్యత యెటులు కలుఁగునో నిరూపించుటకై మీమాంసా శాస్త్రము ప్రవర్తించెను. మనుష్యుఁడేమి యొనర్చినను యజ్ఞార్థమేయని (మహా.భా.శాం. 25, 26) కలదు. ఋగ్వేదమున నింద్రాది దేవతాస్తుతి పరములుగా సూక్తములుండెను సర్వశ్రుతి గ్రంథములు యజ్ఞాదిక ప్రతిపాదకములేయని మీమాంసకులు చెప్పుదురు. యజ్ఞాదికములవల్లనే స్వర్గము కలుఁగునవియుఁ జెప్పుదురు. ఉపనిషత్తులు యజ్ఞములు గ్రాహ్యముగ నంగీకరించును గాని మోక్షమునకు బ్రహ్మజ్ఞానమే సాధనమని చెప్పుచున్నవి. ఇవిగాక ధార్మిక కర్మలు కొన్నికలవు. అవియే పౌరాణికకర్మలు. అవి నిత్య నైమిత్తిక కామ్య కర్మలని మూఁడు విధములు. (నే.వేం.న.శా.)

(2) సీ॥ హవ్యాలక్షణ సంపత్తి నధిగమించి, యువకమధ్యను నొంది నీవుంటవలన
ఋషిమంతులు నిజసూక్ష్మ బుద్ధిరచిత, మంత్రములచే స్తుతించిరి మాన్య! నిన్ను ॥ 46

(3) చ॥ జనసము లేనివానివలెఁ జాలఁగ భూమికి రక్షఁబెట్టుచో
నసలుఁడ! సత్య మంత్ర సుమహత్త్వములన్ దివి భ్రమాస్పదంగ నే
పున నొనరించినావు పశుపూత పదంబుల వారి ఘోసమున్
గనఁబడునట్లొనర్చి ప్రతికందరమందు వసించిపోపుమా! ॥ 47

(4) క॥ ఎవఁడు గుహాగ్నింజూఁచునొ, యెవఁడగ్నిన్ స్తుతినిజేయు నెవ్వఁడు సూక్తుల్
వివరంబుగ రచియించునొ, [1]యవహితులగువార లర్థ మందుదు రవనిన్ ॥ 48

(5) క॥ సదమలుఁడా! వహ్నీ! నీ, సదనము పూజించి మా సుసదనంబునకై
వదలక నిసుఁ గొనితెచ్చిన, ముదమున మా యన్నికార్యములు [2]చేయవాకో! ॥ 49

## సూక్తమ్—68

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—ద్విపదావిరాట్

(1) శ్రీణన్నుప స్థాద్ [1]దివం భురణ్యుః స్థాతుశ్చరథమక్తూన్ వ్యూర్ణోత్ ।
పరి యదేషామేకో విశ్వేషాం భువద్ దేవో దేవానాం మహిత్వా ॥ 53

(2) ఆదిత్ తే విశ్వే క్రతుం జుషన్త శుష్కాద్ యద్ దేవ జీవో జనిష్ఠాః ।
భజన్త విశ్వే దేవత్వం నామ ఋతం సపన్తో అమృతమేవైః ॥ 54

(3) ఋతస్య ప్రేషా ఋతస్య ధీతిర్విశ్వాయుర్విశ్వే అపాంసి చక్రుః ।
యస్తుభ్యం దాశాద్ యో వా తే శిక్షాత్ తస్మై చికిత్వాన్ రయిం దయస్వ ॥ 55

1. యవహితులంచఁబును నర్థమందుదురవనిన్ (తా.పా.) 2. చేయవునో! (వ్రా.ప్ర.పా.). 1. స్థా హివం (వ్రా.ప్ర.)

(4) హోతా నిషత్తో, మనోరపత్యే స చిన్న్వేసాం, పతీ రయీణామ్ ।

ఇచ్ఛన్త రేతో, మిథస్తనూషు సం జానత స్వైర్దక్షైరమూరాః ॥ 56

(5) పితుర్న పుత్రాః, క్రతుం జుషన్త శ్రోషన్ యే అస్య, శాసం తురాసః ।

వి రాయ ఔర్ణోద్[1], దురః పురుక్షుః పిపేశ నాకం, స్తృభిర్దమూనాః ॥ 57

## సూక్తము—68

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) చ॥ తలఁప హవిస్సుధారసముఁదద్దయునొంది నభంబుమీఁద న
గ్గలముగ రేగుచున్, సహజకాంతిని గప్పుచు లోకమంత నా
ఘన దివిజాళి మధ్యను బ్రకాశమునొందుచు, జంగమంబులం
దున, నల సుస్థిరంబులను దోగుచునగ్ని వెలుంగుచుండఁడే ॥ 50

(2) గీ॥ అరణిరూప కాష్ఠమందు జన్మింపంగఁ, జేసి పిదపఁ గర్మఁజేసి యమృత
రూపమెలమి వేడి రూఢిగ దేవత్వ, మందుచుండి రార్యు[1]లందఱుఁగడు ॥ 51

(3) క॥ యాగం బెవ్వనికై చను, యాగమునన్ స్తుతినిబడసి హవ్యముఁగొనఁదా
సాగునొ యెవ్వండిష్టికి, నాగుణయుతుఁడి[2]చ్చుఁగాక నర్థంబెలమిన్ ॥ 52

(4,5) సీ॥ మనువంశ సంభూత మానవహోతవై రమణీయ గోధన రాజువగుట
ప్రకృతి వర్గంబంత ప్రబల తనువులందుఁబుత్ర వీర్యంబును బొందుచుంట
దిశలో పుత్రుల దర్శనంబునుజేసి చిత్తం[3]బలరఁ జిరజీవులగుట
పుత్రులు జనకాజ్ఞఁ బోషించురీతిగ నఖిలులగ్నిం గొనియాడుచుంట

1. ఔర్ణోత్తరః (ప్రా.ప్ర.)

1. రాద్యులందమగను (తొ.పా.) 2. నాగుణయుతుఁడర్థమిచ్చునందఱ కెలమిన్ (తొ.పా.) 3. చిత్తమలరఁగ (తొ.పా.)

గీ॥ యజ్ఞములకెల్ల హేతువౌ నర్థమెల్ల, నిచ్చుచును నాకమంత నహీనకాంతిఁ
గప్పుచున్నావు తారకాగణముతోడ, శాసకుఁడవయి యజమానశాలలందు ॥ 53

## సూక్తమ్—69

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—ద్విపదావిరాట్

(1) శుక్రః శుశుక్వాగ్ం, ఉషో న జారః పప్రా సమీచీ, దివో న జ్యోతిః ।

పరి ప్రజాతః, క్రత్వా బభూథ భువో దేవానాం, పితా పుత్రః సన్ ॥ 58

(2) వేధా అదృప్తో అగ్నిర్విజానన్నూధర్న గోనాం, స్వాద్మా పితూనామ్ ।

జనే న శేవ, ఆహూర్యః సన్ మధ్యే నిషత్తో, రణ్వో దురో[1]ణే ॥ 59

(3) పుత్రో న జాతో, రణ్వో దురో[2]ణే వాజీ న ప్రీతో, విశో వి తారీత్ ।

విశో యదహ్వే, నృభిః సనీళా అగ్నిర్దేవత్వా, విశ్వాన్యశ్యాః ॥ 60

(4) నకిష్ట ఏతా, వ్రతా మినన్తి నృభ్యో యదేభ్యః, శ్రుష్టిం చకర్థ ।

తత్ తు తే దంసో, యదహన్సమానైర్నృభిర్యత్ యు[3]క్తో, వివే రపాంసి ॥ 61

(5) ఉషో న జారో, విభావోస్రః సంజ్ఞాతరూపశ్చికేతదస్మై ।

త్మనా వహన్తో, దురో వ్యృణ్వన్ నవన్త విశ్వే, స్వర్దృశీకే ॥ 62

1. దురేణే (వ్రా.ప్ర.) 2. దురేణో (వ్రా.ప్ర.) 3. యుక్తే (వ్రా.ప్ర.)

## సూక్తము—69

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) క॥ సుఖకర చంద్రుని మాడ్కిన్, నిఖిలము వెల్గించుచుండి నిజతేజమునన్
సఖుఁడగుచుఁ బ్రజలకెల్లన్, మఖములఁ జేయించు నగ్నిమాన్యుండుగదా! ॥ 54

(2) గీ॥ అన్నములకునెల్ల నావుపాలంబోలి, రుచినిగలుఁగఁజేసి రూపియైన
యగ్నిహోత్రుఁ డెలమినంతట సుఖకర, పురుషు మాడ్కినుతులఁ బొందుచుండె ॥ 55

(3) గీ॥ సూనుపగిది గృహము శోభిల్లఁజేసెడు, వాజికరణిశత్రు రాజిదాటు
ఋత్విజుండు పిలువ సత్వరమమరత్వ, మొందివహ్ని హవ్యమందుచుండె ॥ 56

(4) చ॥ వంచనఁజేయు రాక్షసుల వంచనఁ జేయుటఁజేసి పావకా!
యంచిత యజ్ఞకర్మలు సమంచిత పూర్ణములౌనుగాన నీ
వెంచిన ధైర్యసంపద వహించి మరుద్గణ సంగతిన్ విజృం
భించి సమస్త కార్యముల భీకర విఘ్నములన్ హరింపుమా! ॥ 57

(5) గీ॥ అఖిల జీవులకీవు ప్రత్యక్ష[1]ఁడవుచు, నినసమానత ఫలములనిచ్చు నీదు
రశ్మలున్ ద్వారములుదాఁటి రమ్యగతిని, నూర్ధ్వలోకంబునకుఁ బోవుచుండునగ్ని! 58

## సూక్తమ్—70

### ఋషిః—పరాశరః శాక్త్యః

### దేవతా—అగ్నిః

### ఛందః—ద్విపదా విరాట్

(1) వనేమ పూర్వీరర్యో మనీషా అగ్నిః సుశోకో, విశ్వాన్యశ్యాః ।

ఆ దైవ్యాని, వ్రతా చికిత్వానా మానుషస్య, జనస్య జన్మ ॥ 63

1, ప్రత్యక్షమగుచు (తా.పా.)

(2) గర్భో యో అపాం గర్భో వనానాం గర్భశ్చ స్థాతాం, గర్భశ్చరథామ్ ।

అద్రౌ చిదస్మా, అన్తర్దురోణే విశాం న విశ్వో. అమృతః స్వాధీః ॥ 64

(3) స హి క్షపావాగ్‌ం అగ్నీ రయీణాం దాశద్ యో అస్మా, అరం సూక్తైః ।

ఏతా చికిత్వో, భూమా ని పాహి దేవానాం జన్మ, మర్తాంశ్చ విద్వాన్ ॥ 65

(4) వర్ధాన్యం పూర్వీః క్షపో విరూపాః స్థాతుశ్చ రథమృతప్రవీతమ్ ।

అరాధి హోతా, స్వర్నిషత్తః కృణ్వన్ విశ్వాన్యపాంసి సత్యా ॥ 66

(5) గోషు ప్రశస్తిం, వనేషు ధిషే భరన్త విశ్వే, బలిం స్వర్ణః ।

వి త్వా నరః, పురుత్రా సపర్యన్ పితుర్న జివ్రేర్వి వేదో భరన్త ॥ 67

(6) సాధుర్న గృధ్నురస్తేవ శూరో యాతేవ భీమస్త్వేషః సమత్సు ॥ 68

## సూక్తము 70

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) ఉ॥ మానవజాతి పుట్టువు, సమంచిత వైదికకర్మ, రోదసీ
మానిత కర్మరాశి, యసమానదయం గనుగొంచు సర్వ స
న్మానిత దీప్తివంతుఁడు ఘనంబగు నైజ మనీషచేత స
న్మానముగల్గి యన్నముల మాన్యుల కీ విడవే ప్రియంబునన్ ॥ 59

(2) మ॥ వనమధ్యంబున వార్ధిమధ్యను జరద్వస్తు ప్రపంచంబు మ
ధ్యను గాష్టంబుల మధ్యనద్రితతి మధ్యంబందునన్ జిష్ణురూ
పునఁ బెంపొందుచు నిత్యమున్ వెలిఁగి సంపూర్ణంబుగా మమ్ముఁ బా
వన భూపాలుఁడు మానవాళిగతిఁగాపాడంగదే! [1]పావకా! ॥ 60

1. ప్రేమతోన్ (పా.పా.)

(3) శా॥ చేతోవంతుఁడవై బలాధికుఁడవై చేట్పాటులేనట్టి స
జ్జ్యోతీరూపమునొందు రాత్రికి నిజజ్యోతిస్సు నందించుచుం
బూతేంద్రామర మర్త్య జన్మముల సంపూర్ణమ్ముగా నెంచుచున్
భూతవ్రాతము కాఁచి[1] వెల్గవలెసూ పుణ్యాత్మ! వైశ్వానరా! ॥ 61

(4) మ॥ విమలోషస్సులఁ గృష్ణరాత్రులను వేర్వేరైన రూపంబులన్
రమణీయాకృతి వృషపంక్తి నరులన్ రాజిల్లఁజేయంగ నీ
కమనీయామల యజ్ఞమందిరములంగర్మంబు చేయింతువో
సుమనోదేవుఁడ! పూరుషావళులచేఁ జోద్యంబు నీ వృత్తమౌన్ ॥ 62

(5) చ॥ జనకునిఁజేరి పుత్రకుఁడు చాలధనంబును నందురీతిగా
ననయము మానవాళినిను యాగములంగదియించి సర్వస
జ్జనము మనోజ్ఞభూరి పశుసంపద నందునుగాన శస్తమై
తనరు గవాదిసాధుపశు తల్లజముల్ కలిఁగింపు పావకా! ॥ 63

(6) సీ॥ సాధ్యంబులెట్టులు సాధకుండొనరించునట్టులె యంతయునధిగమించి
చారుధానుష్కుఁడు శత్రువుతోవలె ప్రాణి జాతంబుతోఁ బ్రాకులాడి
పరమహింసకురీతి భయదుఁడై వెలుఁగుచు పరమనియతిఁబాపి భయముగొలిపి
సంగ్రామవీథుల సంతసిల్లుచునుండి సకల కార్యంబులఁ జక్కఁబెట్టి
గీ॥ చిత్రభానుండు సంగ్రామసీమలందు, సహజతేజస్సుతోఁగూడి సంతసమున
సర్వభూతంబులకు నిత్యసఖునిఁబోలి, సాయమొనరించుఁగాక సత్వుఁడగుచు ॥ 64

## సూక్తమ్—71

## ఋషిః—పరాశరః శాక్త్యః

## దేవతా—అగ్నిః

## ఛందః—త్రిష్టుప్

(1) ఉప ప్ర జిన్వన్నుశతీరుశన్తం పతిం న నిత్యం జనయః సనీళాః ।
స్వసారః శ్యావీమరుషీమజుష్రఞ్ చిత్రముచ్ఛన్తీముషసం న గావః ॥ 69

(2) వీళు చిద్ దృళ్హా పితరో న ఉక్థైరద్రిం రుజన్నఙ్గిరసో రవేణ ।
చక్రుర్దివో బృహతో గాతుమస్మే అహః స్వర్వివిదుః కేతుముస్రాః ॥ 70

1. కావఁగావలెసుమా పుణ్యాత్మవైశ్వానరా! (తా.పా.) కాఁచివెల్గెదవుగాకో పుణ్యవైశ్వానరా! (ఇది రచయిత సవరించిన పాఠము. ఇందుయతిభంగము కలదు. లేదా "భూత" శబ్దములోని "ఊ" కారమునకు "గాకో" అన్నప్పుడు "ఓ" కారమునకును గేవల స్వరయతిని నామోదింపవలసివచ్చును. తొలిపాఠములో యతిదోషములేదు. కాని వెల్గుశబ్దార్థక మేదియు లేని లోపముండును. వ.గో.కృ.

(3) దధన్నృతం ధనయనస్య ధీతిమాదిదర్యో దిధిష్వో౩ విభృత్రాః ।

అతృష్యన్తీరపసో యన్త్యచ్ఛా దేవా[1]ఞ్జన్మ ప్రయసా వర్ధయన్తీః ॥ 71

(4) మథీద్ యదీం విభృతో మాతరిశ్వా గృహేగృహే శ్యేతో జేన్యో భూత్ ।

ఆదీం రాజ్ఞే న సహీయసే సచా సన్నా దూత్యం[2]౧ భృగవాణో వివాయ ॥ 72

(5) మహే యత్ పిత్ర ఈం రసం దివే కరవ త్సరత్ పృశన్యశ్చికిత్వాన్ ।

సృజదస్తా ధృషతా దిద్యుమస్మై స్వాయాం దేవో దుహితరి త్విషిం ధాత్ ॥ 73

(6) స్వ ఆ యస్తుభ్యం దమ ఆ విభాతి నమో వా దాశాదుశతో అను ద్యూన్ ।

వర్ధో అగ్నే వయో అస్య ద్విబర్హా యాసద్ రాయా సరథం యం జునాసి ॥ 74

(7) అగ్నిం విశ్వా అభి పృక్షః సచన్తే సముద్రం న స్రవతః సప్త యహ్వీః ।

న జామిభిర్వి చికితే వయో నో విదా దేవేషు ప్రమతిం చికిత్వాన్ ॥ 75

(8) ఆ యదిషే నృపతిం తేజ ఆనట్ ఛుచి రేతో నిషిక్తం ద్యౌరభీకే ।

అగ్నిః శర్ధ[3]మనవద్యం యువానం స్వాధ్యం జనయత్ సూదయచ్చ ॥ 76

(9) మనో న యోఽధ్వనః సద్య ఏత్యేకః సత్రా సూరో వస్వ ఈశే ।

రాజానా మిత్రావరుణా సుపాణీ గోషు ప్రియమమృతం రక్షమాణా ॥ 77

1. దేవాఞ్జన్మ. (ప్రా.ప్ర.) 2. దూత్యం౩ (ప్రా.ప్ర.) 3. శర్ధమానవద్యం (ప్రా.ప్ర.)

(10) మా నో అగ్నే సఖ్యా పిత్ర్యాణి ప్రమర్షిష్ఠా అభి విదుష్కవిః సన్ ।

నభో న రూపం జరిమా మినాతి పురా తస్యా అభిశస్తేరధీహి ॥ 78

## సూక్తము—71

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) ఉ॥ కామయమానభర్తలను గామినులంచఁగఁ గోరునట్టుగా
నీమముతోనుషస్సులు వినిర్మల రశ్ములఁబొందునట్టుగా
ధామమునొంది భాసిలెదు ధన్య[1]మహానల! నీకుఁబూజలం
గామమొనర్చి యంగుళులు కాంతిని వెల్గుచునుండు నెప్పుడున్ ॥ 65

(2) ఉ॥ ఆదిని పావనస్తుతుల నార్యులుద్రుంచిరి గ్రా[2]వనట్టులే
సాదరమంగిరోమునులు సత్వనుసూక్తిరవంబుచేత నా
మేదుర పర్వతంబులను మిక్కిలికొట్టి సురాధిరాజ్య సం
పాదనకై గణించిరి విభాసితకాంతిని నీదు ప్రాఁపునన్ ॥ 66

(3) గీ॥ పుణ్యపురుషులు ధనమును బొందుసటుల, నగ్ని దేవత్వమునుబొందె నతిశయముగ
నగ్ని కాధానమొనరించి యధికభక్తిఁ, బ్రజలుతనియుదు రమరాళి ప్రజ్ఞనొందు ॥ 67

(4) సీ॥ ప్రాణాదివృత్తుల భాసిల్లు మాతరిశ్వుంబును మర్ధింపజన్మమొందె
శుభ్రవర్ణముఁగల్గి శోభలందించుచు నాదరంబున నిష్టిహవ్యమందెఁ
బ్రతి యజ్ఞగృహమునఁ బ్రాదుర్భవించుచు సకల కార్యములను జక్కఁబఱచె
భీషణరూపుఁడౌ భృగుమహర్షిని భంగి దూత్యంబునందింప దూతయయ్యె
గీ॥ నట్టియగ్నిని హవ్యవాహకునిఁజూచి, యంతరాయంబులన్నియు నంతరించె
నైజకాంతులు దిశలెల్ల నింపి యల్ల, కల్య[3]మేతెంచుఁ గాంతిసంక్రమితమగుచు ॥ 68

(5) గద్యము—ఓ యగ్నీ! ప్రపంచ రక్షకులును శ్రేష్ఠులునునగు దేవతలకు యజమానుఁడు హవిస్సు నొసంగిన సమాచారము చెవినిసోకినతోడనే జాడలఁదీయు నేర్పుగల రాక్షసులగుంపు నీవచ్చటనుండుటవిని పరువెత్తుచున్నది. మరియు బాణప్రయోగ నిపుణుఁడవగునీవు దృఢతరమగు ధనస్సున బాణము సంధించి రాక్షసులపై విడుచుచున్నావు. మరియు నుషఃకాలమున నీ తేజస్సును నెల్లయెడలఁ బ్రసరింపఁ జేయుచున్నావు. ॥ 69*

1. ధన్యధనంజయ! (తా.పా.) 2. రాలనట్టులే (తా.పా) 3. కల్యశోభించు (తా.పా.) * వ్రాతప్రతిలో 5వ ఋక్కునకనువాదమైన యీగద్యమునకుఁ గ్రమసంఖ్య వ్రాయలేదు. ఇది ప్రమాదము. (చూ. 1వ సంపుటము. 201వ. పుట.) కాఁగా నిటనుండి పద్యముల క్రమసంఖ్యమారును. వ.గో.కృ.

(6) గీ॥ ఎవ్వఁడు యజ్ఞగృహంబున నేపుఁగల్గి, నతులసర్పించునో నీకు నమ్రుఁడగుచు
నట్టి యాజమానునకు నీయుమన్నమంత, యజ్ఞపురుషుండు తేడతే యన్నమెల్ల॥ 70

(7) సీ॥ సప్తమహానదుల్ సంద్రంబునట్టుల చరుపురోడాశాది సర్వవితతి
యంగనామణియుక్త నగ్నిఁజేరుచునుంటె ఁదలఁపంగ మాయొద్ద ధనములేమి
దేవతాళికిఁగల దివ్యధనంబెల్లఁ దెప్పించి మాకిమ్ము దివిజమాత!
యన్నిజీవులయందు నడిఁగినతేజంబు వీర్యపుత్రంబయి వెలయుఁగాక
గీ॥ వహ్నా! యలయుదుగాక యౌవనుఁడవగుచు, వహ్నా! యెసఁగుత రాజశబ్దంబుదాల్చి
వహ్నా! శోభింతుకాకనవారితముగ, వహ్నా! పొందుత యాగభవంబునీవు॥ 71

(8) గద్యము—ఓ యగ్నీ! యజమానుని గర్భముననుండు జఠరాగ్నిరూపమునఁ బ్రకాశించు పరిశుద్ధమగు నీ తేజస్సు యజమానుఁడు భక్షించుచున్న యన్నమును బరిపక్వముఁ జేసి రేతోరూపమును బొందించి బలవంతుఁడు నిర్దుష్టుఁడును యౌవనవంతుడును నగు పుత్రుని గలిఁగించును గాక. మఱియు నన్నముఁబొందు నిమిత్తముయాగాది కర్మలనుజేయ బుద్ధిఁబుట్టించుఁగాక. ॥ 72

(9) మ॥ ద్విసహస్రంబులు యోజనంబులు మనోవేగంబుతో సూర్యుఁడే
విసువుంజెందక యన్ని దేశములకున్ విస్తారమైపోవుఁ దా
మనమానంబుగ మిత్రుఁడున్ వరుణుఁడున్ హత్తించి గోమండలిన్
వెసదుగ్ధంబుల నుంత్రుపావక భవద్వీర్య ప్రభావంబులన్ ॥ 73

(10) చ॥ పితరులనాఁటి మైత్రి మదిఁబెట్టుచు నాశనముఁజేయకుండుమా
యతులకవీశ్వరుండ[1]వుట నంతనెఱుంగుదువీవు, రశ్మి లా
తతగగనంబుగప్పెడి విధంబున వృద్ధతఁగప్పుచుండె సం
తతమును దానిఁబాపికడు ధన్యుఁడవై చరియించుపావకా! ॥ 74

## సూక్తమ్—72

ఋషిః—పరాశరః శాక్త్యః

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) ని కావ్యా వేధసః శశ్వతస్కర్హస్తే దధానో నర్యా పురూణి ।

అగ్నిర్భువద్ రయిపతీ రయీణాం సత్రా చక్రాణో అమృతాని విశ్వా ॥ 79

1. కవీశ్వరుఁడవుట. (వ్రా.ప్ర.పా. గణభంగము) వ.గో.కృ.

(2) అస్మే వత్సం పరి షన్తం న విన్దన్నిచ్ఛన్తో విశ్వే అమృతా అ[1]మూరాః ।
శ్రమయువః పదవ్యో ధియన్ధాస్తస్థుః పదే పరమే చార్వగ్నేః ॥ 80

(3) తిస్రో యదగ్నే శరదస్త్వామిచ్ఛుచిం ఘృతేన శుచయః సపర్యాన్ ।
నామాని చిద్ దధిరే యజ్ఞియాన్యసూదయన్త తన్వః సుజాతాః ॥ 81

(4) ఆ రోదసీ బృహతీ వేవిదానాః ప్ర రుద్రియా జభ్రిరే యజ్ఞియాసః ।
విదన్మర్తో నేమధితా చికిత్వానగ్నిం పదే పరమే తస్థివాంసమ్ ॥ 82

(5) సంజానానా ఉప సీదన్నభిజ్ఞు పత్నీవన్తో నమస్యం నమస్యన్ ।
రిరిక్వాంసస్తన్వః కృణ్వత స్వాః సఖా సఖ్యుర్నిమిషి రక్షమాణాః ॥ 83

(6) త్రిః సప్త యద్ గుహ్యాని త్వే ఇత్ పదావిదన్నిహితా యజ్ఞియాసః ।
తేభీ రక్షన్తే అమృతం సజోషాః పశూంశ్చ స్థాతౄఞ్చరథం చ పాహి ॥ 84

(7) విద్వాగ్ం అగ్నే వయునాని క్షితీనాం వ్యానుషక్ ఛురుధో జీవసే ధాః ।
అన్తర్విద్వాగ్ం అధ్వనో దేవయానానతన్ద్రో దూతో అభవో హవిర్వాట్ ॥ 85

(8) స్వాధ్యో దివ ఆ సప్త యహ్వీ రాయో దురో వ్యృతజ్ఞా అజానన్ ।
విదద్ గవ్యం సరమా దృళ్హమూర్వం యేనా ను కం మానుషీ భోజతే విట్ ॥ 86

1. అసూరాః (వా.ప్ర.)

(9) ఆ యే విశ్వా స్వపత్యాని తస్థుః కృణ్వానాసో అమృతత్వాయ గాతుమ్ ।

మహ్నా మహద్భిః పృథివీ వి తస్థే మాతా పుత్రైరదితిర్ధాయసే వేః ॥ 87

(10) అధి శ్రియం ని దధుశ్చారుమస్మిన్ దివో యదక్షీ అమృతా అకృణ్వన్ ।

అధ క్షరన్తి సిన్ధవో న సృష్టాః ప్ర నీచీరగ్నే అరుషీరజా[1]నన్ ॥ 88

## సూక్తము—72

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) చ॥ కరముసఁజాల విత్తమును గల్గి పరేశ్వర మంత్రసూక్తులం
జిరము నిజాభిముఖ్యముగఁజేకొనుచీవు ధనప్రదాతవై
యురువుగ విత్తమెల్లెడల నోపికనెవ్వరికిత్తు, వారలుం
గరము ధనాధినాథులయి గాంత్రుప్రసిద్ధిని[1]లోకమంతటన్ ॥ 75

(2) చ॥ సుతుఁడువలెంబ్రి[2]యుండవగుశోభనవహ్నీ! సమస్తకీచక
ప్రత[3]తిని దాఁగి యుండుటను, బావన హవ్యములేమిదేవతా
వితతి శ్రమోద్ధదుఃఖమున వేఁగుచు నీవు వసించు దేశమున్
ధృతి[4]గని సంచరించి కనరే నినుఁ బావన! హవ్యవాహనా! ॥ 76

(3) చ॥ రుచిర మరుత్తులంద అతిరూఢిగ నాజ్యముతోడ నెంతయే
సుచితముగా శరత్త్రయము హోమముఁజేయఁగఁబుట్టి యాదరిం
చుచుఁదగు యజ్ఞనామముల సొంపుగ నీవొసఁగంగ వార లా
శుచియగు మోక్షమార్గమునుజూడరె జన్మ జరాదిహీనులై ॥ 77

(4) చ॥ గగనమునన్ ధరాస్థలినిఁగాంచ నదృశ్యుండవైన నిన్ను నా
సుగుణయుతుండు, శక్రుఁడతిశూరమరుద్గణమాది గల్గు నా
గగనచరుల్ నిజోక్తులను గౌరవమొప్పఁగ వేడియప్పుడే
సొగసగురావిలోపలను జొచ్చిన రుద్రుని నిన్నుఁజూడరే! ॥ 78

1. అరుషీరజనన్. (వ్రా.ప్ర.) 1. భూమిలోపలన్ (తొ.పా.) 2. ప్రియుండవగు, (తొ.పా.) 3. ప్రతతినివీనుఁడై వెలయ (తొ.పా.)
4. ధృతమతి సంచరింపఁగనరే (తొ.పా.)

(5) గీ॥ నిన్నెరింగియుండి నియతాత్ములగుదేవ, తతులునీకుఁ బెక్కునతులఁజేసి
సుతులఁగూడి యజ్ఞసంస్కారములఁజేసి, రశనములను మాని యనవరతము ॥ 79

(6) గీ॥ అన్ని యజ్ఞములను యజమానులందఱుఁ, బొందునటులఁజేయు ప్రోఁడవగుచు
నందువలన మాకు నన్నంబుసిద్ధించు, నగ్ని! వస్తువులకు నవనమిమ్ము ॥ 80

(7) క॥ జ్ఞాతవ్యార్థం బెఱుఁగుచుఁ, బూతమనుజ శోకమెల్లఁ బోఁగొట్టెడి వి
ఖ్యాతిగల నన్నుమీయుము, దూతవగుచు దేవతలకుఁ దూర్ణంబనలా! ॥ 81

(8) గీ॥ సర్వశుభ కర్మసాధక సప్తనదులు, భువిని బ్రవహించుచుండునీ పూర్ణదయను
నంగిరస్సులు గోవుల నందుకొనిరి, మానవులు పొందఁగల్గిరి మంచిపాల ॥ 82

(9,10) సీ॥ అమృతత్వసిద్ధికై నాదిత్యగణమెల్ల సర్వకర్మంబులఁ జలిపియుండెఁ
బెక్కుపుత్రులఁగల్గు చక్కనిపుడమియు నిత్యలోకమునకై నిలిచియుండె
శోభనశ్రీయుత శుభ యజమానుండు యజ్ఞాజ్యమునుగోరి యలరుచుండె
నమరలోకమునుండి యమరలోకంబంత యాగవేళకుఁబ్రీతి నరుగుచుండె
గీ॥ నగ్నిసంజాత సింషవు లధికవేగ, గమనమున దిక్కులంతటఁ గదలునట్టు
లగ్గిమంటలు దిక్కుల కరిఁగి యరిఁగి, భాసమానంబులగుచుండె భాగ్యమునను ॥ 83

## సూక్తమ్ — 73

### ఋషిః— పరాశరః శాక్త్యః

### దేవతా—అగ్నిః

### ఛందః—త్రిష్టుప్

(1) రయి[1]ర్న యః పితృవిత్తో వయోధాః సుప్రణీతిశ్చికితుషో న శాసుః ।

స్యోనశీరతిథిర్న ప్రీణానో హోతేవ సద్మ విధతో వి తారీత్ ॥ 89

(2) దేవో న యః సవితా సత్యమన్మా క్రత్వా నిపాతి వృజనాని విశ్వా ।

పురుప్రశస్తో అమతిర్న సత్య ఆత్మేవ శేవో[2] దిధిషాయ్యో భూత్ ॥ 90

1. రయిర్నయ (బ్రా.ప్ర.) 2. దధిషా (బ్రా.ప్ర.)

(3) దేవో న యః పృథివీం విశ్వధాయా ఉపక్షేతి హితమిత్రో న రాజా ।

పురః సదః శర్మసదో న వీరా అనవద్యా పతిజుష్టేవ నారీ ॥ 91

(4) తం త్వా నరో దమ ఆ నిత్యమిద్ధమగ్నే సచన్త క్షితిషు ధ్రువాసు ।

అధి ద్యుమ్నం ని దధుర్భూర్యస్మిన్ భవా విశ్వాయుర్ధరుణో రయీణామ్ ॥ 92

(5) వి పృక్షో అగ్నే మఘవానో అశ్యుర్వి సూరయో దదతో విశ్వమాయుః ।

సనేమ వాజం సమిథేష్వర్యో భాగం దేవేషు శ్రవసే దధానాః ॥ 93

(6) ఋతస్య హి ధేనవో వావశానాః స్మదూధ్నీః పీపయన్త ద్యుభక్తాః ।

పరావతః సుమతిం భిక్షమాణా వి సిన్ధవః సమయా సస్రురద్రిమ్ ॥ 94

(7) త్వే అగ్నే సుమతిం భిక్షమాణా దివి శ్రవో దధిరే యజ్ఞియాసః ।

నక్తా చ చక్రురుషసా విరూపే కృష్ణం చ వర్ణమరుణం చ సం ధుః ॥ 95

(8) యాన్ రాయే మర్తాన్త్సుషూదో అగ్నే తే స్యామ మఘవానో వయం చ ।

ఛాయేవ విశ్వం భువనం సిసక్ష్యాపప్రివాన్ రోదసీ అన్తరిక్షమ్ ॥ 96

(9) అర్వద్భిరగ్నే అర్వతో నృభిర్నౄన్ వీరైర్వీరాన్ వనుయామా త్వోతాః ।

ఈశానాసః పితృవిత్తస్య రాయో వి సూరయః శతహిమా నో అశ్యుః ॥ 97

(10) ఏతా తే అగ్న ఉచథాని వేధో జుష్టాని సన్తు మనసే హృదే చ ।

శకేమ రాయః సుధురో యమం తేऽధి శ్రవో దేవభక్తం దధానాః ॥ 98

## సూక్తము—73

### ఋషి—శక్తిపుత్రుఁడు పరాశరుఁడు

### దేవత—అగ్ని

(1) సీ॥ పైతృకధనమట్లు పరిఢవిల్లుచు సర్వజీవిత సుఖములఁ జేయునెవఁడొ!
బుధశాసనంబుల విధమున సన్మార్గగామియై నిత్యంబు కదలునెవఁడొ!
యర్ఘ్యపాద్యాదుల నర్చింపఁబడుచుండి సధికభక్తిని సర్చలొందునెవఁడొ!
[1]సద్ధావిర్వర్ధిత చారుగాత్రుండయి సోమయాజికినిల్లుఁ జూపునెవఁడొ!
గీ॥ కర్మజన్యఫలంబుల కర్మకర్త, పలెను యజమానగృహముల వాసికెక్క-
వృద్ధిఁ బొందించునెవ్వఁడు వివిధగతుల. నట్టియగ్నినిఁ గొనియాడనౌనుగాదె! ॥ 84

(2) సీ॥ చూడయోగ్యుండగు సూర్యదేవునిరీతిఁ గర్మల జగములఁ గాచువహ్ని
వివిధరూపములొందు విశ్వంభరంబోలి వ్యాపించియంతట వరలువహ్ని
యాత్మవలెంజాల నఖిలభూతములకు నానందవర్ధక మగునువహ్ని
నుచ్చావచంబుల నుచ్చకర్మలయందు నొక్కటిగానుండు నుచితవహ్ని
గీ॥ స్వర్గఫలహేతువగుచును సర్వయాజి, ధారణీయంబునగుచును దహనమూర్తి
నిండుతేజస్సుతోఁగూడి నిరతిశయము, [2]వెల్గుచుండునుగాకఁ దావేడ్కమీర ॥ 85

(3,4) సీ॥ జనమైత్రిగలరాజు జనసఖుండగునట్లు లఖిలప్రియుండయి యలరునగ్ని
వృష్టిచే సూర్యుఁడు విశ్వంబురీతిగా యజ్ఞంబులంబ్రోచు నట్టియగ్ని
పుత్రుని జనకుఁడు పోషించులాగున భక్తులరక్షించు పావనాగ్ని
పతిహితాంగనఁబోలి పరమపావన కర్మలందు యోగ్యుండగునట్టియగ్ని
గీ॥ నిశ్చల గ్రామములయందు నిఖిలయజ్ఞ, గృహములందును వేళలఁ గీర్తనీయ
చరుపురోడాశములనెల్ల శాంతిఁగొనుచు, ధనమునిచ్చునుగాక సంతసమెలర్ప ॥ 86

(5) గీ॥ స్తుతులుచేసినిన్ను శూరులాయుర్దాయ, మెల్లఁబొంది తా[3]మహీసభువిని
నెదిరిధనమునెల్ల నేపునఁగొనుచు స. ద్యాగములనొర్తునగ్ని హవ్యవాహ! ॥ 87

(6) ఉ॥ క్షీరమునిచ్చు గోగణము చిత్తవికాసము నొందఁజేయు చెం
తే రహినా కృశానునకు నేడ్తెరఁబాల నొసంగునట్లు పెం
పార సమస్త సింధువులు భవ్యమహీంధ్రములందుఁ బుట్టి నిం
డార జలంబులంగలిఁగి హవ్యనిమిత్తము పారుచుండెడున్ ॥ 88

---

1. సత్+హవి=సద్ధవి, సద్ధావి (సంధిలో మహాప్రాణము వైకల్పికము) వ.గో.కృ. 2. వెల్గుచుండెడుఁగావుత వేడ్కమీర (తొ.పా.)
3. తాము ధరణిలోన. (తొ.పా. యతిభంగము) వ.గో.కృ.

(7) గీ॥ నీదు మేలుకోరి నిర్జరుల్ హవ్యంబొసంగఁబవలురాత్రి సలిపి [1]శ్వేత
కృష్ణవర్ణములను సృష్టించియెవ్వాని, యందు నిల్పినారు హవ్యవాహ! ॥ 89

(8) గీ॥ అగ్నిహోత్రాది కర్మలనాచరించు, ధనము పొందెదమయ్య! యో దహనమూర్తి!
ఆతపక్లేశమున్ ఛత్రమడఁచునట్లు, శోకభారంబడంపుమో లోకమాన్య! ॥ 90

(9) ఉ॥ మామక పుత్రులంద ఱతిమన్ననలందుచు శత్రు వాజులన్
†గామ మెలర్పఁగొట్టి రిపునాశకులై [2]యలశత్రు విత్తమున్
నీమముతోడఁ జేకొనుచు నిత్యముపైతృకవిత్తమందుచున్
భూమిని రోగహీనులుగఁ బూర్ణవయస్కులుగా[3]ను వెల్గుతన్ ॥ 91

(10) గీ॥ మాసుసూక్తి నీకు మానసప్రియములై, సచ్చుఁగాక తుష్టినిచ్చుఁగాక
లేమిఁబోవఁజేయు కామితఫనమెల్ల, నీదునియతి మాకు నిలుచుఁగాక ॥ 92

1. కృష్ణ,శ్వేతవర్ణములను సృష్టించి (**తొ.పా.** "రాత్రిఁబవలు సలిపి" అని తొలత రాత్రిని పిదపఁబగలును పేర్కొన్న గ్రంథకర్త తదను **గుణముగా** "కృష్ణశ్వేత" శబ్దములనే తొలుతఁ బ్రయోగించి తిరిగి తానే "శ్వేతకృష్ణ" అని మార్పుచేసెను. "కృష్ణశ్వేత" సమాసముపయోగించుచో "శ్వే" సంయుక్తముచేత కృష్ణలోని "ష్ణ" గురువుగా మారి గణభంగమగునని భావించి "శ్వేత, కృష్ణవర్ణములను" అని మార్చివేసెను. కాని శ్రీ నేమానివారు "హవ్యంబొసంగ రాత్రిఁబవలు సలిపి శ్వేత.కృష్ణ వర్ణములను" అని పవలు రాత్రి "శబ్దములను రాత్రిఁ బవలు"గాఁ గ్రమముమార్చి ప్రయోగించి వ్రాతప్రతిలో వ్రాసిరి. వైజ్ఞానికముగాఁగూడఁ దొలుతఁ బవలు పిదప రాత్రియేగాని తొలుత రాత్రిఁ బిదపఁ బగలుకాదుగదా! ఈ సందర్భమునఁ "బవలురాత్రి" అని మార్పవచ్చును గాని రచయిత స్వయముగాఁ "కృష్ణశ్వేత" శబ్దములను "శ్వేతకృష్ణ శబ్దములుగా గణభంగదోష దృష్టితో మార్చెనేగాని "పవలు రాత్రి" "శ్వేతకృష్ణ" శబ్దములకున్న క్రమాన్వయము ప్రమాదవశమున గుర్తింపలేదు. కాఁగా మూలములోని "రాత్రిఁబవలు" శబ్దములను (1 సంపుటము. 259 పుట) బవలురాత్రి శబ్దములుగా సార్థకముగా సవరించుట జరిగినది. వ.గో.కృ.

† ఋగ్వేదము మూలమున "శతహిమా నః" అను పదముగలదు. నూరు హేమంతఋతువులు. నూరు పత్సరములు. హేమంతఋతువు ప్రాధాన్యముగఁజెప్పుటఁజేసి ఆర్యులు హిమవత్పర్వతప్రాంతవాసులనియూహింపఁదగును. లేదా ఆకాలమున పత్సరప్రారంభము హేమంతఋతువుతోనే అయియుండవలయును. అప్పటి మనుజుల పూర్ణాయుర్దాయము నూఱువత్సరములేకాని యజుర్వేద. అధ్యా. 3. (మంత్రము 62) "ఆయుషంజమదగ్నే....తన్నోఅస్తుత్ర్యాయుషం", అనుమంత్ర సందర్భమున శతపథబ్రాహ్మణమున జమదగ్ని, కాశ్యప శబ్దములు మానవనామములు కావనియు జమదగ్నియనగాఁ జక్షువనియు, కాశ్యపమనఁగా అంతః కరణమనియు వ్రాయఁబడి యున్నది. మీఁదఁజెప్పఁబడిన మంత్ర సందర్భమున (శత. కాం. 3. అ. 7) భవత్కృపయానోఽస్మాకం జమదగ్ని సంజ్ఞిక స్వచక్షుషః కాశ్యప్రాఖ్యస్య ప్రాణస్యచత్రాయుషంత్రిగుణమర్థాత్ త్రీణిశతాని వర్షాణి యావత్తావదాయురస్తు" అని మొదలగు వివరణములుగలదు. "ఓ జగదీశ్వర! నాచక్షుస్సు, మనస్సు మొదలగునవి మూఁడువందల సంవత్సరములుండుఁగాక" అని దీనిసారము. ఇట్టిప్రమాణములవల్ల (బ్రహ్మచర్యాది సునియమైర్మనుష్యైరేతఃత్రిగుణమాయుఃకర్తుం శక్యమస్తిమస్తీతి గమ్యతే) బ్రహ్మచర్యాది నియమములవలన మనుష్యులు 300 సంవత్సరములు జీవింపఁగలరని తేలుచున్నది. చూఁడు. "బిహారిలాల్" శాస్త్రి గారి "వేదములు" అనుగ్రంథము. (నే.వేం.న.శా.)

సూచన:—"ఆయుషం" ఇత్యాదిగాఁగల యజుర్వేదమంత్రమును శ్రీనేమానివారుటంకించిరి."త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్యత్ర్యాయుషమ్ । యద్దేవేషుత్ర్యాయుషం తన్నోఅస్తు త్ర్యాయుషమ్" అని అసలు మంత్రము. ఈమంత్రార్థము బ్రాహ్మణములవతరించు నాటికే యంతరించినట్లు కనిపించుచున్నది. వేదగతమైన శత హేమంతములు శతశరత్తులువంటి ప్రయోగముల యంతరార్థవిశేషాదులకై పీఠిక చూఁడనగును. వ.గో.కృ.

2. యజ్ఞవారిద్రవ్యముల్ (**తొ.పా.**) 3. గానొనర్చుమా! (**తొ.పా.**)

అనువాకః—13, సూక్తమ్—74

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ

(1) ఉపప్రయన్తో అధ్వరం మన్త్రం వోచేమాగ్నయే । ఆరే అస్మే చ శృణ్వతే ॥ 99

(2) యః స్నీహితీషు పూర్వ్యః సంజగ్మానాసు కృష్టిషు । అరక్షద్ దాశుషే గయమ్ ॥ 100

(3) ఉత బ్రువన్తు జన్తవ ఉదగ్నిర్వృత్రహాజని । ధనంజయో రణేరణే ॥ 101

(4) యస్య దూతో అసి క్షయే వేషి హవ్యాని వీతయే । దస్మత్ కృణోష్యధ్వరమ్ ॥ 102

(5) తమిత్ సుహవ్యమఙ్గిరః సుదేవం సహసో యహో । జనా ఆహుః సుబర్హిషమ్ ॥ 103

(6) ఆ చ వహాసి తాగ్ం ఇహ దేవాగ్ం ఉప ప్రశస్తయే । హవ్యా సుశ్చన్ద్ర వీతయే ॥ 104

(7) న యోరుపబ్దిరశ్వ్యః శృణ్వే రథస్య కచ్చన । యదగ్నే యాసి దూత్యమ్ ॥ 105

(8) త్వోతో వాజ్యహ్రయో ఽభి పూర్వస్మాదపరః । ప్ర దాశ్వాగ్ం అగ్నే అస్థాత్ ॥ 106

(9) ఉత ద్యుమత్ సువీర్యం బృహదగ్నే వివాససి । దేవేభ్యో దేవ దాశుషే ॥ 107

### అనువాకము—13, సూక్తము—74

### ఋషి—ఋగ్నపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—అగ్ని

(1) సీ॥ †జంతుహింసలేని జన్నంబు సేయుచు, నగ్నికై వచింతు మతులసూక్తి
నన్ని దేశములను నాశ్రయించెడునగ్ని, వినుచుగాక మా ప్రవిమలసూక్తి ॥ 93

(2,3,4,5,6,7) సీ॥ చంపనుద్దేశించి శత్రువులేతేర భక్తగృహంబుఁగాపాడునెవఁడొ!
ధర్మంబుగా శత్రుధనమును హరియించి స్తోత్రజాలమునకుఁ బాత్రుఁడెవఁడొ!
జలలను జవిఁజూడ భక్తగేహములందుఁ దిరముగనుండెడి దేవుఁడెవఁడొ!
చరుపురోడాశాదిచారు హవ్యంబులఁదెచ్చి దేవతలకు నిచ్చునెవ్వఁడొ!
గీ॥ త్రిదశులకు సూక్తులందించు దివ్యుఁడైన, దూతుఁడగుచును మారంబు తొలఁగుచుండ
[1]నెదుకఁబడనట్టి రథమున నెసఁగునెవఁడొ, యట్టియనలుండు సూక్తుల నందుఁగాక ॥ 94

* సంస్కృత మూలప్రతులలోఁగొన్నిట "గోతమోరాహూగణః" అని రాహూగణపుత్రుఁడు గోతముఁడుగాఁ బేర్కొనఁగా శ్రీ నేమానివారు (1వ సంపుటము 259 పుట) పంచమాధ్యాయము—74వ సూక్తమునకు ఋషి "ఋగ్నపుత్రుఁడు గోతముఁడు"గా వ్రాసిరి. వీరనుసరించిన ప్రతిలో నీఋషి భిన్నత్వముండియుండును. సంస్కృతములో 74వ సూక్తము మొదలు 93 సూక్తమువఱకు (93తో సహా) గోతమోరాహూగణః అనియే యుండఁగా శ్రీ నేమానివారి యనువాదములో 74 సూక్తము మొదలు 79వ సూక్తము వఱకు (79తో సహా) ఋగ్నపుత్రుఁడు గోతముఁడనియున్నది. 80వ సూక్తము నుంచే తెలుఁగనువాదములో విభిన్న ఋషులు పేర్కొనఁబడిరి. సంస్కృత వ్రాతప్రతిలో 74 సూక్తము మొదలు 90 సూక్తము వఱకు గౌతముఁడు ఋషిగా 91 సూక్తము నుంచి 93 సూక్తమువఱకు గోతముఁడు ఋషిగా నుటంకితమైనది. 74వ. సూక్తము మొదలుగా గోతముఁడు ఋగ్నపుత్రుఁడుగాఁ బేర్కొనఁబడినను 78వ. సూక్తానువాద (107) పద్యములో "రహూమునిగణ పుత్రకులము, గోతమాఖ్యులమగు మేము" అని పేర్కొను చూచ శ్రీ నేమానివా రేసంస్కృతమూల గ్రంథమునను సరించిరో యవగాహనమగుటలేదు. సాయనాచార్యుఁడుకూడ "రహూగణ" శబ్దమునే ప్రయోగించెనుగాని "రహూగణ" శబ్దమును ప్రయోగింపలేదు. ఈగోతముఁడు కూడ నొక్కఁడు కాక యిదే పేరుతోఁ బెక్కుఁడు "రహూమునిగణ" పుత్రులు గోతమ గణముగానున్నట్టు స్పష్టమగుచున్నది. రహూమునిగణ ఋషులకుఁబుట్టిన వారందఱును "గోతమ" నామముతోనే వ్యవహరింపఁబడినట్లున్నది. కాఁగా 74వ సూక్తముమొదలుగానున్న గోతమమహర్షులందఱునునేకైకులేయని భావింపనక్కఱలేదు. ఆయాసూక్త ద్రష్టలు విభిన్నులునుగావచ్చును. ఆంధ్రానువాదములో 80వ సూక్తమునకు ఋషిగా "రాహూవాన" పుత్రుఁడు గోతముఁడుగాను, 83వ సూక్తమునకు ఋషిగా రాహూవనపుత్రుఁడు గౌతముఁడును నుటంకింపఁబడిరి. (1వ సంపుటము 267,277 పుటలు చూఁడు.) గోతమ, గౌతమశాబ్దాలలో భిన్నత్వమున్నను నొకదానికొకటి తార్మారుగా నుటంకించిన సందర్భములు కూడఁగలవు. రాహూగణ-రాహూగణ-రహూగణ-రహూగణ-రాహూవాన-రాహూవన శబ్దములు పర్యాయపదములుగాఁగన్పించుచున్నవి. 78వ సూక్తములోని 5వ ఋక్కులో "రహూగణ" శబ్దముపయుక్తమైనను శ్రీనేమానివారు "రహూమునిగణ" అని "హూ" కారహ్రస్వ ప్రయోగమేచేసిరి. (చూఁడు 1వ. సంపుటము-5వ. అధ్యాయము-265 పుట.) ఈ సందర్భమున మూలమంత్రానుసారముగా "పుణ్యతమరహూమునిగణపుత్రకులము" అని వ్రాసినను దేటగీతి పాదలక్షణమునకు భంగమేర్పడదు. అయినను శ్రీనేమానివారు "రహూముని" అని "హూ" హ్రస్వరూపప్రయోగముచేయుట గమనింపఁదగినవిషయము.—వ.గో.కృ.

† జంతుహింసలేని జన్నము—జంతుహింసలేనియజ్ఞము జరుగుచున్నట్లు సాయనాచార్యుఁడు మంత్రమునకు భాష్యమువ్రాసినాడు. కాని మరికొన్ని ఋక్కులకు యజ్ఞములయందుఁబశుమారణమున్నట్లు వర్ణించినారు. శాకపూణి, నిరుక్తము అను ఋగ్వేద భాష్యములకిది విరుద్ధముగానున్నట్లు తోచుచున్నది. (నే.వేం.న.శా.)

సూచన-పశుమారణమున్నట్లు వర్ణింపఁబడిన ఋక్కులకు మారణముతో సంబంధములేని యర్థములున్నవి. ఋగ్వేదభాష్యములననుసరించి వేద మంత్రార్థముల నిర్ణయించుట వేదములకంటె భాష్యములు ప్రామాణికములని శ్రీ నేమానివారు భావించుట సరికాదు. ఇది వేదవిజ్ఞాన విరుద్ధము. ఆర్షఖగోళవిజ్ఞానమునకిది గొడ్డలిపెట్టువంటిది. (చూఁడు.పీఠిక) వ.గో.కృ.

1. నెదుకఁబడని రథమున నెసఁగునెవఁడొ! (తొ.పా.)

(8) క॥ అధికారరహితుఁడిచ్చిన, మధురహవిస్సులనుగూడ మాన్యుఁడవగుచుం
ప్రథమాన సంతసంబున, విధిగా గ్రహియింపుమయ్య! వీరవతంసా! ॥ 95

(9) గీ॥ నిర్జరాళికి హవ్యంబు నిత్యమిచ్చి, భక్తపాళికి ధనము నాసక్తిఁగూర్చి
వెలుఁగుచున్నావు పుడమిని వివిధగతుల, నమరగణముఖ్య దేవ! యోయగ్నిదేవ! ॥ 96

## సూక్తమ్—75

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—అగ్నిః

ఛందః — గాయత్రీ

(1) జు[1]షస్వ సప్రథస్తమం వచో దేవప్సరస్తమమ్ । హవ్యా జుహ్వాన ఆసని ॥ 108

(2) అథా తే అఙ్గిరస్తమాగ్నే వేధస్తమ ప్రియమ్ । వోచేమ బ్రహ్మ సానసి ॥ 109

(3) కస్తే జామిర్జనానామగ్నే కో దాశ్వధ్వరః । కో హ కస్మిన్నసి శ్రితః ॥ 110

(4) త్వం జామిర్జనానామగ్నే మిత్రో అసి ప్రియః । సఖా సఖిభ్య ఈడ్యః ॥ 111

(5) యజా నో మిత్రావరుణా యజా దేవాగ్ం ఋతం బృహత్ । అగ్నే యక్షి స్వం దమమ్ ॥ 112

## సూక్తము — 75

ఋషి — ఋగ్నపుత్రుఁడు గోతముఁడు†

దేవత — అగ్ని

(1,2,3, 4,5) సీ॥ స్తోత్రలక్షణ హవిస్తోమంబు చెవులతో నగ్నిహోత్రుఁడ!యాలకింపుమయ్య!
డెందంబునకును నానందంబుఁ గలిఁగించు సుందరస్తోత్రంబు పొందుమయ్య!
సర్వాధికుండవై సకలంబుగనుగొంచు నెచ్చటనుందువోయెరుగమయ్య!
మిత్రావరుణదేవ మైత్రినిబొందుచు సత్యయాగంబులఁ జలుపుమయ్య!

1.ఉపస్వ (వా.ప్ర.) † ఋషివిషయమై వివరములకు 200 పుట 74 వ సూక్తము క్రింది ఫుట్‌నోట్ విషయము చూడఁదగును .వ.గో.కృ.

*గీ॥ అగ్నిదేవుఁడా! నీవు మా కఖిలశుభము, లొనరఁజేయంగ మిత్రావరుణులు నింద్రుఁ
డాదిగాఁగల్గు దేవాళినర్చచేయ, యజ్ఞగృహముల గూఢత నలరుమయ్య! ॥ 97

## సూక్తమ్ — 76

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) కా త ఉపేతిర్మనసో వరాయ భువదగ్నే శంతమా కా మనీషా ।

కో వా యజ్ఞైః పరి దక్షం త ఆప కేన వా తే మనసా దాశేమ ॥ 113

(2) ఏహ్యగ్న ఇహ హోతా ని షీదా[1]దబ్ధః సు పురఏతా భవా నః ।

అవతాం త్వా రోదసీ విశ్వమిన్వే యజా మహే సౌమనసాయ దేవాన్ ॥ 114

(3) ప్ర సు విశ్వాన్ రక్షసో ధక్ష్యగ్నే భవా యజ్ఞానామభిశస్తిపావా ।

అథా వహ సోమపతిం హరిభ్యామాతిథ్యమస్మై చకృమా సుదావ్నే ॥ 115

(4) ప్రజావతా వచసా వహ్నిరాసా[2]ऽऽ చ హువే ని చ సత్సీహ దేవైః ।

వేషి హోత్రముత పోత్రం యజత్ర బోధి ప్రయన్తర్జనితర్వసూనామ్ ॥ 116

(5) యథా విప్రస్య మనుషో హవిర్భిర్దేవాగ్ం అయజః కవిభిః కవిః సన్ ।

ఏవా హోతః సత్యతర త్వమద్యాగ్నే మన్ద్రయా జుహ్వా యాజస్వ ॥ 117

* ఉత్తరభాగపూరణకర్త, వాఙ్మయమహాధ్యక్ష, డాక్టర్. వడ్లమూడి గోపాలకృష్ణయ్య "కళా-ప్రపూర్ణ". ఋగ్వేదము ప్రథమాష్టకము పంచమాధ్యాయములోని 75వ సూక్తములో మొత్తమయిదు ఋక్కులుండఁగా నాలుగు ఋక్కులు మాత్రమే శ్రీ నేమానివారు నాలుగు సీసపాదములలో ననువదించి యయిదవఋక్కును గీతపద్యముగా ననువదించుట మఱచిపోయిరి. (చూఁడు 1వ. సంపుటము 261వ పుట.) కాఁగా నయిదవ ఋక్కును దేటగీతిగా ననువదించి యీ సీసపద్యమును బూరించితిని-వ.గో.కృ.

1 షీదదబ్ధః (వా.ప్ర.) 2. రాసాచ (వా.ప్ర.)

## సూక్తము 76

### ఋషి—ఋగ్ణపుత్రుఁడు గోతముఁడు†

### దేవత—అగ్ని

(1) గీ॥ నీకుఁబూజల నర్పింప నేరమయ్యా!, నిన్నుఁ గొనియాడు మార్గము నెఱుఁగమయ్యా!
కర్మఫలములు మాకెట్లు కలుఁగునయ్యా!, సర్వముం దెలియుటకు మది[1]చాలదగ్ని![2] ॥ 98

(2) ఉ॥ వచ్చినవాఁడవై మిగుల [3]వర్ణనకెక్కిన దేవతాళికిన్
మెచ్చగఁ బూజఁజేయుచు నమేయ పరాక్రమ వైరిపుత్రులం
జొచ్చుచు నింద్రదేవునకు సుందరహవ్యము సంతసంబుతో
నిచ్చెడు నిన్ననంతముగ నిద్ధధరాతలమెల్లఁ గాఁచుతన్ ॥ 99

(3,4) మ॥ శుభమంత్రంబులఁ బూజఁజేయుదు నినున్ శోభాయమానుండవై
యభిమానంబుఁ దలిర్ప రమ్మిటకు నీవానిర్జరశ్రేణితోఁ
బ్రభలం దేలెడు యజ్ఞభాగముల సంభావించి గైకొంటకై
శుభదా! వచ్చి ధనంబు యాగమునకై శోభిల్లఁగానీయుమా! ॥ 100

(5) గీ॥ కవివియగుటవలనఁ గవివరులంగూడి, జన్నములను బ్రీతి జరిపినట్లు
స్రుక్కుఁజేతఁబూని శుచికరయజ్ఞంబుఁ, జేయుమయ్య! ప్రీతిఁజేయుమయ్య! ॥ 101

## సూక్తమ్. 77

### ఋషిః—గోతమో రాహూగణః

### దేవతా. అగ్నిః

### ఛందః—త్రిష్టుప్

(1) కథా దాశేమాగ్నయే కాస్మై దేవజుష్టోచ్యతే భామినే గీః ।
యో మర్త్యేష్వమృత ఋతావా హోతా యజిష్ఠ ఇత్ కృణోతి దేవాన్ ॥ 118

† ఋషికి సంబంధించిన విశేషవిషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తము క్రింది ఫుట్‌నోట్ చూచుకొనవలయును. వ.గో.కృ.
1. ఈ తేటగీతి రెండవపాదములోఁ బంచలఘుగణమింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ. 2. చాలదయ్య! (తొ.పా.)
3. వాడిమిఁగాంచిన (తొ.పా.)

(2) యో అధ్వరేషు శంతమ ఋతావా హోతా తమూ నమోభిరా కృణుధ్వమ్ ।

అగ్నిర్యద్ వేర్మర్తాయ దేవాన్త్స చా బోధాతి మనసా యజాతి ॥ 119

(3) స హి క్రతుః స మర్యః స సాధుర్మిత్రో న భూదద్భుతస్య రథీః ।

తం మేధేషు ప్రథమం దేవయన్తీర్విశ ఉప బ్రువతే దస్మమారీః ॥ 120

(4) స నో నృణాం నృతమో రిశాదా అగ్నిర్గిరోఽవసా వేతు ధీతిమ్ ।

తనా చ యే మఘవానః శవిష్ఠా వాజప్రసూతా ఇషయన్త మన్మ ॥ 121

(5) ఏవాగ్నిర్గోతమేభిరృతావా విప్రేభిరస్తోష్ట జాతవేదాః ।

స ఏషు ద్యుమ్నం పీపయత్ స వాజం స పుష్టిం యాతి జోషమా చికిత్వాన్ ॥ 122

## సూక్తము—77

ఋషి—ఋగ్ణపుత్రుఁడు గోతముఁడు†

దేవత—అగ్ని

(1) క॥ పావకః నీకై యజ్ఞము, గావింపఁగలేము నుతుల కౌశల్యమునన్
భావింప శక్యమగునపె, హావిష్యంబందుకొనుము హవ్యవహుండా! ॥ 102

(2) ఉ॥ యాగములందు సౌఖ్యకరుఁడంచిత సత్యధురీణుఁడంగనా
భాగములందువాఁడునగు పావకుఁడార్య నమస్క్రియాతతిన్
వేగమెగొంచు మానవులువీఁక యొనర్చెడి యాగకర్మకై
[1]రాగమెలర్ప దేవతల రాజిలఁబిల్వ సమర్థుఁడేకదా! ॥ 103

† ఋషికి సంబంధించిన విశేష విషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తముక్రింది ఫుట్‌నోట్ చూడవలయును. వ.గో.కృ.

1. రాఁగలదేవ బృందమును (తొ.పా.)

(3) చ॥ గురుతర విత్తసంచయముఁ గోరికతీరఁగ నిచ్చువాని ని
బ్బరముగ యాగదీక్షితుని భర్తను హర్తను లోకరక్షకుం
బరమ సఖుండు విత్తమును బంచెడు రీతిగ నర్థమెప్పుడున్
విరివిగసేయువాని, నినువేగమె కొల్వరె భక్తులెప్పుడున్ ॥ 104

(4) చ॥ మనుజులలోన నుత్తముఁడః మర్దిత శత్రుగణుండః సంస్తుతుల్
ఘనముగ నాలకించుటకుఁ గాంతిని గల్గుచు వచ్చి ప్రీతితో
వినతులొనర్చు యాజ్ఞికుల విందులకుంజని సౌఖ్యమొందుచుం
జనులకు నన్నదానములఁ జాలఁగజేయుము హవ్యవాహనాః ॥ 105

(5) గీ॥ గోతమస్తోత్ర పాత్రుఁడః గోతమాది, సరస మునులిచ్చు సోమరసంబుఁగ్రోలి
చరుపురోడాశలక్షణచారుహవ్య, ములను గ్రహియించి పొందుము ముదమునెంతొ ॥ 106

## సూక్తమ్—78

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ

(1) అభి త్వా గోతమా గిరా జాతవేదో విచర్షణే [1]ద్యుమ్నైరభి ప్ర ణోనుమః ॥ 123

(2) తము త్వా గోతమో గిరా రాయస్కామో దువస్యతి । ద్యుమ్నైరభి ప్ర ణోనుమః ॥ 124

(3) తము త్వా వాజసాతమమఙ్గిరస్వద్ధవామహే । ద్యుమ్నైరభి ప్ర ణోనుమః ॥ 125

(4) తము త్వా వృత్రహన్తమం యో దస్యూగ్ంరవధూనుషే । ద్యుమ్నైరభి ప్ర ణోనుమః ॥ 126

(5) అవోచామ [2]రహూగణా అగ్నయే మధుమద్ వచః । ద్యుమ్నైరభి ప్ర ణోనుమః ॥ 127

1. దుమ్నై (బ్రా.ప్ర.) 2. "రాహూగణ" "రహూగణ" శబ్దములు పర్యాయపదములు-చూఁడు 200 పుట ఋషిఫుట్‌నోటు. వ.గో.కృ.

## సూక్తము—78

ఋషి—ఋగ్నపుత్రుఁడగు గోతముఁడు†

దేవత—అగ్ని

(1,2,3, 4,5) సీ॥ గుణవిరాజిత! మహాగోతములగు మేము బహుమంత్రముల నిన్నుఁ బలుకఁగలము
గోతమమునులమై గూఢ మంత్రంబుల నభిమతములనెల్ల నడుగఁగలము
సత్యాంగిరసులమై సత్యసూక్తులతోడఁ బ్రీతులమై నిన్నుఁ బిలువఁగలము
దస్యుగణచ్ఛేద దక్షుండవగునిన్నుఁ బాపముఁబోఁగొట్టఁ బాడఁగలము
గీ॥ పుణ్యతమ రహుముని[1]గణపుత్రకులము, గోతమాఖ్యులమగు మేము ప్రీతితోఁడ
మంత్రములఁ బల్కుచున్నాము మహితతేజ!, యర్థమిచ్చుచు రక్షింపు మగ్నిదేవ! ॥ 107

## సూక్తమ్—79

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—1—3 అగ్నిః మధ్యమోఽగ్నిర్వా, 4—12 అగ్నిః

ఛందః—1—3 త్రిష్టుప్, 4—6 ఉష్ణిక్, 7—12 గాయత్రీ

(1) హిరణ్యకేశో రజసో విసారేఽహిర్ధునిర్వాత ఇవ ధ్రజీమాన్ ।
శుచిభ్రాజా ఉషసో నవేదా యశస్వతీరపస్యువో న సత్యాః ॥ 128

(2) ఆ తే సుపర్ణా అమినన్తగ్ం ఏవైః కృష్ణో నోనావ వృషభో యదీదమ్ ।
శివాభిర్న స్మయమానాభిరాగాత్ పతన్తి మిహః స్తనయన్త్యభ్రా ॥ 129

(3) యదీమృతస్య పయసా పియానో నయన్నృతస్య పథిభీ రజిష్ఠైః ।
అర్యమా మిత్రో వరుణః పరిజ్మా త్వచం పృఞ్చన్త్యుపరస్య యోనౌ ॥ 130

† ఋషి విషయిక విశేషములకు 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తముక్రింది ఫుట్‌నోట్ చదువుకొనవలయును. వ.గో.కృ.

1. రహుముని-రహూముని-రాహుముని

(4) అగ్నే వాజస్య గోమత ఈశానః సహసో యహో । అస్మే ధేహి జాతవేదో మహి శ్రవః ॥ 131

(5) స ఇధానో వసుష్కవిరగ్నిరీళేన్యో గిరా । రేవదస్మభ్యం పుర్వణీక దీదిహి ॥ 132

(6) క్షపో రాజన్నుత త్మనాగ్నే వస్తోరుతోషసః । స తిగ్మజమ్భ రక్షసో దహ ప్రతి ॥ 133

(7) అవా నో అగ్న ఊతిభిర్గాయత్రస్య ప్రభర్మణి । విశ్వాసు ధీషు వన్ద్య ॥ 134

(8) ఆ నో అగ్నే రయిం భర సత్రాసాహం వరేణ్యమ్ । విశ్వాసు పృత్సు దుష్టరమ్ ॥ 135

(9) ఆ నో అగ్నే సుచేతునా రయిం విశ్వాయుపోషసమ్ । మార్డీకం ధేహి జీవసే ॥ 136

(10) ప్ర పూతాస్తిగ్మశోచిషే వాచో గోతమాగ్నయే । భరస్వ సుమ్నయుర్గిరః ॥ 137

(11) యో నో అగ్నేऽభిదాసత్యన్తి దూరే పదీష్టసః । అస్మాకమిద్ వృధే భవ ॥ 138

(12) సహస్రాక్షో విచర్షణిరగ్నీ[1] రక్షాంసి సేధతి । హోతా గృణీత ఉక్థ్యః 139

## సూక్తము—79

### ఋషి—ఋగ్నపుత్రుఁడు గోతముఁడు†

### దేవత—అగ్ని

(1,2) సీ॥ సింగారమగునట్టి బంగారుమంటనా [1]కనకకేశంబులు గలుగువానిఁ
గంపితమేఘుఁడౌ గాలినిబోలుచు శీఘ్రంబు జగతిని జెలఁగువాని
వారిదంబులనుండి వైద్యుతాగ్ని జనించువేళల నధికంబు వెలుఁగువానిఁ
గల్యాదేవికి [2]నెఱుకగాని నీరదవారి నిస్సరణక్రియ నేర్పువాని
గీ॥ నిజకిరణరాశిచే నీటినిచ్చువాని, జలముచేనిండుకొనియుండు జలదమాల
యందు గర్జనఁబుట్టించి యలరుచుండు, నట్టి నినునగ్నీ! స్మరియింతు మాదరమున ॥ 108

1. వక్షాంసి (వ్రా.ప్ర.) † ఋషికిసంబంధించిన విశేషవిషయములకై 200 పుటలో తెలుఁగు 74వ సూక్తముక్రింది ఋషిఫుట్‌నోటు చూడనగును వ.గో.శ్.  1. కనకేశంబులు (వ్రా.ప్ర.పా.)  2. ఇక్కడఁ బంచలఘుగణ మింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.శ్.

(3) ఉ॥ వానలవారిచేతను సమస్తము జీవులఁదృప్తిఁ దేల్చుచున్
స్నానము పానముండును చల్లగఁ జేసెదునట్లొనర్చుచుం
బూని మరుద్గణం బుదకభూమిని గట్టిగఁ గొట్టునట్లుగా
మానుగఁజేయుచున్ విబుధమాన్యుఁడ వైతివి నీవు పావకా! ॥ 109

(4) క॥ బలపుత్రుఁడు గోధనముల, నలరెడు సర్వేశ్వరుండు హవ్యవహుం డ
గ్గలముగ బలమున్ ధనముం, జలియింపక యిచ్చుఁగాకఁ జయ్యనమాకున్ ॥ 110

(5,6,7,8, 9,10,11,12) సీ॥ దీపనశీలుండు దివిజాళివినుతుండు రాత్రిందివంబులు రగులువాఁడు
మంత్రవర్ణితుఁడు సమ్మాన్యచారిత్రుండు సుఖహేతుభూతుండు శోభనుండు
వేఁడిమంటలవాఁడు వేల్పులకెకిమీడు శత్రుసంహననుండు సర్వదర్శి
రాక్షససంహర్త రక్షకులకుభర్త వాఁడిమయూఖుండు వేఁడివేల్పు
గీ॥ విశ్వసంతోషదుఁడు చతుర్వేదవేద్యుఁ, డమితధనదాత పురుషుల కన్నదాత
యంగనాలక్షణాన్వితుఁ డమరదూతుఁ, డైన దహనుండు భక్తులఁబూనుఁగాక ॥ 111

## సూక్తమ్—80

ఋషిః—గోతమో రాహూగణః

* దేవతా—ఇంద్రః, 16-ఇంద్రః, (అథర్వా, మనుః దధ్యఙ్చ)

ఛందః—పంక్తిః

(1) ఇత్థా హి సోమ ఇన్మదే బ్రహ్మా చకార వర్ధనమ్ ।
శవిష్ఠ వజ్రిన్నోజసా పృథివ్యా నిః [1]శశా అహిమర్చన్నను స్వరాజ్యమ్ ॥ 140

(2) స త్వామదద్ వృషా మదః సోమః శ్యేనాభృతః సుతః ।
యేనా వృత్రం నిరద్భ్యో జఘన్థ వజ్రిన్నోజసార్చన్నను స్వరాజ్యమ్ ॥ 141

* ఈ 80వ సూక్తమునకున్న దేవత విషయమై యింద్రుఁడే దేవతగాఁ బెక్కుమంది పేర్కొన్నను బరిశీలింపఁగా అథర్వ, మను, దధుల సిద్ధాంతము ప్రకార మీసూక్తములోని 16వ ఋక్కునకు మాత్రమే ఇంద్రుఁడు దేవత అనియు మిగిలిన 15 ఋక్కులకు సోముఁడు దేవతయనియుఁదేలుచున్నది. కాని అథర్వ-మను-దధుల మతాంతరత్వమును బేర్కొన్న గ్రంథములలో సైతము మిగిలిన 15ఋక్కుల సోమదైవత్వముటంకింపఁబడలేదు. ఇది ప్రమాదముకాఁదగును. అన్ని ఋక్కులకును నగ్నియే దేవతగా శ్రీ నేమానివారికి లభించినప్రతిలో నున్నట్లు కనిపించుచున్నది. వ.గో.కృ. 1. ఇశా (వా.ప్ర.)

(3) ప్రేహ్యభీహి ధృష్ణుహి న తే వజ్రో ని యంసతే ।

ఇన్ద్ర నృమ్ణం హి తే శవో హనో వృత్రం జయా అపో ऽర్చన్నను స్వరాజ్యమ్ ॥ 142

(4) నిరిన్ద్ర భూమ్యా అధి వృత్రం జఘన్థ నిర్దివః ।

సృజా మరుత్వతీరవ జీవధన్యా ఇమా అపో ऽర్చన్నను స్వరాజ్యమ్ ॥ 143

(5) ఇన్ద్రో వృత్రస్య దోధతః సానుం వజ్రేణ హీళితః ।

అభిక్రమ్యావ జిఘ్నతే ऽపః సర్మాయ చోదయ న్నర్చన్నను స్వరాజ్యమ్ ॥ 144

(6) అధి సానౌ ని జిఘ్నతే వజ్రేణ శతపర్వణా ।

మన్దాన ఇన్ద్రో అన్ధసః సఖిభ్యో గాతుమిచ్ఛత్యర్చన్నను స్వరాజ్యమ్ ॥ 145

(7) ఇన్ద్ర తుభ్యమిదద్రివో ऽనుత్తం వజ్రిన్ వీర్యమ్ ।

యద్ధ త్యం మాయినం మృగం తము త్వం మాయయావధీరర్చన్నను స్వరాజ్యమ్ ॥ 146

(8) వి తే వజ్రాసో అస్థిరన్నవతిం నావ్యాః అను ।

మహత్ త ఇన్ద్ర వీర్యం బాహ్వోస్తే బలం హితమర్చన్నను స్వరాజ్యమ్ ॥ 147

(9) సహస్రం సాకమర్చత పరి ష్టోభత[1] వింశతిః ।

శతైనమన్వనోనవురిన్ద్రాయ బ్రహ్మోద్యతమర్చన్నను స్వరాజ్యమ్ ॥ 148

(10) ఇన్ద్రో వృత్రస్య తవిషీం నిరహన్త్సహసా సహః ।

మహత్ తదస్య పౌంస్యం వృత్రం జఘన్వాగ్ం అసృజదర్చన్నను స్వరాజ్యమ్ ॥ 149

1. పరిష్టోభత (ప్రా.ప్ర.)

(11) ఇమే చిత్ తవ మన్యవే వేపేతే భియసా మహీ ।

యదిన్ద్ర వజ్రిన్నోజసా వృత్రం మరుత్వాగ్ం అవధీరర్చన్ననుస్వరాజ్యమ్ ॥ 150

(12) న వేపసా న తన్యతేన్ద్రం వృత్రో వి బీభయత్ ।

అభ్యేనం వజ్ర ఆయసః [1]సహస్రభృష్టిరాయతార్చన్ను స్వరాజ్యమ్ ॥ 151

(13) యద్ వృత్రం తవ చాశనిం వజ్రేణ సమయోధయః ।

అహిమిన్ద్ర జిఘాంసతో దివితే [2]బద్బధే శవో ఽర్చన్ను స్వరాజ్యమ్ ॥ 152

(14) అభిష్టనే తే అద్రివో యత్ స్థా జగచ్చ రేజతే ।

త్వష్టా చిత్ తవ మన్యవ ఇన్ద్ర వేవిజ్యతే భియార్చన్ను స్వరాజ్యమ్ ॥ 153

(15) నహి ను యాదధీమసీన్ద్రం కో వీర్యా పరః ।

తస్మిన్నృమ్ణముత క్రతుం దేవా ఓజాంసి సందధురర్చన్ను స్వరాజ్యమ్ ॥ 154

(16) యామథర్వా మనుష్పితా దధ్యఙ్ ధియమత్నత ।

తస్మిన్ బ్రహ్మాణి పూర్వథేన్ద్ర ఉక్థా సమగ్మతార్చన్ను స్వరాజ్యమ్ ॥ 155

ఇతి
ప్రథమోఽష్టకే పఞ్చమోఽధ్యాయ
స్సమాప్తః

1. సదస్ర (బ్రా.ప్ర.) 2. తద్వధే (బ్రా.ప్ర.)

## సూక్తము—80

### ఋషి—రాహూవానపుత్రుఁడు గోతముఁడు‡

### దేవత—అగ్ని*

(1) ఉ॥ సోమరసంబునాని తగసూక్తులఁబాడిరి బ్రహ్మలందుచే
భీముఁడు వృత్రరాక్షసుఁడు భీతినిబొంది గతించెనప్పుడే
భీమబలుండవై యఖిలభీతినివీడి సురాధిపత్యముం
గామనమీర నిల్పితివి కల్మషనాశక! నీవు పావకా! ॥ 112

(2) గీ॥ హర్షమదవర్ధకంబగు నమలసోమ, †రసముగ్రోలుటచే నీవు రాజువగుచుఁ
బగతుఁ, దునుమాడుదువుగాక బలముచేత, సోమరసమేమిసేయదు ? సూరివినుత! 113

(3) గీ॥ వహ్నీ! తావకవజ్రంబు వరలుచుండు, బలము దొడ్డసి పురుషాభిభావకంబు
కాన శత్రువులం జంపఁబూనినీవు, జలము తెప్పింపు మెంతైనఁ జాఁగులేక ॥ 114

(4,5) గీ॥ వజ్రధారవలన వైరినిబరిమార్చి. వాయుసహితమైన వారినిమ్ము
జీవనమునమమ్ము జీవింపఁజేసిన, దృప్తినొందఁగలము దివిజదూత! ॥ 115

(6) క॥ సూరంచులతో వెలసెడు, చారు పవినిగొంచు నీవు శత్రుహతకునిన్
వీరుఁడ! యింద్రుఁడ! దునుముచు, సారముగలనన్నమిమ్ముఁ జయ్యనమాకున్ ॥ 116

(7) క॥ మాయామయ దానవపతి, మాయలకున్ దొరకనట్టి మాయలచేతన్
సాయమునుగొనక యగ్నీ!, యాయుధములఁ గొట్టవేమి యరివారములన్ ॥ 117

‡ ఋషి విశేషవిషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తము ఋషిఫుట్‌నోటు చూడవలయు. వ.గో.కృ.

* సంస్కృతమూలములో నీ సూక్తమునకు నింద్రుఁడు దేవతగాఁ బేర్కొనఁబడినది. తొలి 15 ఋక్కులను బరిశీలింప సోమదైవత్వము కనిపించుచున్నది. కాని నేమానివా రీసూక్తమంతటికిని నగ్ని దేవతగా నుటంకించినను గొన్ని పద్యములలో నింద్రదైవత్వ ప్రసక్తియుఁగలదు. శ్రీ నేమానివా రీసూక్తమునకు నగ్నిదేవతగాఁబేర్కొన్నను నింద్రునితోపాటు నాయగ్నిని వజ్రధారిగ వర్ణించుట పరిశీలింపవలసిన విషయము. వ.గో.కృ.

† యజ్ఞవిద్వేషులసంఖ్య యధికమగుటచేఁ బారసీకార్యులు పరాజితులైనపుడు పలాయనమే కాని వేరుగతి లేకపోయినది. అప్పుడు పారసీకార్యులు సోమయాగమును దేవతలను దిట్టసాగిరి. పిమ్మట సోమయాజ జనితమగు బ్రహ్మానందమును విడువఁజాలక తద్యాగమును చేయలేకపోయిరి. సోమలతలు వారికాదేశమున దొరుకనందునఁ దత్తుల్యములగు వనస్పతుల వాడఁజొచ్చిరి. కాని వారిలోఁ గొందఱు సంస్కర్తలు హైందవార్యులయందుఁ దమకుఁగలద్వేషమున సోమమును దిరస్కరించిరి. ఇట్లుండఁ గొన్నాళ్ళకు పారసీకార్య వీరుఁడగు జొరాష్టరు (zoraster) స్వప్నములో సోమ పురుషుఁడు తన తేజోదేహముతోఁ గనపడెను. అపుడు జొరాష్టరు "నీవెవఁడవు? ఏల నీ కాంతిశరీరముతో వచ్చితివి" అని ప్రశ్నించెను. సోముఁడు "నేను సోమపురుషుఁడను, పూర్వము మీ పూర్వులెట్లు నన్నుఁబూచించిరో యిపుడీ సంస్కర్తలుకూడ నన్నుఁబూజింపవలయును." అనెను. తర్వాత జొరాష్టరు సోమునకు నమస్కరించి సోమలతలను దెప్పించి తనతోటలో నాటించి ప్రాణప్రతిష్ఠ చేయించెను. సోమయాగమును యథావిధిగాఁ జేయించెను" అనుకథ చండికాపురాణములయందుఁగలదు. చూచితిరా! ఆర్యవంశీయులారా! సోమజనానందమెట్టి మహిమగలదో. సోమరసమంటెట్టి మహిమయులేకయుండిన తనను ద్వేషించువారిచేతను బూజింపఁబడుచువచ్చెను. నే॥వేం॥న॥శాస్త్రి

(8) సీ॥ ప్రాచీనమేయవి పెక్కురూపములను, బొంది వృత్రుని బరిమార్చి పుడమిపైని
నదుల సాధ్యములంజేసి నాకదేవ!, వారి ప్రళయము పోఁగొట్టి తౌరనీవు ॥ 118

(9) చ॥ మనుజ సహస్రమొక్క పరిమానుగఁ బూజలుసల్ప మానవ
ప్రణుత నవగ్వదాదిగల పావనవింశతి యాగ దీక్షితుల్
పనిఁగొనియర్చలన్ జరుప భవ్యమునీశ్వరు లన్నమీయఁగన్
ఘనుఁడగు నింద్రుఁడెల్లెడలఁ గారియఁబెట్టెఁడె వృత్రశత్రునిన్ ॥ 119

(10) గీ॥ ఆయుధంబువలన నాయుధంబులఁగొట్టి, బలమువలన శత్రుబలముఁద్రుంచి
వైరిపక్షమైన వారినిదెప్పించి, యమరపతిగనిలిచె నమరరాజు ॥ 120

(11) గీ॥ నీదుకోపంబుఁ గనుఁగొని నిఖిలమైన, గగనభాగంబు భూమియుఁ గంపమొందె
బహు మరుద్గణమైత్రిని బడసిదేవ!, వైరిఁదునుమాడి స్వర్గంబు వడసితీవు ॥ 121

(12) గీ॥ వైరికృత్యములకు వగవక ఘోరంపు, గర్జనంబులకును గదలకుండ
వింద్రుఁడంపినట్టి †యినుప వజ్రంబుతో, వైరిఁగొట్టితీవు వాసవుండ! ॥ 122

(13) క॥ ఘనవజ్రముఁ జేతన్గొని[1], మునువడి వాసవుఁడు వృత్రు ముక్కలుసేయం
గనదింద్ర దేవబలముం, గొనియాడిరి దివిజవరులు [2]"కో!కో!" యనుచున్ ॥ 123

(14) ఉ॥ తావక సింహనాద జనితారవమున్ విని సర్వజంగమ
స్థావరరూప లోకములు చాలుగఁ గంపమునొందె వాసవా!
తావక కోపవహ్నిఁగని ధన్యతముండగు వజ్రకర్తయున్
జీవము ఓడియుండెఁగద చిత్రము నీదుమహత్త్వ మెంచఁగన్ ॥ 124

† ఈ సందర్భములో స్కాంధభాష్యములో "ఆయసః లోహమయః గమనశీలోవా" అని రెండర్థములు వ్రాయఁగా సాయను ననుసరించి శ్రీ నేమానివారు "ఇనుపవజ్ర"మని యనువదించిరి. వజ్రమినుపదనుట హాస్యాస్పదమైన విషయము. స్కాందుఁడు పేర్కొన్నట్లు గమనశీలము గలదనుట కూడ వాస్తవముకాదు. అది స్వతంత్రముగాఁదనకైతాను ప్రయుక్తముగా స్వేచ్ఛగాఁ బ్రవర్తిల్లదు. అది యింద్రాజ్ఞానువర్తియై యాతని ప్రయోగదృష్టిపై నాధారపడియుండును. "ఆయస" శబ్దమునకు "ఆయుస్స్వరూపమైనది" అనికూడ నర్థము. అనఁగా నోటమినొందనిదని భావము. వ.గో.కృ.

1. "జేతన్గొనిమునుఁగొని" అని తొలిపాఠము. మునుఁగొని అన్నదాని నటులనే యుంచి "జేతన్గొని" అన్నదానిని "జేతనునిడి" అని గ్రంథకర్త సవరించెను. "జేతనునిడి" మునుఁగొని" అని "ఇడికోని" శబ్దములు వాడుటలో నంతగానౌచిత్యము కానరాదు. అందువల్ల శ్రీ నేమానివారు వ్రాసిన తొలిపాఠము (1వ సంపుటము, 269 పుట) "జేతన్గొని" అన్నదానినే గ్రహించి "మునుఁగొని" అన్నదానిని సార్థకముగా "మునువడి" (ముందుకుఱికి) గా సవరించుట జరిగినది. వ.గో.కృ.

2. "కో!కో! యనుచున్" ఇంద్రబలమును గొనియాడిరనుట తెలుఁగువారి సంప్రదాయముకాదు. "జైజై" అనుట లేదా "జయజయ" అనుట మన సంప్రదాయము. "కః కః" ఎవఁడు? ఎవఁడు? అనఁగా నీకెదురెవ్వఁడను నర్థమున దీని ప్రయోగము తెలుఁగులోఁ జేరియుండును. వ.గో.కృ.

(15) గీ॥ అలఁతివారమగుట నంతటవిలసిల్లు, నిన్నుఁజూడ మాకు నేర్పుగలదె ?
మనుజ దురవగాహ్య మైన దూరస్థుని, నెటులుచూడఁగల మహీనతేజః ॥ 125

(16) చ॥ మనుసుర మౌనిపుంగవుల మోదవివర్ధిత యజ్ఞకర్మలం
గనుఁగొని పాకశాసనుఁడు కౌతుకమొందినయట్లధర్వయున్
మనుపతిచేయు యజ్ఞములు మానుగ వానికిఁ బ్రీతిఁజేసి త
ద్ఘన విభుతత్వమున్ నిలిపెఁగాంచఁగ వాని మహత్వమెట్టిదో! ॥ 126

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమునఁ బంచమాధ్యాయము
సమాప్తము

---

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ప్రథమోఽష్టకః—షష్ఠోఽధ్యాయః

### సూక్తమ్—81

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—ఇన్ద్రః

ఛందః—పంక్తిః

(1) ఇన్ద్రో మదాయ వావృధే శవసే వృత్రహా నృభిః ।

తమిన్మహత్స్వాజిషూతేమర్భే హవామహే స వాజేషు ప్ర నోఽవిషత్ ॥ 1

(2) అసి హి వీర సేన్యోఽసి భూరి పరాదదిః ।

అసి దభ్రస్య చిద్ వృధో యజమానాయ శిక్షసి సున్వతే భూరి తే వసు ॥ 2

(3) యదుదీరత ఆజయో ధృష్ణవే ధీయతే ధనా ।

యుక్ష్వా మదచ్యుతా హరీ కం హనః కం వసౌ దధోఽస్మాగ్ం ఇన్ద్ర వసౌ దధః ॥ 3

(4) క్రత్వా మహాగ్ం అనుష్వధం భీమ ఆ వావృధే శవః ।

శ్రియ ఋష్వ ఉపాకయోర్ని శిప్రీ హరివాన్ దధే హస్తయోర్వజ్రమాయసమ్ ॥ 4

(5) ఆ పప్రౌ పార్థివం రజో బద్బధే రోచనా దివి ।

న త్వావాగ్ం ఇన్ద్ర కశ్చన న జాతో న జనిష్యతేఽతి విశ్వం వవక్షిథ ॥ 5

(6) యో అర్యో మర్తభోజనం పరాదదాతి దాశుషే ।

ఇన్ద్రో అస్మభ్యం శిక్షతు వి భజా భూరి తే వసు భక్షీయ తవ రాధసః ॥ 6

(7) మదేమదే హి నో దదిర్యూథా గవామృజుక్రతుః ।

సం గృభాయ పురూ శతోభయాహస్త్యా వసు శిశీహి రాయ ఆ భర ॥ 7

(8) మాదయస్వ సుతే సచా శవసే శూర రాధసే ।

విద్మా హి త్వా పురూవసుముప కామాన్త్ససృజ్మహేఽథా నోఽవితా భవ ॥ 8

(9) ఏతే త ఇన్ద్ర జన్తవో విశ్వం పుష్యన్తి వార్యమ్ ।

అన్తర్హి ఖ్యో జనానామర్యో వేదో అదాశుషాం తేషాం నో వేద ఆ భర ॥ 9

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము—షష్ఠాధ్యాయము

### సూక్తము—81

ఋషి—రహూగణపుత్రుఁడు గోతముఁడు†

దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ పాయక పాకశాసనుఁ డపారబలంబును బొందునట్లుగా
మాయలులేక మేము గడు మాన్యనుతుల్ *పఠియించినార మ
త్యాయతవీర్యముం గలుఁగునాతఁడు ఘోరరణస్థలంబులన్
సాయము సేయుఁగాకఁ గడు సంతసమొందుచు మాకు నెప్పుడున్ ॥ 1

(2,3) సీ॥ ఒక్క—వీరుండవై పెక్కు—వీరులవలె సేనలోనలజడిఁ జేయఁగలవు
వైరులఁ దెగనేసి వారి ధనంబంత నేకాంతముగ మాకు నీయఁగలవు
సామాన్యమానవ స్తవములందుచు[1] మహావృద్ధిని గలిఁగించి వెలుఁగఁగలవు
యాగంబుఁజేసెడు యజమానులకుఁ బ్రీతి నక్షయంబగు ధనమంపఁగలవు
గీ॥ వైరివిచ్ఛేదకులకెల్ల వసువునీయఁ, గలవు నీవింద్రదేవుఁడ! బలముగల్గు
నశ్వములతోడ నెచటికి నరిగెదొ[2]మఱి, యెవ్వనిం జంపనుంటివొ యెరుగమయ్య! ॥ 2

† ఋషి విశేషములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తము క్రింది ఫుట్‌నోట్ చూడవలయును. వ.గో.కృ.

* 81వ సూక్తములోని తొలిఋక్కునకు సాయనాచార్యులు వ్యాఖ్యవ్రాయుచు "బలార్థంచ నృభిః యజ్ఞస్య నేత్రభిరృత్విగ్భిః వవృధే స్తోత్ర శస్త్రరూపాభిః స్తుతిభిః ప్రవర్ధితో బభూవ. స్తుత్యాహి దేవతా ప్రాప్తబలాసతీ ప్రవర్ధతే" అని వ్రాయఁగా నీ వాక్యములను దృష్టిలోఁ బెట్టుకొని "పాయకపాకశాసనుఁడపారబలంబును బొందునట్లుగా, మాయలు కాక మేముగడుమాన్యనుతుల్ రచియించినాము" అని శ్రీనేమానివారనువదించిరి. అపౌరుషేయములై స్తోత్రరూపములైన ఋక్కులను బఠియించుటజరుగును గాని పౌరుషేయములు గాని యాఋక్కులనెవఁడు రచించును? స్తోత్రపాఠములవల్ల లేదా నుతులవల్ల బలము పెరుగుననుట సామాన్యవిషయము. ఒక్క దేవతలలోనేకాదు. సామాన్యమానవులలోనైనను "ఏమియుఁబట్టించుకొనక మిన్నకున్నవానిని "నీవంతటివాఁడ వింతటివాఁడ" వని అంతరింతలుగాఁబొగడి మెక్కు—వేయుచో నెంతటియసమర్థునిలోనైనను నుత్సాహశక్తిపొంగిపొరలుటసహజము. ఆ యుత్సాహముతో లేని బలము వచ్చినట్లు మానవుఁడు ప్రవర్తించి తనశక్తియుక్తుల నన్నింటిని నొడ్డును. అదేరీతిగా నింద్రుఁడు శత్రుసంహారణార్థమై మరింత ఉత్సాహమొందు, ముందుకురుకుటకై ఋషులు నుతులొనర్చుట సహజము. ఋక్కులు మానవ విరచితములన్న దృష్టితోఁ బొరపాటున శ్రీనేమానివారు "రచియించినారము" అని ప్రయోగించుట సరికాదు. ఋషులు ఋగ్ద్రష్టలేగాని-స్రష్టలు కారు. కాన "రచియించినార" మనుమాటను "పఠియించినార"మని సవరించుట యుక్తముగాభావించి సవరించుటజరిగినది. వ.గో.కృ.

1. రచయిత "స్తవములందుచు" అని వ్రాయఁబోయి పొరపాటున మువర్ణమును విడిచిపెట్టి "స్తవలందుచు" నని వ్రాయఁగా నితరులెవరో యాసంపర్కమునఁ గ్రింద గీతగీసి "స్తుతులందుచు" అని సవరించిరి. "స్తుతులందుచు" అని సవరించుచో యతిభంగమే గాక గణభంగము గూడ నేర్పడును. (1వ సంపుటము 173 పుట, 81 సూ. 2ప.) వ.గో.కృ. 2. నెచటికినరుగదొ (వ్రా.ప్ర.పా. సరికాదు.)

(4) క॥ [1]కామము సోమరసంబున్, సీమముతోఁ ద్రాగి సర్వనిర్జరులకుఁ దా
క్షేమమునొసఁగఁగ నింద్రుఁడు, భీమపవింబట్టి మిగులవెలిఁగెనుగాదే! ॥ 3

(5) మ॥ నిజతేజంబున భూపదార్థవితతిన్ నిర్నిద్రమౌనట్లుగా
ద్విజమార్గంబునఁ దారకా [2]నిచయముద్దీపింపఁగాఁ జేయుటన్
విజయంబంతటఁ గల్గుచున్నదిగదా! విత్తాధికారీ! భవ
ద్భుజవీర్యంబును నెవ్వఁడైన జగతింబొందంగ శక్యండఁటే! ॥ 4

(6) గీ॥ పుట్టనున్నవారిఁ బుట్టినవారిని, బుట్టిచనెడివారిఁ బూన్కిఁజూడ
నీకు సముఁడెవండు నిరత మాలోచింప, నీవె నీకుసాటి నిర్జరేశ! ॥ 5

(7) క॥ పాలకుఁడైన మహేంద్రుఁడు, జాలములేకుండ బలము జనులకొసఁగు నా
లీలన్ ధనవసుబలముల, నోలిఁ బ్రసాదించుఁగాక నొయ్యన మాకున్ ॥ 6

(8) ఉ॥ ఎక్కువ సోమపానమును నేపుగఁజేసి మదించి ప్రీతితోఁ
దక్కువకాని గోగణము దానములిచ్చెడు దాతలౌటచే
మక్కువతోడ వేడుకొనుమాకు నసంఖ్య ధనంబులిచ్చుచున్
స్రుక్కిన మానుబుద్ధులను సూక్ష్మముగా నెనరింపవే! హరీ! ॥ 7

చ॥ సురపతి! నీవు సోమ మతిసూక్ష్మముగాఁగొని తృప్తినొంది సు
స్థిరమగు సంపదన్ మఱియుఁ దీక్ష్ణబలంబును మాకు నిచ్చి[3]యిం
కరయ ధనంబునీకుఁ గలదౌటను విత్తము మాకొసంగుమా!
[4]సరగున గోవు, దూడలను జాడ్పున మమ్ములఁ గాఁచుచుండుమా ! ॥ 8

(9) గీ॥ శక్ర! యజమానలక్షణ జనులుసర్వ, హవ్యముల [5]వృద్ధిఁజేయుట నధికమెఱిఁగి
యాగములకెల్లఁ గానట్టి యరిధనంబు, నధ్వరక్రియకిమ్ము నీవతిశయముగ ॥ 9

1. నాలుగవఋక్కున కనువాదపద్యమైన దీనిలో "కామము సోమరసంబున్" అని గ్రంథకర్త వ్రాసెను. ఇదిసరిగాలేదు. ...రసము త్రాగుటబాగుగానేయుండును. "కామము-త్రాగుట"-అర్థరహితము మాత్రమేకాదు, పరిశీలించుచో దురర్థకముకూడనగును. ...న"కామ్యము" అని వ్రాయఁబోయి ప్రాసభంగమగునని తలఁచి "కామము" అని రచయిత వ్రాసియుండును. ఈ సందర్భమున ...మము" నకు బదులు "కామిత" అనిగాని, "కామద" అనిగాని మార్చినను దొసఁగుండదు. ఈ పద్యములోఁ దొలిపాఠముగా ...మముతోఁ ద్రాగి సర్వనిర్జర శ్రేణిన్ । భీమబలుండగు నింద్రుఁడు । సేమముగాఁ బవినిబట్టి చెచ్చెరఁగొట్టెన్" అని కలదు. ఈ పాఠము గొట్టివేసి గ్రంథకర్త స్వయముగా "నిర్జరులకు" మొదలుగాఁ బాఠమును సవరించెను. పద్యాంతమున "కాదె" అని పాటున హ్రస్వాంతముగా వ్రాసెను. అది దీర్ఘాంతము, కందము గుర్వంతముగదా!. వ.గో.కృ.

2. నిచయముద్దీపింపఁగా (తొ.పా.) 3. ఇంకన్+అరయ=ఇంకరయ 4. సరగున గోవుదూడలను సంభ్రమరీతిని గాఁచుకైవడిన్ ...పా.) 5. వృద్ధిఁజేసిరి యదిమెఱింగి (తొ.పా.)

## సూక్తమ్—32

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—ఇంద్రః

**ఛందః—పంక్తిః, 6—జగతీ.**

(1) ఉపో షు శృణుహీ గిరో మఘవన్ మాతథా ఇవ ।

యదా నః సూనృతావతః కర ఆదర్థయాస ఇద్ యోజా న్విన్ద్ర తే హరీ ॥ 10

(2) అక్షన్నమీమదన్త హ్యవ ప్రియా అధూషత ।

అస్తోషత స్వభానవో విప్రా నవిష్ఠయా మతీ యోజా న్విన్ద్ర తే హరీ ॥ 11

(3) సుసందృశం త్వా వయం మఘవన్ వన్దిషీమహి ।

ప్ర నూనం పూర్ణవన్ధురః స్తుతో యాహి వశాగ్ం అను యోజా న్విన్ద్ర తే హరీ ॥ 12

(4) స ఘా తం[1] వృషణం రథమధి తిష్ఠాతి గోవిదమ్ ।

యః పాత్రం హారియోజనం పూర్ణమిన్ద్ర చికేతతి యోజా న్విన్ద్ర తే హరీ ॥ 13

(5) యుక్తస్తే అస్తు దక్షిణ ఉత సవ్యః శతక్రతో ।

తేన జాయముప ప్రియాం మన్దానో యాహ్యన్ధసో యోజా న్విన్ద్ర తే హరీ ॥ 14

(6) యునజ్మి తే బ్రహ్మణా కేశినా హరీ ఉప ప్ర యాహి [2]దధిషే గభస్త్యోః

ఉత్ త్వా సుతాసో రభసా అమన్దిషుః పూషణ్వాన్ వజ్రిన్త్సము పత్న్యామదః ॥ 15

1. సఘారథమధి (వ్రా.ప్ర.) 2. దధిషేగభస్త్యోః (వ్రా.ప్ర.)

## సూక్తము—82

### ఋషి—గోతముఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1) మ॥ ధనదా! పూర్వము మత్కృత స్తవములం దార్మారు కాకుండ నీ
మనమందుంచి యొసంగినాఁడవు సుమా! మా కాంక్షితార్థంబు పెం
పున నేవేళను మేముచేయు నుతులం బూర్వప్రకారంబుగా
విని యశ్వంబులఁబూన్చి యానమునకున్ వేంచేయవే ప్రీతితోన్ ॥ 10

(2) క॥ పరమాన్న రసాస్వాదము, పరవశులుగ, జేయ జనులు పరమప్రీతిన్
విరివిగ నుతులంజేసిరి, హరులన్ రథమునకుఁగూర్పు మమరాధ్యక్షా! ॥ 11

(3) గీ॥ నీయనుగ్రహముంగోరి నిన్ను మేము, స్తోత్రములఁ జేయుచున్నాము శూరవినుత!
యీయ నున్నట్టి ధనమెల్ల నిపుడెకొనుచు, రమ్ము రథమెక్కి యింద్రుఁడా! సొమ్ముఁదెమ్ము॥ 12

(4) గీ॥ జనుల కోరికలందీర్ప జరుగునెద్ది?, పరమ హరియోజనాఖ్యమై పరఁగునెద్ది?
సోమరసపూర్ణపాత్రలఁ జూపునెద్ది, యట్టిరథమున కశ్వాళిఁ గట్టుమింద్ర! ॥ 13

(5) క॥ రథమున కిరుపార్శ్వంబుల, నధరీకృత వాయుజవములైన హయములన్
విధిగాఁబూచుచు †శచికై, సుధఁబోలు రసంబుఁ ద్రాగి సూటిగఁజనుమా! ॥ 14

(6) ఉ॥ మంత్రముచేత నశ్వముల మానుగఁ బూన్చితిమయ్య శక్రుఁడా!
తంత్రమువీడి పగ్గములఁదాల్పుము [1]సోమముఁ గ్రోలియుంటచే
యంత్రములేక పుష్టిఁగొని యార్యశచీ సతితోడఁగూడుచున్
యంత్రణమాని సౌఖ్యమును నందుము [2]చాలిన సంతసంబునన్ ॥ 15

* ఋషి విశేషవిషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తముక్రింది ఫుట్‌నోట్ చదువవలయును. వ.గో.కృ.

† "శచికై సోమరసముఁ ద్రావిపొమ్ము" అని కలదు. ఇంద్రునకు శచి యనుభార్య కలదనుటకుఁ బురాణములలోఁ జాల కథలుగలవు. కాని తొల్లిటివేద భాష్యములందు శచియనఁగాఁ గర్మయనియు, శచీపతియనఁగఁగర్మపతియనియుఁగలదు. పురాణములకు వేదములే ప్రమాణములయి యుండకతప్పదు. కావున వేదములందుఁగల నిట్టి చిన్నయంశములను విస్తరించి సరసమగు కథలు కల్పించియుందురేమోయని సందేహము జనింపకతప్పదు. ఇట్టి సందేహములను పెద్దలు నిర్ణయింతురుగాక. —నే.వేం.న.శాస్త్రి.

సూచన:—ఇట్టి దృక్పథమునే 74 సూక్తములోని తొలిఋక్కునకొనర్చిన యనువాదపద్య సందర్భముగా శ్రీనేమానివారు వ్రాసిన ఫుట్‌నోట్ సందర్భములోనైతము ప్రదర్శించియున్నచో నెంతయు సముచితముగా నుండెడిది. సత్యసన్నిహితమై పరమ వైజ్ఞానికమై వెలుఁగొందెడిది. వ.గో.కృ.

1. సోమముఁగ్రోలినాఁడవే (తా.పా.) 2. చక్కఁగ సంతసంబునన్ (తా.పా.)

## సూక్తమ్—83

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ.

(1) అశ్వావతి ప్రథమో గోషు గచ్ఛతి సుప్రావీరిన్ద్ర మర్త్యస్తవోతిభిః ।

తమిత్ పృణక్షి వసునా భవీయసా సిన్ధుమాపో యథాభితో విచేతసః ॥ 16

(2) ఆపో న దేవీరుప యన్తి హోత్రియమవః పశ్యన్తి వితతం యథా రజః ।

ప్రాచైర్దేవాసః ప్ర ణయన్తి దేవయుం బ్రహ్మప్రియం జోషయన్తే వరా ఇవ ॥ 17

(3) అధి ద్వయోరదధా ఉక్థ్యంం వచో యతస్రుచా మిథునా యా సపర్యతః ।

అసంయత్తో వ్రతే తే క్షేతి పుష్యతి భద్రా శక్తిర్యజమానాయ సున్వతే ॥ 18

(4) ఆదఙ్గిరాః ప్రథమం దధిరే వయ ఇద్ధాగ్నయః శమ్యాయే సుకృత్యయా ।

సర్వం పణేః సమవిన్దన్త భోజనమశ్వావన్తం గోమన్తమా పశుం నరః ॥ 19

(5) యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే తతః సూర్యో వ్రతపా వేన ఆజని ।

ఆ గా ఆజదుశనా కావ్యః సచా యమస్య జాతమమృతం యజామహే ॥ 20

(6) బర్హిర్వా యత్ స్వపత్యాయ వృజ్యతే ఽర్కో వా శ్లోకమాఘోషతే దివి ।

గ్రావా యత్ర వదతి కారురుక్థ్యంస్తస్యేదిన్ద్రో అభిపిత్వేషు రణ్యతి ॥ 21

## సూక్తము 83

### ఋషి—రాహూగణపుత్రుఁడు గౌతముఁడు*

### దేవత—అగ్ని†

(1) ఉ॥ మాటలు వేయినేమిటికి మాన్యుఁడ! నీ పరిరక్షణంబు ము
మ్మాటికిఁ బొందుమానవుఁడు మత్సరమున్ [1]విడిగోవులందెడున్,
సాటిని బొందనట్టి వసుసంపదలందెడు ధాత్రి నిత్యమున్,
మేటి సముద్రమెల్లెడల మేదురవారినిబొందు కైవడిన్ ॥ 16

(2) ఉ॥ సూరునికాంతి భూమిపయిసూటిగఁ బోయెడునట్లు దేవతా
వారము దృష్టులన్నియు సువాసిత పాత్రముపైకిఁ బోయెడుం
గోరికతోడఁ బాత్రములఁగూర్చిన వేరుగ దేవతోత్తముల్
సారముగల్గు సోమరససారము గోరుచునుందురెప్పుడున్ ॥ 17

(3) మ॥ సుహవిర్దానపరుండు పూరుషుఁడు సంక్షోభిల్లుచున్ వైరులన్
బహుళాశక్తిన్ దునుమాడి శక్ర! పరమ ప్రావీణ్యముం జూపుచున్
మహితంబౌ భవదీయ కర్మసరణిన్ మార్పేమి లేకుండఁగా
రహిమీరం జరిపించె[2]నేని బలమున్ రక్షాక్రియం బొందుఁదాన్ ॥ 18

(4) గీ॥ అంగిరోమౌనిగణమెల్ల నఖిలయజ్ఞ, కర్మలంజేసి యింద్రునిగారవించి
పణి గృహీతాశ్వ గోగణ భక్తములను, జెందియుండును సత్కర్మచేతనెపుడు ॥ 19

(5) ఉ॥ ఆది నథర్వమౌనికృత యజ్ఞపదంబులఁజూచి ప్రీతి సం
పాదిత కర్ముఁడైనహరి, పావనుఁడైన భృగుండు గోవులన్
సాదర దృష్టులంగనుచుఁ జయ్యన వైరులఁద్రుంచి మాకిలం
గావనకుండ నీయరటె కాంచనమున్ మఱి హవ్యసంపదన్ ॥ 20

* ఋషికి సంబంధించిన విశేషవిషయములకై 200 పుటలోని 74సూక్తము క్రింది ఫుట్‌నోట్ చదువవలయును. వ.గో.కృ.

† సంస్కృతమూల గ్రంథములలోనీసూక్తమునకు దేవత ఇంద్రుఁడనియే పేర్కొనఁబడినది. కాని శ్రీ సేమూనివారి 83వ. సూక్తమునకు (1వ. సంపుటము. షష్ఠాధ్యాయము. 83వసూక్తము 277 పుట) దేవత "అగ్ని"గాఁబేర్కొనిరి. కాని యనువాద పద్యములలో శక్ర! (3ఋక్కు—18ప.) యింద్రుని (4 ఋక్కు—19 ప.) ఇంద్రుఁడు (6 ఋక్కు—21 ప.) శబ్దములు ప్రయోగించుట చూడఁగా నింద్రుడే దేవతయన నగును. తెలుఁగులో (5 ఋక్కు—20 ప.) నొక పద్యమునఁ బ్రయోగితమైన "హరి" శబ్దమింద్రవాచకము కానగును. వ.గో.కృ.

1. వీడికిమారుగా "విడి" ప్రయోగింపఁబడినది. 2. ఇక్కడ వ్రాతప్రతిలో (1వ. సంపుటము. 277 పుట 13 ప.) స్పష్టముగా "జరిపించినేని" అనివ్రాయఁబడియున్నది. క్త్వార్థకమైన "జరిపించి" అనునసమాపకక్రియారూపముపై "నేని" ద్రుత పూర్వకరూపమురానేరదు. కావున "జరిపించెనేని" అనివ్రాయుటకు మారుగాఁ బొరపాటున "జరిపించినేని" అని వ్రాసియుండనగునని పైవిధముగా సవరించఁబడినది. మూలమంత్రము సరయుచో దీనిని సిద్ధమునానేవ్రాసి "లేని" శబ్దముప్రాయుటకు మారు పొరపాటున "నేని" ("లే"కు మారుగా "నే") శబ్దమును వ్రాసినట్లు మనము భావింపవలసి యున్నది. వ.గో.కృ.



(6) ఉ॥ శోభన కర్మ(జేయుటకు శోధితదర్భలు తీయువేళలన్
శోభిత యజ్ఞవేదికల సూటిగ సంస్తుతులందువేళలన్
శోభనవేళ హోత కడుసుందరిశబ్దము చేయునట్లు సం
శోభిత శైలరావమున శోభిలునింద్రుడు హర్షమొంద(దే: ॥ 21

## సూక్తమ్—84

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—ఇంద్రః

ఛందః—1-6 అనుష్టుప్, 7-9 ఉష్ణిక్, 10-12 పంక్తిః, 13-15 గాయత్రీ
16-18 త్రిష్టుప్, †(ప్రగాథః) 19-బృహతీ, 20-సతోబృహతీ.

(1) అసావి సోమ ఇన్ద్ర తే శవిష్ఠ ధృష్ణవా గహి ।
ఆ త్వా పృణక్త్విన్ద్రియం రజః సూర్యో న రశ్మిభిః ॥ 22

(2) ఇన్ద్రమిద్ధరీ వహతో ऽప్రతిధృష్టశవసమ్ ।
ఋషీణాం చ స్తుతీరుప యజ్ఞం చ మానుషాణామ్ ॥ 23

(3) ఆ తిష్ఠ వృత్రహన్ రథం యుక్తా తే బ్రహ్మణా హరీ ।
అర్వాచీనం సు తే మనో గ్రావా కృణోతు వగ్నునా ॥ 24

(4) ఇమమిన్ద్ర సుతం పిబ జ్యేష్ఠమమర్త్యం మదమ్ ।
శుక్రస్య త్వాభ్యక్షరన్ ధారా ఋతస్య సాదనే ॥ 25

† మతాంతరము సూచింప(బడలేదు.

(5) ఇన్ద్రాయ నూనమర్చతోక్థాని చ బ్రవీతన ।

సుతా అమత్సురిన్దవో జ్యేష్ఠం నమస్యతా సహః ॥ 26

(6) నకిష్ట్వద్ రథీతరో హరీ యదిన్ద్ర యచ్ఛసే ।

నకిష్ట్వాను మజ్మనా నకిః స్వశ్వ ఆనశే ॥ 27

(7) య ఏక ఇద్ విదయతే వసు మర్తాయ దాశుషే ।

ఈశానో అప్రతిష్కుత ఇన్ద్రో అఙ్గ ॥ 28

(8) కదా మర్తమరాధసం పదా క్షుమ్పమివ స్ఫురత్ ।

కదా నః శుశ్రవద్ గిర ఇన్ద్రో అఙ్గ ॥ 29

(9) యశ్చిద్ధి త్వా బహుభ్య ఆ సుతావాగ్ం ఆవివాసతి ।

ఉగ్రం తత్ పత్యతే శవ ఇన్ద్రో అఙ్గ ॥ 30

(10) స్వాదోరిత్థా విషూవతో మధ్వః పిబన్తి గౌర్యః ।

యా ఇన్ద్రేణ సయావరీర్వృష్ణా మదన్తి శోభసే వస్వీరను స్వరాజ్యమ్ ॥ 31

(11) తా అస్య పృశనాయువః సోమం శ్రీణన్తి పృశ్నయః ।

ప్రియా ఇన్ద్రస్య ధేనవో వజ్రం హిన్వన్తి సాయకం వస్వీరను స్వరాజ్యమ్ ॥ 32

(12) తా అస్య నమసా సహః సపర్యన్తి ప్రచేతసః ।

వ్రతాన్యస్య సశ్చిరే పురూణి పూర్వచిత్తయే వస్వీరను స్వరాజ్యమ్ ॥ 33

(13) ఇన్ద్రో దధీచో అస్థభిర్వృత్రాణ్యప్రతిష్కుతః । జఘాన నవతీర్నవ ॥ 34

(14) ఇచ్ఛన్నశ్వస్య యచ్ఛిరః పర్వతేష్వపశ్రితమ్ । తద్ విదచ్ఛర్యణావతి ॥ 35

(15) అత్రాహ గోరమన్వత నామ త్వష్టురపీచ్యమ్ । ఇత్థా చన్ద్రమసో గృహే ॥ 36

(16) కో అద్య యుఙ్క్తే ధురి గా ఋతస్య శిమీవతో భామినో దుర్హృణాయూన్ ।

ఆసన్నిషూన్ హృత్స్వసో[1] మయోభూన్ య ఏషాం భృత్యామృణధత్ స జీవాత్ ॥ 37

(17) క ఈషతే తుజ్యతే కో బిభాయ కో మంసతే సన్తమిన్ద్రం కో అన్తి ।

కస్తోకాయ క ఇభాయోత రాయే ऽధి బ్రవత్ తన్వే కో జనాయ ॥ 38

(18) కో అగ్నిమీట్టే హవిషా ఘృతేన స్రుచా యజాతా ఋతుభిర్ధ్రువేభిః ।

కస్మై దేవా ఆ వహానాశు హోమ కో మంసతే వీతిహోత్రః సుదేవః ॥ 39

(19) త్వమఙ్గ ప్ర శంసిషో దేవః శవిష్ఠ మర్త్యమ్ ।

న త్వదన్యో మఘవన్నస్తి మర్డితేన్ద్ర బ్రవీమి తే వచః ॥ 40

(20) మా తే రాధాంసి మా త ఊతయో వసో ऽస్మాన్ కదా చనా దభన్ ।

విశ్వా చ న ఉపమిమీహి మానుష వసూని చర్షణిభ్య ఆ ॥ 41

1. హృత్స్వసోయమో (వా.ప్ర.)

## సూక్తము—84

### ఋషి—రాహూవనపుత్రుఁడు గౌతముఁడు*

### దేవత—అగ్ని†

(1,2,3) సీ॥ రవిగగనంబెల్ల రశ్మిజాలంబులఁ బూరించునట్టులు పుణ్యచరిత!
సోమపానంబున సొగసగుసామర్థ్య మధిగమించును నిన్నె యమరదూత!
యజ్ఞసంస్తోత్రంబు లలరెడుచోటికి హరులు నిన్గొనిపోవు నధికవీర్య!
యమలమంత్రములతో నశ్వముల్ జతఁగూర్చి బండిపై నెక్కుము బాడబుండ!
గీ॥ గ్రావనీమానసంబును గదలఁజేసి, యభిలష[1] ధ్వనితోఁగూడి యలరిమిగుల
నస్మదభిముఖమగునట్టు లరుగఁజేయ, మమ్ము రక్షింపుదువుగాక మాన్య! నీవు ॥ 22

(4) క॥ ముదమునఁదన యంతట నతి, మదకరసోమంబు వచ్చెమాన్య! యిచటికిన్
సదయుఁడవై చవిచూడుము, మదమిది కలిగింపఁబోదుమా: యెపుడైనన్ ॥ 23

(5) గీ॥ పూజలంజేయుఁడో పుణ్యపురుషులార!, స్తోత్రముల నందఁజేయుఁడు సురలపతికి
సోమరసమిచ్చి తనుపుఁడు శుభచరిత్రు, దండములుపెట్టుఁ డతనికి ధన్యులార! ॥ 24

(6) చ॥ హరులను సంజ్ఞతో నలరునట్టి హయంబులునీకుఁ గల్గుటం
బరమ బలాధికుండవని భక్తిని బల్కెదమయ్య! యింద్ర! నిన్
సురుచిర హవ్యముల్ గలుఁగు శూరుఁడులేడిల నీదుముందిటం
బరహయముల్ జయింపఁబడు భావుక తావక వాజిశక్తిచేన్ ॥ 25

(7) గీ॥ హవ్యమిచ్చెడు పురుషుల కధికధనము. నిచ్చువారలలోఁ గలఁడింద్రుఁడొకఁడె
యరిప్రతిధ్వని విననట్టియమరరాజు, సకల జగములకెల్లను సామియయ్యె ॥ 26

(8) గీ॥ మండలాకారముననున్న కుండలీంద్రు, నెటుల మనుజుండుచంపునో యటుల శత్రు
సముదయంబునుగొట్టుచుశత్రుఁడెలమి, [2]వినుతమావాక్యములనెల్ల వినఁగరాఁడొ ॥ 27

(9) క॥ ప్రీతిన్ సోమంబిచ్చెడు, ఖ్యాతి లసత్పూరుషులకు యజ్ఞములందుం
[3]జేతోమోదముఁజేయుచు, నాతత బలమొసఁగి కావుమయ్య! మహేంద్రా! ॥ 28

* ఆంధ్రానువాదమూలప్రతిలో (1వ. సంపుటము. 279పుట) 84వ సూక్తమునకు ఋషిని పేర్కొనలేదు. 83వ సూక్తమునకు వ్రాయఁబడిన ఋషియే యిక్కడనుటంకింపఁబడినది. ఋషికి సంబంధించినవిశేషములకై 200పుటలోనితెలుఁగు 74వ సూక్తము క్రిందిఫుట్‌నోట్ చూడవలయును. వ.గో.కృ.

† సంస్కృతమూలములోని 84వ సూక్తమునకు నింద్రుఁడధిదేవతగాఁ బేర్కొనఁబడెను. ఈ సందర్భమున సాయనాచార్యుఁడు "అనాదేశ పరిభాషయా ఇంద్రో దేవతా" అని పేర్కొనెను. కాని కొన్ని ఋక్కులను బరిశీలించుచో సూర్యరూపాగ్నియు దేవతగానున్నట్లు స్పష్టపడును. ఈ యగ్నిని దృష్టిలోఁబెట్టుకొని వేరొక సంస్కృతమూల గ్రంథములో అగ్నిదేవతగాఁ బేర్కొనఁబడఁగా దానిని శ్రీ నేమానివారు చూచి అగ్నినే దేవతగాఁ బేర్కొనియుందురు. వ.గో.కృ. 1. యభిషవ (వ్రా.ప్ర.పా.) 2. తెలుఁగు వ్రాతప్రతిలో (1వ. సంపుటము 281వ పుట. 27ప.) "వినునొమా వాక్యములనెల్ల వినఁగరాఁడొ" అని వ్రాయఁబడినది. "వినఁగరాఁడొ!" అన్న క్రియనుపయోగించినపుడు పూర్వమందున్న "వినునొ" అను నసమాన క్రియ అనర్థకమున నన్వితమునగును. రచయిత "వినుత మా వాక్యములనెల్ల" అని సార్థకముగా వ్రాయఁదలఁచి పొరపాటున "వినునొ" అని వ్రాసి యుండ నోపునుగావ నీ సవరణచేయఁబడినది. వ.గో.కృ. 3. జేతోమోదము (వ్రా.ప్ర.పా. ప్రమాదము)

(10) గీ॥ ఇష్టములనెల్ల నొసఁగెడు నింద్రుతోడఁ, జనెడుగోవులు [1]శక్రుఁడు చవినిజూచి
విడచినట్టి సుసోమంబు వేడ్కఁద్రావి, యధివసించుచునున్నవి యమరపదము ॥ 29

(11) గీ॥ ఇంద్రునకు శక్తిఁబుట్టింప హీనమైన, యాలు సోమంబునందమపాలఁగలిపె
నట్టి సోమంబుఁదాఁగ్రోలి యమరనాథుఁ, డరినిషూదనమొనరించె నతిశయముగ ॥ 30

(12) చ॥ అరితతికెల్ల నాశనములబ్బెను మీరలిఁకేల పోరులో
బిరబిర సంచరించెదరు భీకరయుద్ధముమాని పూరుషుల్!
పరుగిడుఁడంచు సూచనలఁబంతముతో సరిచూపిగోవు లా
సురపతి వీర్యమంతట సుశోభిలఁ జాటుచునుండె మక్కువన్ ॥ 31

(13,14) గీ॥ శర్యణాబద్ధసరసునఁ జక్కనైన, శివదధీచుని యస్తులచేతఁబట్టి
నవనవతి సంఖ్యచేతను నలరునట్టి, వృత్రులను సంహరించెను వృత్రవైరి ॥ 32

(15) గీ॥ రేలు శశిమండలంబునఁ గ్రాలుచుండు, నఖిలతేజస్సు సూర్యునిదై వెలుంగుఁ
గాన, జంద్రుఁడు, రాత్రులఁ గలుఁగుచుండు, నంధకారంబుఁబోఁగొట్టి యవలఁద్రోలు ॥ 33

(16) సీ॥ వీర్యవంతంబులు విపులతేజశ్శాలు రధికవీర్యయుతంబు లతిసుఖదము
లఖిలారినాశకాఖిలబాణసంబద్ధ ముఖమండలంబులు మోదకరము
లైన యింద్రహయంబుల రథంబుముందటఁ జక్కఁగఁజేర్చుచు సరసమతిని
సారహయంబులస్యందనవహనంబు నుతియించు పూరుషుండతుల[2]తుష్టిఁ
గీ॥ బెద్దకాలంబు జీవించి బెగడులేక, శత్రువులనెల్ల వేగంబ చంపఁగలఁడు
ధనకనకపస్తువాహన ధాన్యములను, నమరనాథుని కరుణచే నందఁగలఁడు ॥ 34

(17) సీ॥ వివిధశత్రువులకై భీతిల్లఁగానేల? శాంతిరక్షకుఁడగు శక్రుఁడుండ
సంతానరక్షకై చాలవేడఁగనేల? శాంతిరక్షకుఁడగు శక్రుఁడుండ
ధననాశనమునకై తల్లడిల్లఁగనేల? శాంతిరక్షకుఁడగు శక్రుఁడుండ
నిజశరీరమునకై నిత్యరక్షణమేల? శాంతిరక్షకుఁడగు శక్రుఁడుండఁ
గీ॥ బరిజన త్రాణమునకునై పాఅనేల?, భద్రగజములఁబాలింపఁ బంతమేల?
యజ్ఞవిఘ్నములన్నిటి ననుపుటేల?, శాంతిరక్షకుఁడయిన యా శక్రుఁడుండ ॥ 35

(18) సీ॥ పాకశాసనునకై భవ్యహవ్యంబుల వీతిహోత్రునెవండు వేడఁగలఁడు?
చైత్రవైశాఖాది చారుమాసములందుఁ జిత్రభానునెవండు చేరఁగలఁడు?
విభుదాళిదరిఁజేరి విత్తంబునెల్లను పోఁడిమినెవ్వఁడు పొందఁగలఁడు?
యజమానులకునెల్ల హరితప్ప నెవ్వఁడు వెసద్రవిణంబును నొసఁగఁగలఁడు?

1. "శక్రుఁడు జన్నములను, ద్రావ మిగిలిన సోమంబుఁద్రాగుచుండి" (తొ.పా.) 2. భక్తి (పాఠాంతరము)

గీ॥ బహువిధోపాసనాశక్తి† పటిమవలనఁ, జారు[1]తర నుతిపరంపరా శక్తి వలన
భక్తులందఱుఁ గోరెడుభాగ్యకలన, నిచ్చువాఁడింద్రుఁడే యికనెవఁడుగలఁడు? ॥ 36

(19) క॥ స్తుతులన్నిను నుతియించెడి, మతిమంతుల యతులనుతులు మన్నింపుహరీ!
సతతము సుఖముఁడవగుటన్, స్తుతియించుచు నుంటిమయ్య! సురపతి! నిన్నే ॥ 37

(20) క॥ చరియించెడు భూతంబులు, గురుపీడలు పెట్టకుండఁ గూర్చుచుమాకున్
సురపతి! సర్వధనంబును, నరమరలేకుండ నిచ్చియనుపవె! మమ్మున్ ॥ 38

## అనువాకః—14, సూక్తమ్—85

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—మరుతః

ఛందః—జగతీ, 5, 12-త్రిష్టుప్.

(1) ప్ర యే శుమ్భన్తే జనయో న సప్తయో యామన్ రు[1]ద్రస్య సూనవః సుదంససః ।
రోదసీ హి మరుతశ్చక్రిరే వృధే మదన్తి వీరా విదథేషు ఘృష్వయః ॥ 42

(2) త ఉక్షితాసో మహిమానమాశత దివి రుద్రాసో అధి చక్రిరే సదః ।
అర్చన్తో అర్కం జనయన్త ఇన్ద్రియమధి శ్రియో దధిరే పృశ్నిమాతరః ॥ 43

(3) గోమాతరో యచ్ఛుభయన్తే అఞ్జిభిస్తనూషు శుభ్రా దధిరే విరుక్మతః ।
బాధన్తే విశ్వమభిమాతినమప వర్త్మాన్యేషామను రీయతే ఘృతమ్ ॥ 44

† బహువిధోపాసనాశక్తి—ఉపనిషత్తులయందున్న కేవలము బుద్ధిగమ్యమగు బ్రహ్మజ్ఞానమును ప్రేమగమ్యమునగు నుపాసనయను రాజగుహ్యమగు దానిని జేర్చి కర్మకాండయొక్క ప్రాచీన పరంపరానుసారముగఁ దమతమ యోగ్యతానుసారముగఁ దమతమ సాంసారికకృత్యములను లోకసంగ్రహార్థమై నిష్కామబుద్ధితోడను నాత్మౌపమ్య దృష్టితోడను నుత్సాహముతోడనుయాజ్ఞికముఁ జేయుచుండుటచే నందపిండబ్రహ్మాండములందును సర్వభూతములయందునేకత్వములోనిండియున్న పరమాత్మనే యజింపవలయునను సిద్ధాంతమేర్పడుచున్నది. (నే.వేం.న.శా.) 1. తేటగీతి రెండవ పాదములో నింద్రగణమునకు మారుగాఁబంచలఘుగణముపయోగింపఁబడెను. వ.గో.కృ. 1. రుదస్య (వా.ప్ర.)

(4) వి యే భ్రాజన్తే సుమఖాస ఋష్టిభిః ప్రచ్యావయన్తో అచ్యుతా చిదోజసా ।

మనోజువో యన్మరుతో రథేష్వా వృషవ్రాతాసః పృషతీరయుగ్ధ్వమ్ ॥ 45

(5) ప్ర యద్ రథేషు పృషతీరయుగ్ధ్వం వాజే అద్రిం మరుతో రంహయన్తః ।

ఉతారుషస్య వి ష్యన్తి ధారాశ్చర్మేవోదభిర్వ్యున్దన్తి భూమ ॥ 46

(6) ఆ వో వహన్తు సప్తయో రఘుష్యదో రఘుపత్వానః ప్ర జిగాత బాహుభిః ।

సీదతా బర్హిరురు వః సదస్కృతం మాదయధ్వం మరుతో మధ్వో అన్ధసః ॥ 47

(7) తేఽవర్ధన్త స్వతవసో మహిత్వనా నాకం తస్థురురు చక్రిరే సదః ।

విష్ణుర్యద్ధావద్ వృషణం మదచ్యుతం వయో న సీదన్నధి బర్హిషి ప్రియే ॥ 48

(8) శూరా ఇవేద్ యుయుధయో న జగ్మయః శ్రవస్యవో న పృతనాసు యేతిరే ।

భయన్తే విశ్వా భువనా మరుద్భ్యో రాజాన ఇవ త్వేషసందృశో నరః ॥ 49

(9) త్వష్టా యద్ వజ్రం సుకృతం హిరణ్యయం సహస్రభృష్టిం స్వపా అవర్తయత్ ।

ధత్త ఇన్ద్రో నర్యపాంసి కర్తవేఽహన్ వృత్రం నిరపామౌబ్జదర్ణవమ్ ॥ 50

(10) ఊర్ధ్వం నునుద్రేఽవతం త ఓజసా దాదృహాణం చిద్ బిభిదుర్వి పర్వతమ్ ।

ధమన్తో వాణం మరుతః సుదానవో మదే సోమస్య రణ్యాని చక్రిరే ॥ 51

(11) జిహ్మం నునుద్రేవతం తయా దిశాసిఞ్చన్నుత్సం గోతమాయ తృష్ణజే ।

ఆ గచ్ఛన్తీమవసా చిత్రభానవః కామం విప్రస్య తర్పయన్త ధామభిః ॥ 52

(12) యా వః శర్మ శశమానాయ సన్తి త్రిధాతూని దాశుషే యచ్ఛతాధి ।

అస్మభ్యం తాని మరుతో వి యన్త రయిం నో ధత్త వృషణః సువీరమ్ ॥ 53

## అనువాకము—14, సూక్తము—85

ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

దేవత—మరుత్తులు

(1) చ॥ అతివ లలంకరించుకొనునట్టు లలంకృత దేహులౌ మహా
మతిగల రుద్రపుత్రకులు మానుష శత్రుగణంబుఁ గొట్టుచుం
గుతలమునందుఁగ్గలు కుజగోత్రములం జలియింపఁజేయుచున్
సతతము సంచరించెదరు సర్వవిధంబుల వానలిచ్చుచున్ ॥ 39

(2) క॥ సురదత్తమహిమలంగొని, సురపతిఁబూజించి గగనశోభంగనుచున్
స్థిరకుం బుత్రకులగుచున్, [1]బరము మరుద్గణమువెలయు భాసురభూమిన్ ॥ 40

5) సీ॥ శోభనాలంకార శోభితదేహులై శత్రుయుద్ధములను జరుపువారు
[2]తామేగుచోటికిఁ దమవెంట ద్రవరూప జలములఁ[3]గైకొంచు జరుగువారు
తీక్ష్ణాయుధంబులఁ దిరముగ ధరియించి కొండల నెగులంగఁగొట్టువారు
వర్షవారులనెల్ల వర్షించుచున్ భువి సప్త సంఘములయి సాఁగువారు
గీ॥ మేఘమండలములనెల్ల మేలుకొలిపి, ధాస్కరునిలేపి వారిచేభవ్యమైన
ధరణినంతటఁ బ్రీతితోఁ దడుపువార, లైన వాయుగణముప్రీతి నరుఁగుఁగాక ॥ 41

6) క॥ పరమజవంబుల వెలసెడు, తురగంబులు యజ్ఞమునకుఁ దూర్ణముగ మిముం
దొరకొని తెచ్చుంగావునఁ, గరము ధనంబిచ్చి పొందు[4]గాలు మరుత్తుల్ ॥ 42

ఋషికి సంబంధించిన విశేషములకై 200 పుటలోని తెలుఁగు 74వ. సూక్తము క్రింది ఫుట్నోట్ చూడనగును. వ.గో.కృ. 1. సురుచిర
ు వెలయు చుండును భూమిన్ (తొ.పా. ఇందఖండయతి కలదు.) 2. తారెక్కడికిఁ బోవఁదమవెంట (వ్రా.ప్ర.పా.) తారెక్కడికిఁ
్కడకిఁ దమవెంట ననివాక్యముండనగును. ఇందులో "అక్కడికి" అను పదము లోపించినది. కావునఁ బైవిధముగా సవరింపఁబడినది.
). 3. జలముఁగొనుచును జరుగువారు (తొ.పా.) 4. గాలులు! మీరల్ (తొ.పా. గాలులు ! = గాలులారా! అని గ్రహింపనగు)
! అనునప్పుడు మరుత్తులారా ! అనునర్థము గ్రహింపనగును. వ.గో.కృ.

(7) చ॥ ఇతర బలంబులంగొన కహీనముగా నభివృద్ధిఁబొందుచున్
సతతము నాకలోకమునఁ జారుతరంబుగ సంచరించుచున్
మతి¹గలయో మరుద్గణమ! మాన్యుఁడు యాగముఁగాఁచుచుండ స
ద్గతినివహించి రమ్మిపుడు కౌతుకమొప్పఁగఁ బల్కికై వడిన్ ॥ 43

(8) ఉ॥ శూరులమాట్కి నెల్లెడల శోభలఁబొందుచు యుద్ధకేళిలో
వీరుల భంగివై రిపయి వేగము పోయెడువారు, రాజులన్
మీరినవారు రూపముల మించెడివారగు వాయుదేవులన్
జేరెడు భూతజాతములు చెచ్చెరభీతిని నొందకుండునే! ॥ 44

(9) మ॥ పదినూర్లంచులుగల్గి హేమమయమై భాసిల్లు దంభోళిఁ దా
ముదితుండై గొని వాసవుండు దనుజున్ మోదంగ వాఁడాస్త్రతో
మదమున్ వీడి నిరుద్ధవారిధరమున్ మార్గంబునంబెట్టఁగా
నుదకంబంతటఁ బారఁగల్గెనుగదా! యుర్వీతలానంగడున్ ॥ 45

(10) గీ॥ బావిఁద్రవ్వ నీరు పైకివచ్చెడురీతిఁ, జేసి ²యామరుత్తుచెంతనున్న
కొండ నిజబలానఁ బిండిగాఁజేయుచు, ధనమునిచ్చుచుండె ధన్యులకయి ॥ 46

గీ॥ దప్పిఁగొని గోతముండను ధన్యతపసి, వాయుగణమును బ్రార్థింపవారికొలఁకు
నా గణము కూపమునుబట్టి యతనికడకుఁ, దెచ్చుచుండఁగఁ గొండలు తెరువుగప్పె ॥ 47

గీ॥ దారియందునుండు ధరణీధరంబులఁ, గొట్టి కూపజలము తొట్టిలోనఁ
బోయ మునివరుండు పోఁడిమిదానితో, దప్పిఁదీర్చుకొనఁడె? ధరణియందు ॥ 48

క॥ శతపరిమిత తంత్రులచే, నతివిలసితమైన ³వీణనంది మరుత్తుల్
మితిమీర సోమముంగొని, కుతుకమునన్ ధనమునిత్తు గోరుజనులకున్ ॥ 49

(11) చ॥ మునివరుఁడుండు తావునకు మోదముతోఁగొనిపోయి కూపమున్
ఘనతర వారిధారలను గానుకలంగొనుమంచు వానితో
వినయముతోపఁ బల్కఁగనె వేల్పులు గోతమమౌని యప్పుడే
ననువుగ వారివారమును నత్యధికంబుగఁ ద్రావెఁ దృప్తిగాన్ ॥ 50

(12) చ॥ సతతము భక్తిమంతులకుఁ జాలనొసంగెడు సౌఖ్యసంతతిన్
నుతులనుజేయు మాకిపుడు నూత్నముగాఁ దయఁజేసి పిమ్మటన్
మతియుతులార! మీరు పలుమాటలుచెప్పక సంతసంబునన్
సుతులను విత్తమున్ బలముఁజూపుఁడు తోషముగల్గ మాకిలన్ ॥ 51

1. మతిగల మారుతంబ! కడు మాధవుఁడిష్టినిగాచుచుండ (తొ.పా.) మూలమంత్రములో విష్ణుశబ్ద ప్రయోగముండుటంబట్టి యీతొలిపాఠమే సమంజసమనిపించును—ఈ పాఠమును రచయిత యెందుకు మార్చెనో యనూహ్యము. వ.గో.కృ. 2. మారుతంబు చెంతనున్న (తొ.పా.)
3. వీణనందుచు గాలుల్ (తొ.పా.)

## సూక్తమ్—86

### ఋషిః—గోతమో రాహూగణః

### దేవతా—మరుతః

### ఛందః—గాయత్రీ

(1) మరుతో యస్య హి క్షయే పాథా దివో విమహసః । స సుగోపాతమో జనః ॥ 54

(2) యజ్ఞైర్వా యజ్ఞవాహసో విప్రస్య వా మతీనామ్ । మరుతః శృణుతా హవమ్ ॥ 55

(3) ఉత వా యస్య వాజినో ఽను విప్రమతక్షత । స గన్తా గోమతి వ్రజే ॥ 56

(4) అస్య వీరస్య బర్హిషి సుతః సోమో దివిష్టిషు । ఉక్థం మదశ్చ శస్యతే ॥ 57

(5) అస్య శ్రోషన్త్వా భువో విశ్వా యశ్చర్షణీరభి । సూరం చిత్ సస్రుషీరిషః[1] ॥ 58

(6) పూర్వీభిర్హి దదాశిమ శరద్భిర్మరుతోవయమ్ । అవోభిశ్చర్షణీనామ్ ॥ 59

(7) సుభగః స ప్రయజ్యవో మరుతో అస్తు మర్త్యః । యస్య ప్రయాంసి పర్షథ ॥ 60

(8) శశమానస్య వా నరః స్వేదస్య సత్యశవసః । విదా కామస్య వేనతః ॥ 61

(9) యూయం తత్ సత్యశవస ఆవిష్కర్త మహిత్వనా । విధ్యతా విద్యుతా రక్షః ॥ 62

(10) గూహతా గుహ్యం తమో వి యాత విశ్వమత్రిణమ్ । జ్యోతిష్కర్తా యదుశ్మసి ॥ 63

1. సస్రుషీరిష (వా.ప్ర.)

## సూక్తము 86

ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

దేవత—మరుత్తులు

(1,2,3,
4,5)

సీ॥ ఎవని యజ్ఞమునకు నేగుచుందురో మీరు పాలనంబులచేతఁ బరగు వాఁడె
యెవని సంబోధన లిచ్చగింతురో మీరు వేయివిధంబుల వెలయు వాఁడె
యెవని సవనహవ్య మిచ్చఁగొందురో మీరు గోగణంబులతోడఁ గూడు వాఁడె
యెవని సోమరసంబులిలఁ గ్రోలుదురో మీరు కర్మఫలంబులఁ గాంచు వాఁడె

గీ॥ యెవని నుతులను వినెదరో యీసుదక్కి, యెవనిపూజలు కొనెదరో [1]యెలమిమీర
వాఁడు ధనమునుబొందు నవ్వారిగాఁగ, వాఁడు యశమునుబొందు నవ్వారిగాఁగ॥ 52

(6,7,8,
9,10)

సీ॥ సర్వజ్ఞ భవదీయ సంరక్షణలఁబొంది హవ్యలక్షణ భక్తమందుకొనుఁడు
హవ్యలక్షణభక్త మందించునరునకు సకలధనంబులఁ జాలనిడుఁడు
భజమానసుందర యజమానుశ్రమవారిఁ బోఁగొట్టినారికి బోనమిడుఁడు
వృత్రునిపోరులో వృద్ధిఁబొందిన యస్మదీయ మాహాత్మ్యంబు తెలిసికొనుఁడు

గీ॥ ఘోరకర్ముని రాక్షసుఁగొట్టుఁడిపుడు, గ్రాలుచీఁకటినెల్లను ద్రోలుఁడిపుడు
కరుణమాపయిఁ గలిఁగించి కాంతినిడుఁడు, [2]వాయువుల్! మమ్ముసుఖియింపఁజేయుఁడిపుడు॥ 53

## సూక్తమ్—87

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—మరుతః

ఛందః — జగతీ

(1) ప్రత్వక్షసః ప్రతవసో విరప్శినో ऽనానతా అవిథురా ఋజీషిణః ।
జుష్టతమాసో నృతమాసో అఞ్జిభిర్వ్యానజ్రే కే చిదుస్రా ఇవ స్తృభిః ॥ 54

* ఋషి విశేషములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తముక్రింది ఫుట్‌నోటువిషయములు చూఁడనగును, వ.గో.కృ 1. యీసుఁదక్కి (తొ.పా.) యెలమిఁబొంది (వ్రా.ప్ర.పా.) 2. వాయువుల్ = వాయువులారా!

(2) ఉపహ్వరేషు యదచిధ్వం యయిం వయ ఇవ మరుతః కేన చిత్ పథా ।

శ్చోతన్తి కోశా ఉప వో రథేష్వా ఘృతముక్షతా మధువర్ణమర్చతే ॥ 65

(3) ప్రైషామజ్మేషు విథురేవ రేజతే భూమిర్యామేషు యద్ధ యుఞ్జతే శుభే ।

తే క్రీళయో ధునయో భ్రాజదృష్టయః స్వయం మహిత్వం పనయన్త ధూతయః ॥ 66

(4) స హి స్వసృత్ పృషదశ్వో యువా గణో౽యా ఈశానస్తవిషీభిరావృతః ।

అసి సత్య [1]ఋణయావానేద్యో౽స్యా ధియః ప్రావితాథా వృషా గణః ॥ 67

(5) పితుః ప్రత్నస్య జన్మనా వదామసి సోమస్య జిహ్వా ప్ర జిగాతి చక్షసా ।

యదీమిన్ద్రం [2]శమ్యృక్వాణ ఆశతా దిన్నామాని యజ్ఞియాని దధిరే ॥ 68

(6) శ్రియసే కం భానుభిః సం మిమిక్షిరే తే రశ్మిభిస్త ఋక్వభిః సుఖాదయః ।

తే వాశీమన్త ఇష్మిణో అభీరవో విద్రే ప్రియస్య మారుతస్య ధామ్నః ॥ 69

## సూక్తము—87

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—మరుత్తులు

(1) ఉ॥ వైరులఁజంపువారు, బలవంతులు, సప్తగణాభిధాయుతుల్,
స్ఫారమఖాంతరాళముల సారహవిస్సులఁ బొందువారు స
న్నీరద సంచయంబునకు నేతలునైన మరుత్తు లిం[1]పలం
కారములన్ధరించి రుచిగాంచిరి సూర్యునిరశ్మి కైవడిన్ ॥ 54

1. ఋణ యావా౽నేద్యో (వ్రా.ప్ర.) 2 శమ్యుక్వాణ (వ్రా.ప్ర.) † ఋషికి సంబంధించిన విశేషములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తము క్రింది ఫుట్‌నోట్ చూఁడవలయును. వ.గో.కృ. 1. ఇంపు + అలంకారములన్ = ఇంపలంకారములన్ (లింపలంకారములన్ అని వ్రా.ప్ర.పా. ప్రమాదము.)

(2) చ॥ †ఖగములమాడ్కి వాయువులు కాంతనభంబునఁ బోవువేళలం
బరఁగ మేఘమండలికిఁ దద్దయుఁగారును నీరు, కావునన్
సుగతిఁజరించు మీరు కడు సోనలుగాఁబడు వర్షమంతటం
దగినటు కిసివారిగను దానముచేయుఁడు మాకువాయువుల్! ॥ 55

(3) ఉ॥ వాయువులెల్లఁ గావలయు వానకు మేఘములన్ స్పృశింపఁగాఁ
బాయకభూమి భీతిఁగొను, భర్తనుబీడిన నాతిరీతిగా,
వాయుఘటాళిచే వెలసి యయ్యవియెల్లెడ సంచరించుచోఁ
బోయన నైజవీర్యమును నొప్పుగఁ జూపుచు[1]సుంద్రు తామొగిన్ ॥ 56

(4) చ॥ కనకమయద్గణంబు బలకాంచనముల్ గలుఁగంగఁ జేయు చా
ఘన నిజవీర్య సంపదలఁ గ్రాలుచు నూతన యౌవనంబుతో
ననిశము వెల్గుచున్ ఋణమునంతను దీర్చుచు నాడ లేడులం
గాని తురగాళిగానునిచి గొబ్బున యానమునెక్కి వచ్చుతన్ ॥ 57

(5) గీ॥ వరరహాగణమునినోట వలసినన్ని, వార్తలను విన్నవారము వాయుగణమ!
వాని నాలింపుఁడిప్టుడు పాకహరుని, మీరు కొనియాడలేచఁటే! మేదురముగ ॥ 58

(6) గీ॥ కానమీరు యాగకర్మలందు హవిస్సు. కర్తమీరు నుతులవెల్గినారు
యజ్ఞనామములను నంతటఁబొందుచు, వృద్ధిఁబొందినారు వివిధగతుల ॥ 59

ఉ॥ నిచ్చలు కాంతితో సరిగ నేస్తముఁగట్టుచు వర్షధారలం
బొచ్చెములేక భూతల విభూతినిఁపెంపుచు హవ్యమందుచున్
మచ్చరమీర సన్నుతుల మానుగనొందుచు భీతిపీడుచున్
జొచ్చిరి నైజగేహముల [2]శూరమరుత్తులు సంభ్రమంబునన్ ॥ 60

† ఖగములమాడ్కి వాయువులు—ఉపమానాలంకారము గలదు. సామాన్యముగా ఋగ్వేదసంహితయందుపమాలంకార మెక్కువగాఁ జెప్పఁబడినది. వస్తుతత్త్వమును గ్రహింపవలెనన్న ప్రత్యక్షానుమానోపమాన శబ్దప్రమాణములచేఁ దెలిసికొనఁదగును. ఛాత్రులకు వస్తుతత్త్వమును దెలుపుటకెట్టి ఉపమానము తెలుపఁబడినదో (ఛాందోగ్యము-VI) కనుఁడు. పరమాత్మయంతటవ్యాపించి యున్నను గనులకుఁ గన్పడఁడు అను నంశమును జెప్పుటకీ క్రింది యుపమానము చెప్పఁబడియెను. ఒక బ్రహ్మజ్ఞాని నిజపుత్రునకు బ్రహ్మ సర్వాంతర్యామియను తత్త్వము బోధింపఁ దలఁచి పుత్రకా! ఉప్పును జలములోఁబడవేసి ఉదయమునఁబాగుమనెను. ఆ పుత్రుఁడట్లొనర్చెను. ప్రాతఃకాలమునఁ దండ్రి కుఱ్ఱా! నీటిలోవేసిన ఉప్పును దెమ్మనెను. పుత్రుఁడా ఉప్పుదెచ్చుటకు వెడలి చూచి యది నీటఁగఱిగిపోయెనని చెప్పెను. తర్వాత తండ్రి పుత్రా! ఆ జలము మీఁది నీటిని రుచిచూడుమనెను. అట్లొనర్చి పుత్రుఁడు ఉప్పగనున్నదనెను. ఆ జలముమధ్యనున్న నీటిని రుచిచూఁడుమని తండ్రియనఁగా నతఁడట్లుచేసి ఉప్పగానున్నదనెను. అనంతరము తండ్రి క్రింది భాగమునఁగల నీటిని రుచిచూచి చెప్పుమన నతఁడట్లేచూచి యుప్పగానున్నదనెను. పిమ్మటఁ దండ్రి పుత్రా! ఆ నీటిని పారఁబోసిరమ్మనఁగాఁ పుత్రుఁడట్లొనర్చివచ్చెను. అప్పుడతఁడిట్లు ఉపదేశించెను. పరబ్రహ్మము దృశ్యము కాకపోయినను లవణము జలమందంతటనున్నట్లు లోకమంతటఁ బరమేశ్వరుఁడుండెనని తెలిసికొనుము. (నే,వేం.న.శా.) సూచన:—వేదాలంకార విశేషములకై పీఠిక చూడుఁడు. వ.గో.కృ. 1. సుంద్రునెంతయున్ (తొ.పా.) 2. శూరులుగాలుగు (తొ.పా.)

## సూక్తమ్—88

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—మరుతః

ఛందః—త్రిష్టుప్, 1, 6-ప్రస్తారపంక్తిః, 5-విరాడ్రూపా.

(1) ఆ విద్యున్మద్భిర్మరుతః స్వర్కై [1]రథేభిర్యాత ఋష్టిమద్భిరశ్వపర్ణైః ।

ఆ వర్షిష్ఠయా న ఇషా వయో న పప్తతా సుమాయాః ॥ 70

(2) తేఽరుణేభిర్వరమా పిశఙ్గైః శుభే కం యాన్తి రథతూర్భిరశ్వైః ।

రుక్మో న చిత్రః స్వధితీవాన్ పవ్యా రథస్య జఙ్ఘనన్త భూమ ॥ 71

(3) శ్రియే కం వో అధి తనూషు వాశీర్మేధా వనా న కృణవన్త ఊర్ధ్వా ।

యుష్మభ్యం కం మరుతః సుజాతాస్తువిద్యుమ్నాసో ధనయన్తే అద్రిమ్ ॥ 72

(4) అహాని [2]గృధ్రాః పర్యా వ ఆగురిమాం ధియం [3]వార్కార్యాం చ దేవీమ్ ।

బ్రహ్మ కృణ్వన్తో గోతమాసో అర్కైరూర్ధ్వం నునుద్ర ఉత్సధిం పిబధ్యై ॥ 73

(5) ఏతత్ త్యన్న యోజనమచేతి సస్వర్హ యన్మరుతో గోతమో వః ।

పశ్యన్ హిరణ్యచక్రానయోదంష్ట్రాన్ విధావతో వరాహూన్ ॥ 74

(6) ఏషా స్యా వో మరుతోఽనుభర్త్రీ ప్రతి ష్టోభతి వాఘతో న [4]వాణీ ।

అస్తోభయద్ వృథాసామను స్వధాం గభస్త్యోః ॥ 75

1. రథేభిర్యాతి (వా.ప్ర.) 2. గృధాః (వా.ప్ర.) 3. వార్కాయం (వా.ప్ర.) 4. ఘాణీ (వా.ప్ర.)

## సూక్తము—88

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—మరుత్తులు

(1) ఉ॥ ఆయుధజాలముం గలిఁగి యంతటవెల్గు తురంగమంబులం
బాయని యానరాజముల భాసిలనెక్కుచు వర్షణార్థమై
మాయలు డాయనీక యసమానత నన్నముఁగొంచు వేగ వి
చ్చేయుఁడు పక్షిరీతిఁగడుఁ జేయుఁడు శోభలమీరు వాయువుల్ ॥ 61

(2) చ॥ అరుణపిశంగ వర్ణములనంచిత వాజులతోడ నొప్పు నా
యరదమునెక్కివచ్చి కడు నంబువునీయఁగ లోకపాళికిన్
సురుచిర చక్రధారల విశుద్ధరసాతలమంతఁ దాఁకి వి
స్ఫురితగతిన్ మరుద్గణము పూర్ణమనస్సున నిల్పి యుండుతన్ ॥ 62

(3) గీ॥ అరివినాశనకరమగు నాయుధంబు, త్వత్సమృద్ధిని జూపించు ధన్యులార!
వృక్షములఁ బెంచునట్టు లహీనయాగ, ములను చేయించుచున్నారు మోదమలర ॥ 63

గీ॥ ఇట్టి మిమ్ములఁగూరిచి యిష్టులెల్లఁ, జేసి యజమానులందఱుఁ జిత్తమలర
నందు సోమరసంబును నధికభక్తిఁ, దీయుచున్నారు రండిట దివిజులార! ॥ 64

(4) క॥ మారుతమున్ నుతియింపఁగ, మారుతమది యెఱిఁగి నైజమాహాత్మ్యముతో
సారయుత కూపమీయఁగ, వారిని గోతములుగ్రోలి వర్ధిలిరి భువిన్ ॥ 65

(5) చ॥ కనకరథంబునెక్కి కడుఁగంటకులై చరియించు శత్రులం
బనిగొనికొట్టి దేవతలఁ బన్నుగఁబిల్చుచు యాగహవ్యముం
గొనెడి మరుద్గణంబులను గొబ్బునఁజూచుచు గోతముండు తా
వినయముతోడ సంస్తవము వేయివిధంబులొనర్చెఁ బ్రీతితోన్ ॥ 66

(6) గీ॥ మిమ్ము నుతులఁజేయ మీరుమాకన్నంబు, నీయ నదియెఱింగి యఖిలజనము
[1]మాపఠించుబుక్కు మదిఁబెట్టిమిమ్ముల, స్తుతులఁజేయఁ దొడఁగె శుభదులార! ॥ 67

* ఋషిని గురించిన విశేషవిషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తములోని ఫుట్‌నోట్ క్రింది విషయముచూఁడనగును. వ.గో.కృ.

1. మాదుబుక్కులెల్ల (తొ.పా.)

## సూక్తమ్ — 89

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—విశ్వేదేవాః (1-2, 8-9 దేవాః, 10-అదితిః)

ఛందః—జగతీ, 6-విరాట్-స్థానా, 8-10 త్రిష్టుప్

(1) ఆ నో భద్రాః క్రతవో యన్తు విశ్వతో ऽదబ్ధాసో అపరీతాస ఉద్భిదః ।

దేవా నో యథా సదమిద్ వృధే అసన్నప్రాయువో రక్షితారో దివేదివే ॥ 76

(2) దేవానాం భద్రా సుమతిరృజూయతాం దేవానాం రాతిరభి నో ని వర్తతామ్ ।

[1]దేవానాం సఖ్యముప సేదిమా వయం దేవా న ఆయుః ప్ర తిరన్తు జీవసే ॥ 77

(3) తాన్ పూర్వయా నివిదా హూమహే వయం భగం మిత్రమదితిం దక్షమస్రిధమ్ ।

అర్యమణం వరుణం సోమమశ్వినా సరస్వతీ నః సుభగా మయస్కరత్ ॥ 78

(4) తన్నో వాతో మయోభు వాతు భేషజం తన్మాతా పృథివీ తత్ పితా ద్యౌః ।

తద్ గ్రావాణః సోమసుతో మయోభువస్తదశ్వినా శృణుతం ధిష్ణ్యా యువమ్ ॥ 79

(5) తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వమవసే హూమహే వయమ్ ।

పూషా నో యథా వేదసామసద్ వృధే రక్షితా పాయురదబ్ధః స్వస్తయే ॥ 80

(6) స్వస్తి న ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః ।

స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతిర్దధాతు ॥ 81

1. దేవానాం (పాఠాంతరము)

(7) పృషదశ్వా మరుతః పృశ్నిమాతరః శుభంయావానో విదథేషు జగ్మయః ।

అగ్నిజిహ్వా మనవః సూరచక్షసో విశ్వే నో దేవా అవసా గమన్నిహ ॥ 82

(8) భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః ।

స్థిరైరఙ్గైస్తుష్టువాంసస్తనూభిర్వ్యశేమ దేవహితం యదాయుః ॥ 83

(9) శతమిన్ను శరదో అన్తి దేవా యత్రా నశ్చక్రా జరసం తనూనామ్ ।

పుత్రాసో యత్ర పితరో భవన్తి మా నో మధ్యా రీరిషతాయుర్గన్తోః ॥ 84

(10) †అదితిర్ద్యౌరదితిరన్తరిక్షమదితిర్మాతా స పితా స పుత్రః ।

విశ్వే దేవా అదితిః పఞ్చ జనా అదితిర్జాతమదితిర్జనిత్వమ్ ॥ 85

## సూక్తము—89

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—విశ్వేదేవతలు‡

(1) చ॥ క్రతువులు భద్రరూపమున ఖండితవిఘ్నములై చరించుతన్
స్తుతులమగొంచువచ్చి కడుశోభిలు రక్షలనిచ్చి దేవతల్
నుతులకుఁ దృప్తిఁజెంది తగ నూతనభక్తిని మాకుఁజెంత స
న్మతి చరియించుచుండుఁ దమమానుషవృద్ధిని కల్గఁజేయుచున్ ॥ 68

† ఈ 10వ ఋక్కుకు "అదితి" దేవతగాఁ గొందఱు భావించిరి. స్కందభాష్యకారాదులు మాత్రము మొత్తము దశ ఋక్కులున్న యీ సూక్తమంతటికిని "విశ్వేదేవతలే" దేవతలుగాఁ బేర్కొనిరి. వ.గో.కృ.

* ఋషికి సంబంధించిన విశేషములకై 200 పుటలోని తెలుఁగు 74వసూక్తము క్రింది ఫుట్‌నోట్ విషయము చూడదగును. వ.గో.కృ.

‡ శ్రీనేమానివారు "విశ్వేదేవుఁడు" దేవతగానేకవచన ప్రయోగములో వ్రాసిరిగాని ఋగనువాదముల నరయుచో "విశ్వేదేవతలు" బహువచన ప్రయోగమే సార్థకమనిపించును. వ.గో.కృ.

(2) క॥ దేవానుగ్రహ బుద్ధియు, దేవతల శుభంబులన్ని దివ్యులచెలిమిన్
దేవతలు! మీరలిచ్చుచు, [1]దీవించుఁడు మాకు సకలతేజము లలరన్ ॥ 69

(3) గీ॥ అర్యమాశ్వుల మిత్రుని నదితమునిని, దక్షవరుణుల, సోముని ధర్మభాగు
వేదబుక్కులతో మేము వేడుకొనెద, మధిక సుఖమిచ్చెదరుగాక నా దివిజులు ॥ 70

(4) సీ॥ వాయుదేవుఁడుమాకు వర్ధితసుఖదమౌ భేషజంబునుమాకుఁ బెట్టవలయుఁ
గానక కన్న సంతానంబుగల పృథ్వి భేషజంబునుమాకుఁ బెట్టవలయు
వర్షదానంబుల వర్ధిల్లుగగనంబు భేషజంబునుమాకుఁ బెట్టవలయు
సోమంబుఁ బుట్టించు సొంపారుగ్రావలు భేషజంబులమాకుఁ బెట్టవలయు
గీ॥ దేవతావైద్యులగు నశ్వి దేవులెలమిఁ, దలఁపు నొలుపును బలమును గలుఁగఁజేయ
నౌషధంబులనిచ్చుచు నాదరమున, నుతులవినెదరుగాక సన్మతులతోడ ॥ 71

(5) మ॥ సకలైశ్వర్యయుతున్ సమస్తజగతీ సంరక్షకున్ నిర్మలా
త్మకు దేవేంద్రుని రక్షణార్థమయి సంసేవింతు మర్థార్థ మే
మిఁకఁబూషున్ సకలారి గర్వదమునున్ హేళాపరున్ నిత్యమున్
సుకరంబౌనటు మేము పిల్చెదము మాసూక్తి ప్రపంచంబునన్ ॥ 72

(6) మ॥ స్వస్తినొసంగుఁగాక హరి సంస్తవమందుచు నెల్లవేళలన్
స్వస్తినొసంగుఁగాక ఖలశత్రుగణంబులఁ ద్రుంచు తార్క్ష్యుఁడున్
స్వస్తినొసంగుఁగాక నలచారుకరుండు దయామయాత్ముఁడై
స్వస్తినొసంగుఁగాక సువిశాల మనస్కుఁడు [2]పూషమాకిలన్ ॥ 73

పాఠాంతరము

†గీ॥ ఇంద్రుఁడిచ్చుమేలు వృద్ధశ్రవుఁడువిశ్వ, వేదుఁడైన పూషవిభుఁడునట్లు
తా నరిష్టనేమి తార్క్ష్యుండు మాకు బృహస్పతియును శుభదు లగుదురెలమి ॥ 74

(7) ఉ॥ ఎవ్వరితల్లి పృశ్ని మఱియెవ్వరు పావకజిహ్వలౌదురో
యెవ్వరు యాగదేశముల కేగుచునుందురొ హవ్యభుక్తికై
యెవ్వరి నేత్రజాతరుచి యేత్తెర భాస్కరుకాంతిఁ బోలునో
యెవ్వరు సర్వరక్షకు లహీనులు వారలు మమ్ముఁగావుతన్ ॥ 75

1. "జీవించెడు నటులమమ్ము దీవింపండీ!" (వ్రా.ప్ర.పా.) ఈ పాదమునఁ బ్రయుక్తమైన "దీవింపండీ" అను వ్యావహారిక భాషాపద ప్రయోగమునకేమిగాని అసలు యతియే తప్పినది. ఈ యతిభంగదోషమును దృష్టినిడికొని మొత్తము పాదము సవరింపఁబడినది. వ.గో.కృ.
2. పూషయెంతయున్ (తొ.పా.)

† గమనిక:- ఇది పాఠాంతరముగా వ్రాతపతిలోఁ బ్రక్కపుటలో (294) వ్రాయఁబడినది. ఈ పద్యమే 15.b సంఖ్యగల సంపుటములో 180వపుటలోఁ బాఠాంతరముగా వ్రాయఁబడినది. దీనినిబట్టి చూడఁగా నీపాఠాంతరము మొదట15.b సంఖ్యగల సంపుటములోనే వ్రాయఁబడి తరువాత 1వసంపుటములోని యెడమప్రక్క (294వ) పుటలో వ్రాయఁబడినట్లు కనిపించుచున్నది. వ.గో.కృ.

(8) ఉ॥ దేవతలార! శ్రోత్రములఁదీయఁగ వింధుముగాక భద్రముల్
దేవతలార! నేత్రముల దివ్యము, జూతుముగాక మీకృపన్
దేవతలార! చేయుదు ముదీర్ణశరీరముతోడ సంస్తుతుల్
దేవతలార! యాయువును దేవహితంబుగ నిండుమాకిలన్ ॥ 76

పాఠాంతరము

*ఉ॥ వింధుముగాత మాచెవుల వేలుపులార! శుభంబులెప్పుడున్
గందుము గాత భద్రములె కన్నుల నో యజనీయులార! యె
ప్డుం దిరమైన యంగముల పోఁడిమి మిమ్ముఁ నుతించువారమై
యుందుముగాత నాయు విరవొందఁగ మేనుల నీకు నింపుగా ॥ 77

(9) †క॥ శత శరదమ్ములు నిండుగ, సతతము దేవాళిదయను సంతతియు సదా
పితలౌచును బుణ్యగతులఁ, బ్రతిహతి లేకుండవెలుఁగ బ్రతుకుత జగతిన్ ॥ 78

(10) క॥ అదితియె సురలోకంబగు, నదితియె తలిదండ్రు లదితియోఁ బుత్రుండున్
మదినూహింపఁగ సర్వం, బదితిమయంబగును నటుల నౌ టబ్రంబే! ॥ 79

## సూక్తమ్—90

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—విశ్వేదేవాః

ఛందః—గాయత్రీ, 9 అనుష్టుప్

(1) ఋజునీతీ నో వరుణో మిత్రో నయతు విద్వాన్ । అర్యమా దేవైః సజోషాః ॥ 86

(2) తే హి వస్వో వసవానాస్తే అప్రమూరా మహోభిః । వ్రతా రక్షన్తే విశ్వాహా ॥ 87

*గమనిక:—ఈ పద్యము పాఠాంతరముగా 15.b సంఖ్యగల సంపుటములో 179 వ పుటలోను, 1 వ సంపుటములోని 294 వ దగు నెడమప్రక్క పుటలోను వ్రాయఁబడినది. దీనినిబట్టి చూడఁగా నీ పాఠాంతరము తొలుత 15.b సంఖ్యగల సంపుటములోనే వ్రాయఁబడి తరువాత 1వ సంపుటములోని యెడమప్రక్క (294వ) పుటలో వ్రాయఁబడినట్లు కనిపించుచున్నది. వ.గో.కృ.

† లుప్తభాగ పూరణకర్త. వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య. శ్రీ నేమానివారు తెలుఁగు ననువదించుటలో నీ సూక్తమున మూలములో దశఋక్కులు గలవని మరచి పదియవ ఋక్కును దొమ్మిదవ ఋక్కుగా ననువదించిరి. "అదితియె సురలోకంబగు" నిత్యాది పద్యము పదవ ఋక్కునకనువాదము. అందువల్లఁ దొమ్మిదవ ఋక్కున కనువాదముగా "శతశరదమ్ములునిండుగ" నిత్యాదికందపద్యమును నేనువిరచించి యీ లుప్తభాగమును బూరించితిని. శతశరదమ్ములని యిక్కడఁ బేర్కొనఁబడినది. గతములో 1మం—73వ సూక్తములోని 9వ ఋక్కు సందర్భముగా నూరు హేమంతముల విషయమై శ్రీ నేమానివారు కొంతవ్రాసిరి. అసలీ నూరుహేమంతములు శతశరదమ్ములని వేదవాఙ్మయములోఁ బ్రయుక్తమగుటలో నున్న యాంతర్య విశేష విషయములకై పీఠిక చూచునది. వ.గో.కృ.

(3) తే అస్మభ్యం శర్మ యంసన్నమృతా మర్త్యేభ్యః । బాధమానా అప ద్విషః ॥ 88

(4) వి నః పథః సువితాయ చియన్త్విన్ద్రో మరుతః । పూషా భగో వన్ద్యాసః ॥ 89

(5) ఉత నో ధియో గో అగ్రాః పూషన్ విష్ణవేవయావః । కర్తా నః స్వస్తిమతః ॥ 90

(6) మధు వాతా ఋతాయతే మధు క్షరన్తి సిన్ధవః । మాధ్వీర్నః సన్త్వోషధీః ॥ 91

(7) మధు నక్తముతోషసో మధుమత్ పార్థివం రజః । మధు ద్యౌరస్తు నః పితా ॥ 92

(8) మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః । మాధ్వీర్గావో భవన్తు నః ॥ 93

(9) శం నో మిత్రః శం వరుణః శం నో భవత్వర్యమా ।

శం న ఇన్ద్రో బృహస్పతిః శం నో విష్ణురురుక్రమః ॥ 94

## సూక్తము—90

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు *

### దేవత—విశ్వేదేవులు

(1,2,3, 4,5) సీ॥ [1]వరుణుండు మిత్రుండు సురుచిరసూర్యుండు ఋజుమార్గమునఁ దనియింత్రుగాక!
మిత్రునివలెవచ్చు మిత్రాదిదేవతల్ స్వీయకర్మలను రక్షింత్రుగాక!
పాపలక్షణ శత్రుపంక్తిఁ గొట్టెడివా రశేషసుఖంబు లిచ్చెదరుగాక!
వందనీయ సమస్త బృందారకశ్రేణి శోభనమును మాకుఁజూపుఁగాక!
గీ॥ మాన్యచరిత విరాజిత! మారుతంబ!, పుణ్యకర్మాభివర్ధక! పూషదేవ!
పశుగణంబులనిచ్చి యేపగిదినైన, స్వస్థిమంతులఁ జేయరె స్వాశ్రితులను ॥ 80

(6) క॥ మధుకర్మఫలము [2]వాయువు, మధువారుల సింధువితతి [3]మాకొసఁగుత నా
మధురౌషధి సంతతియున్, మధురంబై వెలయుఁగాక మానుగ జగతిన్ ॥ 81

ఋషికిసంబంధించిన విశేషవిషయములకై 200 పుటలోఁగల తెలుఁగు 74వ సూక్తము క్రింది విశేషములుచూఁడనగును వ.గో.కృ. 1 వరుణుండు త్రుఁడువనజాత మిత్రుండు (తొ.పా.) 2. గాలులు, (తొ.పా.) మాకొసఁగుతయా (వ్రా.ప్ర.పా. సంధిదోషము) వ.గో.కృ.

(7) గీ॥ నిశలు మధుఫలయుతములై నెగడుఁగాకఁ, బవళు లతిమధురంబులై బరఁగుఁగాకఁ
బుడమియంతయు మధురమై పొసఁగుఁగాక, నభ్రమంతయు మధురమై యలరుఁగాక ॥ 82

(8) క॥ వనపాలక సువనస్పతి, ఘనరవి, మధుకర్మఫలము కలిఁగించుత మా
కనిశము ధేనువులన్నియు, ననుపములౌ పాలనొసఁగునట్టివి యగుతన్ ॥ 83

(9) క॥ వరుణుఁడు మిత్రుఁడు సూర్యుఁడు, సురుచిర శక్రుండుమాకు సుఖకరులుగదా!
పరిపరివిధముల విష్ణుం, డురు సుఖములనిచ్చుఁగాక నుద్యల్లీలన్ ॥ 84

## సూక్తమ్—91

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా—సోమః

ఛందః—త్రిష్టుప్, 5-16 గాయత్రీ, 17 ఉష్ణిక్

(1) త్వం సోమ ప్ర చికితో మనీషా త్వం రజిష్ఠమను [1]నేషి పన్థామ్ ।

తవ ప్రణీతీ పితరో న [2]ఇన్దో దేవేషు రత్నమభజన్త ధీరాః ॥ 95

(2) త్వం సోమ క్రతుభిః సుక్రతుర్భూస్త్వం దక్షైః సుదక్షో విశ్వవేదాః ।

త్వం వృషా వృషత్వేభిర్మహిత్వా ద్యుమ్నేభిర్ద్యుమ్న్యభవో నృచక్షాః ॥ 96

(3) రాజ్ఞో ను తే వరుణస్య వ్రతాని బృహద్ గభీరం తవ సోమ ధామ ।

శుచిష్ట్వమసి ప్రియో న మిత్రో దక్షాయ్యో అర్యమేవాసి సోమ ॥ 97

(4) యా తే ధామాని దివి యా పృథివ్యాం యా పర్వతేష్వోషధీష్వప్సు ।

తేభిర్నో విశ్వైః సుమనా అహేళన్ రాజన్త్సోమ ప్రతి హవ్యా గృభాయ ॥ 98

1. నోషి. (వ్రా.ప్ర.) 2. ఇన్ద్రో (వ్రా.ప్ర.పా.) ఈ పాఠాంతమువల్ల సోముఁడింద్రులకంటె గొప్పవాఁడనియర్థము చెప్పనగును. వ.గో.కృ.

(5) త్వం సోమాసి సత్పతిస్త్వం రాజోత వృత్రహా । త్వం భద్రో అసి క్రతుః ॥ 99

(6) త్వం చ సోమ నో వశో జీవాతుం న మరామహే । ప్రియస్తోత్రో వనస్పతిః ॥ 100

(7) త్వం సోమ మహే భగం త్వం యూన ఋతాయతే । దక్షం దధాసి జీవసే ॥ 101

(8) త్వం నః సోమ విశ్వతో రక్షా రాజన్నఘాయతః । న రిష్యేత్ త్వావతః సఖా ॥ 102

(9) సోమ యాస్తే మయోభువ ఊతయః సన్తి దాశుషే । తాభిర్నోఽవితా భవ ॥ 103

(10) ఇమం యజ్ఞమిదం వచో జుజుషాణ ఉపాగహి । సోమ త్వం నో వృధే భవ ॥ 104

(11) సోమ గీర్భిష్ట్వా వయం వర్ధయామో వచోవిదః । సుమృళీకో న ఆ విశ ॥ 105

(12) గయస్ఫానో అమీవహా వసువిత్ పుష్టివర్ధనః । సుమిత్రః సోమ నో భవ ॥ 106

(13) సోమ రారన్ధి నో హృది గావో న యవసేష్వా । మర్య ఇవ స్వ ఓక్యే ॥ 107

(14) యః సోమ సఖ్యే తవ రారణద్ దేవ మర్త్యః । తం దక్షః సచతే కవిః ॥ 108

(15) ఉరుష్యా ణో అభిశస్తేః సోమ ని పాహ్యంహసః । సఖా సుశేవ ఏధి నః ॥ 109

(16) ఆ ప్యాయస్వ సమేతు తే విశ్వతః సోమ వృష్ణ్యమ్ । భవా వాజస్య సంగథే ॥ 110

(17) ఆ ప్యాయస్వ మదిన్తమ సోమ విశ్వేభిరంశుభిః । భవా నః సుశ్రవస్తమః సఖా వృధే ॥ 111

(18) సం తే పయాంసి సము యన్తు వాజాః సం వృష్ణ్యాన్యభిమాతిషాహః ।
ఆ ప్యాయమానో అమృతాయ సోమ దివి శ్రవాంస్యుత్తమాని ధిష్వ ॥ 112

(19) యా తే ధామాని హవిషా యజన్తి తా తే విశ్వా పరిభూరస్తు యజ్ఞమ్ ।

గయస్ఫానః ప్రతరణః సువీరో ఽవీరహా ప్ర చరా సోమ దుర్యాన్ ॥ 113

(20) సోమో ధేనుం సోమో అర్వన్తమాశుం సోమో వీరం కర్మణ్యం దదాతి ।

సాదన్యం విదథ్యం సభేయం పితృశ్రవణం యో దదాశదస్మై ॥ 114

(21) అషాళ్హం యుత్సు పృతనాసు పప్రిం స్వర్షామప్సాం వృజనస్య గోపామ్ ।

భరేషుజాం సుక్షితిం సుశ్రవసం [1]జయన్తం త్వామను మదేమ సోమ ॥ 115

(22) త్వమిమా ఓషధీః సోమ విశ్వాస్త్వమపో అజనయస్త్వం గాః ।

త్వమా తతన్థోర్వాన్తరిక్షం త్వం జ్యోతిషా వి తమో వవర్థ ॥ 116

(23) దేవేన నో మనసా దేవ సోమ రాయో భాగం సహసావన్నభి యుధ్య ।

మా త్వా తనదీశిషే వీర్యస్యోభయేభ్యః ప్ర చికిత్సా గవిష్టౌ ॥ 117

## సూక్తము — 91

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—సోముఁడు

(1) ఉ॥ †స్తోత్రముచే నెఱుంగుదువు సోముఁడ! మమ్ముల నీవుకాన సం
స్తోత్రముగన్న కర్మఫలసూతికి హేతువులైన దారు ల
త్యాత్రముతోడఁ జూపఁగల వత్యధికంబగు వి త్తరాశికిం
బాత్రములైరి మాపితలు పన్నుగమమ్ముల నట్ల చేయుమా! ॥ 85

1 యజన్తం (వ్రా.ప్ర.) ఈ వ్రాతప్రతి పాఠమువల్లనర్థమమారును. ఆంధ్రానువాదపద్యము (21ఋ. 95వ పద్యము) ఈ వ్రాతప్రతి పాఠానుగుణముగాఁ గన్పట్టును. వ.గో.కృ.

* ఋషికి సంబంధించిన విశేషవిషయములకై తెలుఁగు 200పుటలోని 74వ సూక్తముక్రింది ఫుట్‌నోట్ చదువవలయును. వ.గో.కృ.

† సోమరసపానీయముచేతనే వైదికయుగమందఖండ సామ్రాజ్య వైభవమనుభవింపఁ గల్గిరి. అప్పటి యార్యులేకాక వారిపూర్వులు నమందానందమనుభవించినట్లు సూచన కలదు. (వే.వేం.న.శా.)

(2) చ॥ అనుపమ యజ్ఞకర్మల సమంచిత కర్తుఁడవౌదు, శ్రీతతిం
దనరుటచేత నీవు బలదక్షుఁడవౌదువు కోర్కెలిచ్చుటన్
ఘనమగు కామదాతవు, సుకాంక్షితముల్ సరిపెట్టుచుండుటన్
వినుతుఁడ! యన్నవంతుఁడవు, వేగము మాకు నొసంగు సంపదన్ ॥ 86

(3) చ॥ వరుణుని కార్యముల్వలె నవారితముల్ శశీ! నీదు కార్యముల్
దొరవిల జన్మిగట్టులకుఁ దోరపుఁ గారణమౌదు కర్మకుం
బరువడి నీదుధామము విభావసురీతిని వెల్గునిచ్చెడుం
జిరము సమస్త కర్మలకుఁ జేయుదు వృద్ధిని నీవునన్నిటన్ ॥ 87

(4) సీ॥ అవకాశరహితమౌ నాకాశవీథిని నిలిచినధామంబు నీదికాదె ?
సర్వసర్వంసహా సంపూర్ణతలమున నిలిచినధామంబు నీదికాదె ?
సౌఖ్యకరంబగు సలిలరూపంబున నిలిచినధామంబు నీదికాదె ?
పరమదృఢంబైన పర్వతశ్రేణిని నిలిచినధామంబు నీదికాదె ?
గీ॥ ధామమంతయునీలోన దాగియుండె, రాజమానుండ వగుటచే రాజవౌదు
వఖిల యజమానదత్తమౌ హవ్యమెల్ల, నందుకొనరాదె సోముఁడా! యాదరమున ॥ 88

(5) గీ॥ బహుళ కర్మలఁజేసెడు బ్రాహ్మణులకు, నధిపుఁడవు శత్రురాజి సంహారకుఁడవు
నీవులేకున్న కర్మలులేవు కాన, యాగరూపుండ వగుదువు యజ్ఞదేవ ॥ 89

(6,7,8, 9,10) సీ॥ చిరభక్తులకునీవు జీవనౌషధమౌట జీవించియుందుము జీవితేశ!
యోషధిలతలకు నొనరంగఁబతివౌట స్తోత్రంబులందుము సోమదేవ!
పాపులనెల్లరఁ బరిమార్చుటంజేసి మాపాపముల్గొట్టు మాన్యచరిత!
ధరమహాత్ములకెల్ల ధనదుండవగుటను ధనసంచయంబిమ్ము ధార్మికుండ!
గీ॥ చరుపురోడాశములనిచ్చు చారుపురుష!, సుఖము నశియింపకుండఁగఁ జూడుమయ్య!
శ్రోత్రలక్షణ వాక్యముల్ శ్రుతినిఁబెట్టి, యజ్ఞగృహమున కరుగుము యజ్ఞపురుష! ॥ 90

(11,12, 13,14) సీ॥ విధివాక్యములనిన్ను వృద్ధిఁబొందింతుము సుఖమునీయఁగరాదె సూరివినుత!
రోగముహరియించు రుచిగల్గియుండుటన్ బుష్టినీయఁగరావె పుణ్యచరిత!
పచ్చికనేలలపజ్జ గోవులమాట్కి మాలోనఁదిరుగవె మాన్యసోమ!
పుత్రాదిసంపదఁ బురుషుఁడుండెడిరీతి మాతోడమెలఁగవె మధురధామ!
గీ॥ నీచెలిమి గోరుచుండెడి నిఖిలమిట్టి, సూక్తులను వేడుకొనియేని సోమ! నిన్నుఁ
బనులు సిద్ధించుచుండవె! భక్తగణముఁ, జూచుచుందువు ప్రీతితో సొగసుకాఁడ! ॥ 91

(15) క॥ నిందలగమిఁ బోఁగొట్టుము, ముందుగఁ బాపముహరించి ముదమున నీ వా
నందమున హితము నిచ్చుచు, సుందర! హితకారివనెడి శోభనుగనుమా! ॥ 92

(16,17) క॥ అతిశయ మదవంతుఁడవై, మతిగల్గి సమస్త వృక్షమాలికచేతన్
స్తుతిగలుఁగ వృద్ధిఁబొందుము, వ్రతులకు సరసాన్నమిచ్చి వర్ధిలుము శశీ! ॥ 93

(18,19, 20) సీ॥ వైరివిచ్ఛేదక బలరాశియుంట మాకీరాన్నములు నిన్నుఁజేరుఁగాక
సకిలధామంబుల కధిపుండవగుట నీకాంతులు భూమిపైఁ గలుఁగుఁగాక
విత్తాభివర్ధక వీరుండవగుట మాదురితంబులన్నియుఁ దొలఁగుఁగాకఁ
బుత్రాభివర్ధక పురుషుండవగుట మాపుత్రకహింసలు పోవుఁగాక
గీ॥ హవ్యలక్షణమౌ నన్నమందఁజేయు, పురుషగణమెల్ల ధనమును బొందుఁగాకఁ
గర్మకరులకుఁ బుత్రాళి కలుఁగుఁగాక, ననుచువేడుచు నున్నారమబ్జ! వీఁక ॥ 94

(21) ఉ॥ సూనుల నిచ్చువాఁడు బహుశోభ నొసంగెడువాఁడు వర్షమున్
దానము లిచ్చువాఁడు ఘనధర్మ బలంబులఁ గాఁచువాఁడు మే
ధానిధియైనవాఁడు సువిధంబున నిష్టికిఁబోవువాఁడు ల
క్ష్మీనిధియైన రాత్రి పతిచేర్పుత భక్తము మాకునిచ్చులున్ ॥ 95

(22) మ॥ భువిపై వెల్గుట కోషధీ ప్రచయముం బుట్టించినట్లేల స
ద్భువనంబున్ సృజియించినావు నభముంబొందించినా వంతటన్
వివిధంబైన తమస్సుకాంతితతిచే వేఁగొట్టుచున్నావు స
త్కవి పూజ్యుండవు సోముఁడా!నిరతముం గళ్యాణముంజేయుమా! ॥ 96

(23) చ॥ అనుపమ బుద్ధిచేఁదలఁచి యత్యధికంబగు విత్తమిమ్ము మా
కనయముగల్గు శత్రువుల నందఱఁద్రుంపుము కక్కసంబునం
బనిఁగొని యెల్లనైనికుల భాగ్యముకావుము సర్వవైరి వ
ర్తనములఁగొట్టి మాకుఁదగు దారినిఁజూపుము సోమదేవుఁడా! ॥ 97

సూక్తమ్—92

ఋషిః—గోతమో రాహూగణః

దేవతా-ఉషాః, 16-18 అశ్వినౌ

ఛందః—1-4 జగతీ. 5-12 త్రిష్టుప్, 13-18 ఉష్ణిక్,

(1) ఏతా ఉత్యా ఉషసః కేతుమక్రత పూర్వే అర్ధే రజసో భానుమఞ్జతే ।
నిష్కృణ్వానా ఆయుధానీవ ధృష్ణవః ప్రతి గావోఽరుషీర్యన్తి మాతరః ॥ 118

(2) ఉదపప్తన్నరుణా భానవో వృథా స్వాయుజో అరుషీర్గా అయుక్షత ।
అక్రన్నుషాసో వయునాని పూర్వథా రుశన్తం భానుమరుషీరశిశ్రయుః ॥ 119

(3) అర్చన్తి నారీరపసో న విష్టిభిః సమానేన యోజనేనా పరావతః ।
ఇషం వహన్తీః సుకృతే సుదానవే విశ్వేదహ యజమానాయ సున్వతే ॥ 120

(4) అధి పేశాంసి వపతే నృతూరివాపోర్ణుతే వక్ష ఉస్రేవ [1]బర్జహమ్ ।
జ్యోతిర్విశ్వస్మై భువనాయ కృణ్వతీ గావో న వ్రజం వ్యుషా ఆవర్తమః ॥ 121

(5) ప్రత్యర్చీ రుశదస్యా అదర్శి వి తిష్ఠతే బాధతే కృష్ణమభ్వమ్ ।
స్వరుం న పేశో విదథేష్వఞ్జ్ చిత్రం దివో దుహితా భానుమశ్రేత్ ॥ 122

(6) అతారిష్మ తమసస్పారమస్యోషా ఉచ్ఛన్తీ వయునా కృణోతి ।
శ్రియే ఛన్దో న స్మయతే విభాతీ సుప్రతీకా సౌమనసాయాజీగః ॥ 123

(7) భాస్వతీ నేత్రీ సూనృతానాం దివః స్తవే దుహితా గోతమేభిః ।
ప్రజావతో నృవతో అశ్వబుధ్యానుషో గోఅగ్రాగ్ం ఉప మాసి వాజాన్ ॥ 124

(8) ఉషస్తమశ్యాం యశసం సువీరం దాసప్రవర్గం రయిమశ్వబుధ్యమ్ ।
సుదంససా శ్రవసా యా విభాసి వాజప్రసూతా సుభగే బృహన్తమ్ ॥ 125

1. వర్జహమ్ (వ్రా.ప్ర.)

(9) విశ్వాని దేవీ భువనాభిచక్ష్యా ప్రతీచీ చక్షురుర్వియా వి భాతి ।

విశ్వం జీవం చరసే బోధయన్తీ విశ్వస్య వాచమవిదన్మనాయోః ॥ 126

(10) పునః పునర్జాయమానా పురాణీ సమానం వర్ణమభి శుమ్భమానా ।

శ్వఘ్నీవ కృత్నుర్విజ ఆమినానా మర్తస్య దేవీ జరయన్త్యాయుః ॥ 127

(11) వ్యూర్ణ్వతీ దివో అన్తాగ్ం అబోధ్యప స్వసారం సనుతర్యుయోతి ।

ప్రమినతీ మనుష్యా యుగాని యోషా జారస్య చక్షసా వి భాతి ॥ 128

(12) పశూన్న చిత్రా సుభగా ప్రథానా సిన్ధుర్న క్షోద ఉర్వియా వ్యశ్వైత్ ।

అమినతీ దైవ్యాని వ్రతాని సూర్యస్య చేతి రశ్మిభిర్దృశానా ॥ 129

(13) ఉషస్తచ్చిత్రమా భరాస్మభ్యం వాజినీవతి । యేన తోకం చ తనయం చ ధామహే ॥ 130

(14) ఉషో అద్యేహ గోమత్యశ్వావతి విభావరి । రేవదస్మే వ్యుచ్ఛ సూనృతావతి ॥ 131

(15) యుక్ష్వా హి వాజినీవత్యశ్వాగ్ం అద్యారుణాగ్ంఉషః । అథా నో విశ్వా సౌభగాన్యా వహ ॥ 132

(16) అశ్వినా వర్తిరస్మదా గోమద్ దస్రా హిరణ్యవత్ । అర్వాగ్రథం సమనసా ని యచ్ఛతమ్ ॥ 133

(17) యావిత్థా శ్లోకమా దివో జ్యోతిర్జనాయ చక్రథుః । ఆ న ఊర్జం వహతమశ్వినా యువమ్ ॥ 134

(18) ఏహ దేవా మయోభువా దస్రా హిరణ్యవర్తనీ । ఉషర్బుధో వహన్తు సోమపీతయే ॥ 135

## సూక్తము—92

### ఋషి—రాహుగణపుత్రుఁడు గోతముఁడు *

### దేవత—ఉషస్సు†

(1) మ॥ అమలోషః ప్రభ లంతటన్ వెలుఁగుచున్ హత్తించి ప్రాగ్దిక్కునం
గమనీయాకృతిఁగ్రాలు భాస్కరు లసత్కాంతిన్ విడంబించెడున్
[1]రమణీయాయుధ పంక్తిఁజూచి సుభట వ్రాతంబు తోషించు న
ట్లమలంబైన ప్రభాతరోచి గని యాయాగోవు లుప్పొంగెడున్ ॥ 98

(2) ఉ॥ ఎంతయుఁ దొందఱంబడుచు నెఱ్ఱని ఘృష్టులు పారుచుండి యా
వంతయు నాలసింపక సువాజులనొప్పు రథంబునెక్కి యే
వింతయులేక యెల్లెడల వేగముపోవుచుఁ బ్రాణికోటి క
త్యంత ముదంబుఁజేయుచును హంసునిఁజేరుచునుండెఁ జూఁడుఁడీ! ॥ 99

(3) చ॥ విలసిత కల్యదేవతలు! వేడుకతో శుభకాంతిమాలలం
గలిత నభఃప్రదేశమును గప్పుచునుండెను నొక్కమారుగా
నలఘు విరాజితంబులగు నాయుధముల్ గొను యోధులట్టి ని
శ్చలగతిఁబొంది యన్నమును జయ్యనమాకు [2]ననుగ్రహించుతన్ ॥ 100

(4) ఉ॥ ‡నాపితకేశ పాశమును నాశముఁ జేసెడురీతి లోక సం
స్థాపితమైన చీఁకటిని జయ్యనఁగొట్టుచు సర్వగోగణం
బోపి పయః ప్రదేశమును నొప్పుగఁ జూపెడునట్లు రూపముం
జూపుచు గోవుగోష్ఠమున శోభిలు మాట్కినుషస్సు [3]వెల్గెడిన్ ॥ 101

(5) ఉ॥ అల్లదె కల్యకాంతితతి యత్యధికంబగు నంధకారముం
గొల్లఁగఁగొట్టి దిక్కులకు గొబ్బునఁబోవుచు యాగభూమిలోఁ
బెల్లగు యూపదారువును బెద్దలు నేతిని గప్పునట్లుగా
నెల్లనభంబుఁగప్పి సరినేగుచునుండును సూర్యరశ్మికై ॥ 102

* ఋషికి సంబంధించిన విశేషములకై 200 పుట తెలుఁగు 74 వ సూక్తము క్రింది పుట్నోట్ విషయములు చూఁడనగును. వ.గో.కృ.

† 16-18 ఋక్కులకు అశ్వినీదేవతలు దేవతలుగాఁ జేర్కొనుట జరిగినది. ఆంధ్రానువాద పద్యములు కూడ నశ్విదేవతల నుద్దేశించియే రచియింపఁబడినవి. కాని ఆంధ్రానువాద గ్రంథములో (వ్రాతప్రతి 1వ. సంపుటము, 303వ పుట) 16-18 ఋక్కులకు అశ్విదేవతలు దేవతలుగాఁ జేర్కొనఁబడ లేదు. వ.గో.కృ. 1. రమణీయాయుధ (వ్రా.ప్ర.పా.) 2. ననుగ్రహింపుతన్ (వ్రా.ప్ర.పా.

‡ నాపిత—ఆర్యులకు క్షురకర్మ చేయువారొక భిన్నజాతిగలవారుగా లేకున్నను క్షురకర్మయే వృత్తిగాఁ బెట్టుకొన్న వారందరు నాపితులుగా నున్నట్టు తోఁచుచున్నది. అట్లే యే వృత్తినవలంబించిన వా రాజాతివారని తేలుచున్నది. —నే॥వేఁ॥న॥శాస్త్రి. 3. వెల్గెడిన్ (వ్రా.ప్ర.పా.)

(6) ఉ॥ చీఁకటి కోణమున్‌విడచి చేరితినిప్పుడు కాంతిధామమున్
వీఁకయెలర్పఁదెల్వి నతివేగమె పొందితి శ్రీనిమిత్తమై
యాక యొకింతలేక జనుఁడాఢ్య సమీపముచేరి నవ్విన
ట్లీ కమనీయ కల్యసతి యింపుగ హాసముఁజేయు నెంతయున్ ॥ 103

(7) ఉ॥ గోతమముఖ్యు లందఱముగూడి నుతించితి మర్త్యపుత్రి వి
ఖ్యాతహితోక్తి మూలమునఁగావున మాకు సుపుత్రపౌత్ర వి
స్ఫీతిని నిమ్ము దాసజనప్రీతిని నిమ్ము హయాన్నవారమున్
బ్రీతిగ నిమ్ము గోగణముఁ బ్రీతిగ నిచ్చి ధనంబు నీయుమా! ॥ 104

(8) చ॥ కొమరుగనన్న ధాత్రివతి కోమల సంస్తవయుక్తవందుచే
విమలయశః కరంబు ఘనవీర భటావళి పుత్రపౌత్ర స
త్క్రమ పరివీత సుందరము కర్మకరాఢ్యము సంఘయుక్తమౌ
నమలధనంబు నీయవలదమ్మ! యుషస్సతి! మాకు నెంతయున్ ॥ 105

(9) చ॥ అంతట వెల్గుఁజేయుచుఁ దనంతఁ బ్రతీచికిఁబోయి పిమ్మటం
జింతలుమాని వృద్ధిఁగను చిత్తముతో సకల ప్రపంచ మే
భ్రాంతియులేక దిర్గుటకుఁ బ్రాభవమిచ్చు నుషస్సు ప్రీతితో
నెంతయు సంస్తవంబుల నహీనముగాఁగను సూనృతాత్మయై ॥ 106

(10) చ॥ ప్రతిదినముం జనించినను బ్రాతదిగాక యుషస్సు నిత్యమున్
క్షితిగల ప్రాణికోటులకుఁ జక్కని నాయువుదగ్గఁ జేయుచున్
సతతము వెల్గఁజేయుచు విశాలముగాఁ జరియించు పక్షి సం
తతిఁగని హింసఁజేసెడు మతింగల బోయెత సామ్యమొందుచున్ ॥ 107

(11) మ॥ గగనప్రాంతములందు వెల్గెడుమహా గాఢాంధకారచ్ఛటం
దెగువంగొట్టి నిశీథినీసహజకుం దీనత్వమున్ మాన్పుచున్
సుగతిన్ నెట్టుచు మర్త్యజీవితములన్ సూర్యప్రియా శోభలన్
నగుచుంబొందు నుషస్సతీమణి, ప్రభన్ నవ్యంబుగావెల్గదే! ॥ 108

(12) ఉ॥ ఆవులఁగాచువాఁ డడవినావులనట్టు లుషస్సురోచులన్
భావ మెలర్పఁ ద్రిప్పు చతిభాసురలీల మెలంగి పిమ్మటన్
జీవనమెట్లు నిమ్నమునుజేరునొ యట్ల నభంబుఁ జేరుచున్
లావుగ సూర్యరశ్ములఁ దొలంగకపొందును గర్మధారియై ॥ 109

(13) క॥ మనమునఁదలపోసి కడున్, ధనమున్ మాకిమ్ముషస్స! ధర్మనిరతి నా
ధనమునఁ బుత్రులుమేమున్, ఘనముగ జీవింతుమమ్మ! కాంక్షితధాత్రీ! ॥ 110

(14) గీ॥ ఆవులుండినయట్టులే యశ్వతతియుఁ, గలదునీకిల దీప్తియుఁగలదు ధనము
కాన ధనసాధ్యకర్మలు కలుఁగనిమ్ము, సూనృతాత్మ! యుషోదేవి! శోభనిమ్ము ॥ 111

(15) గీ॥ అరుణవర్ణముఁ గలయట్టి యశ్వములను, రథమునకుఁ బూన్చి[1] యది యెక్కి-రమ్ము వేగ
బలముగలదాన! మాకు సౌభాగ్యములను, గలుఁగఁజేయుముషోదేవి! కరుణనీవు ॥ 112

(16) గీ॥ అశ్విదేవతలార! యోయధికులార!, గో హిరణ్యంబులంగొని కొఱతలేక
యుష్మదీయ రథంబెక్కి- యుచితమైన, గృహమునకు వచ్చి మీరలు కీర్తిఁగనుఁడు ॥ 113

(17) క॥ గగనమున వెల్గుచుండెడు, నగణిత తేజస్సు మాకు నందించిన యా
సొగసుగల యశ్వియుగ్మము, తగు [2]బలమందించుఁగాకఁ దద్దయుఁ బ్రీతిన్॥ 114

(18) క॥ సుఖకరులశ్వులు మీరలు, మఖమున సోమంబుఁ ద్రావ మట్టుచు నరులన్
నిఖిల హిరణ్మయరథముల, సఖులుగఁ గూర్చుండి రండు : సారసమతితోన్ ॥ 115

## సూక్తమ్ 93

### ఋషిః—గోతమో రాహూగణః

### దేవతా—అగ్నీషోమౌ

ఛందః—1-3 అనుష్టుప్; 4-7, 12-త్రిష్టుప్, 8-జగతీ త్రిష్టుబ్వా, 9-11 గాయత్రీ.

(1) అగ్నీషోమావిమం సు మే శృణుతం వృషణా హవమ్ ।
ప్రతి సూక్తాని హర్యతం భవతం దాశుషే మయః ॥ 136

(2) అగ్నీషోమా యో అద్య వామిదం వచః సపర్యతి ।
తస్మై ధత్తం సువీర్యం గవాం పోషం స్వశ్వ్యమ్ ॥ 137

(3) అగ్నీషోమా య ఆహుతిం యో వాం దాశాద్ధవిష్కృతిమ్ ।
స ప్రజయా సువీర్యం విశ్వమాయుర్వ్యశ్నవత్ ॥ 138

1. బూచి (వా.ప్ర.పా.) 2. బలమందింపుగాక (వా.ప్ర.పా.)

(4) అగ్నీషోమా చేతి తద్వీర్యం వాం యదముష్ణీతమవసం పణిం గాః ।
అవాతిరతం బృసయస్య శేషో ఽవిన్దతం జ్యోతిరేకం బహుభ్యః ॥ 139

(5) యువమేతాని దివి రోచనాన్యగ్నిశ్చ సోమ సక్రతూ అధత్తమ్ ।
యువం సిన్ధూఁరభిశస్తేరవద్యాదగ్నీషోమావముఞ్చతం గృభీతాన్ ॥ 140

(6) ఆన్యం దివో మాతరిశ్వా జభారామథ్నాదన్యం పరి శ్యేనో అద్రేః ।
అగ్నీషోమా బ్రహ్మణా వావృధానోరుం యజ్ఞాయ చక్రథురు లోకమ్ ॥ 141

(7) అగ్నీషోమా హవిషః ప్రస్థితస్య వీతం హర్యతం వృషణా జుషేథామ్ ।
సుశర్మాణా స్వవసా హి భూతమథా ధత్తం యజమానాయ శంయోః ॥ 142

(8) యో అగ్నీషోమా హవిషా సపర్యాద్ దేవద్రీచా మనసా యో ఘృతేన ।
తస్య వ్రతం రక్షతం పాతమంహసో విశే జనాయ మహి శర్మ యచ్ఛతమ్ ॥ 143

(9) అగ్నీషోమా సవేదసా సహూతీ వనతం గిరః । సం దేవత్రా బభూవథుః ॥ 144

(10) అగ్నీషోమావనేన వాం యో వాం ఘృతేన దాశతి । తస్మై దీదయతం బృహత్ ॥ 145

(11) అగ్నీషోమావిమాని నో యువం హవ్యా జుజోషతమ్ । ఆ యాతముప నః సచా ॥ 146

(12) అగ్నీషోమా పిపృతమర్వతో న ఆ ప్యాయన్తాముస్రియా హవ్యసూదః ।
అస్మే బలాని మఘవత్సు ధత్తం కృణుతం నో అధ్వరం శ్రుష్టిమన్తమ్ ॥ 147

## సూక్తము 93

### ఋషి—రాహూగణపుత్రుఁడు గోతముఁడు*

### దేవత—అగ్ని, సోముఁడు

(1,2,3) క॥ మతిమంతులార! మామా, మతులంగల నుతులనెల్ల మన్నించుచు మా
కతివిపులంబగు నాయువు, సతతము ధనపుత్రపౌత్ర సంపద నిడుఁడీ! ॥ 116

(4) క॥ ఎయ్యది వృత్రునిన్ద్రుంచెనొ? యెయ్యది పణిధనముఁ దెచ్చియిచ్చెనొ? సిరితో
నెయ్యది సూర్యుంజేరునొ?, [1]యయ్యదె మీ వీర్యమధిక మౌనటు చేయున్ ॥ 117

(5) చ॥ అనుపమ విస్తృతిన్వెలుఁగు, నంబరవీథిని నుండునట్టి యా
ఘనరవి తారకావళులఁ గట్టడిఁజేయుచు మీరుకూరులై
పెనఁగొను వృత్రపాపమునఁ బేరిన సింధుజలంబులన్ని చ
య్యనను ద్రవింపఁజేయ నవియంతటఁ బారవె మీ సుశక్తిచేన్ ॥ 118

(6) ఉ॥ సోముఁడ! యగ్ని! మీకవను సోముఁడుపుట్టె ప్రశంసనీయుఁడై
శ్యామవిహంగ మూలమునఁజారు మహీధ్రముపైని; నగ్ని దా
నీమముతోఁ బ్రభంజనుని నేర్పున జారెను మిన్నునుండి యీ
భూమికిఁగాన, మీరు మఖభూమి నొనర్చిరి భాసురంబుగన్ ॥ 119

(7) ఉ॥ [2]ఆవహనీయ సన్నిధిని నంచిత హవ్యమునందుకొంచు మీ
రీహల, మాసు సేవలను, నేత్రెరమాకయి రక్షలిచ్చుచున్
మోహసముద్ధరోగముల మోదముతోడఁ గుదిర్చి భీతులన్
సాహసమూని పాపుచు విశాలముగాఁ బరితుష్టిఁ జేయుఁడీ! ॥ 120

క॥ ఖ్యాతిఁగల పురుషఁడెవ్వఁడు, ప్రీతిన్ హవ్యంబులిచ్చుఁ బెంపెసలారం
జేతోమోదంబొదవఁగ, నాతనికిన్ సుఖమునిచ్చి యంపుఁడుమీరల్ ॥ 121

(8,9,10, 11,12) సీ॥ చరుపురోడాశాదిచారు హవ్యంబిచ్చు భక్తులకై మీరు భక్తమిమఁడు
దేవప్రసిద్ధులె తేజరిల్లుచు మీరలస్మద్గిరంబుల నందుకొనుఁడు
సంస్కృతాజ్యంబుతోఁ జారుహవ్యంబిచ్చు పురుషులకై ధన పూర్తినిడుఁడు
సమధనాహ్వానాది సంపత్తినొప్పి మాస్తోత్రముల్ మీరలు [3]శ్రుతులఁబెట్టఁ
గీ॥ దస్మదీయ హవిస్సులనందుకొనుఁడు, జంటలై వచ్చి వాజుల వెంటనిలుఁడు
భాసురంబగు నాలకుఁబాలనొసఁగుఁ, డెటిఁగి యనలుఁడ! చంద్రుఁడా! జరుగుఁడిపుడు ॥ 122

* ఋషిని గుఱించిన విశేషవిషయములకై 200 పుటలోని తెలుఁగు 74వ సూక్తముక్రింది ఫుట్‌నోట్ విషయముచూఁడదగును. వ.గో.కృ.
1. యయ్యా మీవీర్యమధిక మౌను ధరిత్రిన్ (వా.ప్ర.పా. 1వ సంపుటము 307వ పుట.) ఈ మూలపాఠమిట్లై యున్నచోఁ బద్యమునకు సమన్వయమే కుదరదు. కానఁ బై విధముగా సవరింపఁబడినది. వ.గో.కృ. 2. ఆహవనీయ ప్రాంతమున (తా.పా.) 3. శ్రుతల (వా.ప్ర.పా.)

అనువాకః—15, సూ_క్తమ్—94

ఋషిః—కుత్స ఆఙ్గిరసః

దేవతా—అగ్నిః (జాతవేదాః) 8 (త్రయః పాదాః) దేవాః

16-ఉ_త్తరార్ధస్యఅగ్నిః, మిత్రవరుణాదితిసిన్ధుపృథివీద్యావోఽపి. †

ఛందః—జగతీ. 15-16 త్రిష్టుప్.

(1) ఇమం స్తోమమర్హతే జాతవేదసే రథమివ సం మహేమా మనీషయా ।

భద్రా హి నః ప్రమతిరస్య సంసద్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 148

(2) యస్మై త్వమాయజసే స సాధత్యనర్వా క్షేతి దధతే సువీర్యమ్ ।

స తూతావ నైనమశ్నోత్యంహతిరగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 149

(3) శకేమ త్వా సమిధం సాధయా ధియస్త్వే దేవా హవిరదన్త్యాహుతమ్ ।

త్వమాదిత్యాగ్ం ఆ వహ తాన్ హ్యుశ్మస్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 150

(4) భరామేధ్మం కృణవామా హవీంషి తే చితయన్తః పర్వణాపర్వణా వయమ్ ।

జీవాతవే ప్రతరం సాధయా ధియోఽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 151

(5) విశాం గోపా అస్య చరన్తి జన్తవో ద్విపచ్చ యదుత చతుష్పదక్తుభిః ।

చిత్రః ప్రకేత ఉషసో మహాగ్ం అస్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 152

(6) త్వమధ్వర్యురుత హోతాసి పూర్వ్యః ప్రశాస్తా పోతా జనుషా పురోహితః ।

విశ్వా విద్వాగ్ం ఆర్త్విజ్యా ధీర పుష్యస్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 153

† మిత్రవరుణాదితి......ద్యావోవా అని పాఠాంతరమున్నది గాని యది సరికాదు. వ.గో.కృ.

(7) యో విశ్వతః సుప్రతీకః సదృఙ్ఙసి దూరే చిత్ సన్తళిదివాతి రోచసే ।

రాత్ర్యాశ్చిదన్ధో అతి దేవ పశ్యస్యగ్నే సఖ్యే మా రిషమా వయం తవ ॥ 154

(8) పూర్వో దేవా భవతు సున్వతో రథో ऽస్మాకం శంసో అభ్యస్తు దూఢ్యః ।

తదా జానీతోత పుష్య[1]తా వచో ऽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 155

(9) వధైర్దుఃశంసాగ్ం అప దూఢ్యో జహి దూరే వా యే అన్తి వా కే చిదత్రిణః ।

అథా యజ్ఞాయ గృణతే సుగం కృధ్యగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 156

(10) యదయుక్థా అరుషా రోహితా రథే వాతజూతా వృషభస్యేవ తే రవః ।

ఆదిన్వసి వనినో ధూమకేతునా ऽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 157

(11) అధ స్వనాదుత బిభ్యుః పతత్రిణో ద్రప్సా యత్ తే యవసాదో వ్యస్థిరన్ ।

సుగం తత్ తే తావకేభ్యో రథేభ్యో ऽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 158

(12) అయం మిత్రస్య వరుణస్య ధాయసే [2]ऽవయాతాం మరుతాం హేళో అద్భుతః ।

మృళా సు నో భూత్వేషాం మనః పునరగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 159

(13) దేవో దేవానామసి మిత్రో అద్భుతో వసుర్వసూనామసి చారురధ్వరే ।

శర్మన్త్స్యామ తవ సప్రథస్తమే ऽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 160

1. పుష్పతా (వ్రా.ప్ర.) 2. ధాయసేవయాతాం (వ్రా.ప్ర.)

(14) తత్ తే భద్రం యత్ సమిద్ధః స్వే దమే సోమాహుతో జరసే మృళయత్తమః ।

దధాసి రత్నం ద్రవిణం చ దాశుషే ऽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥ 161

(15) యస్మై త్వం సుద్రవిణో దదాశో[1] ऽనాగాస్త్వమదితే సర్వతాతా ।

యం భద్రేణ శవసా చోదయాసి ప్రజావతా రాధసా తే స్యామ ॥ 162

(16) స త్వమగ్నే సౌభగత్వస్య విద్వానస్మాకమాయుః ప్ర తిరేహ దేవ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 163

ఇతి
ప్రథమోऽష్టకే షష్ఠోऽధ్యాయః
సమాప్తః

## అనువాకము—15, సూక్తము—94

ఋషులు—కుత్సుఁడు, అంగిరసుఁడు*

దేవత—అగ్ని†

(1) చ॥ లలితరథంబుఁ దక్షకుఁడులాగునఁ జక్కఁగఁ జేయునట్టు మా
విలసిత సూక్ష్మబుద్ధి నతివిస్తృత సంస్తవ పూర్వకక్రియల్
సలుపుచు నీదురక్షలను జాలఁగనందెద మగ్నిదేవః నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 123

1. దదాశోనాగాస్త్వ మదితే (వ్రా.ప్ర.)

* ఆంధ్రానువాదము షష్ఠాధ్యాయములోని 94వ సూక్తమునకు వ్రాతప్రతిలో (1వ. సంపుటము. 309పుట) విస్పష్టముగా ఋషులు అని బహువచనముతో పేర్కొనఁబడి కుత్సుఁడు, అంగిరసుఁడు ఇద్దరును నీ సూక్తమునకు ద్రష్టలుగా వ్రాయుటజరిగినది. సంస్కృతమూల గ్రంథములలో నుపలభ్యమానమైన వానిలో "కుత్స ఆంగిరసః" అని అంగిరసుని పుత్రుఁడు కుత్సుఁడుగా మాత్రమే పేర్కొనఁబడినది. శ్రీ నేమానివారికి లభ్యమైన ప్రతిలో ఋషిద్వయము పేర్కొనఁబడియుండనగును. వ.గో.కృ.

† ఈ సూక్తదేవతగా నాంధ్రానువాదములో "అగ్ని" ఒక్కఁడే పేర్కొనఁబడినను ననువాదములో (16 వ ఋగనువాదము 138 వ పద్యము 259 పుట.) సంస్కృత మూలానుగుణమగునట్లుగా "వరుణాది దేవతల్" అని పేర్కొనుట రూపముగా "16-ఉత్తరార్ధస్య అగ్నిః మిత్ర వరుణాదితి సిన్ధుపృథివీద్యావో ऽపి" అన్న సంస్కృతమూలవాక్యము ననుసరించినట్లయినది. వ.గో.కృ.

(2) చ॥ జ్వలనః భవత్కృపాయుతుఁడు చయ్యనఁ గార్యముఁజేయు, వెండియుం
బలమున వైరులంగెలిచి బంధురవిత్తముఁగొందు, నెంతయుం
జలమున, లేమిఁబోనడఁచు చారు భవద్భుజశక్తిచేత నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 124

(3) చ॥ కలితహవిః ప్రపూరముల కమ్మఁదనంబులఁగోరు దేవతల్
చెలువముమీర నీవు తమచెంతకుఁ జేర్చెడి హవ్యమంతయుం
బలిమినిఁ గుక్షిఁబెట్టెదరు భావుకకర్మలు చెల్లుచుండు నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 125

(4) చ॥ [1]మెలఁగుచు నేకవింశతిసమిత్తులఁ గూర్తుమునీకు నాహవిః
కలనకుఁ బర్వవేళ నినుఁ గొంతుము నీవువెలుంగుచుండ ని
శ్చలగతి భూమినుండెదము చాలసుకర్మలఁ జేయుచుండి నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 126

(5) చ॥ అలరెడు నీపరశ్మితతి యన్నివిధంబుల జంతుసంతతిన్
వెలిఁగెడునట్లు సేసి భువి వేయువిధంబులనుండి కాంతిచేఁ
జెలఁగు నుషస్సుమించికడుఁ జిత్రముగా రగులొందుచుండు నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 127

(6) చ॥ సులలిత యజ్ఞకర్మలకు శోభననేతవు దేవహోతవున్
లలితపురోహితుండ వతిలక్షణయుక్త సమస్తకర్మలన్
మెలఁగుచు శోధకుండవయి మెప్పువహించిన వాఁడవౌదు నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! 128

(7) చ॥ విలసిత దేహధారివయి విశ్వముతోఁ దులఁదూఁగి వెల్గుచున్
మెలఁగుచు దూరదేశమున మించునుబోలి చెలంగుచున్ మహా
బలమున నంధకారమును బాపుచు నుండెదవయ్య! నీవు నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 129

(8) చ॥ తలఁచిన మాత్రయాజ్ఞికుఁడు తప్పకవెల్గును యానరీవితోఁ
దొలఁగును మూర్ఖసంచయము తూర్ణముగా నభిశాప [2]పద్ధతిం
జెలఁగెడుమా సువాక్యముల చెన్నువహించును నర్థరీతి నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 130

1. చలమున నేకవింశతిసమిత్తుల (తొ.పా. యతిదోషము.) వ.గో.శ్రీ. 2. "పద్ధతి" శబ్దమునకు రూపాంతరము.

(9) చ॥ బలమగు నాయుధాళిఁగడు భర్జితులౌదురుగాక శాత్రవుల్
ఖలులగు రాక్షసౌఘములు కంపితులౌదురుగాక మేదినిం
గలుషములేని భక్తులకుఁ గల్గునుగాక సుమార్గపక్కి- నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 131

(10) *చ॥ తలఁగని వాయువేగమునఁ దద్దయుఁబోయెడునీదు వాజులం
జెలువుగఁబూన్చి[1] బండి, కది చెంతకుఁజేర్చుచునుండ శబ్దము
జ్జ్వలమగునెద్దు అంకెవలెఁ జారుతరంబుగఁబుట్టి పిమ్మటం
బలువిధ వృక్షరాజముల భావుకధూమముచేతఁగప్పు నీ
చెలిమిని గోరువారలకు చేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 132

(11) చ॥ తలఁపఁగ విస్ఫులింగములు దవ్వననున్న తృణాళినంతయుం
దొలఁగకగాల్పఁ, దద్ధ్వనిని దొందఱగా విని పక్షిసంఘముల్
చలితములౌచుఁ బారుటను, జక్కఁగనౌను బథంబులన్ని, నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 133

(12) చ॥ లలిత మరుద్గణంబునకు లావగుఁ గోపముగాన దానిచేఁ
గలిగెడు బాధలన్నిటిని గాచును మిత్రుఁడు వానిమిత్రుఁడుం
గల సుఖమిచ్చి వారలకుఁగావుము వారలనెన్నునట్టు నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 134

(13) చ॥ చెలువుఁడ వాదితేయులకుఁ జిత్ర తనుండవు యజ్ఞభూమిలోఁ
గల వసురాశినెల్లఁగడుఁ గల్గెడువాఁడవు, కాన రత్నముల్
దలఁకొనియిమ్ము మాకెపుడు దగ్గరనుండుము యజ్ఞశాల నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 135

(14) చ॥ స్థలములయందుఁ బూజఁగొని సంతసమొందుచు నిష్టికర్త కు
జ్జ్వలతరసౌఖ్యమిచ్చి కడుఁజారు రసంబును ద్రావి వానినే
లలిఁగొనియాడి [2]విత్తము దొలంగక యిచ్చుచు నుందువయ్యా! నీ
చెలిమిని గోరువారలకుఁ జేటులుచేరునె? హవ్యవాహనా! ॥ 136

* ఈ చంపకమాల పంచపాది. 1. బూచి (వ్రా.ప్ర.పా.) 2. విత్తమునులావుగనిచ్చుచు, (తా.పా.)

(15) చ॥ ధనపతి! నీదుమూలమున ధన్యుఁడెవండు! పవిత్రకర్మమున్
వినయముతోనొనర్చి కడువెల్గునొ! యెవ్వఁడు! వీర్యసంపదం
గొనకొని యేఁడువెల్గెడినొ! కుంభిని నాతఁడు వృద్ధిఁజెందు మే
మనయము పుత్రసంతతియు నన్నము నందెదమయ్య! పావకా! ॥ 137

(16) గీ॥ మాసుసౌభాగ్యము నెఱింగి మాకునైన, నాయువభివృద్ధిఁ బొందింపుమగ్ని! నీవు
దానివరుణాది [1]దేవతల్ ధన్యగతిని, బూని రక్షించుదురుగాకఁ బొలుపుమీఱ ॥ 138

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమున షష్ఠాధ్యాయము
సమాప్తము

---

1. ఆంధ్రానువాదములో యీ 94వ సూక్తములోని 16వ. ఋక్కును సరిగా ననువదింపలేదు. (వ్రాతప్రతి1వ. సంపుటము.313పుట) ప్రత్యేకించి మూఁడవపాదమున, "దాని వరుణాదిదేవతల్ ధన్యులగుచుఁ, బూని రక్షించుదురుగాకఁ బొలుపుమీఱ" (బూని రక్షించుదురుగాక మానకుండ అని తొ.పా.) అని వరుణాది దేవతలు తమకుఁదామై ధన్యులగు రీతిగా (అగ్నియభివృద్ధి పరచిన స్తోతల యాయువును) రక్షించుఁడని వ్రాయుట పూర్తిగా నసంబంధమైన విషయము. స్తోతలు తమ యాయుర్దాయమును బెంపొందింప వలయునని యగ్నినిప్రార్థించి దానిని వరుణాదిదేవతలు తమ్ముధన్యత్వము కొఱకై రక్షింపవలయుననుట దేవతలకే యవమానకరమైన విషయము, దీనిని భ్రమ ప్రమాదములకులోనై గ్రంథకర్త చూచుకొనక త్వొందరలో ననువదించియుండును. అందువలన "ధన్యులగుచు" అన్నదానిని "ధన్యగతిని" అని సవరించుటజరిగినది, అగ్ని యభివృద్ధిపరచిన యాయుర్దాయమును ధన్యమార్గములో వరుణాదిదేవతలు పట్టుదలతో రక్షింతురుగాక" అని సరియైన భావమువచ్చును. వ.గో.కృ.

# సమూల

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ప్రథమోఽష్టకః—సప్తమోఽధ్యాయః

### సూక్తమ్—95

ఋషిః—కుత్సఆంగిరసః

దేవతా—అగ్నిః, ఔషసోఽగ్నిర్వా (సత్వగుణవిశిష్టోఽగ్నిః శుద్ధోఽగ్నిర్వా)

ఛందః—త్రిష్టుప్.

(1) ద్వే విరూపే చరతః స్వర్థే అన్యాన్యా వత్సముప ధాపయేతే ।

హరిరన్యస్యాం భవతి స్వధావాఞ్ ఛుక్రో అన్యస్యాం దదృశే సువర్చాః ॥ 1

(2) దశేమం త్వష్టుర్జనయన్త [1]గర్భమతన్ద్రాసో యువతయో విభృత్రమ్ ।

తిగ్మానీకం స్వయశసం జనేషు విరోచమానం పరి షీం నయన్తి ॥ 2

(3) త్రీణి జానా పరి భూషన్త్యస్య సముద్ర ఏకం దివ్యేకమప్సు ।

పూర్వామను ప్ర దిశం పార్థివానామృతూన్ ప్రశాసద్ వి దధావనుష్ఠు ॥ 3

1. మన్తన్ద్రాసో (వ్రా.ప్ర.)

(4) క ఇమం వో నిణ్యమా చికేత వత్సో [1]మాతౄర్జనయత స్వధాభిః ।

బహ్వీనాం గర్భో అపసాముపస్థాన్మహాన్ కవిర్నిశ్చరతి స్వధావాన్ ॥ 4

(5) [2]ఆవిష్ట్యో వర్ధతే చారురాసు జిహ్మానామూర్ధ్వః స్వయశా ఉపస్థే ।

ఉభే త్వష్టు[3]ర్బిభ్యతుర్జాయమానాత్ ప్రతీచీ సింహం ప్రతి జోషయేతే ॥ 5

(6) ఉభే భద్రే జోషయేతే న మేనే గావో న వాశ్రా ఉప తస్థురేవైః ।

స దక్షాణాం దక్షపతిర్బభూవాఞ్జన్తి యం దక్షిణతో హవిర్భిః ॥ 6

(7) ఉద్ యంయమీతి సవితేవ బాహూ ఉభే సిచౌ యతతే భీమ ఋఞ్జన్ ।

ఉచ్ఛుక్రమత్కమజతే సిమస్మాన్నవా మాతృభ్యో వసనా జహాతి ॥ 7

(8) త్వేషం రూపం కృణుత ఉత్తరం యత్ సంపృఞ్చానః సదనే గోభిరద్భిః ।

కవిర్బుధ్నం పరి మర్మృజ్యతే ధీః సా దేవతాతా సమితిర్బభూవ ॥ 8

(9) ఉరు తే జ్రయః పర్యేతి బుధ్నం విరోచమానం మహిషస్య ధామ ।

విశ్వేభిరగ్నే స్వయశోభిరిద్ధో ఽదబ్ధేభిః పాయుభిః పాహ్యస్మాన్ ॥ 9

(10) ధన్వన్త్స్రోతః కృణుతే గాతుమూర్మిం[4] శుక్రైరూర్మిభిరభి నక్షతి క్షామ్ ।

విశ్వా సనాని జఠరేషు ధత్తే ఽన్తర్నవాసు చరతి ప్రసూషు ॥ 10

(11) ఏవా నో అగ్నే సమిధా వృధానో రేవత్ పావక శ్రవసే వి భాహి ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 11

1. మాతౄర్జనయత (ప్రా.ప్ర.) 2. అవిష్ట్యో (ప్రా.ప్ర.) 3. త్వష్టుర్బిభ్యతుర్ (ప్రా.ప్ర.) 4. మూర్మిశుక్రైః (ప్రా.ప్ర.)

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

ప్రథమాష్టకము   సప్తమాధ్యాయము

### సూక్తము 95

ఋషి—అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు

దేవత—అగ్ని*

(1) సీ॥ అగ్నికిఁదల్లియౌ హవ్యదేవతప్రీతి సూర్యునిఁ బోషించుచుండు, సూర్య
మాతయౌ యామినీమహిత దేవతయగ్నిఁ బోషించుచుండు సంపూర్ణమతిని
[1]గావున ననలుఁడు ఘనుఁడు సూర్యుండు తా రాతిరిఁబవలు విరాజమాన
[2]పుత్రులై వరుసఁగ రాత్రికిఁబగటికి వెలుఁగిచ్చుచుండిరి విశ్వమందు
గీ॥ శుక్లకృష్ణములై రమ్యశోభలందు, చున్న దినరాత్రులెంతయుఁ జోద్యమలర
మరలమరలను దిరుగుచు మాన్యులయిన, పుత్రులం బెంచుచుండిరి చిత్రగతిని ॥ 1

(2) ఉ॥ భూతలమందు సర్వవిధ భూతములందు వెలుంగువాని, స
ద్వ్రాతమునందు జన్మఁగొని వర్ధిలుచుండెడువాని, పూరుష
వ్రాత మతంద్రమౌచుఁ గడుభక్తినిగాంచిన నగ్నిదేవునిం
బ్రీతిగ నన్నిచోటులకుఁ బెద్దలు చేర్తురు పెక్కురీతులన్ ॥ 2

(3) ఉ॥ ఒక్కొకటి నబ్ధిమధ్యమున [3]నొక్కెరగా [4]వెలుఁగొందఁజేసి యిం
కొక్కొకటి దేవలోకమున నుత్తమ సూర్యుని[5]గాను నిల్పి వే
రొక్కొకటి నంతరిక్షమున రూఢినిగాంచిన వైద్యుతాగ్నిగాఁ
దక్కకయుంచి సర్వమును దాహకః చేయవెపీవు వెల్గఁగాన్ ॥ 3

క॥ జలమున నాకాశంబున, సులలితకాంతిన్ వెలుంగు సూర్యాకృతిగా
వెలసెడు నగ్నియె జనులకుఁ, బలుదిక్కులఁ జూపు మఱియుఁ బనుపు ఋతువులన్ ॥ 4

* "ఉషసోऽగ్ని లేదా సత్వగుణ విశిష్టోऽగ్ని లేక శుద్ధోऽగ్ని" అని సంస్కృత గ్రంథములలోఁ బాఠాంతరములుగలవు. వ.గో.శ్రీ.

1. కావుననలము కమలమిత్రుండును రాత్రింబవళ్లు విరాజమాన (తొ.పా.) 2. పుత్రులై మెలఁగుచు వెలుఁగిచ్చుచుండిరి విశ్వమునకు. (తొ.పా.) 3. ఒక్కెర = ఉగ్రము. 4. వెలుఁగొందుచుండి నిం కొక్కొకటి (తొ.పా.) 5. గావెలుంగువే. (తొ.పా.)

పాఠాంతరము

క॥ మాటంగల సూర్యాగ్నియె, వాటముగ జనాళికెల్ల వరలు ఋతుగణం
బోటువడకుండ దిక్కుల, నీటుగఁగలిఁగించుచుండు నిత్యము వరుసన్ ॥ 5

(4) చ॥ జలములయందు సర్వవిధ జంగమమందు విలీనమైన స
ద్బలముగలట్టి యగ్ని ప్రవిభాసిత మేఘములోన డాఁగుచున్
వలసిన వర్షమిచ్చి కడువర్ధిలఁజేసి హవిస్సునంతటన్
జలధిపయిన్ వెలింగి తగ సాగుచునుండు విచిత్రభానుఁడై ॥ 6

(5) ఉ॥ వారిద వారివారమున వైద్యుతవహ్నిగఁ బుట్టి దానిలోఁ
దీరగు వక్రయానమునఁ దేలుచునుండు పయస్సు చెంగటన్
సారమునొంది యూర్ధ్వముగఁ జయ్యననేగి సువృద్ధినొందు నా
దారుణవహ్నికిం బుడమి తప్పక సేవ లొనర్చు భీతిచేన్ ॥ 7

(6) సీ॥ సౌందర్యమున నొప్పు చానలు రాజును† వింజామరముల నేవించునట్టు
లంభారవమొనర్చు నావులు దూడలమించు ప్రీతిని నాదరించునట్లు
ద్యావాపృథువులగ్ని దరిఁజేరి వానిని సేవించుచున్న విచిత్రవృత్తి
దక్షిణమందుండు [1]దక్షులు ఋత్విజులిచ్చు హవ్యంబులఁ బుచ్చుకొనుచుఁ
గీ॥ దృప్తినొందుచు నున్నట్టి దివ్యవహ్ని, బలముతోఁ గూడియుండుట బలపతి యని
పిలుచుచున్ [2]భక్తివానికిఁ, బెద్దలెల్లఁ, బూజ లొనరించుచుండిరి పూర్ణమతిని ॥ 8

(7) ఉ॥ భానుఁడు నై జరశ్మలను భాసిలఁ జేసెడునట్లు తేజముం
బూని యుషోగ్నికాంతులను బోవఁగఁజేయుచు విశ్వమంతటన్
మానక కృత్యముం జరిపి మన్ననలంది, రసంబుగ్రోలుచున్
మానితవర్షమంత నభిమానము హెచ్చఁగనిచ్చి వెల్గఁడే ॥ 9

(8) చ॥ పొలుపుగ దూరదర్శియయి పోషకుఁడై విలసిల్లువహ్ని యా
జలదములో వెలింగి కడుఁ జక్కఁగ [3]మెర్పులనుండు నగ్నితో
మిళితముగా వసించి యలమేదురకాంతిని గల్గఁజేయుచున్
విలసిత సూర్యరూపమున విశ్వజనాళికి గోచరంబగున్ ॥ 10

(9) గీ॥ వీతిహోతృఁడ! తావక విపులకాంతి, దనుజవీరులఁ జక్కాడి [4]ఘనతరమగు
నంతరిక్షముపై కేగి యతిశయించుఁ, గానఁ గాంతులుమాకిలఁ గలుఁగనిమ్ము ॥ 11

† అంతఃపురమునరాజు విశ్రమించియుండఁగా స్త్రీలు వింజామరములతో (వాసికిఁజల్లగాలి తగులునటులు) వీచుచుండునాచారమప్పుడు గలిఁగియున్నట్టు లూహించినను ప్రమాదములేదు. (నే.వేం.న.శాస్త్రి) 1. దక్షులౌ ఋత్విజ్ఞు లమరపురోడాశహవ్యరీతి (తా.పా.) 2. వీతిహోత్రునిఁ బెద్దలెల్ల (తా.పా.) 3. మెదపుల=మెర్పుల(రూపాంతరము) 4. తప్పకుండ (తొ.పా.)

(10) శా॥ ఆకాశంబున సంచరించు జలదాళింబొందు నీరంబులన్
వీఁకన్ వంచుచుఁదడ్పి భూమితలమున్ వేర్వేరు సస్యాళికిం
బాకంబేర్పడఁజేసి మానవులకున్ భక్తంబుఁ గల్పించుచున్
నాకస్తుత్యుఁడు వహ్నిదేవుఁడు మహానందంబుతో వెల్గెడున్ ॥ 12

(11) చ॥ దహనుఁడ! మేమొసంగు సమిధాదులచే నభివృద్ధిఁగాంచి మా
కిహమున నన్నవృద్ధిఁ గడు నిచ్చిన, దానిని గావుమంచు మే
మహరము మిత్రునిన్ మఱియు నాజలదేవత నన్నివేళలన్
గుహనము[1]లేక వేడెదము కూర్పుము భక్తము భక్తవత్సలా! ॥ 13

## సూక్తమ్—96

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—అగ్నిః, ద్రవిణోదా అగ్నిర్వా †

ఛందః—త్రిష్టుప్

(1) స ప్రత్నథా సహసా జాయమానః సద్యః కావ్యాని బళధత్త విశ్వా ।

ఆపశ్చ మిత్రం ధిషణా చ సాధన్ దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 12

(2) స పూర్వయా నివిదా [1]కవ్యతాయోరిమాః ప్రజా అజనయన్మనూనామ్ ।

వివస్వతా చక్షసా ద్యామపశ్చ దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 13

(3) తమీళత ప్రథమం యజ్ఞసాధం విశ ఆరీరాహుతమృఞ్జసానమ్ ।

ఊర్జః పుత్రః భరతం సృప్రదానుం దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 14

(4) స మాతరిశ్వా పురువారపుష్టిర్విదద్ గాతుం తనయాయ స్వర్విత్ ।

విశాం గోపా జనితా రోదస్యోర్దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 15

1. కుహనమువీడి (వ్రా.ప్ర.పా.) † శుద్ధోsగ్నిర్వా (పాఠాంతరము. వ్రా.ప్ర.) 1. కావ్యతా (వ్రా.ప్ర.)

(5) నక్తోషాసా వర్ణమామేమ్యానే ధాపయేతే శిశుమేకం సమీచీ ।

ద్యావాక్షామా రుక్మో అన్తర్వి భాతి దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 16

(6) రాయో బుధ్నః సంగమనో వసూనాం యజ్ఞస్య కేతుర్మన్మసాధనో వేః ।

అమృతత్వం రక్షమాణాస ఏనం దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 17

(7) నూ చ పురా చ సదనం రయీణాం జాతస్య చ జాయమానస్య చ క్షామ్ ।

సతశ్చ గోపాం భవతశ్చ భూరేర్దేవా అగ్నిం ధారయన్ ద్రవిణోదామ్ ॥ 18

(8) ద్రవిణోదా ద్రవిణసస్తురస్య ద్రవిణోదాః సనరస్య ప్ర యంసత్ ।

ద్రవిణోదా వీరవతీమిషం నో ద్రవిణోదా రాసతే దీర్ఘమాయుః ॥ 19

(9) ఏవా నో అగ్నే సమిధా వృధానో రేవత్ పావక శ్రవసే వి భాహి ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 20

## సూక్తము—96

### ఋషి--కుత్సుఁడు *

### దేవత—అగ్ని †

(1) చ॥ బలమునఁ గాష్టజాతముల వహ్ని జనించినతోడనే కడున్
వెలుఁగుచుఁ దాను గార్యముల వేగ మొనర్చుచు వైద్యుతాగ్నిగాఁ
జెలఁగుచు మేఘవారులను జెల్లెడు శబ్దమునందు దాతగా
నిలుచుచు గార్హపత్యుఁడయి నిర్జరరాజికి వంద్యుఁడౌఁగదా! ॥ 14

* అంగిరస పుత్రుఁడు కుత్సుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ. † ద్రవిణోదాగ్ని లేదా శుద్ధోకగ్ని (వ్రా.ప్ర.)

(2) క॥ మునినుతులఁ గొనుచు నెవ్వఁడు, జనులన్ సృజియించి దివిని జక్కఁగ వెలుఁగన్
బనిగొని చేయఁగఁగల్గున్, మును లాతని శాలలందు మూర్కొనెద రొగిన్ ॥ 15

(3) సీ॥ జనులారః మనకెల్లఁ జక్కనివాఁడగు నగ్ని దేవతలలో నధికుఁడగును
యజ్ఞంబులో వహ్ని యాహుతిఁ దృప్తుఁడై స్తుతులఁ బొందుచు నన్నసూనుఁడగును
[1]హవ్యం బొసంగిన నది పొంది యనలుండు పూతుల కిడి హవ్యదాత యగును
దన భక్తులకు నగ్ని ధన మిచ్చుచుం జాల రక్షల నిచ్చెడు దక్షుఁ డగును
గీ॥ విపులమహిమలచే నగ్ని వీరుఁడగును, ధనముచే నగ్ని సంపూర్ణ దాతయగును
గార్హపత్యాభిధకు నగ్ని యర్హుఁడగును, సురలు పూజించునగ్నియె శూరుఁడగును ॥ 16

(4) ఉ॥ సంతత మంతరిక్షమున సౌఖ్యముగా నివసించి మానవా
సంత నుతుల్ గ్రహించు బలమంతయు నొందుచు రెంటఁజేయుచున్
సంతసమందు నగ్ని [2]సదసత్పరుఁగా నొనరించుఁగాకఁ [3]దా
వింతగు మాతరిశ్వుఁడతివేడి గలాఁడె సురాళిఁ గాచుతన్ ॥ 17

(5) క॥ రేయుం బవలుం గ్రమమున, మాయోదయములను బొందు మానితవహ్నిన్
జేయుచు వానికి హవ్య ము, సూయన్ విడనాడి దేవశూరు లొసఁగరే ! ॥ 18

(6) క॥ ధనమునకు మూల పురుషుఁడు, ధనదాత సమస్తకర్మ దర్శకుఁ డనలుం
డనయముఁ గోరిక లిచ్చుచు, నొనరఁగ సురపూజ లందు "నోహో"! యనఁగన్ ॥ 19

(7) చ॥ మునుపటిరీతి నిప్పు డతిముఖ్య ధనాఢ్యుఁడు లోకమంతటం
జెలఁగెడు ప్రాణికోటులకు జీవితమై వెలుఁగొందువాఁడు స
ద్బలమున భూతరక్షకుఁడు భాగ్యము నిచ్చెడువాఁడు నైన యా
జ్వలనుని వేడుచుండుదురు చాలఁగ దేవతలెల్ల భక్తితోన్ ॥ 20

(8) క॥ ధనదుఁడగు నగ్నిదేవుఁడు, తన సుస్థిర జంగమాఖ్య ధనమున్ సుతులన్
ఘనమగు నాయుష్యంబును, ననయము మాకిచ్చుఁగాక నన్నివిధములన్ ॥ 21

(9) ఉ॥ పావకః విత్తమూలమున భవ్యతరంబుగ వృద్ధిఁబొందుచున్
జీవము నిచ్చు నన్నమును జెచ్చర మాకు ననుగ్రహింపు భూ
దేవత వారిదేవత సుదేవుఁడు మిత్రుఁడు దేవమాతయుం
గావలితోఁ దదన్నమును గావుత నెంతయు సంతసంబునన్ ॥ 22

1. హవ్యంబొసంగిన నగ్నికైకొని దేవతలకు నిచ్చెడు హవ్యదాతయగును. (తొ.పా.) 2. సతు సత్పరుగా (తొ పా.)
3. యే.వంతయు లేక దేవతల వహ్నియె కావుత నెల్ల వేళలన్ (తొ.పా.)

## సూక్తమ్—97
### ఋషిః—కుత్స ఆంగిరసః
### దేవతా—అగ్నిః, శుచిరగ్నిర్వా
### ఛందః—గాయత్రీ

(1) అప నః శోశుచదఘమగ్నే శుశుగ్ధ్యా రయిమ్ । అప నః శోశుచదఘమ్ ॥ 21

(2) సుక్షేత్రియా సుగాతుయా వసూయా చ యజామహే । అప నః శోశుచదఘమ్ ॥ 22

(3) ప్ర యద్ భన్దిష్ఠ ఏషాం ప్రాస్మాకాసశ్చ సూరయః । అప నః శోశుచదఘమ్ ॥ 23

(4) ప్ర యత్ తే అగ్నే సూరయో జాయేమహి ప్ర తే వయమ్ । అప నః శోశుచదఘమ్ ॥ 24

(5) ప్ర యదగ్నేః సహస్వతో విశ్వతో యన్తి భానవః । అప నః శోశుచదఘమ్ ॥ 25

(6) త్వం హి విశ్వతోముఖ విశ్వతః పరిభూరసి । అప నః శోశుచదఘమ్ ॥ 26

(7) ద్విషో నో విశ్వతోముఖాతి నావేవ పారయ । అప నః శోశుచదఘమ్ ॥ 27

(8) స నః సిన్ధుమివ నావయాతి [1]పర్షా స్వస్తయే । అప నః శోశుచదఘమ్ ॥ 28

## సూక్తము—97
### ఋషి—కుత్సుఁడు*
### దేవత—అగ్ని †

(1,2,3, 4,5,6) సీ॥ భవదనుగ్రహమునఁ బాపముల్ మా కతిదూరంబుగా వహ్ని! తొలఁగుఁగాక!
సుక్షేత్ర సన్మార్గశోధనంబులు రెండు సిరితోడ మమ్ములఁ జెందుఁగాక!
గుత్సునివలె నిన్నుఁ గోరుచుండెడి మాకుఁ బేరుప్రతిషలు పెరుగుఁగాక!
బుత్రులు పౌత్రులు పొందినవారట్లు పుత్రవృద్ధియు మమ్ముఁ బొందుఁగాక!

1. పర్షా స్వస్తయే (ప్రా.ప్ర.) * అంగిరసునిపుత్రుఁడు కుత్సుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ.
† శుచ్యగ్నికూడఁగాఁదగు. (చూ. సం. మూ.)

గీ॥ శత్రునాశక! నీ దీప్తి చిత్రగతిని, సర్వదిక్కులం బెలరేగి సరస రీతి
వెలయుచుండంగ నేపేశ వేరు వేరు, పాపముల నేలఁ గొట్టవు? పావకుండ! ॥ 23

(7) గీ॥ నావ నదులను దాటించునట్లు నీవు, విశ్వతోముఖ! వైరులఁ వెడలఁగొట్టు!
భవదనుగ్రహ వశమునఁ బాపమెల్ల, [1]నష్టమయిపోవుదాక నో యిష్టిరూప! ॥ 24

(8) గీ॥ ఏటి నీటిని దరణిచే దాఁటినట్లు, శత్రువులనెల్ల దాఁటింపు! చారురూప!
నీ యనుగ్రహ వశమున నియతపాప, పుంజములు దూరముగ పెసఁబోవుఁగాక! ॥ 25

## సూక్తమ్—98

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—అగ్నిః, వైశ్వానరోఽగ్నిర్వా

ఛందః—త్రిష్టుప్

(1) వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః ।

ఇతో జాతో విశ్వమిదం వి చష్టే వైశ్వానరో యతతే సూర్యేణ ॥ 26

(2) పృష్టో దివి పృష్టో అగ్నిః పృథివ్యాం పృష్టో విశ్వా ఓషధీరా వివేశ ।

వైశ్వానరః సహసా పృష్టో అగ్నిః స నో దివా స రిషః పాతు నక్తమ్ ॥ 29

(3) వైశ్వానర తవ తత్ సత్యమస్త్వస్మాన్ రాయో మఘవానః సచన్తామ్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 31

1. నష్టమయిపోవునాక (వ్రా.ప్ర.పా.)

## సూక్తము—98

ఋషి—కుత్సుఁడు *

దేవత—అగ్ని †

(1) క॥ ఘనవైశ్వానరుఁడరణుల, జననముగొని భువనమునకుఁ జక్కని ప్రభువై
యనయము మముఁ గనుఁగొనుచున్, దినకరుఁ దాఁ జేరుచుండె దేవుండగుచున్ ॥ 26

(2) చ॥ గగనమునందు సూర్యునిగఁ గ్రాలి యెసంగుచు భూమిలోపలం
దగు ననల త్రయంబగుచుఁ దద్దయు వెల్గెడు నోషధీతతిన్
సొగసుగఁ బండఁజేయు చతిశోభిత సంపదగల్గు నగ్ని తా
మిగులఁ జెలంగి శత్రువుల మిక్కిలి నాశము సేయుతన్ వడిన్ ॥ 27

(3) గీ॥ సత్యమగుఁగాక నీయజ్ఞ చారుకర్మ, పొందుదుముగాక ధనమును బుత్రవరుల
నీ యనుగ్రహమున [1]మా యమేయపాప, సంచయంబులు దూరము జరుగుఁగాక ॥ 28

## సూక్తమ్—99

ఋషిః—కశ్యపో మారీచః

దేవతా—అగ్నిః, జాతవేదా అగ్నిర్వా

ఛందః—త్రిష్టుప్

(1) జాతవేదసే సునవామ సోమ [1]మరాతీయతో ని దహాతి వేదః ।

స నః పర్షదతి దుర్గాణి విశ్వా నావేవ సిన్ధుం దురితాత్యగ్నిః ॥ 31

* అంగిరస పుత్రుఁడు కుత్సుఁడని సంస్కృత మూలము. వ.గో.కృ. † వైశ్వానరాగ్ని అని పాఠాంతరముగా సంస్కృత మూలగ్రంథములలోఁ బేర్కొనఁబడినది. కాని ఆంధ్రానువాదములోని పద్యములు పరికింపఁగా వగ్నికిని వైశ్వానరాగ్నికిని భిన్నత్వమును బాటించినట్లు కన్పట్టదు. వ.గో.కృ.

1. మాదు నియతపాప (తా.పా.) 1. సోమ మరీతీయతో (వ్రా.ప్ర.)

## సూక్తము — 99

ఋషి—మరీచపుత్రుఁడు కశ్యపుఁడు

దేవత—అగ్ని †

(1) చ॥ సొగసుగ జాతవేదునకు సోమలతాతతిఁ ద్రచ్చి శ్రద్ధగాఁ
దగురసమెల్లఁ దీసితిమి త్రాగినయాతఁడు దానినెంతయున్
మగఁటిమిగల్గి పాపముల మానకగొట్టుచు, మమ్మువేడ్క-తో
నొగి నది [1]నావలాగు మము నుత్తరణం బొనరింపఁజేయఁడే॥ 29

## సూక్తమ్—100

ఋషిః—వార్షాగిరాః ఋజ్రాశ్వామ్బరీష-సహదేవ-భయమాన-సురాధసః *

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) స యో వృషా వృష్ణ్యేభిః సమోకా మహో దివః పృథివ్యాశ్చ సమ్రాట్ ।
సతీనసత్వా హవ్యో భరేషు మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 32

(2) యస్యానాప్తః సూర్యస్యేవ [1] యామో భరేభరే వృత్రహా శుష్మో అస్తి ।
వృషన్తమః సఖిభిః స్వేభిరేవైర్మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 33

(3) దివో న యస్య రేతసో దుఘానాః పన్థాసో యన్తి శవసాపరీతాః ।
తరద్ద్వేషాః సాసహిః పౌంస్యేభిర్మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 34

† జాతవేదాగ్నియని పాఠాంతరము. (సం. మూ.) కాని యీయాంధ్రానువాదమున నగ్నియనఁగా జాతవేదుఁడనియే ప్రయుక్తమాయెను. వ.గో.కృ.
1. నావలాగున నుత్తరణం (తె.పా. గణభంగము.) నావలాగునను నుత్తరణం అని తెలుగు రచయిత వ్రాయఁదలఁచియుండు. వ.గో.కృ.

* ఋజ్రాశ్వః (వ్రా.ప్ర.) 1. యమో (వ్రా.ప్ర.)

(4) సో అంగిరోభిరంగిరస్తమో భూద్ వృషా వృషభిః సఖిభిః సఖాసన్ ।

ఋగ్మిభిరృగ్మీ గాతుభిర్జ్యేష్ఠో మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 35

(5) స సూనుభిర్న రుద్రేభిరృభ్వా నృషాహ్యే సాసహ్వాగ్ం అమిత్రాన్[1] ।

సనీళేభిః శ్రవస్యాని తూర్వన్ మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 36

(6) స మన్యుమీః సమదనస్య కర్తా ఽస్మాకేభిర్నృభిః సూర్యం సనత్ ।

అస్మిన్నహన్త్సత్పతిః పురుహూతో మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 37

(7) తమూతయో రణయఞ్ఛూరసాతౌ తం క్షేమస్య క్షితయః కృణ్వత త్రామ్ ।

స విశ్వస్య కరుణస్యేశ ఏకో మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 38

(8) తమప్సన్త శవస ఉత్సవేషు నరో నరమవసే తం ధనాయ ।

సో అన్ధే చిత్ తమసి జ్యోతిర్విదన్ మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 39

(9) స సవ్యేన యమతి వ్రాధతశ్చిత్ స దక్షిణే సంగృభీతా కృతాని ।

స కీరిణా చిత్ సనితా ధనాని మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 40

(10) స గ్రామేభిః సనితా స రథేభిర్విదే విశ్వాభిః కృష్టిభిర్న్వద్య ।

స పౌంస్యేభిరభిభూరశస్తీర్మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 41

1. అమిత్రాన (బ్రా.ప్ర.)

(11) స జామిభిర్యత్ సమజాతి [1]మీఢ్హే ऽజామిభిర్వా పురుహూత ఏవైః ।

ఆపాం తోకస్య తనయస్య జేషే మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 42

(12) స వజ్రభృద్ దస్యుహా భీమ ఉగ్రః సహస్రచేతాః శతనీథ ఋభ్వా ।

చమ్రీషో న శవసా పాఞ్చజన్యో మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 43

(13) తస్య వజ్రః క్రన్దతి స్మత్ స్వర్షా దివో న త్వేషో రవథః [2]శిమీవాన్ ।

తం సచన్తే సనయస్తం ధనాని మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 44

(14) యస్యాజస్రం శవసా మానముక్థం పరిభుజద్ రోదసీ విశ్వతః సీమ్ ।

[3]స పారిషత్ క్రతుభిర్మన్దసానో మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 45

(15) న యస్య దేవా దేవతా న మర్తా ఆపశ్చన శవసో అన్తమాపుః ।

స ప్రరిక్వా త్వక్షసా క్ష్మో దివశ్చ మరుత్వాన్ నో భవత్విన్ద్ర ఊతీ ॥ 46

(16) రోహిచ్ఛ్యావా సుమదంశుర్లలామీర్ద్యుక్షా రాయ ఋజ్రాశ్వస్య ।

వృషణ్వన్తంబిభ్రతీ ధూర్షు రథం మన్ద్రా చికేత నాహుషీషు విక్షు ॥ 47

(17) ఏతత్ త్యత్ త ఇన్ద్ర వృష్ణ ఉక్థం వార్షాగిరా అభి గృణన్తి రాధః ।

ఋజ్రాశ్వః ప్రష్టిభిరమ్బరీషః సహదేవో భయమానః సురాధాః ॥ 48

1. మీళహే ऽ (వా.ప్ర.) మీళ్హే ऽ (సా.మా.) 2. శిమీవాన్— (వా.ప్ర.) 3. సపరిషత్ (వా.ప్ర.)

(18) దస్యూఞ్ఛి[1]మ్యూగ్ంశ్చ పురుహూత ఏవైర్హత్వా పృథివ్యాం శర్వా ని బర్హీత్ ।
సనత్ క్షేత్రం సఖిభిః శ్విత్న్యేభిః సనత్ సూర్యం సనదపః సువజ్రః ॥ 49

(19) విశ్వాహేన్ద్రో అధివక్తా నో అస్త్వపరిహ్వృతాః సనుయామ వాజమ్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 50

## సూక్తము—100

### ఋషి—వృషాగిరుఁడనుమహారాజుయొక్క పుత్రులు

### ఋజ్రాశ్వాదులు అయిదుగురు రాజర్షులు*

### దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ దానాదిశక్తులఁ దగఁగల్గుచును నెవ్వఁ డిష్టార్థములనెల్ల నిచ్చువాఁడొ!
భూలోకమునకెల్ల భూనాథుఁడగుచుండి యమరలోకమునకు నధిపుఁడెవఁడొ!
జీవరాశులుగోరు జీవనంబులనెల్ల చిత్తరంజకముగాఁ జేయునెవఁడొ!
సరసమనస్సుతో జన్యంబులందెల్ల సాయముసేయంగ జరుగునెవఁడొ!
గీ॥ గురుమరుత్తుల [1]సంప్రీతిఁ గూడునెవఁడొ!, జంభుఁడను రాక్షసుని మున్ను చంపెనెవఁడొ!
భక్తవర పాపములనెల్లఁ బాపునెవఁడొ!, యట్టి హరి మాకు రక్షలఁబెట్టుఁగాక! ॥ 30

1. దస్యూఞ్ఛిమ్యూంశ్చ (వ్రా.ప్ర.మా.సా.) దస్యూఞ్ఛింపూశ్చ (స్కం.భా.పా.)

* "స యో వృషైకోనా వార్షాగిరా ఋజ్రాశ్వాంబరీష, సహదేవ, భయమాన, సురాధసః, వృషాగిరో మహారాజస్యపుత్రభూతాః ఋజాశ్వాదయః, పంచరాజర్షయః సహఇదంసూక్తందదృశుః అతస్తేऽస్యసూక్తస్య ఋషయః" అని సాయనాచార్యుల వారు భాష్యము వ్రాయఁగా దానిననుసరించి యాంధ్రానువాదములో నైతము పేర్కొనఁబడినది. ఇది సరిగానున్నట్లు కన్పట్టదు. ఋజ్రాశ్వాదులు వృషాగిరుఁడను మహారాజునకుఁ బుత్రభూతులని సాయనుఁడు పేర్కొన్నాఁడు. (వృషాగిరో మహారాజస్య పుత్రభూతా ఋజ్రాశ్వాదయః) పుత్రభూతులనఁగాఁ బుత్రులని యర్థము కానేకాదు. ఋజ్రాశ్వాదులు వృషాగిరునకుఁ బుత్రులేయగుచో "వృషాగిరో మహారాజస్యపుత్రాః" అని విస్పష్టముగానే సాయనుఁడు పేర్కొనెడివాఁడు. "పుత్రభూతాః" అని పేర్కొన్నాఁడనఁగాఁ బుత్రులు కారనియుఁ బుత్రులవంటి వారనియు నర్థము. కాఁగా వృషాగిరుఁడు ఋజ్రాశ్వాదులైదుగురిని బుత్రులవలెఁజూచి యాదరించి పరిపోషించినాఁడని యర్థము—పైగా నసలు "వృషాగిరుఁడు" మహారాజనుటకుఁగాని ఋజ్రాశ్వాదులు నైదుగురును రాజర్షులనుటకుఁగాని నాధారములేదు. ప్రాచీన కాలమున మహర్షుల పేర్లు-అనఁగా వేదర్షులపేర్లు రాజులును దదితరులును దమ సంతతికిఁ బెట్టుకొనెడివారు. అసలు దేవతల పేరులే వేదర్షులు పెట్టుకొన్నట్లుగా వేదములే ప్రమాణములై యున్నవి. కాఁగా వేదర్షులపేర్లు రాజులుగాని, మహారాజులుగాని, మామూలు జనులుగాని పెట్టుకొనుటలో వింతలేదు. వృషాగిరుఁడు మహారాజు కాకపోవచ్చు ననుమాట

1. నెవ్వఁడు (తొ.పా.)

(3) ఉ॥ ఎవ్వఁడు మిత్రులంగలసి యే త్తైర భాసిలు సర్వకామదుం
డెవ్వఁడు యుద్ధభూములను నీసున వైరుల ద్రుంచుచుండునో;
యెవ్వని యాన మేపెడ నహీనదినేశుని బోలియుండునో!
యవ్విధ పాకశాసనుఁడు హానులఁగొట్టుచు మమ్ముఁగావుతన్ ॥ 31

(4) ఉ॥ ఎవ్వని తీక్ష్ణవృష్టితతి యుద్ధవిభాకరుఁ బోలియుండునో!
యెవ్వఁడు శత్రుమండలిని హీనముగా నొనరింపఁ జాలునో;
యెవ్వని కాంతి వర్షముల నే త్తైరఁజేయునో; సంతసంబుతో
నవ్విధ పాకశాసనుఁడు హానులఁగొట్టుచు మమ్ముఁగావుతన్ ॥ 32

(5) చ॥ [1]ప్రతగమనంబువాఁడు కడుఁదేనువతో జలమిచ్చువాఁడు స
న్మతి గలవాఁడు మైత్రిగతమాన్యతఁ [2]గూర్చెడువాఁడు సంతత
స్తుతిగనువాఁడు సర్వవిధ సుందరుఁడౌ నల గోత్రభిత్తు మా
యతుల విపత్పరంపరల నాఁపుచు మమ్ములఁ గాచుచుండుతన్ ॥ 33

(6) ఉ॥ సూనులమాట్కి రుద్రులను శోభిలఁగూడుచు శత్రుబృందముం
బూనికతోడ యుద్ధమునఁ బోవఁగఁగొట్టుచు వాయుమండలిన్
మానకకూడి వర్షమును మాటికిమాటికి నిచ్చువజ్రి, స
న్మానముగోరు మాకిపుడు మన్నన లిచ్చి పరిగ్రహించుతన్ ॥ 34

(7) క॥ పురుహూతుం డరిజేతయుఁ, గర మనుల నొనర్చువాఁడు ఘనహాయుఁ డస్మ
త్పురుషులకు దీప్తినిచ్చుచుఁ, బరులకుఁ జీఁకటినిజేసి [3]పరఁగుత మహిమన్ ॥ 35

యటుండఁగా నాతనికిఁ బుత్రభూతులైన ఋజ్రాశ్వాదులు నైదుగురును రాజర్షులనుట కవకాశములేదు. ఋజ్రాశ్వ. అంబ[illegible] సహదేవ, భయమాన, సురాధులు రాజర్షులు కాక వేదర్షులనియే చెప్పవచ్చును. ఈ వేదర్షుల నామములమీఁదఁ దదనంతర కాల[illegible] రాజులు, మహారాజులు, రాజర్షులు నేర్పడియుండ వచ్చును. ఉదాహరణకు అంబరీషునే తీసుకుందము. నాభాగుని కుమారుఁ[illegible] నంబరీషుఁడొకడు, బిందుమతీ మాంధాతల పెద్దకుమారుఁడు మరొకఁడు, అయోధ్యానగరి రాజొకఁడు, పద్మవతీ కుమారుఁడైన యి[illegible] వంశపురాజు నిట్లే పెక్కు రంబరీషులున్నారు. ఇట్లే మిగిలిన వారును ననేకులున్నారు. ఇంతెందుకు? ఋగ్వేద స్కంద భాష్యమ[illegible] "ఏమోవృషే త్యేతత్ సూక్తం పఞ్చ ఋషయః వృషాగిరః పుత్రాః విదుః జానన్తి—దృష్టవన్త ఇత్యర్థః తేతునిర[illegible] స్వైర్నామధేయై రేతత్కృత్త ఇన్ద్రిపృష్ఠ ఇత్యస్యామృచి. ఋజ్రాశ్వః—అంబరీషః—సహదేవః—భయమానః—సురాధాఇత్యేతే" ఏస్పష్టముగాఁ దెల్పఁబడినది. ఇందులో వృషాగిరుఁడు మహారాజని పేర్కొనుట జరుగలేదు. సరికదా ఋజ్రాశ్వాదులు ఋష[illegible] దేర్కొనఁబడిరేగాని రాజర్షులుగా నుటంకింపఁబడలేదు. మీఁదుమిక్కిలి "వృషాగిరః పుత్రావిదుః" అని వృషాగిరుని పుత్రులు[illegible] పేర్కొనుట జరిగినది. ఈ వృషాగిరుఁడు మహారాజుగాని. రాజుగాని కాకపోవచ్చును. కాఁగా సాయన భాష్యాధార భూ[illegible] వెలసిన శ్రీ నేమానివారి ఋషుల ప్రశస్తి ప్రామాణికము కానేరదు. (చూ. పీఠిక) వ.గో.కృ.

1. వ్రత శబ్దము ప్రమాద వశమున వ్యావహారిక ప్రభావముతో "వ్రత"గా యతి స్థానములోఁ (రు—ఋల తార్మా[illegible] ప్రయుక్తమైనది. ఋ—రులను వార్మారుగ వ్రాయుట యీ గ్రంథకర్తకు మంచినీళ్ళప్రాయముగాఁ గన్పట్టును. "వ్రత"ను "వ్రత[illegible] మార్చుచో శబ్దదోషము పరిహార్యమగును. ఋగర్థమునకు భిన్నత్వమేర్పడదు. వ.గో.కృ.

2. ఓర్చెడువాఁడు (తా.పా.) 3. పాలించుమమున్ (తా.పా.)

(8) చ॥ మదమున శత్రుమండలిని మర్దనఁ జేయుమటంచు వేడ్కతోఁ
గదనములోఁ జరించు నెఱగాలులు పల్కను గోత్రభేదితో,
నెదను దలంచి మర్త్యగణ మింద్రుఁడు కాచునటంచు విత్తముం
బొదలుచుఁబల్కుచుండుటను బ్రాజ్ఞుఁడు శక్రుఁడు మమ్ముఁ గావుతన్ ॥ 36

(9) ఉ॥ మోహదమైన యుద్ధముల ముక్తినిబొందుచు నప్పుడప్పు డ
త్యాహిత విత్తరక్షలకు, నంచిత యుద్ధము వచ్చువేళ న
త్యూహనుబూని కాచుటకు, నోర్మినిగల్గు నరోత్తమాళిచేఁ
"బాహి" యటంచు వేడఁబడు పండితశక్రుఁడు మమ్ముఁ గావుతన్ ॥ 37

(10) ఉ॥ వామకరంబుతో నరుల వంచుచు, దక్షిణ పాణితోడఁ బె
న్నీమముఁగల్గ హవ్యముల నేర్పునఁ దీయుచు, భక్తజాతికిం
గామిత విత్తసంచయము కాదనకుండ నొసంగునట్టి మా
స్వామి మహేంద్రుఁ డెల్లపుడు శాంతినిజేయుచు మమ్ముఁ గావుతన్ ॥ 38

(11,12) సీ॥ మారుతముంగూడి మహి నుపాసకులకు నిష్టార్థములనెల్ల నిచ్చుచుండుఁ
బరిజన సహితుఁడై బండిపైఁగూర్చుండి వసురాశి నీయంగ వచ్చుచుండు
నిస్సహాయుండౌచు నిఖిల శత్రుగణంబు శక్తిమూలంబునఁ జంపుచుండుఁ
బురుహూతుఁడై పరాపర భేదమున్వీడి జనులకు జయమును [1]సలుపుచుండు
గీ॥ [2]నల మరుత్సంఘమును రణమందుఁజేరి, వారి పుత్రులఁకున్ మఱి వారి పౌత్ర
గణములకునెల్ల జయమును గలుఁగఁజేయు, చుండు హరిమమ్ముఁ గావుత నిండు వేడ్క ॥ 39

(13) చ॥ పవిఁగొని చేత, రాక్షసులఁ బారఁగఁద్రోలుచు, శత్రు భీముఁడై
కవికృత సంస్తుతింబడసి కాంతులఁ బొందుచు విశ్వవేదియై
జవకరమైన సోమమతి జాగరణంబునఁ దన్నుఁగొల్చు న
ట్లవనతులైన భక్తులకు నాశ్రయమౌ హరిమమ్ముఁ గావుతన్ ॥ 40

(14) క॥ నగభేది వజ్రమంతట, వగపుంబుట్టించు నిఖిల వైరులకెల్లన్
మగటిమిఁగల సూర్యునివలెఁ, దగవెలిఁగెకు వజ్రి కాచుఁ దప్పక మమ్మున్ ॥ 41

(15) మ॥ బలసంపన్నము శంసనీయమునునై భాసించు నుత్సాహమున్
వెలయంగాఁగొని రోదసిన్ ముదమునన్ వీక్షించి రక్షించు నా
బలభిత్తిష్టలఁజేరి మారుతముతోఁ బాపంబులంద్రుంచి యు
జ్జ్వలుఁడై కావుత మమ్ము భక్తవరులన్ శాంతిన్ విడంబించుచున్ ॥ 42

1. జేయుచుండు. (తొ.పా. యతిభంగము.) వ.గో.కృ. 2. మారుతముతోడ రణరంగమధ్యమొంది. (తొ.పా.)

*క॥ ఎవ్వని బలముంగనుఁగొని, య వ్వసుమానవగణంబు లందునొ లజ్జన్
జివ్వన నా యింద్రుఁడు మము, నవ్వారిగఁ గాచుఁగాక నధికప్రీతిన్ ॥ 43

(16) మ॥ అతిదీర్ఘావయవాభిరాజితములై యత్యంత భూషాతతి
ద్యుతిచే నొప్పెడు నెఱ్ఱగుఱ్ఱముల సందోహంబు, నేవేళ స
ద్గతి నుప్పొంగెడు నల్లగుఱ్ఱముల [1]సంఘంబొప్ప యానంబుపై
మతితోఁబోయి నృపాల యుద్ధములకున్ మాన్యా! జయంబందవే! ॥ 44

(17) గీ॥ ఇంద్రుఁడా! కామితార్థము లిచ్చువాఁడ!, యావృషాగిర పుత్రులౌ నంబరీష
ప్రముఖులన్‌గూడి [2]ఋజ్రాశ్వ ప్రబలనుతులఁ, జిత్తగింపుటకయి నీవు చేర[3]వలదె? ॥ 45

(18) మ॥ పురుహూతుండగు నింద్రదేవుఁడు వడిన్‌బోరన్ స్వవజ్రంబుతో
నరులన్‌ద్రుంచుచు వాయువారములతో నత్యంత సంపర్కముం
గరముంబొందుచు శత్రుమండలిని దాఁ గంపింపఁగాఁ జేయుచున్
ఖరఘృష్టిన్ వికసింపఁజేసి జలముం గల్పించుచుండెం గదా! ॥ 46

(19) ఉ॥ మాపయిఁ బక్షపాతమును మానక యింద్రుఁడు వెల్గుఁగాక! మే
మోపికఁబూని హవ్యములనొంది చరింతుముగాక! వృద్ధిచే
దీపిత [4]భక్తసంతతికి దేవుఁడు మిత్రుఁడు భూమిదేవియుం
గాపులౌచు మమ్ములను గాచుచునుందురుగాత నెంతయేన్ ॥ 47

## సూక్తమ్—101

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ, 8-11 త్రిష్టుప్

(1) ప్ర మన్దినే పితుమదర్చతా వచో యః కృష్ణగర్భా నిరహన్నృజిశ్వనా।

అవస్యవో వృషణం వజ్రదక్షిణం మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 51

* శ్రీ నేమానివారీ నూరవసూక్తములో 20 ఋక్కులున్నట్లు పొరపాటున భావించిరి. 43, 44, 45, 46, 47 పద్యములు క్రమముగా 16, 17, 18, 19, 20 ఋక్కుల కనువాదపద్యములుగా వ్రాతప్రతిలో (1వ సంపుటము 329పుట) వ్రాయఁబడి యివి ఋగ్విరుద్ధములైనవి. 17వ ఋక్కుగా ననువదింపఁబడిన "అతిదీర్ఘావయవాభిరాజితములై" ఇత్యాది మత్తేభవిక్రీడితము పదునారవ ఋక్కునకే యనువాదపద్యము. "ఎవ్వని బలముంగనుఁగొని" ఇత్యాది పద్యము 15 (పదినేనవ) ఋగ్భాగమునకేయనువాదము. పదినేనవఋక్కునకు "బలసంపన్నము" ఇత్యాదిగాఁగలమత్తేభము "ఎవ్వనిబలముంగనుఁగొని" ఇత్యాది కందపద్యము రెండును ననువాదములని గ్రహింపవలయును. కాఁగా "అతిదీర్ఘావయ" వేత్యాదిగాఁగల మత్తేభము 16వ ఋక్కునకును "ఇంద్రుఁడా! కామితార్థము" లిత్యాది గీతపద్యము 17వ ఋక్కునకును, "పురుహూతుండగు" నిత్యాది మత్తేభము 18వ ఋక్కునకును "మాపయిఁ బక్షపాతము" నిత్యాది ఉత్పలమాల 19వ ఋక్కునకును ననువాదములుగా గ్రహింపనగును. వ.గో.కృ.

1. సంఘంబుంగల్గ (వ్రా:ప్ర.పా.) గణభంగము. వ.గో.కృ. 2. ఋజ్రాశ్వప్రభువునుతుల (తొ.పా, గణభంగము) వ.గో.కృ. 3. వలదే! (వ్రా.ప్ర.పా. గణభంగము వ.గో.కృ.) 4. భక్తరాశులకు (తొ.పా.)

(2) యో వ్యంసం జాహృషాణేన మన్యునా యః శమ్బరం యో అహన్ పిప్రుమవ్రతమ్ ।

ఇన్ద్రో యః శుష్ణమశుషం న్యావృణఙ్ మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 52

(3) యస్య ద్యావాపృథివీ పౌంస్యం మహద్ యస్య వ్రతే వరుణో యస్య సూర్యః ।

యస్యేన్ద్రస్య సిన్ధవః సశ్చతి వ్రతం మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 53

(4) యో [1]అశ్వానాం యో గవాం గోపతిర్వశీ య ఆరితః కర్మణికర్మణి స్థిరః ।

వీళోశ్చిదిన్ద్రో యో అసున్వతో వధో మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 54

(5) యో విశ్వస్య జగతః ప్రాణతస్పతిర్యో బ్రహ్మణే ప్రథమో గా అవిన్దత్ ।

ఇన్ద్రో యో దస్యూగ్ంరధరాగ్ం అవాతిరన్ మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 55

(6) యః శూరేభిర్హవ్యో యశ్చ భీరుభిర్యో ధావద్భిర్హూయతే యశ్చ జిగ్యుభిః ।

ఇన్ద్రం యం విశ్వా భువనాభి సందధుర్మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 56

(7) రుద్రాణామేతి ప్రదిశా విచక్షణో రుద్రేభిర్యోషా తనుతే పృథు జ్రయః ।

ఇన్ద్రం మనీషా అభ్యర్చతి శ్రుతం మరుత్వన్తం సఖ్యాయ హవామహే ॥ 57

(8) యద్ వా మరుత్వః పరమే సధస్థే యద్ వావమే వృజనే మాదయాసే ।

అత ఆ యాహ్యధ్వరం నో అచ్ఛా త్వాయా హవిశ్చకృమా సత్యరాధః ॥ 58

1. యో విశ్వానాం.......కర్మణిస్థిరః (వ్రా.ప్ర. ఈ పాఠాంతరముతో నర్థమే మార్పునొందును. అశ్వపతికి విశ్వపతికి నంతరమెంతయని చెప్పగలము?.) వ.గో.కృ

(9) త్వాయేన్ద్ర సోమం సుషు మాసుదక్ష త్వాయా హవిశ్చకృమా బ్రహ్మవాహః ।

అధా నియుత్వః సగణో మరుద్భిరస్మిన్ యజ్ఞే బర్హిషి మాదయస్వ ॥ 59

(10) మాదయస్వ హరిభిర్యే త ఇన్ద్ర వి ష్యస్వ శిప్రే వి సృజస్వ ధేనే ।

ఆ త్వా సుశిప్ర హరయో వహన్తూశన్ హవ్యాని ప్రతి నో జుషస్వ ॥ 60

(11) మరుత్స్తోత్రస్య వృజనస్య గోపా వయమిన్ద్రేణ సనుయామ వాజమ్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 61

## సూక్తము—101

ఋషి—అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు

దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ సందడిగా ఋజిశ్వుఁడను చక్కని రాజునుగూడి వజ్రియై
పొందుగ గర్భభారములఁ బొందుచునుండెడి కృష్ణకాంతులం
జెందుచుఁజంపి మిత్రములఁ జెన్నెసలారు మహేంద్రుఁడాత్ర నా
నందముఁ జేయవచ్చుటకు నందఱు సంస్తుతిఁ జేయుఁడాతనిన్ ॥ 48

(2) ఉ॥ ఎవ్వఁడు వజ్రముంగొనుచు వృత్రుని జంపెనొ యుగ్రమూర్తియై
యెవ్వఁడు శంబరాసురుని నిర్దచరిత్రుని శుష్ణుఁద్రుంచెనో
యెవ్వఁడు పిప్రురాక్షసుని నీడ్చెనొ యుద్ధములందుఁ గిన్కతో
నెవ్వఁడు మారుతంబునకు నిష్టుఁడొ వానిని మేము పిల్వమేః ॥ 49

(3) గీ॥ ఎవని బలమంతటన్ వెల్గునెవనియాజ్ఞఁ, దలఁ దాల్చుచున్నారొ తరణి సింధు
వరుణదేవులు వానిన్ని వజ్రధరుని, బిలుచుచున్నాము మైత్రితో మెలఁగుటకయి ॥ 50

(4) ఉ॥ ఎవ్వఁడు గోహయంబులకు నేర్పడ రాజయి వెల్గుచుండెనో
యెవ్వఁడు సర్వకర్మముల నేపుగ సుస్థిరుఁడై చెలంగునో
యెవ్వఁడు యాగశత్రువుల నేఁచిహరించునొ! వాఁడు ప్రీతితో
రివ్వన వచ్చినట్లయినఁ బ్రేముడి వానినిమేము కొల్వమే! ॥ 51

(5) చ॥ ఎవఁడు [1]సమస్తజీవులకు నీశుఁడుగాఁ జరియించుచుండునో!
యెవఁడు సమస్త [2]రాక్షసనిరీక్ష్యుఁడుగా వెలుఁగొందుచుండునో!
యెవఁడు గ్రహించె గోగణమునెంతయు వేడ్కను ముందుముందుగా
నెవఁడు మరుద్గణంబులకు నిష్టుఁడొ! యా హరి మేముకొల్వమే ॥ 52

(6) ఉ॥ శూరులు వీరులుం బ్రధనశోభల పీడిన వార లెవ్వనిన్
"రార!" యటంచు వేడెదరొ! రమ్యజయంబులఁ గల్గువారు నా
తీరునె చేయుచుండెదరొ! దివ్యమరుద్గణవంద్యు వానినే
యారసి పిల్చుచుండుదు మనార్యులఁగొట్ట విశేషశక్తితోన్ ॥ 53

(7) చ॥ మునుగొని సూర్యరూపమున మోదముతో నుదయించువాని, భూ
ఘనతర మధ్యవాక్కులను గల్పనఁ జేసెడువానిఁ బ్రాణికై
జను లతిభక్తితో నుడువు చల్లని మాటలఁబొందు శక్ర మే
మనయముఁ బిల్వకుండుదుమె యత్యధికంబగు మైత్రిఁజేకొనన్ ॥ 54

(8) మ॥ దివినున్నన్ భువినున్ననీవు హరిసంతృప్తుండవై శాలలన్
జవముం బొందుచువెల్గువాఁడ వయినన్ బార్వధ్వరప్రక్రియా
నవలక్ష్మిం గన రమ్ము శాశ్వతధనా! నారాచ వేగంబునన్
సవిశేషంబుగ హవ్యమించితిమి నీ సంతోష కార్యార్థమై ॥ 55

(9) గీ॥ సోమముంబిండి శ్రద్ధతో శుభకరాగ్ని, యందు హవ్యము నుంచితి మమరదేవ!
మారుతముతోడఁ గూడుచు మసలకుండ, వచ్చి సోమముఁగొను మిచ్చవచ్చినటుల ॥ 56

(10) చ॥ †దవుడలవిప్పి సోమమును ద్రావఁగఁ దెర్వము జిహ్వ నెంతయుం
జవమునుగల్గు నశ్వములఁ జయ్యనఁ దృప్తిని నొందు మింద్రుఁడా!
పవిగల నిన్ను వాజితతి పావక శాలకుఁ జేర్చుఁగాక! మా
నవ కృత హవ్యముంగొని, సునాశిక! మమ్ము ననుగ్రహింపవే! ॥ 57

1. సమస్తప్రాణులకు (తా.పా.)

2. రాక్షసుల కీశకుఁడై (తా.పా.) ఈ పాఠమున కీశకుఁడై = సూర్యుఁడైయని యర్థము చెప్పవచ్చును. కాని గ్రంథకర్త "కీశకుఁడుగా" అని స్వహస్తముతోనే సవరించెను. ఈ సవరించిన పాఠమునకు సైతము సూర్యుఁడని యర్థము చెప్పనగును. కాని గణభంగదోషమేర్పడును. "రాక్షసుల కీశుఁడుగా వెలుగొందుచుండునో" రాక్షసులకు + ఈశుఁడుగా అనియే రచయిత సవరింపనెంచి నాఁడనుకొనెదమన్నఁ బ్రథమపాదములోనే "సమస్తజీవులకు నీశుఁడుగా" అనిపేర్కొన్నాఁడు. కావున నర్థరహితమైన పునరుక్తిగా నిలచును. సూర్యార్థకమైన "కీశ" శబ్దముంచి "సమస్త రాక్షసులకీశుఁడుగా = సమస్తరాక్షసులకును సూర్యుఁడుగాననఁగాఁ గన్నెత్తి చూచుటకైన వీలులేనివాఁడుగా వెలుఁగొందుచున్నాఁడని చెప్పవచ్చును. కీశ శబ్దము ప్రసిద్ధమగుటను బై సవరణ చేయఁబడినది. అంతియే కాదు. "కీశ" శబ్దముంచుచో యతిభంగమేర్పడును. తద్దోష నివారణకుఁగేవలస్వరయతి నామోదింపవలయును. వ.గో.కృ.

† ఈ దశమ ఋగర్థమేవేరు. సాయనాదుల ననుసరించిన యీ పద్యభావ మతిపేలవముగా నున్నది. వ.గో.కృ.

(11) గీ॥ శత్రునాశకుఁడగు శ్రేష్ఠశత్రువన కతి, రక్షణార్థులమయి యతిరాజమాన
భక్తముం బొందుదుము, [1]దాని వరుణముఖ్యు, లెల్లఁగాపాడుదురుగాక నుల్లమలర ॥ 58

## సూక్తమ్ — 102

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—జగతీ, 11 త్రిష్టుప్

(1) ఇమాం తే ధియం ప్ర భరే మహో మహీమస్య స్తోత్రే ధిషణా యత్ త ఆనజే।

తముత్సవే చ ప్రసవే చ సాసహిమిన్ద్రం దేవాసః శవసామదన్నను ॥ 62

(2) అస్య శ్రవో నద్యః సప్త బిభ్రతి ద్యావాక్షామా పృథివీ దర్శతం వపుః।

అస్మే సూర్యాచన్ద్రమసాభిచక్షే శ్రద్ధే కమిన్ద్ర చరతో వితర్తురమ్ ॥ 63

(3) తం స్మా రథం మఘవన్ప్రావ సాతయే జైత్రం యం తే అనుమదామ సంగమే।

ఆజా న ఇన్ద్ర మనసా పురుష్టుత త్వాయద్భ్యో మఘవఞ్ఛర్మ యచ్ఛ నః ॥ 64

(4) వయం జయేమ త్వయా యుజా వృతమస్మాకమంశముదవా భరే భరే।

అస్మభ్యమిన్ద్ర వరివః సుగం కృధి ప్ర శత్రూణాం మఘవన్వృష్ణ్యా రుజ ॥ 65

(5) నానా హి త్వా హవమానా జనా ఇమే ధనానాం ధర్తరవసా విపన్యవః

అస్మాకం స్మా రథమా తిష్ఠ సాతయే జైత్రం హీన్ద్ర నిభృతం మనస్తవ ॥ 66

1. దానివరుణ దేవ. దేవమాతను వీక్షించి కాపవలయు (కౌ.పా.)

(6) గోజితా బాహూ అమితక్రతుః సిమః కర్మన్కర్మఞ్ఛతమూతిః ఖజంకరః ।

అకల్ప ఇన్ద్రః ప్రతిమానమోజసాథా జనా వి హ్వయన్తే సిషాసవః ॥ 67

(7) ఉత్ తే శతాన్మఘవన్నుచ్చ భూయస ఉత్ సహస్రాద్ రిరిచే కృష్టిషు శ్రవః ।

అమాత్రం త్వా ధిషణా తిత్విషే మహ్యధా వృత్రాణి జిఘ్నసే పురంవర ॥ 68

(8) త్రివిష్టిధాతు ప్రతిమానమోజసస్తిస్రో భూమీర్నృపతే త్రీణి రోచనా ।

అతీదం విశ్వం భువనం వవక్షిథాశత్రురిన్ద్ర జనుషా సనాదసి ॥ 69

(9) త్వాం దేవేషు ప్రథమం హవామహే త్వం బభూథ పృతనాసు సాసహిః ।

సేమం నః కారుముపమన్యుముద్భిదమిన్ద్రః కృణోతు ప్రసవే రథం పురః ॥ 70

(10) త్వం జిగేథ న ధనా రురోధిథార్భేష్వాజా మఘవన్ మహత్సు చ ।

త్వాముగ్రమవసే సం శిశీమస్యథా న ఇన్ద్ర హవనేషు చోదయ ॥ 71

(11) విశ్వాహేన్ద్రో అధివక్తా నో అస్త్వపరిహ్వృతాః సనుయామ వాజమ్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 72

## సూక్తము—102

### ఋషి—అంగిరసపుత్రుఁడగు కుత్సుఁడు*

### దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ మేమొనరించు సంస్తుతులు మిక్కిలి నీకుఁ బ్రియంబులౌట పె
న్నీమముతో భవన్నుతుల నిత్యము చేయుచు నుంటిమయ్య! యో
సోమహితుండ! ఋత్విజులు శోభిలు విత్తము నొంది భక్తి నీ
నామము వాఁడుచుండి నిను నాకవిభూ! కొనియాడకుందురే! ॥ 59

(2) గీ॥ త్వద్యశస్సును నదు లేడు ధర్మదేవ!, చాటుచున్నవి, దివిభువిఁ [1]జారురూప
మును ధరించుచునున్నవి, యిన శశాంక, రూపములు వెల్గుచుండె, నీరూపువలన ॥ 60

(3) క॥ ఏ రథమున్ మేమందఱు, మారసి కొనియాడుచుందు మనులన్ శ్రీతో
నా రథము నెక్కివచ్చుచు, నేరుపునన్ ధనమునిమ్ము నిత్యధనపతీ! ॥ 61

(4) చ॥ అనిమొననుండి శత్రువుల నంపెదమయ్య! భవత్సహాయతం
గనుఁగొని యుద్ధరంగములఁ గ్రాలెడు వైరులఁ జంపుమయ్య! వేఁ
బనిగొని మాకు విత్తమును బంచఁగదయ్య! సుఖప్రదంబుగన్
దనుజుల వీర్యసంపదను దద్దయుఁ గొట్టఁగదయ్య! శక్రుఁడా! ॥ 62

(5) ఉ॥ పెక్కురు నీదు సేవకులు పిల్తురు నిన్ను స్వరక్షణార్థమై
యెక్కుచు రమ్యయానమును నెక్కుడకైనను బోఁక నిక్కమౌ
మక్కువతోడ మాకడకు మానుగవచ్చి ధనంబు నీయుమా!
తక్కువకాని నీమనసు ధన్యుఁడ! నిశ్చలమైనదేగదా! 63

(6) ఉ॥ అంచిత విక్రమంబున [2]మహాపవిఁ గొట్టుచు నాలఁ దెచ్చినా
వెంచెడు కర్మకారులకు నిష్టుఁడవై వెలుఁగొంది వైరులన్
మించి సమస్త యుద్ధముల మేదురకీర్తిని బొందినావు క
న్పించెడు వీర్యసంపదకుఁ బెద్దవుకావఁటె నీవు శక్రుఁడా! ॥ 64

(7) గీ॥ నీవొసంగిన యన్నంబు నిత్యశుభద!, నక్షయంబయి వెలుఁగొంది యవనిలోన
వెల్గుచుండుసుగాన నా వివిధనుతుల, సరసమతి విని వైరుల సంహరింపు ॥ 65

* ఆంధ్రానువాదము వ్రాతప్రతి (1వ. సంపుటము 333 పుట.) లో నీ 102వ సూక్తమునకుఁ బొరపాటున ఋషి పేర్కొనఁబడలేదు. సంస్కృత మూలమువనుసరించి యీ ఋషి పేర్కొనఁబడినాఁడు. వ.గో.కృ. 1. సరసరూప (తా.పా.) 2. మహాపణి (వ్రా.ప్ర పా.)

(8) చ॥ ఘనుఁడవు జాతవేదుఁడవు కావున ముప్పిరి త్రాడురీతిగా
జనులకునెల్లఁ దోడుపడఁ జాలినవాఁడవు, మూఁడుమూర్తులం
బనివడి మూఁడులోకముల భాసిలఁజేయుచు విశ్వమంతయుం
గనుఁగొని మోయువాఁడవును గాంక్షితముల్ [1]నెఱవేర్చు మింద్రుఁడా! ॥ 66

(9) చ॥ దివిజులలోన ముఖ్యుఁడవు దిట్టవు వైరులద్రుంపఁ గావునన్
వివిధములైన యిష్టులకు వేయి విధంబులఁ బిల్చుచుంటిమో
యవగత కాంక్షితార్థ! హరి! యంచిత పుత్రుని శత్రునాశనం
బ్రవిమలునిచ్చి యుద్ధములఁ బారెడునట్టు లొనర్చు యాసమున్ ॥ 67

(10) ఉ॥ శత్రువులన్ జయించి ఖలశాత్రవ విత్తమునెల్ల దెచ్చుచున్
మిత్రులకెల్ల నిచ్చుచును మెచ్చులు బొందుచునుండె దీవు, స
చ్చిత్రములైన యుద్ధములఁ జేతనమున్ గలిగించుచుంటి వో
మిత్రమ! మా సువాక్కు విని [2]మిత్రతఁజూపుము మాపయింగృపన్ ॥ 68

(11) ఉ॥ శక్రుఁడుమాపయిన్ మిగులజాలిని బొందుచునుండుఁ గావునన్
వక్రముగాని భక్తిమెయి వానిని గొల్చుచు నన్నమంతయున్
సక్రమరీతిఁ బొందెదము చాలఁగ దానిని దేవమాతయున్
విక్రమశాలి మిత్రుఁడును వీరును వారును గాచుచుండుతన్ ॥ 69

## సూక్తమ్—103

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్.

(1) తత్ త ఇన్ద్రియం పరమం పరాచైరధారయన్త కవయః పురేదమ్ ।
క్షమేదమన్యద్ [1]దివ్యగ్‌న్యదస్య సమీ పృచ్యతే సమనేవ కేతుః ॥ 73

(2) స ధారయత్ పృథివీం పప్రథచ్చ వజ్రేణ హత్వా నిరపః ససర్జ ।
అహన్నహిమభినద్రౌహిణం వ్యహన్ వ్యంసం మఘవా శచీభిః ॥ 74

1. నరిపుచ్చు (వ్రా.ప్ర.పా.) 2. మైత్రినిజూపుము (వ్రా.ప్ర.పా.) యతిభంగము. వ.గో.కృ. 1. దమన్యద్దివ్య (వ్రా.ప్ర.)

(3) స జాతూభర్మా శ్రద్దధాన ఓజః పురో విభిన్దన్నచరద్ వి దాసీః ।
విద్వాన్ వజ్రిన్ దస్యవే హేతిమస్యాఽఽర్యం సహో వర్ధయా ద్యుమ్నమిన్ద్ర ॥ 75

(4) తదూచుషే మానుషేమా యుగాని కీర్తేన్యం మఘవా నామ బిభ్రత్ ।
ఉపప్రయన్ దస్యుహత్యాయ వజ్రీ యద్ధ సూనుః శ్రవసే నామ దధే ॥ 76

(5) తదస్యేదం పశ్యతా భూరి పుష్టం శ్రదిన్ద్రస్య ధత్తన వీర్యాయ ।
స గా అవిన్దత్ సో అవిన్దదశ్వాన్ త్స ఓషధీః సో అపః స వనాని ॥ 77

(6) భూరి కర్మణే వృషభాయ [2]వృష్ణే సత్యశుష్మాయ సునవామ సోమమ్ ।
య ఆదృత్యా పరిపన్థీవ శూరో ఽయజ్వనో విభజన్నేతి వేదః ॥ 78

(7) తదిన్ద్ర ప్రేవ వీర్యం చకర్థ యత్ ససన్తం వజ్రేణాబోధయోఽహిమ్ ।
అను త్వా పత్నీర్హృషితం వయశ్చ విశ్వే దేవాసో అమదన్నను త్వా ॥ 79

(8) శుష్ణం పిప్రుం కుయవం వృత్రమిన్ద్ర యదావధీర్వి పురః శమ్బరస్య ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 80

1. వృషే (ప్రా.ప్ర.)

## సూక్తము—103

ఋషి—అంగిరఃపుత్రుఁడగు కుత్సుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ కవివరులెల్ల నీబలము గాంచిరి మున్నతిసూక్ష్మబుద్ధితో
నవనిని నగ్నిరూపమును నంచిత మానవ లోకమంతటన్
రవిగ వెలుంగు రూపమును రాయఁడ! నీయవి తత్స్వరూపముల్
ప్రవిమలకేతనద్వయముభంగిఁ జెలంగుచు నుండు మైత్రితోన్ ॥ 70

(2) చ॥ పుడమినిగల్గు మానవులఁబూని చరించుచు వజ్రధారచే
వడివడి వృత్రదానవుని వంచినపిమ్మట వర్షమంతటం
గడుఁబడునట్లొనర్చితివి [1]కాదనకుండఁగ రౌహిణుండు తాఁ
బడి చెడునట్లు సేసితివి పాకహరా! నినుఁజెప్ప శక్యమే ॥ 71

(3) మ॥ బలసాధ్యంబగు కార్యమెల్ల జరుపన్ బద్ధుండవో యింద్రుఁడా!
దళితారాతిపురీవిచిత్రవితతిందగ్ధంబుఁ గావించుచున్
విలసత్స్తోత్రము లాలకించి యరులన్ వేర్వేరుగాఁ గొట్టినా
వలఘుస్తోతలు కీర్తివంతులగున ట్లాత్రంబుతోఁ జేయుమా! ॥ 72

(4) ఉ॥ వైరులతోడ యుద్ధములు వచ్చినయప్పుడు పాతకాళికిన్
సారస కీర్తి సంపదలఁ జాల బలంబునుగల్గఁ జేతువో
వీరుఁడ! సూర్యరూపమున వేరు యుగంబులు చేయుచుంటి వీ
వారయ శత్రునాశకరమైన పవిం గొనినావు కీర్తికై ॥ 73

(5) ఉ॥ పాకహవీర్యమెల్ల బహుభంగుల వృద్ధినిఁ బొందెఁగాన న
స్తోక బలంబుఁ జూఁచి కడుఁ దోరపుభక్తిని బొందుఁడీ జనుల్
నాక పురీశ మూలమున నబ్బులు వాజులు వర్షభూములుం
దేకువఁ జేకొనంబడెను ద్రిప్పుడు బుద్ధులు వానికై వడిన్ ॥ 74

(6) ఉ॥ శూరుఁడు శక్రదేవుఁ డతిచోరుని చందము యాగసత్క్రియల్
చేరనివారి విత్తములఁ జేత హరించు చొనంగుఁగాన, స
త్కారపురస్సరంబులగు [2]కర్మలఁగల్గెడు వానికై ముదం
బారసి తీయుచుంటి మిపు డంచిత సోమరసంబు వేడ్కతోన్ ॥ 75

---

* ఆంధ్రానువాదము వ్రాతప్రతిలో (1వ. సంపుటము. 335వ పుట.) 103వ సూక్తమునకు ఋషిని పేర్కొనలేదు. సంస్కృతమూలము ననుసరించి ఋషినామ ముటంకింపఁబడినది. వ.గో.కృ. 1. కాదనకుండఁగు (తొ.పా. "గ" వ్రాయఁబోయి పొరపాటున "గు" వ్రాసెను. రచయిత స్వయముగా" కాదనకుండల" అని సవరించెను. అనకుండన్ + అల=అనకుండల అనునది ద్రుత ప్రకృతికదుస్సంధి. కావున "కాదనకుండఁగ" అని సవరించుట జరిగినది. వ.గో.కృ. 2 కర్మపరుండగు. (తొ.పా.)

(7) గీ॥ మదముచే [1]నిద్రవీఁగెడు మాయదారి, వృత్రు వజ్రాయుధముఁబూని వివిధగతులఁ
జంపఁగనె దేవకాంతలు చాలఁదుష్టి, నందియుండిరి నీ బల మధికమింద్ర॥ 76

(8) గీ॥ త్రోసిరాజు నేసి దుష్టవృత్రాదులఁ, బాడునేసినావు పట్టణముల
నీ నిమిత్త మేము నెఱవేర్పనున్నట్టి, వేడికోలులన్ని వెలయుఁగాక॥ 77

## సూక్తమ్—104

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) యోనిష్ట ఇన్ద్ర నిషదే అకారి తమా ని షీద స్వానో నార్వా ।

విముచ్యా వయోఽవసాయాశ్వాన్ దోషా వస్తోర్వహీయసః [1]ప్రపిత్వే ॥ 81

(2) ఓ త్యే నర ఇన్ద్రమూతయే గుర్నూ చిత్ తాన్ త్సద్యో అధ్వనో జగమ్యాత్ ।

దేవాసో మన్యుం దాసస్య శ్చమ్నన్ తే న ఆ వక్షన్త్సువితాయ వర్ణమ్ ॥ 82

(3) అవ త్మనా భరతే కేతవేదా అవ త్మనా భరతే ఫేనముదన్ ।

క్షీరేణ స్నాతః కుయవస్య యోషే హతే తే స్యాతాం ప్రవణే శిఫాయాః ॥ 83

(4) యుయోప నాభిరుపరస్యాయోః ప్ర పూర్వాభిస్తిరతే రాష్టి శూరః ।

అఞ్జసీ కులిశీ వీరపత్నీ పయో హిన్వానా ఉదభిర్భరన్తే ॥ 84

1. నిద్రఁబోయెడి (వ్రా.ప్ర.పా.) నిద్రఁబోయెడి వానిని వధించుట ఘనకార్యముకాదు. సంస్కృతమూలములో "నిద్రా" ర్థకమైన పదమేదియు లేదు. సాయనభాష్యములోఁగాని తదితర భాష్యములలోఁగాని నిద్రార్థము వ్రాయలేదు. "ససన్త" అన్నప్పుడు "సస" నిశ్చింతార్థకముగాఁ గొందఱు పేర్కొనిరి. నిశ్చింతగ నుండుటవేరు. నిద్రపోవుటవేరు. కావునఁబై విధముగా సవరింపఁబడినది. వ.గో.కృ. 1. ప్రయిత్వే (వ్రా.ప్ర.)

(5) ప్రతి యత్ స్యా నీథాదర్శి దస్యోరోకో నాచ్ఛా సదనం జానతీ గాత్ ।
అధ స్మా నో మఘవఞ్చర్కృతాదిన్మా నో మఘేవ నిష్షపీ పరా దాః ॥ 85

(6) స త్వం న ఇన్ద్ర సూర్యే సో అప్స్వనాగాస్త్వ ఆ భజ జీవశంసే ।
మాన్తరాం భుజమా రీరిషో నః శ్రద్ధితం తే మహత ఇన్ద్రియాయ ॥ 86

(7) అధా మన్యే శ్రత్ తే అస్మా అధాయి వృషా చోదస్వ మహతే ధనాయ ।
మా నో అకృతే పురుహూత యోనా విన్ద్ర క్షుధ్యద్భ్యో వయ ఆసుతిం దాః ॥ 87

(8) మా నో వధీరిన్ద్ర మా పరా దా మా నః ప్రియా భోజనాని ప్ర మోషీః ।
ఆణ్డా మా నో మఘవఞ్ఛక్ర నిర్భేన్మా నః పాత్రా భేత్ సహజానుషాణి ॥ 88

(9) అర్వాజేహి సోమకామం త్వాహురయం సుతస్తస్య పిబా మదాయ ।
ఉరువ్యచా జఠర ఆ వృషస్వ పితేవ నః శృణుహి హూయమానః ॥ 89

## సూక్తము—104

### ఋషి—కుత్సుఁడు *

### దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ మానకవేదికన్ మిగుల మానుగఁజేసితి మింద్రః నీకుఁ బె
న్పూనికతోడ యానమును బొల్పెసలారఁగ నీడ్చునట్టి నీ
యానహయంబులన్ విడచి యందముగా దయసేయుమా! వడిన్
యాన విముక్తమై యలరు నశ్వము పట్టునుజేరుకై వడిన్ ॥ 78

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ.

(2) మ॥ యజమానావన [1]సత్క్రియా విషయమై యాచించు మే మెల్ల స
ద్భజమానామర దేవు భాగ్యసహితున్ భావింప నా యింద్రుఁడే
సుజనుల్ మెచ్చఁగ మాకు రక్షలిడుచున్ సూక్ష్మార్థముల్ చూపుచున్
యజనాళిం బడఁగొట్టు శత్రువులకున్ హానిం గడుం జేయఁడే! ॥ 79

(3) గీ॥ అన్యధనముల హరియించి యంబులోన, దాఁగియున్నట్టి కుయవుని దర్ప మడఁచి
వానియోషాద్వయంబును వారిలోన, స్నానమొనరింపఁ జంపవె! [2]శక్ర! నీవు ॥ 80

(4) గీ॥ కుయవుఁ డుదకంబులోపలఁ గూరుచుండి, వృద్ధిఁ బొందుచు నుండఁగ విశ్వవంద్య!
యంజసీముఖ్యనదులన్ని యసురపతిని, గాఁచినను వాని వధియింపఁగలిగినావు ॥ 81

(5) చ॥ రయమున గోవుపోయి కడు రాజిలువత్సముఁ జూఁచునట్లుగాఁ
గుయవునిచోటు మేము కనుఁగొంటిమి దానినె నీవు చూచి ని
ర్భయముగ వానిఁజంపితివి బాధలు ద్రోలుచు వీడకుండుమా
యయ! మము, జారపూరుషుఁడు హస్తధనంబును వీడురీతిగన్ ॥ 82

(6) ఉ॥ భానుసపర్యఁ జేయు మతిభాగ్యమొసంగుము, పాపమంతయుం
బూనికతో హరించి మముఁ బూతులఁగా నొనరించు తుష్టితో
మానుగఁ గామినీ యుదర మధ్యమునన్ విలసిల్లుచుం గడున్
జానుగలట్టి బిడ్డలను జాలఁగఁ జూచుచుఁ గోర్కెఁ దీర్పుమా! ॥ 83

(7) ఉ॥ పిమ్మట డెందమందు నినుఁ బెద్దగ నెంచుచునంటి మింద్రుఁడా!
నమ్ముము [3]మాదుమాటలను నవ్వులు కావివి కాంక్షితార్థదా!
నెమ్మి ధనార్జనంబునకు నేర్పునొసంగుము గేహ మర్థశూ
న్యంబుగఁ జేయకుండి నరయాచిత భక్తము నిమ్ము పాలతోన్ ॥ 84

(8) గీ॥ మమ్ము విడువకుండ మహితాత్మ! రక్షింపు, ధన మొసంగుమయ్య! ధర్మబుద్ధి
గర్భమందునున్న ఘనసంతతిచ్ఛేద, మెటుఁగి చేయకయ్య! యిష్టికర్త! ॥ 85

(9) ఉ॥ సోమరసాభిలాషివని శూరులు చెప్పఁగ నాలకించి యీ
సోమరసంబుఁ దీసితిమి శూరుఁడ! యిష్టికి వచ్చి వేడ్కతో
సోమమునెల్లఁ గ్రోలి పిత సూనుని మాట గ్రహించునట్లు పె
న్ప్రేమముతోడ మా నుడువు [4]నీవును విందువుగాకఁ బేర్మితోన్ ॥ 86

1. ప్రక్రియా విషయమై (తా.పా.) 2. బంభభేదీ! (తా.పా.) 3. నాదు. (వ్రా.ప్ర.పా.) 4. నీవువినన్వలె సంతసంబునన్ (తా.పా.)

## సూక్తమ్ 105

ఋషిః—త్రిత ఆప్త్యః, కుత్స ఆంగిరసో వా

దేవతా—విశ్వేదేవాః

ఛందః—పంక్తిః, 8-యవమధ్యా మహాబృహతీ 19-త్రిష్టుప్

(1) చన్ద్రమా అప్స్వన్తరా సుపర్ణో ధావతే దివి ।

న వో హిరణ్యనేమయః పదం విన్దన్తి విద్యుతో విత్తం మే అస్య రోదసీ ॥ 90

(2) అర్థమిద్ వా ఉ అర్థిన ఆ జాయా యువతే పతిమ్ ।

తుఞ్జాతే వృష్ణ్యం పయః పరిదాయ రసం దుహే విత్తం మే అస్య రోదసీ ॥ 91

(3) మో షు దేవా అదః స్వరవ పాది దివస్పరి ।

మా సోమ్యస్య శంభువః శూనే భూమ కదా చన విత్తం మే అస్య రోదసీ ॥ 92

(4) యజ్ఞం పృచ్ఛామ్యవమం స తద్ దూతో వి వోచతి ।

క్వ ఋతం పూర్వ్యం గతం కస్తద్ బిభర్తి నూతనో విత్తం మే అస్య రోదసీ ॥ 93

(5) అమీ యే దేవాః స్థన త్రిష్వా రోచనే దివః ।

కద్ వ ఋతం కదనృతం క్వ ప్రత్నా వ ఆహుతిర్విత్తం మే అస్య రోదసీ ॥ 94

(6) కద్ వ ఋతస్య ధర్ణసి కద్ వరుణస్య చక్షణమ్ ।

కదర్యమ్ణో మహస్పథాతి క్రామేమ దూఢ్యో విత్తం మే అస్య రోదసీ ॥ 95

(7) అహం సో అస్మి యః పురా సుతే వదామి కాని చిత్ ।

తం మా వ్యన్త్యాధ్యో౩ వృకో న తృష్ణజం మృగం విత్తం మే అస్య రోదసీ ॥ 96

(8) సం మా తపన్త్యభితః సపత్నీరివ పర్శవః ।

మూషో న శిశ్నా వ్యదన్తి మాధ్యః స్తోతారం తే శతక్రతో విత్తం మే అస్య రోదసీ ॥ 97

(9) అమీ యే సప్త రశ్మయస్తత్రా మే నాభిరాతతా ।

త్రితస్తద్వేదాప్త్యః స జామిత్వాయ రేభతి విత్తం మే అస్య రోదసీ ॥ 98

(10) అమీ యే పఞ్చోక్షణో మధ్యే తస్థుర్మహో దివః ।

దేవత్రా ను ప్రవాచ్యం సధ్రీచీనా ని వావృతుర్విత్తం మే అస్య రోదసీ ॥ 99

(11) సుపర్ణా ఏత ఆసతే మధ్య ఆరోధనే దివః ।

తే సేధన్తి పథో వృకం తరన్తం యహ్వతీరపో విత్తం మే అస్య రోదసీ ॥ 100

(12) నవ్యం తదుక్థ్యం హితం దేవాసః సుప్రవాచనమ్ ।

ఋతమర్షన్తి సిన్ధవః సత్యం తాతాన సూర్యో విత్తం మే అస్య రోదసీ ॥ 101

(13) అగ్నే తవ త్యదుక్థ్యం దేవేష్వస్త్యాప్యమ్ ।

స నః సత్తో మనుష్వదా దేవాన్ యక్షి విదుష్టరో విత్తం మే అస్య రోదసీ ॥ 102

(14) సత్తో హోతా మనుష్వదా దేవాఁ అచ్ఛా విదుష్టరః ।

అగ్నిర్హవ్యా సుషూదతి దేవో దేవేషు మేధిరో విత్తం మే అస్య రోదసీ ॥ 103

(15) బ్రహ్మా కృణోతి వరుణో గాతువిదం తమీమహే ।

వ్యూర్ణోతి హృదా మతిం నవ్యో జాయతామృతం విత్తం మే అస్య రోదసీ ॥ 104

(16) అసౌ యః పన్థా ఆదిత్యో దివి ప్రవాచ్యం కృతః ।

న స దేవా అతిక్రమే తం మర్తాసో న పశ్యథ విత్తం మే అస్య రోదసీ ॥ 105

(17) త్రితః కూపేఽవహితో దేవాన్ హవత ఊతయే ।

తచ్ఛుశ్రావ బృహస్పతిః కృణ్వన్నం హూరణాదురు విత్తం మే అస్య రోదసీ ॥ 106

(18) అరుణో మా సకృద్ వృకః పథా యన్తం దదర్శ హి ।

ఉజ్జిహీతే నిచాయ్యా తష్టేవ పృష్ట్యామయీ విత్తం మే అస్య రోదసీ ॥ 107

(19) ఏనాఙ్గూషేణ వయమిన్ద్రవన్తో ఽభి ష్యామ వృజనే సర్వవీరాః ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 108

## సూక్తము—105

### ఋషి—కుత్సుఁడు *

### దేవత—విశ్వేదేవతలు

(1) చ॥ పొలుపుగ వారి మధ్యమును బొందుచు భాసిలు సూర్య కాంతితో
మెలఁగెడు చంద్రదీధితులు మేనుపయిం బ్రసరింపకుంట నే
సలయుచునుంటిఁ గష్టముల యార్తిని బోవఁగఁజేసి వెంటనే
కలిగిన బాధలన్నిటిని గాంచి హరింపుము భక్తవత్సలా! ॥ 87

* ఆప్త్యుఁడైన త్రితుఁడు లేదా అంగిరస పుత్రుఁడైన కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ.

(2) చ॥ ధనమునుగోరు మానవులు తద్దయు విత్తముఁగాంచి కాంతలన్
ఘనముగఁబొంది సౌఖ్యమును గౌరవ సంతతితోడ వెల్గుచుం
దనియుచు నుండ నే నిచట దండిగ బాధల నొందుచుండగాఁ
గన వదియేమి? రోదసిరో! కల్గవె నీకు దయా విశేషముల్ ॥ 88

(3) గీ॥ నా వియోగ శ్రమంబున నలయుచున్న, ప్రియయుఁ గుందుచునుండుఁ దాఁబెద్దదైన
బాధ నారసి నన్దీయ బావినుండి, గగన భూదేవతలు మీరు కదలిరండు ॥ 89

(4) చ॥ తిరముగ బావినుండి ననుఁదీయక యుండిన తండ్రి తాతయున్
నరకములోన జారి గడునాశముఁ బొందెద రట్టు లెన్నఁడున్
జరగక యుండునట్లు నన్నుఁ జయ్యనఁదీయరె నూతినుండి ని
ర్జరవరులార! పెద్దలకుఁ జల్లని పుత్రకభిక్షపెట్టరే! ॥ 90

గీ॥ అమరులకు నగ్రగణ్యుఁడౌ నగ్నిదేవుఁ, డెచ్చటున్నాఁడొ తద్గుణమెందు నిలచి
యున్నదో తెలియఁజేయంగ నుచితరీతి, నగ్నినడిగెద రోదసీ! యవనమిడవె! ॥ 91

(5) శా॥ పాతాళాదులయందు వెల్గుచుఁగడున్ భాసిల్లు నాదిత్యుతోఁ
జేతోమోదము నొందఁజేరిఁ నుతులం జిత్తంబులోఁ బెట్టుచున్
ఖ్యాతిం బొందెడునట్లు వైరిగణముం గారించు మీరిప్పు డే
రీతిం మాపయిఁ జూపకుండిరో! దయన్ ఋక్స్తుత్యులారా! తగన్ ॥ 92

(6) క॥ ఎచ్చటికిఁబోయెఁ బోషణ, మెచ్చటకున్ వరుణుఁడరిగి యెందుండెనొకో!
యెచ్చట నర్యముఁడుండెనొ!, నచ్చముగా నెఱుఁగనైతి నమరాధీశున్ ॥ 93

పాఠాంతరము

గీ॥ ప్రీతితో దర్శనమొసంగి ప్రియముఁగూర్చు, వరుణుఁడెచ్చట దాగెనో వైరిగణము
నంతమొందించు నర్యముఁ [1]డెంతవాఁడొ, నన్నురోదసి! కాపాడు! సన్నుతాంగి! ॥ 94

(7,8,9) సీ॥ మృగమును దోడేలు మ్రింగెడునట్టులు, సంతతిలేమి నన్జంపుచుండె
సవతులు మగనిని సాధించునట్టులు, నూతి దరుల్ నన్ను నొక్కుచుండె
నెలుక దారములను నింపుగాఁదినునట్లు, బిట్టుదుఃఖము పీడఁ బెట్టుచుండె
స్వర్లోకమందుండు సప్తజీవ స్వరూపమున వర్తించెడు భాను కిరణ
గీ॥ ములను నాప్రాణమంతయుఁ గలియుచుండె, నుదకపుత్రుఁడు త్రితుఁడు నే నున్నరీతి
నెఱిఁగియుండెను మరియెవ్వఁడెఱుఁగుదాని, [2]నింద్రుఁడ! త్రితుఁడ! రోదసి! యీరు రండు॥ 95

1. డెంతఁగలఁడొ!, నన్నురోదసి! కావలె సన్నుతాంగి!(వా.ప్ర.పా.) నేమానివారు విరచించిన యీపాఠము సముచితముగాలేదు. "ఎంతఁగలఁడొ? —కావలె" అన్న పదములు సమన్వయమున కనుకూలముకావు. కానఁ బై విధముగా సవరింపఁబడినది. వ.గో.కృ. (చూ. వ్రాతప్రతి 1వ సంపుటము. 341 పుట) 2. నింద్రత్రితులార! రోదసి! యెఱిగిరారె! (.తొపా.) గణభంగమగునని రచయిత పైపాఠముగా నవరించెను. సవరించిన పాఠమందును "నింద్రుఁడా!" దీర్ఘాంతముగ వ్రాయఁబడెను. అప్పుడింద్రగణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనట్లు గ్రహింపనగును. వ.గో.కృ.

(10) ఉ॥ దేవత లెందరో కలరు దీనుల కోర్కెలఁ దీర్చువార లే
దేవతకాని నామొఱను దిన్ననిరీతిని నాలకింప దేఁ
గావుమటంచు సంస్తుతులు గౌరవమొప్పగఁజేసి యుండగాఁ
గావవదేమి రోదసిరా! కల్గిన దుఃఖము లన్నిఁ దీర్చుచున్ ॥ 96

(11) ఉ॥ అంతటఁబోవు సూర్యకిరణాళి నభంబున వెల్గుచుండఁగా
సంతస మూని యంబువులఁ జయ్యనదాఁటి వృకంబు, వెంటనే
చింతను బొందుచున్న ననుఁజేరి తినన్ బరు వెత్తుచుండ నా
యంతకుఁ దండ్రి యట్లగుట కడ్డముఁబెట్టఁడె నైజరశ్ములన్ ॥ 97

(12) ఉ॥ దేవతలార! మీ రఖిల దివ్యనుతుల్ వినియున్న వారలో!
దేవతలార! మీ బలము తేకువతో నరులంతఁ జాటరో!
దేవతలార! మీవలన దివ్యనదుల్ ప్రవహించుచుండ నన్
గావరదేమి? నాకిపుడు కల్గిన బాధల నన్నిఁ గొట్టుచున్ ॥ 98

(13) ఉ॥ నీకును దేవతావళికి నేస్తము సిద్ధము కానఁ బావకా!
నాక పురీశ ముఖ్యులకు నాదగు యజ్ఞములోనఁ బూజ నేఁ
దేకువతో నొనర్చునటు దివ్యన కిప్పుడు పూజఁ జేయుమా!
నాకుఁగలట్టి బాధలకు నాస్తికతం గల్గింపు రోదసీ! ॥ 99

(14) క॥ మను యజ్ఞమునందువలెం, బనిఁగొని నా హవ్యములను బావకుఁ డెలమిన్ ॥
ఘన నిర్జరాళి కిచ్చుచు, జనుచుండుట యెఱుఁగరేమి జాణలుకారే! ॥ 100

(15) గీ॥ శ్రేషరక్షణ కర్మలఁ జేయువారి, కఖిల కామ్యార్థదుండవు యజ్ఞకర్త
వైన వరుణుండ! భూమిరో! యంతరిక్ష, దేవి! నాబాధ లన్నిటిఁ దీర్పరారె! ॥ 101

(16,17) సీ॥ బ్రహ్మలోకమునకు బాటఁజూపెట్టుచు నంతట వెలుఁగుచు [1]నతిపవిత్ర
మాసముల్ గల్పించి మర్యాదనొందుచు యాగ సంతతినెల్ల సాగనిచ్చు
నమరుల నెల్లర నాదరించుచునుండు సూర్యుని మనుజులు చూడఁగలరె!
యేకతద్వితులార! యెఱుఁగదె ధానుండు మీపాపకార్యముల్ [2]మిగుల, నేను
గీ॥ బావిలోనుండి యమరులఁ బ్రస్తుతింప, గురువు నామొఱ నాలించి కూపబాధ
పాపి రక్షించుఁగాక, [3]నన్బరమదీప్త, రోదసియుఁ జూచుఁగాకఁ దా నాదుస్థితిని ॥ 102

(18) గీ॥ వీఁపులో నొప్పికలుఁగఁగ, వెన్నుపైకి, నెత్తు వడ్లంగి విధమున వృకమువెన్నుఁ
బైకి నెత్తుచు నాపయింబడెను దొల్లి, రోదసీ! నన్నుఁగావవే! రూఢమతిని ॥ 103

1. నతిప్రశస్త (తొ.పా. గణభంగము) వ.గో.కృ. 2. మిక్కుటముగ (తొ.పా.) 3. నన్నవ్యమైన (తొ.పా.)

పాఠాంతరము

గీ॥ మాసములఁజేయు సూర్యుఁడు మార్గమంటి, యేగుచుం దారలంజూఁచి యెసకమెసక
సరస మాడుచు వానితో జరుగుచుండె, రోదసీః నన్నుఁగావవే రూఢమతిని ॥ 104

(19) గీ॥ అమరపతి మాకు వశ్యుఁడై యమరునట్లు, పుత్ర పౌత్రాభివృద్ధి నేఁ బొందునట్లు
శత్రువులఁ బాఱఁద్రోలంగ శక్తి గలుఁగు, నట్లు సన్నుతిఁజేయు నే నణఁగియుంటి ॥ 105

†గీ॥ మత్కృతంబగు స్తోత్రంబు మదినిబెట్టి, వరుణమిత్రులు భూదేవి వాసిఁగాంచు
నదితి సింధువు ద్యోదేవి యాదరమున, నన్నుఁగాపాడుదురుగాక నెన్నునటుల ॥ 106

## అనువాకః—16, సూక్తమ్—106

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—విశ్వేదేవాః

ఛందః—జగతీ, 7- త్రిష్టుప్

(1) ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమూతయే మారుతం శర్ధో అదితిం హవామహే ।

రథం న దుర్గాద్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 109

(2) త ఆదిత్యా ఆ గతా సర్వతాతయే భూత దేవా వృత్రతూర్యేషు శంభువః ।

రథం న దుర్గాద్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 110

(3) అవన్తు నః పితరః సుప్రవాచనా ఉత దేవీ దేవపుత్రే ఋతావృధా ।

రథం న దుర్గాద్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 111

(4) నరాశంసం వాజినం వాజయన్నిహ క్షయద్వీరం పూషణం సుమ్నైరీమహే ।

రథం న దుర్గాద్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 112

† ఋగ్వేదములో ప్రథమాష్టకము సప్తమాధ్యాయమున 105వ సూక్తములో 19 ఋక్కులే సంస్కృతముననుండఁగాఁ బొరపాటునవాంధ్రానువాదములో (వ్రాతప్రతి 1వ. సంపుటము 345వ పుట) 105వ సూక్తములో 20 ఋక్కులున్నట్లు గ్రంథకర్త వ్రాసెను. 105 - 106 పద్యములు రెండును 19 ఋక్కున కనువాదములేగాని వేరుకాదు. వ.గో.కృ.

(5) బృహస్పతే సదమిన్నః సుగం కృధి శం యోర్యత్ తే మనుర్హితం తదీమహే ।

రథం న దుర్గాత్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 113

(6) ఇన్ద్రం కుత్సో వృత్రహణం శచీపతిం కాటే నిబాళ్హ[1] ఋషిరహ్వదూతయే ।

రథం న దుర్గాద్ వసవః సుదానవో విశ్వస్మాన్నో అంహసో నిష్పిపర్తన ॥ 114

(7) దేవైర్నో దేవ్యదితిర్ని పాతు దేవస్త్రాతా త్రాయతామప్రయుచ్ఛన్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తా మదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 115

## అనువాకము—16, సూక్తము—106

### ఋషి—కుత్సుఁడు *

### దేవత—అశ్విదేవతలు †

(1) గీ॥ వరుణ, మిత్రుల, వహ్నిని బరమమైత్రిఁ, బిలుచుచున్నాము వారలు పెద్ద లగుచుఁ
గల్మషమునుండి మమ్ములఁ గావవలదె, రథము సారథి కాపాడువిధము తల్లఁప ॥ 107

(2,3,4,5) సీ॥ శూరయుద్ధములందు వీరులై తోడ్పడి, మమ్ము రక్షింపరే మాన్యులార!
పితలు! కాపాడరే పెద్దలై మమ్ములఁ గనవేమి రోచసీ ఘనతలంబ!
నుతియించుచున్న యీ మతిశూన్యుఁ జూడంగఁ గదలిరావేమి యోకాంచనాథ!
[1]చీకాకుఁ బడకుండఁ జిత్సుఖంబులనెల్లఁ గలుఁగఁ జేయ వదేమి! ఘన గురుండ!

1. నిబాళహ (వా.ప్ర.) నిబాళ్హ (సా.మా )

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ. † సంస్కృత మూలగ్రంథములలోఁ బెక్కెట నీసూక్తమునకు "విశ్వే దేవతలు" దేవతలుగాఁ బేర్కొనఁబడినది. విశ్వేదేవతలు దేవతలైనప్పుడు నిర్దిష్టమైన లింగవ్యవస్థ నియమితమై యుండదు. స్త్రీ పురుష దేవత లెవ్వరైనను దేవతలు కావచ్చును. అనువాద పద్యములలో వరుణాదిదేవతలేకాక సప్తమఋక్కున కనువాదపద్యమైన 110వ పద్యమున దేవమాతను బ్రార్థించుటఁ జూడఁగా నీసూక్తమునకు దేవతలు అశ్విదేవతలుగాక విశ్వేదేవతలేయని తేలుచున్నది. కాఁగా నాంధ్రానువాదములో అశ్విదేవతలుఁగా రచయిత వ్రాయుట పొరపాటు కానగును. వ.గో.కృ.

1. "చీకాకుఁబడకుండఁ జిత్సుఖంబులనెల్ల" అని రచయిత పేర్కొనఁగా వ్రాయసగాఁడు "విచ్చుఖంబులనెల్లఁ" అను నవపాఠమును వ్రాసి యుంచెను. పునఃపరిశీలనలో గ్రంథకర్తయు దీనిని గమనింపలేదు. కాన నసలుపాఠమును గుర్తించి యతిభంగము కాకుండఁ "జిత్సుఖంబులనెల్లఁ" అని సవరించుట జరిగినది. వ.గో.కృ.

గీ॥ బ్రహ్మ నీ కిచ్చినట్టి యాప్రబలశక్తి, భయముఁబోఁగొట్టి సామర్థ్యశక్తిఁ గూడ
మాఘయిం జూపవయ్య! యోమాననీయ!, దేవతారక్షకుండ! యోదివ్యతేజ! ॥ 108

(6) గీ॥ కూపమునఁ ద్రోయఁబడినట్టి కుత్సితుండు, తన్ను రక్షింప వేడుచు ధన్యతముని
శత్రునాశకు బహుకర్మ శక్తియుతుని, నిన్ను వేడఁగలేదె యోసన్నుతాంగ! ॥ 109

(7) ఉ॥ సూనులతోడఁ గూడుకొని సూనృతవాదిని దేవమాత, స
న్మానముతోడ మమ్ము [1]నభిమానముమీరఁగఁ గాచుఁగాతఁ దా
జ్ఞానముకల్గు సూర్యుఁడతిశాంతినిఁజేయుచు మాకు నెప్పుడున్
మానక మత్కృతస్తుతుల మన్ననతోఁ జెవిఁబెట్టుఁ గావుతన్ ॥ 110

## సూక్తమ్ — 107

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—విశ్వేదేవాః

ఛందః—త్రిష్టుప్

(1) యజ్ఞో దేవానాం ప్రత్యేతి సుమ్నమాదిత్యాసో భవతా మృళయన్తః ।
ఆ వోఽర్వాచీ సుమతిర్వవృత్యాదంహోశ్చిద్యా వరివోవిత్తరాసత్ ॥ 116

(2) ఉప నో దేవా అవసా గమన్త్వఙ్గిరసాం సామభిః స్తూయమానాః ।
ఇన్ద్ర ఇన్ద్రియైర్మరుతో మరుద్భిరాదిత్యైర్నో అదితిః శర్మ యంసత్ ॥ 117

(3) తన్న ఇన్ద్రస్తద్ వరుణస్తదగ్నిస్తదర్యమా తత్ సవితా చనో ధాత్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 118

1. నభిమానముతోడుత (తా.పా.)

## సూక్తము—107

ఋషి— కుత్సుఁడు*

దేవత—విశ్వేదేవతలు

(1) చ॥ యజనము దేవతావళి కనంతసుఖంబులు చేయుఁగాత స
ద్భజనమొనర్చు వారి నెడఁబాయక దేవత లింద్రుగావుతన్
నిజమగు విత్తహీనులకు నేర్పున విత్తము వచ్చుఁగాక మీ
విజయములం దలంచెదము వేల్పులు! మీరలు మమ్ముఁ గావరే! ॥ 111

(2) గీ॥ అంగిరస్తుత్యమానులౌ యమరులార!, మమ్ముఁ గాపాడ రారేమి? సొమ్ముతోడ
శక్ర మారుతముల్ మాకు శాంతి నొసఁగ, వచ్చెదరుగాక సుజనులు మెచ్చునట్లు ॥ 112

(3) గీ॥ ఇచ్చెదరుగాక నన్నంబు నింద్రవహ్ని, సవిత లత్యాదరంబున సరసమతిని
వా రొసంగిన యన్నంబు వరుణుఁ డుదక, దేవియుం గాచుచుండుతఁ దెల్వితోడ ॥ 113

## సూక్తమ్—108

ఋషిః—కుత్సఆంగిరసః

దేవతా—ఇంద్రాగ్నీ

ఛందః—త్రిష్టుప్.

(1) య ఇన్ద్రాగ్నీ చిత్రతమో రథో వామభి విశ్వాని భువనాని చష్టే।

తేనా యాతం సరథం తస్థివాంసాథా సోమస్య పిబతం సుతస్య ॥ 119

(2) యావదిదం భువనం విశ్వమస్త్యురువ్యచా వరిమతా గభీరమ్ ।

తావాగ్ం అయం పాతవే సోమో అస్త్వరమిన్ద్రాగ్నీ [1]మనసే యువభ్యామ్ ॥ 120

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ. 1. మనసయుష్మ్యాం (ప్రా.ప్ర.)

(3) చక్రాథే హి సధ్ర్యఙ్నామ భద్రం సధ్రీచీనా వృత్రహణా ఉత స్థః ।
తావింద్రాఽగ్నీ సధ్ర్యంచా నిషద్యా వృష్ణః సోమస్య వృషణా వృషేథామ్ ॥ 121

(4) సమిద్ధేష్వగ్నిష్వానజానా [1] యతస్రుచా బర్హిరు తిస్తిరాణా ।
తీవ్రైః సోమైః పరిషిక్తేభిరర్వాగేంద్రాఽగ్నీ సౌమనసాయ యాతమ్ ॥ 122

(5) యానీంద్రాఽగ్నీ చక్రథుర్వీర్యాణి యాని రూపాణ్యుత వృష్ణ్యాని ।
యా వాం ప్రత్నాని సఖ్యా శివాని తేభిః సోమస్య పిబతం సుతస్య ॥ 123

(6) యదబ్రవం ప్రథమం వాం [2]వృణానో౾యం సోమో అసురైర్నో విహవ్యః ।
తాం సత్యాం శ్రద్ధామభ్యా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 124

(7) యదింద్రాఽగ్నీ మదథః స్వే దురోణే యద్ బ్రహ్మణి రాజని వా యజత్రా ।
అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 125

(8) యదింద్రాఽగ్నీ యదుషు తుర్వశేషు యద్ ద్రుహ్యుష్వనుషు పూరుషు స్థః ।
అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 126

(9) యదింద్రాఽగ్నీ అవమస్యాం పృథివ్యాం మధ్యమస్యాం పరమస్యాముత స్థః ।
అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 127

1. యతస్రుచా (వా.ప్ర.) 2. వృణానోయం (వా.ప్ర.)

(10) యదిన్ద్రాగ్నీ పరమస్యాం పృథివ్యాం మధ్యమ స్యామవమస్యాముత స్థః ।

అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 128

(11) యదిన్ద్రాగ్నీ దివిష్ఠో యత్ పృథివ్యాం యత్ పర్వతేష్వోషధీష్వప్సు ।

అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 129

(12) యదిన్ద్రాగ్నీ ఉదితా సూర్యస్య మధ్యే దివః స్వధయా మాదయేథే ।

అతః పరి వృషణావా హి యాతమథా సోమస్య పిబతం సుతస్య ॥ 130

(13) ఏవేన్ద్రాగ్నీ పపివాంసా సుతస్య విశ్వాస్మభ్యం సం జయతం ధనాని ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 131

## సూక్తము—108

### ఋషి—కుత్సుఁడు*

### దేవత—ఇంద్రాగ్నులు

(1) క॥ వాసవుఁడః యగ్నిః మీరలు, భాసించెడు రథముపైని వసియించి కడున్
దాసులరై వచ్చుచు మా, తీసిన సోమమును ద్రావి దివికిం జనరేః ॥ 114

(2) క॥ జగమంత నెంత గలదో, తగ నంతటి సోమరసముఁ ద్రావుటకొఱకై
నొగి వర్ధిల్లుచు నుండరె !, యగణిత వహ్నీంద్రులారః యధిపతులారాః ॥ 115

(3) ఉ॥ ఎక్కడికైన మీ రిరువు రెప్పుడు పోయిన నొక్కమారుగాఁ
జక్కఁగ బోవుచుండెదరు జాణలు మీరలు, కానఁ బ్రీతితో
మిక్కిలి యెక్కు వౌనటుల మేము రచించిన యజ్ఞవేదిపై
నెక్కువ సోమపానమును నింపుగఁ జేయరె వహ్నిః యింద్రుఁడాః ॥ 116

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ.

(4) చ॥ అనలము లన్నిరీతులను నందముగా జ్వలియించుచుండఁగా
ఘనతర హోమవస్తువులఁగాఁచిన నేతిని దడ్పి స్రుక్కులం
బనిఁగొనిఁ జేతఁబట్టుకొని పర్చితి మిక్కిడ దర్భ లన్ని కా
దని యనకుండ మా కడకు నగ్ని మహేంద్రులుః రండుః వేగమే ॥ 117

(5) ఉ॥ వృత్రవధాదిరూపమగు వీర్యము లోకము లంతఁ జాటుచున్
స్తోత్రము లొంద భూతముల సూటిగఁజేయుచు, వర్ష మిచ్చుచుం
జిత్రముగాఁగ నిర్వరును జేర్చుచు, మంగళ మెల్లవారికిం
బాత్ర సమిద్ధసోమమును బానముఁజేయుఁడు శక్రః పావకాః ॥ 118

(6) ఉ॥ సోమరసంబుతోడ మిము శోభిలఁజేయఁదలంపు పూర్వమే
నామదిలోనఁ బుట్టినది నాదగుఁగోర్కెనుఁ దీర్పవచ్చి పై
న్నీమముతోడ సోమమును నేర్పునఁ గ్రోలిన మీరు నా మహా
హోమము సార్థకం బగునహో యని చాటుదు రెల్ల కోవిదుల్ ॥ 119

(7) ఉ॥ మీకు సమస్త సౌఖ్యములు మీ గృహరాజములందు నుండినం
బాకహరాగ్నులారః రసపానముచేఁ బరితృప్తి నొందినం
దేకువతోడఁ బోరులకుఁ దిన్నఁగ మీరలు పోవుచున్న నే
సాకులు చెప్పకుండ నెఱ జన్నముఁ జూడఁగ వచ్చి యేగుఁడీ ॥ 120

(8) గీ॥ ఎచ్చటకుఁ బోయియుండిన నేరికైన, సాయ మొనరింపఁ బూనిన సరసనుతులఁ
జేయువారికి నిష్టార్థ సరణినీయ, నేగి యున్నను, మీరలు సాగి రండుః ॥ 121

(9) క॥ దివి నున్న భువిని నున్నం, బవిధారీః యగ్నిదేవః పరస్తోమంబుం
జవిఁజూడఁ గదలి వచ్చుచు, వివిధార్థము లన్ని మాకు వేగ మొసఁగుఁడీ ॥ 122

(10) క॥ రవి వెలుఁగు గగనమందున, నవిరళ తేజస్సుతోడ నమరుచు నున్నన్
జవమున నిష్టము లొసఁగెడు, పవిధారీః యగ్నితోడఁ బరుగిడి రావేః ॥ 123

(11) †క॥ పుడమిని బర్వతతతిపై, నడరెడు దివియందుఁగూడ, నగ్నీః యింద్రాః
[1]జడమును నౌషధతతితో, నెడతెగకుండంగ మమ్మ నెపుడుం గనుఁడీ ॥ 124

† లుప్తభాగ పూరణకర్త, వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వద్లమూడిగోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ"—శ్రీ నేమానివారు ప్రథమాష్టకము సప్తమాధ్యాయములో 108వ సూక్తములోని 11-13 ఋక్కులను బొరపాటున ననువదింపలేదు. 12వ ఋక్కున కనువాదపద్యమైన "సోమరసపాన" ఇత్యాది పద్యమును 11వ ఋక్కుగాఁజూపి (వ్రాతప్రతి 1వ. సంపుటము 351 పుట) సూక్తమును ముగించిరి. కాన నీ 11-13 ఋక్కులను నే నాంధ్రీకరించితిని. వ.గో.కృ.

1. జడమును = జలమును "లడయో రభేదః" అను సూత్రమున ననుసరించి యీ పదము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

(12) *క॥ సోమరసపాన మొనరిచి, కామిత ధన మొసఁగి [2]మాకు, గ్రాలుఁడు దానిన్
భూమిసతీ ప్రముఖులు కడు, నీ మహి రక్షింత్రుగాక నెంతయుఁ బ్రీతిన్ ॥ 125

(13) †గీ॥ అంతరిక్ష మధ్యమందతులమయిన, శక్తి నలరు నగ్ని శక్రులార!
వరుణమిత్ర దేవ వరులార! వివిధమౌ, సంపదల నొసంగి సదయఁగనుఁడు ॥ 126

## సూక్తమ్ 109

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఇంద్రాగ్నీ

ఛందః—త్రిష్టుప్

(1) వి హ్యఖ్యం మనసా వస్య ఇచ్ఛన్నిన్ద్రా౨గ్నీ జ్ఞాస ఉత వా సజాతాన్ ।
నాన్యా యువత్ ప్రమతిరస్తి మహ్యం స వాం ధియం వాజయన్తీ[1]మతక్షమ్ ॥ 132

(2) అశ్రవం హి భూరిదావత్తరా వాం విజామాతురుత వా ఘా స్యాలాత్ ।
అథా[2] సోమస్య ప్రయతీ యువభ్యామిన్ద్రా౨గ్నీ స్తోమం జనయామి నవ్యమ్ ॥ 133

(3) మా చ్ఛేద్మ రశ్మీగ్ంరితి నాధమానాః పితౄణాం శక్తీరనుయచ్ఛమానాః ।
ఇన్ద్రా౨గ్నిభ్యాం కం వృషణో మదన్తి తా హ్యద్రీ ధిషణాయా ఉపస్థే ॥ 134

(4) యువాభ్యాం దేవీ ధిషణా మదాయేన్ద్రా౨గ్నీ సోమముశతీ సునోతి ।
తావశ్వినా భద్రహస్తా సుపాణీ ఆ ధావతం మధునా పృఙ్క్తమప్సు ॥ 135

---

* "సోమరసపాన" ఇత్యాది కందపద్యమును వ్రాతప్రతిలో శ్రీ నేమానివారు 11వ ఋక్కుగాఁ బేర్కొనిరిగాని యిది 12వ ఋక్కున కనువాదము. వ.గో.కృ. † లుప్తభాగ పూరణకర్త, వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

2. మాకుఁ గదలుఁడుదానిన్, భూమి సతీవరుణ మిత్రులు (భూమిసతీ ముఖ్యులుకడు) శ్రీమవుఁడు రక్షణంబు సేతురు గాతన్ (తొ.పా.) ఇది సరిగాలేదని రచయిత స్వయముగాఁ ద్వైవిధముగా సవరించెను. వ.గో.కృ.

1. మమక్షమ్ (వ్రా.ప్ర.) 2. అథోసోమస్య (వ్రా.ప్ర)

(5) యువామిన్ద్రాగ్నీ వసునో విభాగే తవస్తమా శుశ్రవ వృత్రహత్యే ।
తావా సద్యా బర్హిషి యజ్ఞే అస్మిన్ ప్ర చర్షణీ మదాయేథాం సుతస్య ॥ 136

(6) ప్ర చర్షణిభ్యః పృతనాహవేషు ప్ర పృథివ్యా రిరిచాథే దివశ్చ ।
ప్ర సిన్ధుభ్యః ప్ర గిరిభ్యో మహిత్వా ప్రేన్ద్రాగ్నీ విశ్వా భువనాత్యన్యా ॥ 137

(7) ఆ భరతం శిక్షతం వజ్రబాహూ అస్మాగ్ం ఇన్ద్రాగ్నీ అవతం శచీభిః ।
ఇమే ను తే రశ్మయః సూర్యస్య యేభిః సపిత్వం పితరో న ఆసన్ ॥ 138

(8) పురందరా శిక్షతం వజ్రహస్తాస్మాగ్ం ఇన్ద్రాగ్నీ అవతం భరేషు ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 139

## సూక్తము 109

ఋషి—కుత్సుఁడు*

దేవత—ఇంద్రాగ్నులు

(1) చ॥ ధనమును గోరు నా కిపుడు దాయలు మీరలె, మీరె బంధువుల్
ఘనులు మ రెవ్వ రింక నను, గాచెడు వారలు వేరు చుట్టముల్
పనిఁగొని చూడ నన్నిచటఁ బావక వాసవులార! బుద్ధియుం
బనివడి మీర లిచ్చునెడఁ బ్రస్తుతిఁ జేసెద మిమ్ము దానితోన్ ॥ 125

(2) ఉ॥ భావముతో మఱంది తన బావ కొసంగు ధనంబుకంటె, స
ద్భావ గుణాభిజాత్యములఁ బాసినవాఁడు వధూనిమిత్తమై
బావమఱంది తండ్రి కిడు భాసుర విత్తముకంటె, మీరు స
ద్భావముతోడ నెక్కువగు భాగ్యము లిచ్చెడు వారలేకదా! ॥ 126

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ.

(3) క॥ స్తోతలకు మీర లెక్కువ, ప్రీతిం గామ్యార్థమిచ్చు పెద్దలు, కానన్
నాతులతో యజమానులు, పూతతనూజాతులెల్లఁ బొగడెదరు మిమున్ ॥ 127

(4) గీ॥ మిక్కుటం బగు సంతుష్టి మీకుఁ గలుఁగఁ, జేయ మంత్రం బమర్చె నమేయరసము
భద్రహస్తులు మీరలు పావక! హరి!, యరుగుదెం డీ రసంబెల్ల నానుటకయి ॥ 128

(5) చ॥ అనల మహేంద్రులార! నుతు లర్పణఁ జేసెడివారి కెంతయేన్
ధనమును మీరు గూర్తు రను ధర్మగుణంబును, మీకు శత్రు సం
హననము, మే మెఱుంగమటె యాగవినిర్మిత రమ్యవేదిపై
ననువుగనున్న దర్భలను నాసనముంగొని సోమ మానుఁడీ! ॥ 129

(6) క॥ అనులకుఁ దోడ్పడ, మిమ్ముల, జనములు పిలువంగ మీరు చని పంతముతో
[1]నని మిగుల బలముఁ జూపిరి, మనుజాదులకంటె నధికమాన్యులకంటెన్ ॥ 130

(7) గీ॥ త్వద్దినేశరూప [2]పటలిచేఁ బితరులు, బ్రహ్మలోక మెలమిఁ బట్టినారు
ధన మొసంగి మాకుఁ దద్దయుఁ గర్మలఁ, జేయు నటుల మమ్ముఁ జేయుఁడయ్య! ॥ 131

(8) క॥ అక్షయమగు ధన మొసఁగుఁడు, రక్షోయుద్ధములయందు రాజులు కానన్
రక్షింపుఁడు మము మీరలు, రక్షింతురుగాక వరుణరాజ ప్రముఖుల్ ॥ 132

## సూక్తమ్—110

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఋభవః

ఛందః—జగతీ 5,9 త్రిష్టుప్

(1) తతం మే అపస్తమ తాయతే పునః స్వాదిష్ఠా ధీతిరుచథాయ శస్యతే ।

అయం సముద్ర ఇహ విశ్వదేవ్యః స్వాహాకృతస్య సము తృష్ణుత ఋభవః ॥ 140

(2) ఆభోగయం ప్ర యదిచ్ఛన్త ఐతనాపాకాః ప్రాంచో మమ కే చిదాపయః ।

సౌధన్వనాసశ్చరితస్య భూమనాగచ్ఛత సవితుర్దాశుషో గృహమ్ ॥ 141

1. నని మొనబలముంజూపిరి (తొ.పా.) 2. పక్కిచేఁబితరుల (తొ.పా.)

(3) తత్ సవితా వోఽమృతత్వమాసువదగోహ్యం యచ్ఛ్రవయన్త ఐతన ।

త్యం చిచ్చమసమసురస్య భక్షణమేకం సన్తమకృణుతా చతుర్వయమ్ ॥ 142

(4) [1]విష్ట్వీ శమీ తరణిత్వేన వాఘతో మర్తాసః సన్తో అమృతత్వమానశుః ।

సౌధన్వనా ఋభవః సూరచక్షస[2]ః సంవత్సరే సమపృచ్యన్త ధీతిభిః ॥ 143

(5) క్షేత్రమివ వి మముస్తేజనేనగ్ం ఏకం పాత్రమృభవో జేహమానమ్ ।

ఉపస్తుతా ఉపమం నాధమానా అమర్త్యేషు శ్రవ ఇచ్ఛమానాః ॥ 144

(6) ఆ మనీషా మన్తరిక్షస్య నృభ్యః స్రుచేవ ఘృతం జుహవామ విద్మనా ।

తరణిత్వా యే పితురస్య సశ్చిర ఋభవో వాజమరుహన్ దివో రజః ॥ 145

(7) ఋభుర్న ఇన్ద్రః శవసా నవీయానృభుర్వాజేభిర్వసుభిర్వసుర్దదిః ।

యుష్మాకం దేవా అవసాహని ప్రియేఽభి తిష్ఠేమ పృత్సుతీరసున్వతామ్ ॥ 146

(8) నిశ్చర్మణ ఋభవో గామపింశత సం వత్సేనాసృజతా మాతరం పునః ।

సౌధన్వనాసః స్వపస్యయా నరో జివ్రీ యువానా పితరాకృణోతన ॥ 147

(9) వాజేభిర్నో వాజసాతావవిడ్ఢ్యృభుమాగ్ం ఇన్ద్ర చిత్రమా దర్షి రాధః ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 148

1. విష్ట్వా (వ్రా.ప్ర.) 2. చక్షస (వ్రా.ప్ర.)

## సూక్తము—110

### ఋషి—కుత్సుఁడు *

### దేవత—ఋభువులు

(1,2) †సీ॥ మీకు ఋభువులార! మిక్కిలి యజ్ఞముల్ చేయుచు నున్నాను జేసినాను
స్తుత్యులౌ మీకయి స్తోత్రములంగూడఁ బఠియించు చున్నాను బాడినాను
స్వాహాస్వధాయుక్త చారుహోమములను గూర్చుచు నున్నాను గూర్చినాను
సోమమెల్లన్ మీరు నీమముతోఁ ద్రావ వేడుచు నున్నాను వేడినాను
గీ॥ జ్ఞాతివారలు మీర లజ్ఞానయుతులు, వనములకు నేగి సత్తపోబలము నొంది
హవ్యమునొసంగు యజమాన యాగములకుఁ, బోయి సోమరసంబును బొందుఁ డీరు ॥ 133

(3,4,5) సీ॥ సవితృదేవతకయి చక్కని సోమంబు స్థిరభక్తిచేత నార్జించినారు
త్వష్ట నిర్మితమైన తగు చమసంబును మ్యూఁడు నొక్కటిఁజేసి మురిసినారు
చమసాదులంజాలఁ జక్కఁగా నిర్మించి ఘనులార! భాగ్యంబుఁ గాంచినారు
మానవు లయ్యును బూని దేవత్వంబు నొంది యాగహవిస్సు లందినారు
గీ॥ దేవతలతోడ హవ్యంబుఁ దినఁగఁగోరి, కొలత కఱ్ఱల భూమిని గొలుచునటులఁ
జమసమును శ్రద్ధఁగా మీరు శస్త్రములను, గొలిచి నాల్గుగు విధములఁ గూర్చినారు ॥ 134

(6) చ॥ రవికిరణ స్వరూపులయి రమ్యనభంబున సంచరించుచున్
వివిధములైన దానముల, వెండియు యజ్ఞము లెల్లఁ జేయుచున్
ప్రవిమల సోమముం బడసి ప్రస్తుతిఁగాంచు ఋభూత్తమాళికిన్
నవఘృతయుక్తహవ్యమును సమ్మికనిచ్చెద మిష్టసిద్ధికై ॥ 135

(7) గీ॥ మాకు ఋభువులు ప్రభువులు మాకు వలయు, నన్నధనముల నిచ్చుచు నతిశయించి
మమ్ము రక్షింపఁగలరని నమ్మినాము, వారి దయనొంది వైరుల నణంచఁగలము ॥ 136

(8) ఉ॥ ధేనువు లేని తర్ణకము దిగ్భ్రమఁజెంది కృశించుచుండ నా
ధేనువు చర్మ మన్యమగు ధేనువుపై నిడి మాతృరూపమౌ
ధేనువు గానొనర్చి యలధేనువుతో సమకూర్చి పెయ్యకున్
ధేనువు పాలఁబెట్టి రతిధీరులు కోరె సుధన్వపుత్రకుల్ ॥ 137
గీ॥ మఱియు సౌధన్వు లందఱు మహితయజ్ఞ, నేత లుత్కృష్టకర్మల నేర్పుమీర
వృద్ధు లగుతల్లిదండ్రుల విధ మెఱింగి, యువకులుగ వారిఁజేసిరి యుచితరీతి ॥ 138

* ఆఙ్గిరసపుత్త్రుఁడు కుత్సుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ. † ప్రథమ ద్వితీయ ఋక్కుల కనువాదపద్యమైన సీసములోనుత్తమపురుషైక వచనమును 6,7,9 ఋగనువాదపద్యములలో బహువచనమును బ్రయుక్తమైనది. అసలీ ఋక్కుల యనువాదములు స్వవచన వ్యాఘాతములుగాఁ బరస్పర విరుద్ధములుగా నున్నవి. సంస్కృతభాష్యములే యీ గతిలోనుండఁగా ననువాదముఁ గూర్చి చెప్పవలసినదేముండును? 133 సీసపద్యగీతములో "మీరలు జ్ఞానయుతులు" అనుటకు "మీర లజ్ఞానయుతులు" అని నేమానివారు వ్రాయుట చాల విచిత్రముగా నున్నది. వ.గో.కృ.

(9) చ॥ అమరసుధన్వ పుత్రకుడ! యన్నము నిచ్చెడువేళ మాకు నీ
విమలమనస్సుతో నొసఁగుమయ్య! ధనంబును, దానిఁ బ్రీతితో
సుమతినిగలు మిత్రుఁ డతిశోభిలు దేవత లంద ఱెంతయేన్
గ్రమమ్ముగ మాదు ప్రార్థనలఁగాంచుచు నుండుత మన్నివేళలన్॥ 139

## సూక్తమ్ 111

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—ఋభవః

ఛందః—జగతీ, 5 త్రిష్టుప్

(1) తక్షన్ రథం సువృతం విద్మనాపస స్తక్షన్ హరీ ఇన్ద్రవాహా వృషణ్వసూ।

తక్షన్ పితృభ్యామృభవో యువద్ వయ స్తక్షన్ వత్సాయ మాతరం సచాభువమ్॥ 149

(2) ఆ నో యజ్ఞాయ తక్షత ఋభుమద్వయః క్రత్వే దక్షాయ సుప్రజావతీమిషమ్।

యథా క్షయామ సర్వవీరయా విశా తన్నః శర్ధాయ ధాసథా స్విన్ద్రియమ్॥ 150

(3) ఆ తక్షత సాతిమస్మభ్యమృభవః సాతిం రథాయ సాతిమర్వతే నరః।

సాతిం నో జైత్రీం సం మహేతే విశ్వహా జామిమజామిం పృతనాసు సక్షణిమ్॥ 151

(4) ఋభుక్షణమిన్ద్రమా హువ ఊతయ ఋభూన్ వాజాన్ మరుతః సోమపీతయే।

ఉభా మిత్రావరుణా నూనమశ్వినా తే నో హిన్వన్తు సాతయే ధియే జిషే॥ 152

(5) ఋభుర్భరాయ [1]సం శిశాతు సాతిం సమర్యజిద్వాజో అస్మాఁ అవిష్టు।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః॥ 153

1. సేశాతు (ప్రా.ప్ర.)

## సూక్తము—111

ఋషి—కుత్సుఁడు *

దేవత—ఋభువులు

(1,2) సీ॥ సుందరచక్రాతిసుందర రథమును నశ్విదేవతలకు ననిపినారు ;
బలశాలిహయముల బలముచేఁగల్పించి మించి యింద్రునికి నర్పించినారు ;
ధన్యాత్ములౌ తల్లిదండ్రుల కెంతయు నూర్జితయౌవనం బొసఁగినారు ;
తల్లి లేనట్టి గోతర్ణకంబున కప్డు తల్లిని గలిఁగించి తనిపినారు ;
గీ॥ కాన నిష్టిని హవ్యంబు కలుఁగునటులఁ,బుత్రపౌత్రాన్నముల మేము పొందునటుల
క్షేమముగ జీవనము మేముఁజేయునటులఁ, [1]జేయుదురుగాక ఋభువులు చింతవీడి ॥ 140

(3) ఉ॥ మాకుఁ బుత్రపౌత్రుల కమానము విత్తముఁగల్గఁజేసి చీ
కాకును వీడి యశ్వములఁగాంచుటకై ధనమిండు దానిచే
లోకము మెచ్చునట్లు ధనలోపము లేదను కీర్తిఁబొంది య
స్తోకబలాఢ్యశత్రువుల స్రుక్కఁగఁజేసెద మేము పండితుల్ ! ॥ 141

(4) గీ॥ పిలుచుచున్నార మింద్రునిఁ బెద్దఁజేసి, పిలుచుచుంటిమి ఋభువులఁ బ్రీతితోడ
నశ్వులను[2] వరుణమిత్రుల నధికభక్తి, సోమరస మానఁబిల్చుచున్నాము మేము ॥ 142

(5) గీ॥ ఋభువు మాకెల్లధనమును నిచ్చుఁగాక, యాజి రక్షించుఁగాక మా వాజు లెలమి
వరుణమిత్రులు సింధువు వసుమతియును, బడయుదురుగాక నుతుల మా పక్షమూని ॥ 143

## సూక్తమ్—112

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—1 (ఆద్యపాదస్య) ద్యావాపృథివ్యౌ, 1 (ద్వితీయపాదస్య)
అగ్నిః, (ఉత్తరార్ధస్య) అశ్వినౌ, 2-25 అశ్వినౌ
ఛందః—జగతీ, 24-25 త్రిష్టుప్

(1) ఈళే ద్యావాపృథివీ పూర్వచిత్తయే ఽగ్నిం ఘర్మం సురుచం యామన్నిష్టయే ।
యాభిర్భరే కారమంశాయ జిన్వథస్తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 154

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ. 1. జేయవలయును ఋభువులు చింతలేక (తొ.పా.) 2. ఈ మూఁడవ పాదములోఁ బంచలఘుగణ మింద్రగణముగా నుపయుక్తమైనది. వ.గో.కృ.

(16) యాభిన్నరా శయవే యాభిరత్రయే యాభిః పురా మనవే గాతుమీషథుః ।
యాభిః శారీరాజతం స్యూమరశ్మయే తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 169

(17) యాభిః పఠర్వా జఠరస్య మజ్మనాగ్నిర్నాదీదేచ్చిత ఇద్ధో అజ్మన్నా ।
యాభిః శర్యాతమవథో మహాధనే తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 170

(18) యాభిరఙ్గిరో మనసా నిరణ్యథో ऽగ్రం గచ్ఛథో వివరే గో అర్ణసః ।
యాభిర్మనుం శూరమిషా సమావతం తాభీరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 171

(19) యాభిః పత్నీర్విమదాయ న్యూహథురా ఘ వా యాభిరరుణీరశిక్షతమ్ ।
యాభిః సుదాస ఊహథుః సుదేవ్యంగ్ం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 172

(20) యాభిః శంతాతీ భవథో దదాశుషే భుజ్యుం యాభిరవథో యాభిరధ్రిగుమ్ ।
ఓమ్యావతీం సుభరామృతస్తుభం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 173

(21) యాభిః కృశానుమసనే దువస్యథో జవే యాభిర్యూనో అర్వన్తమావతమ్ ।
మధు ప్రియం భరథో యత్ సరడ్భ్యస్తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 174

(22) యాభిర్నరం గోషుయుధం నృషాహ్యే క్షేత్రస్య సాతా తనయస్య జిన్వథః ।
యాభీ రథాగ్ం అవథో యాభిరర్వతస్తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 175

(23) యాభిః కుత్సమార్జునేయం శతక్రతూ ప్ర తుర్వీతిం ప్ర చ దభీతిమావతమ్ ।

యాభిర్ధ్వసన్తిం పురుషన్తిమావతం తాభిరూ షు ఊతిభిరశ్వినా గతమ్ ॥ 176

(24) అప్నస్వతీమశ్వినా వాచమస్మే కృతం నో దస్రా వృషణా మనీషామ్ ।

అద్యూత్యేఽవసే ని హ్వయే వాం వృధే చ నో భవతం వాజసాతౌ ॥ 177

(25) ద్యుభిరక్తుభిః పరి పాతమస్మానరిష్టేభిరశ్వినా సౌభగేభిః ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 178

ఇతి
ప్రథమోఽష్టకే సప్తమోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—112

ఋషి—కుత్సుఁడు *

దేవత—మొదటి ఋక్కునందు మొదటి పాదమునకు ద్యావాభూములు, రెండవ పాదమునకు అగ్ని, తొలిఋక్కు ఉత్తరార్థమునకును నవశిష్టములైన ఋక్కులన్నిటికిని నశ్విదేవతలు.†

(1) ఉ॥ అశ్వముకంటె ముందుగనె యాకసమున్ భువి[1] సంస్తుతించి యా
యశ్వులఁజూఁచి వారికయి యాగ మొనర్పఁగ నగ్ని వేడెదన్
విశ్వ సుసిద్ధ యుద్ధముల వేయి జయంబులఁ బొందఁజేయున
ట్లశ్వులు నేఁడు మా కడకు నందఱు వచ్చి జయంబు లిచ్చుతన్ ॥ 144

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.కృ. † ఆంధ్రానువాదము వ్రాతప్రతిలో (1వ. సంపుటము 357వ పుట) నీ సూక్తదేవతలను వ్రాయుచుఁ దొలిఋక్కు ప్రథమ ద్వితీయ పాదముల దేవతలను వ్రాసి తొలిఋక్కు ఉత్తరార్ధదేవతను పేర్కొనుట పొరపాటున మరచెను. "అవశిష్ట సూక్తమునకు అశ్విదేవతలు" అని "సూక్తమునకు" అను నేకవచనప్రయోగము చేయక పొరపాటున సూక్తములకు అని వచన ప్రయోగము చేయుట జరిగినది. ఇది సరికాదు. "అవశిష్ట సూక్తమునకు అశ్విదేవతలు" అని పేర్కొన్నచోఁ దొలిఋక్కు ఉత్తరార్ధముకూడఁ బరిగ్రహీతమగును గాన నపుడు దేవతా నిర్దేశము నిర్దుష్టమగును. వ.గో.కృ. 1. దివి. (వ్రా. ప్ర.పా.) ఆకాశ శబ్దము చే దివియు భువిశబ్దముచేఁ బృథివియు నిర్దిష్టములగును; ఆంధ్రానువాద మూలప్రతిలోవలె దివిశబ్దమే యుంచినఁ బృథివీ దైవత్యమున కిందుస్థానముండదు. కాన "దివి" శబ్దము మ "భువి" గా సవరించుట జరిగినది. వ.గో.కృ.

(2) క॥ తెలియని మనుజుఁడు మిక్కిలి, తెలిసిన పండితుని కడకుఁ దిరిగెడు రీతిన్
లలి మీ దానముకొఱకై, యలయుచు మిమ్ముఁ జేరుచుండి రా యా మనుజుల్ ॥ 145

గీ॥ అశ్విదేవతలార! మీ కధ్వరములఁ, జేయువారికి రక్షలఁజేసి మిగుల
మెచ్చి యజ్ఞమునకు మీరు వచ్చి మాకు, రక్ష లిడి పొందు చక్కని రాజులగుట ॥ 146

(3,4) సీ॥ సోమపానముచేత సోమించి మీరలు సకలము శిక్షింపఁజాలినారు
ప్రసవింపలేనట్టి ప్రబలగోవును నీనునట్టుగా నొనరించి యలరినారు
సద్యఃప్రసూత యౌ చక్కని యావును శయుని కర్పింపఁగఁ జాలి[1]నారు
శీఘ్రగాములలో నశేష చాతురిఁ బొందునట్టులు గాలిని మెట్టినారు
గీ॥ పాక యజ్ఞాదిక మెఱుంగు భవ్యకక్షి, యనెడువాఁ డధికుఁ డగునటు లశ్విలార!
మమ్ము నధికులఁ జేయుఁ డో మాన్యులార!, రమ్యసోమంబు గ్రోలుఁడు రాజులార! ॥ 147

(5) సీ॥ పైకెత్తితిరి మీరు బావిలోపలనుండి మునిపుత్రు రేభుని ముదముతోడఁ
గాపాడితిరి మీరు కరుణావిశిష్టులై బావిలోపలనుండు "[2]బంద" మునిని
జూపించితిరి మీరు సూర్యదేవుని గణ్వమునివరునకుఁ జాల మోద మలర
రక్షించితిరి మీరు రాజు లౌటంజేసి యంధకారమునుండి యమర మునిని
గీ॥ వారి బాధల నన్నిటిఁబాఱఁద్రోల్చి శుభము లొసఁగూర్చునట్టులు శోభనాశ్వి
లార! మా కీడు లన్ని దొలంగఁజేసి, మమ్ము రక్షింపరేమి యో మాన్యులార! 148

(6,7,8) సీ॥ పలలాశనసమూహ బాధితాంతకునట్లు కర్కంధుఁ డనువానిఁ గాచునట్లు
లుదధిస్థభుజ్యుని వెదకి వానికి నౌక నర్పించి కాపాడ నలరునట్లు
శాంతిసుచంతుని సఖ్యునిగాఁజేసి కరుణతో వానినిఁ గనినయట్లు
ఘర్మఁడన్వానికి శర్మముంగలిఁగించి వృశ్నిని రక్షింపఁ బిలిచినట్లు
గీ॥ కుంటివాళ్ళకుఁ గాళ్లను గ్రుడ్డిఋషికిఁ, గన్నులను నిచ్చి మోకాళ్లఁ గలుగఁజేసి
యాడపక్షిని విడిపించి యలరునట్లు, మమ్ము రక్షింపరేమి యో మాన్యులార! ॥ 149

(9) గీ॥ నదిని మధుమంతముగఁజేసి నడపినారు, వరవశిష్ఠుని సంతోషపరచినారు
కుత్స నర్యుల కెలమిని గూర్చినార, లట్టులే మమ్ము రక్షింపుఁడ[3]శ్విలార! ॥ 150

1. జరిగినారు (వ్రా.ప్ర.పా.) అనన్వితము నపార్థకము. వ.గో.కృ. 2. "వంద" నామకుఁడైన ఋషియని సంస్కృత మూలములోఁ గలదు. "వబయోరభేదః" అనుసూత్రము ననుసరించి "బంద" పాఠము పరిగ్రహీతమైన మూలానుగుణముగా నిది యనువదింపఁబడెను. వ.గో.కృ.
3. డశ్విలారా! (వ్రా.ప్ర.పా.)

(10) గీ॥ పోరఁబిక్కలు తెగిపడి పొరలు ఖేలు, భార్యకుం గాళ్లు గల్గించి బ్రదుకఁజేసి
యశము గాంచితిరయ్య యో యశ్విలార !, మమ్ము రక్షింపరేమి యో మాన్యులార ! ॥ 151

(11) చ॥ కరువులచేత జీవనము కల్గక దీర్ఘశ్రవుండుఁజిక్కఁగా
జరుగు నటంచు జీవనము చారు వణిగ్జనుఁడై వసింపఁగా
జరుగమి దానిచే నైనఁజల్లఁగ జీవన మంచు భక్తితో
నెరుఁగుచు మిమ్ము వేఁడఁగనె యీయఁగలేదఁటె వర్షమెంతయున్ ॥ 152

(12,13,14) సీ॥ ఎండిపోయిన నది నిండి పారెడునట్లు లశ్వ శూన్యరథంబు లరుగునట్లు
కణ్వపుత్రుఁడ్రిశోక కమనీయ గోవులఁదెచ్చి వారికి వేగ నిచ్చినట్లు
రాహుగ్రహగ్రస్థ రవిబాధఁ దొలఁగించి విప్రుని గాపాడి వెలసినట్లు
క్షేత్రపాలకులకుఁ జేయు కర్మములందు మాంధాతృ కష్టముల్ మాన్పినట్టు
గీ॥ లల దివోదాసు భీతిని నణఁచునట్లు, పూజ్యుఁద్రసదస్యుఁ డనువానిఁ బ్రోచినట్టు
లధిక సంపద లొనఁగూర్పుఁడశ్విలార !, మమ్ము రక్షింప రారేమి మాన్యులార ! ॥ 153

(15,16) సీ॥ నీరులేకను మంటి నీరు ద్రావెడు వమ్రునకు నీరము లొసంగినారుకాదె !
దారిద్ర్యదేవతా దర్శనంబునఁ గలి ఋషికి నైశ్వర్యంబు నీయలేదె !
గుఱ్ఱముం బోఁగొట్టుకొని కష్టపడుచున్న పృథివికి నశ్వంబుఁబెట్టలేదె !
శయుఁ డనువానికి శాంతిని బోధించి దుఃఖంబు లన్నిటిఁ ద్రోలలేదె !
గీ॥ నూరు మార్గములం గల్గు నూత్నయంత్ర, సదనమునఁ ద్రోయఁబడినట్టి చక్కనైన
నత్రి బైటకుఁదీయుచు ననుపలేదె!, యట్టులే మమ్ముఁ గాపాడుఁ డశ్విలార ! ॥ 154

గీ॥ సేద్యముం జేయుమార్గము చెప్పి మనువు, నకును దారిద్ర్యముం గొట్టినారు మీర
[1]లట్లు మా లేములను మీరు మట్టుపెట్టి, మమ్ము రక్షింపుఁడిప్పుడు మాన్యులార ! ॥ 155

(17) చ॥ పొలుపుగ శర్వ రాజొకఁడు పోరున వైరికిఁ జిక్కియుండుటం
దెలిసి విశేషయత్నమునఁదీయఁగ వానిని వాఁడు ప్రీతితో
వెలయుచు నింధనంబులను వృద్ధిని బొందిన నగ్ని రీతిగా
వెలిఁగెను గాన నట్టులనె వేగమె రక్షల మాకు నీయుఁడా! ॥ 156

(18,19) సీ॥ అంగిరః పుత్రుఁడా! యశ్వి దేవతలతో నేవాళి రక్షింపఁ [2]జేరు మనుము
పర్వతగుహలోనఁ బాడుఁగొల్పినయాలఁ జూపించుటయె గొప్ప చోద్య మనుము
మను రాజు నేసిన ఘనకృషి యంతయు నందంబుగా వృద్ధిఁ బొందె ననుము
[3]విమద భూపాలుండు విశ్లిష్ట భార్యను బొంది సుఖంబుల నొందె ననుము

1. అట్టులేమాదులేములు మట్టుపెట్టి (తా.పా.) 2. జేరమనుము (వా.ప్ర.పా.) 3. మిమద (వా.ప్ర.పా.)

గీ॥ సేవకుల కెల్ల గోవులు సేరె ననుము, విత్తము సుదాసుచేతను వెలిఁగె ననుము
మాయ లేకయె స్వాగతం [1]బీయుమనుము, పూజ్యకర్మలఁ బుణ్యంబు పుట్టె ననుము ॥ 157

(20) గీ॥ హవ్యము నొసంగు వారికి నఖిల సౌఖ్య, మొసఁగినట్టులు భుజ్యుని కోలి సుఖము
కలుగఁజేసినయట్టులు కలుఁగఁజేయుఁ, డధికసుఖ మాత్మ మెచ్చఁగ నశ్వులార ! ॥ 158

(21) చ॥ అనువుగ సోమవల్లికల నంతట నమ్మెడి వానిఁ బోరులోఁ
[2]బనివడి కాచినారు మరి బాట మహాశ్వము లేవఁ దీయుచున్
ఘనతను బొందినారు మరి కమ్మని తేనెను గ్రాచినారు కా
[3]వున నిట వచ్చి మాకుఁదగఁ బూర్ణసుఖంబుల నీయుఁడశ్వికుల్ ! ॥ 159

(22) గీ॥ యుద్ధమున నోడిపోకుండ నుండఁజేసి, యిల్లు భూములు ధనమును నిచ్చి రథము
వాజులను గూర్చి యజమాన రాజి నెట్లు, కాఁచితిరో మీరు నన్నట్లు కావ రారె! ॥ 160

(23) గీ॥ వెలఁగి పురుషంతి నెట్టులు చేరినారొ!, కుత్సతుర్వీతులకునెట్లు కూర్చినారొ!
ధరదభీతిని నెట్టులు డాఁచినారొ!, యట్టులే నన్నుఁ గాపాడుఁ డశ్వులార ! ॥ 161

(24,25) సీ॥ మంత్రంబులన్ మేము మరువక యే వేళ నుచ్చరించెడు నట్టు లుంచ వలదె !
సర్వజ్ఞబుద్ధులఁ జాలఁగ నొసఁగుచు నన్నంబుఁ గలిగింప [4]నమర వలదె !
రాత్రిం బవళ్లు సంరక్షింపుచున్ మమ్ము విత్తంబులను నీయ వెడల వలదె !
యుదకాధిదేవత యదితి ప్రార్థన విని కాపాడ మమ్ములఁ గదల వలదె !
గీ॥ దేవమాతయు నుదకాదిదేవతయును, వరుణుఁడున్ భూమిదేవియుఁ గరుణ వచ్చి
మొదట మా వేడుకోలు మెచ్చుదురుగాక, మెచ్చి సుఖ మిత్తురుగాక నమేయశక్తి ॥ 162

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన శ్రీ భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమున సప్తమాధ్యాయము
సమాప్తము

---

1. బీయమనుము (వ్రా.ప్ర.పా.) 2. బనుపునెఱింగి కాఁచితిరి (తొ.పా.) 3. దనకయెవచ్చి మాకడకుదారసుఖంబుల (తొ.పా.) కాదు + అనకయె = కాదనకయె, మాకడకు + ఉక్ + ఆర = మాకడకుదార) 4. నెన్నవలదె (తొ.పా.)

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

### ప్రథమోఽష్టకః—అష్టమోఽధ్యాయః

### సూక్తమ్—113

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—1 ఉషాః (ఉత్తరార్ధస్య) రాత్రిశ్చ, 2-20 ఉషాః

ఛందః—త్రిష్టుప్

(1) ఇదం శ్రేష్ఠం జ్యోతిషాం జ్యోతిరాగాచ్చిత్రః ప్రకేతో అజనిష్ట విభ్వా ।

యథా ప్రసూతా సవితుః సవాయగ్ం ఏవా రాత్ర్యుషసే యోనిమారైక్ ॥ 1

(2) రుశద్వత్సా రుశతీ శ్వేత్యాగాదారైగు కృష్ణా సదనాన్యస్యాః ।

సమానబన్ధూ అమృతే అనూచీ ద్యావా వర్ణం చరత ఆమినానే ॥ 2

(3) సమానో అధ్వా స్వస్రోరనన్తస్తమన్యాన్యా చరతో దేవశిష్టే ।

న మేథేతే న తస్థతుః సుమేకే నక్తోషాసా సమనసా విరూపే ॥ 3

(4) భాస్వతీ నేత్రీ సూనృతానామచేతి చిత్రా వి దురో న ఆవః ।

ప్రార్ప్యా జగద్వ్యు నో రాయో అఖ్యదుషా అజీగర్భువనాని విశ్వా ॥ 4

(5) జిహ్మశ్యేః చరితవే మఘోన్యాభోగయ ఇష్టయే రాయ ఉ త్వమ్ ।

దభ్రం పశ్యద్భ్య ఉర్వియా విచక్ష ఉషా [1]అజీగర్భువనాని విశ్వా ॥ 5

(6) క్షత్రాయ త్వం శ్రవసే త్వం మహీయా ఇష్టయే త్వమర్థమివ త్వమిత్యై ।

విసదృశా జీవితాభిప్రచక్ష ఉషా అజీగర్భువనాని విశ్వా ॥ 6

(7) ఏషా దివో దుహితా ప్రత్యదర్శి వ్యుచ్ఛన్తీ యువతిః శుక్రవాసాః ।

విశ్వస్యేశానా పార్థివస్య వస్వ ఉషో అద్యేహ సుభగే వ్యుచ్ఛ ॥ 7

(8) పరాయతీనామన్వేతి పాథ ఆయతీనాం ప్రథమా శశ్వతీనామ్ ।

వ్యుచ్ఛన్తీ జీవముదీరయన్త్యుషా మృతం కం చన బోధయన్తీ ॥ 8

(9) ఉషో యదగ్నిం సమిధే చకర్థ వి యదావశ్చక్షసా సూర్యస్య ।

యన్మానుషాన్ యక్ష్యమాణాగ్ం [2]అజీగస్తద్ దేవేషు చకృషే భద్రమప్నః ॥ 9

(10) కియాత్యా యత్ సమయా భవాతి యా వ్యూషుర్యాశ్చ నూనం వ్యుచ్ఛాన్ ।

అను పూర్వాః కృపతే వావశానా ప్రదీధ్యానా జోషమన్యాభిరేతి ॥ 10

1. అజీగర్భునాని (వ్రా.ప్ర.) 2. అజీగరతద్దేవేషు (వ్రా.ప్ర.)

(11) ఈ యుష్టే యే పూర్వతరామపశ్యన్ వ్యుచ్ఛన్తీముషసం మర్త్యాసః ।
అస్మాభిరూ ను ప్రతిచక్ష్యాభూదో[1]తే యన్తి యే అపరీషు పశ్యాన్ ॥ 11

(12) యావయద్ ద్వేషా ఋతపా ఋతేజాః సుమ్నావరీ సూనృతా ఈరయన్తీ ।
సుమఙ్గలీర్బిభ్రతీ దేవవీతిమిహాద్యోషః శ్రేష్ఠతమా వ్యుచ్ఛ ॥ 12

(13) శశ్వత్ పురోషా వ్యువాస దేవ్యథో అద్యేదం వ్యావో మఘోనీ ।
అథో వ్యుచ్ఛాదుత్తరాగ్ం అను ద్యూన జరామృతా చరతి స్వధాభిః ॥ 13

(14) వ్యఞ్జిభిర్దివ ఆతాస్వద్యౌదప కృష్ణాం నిర్ణిజం దేవ్యావః ।
ప్రబోధయన్త్యరుణేభిరశ్వైరోషా యాతి సుయుజా రథేన ॥ 14

(15) ఆవహన్తీ పోష్యా వార్యాణి చిత్రం కేతుం కృణుతే చేకితానా ।
ఈయుషీణాముపమా శశ్వతీనాం విభాతీనాం ప్రథమోషా వ్యశ్వైత్ ॥ 15

(16) ఉదీర్ధ్వం జీవో అసుర్న ఆగాదప ప్రాగాత్ తమ ఆ జ్యోతిరేతి ।
ఆరైక్ పన్థాం యాతవే సూర్యాయాగన్మ యత్ర ప్రతిరన్త ఆయుః ॥ 16

(17) స్యూమనా వాచ ఉదియర్తి వహ్నిః స్తవానో రేభ ఉషసో విభాతీః ।
అద్యా తదుచ్ఛ గృణతే మఘోన్యస్మే ఆయుర్ని దిదీహి ప్రజావత్ ॥ 17

1. తేయాన్తిమే. (వా.ప్ర.)

(18) యా గోమతీ రుషసః సర్వవీరా వ్యుచ్ఛన్తి దాశుషే మర్త్యాయ ।

వాయోరివ సూనృతానాముదర్కే తా అశ్వదా అశ్నవత్ సోమసుత్వా ॥ 18

(19) మాతా దేవానామదితేరనీకం యజ్ఞస్య కేతుర్బృహతీ వి భాహి ।

ప్రశస్తికృద్ బ్రహ్మణే నో వ్యుచ్ఛా నో జనే జనయ విశ్వవారే ॥ 19

(20) యచ్చిత్రమప్న ఉషసో వహన్తీ[1]జానాయ శశమానాయ భద్రమ్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 20

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ప్రథమాష్టకము అష్టమాధ్యాయము

### సూక్తము—113

ఋషి—అంగిరసుఁడు, కుత్సుఁడు*

దేవత—ఉషస్సు†

(1) ఉ॥ అల్లదిగో! యుషస్సు కడు నందముగా జనియించెఁ దూర్పునన్
మెల్లఁగ దాని ఘృష్టితతి మిక్కిలి యేగుచునుండె నంతటన్
సల్లలిత ప్రభాకరుఁడు సాగినతోడనె రాత్రి వచ్చిన
ట్లుల్లసిత త్రియామయును నూఱటఁ జెందిన వచ్చుఁ గల్యమున్ ॥ 1

1. జనాయ (వ్రా.ప్ర.)

* ఈ సూక్తమునకు అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు ఋషియని పెక్కు సంస్కృతమూల ప్రతులలోఁగలదు. ఈ సూక్తమునకు నీ యాంధ్రానువాదములో అంగిరసుఁడు, కుత్సుఁడు నిరువురును ఋషులుగాఁ బేర్కొనుట జరిగినది. దీనిని బట్టి చూడ శ్రీ నేమానివారుచూచిన సంస్కృత ప్రతిలో నీ సూక్తమునకు నిరువురును ఋషులని యున్నట్లు తోచుచున్నది. వ.గో.కృ.

† సంస్కృతమూలములోఁ దొలి ఋక్కు ప్రథమార్థమునకు ఉషస్సును ముత్తరార్థమునకు రాత్రియు మిగిలినఋక్కు లన్నింటికిని నుషస్సును దేవతగాఁ బేర్కొనుట జరిగినది. ఈ యాంధ్రానువాదములోఁ దొలిఋక్కునుత్తరార్థమునకు రాత్రి దేవత యన్న సంగతి వ్రాయలేదు. అయినను దొలి తెలుఁగు పద్యములో రాత్రి ప్రసక్తి కలదు. వ.గో.కృ.

(2) ఉ॥ భానుని బిడ్డగాఁ గొనుచు భాసురకల్యము వచ్చుచుండ స
న్మానమ్ముఁజేయ దానికయి మత్సరమున్ విడిపోయె రాత్రియున్
భానుఁడు వారి కిద్దరికి బంధువు, రెండును సక్రమంబుగన్
మానక సంచరించుఁ గడు మానవకోటి వయస్సుఁ గొట్టుచున్ ॥ 2

(3) చ॥ పొలుపుగ స్వ స్వధర్మమును బొంది నభంబున నొక్క దారినే
యలయక సూర్య శిక్షితములై చరియించుచు భిన్నరూపమున్
గలిఁగినవైన నైక్యమును గాంచు నుషస్సతి రాత్రి వేళయున్
నిలువక యెల్లవేళలను నేమముతోఁ జనుచుండుఁ జూడుఁడీ! ॥ 3

(4) ఉ॥ మిక్కిలి యెల్లప్రాణులను మేల్కొనఁజేయుచు సూనృతంబులం
జక్కఁగఁ బల్కునట్టులను దా వెలిఁగించి, హరించి చీఁకటిన్;
దక్కక లోక మంతటను దా వెలుఁగొందుచు వెల్గఁజేయుచున్
మక్కువ తీర విత్తమును మాకు నొసంగు నుషస్సుఁ జూడరే! ॥ 4

(5,6) సీ॥ శంక లేకయె కాళ్ళు వంకరగాఁబెట్టి కునుకు వారిని మేలు కొలుపుచుండు
మేల్కొల్పి వారిని మెల్లఁగాఁబోఁజేసి పనులను జేయంగఁ బనుపుచుండు
ధనము సంపాదింప జనులు పోయెదునట్లు చేయుచు వెల్గును జేయుచుండుఁ
గొందఱు భోగాళిఁ గొందఱు యాగాళిఁ బడయునట్టులు పాటుపడుచునుండుఁ
గీ॥ కృషికి వాణిజ్యమునకును గీడు కలుఁగ, కుండ నొనరించి చీఁకటిఁ గొట్టుచుండి
[1]యుదయమందు చుషోదేవి యూర్జితముగ, వెల్గుచుండును జగమున వివిధ గతుల ॥ 5

(7) ఉ॥ ఆకసమందుఁ బుట్టుచును నంతటఁ బోవుచు నిర్భయంబుగన్
జీఁకటిఁ బాఱఁద్రోలుచును జేరుచు నిష్టులఁ దత్ఫలంబులన్
వీఁకఁ గడంగి యిచ్చుచును వెల్గె నుషస్సు మదీయశాలలోఁ
జీఁకటిఁ గొట్టి మమ్ము దరిఁజేర్పుము వేగము కల్యదేవిరో! ॥ 6

(8) క॥ గడచుచు వచ్చు నుషస్సుల, నడవడినే యనుసరించి నవ కల్యంబున్
వడిఁ జీఁకటి హరియించుచుఁ, గడు జీవుల లేపుచుండుఁ గనరే దానిన్ ॥ 7

1. "యుదయమందు చుషోదేవి యూర్జితముగ" అని గ్రంథకర్త యనువదింపనెవ్వరో "యుదయమంది యుషాదేవి యూర్జితముగ" అని యుండవలయునన్నట్లు ప్రక్కన "౦దియుషా" అని వ్రాసిరి. వేద భాషా వ్యవస్థ ననుసరించి "ఉషోదేవి" యున్నను దొసఁగులేదు. వ.గో.కృ.

(9) ఉ॥ రంగుగ నగ్నిహోత్రముల రాజిలఁజేయుచు లోక మంతటన్
దుంగ తమః ప్రపంచమును ద్రోలుచు నుంటివి యాగకర్మ స
త్సంగతి బోధ చేయుచును సాగుచు నుంటివి కానఁ గల్యమా!
మంగళ మైన దానవని మాన్యులు నిన్ను వచింపకుందురే! ॥ 8

(10) క॥ గమనా గమనంబులచే, సమముగఁ గల్యంబు లన్ని సాగుచు నుండెన్
విమలోషస్సున్ వే రగు, విమలోష స్సనుకరించి వెల్గుచు నుండెన్ ॥ 9

(11) ఉ॥ ఎంద ఉషస్సుఁ జూచి చని రెందఱు చూచుచు నున్నవారలో!
యెందఱు చూడఁబోవుదురో! యెవ్వఁడు చెప్పఁ గలండు? దీక్షతో
నందఱు సర్వరీతులను నంతట మార్పులు చెందుచున్న నే
చందమునైన మారక యుషస్సు వెలుంగుచు నుండెఁ జూడుఁడీ ॥ 10

(12,13,14) సీ॥ యజ్ఞనిమిత్తమై యభివృద్ధిఁజెందుచు యజ్ఞాభిహర్తల నణఁపఁగలవు
పశు పక్షి మృగములఁ బంతంబునన్ లేపి పని పాటుల నొనర్పఁ బంపఁగలవు
తమమును బోఁగొట్టి ధరణి నంతట వెల్గి చెలఁగెడునట్టులు చేయఁగలవు
జరయుఁ జావును లేక చరియించుచున్ దివ్యకాంతి నొసంగుచుఁ గదలఁగలవు
గీ॥ నిఖిల దిక్కులయందును నిలువఁగలవు, కల్యమా! రథమున నెక్కి కదలివచ్చి
యజ్ఞశాలలఁ గలయట్టి యఖిలతమముఁ, గొట్టుచున్ మమ్ము రక్షింపు కోర్కె లీన ॥ 11

(15) చ॥ ధనమును గోరు వారలకు ధాత్రిగ నుండి సమస్త జీవులన్
సునిశితదీప్తి మూలమున శోభిలఁజేయుచు మేలుకొల్పుచున్
ఘనముగఁ బ్రాణికోటులకుఁ గమ్మని తెల్వి నొనంగి యెంతయేన్
దనరి యుషస్సు ముందు తగుఁ దప్పక వచ్చెడు కల్యకాంతకున్ ॥ 12

(16) చ॥ పడకలనుండి వెం డిపుడు పావన సంస్థితి హేతుభూతమై
కడు వెలుఁగొందు కాంతితతి కల్గుచుఁ దూర్పున నంధకారమున్
వడివడిఁగొట్టి యంతటను వర్ధిలుచున్నది కాన వేగమే
తడఁబడకుండఁ బోవుదము తప్పక యన్నము గల్గు చోటికిన్ ॥ 13

1. జేయనుషస్సు: మెంతయున్ (తా.పా.)

(17) చ॥ తమమును గొట్టి యుండెనుగదా! యని కల్యములన్ నుతించుచున్
విమల విశేషమంత్రముల విశ్రుత భక్తిని నుచ్చరించెడిన్
సమయమునందు సేవకుని జాలఁగఁ గప్పిన యంధకార సం
ఘమును దొలంగఁజేసి తగఁగావవె కల్యమ! యన్ని భంగులన్ ॥ 14

(18) ఉ॥ పెక్కగు గోవులన్ భటులఁ బ్రేమను నిచ్చుచుఁ బూరుషాళికిం
జిక్కని యంధకారమును శీఘ్రము గొట్టుచు వాయు రీతిగా
నక్కజ మైన వేగమున నంతటఁ బోవు నుషస్సు వాక్కులన్
మిక్కిలి యాలకింపఁగనె మెచ్చుచు వాజుల నీయకుండునే! ॥ 15

(19) చ॥ అమరుల కెల్లఁ దల్లివయి యందఱికిం దగు బూజ్యురాలవై
విమలముగా మఖక్రియల వేయి విధంబుల బోధ చేయుచున్
సమముగ నుండు మంత్రములఁ జక్కఁగ శ్రోత్రములందుఁ బెట్టుచుం
దమమును గొట్టి మ మ్మిపుడు ధన్యులఁ [1]జేయుదుగాకఁ గల్యమా! ॥ 16

(20) గీ॥ కల్య దేవత లందఱుఁ గనుచుఁ జిత్ర, ధనములను నిచ్చుచున్నారు ధన్యులకును
మేము సేసెడు యాగంబు మెచ్చవలయు, వరుణుఁడున్ మిత్రదేవుండు వసుధలోన ॥ 17

## సూక్తమ్—114

ఋషిః—కుత్స ఆంగిరసః

దేవతా—రుద్రః

ఛందః—జగతీ, 10-11 త్రిష్టుప్

(1) ఇమా రుద్రాయ తవసే కపర్దినే క్షయ ద్వీరాయ ప్ర భరామహే మతీః ।
యథా శమసద్ ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మిన్ననాతురమ్ ॥ 21

(2) మృళా నో రుద్రోత నో మయస్కృధి క్షయద్వీరాయ నమసా విధేమ తే ।
యచ్ఛం చ యోశ్చ మనురాయేజే పితా తదశ్యామ తవ రుద్ర ప్రణీతిషు ॥ 22

1. జేయునుషస్సు! యెంతయున్ (తా.పా.)



(3) అశ్యామ తే సుమతిం దేవయజ్యయా క్షయద్వీరస్య తవ రుద్ర మీఢ్వః ।
సుమ్నాయన్నిద్ విశో అస్మాకమా చరారిష్టవీరా జుహవామ తే హవిః ॥ 23

(4) త్వేషం వయం రుద్రం యజ్ఞసాధం వఙ్కుం కవిమవసే ని హ్వయామహే ।
ఆరే అస్మద్ దైవ్యం హేళో అస్యతు సుమతిమిద్ వయమస్యా వృణీమహే ॥ 24

(5) దివో వరాహ మరుషం కపర్దినం త్వేషం రూపం నమసా ని హ్వయామహే ।
హస్తే బిభ్రద్ భేషజా వార్యాణి శర్మ వర్మ చ్ఛర్దిరస్మభ్యం యంసత్ ॥ 25

(6) ఇదం పిత్రే మరుతాముచ్యతే వచః స్వాదోః స్వాదీయో రుద్రాయ వర్ధనమ్ ।
రాస్వా చ నో అమృత మర్తభోజనం త్మనే తోకాయ తనయాయ మృళ ॥ 26

(7) మా నో మహాన్తముత మా నో అర్భకం మా న ఉక్షన్తముత మా న ఉక్షితమ్ ।
మా నో వధీః పితరం మోత మాతరం మా నః ప్రియాస్తన్వో రుద్రరీరిషః ॥ 27

(8) మా నస్తోకే తనయే మా న ఆయౌ మా నో గోషు మా నో అశ్వేషు రీరిషః ।
వీరాన్ మా నో రుద్ర భామితో వధీర్హవిష్మన్తః [1] సదమిత్ త్వా హవామహే ॥ 28

(9) ఉప తే స్తోమాన్ పశుపా ఇవాకరం రాస్వా పితర్మరుతాం సుమ్నమస్మే ।
భద్రా హి తే సుమతిర్మృళయత్తమథా వయమవ ఇత్ తే వృణీమహే ॥ 29

1. సదామిత్త్వా (బ్రా.ప.)

(10) ఆరే తే గోఘ్నముత పూరుషఘ్నం క్షయద్వీర సుమ్నమస్మే తే అస్తు ।

మృళా చ నో అధి చ బ్రూహి దేవాధా చ నః శర్మ యచ్ఛ ద్విబర్హాః ॥ 30

(11) అవోచామ నమో అస్మా అవస్యవః శృణోతు నో హవం రుద్రో మరుత్వాన్ ।

తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 31

## సూక్తము—114

### ఋషి—కుత్సుఁడు*

### దేవత—రుద్రుఁడు

(1) ఉ॥ గోవులకున్ హయంబులకుఁ గోమల మానవ జంతు పంక్తికిన్
జావునుగూర్చు [1]రోగము లణంగెడు నట్టులు సేసి యంతటం
గావఁగ వాయు పుత్రు జడఁగల్గిన వానిని రుద్ర దేవునిన్
భావమునన్ స్తుతించెదము పల్మరు గ్రామ పురోభివృద్ధికై ॥ 18

(2,3) సీ॥ ధనికులౌ వాయువుల్ దనయులుగాఁగల్గు ఘనరుద్రః సౌఖ్యంబు కలిఁగియుండె
మా తండ్రి మనురాజు మన్నిమిత్తము రోగ వారణ శక్తులఁ బడసియుండె
నీ మూలమున మాకు నిత్యము యజ్ఞముల్ వివిధరీతుల నెఱవేరఁగల్గె
నీ యనుగ్రహమున నిత్యసంపద లెల్ల స్థిరముగా మమ్ములఁ జేరఁగల్గె
గీ॥ నీ కటాక్షంబుచేతనే నీకు మేము, పూజనంబులు సలుపుచుఁ బుత్రపౌత్ర
లాభములఁ బొందుదుముగాక లలితరూపః, హోమములఁ జేసెదముగాత [2]నుగ్రదేహః ॥ 19

(4) ఉ॥ యాగ [3]సుకర్మసాధకుని నద్భుతమై వెలుఁగొందువాని నీ
రాగుని రుద్ర దేవుని దిరంబుగ వేఁడుచు నుంటి మాతఁడే
సాగుచు దేవతావళికిఁ జక్కని శాంతిని నచ్చఁజెప్పి మా
పైఁగల రోషమున్విడిచి పాలనఁజేయుచు నందఁడే నుతుల్ ॥ 20

* అంగిరసపుత్రుఁడు కుత్సుఁడు అని సంస్కృతమూలము. వ.గో.శ్రృ. 1. రోగములు పొగెడునట్టులు (శా.పా.) 2. యుచితరూప (శా.పా.)
3. క్రియాదిసాధకుని (శా.పా.)

(5,6) సీ॥ పోత్రి శరీరముంబోలు రూపుఁగలట్టి లలిత జటలతోడఁ జెలఁగునట్టి
దివ్యతేజస్సుతో దివిని వెల్గెడునట్టి వేదాంతములయందు వెలయునట్టి
రుద్రదేవుని మేము రుచిరసూక్తులతోడఁ బిలుచుచునున్నాము ప్రీతితోడ
సర్వజనాపేక్ష్య సకలౌషధులతోడ రమ్మనుచున్నాము సౌమ్య నీయ
గీ॥ సంతతారోగ్యమును మాకుఁ జారుగృహముఁ, గవచముం బుత్రపౌత్రులఁ గలుఁగఁజేసి
భోజనంబుల నొసఁగుచుఁ బూర్ణమైన, సుఖము లందించుమా! రుద్ర! మఖములోన ॥ 21

(7,8) †సీ॥ వృద్ధుని నైనను వెడలఁ గొట్టఁగఁబోకు బిడ్డల నైనను బిలువఁబోకు
వయసు వారిని నైన వంచింపఁగాఁబోకు గర్భస్థు నైనను గాంచఁబోకు
తల్లిదండ్రుల కైనఁ దరిఁజేరఁగాఁబోకు జనుల నైనను నీవు చంపఁబోకు
కోపించి మమ్ములఁ గొడుకులఁ బౌత్రులు మొదలగువారిని ముట్టఁబోకు
గీ॥ వైద్య భూషణ రుద్ర! నీ వశులమగుచు, యజ్ఞములఁ జేయుచున్నార మతులభక్తి
నందుటకుఁ బిల్చుచున్నార మమలసత్య, నుతులఁ గొనియాడుచున్నాము నూత్నఫక్కి ॥ 22

(9) చ॥ పశువులఁ గాయువాఁడు తన పజ్జకు వచ్చిన గోవు లెల్లఁద
ద్వశమున నుంచకుండఁ దఱి వచ్చిన యప్పుడు తోలునట్లుగాఁ
బశుపతి ! నీ కటాక్షమున, బావన మంత్రములం బఠించి నీ
వశమున నుంచుచుంటి మవి [1]వావిరి మాకు సుఖంబు నీయవే ! ॥ 23

గీ॥ తలఁప నీ బుద్ధి సుఖమును గలుగఁజేయుఁ, గాన నిను మేము కన్నారఁ గాంచియుండి
యఖిల లక్షణముల భక్తి నడుగుచుంటి, మమరవంద్యుఁడ ! రుద్రుఁడా ! యవధరింపు! ॥ 24

(10) ఉ॥ గోవుల మానవావళిని గొట్టెడి నాయుధ ముంచి యెక్కఁడేన్
భావమునం దలంచి సుఖ భాగ్యము నీయుము మాకు రుద్రుఁడా!
యే వగఁ బొందకుండుటకు హింసలు దోలుచు శత్రునాశకా!
కావుము బ్రహ్మకర్మలకుఁ గాపరి వై సుఖమిచ్చి మమ్ములన్ ॥ 25

---

† ఇంద్రాదిస్తుతులతో ఋగ్వేద సూక్తము లన్నియును నిండియున్నవి. వానియం దొక్కొకచోట "ఓ దేవా! నాకు సత సమృద్ధినిమ్ము. మాకు నూఱేళ్లాయుర్దాయము నిమ్ము. మమ్మును మా సంతతిని మా శూరులను మా పశ్వాదులను హింసింపకుము. అని ప్రార్థింపఁబడినది. పూర్వకాలమందు జనులు కేవలము స్వార్థమునకే కాక సమాజముయొక్క కళ్యాణార్థమై సయితము యజ్ఞము చేసి దేవతల నారాధించుచుండి రని స్పష్టముగఁ దెలియుచున్నది. (నే.వేం,న.శా.) 1. వావిరిగాసుఖమిచ్చి కావవే! (తా.పా.)

(11) గీ॥ రుద్ర సంరక్షణముఁ గోరి రుచిర సూక్త, ములను బఠియించుచున్నాము మోవ మలర
నస్మ దాహ్వానమును విని యదితి వరుణ, సింధువులు ! వెల్గుదురుగాక ఁ జేరి మమ్ము ॥ 26

## సూక్తమ్—115

### ఋషిః—కుత్స ఆంగిరసః

### దేవతా—సూర్యః

### ఛందః—త్రిష్టుప్

(1) చిత్రం దేవానాముదగాదనీకం చక్షుర్మిత్రస్య వరుణస్యాగ్నేః ।
ఆప్రా ద్యావాపృథివీ అన్తరిక్షం సూర్య ఆత్మా జగతస్తస్థుషశ్చ ॥ 32

(2) సూర్యో దేవీముషసం రోచమానాం మర్యో న యోషామభ్యేతి పశ్చాత్ ।
యత్రా నరో దేవయన్తో యుగాని వితన్వతే ప్రతి భద్రాయ భద్రమ్ ॥ 33

(3) భద్రా అశ్వా హరితః సూర్యస్య చిత్రా ఏతగ్వా అనుమాద్యాసః ।
నమస్యన్తో దివ ఆ పృష్ఠమస్థుః పరి ద్యావా పృథివీ యన్తి సద్యః ॥ 34

(4) తత్ సూర్యస్య దేవత్వం తన్మహిత్వం మధ్యా కర్తోర్వితతం సం జభార ।
యదేదయుక్త హరితః సధస్థాదాద్రాత్రీ వాసస్తనుతే సిమస్మై ॥ 35

(5) తన్మిత్రస్య వరుణస్యాభిచక్షే సూర్యో రూపం కృణుతే ద్యోరుపస్థే ।
అనన్తమన్యద్ రుశదస్య పాజః కృష్ణమన్యద్ధరితః సం భరన్తి ॥ 36

(6) అద్యా దేవా ఉదితా సూర్యస్య నిరంహసః పిపృతా నిరవద్యాత్ ।
తన్నో మిత్రో వరుణో మామహన్తామదితిః సిన్ధుః పృథివీ ఉత ద్యౌః ॥ 37

## సూక్తము—115

### ఋషి—కుత్సుఁడు†

### దేవత—సూర్యుఁడు

(1) చ॥ వరుణుని మిత్రునిన్ మఱియు వహ్నిని గల్గిన లోక మంతకున్
సురుచిర నేత్రమై యలరు సూర్యుని ఘృష్టి చయంబు తూర్పునం
గర ముదయించి రోదసిని గప్పుచు నుండెను భానుదేవుఁ డే
యరమర లేక యన్నిటికి నాత్మగ వెల్గుచు నుండుఁ గానరే! ॥ 27

(2) ఉ॥ భాసుర రూపముం గలుఁగు భార్యను యౌవనవంతుఁ డట్లు పే
రాస నుషోఽగనం దగిలి యంచిత సూర్యుఁడు వచ్చుచుండుటం
జేసి సభార్యులై నరులు చేయుచు నుండిరి నిత్య కర్మలన్
వాసిగ భద్రముల్ గలుఁగ వర్ధిత దైవత భక్తి పూర్ణులై ॥ 28

(3) ఉ॥ మంగళకారులై యుదకమానముఁ బీల్చుచుఁ జిత్రితంబులై
యంగగ మానవస్తుతుల కత్యధికంబుగ సంతసించు చు
ప్పొంగి నమస్కృతుల్ వడయు పూర్ణ దివాకరు ఘృష్టి సంతతుల్
తుంగ నభంబుపైకిఁ జని తొందఱగాఁ బ్రసరించు నంతటన్ ॥ 29

(4) సీ॥ భానుండు కిరణముల్ ప్రసరింపఁజేసిన జనుల కర్మలు వెస జరుగుచుండు
నుష్ణ రశ్మి గభస్తు లుపసంహరించిన సకలకృత్యంబులు జరుగకుండు
నదియె దేవత్వంబు నదియె మహత్త్వంబు వెల్లడిఁజేయుచు వెలుఁగుచుండు
స్వాతంత్ర్య మాహాత్మ్య సాధనంబులు రెండు స్థిరముగ సూర్యునిఁ జేరుచుండుఁ
గీ॥ చిత్ర భానుండు కిరణముల్ చిత్రగతిని, భూమిని వెడల నీయక పోవఁజేసి
వేఱు లోకముఁ జేర్చిన కారుకొనిన, చీఁకటులు వచ్చి చేరు నీ లోక మంత ॥ 30

† అంగిరస పుత్రుఁడు కుత్సుఁడని సంస్కృతమూలము. వ.గో.కృ.

(5) చ॥ వరుణుని మిత్రులం గలిఁగి వానిని గాంచుఁ బ్రపంచ మంతయుం
గరము వెలుంగఁజేసి తను గన్పడ నట్టుల మిన్నుఁజేరుచున్
సురుచిర దివ్యతేజమున శోభిలఁజేయుచు వస్తు సంతతిన్
విరివిగ రాత్రులం బవలు విశ్వము సంతటఁ గల్గఁజేసెడున్ ॥ 31

(6) గీ॥ సూర్యుఁ డుదయించినంతను సూర్యకిరణ, జాలములు పాపముల నెల్లఁ ద్రోలుఁగాక!
వరుణదేవుని మిత్రునిఁ బరమభక్తిఁ, బ్రస్తుతించెద మే వేళఁ బ్రార్థనలను ॥ 32

అనువాకః—17, సూక్తమ్—116

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్.

(1) నాసత్యాభ్యాం[1] బర్హిరివ ప్ర వృఞ్జే స్తోమాగ్ం ఇయర్మ్యభ్రియేవ వాతః ।

యావర్భగాయ విమదాయ జాయాం సేనాజువా న్యూహతూ రథేన ॥ 38

(2) వీళుపత్మభిరాశుహేమభిర్వా దేవానాం వా జూతిభిః శాశదానా ।

తద్ రాసభో నాసత్యా సహస్రమాజా యమస్య ప్రధనే జిగాయ ॥ 39

(3) తుగ్రో హ భుజ్యుమశ్వినోదమేఘే రయిం న కశ్చిన్మమృవాగ్ం అవాహాః ।

తమూహథు ర్నౌభిరాత్మన్వతీభిర న్తరిక్షప్రుద్భిరపోదకాభిః ॥ 40

(4) తిస్రః క్షపస్త్రిరహాతివ్రజద్భిర్నాసత్యా భుజ్యుమూహథుః పతఙ్గైః ।

సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షళశ్వైః ॥ 41

1. నాసత్యాభాం (వా.ప్ర.)

(5) అనారమ్భణే తదవీరయేథామనాస్థానే అగ్రభణే సముద్రే ।

యదశ్వినా ఊహథుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాతస్థివాంసమ్ ॥ 42

(6) యమశ్వినా దదథుః శ్వేతమశ్వమఘాశ్వాయ శశ్వదిత్ స్వస్తి ।

తద్ వాం దాత్రం మహి కీర్తేన్యం భూత్ పైద్వో వాజీ సదమిద్ధవ్యో అర్యః ॥ 43

(7) యువం నరా స్తువతే పజ్రియాయ కక్షీవతే అరదతం పురంధిమ్ ।

కారోతరాచ్ఛఫాదశ్వస్య వృష్ణః శతం కుమ్భాఁ అసిఞ్చతం సురాయాః ॥ 44

(8) హిమేనాగ్నిం ఘ్రంసమ వారయేథాం పితుమతీమూర్జమస్మా అధత్తమ్ ।

ఋబీసే అత్రిమశ్వినావనీతమున్నిన్యథుః సర్వగణం స్వస్తి ॥ 45

(9) పరావతం నాసత్యానుదేథాముచ్చాబుధ్నం చక్రథుర్జిహ్మబారమ్ ।

క్షరన్నాపో న పాయనాయ రాయే సహస్రాయ తృష్యతే గోతమస్య ॥ 46

(10) జుజురుషో నాసత్యోత వవ్రిం ప్రాముఞ్చతం ద్రాపిమివ చ్యవానాత్ ।

ప్రాతిరతం జహితస్యాయుర్దస్రాదిత్ పతిమకృణుతం కనీనామ్ ॥ 47

(11) తద్ వాం నరా శంస్యం రాధ్యం చాభిష్టిమన్నాసత్యా వరూథమ్ ।

యద్ విద్వాంసా నిధిమివాపగూళ్హముద్ దర్శతాదూపథుర్వన్దనాయ ॥ 48

(12) తద్ వాం నరా సనయే దంస ఉగ్రమావిష్కృణోమి తన్యతుర్న వృష్టిమ్ ।

దధ్యఙ్ హ యన్మధ్వాథర్వణో వామశ్వస్య శీర్ష్ణా ప్ర యదీముువాచ ॥ 49

(13) అజోహవీన్నాసత్యా కరా వాం మహే యామన్ పురుభుజా పురంధిః ।

శ్రుతం తచ్ఛాసురివ వధ్రిమత్యా హిరణ్యహస్తమశ్వినావదత్తమ్ ॥ 50

(14) ఆస్నో వృకస్య వర్తికామభీకే యువం నరా నాసత్యాముముక్తమ్ ।

ఉతో కవిం పురుభుజా యువం హ కృపమాణమకృణుతం విచక్షే ॥ 51

(15) చరిత్రం హి వేరివాచ్ఛేది పర్ణమాజా ఖేలస్య పరితక్మ్యాయామ్ ।

సద్యో జఙ్ఘామాయసీం విశ్పలాయై ధనే హితే సర్తవే ప్రత్యధత్తమ్ ॥ 52

(16) శతం మేషాన్ వృక్యే చక్షదానమృజ్రాశ్వం తం పితాన్ధం చకార ।

తస్మా అక్షీ నాసత్యా విచక్ష ఆధత్తం దస్రా భిషజావనర్వన్ ॥ 53

(17) ఆ వాం రథం దుహితా సూర్యస్య కార్ష్మేవాతిష్ఠదర్వతా జయన్తీ ।

విశ్వే దేవా అన్వమన్యన్త హృద్భిః సము శ్రియా నాసత్యా సచేథే ॥ 54

(18) యదయాతం దివోదాసాయ వర్తిర్భరద్వాజాయాశ్వినా హయన్తా ।

రేవదువాహ సచనో రథో వాం వృషభశ్చ శింశుమారశ్చ యుక్తా ॥ 55

(19) రయిం సుక్షత్రం స్వపత్యమాయుః సువీర్యం నాసత్యా వహన్తా ।

ఆ [1]జహ్నావీం సమనసోప వాజైస్త్రిరహ్నో భాగం దధతీమయాతమ్ ॥ 56

(20) పరివిష్టం జాహుషం విశ్వతః సీం సుగేభిర్నక్తమూహథూ రజోభిః ।

విభిన్దునా నాసత్యా రథేన వి పర్వతాగ్ం అజరయూ అయాతమ్ ॥ 57

(21) ఏకస్యా వస్తోరావతం రణాయ వశమశ్వినా సనయే సహస్రా ।

నిరహతం దుచ్ఛునా ఇన్ద్రవన్తా పృథుశ్రవసో వృషణావరాతీః ॥ 58

(22) శరస్య చిదార్చత్కస్యావతాదా నీచాదుచ్చా చక్రథుః పాతవే వాః ।

శయవే చిన్నాసత్యా శచీభిర్జసురయే స్తర్యం పిప్యథుర్గామ్ ॥ 59

(23) అవస్యతే స్తువతే కృష్ణియాయ ఋజూయతే నాసత్యా శచీభిః ।

పశుం న నష్టమివదర్శనాయ విష్ణాప్వం దదథుర్విశ్వకాయ ॥ 60

(24) దశ రాత్రీ రశివేనా నవ ద్యూనవనద్ధం [2]శ్నథితమప్స్వన్తః ।

విప్రుతం రేభముదని ప్రవృక్తమున్నిన్యథుః సోమమివ స్రువేణ ॥ 61

(25) ప్ర వాం దంసాంస్యశ్వినావవోచమస్య పతిః స్యాం సుగవః సువీరః ।

ఉత పశ్యన్నశ్నువన్ దీర్ఘమాయు రస్తమివేజ్జరిమాణం జగమ్యామ్ ॥ 62

1. జహ్నావీం (వ్యా.ప్ర.) 2. శ్రథిత (వ్యా.ప్ర.)

## అనువాకము—17, సూక్తము—116

### ఋషి—దీర్ఘతమపుత్రుఁడగు కక్షీవంతుఁడు*

### దేవత—అశ్విదేవతలు

(1) చ॥ విమల నృపాల భార్య నరి వీరులు చేకొని పోవుచుండ నా
యమ గ్రహియించి కాంతునకు నందఁగఁజేసిరి యశ్విదేవతల్
సమముగ దర్భలంబరచి సంస్తుతిఁ జేసెడుయాజి మాటికి మే
ఘములు పయస్సు నిచ్చుటకు గాలుల నశ్వుల మేము వేడమే॥ 33

(2) క॥ బలమును నతిగమనంబుం, గల యశ్వములం బ్రసిద్ధిఁ గలిఁగిరి [1]దస్రుల్
తొలి, తద్రాసభ మనికిం, జెలఁగుచుఁజని శత్రువులను జెనకెను శీవిన్ ॥ 34

(3) ఉ॥ వే రొక దీవియందుఁగల వీరుల వైరులఁ జంపఁ "దుగ్రుఁ" డన్
వీర నృపుండు "భుజ్యుఁ"డను వీర కుమారునిఁ బంపుచుండ నా
వీరుని నౌక సంద్రమున వేగిరపాటున మున్గ నుండఁగా
మీ రది చూఁచి మీ పడవ మీఁదను వానిని జేర్ప లేదఁటే! ॥ 35

(4) చ॥ ఉదధిని సేనతో మునిఁగియుండిన భుజ్యుని లేవఁదీయుచున్
సదయులరై షడశ్వశత చారురథంబునఁ బెట్టి యెంతయున్
ముదమున నా నృపాలకుఁడు మూఁడు దినంబులలోన సంద్రమున్
వదలెడునట్లు చేయుచును వానినిఁ దీరముఁ జేర్ప లేదఁటే! ॥ 36

(5) గీ॥ నూఱు తెడ్డులతో నొప్పి వారిలోన, మునుగ కుండెడు నోడపై మునిఁగియున్న
భుజ్యురాజును నెక్కించి పూజ్యుఁడైన, తండ్రి గృహమునఁ జేర్చిరి ధర్మపరులు ॥ 37

* ఈ కక్షీవంతుఁడు ఔశిజుఁడని సంస్కృత మూలగ్రంథములలోఁ గొన్నిటఁ బాఠాంతరముగాఁ గలదు. శ్రీ నేమానివారి ఆంధ్రానువాద గ్రంథము వ్రాతప్రతిలో 119, 123 సూక్తములకు దీర్ఘతమపుత్రుఁడగు కక్షీవంతుఁడు ఋషి యనియు—118, 122 సూక్తములకు కక్షీవంతుఁడు ఋషియనియు, 124, 125. సూక్తములకు, 126 సూక్తములోని తొలి 5 ఋక్కులకు కక్షివంతుఁడు ("కక్షి" హ్రస్వరూపము నుపయోగించెను) ఋషియనియు — 117, 121 సూక్తములకు "కక్షవంతుఁడు" ఋషియనియు భిన్న రీతులలోఁ బేర్కొనిరి. 120వ సూక్తమునకుఁ బొరపాటున ఋషిని వ్రాయలేదు. వీరిట్లు పేర్కొనుట చూడఁగా కక్షీవంత—కక్షివంత దీర్ఘహ్రస్వ రూపయుక్తములైన ఋషుల నామములుకల (హ్రస్వము పొరపాటున వ్రాయఁబడినదై యుండవచ్చునని భావించవలసి వచ్చుచో) ఋషియు, దీర్ఘతమ పుత్రుఁడగు కక్షీవంతుఁడును, కక్షవంతుఁడును విభిన్నులైన మహర్షులని భావించినట్లు కనిపించు చున్నది. కేవలము 117వ సూక్తమునకే కాక 121వ సూక్తమునకుఁ గూడ కక్షవంతుఁడు ఋషి యని "కక్ష" శబ్దమును విస్పష్టముగాఁ బేర్కొనుటఁజూడ "కక్షివంత" మహర్షులకు విభిన్నుఁడుగా "కక్షవంతుఁ"డు కలఁడని శ్రీ నేమానివారు భావించినట్లు స్పష్టమగుచున్నది. కావున నిది ప్రమాదభరితముగా నెంచుటకు వీలులేదు. (చూ. వ్రాతప్రతి 1వ సంపుటము. 13 పుట మొదలు 37వ పుటవరకు, 2వ సంపుటము 3వ పుట మొదలు 17వ పుటవరకు) శ్రీ నేమానివారు యేయే సంస్కృతమూల ప్రతులుచూచిరో చెప్పలేము. ఈ విషయమై వారెక్కడను బ్రస్తావింపలేదు. ఏది యేమైనను నసలీ ఋషుల విషయమై యింకను బెక్కు భిన్నాభిప్రాయములు కలవు. వ.గో.కృ.

1. యశ్వుల్ (తొ.పా.)

(6,7) సీ॥ అంపినారలు మీరు హయరాజమును పేదుఁడను రాజునకు లీల నశ్వులార!
కలిఁగించినారలు కమనీయ కీర్తిని నా యశ్వమున మీర లనులకెల్లఁ
బుట్టించినారలు పూజ్యాశ్వమున మాకుఁ బేరు ప్రతిష్ఠలు పెద్దలగుచుఁ
దీసినారలు హయదీర్ఘ వృషణముల నత్యధికంబుగ నమల సురను
గీ॥ నంగిరో వంశవారిధియందుఁబుట్టి, నట్టి వజ్రియునకుఁ దీక్ష్ణ బుద్ధినిచ్చి
పొందినారలు కీర్తి నో పూజ్యులార!, యందినారలు తృప్తి నో యశ్వులార! ॥ 38

(8) శా॥ పీడా యంత్రమునం దుషానలముచేఁ బెంపేది రూక్షంబుగాఁ
గీడుం బొందుచు నున్న యత్రిముని పెన్‌గీడున్ హరింపంగ నే
తోడున్‌లేక జలంబుచే ననలముం దూర్ణంబుగా నార్పినన్
వాఁ డేతేరగఁ బైట కౌషధముచే వారింపరే బాధలన్ ॥ 39

(9) ఉ॥ గోతమ మౌనివర్యునకుఁ గూపము నీయఁగఁ దెచ్చి దాని సం
ప్రీతిగఁ గ్రిందుమీఁదుగను భీతిని వీడుచుఁ జేయ నాతఁ డ
త్యాతుర భావముంగలిఁగి యా జల మానుచుఁ దృప్తిఁదీరఁగా
నాతత విత్తముం గొనఁడె యందుల కశ్వులు హేతువుల్‌గదా! ॥ 40

(10) చ॥ కవచము మాడ్కి దేహమునఁ గ్రగ్గిన వృద్ధతఁ బోవఁజేసి యా
చ్యవన మహర్షి కెంతయును నాయువు నీయఁగ వాఁ డనర్ఘ్య మౌ
నవనవ యౌవనంబుఁ గొని నారులకున్ వరణీయ గాత్రుఁడై
కువలయమందు వెల్గఁడఁటె కోర్కెల నందుచు నశ్వ దృష్టులన్ ॥ 41

(11) చ॥ నిధివలె రాక్షసాధములు నిర్జన కాననమందు బావిలో
విధిగను బూడ్చినట్టి నృప వీరుని "వందు"ని బావినుండి యే
విధమునొ పైకిఁ దీసితిరి వీరులు ధీరులు బుద్ధిశాలురౌ
కథకులు మీరు మీ తగిన కర్మము మెచ్చరె! యశ్విదేవతల్! ॥ 42

(12) మ॥ మును దధ్యఙ్ముని యుత్తమాశ్వ ముఖముల్ మోదంబుతోఁ బొందుచున్
ఘన సద్విద్యల రెండు మీకు గరిపెంగాఁబట్టి మీ కృత్యముల్
[1]ధ్వని ఘన వర్షసూచనములం దన్పింపఁగాఁ జేసిన
ట్లనయంబుం బ్రకటింతు మాదరముతో నర్థారమె దేవతల్! ॥ 43

1. గ్రంథకర్త తొలుత "ఘనగర్జా వర్షసూచనములం గాన్పింపఁగా జేసి" అని వ్రాయఁదలఁచి "గర్జా" శబ్దము వ్రాసి "గర్జా వర్ష" అనునప్పుడు గర్జ + అవర్షఅను పద విభజనమున కవకాశము వచ్చి దురర్థమేర్పడునని భావించి "గర్జా" శబ్దమును గొట్టివేసి పిదప "ధ్వనివర్ష సూచనములం గాన్పింపఁగా" అని వ్రాసెను. "ఘనధ్వని వర్షసూచనములం గాన్పింపఁగా" అని గ్రంథకర్త వ్రాసిన యీ పాఠములో "ఘనధ్వని" యనునప్పుడు గణభంగమేర్పడును. పైగా ద్వితీయపాదమునను బ్రారంభముననే "ఘన"శబ్ద ప్రయోగమున్నది. కావునఁ బైవిధముగా సవరింపఁబడినది. ఈ సవరణతో ధ్వనిన్ = ఉరుములతోఁ గూడిన, ఘన = గొప్పదైన లేదా మేఘమాల యొక్క అని ఘనశబ్దము శ్లేషార్థదాయి యగును. సార్థకమగును. వ.గో.కృ.

(13) చ॥ వరుఁడు నపుంసకుండగుట వధ్రిమతీసతి చింతఁ గుందుచున్
వరదుల మిమ్ము వేఁడఁగనె వాంఛిత మిచ్చెద మంచుఁ జెప్పి మీ
రరసి గురుండు శిష్యులను నైచ్ఛికరీతిని ద్రిప్పునట్టు లా
సురుచిర కామినీ మణికి సూనుని నిచ్చితి రశ్విదేవతల్! ॥ 44

(14) గీ॥ శునక ముఖమునఁబడి చాల శోకమొందు, పిచ్చుకన్ మీరు తీయంగఁ బేరు వచ్చె
మిమ్ము నుతియించు వారికి మిగులఁ దెల్పి, దూరదృష్టిని గలిఁగింప దొరలు మీరె ॥ 45

(15) చ॥ విహగము వెంద్రుకల్ వలెను విస్పళ కాళ్లు తెగంగ నాజిలో
మహిని నగస్త్య మౌని మిము మానుగ వేఁడఁగ నర్థయామినిన్
బహుమతితోడ [1]నినప వగు పాదములం దవిలించి కాళ్లకున్
మహి తరణంబుఁ జేయ నల మానిని బంపితి రశ్విదేవతల్! ॥ 46

(16) †మ॥ శతసంఖ్యన్ విలసిల్లు మేషతతిఁ దాఁ జంపించి ఋజ్రాశ్వుఁ డు
న్నతిచేఁ గుక్కకు వేయ నద్ది గడు నన్యాయం బటంచున్ వడిం
బిత కోపించి కుమారు నంధునిగ నిర్భీతిన్ శపింపంగ వి
శ్రుతులం బొందఁగ వాని కీయరఁటె రక్షస్సుల్ భిషల్ చంద్రముల్! ॥ 47

(17) సీ॥ సూర్యుఁడు దనకూఁతు సోముని కీయఁగఁ దలఁచి యుండఁగ దేవతతు లెటింగి
తమలోన నొకనికి తనయ నిమ్మని వేఁడఁ దన యొద్దకున్ మున్ను త్వరగ వచ్చు
నెవ్వఁడు ? వానికే యిభరాజయానను నిచ్చెద నంచతఁ డచ్చఁ బల్కె-
నప్పుడశ్వులు తమ యశ్వంబులను నెక్కి పందెపుఁ గొయ్యను బొందునటుల
గీ॥ సూర్యదేవుని వేఁడఁగ సూరుఁడెలమిఁ దనయ నశ్వుల కిచ్చె నద్దాని రథము
పైని గూర్చుండఁ జేయుచుఁ బయనమగుచు, విజయ వికసిత వదనులై వెడలి రపుడు ॥ 48

(18) గీ॥ ఎప్పుడుం జెలిమి లేకుండ నిలను దిరుగు, మొసలి నెద్దును వాహనములగఁ జేసి
కొనిన మీ ఘన మాహాత్మ్యమును వచింప, సాధ్య మె ట్లగుఁ జెప్పరే! జాణలార! ॥ 49

(19) క॥ ధనముం బుత్రులఁ బౌత్రుల, ఘన మగు నన్నమును శక్తిఁ గలిఁగిన మీరల్
వినయముగల మా కడకుం, జనువున నేతెంచి కొనరె చాల హవిస్సున్ ॥ 50

1. ఇనుపవగు పాదములు = ఇనుముతోఁ జేయఁబడిన పాదములు అనగా ఉక్కు పాదములని భావము. † 117వ సూక్తములోని 17వ ఋగనువాద పద్యమునకును (341 పుట. 70 ప.) దీనికిని జాల సాజాత్యము కలదు. కాని సంస్కృతమూలములోని 116వ సూక్తములోని 16 వ ఋక్కునకును (329 పుట. 53 ఋక్కు) 117వ సూక్తములోని 17వ ఋక్కునకును (337 పుట. 79 ఋక్కు) మిక్కిలి భిన్నత్వము కలదు. ఇవి భిన్నార్థకములు. వ.గో.కృ.

(20,21) సీ॥ జాహుషం డనువాఁడు శత్రురాజులచేత ముట్టడింపంబడి మూల్గుచుండ
నాతని రక్షింప నరదముపై నెక్కి వచ్చి వైరుల నెల్లఁ ద్రచ్చి వానిఁ
దెచ్చి పేఁటుచుఁ దగ దివ్య పర్వత మెక్కి చారు నాహుషునితో వీరు లగుచుఁ
బ్రతిదినమంచునఁ బ్రబలధనంబిచ్చి వాని రక్షించుచు వాసిఁగాంచి
గీ॥ మఱియు నింద్రునితోఁ జేరి మాన్యు లగుచు, నతిబల విరాజమానులై యతిశయించి
దుఃఖముల నెల్లఁ గలిఁగించు దోషిగణము, హతముఁ గావించి యుండి రా యశ్వు లెలమి॥ 51

(22) చ॥ కరుఁడనువాఁడు దప్పిఁగొని శాంతిని బొందక మిమ్ము వేఁడఁగాఁ
దూరఁగొని చాల లోతుగల బావినిఁ జేరుచు నీటి వెల్లువల్
జరజరఁ బైకి వచ్చిపడు చక్కటిఁ జేయఁగ మీరు వాఁడు త
త్పురుచిర వారిపూరమును సూటిగ గ్రోలఁడె! యశ్విదేవతల్! ॥ 52

గీ॥ బహుళ యాగకరణ పరిచర్యచేఁ బరి, శ్రాంతుఁడైన యోగ్యశయుని గోవు
గొడ్డుఁదనముఁబాపి కూర్మితో దానిని, దోగ్ధ్రిగా నొనర్చి త్రోల లేదె! ॥ 53

(23) ఉ॥ పుత్రుఁడు గేహమున్ విడచిపోయె నటం చల విశ్వకుండు సం
[1]స్తోత్రముతోడ వేడ మిము సూటిగ నా స్తుతి నాలకించి మీ
రాత్రతతోడ నాసుతుని నచ్చట నచ్చటఁ జూచి ప్రీతికిం
బాత్రతఁ గొన్నవాని నిజ వాసముఁ జేర్పరె! యశ్విదేవతల్ ॥ 54

(24) ఉ॥ గట్టిగఁ ద్రాళ్లచేత సరిగట్టుచు రేభుని బావిలోపలన్
నెట్టఁగ నందు వాఁడు పడి నీళుల నుండఁగఁ గొంత కాల మీ
రెట్టొటొ వాని నొడ్డునకు నీడ్వఁగ లేదఁటె హోత పాత్రముం
బట్టుచు నగ్నిహోత్రమున భాసుర సోమముఁబోయు కైవడిన్ ॥ 55

(25) సీ॥ ప్రాచీన కర్మలు ప్రస్తుతించుచు నేను వర్ణించి యుంటిని వలయునట్టి
యావుల నీయుఁ డత్యధిక వీర్యము నిండు ప్రభువుగఁ జేయుఁడు ప్రకృతిలోనఁ
దమతమ విషయముల్ తథ్యంబులుగఁ జూడఁజాలిన యింద్రియ సౌఖ్య వితతి
ననుభవించుచుఁ జాల నాయువుఁ గొనుచుండు గృహపతి తన దైన గృహమునందు
గీ॥ బాధలం బొందకుండంగ బ్రతికియుండు, నటులు నేనును ముదిమిని నధిగమించి
జీవయాత్రను గడిపెదఁ జిత్తమలర, నఖిల రక్షకులార! యో! యశ్వులార! ॥ 56

1. సంస్తోత్రములెన్ని చేయు మిముసూటిగ (తా.పా.)

## సూక్తమ్ 117

### ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః†

### దేవతా—అశ్వినౌ

### ఛందః—త్రిష్టుప్

(1) మధ్వః సోమస్యాశ్వినా మదాయ ప్రత్నో హోతా వివాసతే వామ్ ।

బర్హిష్మతీ రాతిర్విశ్రితా గీరిషా యాతం నాసత్యోప వాజైః ॥ 63

(2) యో వామశ్వినా మనసో జవీయాన్ రథః స్వశ్వో విశ ఆజిగాతి ।

యేన గచ్ఛథః సుకృతో దురోణం తేన నరా వర్తిరస్మభ్యం యాతమ్ ॥ 64

(3) ఋషిం నరావంహసః పాఞ్చజన్య[1]మృబీసాదత్రిం ముఞ్చథో గణేన ।

మినన్తా దస్యోరశివస్య మాయా అనుపూర్వం వృషణా చోదయన్తా ॥ 65

(4) అశ్వం న గూళ్హ[2]మశ్వినా దురేవై ర్ఋషిం నరా వృషణా రేభమప్సు ।

సం తం రిణీథో విప్రుతం దంసోభిర్న వాం జూర్యన్తి పూర్వ్యా కృతాని ॥ 66

(5) సుషుప్వాంసం న నిరృతేరుపస్థే సూర్యం న దస్రా తమసి క్షియన్తమ్ ।

శుభే రుక్మం న దర్శతం నిఖాతముదూపథురశ్వినా వన్దనాయ ॥ 67

(6) తద్ వాం నరా శంస్యం పజ్రియేణ కక్షీవతా నాసత్యా పరిజ్మన్ ।

శఫాదశ్వస్య వాజినో జనాయ శతం కుమ్భాగ్ం అసిఞ్చతం మధూనామ్ ॥ 68

† ఋషి విశేష విషయములకై తెలుగు 116వ సూక్తము ఋషికిచ్చినఫుట్‌నోటు (331వ పుట) చూచునది. వ.గో.కృ. 1. మృబీసా (బ్రా.ప్ర.)
2. గూళహ (బ్రా.ప్ర.) గూళ్హ (సా.మా.)

(7) యువం నరా స్తువతే కృష్ణియాయ విష్ణాప్వం దదథుర్విశ్వకాయ ।
ఘోషాయై చిత్ పితృషదే దురోణే పతిం జూర్యన్త్యా అశ్వినావదత్తమ్ ॥ 69

(8) యువం శ్యావాయ రుశతీమదత్తం మహః క్షోణస్యాశ్వినా కణ్వాయ ।
ప్రవాచ్యం తద్ వృషణా కృతం వాం యన్నార్షదాయ శ్రవో అధ్యధత్తమ్ ॥ 70

(9) పురూ వర్పాంస్యశ్వినా దధానా ని పేదవ ఊహథురాశుమశ్వమ్ ।
సహస్రసాం వాజినమప్రతీతమహిహనం శ్రవస్యం తరుత్రమ్ ॥ 71

(10) ఏతాని వాం శ్రవస్యా సుదానూ బ్రహ్మాఙ్గూషం సదనం రోదస్యోః ।
యద్ వాం పజ్రాసో అశ్వినా హవన్తే యాతమిషా చ విదుషే చ వాజమ్ ॥ 72

(11) సూనోర్మానేనాశ్వినా గృణానా వాజం విప్రాయ భురణా రదన్తా ।
అగస్త్యే బ్రహ్మణా వావృధానా సం విశ్పలాం నాసత్యారిణీతమ్ ॥ 73

(12) కుహ యాన్తా సుష్టుతిం కావ్యస్య దివో నపాతా వృషణా శయుత్రా ।
హిరణ్యస్యేవ కలశం నిఖాతముదూపథుర్దశమే అశ్వినాహన్ ॥ 74

(13) యువం చ్యవానమశ్వినా జరన్తం పునర్యువానం చక్రథుః శచీభిః ।
యువో రథం దుహితా సూర్యస్య సహ శ్రియా నాసత్యావృణీత ॥ 75

(14) యువం తుగ్రాయ పూర్వ్యేభిరేవైః పునర్మన్యావభవతం యువానా ।

యువం భుజ్యుమర్ణసో నిః సముద్రాద్ విభిరూహథుర్ఋజ్రేభిరశ్వైః ॥ 76

(15) అజోహవీదశ్వినా తౌగ్ర్యో వాం ప్రోళ్హః సముద్రమవ్యథిర్జగన్వాన్ ।

నిష్టమూహథుః సుయుజా రథేన మనోజవసా వృషణా స్వస్తి ॥ 77

(16) అజోహవీదశ్వినా వర్తికా వామాస్నో యత్ సీమముఞ్చతం వృకస్య ।

వి జయుషా యయథుః సాన్వద్రేర్జాతం విష్వాచో అహతం విషేణ ॥ 78

(17) శతం మేషాన్ వృక్యే మామహానం తమః ప్రణీతమశివేన పిత్రా ।

ఆక్షీ ఋజ్రాశ్వే అశ్వినావధత్తం జ్యోతిరన్ధాయ చక్రథుర్విచక్షే ॥ 79

(18) శునమన్ధాయ భరమహ్వయత్ సా వృకీరశ్వినా వృషణా నరేతి ।

జారః కనీన ఇవ చక్షదాన ఋజ్రాశ్వః శతమేకం చ మేషాన్ ॥ 80

(19) మహీ వామూతిరశ్వినా [1]మయోభూరుత [2]స్రామం ధిష్ణయా సం రిణీథః ।

అథా యువామిదహ్వయత్ పురంధిరాగచ్ఛతం సీం వృషణావవోభిః ॥ 81

(20) అధేనుం [3]దస్రా స్తర్యం౧ విషక్తామపిన్వతం శయవే అశ్వినా గామ్ ।

యువం శచీభిర్విమదాయ జాయాం న్యూహథుః పురుమిత్రస్య యోషామ్ ॥ 82

1. మేయా (వ్రా.ప్ర.) 2. స్త్రామం (వ్రా.ప్ర.) 3. దస్నా (వ్రా.ప్ర.)

(21) [1]యవం వృకేణాశ్వినా వపన్తేషం దుహన్తా మనుషాయ దస్రా।
అభి దస్యుం బకురేణా ధమన్తోరు జ్యోతిశ్చక్రథురార్యాయ ॥ 83

(22) ఆథర్వణాయాశ్వినా దధీచే ऽశ్వ్యం శిరః ప్రత్యైరయతమ్ ।
స వాం మధు ప్ర వోచదృతాయన్ త్వాష్ట్రం యద్ దస్రావపి కక్ష్యం వామ్ ॥ 84

(23) సదా కవీ సుమతిమా చకే వాం విశ్వా ధియో అశ్వినా ప్రావతం మే।
అస్మే రయిం నాసత్యా బృహన్తమపత్యసాచం శ్రుత్యం రరాథామ్ ॥ 85

(24) హిరణ్యహస్తమశ్వినా రరాణా పుత్రం నరా [2]వధ్రిమత్యా అదత్తమ్ ।
త్రిధా హ శ్యావమశ్వినా వికస్తముజ్జీవస ఐరయతం సుదానూ ॥ 86

(25) ఏతాని వామశ్వినా వీర్యాణి ప్ర పూర్వ్యాణ్యాయవోऽవోచన్ ।
బ్రహ్మ కృణ్వన్తో వృషణా యువభ్యాం సువీరాసో విదథమా వదేమ ॥ 87

## సూక్తము—117

### ఋషి—కక్షవంతుఁడు *

### దేవత—అశ్విదేవతలు

(1) ఉ॥ స్తుతు లొనరించుచుం దగిన సూక్తి పఠించుచు సోమయాజి స
న్నుతులను జేయుచున్ మిగుల నవ్య హవిస్సును దర్భ నుంచెనో
నుతమతులార! శీఘ్రముగ నూత్న బలంబును నన్న మీయ మే
మతులిత మాధురీ మహిమ నందెద మప్పుడు సంతసంబునన్ ॥ 57

1. యువం (ప్రా.ప్ర.) 2. వధ్రిమత్యా (ప్రా.ప్ర.) * ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోట్ విషయము (331 పుట) చూడఁదగును. వ.గో.కృ.

(2) గీ॥ మనసుకంటెను వేగంబు చనెడు నదియు, యజ్ఞకర్తల యాగార్థ మరుగు నదియు
నైన రథమెక్కి మీర లో యశ్వులార!, వచ్చి సోమముఁగొనిపోరె మెచ్చునట్లు ॥ 58

(3) సీ॥ అఖిల భూతములకు నతిహితంబును జేయు మిత్రుని రాహువు మ్రింగియుండ
నత్రి మహాముని యది చూచి సూర్యుని విడిపించి జగమును వెలుఁగఁజేసెఁ,
దాము పట్టినపట్టు తప్పిపోయె నటంచు నధిక రోషముఁబూని యసురు లంత
నత్రి మహర్షిని నధికబాధలఁబెట్టి శతములౌ ద్వారముల్ చాలఁగల్గు
గీ॥ యంత్ర సదనంబులో నున్న యగ్నియందుఁ, [1]బడఁగఁ ద్రోయఁగ నెంతేని, బట్టుపట్టి
నట్టి యత్రిని రక్షించి యశ్వివరులు, విపుల కీర్తిని బడసిరి విశ్వమందు ॥ 59

(4) చ॥ ఘనుఁడగు రేభుఁదాపసు నగాథ జలంబులఁ ద్రోసి రాక్షసుల్
కనలెడు నా మహామునికిఁ గాళ్లను జేతులు కోసి యుండఁగాఁ
బనిఁగొని [2]యశ్వరాజ గత బాధను మీరలు కొట్టునట్లుగా
మునుఁగొని కాళ్ళ వాని కతిమోదముతోఁ దమ రీయ లేదఁటే! ॥ 60

(5,6) సీ॥ పుడమిపైని బరుండు పురుషునికైవడి బావిలో నుండెడు బందమునిని
నూతిలో సూర్యవిఖ్యాత బింబమురీతి బావిలో నుండెడు బందమునిని
జాలఁ జీఁకటిలోన స్వర్ణవస్తువు భంగి బావిలో నుండెడు బందమునిని
స్థిరచిత్తమున మీరు తీసితి రప్పు డశ్వము †శఫములనుండి శతఘటములు
గీ॥ నిండునట్టులు మద్యము నిర్గమింపఁ, జేసితిరికాదె తొల్లి వికాసమాన
కర్మకారకులార! మీ కర్మలన్ని, నేను కొనియాడ కుందునే! నెనరుతోడ ॥ 61

(7) చ॥ ప్రియుఁడగు విశ్వకుం డనెడు పెద్ద కుమారుఁడు తప్పిపోవఁగా
భయమును బొంది మిమ్ముఁ బిత ప్రస్తుతిఁ జేయఁగ మీపు దీక్షతో
హయముల నెక్కిపోయి భువి నంతటఁ గన్గొని వాని నెట్లొ మీ
శయములఁ బట్టి తెచ్చితిరి చారు భిషగ్వరులార! దీక్షతోన్ ॥ 62

---

1. బడఁగఁద్రోసిరి యత్రి సబాంధవముగ (తొ.పా.) 2. యశ్విరాజునకు బాధ చికిత్స నొనర్చునట్లుగా (తొ.పా.) † గుఱ్ఱముయొక్క గిట్టలనుండి (శఫములనుండి) నూరు కడవల మద్యమును అశ్వులు దీసిరఁట. అశ్వము గిట్టల నడుమ మాదకపదార్థ ముండునేమో? (నే.వేం.న.శా.) సూచన:- ఈ భావము స్కంద సాయనాది భాష్యములనుంచి పరిగృహీత మైనది. ఆర్ష విజ్ఞానము దృష్టితో నీ ఋక్కుల యర్థములే ప్రామాణికములు కావు. చూఁడు పీఠిక. వ.గో.కృ.

గీ॥ †ఘోషయను నంగనామణి కుష్ఠరోగ, బాధిత శరీరయయి *తన భర్త వీడఁ
దండ్రికడనుండి మిమ్ములఁ దగినరీతి, వేడుకొన దాని రోగము వెడలలేదె! ॥ 63

(8) సీ॥ నార్షదు బధిరంబు హర్షంబుతోఁ గొట్టి వినికిగల్గుచు వాఁడు వెలయలేదె?
కుష్ఠరోగంబునఁ గ్రుళ్ళు మునీశుని వనిత యెవ్వతెయును[1] వాని నొల్ల
కుండుటఁ గనిపెట్టి యుచితరీతిగ వాని రోగముఁ బోఁగొట్టి రూపవతిని
బత్నిగాఁజేయుచుఁ బడయరె? చిరకీర్తిఁ గన్నుల లేమిచేఁ గదలకుండ
గీ॥ నింటఁగూర్చుండి యున్నట్టి యిద్ధకణ్వు, మునియు నేత్రంబు లందఁడే! మోద మలర
[2]నఖిల రక్షకు లగునట్టి యశ్వులార!, యట్టి మీకృతముల్ పల్క నగునె మాకు! ॥ 64

(9) చ॥ వివిధములైన రూపముల వేయగు కార్యము లాచరించు మీ
రవితథ విత్తదం బగుచు నంచిత వేగముఁ గల్గి యొప్పుచున్
నవనవ శత్రు మండలిని నాశముఁ జేసెడు నశ్వరాజు సం
స్తవములఁజేయు భక్తులకుఁ జయ్యన నియ్యరె? యశ్విదేవతల్ ॥ 65

(10) ఉ॥ రోదసి రూపుఁబోలు నతిరూపము నందెడు మీర లెంతయున్
మోదముతోఁ బఠించితిరి ముద్దులు గొల్పెడి మంత్రరాజమున్
గాదనకుండ నాంగిరస కాంక్షితముల్ సరిగూర్చి ప్రీతితో
నోదన మిందు మా కిపు డహో! యనునట్టు [3]లుదశ్విదేవతల్! ॥ 66

(11) క॥ ఘనుఁ డగు నగస్త్యమునిపతి, వినయమునన్ వేడమిమ్ము విప్రున కెలమిన్
ఘన మగు నన్నంబొసఁగరె!, మును విశ్పల కీయలేదె మొగిఁ బాదములన్ ॥ 67

(12) గీ॥ భువి వినిక్షిప్త సౌవర్ణ పూర్ణఘటము, నుద్ధరించిన విధమున నిద్ధరేభుఁ
బైకిఁదీసితి రెలమిని బావినుండి, యఖిల రక్షకులార! యో యశ్వులార! ॥ 68

† అశ్వులు ఘోష యనునామె కుష్ఠరోగము మాన్పినారు. వారు భిషగ్వరులు. ఈ ఋక్కునవారు చూపెట్టిన వైద్య పాండిత్యమును పాఠకులారా! పరీక్షింపుఁడు. రేభుఁడను మహామునికిఁ గాళ్ళు కలిఁగించిరి. ఒక ముని కుష్ఠరోగ దూషితుఁడుకాఁగా వాని భార్య వాని నొల్లకుండెను. అట్టి ముని మహారోగమును బోఁగొట్టిరి. కణ్వమహర్షి నేత్రమును బాగుచేసిరి. చ్యవన మహర్షిని యౌవనవంతులుగా నొనర్చిరి. ఈ మొదలగు చికిత్సల నార్యు లొనర్చియుండ ఆర్యులకు వైద్యజ్ఞానము లేదనుట ఆశ్చర్యకరముగ నున్నది. (నే.వేం.న.శా.) * తనభర్తవీడి (వ్రా.ప్ర.పా.) ఘోషను భర్త పరిత్యజించెను గాని ఘోషయే భర్తను విడిచిపెట్ట లేదు. వ.గో.కృ.

1. యెవ్వతెయైన (వ్రా.ప్ర.పా.) భావ మస్పష్టముగానుండుటచే నీసవరణ చేయఁబడినది. వ.గో.కృ. 2. నఖిలరక్షకులగువారలశ్వివరులు (ర్యులట్టి) (తొ.పా.) 3. "నట్టులు దక్షుదేవతల్!" గ్రంథకర్త స్వయముగా "క్షు" వర్ణముగ సవరించెను. (ఉదక్షుదేవత అనఁగా మహా దుఃఖ దేవత అని మూలచ్ఛేదకమగు దురర్థము వచ్చును. కాన మూలానుగుణముగా "నట్టు లుదశ్విదేవతల్" (అశ్వినా) అని సవరింపఁబడినది. "దస్ర దేవతల్" అని యుంచినను అశ్వినీ దేవతలని యర్థము వచ్చి సరిపోయెడిది. వ.గో.కృ.

(13,14, 15,16) సీ॥ చ్యవన మహర్షికిఁ జారు యౌవన మిచ్చి [1]యతని వృద్ధత్వంబు ననిపినారు
సూర్యుని సుత యగు సూర్యను రథముపై నెక్కించుకొని మీర లేగినారు
దుఃఖించుచున్న యా తుగ్ర పుత్రుని నీటి గండంబులన్ నీటఁ గడపినారు
గండముల్ దప్పించి ఘనరథంబున వాని నెక్కించి తత్పిత కిచ్చినారు
గీ॥ పిచ్చుకకు బాధఁబోఁగొట్టి పెద్ద వైరి, జాహుషుని రథము పైనుంచి జనుచుఁ బర్వ
తాగ్ర శిఖరములం జేర్చి తనిసి యశ్వి, కులు! ప్రతిష్ఠలచేఁ జాల వెలిఁగినారు ॥ 69

(17) మ॥ †శతసంఖ్యన్ విలసిల్లు మేష వితతిం జంపించి ఋజ్రాశ్వుఁ డు
న్నతిచేఁ గుక్కకుఁ దిండిగా నిడఁగ నన్యాయం బటంచున్ వడిన్
బిత కోపించి కుమారు నంధునిగ నిర్భీతిన్ శపింపంగ వి
శ్రుతులం బొందఁగ వాని కీయరఁటె చక్షుల్ [2]దస్రు యుగ్మంబహో! ॥ 70

(18) సీ॥ అశ్విదేవతలార! యాలకింపుఁడు నాదు మాట లన్నియు మీరు మఱవకుండ
యౌవనవంతుఁడై యపరదారను గోరు జారుఁడు ధనమును జాలఁగొనుచు
నన్యకాంత కొసంగునట్టులు ఋజ్రాశ్వుఁ డన్ని మేషంబుల నపహరించి
యాహారముగ నాకు నతిశయంబుగ నీయ నంధుండ వగు మని యతని తండ్రి
గీ॥ శాప మిచ్చుటచే వాఁడు శాంతిఁగొనక, గ్రుడ్డివాఁడయి యుండ, నే యడ్డులేక
కన్నుల నొసంగి వానిని గాఁచినారు, వృకము ప్రార్థన నాలించి వెలసినారు ॥ 71

(19) గీ॥ రోగు లందఱి రోగముల్ త్యాగబుద్ధి, మాన్పుచున్నారు విశ్పలా మానవతికిఁ
గుష్ఠ రోగముఁ బోఁగొట్టి కూర్చినార, లతిసుఖంబుల నప్పు డో యశ్వులార! ॥ 72

(20) చ॥ మిగులఁ గృశించి వాసిచెడి మిక్కిలి గొడ్డగు మౌని ధేనువున్
దగిన పయ స్స్రవంగెడు విధంబునఁ జేసిరి వారు వెండియున్
మగఁటిమిఁబూని శత్రువుల మార్కొని భార్యను దెచ్చి భర్తకుం
జగములు మెచ్చ నిచ్చి రతిచారు శరీరులు దేవతోత్తముల్ ॥ 73

(21,22, 23,24) సీ॥ మనుదర్శనీయులై మనుజాభివృద్ధికిఁ బెద్ద వర్షము గురిపించినారు
మనుజుల బాధించు మత్తఘాతంబుల వజ్రాయుధముచేత వంచినార
లల దధీచికిఁ దగు నశ్వముఖంబును నందించి విద్యల నందినారు
[3]మద్రిమతీ బ్రహ్మవాదినికయి పుత్రు నోపి వరంబుగా నొసఁగినారు

1. మరల వృద్ధత్వంబు మాన్పినారు (తా.పా.) † 116వ. సూక్తములోని 16వ ఋగనువాద పద్యమునకును (333 పుట. 47వ పద్యము) దీనికిని జాల సాజాత్యము కలదు. ఇది సరికాదు. సంస్కృత మూలములో 116వ సూక్తములోని 16వ ఋక్కునకును (329పుట. 53 ఋక్కు) 117వ. సూక్తములోని 17వ ఋక్కునకును (337పుట 79 ఋక్కు) జాల భిన్నత్వము కలదు. ఇవి భిన్నార్థకములు. వ.గో.కృ. 2. దస్రు యుగ్మంబు = అశ్వినీ దేవతల జంట. 3. ఈ సీసపద్యము నాల్గవ పాదములో "మద్రి-వాదిని" అనునప్పుడు సంయుతా సంయుత ప్రాసము ప్రయోగితమైనది. వ.గో.కృ.

గీ॥ శ్వావునకుఁ బ్రాణముల నీయ సాగినారు, కాన, బుత్రులఁ బౌత్రులఁ గలుగఁజేసి
మమ్ము రక్షించెదరుగాక మాన్యులగుచు, నశ్విదేవత లేవేళ నతిశయించి ॥ 74

(25) [1]పుర్వున మీ రొనర్చిన యపూర్యపుఁ గృత్యము లన్ని మా కిలం
గర్వము లేక పెద్ద లతిగౌరవ భావముతోడఁ జెప్పఁగా
సర్వము లైన సంస్తుతులఁ జాలగఁ జేసితి మశ్వులారః మీ
[2]నిర్వచనీయ భక్తులకు నెమ్మిక నీయుఁడు పుత్ర పౌత్రులన్ ॥ 75

## సూక్తమ్—118

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః†

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) ఆ వాం రథో అశ్వినా శ్యేనపత్వా సుమృళీకః [1]స్వవాగ్ం యాత్వర్వాఙ్ ।
యో మర్త్యస్య మనసో జవీయాన్ త్రివన్ధురో వృషణా వాతరంహాః ॥ 88

(2) త్రివన్ధురేణ త్రివృతా రథేన త్రి చక్రేణ సువృతా యాతమర్వాక్ ।
పిన్వతం గా జిన్వతమర్వతో నో వర్ధయతమశ్వినా వీరమస్మే ॥ 89

(3) ప్రవద్యామనా సువృతా రథేన దస్రావిమం శృణుతం శ్లోకమద్రేః ।
కిమఙ్గ వాం ప్రత్యవర్తి[2]ం గమిష్ఠాహుర్విప్రాసో అశ్వినా పురాజాః ॥ 90

† ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (331 పుట) చూచునది. వ.గో.కృ.

1. పుర్వున—మిక్కుటముగా 2. నిర్వచనీయ భక్తులకు—ఎల్లప్పుడును బేర్కొనఁదగిన భక్తులకు (నితరాం వచనీయ) అను విశేషార్థమున శ్రీ వేమాని వారీ ప్రయోగము చేసినట్లగపడుచున్నది. ఇట్టి యర్థమున నిటువంటి ప్రయోగములు మృగ్యములు. వ.గో.కృ.

1. సవాం (వ్రా.ప్ర) 2. ప్రత్యవర్తిగమిష్ఠా హుర్విప్రాసో (వ్రా.ప్ర.)

(4) ఆ వాం శ్యేనాసో అశ్వినా వహన్తు రథే యుక్తాస ఆశవః పతఙ్గాః ।

యే అప్తురో దివ్యాసో న గృధ్రా అభి ప్రయో నాసత్యా వహన్తి ॥ 91

(5) ఆ వాం రథం యువతిస్తిష్ఠదత్ర జుష్ట్వీ నరా దుహితా సూర్యస్య ।

పరి వామశ్వా వపుషః పతఙ్గా వయో వహన్త్వరుషా అభీకే ॥ 92

(6) ఉద్ వన్దనమైరతం దంసనాభిరుద్రేభం దస్రా వృషణా శచీభిః ।

నిష్టౌగ్ర్యం పారయథః సముద్రాత్ పునశ్చ్యవానం చక్రథుర్యువానమ్ ॥ 93

(7) యువమత్రయేఽవనీతాయ తప్తమూర్జమోమానమశ్వినావధత్తమ్ ।

యువం కణ్వాయాపిరిప్తాయ చక్షుః ప్రత్యధత్తం సుష్టుతిం జుజుషాణా ॥ 94

(8) యువం ధేనుం శయవే నాధితాయాపిన్వతమశ్వినా పూర్వ్యాయ ।

అముఞ్చతం వర్తికామంహసో నిః ప్రతి జఙ్ఘాం విశ్పలాయా అధత్తమ్ ॥ 95

(9) యువం శ్వేతం పేదవ ఇన్ద్రజూతమహిహన మశ్వినాదత్తమశ్వమ్ ।

జోహూత్రమర్యో అభిభూతిముగ్రం సహస్రసాం వృషణం వీహ్వఙ్గమ్ ॥ 96

(10) తా వాం నరా స్వవసే సుజాతా హవామహే అశ్వినా నాధమానాః ।

ఆ న ఉప వసుమతా[1] రథేన గిరో జుషాణా సువితాయ యాతమ్ ॥ 97

1. వసుమతా స్థేన (వ్రా.ప్ర.)

(11) ఆ శ్యేనస్య జవసా నూతనేనాస్మే యాతం నాసత్యా సజోషాః ।

హువే హి వామశ్వినా రాతహవ్యః శశ్వత్తమాయా ఉషసో వ్యుష్టౌ ॥ 98

## సూక్తము—118

### ఋషి—కక్షీవంతుఁడు *

### దేవత—అశ్విదేవతలు

(1) గీ॥ అఖిల రక్షకు లగు మీర లశ్విలార!, వేగమున మానసంబును వీఁగఁజేసి
పోవు మూఁడగు నశ్వముల్ పూన్చినట్టి, [1]సుఖము నొసంగు రథంబుపైఁ జూడరండు ॥ 76

(2) ఉ॥ సారథి విశ్రమించుటకుఁ జక్కని తావులు మూట నొప్పి వి
స్తార సుఖప్రదంబయి విశాలముగా విలసిల్లునట్టి మీ
తేరును నెక్కి మా కడకుఁ దిన్నఁగ వచ్చుచు ధేను పంక్తికిన్
సారముఁ జెందఁజేసి కడు సౌఖ్యము నీయరె యశ్విదేవతల్! ॥ 77

(3) గీ॥ మిమ్ము నుతియించువారికి మేలు సేయ, మీర లరుదెంతు రని మేము మిక్కుటముగ
నాలకించితి మప్పుడే యశ్విలార!, ఘనరథం బెక్కి మమ్ములఁ గనఁగ రండు! ॥ 78

(4) క॥ గద్దవలెఁ బోవునవియుం, దద్దయు నుదక ప్రవాహ ధర్మముఁగొని మా
యొద్దకు [2]నశ్వంబులు మిము, నొద్దికగాఁ దెచ్చి విడుచు నోహో! యశ్విల్! ॥ 79

(5) గీ॥ సూర్య దుహితయైన జుష్టితో మిమ్ముల, రథముపైనిసుంచి [3]రాణ వెలుఁగు
నశ్వ [4]వరము నెలమి నధిక వేగంబున, వచ్చుఁగాక మిమ్ముఁ దెచ్చుఁగాక ॥ 80

(6,7) సీ॥ బావిలోఁ బడియుండు వందుని దరిఁజేర్చి యిష్టార్థముల నెల్ల నిచ్చి రెవరో!
రిక్తుఁడై పడియున్న రేభుని దరిఁజేరి యిష్టార్థముల నెల్ల నిచ్చి రెవరో!
భువనంబునంగల భుజ్యునికడఁజేరి యిష్టార్థముల నెల్ల నిచ్చి రెవరో!
చ్యవన మహర్షికిఁ జారు యౌవన మిచ్చి యిష్టార్థముల నెల్ల నిచ్చి రెవరో!
గీ॥ యంత్రవహ్నిని బడియున్న యత్రి మౌని, నోపి రక్షించి రెవ్వరో యుచితరీతిఁ
గన్నుఁగానక పడియున్న కణ్వ మునికిఁ, గన్నులను నిచ్చి కాపాడఁగల్గి రెవరో! ॥ 81

* ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ విషయము (331 పుట) చూఁడనగును, వ.గో.కృ.
1. సుఖదమైయొప్పు రథముపై (తా.పా.) ఈ గీతము నాలుగవపాదమున "సుఖము నొసఁగు రథంబుపై" అని తొలి యింద్రగణమును సలక్షణముగ "నల"ముగాఁ బ్రయోగింపఁ గలిగి యుండియు శ్రీ నేమానివారు "నల" మునకు మారుగా "జల" ము ప్రయోగించుట విశేషము. వ.గో.కృ.
2. వేఁగము మిమ్ముల (తా.పా.) 3. రమ్యమైన (తా.పా.) 4. రాజులెలమి (తా.పా.)

(8,9) సీ॥ శయువుని గోవును జాల దోగ్ధ్రిగఁజేసి యతులభక్తిని నతు లంది రెవరొ!
తోడేలు పాలైన దొడ్డ పిచ్చుక నతిదయతోడఁ గాపాడఁ దలఁచి రెవరొ!
విశ్పల ననిలోన విగత జంఘగఁజూచి యినుప పిక్కలఁజేసి యిచ్చి రెవరొ!
పేదుఁడన్ నృపునకుఁ బెద్ద యశ్వమొసంగి పేరుఁగాంచిన యట్టి పెద్ద లెవరొ!
గీ॥ యట్టి ధర్మాత్ములైన యా యశ్వులధిక, దర్శనీయులు సకలార్థ దాతృవరులు
రాజితాశ్వములన్ గల్గు రథముపైని, ముద మలర వచ్చి ధనము నిచ్చెదరు గాక! ॥ 82

(10) గీ॥ సకల కర్మల జరిపించు జాణలార!, విత్తము నొసంగి రక్షింప వేఁడుకొనెద
స్తోత్ర జాలంబు నాలించి యాత్రతోడ, ద్రవిణ పూరిత రథముతోఁ దరలిరండు ॥ 83

(11) గీ॥ ప్రత్యుషః కాలమున మిమ్ముఁ బ్రస్తుతించి, హవ్యము నొసంగుచున్నార మశ్వులార!
కాన దయచేసి మాయెడఁ గరుణగల్గి, యశ్వ జవమున రండు! మ మ్మాదరింప ॥ 84

## సూక్తమ్—119

### ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః

### దేవతా—అశ్వినౌ

### ఛందః—జగతీ

(1) ఆ వాం రథం పురుమాయం మనోజువం జీరాశ్వం యజ్ఞియం జీవసే హువే ।
సహస్రకేతుం వనినం శతద్వసుం శ్రుష్టీవానం వరివోధామభి ప్రయః ॥ 99

(2) ఊర్ధ్వా ధీతిః ప్రత్యస్య ప్రయామన్యధాయి శస్మన్త్సమయన్త ఆ దిశః ।
స్వదామి ఘర్మం ప్రతి యన్త్యూతయ ఆ వామూర్జానీ రథమశ్వినారుహత్ ॥ 100

(3) సం యన్మిథః పస్పృధానాసో అగ్మత శుభే [1]మఖా అమితా జాయవో రణే ।
యువోరహ ప్రవణే చేకితే రథో యదశ్వినా వహథః సూరిమా వరమ్ ॥ 101

1. శుభేముఖే (వా.ప్ర.)

(4) యువం భుజ్యుం భురమాణం విభిర్గతం స్వయుక్తిభిర్నివహన్తా పితృభ్య ఆ ।
యాసిష్టం వర్తిర్వృషణా విజేన్యం౧ం దివోదాసాయ మహి చేతి వామవః ॥ 102

(5) యువోరశ్వినా వపుషే యువాయుజం రథం వాణీ యేమతురస్య శర్ధ్యమ్ ।
ఆ వాం పతిత్వం సఖ్యాయ జగ్ముషీ యోషావృణీత జేన్యా యువాం పతీ ॥ 103

(6) యువం రేభం పరిషూతేరురుష్యథో[1] హిమేన ఘర్మం పరితప్తమత్రయే ।
యువం శయోరవసం పిప్యథుర్గవి ప్ర దీర్ఘేణ వన్దనస్తార్యాయుషా ॥ 104

(7) యువం వన్దనం నిరృతం జరణ్యయా రథం న దస్రా కరణా సమిన్వథః ।
క్షేత్రాదా విప్రం జనథో విపన్యయా ప్ర వామత్ర విధతే దంసనా భువత్ ॥ 105

(8) అగచ్ఛతం కృపమాణం పరావతి పితుః స్వస్య త్యజసా నిబాధితమ్ ।
స్వర్వతీరిత ఊతీర్యువోరహ చిత్రా అభీకే అభవన్నభిష్టయః ॥ 106

(9) ఉత స్యా వాం మధుమన్మక్షికారపన్మదే సోమస్యౌశిజో హువన్యతి ।
యువం దధీచో మన ఆ వివాసథో౽థా శిరః ప్రతి వామశ్వ్యం వదత్ ॥ 107

(10) యువం పేదవే పురువారమశ్వినా స్పృధాం శ్వేతం తరుతారం దువస్యథః ।
శర్యైరభిద్యుం పృతనాసు దుష్టరం చర్కృత్యమిన్ద్రమివ చర్షణీసహమ్ ॥ 108

1. రురుష్పథో (వ్రా.ప్ర.)

## సూక్తము—119

### ఋషి—దీర్ఘతమ పుత్రుఁడగు కక్షీవంతుఁడు*

### దేవత—అశ్వీదేవతలు

(1,2) సీ॥ చిత్త వేగంబుతోఁ జేరుచుండును నెద్ది? యాశ్చర్య కర్మల నమరు నెద్ది?
యాగంబునకుఁ బిల్వ నేగెడు నెయ్యది? వివిధ ధ్వజంబుల వెలయు నెద్ది?
విత్తరాశులతోడ వెలుఁగొందు నెయ్యది? వర్షప్రదంబయి వరలు నెద్ది?
సౌఖ్యప్రదం బౌచు సర్వార్థదం బెద్ది? యశ్వ రాజంబుల నమరు నెద్ది?
గీ॥ [1]యట్టి మీ దివ్యరథము మా కభిముఖముగ, వచ్చుచుండఁగ విన్ఁబడు మెచ్చు లన్ని
హవ్య సంస్కార మంతయు నమరియుండు, నశ్వరక్షకులార! యో యశ్వులార! ॥ 85

(3) చ॥ వినయము మీర యజ్ఞముల వేల నొనర్చిన పండితోత్తముల్
ధనమునకై పరస్పరము తప్పక యుద్ధముఁ జేయ నెంచి తా
మనయము వేల్పులన్‌విడచి యశ్వుల వేడఁగ వారి కెంతయో
[2]ధనమును నీయఁగల్గిరి సుధన్య మహాశ్వులు సంతసంబునన్ ॥ 86

(4) గీ॥ సైనికులతోడ సంద్రంబు లోనఁబడిన, తుగ్రపుత్రుని భుజ్యుని దురగములను
నోడలను గొంచు పోవుచు నుద్ధరించి, తిరి, దివో దాసునింబలె దివ్యులార! ॥ 87

(5) ఉ॥ అందఱికంటె మున్ను మిము నశ్వములన్నియు నూరు చెంతకుం
దొందఱమీరఁ జేర్చి జయదుందుభి మ్రోగెడునట్లు చేయవే
సుందరమైన యోష మిముఁ జూఁచి వరించెను మోహబుద్ధితో
నెందును లేరు మీ సము లహీన భిషగ్వరులార! చూఁడరే! ॥ 88

(6,7) సీ॥ ఉముక నిప్పులలోన నుడుకుచుండెడు నత్రి రక్షించితిరి మీరు రాజులార!
గొడ్డువోయిన పెద్ద గోవును పాలిచ్చునట్టులు చేసితి రార్యులార!
వద్రంగి బిందికివలె వంవమౌనికి నతిశోభ నిచ్చితి రయ్యలార!
వామదేవుని తల్లి బహుగర్భవేదనఁ బోఁగొట్టితిరి మీరు పూజ్యులార!
గీ॥ బాధ లన్నిటిఁ బోఁగొట్టు పరమశక్తి, మీకుఁగలదని మిమ్ము ననేకగతుల
వేడుచుండఁగ రారేమి వేల్పులార!, యఖిల రక్షకులార! యో యశ్వులార! ॥ 89

* ఋషివిశేషవిషయములకై తెలుఁగు 116వ. సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు విషయము (331 పుట) చూచునది. వ.గో.కృ.

1. యట్టి దివ్యరథంబు మా కభిముఖముగ (తా.పా.) 2. ధనమును నీయఁగల్గిరి మహాశ్వులు ధన్యులు సంతసంబునన్ (వ్రా.ప్ర. పాఠము.) 1వ సంపుటము ప్రథమాష్టకమున నష్టమాధ్యాయమున 119వ. సూక్తములోని 3వ ఋక్కునకు ననువాదమైన యీ పద్యము శ్రీ నేమానివారిచే 32వ. పుటలో ప్రత్యేకముగా వ్రాయఁబడినది. కుడిప్రక్క పుట 33వ పుటలో వ్రాయవలసిన నీ ఋగనువాద పద్యము పొరపాటున ననువదింపక మరచి తరువాత నెడమప్రక్క పుటయైన 32వ. పుటలో వ్రాయుట జరిగినది. "వినయము మీర" యిత్యాదిగాఁగల యీ పద్యము నాల్గవ పాదమున యతిదోషమున్నది. కాన "మహాశ్వులు ధన్యులు" అని శ్రీనేమానివారు వ్రాసిన దానిని "సుధన్యమహాశ్వులు"గా సవరింపఁబడినది. వ.గో.కృ.

(8) గీ॥ తండ్రిచే విజయ[1] యాత్రకుఁ దగినయట్లు, పంపఁబడి [2]యుదధి మధ్యను బడినయట్టి
భుజ్యు రక్షింపఁ గల్గుచుఁ బూజ్యులగుచు, వెలుఁగుచుండిరి [3]దస్రులు వేయిగతుల ॥ 90

(9) ఉ॥ తేనెను గోరి మక్షికము తీయని వాక్కుల మిమ్ము వేడ[4] నా
తేనెను మీరు పొందుటకు దివ్య దధీచుని వేడి వానికిన్
మానుగ సేవఁజేయ నభిమానముతో హయరాజితాస్యముం
బూని దధీచి మీ కిడడె [5]పుష్కలమౌ మధువున్ సుహార్దికుల్ ॥ 91

(10) సీ॥ కోర్కె లుండెడు వారు కోరంగఁదగుదానిఁబోరులోఁ దనవారిఁ బ్రోచుదాని
శూరులచేనైన వారింపఁగా రాని జవముచే ననిలోన జరుగు దాని
నుల్లం బలరఁజేయు తెల్లని రంగుతో వేయి విధంబుల వెలుఁగు దాని
నెల్లకార్యములందు మెల్లఁగ బండికి బహుప్రీతితోఁ గట్టఁబడెడు దాని
గీ॥ వజ్రివలె దేని నైనను వంచుదాని, వింతయగు పూర్ణశక్తితో వెలయుదాని
నమరపతి లబ్ధ మగునట్టి యశ్వమెలమి, [2]జేదునకు నొసఁగలేదఁటే పెద్దలార! ॥ 92

## సూక్తమ్—120

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః

దేవతా—అశ్వినౌ (12, దుస్స్వప్న నాశనమ్)*

ఛందః—1-గాయత్రీ, 2-కకుప్, 3-కా-విరాట్, 4-నష్టరూపీ

5-తనుశిరా, 6-ఉష్ణిక్. 7-విష్టార-బృహతీ, 8-కృతిః 9-విరాట్, 10-12—గాయత్రీ

(1) కా రాధద్ధోత్రాశ్వినా వాం కోవాం జోష ఉభయోః । కథా విధాత్యప్రచేతాః ॥ 109

(2) విద్వాంసా విద్ దురః పృచ్ఛేదవిద్వానిత్థాపరో అచేతాః । నూ చిన్ను మర్తే అక్రౌ ॥ 110

1. ఇంద్రగణమునకు మారు చంద్రగణమైన "భల"ము ప్రయుక్తము. వ.గో.కృ. 2. ఇక్కడ నింద్రగణమునకుమారుగఁ బంచలఘుగణము ప్రయుక్తమైనది. వ.గో.కృ. 3. యశ్వులు (తా.పా.) 4. మిముఁగోరనా (తా.పా.) 5. పూజ్యగుణోత్తములార! వేడ్కతోన్ (తా.పా.) 6. ఈ తేటగీతి నాల్గవ పాదములో నింద్రగణమునకు మారు పంచలఘుగణమైన "నలల" ముపయుక్తమైనది. శ్రీ నేమానివారు "బేదునకొసంగ లేదటే" అని వ్రాయఁగల్గి యుండియు "నలల" (నహ) ముపయోగించిరి గాన విశిష్టముగా భావించి యథాతథముగా నుంచఁబడినది. వ.గో.కృ.

* కొందఱి మతమున 12వ ఋక్కునకు దేవత దుస్స్వప్న నాశనీ దేవత. కొంద అన్నింటికిని నశ్వినీ దేవతలనే దేవతగా భావించి 12వ ఋక్కు దుస్స్వప్న నాశకమని తలంచిరి. వ.గో.కృ.

(3) తా విద్వాంసా హవామహే[1] వాం తా నో విద్వాంసా మన్మ వోచేతమద్య ।

ప్రార్చద్ దయమానో[2] యువాకుః ॥ 111

(4) వి పృచ్ఛామి పాక్యా౩ న దేవాన్ వషట్కృతస్యాద్భుతస్య దస్రా ।

పాతం చ సహ్యసో యువం చ రభ్యసో నః ॥ 112

(5) ప్ర యా ఘోషే భృగవాణే న శోభే యయా వాచా యజతి పజ్రియో వామ్ ।

ప్రైషయుర్న విద్వాన్ ॥ 113

(6) శ్రుతం గాయత్రం తకవానస్యాహం చిద్ధి రిరేభాశ్వినా వామ్ ।

ఆక్షీ శుభస్పతీ దన్ ॥ 114

(7) యువం హ్యాస్తం మహో రన్ యువం వా యన్నిరతతంసతమ్ ।

తా నో వసూ సుగోపాస్యాతం పాతం నో వృకాదఘాయోః ॥ 115

(8) మా కస్మై ధాతమభ్యమిత్రిణే నో మాకుత్రా నో గృహేభ్యో ధేనవో గుః ।

స్తనాభుజో అశిశ్వీః ॥ 116

(9) దుహీయన్ మిత్రధితయే యువాకు రాయే చ నో మిమీతం వాజవత్యై ।

ఇషే చ నో మిమీతం ధేనుమత్యై ॥ 117

1. హమాకుహే (వా.ప్ర.) 2. దయమనో (వా.ప్ర.)

(10) అశ్వినోరసనం రథమనశ్వం వాజినీవతోః । తేనాహం భూరి చాకన ॥ 118

(11) అయం సమహ మా తనూహ్యాతే జనాగ్ం అను సోమపేయం సుఖో రథః ॥ 119

(12) అధ స్వప్నస్య నిర్విదే ऽభుఞ్జతశ్చ రేవతః । ఉభా తా బస్రి నశ్యతః ॥ 120

## సూక్తము 120

### ఋషి—దీర్ఘతమ పుత్రుఁడగు కక్షీవంతుఁడు*

### దేవత—అశ్విదేవతలు

(1) క॥ నుతియింతురు మి మ్మెవ్వరు?, సతతము సంతోషపెట్టఁ జాలఁ డెవండున్
మతిమంతు లశ్వులారా!, యతులిత పరిచర్యఁ జేయ [1]నరుఁగు నెవండో! ॥ 93

(2) గీ॥ అశ్వి మాహాత్మ్య మెఱుఁగని యతఁడు వారి, నెటులు నుతియింపవలయునో యెరుఁగకుంట
దేవతల నడుగ[2]వలవదె దివ్యు లెలమి, భక్తులకు వశ్యులగుదురు పరమ[3]తుష్టి ॥ 94

(3) క॥ మిము మేము పిలుచుచుంటిమి, సమముగ వేద్యంబులైన సారస నుతులన్
స్తిమితముగ నెఱుక పరచుచు, మహిత హవి ద్రవ్య మెల్ల మానుగఁగొనరే ॥ 95

(4) క॥ ఇతరులగు నమరవరులన్, మతితో నే నడుగఁబోను మాన్యుల మిమ్మే
యతులిత భక్తిన్ వేడెద, హిత సోమరసంబుఁ ద్రావి హితము నొసఁగరే ॥ 96

(5) క॥ భృగు[4]ఘోషలు మీ నుతులం, దగ నెఱిఁగిన వార లవియుఁ దధ్యంబులగుం
జగమున నన్నుముఁ [5]గోరుచుఁ, దగు కక్షీవంతుఁడెపుడు [6]ధన్యుఁడు సుండీ! ॥ 97

(6) క॥ కన్నులు పోవుటవలనం, గన్నులు కావలయు ననుచుఁ గడు దైన్యముతో
నెన్నిన యట్టులు మిమ్ములం, నెన్నుదుఁ గరుణించి నాకు నీయరె! ధనమున్ ॥ 98

* ఆంధ్రానువాద మూలప్రతిలో (1వ. సంపుటము. 35వ. పుట.) నీ 120వ. సూక్తమునకు ఋషిని జేర్కొనలేదు. పొరపాటున విడిచిపెట్టి యుండనోపు. ఋషి విశేష విషయములకై 116వ. సూక్తము ఋషికిచ్చిన పుట్నోట్ (331వ పుట) చదువుకొనునది. వ.గో.కృ. 1. నరుగఁగలరె (తొ.పా.) 2. ఇక్కడఁ బంచలఘుగణ మింద్రగణమునకుమారుగాఁ యుక్తమాయెను. వ.గో.కృ. 3. పరమప్రీతి (తొ.పా.) 4. ఘోషలు (వ్రా.ప్ర.పా.) ఘోషఋషిక కాన ఘోషలుగా సవరింపఁబడెను. వ.గో.కృ. 5. గోరెడి. (తొ.పా.) 6. ధన్యుండుసుండీ (వ్రా.ప్ర.పా.) గణభంగము వ.గో.కృ.

(7) క॥ రక్షింపన్ భక్షింపన్, శిక్షింపంగలరు మమ్ము శ్రీయుతులారా!
[1]శిక్షింపుఁడు మముఁ జక్కఁగ, రక్షింపుఁడు దొంగవలన రాజులుకానన్ ॥ 99

(8) గీ॥ అశ్వి దేవతలార! మ మ్మరులకెదుటఁ, బెట్టకుండుఁడు, గోవులు పెంపు వీడి
దూడలన్ వీడకుండఁగ దూరమునకుఁ, [2]జేర్చెదరుగాక మీరలు చిత్త మలర ॥ 100

(9) గీ॥ సఖులపోషణకై మిమ్ముఁ జాలఁబొగడి, విత్తముం బొందుచున్నారు వివిధ[3]ఋషులు
కాన భక్తుల మగు మాకుఁ గలుఁగఁజేయుఁ, డన్నముం బాడియావుల నశ్వులార! ॥ 101

(10) గీ॥ గుఱ్ఱములు లేకయే పోవు గురురథంబుఁ, బొంది తృప్తుఁడ నైతిని బూజ్యులార!
యందువలనను ధనమును నశ్వులార!, నందఁ గోరుచునున్నాఁడ నతిశయముగ ॥ 102

(11) ‡క॥ బహువిధ మహిమల ధనముల, విహరించెడు నశ్వినీ సుపృథుదేవులు మే
మహరహ మహామహమిక నిడు, సుహవిస్సుం గొనుచు సర్వ శుభము లొసఁగుఁడీ! ॥ 103

(12) †క॥ వేకువ వచ్చెడు కలయుం, దేకువతో నిడక తాను దినకుండెడు నా
భీకర లోభియుఁ జెడుదురు, నాకాధిప మిత్రులార! నయవిదులారా! ॥ 104

అర్థాంతరము

(12) *క॥ ఉదయమె చెడు కల రాఁగా, నెదిరికి నుడివి పరిశుద్ధ హృదిమై మృష్టా
న్నదుఁడయి తాఁ దినవలయును, నిది నెరవేర్పని నరుండె యెగ్గును బొందున్ ॥ 105

వేరొక యర్థాంతము

(12) *క॥ కల సంపద నొరుల కిడక, కలనైనను దానె తినని కడు లోభి చెడున్
దెలతెల్లవారు తదుపరిఁ, గల వచ్చినచో నరర్థక మ్మగు రీతిన్ ॥ 106

---

1. మూఁడవ పాదములోఁగూడ మూలవ్రాతప్రతిలో నాల్గవపాదాదిలో వలె "రక్షింపుఁడు" అని వ్రాయఁబడియున్నది. కాన "శిక్షింపుఁడు" అని సవరింపఁబడినది. "చక్కఁగా మాకు విద్యలను నేర్పుఁడు" అని యీ మూఁడవ పాదమున కర్థము వచ్చును. వ.గో.కృ. 2. జేర్పవలయును మీరలు (తొ.పా.) 3. వివిధగతుల (వ్రా.ప్ర.పా.)

‡ లుప్తభాగపూరణకర్త, వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ". అసలు శ్రీనేమాని వా రనువదింపక విడచిన పదకొండవ ఋక్కున కనువాద పద్యముగా దీనిని నే రచించి పూరించితిని. వ.గో.కృ.

† పంద్రెండు ఋక్కులున్న యీ 120వ సూక్తములోని 11వ ఋక్కు ననువదింపక శ్రీ నేమానివారు 12వ ఋక్కును "వేకువ వచ్చెడు" నిత్యాది పద్యము రూపముగా ననువదించి దీనినే 11వ ఋక్కుగాఁ బేర్కొనిరి. (చూడు. వ్రాతప్రతి 1వ. సంపుటము 37వ. పుట) కొందఱు భాష్యకారులు పేర్కొన్నట్లు పంద్రెండవఋక్కు దుస్స్వప్న వినాశకమైనదికాదు. దీనికి విభిన్నార్థము లున్నవి. 11వ ఋక్కున కనువాద పద్యముగా శ్రీ నేమానివారు రచించిన "వేకువ వచ్చెడు కల" ఇత్యాదిపద్యము వాస్తవమునకుఁ జాల నసందర్భముగను నసమగ్ర భావయుక్తముగను నున్నది. ఈ పంద్రెండవ ఋక్కునకు మహర్షుల దృష్టిని నొకవిధమైన విశిష్టదృక్పథముతో నే నీ యర్థాంతర కంద పద్యద్వయమును ననువాదముగా విరచించితిని. వ.గో.కృ,

* రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య,

## అనువాకః 18, సూక్తమ్—121

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః

దేవతా—ఇన్ద్రో విశ్వేదేవా వా

ఛందః—త్రిష్టుప్

(1) కదిత్థా నౄఁః పాత్రం దేవయతాం శ్రవద్ గిరో అఙ్గిరసాం తురణ్యన్ ।
ప్ర యదానడ్విశ ఆ హర్మ్యస్యోరు క్రంసతే అధ్వరే యజత్రః ॥ 121

(2) స్తమ్భీద్ధ ద్యాం స ధరుణం ప్రుషాయదృభుర్వాజాయ ద్రవిణం నరో గోః ।
అను స్వజాం మహిషశ్చక్షత వ్రాం మేనామశ్వస్య పరి మాతరం గోః ॥ 122

(3) నక్షద్ధవమరుణీః పూర్వ్యం రాట్ తురో విశామఙ్గిరసామను ద్యూన్ ।
తక్షద్ వజ్రం నియుతం తస్తమ్భద్ ద్యాం చతుష్పదే[1] నర్యాయ ద్విపాదే ॥ 123

(4) అస్య మదే స్వర్యం దా ఋతాయాపీవృతముస్రియాణామనీకమ్ ।
యద్ధ ప్రసర్గే త్రికకుమ్నివర్తదప ద్రుహో మానుషస్య దురో వః ॥ 124

(5) తుభ్యం పయో యత్ పితరావనీతాం రాధః సురేతస్తురణే భురణ్యూ ।
శుచి యత్ తే రేక్ణ ఆయజన్త సబర్దుఘాయాః పయ ఉస్రియాయాః ॥ 125

(6) అధ ప్ర జజ్ఞే తరణిర్మమత్తు ప్ర రోచ్యస్యా ఉషసో న సూరః ।
ఇన్దుర్యేభిరాష్ట స్వేదుహవ్యైః స్రువేణ సిఞ్చఞ్జరణాభి ధామ ॥ 126

1. చతుష్పతేనయార్య (వ్రా.ప్ర.)

(7) స్విధ్మా యద్ వనధితిరపస్యాత్ సూరో అధ్వరే పరి రోధనా గోః ।
యద్ధ ప్రభాసి కృత్వ్యాగ్ం అను ద్యూనసర్విశే పశ్విషే తురాయ ॥ 127

(8) అష్టా మహో దివ ఆదో హరీ ఇహ ద్యుమ్నాసాహమభి యోధాన ఉత్సమ్ ।
హరిం యత్ తే మన్దినం దుక్షన్ వృధే గోరభసమద్రిభిర్వాతాప్యమ్ ॥ 128

(9) త్వమాయసం ప్రతి వర్తయో గోర్దివో అశ్మానముపనీతమృభ్వా ।
కుత్సాయ యత్ర పురుహూత వన్వఞ్ఛుష్ణ[1]మనన్తైః పరియాసి వధైః ॥ 129

(10) పురా యత్ సూరస్తమసో అపీతేస్తమద్రివః [2]ఫలిగం హేతిమస్య ।
శుష్ణస్య చిత్ పరిహితం యదోజో దివస్పరి సుగ్రథితం తదాదః ॥ 130

(11) అను త్వా మహీ పాజసీ అచక్రే ద్యావాక్షామా మదతామిన్ద్ర [3]కర్మన్ ।
త్వం వృత్రమాశయానం సిరాసు మహో వజ్రేణ సిష్వపో వరాహుమ్ ॥ 131

(12) త్వమిన్ద్ర నర్యో యాగ్ం అవో నృన్ తిష్ఠా వాతస్య సుయుజో వహిష్ఠాన్ ।
యం తే కావ్య ఉశనా మన్దినం దాద్ వృత్రహణం పార్యం తతక్ష వజ్రమ్ ॥ 132

(13) త్వం సూరో హరితో రామయో నృన్ భరచ్చక్రమేతశో నాయమిన్ద్ర ।
ప్రాస్య పారం నవతిం [4]నావ్యానామపి కర్తమవర్తయోఽయజ్యూన్ ॥ 133

1. మనన్తైః (వా.ప్ర.) 2. ఫాలిగం (వా.ప్ర.) 3. కర్మన (వా.ప్ర.) 4. నావ్యానామపి (వా.ప్ర.)

(14) త్వం నో అస్యా ఇన్ద్ర దుర్హణాయాః పాహి వజ్రివో దురితాదభీకే ।

ప్ర నో వాజాన్ రథ్యో౩ అశ్వబుధ్యానిషే యన్ధి శ్రవసే సూనృతాయై ॥ 134

(15) మా సా తే అస్మత్ సుమతిర్వి దసద్ వాజప్రమహః సమిషో వరన్త ।

ఆ నో భజ మఘవన్ గోష్వర్యో మంహిష్ఠాస్తే సధమాదః స్యామ ॥ 135

ఇతి
ప్రథమోఽష్టకే ఽష్టమోఽధ్యాయ
స్సమాప్తః
ప్రథమోఽష్టక స్సమాప్తః

## అనువాకము—18, సూక్తము—121

ఋషి—కక్షీవంతుఁడు *

దేవత—విశ్వేదేవతలు †

(1) చ॥ ధనము నొసంగువాఁడు వివిధావనతత్పరుఁ డింద్రుఁ డాత్రతోఁ
దన దయఁగోరు మా మతులఁ దద్దయుఁ దానెపు డాలకించునోః
ఘనతర హర్మ్యవీథులను గ్రాలెడు ఋత్విజు మంత్ర సంతతిన్
విని విని మా కొసంగ నగు విత్తము పూజలఁ జేయు వేళలన్ ॥ 107

(2,3) సీ॥ శక్రుండు దివమును శాశ్వతంబుగ నిల్పునట్టులుగాఁ జేయఁగల్గు వాఁడెః
యాదిత్య రూపుఁడై యఖిల జీవాధారమగు వర్షమును నీయఁదగును వాఁడెః
భాస్కర రూపుఁడై పగటినిజేయుచు రాత్రి గతింపంగ రగులు వాఁడెః
గుఱ్ఱమునకు మంచి గోవును బుట్టించి పెక్కిండ్రు వైరుల నొక్కు వాఁడెః

* ఋషి విషయక విశేషములకై 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోట్ (331వ. పుట.) చదువుకొనవలయును. వ.గో.కృ. † సంస్కృత మూలప్రతులలో “ఇంద్రో విశ్వేదేవా వా” అని యుండఁగా శ్రీ నేమానివారు కేవలము “విశ్వే దేవతలు” మాత్రమే దేవతలుగా వ్రాసిరి. (చూఁడు. వ్రాతప్రతి 1వ సంపుటము 37వ. పుట) కాని తొలియనువాద పద్యములోనే యింద్రదేవుని శ్రీనేమానివా రుటంకించిరి. మిగిలిన పద్యములలోఁ గూడఁ బెక్కింట నింద్రవాచక పదములు ప్రయోగించిరి. విశ్వేదేవతలలో నింద్రుఁడొక్కఁడని శ్రీనేమానివారభిప్రాయపడి యుండనగును, కాని యింద్రుఁడు విశ్వేదేవతలలో నొకఁడు కానేరఁడు. వ.గో.కృ.

గీ॥ సేవకులకెల్ల[1] ధనమును జేర్చువాఁడె!, కల్యములనెల్ల వెలిఁగింప ఘనుఁడు వాఁడె!
పరమ భక్తులచేఁ బిల్వఁబడును వాఁడె!, వాఁడె! యింద్రుఁడు హరి వాఁడె! [2]బ్రహ్మవాఁడె!॥ 108

(4) గీ॥ సోమముం ద్రావుటంజేసి శోభనంది, ఫణి హృతంబగు గోతతిఁ బట్టుకొనుచు
నంగిరస్సున కొసఁగితి రయ్యలార!, యుపకృతికి[3] మరల నుపకృతి [4]యుచితమెగద! ॥ 109

(5) ఉ॥ వేగము కార్య మెల్ల నెఱవేర్చెడు నీకు శుభంబు భూమియుం
ద్యాగముతోడ హవ్య సముదాయము నిచ్చినయప్పు డింద్రుఁడా
సాగు ధనంబుకంటెఁ గడుఁ జక్కని పాల నొసంగు[5]నప్డు తా
నేగుచు వైరి సద్మముల కింపుగఁ దల్పులు [6]తీయఁడే త్వరన్ ॥ 110

(6) చ॥ అరులకుఁ జిక్కకుండ మము నాదరవృత్తిని జూఁచుగాక నా
సురపతి వాఁడె వెల్గెడును, సూర్యునిలాగు నుషస్సుచెంత నా
సురపతి హవ్యపూరముల సోముని దృప్తునిగా నొనర్చు మ
మ్మరమరలేక కావఁడఁటె యందఱి వైరుల గర్వ మాపుచున్ ॥ 111

(7) చ॥ రవికిరణోద్ధ మేఘములు రాణ సువృష్టిని నీయ నుండగాఁ
బవిధరుఁ డన్ని విఘ్నములు పంతముతో నవరించు నాతఁడే
రవిఁగ వెలుంగుచుండ నవిరామముగా నగు కర్మలన్ని[7] యు
త్సవమున గోగణాధికము సాగుచు నుండు నరణ్య భూమికిన్ ॥ 112

(8) గీ॥ శోభలం బొందుచుండెడు సోమరసముఁ, దీయుచున్నాము నీకయి దివిజనాథ!
నీవు ద్రావినపిమ్మట నీతురంగ, ములకుఁ ద్రావఁగ నీయుము బలముగల్గ ॥ 113

(9) ఉ॥ కావఁదలంచి కుత్సమునిఁ గాఱియఁబెట్టెడు రాక్షసాధముం
దేవల నున్న వానికయి యేగుచుఁ బిమ్మట బుజ్వు చెంతకుం
బోవుచు వాని వజ్రమును బొంది యయోమయమైన దానిచేఁ
జావఁగ [8]మొత్తలేదె! బహు సాహసవృత్తిని రాక్షసాధమున్ ॥ 114

1. "సేవకులకెల్ల దనమును" అని వ్రా.ప. పాఠము ధనమును అని వ్రాయుటకుఁ బొరపాటున "దనమును" అని వ్రాసియుం డనగునను దృష్టితో సవరింపఁ బడినది. కాని సేవకులకు, ఎల్లదనమును = పరిమితమైన హద్దును. వాఁడే చేర్చునని కూడ నర్థము చెప్పవచ్చును. అనఁగా సేవకులందఱును దమతమ హద్దులనుండి ప్రవర్తించునట్లు చేయువాఁడు వాఁడేయని భావము. ఏ యర్థము చెప్పవలయునన్నను సంస్కృతమూలములో సముచితమైన యాధారభూతమగు పదప్రయోగము మృగ్యము. వ.గో.కృ. 2. బ్రహ్మవాఁడే (వ్రా.ప్ర.పా. గణభంగము) 3. ఈ పాదములో బంచలఘుగణ మింద్రగణమునకుమారుగాఁ బ్రయోగింపఁబడినది. వ.గో.కృ. 4. యుచితముగద (వ్రా.ప్ర.పా.) 5. నప్పుడే యేగుచు (తొ.పా.) 6. తీయవే హరీ (తొ.పా.) 7. కర్మలన్నియుం। గవితతిఁ బోవుచుండుఁ గద కట్టెల వార లరణ్య భూమికిన్ (తొ.పా.) 8. మొత్తలేదెబలు రి సాహస (తొ.పా. గణభంగము)

(10) క॥ తొల్లి తమోరూపంబున, బల్లిదుఁడగు రాక్షసుండు భాస్కర దేవున్
మెల్లఁగ నాచ్ఛాదింపఁగ, [1]నుల్లమలర వానిఁగొట్టి యుండరె మీరల్‌! ॥ 115

(11) [2]ఉ॥ వృత్రవధాది కర్మముల విశ్రుతిఁగాంచిన వానిఁ [3]జూఁచుచున్
జిత్ర బలాఢ్య రోదసి విచిత్రముగా నతితుష్టిఁ జెందె నే
కుత్రిమ భావముంగనక కుచ్చిత వృత్రుని వజ్ర ధారచే
మిత్రుల మేలుకై దునిమె మేఘరథుండు విశాల బుద్ధితోన్ ॥ 116

(12,13,14) సీ॥ వాయు వేగముగల్గు వాజుల నెక్కుచు ర మ్మిచ్చటికి లోక రక్షకుండ!
శుక్రుఁ డిచ్చిన యట్టి శుద్ధ వజ్రంబును సానపెట్టుము వేగ శక్రదేవ!
సూర్య రూపంబున శోభ లందెడు యాన హయమునె యెక్కుమో! యమరనాథ!
తొంబది నదులను దొందరగా దాఁటి కర్మము కలిఁగింపు ఘనయశుండ!
గీ॥ కష్టతరమైన దారిద్ర్య కలననుండి, పాపములనుండి యిప్పుడు ప్రాప్తమైన
యుద్ధములనుండి తొలఁగించి యిద్ధమైన, ధనము మొదలగు వానిని దప్ప కిమ్ము ॥ 117

(15) గీ॥ తఱగకుండ నుండు తావకానుగ్రహ, ముండుఁగాక[4] నన్నముండుఁగాక
విన్నుఁ బొగడునట్టి నియతాత్ము లొందుత, పుత్ర పౌత్ర సుఖము [5]పూర్ణరీతి ॥ 118

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సఙ్గమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన శ్రీ భగవత్పాదారాధక
వేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
బ్రథమాష్టకమున నష్టమాధ్యాయము
సమాప్తము
ప్రథమాష్టకము సమాప్తము

---

1. మెల్లగ బరిమార్చి వాని మెప్పులు గనవే! (తా.పా.) యుల్లమలర (వ్రా.ప్ర.పా.) 2. వ్రాతప్రతిలోఁ బొరపాటున "చ" అని చంపక మాలగాఁ బేర్కొనఁ బడినది. (చూఁడు 1వ సంపుటము. 41 పుట) 3. జూఁచిబిల్ (తా.పా.) 4. యన్నముండుఁ గాక (వ్రా.ప్ర.పా.) 5. పూర్ణముగను (తా.పా.)

# సములాల

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

### ద్వితీయోఽష్టకః—ప్రథమోఽధ్యాయః

### సూక్తమ్ — 122

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః*

దేవతా—విశ్వేదేవాః

ఛందః—త్రిష్టుప్, 5-6 విరాడ్ రూపా†

(1) ప్ర వః పాన్తం రఘుమన్యవోఽన్ధో యజ్ఞం[1] రుద్రాయ [2]మీళ్హుషే భరధ్వమ్ ।

దివో అస్తోష్యసురస్య వీరైరిషుధ్యేవ మరుతో రోదస్యోః ॥ 1

(2) పత్నీవ పూర్వ హూతిం వావృధధ్యా ఉషాసానక్తా పురుధా విదానే ।

స్తరీర్నాత్కం వ్యుతం వసానా సూర్యస్య శ్రియా సుదృశీ హిరణ్యైః ॥ 2

---

* ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (331వ పుట) చూచునది. వ.గో.కృ.

† కొందఱి మతమున నసలీ సూక్త మంతయుఁ త్రిష్టుప్ ఛందయుతమే. వ.గో.కృ. 1. యజ్ఞ (వా.ప్ర.) 2. మీళహూషే (వా.ప్ర.) మీఢ్షుషే (సా.మా.)

(3) మమత్తు నః పరిజ్మా వసర్హా మమత్తు వాతో అపాం వృషణ్వాన్ ।
శిశీతమిన్ద్రాపర్వతా యువం నస్తన్నో విశ్వే వరివస్యన్తు దేవాః ॥ 3

(4) ఉత త్యా మే యశసా శ్వేతనాయై వ్యన్తా పాన్తౌశిజో హువధ్యై ।
ప్ర వో నపాతమపాం కృణుధ్వం ప్ర మాతరా రాస్పినస్యాయోః ॥ 4

(5) ఆ వో రువణ్యుమౌశిజో హువధ్యై ఘోషేవ శంసమర్జునస్య నంశే ।
ప్ర వః పూష్ణే దావన ఆఁ అచ్ఛా వోచేయ వసుతాతిమగ్నేః ॥ 5

(6) శ్రుతం మే మిత్రావరుణా హవేమోత శ్రుతం సదనే విశ్వతః సీమ్ ।
శ్రోతు నః శ్రోతురాతిః సుశ్రోతుః సుక్షేత్రా సిన్ధురద్భిః ॥ 6

(7) స్తుషే సా వాం వరుణ మిత్ర రాతిర్గవాం శతా పృక్షయామేషు పజ్రే ।
శ్రుతరథే[1] ప్రియరథే దధానాః సద్యః పుష్టిం నిరున్ధానాసో అగ్మన్ ॥ 7

(8) అస్య స్తుషే మహిమఘస్య రాధః సచా సనేమ నహుషః సువీరాః ।
జనో యః పజ్రేభ్యో వాజినీవానశ్వావతో రథినో మహ్యం సూరిః ॥ 8

1. శ్రుతర్థే (వా.ప్ర.)

(9) జనో యో మిత్రావరుణావభిధ్రుగపో న వాం సునోత్యక్ష్ణయాధ్రుక్ ।
స్వయం స యక్ష్మం హృదయే ని ధత్త ఆప యదీం హోత్రాభిరృతావా ॥ 9

(10) స వ్రాధతో నహుషో దంసుజూతః శర్ధస్తరో నరాం గూర్తశ్రవాః ।
విసృష్టరాతిర్యాతి బాహ్వా[1]సృత్వా విశ్వాసు పృత్సు సదమిచ్ఛూరః ॥ 10

(11) అధ గ్మన్తా నహుషో హవం సూరేః శ్రోతా రాజానో అమృతస్య మన్ద్రాః ।
నభోజువో యన్నిరవస్య రాధః ప్రశస్తయే మహినా రథవతే ॥ 11

(12) ఏతం శర్ధం ధామ యస్య సూరేరిత్యవోచన్ దశతయస్య నంశే ।
ద్యుమ్నాని యేషు వసుతాతీ రారన్ విశ్వే సన్వన్తు ప్రభృథేషు వాజమ్ ॥ 12

(13) మన్దామహే దశతయస్య ధాసేర్ద్విర్యత్ పఞ్చ బిభ్రతో యన్త్యన్నా ।
కిమిష్టాశ్వ ఇష్టరశ్మిరేత ఈశానాసస్తరుష ఋఞ్జతే నౄన్ ॥ 13

(14) హిరణ్యకర్ణం మణిగ్రీవమర్ణస్తన్నో విశ్వే వరివస్యన్తు దేవాః ।
అర్యో గిరః సద్య ఆ జగ్ముషీరోస్రాశ్చాకన్తూభయేష్వస్మే ॥ 14

(15) చత్వారో మా మశర్శారస్య [3]శిశ్వస్త్రయో రాజ్ఞ ఆయవసస్య జిష్ణోః ।
రథో వాం మిత్రావరుణా దీర్ఘాప్సాః స్యూమగభస్తిః సూరో నాద్యౌత్ ॥ 15

1. బాళహ (వ్రా.ప్ర.) బాళ్హ (సా.మా.) 2. విశ్వప్స్రయో (వ్రా.ప్ర.)

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ద్వితీయాష్టకము—ప్రథమాధ్యాయము

### సూక్తము—122

ఋషి—కక్షీవంతుఁడు *

దేవత—విశ్వేదేవతలు†

(1) మ॥ ఘన తూణీరగబాణ జాల మరులన్ ఖండించు చందంబునం
బనిమై నాసుర మెల్లఁగొట్టెనుగదా! భవ్యాత్ముఁడౌ రుద్రుఁ [1]డా
తని కన్నంబు నొసంగి పూజ లిడుఁడీ! ధన్యాత్ములారా! జగం
బున నున్నట్టి మరుద్గణాధిపులకుం బోనంబు నందీయుఁడీ! ॥ 1

(2,3) సీ॥ మగని పిల్పును విని మగువ వచ్చెడు మాడ్కి— రం డిచ్చటకు దిన రాత్రులార!
సూర్యునివలె [2]స్వర్ణశోభల విలసిల్లి ర ఝ్ముషస్సౌభాగ్య రమణి తిలక!
గార్హ పత్యాదుల యర్హ రూపము లొంది దయచేయు మిచటకుఁ దరణి దేవ!
వృష్టి జలాదుల వృద్ధినిఁజేయుచుఁ గలిఁగించుమా ప్రీతి గాలి వేల్పు!
గీ॥ యింద్ర పర్జన్యులార! [3]మా యిద్ధమతిని, నిర్మలంబుగఁ జేయుఁడు నియత బుద్ధి
దేవతోత్తములార! మా దివ్యనుతుల, వినుచు నన్న మొసంగుఁడు వివిధగతుల ॥ 2

(4) శా॥ కక్షీవంతుఁడ నౌశిజుండనగు నేన్ గార్యార్థినై భక్తితో
దీక్షం బూని పఠించు సంస్తవములన్ దివ్యాశ్వు లెంతేనియున్
[4]సుక్షాంతింగొని యాలకించుటకు నే సూచింతుఁ బూజావిధిన్
పాక్షాదగ్ని నహర్నిశంబు విలసచ్చారిత్రకుల్ వేడరే! ॥ 3

* ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (331వ పుట) చూడనగును. వ.గో.కృ.

† దేవత విషయమై తక్కినచోట్లలోవలెఁగాక యిక్కడ వ్రాతప్రతిలో (2వ సంపుటము. 3 పుట) "విశ్వేదేవత" యని యేకవచన రూపమే వ్రాయఁబడినది. ఇది సరికాదు. వ.గో.కృ.

1. డా, తనికిన్ భక్తమునిచ్చి (తొ.పా.) 2. రుక్మశోభల (తొ.పా.) 3. మా హీనమతిని (వ్రా.ప్ర.పా.) అమూలకము ననర్థకముః వ.గో.కృ. 4. కాంక్షన్ శ్రోత్రములందు నిల్పుటకునై (నే) గల్పింతుఁ బూజావిధిన్ (తొ.పా.)

(5) గీ॥ పాండు రోగోపశాంతికై బ్రహ్మవాది, నివలె యుష్మద్గుణంబుల స్తవముఁ జేతు
నిష్ట ఫలదాతృ పూష! సమిద్ధవహ్నిఁ, గక్షీవంతుఁడ నగు నేను గరము తలఁతు ॥ 4

(6) గీ॥ మిత్రుఁడా! *వరుణదేవుఁడ! మీర లస్మ, దీయ నుతి నాలకింపుఁ డమేయ ధనము
గలుఁగు సింధువు భూములఁ గరము తడుప, సాగి వచ్చునుగాక మా స్తవము వినుచు ॥ 5

(7) గీ॥ అన్నదాన మొనర్చుచు యాగములను, జేయుటకు నాల నొసఁగుఁ డమేయ గో గ
ణంబులకుఁ బుష్టినీయ ముదంబుతోడ, మీర [1]లేతెంచెదరుగాక మిత్ర! వరుణ! ॥ 6

(8) క॥ కామము రథాన్న ధనములఁ, గామింప నొసంగుదేవ! కార్యార్థులమై
నీమముగ మిమ్ముఁ బొగడిన, భూమిపయిన్ మాకు సర్వ భూతి కలుఁగదే! ॥ 7

(9,10) సీ॥ ఎవఁడు మిమ్ముగుఱించి యిష్టి నొనర్పక యన్యుల యిష్టికై నరుఁగువాఁడొ!
యెవఁడు సోమరసంబు సేవగించుచు మీకు సిద్ధముఁజేయక చెలఁగువాఁడొ!
యెవఁడు మీ స్తవముల నింపారఁ గూర్పక యన్యస్తుతు లొనర్చి యలరువాఁడొ!
యెవఁడు మిమ్ముల వీఁడి హీనులకై చాల సేవావిధులనెల్లఁ జేయువాఁడొ!
గీ॥ యట్టి మూర్ఖుని మాన సాభ్యంతరములు, వ్యాధితోఁ గూడికొని యుండు, నటులుగాక
యజ్ఞములఁ జేయువాడు నిరంతరంబు, దాత, వీరుఁడు, లోక విఖ్యాతుఁడగును ॥ 8

(11) గీ॥ ఖేచరద్రాజ వరులార! యేచి మీర, లస్మదీయ సదాహ్వాన మధిగమించి
దీన యజమాన నుతులెల్లఁ దిరముఁ గలుఁగఁ, బొగడుటకు రండు వేవేగఁ బూర్ణమతిని ॥ 9

(12) మ॥ యజమానుండు దశేంద్రియంబులకు నౌ నన్నంబులన్ [2]గోరుచున్
భజమానాపరభక్త సంతతికినై భక్తంబుఁ [3]గాంక్షించినన్
సుజనుల్ మెచ్చఁగ నీయనున్న దివిజుల్ చోద్యాన్నముం దెచ్చి మీ
విజయేష్టి క్రియలందు సద్బలము సద్వీర్యంబు మా కీయరే! ॥ 10

(13) గీ॥ అన్నముంగొని యధ్వర్యుఁ డగ్ని వేడు, దేవతలఁ గొల్చి దివిజారిఁ ద్రెవ్వఁగలము
ఇష్టరశ్మియు నిష్టాశ్వుఁ డేమిచేయఁ, గలరొ! చూచెద మిప్పుడే! ఘనుల మగుచు ॥ 11

(14) క॥ నుతియించు మా స్తవంబుల, మతితోఁ జెవిఁబెట్టు రూపమతులు గల సుత
ప్రతతి నొసంగుత మమరులు, తత ఫలముల హవ్యములను దప్పక యిడుతన్ ॥ 12

(15) క॥ యవ సమ శర్మారజు ల, త్యవమతులై [4]దీక్షితుండ నౌ ననుఁ జెరుపన్
రవముం జేయుచు నుండిరి, దివిజులు ! మీ రథము వారి దెసకుం గొనుఁడీ! ॥ 13

* ఇక్కడ "మిత్రుఁడ! వరుణ" అని యింద్రగణమగు "నలము" ప్రయోగింపఁగల్గి యుండియు శ్రీ నేమానివారు "మిత్రుఁడా! వరుణ" యని "భలము" ప్రయోగించుట విశేషము. వ.గో.కృ.

1. మీరువత్తురుగాకయో మిత్ర! వరుణ (తొ.పా.) 2. యాచింపుచున్ (తొ.పా.) 3. గాంక్షించుచో (తొ.పా.) 4. కక్షివంతుఁడగు ననుఁ జెరుపన్ (తొ.పా.)

## సూక్తమ్ 123

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః*

దేవతా—ఉషాః

ఛందః—త్రిష్టుప్

(1) పృథూ రథో దక్షిణాయా అయోజ్యైనం దేవాసో అమృతాసో అస్థుః ।
కృష్ణాదుదస్థాదర్యా౩ విహాయాశ్చికిత్సన్తీ మానుషాయ క్షయాయ ॥ 16

(2) పూర్వా విశ్వస్మాద్ భువనాదబోధి జయన్తీ వాజం బృహతీ సనుత్రీ ।
ఉచ్చా వ్యఖ్యద్ యువతిః పునర్భూరోషా అగన్ ప్రథమా పూర్వహూతౌ ॥ 17

(3) యదద్య భాగం విభజాసి నృభ్య ఉషో దేవి మర్త్యత్రా సుజాతే ।
దేవో నో అత్ర సవితా దమూనా అనాగసో వోచతి సూర్యాయ ॥ 18

(4) గృహంగృహమహనా యాత్యచ్ఛా దివేదివే అధి నామా దధానా ।
సిషాసన్తీ ద్యోతనా శశ్వదాగా దగ్రమగ్రమిద్ భజతే వసూనామ్ ॥ 19

(5) భగస్య స్వసా వరుణస్య జామిరుషః సూనృతే ప్రథమా జరస్వ ।
పశ్చా స దఘ్యా యో అఘస్య ధాతా జయేమ తం దక్షిణయా రథేన ॥ 20

* ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్ నోటు (331వ పుట) చూచునది. వ-గో.కృ.

(6) ఉదీరతాం సూనృతా ఉత్ పురంధీరుదగ్నయః శుశుచానాసో అస్థుః ।
స్పార్హా వసూని తమసాపగూహ్ళా[1] విష్కృణ్వన్త్యుషసో విభాతీః ॥ 21

(7) అపాన్యదేత్యభ్యగన్యదేతి విషురూపే అహనీ సం చరేతే ।
పరిక్షితోస్తమో అన్యా గుహాకరద్యౌదుషాః శోశుచతా రథేన ॥ 22

(8) సదృశీరద్య సదృశీరిదు శ్వో దీర్ఘం సచన్తే వరుణస్య ధామ ।
అనవద్యాస్త్రింశతం యోజనాన్యేకైకా క్రతుం పరి యన్తి సద్యః ॥ 23

(9) జానత్యహ్నః ప్రథమస్య నామ శుక్రా కృష్ణాదజనిష్ట శ్వితీచీ ।
ఋతస్య యోషా న మినాతి ధామాహరహర్నిష్కృతమాచరన్తీ ॥ 24

(10) కన్యేవ తన్వా౩ శాశదానాగ్ం ఏషి దేవి దేవమియక్షమాణమ్ ।
సంస్మయమానా యువతిః పురస్తాదావిర్వక్షాంసి కృణుషే విభాతీ ॥ 25

(11) సుసంకాశా మాతృమృష్టేవ యోషావిస్తన్వం కృణుషే దృశే కమ్ ।
భద్రా త్వముషో వితరం వ్యుచ్ఛ న తత్ తే అన్యా ఉషసో నశన్త ॥ 26

(12) అశ్వావతీర్గోమతీర్విశ్వవారా యతమానా రశ్మిభిః సూర్యస్య ।
పరా చ యన్తి పునరా చ యన్తి భద్రా నామ వహమానా ఉషాసః ॥ 27

1. గూళహా (బ్రా.ప్ర.) గూళ్హా (సా.మా.)

(13) ఋతస్య రశ్మిమనుయచ్ఛమానా భద్రంభద్రం క్రతుమస్మాసు ధేహి ।

ఉషో నో అద్య సుహవా వ్యుచ్ఛాస్మాసు రాయో మఘవత్సు చ స్యుః ॥ 23

### †సూక్తము—123

ఋషి—దీర్ఘతముని పుత్రుఁడు కక్షీవంతుఁడు *

దేవత—ఉషస్సు (ఉషోదేవత)

(1) చ॥ అరదము ముందు వాజి చయ మప్పుడె పూన్చిరి దానిపై మహా
సుర లుపవిష్టు లయిరి కడు శోభన కర్మల కెల్లఁ బోవఁగా
నరనుతః కల్యదేవి సవనస్థలికిం దిగుచుండె చూడుఁ డె
ప్పరసున నైనఁ జీఁకటులఁ బాఱఁగఁ ద్రోలుటకై క్షణంబులోన్ ॥ 14

(2) సీ॥ భువనంబునం గల భూత జాతముకంటె నేది మేల్కొను ముం దహీన గతిని
సర్వ ప్రపంచంబు సరిగ వెల్గెడునట్టు లెయ్యది చేయు నహీన గతిని
శాశ్వత యౌవన సంపత్తి నొప్పుచు నెయ్యది వెల్గు నహీన గతిని
నమదిన ముదయించి యధిక తరంబుగ నేది రాజిల్లు నహీన గతిని
గీ॥ అట్టి కల్యాధిదేవత యస్మదీయ, మగు పిలుపు నాలకించి మా యజ్ఞశాల
లందు జరిగెడు కార్యము లధిగమింప, వచ్చుచున్నది చూడుఁడీ! మెచ్చునటుల ॥ 15

(3) గీ॥ స్వ ప్రకాశంబుచేఁ గల్య! సకల జనులఁ, బాలనము చేయుచున్నావు పరమ పురుషుఁ
డిష్టులకు సూర్యదేవుఁ డహీన గతిని, వచ్చునట్టులు చేయుత! వరదుఁడగుచు ॥ 16

(4) క॥ ప్రతి యజ్ఞగృహమునకు నీ, వతి కాంతింగలుఁగఁజేసి యంతట వెలుఁగున్
సతతముఁజేర్చు నుషస్సా!, వ్రత హవ్యము లానుచుంటి వనితా మణివై ॥ 17

(5) గీ॥ రవికిఁ జెల్లెల వగుట విరాజమాన, నుతులు పొందిన దానవై యతివ! వినుము
దుఃఖములఁ గల్గఁజేసెడు దుష్టు మేము, గెలువఁగలమమ్మ! తావక కృపనుజేసి ॥ 18

† ఇక్కడ 18వ అనువాకము ప్రారంభమైనట్లు వ్రాతప్రతిలో (2వ సంపుటము. 7వ పుట) వ్రాయఁబడియున్నది. ఇది ప్రమాదము కానోపు. వ.గో.కృ.

* ఋషికి సంబంధించిన విశేషములకై తెలుఁగు 116వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (331వ పుట) చదువుకొననగును. వ.గో.కృ.

(6) ఉ॥ పెక్కగు రూపముల్ గలిఁగి పెంపు వహించు నహస్సు రాత్రియుం
దక్కక సంచరించు నటఁ దామసి పోవు నహస్సు వచ్చు నం
దొక్కటి యంధకారమును నోపి యొనర్చును దైన భాగ మౌ
నొక్క యుషోఽంగనామణి మహోత్తమ యానము నెక్కి వెల్గెడిన్ ॥ 19

(7) *క॥ విషురూప దివారాత్రులు,నుషోదయ మ్మమల మగును నుజ్జ్వల సమమై
విషమ స్థితి గతి నెఱుఁగని, ఋష తుల్యా విధి వెలుంగుఁ జదలున నెపుడున్ ॥ 20

(8,9) సీ॥ ఈ దినంబులయందు [1]నెసఁగు ప్రత్యూషంబు లెంత వెలుంగు ననంతయందు
నా దినంబులయందు నంతయు వెలుఁగును మఱియు సూర్యస్థానమైన మేరు
పర్వతముం జుట్టి బహు యోజనంబులు తిరుగుచుఁ దిరుగుచు దీక్షతోడ
శంకలేకయె గొప్ప లంకాది భూభాగ ములకుఁ గర్మల నెల్లఁ గలుఁగఁజేసి
గీ॥ శ్వేత వర్ణముతోఁ బ్రకాశించి సర్వ, జనులకున్ సూర్యు రాకను జక్కఁదెలిపి
యజ్ఞవాటికఁ బొందుచు హవ్యములకు, బాధ కల్గింపకున్నవి [2]పరమశక్తి॥ 21

(10,11) సీ॥ కన్యకారత్నంబుకరణి వస్త్రము లేక శోభిల్లుచున్నావు శోభతోడ
స్పష్టంబుగాఁ నగపడకుండఁ బిమ్మటఁ గాన్పించుచున్నావు! కాంతితోడ
సొగసగు ప్రౌఢవై సూర్యప్రియుని గూడఁ బోవుచున్నావు విభూతితోడ
యువతివై ప్రియ సూర్యు[3]నుచిత సంతసముతోఁ దనియింపుచున్నావు తనువుతోడ
గీ॥ సర్వజన దర్శనార్థమై సరసరీతిఁ, గనఁబడెడునట్లు చేయుదుగాన నిన్ను
సంస్తుతించెద అందఱుఁ జాన! యితర, కల్యములు[4] తమముఁ బోఁగొట్టఁగలవె? చెపుమ॥ 22

(12,13) సీ॥ గుఱ్ఱముల్ గలవియు గోవులు గలవియు శాశ్వతంబుగ నుండఁజాలునవియు
నఖిల జనామోద మందుచు సుతులకుఁ బాత్రంబులై ఖ్యాతిఁ బఱఁగునవియు
సూర్యరశ్ములఁ గూడి శోభలఁ జీఁకట్ల వారించునవి వేగఁబాఱునవియు
నాకలోకము నుండి రాకలు సేయుచు నంధకారంబుల నడఁచునవియు
గీ॥ నగు నుషస్సుల భక్తితో సహ రహంబుఁ, బిలుచుచున్నాము మేము మా పిలుపు వినుచుఁ
గర్మములఁ జక్క నెరవేర్పఁ గదలివచ్చి, [5]యయ్యవి ధనంబు మాకిచ్చి యమరుఁగాక॥ 23

* లుప్తభాగ పూరణకర్త- వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

ఆంధ్రానువాదము వ్రాతప్రతిలో (2వ. సంపుటము 7-9-11 పుటలు) 123వ. సూక్తములోని ఋగనువాద పద్యములలోఁ బ్రమాదవశమున 4వ. ఋగనువాద పద్యము నిర్దేశింపఁబడలేదు. 4,5,6, ఋగనువాద పద్యములు పొరపాటున 5,6,7 ఋగనువాద పద్యములుగా నిర్దిష్టములైనవి. ప్రమాదవశమున శ్రీ నేమానివారు 7వ. ఋక్కు ననువదింపక విడచిరి· కావున నేను దీని నాంధ్రీకరించి లుప్తభాగ పూరణ మొనర్చితిని. వ.గో.కృ.

1. నిద్ధప్రత్యూషంబు (తొ.పా. గణభంగము) వ.గో.కృ. 2. పరమప్రీతి (తొ.పా.) 3. నుచితమానవ్వుల (తొ.పా.) 4. ఈ నాల్గవ పాదములో నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయోగితమైనది. వ.గో.కృ. 5. "ధనము నయ్యవి మా కిచ్చి తనరుఁగాక" అని తొలుత రచయిత వ్రాయఁదలఁచినట్లు కనిపించును. (చూ. 2వ సంపుటము. 11వ పుట) వ.గో.కృ.

## సూక్తమ్—124

ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః†

దేవతా—ఉషాః

ఛందః—త్రిష్టుప్

(1) ఉషా ఉచ్ఛన్తీ సమిధానే[1] అగ్నా ఉద్యన్త్సూర్య ఉర్వియా జ్యోతిరశ్రేత్ ।
దేవో నో అత్ర సవితా న్వర్థం ప్రాసావీద్ ద్విపత్ ప్ర చతుష్పదిత్యై ॥ 29

(2) అమినతీ దైవ్యాని వ్రతాని ప్రమినతీ మనుష్యా యుగాని ।
ఈయుషీణాముపమా శశ్వతీనామాయతీనాం ప్రథమోషా వ్యద్యౌత్ ॥ 30

(3) ఏషా దివో దుహితా ప్రత్యదర్శి జ్యోతిర్వసానా సమనా పురస్తాత్ ।
ఋతస్య పన్థామన్వేతి సాధు ప్రజానతీవ న దిశో మినాతి ॥ 31

(4) ఉపో అదర్శి శున్ధ్యువో న వక్షో నోధా ఇవావిరకృత ప్రియాణి ।
అద్మసన్న ససతో బోధయన్తీ శశ్వత్తమాగాత్ పునరేయుషీణామ్ ॥ 32

(5) పూర్వే అర్ధే రజసో అప్త్యస్య గవాం జనిత్ర్యకృత ప్ర కేతుమ్ ।
వ్యు ప్రథతే వితరం వరీయ ఓభా పృణన్తీ పిత్రోరుపస్థా ॥ 33

† ఋషి విశేషవిషయములకై తెలుఁగు 116 వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (331 వ పుట) చూచునది. వ.గో.కృ.

1. సమిధానో (వ్రా.ప్ర.)

(6) ఏవే దేషా పురుతమా దృశే కం నాజామిం న పరి వృణక్తి జామిమ్ ।

అరేపసా తన్వా౩ శాశదానా నార్భాదీషతే న మహో విభాతీ ॥ 34

(7) అభ్రాతేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగివ సనయే ధనానామ్ ।

జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ ని రిణీతే అప్సః ॥ 35

(8) స్వసా స్వస్రే జ్యాయస్యై యోనిమారైగపైత్యస్యాః ప్రతిచక్ష్యేవ ।

వ్యుచ్ఛన్తీ రశ్మిభిః సూర్యస్యాఞ్జ్యఙ్క్తే సమనగా ఇవ వ్రాః ॥ 36

(9) ఆసాం పూర్వాసామహసు స్వసౄణామపరా పూర్వామభ్యేతి పశ్చాత్ ।

తాః ప్రత్నవన్నవ్యసీర్నూనమస్మే రేవదుచ్ఛన్తు సుదినా ఉషాసః ॥ 37

(10) ప్ర బోధయోషః పృణతో మఘోన్యబుధ్యమానాః పణయః ససన్తు ।

రేవదుచ్ఛ మఘవద్భ్యో మఘోని రేవత్ స్తోత్రే సూనృతే జారయన్తీ ॥ 38

(11) అవేయమశ్వైద్ యువతిః పురస్తాద్ యుంక్తే గవామరుణానామనీకమ్ ।

వి నూనముచ్ఛాదసతి ప్ర కేతుర్గృహంగృహముప తిష్ఠాతే అగ్నిః ॥ 39

(12) ఉత్ తే వయశ్చిద్ వసతేరపప్తన్ నరశ్చ యే పితుభాజో వ్యుష్టౌ ।

అమా సతే వహసి భూరి వామముషో దేవి దాశుషే మర్త్యాయ ॥ 40

(13) ఆస్తోఢ్వం స్తోమ్యా బ్రహ్మణా మే ఽవీవృధధ్వముశతీ రుషాసః ।
యుష్మాకం దేవీరవసా సనేమ సహస్రిణం చ శతినం చ వాజమ్ ॥ 41

## సూక్తము—124

ఋషి—కక్షీవంతుఁడు*

దేవత—ఉషో దేవత

(1) చ॥ ఘనముగ నగ్నులన్ వెలుఁగఁ గల్పనఁ జేసి యుషస్సు సూర్య దే
వునివలెఁ గాంతి మండలముఁ బొందుచు నున్నది యాగ దీక్షఁ దో
చినవిధ మెల్ల విత్తమును జేర్చుచు సూర్యుఁడు మాకుఁ బ్రీతితో
మనుజ ధనంబుఁ గూడ ననుమానము లేక యొసంగుఁ గావుతన్ ॥ 24

(2) ఉ॥ దైవికమైన కర్మ తతి తప్పకఁ గూర్చుచు మానవాళికిన్
భూవలయంబులోనఁగల భూత పరిస్థితి కెల్ల యోగ సం
భావనయున్ వియోగమును బ్రౌఢిమతో దయచేయు బ్రత్యుషో
దేవత వెల్గుచుండె నతితీవ్ర [1]వికాసముతోడఁ జూడరే! ॥ 25

(3) గీ॥ దివమునంబుట్టి తూర్పున దివ్యతేజ, మంది భూత గణంబున కఖిల విధులఁ
గార్యములు కలుఁగు[2] విధమును గలుఁగఁ జేసి, తోఁచుచున్నది కల్య మతుల్య మగుచు ॥ 26

గీ॥ భార్యభర్తృ సుమార్గముంబట్టు టొప్పు, ననెడి ధర్మంబు బోధించు నతివ మాట్కిఁ
బైడి కొండకుఁ జుట్టు విభానుఁగూడి, దిగ్విభాగంబుఁ జేయుచుఁ దిరు[3]గుషస్సు ॥ 27

(4,5) సీ॥ ఘన కల్యదేవత యిన రశ్మితతియట్లు కడు దవ్వనంజూడఁబడుచు నుండె
సంయమి నోధస్సు స్వార్థమందినయట్లు భూతముల్ తేజస్సుఁ బొందుచుండెఁ
దన పుత్ర పౌత్రులఁ దల్లి లేపెడునట్లు జనులను మేల్కొల్పి జరుగుచుండె
నుపపతికై యేఁగి యొగి వచ్చు సతి యట్లు తెల్లవారఁగనె యేతెంచుచుండె
గీ॥ నంతటన్ వెల్గు నాకస మర్ధ మందుఁ, బుట్టి తేజస్సు దిశలకుఁ బొందఁజేసి
భూ గగన మధ్యమున నుండి పూర్ణమైన, దివ్యతేజస్సు నంతయుఁదేల్చుచుండె ॥ 28

* ఋషి విశేష విషయములకై తెలుఁగు ఋషికిచ్చిన 116వ సూక్తము క్రింది ఫుట్‌నోటు (331వ పుట) విషయము చూడనగును. వ.గో.కృ.
1. ప్రకాశముతోడ (తొ.పా. గణభంగభీతి). 2. ఇంద్రగణమునకుమారు "నలల"ము ప్రయుక్తమైనది. వ.గో.కృ. 3. తిరుగన్ + ఉషస్సు = తిరుగుషస్సు—దుస్సంధి.

(6) క॥ మనుజులకు దేవతాళికి, నను వగు సౌఖ్యమును జేసి యంచిత దేహం
బును ధరియించు చుషస్సతి, చిన పెద వస్తువుల వెల్గఁ జేయుచు నుండెన్ ॥ 29

(7) సీ॥ అతివ వస్త్రాదుల నందంగఁ గోరుచు, [1]జనకుని యొద్దకుఁజనెడు మాట్కి
[†]విధవ భర్తృధనంబు వేడుటకై రాజ, సభకుఁ దప్పక తాను జనెడు మాట్కి
[2]స్నాతయై ఋతుమతి ధౌతవస్త్రము గట్టి, [3]యతితుష్టిఁ బతి యొద్ద కరుగుమాట్కి
దంతకాంతిచ్ఛట నెంతయుఁజూపుచుఁ, బతి ప్రక్కకుంజేరు పడఁతి మాట్కిఁ
గీ॥ గల్యదేవత నైజ ప్రకాశ మహిమ, సూర్య భర్తను జేరుచు శోభతోడ
సర్వ వస్తు[4]ప్రపంచ విస్తార మెల్ల, వెల్గఁజేయుచునుండెను వివిధగతుల ॥ 30

(8) గీ॥ జ్యేష్ఠయగు కల్యదేవికిఁ [5]జెలియు నైన, రాత్రి యోనిని గల్పించి యాత్ర నరుగు
[6]నిట్లు పుట్టు నుషస్సతి యినుని కిరణ, మూలమునఁ జీఁకటులఁ గొట్టఁ జాలుచుండె ॥ 31

(9) గీ॥ అక్కసెల్లెండ్ర భావము నధిగమించి, యొకటి వేరొక దానిని నుచితరీతి
ననుసరించు చుషస్సు లత్యధిక ధనము, మాకు నొసఁగునుగాక సన్మాన [7]మెసఁగ ॥ 32

(10,11) సీ॥ నీకు హవిస్సుల నిత్య మిచ్చెడి మాకుఁ గర్మల నేవేళఁ గలుఁగ నిమ్ము
ధన లుబ్ధులై యాగ ధర్మముల్ సేయని శత్రువు[8]లందఱఁ జావనిమ్ము
హవ్యంబొసంగెడు యజమాను లెల్లెడ విత్తసమృద్ధితో వెలయనిమ్ము
సర్వ జనాళికి జరను [9]దప్పించుచు, నాయురారోగ్యంబు లందనిమ్ము
గీ॥ పూర్వదిక్కున నుదయించి పూజ్య! నీవు, చీఁకటింగొట్ట నగ్నులు చెలఁగి చెలఁగి
యఖిల యజమాన గృహములయందు నియతిఁ, [10]బ్రజ్వలిల్లుచునున్నవి ప్రకృతియందు ॥ 33

(12) క॥ ఎరకై తమవసతుల విడి[11], పరుగిడుచున్నవి సమస్త పక్షు లుషస్సా!
నరు లుచిత కర్మకై వడి, జరుగుచునున్నారు నీదు జన్మము గనుచున్ ॥ 34

గీ॥ యజ్ఞశాలా స్థలంబులయందునుండి, నీకు హవ్యము నర్పించు నిత్యకర్మ
పరులు భూరి ధనంబును బడయునట్లు, చేయుచున్నా వుషోదేవి! చిత్త మలర ॥ 35

(13) క॥ సూక్తద్వయంబుచేతం, బ్రోక్తము లౌ నుతుల నెల్లఁ బొందుచు మీరల్
రిక్తులగు మమ్ముఁగని యా, సక్తిమెయిన్ ధనము నిం డుషస్సతులారా! ॥ 36

1. జనకునిఁబ్రీతితోఁ జేరుమాట్కి (తొ.పా. యతిభంగము) వ.గో.కృ. † రాజస్థానములు, రాజసభలు నప్పటి యభియోగములు పరిష్కరించి న్యాయములను స్థాపించుచున్నను, గత భర్తృకలకు జీవనార్థమై ధనము నిప్పించుమని న్యాయస్థానములం దభియోగము దెచ్చుచున్నటులను నాచార మార్గ్యలలోఁ గలదు. (నే.వేం.న.శా.) 2. శుద్ధయై ఋతుమతి శుభ్ర వస్త్రముగట్టి (తొ.పా. స్నాతశబ్దమునకుఁ గేవల స్నానము చేయుటయని మాత్రమే కాక ఋతుస్నాత యనియు నర్థము వచ్చును. కావునఁ గేవల పరిశుభ్రార్థకమైన శుద్ధ శబ్ద ప్రయోగముగల యీ పాఠమును రచయిత సార్థకముగా సవరించెను. వ.గో.కృ.) 3. యతిప్రీతి (తొ.పా. గణభంగ భయము) 4. ప్రపంచపు (ఁజ) చక్కనెల్ల (తొ.పా.) 5. జిన్నదైన (తొ.పా.) 6. నిట్లు జన్మించు నుషస్సతి (తొ.పా.) నిట్లు పుట్టు నుషస్సతి (రచయిత సవరించిన యీ పాఠములోను దొలి పాఠములోను దద్ధర్మార్థక ద్రుత ప్రకృతిక శబ్ద ఉత్వసంధి దోషము కలదు. వ.గో.కృ.) 7. మెసఁగ (ప్రా.ప్ర.పా.) 8. లందఱుఁజావనిమ్ము (ప్రా.ప్ర.పా.) 9. జరనుగల్పించుచు (ప్రా.ప్ర.పా. వార్ధక్యము నిమ్మని కోరుట సరికాదు. వ.గో.కృ.) 10. ప్రజ్వరిల్లు (ప్రా.ప్ర.పా. "రలయోరభేదః" అని సూత్రమున్నను జ్వాలార్థమున "జ్వర" శబ్దప్రయోగ ముచితము కాదు. వ.గో.కృ.) 11. విడి = పీడి.

## సూక్తమ్—125

### ఋషిః—కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః*

### దేవతా—స్వనయస్య దానస్తుతిః

### ఛందః—త్రిష్టుప్, 4-5 జగతీ

(1) ప్రాతా రత్నం ప్రాతరిత్వా దధాతి తం చికిత్వాన్ ప్రతిగృహ్యా ని ధత్తే ।

తేన ప్రజాం వర్ధయమాన ఆయూ రాయస్పోషేణ సచతే సువీరః ॥ 42

(2) సుగురసత్ సుహిరణ్యః స్వశ్వో బృహదస్మై వయ ఇన్ద్రో దధాతి ।

యస్త్వాయన్తం వసునా ప్రాతరిత్వో [1]ముక్షీజయేవ పదిముత్సినాతి ॥ 43

(3) ఆయమద్య సుకృతం ప్రాతరిచ్ఛన్నిష్టేః పుత్రం వసుమతా రథేన ।

అంశోః సుతం పాయయ మత్సరస్య క్షయద్వీరం వర్ధయ సూనృతాభిః ॥ 44

(4) ఉప క్షరన్తి సిన్ధవో మయోభువ ఈజానం చ యక్ష్యమాణం చ ధేనవః ।

పృణన్తం చ పపురిం చ శ్రవస్యవో ఘృతస్య ధారా ఉప యన్తి విశ్వతః ॥ 45

(5) నాకస్య పృష్ఠే అధి తిష్ఠతి శ్రితో యః పృణాతి స హ దేవేషు గచ్ఛతి ।

తస్మా ఆపో ఘృతమర్షన్తి సిన్ధవస్తస్మా ఇయం దక్షిణా పిన్వతే సదా ॥ 46

* ఋషి విశేష విషయములకై తెలుగు 116వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (331వ పుట) చూచునది. వ.గో.కృ.

1. ముక్షో (వా.ప్ర.)

(6) దక్షిణావతామిదిమాని చిత్రా దక్షిణావతాం దివి సూర్యాసః ।

దక్షిణావన్తో అమృతం భజన్తే దక్షిణావన్తః ప్ర తిరన్త ఆయుః ॥ 47

(7) మా పృణన్తో దురితమేన ఆరన్ మా జారిషుః సూరయః సువ్రతాసః ।

అన్యస్తేషాం పరిధిరస్తు కశ్చిదపృణన్తమభి సం యన్తు శోకాః ॥ 48

## సూక్తము—125

### ఋషి—కక్షీవంతుఁడు *

### దేవత—దానదేవత†

(1) చ॥ స్వనయ సుదత్తనిష్కములఁ జయ్యన నందుచుఁ గక్షివంతుఁ డా
ధనమును దండ్రియొద్ద నిడఁ దత్పిత దీర్ఘతముండు దానిచేఁ
దనుజులఁ బెంచుకొం చల వదాన్యుఁడు నాకముఁచేరుఁగాక నం
చనయముఁ గోరి దీవనల నాత్రతఁ బల్కుచునుండెఁ జూడరే! ॥ 37

(2) చ॥ ‡ఖగములఁ గట్టు ద్రాటివలెఁ గాంచన వారముతో నెవండు నిన్[1]
దగ నెటుఁ బోవనీయకయె ధర్మగృహంబున గారవించెనో
సుగుణుఁడః యా నృపాలునకు సుందర గోగణ విత్తవృద్ధి న
త్యగణిత వాజి సంచయము నా యమరేశుఁడొసంగుఁగావుతన్ ॥ 38

(3) క॥ జనపతి యిచ్చిన ధనముం, గొని యాగ మొనర్చు నిన్నుఁ గోరికతీరన్
గనుగొందు ననుచు నుండఁగఁ,దనయుఁడ! వచ్చితివి నీవు ధన్యుఁడ వైతిన్ ॥ 39

* ఋషిగురించిన విశేషవిషయములకై 116వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (331వ పుట) చూచునది. వ.గో.కృ.

† ఈ సూక్తమునకు మామూలుగా దాన దేవత్వమునే ప్రాచీనులు పేర్కొనిరి. కాని సంస్కృత మూల వ్యాఖ్యలలోను నితరత్ర సైతము "స్వనయస్య దానస్తుతిః" అని విశేషముగఁ బేర్కొనఁబడెను. వ.గో.కృ. ‡ కక్షివంతుఁడు తెచ్చి యిచ్చిన ధనముతో సంతుష్టి నొందిన దీర్ఘతముఁడు స్వనయుఁడను రాజు నిట్లాశీర్వదించుచున్నాఁడు, (నే.వేం.న.శా.) 1. నిం దగ (ప్రా.ప్ర.పా.)

(4,5) సీ॥ సోమయాగముఁ జేయు సోమయాజి విశేష గోధనంబులతోడఁ గూడఁగలఁడు
సోమ యాగ మొనర్చ నీమము గలవాఁడు పాలిచ్చు గోవుల నేలఁగలఁడు
సోమము దీయఁగఁ గామించు మానవుఁ డిష్టార్థముల నెల్ల నీయఁగలఁడు
సోమయాగమునందు సోమ మందించెడు పురుషుఁడు జలమును బొందఁగలఁడు
గీ॥ హవ్యమున [1]నమరులను నెల్ల నాదరించు, పురుషుఁ డమరుల భావంబుఁ బొందఁగలఁడు
జనులఁ దృప్తులుగాఁ జేయఁజాలఁగలఁడు, విశ్వభూమి ఫలంబుల వెలయఁగలఁడు॥ 40

(6) గీ॥ గో హిరణ్యాది దక్షిణ గూడునట్టి, దానము లొనర్చు పురుషుఁడు ధన్యుఁ డగుచు
సూర్య సంబంధలోకమున్ జూరఁగొనుచుఁ, బూర్ణమగు నాయువును గూడఁ బొందఁగలఁడు॥ 41

(7) మ॥ హవి రాజ్యాదుల దేవతాతతికి నాహారంబుఁ గల్పించు మా
నవులే కాక సురాళికిన్ స్తుతుల నానందంబుఁ బుట్టించు మా
నవులుం గూడ సుఖింత్రు లోకమున నానారూప సంపత్తులన్
భువి హవ్యంబు నొసంగనట్టి మనుజుల్ పుణ్యాత్ము లెట్లౌదురో! ॥ 42

## సూక్తమ్—126

ఋషిః—1-5 కక్షీవాన్ దైర్ఘతమస ఔశిజః,* 6-స్వనయో† భావయవ్యః 7-రోమశా

దేవతా—1-6 స్వనయో† భావయవ్యః, 7-రోమశా†

ఛందః—త్రిష్టుప్- 6-7 అనుష్టుప్

(1) అమన్దాన్ త్స్తోమాన్ ప్ర భరే మనీషా సిన్ధావధి క్షియతో భావ్యస్య ।
యో మే సహస్రమమిమీత సవానతూర్తో రాజా శ్రవ ఇచ్ఛమానః ॥ 49

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణ ముపయోగింపఁబడినది. వ.గో.కృ.

* కక్షీవంత ఋషి విశేష విషయములకై తెలుఁగు 116వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (331వ పుట) చూచునది. వ.గో.కృ.

† ఈ ఋషి దేవతల విషయమై సాయన భాష్యయుక్త ప్రతిలోను, మాక్స్‌ముల్లర్ ప్రతిలోను గేవలము "భావయవ్యః" అని మాత్రమే యున్నది. కాని కొన్ని తదితర ప్రతులలో "స్వనయో భావయవ్యః" అని రెండు చోట్లను (ఋషులలోను—దేవతలలోను) గలదు. ఈ దృష్ట్యా "భావయవు"ని పుత్రుఁడైన "స్వనయుఁడు" ఋషికాఁగలఁడు. దేవత విషయములో భావయవుని పుత్రుఁడైన స్వనయుఁడనిగాని, "భావయవు"ఁడను ఋషి గుర్తించిన "స్వనయ"దేవుఁడనిగాని చెప్పుట కవకాశము కలదు. ఈ దృష్ట్యా ఋషి గణములోఁ బేర్కొనఁబడిన "స్వనయో భావయవ్యః" భావయవుని పుత్రుఁడు స్వనయుఁడనియేకాక "భావయవ" దేవుని గుర్తించిన స్వనయ ఋషియనియుఁ జెప్పవచ్చును. ఋషులు దేవతలు నొక్కటిగాఁ బేర్కొనఁబడిన ఋక్కుల యర్థము విషయమై వేదభాష్య కర్త లెవ్వరును యాస్కాదులు సైతముఁ బ్రత్యేక దృష్టితో నాలోచింపనేలేదు, అసలు వేదముల విషయమై యీ వ్యాఖ్యాతల కున్న యభిప్రాయములే వింతగొల్పును. అవాస్తవికములుగాఁ బ్రత్యక్ష ప్రమాణములై కన్పించును. ఈ సూక్తమునకు

(2) శతం రాజ్ఞో నాధమానస్య నిష్కాఞ్ఛతమశ్వాన్ ప్రయతాన్ త్సద్య ఆదమ్ ।

శతం కక్షీవాగ్ం అసురస్య గోనాం దివి శ్రవోఽజరమా తతాన ॥ 50

(3) ఉప మా శ్యావాః స్వనయేన దత్తా వధూమన్తో దశ రథాసో అస్థుః ।

షష్టిః సహస్రమను గవ్యమాగాత్ సనత్ కక్షీవాగ్ం అభిపిత్వే అహ్నామ్ ॥ 51

(4) చత్వారింశద్ దశరథస్య[1] శోణాః సహస్ర స్యాగ్రే [2]శ్రేణిం నయన్తి ।

మదచ్యుతః కృశనావతో అత్యాన్ కక్షీవన్త ఉదమృక్షన్త పజ్రాః ॥ 52

(5) పూర్వామను ప్రయతిమా దదే వస్త్రీన్ యుక్తాగ్ం అష్టావరిధాయసో గాః ।

సుబన్ధవో యే విశ్యా ఇవ వ్రా[3] అనస్వన్తః శ్రవ ఐషన్త పజ్రాః ॥ 53

(6) అగధితా పరిగధితా యా కశీకేవ జఙ్గహే ।

దదాతి మహ్యం యాదురీ యాశూనాం భోజ్యా శతా ॥ 54

1952లో నేను బరిశీలించిన యొక ప్రతిలో ఋషి "పురుచ్ఛేపః" అని ఏకైక ఋషి మాత్రమే పేర్కొనుట జరిగినది. 6వ ఋక్కునకుఁ గూడ దేవత "రోమశ"గా మాక్స్‌ముల్లర్ ప్రతిలోను మఱికొన్ని ప్రతులలోను బొరపాటునఁ బేర్కొనఁబడినది."సంభోగాయ ప్రార్థితో భావయవ్యః స్వభార్యాం రోమశామప్రౌఢేతి బుద్ధ్యా పరిహసన్నాహ" — అని సాయనాచార్యులు 6వ ఋగ్భాష్యములో వ్రాయఁగా దీని ననుసరించి "సంభోగ నిమిత్తమై పిలువఁబడిన భావయవ్యుఁడు స్వభార్యతోఁ బరిహాసముగఁ జెప్పు మాటయిది."— అని ఆరవ ఋక్కునకుఁ బూర్వము శ్రీ నేమానివారు పేర్కొనిరి. కాఁగా నారవ ఋక్కు భావయవ్యుని దనుట స్పష్టమె. కాని దీనిని బట్టి పరిశీలింప రోమశ తన పతియైన భావయవ్యుని సంభోగ నిమిత్తమై పిలిచినట్లుగా వర్ణించు మఱొక ఋక్కు తప్పక యుండి తీరవలయును. రోమశ పిలిచినట్లున్న ఋక్కు లేకుండఁగనే యామె పిలువని పిలుపునకు సమాధానముగ భావయవ్యుఁడు చెప్పినట్లున్న ఋక్కుండుట యసందర్భముగ నున్నది· కావున నీ సందర్భమునఁ బ్రస్తుతమున్న యారవ ఋక్కునకుఁబూర్వము రోమశ చెప్పిన మరొక ఋక్కు తప్పక యుండి యుండనగును. అది విలుప్తమై యుండును. కాఁగా భావయవ్యుఁడు పరిహాసముగాఁ బల్కిన ఋక్కు 7వదియై దానికి సమాధానముగా రోమశ చెప్పిన ఋక్కు అష్టమ ఋక్కుగా నిలుచును. అయిన నీ సూక్తములో మొత్త మెనిమిది ఋక్కులుండఁగా నసలైన ఆరవ ఋక్కు (రోమశ - సంభోగము నిమిత్తమై భావయవ్యుని నాహ్వానించినది) విలుప్తమై పోయినదని విస్పష్టముగాఁ దేలుచున్నది. (చూడు. పీఠిక) మరికొన్ని విశేషములకై (374వ పుటలో) తెలుఁగు 126 సూక్తము ఋషి దేవతల కిచ్చిన ఫుట్‌నోటు చూచునది. వ.గో.కృ.

1. దశరథశ్య (వా.ప్ర.) 2. శ్రోణిం (వా.ప్ర.) 3. ఇవవా(వా.ప్ర.)

(7) ఉపోప మే పరా మృశ మా మే దభ్రాణి మన్యథాః ।
సర్వాహమస్మి రోమశా గన్ధారీణామివావికా ॥ 55

## సూక్తము—126

†ఋషి—1-5 కక్షీవంతుఁడు, 6, భావయవ్యుఁడు 7, రోమశ బ్రహ్మవాదిని-
†దేవత—1-6 భావయవ్యుఁడు 7 రోమశ

(1) క॥ తతసోమ యాగఫలమున్, సతతముఁ బడయంగఁ గోరి చాలిన ధనమున్
మతి పూర్వకముగ నాకున్, వితరణముం జేయు రాజు వెలయుత భువిలోన్ ॥ 43

(2) క॥ స్వనయుఁడు నేఁ గోరఁగనే, ధనము ప్రసాదించె నాకు దక్షిణకొఱకై
కనుక నృపాలుని కీరితి, ఘనముగఁ జిరకాల ముండుఁగావుత మవనిన్ ॥ 44

† ఋషి కక్షివంతునిగుఱించిన విశేషములకై 116వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (331వ, పుట) చదువుకొనవలయును. ఋషిగాను దేవతగాను బేర్కొనఁబడిన భావయవ్యుని విషయమై 126 సంస్కృతసూక్తము ఋషి దేవతల విషయమై వ్రాసిన ఫుట్‌నోట్ (372-373 పుటలు) చూడవలయును. ఏమైనను దెలుఁగులో ఋషులలో భావయవ్యుఁడు పేర్కొనఁబడుట పొరపాటు. 7వ ఋక్కునకు సంస్కృత మూల వ్యాఖ్యలలో "రోమశ" యను ఋషిక (అనఁగా స్త్రీ యై ఋషిక యైన యామె) భావయవ్యుఁ డను ఋషి భార్యగాఁ బేర్కొనఁబడెను. శరీర మంతయు రోమము లుండుటవలన నీమె "రోమశ" గాఁ బిలువఁబడెనఁట, ఈ ఋషికకుఁ బుట్టు పేరు తెలియదు. ఈమె తండ్రి బృహస్పతి. ఆంధ్రానువాద పద్యములలో "రోమశ" స్పష్టముగా స్త్రీగా-భావయవ్యునిపత్నిగాఁ బేర్కొనఁబడినది. కాని అటు ఋషులలోను, నిటు దేవతలలోను "రోమశుఁడు" అని స్పష్టముగాఁ బురుఁషుడుగాఁ దెలుఁగులో శ్రీనేమానివారు పేర్కొనుట పూర్తిగాఁబొరపాటు. (వ్రాతప్రతి-2వ. సంపుటము. 1వ. మండలము. 126వ సూక్తము 17-19 పుటలు) మీఁదు మిక్కిలి 7వ ఋక్కునకు రోమశుఁడు, బ్రహ్మవాదిని అని ఒక ఋషియు, యొక ఋషికయు నిరువురు నున్నట్లు పేర్కొనుట జరిగినది. ఇది ప్రమాద వశమున వ్రాయుట జరిగినది, 15B సంఖ్యగల సంపుటములో శ్రీనేమానివారు మండలములవారీగా సూక్త సంఖ్యతో వ్రాసిన ఋషుల దేవతల నామము లున్నవి. ఈ నామముల పట్టికలో 126వ. సూక్తమునకు "కక్షీవంతుడు-భావయవ్యుఁడు-రోమశ" అని స్పష్టముగాఁ (రోమశుఁడు అనికాక) వ్రాయఁబడినది, "రోమశ" అనఁగా ఋషికయే గాని (పురుషుఁడైన) ఋషి కానేకాఁడు. ఈ నామముల పట్టికకూడఁ గొంత తికమకగా నున్నది. ప్రతిపుటలోను సూక్త సంఖ్య ఋషినామము దేవతనామము మూఁడు కాలములలో వ్రాయఁబడినది. ఈ దృష్ట్యా 126వ సూక్తమునకు కక్షీవంతుఁడు ఋషియు, "భావయవ్యుఁడు, రోమశ"లు దేవతలుగాను భావింపవలసి యున్నది, (చూఁడు 15b సంపుటము, 4వ ఎక్సెర్‌సైజు బుక్కు 127 వ. పుట ఈబైండు బుక్కులోఁ బుటలన్నియు సరిగాలేవు సరికదా ఉన్న పుస్తకములలో ఋషిదేవతలతో నున్న పుస్తకములు, సరిగా వరుసగా మండలములవారీగానైనను నుంచి బైండు చేయలేదు.) ఈదృష్ట్యా 126వ సూక్తమునకుఁ గక్షీవంతుఁడొక్కఁడే ఋషియై భావయవ్యరోమశ దంపతులు దేవతలగుదురు. దీని మూల సంస్కృత సూక్తము ఋషి దేవతల ఫుట్‌నోట్‌లో నేను బేర్కొన్నట్లు నేను 1952లోఁ జూచిన గ్రంథములో నున్నట్లు దీని ఋషి "పురిచ్ఛేపుఁడు" గాని శ్రీనేమానివారు వ్రాసినట్లు (వారే ప్రతి చూచిరో తెలియదు.) కక్షీవంతుఁడు గాని యయి యుండనగును, ఇట్లగుచో నీసూక్తమునకుఁ బేర్కొన్న అభిన్న ఋషిదేవతల విషయమైన తికమకలకుఁ దావుండ నేరదు (చూడు. పీఠిక) వ.గో.కృ.

(3) గీ॥ వేయినరువది యువతుల వేయి కపిల, వర్ణముంగల నావుల వలసినన్ని
యశ్వరథముల నెల్లను నంది కక్షీ, వంతుఁ డొసంగెను [1]దండ్రికి సంతసమున ॥ 45

(4) ఉ॥ వేలకొలంది గోపకులు, వెంటఁ జెలంగెడు గో సమూహముం
జాల జవంబు గల్గు హయజాలములన్ మఱి యాన పంక్తియున్
లీలను జోటకేగ నవలీలఁగ వాజులఁ దోమి వానికిన్
మే లగు గడి ఘాణమును [2]మేతగ వేయరె యశ్వపాలకుల్ ॥ 46

(5) ఉ॥ చుట్టములార! విత్త చయ శోభిత యానములన్ గ్రహించి మీ
కెట్టిటొ[3]యీయఁగల్గితిని నేడ్తెర వానిని నంది [4]వానిపైఁ
బెట్టిన సొమ్ములంగొనుచుఁ బ్రీతి మనస్సులతోడ యాగమున్
నెట్టనఁజేసి మీర లవనిం గ్రహియించుఁడు కీర్తి నెంతయున్ ॥ 47

(సంభోగము నిమిత్తము పిలువఁబడిన భావయవ్యుఁడు
స్వభార్యతోఁ బరిహాసముగఁ జెప్పు మాట యిది.)

(6) గీ॥ బ్రీతిఁ బరిగ్రహీత బిడ్డను గన్నట్టు, నకుల ప్రియుని కరణి నన్ను విడిచి
యుండ నొల్లనట్టి యువతి రోమశ కామ, సౌఖ్యములను నా కొసంగుచుండె ॥ 48

(రోమశ భర్తకు సమాధానము చెప్పుచున్నది.)

(7) ఉ॥ నన్ను స్పృశించి చూడవఁటె నాథుఁడ! పుష్టిని నొందె నంగముల్
పన్నుగ రమ్ము నాకడకుఁ బంత మదేలకొ గొట్టె రీతి నా
కెన్నఁగరాని రోమచయ మెక్కడఁ జూచిన నక్కడుండుటం
బిన్నతనంబునుండి ననుఁ బిల్తురు "రోమశ"గా నరోత్తముల్ ॥ 49

1. దండ్రి కవ్వారి గాఁగ (తా.పా.) 2. మేతగవేసిరి యశ్వపాలకుల్ (తా.పా.) 3. నెట్టిటొనీయఁగల్గితిని (ప్రా.ప.పా.) 4. వానిని నంది యెందుపై (తా.పా.)

## అనువాకః—19, సూక్తమ్—127

### ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః †

### దేవతా—అగ్నిః

### ఛందః—అత్యష్టిః, 6-అతిధృతిః

(1) అగ్నిం హోతారం మన్యే దాస్వన్తం వసుం సూనుం సహసో జాతవేదసం విప్రం న జాతవేదసమ్ ।

య ఊర్ధ్వయా స్వధ్వరో దేవో దేవాచ్యా కృపా ।

ఘృతస్య విభ్రాష్టిమను వష్టి శోచిషా[1] ऽऽజుహ్వానస్య సర్పిషః ॥ 56

(2) యజిష్ఠం త్వా యజమానా హువేమ జ్యేష్ఠమఙ్గిరసాం విప్ర మన్మభిర్విప్రేభిః శుక్ర మన్మభిః ।

[2]పరిజ్మానమివ ద్యాం హోతారం చర్షణీనామ్ ।

శోచిష్కేశం వృషణం యమిమా విశః ప్రావన్తు జూతయే విశః ॥ 57

(3) స హి పురూ చిదోజసా విరుక్మతా దీద్యానో భవతి [3]ద్రుహంతరః పరశుర్న ద్రుహంతరః ।

వీళు చిద్ యస్య సమృతౌ శ్రువద్ వనేవ యత్ స్థిరమ్ ।

నిష్షహమాణో యమతే నాయతే ధన్వాసహా నాయతే ॥ 58

† 126వ. సూక్తము మొదలుకొని 139వ సూక్తమువఱకు దానితోసహా కలిపి యీ సూక్తములన్నింటికిని "పురుచ్ఛేపుఁడు" ఋషిగా 1952లో నేను జూచిన యొక ఋగ్వేద ముద్రిత ప్రతిలో నున్నది. దాని ననుసరించి నావద్దఁగల సంస్కృత ఋగ్వేద వ్రాతప్రతిలో ఋష్యాదులు పేర్కొనఁబడినవి. కాఁగా నీసూక్తములకు దివోదాస పుత్రుఁడైన పరుచ్ఛేపుఁడు గాని పురుచ్ఛేపుఁడు గాని ఋషి యని గ్రహింపవలయును. ఈ 127వ సూక్తము మొదలు 139 వఱకుఁగల సూక్తములకు శ్రీనేమాని వారి యాంధ్రాను వాద గ్రంథములో భిన్నభిన్న విధములుగా ఋషుల నామములు పేర్కొనఁబడినవి. ఈవిశేషములకై ఆంధ్రానువాదమైన 127 వ. సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోట్ (379వ పుట) చూడవలయును. వ.గో.కృ.

1. శోచిషాజుహ్వానస్య (వ్రా.ప్ర.) 2. పరిజ్మానమివ (వ్రా.ప్ర) 3. భవతి ధ్రువంతరః (వ్రా.ప్ర)

(4) దృహ్యా[1] చిదస్మా అను దుర్యథా విదే తేజిష్ఠాభిరరణిభిర్దాష్ట్యవసే ऽగ్నయే దాష్ట్యవసే ।

ప్ర యః పురూణి గాహతే తక్షద్ వనేవ శోచిషా ।

స్థిరా చిదన్నా ని రిణాత్యోజసా ని స్థిరాణి చిదోజసా ॥ 59

(5) తమస్య పృక్షముపరాసు ధీమహి నక్తం యః సుదర్శతరో దివాతరాదప్రాయుషే దివాతరాత్ ।

ఆదస్యాయుర్గ్రభణవద్ వీళు శర్మ న సూనవే ।

భక్తమభక్తమవో వ్యన్తో అజరా అగ్నయో వ్యన్తో అజరాః ॥ 60

(6) స హి శర్ధో న మారుతం తువిష్వణిరప్నస్వతీ [2]షూర్వరాస్విష్ట నిరార్తనాస్విష్టనిః ।

ఆదద్ధవ్యాన్యాదదిర్యజ్ఞస్య కేతురర్హణా ।

అధ స్మాస్య హర్షతో హృషీవతో విశ్వే జుషన్త పన్థాం నరః శుభే న పన్థామ్ ॥ 61

(7) ద్వితా యదీం కీస్తాసో అభిద్యవో నమస్యన్త ఉపవోచన్త భృగవో మథ్నన్తో దాశా భృగవః ।

అగ్నిరీశే వసూనాం శుచిర్యో ధర్ణిరేషామ్ ।

ప్రియాగ్ం అపి[3]ధీగ్ంర్వనిషీష్ట మేధిర ఆ వనిషీష్ట మేధిరః ॥ 62

1. ద్రళహా (వ్రా.ప్ర) దృళ్హా (సా.మా.) 2. రప్నస్వతీ పూర్వా (వ్రా.ప్ర.) 3. అపిగ్ం (వ్రా.ప్ర.)

(8) విశ్వాసాం త్వా విశాం పతిం హవామహే సర్వాసాం సమానం దంపతిం భుజే [1]సత్యగిర్వాహసం భుజే ।

అతిథిం మానుషాణాం పితుర్న యస్యాసయా ।

అమీ చ విశ్వే అమృతాస ఆ వయో హవ్యా దేవేష్వా వయః ॥ 63

(9) త్వమగ్నే సహసా సహన్తమః శుష్మిన్తమో జాయసే దేవతాతయే రయిర్న దేవతాతయే ।

శుష్మిన్తమో హి తే మదో ద్యుమ్నిన్తమ ఉత క్రతుః ।

అధ స్మా తే పరి చరన్త్యజర శ్రుష్టీవానో నాజర ॥ 64

(10) ప్ర వో మహే సహసా సహస్వత ఉషర్బుధే పశుషే నాగ్నయే స్తోమో బభూత్వగ్నయే ।

ప్రతి యదీం హవిష్మాన్ విశ్వాసు క్షాసు జోగువే ।

అగ్రే రేభో న జరత ఋషూణాం జూర్ణిర్హోత ఋషూణామ్ ॥ 65

(11) స నో నేదిష్ఠం దదృశాన ఆ భరాగ్నే దేవేభిః సచనాః సుచేతునా మహో రాయః సుచేతునా ।

మహి శవిష్ఠ నస్కృధి సంచక్షే భుజే అస్యై ।

మహి స్తోతృభ్యో మఘవన్ త్సువీర్యం మథీరుగ్రో న శవసా ॥ 66

1. వ్రాతప్రతిలో నీ "సత్యగిర్వాహసం భుజే" అన్న మంత్ర భాగము లేదు. వ.గో.కృ.

## అనువాకము—19, సూక్తము—127

## ఋషి—దివోదాసపుత్రుఁడు పురుచ్ఛేపుఁడు*

## దేవత—అగ్ని

(1) సీ॥ చక్కని సామర్థ్య సరణిని యజ్ఞముల్ నిర్వహించెడునట్టి నేర్పుకాఁడ!
యజమాను లొసఁగెడు నాజ్యాదిహవ్యము జ్వాలతో నందంగ జరుగువాఁడ!
పూతజీవ నివాస హేతు భూతుండవై బలసూను ఁడనుపేరఁ బరఁగువాఁడ!
యజ్ఞములకు నెల్ల నమరులఁగొనితెచ్చి యిష్టి హవ్యంబుల నిచ్చువాఁడ!
గీ॥ యగ్నిదేవుండ! నిన్ను మే మాదరించి, యఖిల మేధా విరాజితుఁ డైన జిన్ని
గట్టువలెఁ [1]బొగడుచుంటిమి యెట్టులైన, మమ్ముఁ గాపాడవలవదే! సమ్మతమున ॥ 50

* సంస్కృత మూలగ్రంథములలో 126వ సూక్తమునకు "కక్షీవాన్ దైర్ఘతమసః" ఇత్యాదిగా ఋషులు కొన్ని ప్రతులలో నుండి 127వ సూక్తమునుండి 139వ సూక్తముతోసహా యన్ని సూక్తములకును"పరుచ్ఛేపో దైవోదాసః"అని ఋషినామ ముండఁగా మఱొక ప్రతిలో 126 వ సూక్తము మొదలు 139వ సూక్తముతో సహా యన్నిసూక్తములకును బితృనామ-వంశనామ రహితముగా "పురుచ్ఛేపః" అని మాత్రమే యున్నది. (ఈ విశేషములకై సంస్కృతాంధ్రములలో నున్న 126 సూక్తముల ఋషిదేవతల ఫుట్ నోటు లను జూడనగును.) శ్రీ నేమానివారు తమ యాంధ్రానువాద గ్రంథములో 126వ సూక్తమునకు వివిధ విధములుగా ఋషి దేవతలను బేర్కొనుట జరిగినది. ఈ విశేషవిషయములకై తెలుఁగు 126 వ సూక్తము క్రింది ఫుట్‌నోట్ చూడనగును. ఇంక నాంధ్రానువాద గ్రంథము వ్రాతప్రతిలో శ్రీ నేమానివారు 127వ సూక్తము మొదలు 139వ సూక్తముతో సహా ఆయా సూక్తములకు రకరకాలుగా ఋషుల నామములు వ్రాయుట జరిగినది. ఆ విశేష వివరములివి. 127వ సూక్తమునకు దివోదాస పుత్రుఁడు పురుచ్ఛేపుఁడు ఋషియనియు, ( 1వ మండలము. 2వ సంపుటము 19వ పుట ) 128వ సూక్తమునకు "పరిచ్ఛేపుఁడు" ( 1వ మండలము. 2వ సంపుటము. 25వ పుట. ) ఋషిగాను, 129, 132 సూక్తములకు ( 1వ. మండలము 2వ సంపుటము 129 సూక్తము 27వ పుట. 132వ సూక్తము 39వ పుట) "పురుచ్ఛేదుఁడు" ఋషిగాను - 133వ సూక్తమునకు "పరుచ్ఛేపుఁడు" ( 1వ మండలము. 2వ సంపుటము. 43వ పుట ) ఋషిగాను-134వ సూక్తమునకు "పరుచ్ఛేదుఁడు" ( 1వ మండలము. 2వ సంపుటము. 45వ పుట ) ఋషిగాను, 130, 131వ సూక్తములకు "పురుచ్ఛేపుఁడు" ఋషిగాను ( 1వ మండలము. 2వ సంపుటము 130సూ-33వ పుట. 131 సూ. 37వ పుట ) 133, 135, 136, 137, 138, 139 సూక్తములకు "పరుచ్ఛేపుఁడు" ఋషిగాను (1వ మండలము 2వ సంపుటము 43, 47, 49, 55, 55, 57 పుటలు క్రమముగా నాయా సూక్తములకై చూచునది.) వివిధములుగాఁ బేర్కొనుట జరిగినది. 127 వ సూక్తము మొదలు 139వ సూక్తమువఱకు నున్న మొత్తము 13 సూక్తములకు దివోదాసపుత్రుఁడగు పురుచ్ఛేపుఁడు, పరిచ్ఛేపుఁడు, పురుచ్ఛేదుఁడు, పరుచ్ఛేదుఁడు, పురుచ్ఛేపుఁడు, (దివోదాస పుత్రుఁడగు పురుచ్ఛేపుఁడును నీ పురుచ్ఛేపుఁడును నేకైకులని సాధికారముగాఁ జెప్పుట కవకాశములేదు.) పరుచ్ఛేపుఁడును గొలఁది యక్షర భేదములతో విభిన్నులైన వ్యక్తులు ఋషులుగా నున్నట్లు పేర్కొనఁబడినది. కాని శ్రీ నేమానివారు స్వహస్తముతో వ్రాసిన ఋషిదేవతల పట్టికగల 15b సంఖ్యగల గ్రంథములో మాత్రము 127వ సూక్తము మొదలు 139వ సూక్తముతోసహామొత్తము పదమూఁడు సూక్తములకును "పురుచ్ఛేపుఁడు" ఏకైకుఁడే ఋషిగాఁ బేర్కొనఁబడినది. దీనినిబట్టి పరిశీలింప నాంధ్రానువాద సందర్భముగా శ్రీ నేమానివా రొక గ్రంథము ననుసరించి పునఃపరిశీలన సందర్భముగా వేరొక గ్రంథమును బరిశీలించి ఋషి దేవతా నామముల పట్టికలను రూపొందించినట్లు తేటతెల్లమగుచున్నది. వ.గో.కృ.

1. ఇక్కడ బంచలముగణ మింద్రగణమునకు మారుగాఁ బ్రయోగింపఁబడినది. వ.గో.కృ.

(2) గీ॥ అంగిరో వంశజులలో ననాద్యుఁడవయి, యెల్లెడల సంచరించుచు నినునె పోలి
మర్త్యుల నిమిత్తమై దేవమండలమును, బిలుచుకొని వచ్చుచున్నాఁడ [1]వెలమి నీవు ॥ 51

గీ॥ ఇష్టపుఁడ† వగుటచే నన్నియిష్టులందుఁ, బ్రీతునిగఁ జేయుదురుగాకఁ బెద్ద లెల్ల
మంచి ఋక్కులతో నిన్ను మరువకుండ, సంస్తుతించుచు నుంటిమో! జ్వలనదేవ! ॥ 52

(3) ఉ॥ పావక! నీదుమూలమునఁ బర్వత ముఖ్యపదార్థ జాతముల్
ద్రావక మౌనుగాదె యది తథ్యము కావున నీవె వైరి రా
జావళి నెల్లఁ బట్టి యురుమాడుము గొడ్డలి మాటిఁ [2]నెంతయున్
జేవగలట్టి ధన్వివలెఁ జేరుము వైరుల మధ్యదేశమున్ ॥ 53

(4) సీ॥ తత్త్వజ్ఞుఁ డిల ధాత్రు ధనముఁ బొందెడునట్లు యజమాను ద్రవ్యంబు నందునెవఁడొ!
యజమానుఁ డమరున కర్పించు నాజ్యాది హవ్యంబు నందంగ నరుఁగు నెవఁడొ!
స్థిర పదార్థము నెల్లఁ దేజస్సుతోఁ బరిపక్వముం జేయంగఁ బరఁగు నెవఁడొ!
వృక్షాదులన్‌వలె వివిధ హవిస్సుల భస్మముగాఁ జేయు భవ్యుఁ డెవఁడొ!
గీ॥ యపరిహార్యంబునగు పాప మంతఁగొట్టు, నట్టు చేయుచుఁ బుడమిని నమరు నెవఁడొ!
యట్టి యగ్నివిభుండు సద్యజ్ఞ కర్మ, కరులకున్ స్వర్గసుఖములు కలుఁగఁజేయు ॥ 54

(5) సీ॥ అంధకారములో సహస్సుకంఠెను గడు [3]దర్శనీయత గాంచి దనరునట్టి
సాయంతనంబునఁ దరణితేజః ప్రవేశముచే సజీవులై నమరునట్టి
తంద్రి గృహంబును దనయు లొందిన భంగి హవ్యంబులను నెల్ల నందునట్టి
సేవించినను మఱి సేవింపకుండిన జీవరాశులను రక్షించునట్టి
గీ॥ గార్హ పత్యాది వహ్నులు కర్మదత్త, హవ్యములచేతఁ దృప్తిని నంది ముదిమి
నొందకుండఁగ వెలుఁగుచు నుచితకర్మ, కరుల కమరత్వ మొసఁగంగఁ గలరు భువిని ॥ 55

(6) సీ॥ ఖననాభిరంజిత కర్మవేదికపైని నాజ్యాదికంబుల నందువాఁడు
యజమాను లొసఁగెడు హవ్యంబుఁ గైకొని పూజల నన్నింటిఁ బొందువాఁడు
స్వాభీష్ట ఫలదాన సరణిచే[4] మేధావి పద్ధతి సంతోష పఱచువాఁడు
హవ్యాజ్యములతోడ నమరాధిపుల కెల్ల సంతుష్టిఁజేయంగఁ జాలువాఁడు
గీ॥ నైన యగ్నికి శుభముల నందఁగోరి, యడ్డుదారిని బోవక యర్హమైన
మార్గమును బట్టి పోయెడు మనుజులవలెఁ, జేయుచున్నారు [5]మానవుల్ సేవ లెపుడు ॥ 56

1. వెలమిమీర (తా.పా.) † ఇక్కడఁ బంచలఘుగణ మింద్రగణమునకు మారు ప్రయోగిత మైనది. వ.గో.కృ. 2. యెంతయున్ (వ్రా.ప్ర.పా.)
3. దర్శనీయములొచు (తా.పా.) 4. సరణిచే యజమాన పద్ధతి (తా.పా.) 5. మనుజుల సేవలెపుడు (తా.పా.)

(7) చ॥ భృగు కులజుల్ మునీశ్వరు లభీష్టము లొందఁగఁ గోరి శక్తిచేఁ
దగు నరణిన్ మథించి కడు దగ్గఱఁ జేరి నుతింప దానిఁ జ
క్కఁగ విని తృప్తి గాంచి యొసఁగంగలఁ డగ్ని యధేచ్ఛఁ గోరికన్
మిగుల హవిస్సుఁ బొందుచు నమేయ పవిత్రత యాగశాలలన్ ॥ 57

(8) గీ॥ సముఁడు యజమాన జనులకు స్వాభిలషిత, దానము లొసంగి సుతులను దఱచు వినఁడె
యతిథివలెఁ బూజనీయుఁడౌ నగ్నిదేవుఁ, బిలుచుచున్నాము సౌఖ్యంపుఁ బెంపుఁగోరి ॥ 58

గీ॥ తండ్రి కడనున్న యన్నంబు తనయు లంత, తినుటకై పోవునట్టులు దివిజు లెలమిఁ
దమతమ హవిస్సుఁ గొనఁగ నుత్సాహమునను, జేరుచున్నార లగ్నిని జిత్త మలర ॥ 59

(9) చ॥ బలమున శత్రుమండలి కపాయముఁ జేయఁగఁగోరి నిన్ను మి
క్కిలి నుతియింపఁ బుట్టితివి కీలలు కల్గినవాఁడ! నీకు నే
తుల మద మెల్ల నెక్కుఁగద! దూతలు రాజును జేరునట్లుగా
నల యజమాను లందఱు సహాయ నిమిత్తము నిన్నుఁ గూడరే! ॥ 60

(10) ఉ॥ హోమముఁ జేయఁబూనుటకు హోత పదార్థము నెల్లఁ బూని పె
న్నేమముతోడ నీయెడల నిశ్చల భావముతోడ నిల్పి తా
నీ మహిమల్ స్తుతించు నతినిర్మల భక్తిని భట్టువాఁడు స
త్కామదు మ్రోల నిల్పి యధికంబు నుతించెదుమాట్కిఁ బావకా! ॥ 61

(11) ఉ॥ నీవు సమీప దేశమున నిత్యము వెల్గుచు విత్తవృద్ధితో
గావఁగ మమ్ము ర మ్మిటకుఁ గాంచన వర్ణుఁడ! సౌఖ్యదుండ! నీ
[1]సేవ నొనర్చు వారి కతిశీఘ్రము పుత్రులఁగల్గఁ జేయుచున్
జావఁగఁ జేయవే యరుల సారము గల్గిన క్రూరుకై వడిన్ ॥ 62

1. సేవ నొనర్చు పుత్రకుల శీఘ్రము పౌత్రులఁగల్గఁ జేయుచున్ (తొ.పా.) ఈ తొలి పాఠములో దోషములేదు. ఇది యే వ్యాఖ్య ననుసరించి తెనిగింపఁ బడెనో చెప్పలేము. కాని సవరించిన పాఠము కొంతవఱకు సాయన భాష్యానుసారముగ నున్నది. వ.గో.కృ.

## సూక్తమ్ 128

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

**దేవతా—అగ్నిః**

ఛందః—అత్యష్టిః

(1) అయం జాయత మనుషో ధరీమణి హోతా యజిష్ఠ ఉశిజామను వ్రతమగ్నిః స్వమను వ్రతమ్ ।

విశ్వశ్రుష్టిః సఖీయతే రయిరివ శ్రవస్యతే ।

అదబ్ధో హోతా ని షదదిళస్పదే పరివీత ఇళస్పదే ॥ 67

(2) తం యజ్ఞసాధమపి వాతయామ[1]స్యృతస్య పథా నమసా హవిష్మతా దేవతాతా హవిష్మతా ।

స న ఊర్జాముపాభృత్యయా కృపా న జూర్యతి ।

యం మాతరిశ్వా మనవే పరావతో దేవం భాః పరావతః ॥ 68

(3) ఏవేన సద్యః పర్యేతి పార్థివం ముహుర్గీ రేతో వృషభః కనిక్రదద్ దధద్ రేతః కనిక్రదత్ ।

శతం చక్షాణో అక్షభిర్దేవో వనేషు తుర్వణిః ।

సదో దధాన ఉపరేషు సానుష్వగ్నిః పరేషు సానుషు ॥ 69

* ఋషి విశేషవిషయములకై సంస్కృతము తెలుగు 126-127 సూక్తముల ఋషులకిచ్చిన ఫుట్‌నోటులు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ. 1. వాతయామస్యృతస్య (బ్రా.ప్ర.)

(4) స సుక్రతుః పురోహితో దమేదమే ఽగ్నిర్యజ్ఞస్యాధ్వరస్య చేతతి క్రత్వా యజ్ఞస్య చేతతి ।

క్రత్వా వేధా ఇషూయతే విశ్వా జాతాని పస్పశే ।

యతో ఘృతశ్రీరతిథిరజాయత వహ్నిర్వేధా అజాయత ॥ 70

(5) క్రత్వా యదస్య తవిషీషు పృఞ్చతే ఽగ్నేరవేణ మరుతాం న భోజ్యేషిరాయ న భోజ్యా ।

స హి ష్మా దానమిన్వతి వసూనాం చ మజ్మనా ।

స నస్త్రాసతే దురితాదభిహ్రుతః శంసాదఘాదభిహ్రుతః ॥ 71

(6) విశ్వో విహాయా అరతిర్వసుర్దధే హస్తే దక్షిణే తరణిర్న శిశ్రథచ్ఛ్రవస్యయా న శిశ్రథత్ ।

విశ్వస్మా ఇదిషుధ్యతే దేవత్రా హవ్యమోహిషే ।

విశ్వస్మా ఇత్ సుకృతే వారమృణ్వత్యగ్నిర్ద్వారా వ్యృణ్వతి ॥ 72

(7) స మానుషే వృజనే శంతమో హితో[1] ఽగ్నిర్యజ్ఞేషు జేన్యో న విశ్పతిః ప్రియో యజ్ఞేషు విశ్పతిః ।

స హవ్యా మానుషాణామిళా కృతాని పత్యతే ।

స నస్త్రాసతే వరుణస్య ధూర్తేర్మహో దేవస్య ధూర్తేః ॥ 73

1. హితోఽగ్నిర్యజ్ఞేషు (బ్రా.ప్ర.)

(8) అగ్నిం హోతారమీళతే వసుధితిం ప్రియం చేతిష్ఠమరతిం న్యేరిరే హవ్యవాహం న్యేరిరే ।

విశ్వాయుం విశ్వవేదసం హోతారం యజతం కవిమ్ ।

దేవాసో రణ్వమవసే వసూయవో గీర్భి రణ్వం వసూయవః ॥ 74

## సూక్తము—128

ఋషి—పరిచ్ఛేపుఁడు*

దేవత—అగ్ని

(1) చ॥ ఫలమును గోరు యాజ్ఞికులు ధర్మము నందఁగ [1]నుండి నిన్నుఁ ద
ద్బలమునఁ బుట్టఁజేయఁగనె పావక! నీవు జనించి వారికిన్
లలి ధన మొసఁగు వేదికఁ దొలంగక యుండుట, ఋత్విజాళి న
న్నలతిగఁ జూడ కెంతయు మహాదర మొప్పఁగఁ గొల్వకుందురే! ॥ 63

(2) క॥ వేదికపై నగ్నీ! నిను, మోదముతో నునిచి నుతుల మొత్తముతో నా
జ్యాదికముతోను నిష్టుల, తోఁ దగు కార్యములఁ గొల్చెదుము సద్భక్తిన్ ॥ 64

క॥ పవనుఁడు రవితేజస్సును, భువికిం గొనితెచ్చి నిన్నుఁ బుట్టించెనుమా!
స్తవనీయ మనువుకొఱకై, సవనాగ్నీ! యజ్ఞములకుఁ [2]జను మిఁకఁ బ్రీతిన్ ॥ 65

(3) సీ॥ హవ్యరూపంబగు నన్నంబు గలవాఁడు స్తుతియింపఁబడువాఁడు సొగసుగాఁడు
కామ్యార్థముల నెల్లఁ గలిగింపఁగలవాఁడు ధనము సామర్థ్యంబుఁ దాల్చువాఁడు
నుతియింపఁబడినచో నూఱు మడుంగులు వెలుఁగుచు ధ్వనితోడ వెలయువాఁడు
పరువెత్తు శత్రులఁబట్టి చంపెడువాఁడు నధ్వరంబుల కెల్ల నరుగువాఁడు
గీ॥ నైనయగ్ని మనోహరహవ్యములను, గైకొనఁగఁ[3] బిలుపు వినఁగనె కదలివచ్చు
చున్నవాఁ డదె! ఋత్విజుల్ ! చూడరేమి ?, ధన్యులముకామె ! వాని సందర్శనమున ॥ 66

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372,373,374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ. 1. నందఁగగోరి నిన్ను (తొ.పా.) 2. ఇక్కడ "జరుగుము ప్రీతిన్" అను వ్రాతప్రతి (2వ సంపుటము 25వ పుట) పాఠమౌచితీరహితముగా నున్నది. జరుగుట యనఁగాఁ గొద్ది దూరము నుంచి మఱికొంత దూరమునకుఁ గదలుట. ఇం దౌచిత్యము కానరాదు. కాన నిది "సవనాగ్ని యజ్ఞములకుఁ జనుమిఁక ప్రీతిన్" అని సవరింపఁబడినది. వ.గో.కృ. 3. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణ మువయుక్తమైనది. వ.గో.కృ.

(4) చ॥ సదనములం బురోహితుఁడు చక్క నొనర్చెడుభంగి నగ్ని యే
కొదువయు లేక యాగములఁ గూర్చుచు సాంగముగా వెలింగె స
మ్మదమున నిష్టికర్తలకు ముక్తినొసంగుచు నాజ్యధారచే
మదమును బొందుఁగాన యజమానులకున్ ఫలమీయకుండునే? ॥ 67

(5) ఉ॥ పైరులు పండుచో భువనభర్త యవెల్ల[1] గ్రహించురీతి వి
స్తారము హోమవస్తువులఁ దప్పక హోత గ్రహించి యన్నముం
గోరెడువాని కన్నమును గూర్చెడునట్టులు నీ కొసంగ నా
కారణ తృప్తవహ్నీ! మముఁ గాచుతఁ బాపమునుండి యెంతయున్ ॥ 68

(6,7) సీ॥ విశ్వాత్మగలవాఁడు వేల్చినఁ దనివిని జెందక వెలుఁగును జెందువాఁడు
భక్తుల కెల్లను భానుండు ధనరాశి నిచ్చునట్టులు ధన మిచ్చువాఁడు
యజమానుఁ డర్పించు హవ్యంబు నింద్రాది దేవతాతతి కెల్లఁ దెచ్చువాఁడు
పాపౌఘములనెల్లఁ బాఱఁద్రోలుచుఁ జాల సౌఖ్యంబుఁ గలిఁగింపఁ జాలువాఁడు
గీ॥ జయముఁ గోరెడు జనపతి జనులకువలె, నఖిల సత్కర్మలకు నిష్ఠ మైనవాఁడు
నైన యనలుండు హవ్యంబు లందఁగోరి, వచ్చువాఁ డదె పాపంబుఁ ద్రచ్చువాఁడు ॥ 69

(8) చ॥ ధనము నొసంగు నెల్లరకుఁ దాఁ బ్రియుఁడై వెలుఁగొందు సర్వ జీ
వనము నొసంగుఁ బ్రాణుల కవారిత వైరులఁ ద్రుంచు [2]హవ్యముం
గొని ఘనదేవతాతతికి గొబ్బున నిచ్చు భరించుఁ బూజలన్
చనువునఁబోవు నిష్ఠులకు సంతస మొందును నగ్నియంతయున్ ॥ 70

## సూక్తమ్—129

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—ఇన్ద్రః, 6 ఇన్దుః

ఛందః—అత్యష్టిః, 8-9 అతిశక్వర్యౌః, 11-అష్టిః

(1) యం త్వం రథమిన్ద్ర మేధసాతయేఽపాకా సన్తమిషిర ప్రణయసి ప్రానవద్య నయసి ।

సద్యశ్చిత్తమభిష్టయే కరో వశశ్చ వాజినమ్ ।

సాస్మాకమనవద్య తూతుజాన వేధసామిమాం వాచం న వేధసామ్ ॥ 75

1. యవన్ని (వ్రా.ప్ర.పా.) "అన్ని" శబ్దముపయోగించుచో "యవన్నియు" నని వాడుట యుక్తము. కావున "నెల్ల" శబ్దముగా మార్పు చేయఁబడినది. వ.గో.కృ. 2. "హవ్యముంగొని" యనుటకు వ్రాతప్రతిలోఁ బ్రమాదవశమున "హత్యముంగొని" యని వ్రాయఁబడినది. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోటులు (372.373.374-376-379పుటలు) చూడనగును. వ.గో.కృ.

(2) స శ్రుధి యః స్మా పృతనాసు కాసు చిద్ దక్షాయ్య ఇన్ద్ర భరహూతయే నృభిరసి ప్రతూర్తయే నృభిః ।

యః శూరైః స్వఃసనితా యో విప్రైర్వాజం తరుతా ।

తమీశానాస ఇరధన్త వాజినం పృక్షమత్యం న వాజినమ్ ॥ 76

(3) దస్మో హి ష్మా వృషణం పిన్వసి త్వచం కం చిద్ యావీరరరుం శూర మర్త్యం పరివృణక్షి మర్త్యమ్ ।

ఇన్ద్రోత తుభ్యం తద్ దివే తద్ రుద్రాయ స్వయశసే ।

మిత్రాయ వోచం వరుణాయ సప్రథః సుమృళీకాయ సప్రథః ॥ 77

(4) అస్మాకం వ ఇన్ద్రముశ్మసీష్టయే సఖాయం విశ్వాయుం ప్రాసహం యుజం వాజేషు ప్రాసహం యుజమ్ ।

అస్మాకం బ్రహ్మోతయేఽవా పృత్సుషు కాసు చిత్ ।

నహి త్వా శత్రుః స్తరతే స్తృణోషి యం విశ్వం శత్రుం స్తృణోషి యమ్ ॥ 78

(5) ని షూ నమాతిమతిం కయస్య చిత్ తేజిష్ఠాభిరరణిభిర్నోతిభిరుగ్రాభిరుగ్రోతిభిః ।

నేషి ణో యథా పురా[1]ఽనేనాః శూర మన్యసే ।

విశ్వాని పూరోరప పర్షి వహ్నిరాసా వహ్నిర్నో అచ్ఛ ॥ 79

1. పురానేనాః (బ్రా.బ్ర.)

(6) ప్ర తద్ వోచేయం భవ్యాయేన్దవే హవ్యో న య ఇషవాన్ మన్మ రేజతి రక్షోహా మన్మ రేజతి ।

స్వయం సో అస్మదా నిదో వధైరజేత దుర్మతిమ్ ।

అవ స్రవేదఘశంసోఽవతరమవ క్షుద్రమివ స్రవేత్ ॥ 80

(7) వనేమ తద్ధోత్రయా చితన్త్యా వనేమ రయిం రయివః సువీర్యం రణ్వం సన్తం సువీర్యమ్ ।

దుర్మన్మానం సుమన్తుభిరేమిషా పృచీమహి ।

ఆ సత్యాభిరిన్ద్రం ద్యుమ్నహూతిభిర్యజత్రం ద్యుమ్నహూతిభిః ॥ 81

(8) ప్రప్రా వో అస్మే స్వయశోభిరూతీ పరివర్గ ఇన్ద్రో దుర్మతీనాం దరీమన్ దుర్మతీనామ్ ।

స్వయం సా రిషయధ్యై యా న ఉపేషే అత్రైః ।

హతేమసన్న వక్షతి క్షిప్తా జూర్ణిర్న వక్షతి ॥ 82

(9) త్వం న ఇన్ద్ర రాయా పరీణసా యాహి పథాఁ అనేహసా పురో యాహ్యరక్షసా ।

సచస్వ నః పరాక ఆ సచస్వాస్తమీక ఆ

పాహి నో దూరాదారాదభిష్టిభిః సదా పాహ్యభిష్టిభిః ॥ 83

(10) త్వం న ఇన్ద్ర రాయా తరూషసోగ్రం చిత్ త్వా మహిమా సక్షదవసే మహే మిత్రం నావసే ।

ఓజిష్ఠ త్రాతరవితా రథం కం చిదమర్త్య

అన్యమస్మద్ రిరిషేః కం చిదద్రివో రిరిక్షన్తం చిదద్రివః ॥ 84

(11) పాహి న ఇన్ద్ర సుష్టుత స్రిధో ऽవయాతా సదమిద్ దుర్మతీనాం దేవః సన్ దుర్మతీనామ్ ।

హన్తా పాపస్య రక్షసస్త్రాతా విప్రస్య మావతః ।

అధాహి త్వా జనితా జీజనద్ వసో రక్షోహణం త్వా జీజనద్ వసో ॥ 85

## సూక్తము—129

### ఋషి—పురుచ్ఛేదుఁడు *

### దేవత—ఇంద్రుఁడు†--6-ఇందువు

(1) చ॥ పిలిచినతోడ శీఘ్రముగఁ బేర్మినిఁ బోవుచు నెల్ల వారికిన్
ఫలము నొసంగి హవ్యము నపారముగాఁ గొనుచుంటి వింద్రః నీ
లలిత నుతిం గుశాదులఁ జెలంగెడు హవ్యము నొంది నీవు వి
చ్చలవిడి వచ్చి కర్మగల [1]శాలలలో నివసింపవేః వడిన్ ॥ 71

(2) సీ॥ అరులను దునుమాడి యందఱ రక్షింపు మను దీనవాక్యముల్ విను నెవండొః
శూరులతోఁ గూడి వీరవైరులఁ జంపి యుద్ధ భయంబుల నుడిపె నెవఁడొః
విప్రస్తుతుల నొంది వివిధాన్నముల నిచ్చి చరు పురోడాశముల్ మరిగె నెవఁడొః
సుప్రసిద్ధ గుణాళి శోభఁగఁగ్గలుచు నుతి సొంపు వీనుల నాలకింపు నెవఁడొః
గీ॥ యట్టి దేవేంద్రునకు నరు లధిక గమన, విలసితాశ్వంబునకుఁ దృణంబు లిడునటుల
యజ్ఞముల హవ్యముల నిచ్చి యతిశయముగ, సేవఁ జేయుచు నున్నారు చిత్త మలర ॥ 72

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు(372-373 376-379 పుటలు) చూడ నగును. వ.గో.కృ.

† సంస్కృత మూలములో నీ సూక్తములోని 6వ ఋక్కునకు "ఇందువు" దేవతగాఁ బేర్కొనఁబడినది. కాని యాంధ్రానువాదమున నీ సందర్భమున ఋక్కులన్నింటికిని నింద్రుడే దేవతగా నుటంకింపఁబడినది. (వ్రాతప్రతి 1వ. మండలము-2వ.సంపుటము 27వ. పుట.) కాని ఆరవ ఋక్కున కనువాద పద్యమైన "ఇంద్రునిఁబోలి" ఇత్యాది పద్యములోఁ జంద్రుఁడే (ఇందువే) దేవతగాఁ బేర్కొనఁబడినది. 15b సంపుటములో శ్రీ నేమానివారు ప్రథమమండలములోని యీ 129వ.సూక్తమునకు "ఇంద్రుఁడు—ఇందువు" లిరువురును దేవతలుగా స్వయముగానే వ్రాసిరి. కాన నీ సూక్తములోఁగల ఆరవ ఋక్కునకు నిందువు (చంద్రుఁడు) దేవతగాను మిగిలిన ఋక్కుల కన్నింటికిని నింద్రుఁడే దేవతగాను గుర్తింప నగును. వ.గో.కృ.

1. శాలలో (వ్రా.ప్ర.పా.) గణభంగము.

(3) ఉ॥ శూరుఁడు పారు మానవుని సూక్ష్మముగా నరికట్టినట్లు నీ
బీరముఁజూపి నీరదము బిట్టు నదల్చి పయః ప్రవాహముల్
పారఁగఁజేసి తంతట నపారముగా మఱి శుష్క-మేఘమున్
శూరుఁడ! లేవఁగొట్టితివి చూడఁగ శక్యమె! నీదు కృత్యముల్ ॥ 73

గీ॥ తావకాద్భుత కృత్యముల్ పావకునకు, వరుణునకు మిత్రునకు నీకు వాసవుండ!
తెలియనట్టులు చాటించి తివిరి లోక, మంతటను వెల్గఁజేసెద నధికభక్తి ॥ 74

(4) సీ॥ యాగపూర్తింజేసి యభిమత ఫలముల నిచ్చువాఁడా! ధన మిచ్చువాఁడ!
సర్వ యజ్ఞములకు సాగుచు వైరులఁ గొట్టువాఁడా! గట్టి పట్టువాఁడ!
ఘన మరుత్తుల కెల్ల మొనగాఁడవై యన్న మొసగువాఁడా! సుఖ మొసఁగువాఁడ!
యిష్టి కర్మలలోనఁ గష్టము లేకుండఁ జూచువాఁడా! మమ్ముఁ గాచువాఁడ!
గీ॥ దోషులగు శత్రువులఁ బాఱఁద్రోలువాఁడ!, ప్రథనములయందు బాధింపఁ బడనివాఁడ!
ఋత్విజాళికి మంగళ మిచ్చువాఁడ!, యింద్రుఁడా! రమ్ము మా చేయు నిష్టిఁజూడ ॥ 75

(5) క॥ శత్రు వగు వృత్రువలె మా, శత్రువులను బారఁద్రోలు శక్తిఁ గలిఁగి నీ
వాత్రను బితరులకున్ వలెఁ, జిత్రముగా మాకు ఫలముఁ జేర్పు మహేంద్రా! ॥ 76

క॥ పాపఘ్నుఁడవని నిను జన, మోపి కడుం జెప్పుచుండ నో యింద్రుఁడ! మా
పాపముఁగొట్టుము వృష్టి ప్ర, తాపమునఁ బ్రపంచ నిఖిల తాపమునువలెన్ ॥ 77

(6) ఉ॥ ఇంద్రునిఁ బోలి మా కడ కహీననుతుల్ వినఁగోరి వచ్చు నా
చంద్రుఁడు మాకు బాధ లిడు శత్రుల బుద్ధులు మాన్పుఁగాక ని
స్తంద్రత విత్తముం గొనెడు తస్కరు నుచ్చపదంబునుండి యా
చంద్రుఁడె వారి చందమున జారఁగఁజేయఁడె! సర్వ రీతులన్ ॥ 78

(7) క॥ మిక్కి-లి సామర్థ్యదమై, మిక్కి-లి రమణీయమౌ నమేయ ధనంబుం
జక్క-ని పుత్రులఁ బౌత్రుల, నక్క-జ మగునట్టు మాకు నందింపు హరీ! ॥ 79

క॥ దురధిగముండవు హరి! మా, నిరవధి నుతివాక్య మెల్ల నిన్నే పొందున్
బరమకృపాయత్తుఁడవై, బిరబిర రావేమి! [1]నీవు పిలుపున్ వినుచున్ ॥ 80

(8) క॥ దుర్మతు లగు నరివీరుల, మర్మములను గొట్ట హరి సమర్థుఁడుసుండీ!
యర్మిలి హరి రక్షకుఁడయి, ధర్మము కాపాడ మన కధర్మం బెటులౌన్ ॥ 81

1. మాదుపిలుపున్ (తా.పా.)

(9) గీ॥ పాప విరహిత మార్గముం బట్టవలయు, నంత ధనమును గైకొని చెంతఁజేరు
దూరమున నున్న దగ్గఱఁజేరియున్న, రమ్ము: రక్షింప శక్రుఁడ: మమ్ముఁ బ్రీతి ॥ 82

(10) గీ॥ అధికబలము కలిఁగి యందఱ రక్షింతు, మరణరహిత! నీవు మాకు వలయు
ధన మొసంగి మమ్ము ధర్మాత్ములంజేసి, యుద్ధరింపవలదె! యిద్ధచరత! ॥ 83

గీ॥ స్తుతుల యతులమహిమ సూర్యునివలె నిన్నుఁ, బ్రీతిఁ బఱప నీ వరాతిఁగొట్ట
నెట్టి రథము నైన నెక్కి [1]మా కృతయజ్ఞ, శాలఁగూర్చి రమ్ము శక్ర! [2]నీవు ॥ 84

(11) క॥ సర్వత్ర శత్రు పుత్రులు, గర్వాత్ములుగాన వారి గర్వము నడఁచన్
బర్వున వచ్చి మహేంద్ర! య,ఖర్వ బలముచేత వారిఁగడతేర్పఁగదే! ॥ 85

చ॥ సరస నుతి ప్రపంచమున సంతస మొందెదవయ్య! వైరికిన్
విరసముఁ బుట్టఁ జేయుదువు విస్తృత పాపుల సంహరించి శ్రీ
కర యజమాన యాగములఁ గాచెద వెప్పుడుఁ బ్రాణికోటులం
స్థిరముగఁ గావ నీశ్వరుఁడు సృష్టిని జేయఁడె! నిన్ను శక్రుఁడా! ॥ 86

## సూక్తమ్ 130

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—ఇన్ద్రః

ఛందః—అత్యష్టిః, 10—త్రిష్టుప్

(1) ఏన్ద్ర యాహ్యుప నః పరావతో నాయమచ్ఛా విదథానీవ సత్పతిరస్తం రాజేవ సత్పతిః ।

హవామహే త్వా వయం ప్రయస్వన్తః సుతే సచా ।

పుత్రాసో న పితరం వాజసాతయే మంహిష్ఠం వాజసాతయే ॥ 86

1. మా దగు యజ్ఞ (తొ.పా.) 2. శక్రదేవ! (తొ.పా.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తము ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడవలయును. వ.గో.కృ.

(2) పిబా సోమమిన్ద్ర సువానమద్రిభిః కోశేన సిక్తమవతం న వంసగస్తాతృషాణో న వంసగః ।

మదాయ హర్యతాయ తే తువిష్టమాయ ధాయసే ।

ఆ త్వా యచ్ఛన్తు హరితో న సూర్యమహా విశ్వేవ సూర్యమ్ ॥ 87

(3) అవిన్దద్ దివో నిహితం గుహా నిధిం వేర్న గర్భం పరివీతమశ్మన్యనన్తే[1] అన్తరశ్మని ।

వజ్రం వజ్రీ గవామివ సిషాసన్నఙ్గిరస్తమః ।

అపావృణోదిష ఇన్ద్రః పరీవృతా ద్వార[2] ఇషః పరీవృతాః ॥ 88

(4) దాదృహాణో వజ్రమిన్ద్రో గభస్త్యోః క్షద్మేవ తిగ్మమసనాయ సం శ్యదహిహత్యాయ సం శ్యత్ ।

సంవివ్యాన[3] ఓజసా శవోభిరిన్ద్ర మజ్మనా ।

తష్టేవ వృక్షం వనినో ని వృశ్చసి పరశ్వేవ ని వృశ్చసి ॥ 89

(5) త్వం వృథా[4]నద్య ఇన్ద్ర సర్తవే ऽచ్ఛా సముద్రమసృజో రథాఀ ఇవ వాజయతో రథాఀ[5]ఇవ ।

ఇత[6] ఊతీరయుఞ్జత సమానమర్థమక్షితమ్ ।

ధేనూరివ మనవే విశ్వదోహసో జనాయ విశ్వదోహసః ॥ 90

---

1. న్యనన్తేऽఅన్తరశ్మని (వ్రా.ప్ర.) 2. ద్వారऽఇషః (వ్రా.ప్ర.) 3. సంవివ్యానऽఓజసా (వ్రా.ప్ర.) 4. నద్యऽ ఇన్ద్ర (వ్రా.ప్ర.) 5. రథాఀऽఇవ (వ్రా.ప్ర.) 6. ఇతऽఊతీ (వ్రా.ప్ర.)

(6) ఇమాం తే వాచం వసూయన్త[1] ఆయవో రథం న ధీరః స్వపా[2] అతక్షిషుః సుమ్నాయ త్వామతక్షిషుః ।

శుమ్భన్తో జేన్యం యథా వాజేషు విప్ర వాజినమ్ ।

అత్యమివ శవసే సాతయే ధనా విశ్వా ధనాని సాతయే ॥ 91

(7) భినత్ పురో నవతిమిన్ద్ర పూరవే దివోదాసాయ మహి దాశుషే నృతో వజ్రేణ దాశుషే నృతో ।

అతిథిగ్వాయ శమ్బరం గిరేరు[3]గ్రో అవాభరత్ ।

మహో ధనాని దయమాన[4] ఓజసా విశ్వా ధనాన్యోజసా ॥ 92

(8) ఇన్ద్రః సమత్సు యజమానమార్యం ప్రావద్ విశ్వేషు శతమూతిరాజిషు స్వర్మీ[5]ళ్హేష్వాజిషు ।

మనవే శాసదవ్రతాన్ త్వచం కృష్ణామరన్ధయత్ ।

దక్షన్న విశ్వం తతృషాణమోషతి న్యర్శసానమోషతి ॥ 93

(9) సూరశ్చక్రం ప్ర వృ[6]హజ్జాత ఓజసా ప్రపిత్వే వాచమరుణో ముషాయతీ[7]శాన ఆ ముషాయతి ।

ఉశనా యత్ పరావతోऽజగన్నూతయే కవే ।

సుమ్నాని విశ్వా మనుషేవ తుర్వణిరహా విశ్వేవ తుర్వణిః ॥ 94

1. వసూయన్తऽ (వ్రా.ప్ర) 2. స్వపాऽ (వ్రా.ప్ర.) 3. ఉగ్రోऽ అవాభరత్ (వ్రా.ప్ర.) 4. దయమానऽ ఓజసా (వ్రా.ప్ర.)

5. స్వర్మీళహే (వ్రా.ప్ర.) స్వర్మీళ్హే (సా.మ) 6. బృహజ్జాతऽ ఓజసా (వ్రా.ప్ర.) 7. ఈశానऽఆ (వ్రా.ప్ర.)

(10) స నో నవ్యేభిర్వృషకర్మన్నుక్థైః పురాం దర్తః పాయుభిః పాహి శగ్మైః ।

దివోదాసేభిరిన్ద్ర స్తవానో [1]వావృధీథా అహోభిరివ ద్యౌః ॥ 95

## సూక్తము—130

ఋషి—పురుచ్ఛేపుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ నిజ సదనంబుఁ జేరుటకు నిత్యము చంద్రుఁడు వచ్చునట్లు స
ద్య జన గృహంబుఁ బొందుటకు నగ్ని విభుం డరుదెంచునట్లు ఋ
త్విజులను గూడి హవ్యములఁ దెచ్చుచు ని న్నొగిఁ బిల్వకుందు మొ
క్కొ! జనకు నన్నమీయు[1]మని కోరుచుఁ బుత్రులు పిల్చు రీతిగాన్ ॥

(2) చ॥ అను వగు రాలఁ ద్రచ్చఁబడి యంతట శోధిత మైన సోమమున్
ఘనహయః వారి పూరమునఁ గ్రాలు ఘటంబు వృషంబు చేరున
ట్లనయము నీవు చేరి యది యాత్రుతఁ ద్రావి మదంబు నొంది యీ
దినములయందు నిష్టులకుఁ దిన్నఁగ రావొకొ! సూర్య రీతిగాన్ ॥ 88

(3) సీ॥ ఖగరూప మొందిన గాయత్రి మహిమచే దూరదేశంబున దొరకినట్టి
బహు లతా గుల్మాది బంధురం బగు నొక పర్వత గుహ నుంపఁబడినయట్టి
విహగము శిశువును వెదకెడు రీతిని భక్తిచే వెదుకంగఁబడినయట్టి
యంగిరోముని వరుఁ డాలపట్టునువలెఁ గడు [2]శ్రద్ధఁ గనుగొనంబడినయట్టి
గీ॥ సోమమును బొంది యింద్రుఁడు శూరుఁడగుచు, జలద బంధముఁ గొట్టుచు జలము భూమి
పైనిఁ బాఱంగఁజేయుచుఁ బంట[3]లెల్లఁ, బండునట్టు లొనర్చెఁడె పరమ [4]మహిమ ॥ 89

(4) ఉ॥ వైరుల పైని వేయఁబడు వజ్రము నీరము మాట్కి వాడిగాఁ
దీరిచి వృత్ర దానవ పతిన్ సమయించితి వెండి దాని సిం
గారముగా [5]నొనర్చి యల కారువు గొడ్డలిఁబట్టి వృక్ష సం
హార మొనర్చునట్టుల నరు లందఱఁ గొట్టవె! నీవు శక్రుఁడా! ॥ 90

---

1. వావృధీథాఽఅహో (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తము ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడఁగును. వ.గో.కృ.

1. మీయమని (వ్రా.ప్ర.పా.) 2. శర్థ (వా.ప్ర.పా.) 3. లన్నిపండు (వ్రా.ప్ర.పా.) 4. పరమప్రీతి (కొ.పా.) 5. సింగారముగా మెఱుంగులిడి (తొ.పా.)

(5) ఉ॥ నీవు రథంబు కర్మలకు నిత్యము ద్రోలెడిరీతి యుద్ధమున్
వావిరిఁగోరునట్టి నరపాలురు యానము [1]జన్యభూమికిన్
[2]బోవగఁ జేయునట్లు జలపూర్ణ నదాళి మహోదధిన్ ద్రుతిన్
ద్రావ మెసంగఁ గల్పెదవు శక్రుఁడః నిన్గొనియాడ శక్యమేః ॥ 91

క॥ మనువునకున్ గోవులెన్, జనులకు గోగణము మాట్కి సకలాపగలన్
[3]ఘన! నీవుః కలుఁగఁజేయఁగ, జనులను నవి తృప్తిఁజేయఁ జాలెను శక్రా! ॥ 92

1. యుద్ధభూమికిన్ (తొ.పా.) 2. 1వ.మండలము 130వ సూక్తము 5వఋక్కున కనువాదపద్యమైన (91వ.పద్యము) "నీవురథంబు" ఇత్యాది పద్యములో మూఁడు పాదములు ఉత్పలమాల పాదములుగ నాల్గవ పాదము తొలుత నుత్పలమాల పాదముగనే రచించి పిదపఁ జంపకమాల పాదముగా గ్రంథకర్త సవరించెను. దీనిని దొలుత "ఉ॥" అను సంకేతముతోఁ చూపుటవలన దీని నుత్పలమాలగా వ్రాయవలయు నని గ్రంథకర్త సంకల్పించిన విషయము స్పష్టము. "మజం, బోవనొనర్పఁగల్గితివి పూజ్యుఁడః నిన్గొనియాడశక్యమేః" అని తొలుత ఉత్పలమాల నాల్గవ పాదము వ్రాసి పిదప "మహో, త్సవమునఁజేర్పఁ గల్గితివి శక్రుడః నిన్గొనియాడ శక్యమేః" అని "చంపకమాల" పాదముగా మార్చెను. ఈ మార్పు ప్రమాదవశమున జరిగి యుండ నగును. కాదు బుద్ధి పూర్వకముగనే జరిగిన దను కొన్న దీనిని "బరస్థాన విషమవృత్తము" లలో నొకదానినిగాఁబరిగణించి యీ పద్యమునకు "ఉత్పలమాల" యని కాక వేరు నామ ముంచవలసియున్నది. పరస్థాన విషమవృత్తముగా దీనికిఁ బేరు నుంచవలయునన్నచో "పరస్థాన విషమగతివృత్త" మని నామ ముంచిన నుచితముగా నుండును. "నదీనాం సాగరోగతిః"అన్న భావమును గదాః యీ పద్యమందు వెల్లడింపఁ దలఁచినది. కావున "పరస్థాన విషమగతి వృత్తము" అను నామము సార్థకమగును. శ్రీ నేమానివారికి విషమ వృత్తముగా వ్రాయు సంకల్పము లేదనుకున్న దీనిని వేరు విధముగాఁ బరిష్కరింప వలసియున్నది. ఈ పద్యము మూఁడవ పాదముగాఁ "బోవఁగఁజేయునట్లు జల పూర్ణ నదుల్ జలరాశికిన్" అని రచయిత వ్రాసెను. "జల పూర్ణనదుల్ జలరాశికిన్" అని "జల" శబ్దము రెండుసార్లు ప్రయుక్త మగుట సరిగాలేదు. అట్లే తొలుత రచించిన ఉత్పలమాల నాల్గవపాదములో మూఁడవపాదములో నున్న "పోవు" ధాతు రూపమె పునరుక్తివలెఁ బ్రయుక్తమైనది. మూఁడవ పాదాంతమందలి "మజం" (మజన్) అన్న పదప్రయోగము గూడ నసిగలేదు, కాఁగా నీపద్యము మూఁడవ పాదమునుండి (వ్రాతప్రతి 2వ సంపుటము ప్రథమ మండలము 34-35 పుటలు చూడు)

బోవఁగఁ జేయునట్లు జలపూర్ణ నదుల్ జలరాశికిన్ మజం
బోవ నొనర్పఁ గల్గితివి పూజ్యుఁడః నిన్ గొనియాడ శక్యమేః

అని యొకవిధముగను

బోవఁగఁ జేయునట్లు జలపూర్ణ నదుల్ జలరాశికిన్ మహో
త్సవమునఁ జేర్పఁగల్గితివి శక్రుఁడః నిన్ గొనియాడ శక్యమేః

అని వేరొక విధముగను వ్రాసిన పాఠములను నీక్రింది విధముగ నేను సవరించుట జరిగినది. వ.గో.కృ.

బోవఁగఁ జేయునట్లు జలపూర్ణనదాళి మహోదధిన్ ద్రుతిన్
ద్రావ మెసంగఁ గల్పెదవు శక్రుఁడః నిన్గొనియాడ శక్యమేః ॥

3. ఘనహయః కలుఁగంజేయన్ (తొ.పా.)

(6) చ॥ ధనమును గోరు ఋత్విజులు తద్దయు సౌఖ్యము [1]నొందఁ గోరి ని
[2]న్ననవరత ప్రసన్నునిగ నత్యనుకూలునిగా నొనర్చెడుం
దనకయి ధైర్యశాలి యరదంబును సిద్ధము[3]సేసి కొన్న య
ట్లనయముఁ ద్వత్ స్తవంబులను నాత్రముతోడుత నాలకింపవే! ॥ 93

(7) చ॥ అనులకు వేగఁబోవు నిను నందఱు యోధులు రాజు నట్టులున్
ఘనతర యుద్ధ వీరు లధికంబుగ గుఱ్ఱమునట్లు గొప్ప వ
ర్ణనముల నుగ్గడించుచుఁ గరంబు [4]నుతింతురు భక్తి నింద్రుఁడా!
ధనమునకున్ హయంబులకుఁ దద్దయుఁ బెద్దగ వేడుచున్ నినున్ ॥ 94

(8) సీ॥ పూత హవ్యం బిచ్చుఁ పూరుఁడన్వానికై యరి పట్టణంబుల నడఁచి తీవె!
అల దివోదాసుని యర్థంబుఁ దొంబది పట్టణంబుల నెల్లఁ గొట్టి తీవె!
కాలు సేతులు సుంతఁ గదలకుండగఁ బట్టి శత్రువులను నెల్లఁ జంపి తీవె!
హవ్యం బొసంగెడు యజమాన వైరుల వజ్రాయుధముచేత వంచి తీవె!
గీ॥ చంపకయె మున్ను విడచిన శంబరహత, కు గిరిపైనుండి త్రోయుచుఁ గొట్టి తీవె!
వారి ధనములఁ జేకొని వరలి తీవె, తివిరి ముక్తాది[5] మణుల సాధించి తీవె! ॥ 95

(9) సీ॥ యజ్ఞకర్త లొనర్చు యజ్ఞముల్ సరిపెట్టి రణముల వారికి రక్ష నిచ్చి
జన్యమధ్యంబునఁ జచ్చిన వారికి స్వర్గలోకంబున స్థలము నొసఁగి
కృష్ణ రాక్షస దేహకృత్తిని నొలిపించి తద్భటాళిని జంపి తనివి నొంది
హింసాభిరుచిగల హీనుల నెల్లర శక్తిమూలంబునఁ జావ మోఁది
గీ॥ ప్రీతుఁడయి యజ్ఞముల కెల్లఁ బిలువఁగానె, వచ్చి యాజ్యాది హవ్యంబుఁ బుచ్చుకొనుచు
నిష్టికర్తలకున్ ఫల మిచ్చి యింద్రుఁ, డమిత సంతోష పదవిని నధిగమించె ॥ 96

1. నొందనుండి ని,న్ననయము సుప్రసన్నునిగ(తొ.పా.) 2. "అనయము" అను పద మీ పద్యములో రెండు నాల్గు పాదములలో వ్రాతప్రతి పాఠములో రెండుసార్లు ప్రయుక్తమైనది. కావున రెండవపాదమును "నిన్ననవరత ప్రసన్నునిగ" అని సవరించితిని. "ని న్ననయము సుప్రసన్నునిగ"అని గ్రంథకర్త వ్రాసెను. వ.గో.కృ. 3. సేయునట్టులోఁ ఘనహయ! త్వ స్తవంబులను గౌరవ మొప్పఁగ (తొ.పా.) "త్వత్ స్తవంబులను"అనుటకుగ్రంథకర్త "త్వ స్తవంబులను"అని యేవ్రాతప్రతిలో వ్రాసెను. ఇది వ్యావహారిక భాషా ప్రభావమున "తత్ క్షణము" నకు మారు "తక్షణము" వ్రాసినట్లు వ్రాయఁబడినది. వ.గో.కృ.

4. ప్రశంస నొనర్తు రింద్రుఁడా! (తొ.పా.) 5. ముక్తాదిమణులను అన్నప్పుడు ముక్తాది నవరత్న రాసులను సూర్యచంద్ర కాంతాది మణులను నని యర్థము గ్రహింప వలయును. ముక్తాదులె మణులని యర్థముకాదు. వ.గో.కృ.

(10) చ॥ కుమతులు రాక్షసాధములు కొందఱు చావులు లేక యుండ నా
సమయమునన్ దినేశు రథచక్రముఁ జేకొని వారిఁజంపినా
వమలమతిన్ మునీశ్వరుని నన్నివిధంబులఁ గాచినాఁడ వో
యమరపతీ! ధనం బిడవె! యత్యధికుండగు దాత కైవడిన్ ॥ 97

## సూక్తమ్ 131

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—అత్యష్టిః

(1) ఇన్ద్రాయ హి ద్యౌరసురో[1] అనమ్నతేన్ద్రాయ మహీ పృథివీ వరీమభిర్ద్యుమ్నసాతా వరీమభిః ।

ఇన్ద్రం విశ్వే సజోషసో దేవాసో దధిరే పురః ।

ఇన్ద్రాయ విశ్వా సవనాని మానుషా రాతాని సన్తు మానుషా ॥ 96

(2) విశ్వేషు హి త్వా సవనేషు తుఞ్జతే సమానమేకం వృషమణ్యవః పృథక్ స్వః సనిష్యవః పృథక్ ।

తం త్వా నావం న పర్షణిం శూషస్య ధురి ధీమహి ।

ఇన్ద్రం న యజ్ఞైశ్చితయన్త[2] ఆయవః స్తోమేభిరిన్ద్రమాయవః ॥ 97

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. ద్యౌరసురోఽఅనమ్నతేన్ద్రాయ (వా.ప్ర.) 2. చితయన్తఽఆయవః (వా.ప్ర.)

(3) వి త్వా తతస్రే మిథునా[1] అవస్యవో వ్రజస్య సాతా గవ్యస్య నిః సృజః సక్షన్త[2] ఇన్ద్ర నిః సృజః ।

యద్ గవ్యన్తా ద్వా జనా స్వర్యన్తా సమూహసి ।

ఆవిష్కరిక్రద్ వృషణం సచాభువం వజ్రమిన్ద్ర సచాభువమ్ ॥ 98

(4) విదుష్టే[3] అస్య వీర్యస్య పూరవః పురో యదిన్ద్ర శారదీరవాతిరః సాసహానో[4] అవాతిరః ।

శాసస్తమిన్ద్ర మర్త్యమయజ్యుం శవసస్పతే ।

మహీమముష్ణాః పృథివీమిమా[5] అపో మన్దసాన ఇమా అపః ॥ 99

(5) ఆదిత్ తే[6] అస్య వీర్యస్య చర్కిరన్ మదేషు వృషన్నుశిజో యదావిథ సఖీయతో యదావిథ ।

చకర్థ కారమేభ్యః పృతనాసు ప్రవన్తవే ।

తే [7]అన్యామన్యాం నద్యం సనిష్ణత శ్రవస్యన్తః సనిష్ణత ॥ 100

(6) ఉతో నో[8]అస్యా ఉషసో జుషేత హ్యర్కస్య బోధి హవిషో హవీమభిః స్వర్షాతా హవీమభిః ।

యదిన్ద్ర హన్తవే మృధో వృషా వజ్రిఞ్చికేతసి ।

ఆ మే[9] అస్య వేధసో నవీయసో మన్మ శ్రుధి నవీయసః ॥ 101

1. మిథునాఽఅవస్యవ (ప్రా.ప్ర.) 2. సక్షన్తఽఇన్ద్ర (ప్రా.ప్ర.) 3 విదుష్టేఽఅస్య (ప్రా.ప్ర.) 4. హానోఽఅవా 5. మిమాఽఅపో మన్దసానఽ ఇమాఽ అపః (ప్రా.ప్ర.) 6. తేఽఅస్య (ప్రా.ప్ర.) 7. తేఽఅన్యా. (ప్రా.ప్ర.) 8. నోఽ అస్యా ఉషసో 9. ఆమేఽఅస్య

(7) త్వం తమిన్ద్ర వావృధానో[1] అస్మయురమిత్రయన్తం తువిజాతమర్త్యం వజ్రేణ శూరమర్త్యమ్ ।

జహి యో నో[2] అఘాయతి శృణుష్వ సుశ్రవస్తమః ।

రిష్టం న యామన్నప భూతు దుర్మతిర్విశ్వాప భూతు దుర్మతిః ॥ 102

## సూక్తము—131

ఋషి పురుచ్ఛేపుఁడు*

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ దేవతా [1]సంఘములకును దివము గోరు, వారలకు నింద్రుఁ డొక్కఁడె వశ్యుఁడుగదః
కానఁ గార్యములకు నెల్లఁ[2] గావుదలగ, [3]వాని ముందుంచుచుందురు పరమ మతులు ॥ 98

(2) చ॥ అభిమత మొంద సోమమయ యాగములందు హవిస్సు నంతయున్
విభజనఁజేసి నీ కిడుట వీర జనావళి శత్రు సైన్య సం
క్షుభిత మహా సముద్రమున సుందర నౌకగ నెంచినాము ని
న్నభయ మొసంగరాదె! యసహాయులకున్ జగదేక వీరుఁడా! ॥ 99

(3) ఉ॥ కోరిన గోవులన్ మఱియుఁ గోరిన నాక పదంబు లిచ్చుచుం
గోరిన గోర్కెలన్నియును గూర్తు వటంచు జనుల్ సభార్యలై
గోరుచు నీ యనుగ్రహము గోవులఁ బొందఁ దలంచి యిష్టులన్
వేరుగఁజేసి హవ్యము లివే! యిడుచుండిరి నీకు శక్రుఁడా! ॥ 100

(4) సీ॥ శత్రుదుర్భేద్యమౌ శత్రు పట్టణముల దివ్యాయుధముల భేదించు టొకటి
యజ్ఞ నాశకులగు నఖిల రాక్షసులను నెట్టుచు వారిని గొట్టు టొకటి
యుదక బంధంబుల నొగిఁ ద్రెంచి నీరముల్ చరియించునట్టులు జరుపు టొకటి
వారి సంభూత మౌ వైద్యుతాగ్నిని నెల్ల క్షితిఁ బ్రవేశింపంగఁ జేయు టొకటి

1. నోఽఅస్మయు 2. నోऽ అఘాయతి (ప్రా.ప్ర.)

* ఋషి విశేష వివయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. సంఘములకెల్ల (తొ.పా.) 2. కానఁ గార్యములకెల్ల (తొ.పా.) ఈపాఠమున వింద్రగణమునకుమారు "జ" గణ ముపయుక్తమైనట్లు భావింపనగును. వ.గో.కృ. 3. వాని ముందుంచు చుందురు కరముగోరి (తొ.పా. యతిభంగము) వ.గో.కృ.

గీ॥ మున్నుగు పరాక్రమమ్ముల మోద మలర, యజ్ఞము లొనర్చు వారలే యమరనాథః
యెఱుఁగుచున్నార లన్య్యు లెల్లెఱుఁగఁగలరు, శత్రుజన వృక్షదావః యో శక్రదేవః ॥ 101

(5) చ॥ చెలిమిని గోరు మాకు మఱి చెల్మిని గోరెదు భక్తకోటికిం
జెలువము మీర సంతసముఁ జేయుచు యుద్ధములందు నెంతయున్
బలమున సింహనాదము నవారిత మౌనటు సల్పునట్లు ని
శ్చలముగ సోమపానమున [1]సంభృతిఁజేయు మదంబు శక్రుఁడాః ॥ 102

క॥ ప్రతి యజ్ఞకర్మమందుం, బ్రతి యజమానుండు నీకు భక్తి సలిపి స
ద్గతి సాఫల్యము గని తా, నతులిత మగు నన్ను మెలమి నందఁడెః శక్రాః ॥ 103

(6,7) సీ॥ ప్రత్యుషస్సవనప్రపత్తిఁ జూడఁగ నింద్రుఁ డరుదెంచునోః లేక యరుఁగుదేఁడొః
వచ్చి మే మిచ్చెడు వలసిన హవ్యంబుఁ గుఁగొనునోః లేక కనుఁగొనండొః
సవన సాధకమగు సవనముల్ జరిపింపఁ జంపునోః వైరులఁ జంపఁబోఁడొః
సంస్కృత బుద్ధితో పరస పంస్తుతుల నాలించునోః లేక యాలింపఁబోఁడొః
గీ॥ భ్రాంతుఁడై యున్న మనుజుని జంప నెంచు, తస్కరుని బుద్ధిఁబోలు నధర్మబుద్ధి
వైరులకు లేని యట్టులు బహుళ శక్తిఁ, జేయఁగలుఁగునొః మఱి వాఁడు చేయలేఁడొః ॥ 104

క॥ స్తుతులం బహూకృతుండై, [2]యతిభక్తుల మైన మాకు సతి దుఃఖములన్
సతతము కలిఁగించెడు మా, ప్రతికూలిని జంపె మా ప్రపత్తిని గనఁడేః ॥ 105

## సూక్తమ్—132

### ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

### దేవతా—ఇంద్రః, 6 (1 అర్ధర్చస్య) ఇన్ద్రా పర్వతౌ

### ఛందః—అత్యష్టిః

(1) త్వయా వయం మఘవన్ పూర్వ్యే ధన[1] ఇన్ద్రత్వోతాః సాసహ్యామ పృతన్యతో వనుయామ వనుష్యతః ।
నేదిష్ఠే[2] అస్మిన్నహన్యధి వోచా ను సున్వతే ।
అస్మిన్ యజ్ఞే వి చయేమా భరే కృతం వాజయన్తో భరే కృతమ్ ॥ 103

1. సంభృతిఁజేయు=బాగుగా భరించు (వ్యా.ప్ర.) 2. నతిభక్తులమైన (వ్యా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తము ఋషుల కిచ్చిన పుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడవలయును. వ.గో.కృ.

1. ధనఇన్ద్ర 2. నేదిష్ఠేఅస్మి.

(2) స్వర్ణే షే భర [1]ఆప్రస్య వక్మన్యుషర్బుధః స్వస్మిన్నఞ్జసి క్రాణస్య స్వస్మిన్నఞ్జసి ।

అహన్నిన్ద్రో యథా విదే శీర్ష్ణాశీర్ష్ణోపవాచ్యః ।

అస్మత్రా తే సధ్ర్యక్ సన్తు రాతయో భద్రా భద్రస్య రాతయః ॥ 104

(3) తత్ తు ప్రయః ప్రత్నథా తే శుశుక్వనం యస్మిన్ యజ్ఞే వారమకృణ్వత క్షయమృతస్య వారసి క్షయమ్ ।

వి తద్ వోచేరధ ద్వితాన్తః పశ్యన్తి రశ్మిభిః ।

స ఘా విదే[2] అన్విన్ద్రో గవేషణో బన్ధుక్షిద్భ్యో గవేషణః ॥ 105

(4) నూ[3] ఇత్థా తే పూర్వథా చ ప్రవాచ్యం యదఙ్గిరోభ్యోऽవృణోరప వ్రజమిన్ద్ర శిక్షన్నప వ్రజమ్ ।

ఐభ్యః సమాన్యా దిశాऽస్మభ్యం జేషి యోత్సి చ ।

సున్వద్భ్యో రన్ధయా కం చిదవ్రతం హృణాయన్తం చిదవ్రతమ్ ॥ 106

(5) సం యజ్జనాన్ క్రతుభిః శూర[4] ఈక్షయద్ధనే హితే తరుషన్త శ్రవస్యవః ప్ర యక్షన్త శ్రవస్యవః ।

తస్మా[5] ఆయుః ప్రజావదిద్ [6]బాధే అర్చన్త్యోజసా ।

ఇన్ద్ర [7]ఓక్యం దిధిషన్త ధీతయో దేవాగ్ం[8] అచ్ఛా న ధీతయః ॥ 107

1. భరऽఆప్రస్య. 2. విదేऽఅన్విన్ద్రో (ప్రా.ప్ర.) 3. నూऽఇత్థా 4. శూరऽఈక్షయ 5. తస్మాऽఆయుః 6. బాధేऽఅర్చన్త్యోజసా

7. ఇన్ద్రऽఓక్యం 8. దేవాగ్ంऽఅచ్ఛా (ప్రా.ప్ర.)

(6) యువం తమిన్ద్రాపర్వతా పురోయుధా యో నః పృతన్యాదప తంతమిద్ధతం వజ్రేణ తంతమిద్ధతమ్ ।

దూరే చత్తాయ ఛన్త్సద్ గహనం యదినక్షద్ ।

అస్మాకం శత్రూన్ పరి శూర విశ్వతో దర్మా దర్షీష్ట విశ్వతః ॥ 108

## సూక్తము—132

ఋషి—పురుచ్ఛేదుఁడు *

దేవత—ఇంద్రుఁడు 6. పూర్వార్థమునకు నింద్ర పర్వతులు నుత్తరార్థమునకు నింద్రుఁడు †

(1) శా॥ నీతోఁగూడి సమస్త శత్రు వితతిన్ నిర్జింతు మో యింద్రః నీ
చేతో మోద మొనర్చ నిష్టలఁ దగం జేయంగ నున్నార మీ
ప్రాతః కాలమునందు వచ్చి మనుజ ప్రారబ్ధ సంస్తోత్రముల్
ప్రీతిన్ శక్రుఁడః యాలకించి మము సంప్రీతాత్ములం జేయవేః ॥ 106

* ఋషి విశేషవిషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోటులు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

† ఈ సూక్తమునఁగల యారు ఋక్కులలోను దొలియైదు ఋక్కుల కింద్రుఁడును నారవ ఋక్కులోని పూర్వార్థమునకు నింద్ర పర్వతు లిరువురును నుత్తరార్థమునకు నింద్రుఁడును దేవత యని సంస్కృత మూల ప్రతులలో నున్నది. శ్రీ నేమాని వారు (వ్రాతప్రతి 1వ. మండలము 2వ. సంపుటము. 39వ పుట) ఈ 132వ సూక్తము మొత్తమున కింద్రుఁడొక్కఁడే దేవతయనునట్లు వ్రాసిరి. ఆరవ ఋక్కు పూర్వార్థ విషయికమైన ఇంద్రపర్వతుల విషయ మిక్కడఁ బ్రస్తావింపలేదు. కాని ఆరవ ఋక్కున కనువాద పద్యములుగా శ్రీనేమానివారు రెండు పద్యములు(114-115పద్యములు) రచించిరి. (చూ.403పుట) ఈ రెండింటిలోను దొలి పద్యము ఋక్పూర్వార్థమునకును రెండవపద్య ముత్తరార్థమునకును ననువాదములు. పూర్వార్థానువాద పద్యమైన "మీరింద్ర మేఘులారా!"ఇత్యాది పద్యములో నింద్రమేఘ దేవత లిరువురును సంబోధింపఁబడిరి. సాయనాదుల కొందఱి యభిప్రాయము ననుసరించి యిక్కడఁబర్వత శబ్దముచే మేఘము పరిగృహీత మగును. కాఁగా ననువాద పద్యములో నారవ ఋక్కు పూర్వార్థమునకు నింద్ర పర్వతు లిద్దఱును శ్రీ నేమాని వారి దృష్టిలో సైతము దేవతలే. అంతేకాదు. శ్రీ నేమానివారు వ్రాసిన 15b సంపుటములోఁ బేర్కొన్న ఋషి దేవతల పట్టికలో సైతము ప్రథమ మండలములో నున్న 132వ సూక్తమునకు వివరముగాఁ బేర్కొనలేదు గాని "యింద్ర పర్వతులు" దేవతలుగా శ్రీ నేమానివారే వ్రాసిరి. ఏది యేమైనను ఋగనువాద పద్యములలో నారవ ఋక్కును బద్య ద్వయముగా విరచించి తొలి పద్యములో నింద్రమేఘదేవతలను దదనంతర పద్యములో నింద్రుని బేర్కొనుట వల్ల శ్రీ నేమానివారి దృష్టిలో నారవ ఋగ్దేవతాపరముగా భిన్నాభిప్రాయమునకుఁ దావులేదని స్పష్టపడుచున్నది. అసలు పర్వత శబ్దమున కీ ఋక్సందర్భమున మేఘ మను నర్థము చెప్పనగునా వేరే యర్థము చెప్ప నగునా యనునది వేరు విషయము. వ.గో.కృ.

(2) ఉ॥ తావక మైత్రిఁ గోరుకొను ధన్యుఁ డుషస్సున మేలుకొంచు సం
భావిత భద్ర యాగముల బంధుర భక్తినిఁజేసి యున్నచోన్
దేవ! తదీయ శత్రు వితతిన్ సమయించుచు వెండి వారలన్
[1]దేవ పదంబుఁ జేర్చెద వతీంద్రియ మౌ భవదీయ శక్తిచేన్ ॥ 107

గీ॥ యజ్ఞకర్తల రక్షించు నమర నాథుఁ, డెటులఁ బూజల కర్హుఁడో యటుల యజ్ఞ
కర్తయుం బూజ్యుఁ డగువాఁడు గనినయట్టి, ధనము సుస్థిరమైయుండఁదగునుగాక! ॥ 108

(3) ఉ॥ యాగములందు హవ్యముల నందగఁ జేయుటకై మహేంద్రుఁడా!
త్యాగ మనీష ఋత్విజులు తప్పక వేదికఁగట్టి దానిపై
భోగ నిమిత్తమై [2]యిడిన పూర్ణహవిస్సు గ్రహింప దానిపై
నాగుదు వీవు నాకమున నాగుదు వీవు ఫలప్రదుండవై ॥ 109

ఉ॥ కావున నంతరిక్షమునఁ గల్గెడి మేఘము [3]లెల్లఁగొట్టుచు
ర్వీవలయాధివాసు లతి విస్మయ మొందఁగ వర్ష మిచ్చుచున్
గోవుల భక్త సంతతికిఁ గూర్మి నొసంగుచు నున్నవాఁడ వో
యీవుల రేఁడ! నీ మహిమ నెవ్వఁడు చాటఁగలండొ! చెప్పవే! ॥ 110

(4) సీ॥ అంగిరో మునులకై యంతరిక్షంబున సంచరించుట గొప్ప శక్తి కాదె!
మేఘమున్ భేదించి మిక్కుటంబగు వారిఁ గురిపించుటయె కడుఁ గూర్మి కాదె!
యజ్ఞముల్ చేయని యరులను నిర్జించి గోవులం దెచ్చుట గొప్ప కాదె!
గోవులం దెచ్చుచుఁ గుతుకంబుతో వాని మునుల కిచ్చుట మహా ముదము కాదె!
గీ॥ యటులు మా శత్రువుల నెల్ల నాక్రమించి, సంహరించినచో సంతసంబు గాదె!
నీ వొనర్చిన కార్యముల్ నిర్జరేశ!, సర్వ జన మాన్యములు కావె! సకలజగతి ॥ 111

(5) ఉ॥ అంతటఁగల్గి భూత గణమందున వెల్గుచు ప్రాణికోటు ల
త్యంతము సర్వముం గనెడునట్టులఁజేయుచు గో ధనంబులన్
సంతస మొప్పఁ బొందుటకుఁ జక్కని యజ్ఞముఁ జేయు వారి కీ
వెంతయుఁ బ్రీతి గోవులను నిచ్చుచు నింద్రుఁడ! హవ్య మందుమా! ॥ 112

1. దేవపదంబుఁ జేర్చెదవు చెప్పఁగ శక్యమె నీ మహిత్వముల్(త్రొ.పా.) ఈ తొలిపాఠములో యతి తప్పినది. ఈ తొలి పాఠములో నైతము "చెప్పఁగ శక్యమె" యనుటకు మారు "దెల్పఁగ శక్యమె" యన్నచో యతి చక్కఁగా సరిపోయెడిది. కాని మార్చఁబడిన పాదములోని భావము దీనికి భిన్నముగా నున్నది. మార్పు చేసిన పాఠమందు దేవ—అతీంద్రియ (అతి + ఇంద్రియ) యను నప్పుడు ఉభయపదంలో నొకటైన యుపసర్గ యతిగాఁ బ్రాణి యతి పాటింపఁబడినది. వ. గో. కృ. 2.నిడిన (వ్రా.ప్ర.) 3. లన్నిఁగొట్టి (వ్రా. ప్ర. పా.)

క॥ యజమానులు నిజ బలమునఁ, గుజనుల సాధింప హరినిఁగూర్చి సపర్యన్
యజనములు సేసిరేనియుఁ, ద్రి జగన్నాయకుని లోక దీప్తిం గనరే॥ 113

(6) క॥ మీ రింద్ర మేఘులారా!, ఘోరులలో మమ్ముఁ జంపు పురుషుల నెల్లన్
సారము గల వజ్రంబున, మారణముం జేయ కునికి మంచిదె? మీకున్॥ 114

క॥ శూరుఁడ! నీ వజ్రంబున, దూరముఁజని దాగినట్టి దోషుల నెల్లన్
మీఱి వధించుచు మఱియున్, మారణముం జేయుచుండు మా శత్రువులన్॥ 115

## సూక్తమ్—133

### ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

### దేవతా—ఇంద్రః

### ఛందః—1-త్రిష్టుప్, 2-4 అనుష్టుప్, 5-గాయత్రీ, 6-ధృతిః, 7-అష్టిః

(1) ఉభే పునామి రోదసీ[1] ఋతేన ద్రుహో దహామి సం మహీరనిన్ద్రాః।
అభివ్లగ్య యత్ర హతా[2] అమిత్రా వైలస్థానం పరి తృళ్హా[3] అశేరన్॥ 109

(2) అభివ్లగ్యా చిదద్రివః శీర్షా యాతుమతీనామ్।
ఛిన్ధి వటూరిణా పదా మహావటూరిణా పదా॥ 110

(3) అవాసాం మఘవఞ్జహి శర్ధో యాతు మతీనామ్।
వైలస్థానకే[4] అర్మకే మహావైలస్థే[5] అర్మకే॥ 111

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372,373,384-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ. 1. రోదసీఽఋతేన 2. హతాఽఅమిత్రా (వా.ప్ర.) 3. పరితృళ్హా (వా.ప్ర.సా.మా.)
4. స్థానకేఽఅర్మకే. 5. వైలస్థేఽఅర్మకే

(4) యాసాం తిస్రః పఞ్చాశతో ఽభివ్లఙ్గైరపావపః ।
తత్ సు తే మనాయతి తకత్ సు తే మనాయతి ॥ 112

(5) పిశఙ్గభృష్టిమమ్భృణం పిశాచిమిన్ద్ర సం మృణ ।
సర్వం రక్షో ని బర్హయ ॥ 113

(6) అవర్మహ ఇన్ద్ర దాదృహి శ్రుధీ నః శుశోచ హి ద్యౌః క్షా న భీషాగం[1] అద్రివో ఘృణాన్న భీషాగం[2] అద్రివః ।
శుష్మిన్తమో హి శుష్మిభిర్వధైరుగ్రేభిరీయసే ।
అపూరుషఘ్నో[3] అప్రతీత శూర సత్వభిస్త్రిసప్తైః శూర సత్వభిః ॥ 114

(7) వనోతి హి సున్వన్ క్షయం పరీణసః సున్వానో హి ష్మా యజత్యవ ద్విషో దేవానామవ ద్విషః ।
సున్వాన[4] ఇత్ సిషాసతి సహస్రా వాజ్యవృతః ।
సున్వానాయేన్ద్రో దదాత్యాభువం రయిం దదాత్యాభువమ్ ॥ 115

## సూక్తము—133

### ఋషి—పురుచ్ఛేపుఁడు*

### దేవత—ఇంద్రుఁడు.

(1) క॥ ద్యావాభూమీ ద్వితయము, పావన భవదీయ మౌ సపర్యను జేసెన్
దేవా! నిను సేవింపన్, భావము లేనట్టి జనులఁ బంపితి నెటకో! ॥ 116

1. భీషాగంఽఅద్రివో 2. భీషాగంఽఅద్రివః 3. ఘ్నోఽఅప్రతీత 4. సున్వానఽఇత్ (వా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

†క॥ [1]వైరులు గుమిగూడుచు రాన్, వారిని వధియించి యింద్రః వారి గృహములం
గోరి దహియింపఁ జేయక, వీరుఁడ వై ప్రేతభూమి వెలయించితిఁగా ॥ 117

(2,3,4,5) సీ॥ ఐరావతముచేత నరుల శిరస్సులఁ ద్రొక్కించుటయె మాకు నెక్కు వింద్రః
యాపదఁ గలిఁగించు నాయుధంబులచేత శత్రులఁ జంపుట చిత్ర మింద్రః
పింగళవర్ణ మౌ తుంగ [2]పిశాచంబు సమయించుటయె మాకుఁ [3]జాలు నింద్రః
పాపాత్ము లగు వారి నీ పాదములచేతఁ జూర్ణంబుఁ జేయుట చోద్య మింద్రః
గీ॥ నూటయేఁబది నేనల నేటఁగలుపు, టెంతయో తుష్టి యని మది నెంచు మింద్రః
నీ వొనర్చిన కృత్యము నీకుఁజాలఁ, దక్కు వైనను మాకది యెక్కు వింద్రః ॥ 118

(6) ఉ॥ వానలు లేమి భూ గగన భాగము వహ్ని వశంబునన్ భయం
బూనుచు నుండునట్లె కడు సూష్మ లతం గను నీ ద్యులోకముల్
కాన మదీయ సంస్తుతులఁ గ్రన్నన వీనులఁబెట్టి యింద్రుఁడా!
మానక మేఘ మండలము మర్దనఁజేయుచు వారి నీయవేః ॥ 11

క॥ మాయికములు సంహారో, పాయములు త్రిసప్త యోగ్య భట సంచయమిీ
సాయముఁగొని యరి మీఁదికిఁ, బోయెదవు మహేంద్రః నీవు పొలుపారంగన్ ॥ 120

† వైల స్థాన మశేరన్ = బిల స్థానమునఁ బరుండునట్లు చేయుట—ఈ శబ్దార్థమువలన నీ సూక్తమందుఁ జనిపోయిన వారిని భూ స్థాపనముఁ జేయు విధంబుకూడ నుండెనని తోచుచున్నది. (నే.వేంన.శా.) శ్రీ నేమాని వారు వ్రాసిన యీ ఫుట్‌నోటు కాధారము సాయన భాష్యము. వ.గో.కృ.

గమనిక—"వైరులు" ఇత్యాదిగాఁగల కందపద్యములోని (117వ.పద్యము) మూఁడవ పాదము "గోరి దహియింపఁజేయుచు" అని వ్రాతప్రతిలోఁ గలదు. (వ్రాతప్రతి 2వ సంపుటము. ప్రథమ మండలము. 42-43 పుటలు-42వ పుటలో దీనిని గుఱించి శ్రీ నేమాని వారువ్రాసిన ఫుట్‌నోట్ కలదు.) ప్రథమ మండలము 133వ సూక్తములోని ప్రథమ ఋక్కున కనువాదముగా రచించిన పద్యద్వయమునకు శ్రీ నేమానివారు వ్రాసిన పైఫుట్‌నోటు విషయము చూచినఁ బ్రథమ ఋగనువాద పద్యములలో రెండవ పద్యమైన "వైరులు గుమి గూడుచు" ఇత్యాది పద్యములోఁ దృతీయ పాదము "గోరి దహియింపఁజేయుచు" అనికాక "గోరి దహియింపఁజేయక" అని యుండనగును, అప్పుడు శవములను శ్మశానములోఁ గాల్చక వారి గృహములందే భూస్థాపితము చేసి వారి గృహములనే శ్మశానము లగునట్లు చేసితి వని యర్థము వచ్చును. కానఁ బద్యములోఁ గల "జేయుచు" నను పదమును "జేయక"గా నుంచుట శ్రీ నేమానివారి హృదయముగా నెంచి సవరించితిని. వ.గో.కృ.

1. 117వ. పద్యము తొలి పాఠ మీ విధముగా నున్నది. "వైరులఁగుమిఁ గూడియు రాన్, వారివి వధియించి యింద్రః వారి గృహములన్, (దావశః) (3వ. పాదము తొలుత "దావశ" అని వ్రాసి ప్రాసభంగమును గుర్తించి కొట్టివేసెను.) గోరి దహియింప జేయుచు, వీరుఁడవై నెసఁగ మెసఁగ వెలసితివి కదేః ॥ (చూడు వ్రాతప్రతి 1వ. మండలము 2వ. సంపుటము 43వ పుట) 2. పైశాచంబు (తొ.పా.) 3. నెక్కువింద్రః (తొ.పా.) ఈ తొలిపాఠములో యతిభంగము. వ.గో.కృ.

(7) ఉ॥ సర్వ జగత్ప్రసిద్ధమగు [1]చక్కని సోమము గూర్చు వార లీ
యుర్విని, బెద్దకాలము మహోన్నతిఁ జెందుచు సంతసంబునన్
సర్వజనాభిగమ్యమగు సద్మము నొందుచు శత్రు మాలికా
గర్వ మడంచి యన్నమును గాంచుచు నుందురు శక్రదేవుఁడా! ॥ 121

## అనువాకః—20, సూక్తమ్—134

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—వాయుః

ఛందః—అత్యష్టిః, 6-అష్టిః

(1) ఆ త్వా జువో రారహాణా[1] అభి ప్రయో వాయో వహన్త్విహ

పూర్వపీతయే సోమస్య పూర్వపీతయే ।

ఊర్ధ్వా తే[2] అను సూనృతా మనస్తిష్ఠతు జానతీ ।

నియుత్వతా రథేనా యాహి దావనే వాయో మఖస్య దావనే ॥ 116

(2) మన్దన్తు త్వా మన్దినో వాయవిన్దవో ऽస్మత్ క్రాణాసః

సుకృతా[3] అభిద్యవో గోభిః క్రాణా[4] అభిద్యవః ।

యద్ధ క్రాణా[5] ఇరధ్యై దక్షం సచన్త[6] ఊతయః ।

సధ్రీచీనా నియుతో దావనే ధియ[7] ఉపబ్రువత ఈం ధియః ॥ 117

1. జక్కని సోమ మొనర్చు వారలీ (తొ.పా.) నవరించిన పాఠములోఁగూడ గ్రంథకర్త తద్ధర్మార్థకమైన "అగు" మీఁద "జక్కని" అని సరళాదేశ రూపము వ్రాయుట పొరపాటు. ఇట్లు తద్ధర్మార్థకములపైఁ బరుషములకు సరళాదేశము చేయుట యీ గ్రంథకర్తకుఁ బరిపాటి. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోటులు (372.373.374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. రహాణాऽఅభి, 2. తేऽఅను, 3. సుకృతాऽఅభి, 4. క్రాణాऽఅభి 5. క్రాణాऽఇరధ్యై 6. సచన్తऽఊతయః 7. ధియఽఉప (వా.ప్ర.)

(3) వాయుర్యుంక్తే రోహితా వాయురరుణా వాయూ రథే[1]
అజిరా ధురి వో[2]ఢ్హవే వహిష్ఠా ధురి వోఢ్హవే[3] ।
ప్ర బోధయా పురంధిం జార ఆ ససతీమివ ।
ప్ర చక్షయ రోదసీ వాసయోషసః శ్రవసే వాసయోషసః ॥

(4) తుభ్యముషాసః శుచయః పరావతి భద్రా వస్త్రా
తన్వతే దంసు రశ్మిషు చిత్రా నవ్యేషు రశ్మిషు ।
తుభ్యం ధేనుః సబర్దుఘా విశ్వా వసూని దోహతే ।
అజనయో మరుతో వక్షణాభ్యో దివ[4] ఆ వక్షణాభ్యః ॥ 119

(5) తుభ్యం శుక్రాసః శుచయస్తురణ్యవో మదేషూగ్రా[5]
ఇషణన్త భుర్వణ్యపామిషన్త భుర్వణి ।
త్వాం త్సారీ దసమానో భగమీట్టే తక్వవీయే ।
త్వం విశ్వస్మాద్ భువనాత్ పాసి ధర్మణా[6]ఽసూర్యాత్ పాసి ధర్మణా ॥ 120

1. రథేఽజిరా (వా.ప్ర.) 2.3. వోళ్హవే (సా.మా.) 4. దివఽఆ. 5. గ్రాఽఇష. 6. ధర్మణాఽసూర్యాత్.

(6) త్వం నో వాయవేషామపూర్వ్యః సోమానాం

ప్రథమః పీతిమర్హసి సుతానాం పీతిమర్హసి ।

ఉతో విహుత్మతీనాం విశాం వవర్జుషీణామ్ ।

విశ్వా[1] ఇత్ తే ధేనవో దుహ్ర[2] ఆశిరం ఘృతం దుహ్రత[3] ఆశిరమ్ ॥ 121

## అనువాకము—20, సూక్తము—134

### ఋషి—పరుచ్ఛేదుఁడు *

### దేవత—వాయువు

(1) ఉ॥ వాయువః వేగముంగల్గు వాజులు [1]ని న్నతిమైత్రి నిష్టికిన్
బాయక దెచ్చుఁగాకఁ [2]గడుఁబ్రౌఢ నుతుల్ చెవికెక్కుఁగాక నే
మాయలు లేని హవ్యముల మన్ననచేఁ[3] గయికొంచు మమ్ములం
జేయుచు సౌఖ్యవంతులుగఁ జేర్తువుగాకః ధనంబు మా కిలన్ ॥ 122

క॥ వాయువః నీ వెక్కిడికిం, బోయిన నీతోడ వచ్చుఁ బూజ్య హయంబుల్
చేయుచు నీ పరిచర్యను, మాయురెః నిన్నుఁ దెచ్చుఁగాకః మా యిష్టులకున్ ॥ 123

(2) ఉ॥ తావక హోమముల్ జరుపు తత్త్వ పరిజ్ఞులు నిన్నుఁజేరి స
ద్భావములెల్లఁ జాటుదురు పావక మిత్రమః వాయుదేవుఁడాః
కావున హర్షదంబును బ్రకాశయుతంబును శోధితంబునై
నీవిగ నిద్ధ సోమ రస మెంతయు నీకు మదంబుఁ జేయదేః ॥ 124

---

1. విశ్వేదిత్, 2. దుహ్రఆశిరం. 3. దుహ్రత్ఆశిరమ్ (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372,373,384-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. విన్నతిప్రీతి (తొ.పా.గణభంగము) వ.గో.కృ. 2. యతి ప్రౌఢ నుతుల్ (తొ.పా. గణభంగము) వ.గో.కృ. 3. చేగైకొంచు (వ్రా.ప్ర.పా. గణభంగము,) వ.గో.కృ.

(3) చ॥ ఒకపరి రోహి తాశ్వముల నొక్కొక వేళను రక్త వాజు లిం
కొక పరిఁ జిత్ర వాహముల నున్నత యానము ముందు గట్టుచున్
సకల భరంబు లాగుచును జారుఁడు సుప్త పరాంగనన్ వలెన్
జకచక మేలుకొల్పుము ప్రశస్త గృహస్థుల నీవు వాయువా! ॥ 125

గీ॥ దివికిఁ భూమికిఁ జక్కని తేజ మొసఁగ, నధిక సద్భక్తితో నిద్ధ హవ్య మంద
మిత్ర యజమానులను నీవు మేలుకొల్పఁ, గలుఁగఁజేయు ముషస్సుల గాలివేల్ప! ॥ 126

(4) ఉ॥ వాతయుషస్సు ఘృష్టలను వస్త్రములం గడుఁ గల్గఁజేయుచున్
[1]జాతముగాఁ బ్రపంచమున సాగుచు నుండెదు, పాల నిచ్చు గో
వ్రాతముకెల్ల నాజ్యము నవశ్య మొసంగుచు నుందు వీవు సం
ప్రీతిని గల్గఁ జేయుదువు భీమ మరుత్తుల వానపాటుకై ॥ 127

(5) ఉ॥ సోమ రసంబు గ్రోలి పరిశుద్ధత నొంది సువృష్టి గోరుచున్
సోమమయేష్టులన్ మిగుల సోమముఁదీయుచు నీ కొసంగుచో
నీమముఁబూని భూతముల నిత్యము కాచుచు నుండువాఁడ వో
కామదవాత! యజ్ఞతతి ఘాతకులన్ హరియింపవే! కృపన్ ॥ 128

(6) ఉ॥ అందఱికంటె మున్ను రస మానుట కర్హుఁడ వౌటచేతనే
ముందుగ యజ్ఞ సీమ నది పొందెదు హవ్యముగూడ నట్టులే
యందెదు నెల్లవేళలను యాజ్ఞిక గోవులు నీకు దుగ్ధమున్
బొందుగ నీయ నన్నిటిని బొందఁగఁ జేయుము చేతనం బిలన్ ॥ 129

1. "జాతమయి ప్రపంచము" అని వ్రాతప్రతిలో నున్నది. "జాతమయి ప్రపంచము" అను నప్పుడు ప్రపూర్వకమైన యచ్చు తెలుఁగు "అయి" లోని "యి" వర్ణము గురువు కానేరదు. కాఁగా నుత్పలమాలాలక్షణము దృష్ట్యా గణభంగ మగును. కావున "జాతముగాఁ బ్రపంచమున" అని సవరింపఁబడినది. "జాతమయి" అన్నప్పుడు సంస్కృత "మయి" ని "మయత్వముకలది" యనిగాని "జాతమయ" అనిగాని గ్రహించినను సలక్షణముగానే యుండును. వ.గో.కృ.

## సూక్తమ్ — 135

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—1-3,9 వాయుః, 4-8 ఇంద్రవాయూ†

ఛందః—అత్యష్టిః, 7-8 అష్టిః

(1) స్తీర్ణం బర్హిరుప నో యాహి వీతయే సహస్రేణ

నియుతా నియుత్వతే శతినీభిర్నియుత్వతే ।

తుభ్యం హి పూర్వపీతయే దేవా దేవాయ యేమిరే ।

ప్ర తే సుతాసో మధుమన్తో[1] అస్థిరన్ మదాయ క్రత్వే[2] అస్థిరన్ ॥ 122

(2) తుభ్యాయం సోమః పరిపూతో[3] అద్రిభిః స్పార్హా

వసానః పరి కోశమర్షతి శుక్రా వసానో[4] అర్షతి ।

తవాయం భాగ[5] ఆయుషు సోమో దేవేషు హూయతే ।

వహ వాయో నియుతో యాహ్యస్మయుర్జుషాణో యాహ్యస్మయుః ॥ 123

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్ నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

† మాక్స్‌ముల్లర్ ప్రతిలో 4-8 ఋక్కుల కింద్రుఁడే దేవతగాఁ బేర్కొనఁబడెను. సాయన భాష్యములో "ఆవాంరథః" ఇత్యాది ఋక్పఞ్చక మైన్ద్రమ్ అని సూక్తమునకుఁ దొలుత 5వ. ఋక్కునకు సైతము నింద్రుఁడే దేవతగాఁ బేర్కొనఁబడినది. కాని 5వ ఋక్కునకు వ్రాసిన భాష్యములో ఇంద్ర వాయువు లిరువురును దేవతలైనట్లు "హే ఇన్ద్రవాయూ" అని వ్రాయుట రూపముగా నింద్ర వాయువుల యుభయ దైవత్వమే పేర్కొనఁబడినది. సూక్తమునకు ముందు 6-8 ఋగ్దేవతల విషయమై ప్రస్తావింపఁ బడలేదు గాని యీ ఋక్కులన్నిటి భాష్యములలోను నింద్ర వాయువు లుభయులును దేవతలుగాఁ బేర్కొనఁబడినది. 9వ ఋక్కునకు నన్ని ప్రతులలోను వాయువే దేవతగాఁ గలదు, వ,గో.కృ.

1. మన్తోఽఅస్థిరన్ 2. క్రత్వేఽఅస్థిరన్ 3. పరిపూతోఽఅద్రిభిః, 4. శుక్రా వసానోఽఅర్షతి, 5. భాగఽఆయుషు. (వ్రా.ప్ర)

(3) ఆ నో నియుద్భిః శతినీభిరధ్వరం సహస్రిణీభిరుప

యాహి వీతయే వాయో హవ్యాని వీతయే ।

తవాయం భాగ[1] ఋత్వియః సరశ్మిః సూర్యే సచా ।

అధ్వర్యుభిర్భరమాణా[2] అయంసత వాయో శుక్రాః[3] అయంసత ॥ 124

(4) ఆ వాం రథో నియుత్వాన్ వక్షదవసే ఽభి ప్రయాంసి

సుధితాని వీతయే వాయో హవ్యాని వీతయే ।

పిబతం మధ్వో[4] అన్ధసః పూర్వపేయం హి వాం హితమ్ ।

వాయవా చన్ద్రేణ రాధసా గతమిన్ద్రశ్చ రాధసా గతమ్ ॥ 125

(5) ఆ వాం ధియో వవృత్యురధ్వరాగ్ం[5] ఉపేమమిన్దుం[6]

మర్మృజన్త వాజినమాశుమత్యం న వాజినమ్ ।

తేషాం పిబతమస్మయూ[7] ఆ నో గన్తమిహోత్యా ।

ఇన్ద్రవాయూ సుతానామద్రిభిర్యువం మదాయ వాజదాయువమ్ ॥ 126

---

1. భాగఽ ఋత్వియః, 2. భరమాణాఽఅయం, 3. శుక్రా అయం. 4. మధ్వోఽ అన్ధసః (వా.ప్ర.) 5. రాగ్ంఽ ఉపేమ. 6. మిన్దుమర్మృజన్త. 7. యూఽఆనో. (వా.ప్ర.)

(6) ఇమే వాం సోమా[1] అప్స్వా సుతా[2] ఇహాధ్వర్యుభిర్భరమాణా[3]

అయంసత వాయో శుక్రా[4] అయంసత ।

ఏతే వామభ్యసృక్షత తిరః పవిత్రమాశవః ।

యువాయవోఽతి రోమాణ్యవ్యయా సోమాసో[5] అత్యవ్యయా ॥ 127

(7) అతి వాయో ససతో యాహి శశ్వతో యత్ర గ్రావా

వదతి తత్ర గచ్ఛతం గృహమిన్ద్రశ్చ గచ్ఛతమ్ ।

వి సూనృతా దదృశే రీయతే ఘృతమా పూర్ణయా నియుతా

యాథో[6] అధ్వరమిన్ద్రశ్చ యాథో[7] అధ్వరమ్ 128

(8) అత్రాహ తద్ వహేథే మధ్వ[8] ఆహుతిం

యమశ్వత్థముపతిష్ఠన్త జాయవో ఽస్మే తే సన్తు జాయవః ।

సాకం గావః సువతే పచ్యతే యవో న తే వాయ[9]

ఉప దస్యన్తి ధేనవో నాప దస్యన్తి ధేనవః ॥ 129

1. సోమ్యాఽఅప్స్వా, 2. సుతాఽఇహా, 3. భరమాణాఽఅయం, 4. శుక్రాఽఅయంసత, 5. సోమాసోఽఅత్య, 6. యాథోఽఅధ్వర, 7. యాథోఽఅధ్వరమ్, 8. మధ్వఽఆహుతిం, 9. వాయఽఉప, (ప్రా.ప్ర.)

(9) ఇమే యే తే సు వాయో బాహ్వోజసోऽన్తర్నదీ తే

పతయన్త్యుక్షణో మహి వ్రాధన్త[1] ఉక్షణః ।

ధన్వఞ్చిద్ యే[2] అనాశవో జీరాశ్చిదగిరౌకసః ।

సూర్యస్యేవ రశ్మయో దుర్నియన్తవో హస్తయోర్దుర్నియన్తవః ॥ 130

## సూక్తము—135

### ఋషి—పరుచ్ఛేపుఁడు*

### దేవత—4-8 ఇంద్రవాయువులు, 1,2,3,9-వాయువు†

(1) మ॥ శతసంఖ్యాక మహాశ్వ మాలికలచే సన్నద్ధమైనట్టి యా
తత యానంబును నెక్కివచ్చి మృదు దర్భం జేరుమా; వాయువా!
యతులైశ్వర్య సమగ్రులైన నమరాధీశాదులన్ వీడి నీ
కతిమోదంబుగ సోమ ముంచి రదిగో! యజ్ఞాగ్ని చెంతన్ జనుల్ ॥ 130

1. వ్రాధన్తऽఉక్షణః, 2. య్యేఽఅనాశవో (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373 374-376-379 పుటలు) చూడ నగును. వ.గో.కృ.

† ఆంధ్రానువాదగ్రంథములో (వ్రాతప్రతి 1వ. మండలము. 2వ, సంపుటము 47వ. పుట) 4-8 ఋక్కులకు ఇంద్రుఁడు మాత్రమే దేవతగా వ్రాయఁబడినది. శ్రీనేమానివారు స్వహస్తముతో వ్రాసిన ఋషి దేవతల పట్టికలు గల 15b సంపుటములో వాయువు, వాయువు, ఇంద్రుఁడు. మిత్రావరుణులు దేవతలుగా వ్రాసిరి. ఇది పొరపాటుగాఁదేటతెల్ల మగుచున్నది. 4-8 ఋక్కుల కనువాద పద్యములైన వానిలో నింద్ర వాయువు లిరువురును దేవతలుగా స్పష్టముగానే యుటంకింపఁబడినది. దేవతలవిషయమై యీ సూక్తమందలి సంస్కృత మూలములగు ఋక్కులన్నింటిని బరిశీలించినను, శ్రీ నేమానివారి యనువాద పద్యములను బరిశీలించినను, శ్రీ నేమానివారు 15b సంఖ్యగల సంపుటములో వ్రాసిన దేవతలు సరిగా లేవని స్పష్టమగుచున్నది. వ.గో.కృ.

(2) ఉ॥ చారు దశా పవిత్రములఁ జక్కఁగ శోధిత మైన సోమముం
గూరిచి వచ్చి గ్రోలు మది కోశ గృహంబున నుంచినార మి
ద్ధారణి నీకె యీయఁబడెఁ దక్కిన వారిని వీడి నీవు దు
ర్వార ఫలంబు మా కిడు చవారిత తుష్టి వహించుమా! సఖా! ॥ 131

(3) ఉ॥ శూరుని భంగి సోమ మతిశోభ వెలుంగుచునుండె నీ యెడన్
మారుత! వచ్చి దాని బహుమానముతోఁ గని యశ్వమాలికా
చారు రథంబు నెక్కి బుధ సన్నుతిఁ బొందుచు [1]నీవు సోమముం
జేరుచు దానిఁ గ్రోలవఁటె శీఘ్రముగా నిట విశ్రమించుచున్ ॥ 132

(4) మ॥ నియుతాశ్వాళి నిబద్ధయానము నినున్ దేవాధిపున్ వాయువా!
ప్రియ మొప్పం గొనితేర[2]మీరలు మముం బ్రీతాత్ములం జేయుచున్
దయతో మాకు హిరణ్య గోధనములం దథ్యంబుగా నిచ్చుచున్
భయముం దీర్పరె! ముందు సోమ రసముం బానంబు గావింపరే! ॥ 133

(5) ఉ॥ మీరలు వచ్చి మా కడకు మేదుర తుష్టిని గల్గఁజేయుచు
[3]న్నారు మహేంద్ర! మారుతగణంబ! హయంబును దోమునట్లుగా
సార దశాపవిత్రములఁ జక్కఁగ శోధితమైన సోమ మిం
పారఁగఁ ద్రావి యన్నము మహాయశమున్ దయసేయుఁ డెంతయున్ ॥ 134

(6) ఉ॥ నీకును దేవతా పతికి నేర్పున హోమము సేయ సోమ మ
స్తోకముగాఁగఁ దెచ్చి యతిశోభ దలిర్పఁగఁ బిండి దాని నీ
కై కడుఁ గంబళంబుపయిఁ[4]గా నిడినారము మైత్రివల్ల నే
సాకులు చెప్పకుండ రభసంబునఁ ద్రావఁగ రమ్ము వాయువా! ॥ 135

(7) సీ॥ జీవనప్రదము లౌ గ్రావాధ్వనులు చాల భక్త పంక్తికి వినంబడెను గాన
సోమ రసం బెల్ల సూనృత స్తుతులతో నిండుచు శ్రీదమైయుండెఁ గాన
నావహనీ యాగ్నికై యాజ్య పాత్రల ధీర ఋత్విజు లుంచినారు కాన
నధిక రుచ్యంబు లౌ హవ్యంబులన్ దెచ్చి నతులఁ బెద్దలు వెల్గినారు కాన
గీ॥ వాయువా! యింద్ర! మము మీరు పాయకుండఁ, జాల నిద్రించు యజమానచయముదాఁటి
రాజితాశ్వములను బూన్చు రథము నెక్కి, వచ్చి సవనక్రియంజూచి మెచ్చవలదె! ॥ 136

1. సోమ మంత నా, చారము త్రోసిరాజనక పంతస మొందుచు నీవు గ్రోలవే! (తొ.పా.)

2. ఇచ్చట నుండి 8వ ఋక్కువఱకు (137వ పద్యమువఱకు) నింద్రవాయువు లిరువురును దేవతలు కావున బహువచన ప్రయోగములె ప్రామాణికములు. ఆంధ్రానువాదము మూలవ్రాతప్రతిలో నెవరో యేకవచన యుక్తముగా నీపద్యములో నిక్కడ "నీవును" అని సవరించిరి. ఇది సరికాదు. వ.గో.కృ.

3. అసలు తొలిపాఠము "జేయుచున్నారు మహేంద్ర! మారుత గణంబ! హయంబును" అని సలక్షణముగా నుండఁగా నెవరో "మహేంద్రమారుతగణంబ!" యనుదానిని "మరున్మహేంద్రులు! ప్రశస్థ" అని యతి తప్పిన సంగతి గుర్తింపకసవరించిరి. వ్రాతప్రతిలో సవరణకుఁబూర్వమే (కొట్టివేయఁబడి) యున్నపాఠమే సరియైన పాఠము. వ.గో.కృ. 4. పయిఁగా యతనంబొన రించినారమే! సాకులు (తొ.పా.)

(8) †గీ॥ యజ్ఞమున మీర లిద్దఱు, యవ విరచిత, మృదు పురోడాశమును దివ్వి మెలఁగుటకయి
యాల పాలన్ని యిచ్చట నమరియుండె, నింద్ర వాయువులార! మీ రిటకు రారె! ॥ 137

(9) †క॥ గిరి శిఖ రాదుల నుండెడు, వరసోమము దీసి మనుజవరు లనిలమ! నీ
కరమర లేకయె యాహుతి, బిరబిరఁ జేసెదఱు దాని వేగము గొనవే! ॥ 138

## సూక్తమ్—136

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—1-5 మిత్రావరుణౌ, 6-7 లింగోక్తాః

ఛందః—అత్యష్టిః, 7 త్రిష్టుప్

(1) ప్ర సు జ్యేష్ఠం నిచిరాభ్యాం బృహన్నమో హవ్యం మతిం
భరతా మృళయద్భ్యాం స్వాదిష్ఠం మృళయద్భ్యాం ।

† ఆంధ్రానువాదగ్రంథమైన మూలవ్రాతప్రతిలోఁ గేవలము నెనిమిది ఋక్కుల కనువాదపద్యములు వ్రాయఁబడినట్లు వ్రాయుట జరిగినది. వాస్తవమునకు 8వ. ఋక్కున కనువాద పద్యములుగా రెండు పద్యములు "గిరి శిఖ రాదుల నుండెడు" ఇత్యాది కందపద్యము, "యజ్ఞమున మీర లిద్దఱు" ఇత్యాది తేటగీతిపద్యమును (137-138 పద్యములు వ్యత్యస్తపద్యములుగా-1వ. మండలము 2వ. సంపుటము 49వ. పుట) వ్రాయఁబడినవి. ఈ పద్యములు రెండును సంస్కృతములోని ఋక్కులతోఁ బోల్చిచూడఁగా 8వ ఋక్కున కనువాదముగా 137వ పద్యమగు "యజ్ఞమున మీరలిద్దఱు" ఇత్యాది పద్యము 9వ ఋక్కున, కనువాదముగా 138వ పద్యమగు "గిరిశిఖ రాదుల నుండెడు" నిత్యాది పద్యమును శ్రీ నేమానివారిచే సరిగానే విరచింపఁ బడినట్లు తేలినది. కాని 8వ ఋక్సంఖ్యను వేసి తారుమారుగా నీ రెండు పద్యములును తొలి పద్యము తరువాతను, దరువాతి పద్యము ముందును, పొరపాటున వ్రాయుట జరిగినది. మీఁదు మిక్కిలి అసలు 9వ ఋక్సంఖ్య వేయకయె 9వ ఋక్కున కనువాద పద్య మేదియుఁజూపకయె విడిచి పెట్టఁబడినది. ఇది చాల పొరపాటుగా వ్రాయఁబడినట్లు స్పష్టము. కాఁగా సంస్కృత మూలమందలి ఋక్కుల కనుగుణముగా 8వ ఋక్కున కనువాద పద్యమగు "యజ్ఞమున మీర లిద్దఱు" ఇత్యాది పద్యమును 137వ పద్యముగాను, 9వ ఋక్కున కనువాద పద్యమగు "గిరిశిఖ రాదుల నుండెడు" ఇత్యాది పద్యమును 138వ. పద్యముగాను మార్చి సరిచేసి ముద్రించుట జరిగినది. 9వ. ఋక్కునకు దేవత వాయువు. శ్రీ నేమానివారు "గిరిశిఖ రాదుల నుండెడు, వరసోమము దీసి మనుజవరు లందఱు నీ, కరమర లేకయె...." ఇత్యాదిగా వ్రాసిన వ్రాతప్రతి పద్యములో వాయుదేవ ప్రసక్తియే లేదు. వాయు శబ్ద పర్యాయ పదమేదియును లేదు. కావున "గిరిశిఖ రాదుల నుండెడు, వరసోమము దీసి మనుజవరు లనిలమ! నీ, కరమర లేకయె...." అని వాయ్వర్థకమైన "అనిల" శబ్దయుక్తముగా సంస్కృత మూలానుగుణముగా సవరించితిని. వ.గో.కృ.

* ఋషి విశేషవిషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోటులు (72-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

తా సమ్రాజా ఘృతాసుతీ యజ్ఞే యజ్ఞ[1] ఉపస్తుతా ।
అథైనోః క్షత్రం న కుతశ్చనాధృషే దేవత్వం నూచిదాధృషే ॥ 131

(2) అదర్శి గాతురురవే వరీయసీ పన్థా[2] ఋతస్య
సమయం స్త రశ్మిభిశ్చక్షుర్భగస్య రశ్మిభిః ।
ద్యుక్షం మిత్రస్య సాధనమర్యమ్ణో వరుణస్య చ ।
అథా దధాతే బృహదుక్థ్యంగ్ం వయ[3] ఉపస్తుత్యం బృహద్ వయః ॥ 132

(3) జ్యోతిష్మతీమదితిం ధారయత్ క్షితిం స్వర్వతీమా
సచేతే దివేదివే జాగృవాంసా దివేదివే ।
జ్యోతిష్మత్ క్షత్రమాశాతే[4] ఆదిత్యా దానునస్పతీ ।
మిత్రస్తయోర్వరుణో యాతయజ్జనో ర్యమా యాతయజ్జనః ॥ 133

(4) అయం మిత్రాయ వరుణాయ శంతమః సోమో
భూత్వవపానేష్వాభగో దేవో దేవేష్వాభగః ।
తం దేవాసో జుషేరత విశ్వే[5] అద్య సజోషసః ।
తథా రాజానా కరథో యదీ మహ[6] ఋతావానా యదీమహే ॥ 134

1. యజ్ఞఽఉప, 2. పన్థాఽఋతస్య, 3. వయఽఉప, 4. శాతేఽఆదిత్యా, (ప్రా.ప్ర.) 5. విశ్వేఽఅద్య, 6. మహఽఋతావనా (ప్రా.ప్ర.)

(5) యో మిత్రాయ వరుణాయా[1]విధజ్జనో ऽనర్వాణం తం
పరి పాతో[2] అంహసో దాశ్వాంసం మర్త్తమంహసః ।
తమర్యమాభి రక్షత్యృజూయన్తమను వ్రతమ్ ।
ఉక్థైర్య[3] ఏనోః పరిభూషతి వ్రతం స్తోమైరాభూషతి వ్రతమ్ ॥ 135

(6) నమో దివే బృహతే రోదసీభ్యాం మిత్రాయ వోచం
వరుణాయ మీఢుహ్యే[4]షే సుమృళీకాయ మీఢుహ్యే[5]షే ।
ఇన్ద్రమగ్నిముప స్తుహి ద్యుక్షమర్యమణం భగమ్ ।
జ్యోగ్జీవన్తః ప్రజయా సచేమహి సోమస్యోతి సచేమహి ॥ 136

(7) ఊతీ దేవానాం వయమిన్ద్రవన్తో మంసీమహి [6]స్వయశసో మరుద్భిః ।
అగ్నిర్మిత్రో వరుణః శర్మ యంసన్ తదశ్యామ మఘవానో వయం చ । 137

ఇతి
ద్వితీయోऽష్టకే ప్రథమోऽధ్యాయ
స్సమాప్తః

1. వరుణాయ, 2. పాతోऽంహ, 3. ఉక్థైర్యఽఏనోః, (వా.ప్ర.) 4,5. మీఢ్షేషే. 6. స్వయశసో (వా.ప్ర. సా.మా.)

## సూక్తము—136

ఋషి—పరుచ్ఛేపుఁడు *

దేవత—మిత్రావరుణులు-6-7 లింగోక్త దేవతలు-†

(1) క॥ మిత్ర యజమాన గణము స. చిత్రముగాఁ జేయువారు వేలుపు లగు నా
మిత్రా వరుణులకొఱకై. స్తోత్రములన్ హవ్యములను సూరు లిడరొకో! ॥ 139

క॥ ఆ మిత్రా వరుణులు కడు, ధామముగలవారు వృష్టి ధారాకారుల్
కామదులు కాన వారిని. సీమముతో నుగ్గడింతు నింతు మనమునన్ ॥ 140

(2) ఉ॥ అల్లదిగో యుషస్సు కడు నందముగా వెలుఁగొందె సంతతున్
మెల్లఁగ మానవాళియు మేల్కొనె సూర్యుని కాంతి పుంజముల్
పల్లవ శోభ నొందె బహుధంగుల మిత్ర భగార్యమోత్తముల్
తెల్లఁగ వెల్గుచుండి రికఁ బెంచు హవిస్సుల నెల్ల వారికై ॥ 141

(3) చ॥ అజయుచు సర్వలక్షణ సమన్వితమై విలసిల్లు వేదికన్
స్థిరముగఁ గూరుచుండెఁ గడుఁ దేకువతో యజమానుఁ డప్పుడే
వరుణుఁడు మిత్రుఁడుం బలము వర్ధిలఁజేసెదరు హవ్య మంతయుం
గరుణ వలిర్పఁ గుడి నిడి కాంతిని బొందుచు నుందు రెప్పుడున్ ॥ 142

గీ॥ అర్యముం డను దేవత యఖిలజనుల. కర్మ కనుగుణ మగునట్లు కార్యములకుఁ
బోవునట్లు లొనర్చుచుఁ బుణ్యలోక, ఫలము నందించుచున్నాఁడు పరమమైత్రి ॥ 143

(4) సీ॥ మేము గూర్చెడు హోమ సోమ రసం బెల్ల మిత్రా వరుణులచే మెచ్చఁబడును
జిత్రమౌ సోమంబు మిత్రా వరుణులచేఁ దలపంచి ప్రీతిగాఁ ద్రావఁబడును
నితర దేవతలచే మితిమీరునట్టులు పుష్టిద సోమంబు పొందఁబడును
యాగాభిరంజిత యజమాన తతిచేత నిష్టిద సోమంబు సీయఁబడును
గీ॥ నఖిల సోమము దేవత లాదరించి. యిపుడె ద్రావుచునున్నార లెదను దలఁచి
సత్యముగలట్టి మిత్రుఁడ! సత్యవరుణ!, యభిమతము మాకు నీయరే! యధిక మీరు ॥ 144

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడవగును. వ.గో.కృ.

† సంస్కృత మూలప్రతులలో 6-7 ఋక్కులకు లింగోక్త దేవతలు దేవతలుగాఁ జేర్కొనుట జరిగినవి. ఆంధ్రానువాదములో శ్రీ నేమానివారు ఋక్కు లన్నింటికిని మిత్రావరుణులు దేవతలుగాఁజేర్కొనిరి. కాని 6-7 ఋక్కుల కనువాద రూపములైన 146-147-148 పద్యాలలో మిత్రావరుణులే కాక తదితర విభిన్న దేవతలునైత ముటంకింపఁబడిరి. కావున 6-7 ఋక్కుల లింగోక్త దేవతల విషయమై శ్రీ నేమానివారు వ్రాయకపోవుట పొరపాటు. వ.గో.కృ.

(౫) క॥ రక్షించు సర్యముఁడు కడు. రక్షింతురు వరుణ మిత్ర రాజులు జనులన్
రక్షింతురు వారలె సం, రక్షకులయి మంత్ర వేత్తృ రాజిని ప్రీతిన్ ॥ 145

(౬) క॥ వరుణుని మిత్రుని సౌఖ్యా, కరులగు రవి రుద్ర నిశలఁ గాంచుచు నెలమిం
గరము నుతించుచు నుంటిమి, వరము లొసంగుదురు మాకు వారలు ప్రీతిన్ ॥ 146

గీ॥ అర్యముని నగ్ని దేవుని నమరనాథు, భగుని నుతియించుచున్నాము పరమ భక్తి
వారి మూలంబునంజేసి వలసినంతఁ, బుత్ర పౌత్రాభి సంవృద్ధి పొసఁగు మాకు ॥ 147

(౭) క॥ సుతులన్ సంతుష్టింగను, మతిమన్మారుత గణంబు మాకుఁ గలుఁగుటన్
మితిలేని కీర్తిఁ బొందుచు, నతిశయ సుఖసాధనంబు నందుదు మెపుడున్ ॥ 148

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర
సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వంశ సంజాత వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు
ద్వితీయాష్టకమునఁ బ్రథమాధ్యాయము
సమాప్తము

---

# సమూల శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ద్వితీయోఽష్టకః—ద్వితీయోఽధ్యాయః

### సూక్తమ్—137

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

దేవతా—మిత్రావరుణౌ

ఛందః—అతిశక్వరీ

(1) సుషుమా యాతమద్రిభిర్గోశ్రీతా మత్సరా[1] ఇమే సోమాసో మత్సరా[2] ఇమే ।

ఆ రాజానా దివిస్పృశా[3] ఽస్మత్రా గన్తముప నః ।

ఇమే వాం మిత్రావరుణా గవాశిరః సోమాః శుక్రా గవాశిరః ॥ 1

(2) ఇమ[4] ఆ యాతమిన్దవః సోమాసో దధ్యాశిరః సుతాసో దధ్యాశిరః ।

ఉత వాముషసో బుధి సాకం సూర్యస్య రశ్మిభిః ।

సుతో మిత్రాయ వరుణాయ పీతయే చారుర్ఋతాయ పీతయే ॥ 2

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్ నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1,2. మత్సరాఽఇమే. 3. స్పృశాస్మత్రాగస్త. 4. ఇమఽఆ. (ప్రా.ప్ర.)

(3) తాం వాం ధేనుం న వాసరీమంశుం దుహన్త్యద్రిభిః సోమం దుహన్త్యద్రిభిః ।
అస్మత్రా గన్తముప నో ఽర్వాఞ్చా సోమపీతయే ।
అయం [1]వాం మిత్రావరుణా నృభిః సుతః సోమ[2] ఆ పీతయే సుతః ॥ 3

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ద్వితీయాష్టకము—ద్వితీయాధ్యాయము

### సూక్తము—137

ఋషి—పరుచ్ఛేపుఁడు*

దేవత—మిత్రావరుణులు

(1) చ॥ దివమున రాజచంద్రముల దీప్తి వహించెడు మీ నిమిత్తమై
నవనవ సోమవల్లికల నవ్య రసంబును దీసి దాన సం
స్తవమును గన్న దుగ్ధముల సమ్మతిఁ జేర్చుచు నుంచినార మో
సవన రసజ్ఞుఁడా! వరుణ! చక్కని మిత్రుఁడ! రండు! మీ రొగిన్ ॥ 1

క॥ తక్కిన సోమముకంటెను, నెక్కువ సంతృప్తిఁ జేయు నిది మీకు మదం
బక్కజముగఁ బుట్టించుం, జక్కని రస మెల్లఁ [1]ద్రావఁ జనుదెం డిటకున్ ॥ 2

1. వాం (వ్రా.ప్ర.సా.మా.). 2. సోమఽఆపీతయే (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. ద్రావఁజనుఁడీ మీరల్ (తా.పా.)

(2) చ॥ అతిఘనమైన సోమమును నశ్మములం జితుకంగఁగొట్టి యా
హితరస మెల్లఁ దీసితి మహీనత దాని దధిన్ ప్రశస్త మౌ
నతి నుతిఁ జేర్చినారము మహాత్మ! దివాకర! కల్యకాంతి వి
స్తృతియును దానిపైఁబడెదుఁ దేకువ మీరలు వచ్చి ద్రావరే! ॥ 3

(3) క॥ పా లిచ్చునట్టి గోవుల, పాలెల్లంఁ బిదుకునట్లు పండితవర్యుల్
చాలఁగ సోమముఁ దెచ్చుచు, నోలి రసము దీసి యిచట నునిచిరి వేడ్కన్॥ 4

## సూక్తమ్—138

ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః*

దేవతా—పూషా

ఛందః—అత్యష్టిః

(1) ప్రప్ర పూష్ణస్తువిజాతస్య శస్యతే మహిత్వమస్య

తవసో న తన్దతే స్తోత్రమస్య న తన్దతే ।

అర్చామి[1] సుమ్నయన్నహమన్త్యూతిం మయోభువమ్ ।

విశ్వస్య యో మన[2] ఆయుయువే మఖో దేవ[3] ఆయుయువే మఖః ॥ 4

(2) ప్ర హి త్వా పూషన్నజిరం న యామని స్తోమేభిః

కృణ్వ[4] ఋణవో యథా మృధ[5] ఉష్ట్రో న పీపరో మృధః ।

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన పుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. అర్చామి, 2. మనఽఆయు, 3. దేవఽఆయు, 4. కృణ్వఽఋణవో, 5. మృధఽఉష్ట్రో, (వ్రా.ప్ర.)

హువే యత్ త్వా మయోభువం దేవం సఖ్యాయ మర్త్యః ।

అస్మాకమాఙ్గూషాన్ ద్యుమ్నినస్కృధి వాజేషు ద్యుమ్నినస్కృధి ॥ 5

(3) యస్య తే పూషన్ త్సఖ్యే విపన్యవః క్రత్వా

చిత్ సన్తోऽవసా బుభుజ్రిర[1] ఇతి క్రత్వా బుభుజ్రిరే ।

తామను త్వా నవీయసీం నియుతం రాయ[2] ఈమహే ।

అహేళమాన[3] ఉరుశంస సరీ భవ వాజేవాజే సరీ భవ ॥ 6

(4) అస్యా[4] ఊ షు ణ ఉప సాతయే భువో ऽహేళమానో

రరివాగ్ం[5] అజాశ్వ శ్రవస్యతామజాశ్వ ।

ఓ షు త్వా వవృతీమహి స్తోమేభిర్దస్మ సాధుభిః ।

నహి త్వా పూషన్నతిమన్య[6] ఆఘృణే న తే సఖ్యమపహ్నువే ॥ 7

1. భుజ్రిరఽఇతి, 2. రాయఽఈమహే. 3. మానఽఊరు 4. అస్యాఽఊషుణఽఉప 5. రరివాగ్ంఽఅజాశ్వ 6. పూషన్నతి మన్యఽఆఘృణే. (వా.ప్ర.)

## సూక్తము—138

### ఋషి—పరుచ్ఛేపుఁడు *

### దేవత—పూష †

(1,2) సీ॥ పోషకుం డగు గొప్ప పూష బలంబును నుతియింపకుండునే మతియుతుండు
స్తుతియింపఁబడి వాఁడు సుఖము నందించుచుఁ గాపాడకుండునే కరుణ మమ్ము
నాజికిం బోయెడు నశ్వంబులాగున రాకుండునే యిష్టి రాజికొఱకు
నొంటె భారము మాట్కి యుద్ధవీరుల ననిఁ గడతేర్పకుండునే గణన కెక్కఁ
గీ॥ గడుఁ బ్రకాశించువాఁడును గడు సుఖంబు, నిచ్చువాఁడును నుతులను మెచ్చునట్టి
వాఁడని తలంచి పూషను వేడుచుంటిఁ, గాన శత్రుజయంబులు కలుఁగు నాకు ॥ 5

(3) చ॥ హితకర మైన కర్మము నహీనముగా నొనరించి మానవుల్
స్తుతులను [1]జేసి యెట్టు లతిసుస్థిర సౌఖ్యముఁ బొందుచుందురో!
యతులితరూప! మాకు ధన మంతయు నీయుము [2]నన్లె యాజిలోఁ
బతివయి యుండి శత్రువులఁ బాఱఁగఁ దోలు కడంకతోడుతన్ ॥ 6

(4) చ॥ అజహయ! నీవు మాకడకు నంచిత మంగళ మీయ వచ్చి నీ
యజనముఁ జేయువారలకు నన్న మొసంగుచునుండి యెప్డు నీ
భజనము చేయుచుండు మముఁ బాయక యుండుము సర్వవేళలన్
నిజముగ నీకు భక్తులము నీ కృత కార్యము చాటకుందుమేః ॥ 7

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

† ఈ సూక్తమునకు దేవత పూషగా సంస్కృతమూలము లన్నింటను గలదు. ఆంధ్రానువాద పద్యములందును పూష గానే పేర్కొనెను. కాని దేవతను వ్రాయుటలో "పూషణుఁడు" అని శ్రీ నేమానివారు వ్రాసిరి-ఇది సరికాదు. వ.గో.కృ.

1. నీకుఁ జేసి యతిసుస్థిర. 2. యుద్ధ భూమిలో (వా.ప్ర.పా.) ఈ 6వ పద్యమునఁ బై ? వరణలు చేయకున్నచోఁ బద్యభావ మస్పష్టమై సమన్వయ రహితముగ నుండును. వ.గో.కృ.

## సూక్తమ్ — 139

### ఋషిః—పరుచ్ఛేపో దైవోదాసిః *

**దేవతా—1-విశ్వేదేవాః. 2-మిత్రావరుణౌ. 3-5. అశ్వినౌ. 6-ఇంద్రః. 7-అగ్నిః. 8-మరుతః. 9-ఇంద్రాగ్నీ. 10-బృహస్పతిః. 11-విశ్వేదేవాః.**

**ఛందః—అత్యష్టిః. 5-బృహతీ. 11-త్రిష్టుప్.**

(1) అస్తు శ్రౌషట్ పురో[1] అగ్నిం ధియా దధ[2] ఆ ను

తచ్ఛర్ధో దివ్యం వృణీమహ[3] ఇన్ద్రవాయూ వృణీమహే ।

యద్ధ క్రాణా వివస్వతి నాభా సందాయి నవ్యసీ ।

అధ ప్ర సూ న[4] ఉప యన్తు ధీతయో దేవాగ్ం[5] అచ్ఛా న ధీతయః ॥ 8

(2) యద్ధ త్యన్మిత్రావరుణావృతాదధ్యాదదాథే[6]

అనృతం స్వేన మన్యునా దక్షస్య స్వేన మన్యునా ।

యువోరిత్థాధి సద్మస్వపశ్యామ హిరణ్యయమ్ ।

ధీభిశ్చన మనసా స్వేభిరక్షభిః సోమస్య స్వేభిరక్షభిః ॥ 9

(3) యువాం స్తోమేభిర్దేవయన్తో[7] అశ్వినా ఽఽశ్రావయన్త

ఇవ శ్లోకమాయవో యువాం హవ్యాభ్యాఽఽయవః ।

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్‌నోట్లు (372-373 374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. పురోఽగ్నిం. 2. దధఽఆను. 3. మహఽఇన్ద్ర, 4. సూనఽఉప. 5. దేవాగ్ంఽఅచ్ఛా. 6. దదాథేఽ అనృతం 7. యన్తోఽశ్వినా శ్రావయన్తఽఇవ (వా.ప్ర.)

యువోర్వీర్వా[1] అధి ప్రయః పృక్షః విశ్వవేదసా ।
ప్రుషాయన్తే వాం పవయో హిరణ్యయే రథే దస్రా హిరణ్యయే ॥ 10

(4) అపేతి దస్రా వృష్ణ్యానాకమృణ్వథో యుఞ్జాథే వాం
రథయుజో దివిష్టిష్వధ్వస్మానో దివిష్టిషు ।
అధి వాం స్థామ వన్ధురే రథే దస్రా హిరణ్యయే ।
పథేవ యన్తావనుశాసతా రజో Sఞ్జసా శాసతా రజః ॥ 11

(5) శచీభిర్నః శచీవసూ దివా నక్తం దశస్యతమ్ ।
మా వాం రాతిరుప దసత్ కదా చనాస్మద్ రాతిః కదా చన ॥ 12

(6) వృషన్నిన్ద్ర వృషపాణాస[2] ఇన్దవ ఇమే సుతా
అద్రిషుతాస[3] ఉద్భిదస్తుభ్యం సుతాస[4] ఉద్భిదః ।
తే త్వా[5] మన్దన్తు దావనే మహే చిత్రాయ రాధసే ।
గీర్భిర్గిర్వాహః స్తవమాన[6] ఆగహి సుమృళీకో న[7] ఆ గహి ॥ 13

(7) ఓ షూ ణో[8] అగ్నే శృణుహి త్వమీళితో దేవేభ్యో
బ్రవసి యజ్ఞియేభ్యో రాజభ్యో యజ్ఞియేభ్యః ।

1. వీర్వాSఅధి (బ్రా.ప్ర.) 2. పాణాసSఇన్దవSఇమేసుతా. 3. తాసSఉద్భిదః. 4. సుతాసSఉద్భిదః (బ్రా.ప్ర.) 5. త్వా (సా.) 6. మానSఆగహి. 7. నSఆ. 8. ణోSఅగ్నే. (బ్రా.ప్ర.)

యద్ధ త్యామఙ్గిరోభ్యో ధేనుం దేవా[1] అదత్తన ।
వి తాం దుహ్రే[2] అర్యమా కర్తరీ సచాఁ[3] ఏష తాం వేద మే సచా ॥ 14

(8) మో షు వో[4] అస్మదభి తాని పౌంస్యా సనా భూవన్
ద్యుమ్నాని మోత జారిషురస్మత్ పురోత జారిషుః ।
యద్ వశ్చిత్రం యుగేయుగే నవ్యం ఘోషాదమర్త్యమ్ ।
అస్మాసు తన్మరుతో యచ్చ దుష్టరం దిధృతా యచ్చ దుష్టరమ్ ॥ 15

(9) దధ్యఙ్ హ మే జనుషం పూర్వో[5] అఙ్గిరాః ప్రియమేధః
కణ్వో[6] అత్రిర్మనుర్విదుస్తే మే పూర్వే మనుర్విదుః ।
తేషాం దేవేష్వాయతిరస్మాకం తేషు నాభయః ।
తేషాం పదేన మహ్యా నమే గిరేన్ద్రాగ్నీ[7] ఆ నమే గిరా ॥ 16

(10) హోతా యక్షద్ వనినో వన్త వార్యం బృహస్పతిర్యజతి
వేన[8] ఉక్షభిః పురువారేభిరుక్షభిః ।
జగృభ్మా దూర[9] ఆదిశం శ్లోకమద్రేరధ త్మనా ।
అధారయదరరిన్దాని సుక్రతుః పురూ సద్మాని సుక్రతుః ॥ 17

1. దేవాఽఅదత్తన 2. దుహ్రేఽఅర్యమా 3. సచాఁఽఏష. 4. మోషువోఽఅస్మ 5. పూర్వోఽఅఙ్గిరా 6. కణ్వోఽఅత్రి
7. గిరేన్ద్రాగ్నీఽఆనమే 8. వేనఽఉక్షభిః, 9. దూరఽఆదిశం, (వా.ప్ర.)

(11) ‡యే దేవాసో దివ్యేకాదశ స్థ పృథివ్యామధ్యేకాదశ స్థ ।

అప్సుక్షితో మహినైకాదశ స్థ తే దేవాసో యజ్ఞమిమం జుషధ్వమ్ ॥ 18

## సూక్తము—139

ఋషి—పరుచ్ఛేపుఁడు*

†దేవత—1- విశ్వేదేవతలు అగ్నీంద్ర వాయువులు 2-మిత్రా వరుణులు 3.4.5-అశ్విదేవతలు 6-ఇంద్రుఁడు 7-అగ్ని 8-మరుత్తు 9 ఇంద్రాగ్నులు 10-బృహస్పతి 11-విశ్వేదేవతలు

(1) క॥ అనలుని బ్రణుతించుటచే, ఘనజలముం బొంది వాయు ఘన వాహనులన్
మనస మొనర్చుచు వారికే, వినిపించుచు నుంటి నాదు వినుతుల నెల్లన్ ॥ 8

‡ ఈ 11వ ఋగర్థమునుగూర్చి యాస్కుని యభిప్రాయమును శ్రీ నేమానివారు తమ యనువాద పద్యముకడ (25వ పద్యము) ఫుట్‌నోటులో వ్రాసిరి. శ్రీ నేమానివారి ఫుట్‌నోటు క్రిందనే యనలీ ఋగ్దేవతలఁగూర్చియు ఋగర్థ విశేషములఁగూర్చియు సప్రామాణికముగఁ జర్చించి (431-432-433 పుటలు)వివరించితిని. పాఠకు లీ సూక్తమునకున్న యాంధ్రానువాదము సందర్భముగా ఫుట్‌నోటుగా నేనిచ్చిన నా పరిశోధనాత్మకమై ఆర్ష ఖగోళ విజ్ఞానపరమైన విమర్శను జదువుకొనవలయును. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృతము తెలుఁగు 126-127 సూక్తముల ఋషుల కిచ్చిన ఫుట్ నోట్లు (372-373-374-376-379 పుటలు) చూడనగును. వ.గో.కృ.

† దేవతల విషయమై యాంధ్రానువాద గ్రంథము వ్రాతప్రతిలోఁ (1వ మండలము 2వ సంపుటము 57వ పుటలో)దొలుత విశ్వేదేవతలని పేర్కొని 1వ ఋక్కునకు అగ్ని ఇంద్ర వాయువులని కూడఁ బేర్కొనఁబడెను. విశ్వేదేవతల పేరున నగ్నీంద్ర వాయువులు పరిగృహీతులగుదు రనుకొన్నచో నీ దేవతలు తొలి ఋక్కున కనువాదపద్యములు రెండింటను(8-9పద్యములు)బేర్కొనఁ బడిరి. 11వ ఋక్కునకు విశ్వేదేవతలని యాంధ్రానువాద గ్రంథమున సంస్కృతములోవలెనే గలదు. విశ్వేదేవతలు మొత్తము పది ముగ్గురని యాస్కాచార్యాదులు కొందఱు భావించిరి. వీరిలో నింద్రాగ్నులతోపాటు సూర్యుఁడు సైతము పరిగ్రహింపఁబడెను. ఈ విషయమై 11వ ఋగనువాద పద్యముల ఫుట్‌నోట్‌లోనే శ్రీ నేమానివారు తెల్పిరి. కాని యీ సూక్తము రెండవ ఋక్కున కాంధ్రానువాదము తొలిపద్యము(10వ పద్యము)లో దేవతగా సూర్యప్రసక్తిని వారే చేయుటవల్ల నిది తెలియును. 3-5-6 ఋక్కుల కనువాదపద్యములు చూచినయెడల 3వ ఋగనువాద పద్యద్వయములోను (12-13 పద్యములు) 5వ ఋగనువాద పద్యములోను (17)అశ్విదేవతలు, 6వ ఋగనువాద పద్యములలో రెండింటిలోను (18-19 పద్యములు) నింద్రుఁడును దేవతలని తేటతెల్లమగును. కాని యాంధ్రానువాదము వ్రాతప్రతిలో 3-4-6 ఋక్కులకు నశ్విదేవతలని ఋగంతర్గత దేవతా ప్రసక్తులకు భిన్నముగా వ్రాయఁబడినది. కావున, 3,4,6 అశ్విదేవతలని వ్రాతప్రతిలో నున్నదానిని 3,4,5 లుగా సవరించుట జరిగినది. మిగిలిన దేవతల విషయమై సంస్కృతాంధ్రములలో భిన్నత్వము లేదు. తొలి ఋక్కు ననువదించుటలో విశ్వేదేవతల పరముగా నగ్నీంద్ర వాయువులను బరిగ్రహించుటలో శ్రీ నేమానివారు సాయన భాష్యము ననుసరించినట్లు కన్పట్టును. అసలు విశ్వేదేవతల విషయమును వారి సంఖ్యా పరిమితి విషయమును వేద విజ్ఞానము దృష్ట్యాను నార్ష ఖగోళ విజ్ఞానము దృష్ట్యాను జాల లోతుగా నంతరాంతరములలోనికి వెళ్ళి పరిశోధింప వలసియున్నది. ఈ 139వ సూక్తములోఁ బేర్కొనఁబడిన దేవత లందఱును విశ్వేదేవతలని శ్రీ నేమానివారు భావించినట్లు తోచును. వ.గో.కృ.

గీ॥ ఇంద్రవాయువులారః మిమ్మిష్టిలోన, నుతులఁ గొనియాడుచుంటి నా నూత్నవాక్కు-
లన్ని విని మే మొనర్చెడు సకిల కర్మ, జాల మెల్లను మీకయి గ్రాలుఁగాదె! ॥ 9

(2) క॥ వరుణుఁడ! మిత్రుఁడ! మీరలు, కర ముదకము నింకఁజేసి భరకరుసి లస
త్కరముల దాని నొసంగుచు. స్థిరము ప్రకాశించుచుండి చేయరె! కాంతుల్ ॥ 10

గీ॥ మీ హిరణ్మయరూపం బమేయ యోగ, కర్మముల మానసంబునఁ గనులు తొట్టి
యింద్రియంబులచేతను నినుమడించు, భక్తితోఁ జూఁచుచున్నాము భవ్యులార! ॥ 11

(3) చ॥ స్తవముల మిమ్ము వశ్యులుగఁ దప్పకఁ జేసికొనంగ నెంచి యు
త్సవ విభవాభిరాములయి సారెకు హవ్యముఁ జేతఁగొంచు మీ
యవనము గోరి భక్తజను లందఱు మిమ్ము నుతించి యన్నమున్
ద్రవిణముఁ బొందుచుండెదరు ధారుణి నశ్వినులార! వేడ్కమై ॥ 12

క॥ అధిక బలాఢ్యులు : మీరలు, ప్రథిత హిరణ్యాంచితంబు ప్రకృతిని ఘనమౌ
మధుపూర్ణరథముపైఁ గడు, మధురాన్నం బుంచుకొనుచు మఱియుం జనుఁడీ! ॥ 13

(4) ఉ॥ సారథు లెల్ల మీ రథము చక్కఁగఁ ద్రోలుచు నశ్వులార : యీ
ధారుణిఁ గల్గు యజ్ఞముల దగ్గఱ భూమికి వచ్చుచుంట మే
మారసి యుండలేదె : యది యంతట విస్తృత మౌ మహా
వీరుల చిత్ర కార్యముల వీనులఁ బెట్టని వార లుందురే ? ॥ 14

చ॥ యుగమును బెట్టి కట్టుటకు నున్నత[1]కాష్ఠములన్ వెలుంగుచున్
సొగసగు యాన మ ల్లదిగొ! చూఁడుఁడు : మీరలు వర్షవారులం
దగునటుఁ జేయుచుం గడు నధర్మపరాయణ శత్రుమండలిన్
మగఁటిమిఁ గొట్టి యారథము మానక యెక్కరె : యశ్విదేవతల్ : ॥ 15

పాఠాంతరము

*చ॥ కడు నవలం బహీన మగు ఖస్థలి నాకము నేగువారి కె
ప్పుడు రుజువెట్టు శత్రువులఁ బొల్పుగఁ గొట్టి సమస్త జీవి కిం
పడరఁగ జీవనంబయిన యంబువు లిచ్చిన మీర లశ్వు లి
ప్పుడు వెస రండు! [2] కాష్ఠముల నొప్పెడు బంగరు తేరుపైఁదగన్ ॥ 16

1. కాష్ఠత్రయంబుగల్గు మీ. సొగసగు (తొ.పా. గణభంగము)

* ఈ పాఠాంతర పద్యము శ్రీ పి. రమణమూర్తిగారు రచించినట్లు వ్రాతప్రతిలో (2వ సంపుటము. 59వ పుట) నాంగ్లములో By P. Ramana Murthy అని వ్రాయఁబడియున్నది. శ్రీ నేమానివారి యీ శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 2-3-4-సంపుటములలోఁ గొన్ని కొన్ని పుటలకు శ్రీ రమణమూర్తిగారు లేఖకులు. వ.గో.కృ.

2. కాష్ఠత్రయముం గల (తొ.పా.)

(5) ఉ॥ పెక్కగు మా సుకర్మలను బ్రీతినిఁ బొందుచు నెల్లవేళలం
జక్కని కామితంబుల నొసంగుఁడుః దస్రులుః యాగకర్మలం
దక్క కొనర్చిసన్ మతియుఁ దప్పిన వానినిఁ దత్ఫలంబులన్
మిక్కిలి యిచ్చియున్నయెడ మీకు హవిస్సుల మే మొసంగమేః॥ 17

(6) చ॥ బలమును గల్గఁజేయునది పర్వత జన్యము ప్రాణికోటికిన్
జలదమునైన సోమమును జారుతరంబుగ రాలఁద్రచ్చఁగాఁ
గలుఁగు రసంబు నీకయి [1]యకంపనలీలల నుంచినార మా
చెలఁగు రసంబుఁ ద్రావి హరి ! చేయుత మమ్ము ధనాధినాథులన్ ॥ 18

క॥ స్తుతివాక్యము లెల్లను ద, న్మతిలో నిడుకొనుచుఁ బ్రీతి మా కర్మలలోఁ
దత సుఖము నీయఁగూరిమి, సతతము విచ్చేయుఁగాకః శక్రుం డెలమిన్ ॥ 19

(7) క॥ తప్పక మా నుతులన్ విని, యొప్పగు మా హవ్యములను నొనరఁగఁగొని నీ
విప్పుడె యమరుల కీయుముః, చెప్పఁదరమెః నీ మహత్వ చేష్టలు వహ్నీ ! ॥ 20

ఉ॥ దేవత లంగిరస్సులకు ధేనువు నీయఁగ దాని నర్యముం
దే విధినైనఁ బాల్పితికి యీయఁడె నీకును దేవతాళి కా
గోవునె దేవ ! నేఁడు నొగిఁగూరిచి నీకయి పాలు తీయ స
ద్భావముతోడ నిల్పితిమి దాని పయస్సులఁ ద్రావ రావొకోః ॥ 21

(8) సీ॥ నిత్యమై సత్యమై నిరతము వెల్గెడు మీ బలం బేవేళ మెఱయుఁగాకః
మీ దయావశమున మీదగు ధనమెల్ల నందంబుగా వృద్ధి నొందుఁగాకః
బహుపురాతనమైన ప్రాణిసంఘంబంత నుచ్చస్థితిని వెల్గుచుండుఁగాకః
మరణ వర్జితములు మనుజ దుర్లభములౌ గ్రామపత్తనములు గలుఁగుఁగాకఁః
గీ॥ గష్ట సంపాద్యమును శత్రుగణమువలన, హింసఁబొందంగఁ దగనది యిపుడు మీకుఁః
గలుఁగు ధనసంచయము మాకుఁ గలుఁగనిచ్చి, ఘన మరుత్తులుః మీరలు కనుఁడు కీర్తి ॥ 22

1. ప్రగాఢపత్తుల (తొ.పా. గణభంగ దోషము)

(9) క॥ మను వంగిరస్సు దధ్యఙ్, మునికణ్వుం డత్రిమౌని ముఖ్యులు నాదౌ
జననం బెఱింగియుందురు, మునులకు నాపైని జెల్మి పూర్ణ మగుఁగదా॥ 23

క॥ కావున మా సవనంబులు, జీవనములు ఋషిగణంబుఁ జేరుచు నుంటన్
పావనములైన నుతులం, బావక! హరి! మునుల నెల్లఁ బ్రస్తుతిఁ జేతున్ ॥ 24

(10,11) సీ॥ హోతయాజ్యఁ బఠించు భూతదేవతలకుఁ గోరినసోమంబు గూర్చుచుండు
నమరుల దయగోరు [1]నధ్వర్యుఁ డేవేళ నీమముతో నిష్టి నెఱపుచుండు
సోమఘట్టనజన్య సుందరశుభశబ్ద మధ్వర్యుఁ గర్మకు ననుపుచుండు
నధ్వర్యుఁడేవేళ నభిషవసాధక సద్మాదులను గూర్చ జరుగుచుండు
గీ॥ †దివిని పదునొకండ్రు భువిని నేకాదశ, యంతరిక్షమందు నంతసంఖ్య
గలిఁగినట్టి యమరగణమ[2]! మా హవ్యంబు, నొంది చాలఁ దుష్టి నందవలదె॥ 25

క॥ ముప్పదిముగ్గురు వేల్పులు,! తప్పక మా యజ్ఞమునకు దయచేసి ముదం
బొప్పఁగ హవ్యముఁగొని మా,కెప్పరసున నైన ధనము నీయుఁడు మీరల్ ॥ 26

1. అధ్వర్యుఁడు=బృహస్పతి (10వ ఋక్కునకు దేవత బృహస్పతి యని గతములోనే పేర్కొనఁబడెను.) వ.గో.కృ.
2. ఇక్కడ నింద్ర గణమునకు మారు "నలల" ము ప్రయుక్తమయినది. వ.గో.కృ.

† ఈ ముప్పదిముగ్గురు దేవతలు ఒక్కొక పదకొండుగు రొక్కొక దేవతలో నంతర్భూతు లగుచున్నారని యాస్కాచార్యులు నిర్ణయించి యా ముగ్గురును నింద్రుఁడు, సూర్యుఁడు, అగ్ని, అని సిద్ధాంతము చేసినారు. (నే.వేం.న.శా.)

వివేచన:—139వ సూక్తములోని 11వ ఋక్కునకు "విశ్వేదేవతలు" దేవతలుగాఁ బేర్కొనుట జరిగినది. వాస్తవమునకు వేద వాఙ్మయమును బరిశీలించుచో వీరు వీరు విశ్వేదేవత లని ఒక పరిమితమైన నిర్ణయముతోఁ గూడిన నిర్వచన మున్నట్లు కనపడదు. "యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యా" ఇత్యాదిగాఁగల ఋక్కులో దేవతలు ముప్పదిముగ్గురు మాత్రమేయని వారిలోఁ బదకొండుగురు దివియందును బదకొండుగురు భువియందును బదకొండుగురు అంతరిక్షమందును నుంద రనియు నీ ముప్పది ముగ్గురు దేవతలలోను ఇంద్ర, సూర్య, అగ్నులుకూడ నంతర్భూతులై వున్నారనియు యాస్కుఁడు నిర్ణయించెను. ఏది యేమైనను అసలీ ఋక్కును వేదభాష్యకర్త లెవ్వరును సరిగా నర్థము చేసుకొన్నట్లు కనపడదు. వాస్తవము పరిశీలింపఁగా "అనంతా వై వేదాః" అని వేదము పేర్కొన్నట్లు "అనంతా వై దేవాః" అని దేవత లనంతముగ నున్నట్లు పేర్కొనుట జరిగినది, వేద వాఙ్మయములో వివిధ సూక్తములకు ఋక్కులకుఁ బేర్కొనఁబడిన దేవతలు సహస్రాధికులుగాఁ గలరు, ఒక్క శుక్ల యజుర్వేదములోనే అయిదు వందలకుఁ బైగా దేవతలు పేర్కొనఁబడిరి. వేదము లన్నింటిలోను బేర్కొన్న దేవతలను గణించుచో దేవతలు సహస్రాధికులగుట చాల సులభము, ఋగ్వేదమందును ననేక వందల దేవతలు పేర్కొనఁబడిరి, అయినప్పుడు "యే దేవాసో దివ్యేకా దశస్థ పృథివ్యా" ఇత్యాదిగాఁగల ఋగ్వేద మంత్రములో దేవతల సంఖ్యను ముప్పది మూఁడుకుఁ బరిమితము చేయుట జరిగినదనియు వారును దివి,

పృథివి అంతరిక్షములకు మాత్రమే పరిమితులనియు యాస్కాచార్యాదులు పేర్కొనుట చాల విడ్డూరముగ నున్నది. ఈ సృష్టిలో దివి పృథివి అంతరిక్షములు తప్ప మరి వేరుగా లోకములు లేవా? అక్కడ దేవతలు లేరా? ఈ విషయమును వేదమే ఆమోదింపదు. కాఁగా "యే దేవాసో" ఇత్యాదిగాఁ గల ఋక్కులోఁ బేర్కొనఁబడిన ముప్పది ముగ్గురు దేవత లెవరో యాస్కాదులు సరిగా గుర్తించలేదనియు నీ ఋక్కునకు సరైన అర్థమునే వారు గ్రహించలేదనియుఁ జెప్పవలసి యున్నది. ఇది విష్ణు, బ్రహ్మ, మహేశ్వరులను వర్ణించు ఋక్కు. ఇది విషమచ్ఛందో గతము. విష్ణువు ఏకాదశ రూపుఁడుగా, బ్రహ్మ ఏకాదశ రూపుఁడుగా. మహేశ్వరుఁడు ఏకాదశ రూపుఁడుగా భూమండలము మీఁదనున్న వారికి గోచరించునని పరమ వైజ్ఞానికముగా నిందులోఁ బేర్కొనుట జరిగినది. "దివ్యేకాదశస్థ పృథివ్యా" అన్నప్పుడు "దివి" శబ్దమునకు స్వర్గమని కాక "పవిత్రత కల" అని యర్థము. ఏకాదశ రూపుఁడైన శ్రీ మహా విష్ణువు పృథివి మీఁద నున్నవారికిఁ బదకొండు విధములుగాఁ గన్పించునని యర్థము. ఇక్కడ మహావిష్ణువు ఆషాఢ శుద్ధ ఏకాదశి మొదలు శయనుఁడుగాఁ గ్రమక్రమముగా వివిధ భంగిమలలోఁగాననగును(1) ఆషాఢ శుద్ధ ఏకాదశి (2) ఆషాఢ బహుళ ఏకాదశి. (3) శ్రావణ శుద్ధ ఏకాదశి. (4) శ్రావణ బహుళ ఏకాదశి. (5) భాద్రపద శుద్ధ ఏకాదశి. (6) భాద్రపద బహుళ ఏకాదశి. (7) ఆశ్వియుజ శుద్ధ ఏకాదశి. (8) ఆశ్వియుజ బహుళ ఏకాదశి. (9) కార్తీక శుద్ధ ఏకాదశి. అని చాతుర్మాస్య ఏకాదశులను పేర్కొందురు. కార్తీక శుద్ధ ఏకాదశిని "ఉత్థానైకాదశి" అని యందురు, ఈ దినమున విష్ణువు నిద్ర నుండి మేల్కాంచినట్లు మహావిష్ణు నక్షత్రములు మనకు గోచర మగును. (10) కార్తీక బహుళ ఏకాదశినాఁడు ఒకానొక విశిష్టోత్థానుఁడై మహావిష్ణువు నక్షత్ర రూపములోఁ గనిపించును. వైకుంఠైకాదశిగా సుప్రసిద్ధమైన (11) పుష్య శుద్ధ ఏకాదశినాఁడు మహా విష్ణువు సరిగా స్వస్వరూప భంగిమలో దృగ్గోచరుఁడగును. ఈ వైకుంఠైకాదశినాఁడే వైకుంఠలోక ద్వారములు తెరుచుకొనునని విజ్ఞులు భావింతురు. దీనినే ముక్కోటి ఏకాదశి అందురు. శ్రీ మహా విష్ణువు శయనాది రూపములతో మొదలై వివిధ రూపము లలో నిద్రనుంచి మేల్కాంచి ఉత్థానుఁడై నిలిచి అభయ హస్తముతోఁ గన్పించునట్లు విష్ణు నక్షత్రములు క్రమ రూపమును దాల్చుటలో నీపదకొండు ఏకాదశులు ప్రత్యేకత వహించును, కావున మహావిష్ణువు ఏకాదశ రూపుఁడుగా ఋగ్వేద మంత్రములోఁ బేర్కొనుట జరిగినది. ఋక్కులోని "దివి" శబ్దమునకు స్వర్గ మని యర్థము చెప్పరాదు. స్వర్గలోకము వేరు. వైకుంఠలోకము వేరు. స్వర్గలోకాధిపతి ఇంద్రుఁడు. వైకుంఠాధిపతి మహా విష్ణువు. కాఁగా ఈ ఋక్కులో "దివి" శబ్దమునకు "పవిత్రమైన" అనియే అర్థము. "మధ్యేకాదశస్థ అప్సు క్షితో" అన్న వాక్యములోఁ బదకొండు విధములైన దివ్య దేవతా "బ్రహ్మక"లు పేర్కొనఁబడినవి. బ్రహ్మ విష్ణు నాభి కమల సంజాతుఁడు, కమలము జలజము కదా! ఒక వేళ విష్ణు నాభిస్థమైన దన్నను అసలు విష్ణువే నారాయణుఁడు కదా! నారాయణుఁడనఁగా నర = జలమందు ఉద్భవించిన వాఁడనియే యర్థము. జల నరాది శబ్దములకు నీరని యర్థము చెప్పుకొందురు గాని అది సరికాదు. ద్రవరూపమైన దేదైనను నరజలాది శబ్దములతోఁ బేర్కొనఁబడ వచ్చును. దీని వల్ల మంచినీరు, ఉప్పునీరు, చెరుకు రసము, తేనె, మజ్జిగ, పాలు, పులుసు, మొదలుగాఁగల ద్రవ పదార్థము లన్నియుఁ బరిగృహీతము లగును. కావుననే నీటితో నున్నవి కాకపోయినను సప్తవిధ క్షీరాది ద్రవ పదార్థములతో నిండినవి సప్త సముద్రములుగాఁ బేర్కొనఁబడినవి. పద్మ

భవుఁడైన "బ్రహ్మక"లు ఆర్షవిజ్ఞానము రీత్యా (1) బ్రహ్మ. (2) సృష్టి, (3) వృద్ధి. (4) స్మృతి. (5) మేధ. (6) కాంతి. (7) శ్రీ కల. (8) మతి, (9) స్థిర. (10) స్థితి. సిద్ధి కలలుగాఁ బదకొండు విధములుగా నున్నవి. అప్సుక్షితుఁడైన బ్రహ్మకలు ఏకాదశగా ఋక్కులో నిందు మూలముననే పేర్కొనఁ బడినది. "మహినైకా దశస్థ తే దేవాసో" అన్న వాక్యములోని "మహిన" శబ్దముచేత మహిమాన్వితుఁడై మహేశ్వరుఁడైన రుద్రుఁడు పేర్కొనఁ బడినాఁడు, ఏకాదశ రుద్రులు సుప్రసిద్ధులు. (1) అజైకపాత్. (2) అహిర్బుధ్నుఁడు. (3) విరూపాక్ష రుద్రుఁడు. (4) సురేశ్వరుఁడు. (5) జయంత రుద్రుఁడు. (6) బహురూప రుద్రుఁడు. (7) త్ర్యంబకుఁడు. (8) అపరాజితుఁడు. (9) వైవస్వత రుద్రుఁడు. (10) పావిత్రుఁడు. (11) హరుఁడు. కొందఱి దృష్టిలోఁ బాఠాంతరముగ (1) హరుఁడు. (2) త్ర్యంబకుఁడు. (3) రుద్రనాముఁడు. (4) మృడుఁడు. (5) మృగవ్యాధుఁడు. (6) అపరాజితుఁడు. (7) శంభుఁడు. (8) కపర్థి. (9) వృషాకపి (10) బహురూపుఁడు. (11) పినాకి. అని యేకాదశ రుద్రులు కలరు, మరికొందఱి దృష్టిలోఁ బాఠాంతరముగ (1) ఉగ్రుఁడు. (2) సోముఁడు. (3) శర్వుఁడు. (4) మృగవ్యాధుఁడు. (5) రంతిజుఁడు. (6) భిక్షుకుఁడు. (7) అహిర్బుధ్నుఁడు. (8) పినాకి. (9) పాదుకేశ్వరుఁడు. (10) కపాలికేయుఁడు. (11) రుద్రుఁడు. అని ఏకాదశ రుద్రులు పేర్కొనఁబడిరి. ఏ దృష్టితోఁ జూచినను రుద్రులేకాదశ సంఖ్యకుఁ బరిమితులు కాఁగా "యే దేవాసో "ఇత్యాది ఋగ్రూపముగా దివ్య విష్ణు స్వరూపములు పదకొండు. బ్రహ్మ స్వరూపములు పదకొండు, మహేశ్వర (రుద్ర) స్వరూపములు పదకొండును మొత్తము ముప్పదిమూఁడు స్వరూపములు విష్ణు, బ్రహ్మ, మహేశ్వర పరములుగాఁ బేర్కొనఁబడినవి. అసలీ ఋక్కు "సర్వ పరస్థాన విషమ చ్ఛందోగత వృత్తము". ఇది "త్రిపాది" కాని "ద్విపాది" కాదు. ఇది యీ క్రింది విధముగాఁ బాద విభజనతో నుండవలయును.

యే దేవాసో దివ్యేకాదశస్థ పృథివ్యా ।

మధ్యేకాదశస్థ అప్సుక్షితో ।

మహినైకాదశస్థ తే దేవాసో యజ్ఞమిమం జుషధ్వమ్ ॥

ఈ ఋక్కున కున్న పై నిచ్చిన అసలైన అర్థమును గుర్తింపని వేద ఖగోళ విజ్ఞాన రహితులైన యాస్కాదులు నిరర్థకముగా వేద విజ్ఞాన ఘాతుకముగా దురర్థములను బ్రతిపాదించిరి. ముప్పది ముగ్గురు దేవతలను విష్ణు. బ్రహ్మ, మహేశ్వరుల పరములుగా మనము సార్థకముగా సమన్వయపఱచు కొనినప్పుడు తద్భిన్నులైన యనేకానేక దేవతల యాధిపత్యాదులకు భంగ మేరూపమునను గలుఁగ నేరదు. "అనంతా వై దేవాః" అన్న వేద వాక్యమునకు వ్యాఘాతమును గలుఁగదు.

వాఙ్మయ మహాధ్యక్ష,
డాక్టర్, పళ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

## అనువాకః—21, సూక్తమ్—140

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః †

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ, 10 త్రిష్టుబ్వా, 12-13 త్రిష్టుప్

(1) వేదిషదే ప్రియధామాయ సుద్యుతే

ధాసిమివ ప్ర భరా యోనిమగ్నయే ।

వస్త్రేణేవ వాసయా మన్మనా శుచిం

జ్యోతిరథం శుక్రవర్ణం తమోహనమ్ ॥ 19

† ఉపలభ్యమానములైన సంస్కృత ఋగ్వేద ముద్రిత ప్రతు లన్నింటను "దీర్ఘతమా ఔచథ్యః" అని పేర్కొనుట జరిగినది. సాయనాచార్యులు "ఉచథ్య పుత్రస్య దీర్ఘతమస ఆర్షమ్ ఆగ్నేయమ్" అని ఈ 140వ సూక్తమునకు ముం పేర్కొన్నారు. వాస్తవము పరిశీలింపఁగా ఉచథ్య-ఉతథ్య" నామకులైన మహర్షు లిరువురున్నారని తెలును. విభిన్న నామముల "ఉచథ్య-ఉతథ్య" లుగా నిరువు రున్నారన్నసంగతి సాయనాచార్యులకే అవగతమైనట్లు కనపడదు. ఉచథ్యమహర్షి భార్య "పృథ" ఈ ఉచథ్యుఁడు సామాన్యుఁడు కాఁడు. బ్రహ్మర్షియైన వేదర్షియే. ఇతని భార్యయైన పృథ ప్రజాపతి పుత్రుఁడైన సోము పుత్రిక. ఒకనాఁడు "ఉచథ్యుఁడు" యమునానదికి స్నానార్థమై వెళ్ళగా "పృథ"ను వరుణుఁడు బలవంతముగా నెత్తుకొనిపోయెన ఈ విషయమును నారదుఁడు "ఉచథ్య"నకుఁ దెలిపెను. దిక్పతియై గొప్పవాఁడైన వరుణునికి నిటువంటి పని తగనిదని తనభార్య దన కిచ్చివేయవలసిన దని చెప్పవలసినదిగా ఆనారదునే ఉచథ్యుఁడు కోరెను. నారదుఁడు వెళ్ళి వరుణునకు నచ్చచెప్పఁ బ్రయత్నింపఁ నాతఁ డందు కామోదింపలేదు. నారదుఁడు తిరిగివచ్చి జరిగిన సంగతి "ఉచథ్య"నకుఁ దెలిపెను. అప్పు డుచథ్యుఁడు త తపశ్శక్తితో వరుణలోకమున నీరులేకుండ నింకఁజేసి ధూళిమాసరము గావించెను. అప్పుడు వరుణుఁడు బుద్ధితెచ్చుకొని "పృథ" తిరిగి "ఉచథ్య"న కిచ్చివేసెను. పృథోచథ్య దంపతుల పుత్రుఁడు దీర్ఘతముఁ డొకఁడున్నాఁడు. "దీర్ఘతమా ఔచథ్యః" అనఁ పృథోచథ్యుల పుత్రుఁడైన దీర్ఘతముఁడే ఋషి యగును.

మామతేయుఁడైన దీర్ఘతముఁడనఁగా నతఁడు ఉతథ్యుఁడనునామముకల వేరొకఋషి పుత్రుఁడు. ఉతథ్యుఁడు బృహస్పతి అన్న. ఉతథ్యుని భార్య మమత. ఈ మమతోతథ్యుల పుత్రుఁడు దీర్ఘతమ మహర్షి మామతేయుఁడుగా వేదర్షిగాఁ బ్రసిద్ధి కెక్కెన మామతేయుఁడైన యీ దీర్ఘతముని భార్యపేరు ప్రద్వేషిణి. ఈమె కథయుఁ బ్రసిద్ధమే.

మమతోతథ్యుల పుత్రుఁడైన దీర్ఘతమునిగుఱించి మహాభారతములో నొక కథ కలదు. సంగ్రహముగా నాకథ యిది.

"దీర్ఘతముఁడు ఉతథ్యుని కుమారుఁడు. ఇతని తల్లి మమత-దీర్ఘతముఁడు తల్లి గర్భమందున్నప్పు డితని పినతండ్రియైన బృహస్పతి మమతతో బలవంతముగ రమించెను. అందువల్ల మమతా గర్భమందున్న శిశువు బృహస్పతిపైఁగోపగించి బృహస్పతి వీర్యస్థలమును దిరస్కరించెను. "న న్నీశిశువు నిందించుటా? నిరోధించుటయా?" అని బృహస్పతికిఁ గోపమువచ్చి దీర్ఘతముఁడవు కమ్మని గర్భమందలి శిశువును శపించెను. మమతకుఁ బుట్టంధుఁడైన వాఁడు పుట్టి దీర్ఘతముఁడను పేరునఁ బ్రసిద్ధి వడసెను. ఈ దీర్ఘతముఁడు పుట్టంధుఁడయ్యును సర్వవిద్యలు నేర్చెను."—

ఈకథకుఁగొంత భిన్నముగా మఱియొక కథయు మహాభారతముననే కలదు. ఆ కథ సంగ్రహముగా నిది.

"బృహస్పతి తన సోదరుఁడైన యుతథ్యుని భార్యయగు మమతను గామించెను. మమత వలదని నివారించుచున్నను నామె పైఁబడి బృహస్పతి తన వాంఛ తీర్చుకొనెను. అప్పటికే యామె గర్భవతియై యుండెను. కాఁగా నామె గర్భమందున్న శిశువు కూడ బృహస్పతిని రతి చేయకుండ నివారింప యత్నించెను. అయినను బృహస్పతి వినలేదు-పైగా నాగర్భమందలి శిశువును "నీవు గుడ్డివాఁడవై పుట్టు"మని శపించెను. ఆగర్భస్థమైన శిశువు బృహస్పతి వీర్యమును వెలుపలికిఁ దన్నివేసెను. ఆ వెలుపలికి వచ్చిన వీర్యమును "నీవు భరింపు మనఁగా నీవు భరింపు"మని మమతా బృహస్పతులు వివాదపడి యిరువురును నా వీర్యమును విడిచి పెట్టిరి. ఆ బృహస్పతి వీర్యమే పెరిగి శిశువై భరద్వాజుఁడుగాఁ బ్రసిద్ధికెక్కెను."—

ఈ యుతథ్యుని సోదరుఁడైన బృహస్పతియే దేవగురువగు బృహస్పతియని కొన్ని ప్రతులలోఁగలదు గాని యది సరికాదు. ఈ యుతథ్య బృహస్పతి సోదరులు అంగిరస మహర్షి పుత్రులు. ఈ బృహస్పతి దేవ గురువుకాఁడు. దేవ గురుఁడైన బృహస్పతియు, మహర్షియైన బృహస్పతియు నొక్కరుకారు. విభిన్నులు.

140వ సూక్తము ప్రారంభమున "ఉచథ్యపుత్రస్య దీర్ఘతమసః" అని సాయనాచార్యులు వ్రాసి యీ 140వ సూక్తము మొదలుకొని 164వ సూక్తమువఱకును దానితోసహా కలిపి మొత్తము 25 సూక్తములకు దీర్ఘతముఁడే ఋషి యైనట్లుగా నభిప్రాయ పడినట్లు ముద్రిత సాయన భాష్యములవల్లఁ దెలియుచున్నది. శ్రీ గొబ్బూరు వెంకటానంద రాఘవరావుగారు తమ "దీర్ఘతమ మునీంద్రుని చరిత్ర"లో ఈ 25 సూక్తములకును నీ సూక్తములందలి 237 మంత్రములకును మామతేయుఁడు ఉచథ్య పుత్రుఁడును అగు దీర్ఘతమ మునీంద్రుఁడు ద్రష్టయని పేర్కొన్నారు. (చూఁడు. ఆరాధన (మాసపత్రిక) నవంబరు, 1960) మీఁదుమిక్కిలి ఈ ఉచథ్యుఁడు బృహస్పతికి అన్న యనియు వ్రాసిరి. శ్రీ గొబ్బూరువారు దీర్ఘతమునికి సంబంధించిన చారిత్రక ఖగోళ విజ్ఞాన విషయాదులను బెక్కింటిని తమ "దీర్ఘతమ మునీంద్రుని చరిత్ర"లో అనేక గ్రంథములను పరిశీలించి తమ దృక్పథముతోనేగాక ప్రాచ్య పాశ్చాత్య విజ్ఞానములదృష్ట్యా తమకుఁదోచిన యభిప్రాయములను వెల్లడించిరి. (ఈ గ్రంథము"ఆరాధన"మాసపత్రిక 1960 నవంబరు సంచికలో ప్రారంభింపఁబడి 1961 ఫిబ్రవరి సంచికలవఱకు ధారావాహినిగాఁ బ్రకటితమైనది) శ్రీ గొబ్బూరువారు దీర్ఘతమ ముని ఋక్కులు 237 గాఁబేర్కొనఁగా వారు పరిశీలించిన ఋగ్వేదపు వ్రాతప్రతిలోను ముద్రిత ఋగ్వేదములందును దీర్ఘతముఁడు ఋషిగాఁగల ఋక్కులు మొత్తము 243గా వ్రాయఁబడి ముద్రింపఁబడినవి. కాఁగా శ్రీ గొబ్బూరివారి లెక్కకు ఉపలభ్య మానములైన ఋక్కుల లెక్కకు ఆరు ఋక్కులు చేహె వచ్చుచున్నది. శ్రీ గొబ్బూరివారి లెక్కలో నీ తేడా యెందుకు వచ్చినదో అర్థమగుటలేదు. కనీసము కొన్ని ఋక్కులు ప్రక్షిప్తము లనియైనను వారు పేర్కొనలేదు. శ్రీ గొబ్బూరివారు పరిశీలించిన ఋగ్వేదపు వ్రాతప్రతిలో 243 ఋక్కులే యుండఁగా వారిచ్చిన సంఖ్య పొరపాటున నీయఁబడినదేమో యని తోచును.

ఉపలభ్యమానమైన ముద్రిత సాయన భాష్యములో 140 వ సూక్తమునకు ఋషి "ఉచథ్యపుత్రస్య దీర్ఘతమసః" అని పేర్కొని 141 మొదలుగా 141-"దైర్ఘతమసమ్", 142-"దైర్ఘతమసత్వా దుభయవత్", 143-"దైర్ఘతమసమ్", 144-"దైర్ఘతమసమ్", 145-"దీర్ఘతమాఋషిః", 146-"దైర్ఘతమసమ్", 147-"దైర్ఘతమసమ్", 148-"దైర్ఘతమసమ్", 149-దైర్ఘతమసమ్", 150-"దైర్ఘతమసమ్", 151-"దైర్ఘతమసమ్" 152-"దైర్ఘతమసమ్", 153-"దైర్ఘతమసమ్" 154-"దైర్ఘతమసమ్" 155-"దైర్ఘతమసమ్", 156-"దైర్ఘతమసమ్", 157-"దైర్ఘతమసమ్", 158-"దైర్ఘతమసమ్", 159-"దైర్ఘతమసమ్", 160-"దైర్ఘతమసమ్", 161-"దైర్ఘతమసమ్", 162-"దైర్ఘతమసమ్", 163-"దైర్ఘతమసమ్", 164-"దైర్ఘతమసమ్" అని వ్రాసినట్లున్నవి, వాస్తవము పరిశీలింపఁగా దీర్ఘతమ నామక మహర్షులు వృథ్వోచథ్య పుత్రుఁడొకడు, మమతోతథ్య పుత్రుఁడు మరియెకఁడు, వీరిలో ఒకరి మనుమఁడో మునిమనుమఁడో మరొక దీర్ఘతముఁడును గలఁడేమోయని యనిపించును. 140వ సూక్తము ప్రారంభమున "దీర్ఘతమా ఔచథ్యః"అని పేర్కొన్న సాయనాచార్యులు ఆసూక్త ప్రారంభమునఁగాని తొలి ఋక్కు భాష్యములోఁగాని దీర్ఘతమ మహర్షి ఇతిహాసమునుగురించి వ్రాయలేదు. కాని 147వ సూక్తములోని తృతీయ ఋక్కగు "యే పాయవో మామతేయం తే అగ్నే పశ్యన్తో అన్ధం దురితాద రక్షన్ । రరక్షతాన్సుకృతో విశ్వవేదాదిప్సన్త ఇద్రిపవో నాహదేభుః ॥ అన్న దానిలో మామతేయ శబ్దము ప్రయుక్తమైనదని భావించి దీనిని ఋరస్కరించుకొని సాయనాచార్యులు "అత్రేతిహాస మాచక్షతే. ఉచథ్య బృహస్పతినామానౌ ద్వౌ ఋషీ ఆస్తామ్. తత్ర ఉచథ్యస్య మమతా నామ భార్యా. సా చ గర్భిణీ. తాం బృహస్పతిర్గృహీత్వా అరమయత్. శుక్రనిర్గమనావసరే ప్రాప్తేగర్భస్థం రేతః ప్రావాదీత్. హే మునే రేతో మా త్యాక్షీః. పూర్వమహం వసామి రేతః. సంకరం మా కార్షీః ఇతి. ఏవముక్తో బృహస్పతిః బలాత్ ప్రతిరుద్ధరేతస్కః సన్ శశాప. హే గర్భత్వం యతో రేతో నిరోధ మకరోః అత స్త్వం దీర్ఘం తమః ప్రాప్నుహి జాత్యన్ధో భవేతి. ఏవం శప్తో మమతాయాం అజాయత. స.చోత్పన్నః తమో వ్యథయా అగ్నిమస్తౌషీత్. స చ స్తుత్యాప్రీతః అన్ధ్యం పర్యహరదితి." అని ఇతిహాసమును పేర్కొనిరి. 140వ సూక్తము తొలుత దీర్ఘతమా ఔచథ్యః అని పేర్కొన్న సాయనులు ఉచథ్యపుత్రుఁడైన దీర్ఘతముఁడు, మమతాపుత్రుఁడైన దీర్ఘతముఁడును ఒక్కఁడే యని భావించి యున్నచో నీకథను తొలిసూక్తమునందే వ్రాసియుండెడివారు. 147వ సూక్తములోని 3వ ఋగ్వ్యాఖ్యా సందర్భముగా మామతేయుఁడైన దీర్ఘతముని కథగురించి వ్రాయుట చూడఁగా ఈ 147వ సూక్తమునుంచి ఔచథ్యపుత్రుఁడైన దీర్ఘతముఁడు ఋషి ద్రష్టగాకాక యీ సూక్తాదిగా మమతా ఉతథ్యుల పుత్రుఁడైన దీర్ఘతముఁడు ఋషి ద్రష్టయని భావించి 147వ సూక్త భాష్యములో మామతేయ శబ్ద సందర్భముగా నీ దీర్ఘతముని యితిహాసము నుటంకించినట్లు తోచును. ఉచథ్య-ఉతథ్య నామక మహర్షు లిరువురు విభిన్ను లున్నారని తెలియని లేఖకాధములెవరో యీ కథాసందర్భమున ఉతథ్యశబ్దమునకు మారుగా ఉచథ్యశబ్దమును వ్రాసియుండ నోపును. అందువల్లఁ బ్రమాదవశమున వ్రాయఁబడిన ఉచథ్యశబ్దమే వ్రాతప్రతులనుండి గ్రహింపఁబడి ముద్రింపఁబడినదని నాభావన. అసలు వేదభాష్యకర్త లందరును వేదము లపౌరుషేయములనియు ఋషులు కేవలము ద్రష్టలేగాని స్రష్టలు కారనియు నభిప్రాయపడి ఆరణ్యకాదులు ప్రామాణికముగా "వేదప్రాప్త్యర్థం తపోఽనుతిష్ఠతః పురుషాన్ స్వయం భూర్వేదపురుషః ప్రాప్నోత్. తథాచ శ్రూయతే" "అజాన్హ వై పృశ్నీం స్తపస్యమానాన్బ్రహ్మ స్వయంభ్వభ్యానర్ష త్తదృషయోఽభవన్" (తై. ఆ. 2.9) ఇతి. తథాతీజి యస్య వేదస్య పరమేశ్వరానుగ్రహేణ ప్రథమతో దర్శనాత్ ఋషిత్వమిత్యభిప్రేత్యస్మర్యతే —

> యుగాన్తే ఽ న్తర్హితాన్ వేదాన్ సేతిహాసన్ మహర్షయః ।
>
> లేభిరే తపసా పూర్వ మనుజ్ఞాతాః స్వయం భువా ॥

అని పేర్కొనుట జరిగినది. ఋష్యాదుల జ్ఞానము విలుప్తమైనప్పుడు యోగజపాదుల ద్వారా తెలిసికొనవలయు నని ఆర్షి విజ్ఞానము దృష్ట్యా నీ క్రింది విధముగా పేర్కొనఁబడినది.

ఋష్యాదిజ్ఞానాభావే ప్రత్యవాయః స్మర్యతే—
అవిదిత్వా ఋషిం ఛన్దో దైవతం యోగమేవ చ ।
యోఽధ్యాపయేజ్జపేద్వాపి పాపీయాఞ్జాయతే తు సః ॥

ఋషిచ్ఛన్దోదైవతాని బ్రాహ్మణార్థం స్వరాద్యపి ।
అవిదిత్వా ప్రయుఞ్జానో మన్త్రకణ్టక ఉచ్యతే ॥

అయినప్పుడు కొన్ని కొన్ని సూక్తములు సూక్తములలోని ఋక్కులను నపౌరుషేయములుకానట్లును కేవల ఋషివిరచితములే అయినట్లును భావించి ప్రాచీన భాష్యకారులు అనేకఋక్కులకు అపభాష్యములను విరచించిరి. ఇట్టివానిలో మమతాశబ్దము ప్రయోగింపఁబడినదని భావింపఁబడి వ్యాఖ్యానము చేయఁబడిన 147,152,158 సూక్తములలోనున్న 3,6, 6 ఋక్కులుకూడ చేరుట దురదృష్టకరము. 147వ సూక్తములోని 3వ ఋక్కునకు భాష్యకర్తలు వ్రాసిన అర్థములు సరియైనవికావు. లోగడ ఉదాహరింపఁబడిన 147వ సూక్తములోని 3వ ఋక్కు వాస్తవమునకు ఈ క్రిందివిధముగా నుండవలయును.

యేఽపాయవోఽమా మతేయం తే అగ్నే పశ్యన్తో అన్ధం దురితాదరక్షన్ ।

రరక్ష తాన్సుకృతో విశ్వవేదా దిప్సన్త ఇద్రిపవో నాహ దేభుః ॥

నిజమున కీ ఋక్కులో మామతేయ శబ్ద ముపయోగింపఁబడలేదు. అది ఉపయోగింపఁబడినదని భాష్యకారులు భావించినచో యెంచుచోనిది మానవవిరచితములేయగునుగాని దైవీయములు కానేరదు. వాస్తవమునకు ఈ సందర్భమున యే = ఎటువంటి, అపాయవః = ప్రమాదకరము లైనటువంటి, అమా = అంధకార బంధురమైన రాత్రుల వంటి అనఁగా అమావాస్యల వంటి, మతేయం = సిద్ధాంతములు బుద్ధులు కలిగినటువంటి ప్రాణులను, తే అగ్నే = ఆ అగ్నిదేవతలు, పశ్యన్తః = వీక్షించుచున్నవై, అన్ధందురితాద్ = అంధకారము వంటి పాపము నుండి, అరక్షన్ = రక్షించుచునుగాక". అని ఈ తొలి పాదమున కర్థము. ఈ దృక్పథముతో నీ ఋక్కునకు నేను ఆంధ్రమున వ్రాసిన పద్యద్వయము ప్రత్యేకముగా నీ క్రింద నుటంకింతమైనది.

(3) *క॥ అపకృతి కలిఁగించు మహాం, ధ పథగ బుద్ధులు గలిఁగిన నానా ప్రాణుల్
సుపథగములై సుభద్రత, నపాపులుగఁ గాచుఁగాత నగ్నులు సర్వుల్ ॥

*గీ॥ తూర్పు దిక్కునఁ దిమిరమ్ము దొలఁగిపోవ, నస్తమింపఁగఁ జేయుచు నలరు నరుణు
భాతి నగ్నులు యజమాన పాపతతిని, బోవఁగొట్టుచు రక్షించుఁ బొలుపుమీర॥

ఇదే విధముగా 152వ సూక్తములోని 6వ ఋక్కు "మామతేయ'' శబ్దముతోఁ గూడినది కాదు. ఆ ఋక్కు ఈ క్రింది విధముగా నుండవలయును.

* రచయిత :- వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వద్లమూడి గోపాలకృష్ణయ్య.

అ ధేనవోఽమా మతేయ మవ స్త్రీర్బ్రహ్మప్రియం పీపయ త్నస్మిన్నాధన్ ।

పితోఽభక్షేత వయునాని విద్వానాసావిహసన్నదితి ముఋష్యేత్ ॥

ఈ ఋక్కులోఁ బూర్వార్థమునకు ఆధేనవః = సుదూరమందున్న గో లోకములు, అమా = అమావాస్య రాత్రుల వంటి, మతేయం = మతులు గలిఁగినటువంటి బుద్ధులు లేదా సిద్ధాంతములు గలిఁగినటు వంటి వారిని, అవ స్త్రీర్బ్రహ్మప్రియం = అనంతమైన బ్రహ్మజ్ఞాన ప్రియమగునట్లుగా, త్నస్మిన్నాధన్ = ఆ ప్రకాశవంతమైన నూతనో త్తేజముతో, పీపయన్ = సురక్షితులను చేయుగాక

ఈ పై ఋక్కునకు నీ బ్రహ్మ జ్ఞానదృ క్పథముతో నేను తెలుఁగున విరచించిన పద్యద్వయముకూడఁ బ్రత్యేకముగా నీక్రింద నీయఁబడినది.

(6) *గీ॥ చాల దూరమందు జ్వలితమౌ గోలోక, శక్తు లెల్ల నమవస నిసి తెలివి
నున్న వారి నంత మొనరని బ్రహ్మప్రియులుగ వెల్గఁ జేయుత లలితగతి ॥

*క॥ అతి విద్యావంతులయిన, పితరులను నభిక్షకులుగ వేవెల్గుల న
ప్రతి హతముగను వెలింగెడు, ద్రుత తేజోఽగ్నులు కృపమెయిఁ చొడరుత జగతిన్॥

ఇదే విధముగా 158వ సూక్తములోని 6వ ఋక్కు ఈ క్రింది విధముగ నుండవలయును.

దీర్ఘతమాఽమా మతేయో జుజుర్వాన్దశమే యుగే ।

అపామర్థం యతీనాం బ్రహ్మా భవతి సారథిః ॥

ఈ ఋక్కునకు దీర్ఘతమా = సుదీర్ఘమైనటు వంటి, అమా = చంద్ర రహితమైన చీకటి రాత్రులవంటి, మతేయః = బుద్ధి కలిఁగినటువంటివారు యుగే దశమే = ద్వివిధములైన దశలలో, జుజుర్వాన్ = ద్వివిధములైన జపతప యజ్ఞాదులను జేసిన వారైన, యతీనాం = ఋషులకు బ్రహ్మా = బ్రహ్మ, అపామర్థం = బహు ముఖములైన వరుణ ప్రయోజనములకై, సారథిః = మార్గదర్శి, భవతి = అనుచున్నాఁడు. అని యర్థము. ఈ దృష్టితో నేను దెలుఁగున రచించిన ప్రత్యేక పద్యమిది.

(6) *గీ॥ దీర్ఘ తమముఁబోలు ధీ కల్గు ప్రాణులున్, ద్వివిధ దశలయందు వివిధములగు
జప తపమ్ము లొనర జన్నమ్ము లాదిగ, వరుణులకయి బ్రహ్మ పథము నిల్పు ॥

* రచయిత-వాఙ్మయ మహాధ్యక్ష, కళా-ప్రపూర్ణ, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

ఈ సందర్భమున "దశమే యుగే" అన్న పదములకుఁ బది యుగముల కాలము మామతేయుఁడైన దీర్ఘతముఁడు జీవించి నట్లు ప్రాచీన భాష్యకారులు పేర్కొన్నారు. కాని యిది వాస్తవ విరుద్ధము. పది యుగము లనఁగా రెండు చతుర్యుగములును, కృత, త్రేతాయుగములును గలుపగా వచ్చెడి సంవత్సరముల సంఖ్య యెన్ని సంవత్సరములగునో అంత కాలమగును. కాఁగా

| | | |
|---|---|---|
| చతుర్యుగ సంవత్సరములు | — | 43,20,000 |
| మరొక చతుర్యుగ సంవత్సరములు | — | 43,20,010 |
| కృతయుగ సంవత్సరములు | — | 17,28,000 |
| త్రేతాయుగ సంవత్సరములు | — | 12,96,003 |
| దశ యుగ సంవత్సరముల సంఖ్య | — | 1,16,64,000 |

1 16,64,000 సంవత్సరములు దీర్ఘతముఁడు జీవించినాఁడని మన మామోదింప వలసియుండును. ఆర్ష ఖగోళ విజ్ఞానమును గాదని కొందఱు విమర్శకులు స్వవచన వ్యాఘాతములతోఁగూడిన వాదములలోఁ బేర్కొన్న చతుర్యుగప్రమాణకాలము 12,000 సంవత్సరములని ఆమోదించినను కృతయుగకాలము 7,200 సంవత్సరములై త్రేతాయుగ కాలము 3,600 సంవత్సరములై

| | | |
|---|---|---|
| చతుర్యుగ సంవత్సరములు | — | 12,000 |
| మరొక చతుర్యుగ సంవత్సరములు | — | 12,000 |
| కృతయుగ సంవత్సరములు | — | 7,200 |
| త్రేతాయుగ సంపత్సరములు | — | 3,600 |
| | | 34,800 |

34,800 సంవత్సరములు మామతేయుఁడైన దీర్ఘతముఁడు జీవించినట్లు మన మామోదింపవలసియుండును. ఇదియును సునిశ్చిత మగు సంఖ్యయని నిర్వివాదాంశమైన సంఖ్యయని చెప్పలేము. ఏది యేమైనను ఆర్షఖగోళవిజ్ఞానమదృష్ట్యా దీర్ఘతముని జీవితకాల ప్రమాణమునుగుఱించి సాధికారికముగాఁ జెప్పుట అంత సులభ సాధ్యమైన పనికాదు. సృష్ట్యాదిగా అంగిరసాది మహర్షుల జీవన ప్రమాణ సంఖ్యను వారి సంతతుల సంఖ్యను గురికి బెత్తెడు దూరముగా నైనను లెక్కించుచో మనకు సరియైన సంఖ్య వచ్చుననిగాని నిర్వివాదాంశమైన సంఖ్య వచ్చుననిగాని చెప్పలేము. 147, 152 158 సూక్తములలో నున్న 3, 6, 6 ఋక్కులకు నే నిచ్చిన విశేషార్థములవలన ఆసూక్తములకు ఋషి దీర్ఘతముఁడు కాఁడని చెప్పుటకు నెటువంటి అవకాశములును లేవు. 140వ సూక్తము మొదలు 164వ సూక్తమువఱకు ద్రష్టయైన ఋషి మామతేయుఁడైన దీర్ఘతముఁడుగాని పృథాపుత్రుఁడైన దీర్ఘతముఁడుగాని మరొక దీర్ఘతముఁడుగాని కావచ్చును.

వాఙ్మయ మహోధ్యక్ష,
డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య
"కళా-ప్రపూర్ణ"

(2) అభి ద్విజన్మా త్రివృదన్నమృజ్యతే

సంవత్సరే వావృధే జగ్ధమీ పునః ।

అన్యస్యాసా జిహ్వయా జేన్యో వృషా

న్యంన్యేన వనినో మృష్ట వారణః ॥ 20

(3) కృష్ణప్రుతౌ వేవిజే[1] అస్య సక్షితా ఉభా

తరేతే[2] అభి మాతరా శిశుమ్ ।

ప్రాచాజిహ్వం ధ్వసయన్తం తృషుచ్యుతమా

సాచ్యం కుపయం వర్ధనం పితుః ॥ 21

(4) ముముక్ష్వోః మనవే మానవస్యతే

రఘుద్రువః కృష్ణసీతాస[3] ఊః జువః ।

[4]అసమనా అజిరాసో రఘుష్యదో

వాతజూతా ఉప యుజ్యన్తే[5] ఆశవః ॥ 22

1. వేవిజేఽస్య, 2. తరేతేఽఅభి, 3. సీతాసఽ ఊః, 4. అసమనాఽ అజి, 5. యుజ్యన్తఽఆశ (వా.ప్ర.)

(5) అదస్య తే ధ్వసయన్తో వృథేరతే
కృష్ణమభ్వం మహి వర్పః కరిక్రతః ।
యత్ సీం మహీమవనిం ప్రాభి మర్మృశదభిశ్వసన్
త్స్తనయన్నేతి నానదత్ ॥ 23

(6) భూషన్ న యోऽధి బభ్రూషు నమ్నతే
వృషేవ పత్నీరభ్యేతి రోరువత్ ।
ఓజాయమానస్తన్వశ్చ శుమ్భతే భీమో న
శృఙ్గా దవిధావ దుర్గృభిః ॥ 24

(7) స సంస్తిరో విష్టిరః సం గృభాయతి
జానన్నేవ జానతీర్నిత్య[1] ఆ శయే ।
పునర్వర్ధన్తే[2] అపి యన్తి దేవ్యమన్యద్
వర్పః పిత్రోః కృణ్వతే సచా ॥ 25

1. నిత్యఽఆశయే. 2. వర్ధన్తేఽఅపి. (వా.వ.)

(౮) తమగ్రువః కేశినీః సం హి రేభిర[1]

ఊర్ధ్వాస్తస్థుర్మమ్రుషీః ప్రాయవే పునః ।

తాసాం జరాం ప్రముఞ్చన్నేతి నానదదసుం

పరం జనయఞ్జీవమస్తృతమ్ ॥ 26

(౯) అధీవాసం పరి మాతూ రిహన్నహ

తువిగ్రేభిః సత్వభిర్యాతి వి జ్రయః ।

వయో దధత్ పద్వతే రేరిహత్

సదాఽను శ్యేనీ సచతే వర్తనీరహ ॥ 27

(౧౦) అస్మాకమగ్నే మఘవత్సు దీదిహ్యధ

శ్వసీవాన్ వృషభో దమూనాః ।

అవాస్యా శిశుమతీరదీదేర్వర్మేవ

యుత్సు పరిజర్భురాణః ॥ 28

1. సంహిరేభిరఽఊర్ధ్వాః. (ప్రా.ప్ర.)

(11) ఇదమగ్నే సుధితం దుర్ధితాదధి

ప్రియాదు చిన్మన్మనః ప్రేయో[1] అస్తు తే ।

యత్ తే శుక్రం తన్వో౩ రోచతే శుచి

తేనాస్మభ్యం వనసే రత్నమా త్వమ్ ॥ 29

(12) రథాయ నావముత నో గృహాయ

నిత్యారిత్రాం పద్వతీం[2] రాస్యగ్నే ।

అస్మాకం వీరాగ్ం ఉత నో మఘోనో

జనాగ్ంశ్చ యా పారయాచ్ఛర్మ యా చ ॥ 30

(13) అభీ నో[3] అగ్న ఉక్థమిజ్జుగుర్యా

ద్యావాక్షామా సింధవశ్చ స్వగూర్తాః ।

గవ్యం యవ్యం యన్తో దీర్ఘాహేషం

వరమరుణ్యో వరన్త ॥ 31

1. ప్రేయోఽస్తు. 2. పద్వతీగ్ంఽరాస్యగ్నే. 3. నోఽఅగ్నఽఉక్థ (పా.ప్ర.)

## అనువాకము—21. సూక్తము—140

### ఋషి—ఉచథ్యపుత్రుఁడు దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1) ఉ॥ ఉత్తర వేదిపై వెలుఁగుచుండెడు నగ్నికి వేదు తానముం
గ్రొత్తదిగా నొనర్చి యతికోమల వస్త్రము రీతి దర్భలం
మెత్తఁగ వేసి యందుఁ గడుమేలగు నాజ్యము హవ్యమెల్ల నా
యత్తముఁ జేసి యుంచవలె నధ్వరకారక! హోతృపుంగవా! ॥ 27

(2) చ॥ ద్విజుఁడగు నగ్ని యన్నమును దృప్తిగ భక్షణఁజేయుచుండు నా
నిజమగు నన్నమూలమున నిష్టమెయిం జనులెల్లఁ బ్రీతి న
వ్యజనము చేయఁజాలుదురు యాగ హవిస్సు భుజించు నగ్నియే
సుజలము నిచ్చుఁ గాననము గ్రుక్కఁగఁజేయు దవాగ్నిరూపుతోన్ ॥ 28

(3) సీ॥ జ్వాలాముఖంబున జరుగుచుండెడు నది యంధకారము నెల్ల నడఁచునదియు
సూక్ష్మకాష్ఠాదుల శోభనొందెడునది వేగముగా బయల్వెడలునదియు
నాచ్ఛాదనముచేత నడఁగియుండెడునది పాలకు నభివృద్ధిఁ బఱచునదియు
సామాన్య శిశు ధర్మసరణి నొప్పెడునది యజమానులను దివి కంపునదియు
గీ॥ [1]మథన సంజాత నీలిమ ప్రథిత దారు, యుగళ సంతత బాలనాభ్యుదితమునయి
సర్వ సన్నుతి పాత్రమై జరుగునదియు, నైన యగ్నిపరిస్ఫూర్తి నమరుచుండె ॥ 29

(4) ఉ॥ జ్ఞానముఁగల్గు ఋత్విజుల జాతము బ్రహ్మపథంబుఁజేర్చు వేఁ
బూనును గృష్ణవర్ణమును బొందనమాన ముఖంబు లెన్నియేన్[2]
మానక వస్తుసంపదను మండఁగఁజేయు ఘణంకు గాలి కా
మానిత వహ్నికీల లతిమన్నన లందుత యజ్ఞ భూములన్ ॥ 30

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (434-435-436-437-438-439 పుటలు) చూడనగును. సాయణాచార్యుల భాష్యానుసారముగా శ్రీ నేమానివారు "ఉచథ్య పుత్రుఁడు దీర్ఘతముఁ"డీ సూక్తమునకు ఋషి యని వ్రాసిరి, కాని తరువాతి సూక్తములకుఁ గేవల "దీర్ఘతమ" నామమునే ఋషిగా నుటంకించిరి. శ్రీ నేమాని వారు స్వహస్తముతో నుల్లేఖించిన ఋషిదేవతల నామములు గల 15b సంపుటములోఁ బ్రథమ మండలములోని 140వ సూక్తము మొదలు 164వ సూక్తముదాఁకను "దీర్ఘతమస్సు" ఋషిగాఁ బేర్కొనిరి. దీనినిబట్టి శ్రీ నేమానివారు దీర్ఘతముఁ డొక్కఁడుగానే భావించినట్లు తోఁచుచున్నది. వ.గో.కృ.

1. మథనమున నైల్యమగు నట్టి ప్రథితదారు. ద్వితయ సంతతి బాలన విధమువలనఁ బుట్టునది సర్వనుతులను బొందునదియు (తొ.పా.)
2. లెన్నియే। న్గానెడు వస్తు సంపదను గాల్చుచునుగాలికిఁ గంపమొందునా (తొ.పా.) గాల్చుచును అనునప్పుడు గణభంగము, గాల్చు అని వ్రాసి "ను" వర్ణమును దొలగించ వచ్చును. కాని "కానెడు" అను తొలిపదము సరిగా లేదని కాఁబోలు గ్రంథకర్త పాఠము మార్చి వేసెను. వ.గో.కృ.

(5) గీ॥ స్వప్రకాశమహిమ చాలంగఁజేయుచు, నంధకార మెల్ల నవల కనుపు
నంటరానితనమె యంతటఁగల వహ్ని, కణము లధికకాంతి కలుఁగఁజేయు ॥ 31

క॥ ఎప్పుడు మిణుగురు లన్నియుఁ, దప్పక భువిపైని వెల్గి తార్మా రగునో
యప్పుడె యనలుఁడు భుగభుగ, చప్పుడు సేయుచుఁ బ్రకాశ సంపద నొందున్ ॥ 32

(6) ఉ॥ పచ్చని యోషధీ లతలఁ బల్మరుఁజేరుచు రానురాను దా
హెచ్చయి యాలబోతువలె నెందు నెదుర్కొనువారు లేక యే
బొచ్చము పొందకే సకలభూతములన్ వెలుఁగొందఁజేయుచున్
వచ్చుచుఁ గిలలం గెరలు వహ్ని సశృంగ మృగంబుకై వడిన్ ॥ 33

(7) సీ॥ సూక్ష్మ రూపంబున శోభిల్లు లతలలో నొప్పుచు నభివృద్ధి నొందుచుండు
నభివృద్ధిఁ జెందుచు నన్నివీరుధములఁ గాంచుచు నీరు గావించుచుండుఁ
దన యభివృద్ధిని దాను వాంఛించుచు నర్చస్తుతులఁ బైకి నంపుచుండు
నర్చిస్తుతులఁ బంపి యడఁగియుండక యట సర్వదిక్కులకయి జరుగుచుండు
గీ॥ వృద్ధియగుఁగిలలం దాఁబ్రవృద్ధిఁబొంది, యాగ యోగ్యత గాంచుచు నఖిలభూమి
గగనముల వెల్గఁజేయుచుఁ గరము వహ్ని, ప్రజ్వలిల్లెడు నెప్పుడుఁ బ్రకృతియందు ॥ 34

(8) గీ॥ పైని నల్లఁదనంబునఁ బరిఢవిల్లి, జ్వాల లన్నియుఁ జక్కఁగ సాఁగి సాఁగి
యనలుఁ డాలింగనముఁ జేసికొనుచుఁ గరము, విషమ ముఖముల నేవేళ వెలయుచుండు ॥ 35

క॥ అంగారభావ మంది చెలంగుచు నూర్ధ్వాభిముఖ విలాసముగను నా
రంగత్కీలాజాలము, మంగళతర వహ్ని నెపుడు మానక గొలుచున్ ॥ 36

(9) చ॥ అడవులఁగల్గు జంతువుల నన్నిటఁ బారెడున ట్లొసర్చుచుం
బుడమికిఁ గప్పునాఁబరఁగు పూఁబొదరిండ్లను బుట్టఁజేయుచున్
గడుఁ బహుజాతి కింపగుతృణంబుఁ జనింపఁగ సంచరించుచున్
వడి వడి వహ్నిపోయెడు నవారిత శక్తి పురస్సరంబుగాన్ ॥ 37

(10) గీ॥ అనలుఁడా! మే మొనర్చెడి యజ్ఞములకు, వచ్చి హవ్యము లన్నియుఁ బుచ్చుకొనుచు
దాంతచేతస్కుఁడవు కమ్ము ధర్మబుద్ధిఁ, గవచమున్‌వలె ననిలోనఁ గావు! మమ్ము ॥ 38

(11) †క॥ సమిధలపై వైచిన యీ, సమమగు హోమంబు నీకు సంతస మిచ్చున్
సుమనోదూతజ్వాలా,విమలురమగు మాకు మణుల వేల నొసఁగవే! ॥ 39

† ఈ పద్యమునకు దెలుఁగు వ్రాతప్రతిలో (2వ. సంపుటము 67వ.పుట) ఋక్సంఖ్య పొరపాటున వ్రాయలేదు. వ.గో.కృ.

(12) సీ॥ పుత్రులకుం బుత్రపుత్రులకుం జాల నన్నంబు నీయంగ నమరు నెద్ది?
[1]మౌనులకున్ యజమానులకున్ వేగ దుఃఖంబులను గడుఁదోలు నెద్ది?
[2]చాల బ్రహ్మానందసరణిని నరులకుఁ బాయక నేవేళఁ జేయు నెద్ది?
సంసార వారిధి సంతరింపఁగఁజేయఁ బరమసాధనముగాఁ బరఁగు నెద్ది?
గీ॥ కర్మఋత్విక్కులనుతెల్లఁ గలుఁగు నెద్ది?, మంత్రమయపాదములచేత మసలు నెద్ది
యట్టి యాగమహానౌక నతిసమర్థ, యాగకర్తకు నీయుమో యగ్ని:నీవు! ॥ 40

(13) [3]ఉ॥ మే మొనరించు శస్త్రమును మిక్కిలిగా నుతియింపు పావకా!
భూమి దివంబు [4]యాగములఁ బూర్ణత గాంచునుగాక! వెండి యీ
భూమిని బాఱు వాహినులు పూజ్య పయస్సును వ్రీహి సంపదన్
వేమ రొసంగుచుండి మము వేయి విధంబులఁ గాచుఁగావుతన్! ॥ 41

క॥ అరుణములైన యుషస్సులు, పరముఁ ద్రికాలములయందు బహుళాన్నరస
స్ఫురణము వెదఁజల్లుచు సుస్థిరముగ యాగార్థమెల్లఁ జేయుత మాకున్ ॥ 42

## సూక్తమ్—141

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః†

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ, 12-13 త్రిష్టుప్.

(1) బళిత్థా తద్ వపుషే ధాయి దర్శతం[1] దేవస్య భర్గః సహసో యతో జని ।
యదీముప హ్వరతే సాధతే మతిరృతస్య ధేనా[2] అనయన్త సస్రుతః ॥ 32

1. మౌనులకున్ యజమానుల జననాది కిష్టంబులను దొలగింపు నెద్ది? (తొ.పా.) 2. సరస బ్రహ్మానంద సంతుష్టి నరులకు (తొ.పా.) 3. ఈ ఋక్కు సంస్కృత మూలములో "దీర్ఘాహః," అను పదము గలదు. దీర్ఘములగు అహస్సులు. ఆర్యులు నివసించు ప్రదేశమునందు రాత్రియే లేని దినములుండినట్లు తలంపవచ్చును- (నే.వేం.న.శా.) ఈ వ్యాఖ్య సాయన భాష్యానుగామి. వ.గో.కృ. 4. యాగములు పూర్ణముగా నొనరించుఁగాక (తొ.పా.) † ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (434-435-436-437-438-439 పుటలు) చూడనగును. వ.గో.కృ.

1. దర్శతదేవస్య. 2. ధేనాఽఅనయన్త. (వా.ప్ర.)

(2) పృక్షో వపుః పితుమాన్ నిత్య[1] ఆ శయే ద్వితీయమా సప్తశివాసు మాతృషు ।
తృతీయమస్య వృషభస్య దోహసే దశప్రమతిం జనయన్త యోషణః ॥ 33

(3) నిర్యదీం బుధ్నాన్మహిషస్య వర్పస[2] ఈశానాసః శవసా క్రన్త సూరయః ।
యదీమను ప్రదివో మధ్వ[3] ఆధవే గుహా సన్తం మాతరిశ్వా మథాయతి ॥ 34

(4) ప్ర యత్ పితుః పరమాన్నీయతే పర్యా పృక్షుధో వీరుధో దంసు రోహతి ॥
ఉభా[4] యదస్య జనుషం యదిన్వత[5] ఆదిద్ యవిష్ఠో[6] అభవద్ ఘృణా శుచిః ॥ 35

(5) ఆదిన్మాతౄరావిశద్ యాస్వా శుచిరహింస్యమాన[7] ఉర్వియా వి వావృధే ।
అను యత్ పూర్వా[8] అరుహత్ సనాజువో ని నవ్యసీష్వవరాసు ధావతే ॥ 36

(6) ఆదిద్ధోతారం వృణతే దివిష్టిషు భగమివ పపృచానాస[9] ఋఞ్జతే ।
దేవాన్ యత్ క్రత్వా మజ్మనా పురుష్టుతో మర్తం శంసం విశ్వధా వేతి ధాయసే ॥ 37

(7) వి యదస్థాద్ యజతో వాతచోదితో హ్వారో న వక్వా జరణా[10] అనాకృతః ।
తస్య పత్మన్ దక్షుషః కృష్ణజంహసః శుచిజన్మనో రజ[11] ఆ వ్యధ్వనః ॥ 38

1. నిత్యఽఆశయే. 2. వర్పసఽఈశా. 3. మధ్వఽఆధవే. 4. ఉభాఽఉదస్య. 5. యదిన్వతఽఆదిన్ 6. యవిష్ఠోఽఆభ 7. మానఽఉర్వియా 8. పూర్వాఽఅరుహత్. 9, నాసఽఋఞ్జతే. 10, జరణాఽనా 11. రజఽఆవ్య, (వ్యా.ప్ర.)

(8) రథో న యాతః శిక్వభిః కృతో ద్యామఙ్గేభిరరుషేభిరీయతే ।

ఆదస్య తే కృష్ణాసో దక్షి సూరయః శూరస్యేవ త్వేషథాదీషతే వయః ॥ 39

(9) త్వయా హ్యగ్నే వరుణో ధృతవ్రతో మిత్రః శాశద్రే అర్యమా సుదానవః ।

యత్ సీమను క్రతునా విశ్వథా విభురరాన్న నేమిః పరిభూరజాయథాః ॥ 40

(10) త్వమగ్నే శశమానాయ సున్వతే రత్నం యవిష్ఠ దేవతాతిమిన్వసి ।

తం త్వా ను నవ్యం సహసో యువన్ వయం భగం న కారే మహిరత్న ధీమహి ॥ 41

(11) అస్మే రయిం న స్వర్థం దమూనసం భగం దక్షం న పపృచాసి ధర్ణసిమ్ ।

రశ్మీగ్ం[1]రివ యో యమతి జన్మనీ[2] ఉభే దేవానాం శంసమృత[3] ఆ చ సుక్రతుః ॥ 42

(12) ఉత నః సుద్యోత్మా జీరాశ్వో హోతా మన్ద్రః శృణవచ్చన్ద్రరథః ।

స నో నేషన్నేషతమైరమూరో ऽగ్నిర్వామం సువితం వస్యో[4] అచ్ఛ ॥ 43

(13) అస్తావ్యగ్నిః శిమీవద్భిరర్కైః సామ్రాజ్యాయ ప్రతరం దధానః ।

అమీ చ యే మఘవానో వయం చ మిహం న సూరో[5] అతి నిష్టతన్యుః ॥ 44

1. రశ్మీగ్ంఽరివ, 2. జన్మనీఽఉభే 3. శంసమృతఽఆ, 4. వస్యోఽఅచ్ఛ 5. సూరోఽఅతి (వా.ప్ర.)

## సూక్తము—141

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1) చ॥ బలమును బొంద [1]నానమునఁ బ్రాణులు సూర్యమహస్సు మూర్తిలో
వల జఠరాగ్నిరూపమునఁ బున్నగఁ బొందుచునుండి రెంతయుం
జెలఁగెడు కాంక్షితంబులను దీర్చుచు నయ్యది మంత్ర వాక్కులన్
లలితముగా నొసర్చుచు మెలంగును యజ్ఞము నిర్వహించుచున్ ॥ 43

(2) క॥ వివిధమగు నన్న మిచ్చుచు. వివిధశరీరాభివృద్ధి వెలయ [2]జరుపుచున్
వివిధహవిస్సుల నొసఁగుచు. ఘని నగ్నివెలుంగుచుండుఁ బూర్ణుండగుచున్ ॥ 44

క॥ లోకమునకు శుభకరమగు. ప్రాకటవర్షంబు నీయఁ బ్రభు వగుచు వియ
ల్లోకమున మెఱుపు రూపున. శ్రీకరమగు వెలుఁగునిచ్చుఁ జిచ్చు ముదమునన్ ॥ 45

క॥ రవి కిరణ రూపములతో, దివి వెలుఁగుచు వర్ష మిచ్చు తేజస్సునఁ దా
నవిరళ జలము నొసంగుచు, [3]జవపూర్ణుం డగుచునుండు జ్వలనుండు కడున్ ॥ 46

గీ॥ మూఁడు విధములైన ముద్దురూపములతో. మూఁడు చోట్ల వెలసి ముదముతోడ
నగ్ని యన్న వీరల ననుపమకాంతితో, వెలుఁగుచుండు [4]వేద్య వేల్పులందు ॥ 47

(3) చ॥ సవనములందు నేర్పుగల సాత్త్వికు లందఱుఁ బావకోత్తమున్
వివిధములైన మంత్రముల వేగమె యిష్టికిఁ బుట్టఁజేసెదున్
సవనముఁ జేయువేళఁ గడుఁజక్కఁగఁ గాష్ఠములందు నీసమా
నవిరళవహ్ని వాతమున నత్యధికంబుగఁ బ్రజ్వరిల్లెడున్ ॥ 48

(4.5) సీ॥ హవ్యము హోమార్హమగునట్లు లటునిటు భక్తితోఁ గొనిపోవఁబడుచునుండు
వహ్నిచే భక్షింపఁబడు నోషధులు వాని దంతంబులకుఁ గదుఁదగులుచుండు
నధ్వర్యు యజమాను లరణిని మథియించి తిరముగ నగ్నిని దీయుచుంద్రు
యజమాను లర్పించు హవ్యంబులంగొని వెలిఁగెడు నగ్ని దా వెలుఁగుచుండు
గీ॥ ముందు వేసిన కట్టెల మొత్తమందు. నందుపై నిడిన కట్టెల నందునందు
మండుచున్ నెక్కులందెల్ల నిండుకొనుచు, వెలుఁగుచున్నాఁడు జగమున వేడివేల్పు ॥ 49

* ఋషి విశేష విషయములకై సంస్కృతము, తెలుఁగు 140వ సూక్తముల ఋషులకిచ్చిన ఫుట్‌నోట్లు (434-435-436-437-438-439 పుటలు -444 పుట) చూడనగును. వ.గో.కృ.

1. సర్వవిధ ప్రాణులు (తా.పా. నందఁగను) వ.గో.కృ. 2. పెంపుఁజేయుచున్ (తా.పా.) 3. బరిపూర్ణుండగుచునుండుఁ బావకుఁడు కడున్ (తా.పా. ప్రాణదంగను.) వ.గో.కృ. 4. వివిధ వేల్పులందు (తా.పా.)

(6) ఉ॥ ఋత్విజు లిచ్చుహవ్యముల వృ(ఋ)ద్ధిని బొందుచు సర్వవేళలన్
సత్వర మిష్టికర్మలను సాంగముగా నొనరించి భక్తులన్
సత్వము గల్గు వారలుగఁ జక్కఁగఁ జేసెడు దేవమాలికా
తత్త్వవిదుండు వహ్ని మహితంబుగ వెల్గుచునుండుఁ గాంతితోన్ ॥ 50

క॥ కావున యజమానులు శుభ, దేవతలును గోరుచున్న దివ్యాగ్నిని దా
మేవిధమునైనఁ బిలుచుచు, భూ విభుని నుతించునట్లు పొగడెద రతనిన్ ॥ 51

(7) ఉ॥ ఎప్పుడు వహ్నిజాతమున నింపుగఁ జోదితుఁడౌచు సంతతన్
దప్పక చేరి వక్తయయి తాను విదూషకుమాట్కి నొప్పునో
యప్పుడు సర్వభక్షకుని నగ్నిని బిల్చుచు సంతసంబుతో
నొప్పుచుఁ బూజఁ జేయుదురహో! యనునట్టులు మానవోత్తముల్ ॥ 52

(8) క॥ బెడిదపు యానము త్రాటం,గడు లాగంబడినమాట్కిఁ గదలెడు మంటం
గడఁగుచు నగ్ని నభస్సున్,వడిఁజేరుచు నున్నవాఁడవారితశక్తిన్ ॥ 53

క॥ ఇట్టాకాశము నంతట,నెట్టో యభివృద్ధిఁజెంది యెంతయుఁ బొగచేఁ
జుట్టఁబడు నభము నల్లని, యట్టుల నొనరించు నగ్ని నడవిని గాల్చున్ ॥ 54

గీ॥ శూరవరుని జనులు చూచినమాత్రాన, వెఱచి పాఱునట్లు వివిధ పక్షి
పశువు లెల్ల నగ్ని పజ్జనుండఁగలేక, పరుగు లెత్తుచుండె భయముచేత ॥ 55

(9) గీ॥ నీవలెన్ [1]వరుణమిత్రులు నిష్ఠతోడ, సహజ కార్యములంజేయఁ జాలుచుండ్రి
నేమి చక్రంబునున్వలె నిఖిల జనుల,నగ్ని! కాపాడుచున్నా వనంతశక్తి ॥ 56

(10) చ॥ మిగులఁ బ్రసిద్ధుఁడా! యనల! మిక్కిలి నిన్ను నుతించువారికా
తగిన హవిస్సుగైకొనుచుఁ దప్పక పూజ్యుల కందనిత్తువో
యగణితవిత్తదా! కనుక నన్నివిధంబుల మేము సూక్తులన్
బొగడుచు నుంటిమయ్య! నినుఁ బూర్ణమనస్సుల నన్నివేళలన్ ॥ 57

(11,12) సీ॥ చక్కనిదగుధనసంపత్తి మా కిల దయసేయుమా! యగ్ని! ధర్మబుద్ధి
దక్షుండు ధీరుండు ధనవంతుఁడౌ పుత్రు నొసఁగుమా! యనలుండ! యుచితరీతిఁ[2]
గిరణములన్వలెఁ గ్రిందమీఁదల మాకుఁ గలిగింపుమా! వ్యాప్తి [3]లలితశక్తి
సత్కర్మ చేయించి చక్కని యిష్టులఁ బొందుమా! స్తోత్రంబుఁ [4]బొసఁగు ప్రీతి
గీ॥ నిజ బలంబును నెఱిఁగిన నేర్పుకాఁడ, వధికజవయుక్తహయముల నమరువాఁడ
వమరులను[5] బిలిచికొనివచ్చు నమరదూత,వైన నీ వీయుమా! మాకు నమరపదము ॥ 58

1. ఇక్కడవింద్ర గణమునకు మారు "భలము" ప్రయుక్తమైనది. వ.గో.కృ. 2. యొప్పుకలిమి (తా.పా.) 3. కరుణఁదనరి (తా.పా.)
4. బూర్ణమతివి (తా.పా.) 5. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచ లఘుగణ ముపయుక్తమైనది. వ.గో.కృ.

(13) క॥ జలమునకు సూర్యదేవుఁడు, జలమును శబ్దింపఁజేయ సాగెడునట్టి
పొలుపుగ జను లగ్నిని వర,ములకయి ప్రార్థింపఁజేసి ముదమును గనరే: ॥ 59

## సూక్తమ్—142

ఋషిః—దీర్ఘతమా ఔచిథ్యః *

దేవతా—1-ఇధ్మః† సమిద్ధోऽగ్నిర్వా, 2-తనూనపాత్, 3-నరాశంసః,
4-ఇళః, 5-బర్హిః, 6 దేవీర్ద్వారః, 7-ఉషాసానక్తా, 8-దైవ్యౌ హోతారౌ ప్రచేతసౌ,
9-తిస్రోదేవ్యః సరస్వతీళాభారత్యః, 10-త్వష్టా, 11-వనస్పతిః, 12-స్వాహాకృతయః, 13-ఇంద్రః

ఛందః—అనుష్టుప్

(1) సమిద్ధో[1] అగ్న ఆ వహ దేవాగ్ం అద్య యతస్రుచే ।
తన్తుం తనుష్వ పూర్వ్యం సుతసోమాయ దాశుషే ॥ 45

(2) ఘృతవన్తముప మాసి మధుమన్తం తనూనపాత్
యజ్ఞం విప్రస్య మావతః శశమానస్య దాశుషః ॥ 46

(3) శుచిః పావకో[2] అద్భుతో మధ్వా యజ్ఞం మిమిక్షతి ।
నరాశంసస్త్రిరా దివో దేవో దేవేషు యజ్ఞియః ॥ 47

(4) ఈళితో[3] అగ్న ఆ వహేన్ద్రం చిత్రమిహ ప్రియమ్ ।
ఇయం హి త్వా మతిర్మమాచ్ఛా సుజిహ్వ వచ్యతే ॥ 48

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (434-435-436-437-438-439 పుటలు) చూడనగును. వ.గో.కృ.

† ఇధ్మః పాఠము సాయనభాష్య ప్రతిలోను మాక్సుముల్లర్ ప్రతిలోను లేదు. మఱికొన్నింటఁ గలదు. వ.గో.కృ.

1. సమిద్ధోऽఅగ్నऽ ఆవహా...గ్ం ఽ అద్య 2. పావకోऽఅద్భుతో 3. ఈళితోऽఅగ్నऽ ఆ వహేన్ద్రంచిత్ర. (ప్రా.ప్ర.)

(5) స్తృణానాసో యతస్రుచో బర్హిర్యజ్ఞే స్వధ్వరే ।
వృఞ్జే దేవవ్యచస్తమమిన్ద్రాయ శర్మ సప్రథః ॥ 49

(6) వి శ్రయన్తామృతావృధః ప్రయై దేవేభ్యో మహీః ।
పావకాసః [1]పురుస్పృహో ద్వారో దేవీరసశ్చతః ॥ 50

(7) ఆ భన్దమానే[2] ఉపాకే నక్తోషాసా సుపేశసా ।
యహ్వీ[3] ఋతస్య మాతరా సీదతాం బర్హిరా సుమత్ ॥ 51

(8) మన్ద్రజిహ్వా జుగుర్వణీ హోతారా దైవ్యా కవీ ।
యజ్ఞం నో యక్షతామిమం సిధ్రమద్య దివిస్పృశమ్ ॥ 52

(9) శుచిర్దేవేష్వర్పితా హోత్రా మరుత్సు భారతీ ।
ఇళా సరస్వతీ మహీ బర్హిః సీదన్తు యజ్ఞియాః ॥ 53

(10) తన్నస్తురీపమద్భుతం పురు వారం పురు త్మనా ।
త్వష్టా పోషాయ వి ష్యతు రాయే నాభా నో[4] అస్మయుః ॥ 54

(11) అవసృజన్నుప త్మనా దేవాన్ యక్షి వనస్పతే ।
అగ్నిర్హవ్యా సుషూదతి దేవో దేవేషు మేధిరః ॥ 55

1. పరుస్పృహో, 2. మానేఽఉపాకే 3. యహ్వీఽ ఋతస్య, 4. నోఽఅస్మయుః. (బ్రా.ప్ర.)

(12) పూషణ్వతే మరుత్వతే విశ్వదేవాయ వాయవే ।

స్వాహా గాయత్రవేపసే హవ్యమిన్ద్రాయ కర్తన ॥ 56

(13) స్వాహాకృతాన్యా గహ్యుప హవ్యాని వీతయే ।

ఇన్ద్రా గహి శ్రుధీ హవం త్వాం హవన్తే[1] అధ్వరే ॥ 57

## సూక్తము—142

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని †

(1) ఉ॥ ఇచ్చు హవిస్సులం గడు సమిద్ధుఁడవై సవనంపుఁ బాత్రలం
దెచ్చెడు మానవోత్తముల దీక్షలకై యమరాళిఁ బిల్వు మో
సచ్చరితుండ! సోమ రస సారముఁ దీసితి మెల్ల దేవతల్
వచ్చెడునట్లుచేయవఁటె! వహ్నివిభూ! యది ద్రావఁ బ్రీతితోన్ ॥ 60

1. హవన్తేఽధ్వరే. (వా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† దేవతల విషయమై సామాన్యముగా నగ్ని దేవతగా శ్రీ నేమానివారు గ్రహించిరి. సాయనుఁడు వ్రాసిన పాక్షికార్థములను దృష్టిలోఁ బెట్టుకుని యనువాదమును పెక్కు సందర్భములలోఁ గావించిరి. అగుచో నాడపిల్లయుఁ గానిచో మగపిల్లవాఁడనియు నెడపెడగ నర్థములు సాయనాచార్యులు వ్రాసిన సందర్భములును నున్నవి. ఈ సూక్తము ననువదించుటలో ముఖ్యముగా నగ్నినే దేవతగా శ్రీ నేమానివారు పరిగ్రహించినను 6,7,8,9,10 ఋగనువాదములలో దేవీద్వార, ఉష, హోత, మహి, ఇళ, సరస్వతి దేవతలనుగా మిగిలినవానిలోఁ గొన్నిటిని ననుసరించియు ననుసరింపకయు ననువదించిరి. సాయనులును దేవతలను దమకుఁ దోచిన విధమున నొసంగిరి, ఇళా, సరస్వతీ, భారతీ దేవతలను సాయణులు గ్రహింపఁగా మహీ, ఇళ, సరస్వతులను శ్రీ నేమానివారు గ్రహించిరి, 9వ ఋక్కులో సంస్కృతమున మహీ శబ్దము సైతము ప్రయుక్తమైనది. 64వ పద్యము సీసము నాల్గవ పాదములో "మహియు నిళాదేవి మాన్య సరస్వతి" అని ముగ్గురుదేవతలు పేర్కొనఁబడిరి. మహిని దేవతగా సంస్కృతమూలములో వ్యాఖ్యాతలుపేర్కొనలేదు. కావున నీసూక్తమున దేవతల విషయమై పద్యములలోఁ బేర్కొన్నవానిని బట్టి గ్రహింపనగును. ఈ దేవతలు శ్రీ నేమానివారి యభీష్ట ప్రకారము వా రనుసరించిన సంస్కృతమూల ప్రతి ననుసరించి యనువదింపఁ బడినట్లు గ్రహింపవలయును. సంస్కృత మూలమందలి తొమ్మిదవ ఋక్కునకున్న దేవతలలోఁ బేర్కొనఁబడిన భారతీ దేవతా విషయమై యీసూక్తములోని 64వ పద్యమైన "సుందర పరిశుద్ధ" ఇత్యాది సీసపద్య చతుర్థ పాదమునకై (454 పుట) వ్రాసిన ఫుట్‌నోటు చూడనగును. వ.గో.కృ.

(2) క॥ అనవరతము నిను వేఁడుచు, ఘన హవ్యంబొసఁగునట్టి గౌరవజనులన్
మనమున నెంచుచు యజ్ఞం, బనఘా! యగువలకు నాఁగి యప్పుడు చనుమా !॥ 61

(3,4) సీ॥ దేవతావరులలో దివ్యుఁడవై కీర్తి మించినా వురుకీర్తి గాంచినాఁడ
వాశ్చర్యఘాతుండవై ప్రకాశంబును జేసినా వరుల నిర్జించినావు
యజ్ఞ సంపాదకుఁడగునట్టివానిని మెచ్చినా వతిధనం బిచ్చినావు
సోమపానముసేయ శుభరూపసంపద నిచ్చినావు రసంబు మెచ్చినావు
గీ॥ ప్రతిదినము వృద్ధిఁబొందుచుఁ బ్రభువునింద్రు, హవ్యభాగము గైకొన నతిరయమునఁ
బిలిచికొని రావె! యనల! మా లలితనుతులు, నిన్నుఁబ్రీతుని గావింప నున్నవిపుడు ॥ 62

(5) గీ॥ ప్రాపణీయము మున్నగు ప్రజల నియత, కర్మలఁగలట్టి యాగంబు గలుఁగుచుండ
నీ నిమిత్తము పావకా! నిశ్చయముగఁ, గట్టుచున్నారు గేహము కర్మకరులు ॥ 63

(6,7,8,9,10)సీ॥ సుందర పరిశుద్ధ మందిర ద్వారము లమరుల రాకకై యమరుఁగాక!
రమణీయ రూపమౌ రాత్ర్యుషద్వయము దా నుచ్చదర్భలపైకి వచ్చుఁగాక!
భూమ్యంతరిక్షస్థ పుణ్యాగ్నిహోత్రంబు మించి యాగము నిర్వహించుఁగాక!
† మహి భారతియు నిళా మాన్యసరస్వతి ముదమునఁ గుశలఁ బొందుదురుగాక!
గీ॥ శీఘ్ర గమనంబుఁ గల్గుచు సిద్ధరూప, విలసితంబయి జలమున వెలయునట్టి
వైద్యుతాగ్ని ధనప్రదవర్ష మిచ్చి, మమ్ము నభివృద్ధిఁజేయుత మానితముగ ॥ 64

(11) క॥ యూపాధిప! నరులు నిజ, వ్యాపారములందు నిల్పి వర దేవతలన్
దీపింపఁజేసి వారికి, నోపి హవిస్సులను నొసఁగు ముచిత ప్రజ్ఞన్ ॥ 65

† మహియు నిళాదేవి మాన్య సరస్వతి (వ్రా.ప్ర.పా.) శ్రీ నేమానివారింద సంస్కృత మూలములో నున్న సరస్వతికి భిన్నమైన భారతిని విడిచిపెట్టిరి. కావున నీ పాదమును మూలానుగుణముగా సవరించితిని. ఈ సంస్కృతపు ఋక్కులో భారతీ శబ్దము ప్రయుక్తమైనట్లు శ్రీ నేమానివారు గుర్తింపలేదు. ఇతర సూక్తములలోఁ బలు ఋక్కులలోఁ గూడ నీ భారతీ శబ్దము ప్రయుక్తమైనది. ఈ విషయము గుర్తింపక శ్రీ నేమానివారు శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత వ్రాతప్రతి 8వ సంపుటము బైండు నందు చిట్టచివరి పేజీలో ఒక చిన్న బ్రౌన్ కాగితముపై స్వహస్తముతోనే

"భరత : మండ 2, సూ 14. మంత్ర. 7,8.
భారతీభిః : మండ 3, సూ 4, మంత్ర. 8.

అని వ్రాసియుంటించిరి. కాని ఋగ్వేదము ప్రథమ మండలము 142వ సూక్తము 9వ ఋక్కులోనే "భారతీ" శబ్దము ప్రయుక్తమైనది. ఈ సూక్తమున "ఇళా సరస్వతీ భారతులు" విభిన్న దేవతలుగాఁ బేర్కొనఁబడిరి. ఈ 142వ సూక్తమును విస్మరించిన శ్రీ నేమానివారు 3వ మండలములోని 4వ సూక్తమునందలి 8వ ఋక్కును రెండు పద్యములలో ననువదించుచు "భారత, భారతీ" శబ్దములగురించి "భారతీయుల" గురించి చిన్న ఫుట్‌నోటు వ్రాసి చర్చించిరి. 3వ మండలములోని 53వ సూక్తములోఁగల 24వ ఋగనువాదపద్యమునఁగూడ "భరత" వంశీయుల గురించి కొలదిగా వర్ణించి యీ సందర్భముగా వ్రాసిన ఫుట్‌నోటులో భారతీయులగురించి కొంత చర్చించిరి. ప్రథమమండలము 142వ సూక్తము 9వ ఋక్కులోనే కాక ప్రథమ, ద్వితీయ, మండలములలో నీక్రింది సూక్తములందలి ఋక్కులలో "భరత, భారత, భారతీ" శబ్దములు ప్రయుక్తములైనవి.

మరుత్సు భారతీ—ప్రథమమండ.—సూక్తము—142 ; ఋక్కు—9.

(12) గీ॥ [1]పూషముఖులైన యా పుణ్యదేవతలకు, [2]వాయుదేవతకుం బ్రీతిఁ బాయకుండ
[3]హవ్య మొసఁగంగ నుంటి మత్యాదరమున, [4]"స్వాహ" యని పల్కుటకు మంచి సమయ మిదియె॥ 66

(13) క॥ స్వాహా పదంబుతో నీ,యాహం గనిపెట్టి హవ్య మిచ్చితి మింద్రా!
యాహూతుఁడవై వచ్చుట, స్నేహంబున వినుము మేము సేసెడు నుతులన్ ॥ 67

---

భారతీళే సరస్వతి—ప్రథమ మండ.—సూక్తము—188 ; ఋక్కు—8.

హోత్రా భారతీ—ద్వితీయ మండ—సూక్తము—1 ; ఋక్కు—11.

భారతీ విశ్వతూర్తిః—ద్వితీయ మండ—సూక్తము—3 ; ఋక్కు—8.

భారతాऽగ్నే—ద్వితీయ మండ—సూక్తము—7 : ఋక్కులు—1,5.

భరతేన్ద్రాయ—ద్వితీయ మండ—సూక్తము—14 ; ఋక్కు — 1.

ఏతం భరత—ద్వితీయ మండ—సూక్తము—14 ; ఋక్కు—2.

న్యావృణగ్ భరతా—ద్వితీయ మండ—సూక్తము—14 ; ఋక్కు—7.

భరత శ్రుతయేన్ద్రాయ—ద్వితీయ మండ—సూక్తము— 14 ; ఋక్కు—8.

భరతే మతీ—ద్వితీయ మండ—సూక్తము—24 ; ఋక్కు—13.

భరతే ధనా—ద్వితీయ మండ—సూక్తము—26 : ఋక్కు—3.

బర్హిర్భరతస్య—ద్వితీయ మండ—సూక్తము....36 ; ఋక్కు—2.

ఏతం భరత—ద్వితీయ మండ—సూక్తము—37 ; ఋక్కు—1.

పై నుదాహరించిన ప్రయోగములలో "భరత" శబ్దము ద్వితీయ మండలములో నెన్మిది పర్యాయములు, "భారత" శబ్దము ద్వితీయ మండలములో రెండు సందర్భములలోను, "భారతీ" శబ్దము ప్రథమ, ద్వితీయ మండలములలో నాలుగు పర్యాయములు ప్రయుక్తమైనది. అసలు "భారతీ" శబ్దము ప్రథమ మండలములోనే 142వ సూక్తము 9వ ఋక్కులోనే ప్రయుక్తమై యుండఁగా శ్రీ నేమానివారు తృతీయ మండలములోని 4వ సూక్తములోఁగల 8 ఋక్కులోని "భారతీ" శబ్దముఁ జూచువరకును నీ పద ప్రయోగ విషయము స్ఫురణకు రాకపోవుట విచారనీయము. ఋగ్వేద మందంతటను గల "భరత, భారత, భారతీ" శబ్దముల విషయమై "భారతీయుల" విషయకమైన విశేషములకుఁ బీఠిక చూడవలయును. వ.గో.కృ.

1. పూషణాదియుక్త (తొ.పా.) 2. వాయుదేవతకును వాయువునకు (తొ.పా. గణభంగము.) వ.గో.కృ. 3. హవ్యమొసఁగ నుంటి మమదపూజకులార! (తొ.పా.) 4. "స్వాహ" యని వచింప సమయమిదియె (తొ.పా.) "స్వాహ" యను శబ్ద ప్రయోగము అథర్వణి మతమున సాధువు అని శ్రీ నేమానివారు చెప్పగా (వ్రాతప్రతి 2వ. సంపుటము 75వ పుటలో) 66వ పద్యము ప్రక్కన శ్రీ రమణమూర్తి గారు వ్రాసిరి. 5. వినుము మా రచించు వినుతులన్ (తొ.పా.)

## సూక్తమ్—143

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ, 8 త్రిష్టుప్.

(1) ప్ర తవ్యసీం నవ్యసీం ధీతిమగ్నయే వాచో మతిం సహసః సూనవే భరే ।

అపాం నపాద్ యో వసుభిః సహ ప్రియో హోతా పృథివ్యాం న్యసీదదృత్వియః ॥ 58

(2) స జాయమానః పరమే వ్యోమన్యావిరగ్నిరభవన్మాతరిశ్వనే ।

అస్య క్రత్వా సమిధానస్య మజ్మనా ప్ర ద్యావా శోచిః పృథివీ[1] అరోచయత్ ॥ 59

(3) అస్య త్వేషా[2] అజరా అస్య భానవః సుసందృశః సుప్రతీకస్య సుద్యుతః ।

భాత్వక్షసో[3] అత్యక్తుర్న సింధవోఽగ్నే రేజంతే[4] అససంతో అజరాః ॥ 60

(4) యమేరిరే భృగవో విశ్వవేదసం నాభా పృథివ్యా భువనస్య మజ్మనా ।

అగ్నిం తం గీర్భిర్హినుహి స్వ[5] ఆ దమే య ఏకో వస్వో వరుణో న రాజతి ॥ 61

(5) న యో వరాయ మరుతామివ స్వనః సేనేవ సృష్టా దివ్యా యథాశనిః ।

అగ్నిర్జంభైస్తిగితైరత్తి భర్వతి యోధో న శత్రూన్ త్స వనా న్యృంజతే ॥ 62

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 439 వరకుఁగల పుటలు చూడవగును. వ.గో.కృ.

1. పృథివీఽఅరో, 2. త్వేషాఽఅజరాఽఅస్య. 3. క్షసోఽఅత్యక్తు, 4. రేజంతేఽఅస సన్తోఽ అజరాః, 5. స్వఽఆదమేయఽఏకో.(వ్రా.ప్ర.)

(6) కువిన్నో[1] అగ్నిరుచథస్య వీరసద్ వసుష్కువిద్ వసుభిః కామమావరత్ ।
చోదః కువిత్ తుతుజ్యాత్ సాతయే ధియః శుచిప్రతీకం తమయా ధియా గృణే ॥ 63

(7) ఘృతప్రతీకం వ[2] ఋతస్య ధూర్షదమగ్నిం మిత్రం న సమిధాన[3] ఋఞ్జతే ।
ఇన్ధానో[4] అక్రో విదథేషు దీద్యచ్ఛుక్రవర్ణాముదు నో యంసతే ధియమ్ ॥ 64

(8) అప్రయుచ్ఛన్నప్రయుచ్ఛద్భిరగ్నే శివేభిర్నః పాయుభిః పాహి శగ్మైః ।
అదబ్ధేభిరదృపితేభిరిష్టే ఽనిమిషద్భిః పరి పాహి నో జాః ॥ 65

## సూక్తము—143

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1) మ॥ బలసూనుండగు నగ్నిదేవునకునై పల్మర్మముల్ చేసి ని
శ్చలతా వృత్తిని బూనియుండ విలసత్సారంబుఁ గల్పించు నా
కలితాకారుఁడు వహ్నిదేవుఁడు మహా గాంభీర్యముం బూని ని
శ్చలమౌ విత్తము మా కొసంగుత మహాచాతుర్య మొప్పారఁగన్ ॥ 68

(2) గీ॥ అరణులందుఁ బుట్టి యగ్నివేదికలను, నధివసించియుండె నధికతుష్టిఁ
గాష్టబలముచేతఁ గలిఁగిన యావహ్ని, వెలుఁగుఁజేయుఁగాక వివిధగతుల ॥ 69

1. కు విన్నోఽగ్నిః. 2. వః ఋతస్య. 3. సమిధానఽఋఞ్జతే. 4. ఇన్ధానోఽఅక్రో. (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 459 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(3) క॥ సతతం బగ్ని సుతేజః, ప్రతతులు చెలరేఁగుచుండెఁ బ్రకృతిని విలస
స్తుతివిదుని కాంతితమ [1]మ, ప్రతిహతముగఁ బాపుచుండెఁ బ్రస్తుతికెక్కన్ ॥ 70

(4) చ॥ సకల చరాచరంబులకుఁ జక్కని సారముగల్గఁ జేయ నే
వికలతఁ బొందకుండ భృగు వీరులు వహ్నిని వేదిపైని బా
యక యిడినార లాతఁడె యనంత గవాదుల మాకు నిచ్చుచోఁ
బ్రకటమతిన్ నుతించెదము వానిని భక్తి రపైక సూక్తులన్ ॥ 71

(5) ఉ॥ వాయు నినాదమున్వలె నవారిత యోధుని సేవమాటికిఁ దే
జోయుత వజ్రముంగరణిఁ జూపక నిగ్రహ మెల్లవారిపైఁ
బాయక వహ్నికీలముల భక్షణఁ జేయుచు వైరిపంక్తి న
త్యాయత కాననంబుల ననంత లతాదులఁ గాల్చునట్లుగన్ ॥ 72

(6) క॥ ఘనమగు మా స్తోత్రంబుల, విని స[2]ర్వాధారుఁడైన వేలుపు తా మా
కెనలేని ధనము గోవుల, నొనఁగూర్చుచుఁ గర్మఫలము నొసఁగునుగాతన్ ॥ 73

(7) చ॥ సవనము నిర్వహించుటకుఁ జాలెడు నగ్నిని మిత్రునిన్వలెన్
వివిధములైన యిధ్మముల వెల్గఁగఁజేయును బండితోత్తముం
డవితథమైన యాగమున నగ్నిని మేము వెలుంగఁ జేయుచోఁ
గవియుచు వాఁడు మా మతిని గాంతియుతంబుగఁ జేయకుండునే! ॥ 74

(8) క॥ మంగళకర రక్షణము నొ, సంగెడు నో యజ్ఞదేవ! శాత్రవులగు నీ
[3]వెంగళులు గినుక మాతో, సంగతులనుఁ జెప్పకుండ సలుపుము ప్రీతిన్ ॥ 75

1. కాంతి తమమున ప్రతిహతముగ (వ్రా.ప్ర.పా.) ఈ పద్యమున "అప్రతిహిత" శబ్దము ప్రయుక్తమైనది. తమము "న,ప్రతిహత" అనుట వల్ల "న" వర్ణము గురువై గణభంగమగును. కావున "తమ మప్రతిహముగ" అని సవరింపఁబడినది. దీనివల్ల నర్థమునకు భంగ మేమియు రాదు. వ.గో.కృ. 2. సర్వాధారుఁడై వేడివేల్పు మాకెనలేని (తొ.పా. గణభంగము) వ.గో.కృ. 3. వెంగళులమమ్ముఁ గినుకఁబ్ర । సంగింపక యుండునట్లు సలుపుము ప్రీతిన్ (తొ.పా.)

## సూక్తమ్—144

### ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

### దేవతా—అగ్నిః

### ఛందః—జగతీ

(1) ఏతి ప్ర హోతా వ్రతమస్య మాయయోర్ధ్వాం దధానః శుచిపేశసం ధియమ్ ।

అభి స్రుచః క్రమతే దక్షిణావృతో యా[1] అస్య ధామ ప్రథమం హ నింసతే ॥ 66

(2) అభీమృతస్య దోహనా[2] అనూషత యోనౌ దేవస్య సదనే పరీవృతాః ।

అపాముపస్థే విభృతో యదావసదధ స్వధా[3] అధయద్ యాభిరీయతే ॥ 67

(3) యుయూషతః సవయసా తదిద్ వపుః సమానమర్థం వితరిత్రతా మిథః ।

ఆదీం భగో న హవ్యః సమస్మదా వోఢ్హుర్న[4] రశ్మీన్ త్సమయంస్త సారథిః ॥ 68

(4) యమీం ద్వా సవయసా సపర్యతః సమానే యోనా మిథునా సమోకసా ।

దివా న నక్తం పలితో యువాజని పురూ చరన్నజరో మానుషా యుగా ॥ 69

(5) తమీం హిన్వన్తి ధీతయో దశ వ్రిశో దేవం మర్తాస[5] ఊతయే హవామహే ।

ధనోరధి ప్రవత[6] ఆ స ఋణ్వత్యభివ్రజద్భిర్వయునా నవాధిత ॥ 70

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు 430 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. యాఽఅస్య, 2. దోహనాఽఅనూషత, 3. స్వధాఽఅధయత్. (వ్రా.ప్ర.) 4. వోఢ్హుర్న (వ్రా.ప్ర.సా.మా.) 5, మర్తాస్యఽ ఊతయే. 6. ప్రవతఽఆసఽఋణ్వ (వ్రా.ప్ర.)

(6) త్వం హ్యగ్నే దివ్యస్య రాజసి త్వం పార్థివస్య పశుపా[1] ఇవ త్మనా ।

ఏనీ త[2] ఏతే బృహతీ అభిశ్రియా హిరణ్యయీ వక్వరీ బర్హిరాశాతే ॥ 71

(7) అగ్నే జుషస్వ ప్రతి హర్య తద్ వచో మన్ద్ర స్వధావ[3] ఋతజాత సుక్రతో ।

యో విశ్వతః ప్రత్యఙ్ఙసి దర్శతో రణ్వః సందృష్టౌ పితుమాగ్ం[4] ఇవ క్షయః ॥ 72

## సూక్తము—144

### ఋషి—దీర్ఘతముఁడు*

### దేవత—అగ్ని

(1) చ॥ అమల నవీన కల్పనల నంచిత బుద్ధిని గల్గు హోత నీ
మమున హవిస్సు వహ్ని కసమాన రతిం గదు నీయ నెంచుచున్
సమముగ స్రుక్సువాదులను జక్కని పాత్రల సంగ్రహించి స
క్రమముగ హోమకార్యమునకై యవనంబులు సల్పుచుండఁడే! ॥ 76

(2) చ॥ † జలమున నగ్నియెట్టు లనిశంబు నిగూఢత నంతరాంతరా
జ్వలితము నౌచుఁ బ్రజ్వలిత శక్తిగ వెల్గునొ! యట్లె యగ్నిగా
వెలిఁగెడు సౌర యోని యగు వే[1]డుల వేల్పున వారి నిండియున్
జెలఁగు మహాగ్నిరూపి మము నిత్య వినూత్నపథాలఁ గాచుతన్ ॥ 77

(3) ఉ॥ ఎప్పుడు వారి ధారలు వహించుచు నుండునొ పావనాగ్నిఁ దా
మప్పుడె సూర్య లోకమును నంతటఁజేరుచు నూతనంబులై
తప్పక భూమి భాగమును దద్దయు దీప్తులుఁగల్గి చేర్చునిం
కప్పుడు వానిఁ ద్రావి జన మంతయు సౌఖ్యము నొందు నిద్ధరన్ ॥ 78

1. పశుపాఽఇవ; 2. ఏనీ త్వఏతే బృహతీఽఅభి, 3. స్వధావఽఋత 4. పితుమాగ్ంఽఇవ. (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు 430 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† లుప్త భాగ పూరణకర్త, వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ". ప్రథమ మండలములో 144వ సూక్తములోని తొలిఋక్కు ననువదించి రెండవ ఋక్కును శ్రీ నేమాని వారు పొరపాటున ననువదింపక విడిచిపెట్టి మూఁడవ ఋగాదిగా సూక్తానువాదము పూర్తిచేసిరి. కావున నే నీ ద్వితీయ ఋక్కును "జలమున నగ్నియెట్టు" లిత్యాది చంపకమాలగా (77వ పద్యము) ననువదించి పూరించితిని. (చూడు ఆంధ్రానువాద వ్రాతప్రతి ప్రథమ మండలము. రెండవ సంపుటము 78-79. పుటలు) వ.గో.కృ. 1. వేడులవేల్పు = ఆదిత్యుఁడు.

గీ॥ వెలఁగి యధ్వర్యు హోతలు చేతి పాత్ర, హవ్య [1]మీయంగ నద్దాని నంది యగ్ని
కర్మకాండంబు గ్రహియించు గడఁగి రథికుఁ, డెలమి రశ్మల నినుఁడు పూజలనువలెను ॥ 79

(4) సీ॥ హోత యధ్వర్యుండు పూత మానసముతోఁ గార్యము సాధింపఁ గదలివచ్చి
జన్నంబులో నున్న జాయాపతులమాట్కి నొకని వీడుచు నొక్కఁడుండకుండి
రాత్రి దివంబులు రగిలెడు నగ్నినిఁ బూజించుచున్నారు పూజ్యుఁడతఁడు
మండకయున్నను మంచిసమిత్తుల మండింపఁజేయుచు మండుచుండి
గీ॥ యాగ దంపతు లిచ్చెడు హవ్యములను, సంగ్రహించుచు ముదిమిని సాగఁజేసి
స్వప్రకాశంబుతో లోకసరణినెల్ల, వెల్గఁజేయుచు నున్నాఁడు వెల్గుగల్గి ॥ 80

(5) సీ॥ మాన్యారణిం దెచ్చి మథియించుఁ బదివ్రేళ్ళు వహ్నిని సంతోషపరచుచుండుఁ
దమ్ము రక్షింపంగఁ దత్త్వవేది గణంబు బిగ్గఱగా నగ్నిఁ బిలుచుచుండుఁ
జాపమూలము చారు శరపరంపరలట్లు చిచ్చుకాంతుల వెళ్ళఁబుచ్చుచుండు
సర్వము గుర్తింపఁ జక్కని ప్రజ్ఞల నగ్ని తా నిచ్చుచు నమరియుండు
గీ॥ సరసరూపముతోనుండి సరసుఁడైన, గోపకుఁడు గోవులన్వలె గొప్పదియగు
వానఁగలిఁగించి భూలోక వాసజనులఁ, బ్రోఁచి రక్షించెడును దయాపూర్వకముగ ॥ 81

(7) ఉ॥ ఇచ్చెడు హవ్య మందుకొని యింతయొ! యంతయొ! తృప్తినందుచున్
సచ్చరితుల్ పఠించు సరసంపు నుతుల్ చెవిఁబెట్టుచున్నచో
మెచ్చెదరయ్య! నిన్ననల! మేదురమౌ భవదీయదర్శనం
బిచ్చును నిండ్లు తోటలును హెచ్చగు నన్నము కల్గఁజేసెడున్ ॥ 82

## సూక్తమ్ — 145

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ, 5-త్రిష్టుప్.

(1) తం పృచ్ఛతా స జగామా స వేద స చికిత్వాగ్ం ఈయతే సా న్వీయతే ।

తస్మిన్ త్సన్తి ప్రశిషస్తస్మిన్నిష్టయః స వాజస్య శవసః శుష్మిణస్పతిః ॥ 73

1. హవ్యమీయంగ నందెడు నగ్నియుచ్చ ; కర్మకాండంబు నడిపించు (తొ.పా.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్ నోటు 340 నుండి 349 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(2) తమిత్ పృచ్ఛన్తి న సిమో వి పృచ్ఛతి స్వేనేవ ధీరో మనసా యదగ్రభీత్ ।
న మృష్యతే ప్రథమం నాపరం వచో ऽస్య క్రత్వా సచతే[1] అప్రదృపితః ॥ 74

(3) తమిద్ గచ్ఛన్తి జుహ్వస్తమర్వతీర్విశ్వాన్యేకః శృణవద్ వచాంసి మే ।
పురుప్రైషస్తతురిర్యజ్ఞసాధనో ऽచ్ఛిద్రోతిః శిశురాదత్త సం రభః ॥ 75

(4) ఉపస్థాయం చరతి యత్ సమారత సద్యో జాతస్తత్సార యుజ్యేభిః ।
అభి శ్వాన్తం మృశతే నాన్ద్యే ముదే యదీం[2] గచ్ఛన్త్యుశతీరపిష్ఠితమ్ ॥ 76

(5) స ఈం మృగో[3] అప్యో వనర్గురుప త్వచ్యుపమస్యాం ని ధాయి ।
వ్యబ్రవీద్ వయునా మర్త్యేభ్యో[4] ऽగ్నిర్విద్వాగ్ం ఋతచిద్ధి సత్యః ॥ 77

## సూక్తము—145

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1) సీ॥ వలయువానిని నెల్ల వహ్ని యిచ్చును మాకు వలయుచోట్లకుఁ బోవు వాఁడె తగిన
వానినిఁ గనుఁగొనవచ్చుచుండునుగాన నధిగమింపుఁడు వాని నార్యులారః
సర్వజ్ఞుఁడగువాఁడు సర్వవిజ్ఞానంబు సాధించుటకు వాని సరస కేఁగు
సేవించుచున్నారు శిష్టులు వానిని నిష్టు లన్నియు నగ్ని నిమిడియుండె
గీ॥ సర్వఫలసాధకములైన జన్నములకు, నగ్ని యాధారమగుచుండె నతఁడె యన్న
మునకు బలమునకున్ రాజపురుషులకును, బ్రభువు బలవంతులకుఁగూడఁ బ్రభువుచుండుః॥ 83

1. సచతేऽప్రదృపితః 2. యదీగచ్ఛ, 3. మృగోऽఅప్యో, 4. మర్త్యేభ్యోऽగ్ని ర్విద్వాగ్ంऽఋత (వ్రా.ప్ర.)

* ఋషివిశేష విషయములకై సంస్కృత మూలము 140 వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 439 వరః గల పుటలు చూడనగును. వ.గో.కృ.

(2,3) సీ॥ అడిగెద రగ్నినే యంద అన్నింటిని నపరుల నగ్ని వే రడుగఁబోవ
రగ్ని కిష్టంబైన యంశమునే జను లడిగెద రొండు వా రడుగఁబోరు
తనకంటెఁ బూర్వము ధన్యుఁడెవ్వండైన పలికిన యనలుండు పలుకఁబోఁడు
కావున మానవుల్ గర్వింపకయె యగ్నిఁ జేరుదు రన్యుని జేరఁబోరు
గీ॥ మే మొనర్చెడు నాహుతి మేము సేయు, సంస్తవంబులు వహ్నికై జరుగుచుండుఁ
బ్రేరకుఁడు రక్షకుఁడు శత్రు మారకుండు, యజ్ఞసంరక్షకుం డగ్ని యమరియుండు ॥ 84

(4,5) సీ॥ అధ్వర్యుఁ డతిభక్తి నరణిని మథియించునప్పుడే పావకుం డమరియుండు
యజమానుఁ డేవేళ భజియించునో యగ్ని నప్పుడే ఫలములు తప్పకుండు
వేడివే ల్పేవేళ వినుచుండునో నుతి నప్పుడే సజ్జనుఁ డర్థమందు
వేదికపై నగ్ని వెలయునో యేవేళ నప్పుడే యజ్ఞము లొప్పుచుండు
గీ॥ విపిన సంచారి యజ్ఞాభివృద్ధికారి, యఖిలకర్మలకుం గర్త యజ్ఞభర్త
సుస్వభావంబు గలవాఁడు సొగసుగాఁడు, పావనుండై విరాజిల్లుఁ బరమవహ్ని ॥ 85

## సూక్తమ్—146

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః*

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) త్రిమూర్ధానం సప్తరశ్మిం గృణీషే ऽనూనమగ్నిం పిత్రోరుపస్థే ।
నిషత్తమస్య చరతో ధ్రువస్య విశ్వా దివో రోచనాపప్రివాంసమ్ ॥ 78

(2) ఉక్షా మహాగ్ం[1] అభి వవక్ష ఏనే అజరస్తస్థావిత[2]ఊతిరృష్వః ।
ఉర్వ్యాః పదో ని దధాతి సానౌ రిహన్త్యూధో[3] అరుషాసో అస్య ॥ 79

* ఋషివిశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును.

1. మహాగ్ంऽఅభివవక్షత ఏనేऽఅజర, 2. తऽఊతిర్ఋష్వః. 3. ధోऽఅరుషాసోऽఅస్య, (వ్యా:ప్ర.)

(3) సమానం వత్సమభి సంచరన్తీ విష్వగ్ధేనూ విచరతః సుమేకే ।
అనపవృజ్యాగ్ం[1] అధ్వనో మిమానే విశ్వాన్ కేతాగ్ం[2] అధి మహో దధానే ॥ 80

(4) ధీరాసః పదం కవయో నయన్తి నానా హృదా రక్షమాణా[3] అజుర్యమ్ ।
సిషాసన్తః పర్యపశ్యన్త సిన్ధుమావిరేభ్యో[4] అభవత్ సూర్యో నౄన్ ॥ 81

(5) దిదృక్షేణ్యః పరి కాష్ఠాసు జేన్యః[5] ఈళేన్యో మహో అర్భాయ జీవసే ।
పురుత్రా యదభవత్ సూరహైభ్యో గర్భేభ్యో మఘవా విశ్వదర్శతః ॥ 82

## సూక్తము—146

### ఋషి—దీర్ఘతముఁడు*

### దేవత—అగ్ని

(1) గీ॥ గార్హపత్యాది సంవాసి ఘనుఁడు సప్త, శిఖుఁడు సంపూర్ణదేహుండు శిష్టుఁడు[1] దివి
భూమియందు వెలింగెడు పుణ్యపురుషుఁ, డైన యగ్నిని నుతియింపుఁ డార్యులార! ॥ 86

(2) గీ॥ ముదిమి లేనివాఁడు పూజ్యుఁడు వరదుఁడు, సకల రక్షకుండు సకల హర్త
రోదసీ తలంబు చూఢిగ వ్యాపించి, వెలుఁగుచుండు నగ్ని వేదిపైని ॥ 87

(3) ఉ॥ జ్ఞానముఁ గల్గు దంపతులు చక్కని బిడ్డను బెంచునట్లుగాఁ
బూనుచు నగ్నిదేవతను బూర్ణమనస్సున నుంచి కట్టెలన్
దానికిఁ జేర్చి పెద్దదిగఁ దద్ద నొనర్చుచు శుద్ధి మార్జనా
నూన విభూతిఁజేసి సవనోజ్జ్వల శాలల నుందురేకదా! ॥ 88

1. వృజ్యాగ్ంఽఅధ్వనో, 2. కేతాగ్ంఽఅధి, 3. రక్షమాణాఽఅజుర్యమ్, 4. విరేభ్యోఽఅభవత్. 5. జేన్యఽఈళేన్యో మహోఽఅర్భాయ. (వా.ప్ర.)

* ఋషివిశేష విషయములకై సంస్కృత మూలము 146వ సూక్తము ఋషి కిచ్చినపుట్ నోటు 430 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. శిష్టుఁడద్ర, భూములకుఁ జెంత నుండెడు పుణ్యపురుషుఁ,డైన (తొ.పా)

(4) క॥ కవు లధ్వర్యుఁడు హోతలు, సవనాగ్నిం గాచుచుండి చక్కని భక్తిన్
వివిధముగఁ గొలువ నాతం, డవితథముగ నేత్రములకు నగపడకున్నే॥ 89

(5) సీ॥ సర్వదిక్కులయందు సమముగఁ గన్పించి జయశీలుఁడై స్తుతి చయము వడసి
సురసంఘముల కెల్ల సూనుఁడుగానుండి మెలఁగువారినిఁ జాల వెలుఁగఁజేసి
యన్నితావులయందు హవ్యంబు సమకూర్చి సర్వవృత్తాంతంబుఁ జక్కనెఱిఁగి
పుత్రులౌ యజమానపుత్రకులంగాచి యైశ్వర్యముల వారి కందఁజేసి
గీ॥ కామితార్థంబు లేవేళఁ గలుఁగనిచ్చి, లలితకర్మలపైఁ జాల లక్ష్య ముంచి
వెలయుచుండెడు[1] నా మహావేది యగ్ని, సేవ లందుచు నున్నాఁడు చిత్తమలర॥ 90

## సూక్తమ్—147

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) కథా తే[1] అగ్నే శుచయన్త ఆయోర్దదాశుర్వాజేభిరాశుషాణాః ।

ఉభే యత్ తోకే తనయే దధానా[2] ఋతస్య సామన్ రణయన్త దేవాః ॥ 83

(2) బోధా మే[3] అస్య వచసో యవిష్ఠ మంహిష్ఠస్య ప్రభృతస్య స్వధావః ।

పీ యతి త్వో[4] అను త్వో గృణాతి వన్దారుస్తే తన్వం వన్దే[5] అగ్నే ॥ 84

(3) యే పాయవో మామతేయం తే[6] అగ్నే పశ్యన్తో అన్ధం దురితాదరక్షన్ ।

రరక్ష తాన్ త్సుకృతో విశ్వవేదా దిప్సన్త[7] ఇద్ రిపవో నాహ దేభుః ॥ 85

1. వెలయుచుండును నేవేళ వేడివేల్పు (తొ. పా.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. తేऽఅగ్నే శుచయన్తऽఆయో, 2. దధానాऽఋతస్య, 3. మేऽఅస్య. 4. త్వోऽఅను. 5. వన్దేऽఅగ్నే, 6. తేऽఅగ్నేపశ్యన్తోऽఅన్ధం, 7. దిప్సన్తऽఇద్. (వ్రా.ప్ర.)

(4) యో నో[1] అగ్నే అరరివాగ్ం అఘాయురరాతీవా మర్చయతి ద్వయేన।

మన్త్రో గురుః పునరస్తు సో[2] అస్మా అను మృక్షీష్ట తన్వం దురుక్తైః॥ 86

(5) ఉత వా యః సహస్య ప్రవిద్వాన్ మర్తో మర్తం మర్చయతి ద్వయేన।

అతః పాహి స్తవమాన స్తువన్తమగ్నే మాకిర్నో దురితాయ ధాయీః॥ 87

సూక్తము—147

ఋషి—దీర్ఘతముఁడు *

దేవత—అగ్ని

(1) శా॥ అన్నా! యగ్నివిభూ! భవత్కిరణ సాహాయ్యంబునం జేసి తా
మన్నాయుష్యము లంది సంతతులతో యజ్ఞంబులన్ సామగా
నౌన్నత్యంబులు చూపుచుండి రదిగో హవ్యప్రదుల్ గాన నీ
వన్నాయుష్యము లిచ్చి దీధితుల మా కందింపవే! ప్రీతితోన్॥ 91

(2) ఉ॥ భూవలయంబులో నొకఁడు పూజ లొనర్చును నీ కొకండు తా
నేవిధినైన పూజ లిడఁడెప్పుడు వారలలోన నేను ని
న్గేవలమాత్రుఁగాఁ దలఁచి కీర్తనఁజేయుచుఁ బూజ సల్పెదన్
యౌవనవంతుఁడా! సకల హవ్యము లందెడు నగ్నిహోత్రుఁడా!॥ 92

1. నోऽగ్నేऽ...గ్ంऽ అఘాయు, 2. సోऽఅస్మాऽఅను. (ప్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(3) క॥ మమతా పుత్రుని యంధత†, సమముగఁ బోఁగొట్టెఁగిరణ జాలము కానన్
సమయమున దానిఁగొలిచిన, కుమనశ్శత్రువులు మమ్ముఁ గూడుదురె సఖా! ॥ 93

అర్థాంతరము

క॥ ‡ అపకృతి కలిఁగించు మహాం, ధ పథగ బుద్ధులు గలిఁగిన నానా ప్రాణుల్
సుపథగములై సుభద్రత, నపాపులుగఁ గాచుఁగాత నగ్నులు సర్వుల్ ॥ 94

గీ॥ ‡ తూర్పు దిక్కునఁ దిమిరమ్ముఁ దొలఁగిపోవ, న స్తమింపఁగఁ జేయుచు నలరు నరుణు
ఖాతి నగ్నులు యజమాన పాపతతిని, బోవఁగొట్టుచు రక్షించుఁ బొలుపుమీర ॥ 95

(4) గీ॥ మానసిక వాచకములను మంత్రములను, మమ్ము బాధించువైరుల మట్టువెట్టి
వారి యాలోచనలు మఱి వారి తనువు, నిందితములయి పుడమిని నిలుచుఁగాక! ॥ 96

(5) ఉ॥ మాయలు మంత్రవారములు మానకఁ జక్కనెఱింగి వానిచేఁ
బాయక మానవోత్తముల బాధలు వెట్టెడు వానిఁ గొట్టి నీ
వాయత కష్టమున్ దునిమి యన్నివిధంబుల రక్షఁబెట్టుచున్
సాయము సేయుమా! యనల! సర్వవిపత్తులఁ బోవఁజేయుమా! ॥ 97

---

† బృహస్పతి, యుచథ్యవుఁడు నను నిరువురు ఋషులు గలరు. అందు ఉదథ్యుని భార్య మమత. ఆమె గర్భిణిగా నున్నపుడు ఆమెతో బృహస్పతి సంభోగించుచుండఁగ గర్భస్థమగు శిశువు వీర్యపాతమునకు సహింపలేక వీర్యపాతము చేయవలదని బృహస్పతితో మొరపెట్టుకొనెను. అతఁడు వీర్య నిరోధమునకుం గోపించి గర్భస్థమగు శిశువును పుట్టంధుఁడవు కమ్మని శపియించెను. ఆ శిశువు జననమొంది దీర్ఘతమసుండనుపేరుగాంచి యా ఋషి వరమున మరలఁ గన్నులఁగాంచెను. ఈ కథ నీ పద్యముతో సంబంధింపవలెను. (నే.వేం.న,రా.)

సూచన:— ఈ కథను సాయన భాష్యానుసారముగా శ్రీ నేమానివారు వ్రాసినట్లు కనపడదు. శ్రీ నేమానివారు ఉచథ్యవ-ఉదథ్య శబ్దములు రెండును వాడిరి. వీరు మమతను బృహస్పతిని విడిచిపెట్టలేదు. మమత భర్తయు బృహస్పతి సోదరుఁడును నగువాఁడు ఉచథ్యవుఁడో-ఉచథ్యుఁడో-ఉతథ్యుఁడో-ఉదథ్యుఁడో శ్రీ నేమానివారు గ్రహింపలేదు. దీనిని బట్టి ఇతిహాసములలోను భాష్యముల లోను బెక్కుపాఠ భేదములున్నట్లు స్పష్టమగుచున్నది. సాయను లుదాహరించిన కథ ప్రకారము దీర్ఘతమునకు నేత్రము లిచ్చిన వాఁడగ్ని. శ్రీనేమానివారి వ్రాఁత ప్రకారము దృష్టి నిచ్చినవాఁడు ఋషి బృహస్పతియే. వీరే గ్రంథ మాధారముగా నీ యుదంతము వ్రాసిరో పేర్కొనలేదు. ఈ దీర్ఘతమ ఋషి విశేషములకై సంస్కృతము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూచునది. వ.గో.కృ.

‡ రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. “కళా-ప్రపూర్ణ”.

## సూక్తమ్—148

ఋషిః—దీర్ఘతమా ఔచిథ్యః *

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) మథీద్ యదీం విష్టో మాతరిశ్వా హోతారం విశ్వాప్సుం విశ్వదేవ్యమ్ ।

ని యం దధుర్మనుష్యాసు విక్షు స్వర్ణ చిత్రం వపుషే విభావమ్ ॥ 88

(2) దదానమిన్న దదభన్త మన్మాగ్నిర్వరూథం మమ తస్య చాకన్ ।

జుషన్త విశ్వాన్యస్య కర్మోపస్తుతిం భరమాణస్య కారోః ॥ 89

(3) నిత్యే చిన్ను యం సదనే జగృభ్రే ప్రశస్తిభిర్దధిరే యజ్ఞియాసః ।

ప్ర సూ నయన్త గృభయన్త[1] ఇష్టావశ్వాసో న రథ్యో రారహాణాః ॥ 90

(4) పురూణి దస్మో ని రిణాతి జమ్భైరాద్ రోచతే వన[2] ఆ విభావా ।

ఆదస్య వాతో[3] అను వాతి శోచిరస్తుర్న శర్యామసనామను ద్యూన్ ॥ 91

(5) న యం రిపవో న రిషణ్యవో గర్భే సన్తం రేషణా రేషయన్తి ।

అన్ధా[4] అపశ్యా న దభన్నభిఖ్యా నిత్యాస[5] ఈం ప్రేతారో[6] అరక్షన్ ॥ 92

---

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. గృభయన్తఽఇష్టా. 2. వనఽఆ. 3. వాతోఽఅను. 4. అన్ధాఽఅప 5. నిత్యాసఽఈం, 6. రోఽఅరక్షన్. (వా.ప్ర.)

## సూక్తము—148

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1) ఉ॥ సాంగములైన యాగములు సాగెడునట్టులు సేయ నెంచి యు
ప్పొంగుచుఁ గర్మసాక్షివలెఁ బూజ్య హుతాశునిఁ జేరఁ దీసి స
త్సంగులు వెల్గుచుండి రిఁక జాఠరపార్థివ వైద్యుతాగ్ని వే
భంగుల మండఁజేసె నల వాయువు కష్ఠలలోనఁ జేరుచున్ ॥ 98

(2) క॥ అనలునకున్ హవ్యంబుల, వినయముతో నొసఁగు నన్ను [1]విశ్రుతవైరులీ
చెనకం జాలుదురే! నుతి, విసఁగల్గును వహ్ని సురలు [2]వెలుఁగుచు నుండన్ ॥ 99

(3) క॥ త్వరితముగఁ బోవు హయములు, సురథస్థుని వలయునట్టి చోట[3]నునుచు న
ట్లరమర లేకయె యనలుని, బిరబిర గ్రహియించి నుతుల వేడెదరు జనుల్ ॥ 100

(4) చ॥ అలఘు బలాభిరాముఁడగు నగ్నిలతాదులఁగాల్చి వానిలో
వెలయుచునుండ వాయు వతివేగము తచ్ఛిఖ లెల్లఁగొంచు సం
చలితము ల ట్లొనర్ప నవి చారుతరంబగు వింటినుండి ని
శ్చలముగ వచ్చు బాణముల చందము పోవు సమస్తవేళలన్ ॥ 101

(5) ఉ॥ గర్భమునందుఁబోలె [4]ద్రుమగర్భమునం గల నగ్నికిన్ ముహు
ర్దుర్భరహింసఁ జేయుటకుఁ దుష్టులు జాలుదు రెట్టులింక నా
విర్భవుఁడైన నగ్నిని వివేక విహీనులు బాధఁబెట్టి త
ద్గర్భములం గలంచినను గల్గునె? హింసలు వాని కెన్నఁడేన్ ॥ 102

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. పిరిడిపైరుల్ (శా.పా.) 2. వెలయుదురు గదా! (తొ.పా.) 3. చోటఁ జేర్చునట్లరమర (తొ.పా. గణభంగము.) వ.గో.కృ.
4. ద్రుమ గర్భమునంగల (ప్రా.ప్ర.)

## సూక్తమ్—149

### ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

### దేవతా—అగ్నిః

### ఛందః—విరాట్

(1) మహః స రాయ[1] ఏషతే పతిర్దన్నిన[2] ఇనస్య వసునః పద[3] ఆ ।
ఉప ధ్రజన్తమద్రయో విధన్నిత్ ॥ 93

(2) స యో వృషా నరాం న రోదస్యోః శ్రవోభిరస్తి జీవపీతసర్గః ।
ప్ర యః సస్రాణః శిశ్రీత యోనౌ ॥ 94

(3) ఆ యః పురం నార్మిణీమదీదేదత్యః కవిర్నభన్యో౩ నార్వా ।
సూరో న రురుక్వాఞ్ఛతాత్మా ॥ 95

(4) అభి ద్విజన్మా త్రీ రోచనాని విశ్వా రజాంసి శుశుచానో[4] అస్థాత్ ।
హోతా యజిష్ఠో[5] అపాం సధస్థే ॥ 96

(5) అయం స హోతా యో ద్విజన్మా విశ్వా దధే వార్యాణి శ్రవస్యా ।
మర్తో యో[6] అస్మై సుతుకో దదాశ ॥ 97

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. రాయఽఏష 2. నఽఇనస్య 3. పదఽఆ 4. నోఽఅస్థాత్ 5. ష్ఠోఽఅపాం 6. యోఽఅస్మై (వా.ప్ర.)

## సూక్తము—149

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అగ్ని

(1,2,3,4) సీ॥ అభిమత మందించు, యజ్ఞశాలకు వచ్చు నినులకుఁ బ్రభువగు ధనము నిచ్చు
శుద్ధముగా వెల్గు సోమముగైకొను భూ దివంబులఁగూడఁ బుట్టఁజేయు
యోనిఁ బ్రవేశించి యుచితరేతోరూపమున జంతువులనెల్ల మొలవఁజేయు
నినదేవునింబోలి యింద్రాదిమూర్తులుగా సంచరించుఁ బ్రకాశ మొందుఁ
గీ॥ గవియఁగల జ్ఞానమును జాలఁగలుగఁజేయు, నట్టి యగ్నిత్రయంబు మా యజ్ఞములకు
నమరులను[1]బిలుచుకొని వచ్చి యతిశయముగ, నుదకసం[2]ప్రోక్షణస్థలి నుండుఁగాక॥ 103

(5) గీ॥ రెండు జననము లంది యఖండితముగ, హోమ నిష్పాదకుండగు హోత యగుచు
[3]హోమ ధనమును దనకుఁ దా రొసఁగుటకయి, యభిమతంబుల నిచ్చు నా యగ్ని యొకఁడె॥ 104

## సూక్తమ్—150

### ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

### దేవతా—అగ్నిః

### ఛందః—ఉష్ణిక్

(1) పురు త్వా దాశ్వాన్ వోచే ऽరిరగ్నే తవ స్విదా। తోదస్యేవ శరణ[1] ఆ మహస్య॥ 98

(2) వ్యనినస్య[2] ధనినః ప్రహోషే చిదరరుషః। కదా చన ప్రజిగతో[3] అదేవయోః॥ 99

(3) స చన్ద్రో విప్ర మర్త్యో మహో వ్రాధన్తమో దివి। ప్రప్రేత్ తే[4] అగ్నే వనుషః స్యామ॥ 100

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. ఈ మూఁడవపాదములోఁ బంచలఘుగణ మింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ. 2. వారి ప్రోక్షణఫలమున వరలుఁగాక (తొ.పా.) 3. హోమ ద్రవ్యధనమును. (తొ.పా.)

1. శరణఽఆమహస్య 2. వ్యనినఽస్య, 3. గతోఽఅదేవ 4. తేఽఅగ్నే (వ్రా.ప్ర.)

## సూక్తము—150

ఋషి—దీర్ఘతముఁడు *

దేవత—అగ్ని

(1) క॥ అనవరతము వివిధము లగు, ఘన హవ్యము లిచ్చువారిఁ గాచెడు నీకై
వినయముగల దాసునివలెఁ, బనిఁబూని సపర్యఁజేతుఁ బావకః వినవేః ॥ 105

(2) సీ॥ నిన్నె సత్ప్రభువుగా నిశ్చయింపనివాఁడు ధనము నీకీక తాఁ దాల్చువాఁడు
హోమ మొనర్పక యుద్ధతుం డగువాఁడు యాగాదులకుఁబోక యలరువాఁడు
సురలు రక్షకు లని యెఱుఁగ నేరనివాఁడు మతిచేత నీ నుతి మానువాఁడు
నిత్యంబు నీ సేవ నెఱి నొనర్పనివాఁడు మందుఁడై నీ ఖ్యాతి మఱచువాఁడు
గీ॥ గలరు పుడమిని నెందరోః ఘనులు కాని, వార లున్నారు వారికి వలయునట్టి
కోర్కె లిడకూడదని నేను గోరి నిన్నుఁ, బ్రార్థనముఁ జేయుచున్నాను బావకుండః ॥ 106

(3) గీ॥ నిన్నుఁ బూజించు మనుజుండు సన్నుతాంగః, దివిని జంద్రుఁడుగాఁ బుట్టి దివ్యలోక
మందు నుత్తముఁడై వెల్గు నగ్నిహోత్రః, కాన నినుఁబూజ చేసెదఁ గరముభక్తి ॥ 107

## సూక్తమ్—151

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—1-మిత్రః, 2-9 మిత్రావరుణౌ

ఛందః—జగతీ

(1) మిత్రం న యం శిమ్యా గోషు గవ్యవః స్వాధ్యో విదథే[1] అప్సు జీజనన్ ।
అరేజేతాం రోదసీ పాజసా గిరా ప్రతి ప్రియం యజతం జనుషామవః ॥ 101

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. విదథేఽఅప్సు (ప్రా.ప్ర.)

(2) యద్ధ త్యద్ వాం పురుమీళ్హస్య సోమినః ప్ర మిత్రాసో న దధిరే స్వాభువః ।
అధ క్రతుం విదతం గాతుమర్చత[1] ఉత శ్రుతం వృషణా పస్త్యావతః ॥ 102

(3) ఆ వాం భూషన్[2] క్షితయో జన్మ రోదస్యోః ప్రవాచ్యం వృషణా దక్షసే మహే ।
యదీమృతాయ భరథో యదర్వతే ప్ర హోత్రయా శిమ్యా వీథో[3] అధ్వరమ్ ॥ 103

(4) ప్ర సా క్షితిరసుర యా మహి ప్రియ[4] ఋతావానావృతమా ఘోషథో బృహత్ ।
యువం దివో బృహతో దక్షమాభువం గాం న ధుర్యుప యుఞ్జాథే[5] అపః ॥ 104

(5) మహీ[6] అత్ర మహినా వారమృణ్వథో[7] ऽరేణవస్తుజ[8] ఆ సద్మన్ ధేనవః ।
స్వరన్తి తా[9] ఉపరతాతి సూర్యమా నిమ్రుచ[10] ఉషసస్తక్వవీరివ ॥ 105

(6) ఆ వామృతాయ కేశినీరనూషత మిత్ర యత్ర వరుణ గాతుమర్చథః ।
అవ త్మనా సృజతం పిన్వతం ధియో యువం విప్రస్య మన్మనామిరజ్యథః ॥ 106

(7) యో వాం యజ్ఞైః శశమానో హ దాశతి కవిర్హోతా యజతి మన్మసాధనః ।
ఉపాహ తం గచ్ఛథో వీథో[11] అధ్వరమచ్ఛా గిరః సుమతిం గన్తమస్మయూ ॥ 107

(8) యువాం యజ్ఞైః ప్రథమా గోభిరఞ్జత[12] ఋతావానా మనసో న ప్రయుక్తిషు ।
భరన్తి వాం మన్మనా సంయతా గిరో ऽదృప్యతా మనసా రేవదాశాథే ॥ 108

---

1. మర్చతऽఉత, 2. భూషన్క్షితయో, 3. వీథోऽధ్వరమ్. 4. ప్రియऽఋతా. 5. థేऽఅపః, 6. మహీऽఅత్ర. 7. మృణ్వऽథోరేణ, 8. జऽఆ, 9. తాऽఉప 10. చऽఉష, 11. వీథోऽఅధ్వర, 12. రఞ్జతऽఋతా. (ప్రా.ప్ర:)

(9) రేవద్ వయో దధాథే రేవదాశాథే నరా మాయాభిరిత[1]ఊతి మాహినమ్ ।
న వాం ద్యావోఽహభిర్నోత సిన్ధవో న దేవత్వం పణయో నానశుర్మఘమ్ ॥ 109

## సూక్తము—151

### ఋషి—దీర్ఘతముఁడు *

### † దేవత—1 మిత్రుఁడు, 2-9 మిత్రావరుణులు

(1) ఉ॥ అంచిత గోగణంబు కడు నధ్యయనంబును గోరువారు పో
షించిన కారణంబున వశీకృతుఁడై నివసించువాఁడు నా
[1]ఠించి యొనర్చు యాగమును జేర్చెడు నగ్ని నభమ్ము నిండ లో
కాంచిత భూతజాతములఁ గావఁగఁ బుట్టఁడె సంతసంబునన్॥ 108

1. రిత ఊతి, (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† ఈ సూక్తమునకు దేవతను బేర్కొనుటలో మిత్రావరుణులు సూక్త మంతటికిని దేవతలుగా శ్రీ నేమానివారు వ్రాసిరి. సాయనాచార్యులు 1వ ఋక్కునకు మిత్రుఁడు దేవతగాను మిగిలిన ఋక్కులకు మిత్రావరుణు లిరువురును దేవతలుగాను బేర్కొనిరి. ఉపలభ్యమానాలైన మిగిలిన గ్రంథాలలోను సాయనులు పేర్కొన్నట్లేకలదు. కాని శ్రీ నేమానివారిక్కడ సామాన్యముగా మిత్రావరుణులు దేవతలుగాఁ బేర్కొన్నను, ఋషిదేవతలను బేర్కొన్న వ్రాతప్రతి 15b సంపుటములో 151వ సూక్తమునకు "మిత్రుఁడు, వరుణుఁడు, వరుణుఁడు, మిత్రావరుణులు"అని దేవతలను బేర్కొనిరి. దీనినిబట్టి శ్రీనేమానివారి దృష్టిలో 1వ ఋక్కునకు మిత్రుఁడు దేవతయనియు, 2, 3 ఋక్కులకు వరుణుఁడు దేవతయనియు, మిగిలిన 4, 5, 6, 7, 8, 9 ఋక్కులకు మిత్రావరుణులిరువురును దేవతలనియు, నభిప్రాయమున్నట్లు తోచును. తీరఁ బద్యానువాదములు చూడఁగాఁ బ్రథమఋక్కున కనువాదపద్యములలో నగ్ని దేవతగాను, 2, 3, 4 ఋక్కుల కనువాదపద్యమైన సీసములో మిత్రావరుణు లుభయులు దేవతలుగాను నుటంకింపఁబడిరి. మిగిలిన ఋగనువాదము లన్నింటను మిత్రావరుణులే దేవతలుగాఁ బేర్కొనఁబడిరి. కావున సూరక వ్రాతలో దేవతలను బేర్కొనుటలో భిన్నత్వమేగాని ఋగనువాదములలో దేవతలవిషయమై విభిన్నత్వము లేనేలేదు. వ.గో.కృ.

1. తొలిఋక్కున కనువాదపద్యమైన "అంచితగోగణంబు" నిత్యాదిగాఁగల యుత్పలమాలలో "అంచిత....పో,షించిన" అని ప్రథమద్వితీయపాదములు వ్రాసి శ్రీ నేమానివారు మూఁడవపాదమును "ని,శ్చింతఁగ యాగమున్ నభముఁజేరుచు నుండెడు పావకుండు లో,కాంచిత" అని పూర్వముపయోగించిన పూర్ణబిందు పూర్వక చకారప్రాసను మరచిపోయి పొరపాటునఁ బూర్ణబిందు పూర్వక తకారమును ప్రాసలో నిమిడ్చిరి. ప్రథమ-ద్వితీయ-చతుర్థపాదములలోఁ బూర్ణబిందు పూర్వక చకారమే ("ంచి" అనునది) ప్రాసగా నుపయోగింపఁబడినది. కాఁగా మూఁడవపాదములోఁ బ్రాస తప్పినది. (వ్రాతప్రతి. ప్రథమమండలము. 2వ సంపుటము 89వ పుట) ఈ ప్రాసభంగదోష నివారణార్థమై ద్వితీయపాదాంత్యాక్షర మాదిగాఁ దృతీయ పాదాంత్యాక్షరము మినహాగాఁ బాదము సవరింపఁబడినది-ద్వితీయ పాదములో "నివసించువాఁడు" వఱకును, దృతీయపాదములో "లో కాంచిత" లోఁగల "లోక" శబ్దము మొదలు పద్యము తుదివఱకును శ్రీ నేమానివారి రచనయే యథాతథముగ నుంచఁబడినది. వ.గో.కృ.

గీ॥ అట్టి యగ్ని బలంబున నధికమైన, శబ్ద మూలంబువలనను జారు దివము
భూ తలంబును వణఁకు నో భూతగణమ!, యగ్నిహోతృని సామర్థ్య మధికముగద! ॥ 109

(2,3,4,) సీ॥ ఋత్విజుల్ చేసెడు ఋద్ధయాగముఁ జూడ మిత్రావరుణులార! మీరు రండు!
యజమానుఁ డిచ్చెడు హవ్యంబు గైకొన మిత్రావరుణులార! మీరు రండు!
సోమ రసంబెల్ల నీమముతోఁ ద్రావ మిత్రావరుణులార! మీరు రండు!
ప్రియమైన భూమిపైఁ బ్రీతిని నివసింప మిత్రావరుణులార! మీరు రండు!
గీ॥ మిత్రుఁడా! [1]వరుణ! మా స్తుతి మెచ్చరండు!, యజ్ఞకర్మలకై మీర లరుగుదెండు!
రోదసీ జన్యులగు మిమ్ము రాధినొందు, వేడ్కఁ గొనియాడుచున్నారు వేగరండు! ॥ 110

(5) ఉ॥ ఆవుల నెల్లఁ బచ్చికల నంతటఁ జేర్చి దినాంతమందు నా
యావుల నిల్లుఁజేర్తురని యాకళ మంతయు మేఘమాలికా
శ్రీ విశదాత్మయోటఁ గని చేరి జనుల్ రవిఁగూర్చి దొంగకై
వావిరిఁ జేయు శబ్దములవంటి రవంబు లొనర్తు్రి మీ కృపన్ ॥ 111

(6) గీ॥ మీర లరుగదెంచి మిక్కుటంబగు వర్ష, మిచ్చునట్టులైన మెచ్చి యెలమి
నగ్నిశిఖలు నీకు నర్పించు హవ్యంబు, వరుణ! మిత్ర! మీరు వరుస రండు! ॥ 112

(7) ఉ॥ మిమ్ము నుతించి దక్షిణ నమేయముగా సరిపెట్టి యిష్టులన్
సమ్మతమైనయట్టులు విశాలమతిన్ జరిగించువారిపైఁ
జిమ్ముచు దృష్టిపాతములఁ జేరుచునుందురు వారిచెంత మీ
రిమ్ముగ వచ్చి నాకడకు నీ స్తుతి నందుఁడు మిత్ర! తత్ప్రభా! ॥ 113

(8) గీ॥ యజ్ఞసాధక దుగ్ధాది హవ్యములను, మనమువలె నగ్రగణ్యులౌ ఘనుల మిమ్ముఁ
బూజఁ జేయుచు నున్నారు పూజ్యమిత్ర!, వరుణుఁడా! రండు! ధనమును వారి కొసఁగ ॥ 114

(9) క॥ ధనవంతు లన్నవంతులు, కనుకన్ మా కెదుట వానిఁ గల్పించుచు మీ
ఘనతం జూపుచు నుండిరి, పునరుక్తముగాదె! మిమ్ముఁ బొగడుట యెంతేన్ ॥ 115

క॥ మీకుంగల దేవత్వము, మీకుంగల ధన సమృద్ధి మిత్రుఁడ! వరుణా!
వీఁక నహోరాత్రులకున్, నాకారుల కఖిలపూజ్య నదులకుఁ గలవే! ॥ 116

—

1. ఇక్కడ నింద్రగణమునకు మారు "భల" ము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

## సూక్తమ్—152

ఋషి—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—మిత్రా వరుణౌ

ఛందః—త్రిష్టుప్

(1) యువం వస్త్రాణి పీవసా వసాథే యువోరచ్ఛిద్రా మన్తవో హ సర్గాః ।
అవాతిరతమనృతాని విశ్వ[1] ఋతేన మిత్రావరుణా సచేథే ॥ 110

(2) ఏతచ్చన త్వో వి చికేతదేషాం సత్యో మన్త్రః కవిశస్త[2] ఋఘావాన్ ।
త్రిరశ్రిం హన్తి చతురశ్రిరుగ్రో[3] దేవనిదో హ ప్రథమా[4] అజూర్యన్ ॥ 111

(3) అపాదేతి ప్రథమా పద్వతీనాం కస్తద్ వాం మిత్రావరుణా చికేత్ ।
గర్భో భారం భరత్యా చిదస్య[5] ఋతం పిపర్త్యనృతం ని తారీత్ ॥ 112

(4) ప్రయన్తమిత్ పరి జారం కనీనాం పశ్యామసి నోపనిపద్యమానమ్ ।
అనవపృగ్ణా వితతా వసానం ప్రియం మిత్రస్య వరుణస్య ధామ ॥ 113

(5) అనశ్వో జాతో[6] అనభీశురర్వా కనిక్రదత్ పతయదూర్ధ్వసానుః ।
అచిత్తం బ్రహ్మ జుజుషుర్యువానః ప్ర మిత్రే ధామ వరుణే గృణన్తః ॥ 114

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 430 నుండి 439 వరకు గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. విశ్వఽఋతేన, 2. శస్తఽఋఘావాన్, 3. చతురశ్రి రుగాదేవనిదో, 4. ప్రథమాఽఅజూర్యన్, 5. చిదస్యఽఋతం, 6. జాతోఽఅన. (బ్రా.ప్ర.)

†(6) ఆ ధేనవో మామతేయమవన్తీర్బ్రహ్మప్రియం పీపయన్ త్సస్మిన్నూధన్ ।
పిత్వో భిక్షేత వయునాని విద్వానాసావివాసన్నదితిమురుష్యేత్ ॥ 115

(7) ఆ వాం మిత్రావరుణా హవ్యజుష్టిం నమసా దేవావవసా వవృత్యామ్ ।
అస్మాకం బ్రహ్మ పృతనాసు సహ్యా అస్మాకం వృష్టిర్దివ్యా సుపార ॥ 116

## సూక్తము—152

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—మిత్రావరుణులు

(1) ఉ॥ మీరు ధరించు వస్త్రములు మిక్కిలి కాంతియుతంబులౌ నిఁకన్
మీ రొనరించుకార్యములు మెప్పులుఁ బొందుచు సుస్థిరంబు లౌన్
మీరల కృత్యముల్ వరుణః మిత్రుఁడః సంస్మరణీయ యోగ్యముల్
మీ రనృతంబుఁగొట్టి మము మిక్కిలి ధన్యులుగా నొనర్పరేః ॥ 117

(2) సీ॥ మిత్రావరుణులారః మీలోన నొక్కఁడే సర్వజంతువులను జంపువాఁడు
మిత్రావరుణులారః మీలోన నొక్కఁడే పరులచే బాధింపఁబడనివాఁడు
మిత్రావరుణులారః మీలోన నొక్కఁడే మంత్రంబు నెఱుఁగుచు మసలువాఁడు
మిత్రావరుణులారః మీలోన నొక్కఁడే నిర్జరారులనెల్ల నెట్టువాఁడు
గీ॥ కనఁగ మీలోన నొక్కని ఘనతవలన, దేవ నాశకు లందఱుఁ ద్రెళ్ళుచుండ
నరయ నిఱువురిసామర్థ్య మతిశయించి, వెల్లడించిన నిఁకనేమి వెలతియుండుః ॥ 118

† ఈ 152వ సూక్తములోని ఆరవ ఋక్కు ప్రక్షిప్తము కానోపును, లేదా విశేష భిన్నార్థ దాయకమైనను గానోపును. ఈ విశేష విషయములకై సంస్కృతములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ,గో,కృ,

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(3) ఉ॥ * పాద విహీనకల్యసతి ప్రాఁకినమాత్రము భూ తలంబునం
బాద విశిష్టజంతువులు ప్రాఁకుచు నుండుట సూర్యుఁడెంతయో
యాదర మొప్పఁ గాంతులను నందఁగఁజేయుట భార మాపుటన్
మీ దయవల్లనే కలుఁగు మిత్రుఁడ! తత్సఖ! మీర లల్పులే! ॥ 119

(4) చ॥ వితతములైన కాంతులను వెల్లడిఁజేసి సమస్త లోక స
మ్మతుఁడని పేరుఁగాంచి కడు మాన్యతఁ బొందుచుఁ గల్యదేవతా
సతి కుపభర్తగాఁ జెలఁగి సంతతమున్ రవి పోవుచుంట మీ
యతిదయచేతఁగాదె యగు నాశ్రితరక్షకులార! చూడరే! ॥ 120

(5) ఉ॥ వేగము గుఱ్ఱముల్ చనుట విశ్రుత రశ్మల పంక్తి లేకయే
వేగము పోయి వస్తువుల వెల్గఁగఁ జేయుచు నెండఁబెట్టుచున్
సాగుచు సూర్యుఁడూర్ధ్వమునఁ జక్కఁగ నుండుట మీ మహత్త్వమే!
రాగ విహీనుఁడా! వరుణ! రక్షక! మిత్రుఁడ! పూజలందరే! ॥ 121

(6) గీ॥ వహ్నిఁ బూజించి భక్తిచే వరలు వాఁడ!, [1]మామతేయుండ దీర్ఘతమస్కుఁడ నౌదు
వరుణుఁడా! మిత్రదేవుఁడ! కరముతుష్టిఁ, బూర్ణగోవుల నాకిచ్చి పూజఁగొనుఁడు ॥ 122

గీ॥ దీర్ఘతముఁడు మీకు దేవతోత్తములార!, సాంగయాగములను జక్కఁజేసి
మీకు నిడిన పిదప మిగిలిన హవ్యంబుఁ, బొందుఁగాకఁ దుష్టి నొందుఁగాక! ॥ 123

అర్థాంతరము

†గీ॥ చాల దూరమందు జ్వలితమౌ గో లోక, శక్తులెల్ల నమవస నిసి తెలివి
నున్నవారి నంత మొనరని బ్రహ్మ ప్రి, యులుగ వెల్గఁజేయుత లలితగతి ॥ 124

†క॥ అతి విద్యావంతులయిన, పితరులను నభిక్షకులుగ వేవెల్గులు న
ప్రతిహతముగను వెలింగెడు, ద్రుతతేజోఒగ్నులు కృపమెయిఁ దొడరుత జగతిన్ ॥ 125

(7) క॥ సమముగ [2]మము రక్షింపన్, మిముఁ గొనియాడుదుము వినుతి మిత్రుఁడ! వరుణా!
క్రమముగ నది యరిఁగొట్టుచు, నమితంబగు వర్షమిచ్చు యజ్ఞము జరుపున్ ॥ 126

* అపాత్—సూర్యగ్రహసంచారము ననుసరించి యుషఃకాల మగుచున్నది కాని ఉషఃకాలమున కేప్రత్యేక గమనమును లేదని యూహింపవచ్చును. (నే.వేం.న.శా.) 1. మామతేయుండు = మమతాపుత్రుఁడు, ఈ 152వ సూక్తము నందలి 6వ ఋక్కు ప్రక్షిప్తము కానోపును లేదా భిన్నార్థదాయకము కానగును, వివరములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చదువనగును, వ.గో.కృ. 2. నను (వ్రా.ప్ర.పా.)

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పద్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ".

## సూక్తమ్—153

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—మిత్రా వరుణౌ

ఛందః—త్రిష్టుప్

(1) యజామహే వాం మహః సజోషా హవ్యేభిర్మిత్రావరుణా నమోభిః ।

ఘృతైర్ఘృతస్నూ[1] అధ యద్ వామస్మే[2] అధ్వర్యవో న ధీతిభిర్భరన్తి ॥ 117

(2) ప్రస్తుతిర్వాం ధామ న ప్రయుక్తిరయామి మిత్రావరుణా సువృక్తిః ।

అనక్తి యద్ వాం విదథేషు హోతా సుమ్నం వాం సూరిర్వృషణావియక్షన్ ॥ 118

(3) పీపాయ ధేనురదితిరృతాయ జనాయ మిత్రావరుణా హవిర్దే ।

హినోతి యద్ వాం విదథే సపర్యన్ త్స రాతహవ్యో మానుషో న హోతా ॥ 119

(4) ఉత వాం విక్షు మద్యాస్వన్ధో గావ[3] ఆపశ్చ పీపయన్త దేవీః ।

ఉతో నో[4] అస్య పూర్వ్యః పతిర్దన్ వీతం పాతం పయస[5] ఉస్రియాయాః ॥ 120

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. స్నూఽఅధ. 2. స్మేఽఅధ్వర్యవో. 3. గావఽఆపశ్చ. 4. నోఽఅస్య. 5. పయసఽఉస్రి. (వ్రా.ప్ర.)

## సూక్తము 153

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—మిత్రావరుణులు

(1) క॥ ఘృతపాతలార! మీకున్, సతతము యజ్ఞములయందుఁ జక్కని హవ్య
ప్రతతి నమోవాకంబుల, నతిభక్తిం [1]బూజ లిడుదు నాయా నుతులన్ ॥ 127

(2) శా॥ సంకల్పించిన యజ్ఞకర్మ విధిగా సంపూర్తి కాకుండినన్
శంకన్ వీడుచు మీ సులోకములనే సాధించుచున్నాను నే
నింకన్ హోతృవరుండు భక్తిపరుఁడై యిష్టిక్రియంజేయ నా
తంకంబున్ విడఁగొట్టు మీమహిమలన్ దర్శించితిన్ దేవతల్ ! ॥ 128

(3) గీ॥ రాత హవ్యరాజు రమణీయ కర్మల, మిమ్ముఁ దృప్తిఁబరుప మీరు వానిఁ
దృప్తిఁజేసిరట్టు దీన్ముఁడ నగునాకు, నాల మిత్రవరుణులార![2] యిండు! ॥ 129

(4) గీ॥ మంగళోదకములు మఱి ధేను సంతతి, తృప్తిపఱచుఁగాక దీన జనుల
భక్తపాలకుండు పావకుం డిష్టార్థ, ముల నొసంగుఁగాక[3]బూజ్యులార ! ॥ 130

క॥ మీ రీ యజ్ఞంబులకుం, జేరుచు సన్నంబుఁ గొనుఁడు చెంతనె గల గో
క్షీరము పానము సేయుఁ డ, వారిత శక్తిప్రభావవరుణా! మిత్రా! 131

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. పూజలిడుదు నాయానుతుల్ (వ్రా.ప్ర,పా. గణభంగము) వ.గో.కృ. 2. ఇక్కడ రలల ప్రాస యతి. వ.గో.కృ. 3. ముక్తిదయులు! (పా)

## సూక్తమ్–154

### ఋషిః–దీర్ఘతమా ఔచథ్యః *

### దేవతా–విష్ణుః

### ఛందః–త్రిష్టుప్

(1) విష్ణోర్ను కం వీర్యాణి ప్ర వోచం యః పార్థివాని విమమే రజాంసి ।
యో[1] అస్కభాయదుత్తరం సధస్థం విచక్రమాణస్త్రేధోరుగాయః ॥ 121

(2) ప్ర తద్ విష్ణుః స్తవతే వీర్యేణ మృగో న భీమః కుచరో గిరిష్ఠాః ।
యస్యోరుషు త్రిషు విక్రమణేష్వధిక్షియన్తి భువనాని విశ్వా ॥ 122

(3) ప్ర విష్ణవే శూషమేతు మన్మ గిరిక్షిత[2] ఉరుగాయాయ వృష్ణే ।
య[3] ఇదం దీర్ఘం ప్రయతం సధస్థమేకో విమమే త్రిభిరిత్ పదేభిః ॥ 123

(4) యస్య త్రీ పూర్ణా మధునా పదాన్యక్షీయమాణా స్వధయా మదన్తి ।
య[4] ఉ త్రిధాతు పృథివీముత ద్యామేకో దాధార భువనాని విశ్వా ॥ 124

(5) తదస్య ప్రియమభి పాథో[5] అశ్యాం నరో యత్ర దేవయవో మదన్తి ।
ఉరుక్రమస్య స హి బన్ధురిత్థా విష్ణోః పదే పరమే మధ్వ[6] ఉత్సః ॥ 125

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140 వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. యోఽఅస్క. 2. క్షితఽఉరుగా. 3. యఽఇదం. 4. యఽఉ త్రిధాతు. 5. పాథోఽఅశ్యాం. 6. మధ్వఽఉత్సః (పా.ప్ర.)

(6) తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృఙ్గా[1] అయాసః ।
అత్రాహ తదురుగాయస్య వృష్ణః పరమం పదమవ భాతి భూరి ॥ 126

## సూక్తము—154

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—విష్ణువు

(1) ఉ॥ ఎవ్వఁడు మూఁడు లోకముల నింపెసలారఁగ సృష్టిఁజేసెనో!
యెవ్వఁడు సత్యలోకము నహీనముగాఁ బ్రకటించియుండెనో!
యెవ్వని వేఁడుచుండెదరొ ! యెవ్వఁడు లోకమునం జరించునో!
నవ్విధ విష్ణుకర్మముల నాత్ర వచించెద నాలకింపుఁడీ! ॥ 132

(2) ఉ॥ ఎవ్వఁ డరణ్యభూమిని మృగేంద్రునిమాడ్కిఁ భయంకరుండొ! యిం
కెవ్వఁడు సర్వలోకముల నెప్పుడుఁ దాఁజరించుచుండునో!
యెవ్వని మూఁడు పాదముల నీ జగమంత వసించుచుండునో!
యవ్విధ విష్ణుమూర్తి జను లందఱుఁ గొల్తురు వీర కర్మలన్ ॥ 133

(3) ఉ॥ చక్కని మూఁడు పాదముల శాశ్వత లోకము లెల్లఁజేసి తా
నెక్కువవారిచే నుతుల కెక్కుచు నిష్టము లెల్లఁదీర్చుచున్
మిక్కిలి వేదవేద్యుఁడయి మేలిమిఁ జూపెడు విష్ణుమూర్తి కిం
పెక్కుడు సృష్టిఁజేయుటకు నెక్కుడు వీర్యము కల్గుచుండుతన్ ! ॥ 134

(4) సీ॥ ఎచ్చట వైష్ణవుఁ డినుమడించినప్రీతిఁ దృప్తుఁడై యేవేళఁ దిరుగుచుండు ?
నెచ్చట మధుజల మిచ్చుచుఁ బ్రవహించు నెలయేఱు లేవేళ, జెలఁగుచుండు?
నెచ్చట విష్ణు వహీనతేజస్సుతో సుప్రసన్నుండయి శోభనొందు?
నెచ్చట సర్వంబు హెచ్చు సుఖంబును బొందుచు సంతుష్టి చెందుచుండు?
గీ॥ నట్టి శాశ్వతలోకంబు నందఁగోర్కెఁ, యున్నచో విష్ణువునుఁ జూచి యెన్నవలయు
విష్ణువే బాంధవుండగు వైష్ణవులకు, విష్ణువే భాగ్యదుండగు వైష్ణవులకు ॥ 135

1. శృఙ్గాఽఅవాసః (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

†(5) క॥ ఆఁకలి దప్పులు జరయును, నాకులితము కాక మృతియు నందని సుగతిన్
ప్రాకట విష్ణుస్తుతుల న, నేక ముఖాల నొనరించి యెనయుఁడు తజ్జ్ఞుల్॥ 136

(6) చ॥ కడుఁగడు శాశ్వతంబయిన కాంతివిశేషముతోడ వెల్గుచున్
వడివడి సర్వసిద్ధులను వంచన సేయక గల్గఁ జేయుచున్
కడు వినుతుల్ గ్రహించి కడకాలము నుండెడు విష్ణులోక మే
ర్పడ సవనంబు సేయు పతి భార్యల కిమ్ముగ విష్ణు విచ్చెడున్ ॥ 137

## సూక్తము—155

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—విష్ణుః, 1-3 ఇన్ద్రావిష్ణూ

ఛందః—జగతీ

(1) ప్ర వః పాన్తమన్ధసో ధియాయతే మహే శూరాయ విష్ణవే చార్చత ।

యా సానుని పర్వతానామదాభ్యా మహస్తస్థతురర్వతేవ సాధునా ॥ 127

(2) త్వేషమిత్థా సమరణం శిమీవతోరిన్ద్రావిష్ణూ సుతపా వామురుష్యతి ।

యా మర్త్యాయ ప్రతిధీయమానమిత్ కృశానోరస్తురసనామురుష్యథః ॥ 128

† ఉపభాగ పూరణకర్త—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ పల్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ".

సంస్కృత మూలములోని ప్రథమ మండలము 154వ సూక్తములో మొత్త మారు ఋక్కు లుండఁగా శ్రీ నేమానివారు పొరపాటున నయిదు ఋక్కులను మాత్రమే యనువదించి యొక ఋక్కును—ననువదింపక విడిచిరి. ఈ తడఁబాటులో నారవ ఋక్కును నైదవ ఋక్కుగా ననువదించి యయిదవ ఋక్కు ననువదించుట మరచిరి. ఆరవ ఋక్కుగా ననువదించిన పద్యమునకు (వ్రాతప్రతి 2వ. సంపుటము 97వ పుట.) నయిదు సంఖ్యను ఋక్సంఖ్యగాఁ బొరపాటున వేసిరి. కావున నయిదవ ఋక్కును "ఆఁకలి దప్పులు" ఇత్యాదిగాఁగల కందపద్య రూపముగా నే ననువదించి ఉపభాగ పూరణము గావించితిని. శ్రీ నేమానివారు పొరపాటున నయిదవ ఋక్కున కనువాద పద్యముగాఁ బేర్కొన్న యారవ ఋక్కున కనువాద పద్యమైన "కడుఁగడు" నిత్యాది చంపకమాల పద్యమును నారవ ఋక్కుగాఁ బేర్కొనుట జరిగినది. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(3) తా[1] ఈం వర్ధన్తి మహ్యస్య పౌంస్యం ని మాతరా నయతి రేతసే భుజే ।

దధాతి పుత్రోఽవరం పరం పితుర్నామ తృతీయమధి రోచనే దివః ॥ 129

(4) తత్తదిదస్య[2] పౌంస్యం గృణీమసీనస్య త్రాతురవృకస్య మీఢుషః[3] ।

యః పార్థివాని త్రిభిరిద్ విగామభిరురు క్రమిష్టోరుగాయాయ జీవసే ॥ 130

(5) ద్వే[4] ఇదస్య క్రమణే స్వర్దృశోఽభిఖ్యాయ మర్త్యో భురణ్యతి ।

తృతీయమస్య నకిరా దధర్షతి వయశ్చన పతయన్తః పతత్రిణః ॥ 131

(6) చతుర్భిః సాకం నవతిం చ నామభిశ్చక్రం న వృత్తం వ్యతీగ్ం[5] రవీవిపత్ ।

బృహచ్ఛరీరో విమిమాన[6] ఋక్వభిర్యువాకుమారః ప్రత్యేత్యాహవమ్ ॥ 132

1. తాఽఈం. (వా.ప్ర.) 2. తత్తదిదస్య (మా.సా.) 3. మీళ్హుష (వా.ప్ర.) 4. ద్వేఽఇదస్య 5. గ్ంఽరవీ. 6. మానఽఋక్వభి (వా.ప్ర.)

## సూక్తము—155

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—1-3 ఇంద్ర విష్ణువులు 4-6 విష్ణువు †

(1,2,3) సీ॥ గమ్యస్థలంబునకై పోవు వాజిపై నెక్కి యున్నతపద మెక్కినట్లు
విష్ణ్వింద్రు లిద్దఱు వేల్పుల పదమునుబట్టి చరింతురు, పరులచేత
వంచింపఁబడకుండ వలసినయన్నంబు నిచ్చుచునున్నార లిద్ధజనులు
సంతానవంతులై సౌఖ్యంబుఁ బొందంగఁ గురిపించుచున్నారు కరము వాన
గీ॥ నట్టివర్షముచేతనే యఖిలజనులు, పొందుచున్నారు మిక్కిలి పుత్రకులను
గాన వారి నిమిత్తము ఘనుఁడు యాగ, కర్మ లొనరించుచున్నాఁడు నిర్మలముగ ॥ 138

(4) చ॥ అడుగుల మూఁడిటన్ సకల మాక్రమణం బొనరించి సృష్టికిం
గడుఁ బ్రభువౌచుఁ బాలకుఁడుగా నివసించి యజాత శత్రువై
కడిమిని నిత్యయౌవనము గల్గెడి విష్ణుని పూర్ణచర్యలన్
దడఁబడకుండఁ బేర్కొనినఁ దప్పక ధన్యుల మౌదుమేకదా! ॥ 139

(5) గీ॥ సర్వదర్శియైన సద్విష్ణుపాదము, లరసి చూడఁజూడ నందు రెండు
గగనభూములౌటఁ గాంచుచు మనుజుండు, వానిసేవఁజేసె వరలుఁగాత! ॥ 140

గీ॥ పరమ విష్ణుని మూఁడవ పదమె వెలుఁగు, నా ద్యులోకంబు దానిని నమరులైన
నంతటంబోవు గరుఁ డాద్యనంతపక్షు, లైన నెఱుఁగకయుండఁదదన్యు లెట్లు? ॥ 141

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలములోని 140వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్.నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

† సంస్కృత మూలములో నున్నట్లుగానే 1,2,3 ఋక్కులకు నింద్ర విష్ణువు లధిదేవతలుగా నాంధ్రానువాద పద్యములోఁ బేర్కొని యాంధ్రానువాద వ్రాతప్రతిలో (2వ. సంపుటము 99వ పుట.) పొరపాటున మొత్తము 155వ సూక్త మంతటికిని విష్ణువే దేవతగా వ్రాయుట జరిగినది. వ్రాతప్రతి 15b సంఖ్య గల సంపుటములో నిచ్చిన ఋషి దేవతల పట్టికలో సంస్కృత మూలములో నున్నట్లుగా ననువాదమున కనుగుణముగా నింద్ర విష్ణువులును విష్ణువును దేవతలుగఁ బేర్కొనుట జరిగినది. వ.గో.కృ.

(6) గీ॥ హంసరూప విష్ణు వబ్దాయనాదుల, †నాల్గుతోడఁగూడు నవతిసంఖ్య
నొప్పు కాలమెల్లఁ ద్రిప్పుచుండును వృత్త, చక్రమట్టు లేమి జాగు లేక॥ 142

గీ॥ జాగరూకత గలవాఁడు జగతి నున్న, దేవతాదుల రూపులఁ దిరుగువాఁడు
యౌవనుండగు నావిష్ణు వరుగుదెంచుఁ చుండు భక్తులు పిలచినచో నిజంబు॥ 143

## సూక్తమ్—156

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః*

దేవతా—విష్ణుః

ఛందః—జగతీ

(1) భవా మిత్రో న శేవ్యో ఘృతాసుతిర్విభూతద్యుమ్న[1] ఏవయా ఉ సప్రథాః ।

అధా తే విష్ణో విదుషా చిదర్ధ్యః స్తోమో యజ్ఞశ్చ రాధ్యో హవిష్మతా॥ 133

† తొంబది నాల్గు కాలావయవములు. 1 సంవత్సరము - 2 అయనములు - 5 ఋతువులు - 12 మాసములు 24 పక్షములు - 30 అహోరాత్రములు - 8 యామములు - 12 రాశులు చేరి తొంబదినాలుగు. (నే. వేం. న. శా.)

గమనిక : సాయనాచార్యుల భాష్యము ననుసరించి శ్రీ నేమానివా రీ కాలవిశేషములను 94 భాగములుగా నిచ్చిరి. ఇది వివాదాస్పదమైన విషయము. సాయనునకు దీర్ఘతముఁడు పేర్కొన్న త్రినాభికాల విభాగవిషయమై విస్పష్టముగాఁ దెలియదు. షడృతువుల సంగతియు సాయనుఁడు గుర్తించలేదు. రెండు ఋతువు లొక నాభి యను విషయము సాయనుఁడు గమనింపలేదు. 94 సంఖ్యకు సరిపెట్టవలెనన్న 1 సంవత్సరము - 2 అయనములు. 3 నాభులు, 6 ఋతువులు. 12 మాసములు - 24 పక్షములు - 30 అహోరాత్రులు 12 రాశులు - 4 సంధ్యలు (ఉదయ - మధ్యాహ్న - సాయం - అర్ధరాత్రి సంధ్యలు) 3 నాభులు-ఉష్ణనాభి (వేసాకాలము) - జలనాభి (వర్షాకాలము) - శీతనాభి (చలికాలము) మొత్తము కూడ 94 సంఖ్య వచ్చును గాని 12 మాసములను 24 పక్షములను గ్రహించినప్పుడు 30 రోజులు గ్రహించుటలో నర్థములేదు. అన్ని విభాగములను సంవత్సరాత్మకములుగానే గ్రహింపవలయుఁగాని వేరుగా గ్రహింపరాదు - "మాసదినములు పరిగ్రహించుచో మాసదినములకు మాఱుగాఁ బక్షదినము లేల గ్రహింపరాదు?" అని సందేహము రావచ్చును. ఇది చాల చర్చనీయాంశము. చూడు పీఠిక. వ.గో.కృ.

* ఋషి విశేషవిషయములకై సంస్కృత మూలములోని 140వ సూక్తము ఋషికిచ్చిన పుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. ద్యుమ్నఽఏవయాఽఉ సప్రథా।ఉ ఇతే. (వా.ప్ర.)

(2) యః పూర్వ్యాయ వేధసే నవీయసే సుమజ్జానయే విష్ణవే దదాశతి ।
యో జాతమస్య మహతో మహి బ్రవత్ సేదు శ్రవోభిర్యుజ్యం చిదభ్యసత్ ॥ 134

(3) తము స్తోతారః పూర్వ్యం యథా విద[1] ఋతస్య గర్భం జనుషా పిపర్తన ।
ఆస్య జానన్తో నామ చిద్ వివక్తన మహస్తే విష్ణో సుమతిం భజామహే ॥ 135

(4) తమస్య రాజా వరుణ స్తమశ్వినా క్రతుం సచన్త మారుతస్య వేధసః ।
దాధార దక్షము త్తమమహర్విదం వ్రజం చ విష్ణుః సఖివాగ్ం[2] అపోర్ణుతే ॥ 136

(5) ఆ యో వివాయ సచథాయ దైవ్య[3] ఇన్ద్రాయ విష్ణుః సుకృతే సుకృత్తరః ।
వేధా[4] అజిన్వత్ త్రిషధస్థ[5] ఆర్యమృతస్య భాగే యజమానమాభజత్ ॥ 137

## సూక్తము—156

ఋషి—దీర్ఘతముఁడు*

దేవత—విష్ణువు

(1) ఉ॥ కమ్మ నితాంత సేవ్యుఁడవు క మ్మధికుండవు మాకుఁ బ్రీతి గై
కొమ్ము హవిస్సు నాజ్యమును గొప్ప యశస్సులఁగల్గఁ జేయుచున్
మమ్ముఁ బరిగ్రహించి యజమానుఁ డొనర్చిన సంస్తవంబులన్
నమ్ముచు విష్ణువా! వెలుఁగు నాదగు పూజల నెల్లఁ బొందుచున్ ॥ 144

1. విదఽఋతస్య. 2. వాగ్ంఽఅపో. 3. దైవ్యఽఇన్ద్రాయ. 4. వేధాఽఅజి. 5. త్రిషధస్థఽఆర్య. (వా.ప్ర.)

* ఋషివిశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(2) చ॥ సకలము సృష్టిఁజేసి యతిసంతసముం గలిఁగించు భార్యతో
నకలుష సౌఖ్యసంపదను నందుచు నిత్యుఁడుగా వెలింగి దీ
పకుఁడగు విష్ణునిన్ మిగుల భావనఁ జేసెడు మానవుండు నా
యకుఁడయి సత్యవిష్ణుపద మందకయుండెనెః యెంచిచూడఁగన్ ॥ 145

(3) చ॥ కనుఁగొనుఁ డార్యులారః ఘన కర్మ విశిష్టుఁ డనాదిసిద్ధుఁడై
తనరెడు విష్ణువుం దలఁచి ధన్యులరై విలసిల్లుఁ డెప్పుడున్
ఘనమగు భిన్నకాంక్షితము కల్గునుగాన ననాది దేవునిన్
మనమున నుంచి ప్రీతునిగ మానుగఁ జేయుఁడు మీర లాతనిన్ ॥ 146

గీ॥ చాటుఁడెల్లయెడలఁ జక్కని పురుషార్థ, మిచ్చు విష్ణునామ మెల్లదిశల
విష్ణువాః త్వదీయ విశదంపు బుద్ధిని, బొగడుచుందు నేను బూర్ణమతిని ॥ 147

(4) గీ॥ ఋత్విజాళితోడఁ దత్త్వజ్ఞు నొనరించు, యజ్ఞరూపవిష్ణు నతిముదమున
రాజమానకాంతి రాత్ర్యశ్వదేవత, లాశ్రయించుచుండి రధిక మతని ॥ 148

క॥ ఘనమగు సవనమునకుఁ జను, మన విష్ణువు వివిధ యాగ మర్మకరులతోఁ
దనరెడు వారికి నాకం, బనయము సమకూర్చు బలము నందించుఁగదాః ॥ 149

(5) గీ॥ హవ్యము నొసంగువానికి, యాగములకు, సాయ మొనరించి చక్కని ఫలము నొసఁగ
విష్ణు వంబరమున నుండి వెలసి భువికి, వచ్చుచున్నాఁడు చూడరేః భక్తులారః ॥ 150

గీ॥ యాగ కర్మలందు యజమానుఁ డొసఁగెడు, హవ్యములు గ్రహించి యధికతుష్టి
నతని కభిమతంబు నందింప నావిష్ణు, వరుఁగుదెంచుచుండె యజ్ఞములకు ॥ 151

## అనువాకః—22 సూక్తమ్—157

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అశ్వినౌ

ఛందః—జగతీ, 5-8 త్రిష్టుప్

(1) అబోధ్యగ్నిర్జ్మ[1] ఉదేతి సూర్యో వ్యుషాశ్చన్ద్రా మహ్యావో[2] అర్చిషా ।

అయుక్షాతామశ్వినా యాతవే రథం ప్రాసావీద్ దేవః సవితా జగత్ పృథక్ ॥ 138

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. అబోధ్యగ్నిర్ జ్మఽఉదేతి, 2. మహ్యావోఽఅర్చిషా. (వ్రా.ప్ర.)

(2) యద్ యుఞ్జాథే వృషణమశ్వినా రథం ఘృతేన నో మధునా క్షత్రముక్షతమ్ ।

అస్మాకం బ్రహ్మ పృతనాసు జిన్వతం వయం ధనా శూరసాతా భజేమహి ॥ 139

(3) అర్వాఙ్ త్రిచక్రో మధువాహనో రథో జీరాశ్వో[1] అశ్వినో ర్యాతు సుష్టుతః ।

త్రివన్ధురో మఘవా విశ్వసౌభగః శం న[2] ఆ వక్షద్ ద్విపదే చతుష్పదే ॥ 140

(4) ఆ న[3] ఊర్జం వహతమశ్వినా యువం మధుమత్యా నః కశయా మిమిక్షతమ్ ।

ప్రాయుస్తారిష్టం నీ రపాంసి మృక్షతం సేధతం ద్వేషో భవతం సచాభువా ॥ 141

(5) యువం హ గర్భం జగతీషు ధత్థో యువం విశ్వేషు భువనేష్వన్తః ।

యువమగ్నిం చ వృషణావపశ్చ వనస్పతీగ్ం[4] రశ్వినావైరయేథామ్ ॥ 142

(6) యువం హస్థో భిషజా భేషజేభిరథో హ స్థో రథ్యాః రాథ్యేభిః ।

అథో హ క్షత్రమధి ధత్థ[5] ఉగ్రా యో వాం హవిష్మాన్ మనసా దదాశ ॥ 143

ఇతి

ద్వితీయోఽష్టకే ద్వితీయోఽధ్యాయ

స్సమాప్తః

1. జీరాశ్వోఽఅశ్వినో, 2. శంనఽఆ, 3. నఽఊర్జం, 4. తీగ్ంఽరశ్వినా, 5. ధత్థఽఉగ్రా (ప్రా.ప్ర.)

అనువాకము—22 సూక్తము—157

ఋషి—దీర్ఘతముఁడు *

దేవత—అశ్వీదేవతలు

(1) ఉ॥ వేదికపైని బావకుఁడు వెల్గుచునుండె నుషస్సు సూర్యుఁడున్
సాదర మొప్పఁ జీఁకటుల సంఘము లెల్లను గొట్టుచుండి రా
మోదముతోడ మీ రథము ముందఱ రాసభ పంక్తిఁ బెట్టి దే
[1]వాదిహితేష్టిశాలలకు వచ్చి ముదంబును జేయుఁ డశ్వికుల్! ॥ 152

గీ॥ శుభద కర్మలఁ జేయించు సూర్యు నెలమి, జంగమస్థావరంబైన జగమునంత
స్వస్వకర్మలఁ జేయంగ జరుగఁ జేసి,యమరుచుండుఁడు మీర లో యశ్వులార! ॥ 153

(2) ఉ॥ వానల నిచ్చు మీ రథము వావిరి నెక్కుచు యజ్ఞశాలకున్
మౌనులు మెచ్చవచ్చి యట మంచి హవిస్సులఁ బుచ్చుకొంచు నౌ
నౌ నని సంతసించి బల మత్యధికంబుగ నిండు మాకు వేఁ
బూనుచు శత్రుసంపదల పుంజముకూడ మహాశ్విదేవతల్! ॥ 154

(3) సీ॥ చక్రత్రయముచేతఁ జరియించునది యెద్ది? తేనెను ధరియించి తిరుగు నెద్ది?
ఘనులైనవారిచేఁ గొనియాడఁబడు నెద్ది? పూజ్యహయంబులఁ బూను నెద్ది?
మూఁడగు కట్టెల జోడింపఁబడుచోట సారథి కూర్చుండ సాగునెద్ది?
సర్వధనంబుతో సంపూర్ణమగు నెద్ది? ముదమును జనులకు నొసఁగు నెద్ది?
గీ॥ యట్టి యశ్వరథంబు మా కభిముఖముగ,వచ్చి పశు పుత్ర ధనముల నిచ్చి మమ్ముఁ
బుచ్చుకొమ్మని చెప్పుచు మెచ్చునట్లు,సుఖము నభివృద్ధిఁ జేయుత మఖిలమునకు ॥ 155

(4) చ॥ వెలఁగుచు నన్నముంగలుఁగఁ జేయుఁ డొనర్పుఁడు శత్రుహాని వా
క్కుల మముఁద్రుప్తిఁజేసి కడుఁగూర్మిని నాయువు వృద్ధిచేయుఁ డా
కులమగు పాపసంఘమును గొట్టుఁడు మే మొనరించు కార్యముల్
వెలసెడునట్లు చేయుఁడు భువిన్ బలు భంగుల నశ్విదేవతల్! ॥ 156

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. చతుర్థపాదమున నఖండయతి. వ.గో.కృ.

(5) క॥ పనిగొని వర్షము నిచ్చుచు, ఘనమగు రేతోఽభివృద్ధిఁ గల్పించుచు గో
గణ జంతుజాలమునకై, యనలౌషధులను సృజించి యమరితి రక్షవల్ ! ॥ 157

(6) ఉ॥ మీరలు వైద్యపుంగవులు మీకు రథాశ్వబలంబు లుండె నో
వీర వతంసులార ! జన వీరులు మీకు హవిస్సు నిచ్చుచో
వారి ననుగ్రహించి మఱి వారికిఁ దుష్టిని గల్గఁజేయుచుం
గోరిక లన్ని యిచ్చి కడుఁ గూర్చుఁడు సౌఖ్యము శాశ్వతంబుగన్ ॥ 158

ఇయ్యది

శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేఙ్కటేశ్వర పౌత్ర

శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన

శ్రీ భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత

కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు

ద్వితీయాష్టకమున ద్వితీయాధ్యాయము

సమాప్తము

---

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ద్వితీయోऽష్టకః     తృతీయోऽధ్యాయః

### సూక్తమ్—158

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్, 6 అనుష్టుప్

(1) వసూ రుద్రా పురుమన్తూ వృధన్తా దశస్యతం నో వృషణావభిష్టౌ ।

దస్రా హ యద్ రేక్ణ[1] ఔచథ్యో వాం ప్ర యత్ సస్రాథే[2] అకవాభిరూతీ ॥ 1

(2) కో వాం దాశత్ సుమతయే చిదస్యై వసూ యద్ ధేథే నమసా పదే గోః ।

జిగృతమస్మే రేవతీః పురంధీః కామప్రేణేవ మనసా చరన్తా ॥ 2

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. రేక్ణఔచథ్యో, 2. సస్రాథేऽఅక. (వ్రా.ప్ర.)

(3) యుక్తో హ యద్ వాం తౌగ్ర్యాయ పేరుర్వి మధ్యే[1] అర్ణసో ధాయి పజ్రః ।

ఉప వామవః శరణం గమేయం శూరో నాజ్మ పతయద్భిరేవైః ॥ 3

(4) ఉపస్తుతిరౌచథ్యమురుష్యేన్మా మామిమే పతత్రిణీ వి దుగ్ధామ్ ।

మా మామేధో దశతయశ్చితో ధాక్ ప్ర యద్ వాం బద్ధస్త్మని ఖాదతి క్షామ్ ॥ 4

(5) న మా గరన్ నద్యో మాతృతమా దాసా యదీం సుసముబ్ధమవాధుః ।

శిరో యదస్య త్రైతనో వితక్షత్ స్వయం దాస[2] ఉరో అంసావపి గ్ధ ॥ 5

(6) †దీర్ఘతమా మామతేయో జుజుర్వాన్ దశమే యుగే ।

అపామర్థం యతీనాం బ్రహ్మా భవతి సారథిః ॥ 6

1. మధ్యేఽఅర్ణ, 2. దాసఽఉరోఽఅంసా (బ్రా.ప్ర.)

† ఈ ఋక్కు ప్రక్షిప్తము కానోపును. లేదా వేరే విశేషార్థము చెప్పనగును. సంస్కృత మూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ద్వితీయాష్టకము—తృతీయాధ్యాయము

### సూక్తము—158

ఋషి—దీర్ఘతముఁడు*

దేవత—అశ్వి దేవతలు

(1) సీ॥ కామితార్థ మొసంగి కల శత్రువులనెల్ల నశియింపఁజేయుచు నడచువారు
జన నివాసమునకు ఘనహేతుభూతులై యఘములఁగొట్టుచు నరుగువార
లున్నతస్తుతిచేత నుప్పొంగువారలై యిష్టార్థముల నెల్ల నిచ్చువారు
సర్వసర్వంసహా శక్తిసంపద నొంది [1]ప్రజలఁబ్రసిద్ధిని బరగువార
గీ॥ లైన యశ్వులు! మీకు నీ హవ్యములను, దీర్ఘతమసుఁడ నగు నేను దీన భావ
మొంది యొసఁగుచు నున్నాఁడ నందివాని, సంతసంబున మెసవుఁడీ ! సత్వరమున ॥ 1

(2) క॥ జనమున కభీష్ట మొసఁగెడు, మనమునఁ జరియించునట్టు మర్మవిధిజ్ఞుల్
జనులు నివసించుటకుఁ గా,రణు లశ్వులు! జగమునందు రాజులు కారే ! ॥ 2

(3) ఉ॥ మే మతిభక్తితో నిడిన మేలగు హవ్యము సంగ్రహించి మా
క్షేమముఁ గోరు మీ సరస చిత్తము తుష్టినిఁ జెందఁజేయు నా
స్వామి యెవండొ ! నే నెఱుఁగఁజాలను మీరు హవిస్సుఁబొందుచున్
గామిత మిచ్చు గోవులను గానుకగా నిడుఁ డశ్విదేవతల్ ! ॥ 3

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలములోని 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. "జనులఁబ్రసిద్ధిని జెందువారలు" (వ్రా.ప్ర.పా.) ఇందు వ్యావహారిక భాషా ప్రభావమున "జెనులు-జెందువారలు" అని "జన" శబ్దము "జెన" శబ్దముగా గ్రామ్యముగాఁ బ్రయుక్తమై యతి సరిపెట్టఁబడినది. వ.గో.కృ.

(4) ఉ॥ యానముమీఁద నెక్కి చని యబ్ధిని మున్గిన "తుగ్ర" సూనునిం
బూనికఁ గట్టుఁజేర్చితిరి పూజ్యులు మీరలు దస్రులార! స
మ్మానిత వీరపూరుషుఁడు మత్తవిపక్షులఁ జంపి బండిపై
మానుగ నేఁగు నట్టు లభిమానముతో మిము నేను జేరెదన్ ॥ 4

గీ॥ పాశ బద్ధుఁడైన భవదీయ మిత్రుండు, భూమిపైనిఁ బడుచు పొరలుచుండె
నశ్విలార! మీర లధికదయాత్ములు, గాన వాని గావఁ గదఁగి రండు! ॥ 5

గీ॥ దీర్ఘతమసుండ నగు నేను దీనభావ,మంది యొనరించు సంస్తుతి, యగ్నిదాహ
బాధలం గొట్టుఁగాక! నాప్రాణములను, దీయకుండునుగాక నీ దినము నిశియు ॥ 6

క॥ పదియావృత్తులవఱకున్, బదిలముగా రగులు గొలుపఁబడి మండుచు నా
యెదఁగాల్చునట్టి కాష్ఠము, లుదితాగ్నిన్ విడచి శాంతి నొంది వెలయుతన్! ॥ 7

(5) ఉ॥ దీనులు నన్ను సంకుచిత దేహునిగా నొనరించి నాతలం
బూనుచుఁ గ్రిందుగా నునిచి పూర్ణబలంబునఁ ద్రోసి రిప్పుడే
కాన సమస్త మానవులఁ గాచెడు సింధువు లన్ని యెంతయున్
దీనుఁడనైన నన్నుఁ గడు దీక్షను బూనుచుఁ గాచుఁగావుతన్! ॥ 8

గీ॥ మఱియుఁ దైత్రతనుఁడనువాఁడు మామకీన, శిరముఁజెక్కుచు బొమ్మను జేతులను స
హితము గొట్టెను గావున నతనిశిరసు, తానె చెక్కుకొనుంగాకఁ దత్క్షణంబు ॥ 9

(6) క॥ మమతా పుత్రుండగు నా, గమ దీర్ఘతముండు [1]దశయుగమ్ములు మనుచుం
గమనీయ మునులు బ్రహ్మకు, సముఁడని పొగడంగఁ గర్మ జరిపించు నొగిన్ ॥ 10

అర్థాంతరము

గీ॥ †దీర్ఘతమముఁబోలు ధీకల్గు ప్రాణులున్, ద్వివిధ దశలయందు వివిధములగు
జప తపమ్ము లొనర జన్మమ్ములాదిగా, పరుణులకయి బ్రహ్మ పథము నిల్పు ॥ 11

---

1. దీర్ఘతముండు పెద్దకాలము మనుచుం (ప్రా.ప్ర.పా.) ఇది మూలానుగుణముకాదు. కావున సవరింపఁబడినది. మూలములో "దశమే యుగే" అని స్పష్టముగానున్నది. అసలీ యనువాదమునకు మూలమైన ఋక్కే ప్రక్షిప్తము కానోపును. లేదా విభిన్నమైన విశేషార్థము చెప్పనగును. చూడు. సంస్కృతమూలములోని 140వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు434 నుండి 439 వరకుఁగల పుటల విషయము. వ.గో.కృ.

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

## సూక్తమ్—159

### ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

### దేవతా—ద్యావాపృథివీ

### ఛందః—జగతీ

(1) ప్ర ద్యావా యజ్ఞైః పృథివీ[1] ఋతావృథా మహీ స్తుషే విదథేషు ప్రచేతసా ।

దేవేభిర్యే దేవపుత్రే సుదంససేత్థా ధియా వార్యాణి ప్రభూషతః ॥ 7

(2) ఉత మన్యే పితురద్రుహో మనో మాతుర్మహి స్వతవస్తద్ధవీమభిః ।

సురేతసా పితరా భూమ చక్రతురురు ప్రజాయా[2] అమృతం వరీమభిః ॥ 8

(3) తే సూనవః స్వపసః సుదంససో మహీ జజ్ఞుర్మాతరా పూర్వచిత్తయే ।

స్థాతుశ్చ సత్యం జగతశ్చ ధర్మణి పుత్రస్య పాథః పదమద్వయావినః ॥ 9

(4) తే మాయినో మమిరే సుప్రచేతసో జామీ సయోనీ మిథునా సమోకసా ।

నవ్యంనవ్యం తన్తుమా తన్వతే దివి సముద్రే[3] అన్తః కవయః సుదీతయః ॥ 10

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. పృథివీఽఋతా, 2. ప్రజాయాఽఅమృతం, 3. సముద్రేఽఅన్తః. (వా.ప్ర.)

(5) తద్ రాధో[1] అద్య సవితుర్వరేణ్యం వయం దేవస్య ప్రసవే మనామహే ।

అస్మభ్యం ద్యావాపృథివీ సుచేతునా రయిం ధత్తం వసుమన్తం శతగ్వినమ్ ॥ 11

## సూక్తము—159

ఋషి—దీర్ఘతముఁడు *

దేవత—ద్యావాభూములు

(1,2) సీ॥ యాగాభివృద్ధిని నధికంబుగాఁ జేసి శ్రేష్ఠములయి కడుఁ జెలఁగునవియు
యజ్ఞంబులన్ మమ్ము తజ్ఞులఁ గావించి కోర్కెల నేవేళఁ గూర్చునవియుఁ
బుత్రులవలె మాకుఁ బూజ్యమానపులెల్ల రుపచరించెడువట్టు లుంచునవియు
నెల్లలోకములకుఁ దల్లియై తండ్రియై కర్మల నేవేళఁ గలుఁగునవియు
గీ॥ నైన దివి భూమి యమృతత్వ మందఁజేసి, యజ్ఞహవ్యంబు మాకిచ్చు నవసరమున
మానస మనుగ్రహించిత [1]మౌటఁగొఱకుఁ, బ్రార్థన మొనర్తు వానిని[2] భక్తిమీఱ ॥ 12

(3) ఉ॥ తల్లిని బోలుచున్ హితము తద్ద నొసంగెడు దాన వంచు నీ
యుల్లము పల్లవింప నిను యుక్తవచస్సుల వేడుచుంటి రా
జిల్లెడు రోదసీతలమ! చిన్ని కుమార సమాన లోక మీ
[3]త్వల్లలితప్రభావమును దప్పక నొం డొకరుం డెఱుంగునే! 13

---

1. రాధోऽద్య (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. అఖండయతి, 2. బ్రార్థన మొనర్తు భక్తితాత్పర్య మెసఁగ (తొ.పా.) 3. ఇక్కడఁ దొలుత గ్రంథకర్త "త్వల్లలిత ప్రభావమును దక్కక నొండొకరుం డెఱుంగునే" అని వ్రాయఁగా నెవరో దీనిని గొట్టివేసి "దప్పకె రుంగొకరుం డెరుంగునే" అని సవరించి వేసిరి. తప్పక + ఎరుంగు + ఒకరుండు + ఎరుంగునే అన్నప్పుడు ఎరుగొకరుండన్నది దుస్సంధి. కావునఁ బైవిధముగాఁ దొలిపాఠమున కనుగుణముగా విశేషముగా సవరింపఁబడినది. వ గో.కృ.

(4) ఉ॥ ఒక్కతలానఁ బుట్టుచును నొండొరులన్ విడకుండ వెల్గు నా
చక్కని రోదసీద్వయము చారు తరంబుగఁ దమ్ముఁగొల్వ సొం
పెక్కెడు సూర్యరశ్మితతు లెక్కువకాంతులు గల్గఁజేసి న
ల్దిక్కులకున్ సమగ్రముగ లీలమెయిన్ బ్రసరింపుఁగావుతన్ ॥ 14

(5) చ॥ సకలము తానెయై వెలిఁగి సర్వమొసంగెడు సూర్యమూర్తి గొం
కక విధియించు రోదసిని గాంచుచుఁ గోరుచునుంటి మాత్మసౌ
ఖ్యకరములైన గోగణము కామిత విత్తము కాన నద్ది మా
[1]కకలుషబుద్ధియై నొసఁగుఁగాతను రోదిత కాంక్షితంబులన్ ॥ 15

## సూక్తమ్ 160

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—ద్యావాపృథివీ

ఛందః—జగతీ

(1) తే హి ద్యావాపృథివీ విశ్వశంభువ[1] ఋతావరీ రజసో ధారయత్కవీ ।

సుజన్మనీ ధిషణే[2] అన్తరీయతే దేవో దేవీ ధర్మణా సూర్యః శుచిః ॥ 12

(2) ఉరువ్యచసా మహినీ[3] అసశ్చతా పితా మాతా చ భువనాని రక్షతః ।

సుధృష్టమే వపుష్యే౩ న రోదసీ పితా యత్ సీమభి రూపైరవాసయత్ ॥ 13

1. ఈ పాదమున నఖండయతి. (వ్రాతప్రతి 111వ పుటలో "మా, కలుషబుద్ధి మైయొసఁగుఁగాతవు రోధిత కాంక్షితంబులన్" అని వ్రాయఁబడి యున్నది. ఇది ప్రమాదవశమునఁ బ్రాస గణశబ్దభంగ దోషయుక్తముగా వ్రాయఁబడినది. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. శంభువఽఋతావరీ, 2. ధిషణేఽఅన్తరీయతే, 3. మహినీఽఅసశ్చతా. (వ్రా.ప్ర.)

(3) స వహ్నిః పుత్రః పిత్రోః పవిత్రవాన్ పునాతి ధీరో భువనాని మాయయా ।

ధేనుం చ పృశ్నిం వృషభం సురేతసం విశ్వాహా శుక్రం పయో[1] అస్య దుక్షత ॥ 14

(4) అయం దేవానామపసామపస్తమో యో జజాన రోదసీ విశ్వశంభువా ।

వి యో మమే రజసీ సుక్రతూయయాऽజరేభిః స్కమ్భనేభిః సమానృచే ॥ 15

(5) తే నో గృణానే మహినీ మహి శ్రవః క్షత్రం ద్యావాపృథివీ ధాసథో బృహత్ ।

యేనాభి కృష్టీస్తతనామ విశ్వహా పనాయ్యమోజో[2] అస్మే సమిన్వతమ్ ॥ 16

## సూక్తము—160

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—ద్యావాభూములు

(1) సీ॥ ఎయ్యవి జగమున కిచ్చుసుఖంబులు నెయ్యవి కాంతితో వియ్యమందు
నెయ్యవి వృష్టికై యినునితోడంగూడు నెయ్యవి కామ్యార్థ మిచ్చుచుండు
నెయ్యవి యుపకారవృత్తిచే విలసిల్లు నెయ్యవి జనులకు నెయ్య మొసఁగు
నెయ్యవి పరిశుద్ధిహెచ్చుగాఁ గల్పించు నెయ్యవి దోష విహీన మగును
గీ॥ నట్టి సురవర్త్మ భూముల యంతరమున,నున్న లోకము పరిశుద్ధి నొందఁజేయు
చుండు సూర్యుఁడు పుడమికి నుదక దాన, మొసఁగుచుఁదిరుగుచుండు సంతస మెలర్ప ॥ 16

1. పయోऽఅస్య, 2. పనాయ్య మోజోऽఅస్మే (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(2) క॥ జననీజనకులలాగున, దసరుచు వ్యాపించి నైజ ధామముచేతన్
ఘనమగుపదార్థజాతము, నొనరఁగఁ గలిఁగించుచుండె నుర్వీదివముల్ ॥ 17

గీ॥ ఒక్కదానితోడ నొక్కటి కూడక, సర్వ రక్షణంబుఁజక్కఁజేసి
సర్వలోకములకు సంరక్షణము సేయు, రోదసీ ద్వయంబు రూఢి మెఱయ ॥ 18

(3) ఉ॥ సూర్యుఁడు భూమికిం దివికి సూనుఁడుగా వెలుఁగొంది భూత వి
స్తారముఁ దుష్టిదాత్రియగు ధారణి నంతయు వెల్గఁజేసి వా
ర్ధారల నిచ్చులోకమును దాను నను్గ్రహబుద్ధితోడ వి
స్తారము గ్రాలఁగాఁ బనిచి సారెకు వర్షము నిచ్చుచుండఁడే! ॥ 19

(4) శా॥ ద్యావాభూముల సృష్టిఁజేసి యచటన్ వ్యాపించి సత్కర్మలం
గావంబూనుచు వాని సుస్థిరముగాఁ గల్పించుచున్ వెల్గుచున్
దేవారాధ్యుఁడు సర్వగామియగు నా దేవుం డధీశుండు స
ద్భావం బొప్పెడు కర్మకారకులలో భాసించు నిష్ణాతుఁడై ॥ 20

(5) క॥ నుతియింపఁబడుచు సంతస,మతితో మాకెల్ల యెడల మంచియశస్సున్
సతతముఁ బుత్రులఁ బౌత్రుల, నతిబలమును నీయ రారె! యంబరభూముల్ ! ॥ 21

## సూక్తమ్—161

ఋషి—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—ఋభవః

ఛందః—జగతీ, 14 త్రిష్టుప్

(1) కిము శ్రేష్ఠః కిం యవిష్ఠో న[1] ఆజగన్ కిమీయతే దూత్యం౧ కద్ యదూచిమ ।

న నిన్దిమ చమసం యో మహాకులో ఽగ్నే భ్రాతర్ద్రుణ[2] ఇద్ భూతిమూదిమ ॥ 17

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. నఽఆజగన్, 2. భ్రాతర్ ద్రుణఽఇద్. (వ్రా.ప్ర.)

(2) ఏకం చమసం చతురః కృణోతన తద్ వో దేవా[1] అబ్రువన్ తద్ వ ఆగమమ్ ।

సౌధన్వనా యద్యేవా కరిష్యథ సాకం దేవైర్యజ్ఞియాసో భవిష్యథ ॥ 18

(3) అగ్నిం దూతం ప్రతి యదబ్రవీతనాశ్వః కర్త్వో రథ[2] ఉతేహ కర్త్వః ।

ధేనుః కర్త్వా యువశా కర్త్వా ద్వా తాని భ్రాతరను వః కృత్వ్యేమసి ॥ 19

(4) చకృవాంస[3] ఋభవస్తదపృచ్ఛత క్వేదభూద్ యః స్య దూతో న[4] ఆజగన్ ।

యదావాఖ్యచ్చమసాఞ్చతురః కృతానాదిత్ త్వష్టా గ్నాస్వన్తర్న్యానజే ॥ 20

(5) హనామైనాగ్ం[5] ఇతి త్వష్టా యదబ్రవీచ్చమసం యే దేవపానమనిన్దిషుః ।

అన్యా నామాని కృణ్వతే సుతే సచాగ్ం[6] అన్యైరేనాన్ కన్యాత నామభిః స్పరత్ ॥ 21

(6) ఇన్ద్రో హరీ యుయుజే[7] అశ్వినా రథం బృహస్పతిర్విశ్వరూపాముపాజత ।

ఋభుర్విభ్వా వాజో దేవాగ్ం[8] అగచ్ఛత స్వపసో యజ్ఞియం భాగమైతన ॥ 22

1. దేవాఽ అబ్రువన్ తద్వఽఆగమమ్, 2. రథఽఉతేహ, 3. చకృవాంసఽఋభవ, 4. నఽఆజగన్. 5. హనామైనాగ్ంఽఇతి, 6. సచాగ్ంఽఅన్యైః, 7. యుయుజేఽఅశ్వి, 8. దేవాగ్ంఽఅగచ్ఛత. (ప్రా.ప్ర,)

(7) నిశ్చర్మణో గామరిణీత ధీతిభిర్యా జరన్తా యువశా తాకృణోతన ।

సౌధన్వనా[1] అశ్వాదశ్వమతక్షత యుక్త్వా రథముప దేవాగ్ం[2] అయాతన ॥ 23

(8) ఇదముదకం పిబతేత్యబ్రవీతనేదం వా ఘా పిబతాముఞ్జనేజనమ్ ।

సౌధన్వనా యది తన్నేవ హర్యథ తృతీయే ఘా సవనే మదయాధ్వై ॥ 24

(9) ఆపో భూయిష్ఠా[3] ఇత్యేకో అబ్రవీదగ్నిర్భూయిష్ఠ[4] ఇత్యన్యో అబ్రవీత్ ।

[5]వధర్యన్తీం బహుభ్యః ప్రైకో[6] అబ్రవీదృతా వదన్తశ్చమసాగ్ం[7] అపింశత ॥ 25

(10) శ్రోణామేక[8] ఉదకం గామవాజతి మాంసమేకః పింశతి సూనయాభృతమ్ ।

ఆ నిమ్రుచః శకృదేకో[9] అపాభరత్ కిం స్విత్ పుత్రేభ్యః పితరా[10] ఉపావతుః ॥ 26

(11) ఉద్వత్స్వస్మా[11] అకృణోతనా తృణం నివత్స్వపః స్వపస్యయా నరః ।

అగోహ్యస్య యదసస్తనా గృహే తదద్యేదమృభవో నాను గచ్ఛథ ॥ 27

1. నాఽఅశ్వా, 2. దేవాగ్ంఽఅయాతన. 3. భూయిష్ఠాఽఇత్యేకోఽ, 4. భూయిష్టఽఇత్యన్యోఽఅబ్రవీత్ 5, వర్ధయన్తీం. 6. ప్రైకోఽఅబ్రవీదృతా, 7. మసాగ్ంఽఅపింశత, 8. మేకఽఉదకం, 9. దేకోఽఅపా, 10. పితరాఽఉపా, 11. స్వస్మాఽఅకృణో, (బ్రా.ప్ర.)

(12) సంమీళ్య యద్ భువనా పర్యసర్పత క్వ స్విత్ తాత్యా పితరా వ[1] ఆసతుః ।
అశపత యః కరస్నం వ[2] ఆదదే యః ప్రాబ్రవీత్ ప్రో తస్మా అబ్రవీతన ॥ 28

(13) సుషుప్వాంస[3] ఋభవ స్తదపృచ్ఛతాగోహ్య క[4] ఇదం నో అబూబుధత్ ।
శ్వానం బస్తో బోధయితారమబ్రవీత్ సంవత్సర[5] ఇదమద్యా వ్యఖ్యత ॥ 29

(14) దివా యాన్తి మరుతో భూమ్యాऽగ్నిరయం వాతో[6] అన్తరిక్షేణ యాతి ।
అద్భిర్యాతి వరుణః సముద్రైర్యుష్మాగ్ం[7] ఇచ్ఛన్తః శవసో నపాతః ॥ 30

## సూక్తము—161

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—ఋభువులు

(1) క॥ మాకంటెను శ్రేష్ఠుండో!, మాకంటెఁ గనిష్ఠుఁడగునొ! మఱి వహ్నిసుర
స్తోకంబునకుం దూతుఁడొ!, నాకున్ శక్యంబె! వర్ణనంబున్ జేయన్ ॥ 22

గీ॥ భ్రాత! యగ్నిదేవ! పరమవంశమునందుఁ, బుట్టి దారు రూప పుణ్య చమస
పాత్రభూతినెల్లఁ బ్రకటించుచున్నాము, దాని చరితమెల్ల ధన్యముకద! ॥ 23

---

1. వऽ ఆసతుః, 2. వऽఆదదే, 3. ప్వాంసऽఋభవ, 4. కऽఇదంనోऽఅబూ, 5. సంవత్సరऽఇద 6. వాతోऽఅన్తరిక్షేణ,
7. యుష్మాగ్ంऽఇచ్ఛన్తః (వా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

(2) చ॥ చమసము సంగ్రహించి యది చక్కఁగ నాలుగుఁజేయుఁడంచు నా
యమరులుఁజెప్పఁ దద్వచన మందఱకుం దెలుపంగ వచ్చితిన్
విమల మనస్సుతోడ నదివేగ మొనర్చిన మీరు సోమ పా
నము నెరవేర్పఁగల్గుదురు నాక నివాసులతో ఋభూత్తముల్! ॥ 24

(3) సీ॥ దేవతాదౌత్యంబు దిరముగ వహియించు నగ్నిదేవా! నిన్నె యడుగుచుంటి
మేకార్యమైనను నిప్పుడె చేయంగ వలయునో? మఱి చేయవలదొ? యింక
నశ్వమా చేయుట? యరదంబు చేయుటో? తగినగోవులఁ జేయఁదగునొ? లేక
యతివృద్ధపితరుల, యౌవనవంతులవలెఁజేయవలయునో? పలుకవలదె?
గీ॥ అనల మేమిట్టి కార్యము లన్నిచేసి,యున్నవారము కావున నెన్నఁబడిన
దేవతాకార్యము నొనర్చి దేవతలను,బొందఁగోరుచు నున్నాము పూర్ణమతిని ॥ 25

(4) గీ॥ దేవతలు చెప్పినట్టులు దివ్యచమస,పాత్రములఁజేసి ఋభువు లాపనినిదెల్ప
ననలుఁ డెందుండెనని ప్రశ్న నడుగుచుండఁ,ద్వష్ట రమణీమణులలోన దాఁగుకొనియె ॥ 26

(5) గీ॥ పానయోగ్యచమసపాత్రను విభజింపఁ, ద్వష్ట ఋభుగణంబుఁ దప్పకుండఁ
జంపవచ్చెఁగాన సరగున వారెల్ల,వేరు పేళ్ళతోడ వెలసినారు ॥ 27

(6) గీ॥ హరి బృహస్పతి, యశ్వలు పరమవాహ,నంబులను నెక్కి వచ్చిరి డంబుమీరఁ
గర్మపరులగు ఋభువులు కదలివచ్చి,యజ్ఞభాగములంబొందుఁ డతిముదమున ॥ 28

(7,8) సీ॥ సౌధన్వు లందఱు సహజశక్తులచేత మృతగోవు చర్మము వెతకినార
లాకృత్తి చే నొకయావును నిర్మించి పుడమిపైఁగీర్తిని బడసినార
లతిజరాజీర్ణులౌ యంబకుఁ బితకును యౌవన మర్పించి యమరినార
లొకవాజినుండి వేఱొకవాజి పుట్టించి పేరు ప్రతిష్ఠలఁ బెరిగినారు
గీ॥ కాన, నరదములంబూని కదలిపోయి, యెదుట నున్నట్టి సోమము నెల్లఁద్రావి
సోమరసపానమత్తులై శోభఁజెంది, సవనసోమముఁ జవిఁజూడ జరుగఁగలరు ॥ 29

(9) ఉ॥ ఒక్కఁడు నీరు శ్రేష్ఠమను నొక్కఁడు వహ్నిని జెప్పుచుండు నిం
కొక్కఁడు భూమిశ్రేష్ఠమని యొప్పుగఁ జర్చలఁ జేసిచేసి స
ద్వాక్కులతోఁ బరస్పరము వాదము సల్పుచు సోమపాత్రలన్
మక్కువతో ఋభూత్తములు మానక చేసిరి వేరువేరుగాన్ ॥ 30

(10) *ఉ॥ ఒక్కఁడు గోవునుండి కడునొప్పుగ వచ్చెడు రక్తమంతయున్
దక్కక క్రుమ్మరించు మఱి యొక్కఁడు కత్తినిగోసి మాంసమున్
బ్రక్కకుఁ జేర్చుచుండె బహుభావనఁ జేయుచు సూక్ష్మబుద్ధితో
నొక్కఁడు మూత్రముఖ్యముల నోపిక వేరుగఁజేయుచుండఁడే! ॥ 31

గీ॥ పుత్రకులవలె ఋభువులు పుణ్యకర్మ,లన్నిఁజేయుచు నుండంగ యజ్ఞమందు
దంపతులు చేయవలసిన తగినకర్మ, లుండుననిచెప్ప శక్యమే? పండితుండ! ॥ 32

అర్థాంతరము

†సీ॥ ఒక్కఁడు శ్రవణాన నుదకరాజము తృప్తి లోకాల గురియఁగా లోలుపుఁడగు
నొకఁడు పుత్రునిచేత నుట్టి యెడారుల నిస్సార జలముల నింపుమొయుల
నొక్కఁ డకాలాన నొనరించి కుంభవర్షాలఁ బ్రాణుల నెల్ల బేలపఱచు
నొకఁడు పుత్రులఁ దండ్రి హృదయామృతము నిండఁ బ్రేమించి మించు మై వృష్టిగురియ
గీ॥ ఋక్కులన్ జదువుచు సర్వలోకశుభము, లెనయ జన్నముల్ చేయుసు నెంతయేని
స్వార్థ మనునది లేక నిస్వార్థగతిని, గృత్తికాదిమృగశిరాంత ఋభువు లొప్ప ॥ 33

* ఇట్టి మంత్రములనుబట్టి చూడ నార్యులనాఁడు జీవహింస యున్నట్లు సూచన కలదు. కాని యీ యర్థము భాష్యకారులు వ్రాసినట్లు నిర్ణయింపవలయునో లేక సరియగు మంత్రార్థమేదియో దెలుపుట దుస్సాధ్యము. యజుర్వేదమందు మాత్రము ఒక మంత్రమున నిట్లు వర్ణింపఁబడెను, "పశూన్ పాహి గాం మా హింసీః ప్రజాం మా హింసీః, అవిం మా హింసీః" యజు అ. 1-13 మం. (పశువులు గోవులు ప్రజలు మొదలగు వానిని హింసింపఁగూడదు.) మొదలగు మంత్రములనుబట్టి జీవహింస లేదనియే నిశ్చయింపవలసియున్నది, నే॥వేం॥న॥శా॥

గమనిక—పశ్వాదులను హింసింపరాదను నిషేధము శుక్ల యజుర్వేదములో వక్కాణించినప్పుడు ప్రాణిహింస పాక్షికముగ నున్నట్లు మన మామోదింపక తప్పదు. కార్యమున్న నే గదా? నిషేధము? ఏది యేమైనను నీ ఋక్కునకు భాష్యముల విషయమై శ్రీ నేమానివారు శుక్లయజుర్వేద మంత్రభాగములను వివిధాధ్యాయములనుంచి పేర్కొని యీ భాష్యములు ప్రామాణికములు కావేమో అని సందేహించుటతోఁ జాల నుత్తమమైన పనిచేసిరి. వారే మరికొంత పరిశోధన చేసి యీ ఋక్కునకు సరైన యాంధ్రానువాదమున్నే చేసియున్న మఱింత బాగుండెడిది. కాని పనికిరాని యప్రామాణికములగు పాత భాష్యములపై నాధారపడి 10వ ఋక్కున కనువాదముగా "ఒక్కఁడు గోవునుండి" ఇత్యాదిగాఁగల (31వ. పద్యము) ఉత్పలమాలను విరచించిరి—కాని యీ ఋక్కున కసలైన యర్థ మిచ్చుచు "ఒక్కఁడు శ్రవణాన" నిత్యాది సీస పద్యమును నేను విరచించితిని. శ్రీ నేమానివారు తమ ఫుట్‌నోటులో నుదాహరించిన యజుర్వేదమంత్ర మేకైక మంత్రముకాదు. ఇవి శుక్లయజుర్వేదములోని విభిన్న యధ్యాయములలోఁగల విభిన్న మంత్రములలోని వాక్యములు. ఇవి యేయే మంత్రములనుండి యుద్ధరింపఁబడినవో వివరములీ క్రింద నీయఁబడినవి. "పశూన్ పాహి" (శు.యజు. 1అధ్యా 1 మం), "గాం మా హింసీః" (శు. యజు. 13 అధ్యా, 43 మం), "ప్రజాం మా హింసీః" అనుటకు పాఠాంతరముగా "జనాయాగ్నే మా హింసీః" (శు.యజు, 13 అధ్యా.49 మం),"అవిం మా హింసీః"అనుటకు మారుగా "ఇమం మా హింసీర్ద్వి పాదం" (శు. యజు. 13అధ్యా. 47 మం) అని శుక్ల యజుర్వేదములోఁ గలవు. శ్రీ నేమానివారికి లభించిన గ్రంథములో "ప్రజాం మా హింసీః, అవిం మా హింసీః" అని "జన" శబ్దమునకు మారుగా "ప్రజా" శబ్దము "ఇమం" శబ్దమునకు మారుగా "అవిం" అని భిన్న పాఠములుండి యుండవచ్చును. వ.గో.కృ.

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ".

(11) చ॥ అమితములైన జంతువులకై గురు ఘాములయందు గ్రాస ము
త్తమమగు నిమ్నదేశమునఁ దా ముదకంబులఁ గలఁజేసి స
త్యముగ సమస్త కర్మములఁ దప్పక చేసిన కీర్తిఁ బొందుచున్
విమల సుధన్వపుత్రు లతివిస్తృతికార్యము లాచరింపరే! ॥ 34

గీ॥ వర్షదంబులైన వసుమంతు ఘృష్టుల,వెలయు ఋభువులార! చెలఁగు సూర్య
వేశ్మమందు మీరు విలసిల్లుచున్నారు, కాన వీడవలదు కార్యములను ॥ 35

(12) క॥ అనయము లోకముఁ దిరిగెదు, ఘనములచేఁ గప్పి వాన కల్గించినచో
నిన చంద్రు లెచట నుండెద, రనఘఋభుప్రవరులార! యరుల ననుపుఁడీ! ॥ ‡ 36

(13) ఉ॥ వాసలఁ గలఁజేయ మముఁబంపెదు వా రెవరంచు మీర లా
భానుని వేడ నాతఁ డలవాయువు మిమ్ములఁ బంపు నంచు స
న్మానిత బుద్ధితో నను మంగళ కాల మతిక్రమింప నా
భానుఁడుఁ జంద్రదేవుఁడును భాసిలుచుండిరి లోక మంతటన్ ॥ 37

(14) క॥ జలమును గోరుచు వరుణుఁడు,సలలితగగనంబు గాలి సరసమరుత్తుల్
బలసూనులైన ఋభువుల, చెలిమినిఁ బొందంగఁ గోరి చేరెద రటకున్ ॥ 38

## సూక్తమ్—162

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అశ్వః †

ఛందః—త్రిష్టుప్, 3,6 జగతీ

(1) మా నో మిత్రో వరుణో[1] అర్యమాయురిన్ద్రో[2] ఋభుక్షా మరుతః పరి ఖ్యన్ ।
యద్ వాజినో దేవజాతస్య సప్తేః ప్రవక్ష్యామో విదథే వీర్యాణి ॥ 31

‡ 511వ. పుట 39వ పద్యము ఫుట్‌నోటు చూడనగును. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† అశ్వస్తుతిః (మా)-వివిధ దేవాతాత్మ కాలైన సూక్తములన్నియు స్తుత్యాత్మకములు కాఁగాఁ బ్రత్యేకించి దీనిని స్తుతిగా మాక్స్‌ముల్లర్ పేర్కొనవలసిన పనిలేదు. 163వ సూక్తమునకుసైతము "అశ్వస్తుతిః"అని మాక్స్‌ముల్లర్ పేర్కొనెను. వ.గో.కృ.

1. వరుణోఽఅర్య, 2. రిన్ద్రఽఋభు, (ప్రా.ప్ర.)

(2) యన్నిర్ణిజా రేక్ణసా ప్రావృతస్య రాతిం గృభీతాం ముఖతో నయన్తి ।

సుప్రాజజో మేమ్యద్ విశ్వరూప[1] ఇన్ద్రాపూష్ణోః ప్రియమప్యేతి పాథః ॥ 32

(3) ఏష చ్ఛాగః పురో[2] అశ్వేన వాజినా పూష్ణో భాగో నీయతే విశ్వదేవ్యః ।

అభిప్రియం యత్ పురోళాశమర్వతా త్వష్టేదేనం సౌశ్రవసాయ జిన్వతి ॥ 33

(4) యద్ధవిష్యమృతుశో దేవయానం త్రిర్మానుషాః పర్యశ్వం నయన్తి ।

అత్రా పూష్ణః ప్రథమో భాగ[3] ఏతి యజ్ఞం దేవేభ్యః ప్రతివేదయన్నజః ॥ 34

(5) హోతాధ్వర్యురావయా[4] అగ్నిమిన్ధో గ్రావగ్రాభ[5] ఉత శంస్తా సువిప్రః ।

తేన యజ్ఞేన స్వరంకృతేన స్విష్టేన వక్షణా[6] ఆ పృణధ్వమ్ ॥ 35

(6) యూపవ్రస్కా[7] ఉత యే యూపవాహాశ్చషాళం యే[8] అశ్వయూపాయ తక్షతి ।

యే చార్వతే పచనం సంభరన్త్యుతో తేషామభి గూర్తిర్న[9] ఇన్వతు ॥ 36

1. రూపఽఇన్ద్రా, 2. పురోఽఅశ్వేన, 3. భాగఽఏతి, 4. యాఽఅగ్ని, 5. గ్రాభఽఉత, 6. వక్షణాఽఆ, 7. వ్రస్కాఽఉత, 8. యేఽఅశ్వ, 9. నఽఇన్వతు, (వ్రా.ప్ర.)

(7) ఉప ప్రాగాత్ సుమన్మేఽధాయి మన్మ దేవానామాశా[1] ఉప వీతపృష్ఠః ।

అన్వేనం విప్రా[2] ఋషయో మదన్తి దేవానాం పుష్టే చకృమా సుబన్ధుమ్ ॥ 37

(8) యద్ వాజినో దామ సందానమర్వతో యా శీర్షణ్యా రశనా రజ్జురస్య ।

యద్ వా ఘాస్య ప్రభృతమాస్యే తృణం సర్వా తా తే[3] అపి దేవేష్వస్తు ॥ 38

(9) యదశ్వస్య క్రవిషో మక్షికాశ యద్ వా స్వరౌ స్వధితౌ రిప్తమస్తి ।

యద్ధస్తయోః శమితుర్యన్నఖేషు సర్వా తా తే అపి దేవేష్వస్తు ॥ 39

(10) యదూవధ్యముదరస్యాపవాతి య[4] ఆమస్య క్రవిషో గన్ధో[5] అస్తి ।

సుకృతా తచ్ఛమితారః కృణ్వన్తూత మేధం శృతపాకం పచన్తు ॥ 40

(11) యత్ తే గాత్రాదగ్నినా పచ్యమానాదభి శూలం నిహతస్యావధావతి ।

మా తద్ భూమ్యామా శ్రిషన్మా తృణేషు దేవేభ్యస్తదుశద్భ్యో రాతమస్తు ॥ 41

---

1. మాశాఽఉప, 2. విప్రాఽఋషయో, 3. తా తేఽఅపి, 4. యఽఆమస్య, 5. గన్ధోఽఅస్తి, (వా.ప్ర.)

(12) యే వాజినం పరిపశ్యన్తి పక్వం య[1] ఈమాహుః సురభిర్నిర్హరేతి ।

యే చార్వతో మాంసభిక్షాముపాసత[2] ఉతో తేషామభిగూర్తిర్న[3] ఇన్వతు ॥ 42

(13) యన్నీక్షణం మాంస్పచన్యా[4] ఉఖాయా యా పాత్రాణి యూష్ణ[5] ఆసేచనాని ।

ఊష్మణ్యాపిధానా చరూణామంకాః సూనాః పరి భూషన్త్యశ్వమ్ ॥ 43

(14) నిక్రమణం నిషదనం వివర్తనం యచ్చ పడ్బీశమర్వతః ।

యచ్చ పపౌ యచ్చ ఘాసిం జఘాస సర్వా తా తే[6] అపి దేవేష్వస్తు ॥ 44

(15) మా త్వాగ్నిర్ధ్వనయీద్ధూమగన్ధిర్మోఖా భ్రాజన్త్యభి విక్త జఘ్రిః ।

ఇష్టం వీతమభిగూర్తం వషట్కృతం తం దేవాసః ప్రతి గృభ్ణన్త్యశ్వమ్ ॥ 45

(16) యదశ్వాయ వాస[7] ఉపస్తృణన్త్యధీవాసం యా హిరణ్యాన్యస్మై ।

సందానమర్వన్తం పడ్బీశం ప్రియా దేవేష్వా యామయన్తి ॥ 46

1. యేఽఈమాహుః, 2. ముపాసతఽఉత, 3. నఽఇన్వతు, 4. చన్యాఽఉఖాయా, 5. యూష్ణఽఆసేచనాని 6. తాతేఽఅపి 7. వాసఽఉప, (వా.ప్ర.)

(17) యత్ తే సాదే మహసా శూకృతస్య పార్ష్ణ్యా వా కశయా వా తుతోద ।
స్రుచేవ తా హవిషో[1] అధ్వరేషు సర్వా తా తే బ్రహ్మణా సూదయామి ॥ 47

(18) చతుస్త్రింశద్ వాజినో దేవబన్ధోర్వఙ్క్రీరశ్వస్య స్వధితిః సమేతి ।
అచ్ఛిద్రా గాత్రా వయునా కృణోత పరుష్పరురనుఘుష్యా వి శస్త ॥ 48

(19) ఏకస్త్వష్టురశ్వస్యా విశస్తా ద్వా యన్తారా భవతస్తథ[2] ఋతుః ।
యా తే గాత్రాణామృతుథా కృణోమి తాతా పిణ్డానాం ప్ర జుహోమ్యగ్నౌ ॥ 49

(20) మా త్వా తపత్ ప్రియ[3] ఆత్మాపియన్తం మా స్వధితిస్తన్వ౧ ఆ తిష్ఠిపత్ తే ।
మా తే గృధ్నురవిశస్తాతిహాయ ఛిద్రా గాత్రాణ్యసినా మిథూ కః ॥ 50

(21) న వా[4] ఉ ఏతన్మ్రియసే న రిష్యసి దేవాగ్ం[5] ఇదేషి పథిభిః సుగేభిః ।
హరీ తే యుఞ్జా పృషతీ[6] అభూతాముపాస్థాద్ వాజీ ధురి రాసభస్య ॥ 51

1. హవిషోఽఅధ్వరేషు, 2. తథఽఋతుః 3. ప్రియఽఆత్మా, 4. నవాఽఉ, 5. దేవాగ్ంఽఇదేషి 6. పృషతీఽఅభూ, (వా.ప్ర.)

(22) సుగవ్యం నో వాజీ స్వశ్వ్యం పుంసః పుత్రాగ్ం[1] ఉత విశ్వాపుషం రయిమ్ ।

అనాగాస్త్వం నో[2] అదితిః కృణోతు క్షత్రం నో[3] అశ్వో వనతాం హవిష్మాన్ ॥ 52

## సూక్తము—162

### ఋషి—దీర్ఘతముఁడు *

### దేవత—అశ్వము †

(1) క॥ అనయముఁ దిరుగుచు నుండెడి, ఘనములచేఁ గప్పి వానఁ గల్గించినచో
నిన చంద్రు లెచట నుండెద, రనఘ ఋషిప్రవరులార! యరులఁ [1]దునుముఁడీ!‡ ॥ 39

1. పుత్రాగ్ంఽఉత, 2. నోఽఅదితిః, 3. నోఽఅశ్వో (వ్రా.ప్ర.)

* ఋషివిశేష విషయములకై సంస్కృతమూలము 140 వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† ఆంధ్రానువాదములో (వ్రాతప్రతి 2వ సంపుటము-119వ పుట.) ప్రథమ మండలములోని 162వ సూక్తమునకు దేవతను బేర్కొనలేదు. అనువాద పద్యములలో నశ్వమే దేవతగా వ్రాయఁబడినది, వ్రాతప్రతి 15b సంపుటములో శ్రీ నేమానివారు 162వ సూక్తమునకు దేవతగా "అశ్వము" అని వ్రాసిరి. ఇక్కడ నశ్వమనఁగాఁ గాంతియని యర్థము చెప్పనగును. వ.గో.కృ.

1. యరులఁ జంపుఁడీ! (వ్రా.ప్ర.పా.) గణభంగము. వ.గో.కృ.

‡ సంస్కృతమూలములోని 161వ సూక్తమందలి 12వ ఋక్కును (503వ పుట) 162వ సూక్తమందలి 1వ ఋక్కును (506వ పుట) విస్పష్టముగా విభిన్నములుగా నున్నవి. కాని శ్రీ నేమానివారు మాత్ర మీ రెండు ఋక్కులకును నొకేవిధమైన భావముతో రెండుమూఁడు పదముల భిన్నత్వముతోఁ గందపద్యముగా ననువాదమొనర్చిరి. (చూ-506 పుట. 36వ పద్యము 511 పుట 39వ పద్యము) (వ్రాతప్రతి 2వ సంపుటము 117వ పుట 119వ పుట) శ్రీ నేమానివారు 162వ సూక్తమందలి తొలి ఋక్కున కనువాదముగా నిచ్చిన పద్యభావము సాయన భాష్యానుసారముగా నైనను లేదు. స్కందాది భాష్యముల ననుసరించినదియుఁగాదు. కావున విభిన్నములైన ద్వివిధఋక్కుల కనువాదముగా నవతరించిన యీ యేకైక పద్యరచన కాధారమేమియో చెప్పలేము. భిన్న రూపములోను భిన్నభావముతోను నున్న యీ 162వ సూక్తమందలి 1వ ఋక్కునకుఁ బ్రత్యేక దృక్పథముతోసరియైన భావముతో ననువాదములుగా మూఁడు కంద పద్యములు (512 పుట 40,41,42 పద్యములు) నేను విరచించితిని. వ.గో.కృ.

## అర్థాంతరము

(1) †క॥ సప్తాశ్వుని తేజమ్మును, దృప్తిమెయిన్ నుతి నొనర్ప, హేళనఁ జేయన్
మప్తులుగాఁ బూనవలదు. ఛీ ప్తవరుణ! ఋభువులార! కేల్మోడ్తు మిమున్ ॥ 40

†క॥ తుచ్ఛ నరాఘములెల్లరు, స్వచ్ఛము లౌ సల్లి మొయిల నారసి సూర్యున్
బ్రచ్ఛన్న భాషణములను, జిచ్ఛీయని దూషణములఁ జేయుదురెంతేన్ ॥ 41

†క॥ అహరభిమాని సుమిత్రుఁడు, సహరాత్ర్యభిమాని వర్షశక్తి వరుణుఁడున్
విహరింతురు మహిత గతిని, నహరహమును వాయు వాయువై వెలుఁగొందన్ ॥ 42

(2) గీ॥ ధర్మపూషాశ్వపుం బురోభాగమందు,మిగుల రంగులనొప్పిమే మే రుతంబు
పలుప ఋత్విజగణముచే నిలుపఁబడిన, యజము వహ్నీంద్రుల కగుత మర్పణంబు ॥ 43

(3,4,5) సీ॥ అగ్నిభాగార్హమై యమరాళి కింపగు నజము గుఱ్ఱము ముందు నమరియుండు
వగ్ని దీనినిగొని యమరాళికిం దగు నాహారమగునట్లు లందఁజేయు
హవ్యంబునకు యోగ్యమైనట్టి హయరాజ మగ్నిప్రదక్షిణ నమరియుండు
నగ్నిభాగంబైన నజము దేవాళికిఁ బ్రీత్యర్థమై ముందుఁబెట్టనొప్పుఁ
గీ॥ గాన నధ్వర్యుఁ డనువాఁడు గ్రావ గ్రాభ,[1]శంస్త మొదలగు ఋత్విజుల్ సాంగ యజ్ఞ
కర్మ నెరివేర్చి తద్యాగ కర్మఫలము,లంతటన్ [2]నిండఁ జేయుచు నమరఁగలరు ॥ 44

(6) ఉ॥ యూప మహీరుహంబు కడు యుక్తముగాఁ బడఁగొట్టు వార లా
యూపము దెచ్చువార లల యూపము సంస్కరణం బొనర్చు వా
రేపగు నశ్వభాగమును నింపుగఁ బాకముచేయఁ బాత్రలం
జూపెడువారు యాగముల శోభల నందుచు నుందురేకదా! ॥ 45

(7) గీ॥ హయము సురల కోర్కె కనుగుణంబగుఁగాత, మస్మదీప్సితంబు లమరుఁగాక!
నమరతృప్తికొఱకు నశ్వమేధంబుమ, జేయుచుంటి మిపుడు చింత లేక ॥ 46

(8) గీ॥ హయమునకుఁ గంఠపాదములందు శిరసు, నందుఁ గట్టిన త్రాళ్ళను నాస్యమందు
నిడిన తృణమును హయముతో నెసఁగమెసఁగ, యమరరాజ్యతలంబున నమరుఁగాక! ॥ 47

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

1. సంస్త (వ్రా.ప్ర పా.) 2. లంతటం నిండఁ జేయుచు నమరఁగలరు. (తొ.పా.) అంతటం జెదరఁ జేయుచునమరఁ గలరు. (శ్రీనేమానివారు సవరించిన పాఠము) ఇక్కడఁ "జెదరఁజేయు" శబ్దముకంటెఁ దొరిపాతమైన "నిండఁజేయు" శబ్దమే సార్థకము. మూలానుగుణము. .వ.గో.కృ.

(9,10) *సీ॥ మక్షికాదులు ప్రీతి మఱువక భక్షించు హయమాంసఖండంబు లవి యెవి యొకొ!
తైలమంటుచు నుండఁ దగు నాయుధమునకు నంటిన మాంసంబు లవి యెవి యొకొ!
పశువుఁ జంపెడువేళఁ బాచకకరమున కంటిన మాంసంబు లవి యెవి యొకొ!
పశువులఁ జంపెడి వేళఁ బాచక నఖమున కంటిన మాంసంబు లవి యెవి యొకొ!
గీ॥ యట్టి మాంసము లన్నియు హయముతోడ, నమరులను బొందకుండును నట్టివాని
నచ్ఛముగఁజేసి దేవాళి కాళవుట్ట, వండుదుఱుగాకఁ జక్కఁగ వహ్నిపైని॥ 48

9–10 ఋక్కుల కర్థాంతరము

(9) †గీ॥ ఎట్టి కాంతిపుంజము నేత్ర మిట్టెచేరి, దిక్తటములనుండి స్వరము తేజరిల్లు
నట్టి కాంతి ఖేచరము కాకెట్టి రీతి, దేవతల నుండు నట్టులే తేజరిలుత! ॥ 49

(10) †గీ॥ ఉదరగత మౌచు వధియింప నొప్పిద మగు,దుష్ట గంధయుతమునైన దుష్టశక్తిఁ
బూర్వ సుకృతాన మేఘాళి పూజ్యమైన, శ్రుతులు రక్షించు దుఃఖమ్ము నొరిదిఁ గూల్చు ॥ 50

(11) చ॥ హయవర మాంసభాగముల నచ్ఛపుఁబాత్రలఁ బెట్టి వండఁగా
రయమునఁ బొంగి వచ్చు రస రంజిత మాంసపదార్థలేశ మే
మయినఁ గుళింబునం దరణియందుఁ గనంబడకుండఁజేసి ని
ర్భయముగ దాని దేవతలు భక్షణఁజేసెదున ట్లొనర్పుఁడీ! ॥ 51

(12) చ॥ ఘనమగు మాంసభాగమును గాల్చుచు నుండెడివేళఁ గాంక్షతోఁ
గనుఁగొను వారు తద్గత సుగంధము నాశికఁబట్టి మాంసముం
దిన మనసున్నవార లతిదీనముగా నది భిక్షఁబెట్టుఁడం
చనయముఁ బల్కుదేవతల యాశలు పూర్తినిఁ జెందకుండునే! ॥ 52

* ప్రథమ మండలములోని 162 సూక్తములోఁగల 9-10-11-12-13 ఋక్కులకు నశ్వహింస పచనాది విషయములతోఁ గూడిన హింసాపూరితమైన అపవ్యాఖ్యానముల ననుసరించియే శ్రీ నేమానివా రీ యనువాదపద్యములు రచించిరి. ఈ యనువాదముల సందర్భముగా శ్రీ నేమానివా రెట్టి విమర్శను గతములోనొనర్చినట్లుగాఁ జేయలేదు. ఈ ఋక్కులకు నహింసా పరములగు నర్థములు గలవు. ఈ యహింసార్థదాయకములగు ననువాద పద్యములను నేను విరచించి యర్థాంతరముగ నిచ్చుచున్నాను. వాస్తవమునకు నీ సూక్తమందలి 14వ ఋగనువాద పద్యమే శ్రీ నేమానివారి 9-10-11-12-13 ఋగనువాద పద్యముల భావములను బరాస్తము కావించుచున్నట్లున్నది. వ.గో.కృ.

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ."

(13) సీ॥ పచనవేళలఁ బరిపక్వసాధనముగఁ గల్పింపఁబడు శుష్కకాష్టములును
నందఱుఁ దినుటకు నాత్రంబుతోనుండ వడ్డించుటకుఁ జేతవరలుతెడ్డు
లావిరిపోనీక యాపి యుండుటకయి పాత్రముపై మూయఁబడిన తట్ట
ఛేద్యావయవముల ఛేదించుటకు గుర్తుఁ జక్కఁగ వేసెడు సాధనములు
గీ॥ సూన ఖడ్గాదు లన్నియు శోభనాశ్వరాజము నలంకరించు విభ్రాజమాన
దేవతామధ్యమునఁ జాల దీప్తితోడ, వెల్గుచుండవె! యేవేళ వివిధగతుల ॥ 53

11,12,13, ఋక్కుల కర్థాంతరము

(11) †గీ॥ ఎట్టి యశరీర గతమైన బిట్టు నగ్ని, అవితథమ్ము నవిచలిత మ్మగుచు శూల
జాలముఁ దృణమ్ముల పగిది సంహరించి, దివ్యదేవాళి తృప్తిని దేజరిలుత! ॥ 54

(12) †గీ॥ ఎవ్వ రీశుని దర్శించి యెన్నరాని, కాంతిపుంజము నడిపించి క్రాలుచుందు
రట్టి దేవతల్ చంద్రు నయాచితగతిఁ, దుష్టి నొందెడుఁ గాకఁ దా మిష్టపూర్తి ॥ 55

(13) †గీ॥ చూడఁదగినట్టి చంద్రుని జూచుటకును, నోచుకొనని పాపాత్ము లానేచనగతిఁ
బ్రణవ ముచ్చరించుచును దత్ప్రకృతి నాద, శక్తి దేవాంకమున్ జేరి ముక్తి గనుత! ॥ 56

(14) ఉ॥ ఎచ్చటనిల్చునో![1] కిరణ మెచ్చటఁ బొర్లునో! సంతసంబుతో
నెచ్చట నే జలంబులను నేడ్తెరఁ ద్రావునో! తృప్తి దీరఁగా
నెచ్చటఁ గట్టుతో వెలయు నే తృణముం దిన వెల్గుచుండునో!
యచ్చముగా నవన్నియును నా[2] కిరణోత్తమమందు నుండెడున్ ॥ 57

(15,16) సీ॥ అశ్వమా! పొగఁగూడు నగ్ని ని న్నావేళ ధ్వనియింపఁజేయక తనరుఁగాక!
భ్రాజమానంబులౌ పచనపాత్రము లన్ని ఖండఖండములు గాకుండుఁగాక!
యజ్ఞహోమమునకు ననువగునట్టి నిన్ గ్రహియించి దేవాళి గ్రాలుఁగాక!
వరవషట్కృతములఁ బరఁగి దానార్హమౌ నిన్ను దేవస్తోమ మెన్నుఁగాక!
గీ॥ నిన్నుఁ గప్పిన వస్త్రము నిశ్చలముగ, నిన్నుఁగట్టిన త్రాళ్ళను నిర్జరులకుఁ
బ్రీతియోగ్యములై యుండి ఖ్యాతి వడసి, నట్టి యశ్వముతోఁగూడి యమరుఁగాక! ॥ 58

1. "హయమదెచ్చట." అని శ్రీ నేమానివారి యనువాదము. అశ్వశబ్దము కాంతి వాచకముగా నీ నవరణ జరిగినది. వ.గో.కృ. 2. తొలిపాదములో వలెనే "హయరాజము" అని శ్రీ నేమానివారు వ్రాయఁగాఁ గిరణార్థమున కనుగుణముగా సవరింపఁ బడినది. కాఁగాఁ గాంత్యర్థకమైన "అశ్వ" శబ్దము సార్థకము—వ.గో.కృ.

† రచయిత:-వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

(17) మ॥ బల శూత్కార మొనర్చుచుం బరువుతోఁ బారంగ నిన్నాత్రతో
బలిమిం బార్ష్ణ్య కశాదిసాధనములం బార్శ్వంబులం గొట్ట నా
వలనం గల్గిన బాధ[1]లెల్లఁ బృథుహవ్యం బంత సద్దర్వితో
వలె నగ్నిఁ జన కచ్చమంత్రములతోఁ బాపంగ నౌ నెంతయున్ ॥ 59

(18) చ॥ అనఘహయంబు పార్శ్వములయందలి ముప్పదినాలు గస్థులం
గనుఁగొని గంద్రగొడ్డలిని గట్టిగఁగొట్టుచు నున్నవారు పా
వనమగు గాత్ర మెల్లెడల వావిరి రంధ్రము లుండకుండ నీ
కనువగునట్లు భిన్నముగ నంగములన్ సరిఁగొట్టు మారకా! ॥ 60

(19) చ॥ హయము వధింపఁ గాలమయుఁడైన నరుండొకడుండుఁ జెంత నా
హయము చలింపకుండఁ గడు నాపుటకై దినరాత్రి రూపులౌ
నియమితమర్త్యు లిద్ద అతినిశ్చలభావముతోడ నుండి యా
హయమును ఖండముల్ సలిపి యగ్నికి నాహుతిగా నొసంగరే! ॥ 61

(20) గీ॥ అమరత్వప్రాప్తికొఱకు నరిఁగెడు నీ దేహ, మార్తి నొందకుండ నమరుఁగాక!
నసి విశేషకాల మవయవములలోన, నుండకుండుఁగాక నో హయంబ! ॥ 62

గీ॥ మాంసఖండములను మఱి మఱి కోరెడు, ఛేదకుండు వాజి చెలువ మైన
తనువు లన్ని హెచ్చు తక్కువల్ గాకుండ, ఖండములుగఁ జేయుఁగాక నసిని ॥ 63

18, 19, 20 ఋక్కుల కర్థాంతరము

(18) *క॥ అరువదియెన్మిది వాక్కులు, పొరి నిరు ప్రక్కలఁ జరింప భూతము లెల్లన్
సరిలేని కాంతి తతులన్, బరాపరమయి వెలిఁగెడుఁ బ్రభాసుర జగతిన్ ॥ 64

(19) *క॥ ఒక త్వష్ట వొక్కకాంతిని, బ్రకటిత ఋతుపుంజములను బరిరక్షించున్
వికటమ్ము కాని దేహులు, సకల మపిండముగతిగఁ బ్రశాంతత నిలుచున్ ॥ 65

(20) *గీ॥ చందమామ వెల్గు చల్లని కాంతితోఁ, బందకానిరీతిఁ బ్రబలునెద్ది
సూర్యతేజ మొప్ప నుష్ణ వెలుఁగునద్ది, యెల్ల ఛిద్రములను డుల్లఁజేసి ॥ 66

1. వలనం గల్గిన బాధలన్నియు మహా హవ్యంబు సద్దర్వితో (వ్రా.ప్ర,పా.) యతిభంగము. వ.గో.కృ.

* రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

(21) చ॥ మరణము లేదు నీకు మఱి మారణఁ జేసెడువారు లేరు నీ
వరమరలేక దేవతల యంతిక మొందుచు నుంటి వౌర ని
న్నరదము లశ్వి దేవతల యశ్వము లింద్రుని యశ్వరాజముల్
ఖిర ఖిర దేవలోకమునఁ బెట్టుచు నుండెడు నశ్వరాజమా! ॥ 67

(22) గీ॥ సర్వ పోషక సంపద సకల తురగ,గో సమృద్ధియు నీ వాజి కూర్చు మాకుఁ
బాప రాహిత్యముం జేసి బలము నిచ్చి, పాయకయె పుత్రులం గల్గఁజేయుఁగాక! ॥ 68

## సూక్తమ్—163

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—అశ్వః

ఛందః—త్రిష్టుప్

(1) యదక్రన్దః ప్రథమం జాయమాన[1] ఉద్యన్ త్సముద్రాదుత వా పురీషాత్ ।
శ్యేనస్య పక్షా హరిణస్య బాహూ[2] ఉపస్తుత్యం మహి జాతం తే[3] అర్వన్ ॥ 53

(2) యమేన దత్తం త్రిత[4] ఏనమాయునగిన్ద్ర ఏణం ప్రథమో అధ్యతిష్ఠత్ ।
గన్ధర్వో[5] అస్య రశనామగృభ్ణాత్ సూరాదశ్వం వసవో నిరతష్ట ॥ 54

(3) అసి యమో[6] అస్యాదిత్యో అర్వన్నసి త్రితో గుహ్యేన వ్రతేన ।
అసి సోమేన సమయా విపృక్త[7] ఆహుస్తే త్రీణి దివి బన్ధనాని ॥ 55

* ఋషి విశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు 434 నుండి 4
వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. మానఽఉద్యన్, 2. బాహూఽఉపస్తు, 3. తేఽఅర్వన్, 4. త్రితఽఏన,... దగిన్ద్రఽ ఏణం ప్రథమోఽఅధ్య, 5. గన్ధర్వోఽఅ

6. యమోఽఅస్యాదిత్యోఽఅర్వ, 7. విపృక్తఽఆహుస్తే, (వ్రా.ప్ర.)

(4) త్రీణి త[1] ఆహుర్దివి బన్ధనాని త్రీణ్యప్సు త్రీణ్యన్తః సముద్రే ।
ఉతేవ మే వరుణశ్ఛన్త్స్యర్వన్ యత్రా త[1] ఆహుః పరమం జనిత్రమ్ ॥ 56

(5) ఇమా తే వాజిన్నవమార్జనానీమా శఫానాం సనితుర్నిధానా ।
అత్రా తే భద్రా రశనా[2] అపశ్యమృతస్య యా[3] అభిరక్షన్తి గోపాః ॥ 57

(6) ఆత్మానం తే మనసారాదజానామవో దివా పతయన్తం పతఙ్గమ్ ।
శిరో[4] అపశ్యం పథిభిః సుగేభిరరేణుభిర్జేహమానం పతత్రి ॥ 58

(7) అత్రా తే రూపముత్తమమపశ్యం జిగీషమాణమిష[5] ఆ పదే గోః ।
యదా తే మర్తో[6] అను భోగమానళాదిద్ గ్రసిష్ఠ[7] ఓషధీరజీగః ॥ 59

(8) అను త్వా [8]రథో అను మర్యో అర్వన్ను గావోऽను భగః కనీనామ్ ।
అను వ్రాతాసస్తవ సఖ్యమీయురను దేవా మమిరే వీర్యం తే ॥ 60

1. తఽఆహుర్, 2. రశనాఽఅపశ్య 3. యాఽఅభి, 4. శిరోఽఅపశ్యం, 5, మిషఽఆ, 6. మర్తోఽఅను, 7. గ్రసిష్ఠఽఓషధీ,
8, రథోఽఅనుమర్యోఽఅర్వ, (వా.ప్ర,)

(9) హిరణ్యశృఙ్గోఽయో[1] అస్య పాదా మ[2]నోజవా అవర ఇన్ద్ర ఆసీత్ ।

దేవా[3] ఇదస్య హవిరద్యమాయన్ యో[4] అర్వన్తం ప్రథమో అధ్యతిష్ఠత్ ॥ 61

(10) ఈర్మాన్తాసః సిలికమధ్యమాసః సం శూరణాసో దివ్యాసో[5] అత్యాః ।

హంసా[6] ఇవ శ్రేణిశో యతన్తే యదాక్షిషుర్దివ్యమజ్మమశ్వాః ॥ 62

(11) తవ శరీరం పతయిష్ణ్వర్వన్ తవ చిత్తం వాత[7] ఇవ ధ్రజీమాన్ ।

తవ శృఙ్గాణి విష్ఠితా పురుత్రారణ్యేషు జర్భురాణా చరన్తి ॥ 63

(12) ఉప ప్రాగాచ్ఛసనం వాజ్యర్వా దేవద్రీచా మనసా దీధ్యానః ।

అజః పురో నీయతే నాభిరస్యాను పశ్చాత్ కవయో యన్తి రేభాః ॥ 64

(13) ఉప ప్రాగాత్ పరమం యత్ సధస్థమర్వాగ్ం[8] అచ్ఛా పితరం మాతరం చ ।

అద్యా దేవాఞ్జుష్టతమో హి గమ్యా[9] అథా శాస్తే దాశుషే వార్యాణి ॥ 65

1. యోఽఅస్య, 2. మనోజవాఽఽఽవేరఽఇన్ద్రఽఆసీత్, 3. దేవాఽఇదస్య, 4. యోఽఅర్వన్తం ప్రథమోఽఅధ్య, 5. దివ్యాసోఽఅత్యాః, 6. హంసాఽఇవ, 7. వాతఽఇవ, 8. వాగ్ంఽఅచ్ఛ, 9. గమ్యాఽఅథ, (వా.ప్ర.)

## సూ_క్తము—163

### ఋషి—దీర్ఘతముఁడు *

### †దేవత—అశ్వము

(1) చ॥ జలమున నుండియున్ మఱియుఁ, జారు నభస్థలినుండి యశ్వమా!
యెలమిని నీవు పుట్టునపు డిట్టి భుజంబులఁ బోలు బాహువుల్
వెలసెడు దేగపార్శ్వముల వేయి విధంబులఁ బోలు పక్షముల్
కలిఁగి వెలుంగు చుంటివిగఁ గావున నీవు ఘనుండవే కదా! ॥ 69

(2) క॥ యముఁ డిచ్చిన ఘనహయముం, దమకమునం ద్రితుఁడు పూన్చెఁ దనరథమున కా
యమరపతి దాని నెక్కెను, నమరఁగ నదిపుట్టె వసువు లందఱివలనన్ ॥ 70

(3) క॥ నీవే! యగ్నివి గాలివి, నీవే! శశితోడఁగూడ నిలచితివి తగన్
నీవే! సూర్యుఁడ వౌదువు, నీవే! కారణము దివికి నిర్జర హయమా! ॥ 71

(4) క॥ దివియును భువియును వెండియుఁ, బవనుఁడు చరియించు విష్ణుపదమున్ నీ స
ద్భవకారణములు మూఁ డో,సవనాశ్వమ! గల వటంచుఁజాటుదురు బుధుల్॥ 72

గీ॥ అట్టి పూర్వోక్త తలములయందు నీకు, జన్మహేతువు గలదని సరస వరుణ
సదృశ రూపుఁడ వగు నీవు చాలఁ బ్రీతి,తోడ చెప్పుచు నున్నావు తురగరాజ! ॥ 73

(5) ఉ॥ యాగ సుసాధకంబయిన యశ్వము పగ్గము వాజి దేహముం
బాగుగఁ జేయు మార్జనము బాడబ మల్లనఁబోవు మార్గముల్
యాగ సమిద్ధ భూములును యజ్ఞమునందలి వస్తుసంపదల్
వేగము చూడఁగల్గితిని వేయి విధంబుల సంతసంబుతోన్ ॥ 74

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† యజ్ఞాశ్వమనఁగ నీటిలో సంచరించు సూర్యుఁడని కొందఱు భాష్యకారుల యభిప్రాయము. (నే.వేం.న.శా.)
గమనిక :—ఈ 163వ సూక్తమునకు "దేవత"ను వ్రాయకుండగనే "అశ్వస్తుతి" యని శ్రీనేమానివారు వ్రాతప్రతిలో (2వ సంపుటము 125వ పుట) వ్రాసి పైనున్న పుట్‌నోటును (ఎడమ ప్రక్కనున్న 124వ పుటలో) వ్రాసిరి. యజ్ఞాశ్వ మనఁగా "సూర్యుఁ" డని యర్థము చెప్పుచో నీ యశ్వహత్యలు మాంసపచనాదుల వర్ణనలతోఁ గూడిన పద్యానువాదములు 162 వ సూక్తమున శ్రీ నేమానివారెందువల్ల వ్రాసిరో తెలియదు. దీనివల్ల మౌలికముగ స్వవచన వ్యాఘాతము లేకుండ ఋక్కులను బరిశీలించు బుద్ధికుశలత యుండనగునని స్పష్టమగును, వ.గో.కృ.

(6,7,8) సీ॥ అశ్వమా! నీవల యమరలోకమునకుఁ బోవుచుండుట నేను బొగడుచుంటి
నీ శిరోరత్నంబు నిర్జరస్థలికయి వెడలుచుండుట నేను వేడ్కఁగంటి
యాగదేశంబందు నాహారముం గోరి వచ్చు నీ రూపంబుఁ మెచ్చుచుంటి
దవ్వనకుం దెచ్చు తగిన యాహారంబుఁ గాంక్షతో దినుటయుఁ గనుచునుంటి
గీ॥ హయమ! నీదైన మార్గంబు ననుసరించి, రథములును గో మనుష్యులు రాజమాన
కామినీ మణి సౌందర్య గరిమ లితర, దేవతలు పోవుచుండిరి తివిరి ప్రీతి ॥ 75

(9) ఉ॥ ఉన్నతకంఠభాగమున నుండినజూలు సువర్ణ రూపమై
నెన్నఁబడుంగదా! పదము [1]లిన్నవియై వెలుఁగొందుచుండు నీ
వన్ని విధంబులన్ హరిని నంచితవేగమునన్ జయించి నా
వన్న! యహంబ! ని న్నమరు లందఱుఁ బొందుచు నుందురేకదా! ॥ 76

(10) గీ॥ బలము గల్గు పృష్ఠభాగముల్ మధ్యమ, భాగములను గల్గి పరమ ధీర
భావములను నొప్పు భానుని హయములు, హంస పంక్తిఁబోలి యరుగుచుండు ॥ 77

(11) గీ॥ శీఘ్రగమన సమర్థమై, చెలఁగుఁదనువు, మానసము వాయువేగ సమాన మగును
నీ శిరస్సునఁ గల జూలు నిఖిలదిశల, నతిమనోహర మగునట్టు లధిగమించు ॥ 78

(12) చ॥ దివుజుల కెల్ల నత్యముగఁ దృప్తిని జేయఁగ నెంచి వాజి స
త్పవనతలంబుఁ జేరుటకు సాఁగుచు నున్నది దాని ముందు నా
సవననిమిత్తమై వలయు చాగము పోవుచు నుండె ఋత్విజుల్
వివిధములైన గానముల పేర్మిని దానిని నంటి పోయెడున్ ॥ 79

(13) చ॥ ఘన మగు నాకలోకమును గాంచుటకుం బితృమాతృరీతిగా
జననము గొన్న రోదసిని శాశ్వతమౌనటు చేరుచుంటివో!
యనఘహయంబ ! నీపదము హవ్య మొసంగెదు వాఁడుకూడ స
న్మనమునఁ బొందుఁగాక! నని మానవులెల్లరుఁ గోరకుందురే! ॥ 80

1. ఇన్నవి = ఇనుపవి.

# సూక్తమ్—164

ఋషిః—దీర్ఘతమా ఔచథ్యః *

దేవతా—1-41 విశ్వేదేవాః: 42-ఆద్యర్ధర్చస్యవాక్, ద్వితీయస్య ఆపః;
43-ఆద్యర్ధర్చస్య శకధూమః, ద్వితీయస్య సోమః; 44-కేశినః (అగ్నిః సూర్యో వాయుశ్చ)
45-వాక్; 46-47 సూర్యః; 48-సంవత్సరకాల చక్రమ్; 49-సరస్వతీ; 50-సాధ్యాః;
51-సూర్యః, పర్జన్యాగ్నయో వా, 52- సరస్వాన్, సూర్యో వా
ఛందః—త్రిష్టుప్; 12,15,23,29,36,41—జగతీ; 42—ప్రస్తారపంక్తిః, 51—అనుష్టుప్.

(1) అస్య వామస్య పలితస్య హోతుస్తస్య భ్రాతా మధ్యమో[1] అస్త్యశ్నః ।
తృతీయో భ్రాతా ఘృతపృష్ఠో[2] అస్యాత్రాపశ్యం విశ్పతిం సప్తపుత్రమ్ ॥ 66

(2) సప్త యుఞ్జన్తి రథమేకచక్రమేకో[3] అశ్వో వహతి సప్తనామా ।
త్రినాభి చక్రమజరమనర్వం యత్రేమా విశ్వా భువనాధి తస్థుః ॥ 67

(3) ఇమం రథమధి యే సప్త తస్థుః సప్తచక్రం సప్త వహన్త్యశ్వాః
సప్త స్వసారో[4] అభి సం నవన్తే యత్ర గవాం నిహితా సప్త నామ ॥ 68

* ఋషి విశేష విషయములకై సంస్కృతమూలము 140 సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁ గల పుటలు చూడనగును. వ.గో.కృ.

1. మధ్యమోఽఅస్త్య, 2. పృష్ఠోఽఅస్యా, 3. మేకోఽఅశ్వో, 4. స్వసారోఽఅభి, (వ్రా.ప్ర.)

(4) కో దదర్శ ప్రథమం జాయమానమస్థన్వన్తం యదనస్థా బిభర్తి ।

భూమ్యా[1] అసురసృగాత్మా క్వ స్విత్ కో విద్వాంసముప గాత్ ప్రష్టుమేతత్ ॥ 69

(5) పాకః పృచ్ఛామి మనసావిజానన్ దేవానామేనా నిహితా పదాని ।

వత్సే బష్కయేఽధి సప్త తన్తూన్ వి తత్నిరే కవయ[2] ఓతవా ఉ ॥ 70

(6) అచికిత్వాఞ్చికితుషశ్చిదత్ర కవీన్ పృచ్ఛామి విద్మనే న విద్వాన్ ।

వి యస్తస్తమ్భ షళిమా రజాంస్యజస్య రూపే కిమపి స్విదేకమ్ ॥ 71

(7) ఇహ బ్రవీతు [3]య ఈమఙ్గ వేదాస్య వామస్య నిహితం పదం వేః ।

శీర్ష్ణః క్షీరం దుహ్రతే గావో[4] అస్య వవ్రిం వసానా[5] ఉదకం పదాపుః ॥ 72

(8) మాతా పితరమృత[6] ఆ బభాజ ధీత్యగ్రే మనసా సం హి జగ్మే ।

సా బీభత్సుర్గర్భరసా నివిద్ధా నమస్వన్త[7] ఇదుపవాకమీయుః ॥ 3

1. భూమ్యాఽసుర, 2. కవయఽఓతవా, 3. యఽఈమ, 4. గావోఽఅస్య, 5. వసానాఽఉదకం, 6. పితరమృతఽఆ,

7. నమస్వన్తఽ ఇదు (వా.ప్ర.)

(9) యుక్తా మాతాసీద్ ధురి దక్షిణాయా[1] అతిష్ఠద్ గర్భో వృజనీష్వన్తః ।

అమీమేద్ వత్సో[2] అను గామపశ్యద్ విశ్వరూప్యం త్రిషు యోజనేషు ॥ 74

(10) తిస్రో మాతౄస్త్రీన్ పితౄన్ బిభ్రదేక[3] ఊర్ధ్వస్తస్థౌ నేమవ గ్లాపయన్తి ।

మన్త్రయన్తే దివో[4] అముష్య పృష్ఠే విశ్వవిదం వాచమవిశ్వమిన్వామ్ ॥ 75

(11) ద్వాదశారం నహి తజ్జరాయ వర్వర్తి చక్రం పరి ద్యామృతస్య ।

ఆ పుత్రా[5] అగ్నే మిథునాసో[6] అత్ర సప్త శతాని వింశతిశ్చ తస్థుః ॥ 76

(12) పఞ్చపాదం పితరం ద్వాదశాకృతిం దివ[7] ఆహుః పరే[8] అర్ధే పురీషిణమ్ ।

అథేమే[9] అన్య ఉపరే విచక్షణం సప్తచక్రే షళర[10] ఆహురర్పితమ్ ॥ 77

(13) పఞ్చారే చక్రే పరివర్తమానే తస్మిన్నా తస్థుర్భువనాని విశ్వా ।

తస్య నాక్షస్తప్యతే భూరిభారః సనాదేవ న శీర్యతే సనాభిః ॥ 78

1. దక్షిణాయాఽఅతిష్ఠద్, 2. వత్సోఽఅను. 3. బిభ్రదేకఽఊర్ధ్వ, 4. దివోఽఅముష్య, 5. పుత్రాఽఅగ్నే, 6. మిథునాసోఽఅత్ర 7. దివఽఆహుః, 8. పరేఽఅర్ధే 9. మేఽఅన్యఽఉపరే, 10. షళరఽఆహు. (ప్రా.ప్ర,)

(14) సనేమి చక్రమజరం వి వావృత[1] ఉత్తానాయాం దశ యుక్తా వహన్తి ।

సూర్యస్య చక్షూ రజసైత్యావృతం తస్మిన్నార్పితా భువనాని విశ్వా ॥ 79

(15) సాకంజానాం సప్తథమాహురేకజం షళిద్ యమా[2] ఋషయో దేవజా[3] ఇతి ।

తేషామిష్టాని విహితాని ధామశః స్థాత్రే రేజన్తే వికృతాని రూపశః ॥ 80

(16) స్త్రియః సతీస్తాగ్ం[4] ఉ మే పుంస[5] ఆహుః పశ్యదక్షణ్వాన్న వి చేతదన్ధః ।

కవిర్యః పుత్రః స ఈమా చికేత యస్తా విజానాత్ స పితుష్పితాసత్ ॥ 81

(17) అవః పరేణ పర[6] ఏనావరేణ పదా వత్సం బిభ్రతీ గౌరుదస్థాత్ ।

సా కద్రీచీ కం స్విదర్ధం పరాగాత్ క్వ స్విత్ సూతే నహి యూథే[7] అన్తః ॥ 82

(18) అవః పరేణ పితరం యో[8] అస్యానువేద పర[6] ఏనావరేణ ।

కవీయమానః క[9] ఇహ ప్ర వోచద్ దేవం మనః కుతో[10] అధి ప్రజాతమ్ ॥ 83

1. వావృతఽఉత్తా, 2. యమాఽఋష, 3. జాఽఇతి, 4. తాగ్ంఽఉ, 5. పుంసఽఆహుః, 6. పరఽఏనా, 7. యూథేఽఅన్త, 8. యోఽఅస్య, 9. కఽఇహ 10. కుతోఽఅధి, (బ్రా,బ్ర.)

(19) యే[1] అర్వాఞ్చస్తాగ్ం ఉ పరాచ ఆహుర్యే పరాఞ్చస్తాగ్ం[2] ఉ అర్వాచ ఆహుః ।

ఇన్ద్రశ్చ యా చక్రథుః సోమ తాని ధురా న యుక్తా రజసో వహన్తి ॥ 34

(20) ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరి షస్వజాతే ।

తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో[3] అభి చాకశీతి ॥ 35

(21) యత్రా సుపర్ణా[4] అమృతస్య భాగమనిమేషం విదథాభిస్వరన్తి ।

ఇనో విశ్వస్య భువనస్య గోపాః స మా ధీరః పాకమత్రా వివేశ ॥ 36

(22) యస్మిన్ వృక్షే మధ్వదః సుపర్ణా నివిశన్తే సువతే చాధి విశ్వే ।

తస్యేదాహుః పిప్పలం స్వాద్వగ్రే తన్నోన్నశద్యః పితరం న వేద ॥ 37

(23) యద్ గాయత్రే[5] అధి గాయత్రమాహితం త్రైష్టుభాద్ వా త్రైష్టుభం నిరతక్షత ।

యద్ వా జగజ్జగత్యాహితం పదం య[6] ఇత్ తద్ విదుస్తే[7] అమృతత్వమానశుః ॥ 38

1. యేఽఅర్వాఞ్చస్తాగ్ంఽఉఽపరాచ్యఆహు. 2. తాగ్ంఽఉఽఅర్వాచ. 3. న్నన్యోఽఅభి, 4. సుపర్ణాఽఅమృత, 5. గాయత్రేఽఅధి. 6. యఽఇత్, 7. స్తేఽఅమృ. (వా.ప్ర.)

(24) గాయత్రేణ ప్రతి మిమీతే[1] అర్కమర్కేణ సామ త్రైష్టుభేన వాకమ్ ।

వాకేన వాకం ద్విపదా చతుష్పదాఽక్షరేణ మిమతే సప్త వాణీః ॥ 89

(25) జగతా సిన్ధుం దివ్యస్తభాయద్ రథంతరే సూర్యం పర్యపశ్యత్ ।

గాయత్రస్య సమిధస్తిస్ర[2] ఆహుస్తతో మహ్నా ప్ర రిరిచే మహిత్వా ॥ 90

(26) ఉప హ్వయే సుదుఘాం ధేనుమేతాం సుహస్తో గోధుగుత దోహదేనామ్ ।

శ్రేష్ఠం సవం సవితా సావిషన్నోఽభీద్ధో ఘర్మస్తదు షు ప్ర వోచమ్ ॥ 91

(27) హింకృణ్వతీ వసుపత్నీ వసూనాం వత్సమిచ్ఛన్తీ మనసాభ్యాగాత్ ।

దుహామశ్విభ్యాం పయో[3] అఘ్న్యేయం సా వర్ధతాం మహతే సౌభగాయ ॥ 92

(28) గౌరమీమేదను వత్సం మిషన్తం మూర్ధానం హిఙ్ఙకృణోన్మాతవా[4] ఉ ।

సృక్వాణం ఘర్మమభి వావశానా మిమాతి మాయుం [5]పయతే పయోభిః ॥ 93

1. మిమీతేఽఅర్కం. 2. తిస్రఽఆహుః. 3. పయోఽఅఘ్న్యా. 4. వాఽఉ. 5. పయతే. (ద్రా.ప్ర.)

(29) అయం స శింక్తే యేన గౌరభీవృతా మిమాతి మాయుం ధ్వసనావధి శ్రితా ।

సా చిత్తిభిర్ని హి చకార మర్త్యం విద్యుద్ భవన్తీ ప్రతి వవ్రిమౌహత ॥ 94

(30) అనచ్ఛయే తురగాతు జీవమేజద్ ధ్రువం మధ్య[1] ఆ పస్త్యానామ్ ।

జీవో మృతస్య చరతి స్వధా[2]భిరమర్త్యో మర్త్యేనా సయోనిః ॥ 95

(31) అపశ్యం గోపామని పద్యమానమా చ పరా చ పథిభిశ్చరన్తమ్ ।

స సధ్రీచీః స విషూచీర్వసాన[3] ఆ వరీవర్తి భువనేష్వన్తః ॥ 96

(32) య[4] ఈం చకార న సో[5] అస్య వేద[6] య ఈం దదర్శ హిరుగిన్ను తస్మాత్ ।

స మాతుర్యోనా పరివీతో[7] అన్తర్బహుప్రజా నిరృతిమా వివేశ ॥ 97

(33) ద్యౌర్మే పితా జనితా నాభిరత్ర బన్ధుర్మే మాతా పృథివీ మహీయమ్ ।

ఉత్తానయోశ్చమ్వోఽర్యోనిరన్తరత్రా పితా దుహితుర్గర్భమాధాత్ ॥ 98

---

1. మధ్యఽఆప. 2. స్వధాభిశ్మర్త్యో. 3. నఽఆ. 4. యఽఈం. 5. న సోఽఅస్య. 6. వేదఽయ. 7. వీతోఽఅన్త. (వ్రా.ప్ర.)

(34) పృచ్ఛామి త్వాపరమన్తం పృథివ్యాః పృచ్ఛామి యత్ర భువనస్య నాభిః।

పృచ్ఛామి త్వా వృష్ణో[1] అశ్వస్య రేతః పృచ్ఛామి వాచః పరమం వ్యోమ ॥ 99

(35) ఇయం వేదిః పరో[2] అన్తః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః।

అయం సోమో వృష్ణో[1] అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ ॥ 100

(36) సప్తార్ధగర్భా భువనస్య రేతో విష్ణోస్తిష్ఠన్తి ప్రదిశా విధర్మణి।

తే ధీతిభిర్మనసా తే విపశ్చితః పరిభువః పరి భవన్తి విశ్వతః ॥ 101

(37) న వి జానామి యదివేదమస్మి నిణ్యః సంనద్ధో మనసా చరామి।

యదా మాగన్ ప్రథమజా[3] ఋతస్యాదిద్ వాచో[4] అశ్నువే భాగమస్యాః ॥ 102

(38) అపాఙ్ ప్రాఙేతి స్వధయా గృభీతో ఽమర్త్యో మర్త్యేనా సయోనిః।

తా శశ్వన్తా విషూచీనా వియన్తా న్యన్యం చిక్యుర్న ని చిక్యురన్యమ్ ॥ 103

1. వృష్ణోఽఅశ్వస్య, 2. పరోఽఅన్త పృథివ్యాఽఅయం, 3. ప్రథమజాఽఋత. 4 వాచోఽఅశ్నువే, (వ్రా.ప్ర.)

(39) ఋచో[1] అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా[2] అధి విశ్వే నిషేదుః ।

యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్ తద్ విదుస్త[3] ఇమే సమాసతే ॥ 104

(40) సూయవసాద్ భగవతీ హి భూయా[4] అథో వయం భగవన్తః స్యామ ।

అద్ధి తృణమఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధముదకమాచరన్తీ ॥ 105

(41) గౌరీర్మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సా చతుష్పదీ ।

అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥ 106

(42) తస్యాః సముద్రా[5] అధి వి క్షరన్తి తేన జీవన్తి ప్రదిశశ్చతస్రః ।

తతః క్షరత్యక్షరం తద్ విశ్వముప జీవతి ॥ 107

(43) శకమయం ధూమమారాదపశ్యం విషూవతా పర[6] ఏనావరేణ ।

ఉక్షాణం పృశ్నిమపచన్త వీరాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ॥ 108

1. ఋచోఽక్షరే, 2. దేవాఽఅధి, 3. విదుస్తఽఇమే, 4. భూయాఽఅథో, 5. సముద్రాఽఅధి, 6. పరఽఏనా, (వా.ప్ర.)

(44) త్రయః కేశిన[1] ఋతుథా వి చక్షతే సంవత్సరే వపత[2] ఏక ఏషామ్ ।

విశ్వమేకో[3] అభి చష్టే శచీభిర్ధ్రాజిరేకస్య దదృశే న రూపమ్ ॥ 109

(45) చత్వారి వాక్ పరిమితా పదాని తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।

గుహా త్రీణి నిహితా నేఙ్గయన్తి తురీయం వాచో మనుష్యా వదన్తి ॥ 110

(46) ఇన్ద్రం మిత్రం వరుణమగ్నిమాహురథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్ ।

ఏకం సద్ విప్రా బహుధా వదన్త్యగ్నిం యమం మాతరిశ్వానమాహుః ॥ 111

(47) కృష్ణం నియానం హరయః సుపర్ణా[4] అపో వసానా దివముత్పతన్తి ।

త[5] ఆవవృత్రన్ త్సదనాదృతస్యాదిద్ ఘృతేన పృథివీ వ్యుద్యతే ॥ 112

(48) ద్వాదశ ప్రధయశ్చక్రమేకం త్రీణి నభ్యాని క[6] ఉ తచ్చికేత ।

తస్మిన్ త్సాకం త్రిశతా న శఙ్కవో ఽర్పితాః షష్టిర్న చలాచలాసః ॥ 113

1. కేశినఽఋతుథా, 2. వపతఽఏక. 3. మేకోఽఅభి, 4. సువర్ణాఽఅపో, 5. తఽఆవ. 6. కఽఉ. (వా.ప.)

(49) యస్తే స్తనః శశయో యో మయోభూర్యేన విశ్వా పుష్యసి వార్యాణి ।

యో రత్నధా వసువిద్ యః సుదత్రః సరస్వతి తమిహ ధాతవే కః ॥ 114

(50) యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।

తే హ నాకం మహిమానః సచన్త యత్ర పూర్వే సాధ్యాః సన్తి దేవాః ॥ 115

(51) సమానమేతదుదకముచ్చైత్యవ చాహభిః ।

భూమిం పర్జన్యా జిన్వన్తి దివం జిన్వన్త్యగ్నయః ॥ 116

(52) దివ్యం సుపర్ణం వాయసం బృహన్తమపాం గర్భం దర్శతమోషధీనామ్ ।

అభీపతో వృష్టిభిస్తర్పయన్తం సరస్వన్తమవసే జోహవీమి ॥ 117

## సూక్తము—164

### ఋషి—దీర్ఘతముఁడు*

దేవతలు—విశ్వేదేవతలు. సరస్వతి. ఉదకములు. శకధూముఁడు సోముఁడు, సూర్యవాయువులు. సరస్వతి, సూర్యుఁడు, సంవత్సరాత్మకమగుకాలము, సరస్వతి, సాధ్యులు. సూర్యుఁడు క్రమముగాఁదెలియవలయును.

(1) గీ॥† సర్వ రక్షకుండు సప్త¹పుత్రకుఁడైన, సూర్యు నిపుడు నేను జూచుచుంటి
భానుమూర్తి కమలవాయుప సోదరుం, డైనయట్టు లగ్ని యగునుగాదె! ॥ 81

(2) ఋ॥ సప్త యుంజంతి రథమేకచక్రమేకో అశ్వోవహతి సప్తనామా ।

త్రినాభి చక్రమజరమనర్వం యత్రేమా విశ్వా భువనాధి తస్థుః ॥ (67ఋక్కు—521 పుట)

---

* ఋషివిశేష విషయములకై సంస్కృత మూలము 140వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు 434 నుండి 439 వరకుఁగల పుటలు చూడనగును. వ.గో.కృ.

† ప్రపంచకర్తయగు విశ్వతి యను పరమేశ్వరునకు సృష్టి స్థితి లయ కారణభూతులగు సూర్యాగ్ని వాయువులు ముప్పురు పుత్రులని భావము. పరమేశ్వరుఁడు సృష్టి స్థితి లయ కారణుఁడై త్రిమూర్తి స్వరూపములు నేకాకారుఁడగు పరమేశ్వరునియందు లీనమై యుండుటను ఆత్మ పరమాత్మ జ్ఞానముగలవారు తెలిసికొనుచున్నారని సూచన. (నే.వేం.న.శా.)

1. "సర్వరక్షకుండు సప్తమపుత్రుఁడౌ సూర్యు నిపుడు నేను" అని శ్రీ నేమానివారు వ్రాసిరి, (వ్రాతప్రతి. ప్రథమ మండలము. 2వ సంపుటము, 129వ పుట.) ఈ సందర్భమున సంస్కృతమూలములోని ఋక్కు ననుసరించి సూర్యునికేడుగురు పుత్రులున్నట్లు వ్రాయవలయును గాని సూర్యుఁడేడవ పుత్రుఁడనికాదు. "సప్తమ పుత్రుఁడౌ" అని శ్రీ నేమానివారు వ్రాయుటవలన "నేడవ పుత్రుఁడైన సూర్యుఁడు"అని యర్థము వచ్చినది. ఈ యర్థము మూలచ్ఛేదకమేకాక శ్రీనేమానివారీ ఋగనువాద సందర్భముగా వ్రాసిన (వ్రాతప్రతి 2వ సంపుటము 128వ పుట) పైనున్న ఫుట్‌నోటుకు సైతము విరుద్ధము. కావున "ఏడుగురు పుత్రులు కలిఁగిన సూర్యుఁడు" అని యర్థము వచ్చునట్లుగా "సప్తపుత్రకుఁడైన" అని సముచితముగా సవరింపఁబడినది. వ.గో.కృ.

(2) గీ॥† ఏకచక్రరథంబు సమిద్ధసప్త,సంఖ్యగల యశ్వరాజముల్ చక్కనైన
సప్తసంఖ్యాఖ్యతో నొప్పు చారు వాయు,వును ధరించుచు నున్నవి* యుచితరీతి ॥ 82

† (1) రథమేకచక్రమ్ = ఇది కాలమునకుఁబేరు. కాలమనుటచే సూర్యుఁడనిగాని సంవత్సరమని కాని యూహింపనగును.

(2) సప్త యుంజంతి = సూర్యపరముగ సప్తాశ్వములనిగాని సప్త జిహ్వలనిగాని చెప్పవచ్చును. సంవత్సరపరముగ షడృతువులు, సంవత్సరములు చేరి సప్తాశ్వములని చెప్పినచో సరిపోవును. లేదా షడృతువులును, నధికమాసమునుఁ జేరి సప్తాశ్వమన నగును. సప్తవారములు సప్తాశ్వములుగా నెన్నఁబడును.

(3) త్రినాభిచక్రమ్ = భూత భవిష్యద్వర్తమాన కాలములని గాని, ప్రాతర్మధ్యాహ్న సాయంకాలములని గాని చెప్పవచ్చును. (నే.వేం.న.శా.)

గమనిక:-ప్రథమమండలము164వసూక్తములోని రెండవఋక్కునకు శ్రీనేమానివారు చేసిన (82) పద్యానువాదము సాయనభాష్యముపై నాధారపడినది. శ్రీ నేమానివారీపద్యమునకు వ్రాసిన ఫుట్ నోటు కూడ సాయనభాష్యముపై నాధారపడినదే కాని శ్రీ నేమానివారు సాయన భాష్యానుసారముగానైనను బూర్తిగా తెలుఁగున ఫుట్ నోటువ్రాయలేదు. రథ మన్నది కాలాత్మకమై సంవత్సరాత్మకమైన ఒకే ఒక చక్రముతోఁ గూడినది. "సప్త యుంజంతి" అన్నప్పుడు సప్తశబ్దముచేత సప్తవారములు అనఁగా ఆది, సోమ, మంగళ. బుధ, గురు, శుక్ర, శనివారములు పరిగృహీతములగును. "అశ్వోవహతి సప్తనామా" అన్నప్పుడు సప్తాశ్వము లనఁగా నేడురంగులు కల్గిన "ఏకైకమైనకాంతి" అని అర్థము. అంతియేగాని వేరర్థము లేదు. సప్త యుంజంతి అన్నప్పుడు సప్తవారములని కాక షడృతువులును, సంవత్సరమును, లేదా అధికమాసమును గలిపి సప్తసంఖ్యను సరిపుచ్చుట భావ్యము కాదు. షడృతువులతో సంవత్సరము పూర్తియగును గావునను ఋతువులకు భిన్నముగాఁ బ్రత్యేకమైన సంవత్సరముండనేరదు కావునను సంవత్సరమును ఋతుసంఖ్యతోఁ గలుపుట యప్రసక్తమగును. అధికమాసమన్నది, మూఁడుసంవత్సరముల కొకపరి వచ్చునది గావున దానిని షడృతువులతో మిశ్రితము చేయుటకు వీలులేదు. అధికమాస మేఋతువున వచ్చునో యది యందులో నంతర్భూతమగును. కావున నధికమాసమును బ్రతి సంవత్సరమునునుండు షడృతువులతోఁ గలిపి సప్తసంఖ్యను బూర్తిచేయుట తర్కసహముకాదు. వైజ్ఞానికమును గాదు. సప్తవాయువులన్నదికూడ సరియయిన యర్థముకాదు. కావుననే సప్తవారములని చెప్పవలసియున్నది. త్రినాభులనఁగా రెండు ఋతువులొక నాభియని మొత్తమారు ఋతువులలో మూఁడు నాభులున్నవని మనము గ్రహింపవలసియున్నది. అవి ఉష్ణనాభి, జలనాభి, శీతనాభి అని పేర్లు గలవి. రెండు ఋతువులతో నాల్గుమాసములతోఁ గూడిన ఈ త్రినాభులపై నాధారపడి తెలుఁగువారిలో యేర్పడినవే వేసవి కాలము, వర్షాకాలము, శీతాకాలము అను త్రికాలములు. సాయనాచార్యులు చెప్పిన భూత, భవిష్యత్, వర్తమానకాలములు త్రినాభులని చెప్పిన యర్థము సరియైనదికాదు. కాలమును సంవత్సరాత్మకముగా గుర్తించినప్పుడు ఈ భూత భవిష్యత్ వర్తమాన కాలములకు సంవత్సరములో సమాన ప్రతిపత్తియుండదు. సంవత్సర ప్రారంభమున నంతయు భవిష్యత్తుగా నిలువఁగాఁగొద్దికాలము వర్తమానముగా నిలిచి భూతకాలమునకు స్థానమేయుండదు. సంవత్సరాంత్యమునఁ బరిశీలించుచో నంతయు భూతకాలమై కొద్దికాలము వర్తమానముగా

* "నున్నవియుచితరీతి" అని శ్రీ నేమానివారు వ్రాయఁగా "నున్నవ త్యుచితరీతి" అని శ్రీ పి. రమణమూర్తి సవరించిరి. (వ్రాతప్రతి - 2వ సంపుటము 129వ పుట.) శ్రీ నేమానివారు వ్రాసిన పాఠములోను శ్రీ రమణమూర్తిగారు సవరించిన పాఠము లోనుగూడ యతిభంగమైనది. శ్రీ నేమానివారి పాఠములో "వు" తో "యు" "ఉ" లలో నొక దానితో యతి సరిపెట్టుకొనఁగా శ్రీ రమణమూర్తిగారి పాఠములో "వు" "తో" "యు" "ఉ" లలో నొకదానికి యతి సరిపెట్టుకొనఁబడినది. ఇవి యొకేతెగకుఁ జెందిన లక్షణవిరుద్ధ ప్రయోగములు. కాని ప్రాచీన కవులు కొందఱిట్టి యతిమైత్రి నుపయోగించిరి. చూ. పీఠిక. వ.గో.కృ.

గీ॥ ఆ త్రినాభియుక్తమగు చక్రరాజము, నాశ్రయించుచుండు నఖిల భూత
జాత మద్ది యశిథిల మజరము నగుచు,నదియె నాశరహిత మగునుఁగాదె! ॥ 83

(3) సీ॥ షడ్జమాదిస్వర సామగానములన్ని, సూర్యరథంబును స్తుతినిఁజేయు
సప్తసంఖ్యను నొప్పు చక్కనిరశ్మలు పూషణు నేవేళఁ బొందుచుండు
సప్తరశ్మివిశేష చక్రరథంబును సప్తాశ్వములుమోసి జరుగుచుండుఁ
గాలచక్రము సూర్యగతిచేత నయనాదికమును గల్పించుచుఁగదలుచుండు

గీ॥ ననెడిసిద్ధాంతమెవ్వఁడే నరసియున్నఁ, గాలచక్ర క్రమంబును గాంచువాఁడె
సమయతత్త్వంబు నెఱుఁగని సరసుఁడెట్టు, లరయఁగ్గలుగునొ! చెప్పుఁడో! యమరులార! ॥ 84

(4) గీ॥ సృష్టికిన్ బూర్వముండిన చిత్స్వరూప,మైన పరమాత్మ నేఘనుం డధిగమించు
నీశ్వరాయత్తమగుమాయ యీప్రపంచ,మెటులు భరియించుచున్నదో! యెవ్వఁడెరుఁగు!॥ 85

గీ॥ స్థూలసూక్ష్మరూపసుందర సంబంధ,మైన యాత్మరూప మెచటఁగలదొ!
యిట్టి తత్త్వరూప మెవ్వఁడెఱుగునను, నెవఁడు చెప్పువాఁడొ! యెరుఁగనగునె? ॥ 86

(5) క॥ పరిపక్వము నొందక యే, నరిముఱిచిత్తంబుతోడ నమరులకై నం
బరిచయముకాని తత్త్వం, బరయుటకై దానిరూప మడుగుచునుంటిన్ ॥ 87

గీ॥ అఖిల లోక నివాసుఁడౌ హంసునికయి, బుద్ధిశాలురు ఋత్విజుల్ పూర్ణసప్త
సోమయాగములెల్లను సూక్తములను, జేయ యత్నించుచున్నారు చెన్నుమిగుల ॥ 88

(6) క॥ పరతత్వంబును దెలియక, పరమార్థముఁదెలిసినట్టి పండితులను నేఁ
బరమార్థజ్ఞానంబును, గరముఁదెలియఁగోరి యడుగఁగల్గితిఁ బ్రీతిన్ ॥ 89

క॥ ఎయ్యది యజమై వెలుఁగునొ!, యెయ్యది రవిమండలమున నీ ఋతుషట్కం
బొయ్యన వర్తిలఁజేయునొ!, యయ్యాత్మను నెఱుఁగఁ గోరి యడుగుచునుంటిన్ ॥ 90

నిలుచును. కాఁగా భవిష్యత్తుకు స్థానమేలేదు. సంవత్సర ప్రారంభమందును, సంవత్సరాంత్యమందును భూత భవిష్యత్తు కాలములకు స్థానమున్నదని వాదించునెడల నవిరెండును విభిన్న సంవత్సరములకుఁ జెందినవగును. కావున నీ యర్థము నిలువనేరదు. సంవత్సరములో విభాగముగా నిలువదు. ఉదయ, మధ్యాహ్న, సాయంకాలము లన్నవి ఒక రోజులో భాగములేగాని సంవత్సర భాగములు కానేరవు.సంధ్యలను గ్రహించుచో నర్ధరాత్రి సంధ్యయుఁ బరిగ్రహింపఁబడి ఉదయ సంధ్య, మధ్యాహ్న సంధ్య, సాయం సంధ్య, అర్ధరాత్రి సంధ్య అని నాల్గు సంధ్యలు పరిగృహీతములగును. ఇక్కడ చెప్పవలసినది సంవత్సరాత్మక కాలములోని విభాగములనే గాని రోజులో విభాగములనుగాదు. కావున లోగడ చెప్పినట్లు త్రినాభులనఁగా రెండు ఋతువు లొకనాభియను కాలవిభజనాత్మకమైన వేసవికాల, వర్షాకాల శీతాకాలములను త్రినాభికాలములను బరిగ్రహించుట సత్యసమ్మతమగును. వ.గో.కృ.

గీ॥ సత్యలోకము రూపించి జగమునంత, దానియం దుండునట్టులఁ దగ నొనర్చి
వాఙ్మనస్సులచేఁ జెప్పవలనుపడని, యాత్మతత్త్వంబు నెఱుఁగంగ నడుగుచుంటి ॥ 91

(7) ఉ॥ భానుని ఘృష్టిజాలములు వర్షములం గలుఁగంగఁజేయ నా
భానుని రశ్మిలే మరలఁబానముఁజేయుచునుండు వారులన్
భానుని రూపతత్త్వ మతి[1]భాసిలుచుండు నిగూఢ మౌచు నా
భానుని రూపు గన్గొనెడు భాగ్య మదెవ్వని కబ్బునో! కదా! ॥ 92

(8) సీ॥ మాతృస్వరూపయౌ మహి, పితృసూర్యుఁడు యజ్ఞఫలంబుల నందుచుండు
హంసుండు భూమిపై ననురాగమునుబూని వృష్టుల నిచ్చుచు వెలుఁగుచుండు
ధారుణి గర్భమున్ ధరియించు నిచ్ఛతోఁ గడు హలంబుల దున్నఁబడుచునుండు
సస్యసమృద్ధికి జలమార్దవము కల్గి వ్రీహ్యాదిధాన్యముల్ వెలయుచుండు
గీ॥ వృష్టియగుచుండ సస్యాభివృద్ధినొంది, యాగకర్మము లన్నియు సాగనిచ్చి
హవ్యభాగములన్నియు నాదరమున, నందఁజేయుచు నున్నార మమరులకయి ॥ 93

(9) సీ॥ మాతయౌ దివము విఖ్యాత భూమికిఁ గార్యసాధనంబునకుఁ దా సాఁగుచుండు
గర్భపిండమునాఁగఁ గ్రాలు వారిచయంబు మేఘమధ్యంబుల మెఱయుచుండు
వత్స స్వరూపమౌ వారినిండినవెన్క ఘనములు గర్జింపఁగల్గుచుండు
భానుఘృష్టులు మేఘవాయువు లన్మాటి సంపర్కమున భూమి చక్కనుండు
గీ॥ నపుడు సస్యాభివృద్ధిచే నఖిలభూత, ధాత్రియయి యొప్పు ధారుణిఁ దగినరూప
ములను దాల్చుచుఁ బుష్టిని గలిఁగియుండి, సంతసంబునుఁగలిఁగింపఁ జాలుచుండు ॥ 94

(10) గీ॥ అబ్దరూపకమగు కాలహంసుఁడెపుడు,మూఁడు లోకములన్ మించి ముగ్గురైన
వాయు సూర్యులకంటెను వహ్నికంటె,నున్నతస్థల[2]మునందున నుండువాఁడు ॥ 95

గీ॥ గ్లాని నెవ్వరు కలిఁగింత్రు కాలమునకు?, భానుఁ డబ్దాత్మకంబైన భాసమాన
కాల రూపము నేవేళఁగలుఁగుచుండ, సప్తరశ్మిని వర్ణింప శక్య మగునె! ॥ 96

గీ॥ దివమునకు మీఁదనుండెడు దేవతతులు, సర్వవిద్యావ్యగర్జిత సరణి నెల్ల
భాను సంబంధమౌనను భావనలను, జేయుచున్నారు నిశ్చయ సిద్ధితోడ ॥ 97

1. "రూపతత్వమతిగ భాసిలుచుండు" నన్నచో గణభంగమగునని "అతిగ భాసిలుచుండు" లోని "అగు" ధాత్వర్థక నుజ్యంతరూపమగు "గ" అనుదానిని విలుప్తము చేసి శ్రీ నేమానివారు వ్రాయుట ప్రయోగ విశేషము. వ.గో.కృ.

2. ఇక్కడ నింద్రగణమునకుమారుగా "నున్నత స్థలమునందున" అని భల, భగణములుగాని - భ, జలములుగాని ప్రయుక్తము లైనట్లుభావింపనగును. "నున్నత స్థలమందున నుండువాఁడు" అని శ్రీ నేమానివారు వ్రాయఁగల్గియుండియు నిట్లు ప్రయోగించుట విశేషము.( చూ. 2వ సంపుటము 133వ. పుట. వ్రాతప్రతి.) వ.గో.కృ.

(11) గీ॥ ద్వాదశార విరాజిత తరణియాన, చక్రమే వేళ(దిరుగదే ! శాశ్వతముగ
ఖాస్కరుఁడ: యట మిథున రూపములఁబొంది, దిన నిశారూపపుత్రులు దిరుగుచుంద్రు ॥ 98

(12) ఉ॥ పంచఋతుస్వరూపులుఁ బాదములన్ వెలుఁగంది తృప్తి గా
వించుచు నంతకున్ నెలల విశ్రుత రూపము చెంది వర్షముం
బంచెడి యబ్దచక్ర మతిభాసిలు[1] వ్యోమమునందు నుండు న
ట్లంచితపండితోత్తము లహర్నిశమున్ గడుఁ జెప్పకుందురే ! ॥ 99

క॥ అయనము ఋతుమాసాదుల, చయమనుచక్రములుగలిఁగి షడరంబులతో
వియదర్ధభాగమందునఁ, బ్రయతాదిత్యుండు వెల్గుఁ బ్రజ్వల తనుఁడై ॥ 100

(13) గీ॥ ఐదు ఋతువులనెడి యాకులుగల కాల, చక్రమెపుడు భువన సంచయమును
దీక్షతో భరించి దివ్యప్రభాదుల, మరలమరలఁ దిరుగు మఱవకుండ ॥ 101

క॥ ఎక్కువగుభూమిభారము, చక్కఁగ భరియించు కాల చక్రాక్షము తా
నొక్కింత బాధఁ జెందదు, మిక్కిలి తన్నాభికూడ మెఱయుచునుండున్ ॥ 102

(14) క॥ నిచ్చలు నేమింగలుఁగుచు, [2]సచ్చరితము గల్గు కాలచక్రము విధిగా
నచ్చుపడఁ దిరుగుచుండదె! ద్రచ్చి జరాబాధలన్ని తగిన విధమునన్ ॥ 103

గీ॥ పంచ లోక పాలబ్రాహ్మణాదులు కర్మ, చయమునెల్లఁ బ్రీతి జరుపుచుంద్రు
భానుమండలంబు వర్షమునకు మూల, మౌచు భూతములను గాచుచుండు ॥ 104

(15) క॥ ఒక్కటిగ జనన మొందిన, చక్కని ఋతు వొక్కటగుచు సప్తాశ్వనకుం
జిక్కక వెలుంగు నని తా, మక్కజముగఁ జెప్పుచుంద రంద ఋ ధీరుల్ ॥ 105

క॥ మిగిలిన ఋతుషట్కము మేలగు మాస ద్వయము కలిఁగి హంసునివలనన్
దగఁబుట్టు ననుచుఁ బల్కెద, రగణితకాలజ్ఞులెల్ల రాదరబుద్ధిన్ ॥ 106

క॥ ఋతువులు తమతమ నెలవుల, సతతము నియమింపఁబడుచు సర్వహితంబున్
గతిచే నిచ్చుచు జగముల, కతిరూపము లొందుచుండునవియై చెలఁగున్ ॥ 107

1. అతిగభాసిలు. 2. పొచ్చెములేనట్టి కాలపూర్ణచక్రమే। యచ్చుగఁదిరుగుచునుండదె (తొ.పా.) రెండవపాదమున గణభంగము. (వ్రాతప్రతి. 2వ. సంపుటము. 135 పుట.) వ.గో.కృ.

(16) గీ॥ గర్భమందు జలము గలిఁగియుండుటచేత, †స్త్రీస్వరూపములయి చెలఁగు ఘృష్ట
లల్లఘృష్ట లుదక మందఁజేయుటచేతఁ, బురుషరూపములని ధర వెలుంగు! ॥ 108

గీ॥ ఇట్టి తత్త్వ మెల్ల నెరుఁగును విజ్ఞాని,యజ్ఞుఁ డెటుల దాని నధిగమించు
నట్లుతెలిసికొనిన యచ్చపుఁబుత్రుఁడే, తండ్రితండ్రియగుచు ధరనుఁజెల్లు ॥ 109

(17) సీ॥ కోమల హవ్యమన్ గోవు పద ద్వయమున నగ్నివత్సమ ప్రోచుచుండుఁ
‡పాదద్వయంబునఁ బావకు ధరియించి భానునిచెంతకుఁ బంపుచుండు
నాహుతిద్రవ్యంబ [1]యతిదృఢ గమనమై సగముదూరమువచ్చి జరుగుచుండు
నటులైన నెవ్వఁడు యాగఫలంబుల నత్యాదరంబున నందకుండు
గీ॥ జంగమస్థావరాత్మక సర్వలోక, సముదయంబందు విలసిల్లు సరసగోవు
చందమునఁగాక వర్ణిత సరసగోవు, ఫలము నీయక వేరగు ఫలము నిడదె! ॥ 110

† ఈ ఋక్కునకు సూర్యపరమున నొకయర్థమును దత్త్వార్థపరమున నొకయర్థమును జెప్పవచ్చును.

సూర్యపరము :— మెఱుపుతోఁగూడి ప్రకాశించుటచే మేఘములు అలంకారప్రాయలైన స్త్రీలవలె నొప్పుచున్నవి. ఉదకపిండములను దాల్చిన మేఘములు స్త్రీలనియును, సూర్యకిరణముల ప్రభావముచే మేఘము లుత్పన్న మగుటచేఁ, గిరణములు మేఘములను బుట్టించు పురుషుఁడనియుఁ జెప్పవచ్చును, మేఘములకుఁ గిరణములు తండ్రియగుటచేఁ గిరణములకుఁ బ్రభువైన సూర్యుఁడు మబ్బులకుఁ దండ్రి తండ్రియని చెప్పవచ్చును. (కాఁగాఁ దెలుఁగున మేఘములకు సూర్యుఁడు "తాత" యనవచ్చును.)

తత్త్వపరము:- జీవునకు నామరూపములు లేవనియు, నే యే రూపమునందినపుడాయా రూప, రూపవికారములతో నేకమగుచున్నాఁడనియు. నిట్టి యాత్మ పరమాత్మ జ్ఞానము నుత్తమపురుషులగువారే తెలిసికొనఁగలవారనియు నభిప్రాయము. (నే.వే.న.శా.)

(సాయనభాష్యము ననుసరించి వ్రాసిన యీ ఫుట్‌నోటు శ్రీ నేమానివారి వ్రాతప్రతిలో (2వ సంపుటము. 134వ పుట) సరిగా వ్రాయఁబడలేదు. కావున సరిచేసి వ్రాయుట జరిగినది. వ.గో.కృ.)

‡ గ్రిఫిత్ దొరగారు గోవనఁగ నుషస్సనియు, వత్స మనఁగ నుషస్సనియుఁ జెప్పుచున్నారు. ఉషోదేవతయును, గోరూపమూర్ధ్వభాగముననుండు తన రెండు పాదములకును మధ్య సూర్యుఁడను వత్సమును బుట్టించుచున్నవి. (భూమికిఁబై భాగమున నంతరిక్షమునకుఁ గ్రింది భాగమున నుషఃకాలము సంప్రాప్తమైనపిదప సూర్యుఁడుదయించుచున్నాఁడని తాత్పర్యము.) సూర్యుఁడుదయించిన పిదప నుషఃకాలము మఱుగుపడినదగుచు మనలోకమునఁగాక మరి యేలోకమున నగుపడుచున్నది ? ఈ ఋక్కువలన మనకు రాత్రియగునపుడు మరియొకలోకమువారికి సూర్యోదయమగుచున్న దనునంశము సూచింపఁబడినట్లు తోచుచున్నది. (నే.వే.న.శా.)

సూచన :— ఈ పైననుదహరించిన శ్రీ ఫిత్‌దొర వ్యాఖ్య సరికాదు. "అవఃపరేణ" ఇత్యాది ఋక్కుకు సాయనాదులు సరిగా భాష్యము వ్రాయలేదుగాని "పరా అగాత్ క్వ" అన్నప్పుడు సూర్యుఁడుదయమై పృథ్వికిఁ "పరా" ప్రదేశమునఁ గన్పించునని చెప్పెను. కాఁగా నస్తంగతుఁడగుచో భూమికిఁ బశ్చిమ భాగమునఁ గన్పించునని చెప్పకయే చెప్పినట్లగును. "ప్రాక్" పదమునకుఁ దొలిరూపము "పరా." సాయంత్రమునకు నపరాహ్ణ మనువ్యవహారము దీనిమూలముగనే వచ్చెను-వ.గో.కృ.

1. "నాహుతి ద్రవ్యంబ నిశ్చయ గమనమై" (వ్రా.ప్ర.పా. యతిభంగ దోషము) వ.గో.కృ.

(18) గీ॥ *విశ్వపితవలె నుండెడి వీతిహోత్రు,సూర్యుఁ డనియును పైనుండు సూర్యుఁ జూచి
జనకవహ్నులుగా నెంచఁజాలఁగలమె?, దేవతావిషయ మెట్టులు తెలియఁబడును? ॥ 111

(19) క॥ రవి చంద్ర మండలంబుల, నవితథముగఁ దిరుగుగ్రహము లర్వాంచములౌ
నవనిని దిరిగెడి గ్రహములు, జవమున నూర్ధ్వంబునందు జరుగుచునుండన్॥ 112

క॥ అని కాలజ్ఞులు నుడివెద, రినచంద్రప్రభువులార! యీ మీ గతిచే
ననయము ధరింత్రు జగములఁ, బనుపడి రథమునకుఁ బూన్చు వాహములవలెన్ ॥ 113

(20) †చ॥ అతులితపర్ణముల్ గలిఁగి యంచితమైత్రి సమాన యోగ సు
స్థితి ధరియించి యేకమగు చెట్టున నున్నవి రెండు పక్షులు
ధ్ధతమగు రెంటిలో నొకటి తత్ఫలమున్ భుజియించుచుండ సం
తతమును జూచుచుండుఁగద! తక్కిన పక్షి ఫలార్థికాకయే! ॥ 114

క॥ కలవొకతరువునఁ బలురెక్కలవి పులువు లొక్కరూపు కలవు చెలిమితోఁ
గలియుచు రెం డొక డింపౌ,ఫలము దినుం దినక యొండు భాసిలు నెలమిన్ ॥ 115

(21) చ॥ ఘనతరసూర్యదీధితులు కర్మచయంబును జూచుచుండఁ దా
మనయము వారిభాగముల నందఁగఁజేసెడు సూర్యమండలా
ఖ్యను ధరియించుచో నచట గౌరవ మందిన యీశ్వరుండు నా
మనమునుజేరి యుండు నసమానముగా వెలుఁగొందుచుం గడున్ ॥ 116

(22) చ॥ అనుపమ సూర్యరూపమగు నంచిత వృక్షమునందుఁగల్గు వా
రిని గ్రహియించు దీధితుల రీతులు లోకము నైజకాంతిచే
ననయము వెల్గఁజేయుఁగద! యీ కుజపిప్పల మెల్లఁదియ్యనై
తనరు నటంచుఁ బల్కెదరు దానిని బొందరె! తత్త్వకోవిదుల్ ॥ 117

పరమాత్మపరార్థము

క॥ జ్ఞానేంద్రియములు తమతమ, నానాకార్యములయందు నటియించుచుఁ దా
మూని పరమాత్మవృక్షము,లోనన్ లీనమగుచుండు లోకులు కనరే! ॥ 118

* "ద్యులోకమునకుఁ గ్రిందిభాగమునను బ్రపంచమున కుపరిభాగమునను వెలుంగు సూర్యునికిఁ దండ్రియెవరైనది యే కవీశ్వరుఁడు చెప్పఁగలఁడు?" అని దీని తాత్పర్యమని గ్రిఫిత్ భావము. (నే.వే.న.శా.)

† ఈ మంత్ర ముపనిషత్తులలోనికి స్వీకరింపఁబడినది. (నే.వే.న.శా.)

క॥ పరమాత్మమోక్షఫలమును, బరమజ్ఞానియె విశేషభక్తిం బొందున్
పరమ జ్ఞాన విహీనుఁడు, పరమాత్ముని నెఱుఁగఁగలఁడె! భవ్యుండైనన్ ॥ 119

(23) క॥ భువిపై గాయత్రంబును, దివి వాయుపదంబు మఱియు దివిజపదమునన్
రవిపదము నుండునని యే, రవితథముగఁ దెలియఁగలరొ ! యమృతులు వారల్ ॥ 120

(24) గీ॥ మాన్య గాయత్రితో సామ మంత్రములను, రుచిర త్రిష్టుప్పుతో సూక్త రూపములను
వరలు ఋక్కులు వర్ణానువాకములను, వర్ణముల సప్తవాణులు నిర్ణయించు ॥ 121

(25) †మ॥ జగతీఛందముతోడఁ జెప్పఁబడు సత్సామంబుతో వారులం
దగ సృష్టించెడు సూర్యు నాకశమునన్ స్థాపించి సామంబుతో
గగనంబందు వెలుంగఁజేసెడు మహాగాయత్రి యత్యుత్తమం
బగుగాయత్రి త్రిపాదయుక్తముగదా! యత్యంత మూహించుచో ॥ 122

(26) ఉ॥ దోహదదక్షహస్తములతోడఁ బయస్సులఁదీయ హోత య
త్యూహనుజేసి ధేనువును నుచ్చరవంబునఁ బిల్చుచుండె నా
నా హితసోమయాగమును నవ్యఫలంబగునట్లుసేయ న
త్యాహితసర్వచోదకుని సత్యమలుం బరమేశుఁ బిల్వరే! ॥ 123

సూర్యపరము

క॥ జలదములఁ బిలుచుచుంటిమి, జలమునకై భానుమూర్తి జలము నొసఁగెడున్
జల మిచ్చునట్టి యీశుని, బిలుచుచు నున్నాము మేము పేర్మిదలిర్పన్ ॥ 124

(27) క॥ క్షీరాదుల నందించెడు, సారముగల గోవు వచ్చెఁ జక్కని వత్సం
జేసుటకు నట్టిదగు గో,వారసి సౌభాగ్య మిచ్చు నందఱకుఁదగన్ ॥ 125

అర్థాంతరము

క॥ భువనావనముంగోరుచు, జవమున గర్జమ్మొనర్చు జలదము లనిగో
నవి లోకవస్తువులకున్, వివిధముగ జలంబు లొసఁగు వేయివిధములన్ ॥ 126

† ఈ నూటయిరువదినాల్గవ సూక్తమునందలి 18వ ఋగనువాద పద్యములో (538వ పుట-111 పద్యము) సూర్యమూలకమగు దేవతను నెవ్వరును జెప్పలేరని వ్రాసి యీ 25వ ఋగనువాదములో మహాగాయత్రి మూల మనుట స్వవచన వ్యాఘాతముగా నున్నది. ఛందరూపమైన గాయత్రితో సవితృమంత్రముండుటవల్ల (తత్సవితుర్వరేణియ మిత్యాది) నీ భావము వెల్లడించి యుందురు. ఇది సరికాదు. చూ. పీఠిక. వ.గో.కృ.

(28) ఉ॥ కన్నులు మూసి యేమియును గానకయుండెడి లోకవత్స దా
మున్నె యెఱింగి దాని ఘన మూర్ధము నాకుచునుండె గోవు వి
ద్వన్నుత! యోష్ఠ పార్శ్వములఁ దద్దయుఁ బాలనుగార్చు దానినిన్
మన్ననఁజేసి చూచునది మానక దానికిఁ బాల నిచ్చుచున్ ॥ 127

అర్ధాంతరము

గీ॥ పరితపించుచున్న ప్రజలను సస్యాళి, గావఁదలఁచి పెద్ద గర్జనంబుఁ
జేయుచుండి పుడమిఁ జేరుచు నున్నది, మేఘపంక్తి భువికి మేలుసేయ ॥ 128

(29) క॥ ఈ వత్సము శబ్దించున్, గోవును వత్సమును బట్టికొని భ్రమియించున్
గోవు తన కార్యములచే, భావిత నిజ రూప మహిమఁ బ్రకటించుఁదగన్ ॥ 129

(30) చ॥ తనువులు ప్రాణముల్ గలిఁగి తప్పక కార్యములెల్లఁ జేయుచున్
ఘనమగుగేహసేమఁ గడుఁగాంచుచు నందు వసించుచున్న వా
తనువుల ప్రాణముల్ మరణ ధర్మ సమంచితదేహధారులై
నను దమ పుత్రమిత్రపరిణద్ధములై యమరత్వ మొందెడున్ ॥ 130

(31) క॥ హితమతివర్షం బిచ్చుచు, సతతము లోకములయందుఁ జరియించుచు ను
న్నతమార్గగామియటు రవి, ప్రతిదినము వెలుంగుచుండుఁ బ్రకృతిం గనుచున్ ॥ 131

క॥ తనతోడఁ గలిసి తిరిగెడు, ఘనఘృష్టులతోడఁ జాలఁగ్రాలెడుసూర్యుం
డనయము భువనంబంతయుఁ, గనుచుం జరియించుచుండుఁ గంటిరె!విబుధుల్ ॥ 132

(32) చ॥ తనయునిగోరి యే జనుఁడు తన్వికి గర్భముఁ జేయుచుండు నా
ఘనుఁడలగర్భతత్వమును గాంచఁగఁ గల్గునె ? గర్భసంస్థుఁడై
నను బురుషుండు గర్భగతనైజము గుర్తెరుఁగంగలేఁడు కా
వున భవరోగదుఃఖములఁ బొందుచు నుందురు మానవోత్తముల్ ॥ 133

(33) గీ॥ దివము రక్షకంబు దివము జన్మస్థాన, మగును నాకు సార మచటఁగలదు
పుడమి నాదుతల్లి భూమి దివంబుల, మధ్య నంతరిక్ష మమరియుండు ॥ 134

గీ॥ అంతరిక్షమందు నమరెడుసూర్యుండు, పితగ వెలుఁగుచుండి ప్రేమమీర
క్షమకు వృష్టిరూప గర్భము కలిఁగింపఁ, దాన సస్యరాశి ధర వెలుంగు ॥ 135

పాఠాంతరము

క॥ దివియనెడుతండ్రికిన్ మఱి, భువి యను దల్లికిని సర్వభూత హితంబౌ
దివమే యోని స్థానము, రవి వృష్టిని గలుఁగఁజేసి రక్షించుఁగదా! ॥ 136

(34) ఉ॥ భూమికి నంతమెయ్యెడనొ! [1]భూభువనమ్ముల నాభి యేడనో?
కామితవృష్టిదాతయగు కర్మల రాయని వీర్యమేడ? వాక్
స్తోమము గల్గఁజేయు నల సుందరభస్థలి యున్కియేడనో?
యో మనుజుండ! ని న్నడగుచుంటిని నాకు నెఱుంగఁజెప్పుమా! ॥ 137

(35) చ॥ కనఁబడుచుండు వేదికయె గ్రాలెడుభూమికి నంతమౌను మే
మనయము చేయు యజ్ఞతల మంచితనాభిగ వెల్గుచుండు నీ
ఘనమగుసోమమే జలముఁగల్గఁగఁజేసెడు సూర్యవీర్యమై
చను మఱి మంత్రవాక్కులకుఁ జారు నభంబె ప్రధానమౌన్ గదా! ॥ 138

(36) చ॥ గగనమునందు జన్మమును గాంచుచు నేడుగ నొప్పుచుండు భ
ద్రగుఁడగు సూర్య దీధితులు ధర్మవిధిం వెలుఁగొందుచుండి యీ
జగములఁ గాచుబుద్ధిఁగొని చాలఁబ్రతిజ్ఞను బూని యంతటం
దగ విలసిల్లుచున్నయవి తత్త్వము నారసికొమ్ము యాజకా! ॥ 139

(37) సీ॥ అవివేకమునుఁజేసి యజ్ఞాని నౌచు నే నానందరూపంబు నధిగమింప
లేక మూఢుఁడ నౌచు లీల నజ్ఞానాంధకారంబునం గర్మకలనచేత
నరికట్టఁబడుచుఁ దత్పరమాత్మ సంబంధమగుశక్తి నించుక నందకుండ
సంసారసుఖదుఃఖసరణికి వశుఁడనై తెలివితేటలు వీడి తిరుగుచుంటి
గీ॥ జంగమస్థావరాత్మకజగతియెల్ల, బ్రహ్మమనుబుద్ధి నాలోనఁ బ్రబలియున్న
[2]నుపనిషద్వాక్యతత్త్వంబు నుచితరీతిఁ, బొందఁజాలుదు నదిలేక పొందఁగలనె? ॥ 140

1. "భూతసమూహపు బంధమేడనో" అని శ్రీ నేమానివారు వ్రాసిరి. (వ్రాతప్రతి. 2వ సంపుటము. 143వ పుట.) మూల భూతమైనఋక్కులో "యత్ర భువనస్య నాభిః" అని యుండుటచేఁ దదనుగుణముగా నీపాఠము సవరింపఁబడెను. దీనివల్ల భూమి యనంతమని వేదర్షి భావించినట్లు తలంపరాదు. భూమి నశించినను దిరిగి తిరిగి పుట్టుట నశించుట చక్రనేమి క్రమమున నిది జరుగుచునేయుండును. కావున భూమికి నంతమెప్పుడో యెక్కడనో చెప్పలేమనుట. అసలు విశ్వసృష్టి స్వభావమే యిట్టిది. అందువల్ల దీనికి సమాధానము లేదు. వ.గో.కృ. 2. ఇది సాయన భాష్యానుసారముగ వ్రాయఁబడినది. వేదములో నుపనిషత్ ప్రసక్తి యసమంజసము. అసంబద్ధము. వ.గో.కృ.

(38,39) సీ॥ నిత్యమౌ జీవాత్మ నెఱి పరమాత్మతోఁగూడి భోగంబులఁగూడుచుండు
భోగియై జీవాత్మ పొలుపార సుఖదుఃఖ కర్మ ఫలంబులం గలుఁగుచుండు
నొండరులను వీడకుండ రెండాత్మలు శాశ్వత మైత్రితో జరుగుచుండు
మనుజుఁడు దేహంబు మాత్ర మెఱుంగుచు దేహాతిరిక్తాత్మఁ దెలియకుండు
గీ॥ దేవవర్ణితమును నభోవిస్తృతంబు,నైన చిన్మయరూపంబునందు దేవ
తలు వసించెదరను మహాత్త్వమెఱుఁగు, పురుషుఁడే మోక్షలక్ష్మిని బొందఁగలఁడు ॥ 141

పాఠాంతరము

గీ॥ శాశ్వతంబు లౌచు సకలోత్తమంబులై, [1]యక్షరంబులైన యఖిలవేద
ములు సురాళికెల్ల ముఖ్యాశ్రయం బని,యెఱుఁగువాఁడె బ్రహ్మ మెఱుఁగువాఁడు ॥ 142

(40) ఉ॥ ధేనువ! మంచిగడ్డి తిని తియ్యనిపాలను గల్గియుండుమా!
మానక మేము నీ దయ నమానుషభాగ్యము నందువార మా
శ్రీనిధి సర్వదేశములఁ జేరి తృణంబుల మేయుచుండి నీ
వానుము నిర్మలోదకము లన్ని తలంబుల సంచరించుచున్ ॥ 143

(41) గీ॥ ఒకటి రెండు నాల్గు నొనరంగ నెనిమిది, తొమ్మిదైనపదము లిమ్మ గలిఁగి
ఘనము గగనమందు గర్జించుచుంజాల, వర్షజలమునెల్ల వంచుచుండు ॥ 144

(42) †ఉ॥ శబ్దము వాక్కుతో నతివిశాలముగా భ్రమియించుచుండు నా
శబ్దము నామముల్ క్రియల సంచయ మొందుచు నొప్పు నెప్పు డా
శబ్దము తొమ్మిదింటఁ గదు సంచలనంబొనరించుచుండు నా
శబ్ద విభూతి యున్కి కది శస్త హృదంతర మౌనుగాదొకో! ॥ 145

గీ॥ పైని జెప్పఁబడిన పర్జన్య యుదకంబు,నొసఁగుచుంటవలన నుర్విజనులు
బ్రతుకుచుండి రుదకభాగ్యంబుచేతనే, సస్యవృద్ధికూడ జరుగుచుంటు ॥ 146

1. నక్షరంబులైన నఖిలవేద (వ్రా.ప్ర.పా.)

† శ్రీ నేమానివారు "శబ్దము వాక్కుతో" నిత్యాదిగాఁగల 145వ పద్యమును (వ్రాతప్రతి. 2వ సంపుటము. 147వ పుట.) ప్రథమ మండలములోని 164వ సూక్తములోఁగల 41వ ఋక్కునకు నర్థాంతర పద్యముగాఁ బొరపాటున వ్రాసిరి. ఈ పద్యము "తస్యాః సముద్రా అధివిక్షరన్తి" ఇత్యాది 42వ ఋక్కున కనువాదము-ఈ 42వ ఋక్కు పూర్వార్థమునకు వాక్కును నుత్తరార్థమునకు నప్పును (జలమును) దేవతలు, ఒకవిధముగా సరస్వతీ వరుణులు దేవతలని కొందరు భావింతురు, వ.గో.కృ.

(43) చ॥ శకమయజాతధూమ మతిసంతసదృష్టినిఁజూచి దానిచేఁ
ప్రకటితమౌచు వ్యాప్తిఁగను పావకుఁగాంచితి యజ్ఞకర్తల
త్యకుటిల సోమ వేల్లికల నత్యధికంబుగఁగూర్చుచుండి ర
త్యకలుషయాగకర్మలకు నద్దియె మూలముకాదె! చూడఁగన్ ॥ 147

(44) సీ॥ సూర్యాగ్నివాయుపుల్ శుభదీధితులతోడ భూమినిఁజూచుచుఁ బోవుచుందు
రందులో నొకఁడగు నగ్నిదేవుఁడు వత్స[1]రాంతంబునన్ వృక్షరాజి లతలఁ
గాల్చుచుఁ బుడమినిఁ గమనీయముగఁజేయు తరణి వృష్ట్యాదుల దానమిచ్చి
సర్వసస్యాదుల [2]సమకూర్చి జనులకు సంతృప్తి నొసఁగుచు సకలమైన
గీ॥ భూమిపైనుండి చూచుచుఁబోవుచుండు, గమనవేగంబునన్ గాలి కంటఁబడుచుఁ
దిరుగుచుండును నేవేళఁ దెరిపిలేక, కాని తద్రూప మెవ్వనికంట్పడదు ॥ 148

(45) గీ॥ వాక్పదంబులు నాలుగై వరలుచుండు‡, ననుచు బ్రాహ్మణు లేవేళననువదింతు
రందునన్ మూఁడు హృదయాంతరాళమందు నుండు నొక్కటి మానవు లుచ్చరింత్రు ॥ 149

(46) క॥ పరమాత్మను వాయువుగా, వరుణుం డని యగ్నియనియు వాసవుఁడనియున్
బరుఁడని పెక్కువిధంబులఁ, బరమజ్ఞానులు వచింత్రు బహుళప్రజ్ఞన్ ॥ 150

(47) క॥ రవిఘృష్ట లుదకమునుగొని, వివిధములగు ఘనములందు వెలయించుచు నా
రవినుండి మరలవచ్చుచు, భువనంబును దడుపుచుండుఁ బొలుపారంగన్ ॥ 151

1. ఇక్కడ నఖండయతి ప్రయుక్తము. వ.గో.కృ. 2. సమఁగూర్చి (వ్రా.ప్ర.పా.)

‡ చత్వారి వాక్పరిమితాని— సూర్యాగ్నివాయువులచే నధిష్ఠింపఁబడిన ముల్లోకములందలి మూఁడువిధములైన దైవభాషలను మర్త్యలోకమున మానవులచే వాడఁబడు మానుషభాషను వేదవేత్తలగు బ్రాహ్మణులు తెలిసికొనుచున్నారు. (నే.వేం.న.శా.)

సూచన: —యాస్కాచార్యుల నిరుక్తాభిప్రాయము పాక్షికమైనదైనను నపాక్షికముగా శ్రీ నేమానివారిక్కడ నుటంకించిరి. లోకమున మూఁడు భాషలు పశువులలో నాల్గవభాషయుఁ గలవనికూడ బద్ధవిరుద్ధాభిప్రాయమును యాస్కుఁడు వెల్లడించెను. ముల్లోకముల భాషల విషయ మప్రామాణికము. ఈ యభిప్రాయము నిర్వివాదప్రాయమైనదిగాఁగాని అజయ్యమైనయభిప్రాయముగాఁగాని పరమవైజ్ఞానిక దృక్పథముతోనేకాదు వేదర్షుల దృక్పథముతోఁ జూచినను మరేదృక్పథముతోఁ జూచినను నిశ్చితముగా నిలువ నేరదు. వ.గో.కృ.

(48) గీ॥ పదియురెండు పెద్దప్రధులతో నాభుల, మూఁటితోడ మఱియు [1]మూఁడుమూరు
లరువదైన శంకువరముల నమరిన, కాలచక్రమొకటి కలదుగాదె! ॥ 152

(49) సీ॥ అత్యంతసుఖములు నందించునదియును సర్వార్థసిద్ధి నొసంగునదియు
బహువిధ రత్నముల్ పంచెడునదియును గోరినకోర్కెలు గూర్చునదియు
ద్రవ్యరాశులనెల్ల దరిఁజేర్చునదియును ద్రవ్యనిక్షేపంబుఁ దాల్చునదియు
సర్వశుభంబులఁ జక్కఁగూర్చెడునది విత్తార్థములనెల్ల నిచ్చునదియుఁ
గీ॥ బరుల కనుపమభోగ్యమై పరఁగునదియు,నైన [2]లౌకిక వైదిక మఖిల శబ్ద
రూపమగు తావక స్తవరూప మెలమి, నో సరస్వతి ! మాకిడు మోర్పుగలిఁగి ॥ 153

(50) క॥ యజమాను లరణివహ్నిన్, యజనంబులఁ జేసిచేసి యజ్ఞార్థములన్
యజనార్థ[3]సాధ్యలోకము, భజయించుచు నున్నవారు పరమప్రీతిన్ ॥ 154

(51) గీ॥ ఈ ప్రసిద్ధజలము లెండ కాలంబున, నూర్ధ్వలోకమందు నుండు వర్ష
కాలమందు భువిని గ్రాలెడుఘనములు, భూతములకుఁ దృప్తిఁ బుట్టఁజేయు ॥ 155

(52) చ॥ ద్రుత గమన స్వభావమునఁ దిన్నఁగఁ బోయెడు శక్తితోడ శా
శ్వతమగునట్టి లోకమున జన్మము నొంది యఖండవృష్టి వి
స్తృతులకుఁ గారణుండవయి విశేషముదంబునుజేయు సూర్యు సం
తతము భజించుచుండెదము తత్కృత రక్షణ మొందఁ బ్రీతితోన్ ॥ 156

1. మూఁడునూరు, లరువదియాకుల నమరియుండెడి కాల,చక్రమొకటి కలదవక్రమహిమ. (తొ.పా. 3వ పాదమున గణభంగము. "లరువదాకు లలర నమరియుండెడి కాల, చక్రమొకటి కలదవక్రమహిమ" అని వ్రాసిన సరిపోయెడిది. కాని శ్రీ నేమానివారే పైవిధముగా సవరించిరి. (వ్రాతప్రతి, 2వ సంపుటము. 149వ పుట.)

2. నైనలౌకిక వైదికాఖిల సుశబ్ద (వ్రా.ప్ర.పా. యతిభంగదోషము. 2వ సంపుటము. 149వ పుట.)

3. ఈ 50వ ఋక్కునకు సాధ్యులు దేవతలు. కావున మూఁడవపాదము "యజనార్థలబ్ధలోకము"అని శ్రీ నేమానివారు వ్రాయఁగా "యజనార్థసాధ్యలోకము" అని సవరింపఁబడినది - ఈ సవరణ చేయనిచో దేవత లూహ్యామానులగుదురు. వ.గో.కృ.

## అనువాకః—23 సూక్తమ్ 165

ఋషిః—1, 2, 4, 6, 8, 10-12 ఇంద్రః; 3, 5, 7, 9-మరుతః;

13-15 అగస్త్యోమైత్రావరుణిః†

దేవతా—మరుత్వానిన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) కయా శుభా సవయసః సనీళాః సమాన్యా మరుతః సం మిమిక్షుః ।

కయా మతీ కుత[1] ఏతాస ఏతే ఽర్చన్తి శుష్మం[2] వృషణో వసూయా ॥ 118

(2) కస్య బ్రహ్మాణి జుజుషుర్యువానః కో[3] అధ్వరే మరుత ఆ వవర్త ।

శ్యేనాగ్ం[4] ఇవ ధ్రజతో అన్తరిక్షే కేన మహా మనసా రీరమామ ॥ 119

(3) కుతస్త్వమిన్ద్ర మాహినః సన్నేకో యాసి సత్పతే కిం త[5] ఇత్థా ।

సం పృచ్ఛసే సమరాణః శుభానైర్వోచేస్తన్నో హరివో యత్ తే[6] అస్మే ॥ 120

† 13-15 అగస్త్యః (మా) 1. కుతఽఏతాసఽఏతే, 2. శుష్మవృషణో, 3. కోఽ అధ్వరేమరుతఽఆ

4. శ్యేనా గ్ంఽఇవంధ్రజతోఽఅన్త, 5. తఽఇత్థా 6, తేఽఅస్మే. (వ్రా.ప్ర.)

(4) బ్రహ్మాణి మే మతయః శం[1] సుతాసః శుష్మ ఇయర్తి ప్రభృతో మే[2] అద్రిః ।

ఆ శాసతే ప్రతి హర్యన్త్యుక్థేమా హరీ వహతస్తా నో[3] అచ్ఛ ॥ 121

(5) అతో వయమన్తమేభిర్యుజానాః స్వక్షత్రేభిస్తన్వ[4]ః శుమ్భమానాః ।

మహోభిరేతాగ్ం ఉప యుజ్మహే న్విన్ద్ర స్వధామను హి నో బభూథ ॥ 122

(6) క్వ స్యా వో మరుతః స్వధాసీద్ యన్మామేకం సమధత్తాహిహత్యే ।

అహం హ్యుగ్రస్తవిషస్తువిష్మాన్ విశ్వస్య శత్రోరనమం వధస్నైః ॥ 123

(7) భూరి చకర్థ యుజ్యేభిరస్మే సమానేభిర్వృషభ పౌంస్యేభిః ।

భూరీణి హి కృణవామా [5]శవిష్ఠేన్ద్ర క్రత్వా మరుతో యద్ వశామ ॥ 124

(8) వధీం వృత్రం మరుత[6] ఇన్ద్రియేణ స్వేన భామేన తవిషో బభూవాన్ ।

అహమేతా మనవే విశ్వశ్చన్ద్రాః సుగా[7] అపశ్చకర వజ్రబాహుః ॥ 125

1. శంసుతాసః, 2. మేఽఅద్రిః, 3, నోఽఅచ్ఛ, 4. తన్వంశుమ్భ, 5. వామా విష్ఠేన్ద్ర.

6. మరుతఽఇన్ద్రియేణ, 7. సుగాఽఅపశ్చ. (ప్రా.ప్ర.)

(9) అనుత్తమా తే మఘవన్నకిర్ను న త్వావాగ్ం[1] అస్తి దేవతా విదానః ।
న జాయమానో నశతే న జాతో యాని కరిష్యా కృణుహి ప్రవృద్ధ ॥ 126

(10) ఏకస్య చిన్మే విభ్వఁస్త్వోజో యా ను దధృష్వాన్ కృణవై మనీషా ।
అహం హ్యుఁగ్రో మరుతో విదానో యాని చ్యవమిన్ద్ర[2] ఇదీశ ఏషామ్ ॥ 127

(11) అమన్దన్మా మరుతః స్తోమో[3] అత్ర యన్మే నరః శ్రుత్యం బ్రహ్మ చక్ర ।
ఇన్ద్రాయ వృష్ణే సుమఖాయ మహ్యం సఖ్యే సఖాయస్తన్వే తనూభిః ॥ 128

(12) ఏవేదేతే ప్రతి మా రోచమానా[4] అనేద్యః శ్రవ ఏషో దధానాః ।
సంచక్ష్యా మరుతశ్చన్ద్రవర్ణా[5] అచ్ఛాన్త మే ఛదయాథా చ నూనమ్ ॥ 129

(13) కో న్వత్ర మరుతో మామహే వః ప్ర యాతన సఖీగ్ం[6]రచ్ఛా సఖాయః ।
మన్మాని చిత్రా[7] అపివాతయన్త ఏషాం భూత నవేదా మ[8] ఋతానామ్ ॥ 130

1. వాగ్ంఽఅస్తి, 2. మిన్ద్రఽఇదీశఽ ఏషామ్, 3. స్తోమోఽఅత్ర, 4. మానాఽఅనేద్యః శ్రవఽఏషో, 5. వర్ణాఽఅచ్ఛాన్త, 6. సఖీగ్ంఽరచ్ఛా, 7. చిత్రాఽఅపివాయన్తఽఏషా. 8. వేదామఽఋతానామ్. (వా.ప్ర.)

(14) ఆ యద్ దువస్యాద్ దువసే న కారురస్మాఞ్చక్రే మాన్యస్య మేధా ।

ఓ షు వర్త మరుతో విప్రమచ్ఛేమా బ్రహ్మాణి జరితా వో[1] అర్చత్ ॥ 131

(15) ఏష వః స్తోమో మరుత[2] ఇయం గీర్మాన్దార్యస్య మాన్యస్య కారోః ।

ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 132

ఇతి

ద్వితీయోఽష్టకే తృతీయోఽధ్యాయ

స్సమాప్తః

1. వోఽఅర్చత్, 2. మరుతఽఇయ (వ్రా.ప్ర.)

# అనువాకము—23, సూక్తము—165

ఋషి—3,5,7,9 మరుత్తులు 13,14.15 †అగస్త్యుఁడు

1,2,4,6,8,10,11,12 ఇంద్రుఁడు.

దేవత—మరుదింద్రులు*

‡ ఇంద్రుఁడు.

(1) క॥ సమ వసతులు సవయస్కులు, సమ మహిమము గలిగియున్న సరసమరుత్తుల్
కమనీయ భువిని వృష్టుల, నమితముగాఁ దృప్తిఁజేయ నమరునుగాదే! ॥ 157

గీ॥ మారుతము వృష్టిదాతయై మీరియుండు.ద్రవ్య మభివృద్ధిఁజేసెడు తలఁపుతోడ
వృష్టిదానంబులంగల్గి విపులమైన,బలముఁ బూజించుచున్నది పరమతుష్టి ॥ 158

(2) ఉ॥ ఎవ్వనిశ్రేష్ఠహవ్యము సమిద్ధమరుత్తులు పొందుచుండు నిం
కెవ్వఁడు మారుతంబు నితరేష్టులనుండి పరిగ్రహించు నిం
కెవ్విధి డేగఁబోలి చరియించు మరుత్తుల నుగ్గడింతు మిం
కెవ్విధి వారిఁ దుష్టులుగ మే మొనరింపఁగఁజాలు వారమో! ॥ 159

మరుత్తులు

(3) చ॥ పురుషుల నాయకుండవయి పూజ్యుఁడవై నను నింద్రదేవ ! నీ
వరిమురిఁబోవ నేలనొకొ ? యందుకుఁ గారణమేమొ ! దెల్పవే !
యరసినదాని మమ్ముడుగు మాదరవృత్తిని జూపు మాపయిన్
మరువకపల్కు నిచ్చగల మాటలనెల్ల వచింపు మెంతయున్ ॥ 160

† ఆంధ్రానువాద వ్రాతప్రతిలో (2వ. సంపుటము. 149వ పుట.) అగస్త్యుఁడు అని ఋషిని పేర్కొనుటకు మారుగా "ఆగస్యుఁడు" అని వ్రాయసగాఁడు వ్రాయుట జరిగినది. శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిన ఋషి దేవతల పట్టిక గల 15b సంఖ్యగల సంపుటములో "అగస్త్యుఁడు" అని విస్పష్టముగా వ్రాసిరి. అగస్త్యుఁడు వేరు ఆగస్యుఁడు వేరు. వీరు భిన్న ఋషులు. వ.గో.కృ.

* దేవతల విషయమై వ్రాతప్రతిలో నీ సూక్తమునకు (2వ. సంపుటము. 151వ. పుట) వ్రాయసగాఁడు ఇంద్రుఁడు మరుదింద్రాగస్త్యులు, నలువురు దేవతలుగాఁ బొరపాటున వ్రాసెను. శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిన 15b సంపుటములో నీ సూక్తములకుఁ గేవలము "మరుత్తులు" మాత్రమే దేవతలుగా వ్రాయుట జరిగినది. సంస్కృతమూల గ్రంథము లన్నింటను "మరుత్వానింద్రః" అని దేవతను బేర్కొనుట జరిగినది. ఆంధ్రానువాద పద్యములలో సైతము కేవలము మరుత్తులే కాక యింద్రుఁడుసైతము దేవతగా నుటంకింపఁబడినది. కావున నిక్కడ సూక్తానుగుణముగా మరుదింద్రులు దేవతలుగాఁ బేర్కొనుట జరిగినది. వ.గో.కృ.

‡ సంస్కృతమూలములోఁ బెక్కుప్రతులలో నీ సూక్తము సంభాషణా రూపమని లేకపోయినను సాయనభాష్యానుసారముగా నింద్రమరుత్తుల సంభాషణాప్రాయముగా నీ సూక్తమాంధ్రీకరింపఁబడినది. ఈ విషయమై యాంధ్రానువాదము వ్రాతప్రతిలో సరిగా వ్రాయలేదు. ఇతర విశేషములకు చూ. పీఠిక. వ.గో.కృ.

ఇంద్రుఁడు

(4) సీ॥ యజమానపరిదత్త హవ్యంబు లన్నియు స్థిరముగ నన్ను సంతృప్తిఁజేయు
సాంగంబులయ్యెడు సకలవేదంబులు స్థిరముగ నన్ను సంతృప్తిఁజేయుఁ
బండితుల్ చేసెడు పరమస్తుతులుకూడ స్థిరముగ నన్ను సంతృప్తిఁజేయు
సుఖకరంబైన నా సోమరసంబెల్ల స్థిరముగ నన్ను సంతృప్తిఁజేయు
గీ॥ సశ్వములు నన్నుఁ గొనిపోవు నభిముఖముగ, గాన నేఁబోవుచోటకు మానకుండ
వచ్చి సంతుష్టినొందుఁడు మెచ్చఁదగిన. పూజ్యతములార! యో పుణ్య పురుషులార! ॥ 161

మరుత్తులు

(5) ఉ॥ అందునఁ గాంతి వీర్య మహిమాఢ్య విరాజిత యాన మెక్కి సం
క్రందనదేవ! యజ్ఞములఁ గ్రాలెడు హవ్యపదార్థ జాత మే
మందముగా గ్రహింపమొకొ! యత్యభిమానపురస్సరంబుగాఁ
బొందవఁటయ్య! మా యిడెడు పూర్ణహవిస్సుల నీవు ప్రీతిమైన్ ॥ 162

ఇంద్రుఁడు

(6) చ॥ అమల మరుత్తులార! యహి మారణమున్ సమకూర్చునట్టి నా
విమల బలంబు మీరలదె? భీకరరూపము వీర్యసంపదన్
సమముగఁ గల్గువాఁడనయి చక్కని వజ్రముచేతఁ బూని నే
నమిత భయంకరుండయిన నా యరిఁ ద్రుంపక యూరకుందునే! ॥ 163

మరుత్తులు

(7) ఉ॥ ఎక్కువ కర్మఁజేయుటను నింద్ర! మహాప్రభు! నీవు మా పున
[1]స్సెక్కెడు గొప్పకార్యము లహీనముగా జరిపించినావు మే
మెక్కువ కృత్యముల్ జరుపు టెల్లజగంబు లెరుంగఁగాన మ
మ్మక్కఱతో మరుత్తు లని యందఱుఁ బిల్వఁగఁ గోరకుందుమే! ॥ 164

ఇంద్రుఁడు

(8) ఉ॥ నేను మరుత్తులార! కమనీయ పవిం గ్రహియించి వీర్యమున్
బూనుచు వృత్రదానవుని పోఁడిమిఁ బోవఁగ జేసి దీప్తితో
మానవ సంఘ తోష దమ మాన జలంబునుఁ గల్గఁజేసి స
న్మానముఁ బొందినాఁడ నభిమానపురస్సర యాగ కర్మలన్ ॥ 165

1. మామనస్సెక్కెడు (వ్రా.ప్ర.పా.)

మరుత్తులు

(9) ఉ॥ లేదు మహేంద్ర! నీవు కడులీలఁగఁ జేయని కార్య మేదియున్
గాదిల నీకుఁ దుల్యముగఁ గ్రాలెడు దేవత యొక్కఁడేనియున్
వాదుసుమీ! భవత్సదృశ బంధుర శక్తుల యున్కిమాట యే
భేదము లేక చేయుదురె? పెద్దలు నీవలె గొప్పకార్యముల్ ॥ 166

ఇంద్రుఁడు

(10) క॥ ఏ పనులఁ జేయఁదలఁతునో, యా పనులన్నియు నొనర్తు నతి శీఘ్రముగన్
జూపట్టిన విషయములనె, యోపి కడుంజక్కఁజేతు నో మారుతమా! ॥ 167

(11) తే॥ మునివరకృతమంత్రంబులు, తనివిం గలిఁగించు సంతసంబును నాకై
నెనలేని వర్షరూపక, ఘనకృత్యముఁ జేయవలదె! కరము మరుత్తుల్! ॥ 168

(12) ఉ॥ నన్ను గుతించి కృత్యము లనారతముం గలిపించి ప్రీతితో
నన్నము కీర్తి సంపద సమగ్రముగా గ్రహియింపరాదఁటే ?
క్రన్నన నాకుఁ గీర్తికరకార్యములం జరిపించి మీరలో
యన్నలు ! కీర్తి కాములయి యచ్ఛయశస్సును బొందకూడదే ! ॥ 169

తిరిగి యింద్రుఁడు

(13) క॥ మిమ్మీలోకంబందున, నమ్మిచుఁ బూజలనుఁ జేయు నరులకు మీరల్
సమ్మదము కలుఁగఁజేయుఁడు, నమ్ముఁడు నామాట యభిజనార్చితులారా ! ॥ 170

(14) క॥ నిత్యము విప్రులు మీకై, సత్యమతిన్ నుతులఁ గ్రియల సలిపినయెడలన్
నిత్యము మరుత్తులారా!, సత్యమతిన్ వారిఁ గనుఁడు చక్కనిబుద్ధిన్ ॥ 171

(15) క॥ ఇప్పటి మంత్రము లన్నియుఁ, దప్పక మీ ప్రీతికొఱకె దర్శింపఁబడెన్
మెప్పుగను నుతిపరంపర, తప్పక మిముఁ బొందుఁగాక! ధర్మపథజ్ఞుల్ ॥ 172

క॥ తను సంపోషణమునకై, యనయం బన్నంబు మేము యాచించెద మో
ఘనులార! యన్నబలములత్, ననుకంపన్ మీ రొసంగ నధిపతులుసుఁడీ! ॥ 173

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన
భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు
ద్వితీయాష్టకమునఁ దృతీయాధ్యాయము
సమాప్తము

---

† ఈ సందర్భమున సాయనాదుల వ్యాఖ్యలు తికమకలుగా నున్నవి. అస్పష్టముగా నైత మున్నవి. ఒక దృష్టితోఁ జూచిన నింద్రుఁ డష్టదిక్పాలకులకు నన్నమును (పులగమును = పొంగలిని) బలిగా నిచ్చు విషయము ప్రస్తావించినట్లు గ్రహింప వలయును. "అన్నబలముల" ననఁగా "అన్నబలుల" నని గ్రహింపవలయును. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

ద్వితీయోఽష్టకః చతుర్థోఽధ్యాయః

### సూక్తమ్ 166

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—మరుతః

ఛందః—జగతీ; 14-15 త్రిష్టుప్.

(1) తన్ను వోచామ రభసాయ జన్మనే పూర్వం మహిత్వం వృషభస్య కేతవే ।
ఐధేవ యామన్ మరుతస్తువిష్వణో యుధేవ శక్రాస్తవిషాణి కర్తన ॥ 1

(2) నిత్యం న సూనుం మధు బిభ్రత[1] ఉప క్రీళన్తి క్రీళా విదథేషు ఘృష్వయః ।
నక్షన్తి రుద్రా[2] అవసా నమస్వినం న మర్ధన్తి స్వతవసో హవిష్కృతమ్ ॥ 2

(3) యస్మా[3] ఊమాసో అమృతా అరాసత రాయస్పోషం చ హవిషా దదాశుషే ।
ఉక్షన్త్యస్మై మరుతో హితా[4] ఇవ పురూ రజాంసి పయసా మయోభువః ॥ 3

1. బిభ్రతఽఉప, 2. రుద్రాఽఅవసా, 3. యస్మాఽఊమాసోఽఅమృతా, 4. హితాఽఇవ. (వ్రా.ప్ర.)

(4) ఆ యే రజాంసి తవిషీభిరవ్యత ప్ర వ[1] ఏవాసః స్వయతాసో[2] అధ్రజన్ ।

భయన్తే విశ్వా భువనాని హర్మ్యా చిత్రో వో యామః ప్రయతాస్వృష్టిషు ॥ 4

(5) యత్ త్వేషయామా నదయన్త పర్వతాన్ దివో వా పృష్ఠం నర్యా[3] అచుచ్యవుః ।

విశ్వో వో[4] అజ్మన్ భయతే వనస్పతీ రథీయన్తీవ ప్ర జిహీత[5] ఓషధిః ॥ 5

(6) యూయం న ఉగ్రా మరుతః సుచేతునా ఽరిష్టగ్రామాః సుమతిం పిపర్తన ।

యత్రా వో దిద్యుద్ రదతి క్రివిర్దతీ రిణాతి పశ్వః సుధితేవ బర్హణా ॥ 6

(7) ప్ర స్కమ్భదేష్ణా[6] అనవభ్రరాధసో ఽలాతృణాసో విదథేషు సుష్టుతాః ।

అర్చన్త్యర్కం మదిరస్య పీతయే విదుర్వీరస్య ప్రథమాని పౌంస్యా ॥ 7

(8) శతభుజిభిస్తమభిహ్రుతేరఘాత్ పూర్భీ రక్షతా మరుతో యమావత ।

జనం యముగ్రాస్తవసో విరప్శినః పాథనా శంసాత్ తనయస్య పుష్టిషు ॥ 8

1. ప్రవఽఏవాసః, 2. స్వయ తాసోఽఅధ్రజన్, 3. నర్యాఽఅచు, 4. వోఽఅజ్మన్, 5. జిహీతఽఓషధిః, 6. దేష్ణాఽఅనవ, (ప్రా.ప్ర.)

(9) విశ్వాని భద్రా మరుతో రథేషు వో మిథస్పృధ్యేవ తవిషాణ్యాహితా ।
అంసేష్వా వః ప్రపథేషు ఖాదయోఽక్షో వశ్చక్రా సమయా వి వావృతే ॥ 9

(10) భూరీణి భద్రా నర్యేషు బాహుషు వక్షస్సు రుక్మా రభసాసో[1] అఞ్జయః ।
అంసేష్వేతాః పవిషు క్షురా[2] అధి వయో న పక్షాన్ వ్యను శ్రియో ధిరే ॥ 10

(11) మహాన్తో మహ్నా విభ్వో౩ విభూతయో దూరేదృశో యే దివ్యా[3] ఇవ స్తృభిః ।
మన్ద్రాః సుజిహ్వాః స్వరితార[4] ఆసభిః సంమిశ్లా ఇన్ద్రే మరుతః పరిష్టుభః ॥ 11

(12) తద్ వః సుజాతా మరుతో మహిత్వనం దీర్ఘం వో దాత్రమదితేరివ వ్రతమ్ ।
ఇన్ద్రశ్చన త్యజసా వి హ్రుణాతి తజ్జనాయ యస్మై సుకృతే[5] అరాధ్వమ్ ॥ 12

(13) తద్ వో జామిత్వం మరుతః పరే యుగే పురూ యచ్ఛంసమమృతాస[6] ఆవత ।
అయా[7] ధియా మనవే శ్రుష్టిమావ్యా సాకం నరో దంసనైరా చికిత్రిరే ॥ 13

1. సాసోఽఞ్జ, 2. క్షురాఽధి. 3. దివ్యాఽఇవ, 4. స్వరితారఽఆసభిః సంమిశ్లాఽఇన్ద్రే, 5. సుకృతేఽఅరాధ్వమ్,
6. తాసఽఆవత, 7. అయాః. (వ్రా.ప్ర.)

(14) యేన దీర్ఘం మరుతః శూశవామ యుష్మాకేన పరీణసా తురాసః ।

ఆ యత్ తతనన్ వృజనే జనాస[1] ఏభిర్యజ్ఞేభి స్తదభీష్టిమశ్యామ్ ॥ 14

(15) ఏష వః స్తోమో మరుత ఇయం గీర్మాన్దార్యస్య మాన్యస్య కారోః ।

ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 15

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

### ద్వితీయాష్టకము—చతుర్థాధ్యాయము

### సూక్తము—166

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—మరుత్తులు

(1) క॥ అభిమతఫలముల నొసఁగుట, కభినవ యజనప్రదేశ మధిరోహింపన్
శుభకర మగు మీ తత్త్వము, రభసంబునఁ దెలుప రండు రాజత్కీర్తుల్! ॥ 1

1. జనాసఽఏభి. (వ్రా.ప్ర.)

* ఈ 166 సూక్తము మొదలు 191 సూక్తమువఱకును నక్కడక్కడఁ గొన్ని ఋక్కులకు ఋషులు వేరు వేరు వారున్నను సంస్కృతమూల ప్రతులలో ఋషి అగస్త్యుఁడు మైత్రావరుణుఁ డని కలదు. శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసిన ఋషి దేవతల పట్టికల సంపుటమైన 15b సంఖ్యగల వ్రాతప్రతిలో "అగస్త్యుఁడు" ఋషిగాఁ బేర్కొన్నారు. కాఁగా వారు చూచిన సంస్కృత మూల ప్రతి విభిన్నమైనదిగాఁ దోచును. వ.గో.కృ.

క॥ ధ్వనిఁ జేయుచుఁ జరియించెదు, ఘనులారా ! యాగములకుఁ గదలెదు నపు డీ
రనులకుఁ జను జనుల విధం, బనయముఁ దేజస్సుఁ జూపు చరిగెదరుకదా ! ॥ 2

(2,3) సీ॥ మధురహవ్యంబుల మంచి పుత్రుని మాట్కి- ధరియించెదరు మీరు ధన్యులార !
ప్రౌఢరాక్షసులను బాధించుచున్ భూమి విహరించెదరు మీరు వీరులార !
హవ్యంబు లిచ్చెడు యజమాన గణముల రక్షించెదరు మీరు రాజులార !
భజియించుచున్నట్టి యజమానులకుఁ దుష్టి నందించెదరు మీర లయ్యలార !
గీ॥ ఇచ్చెదరు మీర లమృతులై యెసఁగ మెసఁగ, విత్తవృద్ధిని బహువృద్ధి వివిధరీతిఁ
జేయుదురు[1] సుఖపరంపరఁ జెలిమికానిఁ, బోలి జలముల నొసఁగెద రోలి భువికి ॥ 3

(4) ఉ॥ సారథిచేతఁ బూన్పఁబడు చక్కని యాన హయాళి యంతటన్
బారుఁ దనంతఁదానె బహుభంగుల యుద్ధపు సాధనంబులన్
జేరి భ్రమించు వారివలెఁ జిత్ర విచిత్రములైన మీ సుసం
చారముఁ జూచి భూతముల సంతతి భీతిలుఁ గాదె ! దేవతల్ ! ॥ 4

(5) క॥ [2]మొనయుచుఁ బర్వతగుహలున్, ధ్వనియింపఁగఁ జేయు నపుడు వాయువులు నభం
బున సంచరించునప్పుడు, ఘనవృక్షము లెల్లమిగులఁ గంపింప వొకో ! ॥ 5

(6) క॥ బలముగల మారుతంబా !, వెలసెడు మానసముతోడ విలసిల్లెడు నీ
విలఁగల హింసలఁ గొట్టుచు, నలరెడు కార్యము లొనర్చి యరుగరె! ప్రీతిన్ ॥ 6

(7) చ॥ ఎడతెగనట్టి దానపరు లేమియు లోపము లేనివార లీ
పుడమి విశేషసంపదలఁ బొందిన వారలు ఋత్విజాళిచేఁ
గడు నుతులొందు వార లగు కాంతియుతాత్మమరుత్తు లెంతయున్
వడి హరికార్యముల్ వినుచు వానికిఁ బూజ లొనర్చుచుండరే ! ॥ 7

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచ లఘుగణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

2. గమనముతో గిరిగుహలన్ (తొ.పా.). తొలుత నీ పాదముతోఁ బద్యము వ్రాయఁదలఁచి పిదప "ధ్వని"ని దృష్టిలో నుంచుకొని "న"కారప్రాసగల పద్యముగా శ్రీ నేమానివారు మార్చినట్లు స్పష్టమగుచున్నది. వ.గో.కృ.

(8) ఉ॥ ఎవ్వరు పాపసంఘముల నెల్ల హరించుచు రక్ష లిత్తురో ;
యెవ్వరు కాంతివంతులయి యెల్లరఁ బుత్రులఁ గాచుచుందురో
యివ్విధ దేవతోత్తమము లెల్లరు మానవజాతి కిచ్చుతో
నెవ్విధినైన భాగ్యముల నిత్తురు శాత్రవ పట్టణంబుతోన్ ॥ 8

(9) సీ॥ ఎవ్వరి యానము లినుమడించిన భోగ భాగ్య రాశులచేతఁ బరిఢవిల్లు
నెవ్వరి బాహువు లిలఁ బ్రకాశించుచు నసమానబలముచే నమరియుండు
నెవ్వరి మార్గము లెనలేని ఖాద్య విశేషంబులం గూడి చెలఁగుచుండు
నెవ్వరి యానంపు టిరుసు చక్రంబుల నటు నిటుఁ బోకుండ నాపుచుండు
గీ॥ నట్టి మీ కన్నివిధముల నమరియున్న, సాధనంబులు గలవౌట సరసులార ;
మత్కృతేష్టికి విచ్చేసి మమ్ము మిగులఁ, గావఁగా రారె ; యెంతయుఁ గరుణ మీరు ॥ 9

(10) సీ॥ మీ భుజంబులతో నమేయమౌ ధనరాశి ధరియించుచున్నారు తప్పకుండ
మీ యురస్సులయందు మేలగు రత్నముల్ ధరియించుచున్నారు తప్పకుండ
మీ బాహువులయందు మేలగు హారముల్ ధరియించుచున్నారు తప్పకుండ
మీ కరంబులు పవిమించు నాయుధముల ధరియించుచున్నారు తప్పకుండ
గీ॥ పక్షి గణముల ఱెక్కలు బహువిధంపు, వర్ణములఁ[1] గలిఁగినట్టులు వలసి నన్ని
స్వర్ణభూషణములచేత సర్వ తను వి,భూషితులరయి యున్నారు పూజ్యులార ; ॥ 10

(11,12) సీ॥ ప్రభుధర్మములతోడ భాగ్య మందినవారు సర్వలోకములకు సాగువార
లంతరిక్షమునందు నమరు తారలఁ బోలి దూరస్థలంబులఁ జేరువారు
సంతోషయుక్తులై జరుగుచుండెడి వార లధికసంపత్తుల నమరువారు
సుందర జిహ్వాగ్ర శోభ నొప్పెడు వారు ప్రేమ వాక్కులతోడఁ బిలుచువార
గీ॥ లౌ మరుత్తులు మీ దానమదితిదాన, రీతికంటె నవిచ్చిన్నరీతి నొప్పు
జనుల కిచ్చెదు మీ యీవి శత్రుభేది, దానసామ్యము నందదె? దాతలార ; ॥ 11

1. ఈ తేటగీతి రెండవపాదమునఁ బంచలఘుగణ మింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వర్ణములఁ గల్గినట్టులు వలసినన్ని అని సలక్షణముగా వ్రాయఁగల్గి యుండియు శ్రీ నేమానివారు బుద్ధి పూర్వకముగనే చంద్రగణము నుపయోగించిరి. వ.గో.కృ.

(13) క॥ చిరకాలపు సంబంధం, బరమర లేకుండ మనకు సమరుటచే మా
పరమస్తోత్రము నంతయుఁ, గరము వినుఁడు శ్రేష్ఠులార! ఘను లగు మీరల్! ॥ 12

క॥ మానవులయం దనుగ్రహ, మూనుచు సత్కర్మ చేయుచుండిన వారిన్
మానుగ సంరక్షించెదు, జ్ఞానప్రదమారుతంబు జన్మోత్తరమౌన్ ॥ 13

(14) ఉ॥ రాకలచేత నిష్ఠులకు రక్షలఁ బెట్టుచు నుందు రింక మీ
రాకలచేత ఋత్విజులు రమ్యజయంబులఁ బొందుచుందు రా
రాకలచేత మమ్ములను రంజిలఁజేయ ననుగ్రహించి య
స్తోకదయాస్వరూపులయి చూడఁగ రారఁటె! మమ్ము దేవతల్! ॥ 14

(15) గీ॥ మాననీయుఁడై స మాందార్యుఁడనుమాని, సుతు లొనర్చె మీకు సతులభక్తి
నట్టి నుతులవలన నధికాయురారోగ్య,ములను బొందఁగలము ముఖ్యులార! ॥ 15

## సూక్తమ్—167

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—1-ఇంద్రః: 2-11 మరుతః

ఛందః—త్రిష్టుప్; (10-పురస్తాజ్జ్యోతిః)

(1) సహస్రం త[1] ఇన్ద్రోతయో నః సహస్రమిషో హరివో గూర్తతమాః ।
సహస్రం రాయో మాదయధ్యై సహస్రిణ[2] ఉప నో యన్తు వాజాః ॥ 16

(2) ఆ నోఽవోభిర్మరుతో యాన్త్వచ్ఛా జ్యేష్ఠేభిర్వా బృహద్దివైః సుమాయాః ।
అధ యదేషాం నియుతః పరమాః సముద్రస్య చిద్ధనయన్త పారే ॥ 17

1. తఽఇన్ద్రో, 2. సహస్రిణఽఉప, (ప్రా.ప్ర.)

(3) మిమ్యక్ష యేషు సుధితా ఘృతాచీ హిరణ్యనిర్ణిగుపరా న[1] ఋష్టిః ।

గుహా చరన్తీ మనుషో న యోషా సభావతీ విదథ్యేవ సం వాక్ ॥ 18

(4) పరా శుభ్రా[2] అయాసో యవ్యా సాధారణ్యేవ మరుతో మిమిక్షుః ।

న రోదసీ[3] అప నుదన్త ఘోరా జుషన్త వృధం సఖ్యాయ దేవాః ॥ 19

(5) జోషద్ యదీమసుర్యా సచధ్యై విషితస్తుకా రోదసీ నృమణాః ।

ఆ సూర్యేవ విధతో రథం గాత్ త్వేషప్రతీకా నభసో నేత్యా ॥ 20

(6) ఆస్థాపయన్త యువతిం యువానః శుభే నిమిశ్లాం విదథేషు పజ్రామ్ ।

అర్కో యద్ వో మరుతో హవిష్మాన్ గాయద్ గాథం సుతసోమో దువస్యన్ ॥ 21

(7) ప్ర తం వివక్మి వక్మ్యో య[4] ఏషాం మరుతాం మహిమా సత్యో[5] అస్తి ।

సచా యదీం వృషమణా[6] అహంయుః స్థిరా చిజ్జనీర్వహతే సుభాగాః ॥ 22

1. నఋష్టిః, 2. శుభ్రాఽఅయా, 3. రోదసీఽఅప, 4. యఽఏషాం, 5. సత్యోఽఅస్తి, 6. వృషమణాఽఅహం, (ప్రా.ప్ర.)

(8) పాన్తి మిత్రావరుణావవద్యాచ్చయత ఈమర్త్యమో[1] అప్రశస్తాన్ ।

[2]ఉత చ్యవన్తే అచ్యుతా ధ్రువాణి వావృధ[3] ఈం మరుతో దాతివారః ॥ 23

(9) నహీ ను వో మరుతో[4] అన్త్యస్మే ఆరాత్తాచ్చిచ్ఛవసో అన్తమాపుః ।

తే ధృష్ణునా శవసా శూశువాంసో ఽర్ణో న ద్వేషో ధృషతా పరి ష్ఠుః ॥ 24

(10) వయమద్యేన్ద్రస్య ప్రేష్ఠా వయం శ్వో వోచేమహి సమర్యే ।

వయం పురా మహి చ నో[5] అను ద్యూన్ తన్న[6] ఋభుక్షా నరామను ష్యాత్ ॥ 25

(11) ఏష వః స్తోమో మరుత[7] ఇయం గీర్మాన్దార్యస్య మాన్యస్య కారోః ।

ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 26

---

1. యమోఽప్ర, 2. ఉత చ్యవన్తేఽచ్యు, 3. వృధఽఈం, 4. మరుతోఽన్త్యస్మేఽరా......వసోఽన్త, 5. నోఽను, 6. తన్నఽఋభుక్షా, 7. మరుతఽఇయం (ప్రా.ప్ర.)

## సూక్తము 167

### ఋషి—అగస్త్యుఁడు*

### దేవత—ఇంద్రుఁడు, మరుత్తులు†

(1) క॥ హరి! నీ సంరక్షణములు, గురుతర సౌఖ్యంబునెల్లఁ గూర్చెడు ధనమున్
సురుచిరపశ్వాన్నంబుల, స్థిరముగ మా కిచ్చి తృప్తిఁజేయుత మమ్మున్ ॥ 16

(2) గీ॥ అలప్రసిద్ధమైన నా మారుతము మాకు, నెదుటఁబడుచు మిగుల నెలమితోడ
శ్లాఘ్యధనమునెల్ల సంగ్రహించుచు వచ్చి, యొసఁగుఁగాక! మాకు నుచితరీతి ॥ 17

గీ॥ వర నియత్తులనెడి వాజులు నీరధి, కవలి యొడ్డు నున్న నధికధనము
నైన మీకు నిచ్చు నదికారణంబుగా, ధనము నీయరారె! దాతలార! ॥ 18

(3) సీ॥ ఉదకదానములచే నోలి భూతాళికిఁ బాయక మేలులు చేయునట్టి
యంతఃపురాంగన ననుసరించుచు గుహ్యావిద్యుత్తుతోఁగూడ వెలయు నట్టి
యాగమవాక్కుల యాడంబరముఁ బోలి గర్జించు చంతటఁ గదలునట్టి
మేఘపంక్తులతోడ మెలఁగుచు నేవేళ సర్వకార్యంబులు సలుపునట్టి
గీ॥ ఘనమరుత్తులు ప్రీతితోఁ గరుణఁ బూని, వచ్చి ధనపుత్రబలముల నిచ్చి మాకు
నాయురారోగ్యసంపత్తు లందఁజేసి, సంచరింతురుగావుత సంతసమున ॥ 19

(4) ఉ॥ భోగముదానితో మిగుల భోగ మొనర్చిన భోగి మాట్కి వే
సాగెడు మించుతోఁ గలసి సంగమ మొంది మరుత్తులంత వే
వేగము మేఘమండలము బిట్టు జలంబుల నిచ్చునట్లుగా
రాగ మెలర్పఁ జేయుచును రంజిలు చుందురుగాత నెప్పుడున్ ॥ 20

గీ॥ ఘోరకృత్యము లొనరించు వీరమారు,తంబు రోదసికిన్ నిరాదరణ మెంత
మాత్రముం జేయకయె దాని మహితవృద్ధిఁ, గోరి లోకప్రతీతినిఁ గూర్చుఁగాత! ॥ 21

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట చూడనగును. వ.గో.కృ.

† సంస్కృతమూలము ప్రకారముగాని యనువాద పద్యముల ననుసరించిగాని తొలి ఋక్కున కింద్రుఁడును మిగిలి ఋక్కులకు మరుత్తులును దేవతలు. వ్రాతప్రతిలోఁ (2వ. సంపుటము. 163వ పుట.) దేవల మింద్రుఁ డొక్కఁడే దేవత వ్రాయసగాఁడు వ్రాసెనుగాని శ్రీ నేమానివారు స్వయముగా వ్రాసినఋషి దేవతల పట్టికలుగల 15b సంపుటములో నింద్రమరుత్తుల దేవతలుగా వ్రాసిరి. వ.గో.కృ.

(5) చ॥ పురుషులయందుఁ బ్రీతిఁగొని పూజ్య మరుత్తులతోడఁ గూడి తా
నరిమురియైన వేళముల యందముగల్గిన వెల్గు[1] సూర్య సుం
దర రథ మెక్కి సూర్యవలెఁ దప్పక మారుత యాన మెక్కి చుం
గరముఁ జరించుచుండుఁ దను గాంతుల నిచ్చుచు లోకమంతకున్ ॥ 22

(6) చ॥ స్తుతు లొనరించి యజ్ఞముల సుందరహవ్యములన్ ధరించి మీ
కతిముద మిచ్చు సోమరస మందుచు ఋక్కుల మానవుండు స
న్మతిఁ బలియించుచున్న డతిమానుష యానమునందుఁ జంచలా
సతి నిడికొంచు మా కడకుఁ జల్లఁగ రారొకొ! దేవతోత్తముల్ ॥ 23

(7) చ॥ ఘనములు వర్ష మిచ్చునటుఁ గన్ననఁ జేయుచుఁ జావు లేనిదై
తన[2]రుప కారకర్తృ యను తత్త్వమునన్ విలసిల్లు దేవితో
ననుపుగఁ గూడి కొంచుఁ బ్రజ నాదారవృత్తి వహించు మిమ్ము నే
ననయము వేడుచుంటి మహిమాతిశయాత్మకులార! కానరే! ॥ 24

(8) గీ॥ అర్యముఁడు [3]వరుణ మిత్రులు యజనములను, దోషములనుండి రక్షింపఁ దోడుచుండు
వారిలో సర్వముం దనువాఁడు మిగుల, ధన సమృద్ధిని గల్పించు ధన్యులార! ॥ 25

(9) గీ॥ మే మెఱుంగఁగలమె! మీ బలాధిక్యంబు, కొంచెమైన నెట్టి కొఱవ లేక
యుంబు పథికమూళి సణఁచెడునట్టులు, మారుతంబ! శత్రు మహిమఁ గొట్టు ॥ 26

(10) క॥ కాల త్రయములయందుం, జాలిన యభిమతముకొఱకు శక్రుని మే మే
జాలము లేకయె గొలిచెద, మేలాగునొ [4]మ మ్మనుగ్రహించుగ నతఁడే! ॥ 27

(11) క॥ స్తుతిరూపక మగు వాక్యము, మతిమన్మందార్యరచిత మైనది యిదియే!
యతులిత మగు నారోగ్యము, తతబలము నొసంగు ధన్యతములకు నిదియే! ॥ 28

---

1. మించు (తొ.పా.) "మెఱ్ఱు" (వ్రా.ప్ర.పా.) "మెఱ్ఱు" అని శ్రీనేమానివారు స్వయముగా సవరించిరి. శకటరేఫముతో నన్యహల్ సంయుక్త ముండనేరదు, మెఱ్ఱు పదమును గ్రావ్యముగాలేదు. కాన "వెల్గు" అని సవరింపఁబడినది. వ.గో.కృ.

2. ఇక్కడఁ దద్ధర్మార్థకోకార సంధి ప్రయుక్తమైనది. 3. ఇక్కడఁ బంచలఘు గణ మింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ. 4. "మేలాగునొ మమ్మను గ్రహించును నతఁడే" అని తొలి పాఠముగ వ్రాసి (వ్రాతప్రతి 2వ. సంపుటము. 165వ పుట) శ్రీ నేమానివారే స్వయముగా "మేలాగునొ యతఁడు మమవహించును గాదే!" అని సవరించిరి. గణభంగ దోష నివారణకై "మమ్ము" శబ్దములోని జమిలి మాకు శ్రీ నేమానివారు లోపము చేసి ప్రయోగించిరి. జడ్డక్కరములో స్వరసంధి జరిగిన జడ్డకు లోపము రాదని వారు గుర్తింపలేదు. అంతియకాదు. ఆవహించురూపమునకు మారుగా "అవహించు" రూపమును బ్రయోగించిరి. అనుగ్రహించుటకును ఆవహించుటకును సంబంధమే లేదు. సాయనులు "అనుకూల మతిమతో భవతు" అని వ్రాసిన దానికి నావహించు నను నర్థము రాదు. ఆవహించుట యనఁగా నావేశించుట పూనకము వచ్చుట యని యర్థము. ఈ యర్థమిక్కడ సరిపడదు కాన శ్రీ నేమానివారి తొలిపాఠమే "కదార్థక" మగునట్లుగా నిచ్చుటజరిగినది. వ.గో.కృ.

## సూక్తమ్—168

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—మరుతః

ఛందః—జగతీ, 8.10 త్రిష్టుప్

(1) యజ్ఞాయజ్ఞా వః సమనా తుతుర్వణిర్ధియంధియం వో దేవయా[1] ఉ దధిధ్వే ।

ఆ వోఽర్వాచః సువితాయ రోదస్యోర్మహే వవృత్యామవసే సువృక్తిభిః ॥ 27

(2) వవ్రాసో న యే స్వజాః స్వతవస[2] ఇషం స్వరభిజాయన్త ధూతయః ।

సహస్రియాసో[3] అపాం నోర్మయ[4] ఆసా గావో వన్ద్యాసో నోక్షణః ॥ 28

(3) సోమాసో న యే సుతాస్తృప్తాంశవో హృత్సు పీతాసో దువసో నాసతే ।

ఐషామంసేషు రమ్భిణీవ రారభే హస్తేషు [5]ఖాదిశ్చ కృతిశ్చ సం దధే ॥ 29

(4) అవ స్వయుక్తా దివ[6] ఆ వృథా యయురమర్త్యాః కశయా చోదత త్మనా ।

అరేణవస్తువిజాతా[7] అచుచ్యవుర్దృళ్[8]హాని చిన్మరుతో భ్రాజదృష్టయః ॥ 30

1. దేవయాఽఉద, 2. వసఽఇషం, 3. యాసోఽఅపాం, 4. మయఽఆసా, 5. వాదిశ్చ. 6. దివఽఆ 7. జాతాఽఅచు,

8. దృళ్హాని, (వ్రా.ప్ర.)

(5) కో వోఽన్తర్మరుత[1] ఋష్టివిద్యుతో రేజతి త్మనా హన్వేవ జిహ్వయా ।

ధన్వచ్యుత[2] ఇషాం న యామని పురుప్రైషా[3] అహన్యో౩ నైతశః ॥ 31

(6) క్వ స్విదస్య రజసో మహస్పరం క్వావరం మరుతో యస్మిన్నాయయ ।

యచ్చ్యావయథ విథురేవ సంహితం వ్యద్రిణా పతథ త్వేషమర్ణవమ్ ॥ 32

(7) సాతిర్న వోఽమవతీ స్వర్వతీ త్వేషా విపాకా మరుతః పిపిష్వతీ ।

భద్రా వో రాతిః పృణతో న దక్షిణా పృథుజ్రయీ[4] అసుర్యేవ జఞ్జతీ ॥ 33

(8) ప్రతి ష్టోభన్తి సిన్ధవః పవిభ్యో యదభ్రియాం వాచముదీరయన్తి ।

అవ స్మయన్త విద్యుతః పృథివ్యాం యదీ ఘృతం మరుతః ప్రుష్ణువన్తి ॥ 34

(9) అసూత పృశ్నిర్మహతే రణాయ త్వేషమయాసాం మరుతామనీకమ్ ।

తే సప్సరాసోఽజనయన్తాభ్వమాదిత్ స్వధామిషిరాం పర్యపశ్యన్ ॥ 35

1. మరుతఽఋష్టి. 2. ధన్వచ్యుతఽఇషా. 3. పురుప్రైషాఽఅహిన్యో. 4. పృథుయీఽఅసు. (ప్రా.ప్ర.)

(10) ఏష వః స్తోమో మరుత[1] ఇయం గీర్మాన్దార్యస్య మాన్యస్య కారోః ।

ఏషా యాసీష్ట తన్వే వయాం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 28

## సూక్తము—168

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—మరుత్తులు

(1) క॥ ప్రతియజ్ఞమందు మీరలు, సతతము వర్తించుచుండి సమ మతులారా!
ప్రతికర్మముఁ జేయుటచేఁ, దతరోదసిఁ గావ మీకు దండం బిడమే! ॥ 29

(2,3) సీ॥ దేహధారులవలెఁ దిఱుగుచు నేవేళ శక్తివంతులవలె జరుగుచుండి
చంచలాత్ములవలెఁ జరియించు చేవేళ నిర్హేతుకులవలె నిలుచుచుండి
యూర్మిసంక్తులవలె నుబ్బుచు నేవేళ నినవృష్టివలె సుఖ మిచ్చుచుండి
గోవులవలెఁ గోర్కెఁ గూర్చుచు నేవేళఁ జిత్రసోమమువలెఁ జెలఁగుచుండి
గీ॥ సోమపాన మొనర్చెడు సోమయాజి, చిత్తసంతోష మొదవింపఁ జేరుచుండి
యోగ్య పరిచారకులవలె నుచితరీతి, మీరు వర్తించుచున్నారు వీరులార! ॥ 30

క॥ పురుషాలింగనకాంక్షిత, వరవనితంబోలి శక్తి వరలెడు యుష్మ
త్సురుచిరభుజభాగంబునఁ, గరములఁ గవచాసులుండు ఘనమతులారా! ॥ 31

(4,5) సీ॥ అన్యోఽన్యమైత్రిచే నలరు మరుత్తులు వెలయించుచున్నారు పెక్కు పనుల
సకల యజ్ఞములకు జరుగు మరుత్తులు కదలించుచున్నారు గట్టులెల్ల
నమరస్వభావులై యమరు మరుత్తులు వచ్చుచునున్నా రవార్యగతుల
నాల్కచే దౌడలు నటియించునట్టులు చరియించుచున్నారు సహజవిభుల
గీ॥ నన్న[1]సాధకసస్యము నందుటకయి, ఘనము బహుముఖ్య మగునట్లు చనెడువారి
యన్నమునకయి శిక్షార్హమయిన హయముఁ, బోలి ప్రార్థించుచున్నాఁడు భువనవర్తి ॥ 32

---

1. మరుతఽఇయం (వా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో.కృ.

1. నన్నసాధకములగు సస్యాదులకయి (తొ.పా.)

(6) క॥ ఉదకాద్యంతము లెక్కడ?, యుదకముచే నిండియున్న నూర్జిత ఘన స
మ్మదమును గొట్టుచుఁ బవిచే, నుదకము కలిఁగించుచుండి రుచితప్రజ్ఞల్ ॥ 33

(7) సీ॥ స్వప్రకాశముఁ గల్గి స్వర్గప్రదాయియై సంపూర్ణఫలదమై సాగు నెద్ది?
చక్కని సుఖమిచ్చి శత్రునాశకమయి భద్రనుత్యర్హమై పరఁగు నెద్ది?
దాతృప్రదత్తమౌ దక్షిణవలె మనస్సంతుష్టి నొందింపఁ జాలు నెద్ది?
యసురులచేతి శక్త్యాయుధమునుబోలి యంతయు నార్జింప నరుగు నెద్ది?
గీ॥ అట్టి మీ దానసంపత్తి యఖిలమునకు, మీ సునిక్షేపమునుబోలి మెఱయుచుండి
సుఖము కలిఁగించుచుండదే! శూరులార!, కాంతియుతులార! యో మరుద్గణములార! ॥ 34

(8) ఉ॥ ఎప్పుడు మేఘమండలములెల్లఁ బవిం గడుఁ గొట్టినారలో!
యప్పుడు శంప యంబరమునందు వెలుంగదె! గాలులార! మీ
రెప్పుడు వర్ష బిందువు లహీనముగాఁ బడఁజేయుచుందురో!
యప్పుడు హ్రాదినీ జలధులందలి వారి చలింపకుండునే! ॥ 35

(9) ఉ॥ మే లగు పృశ్నికాంత యల మేఘసమూహముతోడ యుద్ధముం
జాలుగఁ జేయ మారుతము సౌఖ్యముగాఁ బ్రభవించె నద్దియే
జాలముఁ జేయకుండఁ దగు సస్యసమృద్ధి నొసంగ నెంచి యా
ఖీలఘనంబుఁగొట్టి యతి భీకరవర్షము నిచ్చి యుండదే! ॥ 36

(10) క॥ స్తుతిరూపక మగు వాక్యము, మతిమన్మాందార్యరచితమైనది యిదియే
యతులిత మగు నారోగ్యము, తతబలము నొసంగు ధన్యతములకు వరుసన్ ॥ 37

## సూక్తమ్—169

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్, 2-చతుష్పదా విరాట్.

(1) మహశ్చిత్ త్వమిన్ద్ర యత[1] ఏతాన్ మహశ్చిదసి త్యజసో వరూతా ।

స నో వేధో మరుతాం చికిత్వాన్ త్సుమ్నా వనుష్వ తవ హి ప్రేష్ఠా ॥ 37

1. యతఽఏతాన్. (ద్రా.ప్ర.)

(2) అయుజ్రన్త[1] ఇన్ద్ర విశ్వకృష్టీర్విదానాసో నిష్షిధో మర్త్యత్రా ।

మరుతాం పృత్సుతిర్హాసమానా స్వర్మీళ్హ[2]స్య ప్రధనస్య సాతౌ ॥ 38

(3) అమ్యక్ సా త ఇన్ద్ర ఋష్టిరస్మే సనేమ్యభ్వం మరుతో జునన్తి ।

అగ్నిశ్చిద్ధి ష్మాతసే శుశుక్వానాపో న ద్వీపం దధతి ప్రయాంసి ॥ 39

(4) త్వం తూ న[3] ఇన్ద్ర తం రయిం [4]దా ఓజిష్ఠయా దక్షిణయేవ రాతిమ్ ।

స్తుతశ్చ యాస్తే చకనన్త వాయోః స్తనం న మధ్వః పీపయన్త వాజైః ॥ 40

(5) త్వే రాయ[5] ఇన్ద్ర తోశతమాః ప్రణేతారః కస్య చిదృతాయోః ।

తే షు ణో మరుతో మృళయన్తు యే స్మా పురా గాతూయన్తీవ దేవాః ॥ 41

(6) ప్రతి ప్ర యాహీన్ద్ర మీ[6]ళ్హుషో నౄన్ మహః పార్థివే సదనే యతస్వ ।

అధ యదేషాం పృథుబుధ్నాస[7] ఏతాస్తీర్థే నార్యః పౌంస్యాని తస్థుః ॥ 42

1. రన్తఽఇన్ద్ర, 2. మీళహస్య, 3. నఽఇన్ద్ర, 4. దాఽఓజి, 5. రాయఽఇన్ద్ర, 6. మీళహుషో.

7. పఽఏతా, (ప్రా-ప్ర-)

(7) ప్రతి ఘోరాణామేతానామయాసాం మరుతాం శృణ్వ[1] ఆయతాముపబ్దిః ।

యే మర్త్యం పృతనాయన్తమూమైరృణావానం న పతయన్త సర్గైః ॥ 43

(8) త్వం మానేభ్య[2] ఇన్ద్ర విశ్వజన్యా రదా మరుద్భిః [3]శురుధో గోఅగ్రాః ।

స్తవానేభిః స్తవసే దేవ దేవైర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 44

## సూక్తము—169

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ హరి ! మహిమ గల మరుత్తులఁ, గరము విడచి నీవు లోకకర్తవుగానన్
బిరబిర మము రక్షింపుచు, నరమర లేకుండ సుఖము నందింపవొకో! ॥ 38

(2) క॥ ఘన మగు వర్షముచేతన్, జన రంజన మొనఁగునట్టి చారు మరుత్తుల్
ధనమున సుఖమున వెలసెదు, నినుఁ జూతురు తుష్టితోడ నిర్జరనాథా ! ॥ 39

(3) ఉ॥ నీ పవి మాకు మేలుకయి నీదు సమీపము చేరుచుండె సం
తాపముఁ గొట్టు మారుతము తప్పక వర్షము నిచ్చుచుండె స
ద్దీపముఁబోలి జీవనము దీప్తకృశానుఁడు హవ్య మెంతయే
నోపికతో ధరించుఁగద ! యూర్జితరూపద ! పాకశాసనా ! ॥ 40

(4) క॥ నీవే గవాదిధనమున్, దేవా ! మా కిచ్చియున్న దివ్యతరంబై
పావనమగు దానంబున, వే వేగమె నీకుఁ దుష్టి వివరింతుముగా! ॥ 41

1. శృణ్వఽఆయ, 2. మానేభ్యఽఇన్ద్ర. 3. శురుధీ గోఽఅగ్రా, (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూడనగును. వ.గో.శృ.

గీ॥ చంటి పాలకొఱకు సారసాన్నంబుతో, నతివ వృద్ధిఁబరచునట్లు నిన్ను
హరి! హవిస్సుతోడ యజమాన సంతతి, వృద్ధిపఱచుచుండె వివిధ నుతుల ॥ 42

(5) గీ॥ యాగఫలములఁ జవిఁజూడ నరుగునట్టి, మేఘముల నెల్ల హింసింప మెలఁగునట్టి
నీకు సుఖమగు మారుతానీక మెల్ల, మమ్ము సుఖవంతులుగఁ జేయు మాన్యశక్ర! ॥ 43

(6) ఉ॥ మానుగ హవ్యమిచ్చు యజమానులకుం గనిపించి ప్రీతితో
మానవ యజ్ఞవీథుల కమానుషుఁడా! తగఁబోయి హవ్యముం
బూనుచు నీకు మిత్రులగు పూజ్యమరుత్తుల కాలవాలమౌ
దాన సమిద్ధమేఘతతి తద్దయు వీరునిఁ బోలి యుండదే! ॥ 44

(7) చ॥ అరిపురభంజనోజ్జ్వల బలాధికు లుజ్జ్వల కృష్ణవర్ణులై
పరగు మరుత్సమూహముల బంధురవాక్కు చెవింబడెంగదా!
పరిజనయుక్తశత్రులకు బాధలు పెట్టెడు రీతి నింద్రుఁడా!
పరులను గొట్టి పూరుషుల బాధలు ద్రోలుచు మమ్ముఁ గావవే! ॥ 45

(8) క॥ హితముంగోరుచు భువికిం, దతసౌఖ్య మొసంగఁ బెద్ద ధారాధరమున్
శితపవిచేతం గొట్టినఁ, బ్రతిగూలురు లేక మేము బ్రతుకమె? యింద్రా! ॥ 46

## సూక్తమ్—170

ఋషిః—1,3,4 ఇంద్రః, (4-అగస్త్యోవా) 2,5 అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—1 బృహతీ, 2-4 అనుష్టుప్, 5-త్రిష్టుప్.

(1) న నూనమస్తి నో శ్వః కస్తద్ వేద యదద్భుతమ్ ।
అన్యస్య చిత్తమభి సంచరేణ్యముతాధీతం వి నశ్యతి ॥ 45

(2) కిం న[1] ఇన్ద్ర జిఘాంససి భ్రాతరో మరుత స్తవ ।

తేభిః కల్పస్వ సాధుయా మా నః సమరణే వధీః ॥ 46

(3) కిం నో భ్రాతరగ స్త్య సఖా సన్నతి మన్యసే ।

విద్మా హి తే యథా మనో ऽస్మభ్యమిన్న దిత్ససి ॥ 47

(4) అరం కృణ్వన్తు వేదిం సమగ్నిమిన్ధతాం పురః ।

తత్రామృతస్య చేతనం యజ్ఞం తే తనవావహై ॥ 48

(5) త్వమీశిషే వసుపతే వసూనాం త్వం మిత్రాణాం మిత్రపతే ధేష్ఠః ।

ఇన్ద్ర త్వం మరుద్భిః సం వదస్వాధ ప్రాశాన[2] ఋతుథా హవీంషి ॥ 49

1. నऽఇన్ద్ర, 2. ప్రాశానऽఋతుథా, (వా.ప్ర.)

## సూక్తము—170

### ఋషి—ఇంద్రుఁడు, అగస్త్యుఁడు *

### దేవత—ఇంద్రుఁడు

ఇంద్రవాక్యము

(1) సీ॥ మన నిమిత్తంబంత ఘనవస్తు సంతతి మనకుండఁగల్గునే? యనెడు ప్రశ్న
ముదయించుచుండఁగ నెదలోన మఱుచటి దినమందు నద్దాని గనుట యెట్టు
లిఁక ముందు గల్గెడు నెల్ల సంగతులను నెవ్వఁ డెఱుంగునో! యెఱుఁగుటెట్లు?
సర్వకాలములందు సంచలనంబుతోఁ గూడు మానసవృత్తిఁ జూడఁగలమె?
గీ॥ బహుళకాల సమారబ్ధ పరమశక్తి, నన్నియు లభించినను నాశ నధిగమింపఁ
బడునదియుఁ గూడ నశియింపఁబడుచునుండ, నుండునే కొత్తవస్తువు లుచితరీతి ॥ 47

అగస్త్య వాక్యము

(2) గీ॥ నిరపరాధులమగు మమ్ము నిగ్రహింప, నిశ్చయించుచునున్నావు నిర్జరేశ!
యా మరుత్తులతో స్నేహ మధిగమింప, మమ్ము యుద్ధములం జంప మానుమయ్య! ॥ 48

ఇంద్ర వాక్యము

(3) ॥ అనుజుఁడవైన యగస్త్యా!, నను వేరుగఁ దలవనేల? న్యాయమె? నీ దొ
మనసెల్ల నాకుఁ దెలియదె?, ఘన మగు నెద్దానినైనఁ గల్పించితివే! ॥ 49

* ఈ సూక్తములోని 1, 3, 4 ఋక్కులకు నింద్రుఁడు 4వ ఋక్కుకు ఇంద్రుఁడు లేదా అగస్త్యుఁడు ఋషి యని సంస్కృతమూల ప్రతులలోఁ గొన్నిటఁ గలదు. వ్రాతప్రతి 2వ సంపుటము 171వ పుటలో 170వ సూక్తమునకు ఋషిగా అగస్త్యుఁడొక్కఁడే పేర్కొనుట జరిగినది. శ్రీ నేమానివారు ఋషి దేవతల పట్టిక వ్రాసిన 15b సంఖ్య గల సంపుటములో నీ సూక్తమునకు నింద్రుఁడు అగస్త్యుఁడు నిరువురును ఋషులుగాఁ బేర్కొన్నారు. ఈ సూక్త మింద్రాగస్త్యుల సంవాద రూపమైనదని సాయనాదు లభిప్రాయపడిరి. దీని ననుసరించి శ్రీ నేమానివారును నింద్రాగస్త్యుల సంవాద రూపముగనే పద్యములు రచించిరి. ఇంద్రునితోపాటు అగస్త్యుఁడును సూక్తాధిదేవత యగుచో నిది సంవాదరూపమని యామోదింపవచ్చును. కాని శ్రీ నేమానివారగస్త్యుని దేవతగా వ్రాయలేదు. ఇంద్రుఁడొక్కఁడే అధిదేవత యయినప్పుడు సంవాదమున కవకాశము లేనేలేదు. కావున నొకవేళ నగస్త్యుని దేవతగా సైతము గ్రహించుచో దేవతాగస్త్యుఁడు వేరనియు ఋష్యగస్త్యుఁడు వేరనియు గ్రహింప వలసియున్నది. వ.గో.కృ.

(4) గీ॥ ప్రోక్షణాదుల నొనరించి పూర్ణవహ్ని, [1]యిధ్మములచేతఁ గడుఁబ్రజ్వలింపఁజేయుఁ
డార్యవరులార ! యాగము నాదరమునఁ, జేయుదము[2] మనము ప్రీతివిశేష మొప్ప ॥ 50

అగస్త్యవాక్యము

(5) చ॥ వసుపతి ! యింద్రుఁడా ! సకలవస్తు గురుండవు స్నేహితుండవౌ
ననమజగత్తు సంతతికి నాశ్రయనీయుఁడ వౌదు వెంతయుం
బసగలవాఁడ వౌటను వికాసిమరుత్తులతోడఁ గూడి నీ
వసదృశయాగకర్మముల నన్ను నుతింపుచుఁ దుష్టినొందుమా ! ॥ 51

## సూక్తమ్—171

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—మరుతః; 3-6 మరుత్వానిన్ద్రః

ఛందః—త్రిష్టుప్.

(1) ప్రతి వ[1] ఏనా నమసాహ మేమి సూక్తేన భిక్షే సుమతిం తురాణామ్ ।
రరాణతా మరుతో వేద్యాభిర్ని హేళో ధత్త వి ముచధ్వమశ్వాన్ ॥ 50

(2) ఏష వః స్తోమో మరుతో నమస్వాన్ హృదా తష్టో మనసా ధాయి దేవాః ।
ఉపేమా యాత మనసా జుషాణా యూయం హి ష్ఠా నమస[2] ఇద్ వృధాసః ॥ 51

(3) స్తుతాసో నో మరుతో మళయన్తూత స్తుతో మఘవా శంభవిష్ఠః ।
ఊర్ధ్వా నః సన్తు కోమ్యా వనాన్యహాని విశ్వా మరుతో జిగీషా ॥ 52

1. కాష్ఠములచేత మండింపఁగా నొనర్పు (తొ.పా.) 2. ఈ తేటగీతిలో నాల్గవ పాదమునఁ బంచ లఘుగణము ప్రయుక్తమైనది, వ.గో.కృ.

1. వఏనా, 2. నసఇత్. (వ్రా.ప్ర.)

(4) అస్మాదహం తవిషాదీషమాణ[1] ఇన్ద్రాద్భియా మరుతో రేజమానః ।

యుష్మభ్యం హవ్యా నిశితాన్యాసన్ తాన్యారే చకృమా మృళతా నః ॥ 53

(5) యేన మానాసశ్చితయన్త[2] ఉస్రా వ్యుష్టిషు శవసా శశ్వతీనామ్ ।

స నో మరుద్భిర్వృషభ శ్రవో ధా ఉగ్ర[3] ఉగ్రేభిః [4]స్థవిరః సహోదాః ॥ 54

(6) త్వం పాహీన్ద్ర సహీయసో నౄన్ భవా మరుద్భిరవయాతహేళాః ।

సుప్రకేతేభిః సాసహిర్దధానో విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 55

## సూక్తము—171

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—మరుత్తులు 3-6 ఇంద్ర మరుత్తులు †

(1) మ॥ అరి నిర్భేదకు లైన మిమ్ము సుమతిన్ యాచించుచుండంగ మీ
పరమానుగ్రహబుద్ధి మాపయి నిడం బ్రార్థింపమే దేవతల్
స్థిరసంతోషము నొంది క్రోధమును మీ చిత్తంబులన్ వీడి మీ
యరదంబుల్ హయపంక్తి వెన్క నిడుఁడీః యాగ ప్రయణార్థమై ॥ 52

1. మాణఽఇన్ద్రాద్, 2. యన్తఽఉస్రా, 3. ఉగ్రఽఉగ్రేభిః, 4. స్థవిరః, (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో.కృ.

† సంస్కృతమూలములో 3వ ఋక్కు మొదలు 6వ ఋక్కువఱకు నింద్ర మరుత్తులు దేవతలుగాఁ జేర్కొనఁబడఁగా నావివర మీయాంధ్రానువాద గ్రంథములో నీయలేదు. శ్రీనేమానివారు వ్రాసిన 15b సంఖ్యగల సంపుటములో మామూలుగామరుత్తులు నింద్రుఁడు దేవతలని వ్రాయఁబడెను. 3-6 ఋక్కుల కనువాద పద్యములలో నింద్ర మరుత్తుల ప్రసక్తి కలదు. కాపున 3-6 ఋక్కులకు దేవతలు ఇంద్ర మరుత్తులుగా సవరింపఁబడినది. వ.గో.కృ.

(2) గీ॥ హవ్యముల మిమ్ము యాచింప నమరులార!, స్తోత్ర మంగీకరింపుఁ డస్తోకలీల
యాగశాలకు మీరెల్లరరుగుదేర, వెలయు హవ్యము లన్నియు వృద్ధినొందు ॥ 53

(3,4) సీ॥ స్తుతియింపఁబడి మాకు సుఖమును గలిగించి ఘనమారుతంబంతఁ గ్రాలుఁగాక!
స్తుతియింపఁబడి సర్వసుఖమును గలిగించి ఘనవాసవుండు తాఁ గ్రాలుఁగాక!
భావి దినంబులు బహుళకీర్తులతోడ నుత్కృష్టతమములై యుండుఁగాక!
భావి దినంబులు బహుకీర్తికరములై పరులచేఁ గొనియాడఁబడును గాక!
గీ॥ వాసవుని[1]భయముచేఁ గడువడఁకుచుండి, పరువు లెత్తుచు నున్నాము భవ్యులార!
హవ్యముల దూరమందున నమరఁజేసి, యున్నవారము సుఖమిరెఁ యున్నవారు! ॥ 54

(5) చ॥ అమరపతీ! త్వదీయ మగు నత్యమల ప్రభుశక్తి చేతనే
సురుచిరకల్యకాంత కడు శోభిలు కాంతుల నందఁగల్గి తా
స్థిరముగ సర్వమానవులఁ జేష్టలకుం బురిగొల్పుచుండె నో
వర! బలవంత! నీవు కడు భక్తము నిమ్ము మరుద్గణంబుతోన్ ॥ 55

(6) క॥ మనుజుల సంరక్షింపుము, వినుత[2] మరుద్గణముతోడ విడుచుచుఁ గోపం
బనయం బారోగ్యాదుల, నొనరింపుము మాకు నిత్యమో వాసవుఁడా! ॥ 56

## సూక్తమ్—172

### ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

### దేవతా—మరుతః

### ఛందః—గాయత్రీ

(1) చిత్రో వోఽస్తు యామశ్చిత్ర[1] ఊతీ సుదానవః ।
మరుతో[2] అహిభానవః ॥ 56

1. ఇక్కడఁ బంచ లఘుగణ మింద్రగణముగాఁ బ్రయోగింపఁబడినది, వ.గో.కృ. 2. వినత మరుద్గణము పైని విడువుము కోపం, బనయము (వ్రా.ప్ర.పా.) పొరపాటున మరుత్తులు దేవతలన్న సంగతి మరచి శ్రీ నేమానివారిచే నిట్లనువదింపఁబడినది. బుద్ధికిఁ దోచినట్లుగా నెడపెడగ భాష్యము వ్రాసిన సాయనుల ప్రభావ మిది. కావున నింద్ర మరుదుభయ దేవతానుగుణముగ నీ పద్యము సవరింపఁబడినది. వ.గో.కృ.

1. చిత్రఽఊతీ, 2. మరుతోఽఅహి, (వ్రా.ప్ర.)

(2) ఆరే సా వః సుదానవో మరుత[1] ఋఞ్జతీ శరుః ।

ఆరే[2] అశ్మా యమస్యథ ॥ 57

(3) తృణస్కన్దస్య ను విశః పరి వృఙ్క్త సుదానవః ।

ఊర్ధ్వాన్ నః కర్త జీవసే ॥ 58

## సూక్తము—172

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—మరున్నామక దేవతలు

(1) క॥ మీ రాకచేత సాక్షాత్కారంబున నభిమతములఁ గలిగింపరొకో :
మీ రా యజ్ఞంబులకుం, జేరన్ యత్నింప రేల ? శ్రీకరులారా: ॥ 57

(2) గీ॥ అరి వినాశక మగునట్టి యాయుధంబు, మాకు దూరముగా నుండుఁగాక ! మీర
లరులపై వేయు నాయుధవరము కినుక, మా పయిన్ వేయకుండుత ! మాన్యులార ! ॥ 58

(3) గీ॥ గ్రాస తుల్యమగుచుఁ గ్రాలెడు నాపుత్ర, మిత్రవర్గమునకు మేలు నేసి
మెచ్చవలసినట్టు లిచ్చి చిరాయువు, మమ్ముఁ గావరారె ! మాన్యులార! ॥ 59

1. మరుతఽఋఞ్జతీ, 2. ఆరేఽఅశ్మా. (బ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట చూడనగును. వ.గో.కృ.

## సూ_క్తమ్—173

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్; 4 విరాట్ స్థానా, విషమపదా వా

(1) గాయత్ సామ [1]నభన్యం౧ యథా వేరర్చామ తద్ వావృధానం స్వర్వత్ ।

గావో ధేనవో బర్హిష్యదబ్ధా[2] ఆ యత్ సద్మానం దివ్యం వివాసాన్ ॥ 59

(2) అర్చద్ వృషా వృషభిః స్వేదుహవ్యైర్మృగో నాశ్నో[3] అతి యజ్జుగుర్యాత్ ।

ప్ర మన్దయుర్మనాం గూర్త హోతా భరతే మర్యో మిథునా యజత్రః ॥ 60

(3) నక్షద్ధోతా పరి సద్మ మితా యన్ భరద్ గర్భమా శరదః పృథివ్యాః ।

క్రన్దదశ్వో నయమానో రువద్ గౌరన్తర్దూతో న రోదసీ చరద్ వాక్ ॥ 61

(4) తా కర్మాషతరాస్మై ప్ర చ్యౌత్నాని దేవయన్తో భరన్తే ।

జుజోషదిన్ద్రో దస్మవర్చా నాసత్యేవ సుగ్మ్యో రథేష్ఠాః ॥ 62

1. నభన్యం౧ 2. దబ్ధాఽఆ యత్. 3. నాశ్నోఽఅతి. (ప్రా.ప్ర.)

(5) తము ష్టుహీన్ద్రం యో హ సత్వా యః శూరో మఘవా యో రథేష్ఠాః ।
ప్రతీచశ్చిద్ యోధీయాన్ వృషణ్వాన్ వవవ్రుష[1]శ్చిత్తమసో విహన్తా ॥ 63

(6) ప్ర యదిత్థా మహినా నృభ్యో[2] అ స్త్యరం రోదసీ కక్ష్యే౩ నాస్మై ।
సం వివ్య[3] ఇన్ద్రో వృజనం న భూమా భర్తి స్వధావాగ్ం[4] ఓపశమివ ద్యామ్ ॥ 64

(7) సమత్సు త్వా శూర సతామురాణం ప్రపథిన్తమం పరితంసయధ్యై ।
సజోషస[5] ఇన్ద్రం మదే క్షోణీః సూరిం చిద్ యే[6] అనుమదన్తి వాజైః ॥ 65

(8) ఏవా హి తే శం సవనా సముద్ర[7] ఆపో యత్ త[8] ఆసు మదన్తి దేవీః ।
విశ్వా తే[9] అను జోష్యా భూద్ గాః సూరీగ్ం[10]శ్చిద్ యది ధిషా వేషి జనాన్ ॥ 66

(9) అసామ యథా సుషఖాయ[11] ఏన స్వభిష్టయో నరాం న శంసైః ।
అసద్ యథా న[12] ఇన్ద్రో వన్దనేష్ఠాస్తురో న కర్మ నయమాన[13] ఉక్థా ॥ 67

---

1. వ్రుషాశ్చిత్త, 2. నృభ్యోఽఅస్త్యరం, 3. వివ్యఽఇన్ద్రో, 4. వాగ్ంఽఓప, 5. సఽఇన్ద్రం, 6. యేఽఅను, 7. సముద్రఽఆపో, 8. తఽఆసు, 9. తేఽఅను, 10. సూరీగ్ంఽశ్చిద్, 11. ఖాయఽఏన, 12. నఽఇన్ద్రో, 13. మానఽఉక్థా, (వ్రా.ప్ర)

(10) విష్పర్ధసో నరాం న శంసైరస్మాకాసదిన్ద్రో వజ్రహస్తః ।

మిత్రాయువో న పూర్పతిం సుశిష్టౌ మధ్యాయువ[1] ఉప శిక్షన్తి యజ్ఞైః ॥ 68

(11) యజ్ఞో హి ష్మేన్ద్రం కశ్చిదృన్ధఞ్జుహురాణశ్చిన్మనసా పరియన్ ।

తీర్థే నాచ్ఛా తాతృషాణమోకో దీర్ఘో న సిధ్రమా కృణోత్యధ్వా ॥ 69

(12) మో షూ ణ[2] ఇన్ద్రాత్ర పృత్సు దేవైరస్తి హి ష్మా తే శుష్మిన్నవయాః ।

మహశ్చిద్ యస్య మీ[3]ళ్హుషో యవ్యా హవిష్మతో మరుతో వన్దతే గీః ॥ 70

(13) ఏష స్తోమ[4] ఇన్ద్ర తుభ్యమస్మే[5] ఏతేన గాతుం హరివో విదో నః ।

ఆ నో వవృత్యాః సువి[6]తాయ దేవ విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 71

1. యువఽఉప, 2. ణఽఇన్ద్ర, 3. మీఽహుషో, 4. స్తోమఽఇన్ద్ర 5. మస్మేఽఏతేన 6. సువితాయ (వ్రా.ప్ర. 6-వ్రా.ప్ర.సా.మా)

సూక్తము—173

ఋషి—అగస్త్యుడు *

దేవత—ఇంద్రుడు

(1) ఉ॥ సామముచేత గాయకుడు చక్కగ గాన మొనర్చుచుండె, దా
నీమముతోడ మా నుతుల నీవు గ్రహించుచు నాక వాసివై
వేమరు యజ్ఞ వేదికల విస్తృతదర్భలపైని నున్న నీ
కా మహనీయు గోగణములెల్లc బయస్సుల నీయ కుండునే ? ॥ 60

(2) చ॥ యజనము నిర్వహించుటకు యాజ్ఞికు లెంతయు భక్తియుక్తులై
భజన మొనర్చుచుండిరిcక భక్తుడు మర్త్యునితోడ నింద్రుడా!
సుజలపిపాసచే మృగము సూటిగ నీటికి నేగినట్లు మా
యజన నికేతనంబులకు నాదరణన్ దయసేయవేలొకో! ॥ 61

(3) సీ॥† దేవతాహ్వానంబు తివిరి సేసెడు నగ్నియంతట దిఱుగుచు నతిశయించె
నతడు భూ సంబంధ మగునట్టి హవ్యంబు లన్నియు నందుచు నమరియుండె
సకిలించుచున్నట్టి చక్కని హరివలె వేడివేల్పచ్చట వెలుగుచుండె
వాత్రలc గొనిపోవు వారాహరునిcబోలు ననలుడు రోదసియందు నిలిచె
గీ॥ నశ్వమునుబోలి హవ్యంబు లమరపతికిc, దీసికొనిపోవుచున్నాడు దివ్యవహ్ని
భూ నభో మధ్యమున సర్వపూజ్యుcడైన, నగ్ని నుతియించుచుండె నా యమరవరుల ॥ 62

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూడనగును. వ.గో.కృ.

† దేవతా శబ్దము :— దేవత మొదలగు సంస్కృతములోని కొన్ని పవిత్రనామధేయములు జెండూ భాషలోc బిశాచములగ మార్చcబడెను. దీనినిబట్టి చూడ నొకప్పు డేకశాఖగా నున్నట్టి యొకజాతి తరువాత పోరాడి చీలిపోయె నను నూహను బలపరచుచున్నది-॥చిప్స్ ఫ్రం జర్మన్ వర్కుషాపు. (Chips from German workshop). (నే.వేం.న.శా.)

గమనిక—జెండూ భాషలో నర్థము మారిన పదములేవియో భాషాశాస్త్రరీత్యా పరిశీలింప వలసిన యవసర మున్నది. కాని అసలు విభిన్న దేవతాగణములలో రాక్షసులతోపాటు పిశాచగణముగూడc బ్రాచీన కాలమున నొకానొక దేవతా గణముగాc బ్రామాణికముగా లౌకిక సంస్కృత వాఙ్మయములోనే పరిగ్రహింపcబడిన సంగతి మనము గుర్తింపవలయును. వ.గో.కృ.

(4) చ॥ అమల నుతిన్ విశేషముగ హవ్యములన్ గ్రహియించి వజ్రికై
క్రమమున యాగమున్ సలుపఁగా దొరకొంటిమిగాన నింద్రుఁడున్
విమలగతిన్ రథంబుపయి వెల్గుచు నశ్వగణంబుమాట్కి వే
గమునఁ జరించి జన్నమును గన్గొన రావలదే! చెలంగుచున్ ॥ 63

(5) క॥ ధనవంతుఁడు బలవంతుం, డని యొన శత్రువుల నెల్ల నణఁచెడు వాఁడున్
ఘనహంతయైన నింద్రుని. ననయము నుతియించుచుంటి మాదరబుద్ధిన్ ॥ 64

(6) చ॥ మహిమ బ్రసిద్ధిఁజెందు యజమానులఁ గాచెదు నింద్రదేవ! యీ
మహి దివముల్ త్వదీయశుభమార్గములై విలసిల్లఁ గల్గు నే
మహిఁగల భూతజాతము సమానుషశక్తిని నావరించుచున్
మహి దివమున్ భరించవఁటె! మాన్యదివౌకసలోకమున్వలెన్ ॥ 65

(7) చ॥ వినయముతోడ నిన్ను రణవీథులయందు సమాశ్రయించు నా
ఘన మగు శూరసంతతికిఁ గల్పనఁ జేయుచు వీర్యసంపదన్
జనువున సజ్జనావళుల సత్పథయాయులుగా నొనర్చు ని
న్ననయము వేడుచుందరఁటె! యత్యధికంబగు ప్రీతి మానవుల్ ॥ 66

(8) ఉ॥ ఎప్పు డనంతదేశమున నెల్ల జలంబులు వెల్గుచుండునో!
యెప్పుడు నిన్ను వృష్టికొఱకెంతయు నయ్యవి రేపుచుండునో!
యప్పుడు సోమయాగముల నందఱు సేయుదు రెల్ల భక్తితో
నప్పుడె నీకు సౌఖ్యము ననంతముగాఁ గలిఁగింతు రింద్రుఁడా! ॥ 67

(9) క॥ జనులు నుతిం జేయుటచే, ఘన మగు కాంక్షితము లెల్లఁ గలిఁగినయట్లే
యనయము మా నుతివలనన్, మనమున సత్కర్మఫలము మాకీయఁగదే! ॥ 68

(10) చ॥ స్తుతులొనరించి కార్యములు సూక్ష్మముగా జను లొందురీతి మే
మతినుతిఁ జేసి నిన్నుఁ గడు నారయలేదఁటె! మిత్రుభంగి మా
నుతి గతి నాలకించి తగ నూత్నవిధంబగు తుష్టినొందుచున్
జతురత మీ సత్ఫలముఁ జక్కఁగ మాకు నొసందగవే! హరీ! ॥ 69

(11) చ॥ వినుము జనాళి మానవుల విశ్వసనీయులుగా నొనర్చు న
ట్లనయము వజ్రధారి! నిను నందఱు వశ్యునిగా నొనర్పరే!
ఘనుఁ డగు గ్రామ నాయకుని గాంచి భజించెడు మానవాళి య
ట్లనయము ఋత్విజాళి నిను నర్చనఁజేయరె! పాకశాసనా! ॥ 70

(12) గీ॥ బాటఁ జెంతఁగల్గు వారి దప్పికఁగొన్న, వానిఁ దృప్తిఁ జేయుభంగి నమల
యజనకర్మచేత యజమానుఁ డింద్రునిఁ, దృప్తిఁ జేయు నెపుడు తీక్ష్ణశక్తి ॥ 71

గీ॥ దీర్ఘమార్గములను దిరుగుచుండెడు వాఁడు, గమ్యతలము వేగఁ గాంచనట్లు
యజనకర్మచేత నమరేశు నర్చింప,నట్లు జనుఁడు ఫలము నందఁగలఁడె? ॥ 72

క॥ తొడరి మరుత్సంఘముతోఁ, గడు వర్షనిమిత్తమైన కదనములందున్
విడువకుము మమ్ము వేరుగ, నిడియుంటిమి నీకు హవ్య మెల్ల మహేంద్రా! ॥ 73

(13) గీ॥ మే మొనర్చెడు నుతి నీకె సోమపాన, మందుఁబ్రియుఁడవై యిష్టులకు రమ్మ పెద్దవగుచు
వచ్చి మమ్మెటురక్షించి వాసవుండ!, యాయు రారోగ్యముల మాకు నందఁజేయు ॥ 74

సూక్తమ్—174

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) త్వం రాజేన్ద్ర యే చ దేవా రక్షా నౄన్ పాహ్యసుర త్వమస్మాన్ ।

త్వం సత్పతిర్మఘవా నస్తరుత్రస్త్వం సత్యో వసవానః సహోదాః ॥ 72

(2) దనో విశ[1] ఇన్ద్ర మృధ్రవాచః సప్త యత్ పురః శర్మ శారదీర్దర్త్[2] ।

ఋణోరపో[3] అనవద్యార్ణా యూనే వృత్రం పురుకుత్సాయ రన్ధీః ॥ 73

1. విశఽఇన్ద్ర, 2. దీర్ దర్త్, 3. రపోఽఅన, (వా.ప్ర.)

(3) అజా వృత[1] ఇన్ద్ర శూరపత్నీర్ద్యాం చ యేభిః పురుహూత నూనమ్ ।
రక్షో[2] అగ్నిమశుషం తూర్వయాణం సింహో న దమే[3] అపాంసి వస్తోః ॥ 74

(4) శేషన్ ను త[4] ఇన్ద్ర సస్మిన్ యోనౌ ప్రశస్తయే పవీరవస్య మహ్నా ।
సృజదర్ణాంస్యవ యద్ యుధా గాస్తిష్ఠద్ధరీ ధృషతా మృష్ట వాజాన్ ॥ 75

(5) వహ కుత్సమిన్ద్ర యస్మిఞ్చాకన్ త్స్యూమన్యూ[5] ఋజ్రా వాతస్యాశ్వా ।
ప్ర సూరశ్చక్రం వృహతాదభీకే ऽభి స్పృధో యాసిషద్ వజ్రబాహుః ॥ 76

(6) జఘన్వాగ్ం[6] ఇన్ద్ర మిత్రేరూఞ్చోదప్రవృద్ధో హరివో[7] అదాశూన్ ।
ప్ర యే పశ్యన్నర్యమణం సచాయోస్త్వయా శూర్తా వహమానా[8] అపత్యమ్ ॥ 77

(7) రపత్ కవిరిన్ద్రార్కసాతౌ క్షాం దాసాయోపబర్హణీం కః ।
కరత్ తిస్రో మఘవా దానుచిత్రా ని దుర్యోణే కుయవాచం మృధి శ్రేత్ ॥ 78

1. వృతऽఇన్ద్ర, 2. రక్షోऽఅగ్ని, 3. ద మేऽఅపాంసి, 4. ను తేऽఇన్ద్ర, 5. న్యూऽఋజ్రా, 6, వాగ్ంऽఇన్ద్ర, 7. హరివోऽఅదా, 8. మానాऽఅపత్యన్, (వ్రా.ప్ర.)

(8) సనా తా త[1] ఇన్ద్ర నవ్యా ఆగుః సహో నభోऽవిరణాయ పూర్వీః ।

భినత్ పురో న భిదో[2] అదేవీర్నసమో వధరదేవస్య పీయోః ॥ 79

(9) త్వం ధునిరిన్ద్ర ధునిమతీరృణోరపః సీరా న స్రవన్తీః ।

ప్ర యత్ సముద్రమతి శూర పర్షి పారయా తుర్వశం యదుం స్వస్తి ॥ 80

(10) త్వమస్మాకమిన్ద్ర విశ్వధ స్యా[3] అవృకతమో నరాం నృపాతా ।

స నో విశ్వాసాం స్పృధాం సహోదా విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 81

## సూక్తము—174

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ జగమునకు దేవతలకుం, దగు ప్రభువవు నీవు నిత్య ధనపతివి సుమీ !
పగతుర నాశ మొనర్చుచు, వగపులఁ బోఁ ద్రోల వేమి ? వాసవ ! సఖుఁడా ! ॥ 75

* ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదములోని 166 వ సూక్తము ఋషికిచ్చిన పుట్ నోటు (556 వ పుట) చూడనగును. వ.గో.కృ.

1. తా తऽఇన్ద్ర నవ్యాऽఆగుః, 2. భిదోऽఅదే, 3. స్యాऽఅవృ (వ్రా.ప్ర.)

(2) ఉ॥ నీవు మహేంద్ర! సప్తవిధ నిర్జర శత్రు పురంబు లన్నియుం
† జేవ గలట్టి వజ్రమునఁ జెచ్చెరఁ గొట్టిన యప్డు తజ్జనుల్
కావు మటంచు నిన్నడుగఁ గావఁగ లేదఁటె! వారి వెండియున్
భీకర వృత్ర దానవుని పీచ మడంపవె? వైర్యశకులన్ ॥ 76

క॥ స్థిర యౌవనుఁ డగు శ్రీయుత, పురుకుత్సునికొఱకు వృత్రుఁ బూజ్య మహేంద్రా!
త్వరఁగొని వధియింపుచుఁ ద,త్పర మగు నుదకంబు భువినిఁ బడఁజేయవొకో! ॥ 77

---

† ఇంద్రుఁడు దానవపురంబులను బెక్కింటిని గొట్టినట్లు ఋగ్వేదమందుఁ జాల స్థలములఁ గలదు. ఇంద్రునిగూర్చి భారతాది గ్రంథములయందు కౌషీతక్యుపనిషత్తు (కౌషీతకీ బ్రాహ్మణోపనిషద్) నందును గలదు. భీష్ముఁడు ధర్మరాజున కొక ప్రాచీన కథను వక్కాణించినట్లు భారతము శాంతిపర్వమునఁ (124) గలదు. అది యిది. "ప్రహ్లాదుఁడు త్రైలోక్యాధిపత్యమును వహించిన పిదప నింద్రుఁడు దేవతల గురువగు బృహస్పతి యొద్దకేగి శ్రేయస్సుతోనున్న దానినిఁ జెప్పుమనెను. అప్పుడు ఇంద్రునకు బృహస్పతి బ్రహ్మవిద్య నుపదేశించెను. పిమ్మట నతఁ డింద్రుని శుక్రు నొద్దకుఁ బంపెను. ఇంద్రుఁడు బ్రాహ్మణ వేషధారియై ప్రహ్లాదుని కడకేగి శిష్యుఁడై కొంతకాలముండఁగా నొక సమయమునఁ బ్రహ్లాదుఁడు శీలమే త్రైలోక్యాధిపత్యమునకుఁ గారణ మనియు నదియే శ్రేయస్సనియుఁ జెప్పెను. తర్వాత నీ సేవచే సంతుష్టుఁడ నైతి ననియు నీ శీలము నాకిమ్మనియు నింద్రుఁడు ప్రహ్లాదుని గోరఁగా నది యతని కిచ్చెను. ఆ వెంటనే ప్రహ్లాదుని ధర్మము, సత్యము, సచ్చరిత్రము, నైశ్వర్యము, దేవతలు, సమస్తమును విప్రవేషధారి యగు నింద్రుని శరీరమందుఁ బ్రవేశించినవి. దానివలన నింద్రుఁడు రాజ్యమును బొందెను." (నే. వేం. న. శా.)

గమనిక:— మహాభారతమునఁ గల యీ కథను శ్రీ నేమానివారు సరిగా నుదాహరింపలేదు. "పిమ్మట నతఁడింద్రుని శుక్రు నొద్దకుఁ బంపెను." అని వ్రాసి పిదప నింద్రుఁడు శుక్రునియొద్దకేగిన విషయ మేమియు వ్రాయకయే యింద్రుఁడు ప్రహ్లాదుని యొద్దకేగినట్లు శ్రీనేమాని వారు వ్రాసిరి. మహాభారతములో నున్న యసలైన కథాసారాంశ మిది.

"ఇంద్రుడొకసారి త్రైలోక్య రాజ్యముఁ బోగొట్టుకొనెను. ప్రహ్లాదుఁడు మూఁడు లోకము లేలుచుండెను. ఇంద్రున కెట్టులైనఁ దనపదవి సంపాదించుకొనవలయు ననుకోరిక కలదు. నేను గురునికడకుఁబోయి యేమిచేసిన నా రాజ్యము నాకు వచ్చు నని యడిగెను; భార్గవు నడుగు మని గురుఁడు చెప్పెను. ఇంద్రుఁడు భార్గవు నడిగెను. ప్రహ్లాదు నడుగుమని భార్గవుఁడు చెప్పెను. ఇంద్రుఁడు బ్రాహ్మణ వేషమునఁ బ్రహ్లాదుని కడకుఁ బోయి యతనిఁ గొలుచుచుండెను; ఒకనాఁడీ బ్రాహ్మణుఁడు నీ కీ త్రిలోక రాజ్య మెట్లు వచ్చెనని ప్రహ్లాదు నడిగెను. ప్రహ్లాదుఁడు శీలమువలన వచ్చినదని శీల మహాత్మ్యము నెఱింగించెను. "అట్లయినచో నింతకాలముగా నేను నీ సేవచేయుచుంటిని గాన నీ శీలము నాకిమ్మ" అని యింద్రుఁడు కోరెను. ప్రహ్లాదుఁడు సరే యనియె. ఇంతలో నతని శరీరము నుండి యొక పురుషుఁడు వెడలెను. నీ వెవఁడవు? అని ప్రహ్లాదుఁడడుగఁగ నేను నీ శీలమును ఇంద్రుఁడడుగ నిచ్చితివిగానఁ బోవుచుంటి నని యతఁడనియె; వాని వెనుక మఱియొక పురుషుఁడు వచ్చి తాను బలము ననియు శీలముతోఁ బోవుచున్నాననియుఁ జెప్పెను. వీరి వెనుక నొక యువతి పుట్టెను. ఆమె సిరి. శీలమెచ్చట నుండునో యచ్చటకుఁ బోవుదునని యామె చెప్పెను. ఈ మూఁడును లభింపఁగ నింద్రుఁడు తన త్రైలోక్య రాజ్యము తిరిగి సంపాదించుకొనఁ గలిఁగెను." (మహాభారతము. శాంతిపర్వము) వ. గో. కృ.

(3) క॥ వెడలుము తొలివేదికకై, వెడలుము తర్వాత నాక వీథికి నింద్రా!
యడవి హరి కాచు నట్టులఁ, గడుఁ గర్మలకొఱకు నీవు కావు మనలమున్ ॥ 78

(4) చ॥ తలఁచుచు నీ ప్రసిద్ధపవిఁ దావక వైరులు నైజ భూములన్
గలుఁగక యింద్రు నీవు హరిఁ గట్టిగ వజ్రముఁ బట్టి యున్నచో
జలమయ మౌనుగాదె! భువి సస్యము లన్నియు వృద్ధిఁ బొందవే!
బలయుత మైన బాడబము వాహముగా నొనరించి యున్నచో ॥ 79

(5) చ॥ ఘనుఁ డగు కుత్సమౌనివరు గారవ మొప్పఁగ యజ్ఞశాలకుం
బనిఁగొని చేర్చుచున్నటుల వాయు సమానదృతాశ్వరాజులన్
దనరెడు యాగకర్మలకుఁ దప్పక చేర్చుము శత్రునాశకా!
తన రథచక్రముం ధరణి దవ్వనఁ జేర్చెదునట్టు లింద్రుఁడా! ॥ 80

(6) చ॥ హరిహయ! నీకుఁ బూజ లిడునట్టి మనుష్యుల సంస్తవంబులం
గర మభివృద్ధిఁ జెంది శుభకర్మ లొనర్పని శత్రుమండలిం
దరుముచు నున్నవాఁడ వనిఁ దప్పక నేసిన వారి కిష్టముల్
వరలెడినట్లు సేసి బహుళంబుగఁ బుత్రుల నీయుచుండవే! ॥ 81

(7,8) సీ॥ చరుపురోడాశాదిసంపత్తిఁ గోరుచు నిన్నుఁ గవీశ్వరు లెన్నలేదె!
దాసార్థ మై నీవు ధారుణిఁ బఱుపుగాఁ జేసిన వృత్రునిఁ జెండలేదె!
తావక బహుచిత్ర దానాతిశయముచే భువనము లభివృద్ధిఁ బొందలేదె!
దుర్యోణపతికయి దుష్టుఁడౌ కుయవాక్కు జన్యరంగంబునఁ జంపలేదె!
గీఁ యసురపట్టణముల నెల్ల నణఁగఁ ద్రొక్కి, క్రూరుఁ డగు వృత్రదానవుఁ గూలనేసి
జనులసౌఖ్యార్థమై బాధలను సహించి, భయముఁ బాపుచు నున్నావు పాకహారి! ॥ 82

(9) గీ॥ నీరధులు హ్రాదినులచేత నిండు నపుడు, నీవు యదుతుర్వసుల వేఁగఁ గావ లేదె!
శత్రు కంపనకారుఁడా! చపల జలము, నదులుగాఁ బారు నట్టులు నడప లేదె! ॥ 83

(10) క॥ ఒసఁగుము మాకు నభీష్టము, లొసఁగుము సుతభృత్యవరుల కోలిని క్షేమం
బొసఁగుము సైన్యమునకు బల, మొసఁగుము వృజనాయువులను నోయి! మహేంద్రా! ॥ 84

## సూక్తమ్—175

### ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

### దేవతా—ఇంద్రః

### ఛందః — 1 స్కంధోగ్రీవీ బృహతీ; 2—5 అనుష్టుప్; 6 త్రిష్టుప్

(1) మత్స్యపాయి తే మహః పాత్రస్యేవ హరివో మత్సరో మదః ।

వృషా తే వృష్ణ ఇన్దుర్వాజీ సహస్రసాతమః ॥ 82

(2) ఆ నస్తేగన్తు మత్సరో వృషా మదో వరేణ్యః సహావాగ్ం

ఇన్ద్ర సాసహిః పృతనాషాళమర్త్యః ॥ 83

(3) త్వం హి శూరః సనితా చోదయో మనుషో రథమ్ ।

సహావాన్ దస్యుమవ్రతమోషః పాత్రం న శోచిషా॥ 84

(4) ముషాయ సూర్యం కవే చక్రమీశాన[1] ఓజసా ।

వహ శుష్ణాయ వధం కుత్సం వాతస్యాశ్వైః ॥ 85

1. చక్ర మీశానఽఓజసా, (వా.ప్ర.)

(5) శుష్మిన్తమో హి తే మదో ద్యుమ్నిన్తమ[1] ఉత క్రతుః ।

వృత్రఘ్నా వరివోవిదా మంసీష్ఠా[2] అశ్వసాతమః ॥ 86

(6) యథా పూర్వేభ్యో జరితృభ్య[3] ఇన్ద్ర మయ ఇవాపో న తృష్యతే బభూథ ।

తామను త్వా నివిదం జోహవీమి విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 87

## సూక్తము—175

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ మదసాధనంబగు మదమును బుట్టించు నిష్టార్థముల నెల్ల నేపు నించు
స్పర్ధను హెచ్చించు సర్వేంద్రియ ప్రీతిఁ గర మగునన్నంబుగా వెలుంగుఁ
బుట్టించు దశ శత పురుషుల శక్తిని గలిఁగించు నోర్పును వెలయఁజేయు
నరిసేన బెదిరించు నతిపూజ్య మగు మహాబలముల నే వేళఁ బాదుగొల్పు
గీ॥ నట్టి సోమరసంబెల్ల [1]నమితభక్తి, సిద్ధముగఁ జేసియున్నాము బుద్ధిఁదలఁచి
వచ్చి నీవు మహేంద్రుఁడా ! వలయుదాని, నాని [2]మోదాంబునిధి నోలలాడవలదె ! ॥ 85

(3) క॥ కర్మలకు హానిఁజేయుచుఁ, గర్మల నొనరింపనట్టి కఠినుల నెల్లన్
గర్వముతో దహియింపుము, కర్మిష్ఠా! పావకుండు కాష్ఠములవలెన్ ॥ 86

1. తమఽఉత, 2. మంసిష్ఠాఽఅశ్వ 3. జరితృభ్యఽఇంద్రమయఽఇవాపో (వ్రా. ప్ర.)

* ఋషి విశేషవిషయములకై యాంధ్రాను వాదములోని 166 వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. ఆదరమున నను ప్రయోగ మసమంజసము కాన "నమితభక్తి" నని సవరింపఁబడినది. వ. గో. కృ.

2. వార్ధిలో నడఁగవలదె. (వ్రా. ప్ర. పా.) వార్ధిశబ్దప్రయోగము సరికాదు. "అడఁగవలదె" అనుటయు సమంజసముగా లేదు. కావునఁ బై విధముగా సవరింపఁబడినది. వ. గో. కృ.

(4) క॥ నీవే ! శూరుఁడ వగుదువు, నీవే ! జనకాంక్షితముల నిచ్చుచు మరలన్
నీవే ! ప్రేరేపింతువు, శ్రీ విలసిత కార్యములకు శ్రీహరి! నిన్నున్ ॥ 87

(5) క॥ రవి రథ చక్రం బొక్కటి, కవి ! హరియించితివి నీవు కావున మఱియుం
బవిచేత శుష్ణుఁ జంపుచు, నవశక్తిం గుత్స మునికి నవ ధన మిడవే ! ॥ 88

గీ॥ సరససోమరసంబునఁ జక్కనైన, మదము జనియింప లేదఁటె ! మాన్య ! నీకు
నీ వొనర్చెడు కార్యముల్ నిర్జరేశ !, కీర్తికరములు గావఁటె ! యార్తి హారి! ॥ 89

క॥ ధనహయములఁ గల యింద్రుఁడ!, ఘనశత్రుల సంహరింపఁ గల్గు ధనంబున్
వినయమున నొప్పు మాకుం, బనిఁగొని యొసగంగ రాదె ! పాక వినాశా ! ॥ 90

(6) ఉ॥ దప్పి జనించు వారలకుఁ దప్పక నీపలు తృప్తిఁజేయున
ట్లొప్పిద మైన పెద్దలకు నోలి సుఖంబులఁ జేసి యుంటివో
యొప్పులకుప్ప ! మేమును నహో ! యనునట్టులు నిన్ను వేడ మా
కెప్పుక యన్నమున్ బలముఁ జేర్పవఁటే ! హరి ! మాకు నిచ్చలున్ ॥ 91

## సూక్తమ్—176

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—అనుష్టుప్; 6 త్రిష్టుప్

(1) మత్సి నో వస్య ఇష్టయ[1] ఇన్ద్రమిన్దో వృషా విశ ।
ఋఘాయమాణ[2] ఇన్వసి శత్రుమన్తి న విన్దసి ॥ 88

1. ఇష్టయఽఇన్ద్ర, 2. ఋఘాయ మాణఽఇన్వసి, (బ్రా.ప్ర.)

(2) తస్మిన్నా వేశయా గిరో య[1] ఏకశ్చర్షణీనామ్ ।

అను స్వధా యముప్యతే యవం న చర్కృషద్ వృషా ॥ 89

(3) యస్య విశ్వాని హస్తయోః పఞ్చ క్షితీనాం వసు ।

స్పాశయస్వయో[2] అస్మధ్రుగ్దివ్యేవాశనిర్జహి ॥ 90

(4) అసున్వన్తం సమం జహి దూణాశం యో న తే మయః ।

అస్మభ్యమస్య వేదనం దద్ధి[3] సూరిశ్చిదోహతే ॥ 91

(5) ఆవో యస్య ద్విబర్హసో ఽర్కేషు సానుషగసత్ ।

ఆజావిన్ద్రస్యేన్దో ప్రావో వాజేషు వాజినమ్ ॥ 92

(6) యథా పూర్వేభ్యో జరితృభ్య[4] ఇన్ద్ర మయ ఇవాపో న తృష్యతే బభూథ ।

తామను త్వా నివిదం జోహవీమి విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 93

1. యఽఏక, 2. స్పాశయస్వ యోఽఅస్మ, 3. వద్ధి, 4. జరితృభ్యఽఇన్ద్రమయఽఇవాపో, (వ్రా.ప్ర.)

## సూక్తము—176

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—ఇంద్రుఁడు

(1) క॥ అనయము సోమమ! నీ వా, యనఘుండగు నింద్రదేవుఁ డలరుచు నిటకుం
జనువున వచ్చెడు విధముగ, నొనరించిన శత్రునాశ మొందెదవుగదే! ॥ 92

(2) గీ॥ ఆత్మవిజ్ఞానులకు ముఖ్యుఁడైన హరిని, హవ్యవస్తువు లన్నియు నందు హరిని
సంస్తుతించినచో వాఁడు సంతసమున, యవలఁ బుట్టించునట్టులే యన్న మిడఁడె! ॥ 93

(3) క॥ పంచవిధ జీవకోటికి, మించిన యాధార మౌ నమేయ ధనంబున్
బంచెడు కరములు కలిఁగిన, యంచద్గ్రారి శత్రువులను నడఁచునుగాదే! ॥ 94

(4) క॥ ఘనసోమరసంబున ని,న్ననయముఁ బూజింపనట్టి యరులను నింద్రా!
పనిఁబూని చంపి వారల, ధనముం బూజ్యులకు నిచ్చి దాతవు కమ్మా! ॥ 95

(5) గీ॥ నీసహాయంబుచేతనే వాసవుండు, దృప్తినొందుచునున్నాఁడు దేవరసమ!
యట్టి బలవంతు నింద్రుని ననులమధ్య, నీవె కాపాడుచున్నావు నిశ్చయముగ ॥ 96

(6) ఉ॥ దప్పి జనించు వారలను దప్పక నీటలు దృప్తిఁజేయున
ట్లొప్పిద మైన పెద్దలకు నోలి సుఖంబులు నేయుచుందు వో
యొప్పులకుప్ప! లోకము లహో! యను నట్టుల నిన్ను వేడ మా
కెప్పక మాకు నన్నమునుఁ జేప్పచు నాయు వొసంగవే! దయన్ ॥ 97

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో.కృ.

## సూక్తమ్—177

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ఆ చర్షణిప్రా వృషభో జనానాం రాజా కృష్టీనాం పురుహూత[1] ఇన్ద్రః ।

స్తుతః శ్రవస్యన్నవసోప మద్రిగ్యుక్త్వా హరీ వృషణా యాహ్యర్వాఙ్ ॥ 93

(2) యే తే వృషణో వృషభాస[2] ఇన్ద్ర బ్రహ్మయుజో వృషరథాసో[3] అత్యాః ।

తాగ్ం[4] ఆ తిష్ఠ తేభిరా యాహ్యర్వాఙ్ హవామహే త్వా సుత[5] ఇన్ద్ర సోమే ॥ 94

(3) ఆ తిష్ఠ రథం వృషణం వృషా తే సుతః సోమః పరిషిక్తా మధూని ।

యుక్త్వా వృషభ్యాం వృషభ క్షితీనాం హరిభ్యాం యాహి ప్రవతోప మద్రిక్ ॥ 95

(4) అయం యజ్ఞో దేవయా[6] అయం మియేధ ఇమా బ్రహ్మాణ్యయమిన్ద్ర సోమః ।

స్తీర్ణం బర్హిరా తు శక్ర ప్ర యాహి పిబా విషద్య వి ముచా హరీ[7] ఇహ ॥ 96

1. పురుహూతఽఇన్ద్రః, 2. వృషభా సఽఇన్ద్ర, 3. సోఽఅత్యాః, 4. తాగ్ంఽఆ, 5. సుతఽఇన్ద్ర. 6. దేవయాఽఅయం మియేధఽఇమా, 7. హరీఽఇహ. (వ్రా.ప్ర.)

(5) ఓ సుష్టుత[1] ఇన్ద్ర యాహ్యర్వాఙుప బ్రహ్మాణి మాన్యస్య కారోః ।

విద్యామ వస్తోరవసా గృణన్తో విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 98

## సూక్తము—177

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1) సీ॥ మానవాళికి ధనదానాదు లందించి ప్రీతి నొనర్చుచుఁ బెరుగువాఁడు
జనసంఘమున కెల్ల సర్వము నందించి వివిధార్థముల నెఱవేర్చువాఁడు
మనుజుల ప్రభువని ఘనకీర్తిఁ దాఁబొంది యన్ని స్థలంబుల నమరువాఁడు
నుల్లము రంజిల్ల నెల్లరుఁ దెలియంగఁ బురుహూతుఁ డనుపేరుఁ బొందువాఁడు
గీ॥ నైన నింద్రుఁడు మే మిచ్చు హవ్యములను, బుచ్చుకొని మమ్ము రక్షింపఁ బూర్ణయావ
నంబు గల్గిన హయముల దంబు మీరఁ, బూన్చు నరదంబుపై వచ్చుఁ బూర్ణమతిని॥ 98

(2) గీ॥ మంచి యౌవన హయముల మంత్ర శక్తిఁ, బూన్పఁబడినట్టి రథముపైఁ బూజ్య! యెక్కి-
నీవు మా కభిముఖముగ నిశ్చయాత్మ,వచ్చి సోమ రసంబును బుచ్చుకొనుము! ॥ 99

(3) గీ॥ యౌవనాశ్వములం గల్గి యభిమతముల, నిచ్చు రథ మెక్కి- రావఁటే! యింద్ర! నీవు
నీకుఁ బ్రీతినిఁ బుట్టించు నిఖిలమైన, సోమరస మిచ్చుటనె యుండెఁజూఁడ రమ్ము! ॥ 100

(4) క॥ ఈ సవనము సంప్రీతిన్, నీ సముల కొనర్పఁబడెను నీకయి ఋజు ద
ర్భాసనసోమహవిస్సుల, వాసవుఁడా! యిచటఁ బొందుపఱచితిమిగదా! ॥ 101

(5) గీ॥ మత్కృతంబగు నుతి తతి మాన్య! వినుచు, మాకు నభిముఖముగ వచ్చి మంత్రములను
నాలకింపుచు నన్న చిరాయువులను,నొసఁగ రాదఁటె! బలముతో నోయి! యింద్ర! ॥ 102

1. సుష్టుతఽఇన్ద్ర. (వా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో.కృ.

## సూక్తమ్—178

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఇంద్రః

ఛందః—త్రిష్టుప్

(1) యద్ధ స్యా త[1] ఇన్ద్ర శ్రుష్టిరస్తి యయా బభూథ జరితృభ్య[2] ఊతీ ।

మా నః కామం మహయన్తమా ధగ్విశ్వా తే[3] అశ్యాం పర్యాప[4] ఆయోః ॥ 99

(2) న ఘా రాజేన్ద్ర[5] ఆ దభన్నో యా ను స్వసారా కృణవన్త యోనౌ ।

ఆపశ్చిదస్మై సుతుకా[6] అవేషన్ గమన్న ఇన్ద్రః సఖ్యా వయశ్చ ॥ 100

( ) జేతా నృభిరిన్ద్రః పృత్సు శూరః శ్రోతా హవం నాధమానస్య కారోః ।

ప్రభర్తా రథం దాశుష[7] ఉపాక ఉద్యన్తా గిరో యది చ త్మనా భూత్ ॥ 101

(4) ఏవా నృభిరిన్ద్రః సుశ్రవస్యా ప్రఖాదః పృక్షో[8] అభి మిత్రిణో భూత్ ।

సమర్య[9] ఇషః స్తవతే వివాచి సత్రాకరో యజమానస్య శంసః ॥ 102

1. తఽఇన్ద్ర, 2. జరితృభ్యఽఊతీ, 3. తేఽఅశ్యాం, 4. పర్యాపఽఆయోః, 5. రాజేన్ద్రఽఆ, 6. సుతుకాఽఅవేషన్గమన్నః ఇన్ద్రః, 7. దాశుషఽఉపాకఽఉద్య, 8. పృక్షోఽఅభి, 9. సమర్యఽఇషః, (ప్రా.ప్ర.)

(5) త్వయా వయం మఘవన్నిన్ద్ర శత్రూనభి ష్యామ మహతో మన్యమానాన్ ।

త్వం త్రాతా త్వము నో వృధే భూర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 103

## సూక్తము 178

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ నిను నుతియించు వారలకు నీవు శుభంబులఁ గూర్చు వాఁడ వం
చనయముఁ గల్గు కీర్తి భువి నంతట వెల్గుచు నుండెఁగాన నో
ఘనహయ! మాకుఁగూడ నతిగౌరవముం గలిఁగించుచుండి స
జ్జనుఁడు లభింప నర్హమగుసంపద నీయుము పాకనాశకా! ॥ 103

(2) గీ॥ అక్క చెల్లెండ్రవలె నుండు నహము రాత్రి,కాలము నెఱిఁగి వారల కార్యములను
జేయఁ దోడ్పడు నింద్రుఁ డమేయమహిమఁ, గర్మలఁ జెఱుపకుండెడుఁగాతఁ బ్రీతి॥ 104

క॥ బలహేతుక మగు హవ్యము, బలభేదినిఁ దృప్తిపఱచి పరమ ముదంబుం
గలిఁగించి మాకు సఖులకు, లలితాన్నంబిచ్చుఁ దాఁ దొలంగక యెపుడున్ ॥ 105

(3) ఉ॥ అంచిత విక్రమంబున మహాసమరవ్రతదీక్ష నెల్లఁ బో
షించెడి సన్మరుత్తులనుఁ జేరుచు దుర్మద వైరి భూములం
బొంచి మదించి మించు నరిభూపతులం బరిమార్చి ప్రీతి నా
లించుచు మంత్రవాక్కుల భళీ! యన రాఁడఁటె! శక్రుఁడెతయున్ ॥ 106

క॥ ఎప్పుడు శక్రుఁడు నుతులం,దప్పక వినఁగల్గువాఁడొ! తాను గరుణతో
నప్పుడె హవ్యంబులతో, నొప్పెడు గృహములకు రథము నొనరఁగఁద్రోలున్ ॥ 107

(4) చ॥ సవనముఁ జేయు మానవులు చాలఁగ నిచ్చెడి హవ్యరూపమున్
వివిధవిధంబులం దినుచు వెంపరులై చరియించువైరులం
బవిఁగొని కొట్టి చంపుచును బాకహరుండు విశేషదీర్ఘసం
స్తవముల వెల్గు యాగముల శాలలకుం జనుదెంచునేగదా! ॥ 108

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూడనగును. వ.గో.కృ.

(5) చ॥ ధనపతి! నీ సహాయమున ధన్యులమై మహనీయశత్రులం
బనిఁగొని సంహరింపఁగల భాగ్యము చేకుఱుచుండె మాకు నీ
వనయము రక్షకుండవు మహాత్ముఁడ వౌదువు పాకశాసనా!
ధనము బలంబు నన్నమును దద్ద నొసంగుము మానవాళికిన్॥ 103

## సూక్తమ్—179

ఋషిః—1.2 లోపాముద్రా, 3-4 అగస్త్యో మైత్రావరుణిః,
5-6 అగస్త్యశిష్యో బ్రహ్మచారీ

దేవతా—రతిః

ఛందః—త్రిష్టుప్, 5 బృహతీ

(1) పూర్వీరహం శరదః శశ్రమాణా దోషా వస్తోరుషసో జరయన్తీః ।
మినాతి శ్రియం జరిమా తనూనామప్యూ ను పత్నీర్వృషణో జగమ్యుః ॥ 104

(2) యే చిద్ధి పూర్వ[1] ఋతసాప ఆసన్ త్సాకం దేవేభిరవదన్నృతాని ।
తే చిదవాసుర్నహ్యన్తమాపుః సమూ ను పత్నీర్వృషభిర్జగమ్యుః ॥ 105

(3) న మృషా శ్రాన్తం యదవన్తి దేవా విశ్వా[2] ఇత్ స్పృధో అభ్యశ్నవావ ।
జయావేదత్ర శతనీథమాజిం యత్ సమఞ్చా మిథునావభ్యజావ ॥ 106

1. పూర్వ్యఽఋతసాపఽఆసన్, 2. విశ్వాఽఇత్స్పృధోఽఅభ్య. (ప్రా.ప్ర.)

(4) నదస్య నూ రుధతః కామా[1] ఆగన్నిత ఆజాతో అముతః కుతశ్చిత్ ।
లోపాముద్రా వృషణం నీ రిణాతి ధీరమధీరా ధయతి శ్వసన్తమ్ ॥ 107

(5) ఇమం ను సోమమన్తితో హృత్సు పీతముప బ్రువే।
యత్ సీమాగశ్చకృమా తత్ సు మృళతు పులుకామో హి మర్త్యః ॥ 108

(6) అగస్త్యః ఖనమానః ఖనిత్రైః ప్రజామపత్యం బలమిచ్ఛమానః ।
ఉభౌ వర్ణావృషిరుగ్రః పుపోష సత్యా దేవేష్వాశిషో జగామ ॥ 109

## సూక్తము—179

### ఋషి—1-2 లోపాముద్ర 3-4 మైత్రావరుణుఁడైన యగస్త్యుఁడు
### 5-6 అగస్త్య శిష్యుఁడైన బ్రహ్మచారి†
### దేవత—రతి †

(1) శా॥ లోపాముద్ర యటంచు నన్నెనెదరే లోపంబు లేదయ్యె బ్రే
ల్చాపం బెక్కుదినాలు నీదయిన శుశ్రూషాదులన్ జేసి త
త్తాపాధిక్యముచేత వృద్ధ నయితిన్ ధర్మంబు పాలింపవే!
యోపి స్త్రీలను భర్త లొందుదురుగా యూతిప్రదాఽగస్త్యుఁడా! ॥ 110

1. కామఽఆగన్నితఽ ఆజాతోఽఅముతః. (వ్రా ప్ర.)

† సంస్కృతమూల ప్రతుల ననుసరించి యీ ఋషులను బేర్కొనుట జరిగినది. శ్రీ నేమానివారు తమ యాంధ్రానువాద గ్రంథము వ్రాతప్రతిలోఁ బ్రథమ మండలము 2వ సంపుటము 191వ పుటలో నీ 179వ సూక్తమునకు ఋషి అగస్త్య శిష్యుఁడుగాఁ బేర్కొనుట జరిగినది. శ్రీ నేమానివారు వ్రాసిన ఋషి దేవతల పట్టికగల 15b సంపుటములో ఋషులను లోపాముద్ర అగస్త్యులుగాఁ వ్రాసిరి. కాని పద్యములలో 1-2 ఋగనువాదపద్యములు లోపాముద్ర అగస్త్యు నుద్దేశించి పలికినవిగను, 3-4 ఋక్కుల కనువాద పద్యములు లోపాముద్ర నుద్దేశించి అగస్త్యుఁడు పల్కినట్లుగను, 5-6 ఋక్కుల కనువాదపద్యములు అగస్త్య మహర్షి శిష్యుఁడు పల్కినట్లుగను వ్రాయఁబడినవి. ఈ పద్యములు సాయన భాష్యము ననుసరించి యనువాదము చేయఁబడినవి. (అగస్త్య ఋషి విశేషములకై యాంధ్రానువాదము 166వ సూక్తము ఋషికిచ్చిన పుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో కృ.) దేవత

(2) చ॥ అతిఘనులైన మౌనివరులందరు బ్రహ్మను దాము దేవతా
ప్రతతులతోడఁ బిల్చుచు స్వపత్నులఁగూడరె! వారి బ్రహ్మ స
ద్వ్రతములు రూపుమాసెనఁటె! వారల రీతి నగస్త్య! నీవు న
న్నతిదయతోడఁ జేకొనుచు నందుము సంగమసౌఖ్యసంపదన్ ॥ 111

(3) చ॥ మనరుఁగలట్టి వైరుల నమానుషశక్తిని సంహరించుచున్
మనకు నభీష్టసంపదల మానుగ నిత్తురు దేవతోత్తముల్
కనుక సుపత్ని! బ్రహ్మగతకర్మములం జరిపించియుంటచే
మనము జయింపఁగల్గుదుము మానిని! భోగ సుఖంబులన్నియున్ ॥ 112

గీ॥ ఈ ప్రపంచమందు నీ సుఖభోగసం,బంధ బంధకంబు పరిఢవిల్లు
నట్టివిధము నడపు మతియోగ్యమిథునాను,రాగమే ప్రధానభాగమగును ॥ 113

(4) ఉ॥ నీమము సల్పుచున్న నను నిర్భరకాముఁడు చేరె నప్పుడే
రామ! భవత్సహాయమున రమ్యవసంత ఋతుక్రమంబునన్
గామము హెచ్చుగాఁ బెరిగి కారియఁ బెట్టుచునుండె నన్ను స
త్కామిని! మత్సహాయమును గ్రన్ననఁ గోరుచు నుంటివే కదా! ॥ 114

(5) గీ॥ గురుని దత్పత్నియొక్కయుఁ గూర్మిపలుకు, లాలకించుటచే మాకు నంటె నఘము
కరము కామము గలవారు నరులుకాన, వేడుచున్నాము సోమము వేడ్క మీర ॥ 115

యీ సూక్తమునకు "రతి" యని వ్రాతప్రతిలోఁ బేర్కొనఁబడినను 15b సంఖ్యగల సంపుటములో శ్రీ నేమానివారు "రతి" (ఆనందము) అని స్వయముగా వ్రాసిరి. సాయనాదుల భాష్యముల ననుసరించి యాలోచించిన నీ సూక్తము వేదసూక్తము కానేరదు. లోపాముద్రాగస్త్యాగస్త్యశిష్యుల సంభాషణమున్న ఋక్కులు "రతి" ప్రసక్తికలవైనను నానంద పూర్వకములైనను పౌరుషేయములే యగును. కావున నీ ఋక్కులకే భాష్యార్థమే చెప్పినచో నివి యసలు వేదఋక్కులు కానేరవు. ప్రక్షిప్తములు కానోపును. ఇది వేదసూక్తమే యనియు నీ ఋక్కులు వేదములోనివే యనియు మనమామోదింప నెంచినయెడల వీనికి విశిష్టమైన వేరే యర్థము చెప్పవలసియున్నది. ఇవి వేద ఋక్కులని భావించి వీని విశిష్టార్థమును బ్రత్యేకముగాఁ బద్యములుగా విరచించి యర్థాంతరముగా నిచ్చుచున్నాను. సాయనాదుల భాష్యములు కేవల లౌకిక సంస్కృత వాఙ్మయములోని కథలు గాథల ప్రభావములతో నప్రామాణికములై యనాలోచితముగ నవతరించినవి. ఈ సూక్తమందలి యారు ఋక్కులకు విభిన్న ఆర్షవిజ్ఞాన దృక్పథములలో నొక దృక్పథముతోనే నీ యర్థాంతరాంధ్రానువాద పద్యములు రచించితిని. ఈ 179 సూక్తమునకు ఋషి అగస్త్యుఁడనువాఁడే. కాని దేవతలు లోపాముద్రాగస్త్య రూప మయిన "ప్రకృతి". ఈ విషయమును పాఠక పరిశోధకులు గుర్తింపవలయును.
వ.గో.కృ.

(6) చ॥ ఘన ఫల సాధకంబు లగు కర్మలతోడ నిజేష్టసిద్ధులం
గనుఁగొనుచుండి బ్రహ్మమును గాంచుచు నున్న నగస్త్యమౌని తా
ఘన మగు పుత్రసంతతిని గాంచుచు సంస్కృతిలోలబుద్ధియై
తనరి తపస్సుఁ జేసి చరితార్థుఁడు కాఁడె: తుష్టి నొందుచున్ ॥ 116

అర్థాంతర పద్యములు

(1) †సీ॥ హృద్యమై నంద్యమౌ నీ శరదృతువునఁ బూర్వాహ్ణము నుషస్సుఁ బొలుపు పోవ
దోషయుక్తం బౌచు దుర్దినమ్ముగ మీరఁ బ్రకృతి శోభలు తూరుపారినట్లు
గోచరం బగునెడ గో దంపతులు తమ సంతతిఁ బెంచి విశాల సృష్టి
సుఖశుభమయముగ క్షుద్రరాహిత్యమ్ముగను శోభలీనెడు కాంతి గ్రాల
గీ॥ లోపమున సముద్రితమయి లోప రహిత, దివ్యదేవి నగస్త్యుఁడు భవ్యగతుల
జడత లేకుండఁ గావాడి జగమునందు, గోధనంబులఁ బెంచుత గూఢతమెయి ॥ 117

(2) †గీ॥ అన్ని ఋతువుల దేవత లఖిలగతులఁ, దరతమ విభేదములు లేక తనర సమత
సహజ ఋతు కాల మట్టులు సర్వ సృష్టి, జ్ఞానమయ మౌచు వర్ధిల్లఁ గాత: జగతి: ॥ 118

(3) †గీ॥ విశ్వదేవత లెల్లరు విమల విపుల, శక్తి పుంజాల ఋగ్యజు స్సామములను
జయము కైసేసి యమృతంపుకాంతి నొంద,మిథునములఁ గాచుఁగాక నమేయ విధిగ ॥ 119

(4) †చ॥ నదులకు మూలమైన యల నల్లని మబ్బుల గుంపు లెంతయున్
ముదిగతిఁ జేరు నా వివిధ తోయధు లాకరమై జనించు నా
సదమల మైన రీతిఁ దమ సంతతిగాఁగను దామె యౌచు నే
విధి నయినన్ జనించు నటు విశ్వము వెల్గును వెల్గు వెల్గులై ॥ 120

(5) †గీ॥ పొందుచున్ సూర్య కాంతిని జందమామ, చంద్రు నమృతశక్తి రవి యతంద్ర గతిని
బీల్చి జ్వాజ్వల్య మానతఁ బెంపు నొందు.ఖాతి నల్లి బిల్లిగ సృష్టి వరలుఁగాక : ॥ 121

(6) †గీ॥ గురు వగస్త్యుండు దేవుఁడగును నగస్త్యుఁ, డమ్యులోప మెనయకయే యణువయినను
దివ్య దేవి యలరఁగఁ బ్రదీప్త మగుచు, నమృతమయ మౌచు మృత మయ్యు నలరు సృష్టి॥ 122

†గీ॥ సృష్టి కార్య మెంత ఋతమ్ముమై వెల్గునో, విశ్వ సృష్టి రీతి వెల్గునట్లె :
పాపము నశియింప నాపుణ్యవిమలము, మిగులునట్లు సత్తు మిగుల వెల్గు ॥ 123

† రచయిత:—వాఙ్మయ మహోద్యక్ష, డాక్టర్ వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ."

## అనువాకః—24, సూక్తమ్—180

ఋషిః—1-10 అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) యువో రజాంసి సుయమాసో[1] అశ్వా రథో యద్ వాం పర్యర్ణాంసి దీయత్ ।

హిరణ్యయా వాం పవయః ప్రుషాయన్ మధ్వః పిబన్తా[2] ఉషసః సచేథే ॥ 110

(2) యువమత్యస్యావ నక్షథో యద్ విపత్మనో నర్యస్య ప్రయజ్యోః ।

స్వసా యద్ వాం విశ్వగూర్తీ భరాతి వాజాయేట్టే మధుపావిషే చ ॥ 111

(3) యువం పయ[3] ఉస్రియాయామధత్తం పక్వమామాయామవ పూర్వ్యం గోః ।

అన్తర్యద్ వనినో వామృతప్సూ హ్వారో న శుచిర్యజతే హవిష్మాన్ ॥ 112

(4) యువం హ ఘర్మం మధుమన్తమత్రయే ఽపో న క్షోదోఽవృణీతమేషే ।

తద్ వాం నరావశ్వినా పశ్వ[4]ఇష్టీ రథ్యేవ చక్రా ప్రతి యన్తి మధ్వః ॥ 113

1. సుయమానోఽశ్వా. 2. పిబన్తాఽఉషసః. 3. పయఽఉస్రి. 4. పశ్వఽఇష్టీ (వ్రా.ప్ర.)

(5) ఆ వాం దానాయ వవృతీయ దస్రా గోరోహేణ తౌగ్ర్యో న జివ్రిః ।

అపః క్షోణీ సచతే మాహినా వాం జూర్ణో వామక్షురంహసో యజత్రా ॥ 114

(6) ని యద్ యువేథే నియుతః సుదానూ[1] ఉప స్వధాభిః సృజథః పురంధిమ్ ।

ప్రేషద్ వేషద్ వాతో న సూరిరా మహే దదే సువ్రతో న వాజమ్ ॥ 115

(7) వయం చిద్ధి వాం జరితారః సత్యా విపన్యామహే వి పణిర్హితావాన్ ।

అధా చిద్ధి ష్మాశ్వినావనిన్ద్యా పాథో హి ష్మా వృషణావన్తిదేవమ్ ॥ 116

(8) యువాం చిద్ధి ష్మాశ్వినావను ద్యూన్ విరుద్రస్య ప్రస్రవణస్య సాతౌ ।

అగస్త్యో నరాం నృషు ప్రశస్తః కారాధునీవ చితయత్ సహస్రైః ॥ 117

(9) ప్ర యద్ వహేథే మహినా రథస్య ప్ర స్పన్ద్రా యాథో మనుషో న హోతా ।

ధత్తం సూరిభ్య[2] ఉత వా స్వశ్వ్యం నాసత్యా రయిషాచః స్యామ ॥ 118

1. సుదానూఽఉప 2. సూరిభ్యఽఉత వా (వా.ప్ర.)

(10) తం వాం రథం వయమద్యా హువేమ స్తోమైరశ్వినా సువితాయ నవ్యమ్ ।
అరిష్టనేమిం పరి ద్యామియానం విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 119

## అనువాకము—24, సూక్తము—180
### ఋషి—అగస్త్యుఁడు *
### దేవత—అశ్విదేవతలు

(1) చ॥ స్థిరముగ మీ రథంబు ప్రతిసీమకుఁ ద్రిప్పినయప్పు డశ్వముల్
కరము చరించు నెల్లెడలఁ గాంచన శోభిత యాన నేములున్
వరముల నిచ్చుచున్నవి విభాసితసోమముఁ ద్రావరారఁటే!
వరమతులార! యజ్ఞముల వాటిక లందినఁ గోరి హవ్యమున్ ॥ 124

(2,3) సీ॥ అంతట నేవేళ నరుగు మీ యానంబు యాగంబునకు ముందె సాగుచుండు!
యజమానులకు హిత మర్పించు మీ బండి చిత్రవిచిత్రమై చెలఁగుచుండు!
మీ స్వస్పృకల్యాంబ మీ రాకకై ప్రభాతంబును జేయుచుఁ దనరుచుండు!
యాగంబులంజేయు యజమాన గణమెల్ల నన్నార్థమై మిమ్ము నడుగుచుండు!
గీ॥ గోవునందుఁ బయస్సులు కొదువలేక, వెలుగునట్టులు చేయరే! వేల్పులార!
గొడ్డు గోవునకుంగూడఁ గొదవలేని, క్షీరముల్ కల్గఁజేయరే! వీరులార! ॥ 125

క॥ తమమధ్య నుండు చోరుని, సమవృక్షములన్నికాచు సరసను హవ్య
క్రమమునఁ బరుశుద్ధుండై, నమరెడుమానవుఁడు మమ్ము నర్చింపఁడొకో! ॥ 126

---

1. సూరిశ్యఽఉతవా. (వ్రా.ప్ర.)

* ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదములోని 166 వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (556 వ పుట) చూడనగును. వ.గో.కృ.

(4) గీ॥ ఉష్ణముగ నున్న ఘృతమును నుడుకుచున్న, క్షీరముల నీటివలె నోరుచేసి యత్రి
కిచ్చినారలు నరులార![1] యిద్ధవహ్ని, వ్రేల్వఁగాఁబడె సోమము వెలయుచుండె ॥ 127

(5) చ॥ జరను గ్రసింప భుజ్యముని చాఱ్పున మిమ్ముల యజ్ఞభూమికిన్
బిరబిర రమ్మటంచుఁ గడుఁబిల్చుచునుంటిమి దస్రులార! మీ
పరమకృపావిశేషమున భాసిలుచుండు దివంబు భూమియున్
స్థిరముగనుండుఁగాక! మునిజీర్ణ శరీరము నొందుచుండినన్ ॥ 128

(6) చ॥ ఘనహయముల్ రథంబునకుఁ గట్టినయప్పుడు భూమియంతయున్
గననగు నన్నవంతుఁడగు కర్మకరుండు వ్రతార్థియౌచు మి
మ్మనయము వాయు చందమున నత్యధికంబుగఁదృప్తిఁజేసి మీ
యనుమతి నన్నమున్ బలము నందుచు నుండఁడె! యశ్విదేవతల్! ॥ 129

(7) క॥ నిజమగుఫలముం బొందఁగ, భజియించుచునుంటి మిమ్ముఁ బావనులారా!
నిజమగు సోమము గలదిట, భజియింపుఁడు దాని మీరు పరమప్రీతిన్ ॥ 130

(8) గీ॥ కర్మనిర్వాహకమనుష్యగణములో న,గస్త్యుఁ డుదకప్రసాదము గనఁగఁగోరి
శంఖనాదమువలె మిమ్ము సంస్తవముల, హెచ్చరించుచునున్నాఁడు మెచ్చుఁడతని ॥ 131

(9,10) సీ॥ స్వర్గంబునకుఁ బోవ సాధకంబగునట్టి యిష్టిభారము వహియించువారు!
యాగంబునకు వచ్చి యది సాగనీయని యంతరాయంబుల నడుఁచువారు!
యాగంబు లన్నియు సాగినవెంటనే వివిధహోతలమాట్కి వెడలువారు!
నుతియించువారికి నతిఫలంబుల నశ్వసముదాయము నొసఁగఁజాలువార
గీ॥ లైన మిమ్ముల మీ రథ మతిపవిత్ర, యజ్ఞశాలకుఁ గొనితేర నధికభక్తి
సంస్తవంబులఁ జేయుచు సరసులార!, యన్నబలముల నాయువు నందఁగలము ॥ 132

1. ఇక్కడ "నరులార!" అన్నదాని తరువాత వ్రాతప్రతిలో (2వ. సంపుటము. 195 పుట.) బ్రాకెట్లలో (కర్మ నిర్వాకులార!) అని వ్రాయఁబడి యున్నది. "కిచ్చినారలు కర్మనిర్వాకులార!" అని పాఠము గ్రహించుచో యతిభంగ మగును. వ.గో.కృ.

## సూక్తమ్—181

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) కదు ప్రేష్ఠావిషాం రయీణామధ్వర్యన్తా యదున్నినీథో అపామ్ ।

అయం వాం యజ్ఞో[1] అకృత ప్రశస్తిం వసుధితీ[2] అవితారా జనానామ్ ॥ 120

(2) ఆ వామశ్వాసః శుచయః పయస్పా వాతరంహసో దివ్యాసో[3] అత్యాః ।

మనోజువో వృషణో వీతపృష్ఠా[4] ఏహ స్వరాజో అశ్వినా వహన్తు ॥ 121

(3) ఆ వాం రథోఽవనిర్న ప్రవత్వాన్ త్సృప్రవన్ధురః సువితాయ గమ్యాః ।

వృష్ణః స్థాతారా మనసో జవీయానహంపూర్వో యజతో ధిష్ణ్యా యః ॥ 122

(4) ఇహేహ జాతా సమవావశీతామరేపసా తన్వా౩ నామభిః స్వైః ।

జిష్ణుర్వామన్యః సుమఖస్య సూరిర్దివో[5] అన్యః సుభగః పుత్ర[6] ఊహే ॥ 123

1. యజ్ఞోఽకృత, 2. వసుధితీఽవితారా, 3. దివ్యాసోఽత్యాః, 4. వీతపృష్ఠాఽఏహస్వరాజో, 5 సూరిర్దివోఽన్యః, 6. పుత్రఽఊహే. (ప్రా.ప్ర.)

(5) ప్ర వాం నిచేరుః కకుహో వశాగ్ం[1] అను పిశఙ్గరూపః సదనాని గమ్యాః ।

హరీ[2] అన్యస్య పీపయన్త వాజైర్మథ్రా రజాంస్యశ్వినా వి ఘోషైః ॥ 124

(6) ప్ర వాం శరద్వాన్ వృషభో న నిష్షాట్ పూర్వీరిషశ్చరతి మధ్వ[3] ఇష్ణన్ ।

ఏవైరన్యస్య పీపయన్త వాజైర్వేషన్తీరూర్ధ్వా నద్యో న[4] ఆగుః ॥ 125

(7) అసర్జి వాం స్థవిరా వేధసా గీర్బాళ్హే[5] అశ్వినా త్రేధా క్షరన్తీ ।

ఉపస్తుతావవతం నాధమానం యామన్నయామఞ్ఛృణుతం హవం మే ॥ 126

(8) ఉత స్యా వాం రుశతో వప్ససో గీస్త్రిబర్హిషి సదసి పిన్వతే నౄన్ ।

వృషా వాం మేఘో వృషణా పీపాయ గోర్న సేకే మనుషో దశస్యన్ ॥

(9) యువాం పూషేవాశ్వినా పురంధిరగ్నిముషాం న జరతే హవిష్మాన్ ।

హువే యద్ వాం వరివస్యా గృణానో విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 128

---

1. వశాగ్ంఽఅను, 2. హరీఽఅన్యస్య, 3. మధ్వఽఇష్ణన్, 4. నఽఆగుః, 5. గీర్బాహ్వోఽఅశ్వినా, (ప్రా.ప్ర.)

## సూక్తము—181

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—అశ్విదేవతలు

(1) క॥ ఎప్పుడు వృష్ట్యుదకంబుల, నొప్పుగ మాకీయఁగలరొ! యో ఘనులారా!
యప్పుడె మాకన్నంబుం, దప్పక కలుఁగదె! సమస్తధారుణి యంతన్ ॥ 133

క॥ మిక్కిలి ప్రియమగు వారలు.చక్కఁగ సవనాంతములను జరిపెడువారల్
నిక్కముగ ధనమునిచ్చుచు, నెక్కుడు రక్షకులు ద్రమలెంతయు మాకున్ ॥ 134

(2) చ॥ అతిశుచిభావముంగలిఁగి యత్యధికంబగు వృష్టివారులన్
సతతముఁ ద్రాగి యౌవనపు సంపద నెంతయుఁ బొంది వాత స
ద్గతివలె నుండువేగమును గాంచుచు నాకపదంబుఁ బొందుచున్
మతివలెఁ బోవు మీ హరులు మానుగ మిమ్ములఁ దెచ్చుదేవతల్ ॥ 135

(3) ఉ॥ ఉన్నతమైన దేశమున నుండెడు వారు రాథాధివాసులై
సన్నుతిఁ గన్నవారలగు చక్కనియశ్వుల యౌవనాఢ్యమై
నెన్నికగల్గి వేగమున నెంతయు మానసమున్ జయించు నా
తిన్నని యాన మిచ్చుటకుఁ దీసుకవచ్చునుగాక! మిమ్ములన్ ॥ 136

(4) గీ॥ అంతరిక్షదివంబుల నాశ్రయించి, స్వప్రభావంబుచే వెల్గి సరసులైన
సూర్యచంద్రులుగానుండి శోభఁగాంచు.నశ్విదేవత లిరువుర నాశ్రయింతు ॥ 137

ఉ॥ ఇరువురియందు నొక్కరుఁ డహీననిశాపతియోషధీతతుల్
మెరపెడునట్లుచేసి కడు మేలగు లోకము నేలుచుండె నిం
కిరువురిలోన వేరొక్క డహీనదివాపతి నైట ఘృష్టులం
బరపుచు నన్నివైపులకుఁ బాలనఁ జేయుచునుండె లోకమున్ ॥ 138

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూడనగును. వ.గో.కృ.

(5,6) సీ॥ అశ్విద్వయంబులో నన్యుఁడు పచ్చని యానంబుపై నెక్కి యరుగుఁగాక!
నశ్విద్వయంబులో నన్యుని యశ్వాళి యన్నస్తుతులఁ దృప్తి నందుఁగాక!
నశ్విద్వయంబులో నన్యుఁడు శారద చంద్రుఁడై తృప్తి నొసంగుఁగాక!
నశ్విద్వయంబులో నన్యుఁ డింద్రునిఁబోలి శత్రు సంఘంబులఁ జంపుఁగాక!
గీ॥ నందులో వాఁడె హవ్యంబు నందఁదలఁచి, సస్యవృద్ధినిఁ జేయంగఁ జాలుఁగాక!
నన్యుఁ డగు సూర్యదేవుఁ డత్యాదరమున. సరస నదులను బుట్టించి జనునుగాక! ॥ 139

(7) చ॥ స్థిరముగ మీ యనుగ్రహముఁ జెందుటకై ఘన వేద వాక్కులం
గరము నుతించుచుంటి మిముఁ గాన విధాతృసమానులార! మీ
రిరువురు మాకుఁ దృప్తిఁ గలిఁగింపుఁడు మీరలు వచ్చునప్పుడున్
బిరబిరఁ బోవునప్పుడును బిల్పు వినుండు! దయాస్వరూపులై ॥ 140

(8) చ॥ త్రివిధముగా నమర్పఁబడు దివ్యకుశంబుల నొప్పు నిష్టలన్
స్తవములఁ బొందు యాజ్ఞికుల సత్య వచస్సులు తుష్టి నిచ్చెడున్
నవ జల మిచ్చు వారిదము నవ్యజలంబు లొసంగుచుండి గో
వివరము మాట్కి మా కిపుడు వేయి విధంబులఁ దృప్తిఁ జేయుతన్ ॥ 141

(9) గీ॥ అగ్న్యుషస్సులవలె మిమ్ము నాదరించి, పూజ లొనరించుచున్నారు పుణ్యమతులు
మిమ్ము నుతియించు వార లమేయబలము, నన్నమును బొందెదరుగాక! నతిశయించి ॥ 142

## సూక్తమ్—182

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అశ్వినౌ

ఛందః—జగతీ; 6.8 త్రిష్టుప్.

(1) అభూదిదం వయునమో షు భూషతా రథో వృషణ్వాన్ మదతా మనీషిణః ।
ధియంజిన్వా ధిష్ణ్యా విశ్పలావసూ దివో నపాతా సుకృతే శుచివ్రతా ॥ 129

(2) ఇన్ద్రతమా హి ధిష్ణ్యా మరుత్తమా దస్రా దంసిష్ఠా రథ్యా రథీతమా ।
పూర్ణం రథం వహేథే మధ్వ[1] ఆచితం తేన దాశ్వాంసముప యాథో[2] అశ్వినా ॥ 130

(3) కిమత్ర దస్రా కృణుథః కిమాసాథే జనో యః కశ్చిదహవిర్మహీయతే ।
అతి క్రమిష్టం జురతం పణేరసుం జ్యోతిర్విప్రాయ కృణుతం వచస్యవే ॥ 131

(4) జమ్భయతమభితో రాయతః శునో హతం మృధో విదథుస్తాన్యశ్వినా ।
వాచంవాచం జరితూ రత్నినీం కృతముభా శంసం నాసత్యావతం మమ ॥ 132

(5) యువమేతం చక్రథుః సిన్ధుషు ప్లవమాత్మన్వన్తం పక్షిణం తౌగ్ర్యాయకమ్ ।
యేన దేవత్రా మనసా నిరూహథు సుపప్తనీ పేతథుః క్షోదసో మహః ॥ 133

(6) అవవిద్ధం తౌ[3]గ్ర్యమప్స్వం౧న్తరనారమ్భణే తమసి ప్రవిద్ధమ్ ।
చతస్రో నావో జఠలస్య జుష్టా[4] ఉదశ్విభ్యామిషితాః పారయన్తి ॥ 134

1. మధ్వఽఆచితం, 2. యాథోఽఅశ్వినా, 3. తౌగ్ర్యామప్స్వం౧న్తరనారమ్భణే, 4. జుష్టాఽఉదశ్వి. (వ్రా.ప్ర.)

(7) కః స్విద్ వృక్షో నిష్ఠితో మధ్యే[1] అర్ణసో యం తౌగ్ర్యో నాధితః పర్యషస్వజత్ ।
పర్ణా మృగస్య పతరోరివారభ[2] ఉదశ్వినా ఊహథుః శ్రోమతాయ కమ్ ॥ 135

(8) తద్ వాం నరా నాసత్యావను ష్యాద్ యద్ వాం మానాస[3] ఉచథమవోచన్ ।
అస్మాదద్య సదసః సోమ్యాదా విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 136

## సూక్తము—182

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—అశ్విదేవతలు

(1) ఉ॥ అల్లది యశ్విదేవతల యానము వచ్చుచునుండెఁ జూఁడుఁడీ
చల్లని యశ్విదేవతల సంతస మొప్పఁగ మీరు చూఁచుచో
మెల్లఁగ విశ్పలాసతి యమేయఫలంబుల నొందునట్లు మీ
రెల్లరుఁ బొందకుండుదురె! యెంతయు మేలు మనీషి బృందముల్ ॥ 143

గీ॥ సూర్య పౌత్రు లగుచు శుచిగల వారైన,నశ్వు లధికసుకృత మాచరించు
వారి కెటుల నైన వలసిన దానిని.నొసఁగి తుష్టిఁగూడ నొసఁగఁగలరు ॥ 144

(2) సీ॥ అశ్విదేవతలార! యమరాధిపునికంటె మిక్కిలి ఘనులౌచు మెలఁగువార
లశ్విదేవతలార! యా మరుత్తులకంటె శ్రేష్ఠులై సంతుష్టిఁ జెందువార
లశ్విదేవతలార! యందఱికంటెను వెలయు కర్మలఁజేసి వెలుఁగువార
లశ్విదేవతలార! యందఱికంటెను సరి నాశన మొనర్ప నరుఁగువారు
గీ॥ మధురసముతోడ వెండియు మహితవస్తు,సంతతులతోడఁ గూడిన సరసరథము
నెక్కు వారైన మీరలు పిక్కటిల్లి,పుచ్చుకొన రారె! హవ్యము పూజ్యులార! ॥ 145

1. మధ్యేఽఅర్ణ 2. పతరోరివారభఽఉదశ్వినాఽఊహథుః, 3. మానాసఽఉచ (వ్రా.ప్ర.)

* ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదములోని 166 వ సూక్తము ఋషికిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(3) ఉ॥ ఇక్కడ నేల నుండెదరు హీనులు వీరలు వీర లిష్టులం
జక్కఁగఁ జేసి హవ్యములఁ జాలఁగ నీయని వారు యోగ్యులన్
మిక్కిలి తిట్టుచున్ ధనిక మేదుర భక్తినిఁ జూపుచుంద్రు మీ
రెక్కువ వారుకారె! మతి నెక్కుడు వారికి నశ్విదేవతల్! ॥ 146

(4) ఉ॥ కొట్టుఁడు మీరు కుక్కవలెఁ గుచ్ఛితశబ్దము చేయు శత్రునిం
బట్టుఁడు ఘోరయుద్ధములఁ బంతముతోఁ గలిపించువారలం
బెట్టుఁడు మా నుతుల్ మదులఁ బేర్మి వహించెదు నశ్వులార! మా
గుట్టులు మీ రెఱుంగరఁటె! క్రొత్తవె మీ కవి తుచ్ఛ కార్యముల్ ॥ 147

(5) ఉ॥ మీరలు తుగ్ర పుత్రుని నిమిత్తము వారిధియందుఁ బక్షి సం
చారముఁ బోలు వేగమున సాఁగెడు నావను గల్గఁజేసి యే
తీరునో వానిఁ జేర్చితిరి తీరపు భూమికి నశ్వులార! మీ
బీరము నెన్నఁగా వశమె? పెద్దలు గారఁటె? మీర లెంతయున్ ॥ 148

(6) ఉ॥ వారిధి వారి మధ్యమున వైరులచేఁ బడఁద్రోయఁబడ్డ నా
భీరువు భుజ్యుఁడెంతయును భీతిలి చీఁకటిమాటికి నుండు నా
నీరధిలోన దృష్టి చెడి నీరస మొందఁగ నశ్విదేవతల్ !
మీరలు నాల్గు నావలను మెప్పుగ వానికిఁ బంప లేదఁటే! ॥ 149

(7) ఉ॥ మిమ్ములఁ గోరు తుగ్ర సుతు మేలునకై నడి సంద్రమందు వృ
క్షమ్ము జనించునా యనెడు చందము యానము నిల్పినారు మీ
రెమ్మెయిఁ బక్షి సంఘము లహీనపు టాకుల నాశ్రయించునో
యమ్మెయిఁ "దుగ్ర" పుత్రునకు నాశ్రయ మైతిరికాదె! యశ్వికుల్! ॥ 150

(8) గీ॥ యజ్ఞ కర్మలఁ జేయించు నశ్వులార!, మీకు సంతృప్తి కల్గించుఁగాక! నుతులు
యాగ శాలాస్థలంబుల నమరు సోమ, రసము బలమును నన్నంబు నొసంగుఁగాక! ॥ 151

## సూక్తమ్—183

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) తం యుఞ్జాథాం మనసో యో జవీయాన్ త్రివన్ధురో[1] వృషణా యస్త్రిచక్రః ।

యేనోపయాథః సుకృతో దురోణం త్రిధాతునా పతథో విర్న పర్ణైః ॥ 137

(2) సువృద్ రథో వర్తతే యన్నభి క్షాం యత్ తిష్ఠథః క్రతుమన్తాను పృక్షే ।

వపుర్వపుష్యా సచతామియం గీర్దివో దుహిత్రోషసా సచేథే ॥ 138

(3) ఆ తిష్ఠతం సువృతం యో రథో వామను వ్రతాని వర్తతే హవిష్మాన్ ।

యేన నరా నాసత్యేషయధ్యై వర్తిర్యాథస్తనయాయ త్మనే చ ॥ 139

(4) మా వాం వృకో మా వృకీరా దధర్షీన్మా పరి వర్క్తముత మాతి ధక్తమ్ ।

అయం వాం భాగో నిహిత[2] ఇయం గీర్దస్రావిమే వాం నిధయో మధూనామ్ ॥ 140

---

1. త్రిబన్ధురో, 2. నిహితఽఇయం. (వ్రా.ప్ర.)

(5) యువాం గోతమః పురుమీ[1]ళ్హో అత్రిర్దస్రా హవతేఽవసే హవిష్మాన్ ।

దిశం న దిష్టామృజూయేవ యన్తా మే హవం నాసత్యోప యాతమ్ ॥ 141

(6) అతారిష్మ తమసస్పారమస్య ప్రతి వాం స్తోమో[2] అశ్వినావధాయి ।

ఏహ యాతం పథిభిర్దేవయానైర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 142

ఇతి
ద్వితీయోఽష్టకే చతుర్థోఽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—183

ఋషి—అగస్త్యుఁడు*

దేవత—అశ్విదేవతలు

(1) ఉ॥ ఏది త్రి బంధురం బగునొ! యెయ్యది పక్షిని బోలి పోవునో!
యేది త్రి చక్రముల్ గల్గు నెయ్యది యాగ గృహంబు చేరు నిం
కేది త్రిధాతు రంజితమొ! యింపగునట్టి రథంబు నెక్కి సం
పాదితయజ్ఞకర్మలకు బంధుర మైత్రిని రండు! దేవతల్! ॥ 152

(2) చ॥ నరనుతమైన మీ రథము నవ్య సుభా గమనంబు గల్గుచున్
వర సవనంపు శాలలకు వచ్చుచు నున్నది మీరు దేవతల్!
పరమ దయా విశిష్టులయి భవ్యహవిః ప్రదమానవాళితోఁ
బరఁగెడు యజ్ఞ శాలలకు వచ్చుచు నుందురు సంతసంబునన్ ॥ 153

1. మీళహోఽఅత్రి. 2. స్తోమోఽఅశ్వినావధాయి (బ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూడనగును. వ.గో.కృ.

గీ॥ మీకు సంతుష్టి కలిఁగించు మేలు నుతులు త్వచ్ఛరీరంబు సయుతముఁ దనువుఁగాక!
నాకసంబునకుం బుత్రి యైన కల్య. దేవితోఁ జేయుదురుగాక! దివిజులార! ॥ 154

(3) క॥ సుఖగమనము గల యరదము. సఖులారా! మీర లెక్కి సమ్మతితోడన్
నిఖిలులకు నుతుల నీయన్. మఖకర్మకు వచ్చుచుంట మర్యాదనుఁడీ! ॥ 155

(4) గీ॥ అరి వినాశకదక్షు లౌ నశ్వులార!. క్రూర మృగములు మా కేమి కీడుచేయ
కుండఁ జేయుచు మీరలు రండు! మమ్ముఁ. వదలకుండఁగ మా కిండు! పలయువాని ॥ 156

క॥ ప్రథమహవిర్భాగము సుస్థిరముగ నిటనుండె నుతులు చేయఁబడెన్ సో
మరసము సిద్ధం బయ్యెను. నరమర లేకుండ రారె! నశ్వులు! మీరల్ ॥ 157

(5) క॥ పురు మీఢ్గోత మాత్రులు, పరమ హవి ద్రవ్య మెల్లఁ బట్టుక యశ్వుల్
చిర రక్షణమునకై తమ. దరికిం బిలచెదరు మిమ్ముఁ దద్దయు భక్తిన్ ॥ 158

గీ॥ మార్గగామి తనదు మనసులో నుస్నట్టి, సుస్థలంబుఁ జేర శుభ్ర మార్గ
మంటి పోవు నట్టు లశ్వులార!, కదుఁ బిలుపు విను[1]చు రండు! ప్రీతి మీరు ॥ 159

(6) గీ॥ మీ యనుగ్రహవశమున మేము తమము. దాఁటి మిముఁ [1]బొగడుచున్నాము ధర్మ బుద్ధి
దేవతల మార్గమును బట్టి దివిజులార!, వచ్చి యున్న బలాదుల నిచ్చి పొండు! ॥ 160

ఇయ్యది

శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన
భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు
ద్వితీయాష్టకమునఁ జతుర్థాధ్యాయము
సమాప్తము

---

1. ఈ తేటగీతి పాదములోఁ బంచలఘుగణమింద్రగణముగాఁ బ్రయోగితమైనది. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ప్రథమ మండలమ్

### ద్వితీయోఽష్టకః—పంచమోఽధ్యాయః

### సూక్తమ్—184

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) తా వామద్య తావపరం హువేమోచ్ఛన్త్యాముషసి వహ్నిరుక్థైః ।
నాసత్యా కుహ చిత్సన్తావర్యో దివో నపాతా సుదాస్తరాయ ॥ 1

(2) అస్మే[1] ఊ షు వృషణా మాదయేథాముత్పణీగ్ం[2]ర్హతమూర్మ్యా మదన్తా ।
శ్రుతం మే[3] అచ్ఛోక్తిభిర్మతీనామేష్టా నరా నిచేతారా చ కర్ణైః ॥ 2

(3) శ్రియే పూషన్నిషుకృతేవ దేవా నాసత్యా వహతుం సూర్యాయాః ।
వచ్యన్తే వాం కకుహా[4] అప్సు జాతా యుగా జూర్ణేవ వరుణస్య భూరేః ॥ 3

1. అస్మేఽఊషు, 2. పణీగ్ంఽర్హత, 3. మేఽఅచ్ఛోక్తిభిః, 4. కకుహాఽఅప్సు. (ప్రా.ప్ర.)

(4) అస్మే సా వాం మాధ్వీ రాతిరస్తు స్తోమం హినోతం మాన్యస్య కారోః ।
అను యద్వాం శ్రవస్యా సుదానూ సువీర్యాయ చర్షణయో మదన్తి ॥ 4

(5) ఏష వాం స్తోమో[1] అశ్వినావకారి మానేభిర్మఘవానా సువృక్తి ।
యాతం వర్తిస్తనయాయ త్మనే చాగస్త్యే నాసత్యా మదన్తా ॥ 5

(6) అతారిష్మ తమసస్పారమస్య ప్రతి వాం స్తోమో[2] అశ్వినావధాయి ।
ఏహ[3] యాతం పథిభిర్దేవయానైర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 6

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ప్రథమ మండలము

ద్వితీయాష్టకము—పంచమాధ్యాయము

సూక్తము—184

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—అశ్వీదేవతలు

(1) ఉ॥ యాగముఁ జేయు కాలముల యాగముఁ జేయనియట్టి వేళలన్
రాగ మెలర్ప మిమ్ముఁ గడు రంజిలఁ జేయఁగఁ బిల్చుచుంటి మో
భోగ పరాయణద్వయమ! పూర్ణనుతిం జెవిఁబెట్టి మీర లెం
దేగిన మున్న యజ్ఞముల కెంతయుఁ బ్రీతిని వచ్చుచుండరే! ॥ 1

1. స్తోమోఽశ్వి. 2. స్తోమోఽశ్వినావధాయి. 3. ఏష యాతం. (వ్రా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(2) ఉ॥ అమృతమువంటి సోమరస మానుచు నిష్టము లిచ్చువారలై
సమముగ సర్వకర్మలను జక్కనొనర్చెడు నశ్వులార! యా
గము నొనరింపనట్టి జన కాండముఁగొట్టుచు నుండి వేద మం
త్రములఁ బఠించు మా నుతులఁ దప్పక మీరు వినుండు! ప్రీతితోన్ ॥ 2

(3) చ॥ రవి శశి రూప సంపదల రాజిలుచుండెడు నశ్వులార! మీ
రవితథ మంత్ర సూక్తముల నందుటకున్ మఱి సూర్య కన్యకం
బ్రవిమల భంగిఁబొందుటకు బాణము పోయెడు మాట్కిఁ బోవు సం
స్తవ గత రుక్మయానమును జక్కఁగ నెక్కితి రెంతయున్ వడిన్ ॥ 3

(4) చ॥ ఘన మధు పూర్ణపాత్రమును గల్గిన యశ్వులు! మీ సుదానము
[1]న్ననువుగ మాకు లాభము నొనర్చునుగాక! నగస్త్య ముఖ్య స
న్మని వర మంత్రజాలములు మోదముఁ జేయునుగాక! మీకుఁ గై
కొనెదరుగాక! ఋత్విజులు గూర్చిన సన్నుతి మీర లాత్రతోన్ ॥ 4

(5) గీ॥ హవ్య యుక్తమహాగస్త్య నవ్యమతులు, పాప విచ్ఛేదకము లౌచుఁ బరిడవిల్లెఁ
గాన నశ్వులు! మీరలు కదలి వచ్చి, పుత్ర దానంబు సేయుఁ డా పుణ్యమునికి ॥ 5

(6) గీ॥ మీ యనుగ్రహవశమున మేము తమము, దాఁటి మిముఁ[2] బొగడుచున్నాము ధర్మబుద్ధి
దేవతలమార్గమును బట్టి దివిజులార!, వచ్చియున్న జలాదుల నిచ్చి పొండు! ॥ 6

## సూక్తమ్—185

ఋషి—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ద్యావాపృథివ్యౌ

ఛందః—త్రిష్టుప్

(1) కతరా పూర్వా కతరాపరాయోః కథా జాతే కవయః కో వి వేద ।

విశ్వం త్మనా బిభృతో యద్ధ నామ వి వర్తేతే[1] అహనీ చక్రియేవ ॥ 7

1. ఇక్కడ నఖండయతి ప్రయుక్తమైనది. 2. ఇక్కడ నింద్రగణమునకుమారు పంచలఘుగణము ప్రయుక్తమైనది.వ.గో.కృ.

1. వర్తేతేఽఅహనీ, (వ్రా.ప్ర)

(2) భూరిం ద్వే[1] అచరన్తీ చరన్తం పద్వన్తం గర్భమపదీ దధాతే ।

నిత్యం న సూనుం పిత్రోరుపస్థే ద్యావా రక్షతం పృథివీ నో[2] అభ్వాత్ ॥ 8

(3) అనేహో దాత్రమదితేరనర్వం హువే స్వర్వదవధం నమస్వత్ ।

తద్రోదసీ జనయతం జరిత్రే ద్యావా రక్షతం పృథివీ నో[2] అభ్వాత్ ॥ 9

(4) అతప్యమానే[3] అవసావన్తీ అను ష్యామ రోదసీ దేవపుత్రే ।

ఉభే దేవానాముభయేభిరహ్నాం ద్యావా రక్షతం పృథివీ నో[2] అభ్వాత్ ॥ 10

(5) సంగచ్ఛమానే యువతీ సమన్తే స్వసారా జామీ పిత్రోరుపస్థే ।

అభిజిఘ్రన్తీ భువనస్య నాభిం ద్యావా రక్షతం పృథివీ నో[2] అభ్వాత్ ॥ 11

(6) ఉర్వీ సద్మనీ బృహతీ[4] ఋతేన హువే దేవానామవసా జనిత్రీ ।

దధాతే యే[5] అమృతం సుప్రతీకే ద్యావా రక్షతం పృథివీ నో[2] అభ్వాత్ ॥ 12

1. ద్వేऽఅచ. 2. నోऽఅభ్వాత్, 3. మానేऽఅవసావన్తీऽఅను, 4. బృహతీऽఋతేన, 5. యేऽఅమృతం. (ప్రా. ప్ర.)

(7) ఉర్వీ పృథ్వీ బహులే దూరే[1]అన్తే ఉప బ్రువే నమసా యజ్ఞే[2] అస్మిన్ ।

దధాతే యే సుభగే సుప్రతూర్తీ ద్యావా రక్షతం పృథివీ నో[3] అభ్వాత్ ॥ 13

(8) దేవాన్వా యచ్చకృమా కచ్చిదాగః సఖాయం వా సదమిజ్జాస్పతిం వా ।

ఇయం ధీర్భూయా[4] అవయానమేషాం ద్యావా రక్షతం పృథివీ నో[3] అభ్వాత్ ॥ 14

(9) ఉభా శంసా నర్యా మామవిష్టాముభే మామూతీ[5] అవసా సచేతామ్ ।

భూరి చిదర్యః సుదాస్తరాయేషా మదన్త[6] ఇషయేమ దేవాః ॥ 15

(10) ఋతం దివే తదవోచం పృథివ్యా[7] అభిశ్రావాయ ప్రథమం సుమేధాః ।

పాతామవద్యాద్దురితాదభీకే పితా మాతా చ రక్షతామవోభిః ॥ 16

(11) ఇదం ద్యావాపృథివీ సత్యమస్తు పితర్మాతర్యదిహోపబ్రువే వామ్ ।

భూతం దేవానామవమే[8] అవోభిర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 17

1. దూరేఽఅన్తేఽఉప, 2. యజ్ఞేఽఅస్మిన్, 3. నోఽఅభ్వాత్, 4. ధీర్భూయాఽఅవయాన, 5. మామూతీఽఅవసా, 6. మదన్తఽఇషయే, 7. పృథివ్యాఽఅభిశ్రావాయ. 8. దేవానామవమేఽఅవో. (వ్రా.ప్ర.)

## సూక్తము—185

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—ఇంద్రుఁడు

(1) క॥ దివి పుడములలో నెయ్యది, కవులారా! తొలి జనింపఁగల్గెను జెపుఁ డీ
నవ విషయంబును రాజ,త్కవులయినను నిర్ణయింపఁగలరే! బుద్ధిన్ ॥ 7

గీ॥ దివియు, భూమియు, లోకంబు దీప్తితోడ. తామె భరియించి దినములఁ దామసులను
బండి చక్రమువలెఁ బోవుచుండునట్లు, చేయుటకుఁ గారణం బేమొ!చెప్ప రేమి! ॥ 8

(2) చ॥ చరణ విహీన రోదసులు చంచల భావము లేని పొచు స
చ్చరణ విరాజితంబులయి చంచల భావముతోడ వెల్గుచు
ర్మరణము నొందు ప్రాణుల సమాజము పుత్రులఁ దల్లిదండ్రు లే
కరణిని బోరు భాగములఁ గల్గుదు రట్టులె వాని కుక్షులం
గరముఁ జరించుచుండెదరు కావునఁ బాపము నాశ మొందదే! ॥ 9

(3) క॥ అనఘం బక్షీణం బగు. ఘన నాక పదంబు నీయఁగల్గిన యన్నం
బనయము మా కిచ్చుచు నీ, పొనరఁగఁ బాపములఁ గొట్టు మో రోదసిరో! ॥ 10

(4,5) సీ॥ ఎయ్యవి కల్గఁగ నేపారు లోకము లన్ని సంరక్షణ లందుచుండు
నెయ్యవి కడుఁ బ్రకాశించు దివారాత్రసంబంధములఁ బాసి సంచరించు
నెయ్యవి దివిజుల నిలఁగల మనుజులఁ బుత్రులుగాఁ దాము పొందుచుండు
నెయ్యవి యౌవనమంతయుఁ గల్గుచు నక్కచెల్లెండ్రను ననుకరించు
గీ॥ నేవి పితరులవలెఁ దగు జీవనంబు, సర్వభూతంబులకు నెల్ల సరి యొసంగు
నట్టి దివియును భువియును నఘము నుండి. మమ్ముఁ గాపాడుచుండుత! మరువకుండ ॥ 11

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 165వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6,7) సీ॥ వృష్టి కాధారమై వి స్తీర్ణమయి సస్యవృద్ధికి హేతువై వెలయునట్టి
యమృతోపమానమై యంబుధరంబయి ప్రాణి కాధారమై పరగునట్టి
సౌభాగ్యయుక్తమై సకల సుశ్రేష్ఠమై వివిధమై యభివృద్ధి వెలయునట్టి
స్తుత్యస్వరూపమై సుందరంబయి యోగ్యదాతయై సంతయుఁ దాల్చునట్టి
గీ॥ రోదసిని నేను సవనంపు రూపుఁజూడ. వచ్చుటకుఁగాను నుతియింతు మెచ్చునట్టు
లదియె కాపాడు మమ్ముల నఘమునుండి, యదియె రక్షించు మమ్ముల నఘమునుండి ॥ 12

(8) గీ॥ మేము దేవతలకు మిత్రాళికిని యోగ్య, జంపతులకుఁ గీడు జరిపియున్న
యట్టి యఘము నెల్ల నతిభక్తి యజ్ఞముఁ, జేసి పోవునట్లు చేయఁగలము ॥ 13

(9) క॥ స్తుతి యోగ్యములను మానవ,తతిహితకారకములైన ధరణీ దివముల్
నతి పూర్వక సంస్తోత్రము, మతి నిడి రక్షించుఁగాక! మ మ్మతిమహిమన్ ॥ 14

గీ॥ దేవగణమ! మిమ్ముఁ దృప్తులఁ గావింప. నుతులఁ జేయుచుంటి మతులభక్తి
దాన యోగ్యమైన ధనమును గాంక్షించి, వేడుచుంటి మిమ్ము వివిధ గతుల ॥ 15

(10) క॥ కడుఁ బ్రాజ్ఞుఁడ నగు నే నీ, పుడమికి ద్యోలోకమునకుఁ బూర్ణ ప్రీతిన్
వడిఁ గలిఁగించెడు నుతులం, గడుఁ జేయుచు నుంటి సుప్రకాశముకొఱకై ॥ 16

క॥ పాలకమగు ద్యోలోకము, చాలిన సస్యముల నిచ్చు చక్కని భువియున్
మేలిమి నిష్టము లిచ్చుచు, హేలాగతిఁ బాపములను నెగుఱఁగఁ జేయున్ ॥ 17

(11) ఉ॥ భూమి! దివంబ! మీకుఁ గల పూర్ణదయన్ నుతు లన్ని యెంతయున్
క్షేమ మొసంగుఁగాక! మరి గీర్తితయజ్ఞములందు మంత్రముల్
కామిత్త మిచ్చు మిమ్ముఁ గడు గౌరవభావముతోడఁ జేరుచు
[1]న్నా ముద మొప్ప సత్యముద మంమనుగాతను: నిత్య మిచ్చుటన్ ॥ 18

క॥ నుతియించెడు మా చెంగట. మతిగల వారౌచు మీరు మా కాంక్షితమున్
మితిలేక దీర్చి మాకున్, సుతులను నన్నంబు బలము సూటి నొసఁగరే! ॥ 19

1. ఆంధ్రానువాదము ప్రథమమండలము 185వ. సూక్తములోని 11వ. ఋక్కున కనువాదపద్యమైన "భూమి: దివంబ:" ఇత్యాదిగాఁగల ఉత్పలమాలలోఁ జతుర్థపాదమునఁ బ్రాస -భంగమైనది. (వ్రాతప్రతి 2వ. సంపుటము. 211వ. పుట.) "మ" కార ప్రాసతో నీపద్యములోని తొలి మూఁడుపాదములుండఁగాఁ జతుర్థపాదమున "జేరుచా । మోదముతో సదత్యమగుమోదము నొందునుగాక నిచ్చుటన్" అని "ద" కారప్రాసతోఁ బ్రమాదవశమున వ్రాయఁబడినది. కావున నీ నాల్గవ చరణమును బై విధముగా సవరించుట జరిగినది. వ.గో.కృ.

## సూక్తమ్—186

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—విశ్వేదేవాః

ఛందః—త్రిష్టుప్

(1) ఆ న[1] ఇళాభిర్విదథే సుశస్తి విశ్వానరః సవితా దేవ[2] ఏతు ।

అపి యథా యువానో మత్సథా నో విశ్వం జగదభిపిత్వే మనీషా ॥ 18

(2) ఆ నో విశ్వ[3] ఆస్క్రా గమన్తు దేవా మిత్రో[4] అర్యమా వరుణః సజోషాః ।

భువన్యథా నో విశ్వే వృధాసః కరన్త్సుషాహా విథురం న శవః ॥ 19

(3) ప్రేష్ఠం వో[5] అతిథిం గృణీషే ఽగ్నిం శస్తిభిస్తుర్వణిః సజోషాః ।

అసద్యథా నో వరుణః సుకీర్తిరిషశ్చ పర్షదరిగూర్తః సూరిః ॥ 20

(4) ఉప వ[6] ఏషే నమసా జిగీషోషాసానక్తా సుదుఘేవ ధేనుః ।

సమానే[7] అహన్విమిమానో[8] అర్కం విషురూపే పయసి సస్మిన్నూధన్ ॥ 21

1. ఆనఽఇళాభి. 2. దేవఽఏతు. 3. విశ్వఽఆస్క్రా. 4. మిత్రోఽఅర్యమా 5. ప్రేష్ఠంవోఽఅతిథిం 6. వఽఏషే. 7. సమానేఽఅహన్, 8. అహన్విమి మానోఽఅర్కం. (వ్రా.ప్ర.)

(5) ఉత నోఽహిర్బుధ్న్యః శృణోతు మయస్కారః శిశుం న పిప్యుషీవ వేతి సిన్ధుః ।

యేన నపాతమపాం జునామ మనోజువో వృషణో యం వహన్తి ॥ 22

(6) ఉత న[1] ఈం త్వష్టా గన్త్వచ్ఛా స్మత్సూరిభిరభిపిత్వే సజోషాః ।

ఆ వృత్రహేన్ద్రశ్చర్షణిప్రాస్తువిష్టమో నరాం న[2] ఇహ గమ్యాః ॥ 23

(7) ఉత న[1] ఈం మతయోఽశ్వయోగాః శిశుం న గావస్తరుణం రిహన్తి ।

తమీం గిరో జనయో న పత్నీః సురభిష్టమం నరాం[3] నసన్త ॥ 24

(8) ఉత న[1] ఈం మరుతో వృద్ధసేనాః స్మద్రోదసీ సమనసః సదన్తు ।

పృషదశ్వాసోఽవనయో న రథా రిశాదసో మిత్రయుజో న దేవాః ॥ 25

(9) ప్ర ను యదేషాం మహినా చికిత్రే ప్ర యుఞ్జతే ప్రయుజస్తే సువృక్తి ।

అధ యదేషాం సుదినే న శరుర్విశ్వమేరిణం ప్రుషాయన్త సేనాః ॥ 26

1. నఽఈం, 2. నఽఇహ, 3. నరాంఽనసన్త (బ్రా.ప్ర.)

(10) ప్రో[1] అశ్వినావవసే కృణుధ్వం ప్ర పూషణం స్వతవసో హి సన్తి।

అద్వేషో విష్ణుర్వాత[2] ఋభుక్షా అచ్ఛా సుమ్నాయ వవృతీయ దేవాన్ ॥ 27

(11) ఇయం సా వో[3] అస్మే దీధితిర్యజత్రా[4] అపిప్రాణీ చ సదనీ చ భూయాః।

ని యా దేవేషు యతతే వసూయుర్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 28

## సూక్తము—186

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—విశ్వేదేవతలు

(1) చ॥ సవితయు సూర్యుఁడున్ మఱియుఁ జక్కఁగ వెల్గెడు నగ్నిహోత్రుఁడున్
స్తవముల నొప్పు నిష్టులకుఁ దప్పక వచ్చు చిలా ప్రశస్తితోఁ
గవియుచు మమ్ముఁ జేరెదరుగాక విశేష హితంబుఁ జేయ మా
యవితథ కర్మ జాలమును నాత్ర గ్రహింతురుగాకఁ బ్రీతితోన్ ॥ 20

గీ॥ విశ్వదేవగణమ! విశ్వంబునకుఁ దుష్టి, నొందఁ జేసినట్టు లొనర మీరు
మాన్యయాగములను మన్నించి మమ్ములఁ, దృప్తిఁ జేయ రారె! తృప్తి నొంది ॥ 21

(2) క॥ అరి నాశకుఁ డగు మిత్రుఁడు, వరుణార్యము లఖిలమైన వర దేవగణం
బరి సంఘముఁ గొట్టుచు మా, తర మెఱుఁగుచు నన్న మిడఁగ! దనిసెదరుగదా! ॥ 22

1. ప్రోఽఅశ్వి. 2. విష్ణుర్వాతఽఋభుక్షాఽఅచ్ఛా. 3. సావోఽఅస్మే 4. దీధితిర్యజత్రాఽఅపి. (ప్రా.ప్ర.)

* ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదములోని 166 వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556 వ పుట) చూడనగును. వ.గో.కృ.

(3) ఉ॥ మీవలెఁ బ్రీతి యుక్తుఁడయి మీకు మహాతిథియైన నగ్ని యన్
దేవుని యాగగామి సతిదీక్ష నుతించెద సంస్తవంబులం
దా వరుణుండు శత్రువులఁ ద్రచ్చెడు వాఁడు యశోవతంసుఁడై
కావఁగ వచ్చి యన్నమును గానుక నిచ్చునుగాక! మా కిలన్ ॥ 23

(4) చ॥ దినములు రాత్రులున్ సుదుఁడు ధేనువు యాగములందు భీతితో
ఘన మగు బాల నాజ్యమును గల్పనఁ జేసెడు నట్లు దేవతన్
కనుఁడు పలప్రధాన మగు కల్పితయాగమునందు సోమ మె
ల్లను నిడి సంస్తవంబులఁ దొలంగ కొనర్తుము పాపశాంతికై ॥ 24

(5) గీ॥ స్వాంత వేగము గలయట్టి జలదమాల, మఱి యహిర్బుధ్న్యుఁ డనువాఁడు మిగుల మాకు
సుఖపరంపర గలిఁగించి శుభము నిచ్చి,మమ్ము రక్షింపుదురుగాక! నెమ్మి మిగుల ॥ 25

గీ॥ కూర్మి వత్సముఁ గాపాడు గోవు పగిది, సింధు నది [1]యుదకముల నిచ్చి చెలఁగుఁగాక!
నంబు పౌత్రుఁడుగా వెల్గు నట్టి యగ్ని, భవ్య నుతులను విని తృప్తిఁ బడునుగాక! ॥ 26

(6)† చ॥ ఘనుఁ డగు తృష్ణ మా కభిముఖంబుగ వచ్చుచు మత్కృతేష్టులన్
వినయముతోడ ఋత్విజులు వేడ్కఁ బఠించెడు సంస్తవంబులన్
మనమునఁ బెట్టుఁ గాక! యజమాన గణంబులఁ గాచు వాసవుం
డనయము మా సుయజ్ఞముల యంతికమందు వసింపుఁగాకఁదాన్ ॥ 27

(7)† చ॥ హయములఁ బోలు మా మతుల యౌవనముంగల యింద్రదేవుఁడే
ప్రియము గలట్టి గోగణము పెయ్యను మాట్కి గ్రహించుఁగా కొగిన్
నయము గలట్టి భర్తలను నాతులు పొందుచుఁ బుత్రుఁ బ్రీతి ని
శ్చయముగఁ బొందు చందమున సంస్తవమున్ హరి పొందకుండునే! ॥ 28

(8)† చ॥ సమ మగు చిత్తముం గలిగి సారముతోఁ విలసిల్లు దేవతల్
క్రమముగ యజ్ఞ భూములను గానఁగ వత్తురుగాక! వారలే
యమరెడు యాన రాజు పృషదశ్వములన్ సరి గల్గి యన్యులా
నమరుల మాట్కి నిష్టికి సహాయ మొనర్తురుగాకఁ బ్రీతితోన్ ॥ 29

1. ఇందుఁబంచలఘుగణ మింద్రగణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ.

† ఈ 166వ సూక్తములోని 6-7-8 ఋక్కుల కనువాద పద్యములు (27-28-29) మూల వ్రాతప్రతి యగు రెండవ సంపుటము 215వ. పుటలో శిథిలములైనవి. ఈ మూఁడు పద్యములను ఏ. పి. జి. ఓ. యమ్. యల్. అండ్. ఆర్. ఐ లోని 9వ. సంపుటము Acc No. 3753 Call No. T. 25-99వ. పుటలో సరిగానున్న వానిని బరిగ్రహించుట జరిగినది. ఈ పద్యములు శ్రీ నేమానివారు విరచించినవియే గాని యితరములు కావు. వ.గో.కృ.

(9) చ॥ మహిమ గలట్టి మారుతము మానక కార్యము లెల్లొనర్చుచున్
మహిని వెలుంగఁ జేయు మతిమంతుఁడు సూర్యుఁడు వృష్టితో
మహితముగాని క్షేత్రమును మాన్యముగా నొనరించురీతి స
న్నిహిత చమూసహాయమున నిచ్చలు[1] జీవన మిచ్చు నెంతయున్ ॥ 30

(10) క॥ స్తుతియింపుఁడు విష్ణ్వింద్రుల, స్తుతియింపుఁడు పూషదేవు స్తుతవాయువు సం
స్తుతియింపుఁడు నరులారా!, స్తుతులను నే వారిఁ బిలుతు శోభ దలిర్పన్ ॥ 31

(11) క॥ యజనీయదేవగణమా!, విజయము గల మీ ప్రవాశ విస్తృతి మఱియున్
సుజనుల మెచ్చెడు గృహముల, నిజ మగు వ్యాపారమందు నిరతం బిడరే! ॥ 32

## సూక్తమ్—187

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అన్నమ్†

ఛందః—1 అనుష్టుబ్గర్భాఉష్ణిక్, 3, 5-7, 11 అనుష్టుప్,
11 బృహతీవా; 2,4, 8-10 గాయత్రీ

(1) పితుం ను స్తోషం మహో ధర్మాణం తవిషీమ్ ।
యస్య త్రితో వ్యోజసా వృత్రం విపర్వమర్దయత్ ॥ 29

(2) స్వాదో పితో మధో పితో వయం త్వా వవృమహే ।
అస్మాకమవితా భవ ॥ 30

1. "నిచ్చెలు" (వ్రా.ప్ర.పా.)

† అన్నస్తుతిః (మా)

(3) ఉప నః పితవా చర శివః శివాభిరూతిభిః ।

మయోభూరద్విషేణ్యః సఖా సుశేవో[1] అద్వయాః ॥ 31

(4) తవ త్యే పితో రసా రజాంస్యను విష్ఠితాః ।

దివి వా[2]తా ఇవ శ్రితాః ॥ 32

(5) తవ త్యే పితో దదత స్తవ స్వాదిష్ఠ తే పితో ।

ప్ర స్వాద్మానో రసానాం తువిగ్రీవా[3] ఇవేరతే ॥ 33

(6) త్వే పితో మహానాం దేవానాం మనో హితమ్ ।

అకారి చారు కేతునా తవాహిమవసావధీత్ ॥ 34

(7) యదదో పితో[4] అజగన్వివస్వ పర్వతానామ్ ।

అత్రా చిన్నో మధో పితో ఽరం భక్షాయ గమ్యాః ॥ 35

1. సుశేవోఽ అద్వయాః, 2. వాతాఽఇవ, 3. తువిగ్రీవాఽఇవే, 4. పితోఽఅజ. (వ్రా.ప్ర.)

(8) యదపామోషధీనాం పరింశమారిశామహే।

వాతాపే పీవ[1] ఇద్భవ ॥ 36

(9) యత్తే సోమ గవాశిరో యవాశిరో భజామహే।

వాతాపే పీవ[1] ఇద్భవ ॥ 37

(10) కరమ్భ[2] ఓషదే భవ పీవో వృక్క[3] ఉదారథిః।

వాతాపే పీవ[1] ఇద్భవ ॥ 38

(11) తం త్వా వయం పితో వచోభిర్గావో న హవ్యా సుషూదిమ।

దేవేభ్యస్త్వా సధమాదమస్మభ్యం త్వా సధమాదమ్ ॥ 39

1. పీవఽఇద్భవ, 2. కరమ్భఽఓషధే, 3. వృక్కఽఉదారథిః, (వా.ప్ర.)

## సూక్తము—187

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—అన్నము †

(1) గీ॥ దేనివలన నింద్రదేవుఁడు వృత్రుని, సంహరింపఁగల్గె శక్తితోడ
నఖిల జీవములకు నాధార మగునట్టి, యన్నమహిమ పుడమి నమరుఁగాక! ॥ 33

(2,3,4) సీ॥ ఆస్వాదనమునకు నధికయోగ్యం బగు సర్వరక్షక మగు శక్తిగల్గు
మాధుర్య మను మహామహిమను వెలయించు శుభరూపమును నొంది సుఖము నిచ్చు
సఖులవలెం జాల సత్క్రియాళి నొసంగు విపరీతగుణముల వెల్కుఁగకుండు
శుభకరరక్షణ శోభల నందించు హితరసంబుల భూతహితముఁ జేయు
గీ॥ నట్టి యన్నార్చ రసము లా యంబరమున, దిరుగు వాయువువలె భువిఁ దిరుగు జనుల
యందు వ్యాపించి యున్నవి యంద మొప్ప, నవియె రక్షించు మమ్ముల నాదరమున ॥ 34

(5,6,7) సీ॥ నీ యనుగ్రహమున ని న్నొంది మనుజులు జీవించుచున్నారు చిత్త మలర
నీ యనుగ్రహమున ని న్నన్యులకు జను లిచ్చుచునున్నారు మెచ్చునట్లు
నీ యనుగ్రహమున నిరతము మనుజులు దృఢముగ నున్నారు దీప్తు లెసఁగ
నీ యనుగ్రహమున నీయందె యమరులు లీనమై యున్నారు మానకుండ
గీ॥ నీవలనఁ గల్గు బుద్ధిప్రభావమహిమ, శత్రు భేదియు వృత్రునిఁ జంపఁగల్గె
మేఘ మెప్పుడు వర్షించు మిగుల వారి,నప్పుడే నీవు వచ్చెద వన్నదేవి! ॥ 35

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

† సంస్కృతమూలములలో నీ సూక్తమునకు దేవత "అన్నమ్" అని పేర్కొనఁబడినది. ఒక్క మాక్సుముల్లర్ ప్రతిలో మాత్రము "అన్న స్తుతిః" అని పేర్కొనఁబడినది. ఆంధ్రానువాదగ్రంథము వ్రాతప్రతిలో (2వ సంపుటము 217వ పుట) "దేవత-దేవత అన్నము" అని వ్రాయఁబడినది. ఇక్కడ దేవత శబ్దము రెండు పర్యాయములు వ్రాయఁబడిన దనఁగా "దేవతాన్నము"గాఁ బేర్కొనఁబడినట్లు తోఁచును. శ్రీ నేమానివారు స్వహస్తముతో వ్రాసిన 15B సంఖ్యగల సంపుటములో వ్రాసిన ఋషి దేవతల పట్టికలో "అన్న స్తుతి" యని వ్రాసిరి. ఇది దేవతాన్న సూక్తముగాఁ బేర్కొనుట యుక్తము. "అన్న స్తుతి" అన్నది "ఆగ్నేయ" మిత్యాది పదములతో నిర్దేశించినట్లు విషయ నిర్దేశకమగును. మామూలుగా నన్నము దేవత అనినచో దేవతాన్నము కాక మామూలుగా మానవులు భుజించు నన్నమే యగును. అప్పుడది లౌకిక పదార్థస్తుతి యగును గాని యలౌకిక దేవతా పదార్థస్తుతి కానేరదు. వ.గో.కృ.

(8,9,10) సీ॥ ఉచిత భూమిని గల్గు నోషధీజలముల నున్న యన్నము దిని యుంటి మిపుడు
కనుక శరీరమా! కాంచుచు నభివృద్ధి సుఖముగ నుండుము శుభము లొంది
సోమరూపేష్టుల సుదధి పయోవయపూజ్యాన్నమును మేముఁ బొందినాము
కనుక శరీరమా! కాంచుచు నభివృద్ధి సుఖముల నొందుము సురుచిరముగ
గీ॥ సకల దధి సక్తపిండ మాసక్తిరూప, భక్తములు మాకు నిచ్చులు శక్తి నిచ్చి
యింద్రియోద్దీపకంబులై యెసఁగ మెసఁగ, వెలుఁగుచుంట శరీరమా! వృద్ధి నొందు ॥ 36

(11) గీ॥ ధేనుగణము చెంతఁ దివిరి హవ్యంబుల, సంగ్రహించు నట్లు జ్వలన! నీవు
దేవతలను మమ్ముఁ దృప్తిఁ జేసెడునట్లు,నిన్ను మేము నుతుల నెన్నఁగలము ॥ 37

## సూక్తమ్—188

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—ఆప్రీసూక్తం (1 ఇధ్మః సమిద్ధోఽగ్నిర్వా, 2 తనూనపాత్,
3 ఇళః, 4 బర్హిః, 5 దేవీర్ద్వారః, 6 ఉషాసానక్తా, 7 దైవ్యాహోతారా ప్రచేతసౌ,
8 తిస్రోదేవ్యః సరస్వతీళాభారత్యః, 9 త్వష్టా,
10 వనస్పతిః, 11 స్వాహాకృతయః

ఛందః—గాయత్రీ

(1) సమిద్ధో[1] అద్య రాజసి దేవో దేవైః సహస్రజిత్ ।
దూతో హవ్యా కవిర్వహ ॥ 40

1. సమిద్ధోఽఅద్య, (వ్రా.ప్ర.)

(2) తనూనపాదృతం యతే మధ్వా యజ్ఞః సమజ్యతే ।

దధత్సహస్రిణీరిషః ॥ 41

(3) ఆజుహ్వానో న[1] ఈడ్యో దేవాగ్ం ఆ వక్షి యజ్ఞియాన్ ।

అగ్నే సహస్రసా[2] అసి ॥ 42

(4) ప్రాచీనం బర్హిరోజసా సహస్రవీరమస్తృణన్ ।

యత్రాదిత్యా విరాజథ ॥ 43

(5) విరాట్ సమ్రాడ్విభ్వీః ప్రభ్వీర్బహ్వీశ్చ భూయసీశ్చ యాః ।

దురో ఘృతాన్యక్షరన్ ॥ 44

(6) సురుక్మే హి సుపేశసా ఽధి[3] శ్రియా విరాజతః ।

ఉషాసావేహ సీదతామ్ ॥ 45

---

1. నఽఈడ్యోదేవాగ్ంఽఆ, 2. సహస్రసాఽఅసి, 3. సుపేశసాధి, (వ్రా.ప్ర.)

(7) ప్రథమా హి సువాచసా హోతారా దైవ్యా కవీ ।

యజ్ఞం నో యక్షతామిమమ్ ॥ 46

(8) భారతీళే సరస్వతి యా వః సర్వా[1] ఉపబ్రువే ।

తా నశ్చోదయత శ్రియే ॥ 47

(9) త్వష్టా రూపాణి హి ప్రభుః పశూన్విశ్వాన్త్సమానజే ।

తేషాం నః స్ఫాతిమాయజ ॥ 48

(10) ఉప త్మన్యా వనస్పతే పాథో దేవేభ్యః సృజ ।

అగ్నిర్హవ్యాని సిష్వదత్ ॥ 49

(11) పురోగా[2] అగ్నిర్దేవానాం గాయత్రేణ సమజ్యతే ।

స్వాహాకృతీషు రోచతే ॥ 50

1. సర్వాఽఉప, 2. పురోగాఽఅగ్ని, (వా.ప్ర.)

## సూక్తము—188

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—అగ్ని†

(1) క॥ అనలుఁడ! ఋత్విక్కులచే, సనయము వెల్గింపఁబడుచు నమరుల కరణిన్
ఘనముగ శోభించుచు నీ, వనుపమ హవ్యములఁ జేర్పుమా! దివిజులకున్ ॥ 38

(2) గీ॥ పూజనీయ తనూనపాత్పుణ్యవహ్ని, యజ్ఞమున ఋత్విజుల కెల్ల నన్న మొసఁగఁ
[1]బట్టుకొని దాని మా చేయు పరమ యజ్ఞ,కర్మలకు రమ్ము వేగ నీ ధర్మముండు ॥ 39

(3) క॥ స్తుతియుక్తా[2]హ్వానంబును, మతితో నంగీకరించి మా యిష్టులకున్
దత యజ్ఞ భాగభాక్కుల, హితదాతా! పిలుచుకొనుచు నెదురుగ రావే! ॥ 40

(4) గీ॥ అపరిమిత శౌర్యవీరుల కాటపట్టు, లగుచుఁ బ్రాగగ్రములు గల్గి యమరుచుండు
దర్భలంబఱచి[3] రిటఁ గవి తండ మదితి, పుత్రు లెల్లరు వచ్చుతఁ బూర్ణదయను ॥ 41

(5) గీ॥ మిగుల సమ్రాడ్విరాట్టులు మిగుల విభువు, లింకఁ బ్రభువులుగా వెల్గు సృష్టి గృహక
వాటములు భూతతతులకు సూటి మీర, జలములఁ గలిఁగించుఁగావుత! శక్తి మీర ॥ 42

(6,7,8, 9,10) సీ॥ దీప్త భూషణ యుక్త దివ్య సుందరరూప రాత్ర్యహో దేవతల్ రాణ రండు!
మధురవాక్యవిశిష్ట మాన్యదైవికపూతహోతృదేవతలార! యోలి రండు!
భారతి! భూదేవి! భవ్యసరస్వతి! సంపత్తి నీయంగ జరిగి రండు
సకల రూపంబులఁ జక్కఁజేసెడు త్వష్ట! పశువృద్ధి నిమ్మ నీ యశము మెండు
గీ॥ జీవనస్పతి పశురూప మోదనంబు, నీవు కలిఁగించి యున్నచోఁ బావకుండు
వాని నతిరుచ్యముగఁ జేసి తనివి తీర, దేవతల కీయకుండునే! స్థిరముగల్గ ॥ 43

(11) గీ॥ మంచి గాయత్రితోఁ బ్రకాశించి యఖిల, యజ్ఞవాటికలకు ముందు నరుగునట్టు
లగ్ని స్వాహా పదంబుల నమరు నాహుతులవిశేషము వెల్గఁదే! చెలువు మీర ॥ 44

---

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

† సంస్కృతమూలగ్రంథములలోఁ గొన్నిట "ఆప్రీ" దేవత యని సామాన్యముగాఁ జేర్కొన్నను వివిధఋక్కులకు భిన్న భిన్న దేవతలు పేర్కొనఁబడిరి. ఆంధ్రానువాదగ్రంథము వ్రాతప్రతిలో (2వ సంపుటము. 219 పుట) "అగ్ని" యని సామాన్యముగా దేవత పేర్కొనఁబడినను ఋక్కులఁ గొన్నిట నితర దేవతలను పేర్కొనుట జరిగినది. శ్రీ నేమానివారు వ్రాసిన 156 సంఖ్య గల గ్రంథములో నిచ్చిన దేవతల పట్టికలో "ఆప్రీ" దేవతగా వ్రాయఁబడినది. వ.గో.కృ.

1. బట్టుకొని యే మొనర్చెడు పరమ యజ్ఞ (తా.పా.) 2. స్తుతి యుక్తంబగుఁ బిలుపున్ (తా.పా.) 3. ఇక్కడ నింద్రగణమునకు మారుగా "భల" ముపయుక్తమైనది. వ.గో.కృ. దర్భలంబఱచియున్నారు తగిన యదితి (తా.పా.)

# సూక్తమ్—189

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) అగ్నే నయ[1] సుపథా రాయే అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।

యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే [2]నమఉక్తిం విధేమ ॥ 51

(2) అగ్నే త్వం పారయా నవ్యో[3] అస్మాన్త్స్వస్తిభిరతి దుర్గాణి విశ్వా ।

పూశ్చ పృథ్వీ బహులా న[4] ఉర్వీ భవా తోకాయ తనయాయ శం యోః ॥ 52

(3) అగ్నే త్వమస్మద్యుయోధ్యమీవా[5] అనగ్నిత్రా అభ్యమన్త కృష్టీః ।

పునరస్మభ్యం సువితాయ దేవ క్షాం విశ్వేభిరమృతేభిర్యజత్ర ॥ 53

(4) పాహి నో[6] అగ్నే పాయుభిరజస్రైరుత ప్రియే సదన[7] ఆ శుశుక్వాన్ ।

మా తే భయం జరితారం యవిష్ఠ నూనం విదన్మాపరం సహస్వః ॥ 54

1. నయఽసుపథారాయేఽఅస్మా, 2. నమఽఉక్తిం, 3. నవ్యోఽఅస్మాన్త్స్వస్తి, 4. నఽఉర్వీ, 5. మీవాఽఅనగ్నిత్రాఽఅభ్య 6. నోఽఅగ్నే, 7. సదనఽఆ, (వ్రా.ప్ర.)

(5) మా నో[1] అగ్నేఽవ సృజో అఘాయాఽవిష్యవే రిపవే దుచ్ఛునాయై ।

మా దత్వతే దశతే మాదతే నో మా రీషతే సహసావన్పరా దాః ॥ 55

(6) వి ఘ త్వావాగ్ం[2] ఋతజాత యంసద్గృణానో[3] అగ్నే తన్వేఽ వరూథమ్ ।

విశ్వాద్రిరిక్షోరుత వా నినిత్సో[4]రభిహ్రుతామసి హి దేవ విష్పట్ ॥ 56

(7) త్వం తాగ్ం[5] అగ్న ఉభయాన్వి విద్వాన్వేషి ప్రపిత్వే మనుషో యజత్ర ।

అభిపిత్వే మనవే శాస్యో భూర్మర్మృ[6]జేన్య ఉశిగ్భిర్నాక్రః ॥ 57

(8) అవోచామ నివచనాన్యస్మిన్మానస్య సూనుః సహసానే అగ్నౌ ।

వయం సహస్రమృషిభిః సనేమ విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 58

1. మానోఽఅగ్నేఽవసృజోఽఅఘాయా, 2. త్వావాగ్ంఽఋత, 3. గృణానోఽఅగ్నే, 4. నినిత్సే, 5. తాగ్ంఽఅగ్నఽ ఉభయాన్వి, 6. జేన్యఽఉశిగ్భిర్నాక్రః, (వ్రా.ప్ర.)

## సూక్తము—189

### ఋషి—అగస్త్యుఁడు *

### దేవత—అగ్ని

(1) గీ॥ అఖిలముం[1] దెలిసి యున్నట్టి యనలః నీవు, శ్రేష్ఠమార్గములన్ మమ్ముఁ జేర్చి కుటిల
పాపముల నెల్లఁ దొలఁగించి పరమ నుతుల,వీనులకు విందుగా విను వేడ్క మీరః॥ 45

(2) గీ॥ యజ్ఞములచేత నఘముల నరుఁగఁజేసి, పురములను సస్య సంపూర్ణభూమి ననలః
యొసఁగినట్టైన వానిచే నొనర మేము, పుత్రులను సౌఖ్యమును గూడఁ బొందఁగలము॥ 46

(3) ఉ॥ మాకు విరోధులై మెలఁగు మానవులం బరిమార్చి మమ్ము న
స్తోకము హింసఁబెట్టి కడు స్రుక్కఁగఁ జేసెడు రోగ జాలమున్
భీకరవృత్తిచే సడఁచి పెద్దదయన్ ననుఁ గావఁ బావకాః
వీఁకఁ దలిర్ప వేరయిన వేల్పులతో దయసేయు మిష్టికిన్॥ 47

(4) †చ॥ స్థిరమగురక్షతో మములఁ [2]దిన్నఁగఁ జేయుచు యజ్ఞమందు నీ
వరమరలేక వెల్గవఁటెః యగ్నిరొః నీకు సుపూజఁ జేయు న
న్నరయుచు సర్వకాలములయందు భయంబులఁ బాపుచున్నచో
ధర నకళంకభావమున దాసుఁడ నౌదును నీకు నే నొగిన్॥ 48

(5) గీ॥ పావకుండః మమ్ము బహు దుఃఖముల పాలు, సేయు శత్రువులకుఁ జిక్కఁగుఁ జేసి
మమ్ముఁ జంపి తినెడు మానవాధములకు. మమ్ము నీయవలదు సుమ్ము ! నీవు॥ 49

ఉ॥ కోరలచేతనైన మఱి కొమ్ములచేతను నైన మా కిలన్
సారెకు హింసఁ జేయు చెడు జంతువులం బడఁగొట్టి పిమ్మటన్
బీరముఁ జూపి బాధ లిడు భీకర తస్కర రాక్షసాదులన్
వీరుఁడ వౌచుఁ గొట్టవఁటె ! విశ్రుత వీరుఁడః యగ్ని హోత్రుఁడాః॥ 50

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. ఇక్కడ నిందగణమునకు మారు "ఖల" ము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

2 దీర్చుచు యజ్ఞగృహంబులందు నీవరమర (తొ.పా.)

† మూలవ్రాతప్రతిలో "స్థిరమగు రక్షతో" అని పద్యప్రారంభమొనర్చి "స్థిరరక్షతో" అని సవరింపఁబడినది. మిగిలిన పద్యము యథాతథముగానే యున్నది. మీఁదు మిక్కిలి యీ పద్యముత్పలమాలగాఁ బ్రమాదవశమున వ్రాయఁబడినది. (చూ. వ్రాతపతి. 2 వ సంపుటము. 221 వ పుట) వ.గో.కృ.

(6) గీ॥ యాగమునకుఁ బుట్టి నట్టియగ్నీ! నినుఁ, దనుపునట్టి జనుఁడు తాను భోగ
బాధనుండి తొలఁగి వర్థిల్లు దుర్మార్గ,భక్షకుండ వీవె భవ్యచరిత! ॥ 51

(7) క॥ మనమున రెండు తెఱంగుల, జనులను నెరుఁగుదువుకాదె! చక్కని యగ్నీ!
ఘన మగు నీ సాన్నిధ్యము, వినయమునుం గోర నీవు వెడలుట లేదే! ॥ 52

గీ॥ యజ్ఞమునకు వచ్చి యజమానుఁ దొనరించు,యజ్ఞకర్మలందు యజనకరుల
చేత నీవు మిగుల శిక్షింపఁబడుదువు, యజ్ఞకర్త బోలి యగ్నిదేవ! ॥ 53

(8) గీ॥ మంత్ర పుత్రుఁడ వగుదువు మఱియు శత్రు,నాశకుండవు వహ్నీ! ప్రకాశమాన
నుతు లొనర్తును నీకు నా నుతులఁబట్టి, యాయు వన్నబలంబుల నందఁగలము ॥ 54

## సూక్తమ్—190

### ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

### దేవతా—బృహస్పతిః

### ఛందః—త్రిష్టుప్

(1) అనర్వాణం వృషభం మన్ద్రజిహ్వం బృహస్పతిం వర్ధయా నవ్యమర్కైః

గాథాన్యః సురుచో యస్య దేవా[1] ఆశృణ్వన్తి నవమానస్య మర్తాః ॥ 59

(2) తమృత్వియా[2] ఉప వాచః సచన్తే సర్గో న యో దేవయతామసర్జి ।

బృహస్పతిః స హ్యఞ్జో వరాంసి విభ్వాభవత్సమృతే మాతరిశ్వా ॥ 60

(3) ఉపస్తుతిం నమస[3] ఉద్యతిం చ శ్లోకం యంసత్సవితేవ ప్ర బాహూ ।

అస్య క్రత్వాహన్యో౩ యో[4] అస్తి మృగో న భీమో[5] అరక్షసస్తువిష్మాన్ ॥ 61

1. దేవాఽఆశృణ్వన్తి, 2. తమృత్వియాఽఉప, 3. నమసఽఉద్యతిం, 4. యోఽఅస్తి, 5. భీమోఽఅరక్ష. (వ్రా.ప్ర.)

(4) అస శ్లోకో దివీయతే పృథివ్యామత్యో న యంసద్యక్షభృద్విచేతాః ।
మృగాణాం న హేతయో యన్తి చేమా బృహస్పతేరహిమాయాగ్ం[1] అభి ద్యూన్ ॥ 32

(5) యే త్వా దేవోస్త్రికం మన్యమానాః పాపా భద్రముపజీవన్తి పజ్రాః ।
న దూఢ్యే అను దదాసి వామం బృహస్పతే చయస[2] ఇత్పియారుమ్ ॥ 33

(6) సుప్రైతుః సూయవసో న పన్థా దుర్నియన్తుః పరిప్రీతో న మిత్రః ।
అనర్వాణో[3] అభి యే చక్షతే నో ऽపీవృతా[4] అపోర్ణువన్తో అస్థుః ॥ 34

(7) సం యం స్తుభోऽవనయో న యన్తి సముద్రం న స్రవతో రోధచక్రాః ।
స విద్వాగ్ం[5] ఉభయం చష్టే అన్తర్బృహస్పతిస్తర[6] ఆపశ్చ గృధ్రః ॥ 35

(8) ఏవా మహస్తువిజాతస్తువిష్మాన్బృహస్పతిర్వృషభో ధాయి దేవః ।
స నః స్తుతో వీరవద్ధాతు గోమద్విద్యామేషం వృజనం జీరదానుమ్ ॥ 36

1. యాగ్ంऽఅభి, 2. చయసऽఇత్, 3. అనర్వాణోऽఅభి, 4. వృతాऽఅపోర్ణువన్తోऽఅస్థుః, 5. వాగ్ంऽఉభయంచష్టేऽ అన్త, 6. తరఽఆప. (బ్రా.ప్ర.)

సూక్తము—190

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—బృహస్పతి

(1) చ॥ అసయ మభీష్టసిద్ధులను సంధఁగఁజేయు బృహస్పతిం గడుం
జనువున సంస్తుతింపవఁటె! చక్కని మంత్రములన్ మహాత్ముఁడా!
పనిగొని యా బృహస్పతియె పావన నాక పదంబుఁజేరు నా
ఘనుఁ డగు మాతరిశ్వవలెఁ గల్పనఁ జేయుఁడె! సత్ఫలంబులన్ ॥ 55

(2) గీ॥ దేవతానుగ్రహంబును దివిరి గోరు, వారికై యిష్టముల నిచ్చి వర్షవారి
నొసఁగునట్టి బృహస్పతి కోరి మంత్ర, సముదయముచేతఁ దృప్తిని సలుపు హోత ॥ 56

గీ॥ ఈ బృహస్పతిమిక్కిలి యేపు గల్గి, యవ్యయపదంబు వ్యాపించు నమల మాత
రిశ్వవలె సత్ఫలంబుల రీతి నొసఁగు, చుండి యెదుటను బఱచుండెఁజూఁడుమోయి! ॥ 57

(3) చ॥ స్తుత రవి నైజదీధితుల శోభిలఁ జేసెడునట్టు లీ బృహ
స్పతియును యాజ్ఞికోత్తముల సారసహవ్యము లంద యత్నముల్
మతి నిడుచుండె నీతని యమానుషశక్తిని సూర్యుఁ డెంతయున్
దతబలశాలియై తిరుగు దక్షత గౌర మృగంబు చాడ్పునన్ ॥ 58

(4) చ॥ ఘనుఁ డగు నా బృహస్పతికిఁ గల్గిన కీర్తిప్రకాశ మొందుతన్!
ఘనుఁ డగు నా బృహస్పతియె కాంతిదసూర్యునిఁ బోలి హవ్యముల్
గనుఁగొనుతన్! సుజీవులకుఁ గల్పనఁజేయుతఁ! జేతనంబు నా
ఘనుఁడె హితంబు మర్త్యులకుఁ గౌరవభావముతోడ నిచ్చుతన్! ॥ 59

గీ॥ అమలుఁ డగు నా బృహస్పతి యాయుధంబు,మృగయ సాధనమ్ముం బోలి మెఱయుచుండి
మాయఁజేసెడి వారల మంటఁగలిపి,నభిముఖంబుగఁ బోవదే! యహరహంబు ॥ 60

(5) గీ॥ ముసలి యెద్దుఁబోలుముని! బృహస్పతి! నిన్నుఁ, దలఁచువారి కిడకు ధనము నీవు
సోమయాగములను సుందరవిధమునఁ, జేయు వాని కెల్లఁ జేర్చు ధనము ॥ 61

* ఋషి విశేష విషయములకై యాంధ్రానువాదములోని 166వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట.) చూఁడనగును. వ.గో.కృ.

(6) చ॥ మఖమును జేయు వారి కిల మార్గముఁ జూపుచు వో బృహస్పతీ!
సుఖములతోడఁ గూడుకొని శోభ దలిర్పఁగఁ బోవుచుందు వా
సుఖములఁ గొట్టు దుష్టుల సుశోషిలఁ జేయుదు[1] సర్వరీతులన్
సఖునివలెన్ సమస్త సుఖ సంపద లిచ్చెద వీవు నిత్యమున్ ॥ 62

గీ॥ ఎట్టి పాపములను నెఱుఁగని మనుజుల, మైన మాకుఁ దెల్వి నందఁజేయు
మజ్ఞు లయినవారి యజ్ఞానముం గొట్టి, జ్ఞాన మొసఁగుమోయి! సదయమతిని ॥ 63

(7) చ॥ మనుజులు మానవేశ్వరుని మానక చేరెడునట్లు ప్రాఁదినుల్
ఘన మగు వార్ధిఁ జేరునటు గ్రాలెడు భక్తిరసంబుతోడ మే
మనయ మొనర్చు సంస్తవము లన్నిబృహస్పతిఁ బొందుచుండు నిం
పెనయఁగ నా మునీశ్వరుఁ డహీనుఁడు కాఁడఁటె! సర్వరీతులన్ ॥ 64

గీ॥ విద్యచేత బృహస్పతి వెలయుచుండు,నాకసంబునఁ దిరిగెడు నధిక వేగ
వంత మగు పక్షిఁబోలిక వానిఁ జేరి, సలిల నౌకల నేవేళ సంతరింతు ॥ 65

(8) ఉ॥ ఇట్టి బృహస్పతిప్రవరుఁ డెంతయు వెల్గు నభీష్ట మిచ్చుచున్
బిట్టు బలాధికుం డగుచు విశ్రుత జన్మము గాంచెఁ దత్స్తవం
బెట్టు లొనర్చినన్ జనుఁడు వీర్యము నొందుచు దానివల్లఁ దా
నెట్టుల నైన నాయువు నభీష్టబలాన్నము లొందకుండునే! ॥ 66

## సూక్తమ్—191

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—అప్తృణసూర్యాః (విషఘ్నోపనిషద్)*

ఛందః – అనుష్టుప్, 10-12 మహాపంక్తిః, మహాబృహతీ;

(1) కఙ్కతో న కఙ్కతోఽథో సతీనకఙ్కతః ।
ద్వావితి ప్లుషీ[1] ఇతి న్యదృష్టా అలిప్సత ॥ 67

1. సుశోషిలఁజేయుఁడు (వ్రా.ప్ర.పా.)

* (విషఘ్నోపనిషద్) అన్నది కొన్నిప్రతులలోలేదు. వ.గో.కృ. 1. ప్లుషీఽఇతిన్యదృష్టాఽలి, (వ్రా.ప్ర.)

(2) అదృష్టాన్హన్త్యాయత్యథో హన్తి పరాయతీ ।

అథో[1] అవఘ్నతీ హన్త్యథో పినష్టి [2]పింషతీ ॥ 68

(3) శరాసః కుశరాసో దర్భాసః సైర్యా[3] ఉత ।

మౌఞ్జా[4] అదృష్టా వైరిణాః సర్వే సాకం న్యలిప్సత ॥ 69

(4) ని గావో గోష్ఠే[5] అసదన్ని మృగాసో[6] అవిక్షత ।

ని కేతవో జనానాం న్యదృష్టా[7] అలిప్సత ॥ 70

(5) ఏత[8] ఉ త్యే ప్రత్యదృశ్రన్ప్రదోషం తస్కరా[9] ఇవ ।

అదృష్టా విశ్వదృష్టాః ప్రతిబుద్ధా[10] అభూతన ॥ 71

(6) ద్యౌర్వః పితా పృథివీ మాతా సోమో భ్రాతాదితిః స్వసా ।

అదృష్టా విశ్వదృష్టాస్తిష్ఠతేలయతా సు కమ్ ॥ 72

(7) యే[11] అంస్యా యే అఙ్గ్యాః సూచీకా యే ప్రకఙ్కతాః ।

అదృష్టాః కిం చనేహ వః సర్వే సాకం ని జస్యత ॥ 73

1. అథోऽఅవ. 2. పిషతీ. 3. సైర్యాऽఉత. 4. మౌఞ్జాऽఅదృష్టా. 5. గోష్ఠేऽఅస. 6. మృగాసోऽఅవి. 7. దృష్టాऽఅలి. 8. ఏతऽఉ. 9. స్కరాऽఇవ. 10. బుద్ధాऽఅభూతన. 11. యేऽఅంస్యా యే ऽఅఙ్గ్యాః. (ప్రా.ప్ర.)

(8) ఉత్పురస్తాత్సూర్య[1] ఏతి విశ్వదృష్టో[2] అదృష్టహా ।

అదృష్టాన్త్సర్వాఞ్జమ్భయన్త్సర్వాశ్చ యాతుధాన్యః ॥ 74

(9) ఉదపప్తదసౌ సూర్యః పురు విశ్వాని జూర్వన్ ।

ఆదిత్యః పర్వతేభ్యో విశ్వదృష్టో[3] అదృష్టహా ॥ 75

(10) సూర్యే విషమా సజామి దృతిం సురావతో గృహే ।

సో చిన్ను న మరాతి నో వయం మరామాఽऽరే[4]

అస్యయోజనం హరిష్ఠా మధు త్వా మధులా చకార ॥ 76

(11) ఇయత్తికా శకున్తికా సకా జఘాస తే విషమ్ ।

సో చిన్ను న మరాతి నో వయం మరామాఽऽరే[4]

అస్యయోజనం హరిష్ఠా మధు త్వా మధులా చకార ॥ 77

1. సూర్యఽఏతి, 2. దృష్టోఽఅదృష్టహా, 3. దృష్టోఽఅదృష్టహా, 4. మారేఽఅస్య. (వ్రా.ప్ర.)

(12) త్రిః స॒ప్త వి॒ష్పు[1]లి॒ఙ్గకా॑ వి॒షస్య॒ పుష్య॑మక్షన్ ।

తాశ్చిన్ను న మ॑రన్తి॒ నో వ॒యం మ॑రా॒మాఽఽరే

అ॒స్యయోజనం హ॒రిష్ఠా మధు॑ త్వా మ॒ధులా॑ చకార ॥ 78

(13) న॒వా॒నాం న॑వ॒తీనాం॑ వి॒ష॒స్య॒ రోపుషీణామ్ ।

సర్వాసామ॒గ్రభం॑ నా॒మారే

అ॒స్య యోజనం హ॑రిష్ఠా మధు॑ త్వా మధులా చకార ॥ 79

(14) త్రిః స॒ప్త మ॑యూ॒ర్యః స॒ప్త స్వసారో అ॒గ్రువః ।

తా॒స్తే వి॒షం వి జ॑భ్రిర ఉ॒దకం॑ కుమ్భి॒నీరివ ॥ 80

(15) ఇ॒య॒త్త॒కః కు॑షు॒మ్భక॒స్తకం॑ భిన॒ద్మ్యశ్మ॑నా ।

తతో॑ వి॒షం ప్ర వా॑వృతే॒ ప॑రా॒చీర॑ను॒ సంవ॑తః ॥ 81

(16) కు॒షు॒మ్భక॒స్తద॑బ్రవీ[2]గ్గిరేః ప్ర॑వ॒ర్తమా॑న॒కః ।

వృశ్చి॑కస్యా[3]ర॒సం వి॒షమ॑ర॒సం వృ॑శ్చిక తే వి॒షమ్ ॥ 82

1. వి॒ష్ణుఙ్గకా, 2. గి॒రోః, 3. వృశ్చి॑కస్యా॒రసం వృశ్చిక తే వి॒షమ్. (వ్రా.ప్ర.)

## † సూక్తము—191

ఋషి—అగస్త్యుఁడు *

దేవత—జలము, తృణము, సూర్యుఁడు ‡

(1) గీ॥ అల్పవిషధరజీవు లనల్పవిషము, లనుచు జలచరములు భువి యమరునందుఁ
దొల్లిటి విదాహకాదృశ్యధూర్తరూప,ములను విషమును గలిఁగించి యలయఁజేయు ॥ 67

(2) ఉ॥ కన్నులకుం గనంబడక గ్రాలు విషంబును గల్గుచోటికిం
దిన్నఁగ నొక్క యోషధిని దెచ్చిన నొక్కటి దాని వెన్కగా
నెన్నిన యట్లు లాగినను నింకొక దానిని నూరి యున్నచో
నన్ని విషంబు లంతటను నంతము నొందుఁగదా! క్రమంబుగన్ ॥ 68

పాఠాంతరము

ఉ॥ కన్నులకుం గనంబడక గ్రాలు విషంబును గల్గు ప్రాణికిం
దిన్నఁగ నొక్క యోషధిని దెచ్చిన లాగిన దాని క్రిందుగాఁ
బన్నుగ దానిఁ గైకొనుచుఁ బల్మరు ముద్దగఁ జేసి యున్నచో
నన్ని విషంబు లంతటను నంతము నొందవె! నిశ్చయంబుగన్ ॥ 69

(3) క॥ శర కుశల దర్భమౌర్యల, పర బీరణ ముంజ ముఖ్య బహు ఘాసాదుల్
స్థిరముగ నదృష్ట మగు విష,ధరగణముంగూడి మమ్ముఁ దప్పక చేరున్ ॥ 70

† ఈ సూక్తమునందు సర్పముల యుత్పాతము వర్ణింపఁబడినది. ఇందు సర్ప మంత్రములును గలవు. పాముకాటునకు మందులుకూడ నప్పటి యార్యు లెఱింగియున్నటుల సూచనగలదు. (నే.వేం.న.శా.)

* ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదములోని 166 వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (556వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

‡ ఈ సూక్తమునకు సంస్కృతమూలములో "అప్ తృణ సూర్యాః" అని ముగ్గురు దేవతలు పేర్కొనఁబడిరి. ఆంధ్రాను వాదములో (వ్రాతప్రతి. 2వ సంపుటము 225వ పుట.) జలము, తృణములు రెండు మాత్రమే దేవతలుగాఁ బ్రమాదవశమున వ్రాయఁబడి సూర్యదేవత విడచిపుచ్చఁబడినది. ఈ సూక్త ఋగనువాద పద్యములలో సూర్యదేవతాక పద్యములుకూడఁ గలవు. శ్రీ నేమానివారు స్వహస్తముతో వ్రాసిన ఋషిదేవతల పట్టికగల 15b సంపుటములో అప్పులు, ఘాసము, సూర్యుఁడుగానే దేవతలను వ్రాసిరి. వ. .కృ.

(4) గీ॥ గోష్ఠమున గోవు లన్నియుఁ గూడునట్లు, స్వస్థలంబున మృగములు శ్రాంతి నొందు
నట్లు! మనుజుల చైతన్య మరుఁగునట్లు, కనఁబడని విషధరములు కలఁచు మమ్ము ॥ 71

(5) గీ॥ రాత్రిభాగమందు రాజిల్లుచోరుల, విధము విషధరములు వెలయుచుండు
నవియె కంటఁబడక యంతయుఁ గనుచుండుఁ, గాన నరులు! సావధాను లగుఁడు! ॥ 72

(6) గీ॥ దివము తండ్రియె యగు మీకు స్థిరయుఁ దల్లి, సోముఁడే భ్రాత యగుఁజుండీ! సుందరాంగ
[1]మెసఁగు నదితియె స్వసయౌ నదృష్టులార!, విశ్వదృష్టులరై మీరు వెలయుఁ డింక ॥ 73

(7) ఉ॥ ఎయ్యవి బాహు పాదముల నేపు వహించుచు సంచరించునో!
యెయ్యవి యంగ మూలమున నెంతయు శీఘ్రము పారుచుండునో!
యెయ్యవి సూచి మూలమున నెల్లరఁ గుట్టి విషం బొసంగునో!
యయ్యవి దుష్ట జంతుతతి యంతయు వేగ నశించుఁగావుతన్! ॥ 74

(8) గీ॥ పొడుపు కొండపయిన్ రవి పొడిచి విశ్వ.దర్శనంబును జేసిన ధర నదృశ్య
విషధరంబులు నశియించు వేఁడివేల్పు, యాతుధానులఁ దునుమఁడె! యధికశక్తి ॥ 75

(9) గీ॥ ప్రచుర పరిమాణ రీతిని భానుదేవుఁ, డఖిల విష నాశకుండయి యలరుచుండు
సర్వదర్శనదృశ్యముం జంపు నదితి,పుత్రుఁ డుదయించు మంగళ స్ఫూర్తికొఱకు ॥ 76

(10) చ॥ శయనగృహంబునం గలుఁగు చర్మమయం బగు మద్యపాత్రరో
నయ మలరంగ మద్య మిడినం జెడిపోవునె పాత్ర? యట్టులే
ప్రయత విషంబు తీక్ష్ణతర భాస్కరబింబమునందు నుంచితిన్
భయమును వీడి యుండెదను భానుని మాట్కి నశింపకుండఁగన్ ॥ 77

క॥ రవి యశ్వసహాయంబున, దివినుండియె విషము నంతఁ దివిరి హరించున్
*నవ మధు విద్యయె దానిం, గవి నమృతము మాట్కిఁ జేయఁగలుఁగును జుండీ! ॥ 78

1, "సుందరాంగియైన యదితియె" (వ్రాతప్రతి. 2 వ సంపుటము. 227 వ పుట) అని వ్రాతప్రతి పాఠము. ఇందు యతి భంగదోషమున్నది. కాన సవరింపఁబడినది. వ.గో.కృ.

* "రవియశ్వ సహాయంబున" నిత్యాది కందపద్యము తొలి రెండు పాదములను "వ" కారప్రాసతో రచియించి తరువాతి రెండు పాదములను "వరమధువిద్యయె దానిం, గర మమృతము మాట్కి" నని "ర"కారప్రాసతోఁ బ్రాసభంగదోషముతోఁ బ్రమాద వశమున శ్రీ నేమానివారు విరచించిరి. (చూ. వ్రాతప్రతి. 2 వ సంపుటము. 229 వ. పుట.) కానఁ బైవిధముగా సవరింపఁబడినది. వ.గో.కృ.

(11) గీ॥ పక్షి చిన్నదైన బహువిషంబును గ్రోలి,యున్న బ్రతికియుండె నెన్నునట్టు
లటుల నేనుగూడ నసువులు పాయక. యుండువాఁడఁ దుష్టి నొందువాఁడ ॥ 79

క॥ రవి యశ్వ సహాయంబున, దివినుండియె విషము నంతఁ దేలఁగఁ గొట్టున్
†నవ మధు విద్యయె దానిం, గవి నమృతము మాట్కిఁ జేయఁగలుఁగును సుండీ ॥ 80

(12) గీ॥ ఏక వింశతిగా వెల్గు నిన సువిస్ఫు, లింగములు[1] విషము గొట్టఁ దొలంగకుండ
నైన నవి ప్రాణములతోడ నమరియుండె, నటులనే నేను వసియింతు నసులతోడ ॥ 81

క॥ రవి యశ్వ సహాయంబున, దివినుండియె విషమునంతఁ దివిరి హరించున్
†నవ మధు విద్యయె దానిం, గవి నమృతము మాట్కిఁ జేయఁగలుఁగును సుండీ! ॥ 82

(13) క॥ ‡పరలి నవ నవతి సంఖ్యను, వరవిషము హరించునట్టి పావన నదులం
జిరతరముగఁ గీర్తించినఁ, జరితార్థుఁడ నౌదుఁ గాదె ! జగతిని దలఁపన్ ॥ 83

క॥ రవి యశ్వ సహాయంబున, దివి నుండియె విషము నంతఁ దివిరి హరించున్
†నవ మధు విద్యయె దానిం, గవి నమృతము మాట్కిఁ జేయఁగలుఁగును సుండీ! ॥ 84

(14) గీ॥ రమణు లందఱుఁ గుంభముల్ రాణఁ గొనుచు!, విమలజలములఁ దెచ్చిన విధము తలఁప
నేక వింశతి సంఖ్యచే నిలను వెలయు, ఘన మయూరులు నదు లేడు దునుము విషము ॥ 85

(15) చ॥ నకులము క్షుద్ర జంతువయినన్ విష మెల్లహరించు నట్టు లా
నకులము చేయకుండిన నణంచెద దానిని రాతి దెబ్బతో
సకల విషంబు దేహములఁ జక్కఁగ వీడుచుఁ బోవు నట్లుగా
నకలుష వృత్తిఁ జేసెదను నందఱు సౌఖ్యము నొందుఁడీ ! భువిన్ ॥ 86

(16) గీ॥ అట్టి వాక్య మెల్ల నాలించి నకులము, వచ్చి కొండనుండి పలికె నిట్లు
నీచ వృశ్చికంబ! నీ విషంబున రస, [2]మెదియు లేదటంచు నెఱుఁగవైతి ॥ 87

---

† చూ. 644వ. పుటలోని 78వ పద్యము పుట్‌నోటు. వ.గో.కృ.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

‡ "నవ నవతి సంఖ్య" నని "వ" కారప్రాసతోఁ గందమును బ్రారంభించి మిగిలిన మూఁడుపాదములను "ర" కారప్రాసతో శ్రీ నేమానివారు ప్రాసభంగదోషముతోఁ బూర్తిచేసిరి. (చూ. వ్రాతప్రతి, 2వ సంపుటము. 229వ పుట.) వ.గో.కృ.

2. మేదిలేదటంచు నెఱుఁగవైతి (వ్రా.ప్ర.పా.) సముచ్చయార్థకము లోపించుటచే దురర్థమునకవకాశమున్నది. కావున సముచితముగ విస్పష్టార్థకమగునట్లు సవరింపఁబడినది. వ.గో.కృ.

## †సూక్తమ్—192

ఋషిః—ప్రస్కణ్వః కాణ్వః

దేవతా—సూర్యః

ఛందః—జగతీ

(1) శనైశ్చిదద్య[1] సూర్యేణాఽఽదిత్యేన సహీయసా ।

అహం యశస్వినాం యశో విద్యా[2]రూపముపా దదే ॥ 83

(2) ఉద్యన్నద్య వి నో భజ పితా పుత్రేభ్యో యథా ।

దీర్ఘాయుత్వస్య హేశిషే తస్య నో ధేహి సూర్య ॥ 84

(3) ఉద్యన్తం త్వా మిత్రమహ ఆరోహన్తం విచక్షణ ।

పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతమ్ ॥ 85

† ఈ సూక్తమును బరిశిష్టసూక్తముగాఁ గొందఱు భావింపఁగా మరికొందఱు "ఖిలసూక్తము"గా భావించిరి. కల్ప సూత్రములలో వినియోగము పేర్కొనఁబడని మంత్ర సూక్తాదులు "ఖిల" మంత్ర సూక్తాదులుగా వ్యవహృతములైనట్లు కొందఱు తలంచిరి. ఋషిపరంపరలోఁ బదక్రమాదిపాఠములు విలుప్తములై విస్మృతములై మూలము మాత్రమే పఠింపఁబడఁగా నది "ఖిల" భాగమనఁబడినట్లు మరికొందఱు భావించుటయు జరిగినది. కాని "పరశాఖీయం స్వశాఖాయా మపేక్షావశాత్ పఠ్యతే తత్ఖిల ముచ్యతే ఇతి ఖిల లక్షణమ్" అని ప్రాచీనులు "ఖిల" లక్షణము ప్రవచించిరి. ఇతర శాఖాగత మంత్ర జాలమును సూక్తమును సందర్భవశమున నవసరముకొద్ది స్వశాఖలోనికిఁ బరిగృహీత మైనచో నది "ఖిల"సూక్త మనఁబడఁగును. అది సూక్తము మొత్తము కాక తదూనమగు మంత్రములుగఁ బరిగృహీతమైన "ఖిల" మంత్రములగును. ఈ మంత్రసూక్తములను గొందఱు ప్రక్షిప్తములుగ భావించిరి. మరికొందఱు "అధికపాఠము"లుగా నెన్ని పరిగ్రహింపఁగా వేరొక కొందఱు పరిహరించిరి. ఈ 192 వ సూక్తము ప్రథమమండలములో 191వ సూక్తము తదుపరి 192వ సూక్తముగాఁ గొన్ని గ్రంథములలో నుండఁగా-50వ సూక్తము తరువాతి (133వ పుట) 51వ. సూక్తముగాఁ గొన్ని గ్రంథములలోఁ గలదు. వ.గో.కృ.

1. శనైశ్చిత్సూర్యేణాఽఽదిత్యేన (పా.) 2. రూపాణ్యాదదే (పా.)

## ‡సూక్తము—192

ఋషి—కణ్వపుత్రుఁడగు ప్రస్కణ్వుఁడు

దేవత—సూర్యుఁడు

(1) †శా॥ ఆదిత్యుండు మహా ప్రభాకలిత తేజో౽oతర్గతాత్ముండునై
భేదాభేద మహాసుసృష్టికలితాఖీలాద్భుతాధీశుఁడై
వేదోద్ధూత పరాపరాత్మ జననోపేతుండుగా శక్తిమెఁ
దాదాత్మ్యంబున విశ్వ శబ్దమగు నాదానాద నిశ్శబ్దతన్ ॥ 88

(2) †గీ॥ ఉన్నతుండగు తండ్రి తా నుచ్చగతిని, బుత్రులంగాంచి పెంచుచు ధాత్రత రతి
సూరసూర్యః రక్షింపుము: సుశ్రుత హిత, మతిని దీర్ఘాయు వలరఁగ మంగళ హృది ॥ 89

(3) †క॥ శత శరదమ్ములు శుభములు, శత శరదమ్ములు సుఖములు చాలుగ వెలుఁగన్
ఋతుకర్తా: శత ఋతువుల్, హితరతిగతి మిత్రుఁడవయి హెచ్చుగఁగనుమా: ॥ 90

## *సూక్తమ్—193

ఋషిః—అగస్త్యో మైత్రావరుణిః

దేవతా—విషఘ్నః

ఛందః—అనుష్టుప్

(1) మా బిభేర్న మరిష్యసి పరి త్వా పామి సర్వతః ।

ఘనేన హన్మి వృశ్చికమహిం[1] దణ్డేనాగతమ్ ॥ 86

‡ ఈ సూక్తవిషయిక విశేషములకై సంస్కృతమూలము 192వ సూక్తమున కిచ్చిన ఫుట్‌నోటు (646వ పుట,) చూచునది. వ.గో.కృ.

† రచయిత:—వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ."

* ఈ 193వ సూక్తమును బరిశిష్టసూక్తముగాఁ గొందఱు భావింపఁగా "ఖిలసూక్తము"గా మరికొందఱు తలంచిరి. ఇది యధిక పాఠమని కొందఱనఁగాఁ బ్రక్షిప్తమని కొందఱనిరి. "ఖిల" విషయ విశేషములకు 646 వ పుటలోని 192 వ సంస్కృత సూక్తమున కిచ్చిన ఫుట్‌నోటు నరయనగును. వ.గో.కృ.

1. మహాందణ్డేనాం (పా.)

(2) ఆదిత్యరథవేగేన విష్ణుబాహుబలేన చ ।
గరుడపక్షనిపాతేన భూమిం గచ్ఛ మహాయశాః ॥ 87

(3) గరుడస్య [1]పాతమాత్రేణ త్రయో లోకాః ప్రకంపితాః ।
ప్రకంపితా మహీ సర్వా సశైలవనకాననా ॥ 88

(4) గగనం నష్టచన్ద్రార్కం జ్యోతిషం న ప్రకాశతే ।
దేవతా [2]భయభీతాశ్చ [3]మారుతో న ప్లవాయతి ॥ 89

(5) భో సర్ప భద్ర భద్రం తే దూరం గచ్ఛ [4]మహావిష ।
[5]జన్మేజయస్య యజ్ఞాన్తే ఆస్తీకవచనం స్మర ॥ 90

పాఠభేదః

సర్పాపసర్ప భద్రం తే గచ్ఛ సర్ప మహావిష ।
జనమేజయస్య యజ్ఞాన్తే ఆస్తీకవచనం స్మర ॥ 91

1. జాతమాత్రేణ (పా) 2. భయవిత్రస్తా (పా) 3. మారుతో న ప్లవాయతోంనమః (పా) 4. మహాయశాః(పా)
5. జనమేజయస్య (పా)

(6) ఆస్తీకవచనం శ్రుత్వా యః సర్పో న నివర్తతే ।

శతధా భిద్యతే మూర్ధ్ని శింశవృక్షఫలం యథా ॥ 92

పాఠభేదః

ఆస్తీకస్య వచః శ్రుత్వా యః సర్పో న నివర్తతే ।

శతధా భిద్యతే మూర్ధా శింశవృక్షఫలం యథా ॥ 93

(7) నర్మదాయై నమః ప్రాతర్నర్మదాయై నమో నిశి ।

నమోఽస్తు నర్మదే తుభ్యం త్రాహి మాం విషసర్పతః ॥ 94

(8) యో జరత్కారుణా జాతో జరత్కార్వాం మహాయశాః ।

తస్య స్మరాభి భద్రం తే దూరం గచ్ఛ మహావిష ॥ 95

(9) అసితిం చార్థసిద్ధిం చ సునీతిం చాపి యః స్మరేత్ ।

దివా వా యదీ వా రాత్రౌ నాస్తి సర్పభయం భవేత్ ॥ 96

(10) అగస్త్రిర్మాధవశ్చైవ ముచుకుందో మహామునిః ।

కపిలో మునిరాస్తీకః పఞ్చైతే సుఖశాయినః ॥ 97‡

ఇతి
ప్రథమం మండలం
సమాప్తమ్

## ‡సూక్తము—193

ఋషి—మైత్రావరుణియైన యగస్త్యుఁడు

దేవత—విష్ణు దేవత

(1) †క॥ వృశ్చిగ మాదిగఁగల విష,పశ్చాత్ప్రాణ్యాళి సర్వ భగ్న విషములై
యాశ్చర్యకరముగా విష,దుశ్చర్యరహితగతిగతిఁ దొడరుత! జగతిన్ ॥ 91

(2) †మ॥ గరుఁడుం డొక్కఁడు పక్షపాత రతి విక్రాంతి ప్రభంజాదృతిన్
నరుఁడై విష్ణు సుషుప్తి దోర్బల మహానందాత్మతన్ జాగృతిన్
దరుణాదిత్య రథ ప్రవేగమును విధ్వస్తమ్ముగా మించఁగా
ధరణీ ప్రాకృతశక్తిఁ జేరుతను నధ్యాత్మక్రియన్ సత్క్రియన్ ॥ 92

‡ సంస్కృత ఋగ్వేద ప్రతులలో ఋక్కుల క్రమసంఖ్య యొక పద్ధతిలో లేదు. కొన్ని ప్రతులలో సప్తకముల వారీగా ఋక్కుల క్రమసంఖ్య నీయఁగా, మఱికొన్ని ప్రతులలో నధ్యాయములవారీగాను, వేఱుకొన్ని ప్రతులలో ననువాకముల వారీగాను, ఇంకఁగొన్ని ప్రతులలో మండలములవారీగాను నిచ్చుట జరిగినది. శ్రీ నేమానివారు తమ యాంధ్రానువాద వ్రాతప్రతులలో నధ్యాయముల వారీగానే తెలుఁగు పద్యగద్యముల క్రమసంఖ్య నిచ్చుట జరిగినది. శ్రీ నేమానివారు తమ యనువాదములో ననుసరించిన పద్ధతి ప్రకారమే యిప్పటివరకును సంస్కృత ఋక్కుల క్రమసంఖ్యను నధ్యాయములవారీగానే యిచ్చుట జరిగినది. కాని యీ క్రమసంఖ్య వివిధ సంపుటములను దృష్టిలోనుంచుకొని మండలములవారీగా నిచ్చినచోఁ బాఠకుల కెక్కువ సౌకర్యముగా నుండునని యీఁకముందు సంస్కృతాంధ్ర భాగముల రెండింటను మండలములవారీగానే ఋక్పద్యగద్యముల క్రమసంఖ్య యిచ్చుట జరిగినది, పాఠకు లీ విషయమును ప్రత్యేకముగ గుర్తింపనగును. వ.గో.కృ.

‡ ఈ సూక్తవిషయ విశేషములకు 193వ సంస్కృత సూక్తము పుట్నోటు చూఁడనగును. వ.గో.కృ.

† రచయిత:- వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

(3) †గీ॥ సకల శైలాటవీ వనజాల యుక్త,ధర గరుడపాతమాత్రాన దద్దరిల్లు
నఖిల లోకాలు గడగడ లాడిపోవు,సర్వశక్తులు సంభ్రమాచర్వితమగు ॥ 93

(4) †క॥ గగనము భయ భీత మ్మగు,గగనమణిరవి శశి సకల గణనక్షత్రా
లొగిఁ దేజో రహితము లగు,నగణిత దేవాళి వాయు వందును భీతిన్ ॥ 94

†క॥ ఇడుముల కడలిని గడవఁగ,నడుగిడఁ జిడుముడి పడకయె యదరు గరుడ దే
వుఁడ! నీకు నమో యనుచును,దొడరఁగఁ బొగడఁగ భయములు దొలఁగును జగతిన్ ॥ 95

(5) †క॥ ఆస్తీకుఁడు నాస్తికుఁడౌ, నాస్తికుఁడౌ జన్మయె జయమగు నో సర్ప
మ్మా! స్తవనీయ సుభద్రత,నిస్తుల భద్రత నొసఁగుము! నిలుపుము! పెడగన్ ॥ 96

పాఠాంతరము

†క॥ సర్పాపసర్ప! నీ కగుఁ,గార్పణ్యము లేని భద్రగతి గమనము నో
సర్పాధీశ! మహావిష, తర్పిత యజ్ఞాంతమునను దలఁతుము నిన్నున్ ॥ 97

†క॥ జనమేజయ యజ్ఞాంతము,నను నాస్తీక వచనమును నతిని స్మరింపన్
ఘన సర్ప మహావిషమును, జనును! సురక్షితపు భద్ర సకలము నీయన్ ॥ 98

అర్థాంతరము

గీ॥ ఎవని యజ్ఞాంతమున మహాఋషిపథాల. నాస్తికుని పథమ్ము దలంప నమితముగను
సర్వభద్రముల్ సమకూరు సకలవిషము. పరిహారంబగు జనతతి వరలు శుద్ధి ॥ 99

మరొక యర్థాంతరము

†క॥ విషహర! జనులను నెనఁగుము, శషభిషలౌ జనులుకొట్టు ఛల పూర్వ మహా
విషధర భూ జల చరములు. ధిషణాహంకృతు లణంగి తేకున నెడఁగన్ ॥ 100

(6) †క॥ ఆస్తీక వచన గతి నత. మస్తకమై విష కునాగు ముఖలనిచోఁ ద
న్మస్తకము విధిగ శత విధ్వస్త మ్మగు శింశు ఫలము పగిలిన రీతిన్ ॥ 101

(7) †క॥ ప్రాతర్వేళల నర్మద!, రాతిరి వేళలను గూడ నాదు నమస్సుల్
ప్రాతిగఁగొని రక్షింపుమ!, భీతావహమైన విషము విఱుగఁగ నెపుడున్ ॥ 102

† రచయిత:--వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాలకృష్ణయ్య, "కళా-ప్రపూర్ణ".

(౮) †క॥ అతఁడు జరత్కారునికిని, సుతవాసుకి చెలియ లల్ల నోతవ్య సతీ
గతిజ జరత్కారువునకు, సుతుఁ డా యాస్తీకుఁ దలఁతు జుడుఁగుము నాగూ ! ॥ 103

(౯) †క॥ అసితిని సునీతిఁ దగ నర్థ సిద్ధిని స్మరించు ప్రాణి దలఁగును భీతిన్
వెసఁ బవలు రాత్రులను నరయ సర్పభయము కలుఁగదెట నక్షయ ధృతిగాన్ ॥ 104

(10) †క॥ మనమున నగస్తి, ముచికుందుని, నాస్తీకుని, గపిలుని, ధృష మాధవునిన్
మును లా యేవురఁ దల్చినఁ, దనివిని సుఖ శాయసులయి తనరెదరు జనుల్ ॥ ‡105

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన
భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందుఁ
ప్రథమమండలము
సమాప్తము

---

† రచయిత:-వాఙ్మయ మహాధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

‡ శ్రీ నేమానివారు పద్యగద్యముల క్రమసంఖ్యను దమ వ్రాతప్రతులలో నధ్యాయములవారీగా నిచ్చినందువల్ల నదియే పద్ధతిని సంస్కృతఋక్కుల క్రమసంఖ్యను దెలుఁగు పద్యముల క్రమసంఖ్యను నధ్యాయములవారీగానే యింతవరకు నిచ్చుట జరిగినది. ఇఁకముందు మాత్రము కేవలము మండలముల వారీగానే సంస్కృతపు ఋక్కుల క్రమసంఖ్యతోపాటు తెలుఁగు పద్యగద్యముల క్రమసంఖ్య కూడ నిచ్చుట జరిగినది. పాఠకు లీ విషయమును ప్రత్యేకముగా గుర్తింపనగును, వ.గో.కృ.

సముంల

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

# ఋగ్వేద-సంహితా

## అథ ద్వితీయం మండలమ్

### అనువాకః—1, సూక్తమ్—1

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః†

దేవతా—అగ్నిః

ఛందః—జగతీ

(1) త్వమగ్నే ద్యుభిస్త్వమాశుశుక్షణిస్త్వమద్భ్యస్త్వమశ్మనస్పరి ।

త్వం వనేభ్యస్త్వమోషధీభ్యస్త్వం నృణాం నృపతే జాయసే శుచిః ॥ 1

(2) తవాగ్నే హోత్రం తవ పోత్రమృత్వియం తవ నేష్ట్రం మగ్నిదృతాయతః ।

తవ ప్రశాస్త్రం త్వమధ్వరీయసి బ్రహ్మా చాసి గృహపతిశ్చ నో దమే ॥ 2

(3) త్వమగ్న[1] ఇన్ద్రో వృషభః సతామసి త్వం విష్ణురురుగాయో నమస్యః ।

త్వం బ్రహ్మా రయివిద్ బ్రహ్మణస్పతే త్వం విధర్తః సచసే పురంధ్యా ॥ 3

† ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. త్వమగ్నఽఇన్ద్రో, (వ్రా.ప్ర.)

(4) త్వమగ్నే రాజా వరుణో ధృతవ్రత స్త్వం మిత్రో భవసి దస్మ[1] ఈడ్యః ।

త్వమర్యమా సత్పతిర్యస్య సంభుజం త్వమంశో విదథే దేవ భాజయుః ॥ 4

(5) త్వమగ్నే త్వష్టా విధతే సువీర్యం తవ గ్నావో మిత్రమహః సజాత్యమ్ ।

త్వమాశుహేమా రరిషే స్వశ్వ్యం త్వం నరాంశర్ధో[2] అసి పురూవసుః ॥ 5

(6) త్వమగ్నే రుద్రో[3] అసురో మహో దివ స్త్వం శర్ధో మారుతం పృక్ష[4] ఈశిషే ।

త్వం వాతై రరుణైర్యాసి శంగయ స్త్వం పూషా విధతః పాసి ను త్మనా ॥ 6

(7) త్వమగ్నే ద్రవిణోదా[5] అరంకృతే త్వం దేవః సవితా రత్నధా[6] అసి ।

త్వం భగో నృపతే వస్వ[7] ఈశిషే త్వం పాయుర్దమే య స్తేఽవిధత్ ॥ 7

(8) త్వామగ్నే దమ[8] ఆ విశ్పతిం విశ స్త్వాం రాజానం సువిదత్రమృఞ్జతే ।

త్వం విశ్వాని స్వనీక పత్యసే త్వం సహస్రాణి శతా దశ ప్రతి ॥ 8

---

1. దస్మఽఈడ్యః, 2. నరాంశర్ధోఽఅసి 3. రుద్రోఽఅసురో. 4. పృక్షఽఈశిషే, 5. ద్రవిణోదాఽఅరం. 6. రత్నధాఽఅసి, 7. వస్వఽఈశిషే, 8. దమ ఽఆ, (వ్రా.ప్ర.)

(9) త్వామగ్నే పితరమిష్టిభిర్నరస్త్వాం భ్రాత్రాయ శమ్యా తనూరుచమ్ ।

త్వం పుత్రో భవసి యస్తేఽవిధత్ త్వం సఖా సుశేవః పాస్యాధృషః ॥ 9

(10) త్వమగ్న[1] ఋభురాకే నమస్యస్త్వం వాజస్య క్షుమతో రాయ[2] ఈశిషే ।

త్వం వి భాస్యను దక్షి దావనే త్వం విశిక్షురసి యజ్ఞమాతనిః ॥ 10

(11) త్వమగ్నే[3] అదితిర్దేవ దాశుషే త్వం హోత్రా భారతీ వర్ధసే గిరా ।

త్వమిళా శతహిమాసి దక్షసే త్వం వృత్రహా వసుపతే సరస్వతీ ॥ 11

(12) త్వమగ్నే సుభృత[4] ఉత్తమం వయస్తవ స్పార్హే వర్ణ[5] ఆ సందృశి శ్రియః ।

త్వం వాజః ప్రతరణో బృహన్నసి త్వం రయిర్బహులో విశ్వతస్పృథుః ॥ 12

(13) త్వమగ్న[6] ఆదిత్యాస ఆస్యం త్వాం జిహ్వాం శుచయశ్చక్రిరే కవే ।

త్వాం రాతిషాచో[7] అధ్వరేషు సశ్చిరే త్వే దేవా హవిరదన్త్యాహుతమ్ ॥ 13

---

1. త్వ మగ్నేఽఋభురాకే, 2. రాయఽఈశిషే, 3. త్వమగ్నేఽఅదితి, 4. సుభృతఽఉత్తమం, 5. వర్ణఽఆ, 6. త్వమగ్నఽఆదిత్యాసఽఆస్యం. 7. రాతిషాచోఽఅధ్వ. (వ్రా,ప్ర.)

(14) త్వే[1] అగ్నే విశ్వే అమృతాసో అద్రుహ ఆసా దేవా హవిరదన్త్యాహుతమ్ ।

త్వయా మర్తాసః స్వదన్త[2] ఆసుతిం త్వం గర్భో వీరుధాం జజ్ఞిషే శుచిః ॥ 14

(15) త్వం తాన్ త్సం చ ప్రతి చాసి [3]మజ్మనా ఽగ్నే సుజాత ప్ర చ దేవ రిచ్యసే ।

పృక్షో యదత్ర మహినా వి తే భువదను ద్యావాపృథివీ రోదసీ[4] ఉభే ॥ 15

(16) యే స్తోతృభ్యో [5]గో అగ్రామశ్వపేశసమగ్నే రాతిముపసృజన్తి సూరయః ।

అస్మాఞ్చ తాంశ్చ ప్ర హి నేషి వస్య[6] ఆ బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 16

1. త్వేఽఅగ్నే విశ్వేఽఅమృతాసోఽఅద్రుహఽఆ. 2. స్వదన్తఽఆసుతిం 3. మజ్మనాఽగ్నే, 4. రోదసీఽఉభే, 5. గోఽఅగ్రామశ్వ, 6. వస్యఽఆ. (ప్రా.ప్ర.)

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ద్వితీయ మండలము

### అనువాకము—1 సూక్తము—1

ఋషి—గృత్సమదుఁడు†

దేవత—అగ్ని

(1) సీ॥ ఇష్టి దినంబున నెవఁడు పుట్టె నటన్న నగ్నిహోత్రుం డని యనఁగవలయు
దీప్తివంతుం డని తెగఁ డొందు నెవఁడన్న నగ్నిహోత్రుం డని యనఁగవలయు
శుచిగల వాఁ డౌచు శోభిల్లు నెవఁ డన్న నగ్నిహోత్రుం డని యనఁగవలయు
జలమునం దెవ్వఁడు జన్మ మొందు నటన్న నగ్నిహోత్రుం డని యనఁగవలయు
గీ॥ జలధి పాషాణములనుండి చారు వనము నుండి యెవ్వఁడు జన్మము నొందె ననఁగ
నన్ని చోటుల వెలిఁగెడు నగ్ని విభుఁడె,యట్టి వాఁడని తప్పక యనఁగవలయు ॥ 1

† గృత్సమదు లనువారే ఋగ్వేద రెండవమండలమును వెల్లడి చేసినవారు. కాని సాయనాచార్యుఁడు తన భాష్యమునందు "గృత్సమదుఁడు మొదట అంగిరో వంశస్థుఁ డనియుఁ బిమ్మట భృగువంశీయుఁ డగు గృత్సమదుఁ డయ్యె" ననియు వ్రాసితి. ఈ విషయమై మహాభారతము అనుశాసనపర్వము 30వ అధ్యాయమున విపులముగఁ గలదు. ఆ కథ గ్రంథవిస్తరభయముచే వ్రాయ మానితిమి. వీని కథ విష్ణుపురాణమందును, వాయుపురాణమందును గలదు. కాని యా కథలు విచారణీయములు. జాతి విభాగములేని సమయమున గృత్సమదుఁ డుండినట్లు తెలియుచున్నది. జాతివిభాగము నేర్పఱచిన శౌనకుఁడు, గృత్సమదునివలనఁ బుట్టిన వాఁడని విష్ణుపురాణమునఁ (3 - 8) గలదు. (నే.వేం.న.శా.)

గమనిక :—తెలుఁగులోను సంస్కృతమునందును గృత్సమద-గృత్స్నమద-కృత్సమద-కృత్స్నమద శబ్దములు పర్యాయ పదములుగాఁ గన్పించుచున్నవి. ఇవి ఋషులకును రాజులకునుఁ గూడ నామములుగాఁ గన్పించుచున్నవి. ఈ గృత్సమదు లనేకు లున్నారు. మునియైన గృత్సమదుని గృత్సమౌనియని వ్యవహరించుటయుఁ గలదు. గృత్సమదుఁడు మొదట అంగిరోవంశస్థుఁ డనియుఁ బిమ్మట భృగు వంశీయుఁడుగా మాఱె ననియు సాయనాచార్యులు వ్రాసిరనుట వాస్తవమే! కాని యీ విషయము విచార ణీయము. ఈ మాఱిన వంశములోఁ బుట్టిన గృత్సమదుఁడు తొలుత మహర్షియైన అంగిరో వంశజుఁ డని ధృవముగాఁ జెప్పలేము. అంగిరస నామకులు పెక్కురు మహర్షులు, రాజులునున్నారు. వైవస్వతమనువునకుఁ బుత్రుఁడై రాజైన శర్యాతి పుత్రుఁడు "వీతహవ్యుఁడు" ఒకఁడు కలఁడు. వీతహవ్యునకు అనేకమంది పుత్రులున్నను వారందరును దివోదాసుని పుత్రుఁడగు "ప్రతర్దను"ని చేతిలో విగతప్రాణు లైరి. వీతహవ్యుఁడు తన ప్రాణమునకుఁ గూడ ముప్పు వచ్చునని భయపడి భృగుమహర్షి నాశ్రయించెను. అప్పటి నుండి రాజైన వీతహవ్యుఁడు భృగుమహర్షి పెంపుడుకొడుకై బ్రాహ్మణుఁ డయ్యెను. భృగువంశపు బ్రాహ్మణుఁ డైన పిదప వీతహవ్యునికిఁ గలిఁగిన కొడుకు "గృత్స్నమదుఁ"డని ఒకపురాణ గాథ కలదు. ఈ గృత్స్నమదునికి "హయహయుఁడని" నామాంతర మున్నట్లుకూడఁ గలదు, హయహయనామకులుకూడ ననేకు లున్నట్లు పురాణములవలన విదిత మగుచున్నది. ఈ గృత్స్నమదుఁడు భార్గవుఁడేగాని శౌనకునకుఁ బూర్వుఁడు కానేరఁడు-శౌనకునకుఁ దాతయు శునకునకుఁ దండ్రియు నగు గృత్స్న

(2) గీ॥ హోతృ నేష్టృ కర్మ హోమము లన్నియు,నిన్నె చెందుచుండు నిర్మలాగ్ని!
యాగ కర్మ లన్ని యభిలషించి ప్రశాంత.కర్మములను నీవు కనెద వెపుడు ॥ 2

(3,4,5) సీ॥ నీవె సాధువులకు నిఖిలార్థదుండవు నీవె విష్ణుండవు నీవె హరివి
నీవె సంస్తుతులకు నిత్యయోగ్యుండవు నీవె బ్రహ్మవు నీవె నిఖిలపతివి
నీవె మిత్రుండవు నీవె వరుణుఁడవు నీవె యర్యముఁడవు నీవె బలివి
నీవె త్వష్టవు నీవె నిత్యభక్తుల కెల్ల నీవె సేవ్యుండవు నిర్జరేశ!
గీ॥ నీవె బంధు వరుండవు నిర్జరులకు, నీదు తేజంబు హిత మగు నిఖిలమునకు
సశ్వములతోడ ధనమును నందఁజేసి, బలము నీయుము మాకు నో బలతనూజ! ॥ 3

(6,7) సీ॥ ఆకాశమున వెల్గు నసుర రుద్రుండవు బల రూపముల వెల్గు భక్తపతివి
సుఖసంపదకు నెల్ల సుందరాధారుండ వఖిలగణంబుల కమలవిభుఁడ
వమలపూషుఁడ వౌదు వాసుగ సంకాశ హయ రత్నములతోడ నమరువాఁడ
వఖిలగృహంబుల సధిసించుచు సర్వపాలకుండవు నీవు పరమమతివి
గీ॥ విజ్ఞుఁడా! యగ్ని! నీవు మా యజ్ఞములకు, వచ్చినట్లైన యజమాన వర్గమెల్ల
నీకు సేవ లొనర్తురు నీవు వారి,పాలనంబు నొనర్తువు పావకుండ! ॥ 4

గీ॥ మణుల కెల్లను నాధార మణివి నీవు,స్వర్ణ ధనముల నిచ్చెడు సరసమతివి
భగుఁడ! సవితృఁడ! కాంతి విభాసమాన,భక్తవరులను బాలించు పావకుండ! ॥ 5

(8) క॥ లోకులు తమ తమ గృహములఁ, బాకారిస్తుత్య! నిన్ను బంధించి సదా
ప్రాకటముగ భూషింతురు, శ్రీకరుఁడా! దీప్తి నీవు చెలఁగెదవు సుమా! ॥ 6

మదుఁడు సుహోత్రుని పుత్రుఁడు. అనఁగా శౌనకునకు మూలభూతుఁడైన గృత్సమదుఁడు వేఱనియు-తొలుత అంగిరోవంశజుఁడై పిదప భృగువంశజుఁ డైన వీతహవ్యుని పుత్రుఁడగు గృత్సమదుఁడు వేఱనియు గుర్తింపవలసి యున్నది. శౌనకమహర్షికి మూలభూతుఁడైన గృత్సమదుని తండ్రియైన సుహోత్రుఁడు క్షత్రవృద్ధుని కుమారుఁడు-సుహోత్రనామకులు కూడఁ బెక్కుమంది యున్నట్లు కన్పించుచున్నది. బ్రహ్మక్షత్రుఁ డని నామాంతరము కల భుమన్యునకుఁ గుమారుఁడై అనేక రాజసూయములు చేసిన సుహోత్రుఁ డొకఁడు - విజయాసహదేవుల కుమారుఁ డైన సుహోత్రుఁడు వే ' రొకఁడును గలరు. పురాణములు పరిశీలించుచో నీ గృత్సమద - గృత్సమద - కృత్సమద - కృత్సమదుల గాథ లనేకము లనేకవిధములుగాఁ గనిపించును. శౌనకమహర్షికిఁ దరువాత నెంద ఱెందఱు గృత్సమదు లుదయించిరో తెలియదు - వేదసూక్తముల ద్రష్టయైన గృత్సమదుఁడు భార్గవుఁడు కావచ్చును గాని శౌనకుఁడు కాఁడేమో? శౌనకు లాధునికులు - భార్గవుఁడు బాగఁ బ్రాచీనుఁడు - ఏదియేమైనను భార్గవ - శౌనక గృత్సమదు లొక్కరు కానేరరు. వ.గో.కృ.

గీ॥ అరయ నీదు సేన యత్యుత్తమం బగు,సమరదూత వీవు హవ్యవాహ !
ధర్మబుద్ధితోడ దయనుంచి మాపయి, బహుళఫలము లీయఁ బాడి కాదె! ॥ 7

(9) క॥ జనకుఁడవు కాన నీ వో. యనలుఁడ! లోకములు నిన్నె యర్చించుచు నీ
ఘన మగు సౌభ్రాతృత్వం, బును గోరుచుఁ దృప్తిఁ జేయఁ బూనుదురు సుమా, ॥ 8

క॥ పరిచర్య చేయు వారికి, వరపుత్రుఁడ వీవుగాన వారికి నగ్నీ!
చిరదీప్తి శుభము లొసఁగుచుఁ, బరులన్ భంజించి వారిఁ బాలింపవోకో! ॥ 9

(10,11) సీ॥ అతిశయోజ్జ్వలరూప మందిన వాఁడవు ప్రత్యేక నుతులకుఁ బట్టువౌదు
వంథకార బలంబు నడఁగింపఁ గాష్ఠముల్ జ్వలియింపఁ జేయుచుఁ జెలఁగె దీవు
హవిరన్నధనముల నందించు వాఁడవు భారతీదేవివి పాలకుఁడవు
వివిధస్తవంబుల వృద్ధి నొందెడు వాఁడ వసుర వృత్రాఖ్యుని నడఁచి తీవు
గీ॥ శతహిమవిరాజితేశవు జ్వలనదేవ!, సుందరసరస్వతివి నీవు సొగసుకాఁడ!
యజ్ఞనిర్వాహకుండవై యఖిలమునకు, ఫలము లందింపుచుండుము ! పావకుండ! ॥ 10

(12,13,14) సీ॥ ఉత్తమాన్నుండవై యుత్తమైశ్వర్యంబు నుత్తమరీతిని నొసఁగె దనల !
యన్నరూపుండవై యఖిలరక్షక్రియ నందించుచుందు వో యగ్నిదేవ!
యాదిత్యగణమున కాననమై నీవు దివిజజిహ్వాత్వంబుఁ జెందెదగ్ని!
దివ్యముఖుండవై తేజరిల్లెడు హవ్య మమరుల కందింతు వఘ విదూర!
గీ॥ నీవు విలసిల్లుటంజేసి నిఖిలభూత.గణము లెల్లను నన్నంబు గాంచఁగల్గె
లతల గర్భస్వరూపుఁడ వతులశుచిని,జన్మమును నొందినాఁడ వో జ్వలన ! నీవు ॥ 11

(15) చ॥ బలమును బట్టి నీవు బహు పావన నిర్ఝర సంచయంబుతో
మెలఁగుదు వీవు పావకుఁడ! మేచర శక్తిని నీ మహత్వ సం
చలనము వల్ల నంతటను శబ్దము గల్గిన రోదసిన్ గడున్
వెలిఁగెదుఁ గాదె : యన్నము కవీశ్వర! నిన్నుఁ దలంచు వారికిన్ ॥ 12

(16) చ॥ నిను నుతియించు వారలకు నిర్మల విత్తము నన్న వాజులన్
ఘనముగ నిచ్చు శూరులను గల్మష హీనుల మమ్ముఁ బావకా!
కనుఁగొని శ్రేష్ఠ దేశములఁ గాంచెడు వారిగ నీవు సేసినన్
బనివడి యాగమందు బహు పావన మంత్రము లుచ్చరింపమే! ॥ 13

## సూక్తమ్—2

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్)*
భార్గవః శౌనకః
దేవతా—అగ్నిః
ఛందః—జగతీ

(1) యజ్ఞేన వర్ధత జాతవేదసమగ్నిం యజధ్వం హవిషా తనా గిరా ।
సమిధానం సుప్రయసం స్వర్ణరం ద్యుక్షం హోతారం వృజనేషు ధూర్షదమ్ ॥ 17

(2) అభి త్వా నక్తీరుషసో వవాశిరే ఽగ్నే వత్సం న స్వసరేషు ధేనవః ।
దివ[1] ఇవేదరతిర్మానుషా యుగా క్షపో భాసి పురువార సంయతః ॥ 18

(3) తం దేవా బుధ్నే రజసః సుదంససం దివస్పృథివ్యోరరతిం న్యేరిరే ।
రథమివ వేద్యం శుక్రశోచిషమగ్నిం మిత్రం న క్షితిషు ప్రశంస్యమ్ ॥ 19

(4) తముక్షమాణం రజసి స్వ[2] ఆ దమే చన్ద్రమివ సురుచం హ్వార[3] ఆ దధుః ।
పృశ్న్యాః పతరం చితయన్తమక్షభిః పాథో న పాయుం జనసీ[4] ఉభే అను ॥ 20

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. దివఽఇవే, 2. స్వఽఆదమే, 3. హ్వారఽఆ, 4. జనసీఽఉభేఽఅను, (వ్రా.ప్ర.)

(5) స హోతా విశ్వం పరి భూత్వధ్వరం తము హవ్యైర్మనుష[1] ఋఞ్జతే గిరా ।

హిరిశిప్రో వృధసానాసు జర్భురద్ద్యౌర్న స్తృభిశ్చితయద్ రోదసీ[2] అను ॥ 21

(6) స నో రేవత్ సమిధానః స్వస్తయే సందదస్వాన్ రయిమస్మాసు దీదిహి ।

ఆ నః కృణుష్వ సువితాయ రోదసీ[3] అగ్నే హవ్యా మనుషో దేవ వీతయే ॥ 22

(7) దా నో[4] అగ్నే బృహతో దాః సహస్రిణో దురో న వాజం శ్రుత్యా[5] అపా వృధి ।

ప్రాచీ ద్యావాపృథివీ బ్రహ్మణా కృధి స్వర్ణ శుక్రముషసో వి దిద్యుతః ॥ 23

(8) స[6] ఇధాన ఉషసో రామ్యా అను స్వర్ణ దీదేదరుషేణ భానునా ।

హోత్రాభిరగ్నిర్మనుషః స్వధ్వరో రాజా విశామతిథిశ్చారురాయవే ॥ 24

(9) ఏవా నో[7] అగ్నే అమృతేషు పూర్వ్య ధీష్పీపాయ బృహద్ దివేషు మానుషా ।

దుహానా ధేనుర్వృజనేషు కారవే త్మనా శతినం పురురూపమిషణి ॥ 25

1. మనుషఽఅఋఞ్జతే, 2. రోదసీఽఅను, 3. రోదసీఽఅగ్నే, 4. నోఽఅగ్నే, 5. శ్రుత్యాఽఅప, 6. సఽఇధానఽ ఉషసోరామ్యాఽఅను, 7. నోఽఅగ్నేఽఅమృతేషు. (వా.ప్ర.)

(10) వయమగ్నే[1] అర్వతా వా సువీర్యం బ్రహ్మణా వా చితయేమా జనాగ్ం[2] అతి ।

అస్మాకం ద్యుమ్నమధి పఞ్చకృష్టిషూచ్చా స్వర్ణ శుశుచీత దుష్టరమ్ ॥ 26

(11) స నో బోధి సహస్య ప్రశంస్యో యస్మిన్ త్సుజాతా[3] ఇషయన్త సూరయః ।

యమగ్నే యజ్ఞముపయన్తి వాజినో నిత్యే తోకే దీదివాంసం స్వే దమే ॥ 27

(12) ఉభయాసో జాతవేదః స్యామ తే స్తోతారో[4] అగ్నే సూరయశ్చ శర్మణి ।

వస్వో రాయః పురుశ్చన్ద్రస్య భూయసః ప్రజావతః స్వపత్యస్య శగ్ధి నః ॥ 28

(13) యే స్తోతృభ్యో గో[5]అగ్రామశ్వపేశసమగ్నే రాతిముపసృజన్తి సూరయః ।

అస్మాఞ్చ[6] తాంశ్చ ప్ర హి నేషి వస్య[7] ఆ బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 29

1. మగ్నేఽఅర్వతా, 2. జనాగ్ంఽఅతి, 3. జాతాఽఇష, 4. స్తోతారోఽఅగ్నే, 5. గోఽఅగ్రా, 6. అస్మాఞ్చతాంశ్చ 7. వస్యఽఆ, (వా.ప్ర.)

## సూక్తము—2

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—అగ్ని

(1) క॥ చిరబలదుండు మహాత్ముఁడు, పౌరిఁ బౌరిఁ గన్గొనిన వాఁడు భూతముల మహా
సుర హోమకారకుం డగు, పరమాగ్నిని వృద్ధిఁబఱచి భవ్యము గనుఁడీ! ॥ 14

(2) చ॥ దినమున నాల్గు వత్సము లదేపనిగాఁ గనఁగోరు నట్టి తే
ఘను లగు యాజకోత్తములు గాంచుచు నుందురు నిన్ను రాత్రులం
దనయము సంయతుండవయి యా గగనస్థలి మాడ్కి వ్యాప్తి వేఁ
గొని యజమాన యజ్ఞములకుం జనువాఁడవు నీవు పావకా! ॥ 15

(3) క॥ ఘనుని సుదర్శుని నగ్నిని, ధనపూర్ణ రథంబు మాడ్కి ధర వెల్గెడు వా
నిని జగతీ మధ్యంబున, వినయముతోఁ బెట్టినారు వేల్పులు ప్రీతిన్ ॥ 16

(4) చ॥ గగనమునందు వృష్టులను గల్కఁగఁ జేసెడు వాని దీప్తితో
జగములఁ గాచువానిఁ గడు సజ్జన బాంధవుఁడైన వాని నీ
జగముల కెల్లఁ జేతనముఁ జాల నొసంగెడు వాని దాహకున్
ద్విగుణిత భక్తితోడ జనదివ్యగృహంబుల నుంతు రందఱున్ ॥ 17

(5) చ॥ అనలుఁడు హోమ కార్యముల నంతటఁ గల్గిన యాగశాలలో
మనుజు లొనర్చు సన్నుతుల మానక వీనులఁ బెట్టుచుండి తా
నొనరఁ బ్రవర్ధమానుఁడయి యోషధి మధ్యను వెల్గుచుండి స
జ్జనపరిదత్త హవ్యముల సంపదఁ బొందుచు నుండుఁ బ్రీతితోన్ ॥ 18

గీ॥ అమల నక్షత్ర పఙ్క్తిచే నాకసంబు, వెలుఁగు విధమున వహ్నిచే విశ్వగగన
భువనములు వెల్గుచున్నవి పురుషులార!, వానిఁ బూజింపుఁడెపుడుఁ దాత్పర్య మెసఁగ ॥ 19

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6) చ॥ అనలుఁడ! మాకు మంగళము నందఁగఁ జేయఁ దలంచి యెంతయున్
ధనము నొసంగి దీప్తిఁగొని ధారుణి, ఖస్థలి, సత్ఫలంబులన్
బనుఁబడి మా కొసంగునటు పల్మరు సేయుచు దేవతాళికిన్
ఘనతర హవ్యసంపదలు గల్గెడు నట్టులు చేయు మాత్రతోన్ ॥ 20

(7) చ॥ అనలుడ! మాకు గోవులను నశ్వములన్ స్థిర పుత్ర సంతతిన్
ఘన మగు పౌత్ర సంతతిని గాంతిమతిన్ దయసేసి కీర్తికై
యెనఁ గననట్టి యన్నమును నేర్తెర దాని విముక్తి నిచ్చి నీ
వనయము రోదసీ ద్వయ మనంతముగా వెలుఁగొందఁ జేయుమా! ॥ 21

గీ॥ ఆదితేయగణము ననుకరించెడు నుష:స్సముదయంబు నిన్ను జ్వాలనదేవ!
వెల్గఁ జేయుచుండె వివిధ ప్రకార సం,కలనతోడ మమ్ముఁ గావ రాదె! ॥ 22

(8) గీ॥ భవ్యు లాదిత్యులనుఁ బోలి ప్రజ్వలించు,సుందరోషస్సులం గడు సొగసుఁ గాంచు
నగ్ని సందీప్యమానుఁడై యమలరీతి,వెల్గుచుండెడు నేవేళ వివిధగతుల ॥ 23

క॥ మనుజాళిహోమసాధనుఁ, డనయ స్తుత్యుండు మనుజ యాగాధిపుఁడున్
మనుజప్రియుఁ డతిథివలెం, దనరెడు ననలుండు వచ్చుతం గర్మలకున్ ॥ 24

(9) చ॥ సతతముఁ గాంతివంతుఁడవు చక్కని వాఁడవు మానవావళి
స్తుతులఁ బరిగ్రహించెదవు సుందరమూర్తివి పూర్వజన్ముఁడౌ
నుతిఁగొను గోవు చందమున నూత్న ధనంబుల నీయ రావొకో!
మతిగల యాగకర్తలకు మాన్యుఁడ! నీవు సమస్తరీతులన్ ॥ 25

(10) చ॥ అనలుఁడ ! నీవు వాజులను నందఁగఁ జేసిన నవ్వి యన్నముం
దిని కడు దాని మూలమునఁ దృప్తిగఁ గార్యము లెన్నొ చేయవే!
ఘనమగు పంచకృష్టిపయిఁ గాంతిద సూర్యుఁడు వెల్గు నట్లుగా
ధనమును దీప్తివంతమయి తద్దయు వెల్గదె! మాకు నిచ్చుటన్ ॥ 26

(11, సీ॥ శత్రు విచ్ఛేదికా ! సంస్తవయోగ్యుఁడా ! స్తవము గోరెడువాడ ! శరణు ! శరణు !
12,13) సర్వభూతజ్ఞుఁడా ! సర్వసుఖప్రదా ! శక్తిపుత్త్రప్రదా ! శరణు ! శరణు !
స్తోతల కేవేళ దుష్టి నిచ్చెడు వాఁడ ! సంజాతుఁడా ! యగ్ని ! శరణు ! శరణు !
భృత్యుల కన్నము నిచ్చుచుండెడి వాఁడ ! సన్నుతోద్దేశుఁడా ! శరణు ! శరణు !
గీ॥ యజ్ఞకర్తల కేవేళ నశ్వధనము, నిచ్చు వారల మతి మ మ్మహీనదేశ
మునకుఁ బంపిన ననలుఁడా! ఘనములైన, మంత్రములు[1] స్తుతియొనర్పమే! మాన్య! నిన్ను ॥ 27

## సూక్తమ్—3

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఆప్రీ (1-ఇధ్మః సమిద్ధోఽగ్నిర్వా, 2-నరాశంసః, 3-ఇళః,

4-బర్హిః, 5-దేవీర్ద్వారః, 6-ఉషాసానక్తా, 7-దైవ్యాహోతారా ప్రచేతసౌ,

8-తిస్రోదేవ్యః సరస్వతీళాభారత్యః, 9-త్వష్టా, 10-వనస్పతిః, 11-స్వాహాకృతయః†)

ఛందః—త్రిష్టుప్; 7-జగతీ

(1) సమిద్ధో[1] అగ్నిర్నిహితః పృథివ్యాం ప్రత్యఙ్ విశ్వాని భువనాన్యస్థాత్ ।

హోతా పావకః ప్రదివః సుమేధా దేవో దేవాన్ యజత్వగ్నిరర్హన్ ॥ 30

1. ఇక్కడఁ బంచలఘుగణ మింద్రగణమునకుమారుగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ.

* ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును. వ.గో.కృ.

† సంస్కృతమూలము ద్వితీయ మండలములోని మూఁడవ సూక్తమునకు సామాన్యముగా "ఆప్రీ" దేవతగాఁ బేర్కొనఁబడినది. కాని విభిన్న ఋక్కులకుఁగొన్ని ప్రతులలో వివిధ దేవతలు బేర్కొనఁబడిరి. ప్రథమ మండలములోని 142వ సూక్తమునకు సైతము కొన్నిప్రతులలో "ఆప్రి" దేవతగాఁ బేర్కొనఁబడి వివిధ ఋక్కులకు విభిన్నదేవతలు బేర్కొనఁబడిరి. ఇదే విధముగా "విశ్వేదేవతలు" కొన్ని సూక్తములకు," ఆదిత్యులు" కొన్ని సూక్తములకు, "వసువులు" కొన్ని సూక్తములకు విభిన్నదేవతలుగాఁ బేర్కొనఁబడిరి. విశ్వేదేవతల గురించి, ఆదిత్యుల గురించి, వసువులగురించి వివిధ సంఖ్యలకు పరిమితమైన దేవతలుగాఁ బ్రాచీనులు పేర్కొనుట జరిగినది. ద్వాదశాదిత్య లన్నది వాస్తవికమే అయినను మిగిలినవాని సంఖ్యావిశేషాదుల గురించి స్వరూప స్వభావాదుల గురించి మహర్షుల విజ్ఞానము దృష్ట్యా బహుముఖమైన పరిశోధనలు చేయవలసియున్నది. వీనిని గురించి మరికొన్ని విషయములకై పీఠిక చూఁడుఁడు వ.గో.కృ.

1. సమిద్ధోఽఅగ్ని. (బ్రా.ప్ర.)

(2) నరాశంసః ప్రతి ధామాన్యఞ్జన్ తిస్రో దివః ప్రతి మహ్నా స్వర్చిః ।

ఘృతప్రుషా మనసా హవ్యమున్దన్ మూర్ధన్ యజ్ఞస్య సమనక్తు దేవాన్ ॥ 31

(3) ఈళితో[1] అగ్నే మనసా నో[2] అర్హన్ దేవాన్ యక్షి మానుషాత్ పూర్వో[3] అద్య ।

స[4] ఆ వహ మరుతాం శర్ధో[5] అచ్యుతమిన్ద్రం నరో బర్హిషదం యజధ్వమ్ ॥ 32

(4) దేవ బర్హిర్వర్ధమానం సువీరం స్తీర్ణం రాయే సుభరం వేద్యస్యామ్ ।

ఘృతేనాక్తం వసవః[6] సీదతేదం విశ్వే దేవా[7] ఆదిత్యా యజ్ఞియాసః ॥ 33

(5) వి శ్రయన్తాముర్వియా హూయమానా ద్వారో దేవీః సుప్రాయణా నమోభిః ।

వ్యచస్వతీర్వి ప్రథన్తామజుర్యా వర్ణం పునానా యశసం సువీరమ్ ॥ 34

(6) సాధ్వపాంసి సనతా న[8] ఉక్షితే ఉషాసానక్తా వయ్యేవ రణ్వితే ।

తన్తుం తతం సంవయన్తీ సమీచీ యజ్ఞస్య పేశః సుదుఘే పయస్వతీ ॥ 35

1. ఈళితోఽగ్నే, 2. నోఽర్హన్, 3. పూర్వోఽద్య, 4. సఽఆ, 5. శర్ధోఽచ్యుత,(ప్రా.ప్ర.) 6. వసవః-అని ఋక్పా. వసవ-అని పదవిభజన పాఠము (సా.) 7. దేవాఽఆదిత్యా, 8. నఽఉక్షితేఽఉషా. (ప్రా. ప్ర.)

(7) దైవ్యా హోతారా ప్రథమా విదుష్టర[1] ఋజు యక్షతః సమృచా వపుష్టరా ।
దేవాన్ యజన్తావృతుథా సమఞ్జతో నాభా పృథివ్యా[2] అధి సానుషు త్రిషు ॥ 36

(8) సరస్వతీ సాధయన్తీ ధియం న[3] ఇళా దేవీ భారతీ విశ్వతూర్తిః ।
తిస్రో దేవీః స్వధయా బర్హిరేదమచ్ఛిద్రం పాన్తు శరణం నిషద్య ॥ 37

(9) పిశఙ్గరూపః సుభరో వయోధాః శ్రుష్టీ వీరో జాయతే దేవకామః ।
ప్రజాం త్వష్టా వి ష్యతు నాభిమస్మే[4] అథా దేవానామప్యేతు పాథః ॥ 38

(10) వనస్పతిరవసృజన్నుప స్థాదగ్నిర్హవిః సూదయాతి ప్ర ధీభిః ।
త్రిధా సమక్తం నయతు ప్రజానన్ దేవేభ్యో దైవ్యః శమితోప హవ్యమ్ ॥ 39

(11) ఘృతం మిమిక్షే ఘృతమస్య యోనిర్ఘృతే శ్రితో ఘృతమ్వస్య ధామ ।
అనుష్వధమా వహ మాదయస్వ స్వాహాకృతం వృషభ వక్షి హవ్యమ్ ॥ 40

1. విదుష్టరఽఋజు, 2. పృథివ్యాఽఅధి, 3. నఽఇళా, 4. నాభిమస్మేఽఅథా. (ప్రా.ప్ర.)

## సూక్తము—3

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత అగ్ని *

(1) గీ॥ యజ్ఞవేదిపైని నలరించు విధమున, నల సమిద్ధనామకాగ్ని యఖిల
భువనసీమలందు భాసిల్లు చభిముఖ, ముగ వసించుచుండి తగ వెలుఁగుత! ॥ 28

గీ॥ అఖిలశక్తి విభూషి యఖిలహోమ, కారకుఁడు పావనకరుండు కాంతియుతుఁడు
ద్యోతమాన శరీరుండు దూత యగ్ని, సురలకుం దాను బూజ లిచ్చుతను ! ప్రీతి ॥ 29

(2) గీ॥ ఆ నరాశంసనామకుం డనెడు వహ్ని, సుందరశిఖావిశిష్టుఁడై చోద్య మైన
మహిమ వ్యాపింపఁ జేయుచు మహితవర్ష, మూలమున హవ్య మందించి ముదితుఁడగుత! ॥ 30

(3) గీ॥ ఇలిత నామక వహ్ని ! యీ యిలనుగల్గు, మాపయిం బ్రేమఁ జూపుచు నోపి చాలఁ
గర్మయోగ్యుఁడవయి దేవకర్మ లన్ని, జరుగు నట్టులు సేయుము! జగమునందు ॥ 31

గీ॥ మా నిమిత్తము పావక! మానవాళి, కంటెఁ బూర్వమె జన్మముఁ గాంచినావు
మారుతంబును నింద్రుని మానవులను, బిలిచికొనివచ్చి కుశలపై వెలయఁజేయు ! ॥ 32

(4) గీ॥ అమల ! బర్హిస్స్వరూప ! యో యగ్నిదేవ !, ధనము నొసఁగుటకయి మాకు ధరను వెల్గు
వేదిపైఁ బూర్ణ తనువుతో విస్తృతుండ, వగుచు వర్ధిల్లుమా ! నీవు యజ్ఞములను ॥ 33

గీ॥ విశ్వదేవగణమ ! వెలయు నాదిత్యులు!, వసుగణంబ ! మీకు నెసఁగ మెసఁగఁ
గుశలు ఘృతముతోడఁ గూర్చిరి మానవుల్, విశ్రమింప రారె! వేదిపైని ॥ 34

† ఋషి విశేషవిషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

* ద్వితీయమండలములోని 3వ సూక్తమునకు దేవత సంస్కృత మూలములో "అగ్రి" దేవత సామాన్యముగాఁ జెప్పఁబడినను వివిధ ఋక్కుల క్రింది విధముగా దేవతలు పేర్కొనఁబడిరి. 1. ఇధ్మః సమిద్ధోగ్నిర్వా. 2. నరాశంసః 3. ఇళః 4. బర్హిః 5. దేవీర్ద్వారః 6. ఉషాసానక్తా 7. దైవ్యౌ హోతారౌ ప్రచేతసౌ 8. తిస్రో దేవ్యః సరస్వతీ ఇళా భారత్యః, 9. త్వష్టా 10. వనస్పతిః, 11. స్వాహాకృతాయః. దేవతల విషయమై యీ ఆంధ్రానువాదమున ద్వితీయ మండలము (వ్రాతప్రతి. 2వ. సంపుటము. 241వ. పుట)లో "అగ్ని" యని వ్రాయఁబడినను శ్రీనేమానివారు స్వయముగా వ్రాసిన ఋషి దేవతల పట్టిక గల 15. b సంపుటములో "అగ్రి" అని దేవతను సామాన్యముగా వ్రాసిరి. వివిధ దేవతలను పేర్కొన లేదు. కాని యాంధ్రానువాదపద్యములలో నాయాదేవత లుటంకింపఁబడిరి. ఈ దేవతల విశేషవిషయములకై సంస్కృతమూలము ద్వితీయ మండలములోని 3వ. సూక్తము క్రింది (665వ.పుట) ఫుట్‌నోటు చదువుకొన నగును. వ.గో.కృ.

(5) గీ॥ చక్కఁగా ద్వారదేశము లొక్కమారె,మిగుల నుద్ఘాటితంబులై మెఱయుచుండు
హవ్య మిచ్చెడి వేళల నతిశయించి,వానిఁ దరియింపఁ జను యజమానగణము ॥ 35

గీ॥ వర్ణనీయ స్వరూపులు వ్యాప్తిమంతు,లుచ్చకీర్తులు గలవార లుచితము లగు
ద్వారదేశము లన్నిటఁ దగినయట్టి, ప్రతిభఁ గనెదరుగాక! సంభ్రమ మెసంగ ॥ 36

(6) గీ॥ పావనంబులు సకలవిశ్వప్రశస్థ,యజ్ఞకర్మఫలంబుల నమరఁజేసి
కల్యములు శీఘ్రముగ సాగుఁ గడకు ఘనినిఁ, గదలి పోయెడి పక్షుల గణము పగిది ॥ 37

క॥ గమనాగమనంబులతో, విమలంబుగ నగ్నిఁ జేసి వెలయు నుషస్సుల్
కమనీయ ఫలము లిచ్చుచు, విమలము లగు జలముతోడ వెలయుచు నుండున్ ॥ 38

(7) గీ॥ దైవహోతృద్వయం బతితత్త్వవేది,విపుల దేహవిశిష్టమై వెలయుచుండి
మంత్రములతోడఁ బూజల మాన్యదేవ!, గణము ముందఱ యాగంబు గణనఁ జేయు! ॥ 39

(8) క॥ అమలవ్యాప్తసరస్వతి, విమలేలాభారతులును వివిదేష్టులకున్
గమనీయహవ్యమును గొనఁ, గ్రమముగ విచ్చేసి సవన కర్మలఁ గనుతన్! ॥ 40

(9) గీ॥ సవనకర్మలెల్లఁ జక్కఁబెట్టెడి వాఁడు, క్షిప్రకారి దేవ చింతితుండు
వీరపుత్త్రుఁడగుచు వెలసెడు నా యగ్ని. త్వష్ట్ర దయను బుట్టె ధరణియందు ॥ 41

గీ॥ కులము రక్షించు సంతతిఁ గూర్చ మాకు, దేవగణముల మన్నించి తెచ్చుటకయి
త్వష్టఁడా! క్షిప్రగతితోడ దరికి వచ్చి, మమ్ము సంతుష్టిఁ బొందించి మఱియుఁ బొమ్ము! ॥ 42

(10) చ॥ అనలుఁడు భిన్నరూపమున హవ్యము నంతయు భక్ష్యయోగ్యమై
తనరెడు న ట్లొనర్చి కడు ధన్యత నొందె వనస్పతీ!కడుం
బనిగొని నీవు కర్మలను భావమునం దలపోసి యుష్టిలో
ననిమిషు లెల్ల మెచ్చ నభయంబు నొసంగవె! మాకుఁ బ్రీతిమై ॥ 43

గీ॥ దైవ శమిత యనెడు దహనుండ! త్రివిధంపు, సించనములచేత సిక్తమైన
హవ్య మధిగమించి యమరులకై దాని, నొందఁజేయుమయ్య! యమరదూత! ॥ 44

(11) క॥ ఘృతమున నగ్నిం దడిపెద, ఘృతమే యుత్పత్తి భూమి ఘృతకామునకున్
ఘృత మాశ్రయమై వెలుఁగును, ఘృతమే విస్తారదీప్తి గీర్వాణునకున్ ॥ 45

గీ॥ కామదా! యగ్నిదేవుఁడ! గ్రాలు హవ్య, మిచ్చు సమయంబునం దీవు మెచ్చఁదగిన
దేవగణమును బిలుచుచుఁ దివిరి వారి, శమిత తుష్టిని గలిగించుమా! విధాన ॥ 46

## సూక్తమ్—4

ఋషిః—సోమాహుతిర్భార్గవః

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) హువేవః సుద్యోత్మానం సువృక్తిం విశామగ్నిమతిథిం సుప్రయసమ్ ।
మిత్ర[1] ఇవ యో దిధిషాయ్యో భూద్ దేవ[2] ఆదేవే జనే జాతవేదాః ॥ 41

(2) ఇమం విధన్తో[3] అపాం సధస్థే ద్వితాదధుర్భృగవో [4]విక్ష్వాయోః ।
ఏష విశ్వాన్యభ్యస్తు భూమా దేవానామగ్నిరరతిర్జీరాశ్వః ॥ 42

(3) అగ్నిం దేవాసో మానుషీషు విక్షు ప్రియం[5]ధుః క్షేష్యన్తో న మిత్రమ్ ।
స దీదయదుశతీరూర్మ్యా[6] ఆ దక్షాయ్యో యో దాస్వతే దమ[7] ఆ ॥ 43

(4) అస్య రణ్వా స్వస్యేవ పుష్టిః సందృష్టిరస్య హియానస్య దక్షోః ।
వి యో భరిభ్రదోషధీషు జిహ్వామత్యో న రథ్యో దోధవీతి వారాన్ ॥ 44

1. మిత్రఽఇవ, 2. దేవఽఆదేవే, 3. విధన్తోఽఅపాం, 4. విక్ష్వాఽయోః, 5. ప్రియదుః, 6. ఊర్మ్యాఽఆ, 7. దమఽఆ. (వ్యా.ప్ర.)

(5) ఆ యన్మే[1] అభ్వం వనదః పనన్తోశిగ్భ్యో నామిమీత వర్ణమ్ ।

స చిత్రేణ చికితే రంసు భాసా [2]జుజుర్వాగ్ం యో ముహురా యువా భూత్ ॥ 45

(6) ఆ యో వనా తాతృషాణో న భాతి వార్ణ పథా రథ్యేవ స్వానీత్ ।

కృష్ణాధ్వా తపూ రణ్వశ్చికేత ద్యౌరివ స్మయమానో నభోభిః ॥ 46

(7) స యో వ్యస్థాదభి దక్షదుర్వీం[3] పశుర్నైతి స్వయురగోపాః ।

అగ్నిః శోచిష్మాగ్ం[4] అతసాన్యుష్ణన్ కృష్ణవ్యథిరస్వదయన్న భూమ ॥ 47

(8) నూ తే పూర్వస్యావసో[5] అధీతౌ తృతీయే విదథే మన్మ శంసి ।

అస్మే[6] అగ్నే సంయద్వీరం బృహన్తం క్షుమన్తం వాజం స్వపత్యం రయిం దాః ॥ 48

(9) త్వయా యథా గృత్సమదాసో[7] అగ్నే గుహా వన్వన్త ఉపరాగ్ం అభి ష్యుః ।

సువీరాసో [8]అభిమాతిషాహః స్మత్ సూరిభ్యో గృణతే తద్ వయో దాః ॥ 49

---

1. మేఽభ్వం, (వ్రా.ప్ర.) 2. జుజుగ్ంర్వా, (వ్రా.ప్ర.సా.మా.) 3. దుర్వీ, 4. శోచిష్మాగ్ంఽత, 5. వసోఽదీతౌ, 6. అస్మేఽగ్నే, 7. సోఽగ్నేగుహా వన్వన్తఽఉపరాగ్ంఽభి, 8. సువీరాసోఽభి, (వ్రా.ప్ర.)

## సూక్తము—4

### ఋషి—భృగుకుమారుఁడు సోమాహుతి

### దేవత—అగ్ని

(1) గీ॥ పాప వర్జితుండు పరమ దీప్తి యుతుండు,హవ్య వహుఁడు నరుల కతిథియైన
నగ్నిహోతృఁ బిలుతు నతిభక్తియజమాన,గణముకొఱకు భక్తగణముకొఱకు ॥ 47

గీ॥ మానవాదిదేవ మాన్యుల పర్యంత,ముండునట్టి సకల మొందువాఁడు
సర్వభూతవేది, సర్వార్థసిద్ధిదుఁ,డై నయట్టి యగ్ని నాశ్రయింతు ॥ 48

(2) చ॥ అనలునకున్ సపర్యలను నందఁగఁ జేసి నభస్థలంబునన్
మనుజ సుసంతతిప్రకరమధ్యను వానిని నుండఁ జేయుచో
ఘనభృగులార: మీరు కడుఁ గాంతిఁ దలిర్పఁగ సర్వశత్రులన్
దునుము సతండు దేవగణదూతుఁడు సత్వర మార్గగామియై ॥ 49

(3) చ॥ దివమున కేగు కాలమున దేవత లందఱు వహ్నిదేవు సం
స్తవమతి మర్త్యమధ్యమున స్థాపనఁ జేయుదు రట్టి యగ్నినిన్
జవమునఁ బట్టి యాజ్ఞికులు చారు గృహంబుల నుంతు రాతఁడున్
వివిధగతిన్ వెలింగెడును విస్తృత తేజముతోడ రాత్రులన్ ॥ 50

(4) చ॥ స్ఫటికము రంగుఁ బోలి కడుఁ జక్కని దాహకదేహపుష్టి వి
స్ఫుటతర మౌట నర్చిశలఁ బూర్ణముగాఁ జెలరేగుచుంటఁ బ్రా
కటతర మౌచు సుందరముగా విలసిల్లును వాజి పుచ్ఛమున్
బటుతరశక్తిఁ ద్రిప్పు నటు పావకుఁ డెంతయుఁ ద్రిప్పుఁ గీలలన్ ॥ 51

(5) గీ॥ మాకు సహాయోగు లైనట్టి మాన్యు లెల్ల,రగ్ని నుతియించుచుండెద రతఁడు రుష్ట
ఋత్విజుల ముందు నిజకాంతి వృద్ధిఁ బొంది,వెలుఁగుచుండెడుఁ బ్రీతితో వివిధగతుల ॥ 52

క॥ రమణీయ హవ్యమునకై, కమనీయ గభస్తి మాల గ్రాలెడు నగ్ని
క్రమముగ జీర్ణం డైనను,సముచితముగ యువకుఁ డగుచుఁ జక్క వెలుఁగఁ దే ! ॥ 53

(6,7) సీ॥ తృషితమృగ్గంబు మాడ్కిఁ ఘోరంపు వనముల నగ్రంబు గాపించు వహ్ని యెవఁడొ!
తోయము వంటివి తొలఁగుచు నిటు నటు గమనంబుఁ జేసెడు ఘనుఁ డెవండొ!
యరదంబు లాగెడు నశ్వంబులై వడి ద్రుతంబుఁ జేసెడి కెంధ్యుఁ డెవఁడొ!
సుందర ద్యోలోక శోభఁ దోరెడు శోభఁ బొందుచు వెలిఁగెడు భ్రాజ్యుఁ డెవఁడొ!
గీ॥ అట్టి రమణీయు పావకుఁ డఖిలమందు వ్యాప్తి గని పొందురుసు లీల వలసినట్లు
గమనమునుఁ జేసి చెట్లను గాల్చి వానినారముల నెల్ల గ్రహియింపఁడే! రయమున ॥ 54

(8) గీ॥ మొదటి సవనంబుతో నీవు మోద మలరఁ గరము రక్షించితివి మమ్ముఁగాన నిప్పుడు
కూడ నుతియించెదము వహ్ని! కూర్చు! మాకు సుందరాపత్యధనము లస్తోకముగను! ॥ 55

(9) చ॥ అనలుఁడు రక్షకుం డగుచు నంతట నుండఁగఁ బ్రీతి యుక్తులై
వినయము గల్గు గృత్సమద విశ్రుత మౌనులు మంత్ర జాలముల్
బనిఁగొని పాడి శ్రేష్ఠ మగు ధవ్యగుహన్ పిలిచిల్లు వి త్తమున్
ఘను లగు పుత్రులం గనుచుఁ గారియఁ బెట్టెద రెల్ల శత్రులన్ ॥ 56

†క అతిబుద్ధిమంతులకు మతి, సతతము యజనములఁ జేయ సాగు నరులకున్
వితత మగు నన్న మొసఁగుచు, మతిమంతుఁడ! యగ్నిదేవ! మానుగఁ జనుమా! ॥ 57

## సూక్తమ్—5

ఋషిః—సోమాహుతిర్భార్గవః

దేవతా—అగ్నిః

ఛందః—అనుష్టుప్

(1) హోతాజనిష్ట చేతనః పితా పితృభ్య[1] ఊతయే ।

ప్రయక్షన్జేన్యం వసు శకేమ వాజినో యమమ్ ॥ 58

‡ ఇక్కడ వ్రాతప్రతిలో "గ్రహియింప" అని సలమును బ్రయోగింపఁగలిఁగియుండియు (వ్రాతప్రతి-2వ సంపుటము 247వ పుట.) "గ్రహింపఁదేరయమున" అని యింద్రగణమునకు మారుగా "జ" గణము ప్రయుక్తమైనట్లు పాఠమున్నది.

† ఆంధ్రానువాదము వ్రాతప్రతిలో (2వ.సంపుటము. 247వ. పుట) ద్వితీయమండలము 4వ సూక్తమునఁ బది ఋక్కు లున్నట్లుగా ననువాదముతోసహా వ్రాయఁబడినది. చిట్టచివరి పద్యమగు "అతిబుద్ధిమంతులకు మతి" ఇత్యాది కందము 10వ ఋక్కుగాఁ బొరపాటున వ్రాయఁబడినది. సంస్కృతమూల ప్రతులలో 9 ఋక్కులే కలవు. 10వఋక్కున కనువాదపద్యముగాఁ బేర్కొనఁబడినపద్యము 9వ ఋక్కులోని యుత్తరార్ధమున కనువాదపద్యము. వ.గో.కృ.

1. పితృభ్యఽఊతయే. (వ్రా.ప్ర,)

(2) ఆ యస్మిన్ త్సప్త రశ్మయస్తతా యజ్ఞస్య నేతరి ।

మనుష్వద్ దైవ్యమష్టమం పోతా విశ్వం తదిన్వతి ॥ 51

(3) దధన్వే వా యదీమను వోచద్ బ్రహ్మాణి వేరు తత్ ।

పరి విశ్వాని కావ్యా నేమిశ్చక్రమివాభవత్ ॥ 52

(4) సాకం హి శుచినా శుచిః ప్రశాస్తా క్రతునాజని ।

విద్వాగ్ం[1] అస్య వ్రతా ధ్రువా వయా[2] ఇవాను రోహతే ॥ 5

(5) తా[3] అస్య వర్ణమాయువో నేష్టుః సచన్త ధేనవః ।

కువిత్ తిసృభ్య[4] ఆ వరం స్వసారో యా[5] ఇదం యయుః ॥ 54

(6) యదీ మాతురుప స్వసా ఘృతం భరన్త్యస్థిత ।

తాసామధ్వర్యురాగతౌ యవో వృష్టీవ మోదతే ॥ 55

1. వాగ్ంఽఅస్య, 2. వయాఽఇవా, 3. తాఽఅస్య, 4. తిసృభ్యఽఆ, 5. యాఽఇదం. (వ్రా.ప్ర.)

(7) స్వః స్వాయ ధాయసే కృణుతామృత్విగృత్విజమ్ ।

స్తోమం యజ్ఞం చాదరం వనేమా రరిమా వయమ్ ॥ 56

(8) యథా విద్వాగ్ం[1] అరం కరద్ విశ్వేభ్యో యజతేభ్యః ।

అయమగ్నే త్వే[2] అపి యం యజ్ఞం చకృమా వయమ్ ॥ 57

## సూక్తము—౫

ఋషి—సోమాహుతి

దేవత—అగ్ని

(1) క॥ పితృగణరక్షాబద్ధంబై, మతిగల హోతయు విశేషమాన్యుఁడు పితయున్
దత మగు ధన లాభంబున్,సతతముఁ గలిగింపఁ దాముఁ జాలుదురు గదా! ॥ 58

(2) గీ॥ సవననేత యగ్ని సప్తరశ్మల నెల్ల, విస్తృతములు గాఁగ వెలయఁ జేయు
దేవపోతృసదృశదివిజదూతుఁడు పోత, యగును నష్టముండు యజ్ఞమందు ॥ 59

(3) గీ॥ ఎవఁడు హవ్యము వహియించు నిష్ఠియందు, నెవ్వఁడు మంత్రములం జపియించు మిగుల
నట్టి సర్వమనీషల నాదరించి,యగ్ని దయతోడఁ జూడఁడె? యతిశయముగ ॥ 60

గీ॥ చక్రనేమి యెట్లు చక్రమున్ వ్యాపింపఁ, జేయు నట్టు లగ్ని! చేయు నరుల
కర్మజాలమెల్లఁ, గావున నవ్వాని,మహిత మహిమ పొగడ మాకు వశమె! ॥ 61

(4) చ॥ ఘనుఁడు ప్రశస్తపుణ్యకరకర్మముతో జనియించి లోక మె
ల్లను నొక శాఖ వీడుచుఁ దొలంగక వే రొక శాఖ పండ్లకై
పనిఁగొని చూచి నట్టులు విభాసుర యాగములోన సత్క్రియల్
వినయముతోడ నొక్కొకటి వేగ మొనర్చుచు నుండు నాత్రతోన్ ॥ 62

---

1. వాగ్ంఽఅరం, 2. త్వేఽఅపి. (ప్రా.ప్ర.)

(5) గద్యము॥ ఈ యజ్ఞమునకు వచ్చిన ముగ్గురు స్వనలకంటె శ్రేష్ఠములయి శీఘ్రగమన
విద్యుత్తువలె వేగము గల ధేనువులు నేష్టయొక్క పర్ణముచే నాకర్షింపఁబడినవి ॥ 63

(6) గీ॥ ఇష్టిభూమికడకు నెప్పుడు స్వన ఘృత, మందఁజేయుచుండు నప్పుడె యగ్ని
తుష్టి నొందుచుండుఁ దొలకరి వానకు. యవలు చాలఁ† దుష్టి నందునట్లు ॥ 64

(7) క॥ అనలుఁడె ఋత్విక్కర్మల, ఘనముగఁ దాఁ జేయుచుండు ఘనసంతుష్టిన్
బనిఁబూని మేము నుతులన్, వినయమునన్ యజ్ఞమందు వివరింతు మొగిన్ ॥ 65

(8) గీ॥ తావకీన మహిమ తద్దయుఁ దెలిసిన, కవి సమస్తదేవగణముఁ దృప్తిఁ
జేయునట్లు మేము సేయుచు జన్నంబు,నర్పణం బొసగుదు మనల ! నీకు ॥ 66

సూక్తమ్—6

ఋషిః—సోమాహుతిర్భార్గవః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ

(1) ఇమాం మే[1] అగ్నే సమిధమిమాముపసదం వనేః ।

ఇమా[2] ఉ షు శ్రుధీ గిరః ॥ 58

† యవలు చాలఁదుష్టి నందునట్లు:-ఇట్టి యుపమానోపమేయములవలన నార్యులకు వ్యవసాయ మందెంత ప్రేమాతిశయము గలదో తెలియుచున్నది. వేదమునం దచ్చటచ్చటఁగల యిట్టి యంశములు దిలకించినచో నార్యు లెంతటి కృషిశాస్త్రము గలవారో యని యాశ్చర్యము గలుఁగుచున్నది. అఱక, ఎద్దులు, నాగళ్ళు, పైరు కోతలు. చేనిమంచెలు మొదలగు కృషికి సంబంధించినవి వర్ణింపఁబడినవి. (నే.వేం.న.శా.)

1. మేఽఅగ్నే, 2. ఇమాఽఉ షు, (వ్రా.ప్ర.)

(2) అయా తే[1] అగ్నే విధేమోర్జో నపాదశ్వమిష్టే ।
ఏనా సూక్తేన సుజాత ॥ 59

(3) తం త్వా గీర్భిర్గిర్వణసం ద్రవిణస్యుం ద్రవిణోదః ।
సపర్యేమ సపర్యవః ॥ 60

(4) స బోధి సూరిర్మఘవా వసుపతే వసుదావన్ ।
యుయోధ్యస్మద్ ద్వేషాంసి ॥ 61

(5) స నో వృష్టిం దివస్పరి స నో వాజమనర్వాణమ్ ।
స నః సహస్రిణీరిషః ॥ 62

(6) ఈళానాయావస్యవే యవిష్ఠ దూత నో గిరా ।
యజిష్ఠ హోతరా గహి ॥ 63

1. తేఽఅగ్నే. (వా.ప్ర.)

(7) అన్తర్హ్యగ్నే[1] ఈయసే విద్వాన్ జన్మోభయా కవే ।

దూతో జన్యేవ మిత్ర్యః ॥ 64

(8) స విద్వాగ్ం[2] ఆ చ పిప్రయో యక్షి చికిత్వ[3] ఆనుషక్ ।

ఆ చాస్మిన్[4] త్సత్సి బర్హిషి ॥ 65

సూక్తము—6

ఋషి—సోమాహుతి

దేవత- అగ్ని

(1,2) క॥ సమిదాహుతులన్ నుతులను, గ్రమముగ సర్పింతు నీకు ఘనుఁడ! సపర్యా
క్రమమున సంస్తుతివలనన్. సమముగఁ బ్రీతునిగఁ జేయఁ జాలుదును నినున్ ॥ 67

(3) క॥ ధనధాతా! స్తుతి యోగ్యా!, యనలా! పరిచారకుండ నపుటన్ నీకున్
వినతి నుతి పూర్వకంబుగ, ఘన మగు పరిచర్య సలిపి గ్రాలుదు నెపుడున్ ॥ 68

(4) గీ॥ అనల! నీకుఁ జాల నన్న ధనంబులు,కలవు విద్య కూడఁ గలదుగాన
జాగరితుఁడ వగుచు శత్రువులను నెల్ల,దూరదేశమునకుఁ ద్రోలవయ్య! ॥ 69

(5) గీ॥ అనలుఁడా! నీవు మాకయి యంతరిక్ష.తలమునందుండి, వృష్టి నెంతయు నొసంగు
చుఁడ నల్పబలంబును వీఁక మంచి,యన్న మపరిమితంబుగ నంద సమ్ము ॥ 70

(6) క॥ తరుణతమ దేవదూతా,! విరివిగ మా సంస్తవముల వీనుల విని వేఁ
గర మనురక్తిని రాఁగదె!, నిరతము నిను నాశ్రయింప నేరమె? చెపుమా! ॥ 71

1. అన్తర్హ్యగ్నఈ. 2. వాగ్ంఆ. 3. చికిత్వఆనుషక్. 4. ఆ చాస్మిత్సత్సిబర్హిషి. (ప్రా. ప్ర.)

(7) క॥ మనుజుల హృదయ మెఱుంగుదు, వనలా! నీ యుభయరూప మగు జన్మంబుం
గనుఁగొనుచు మేము నిరతము, నినుఁ బూజించెదముగాన నీ వొగి రమ్మా! ॥ 72

(8) క॥ నీవు విద్వాంసుఁడవు కాన నియత కామ,సంబులన్ దీర్పఁ గుశలపై డంబు మీర
విక్రమించుచుఁ బ్రీతి నో వేడివేల్పు!, సక్రమంబుగ జరిపించు సవనములను ॥ 73

## సూక్తమ్—7

ఋషిః—సోమాహుతిర్భార్గవః

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ

(1) శ్రేష్ఠం యవిష్ఠ భారతాऽగ్నే ద్యుమన్తమా భర ।

వసో పురుస్పృహం రయిమ్ ॥ 66

(2) మా నో[1] అరాతిరీశత దేవస్య మర్త్యస్యచ ।

పర్షి తస్యా[2] ఉత ద్విషః ॥ 67

(3) విశ్వా[3] ఉత త్వయా వయం ధారా[4] ఉదన్యా ఇవ ।

అతి గాహేమహి ద్విషః ॥ 68

1. మానోऽఅరా, 2. తస్యాऽఉత. 3 విశ్వాऽఉత, 4. ధారాऽఉదన్యాऽఇవ, (వ్రా.ప్ర.)

(4) శుచిః పావక వన్ద్యో ऽగ్నే బృహద్ వి రోచసే ।

త్వం ఘృతేభిరాహుతః ॥ 69

(5) త్వం [1]నో అసి భారతాऽగ్నే వశాభిరుక్షభిః ।

అష్టాపదీభిరాహుతః ॥ 70

(6) ద్ర్వన్నః సర్పిరాసుతిః ప్రత్నో హోతా వరేణ్యః ।

సహసస్పుత్రో[2] అద్భుతః ॥ 71

సూక్తము—7

ఋషి—సోమాహుతి

దేవత—అగ్ని

(1,2,3,4) సీ॥ భారతుఁడా ! నీవు బహు లోక వాంఛిత ధనమును కొనితెచ్చి దాని నీయు
మఖిల సన్మాన్యః యో యగ్ని దేవా: నీవు: ద్వివిధశత్రువులను వెడలఁ గొట్టు
మనలుఁడా: జలధారి నాక్రమించినయట్టు లరి మండలంబుల నాక్రమింపు
మష్టాపదులవల్ల నాహ్వాన మందుచు వేడివేల్పా: నీవు వెలుఁగుచుంటి
గీ॥ పందనీయుండ వగుదువు పావకుండ:, ఘృతము మూలంబునన్ వహ్ని యతిశయించి
దీప్తివంతుండ వగుదువు దివ్యతేజ:, యగ్ని: నీవు మహాత్ముఁడ వౌదు కాదె: ॥ 74

1. నోऽసి, 2. పుత్రోऽద్భుతః, (ప్రా.ప్ర.)

(5) గీ॥ భారతాగ్ని నీవు వంద్యగోప్తవు నీవు, వృషభ మవుదు నీవు వృద్ధిఁబొంది
చాలు గల్గు నావు శోభ నందుచు సర్వ,హూయమానుఁ డవుదు వుర్విలోన॥ 75

(6) గీ॥ సర్వ సిక్త మగుచు సామాన్నమున్ గల్గు, హోమములనుఁ జేసి నీమ మలర
శక్తిసుతుఁడ వౌచుఁ జరియించుచున్ గొప్ప, యగ్ని! వెలుఁగుచుండు సధిక శోభ॥ 76

## సూక్తమ్—8

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—అగ్నిః

ఛందః—గాయత్రీ, అనుష్టుప్

(1) వాజ[1]యన్నివ ను రథాన్ యోగాగ్ం[2] అగ్నేరుప స్తుహి ।

యశస్తమస [3]మీళ్హుషః ॥ 72

(2) యః సునీథో దదాశుషే అజుర్యో జరయన్నరిం ।

చారుప్రతీక[4] ఆహుతః ॥ 73

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడుఁడది. వ.గో.శ్ర.

1. వాజాయ, 2. యోగాగ్ంఇతిఅగ్నేః, 3. మీళహుషః, 4. ప్రతీకఇతిఆహూతః, (వా.ప్ర.)

(3) య[1] ఉ శ్రియా దమేష్వా దోషోషసి ప్రశస్యతే।

యస్య వ్రతం న మీయతే ॥ 74

(4) ఆ యః స్వర్ణ భానునా చిత్రో విభాత్యర్చిషా ।

అఞ్జానో[2] అజరైరభి ॥ 75

(5) అత్రిమను స్వరాజ్యమగ్నిముక్థాని వావృధుః ।

విశ్వా[3] అధి శ్రియో దధే ॥ 76

(6) అగ్నేరిన్ద్రస్య సోమస్య దేవానామూతిభిర్వయమ్ ।

అరిష్యన్తః సచేమహ్యభి ష్యామ పృతన్యతః ॥ 77

ఇతి
ద్వితీయోఽష్టకే పంచమోఽధ్యాయ
స్సమాప్తః

1. యఽఉశ్రియా, 2. అఞ్జానోఽఅజ. 3. విశ్వాఽఅధి (వ్రా.ప్ర.)

## సూక్తము—8

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—అగ్ని

(1) క॥ పర మగు నన్నముఁ గోరెడు, పురుషుని వలెఁ గీ యుక్త పుణ్యేప్సితముం
గర మిచ్చెడు నగ్ని మనో,హర హయముల సం తింతు నధికప్రీతిన్ ॥ 77

(2,3) గీ॥ అన్న మిచ్చెడి పురుషుల యరులఁ గొట్టు,నందముగలట్టి యగ్నిని నాశ్రయింతు
సుందర శిఖా విశిష్టుని స్తుత్య తనుని. వ్రతము వెలయుత ! సంతత స్తుతులఁగూడి ॥ 78

(4) చ॥ ఖరకరుఁ డెట్లు రశ్మల ప్రకాశము చేయునొ ! లోక మట్టులే
పరమ విచిత్రమూర్తి శిఖి భవ్య శిఖా సముదాయ మెంతయున్
బరపుచు నాల్గు దిక్కులకు భాసుర రశ్మి సమూహ కాంతిచేఁ
గరము వెలింగి రోదసిఁ బ్రకాశిత మౌనటు చేయుచుండెడిన్ ॥ 79

(5) గీ॥ శత్రు విచ్ఛేదనకరుండు జ్వలనమూర్తి,శోభనోద్దేశుఁడై కడు శోభ నొందు
నతఁడు సర్వము కలిఁగెడు నటులఁజేసి,లోక రక్షకరుండయి వీఁక వెలుఁగు ॥ 80

(6) గీ॥ అగ్ని నింద్రుని సోముని నాశ్రయించు,చున్నవారము కాఁబట్టి యెన్నఁడైన
మా కనిష్టంబుఁ గల్గునే లోకమందు,వైరులఁ దిరస్కరింతు నవారితముగ ॥ 81

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన
భగవత్పాదారాధక నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు ద్వితీయాష్టకమునఁ
బంచమాధ్యాయము సమాప్తము

—

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము క్రింది ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ద్వితీయం మండలమ్

ద్వితీయోఽష్టకః—షష్ఠోఽధ్యాయః

### సూక్తమ్—9

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) ని హోతా హోతృషదనే విదానస్త్వేషో దీదివాగ్ం[1] అసదత్ సుదక్షః ।

అదబ్ధవ్రతప్రమతిర్వసిష్ఠః సహస్రంభరః శుచిజిహ్వో[2] అగ్నిః ॥ 78

(2) త్వం దూతస్త్వము నః పరస్పాస్త్వం వస్య[3] ఆ వృషభ ప్రణేతా ।

అగ్నే తోకస్య నస్తనే తనూనామప్రయుచ్ఛన్ దీద్యద్ బోధి గోపాః ॥ 79

(3) విధేమ తే పరమే జన్మన్నగ్నే విధేమ స్తోమైరవరే సధస్థే ।

యస్మాద్ యోనేరుదారిథా యజే తం ప్ర త్వే హవీంషి జుహురే సమిద్ధే ॥ 80

† ఋషి విశేషవిషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడవగును. వ.గో.కృ.

1. దీదివాగ్ంఽఅస, 2. జిహ్వోఽఅగ్నిః, 3. వస్యఽఆవృషభ. (వ్రా.ప్ర.)

(4) అగ్నే యజస్వ హవిషా యజీయాన్ఛ్రుష్టీ దేష్ణమభి గృణీహి రాధః ।

త్వం హ్యసి రయిపతీ రయీణాం త్వం శుక్రస్య వచసో మనోతా ॥ 81

(5) ఉభయం తే న క్షీయతే వసవ్యం దివేదివే జాయమానస్య దస్మ ।

కృధి క్షుమన్తం జరితారమగ్నే కృధి పతిం స్వపత్యస్య రాయః ॥ 82

(6) సైనానీకేన సువిదత్రో[1] అస్మే యష్టా దేవాగ్ం ఆయజిష్ఠః స్వస్తి ।

అద[2]బ్ధో గోపా ఉత నః పరస్పా అగ్నే ద్యుమదుత రేవద్ దిదీహి ॥ 83

# శ్రీమదాంధ్ర ఋగ్వేద సంహిత

## ద్వితీయ మండలము

ద్వితీయాష్టకము—షష్ఠాధ్యాయము

సూక్తము—9

ఋషి—గృత్సమదుఁడు†

దేవత—అగ్ని

(1) ఉ॥ ధీరుఁడు హోత ప్రజ్వలిత దీప్తియుతుండు ప్రకృష్టశక్తి వి
స్తారుఁ డనుగ్రహాన్వితుఁడు ధర్మ ధురీణుఁడు జంతుమాలికా
భారము మోయు వాఁడు కడు భాసుర సద్మము లిచ్చు వాఁడు నౌ
వీరుఁడు వహ్నిహోతృగణవేశ్మములందు వసించుఁగావుతన్! ॥ 82

1. సువిద త్రోऽస్మే, 2. అదబ్ధోగోపాऽఉతనః పరస్పాऽగ్నే, (వ్యా.ప్ర.)

* ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

(2) చ॥ అనలుఁడ! మాకు దూతవయి యాపదలం బడఁగొట్టి కావుమా!
ధనమును మా కొసంగి కడు ధర్మమతిం జరియించుచుండుమా!
సునీతవీ ప్తితో వెలసి సుందర పుత్రులఁ గాచుచుండుమా!
మనమున జాగరూకతను మానక యుండుము! నీవు నెచ్చెలీ! ॥ 83

(3) †మ॥ అనలా! తావక జన్మదేశమున నీ యర్చావిధుల్ చేయుచో
జననస్థానము క్రిందనుండి పరిచర్యల్ చేయకెట్లుండు నీ
జననస్థానము పూజ్యమయ్యెడుసుమా! జ్వాజ్వల్యమానున్ నినుం
గనుఁగొన్నన్ సుహవిస్సు నీయరఁటె! నీకై యాగదీక్షాపరుల్ ॥ 84

(4) చ॥ యజనము సేయుమా! యనల! యాజ్ఞిక పూరుష మధ్యమందు నీ
భజన మొనర్చువార లగు భక్తుల కిచ్చెడు నన్నరాశులన్
సుజనులమైన మా కిడినచో ధనవంతుఁడ! విత్తమంది నీ
భజనము సేయుచుం బ్రథితభంగిని నిన్ను నుతింపకుందుమే! ॥ 85

(5) క॥ ప్రతిదినము పుట్టు నీదౌ, నతులిత ధనరాశి యంత నసమం బగుటన్
స్తుతికారి! నీవు నరులన్,సుత ధనవంతులుగఁ జేయఁ జోద్యమె? తలఁపన్ ॥ 86

(6) చ॥ లలిత శుచి స్వరూపుఁడ! దళంబులతో మముఁ జేరవచ్చి నీ
వెలమినిఁ జూఁడుమా! మముల నిష్టికరా! దివిజారినాశకా!
బలసుత! నీకు నే నరుఁడు బాధలు పెట్టఁగలండు? కావునన్
సులలితకాంతులం గలిఁగి సుందర విత్తముతోడ వెల్గుమా! ॥ 87

† ఇక్కడ వ్రాతప్రతిలోఁ (2వ సంపుటము 257వ పుట.) బ్రమాదవశమున నీ పద్యము శార్దూలముగా వ్రాయఁబడినది. వ.గో.కృ.

## సూక్తమ్—10

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—అగ్నిః

ఛందః—త్రిష్టుప్

(1) జోహూత్రో[1] అగ్నిః ప్రథమః పితేవేళస్పదే మనుషా యత్ సమిద్ధః ।

శ్రియం వసానో[2] అమృతో విచేతా మర్మృజేన్యః శ్రవస్య[3]ః స వాజీ ॥ 34

(2) శ్రూయా[4] అగ్నిశ్చిత్రభానుర్హవం మే విశ్వాభిర్గీర్భిరమృతో విచేతాః ।

శ్యావా రథం వహతో రోహితా వోతారుషాహ చక్రే విభృత్రః ॥ 35

(3) ఉత్తానాయామజనయన్ త్సుషూతం భువదగ్నిః పురుపేశాసు గర్భః ।

శిరిణాయాం చిదక్తునా మహోభిరపరీవృతో వసతి ప్రచేతాః ॥ 36

(4) జిఘర్మ్యగ్నిం హవిషా ఘృతేన ప్రతిక్షియన్తం భువనాని విశ్వా ।

పృథుం తిరశ్చా వయసా బృహన్తం వ్యచిష్ఠమన్నై రభసం దృశానం ॥ 37

* ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట.) చూడనగును. వ.గో.కృ.

1. జోహూత్రోఽఅగ్నిః, 2. వసానోఽఅమృతో, 3. శ్రవస్యఁసవాజీ, 4. శ్రూయాఽఅగ్నిశ్చిత్ర. (వ్రా.ప్ర.)

(5) ఆ విశ్వతః ప్రత్యఞ్చం జిఘర్మ్యరక్షసా మనసా తజ్జుషేత ।

మర్యశ్రీః స్పృహయద్వర్ణో అగ్నిర్నాభిమృశే తన్వా౩ జర్భురాణః ॥ 88

(6) జ్ఞేయా భాగం సహసానో వరేణ త్వాదూతా[1]సో మనువద్ వదేమ ।

అనూనమగ్నిం జుహ్వా వచస్యా మధుపృచం ధనసా జోహవీమి ॥ 89

## సూక్తము—10

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—అగ్ని

(1) క॥ పితవలె హోతవ్యుండవు, మతిమంతులలోన నీవు మాన్యుఁడ వగ్నీ !
తత విజ్ఞాన విశిష్టుఁడ, పతిపరిచరణీయుఁ డౌదు వనలుఁడ! నీవే! ॥ 88

(2) క॥ మరణ వివర్జితుఁడు సదా, స్థిరశక్తుఁడు మరియుఁ జిత్ర దీప్తియుతుండౌ
పరమాగ్ని మా స్తుతిం గడు, స్మరియింపఁడె? ప్రీతియుక్త సంపద వెలుఁగన్ ॥ 89

గీ॥ శ్యావ లోహిత రక్తవర్ణాంచితంపు,వర్ణములలోన నొకటిచే వరలుచుండు
గుఱ్ఱముల జంటతో సరికూర్పఁబడిన,యరదమునఁ బోవుచున్నాఁడ వగ్ని! నీవు ॥ 90

(3) చ॥ అరణులనుండి యూర్ధ్వ కకుభాభిముఖంబుగఁ బుట్టి యోషధీ
వరముల గర్భరూపమున భాసిలఁ జేయుచునుండి రాత్రులన్
గరము వెలుంగుచుండి శుభకర్మగృహంబుల నుచ్చదీప్తితో
స్థిరముగ నంధకారమును జెచ్చెరఁ గొట్టుచు నుండు నగ్ని తాన్ ॥ 91

1. దూతోసో, (వ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడదగును. వ.గో.కృ.

(4) క॥ భువనాధిష్ఠాత శరీ,ర విశిష్టుఁడు సర్వదా విరాజిత హవ్య
ద్రవమున వ్యాప్తిం జెందెడు, సవనపునకు నర్చ నిడుదుఁ జాల ఘృతమునన్ ॥ 92

(5) ఉ॥ యాగ సమస్త కర్మలకు నాగమనోత్సుకుఁడైన వహ్ని తా
బాగుగ సర్పిసిక్తుఁడయి పల్మరు సద్ధృత మాని యాని వే
వేగము దీప్తి గాంచునెడ విశ్వములో నెవఁడైన వాని యే
భాగమునైన ముట్టుకొను భాగ్యము నందఁగలండె? చెప్పుఁడీ! ॥ 93

(6) చ॥ అనుపమ శక్తిమూలమున నందఱి శత్రులఁ జంపువేళ నా
మనువువలెన్ సమగ్రముగ మాన్యత నందిన నగ్ని! వేడమే!
ధనదు ననూనశక్తియుతు ధర్మరతున్ మధుభాక్కు దాహకున్
ఘన మగు సూక్తిఁ బిల్చెదము గాంచుఁడు మానవులార! యాతనిన్ ॥ 94

## సూక్తమ్—11

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—విరాట్స్థానా, 21 త్రిష్టుప్.

(1) శ్రుధీ హవమిన్ద్ర మా రిషణ్యః స్యామ తే దావనే వసూనామ్ ।
ఇమా హి త్వామూర్జో వర్ధయన్తి వసూయవః సిన్ధవో న క్షరన్తః ॥ 90

(2) సృజో మహీరిన్ద్ర యా[1] అపిన్వః పరిష్ఠితా అహినా శూర పూర్వీః ।
అమర్త్యం చిద్ దాసం మన్యమానమవాభినదుక్థైర్వావృధానః ॥ 91

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.శ్రీ.

1. యాఽఅపిన్వః పరిష్ఠితాఽఅహినా, (వ్రా.ప్ర.)

(3) ఉక్థేష్విన్ను శూర యేషు చాకన్ త్స్తోమేష్విన్ద్ర రుద్రియేషు చ ।

తుభ్యేదేతా యాసు మన్దసానః ప్ర వాయవే సిస్రతే న శుభ్రాః ॥ 92

(4) శుభ్రం ను తే శుష్మం వర్ధయన్తః శుభ్రం వజ్రం[1] బాహ్వోర్దధానాః ।

శుభ్రస్త్వమిన్ద్ర వావృధానో[2] అస్మే దాసీర్విశః సూర్యేణ సహ్యాః ॥ 93

(5) గుహా హితం గుహ్యం [3]గూళ్హమప్స్వపీవృతం మాయినం క్షియన్తమ్ ।

ఉతో[4] అపో ద్యాం తస్తభ్వాంసమహన్నహిం శూర వీర్యేణ ॥ 94

(6) స్తవా ను త[5] ఇన్ద్ర పూర్వ్యా మహాన్యుత స్తవామ నూతనా కృతాని ।

స్తవా వజ్రం బాహ్వోరుశన్తం స్తవా హరీ సూర్యస్య కేతూ ॥ 95

(7) హరీ ను త[5] ఇన్ద్ర వాజయన్తా ఘృతశ్చుతం స్వారమస్వార్ష్టామ్ ।

వి సమనా భూమిరప్రథిష్టారంస్త పర్వతశ్చిత్ సరిష్యన్ ॥ 96

---

1, వజ్రబాహో, 2. వావృధానోఽస్మే, 3, గూళహ, 4, ఉతోఽపో, 5, ను తఽఇన్ద్ర, (ప్రా.ప్ర.)

(8) ని పర్వతః సాద్యప్రయుచ్ఛన్ త్సం మాతృభిర్వావశానో[1] అక్రాన్ ।

దూరే పారే వాణీం వర్ధయన్త[2] ఇన్ద్రేషితాం ధమనిం పప్రథన్ ని ॥ 97

(9) ఇన్ద్రో మహాం సిన్ధుమాశయానం మాయావినం వృత్రమస్ఫురన్నిః ।

అరేజేతాం రోదసీ భియానే కనిక్రదతో వృష్ణో[3] అస్య వజ్రాత్ ॥ 98

(10) అరోరవీద్ వృష్ణో [3]అస్య వజ్రో ఽమానుషం యన్మానుషో నిజూర్వాత్ ।

ని మాయినో దానవస్య మాయా[4] అపాదయత్ పపివాన్ త్సుతస్య ॥ 99

(11) పిబాపిబేదిన్ద్ర శూర సోమం మన్దన్తు త్వా మన్దినః సుతాసః ।

పృణన్తస్తే కుక్షీ వర్ధయన్త్విత్థా సుతః పౌర[5] ఇన్ద్రమావ ॥ 100

(12) త్వే[6] ఇన్ద్రాప్యభూమ విప్రా ధియం వనేమ[7] ఋతయా సపన్తః ।

అవస్యవో ధీమహి ప్రశస్తిం సద్యస్తే రాయో దావనే స్యామ ॥ 101

1. శానోఽఅక్రాన్, 2. వర్ధయన్త్వఽఇన్ద్రే, 3. వృష్ణోఽఅస్య, 4. మాయాఽఅపాదయత్, 5. పౌరఽఇన్ద్ర, 6. త్వేఽఇన్ద్ర, 7. వనేమఽఋతయా. (వ్రా.ప్ర.)

(13) స్యామ తే త ఇన్ద్ర యే త ఊతీ అవస్యవ ఊర్జం వర్ధయన్తః ।

శుష్మిన్తమం యం చాకనామ దేవాస్మే రయిం రాసి వీరవన్తమ్ ॥ 102

(14) రాసి క్షయం రాసి మిత్రమస్మే రాసి శర్ధ ఇన్ద్ర మారుతం నః ।

సజోషసో యే చ మన్దసానాః ప్ర వాయవః పాన్త్యగ్రణీతిమ్ ॥ 103

(15) వ్యన్త్విన్ను యేషు మన్దసానస్తృపత్ సోమం పాహి ద్రహ్యదిన్ద్ర ।

అస్మాన్ త్సు పృత్స్వా తరుత్రావర్ధయో ద్యాం బృహద్భిరర్కైః ॥ 104

(16) బృహన్త ఇన్ను యే తే తరుత్రోక్థేభిర్వా సుమ్నమావివాసాన్ ।

స్తృణానాసో బర్హిః పస్త్యావత్ త్వోతా ఇదిన్ద్ర వాజమగ్మన్ ॥ 105

(17) ఉగ్రేష్విన్ను శూర మన్దసాన త్రికద్రుకేషు పాహి సోమమిన్ద్ర ।

ప్రదోధువచ్ఛ్మశ్రుషు ప్రీణానో యాహి హరిభ్యాం సుతస్య పీతిమ్ ॥ 106

(18) ధిష్వా శవః శూర యేన వృత్రమవాభినద్ దానుమౌర్ణవాభమ్ ।

అపావృణోర్జ్యోతిరార్యాయ ని సవ్యతః సాది దస్యురిన్ద్ర ॥ 107

(19) సనేమ యే త ఊతిభి స్తరన్తో విశ్వాః స్పృధ ఆర్యేణ దస్యూన్ ।

అస్మభ్యం తత్ త్వాష్ట్రం విశ్వరూపమరన్ధయః సాఖ్యస్య త్రితాయ ॥ 108

(20) అస్య సువానస్య మన్దినస్త్రితస్య న్యర్బుదం వావృధానో[1] అ స్తః ।

అవ ర్తయత్ సుర్యో న చక్రం భినద్ [2]వలమిన్ద్రో అఙ్గిరస్వాన్ ॥ 109

(21) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 110

1. వావృధానోఽఅ స్తః. 2. భినద్ వలమిన్ద్రోఽఙ్గిర. (వ్రా.ప్ర.)

## సూక్తము—11

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ స్తవమును వీనులన్ వినుచు శక్ర! యవజ్ఞతఁ జూపకయ్యు! యీ
వివిధ నుతి ప్రపంచమున విత్త సమృద్ధికి మమ్ముఁ బాత్రులన్
దివురుచుఁ జేయుమయ్య! యిఁక దివ్య నదీ నిభ హవ్య రాశులన్
స్తవగత విత్తకామననుఁ జక్కఁగఁ దీర్పఁ గదయ్య! ప్రీతితోన్ ॥ 95

(2) ఉ॥ శూరుఁడ! నీవు తోయమును సుందర మౌ నఁట వృద్ధిఁ జేయుచో
మారకుఁ డైన యా "యహి" యమందత దానికి నడుఁబెట్ట నీ
కారసి వానిఁ ద్రుంచుచు నీ కనంత బలంబునఁ దజ్జలంబు వేఁ
బారెడు నట్లు సేయవఁటె! భవ్య నుతిం జెవిఁ బెట్టి శక్రుఁడా! ॥ 96

(3) గీ॥ భద్ర మగు రుద్రియంబను పరమ ఋక్కు,నీకు సంతుష్టిఁ గలిఁగించు నిర్జరేశ!
వాయురూపుఁడ! నీకయి వలసినంత, నుతి ప్రవర్తించుచుండె నా స్తుతిని వినుము! ॥ 97

(4) చ॥ అతిసుఖకారి యైన బల మంతటఁ గల్గును నీకు శక్ర! మా
సుతులను నాలకింపఁగనె నూతన వజ్రము పట్టు దీవు నీ
స్తుతి కృత శక్తి మూలమున సూర్యవికార మహాయుధంబులన్
గతిఁ గన నట్టి వారలకుఁ గల్పనఁజేయు మవజ్ఞ దీక్షతోన్ ॥ 98

(5) చ॥ ఇతరులకుం గనంబడక యెంతయొ కాలము నీట నుంట స
న్మతి చెడినట్టి దానవుఁడు మాయలతో గగనంబు నంతయున్
సతతము గట్టివేయఁగనె శక్రుఁడ! నీవు పవిన్ ధరించి యే
వితముననో! వధింపవఁటె! వీరుఁడ! వానిని యుద్ధ భూమిలోన్ ॥ 99

(6) క॥ [1]తావక పూర్వయశస్సుం, దావక సత్కర్మచయముఁ దద్వజ్రంబున్
దావక కేతు హరిద్వయ, మే విధి నుతియింప కుందునే? సూర్యాత్మా! ॥ 100

† ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. ద్వితీయమండలములో 11వ సూక్తములోని యీ 6వ ఋక్కున కర్థమే భిన్నమైనది. ఈ ఋక్కులోఁ "గేతు" శబ్దము గ్రహవాచకముగాఁ బ్రయోగింపఁబడినది. కేతు శబ్దప్రయోగము చేసినను శ్రీనేమానివారీ ఋక్కును సరిగా ననువదింపనే లేదు. పైఁగా మూలచ్ఛేదకమగు నర్థముతో ననువదింపఁబడినది. ఇక్కడ "కేతు" శబ్దము "కేత"నార్థకమన్న భ్రమతో వ్రాయఁబడెను. సాయనుఁడు పేర్కొన్న ప్రజ్ఞార్థముగూడ సరియైనదికాదు. వ.గో.కృ.

అర్థాంతరము

*క॥ తావక పూర్వయశస్సుం, దావక సత్కర్మచయము తద్వజ్రంబున్
దావక శాత్రువులఁదునుము, నేవిధిఁ గేతువును రాహు ఘృణి వధియించున్ ॥ 101

(7) చ॥ త్వరితముఁ బోవు నీ హరులు వారి నొసంగెడు మేఘ శబ్దమున్
స్థిరముగఁ జేయ నా ధ్వనినిఁ జెచ్చెర శ్రోత్రములందుఁ బెట్టుచో
స్థిరమగు ప్రీతి గల్గుఁగద! శ్రీకర మేఘము సంచరించుచున్
గరము వెలుంగుచుండుఁగద! కాంతి నొసంగుచు లోక మంతకున్ ॥ 102

(8) ఉ॥ ఎట్టి ప్రమాదముం గనక యింపగు తోయద మంబరంబుపై
ని ట్టటు సంచరించుచు నహీన జలంబులు నిచ్చుఁగావునన్
జట్టుగ నుండు మారుతమ! శక్రుఁడు ఖ స్థలిఁ జేయు శబ్దముల్
దిట్టముగాఁగ దిక్కులు ప్రతిధ్వను లిచ్చెడు న ట్లొనర్పవే! ॥ 103

(9) క॥ బలవంతుం డగు నింద్రుఁడు, జలదము పై నెక్కి చెనటి శత్రుని జంపన్
లలి వజ్ర స్తనితంబునఁ, జలియింపదె? నభము పుడమి చాల విధములన్ ॥ 104

(10) చ॥ మనుజ హితార్థి దేవపతి మానవ శత్రుని వృత్ర దానవున్
దునుముటకై చలింపఁ గతుఁ దోయము నిచ్చెడు వాని వజ్రమున్
ఘనముగ గర్జఁ జేయ సమకట్టెను గాన నతండు సోమముం
గనుఁగొని త్రాగి దానవుని క ట్టలుకన్ దునుమండె! యాజిలోన్ ॥ 105

(11) క॥ మదకరసోమము నీకున్,మదమునుఁ బుట్టించు మఱియు మారుత విభుఁడా!
యది నీ కుక్షిని నింపున్,సదయుఁడవై తృప్తి నొందు చారు రసమునన్ ॥ 106

(12) మ॥ అతిమేధావుల మైన మేము నిరతం బాసించి నీ స్థానమున్
హితమౌ కర్మ ఫలంబు బొందుటకు మే మెంతేనిఁ బూజా విధిన్
మతితోఁ జేయుచు యాగ కర్మ ఫల సామాన్యంబుఁ గైకొందు మో
యతులైశ్వర్యమహేంద్ర! మాకు నిడుమా! యర్థంబు నీ వెంతయున్ ॥ 107

* ఈ కందపద్యము పూర్వార్థకర్త కావ్యతీర్థ శ్రీ నేమాని వేంకట నరసింహశాస్త్రి. ఉత్తరార్థకర్త వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్. వర్లమూడి గోపాలకృష్ణయ్య. కళా-ప్రపూర్ణ.

(13) మ॥ భవదీయాశ్రయలాభముం గనుచు నో భవ్యాత్మ! శక్రుండ! నే
నవ హవ్యం బభివృద్ధిఁ జేసికొని యానందంబుతో నుండెదన్
స్తవనీయుండవు నీవు పుత్రయుతమున్ సారాస్పదం బైన స
ద్ద్రవిణంబుం సరిగూర్చినట్లయిన నే ధన్యుండ నౌదున్ గదా! ॥ 108

(14) గీ॥ ఇమ్ము గృహముల మిత్రుల నింద్రదేవ!, మారుతము వీర్యమును మఱి చారు మధుర
సోమ పాన విలాస సంతోషమున, వాయువుల శక్తియును మముఁ బాయకుండు ॥ 109

(15) ఉ॥ చక్కఁగ సోమపానమును జాలఁగ జేసిన మారుతంబు నీ
కెక్కువఁ దృప్తిఁ జేయుఁగద! యింద్రుఁడ! సోమము నీవు త్రాగుచో
మిక్కిలి శక్తి కల్గుఁగద! మేదుర వీర్య మరుద్గణంబుతోఁ
జక్కఁగ వచ్చి నీవు మముఁ జారు శుభంబుల వృద్ధిఁ జేయుమా! ॥ 110

(16) మ॥ సకలానిష్ట! నివారకా! సుఖకరా! శాస్త్రోక్త మౌ నట్లు తా
వక కృత్యంబులు చేయు వారలు మహా వ్యాపారులై యుండరే!
యకళంకంబుగ దర్భలం బఱచి నిత్యానంద మొప్పారఁ దా
వకమౌ పూజ నొనర్చు వారు గృహమున్ భక్తంబు తా మొందరే! ॥ 111

(17) క॥ లలి నుగ్రతికర్దుక కర్మల హృష్టుఁడ వగుచు సోమ రస పానమునన్
బలవంతుఁడ! యరిసూదన!, వెలిఁగెదు సంప్రీతి నొంది వేయి విధములన్ ॥ 112

గీ॥ శ్మశ్రు లిప్త మైన చారు సోమరసంబుఁ, దుడిచి పైచి నీవు కడఁగి సోమ
పానమునకు హతులఁ బన్నిన రథ మెక్కి, రమ్ము! శక్రదేవ! రాజ రాజ! ॥ 113

(18) గీ॥ ఎట్టి బలమునుఁ బొందుచు నింద్రదేవ!, యూర్ణ నాభునివలె వృత్రు నోపి నీవు
తొల్లి దునుమాడఁగాఁ గల్గితో యిపుడును, నట్టి బలమును ధరియింపు మతిశయముగ! ॥ 114

క॥ అనయం బార్యులకొఱకై ,ఘనమౌ జ్యోతిస్సు నీవు కల్పింపవాకో!
పనిగొని దస్యు గణంబును, ననిలో నపసవ్యపాణి నణఁపఁగ లేదే! ॥ 115

(19) ఉ॥ తావక మైన యాశ్రయముఁ దప్పక నొందుచు లోక మెల్ల నద్
భావముతోడ శత్రువులఁ బాపఁగఁ గల్గెను మా నిమిత్తమై
చేవగలట్టి యా త్రితుని చెల్మినిఁ జేయుచు విశ్వరూపకుం
జావఁగ మోదినావుగద! శక్రుఁడ! నిన్ను నుతింప శక్యమే? ॥ 116

(20) గీ॥ సతత తుష్టసుఖానుఁ డగ్ త్రితునివలన, వర్ధితుఁడవయి యింద్రుఁడ! వజ్రధార!
నర్బుదుండనుదనుజుని నడఁచినావు, ఘోర రణరంగమున మహావీరుఁడవయి ॥ 117

గీ॥ స్వరథ చక్రము సూర్యుఁడు జరుపునట్లు, నంగిరస్సుల మూలాన నమరపతియు
వజ్రమును ఘూర్ణితంబుగ వలసినట్లు, చేసి బలశత్రువును బడ నేసె భువిని ॥ 118

(21) చ॥ స్తుతికరులైన వారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచుం
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము మహేంద్ర! మా కస
మ్మతు లగు వారి కీయకుము మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతముఁ బౌత్రులం బడసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమే! ॥ 119

## అనువాకః—2 సూక్తమ్—12

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః *

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) యో జాత[1] ఏవ ప్రథమో మనస్వాన్ దేవో దేవాన్ క్రతునా పర్యభూషత్ ।
యస్య శుష్మాద్ రోదసీ[2] అభ్యసేతాం నృమ్ణస్య మహ్నా స జనాస[3] ఇన్ద్రః ॥ 111

(2) యః పృథివీం వ్యథమానామదృంహద్[4] యః పర్వతాన్ ప్రకుపితాగ్ం[5] అరమ్ణాత్ ।
యో[6] అన్తరిక్షం విమమే వరీయో యో ద్యామస్తభ్నాత్ స జనాస[3] ఇన్ద్రః ॥ 112

---

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. జాతఽఏవ, 2. రోదసీఽఅభ్య, 3 జనాసఽఇన్ద్రః, 4. మదృంహద్యః, 5. ప్రకుపితాగ్ంఽఅర,
6. యోఽఅన్త, (వ్రా.ప్ర).

(3) యో హత్వాహిమరిణాత్ సప్త సిన్ధూన్ యో గా[1] ఉదాజదపధా వలస్య ।
యో[2] అశ్మనోర న్తరగ్నిం జజాన సంవృక్ సమత్సు స జనాస[3] ఇన్ద్రః ॥ 113

(4) యేనేమా విశ్వా చ్యవనా కృతాని యో దాసం వర్ణమధరం గుహాకః ।
శ్వఘ్నీవ యో జిగీవాగ్ం లక్షమాదదర్యః పుష్టాని స జనాస ఇన్ద్రః ॥ 114

(5) యం స్మా పృచ్ఛన్తి కుహ సేతి ఘోరముతేమాహుర్నైషో[4] అస్తీత్యేనమ్ ।
సో[5] అర్యః పుష్టీర్విజ ఇవా మినాతి శ్రదస్మై ధత్త స జనాస ఇన్ద్రః ॥ 115

(6) యో రధ్రస్య చోదితా యః కృశస్య యో బ్రహ్మణో నాధమానస్య కీరేః ।
యుక్తగ్రావ్ణో యో ఽవితా సుశిప్రః సుతసోమస్య స జనాస ఇన్ద్రః ॥ 116

(7) యస్యాశ్వాసః ప్రదిశి యస్య గావో యస్య గ్రామా యస్య విశ్వే రథాసః ।
యః సూర్యం య[6] ఉషసం జజాన యో[7] అపాం నేతా స జనాస ఇన్ద్రః ॥ 117

1. యోగాఽఉదా. 2. యోఽఅస్మ, 3. జనాసఽఇన్ద్రః 4. షోఽఅస్తీత్యేనమ్, 5. సోఽఅర్యఃపుష్టీర్విజఽఇవా, 6. యఽఉషసం, 7. యోఽఅపాం, (వ్రా.ప్ర.)

(8) యం క్రన్దసీ సంయతీ విహ్వయేతే పరేఽవర[1] ఉభయా అమిత్రాః ।

సమానం చిద్ రథమాతస్థివాంసా నానా హవేతే స జనాస ఇన్ద్రః ॥ 118

(9) యస్మాన్న[2] ఋతే విజయన్తే జనాసో యం యుధ్యమానా[3] అవసే హవన్తే ।

యో విశ్వస్య ప్రతిమానం బభూవ యో[4] అచ్యుతచ్యుత్ స జనాస ఇన్ద్రః ॥ 119

(10) యః శశ్వతో మహ్యేనో దధానానమన్యమానాఞ్ఛర్వా జఘాన ।

యః శర్ధతే నానుదదాతి శృధ్యాం యో దస్యోర్హన్తా స జనాస ఇన్ద్రః ॥ 120

(11) యః శమ్బరం పర్వతేషు క్షియన్తం చత్వారింశ్యాం శరద్యన్వవిన్దత్ ।

ఓజాయమానం యో[5] అహిం జఘాన దానుం శయానం స జనాస ఇన్ద్రః ॥ 121

(12) యః సప్తరశ్మిర్వృషభస్తువిష్మానవాసృజత్ సర్తవే సప్త సిన్ధూన్ ।

యో రౌహిణమస్ఫురద్ వజ్రబాహుర్ద్యామారోహన్తం స జనాస ఇన్ద్రః ॥ 122

1. వరఽఉభయాఽఅమిత్రాః, 2. యస్మాన్నఽఋతే, 3. మానాఽఅవసే, 4. యోఽఅచ్యుత, 5. యోఽఅహిం.(వ్రా.ప్ర.)

(13) ద్యావా చిదస్మై పృథివీ నమేతే శుష్మాచ్చిదస్య పర్వతా భయన్తే ।

యః సోమపా నిచితో వజ్రబాహుర్యో వజ్రహస్తః స జనాస ఇన్ద్రః ॥ 123

(14) యః సున్వన్తమవతి యః పచన్తం యః శంసన్తం యః శశమానమూతీ ।

యస్య బ్రహ్మ వర్ధనం యస్య సోమో యస్యేదం రాధః స జనాస ఇన్ద్రః ॥ 124

(15) యః సున్వతే పచతే దుధ్ర[1] ఆ చిద్ వాజం దర్దర్షి స కిలాసి సత్యః ।

వయం త[2] ఇన్ద్ర విశ్వహ ప్రియాసః సువీరాసో విదథమా వదేమ ॥ 125

## అనువాకము—2, సూక్తము—12

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ జగమున దీప్త కాంతి హరి జన్మము నొందుచు దేవతాళికిన్
మగఁటిమి గల్గు మర్త్యులకు మాన్యతముండయి వీర కర్మచే
సొగ సగు దివ్యులన్ మిగుల శోభనవంతులుగా నొనర్చుచుం
దగు పతి యయ్యె సేనలకుఁ దా భయపెట్టుచు రోదసీ స్థలిన్ ॥ 126

1. దుధ్రః ఆ, 2. తః ఇన్ద్ర. (బ్రా.ప్ర.)

† ఋషి విశేషవిషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(2,3) సీ॥ వ్యధిత పృథ్విని దృఢ బద్ధమ్ముగాఁ జేసి పర్వతంబుల నెల్లఁ బాదుకొల్పి
నిఖిలాంతరిక్షంబు నిర్మాణ మొనరించి గగనంబు నంతయుఁ గప్పిపుచ్చి
యహి దానవుని జంపి యాపగా స ప్తక మతిశయంబుగఁ బారున ట్లొనర్చి
జలద మధ్యంబున జ్వలనంబుఁ బుట్టించి బలనీత గోవులఁ బట్టి తెచ్చి
గీ॥ యిచ్చు వాఁడింద్రుఁడేగద! మెచ్చు నట్లు, జన్య భూములలోపల శత్రువులను
జంపు వాఁ డింద్రుఁడేగద! శ క్తి మీరఁ,బవిని జేతను ధరియించి బలము మించ ॥ 121

(4) ఉ॥ ఎవ్వఁడు [1]నశ్వరంబయిన యెల్ల ప్రపంచముఁ బుట్టఁ జేసెనో!
యెవ్వఁడు దాస వర్ణుని మహీధ్రగుహన్ నిలుపంగఁ గల్గెనో!
యెవ్వఁడు వేటగానివలె నెంతయు లక్ష్య జయంబు గాంచునో!
యవ్విధమైన వానిఁ బలు కాడుదు రింద్రునిఁ గాఁగ మానవుల్ ॥ 122

(5) గీ॥ ఆతఁ డెచ్చట నున్నాఁడో! యనెడు ప్రశ్న, ఘోరతముఁడైన దేవునిఁగూర్చి పలుక
నాతఁ డెచ్చట లేఁడని యనెడు నతఁడె, యింద్రుఁ డనఁదగు ననెడు నహీన భ క్తి ॥ 123

గీ॥ శాంత దాత పోల్కి శత్రువులం జంపి, వారి ధనము నెల్ల వశముఁ జేసి
కొనెడు వాని యందుఁ బనిఁ బూని విశ్వాస,ముంచవలయు? హరిగ నుండు నతఁడు ॥ 124

(6) క॥ స్తుతికరులకు ఋత్విజులకు, సతతము దీనాళి కెల్లఁ జాలిన ధనమున్
మతితో నిచ్చిన వానిని, ప్రతిప త్తిని నింద్రుఁ డనుచుఁ బల్కెదరు జనుల్ ॥ 125

గీ॥ శుభ హను విశిష్టుఁడై చాల సోమ రసము, దీయఁ బ్రస్తరముం బట్టు దివ్య మునుల
రక్షకుండయి వెలిఁగెడు రాజమూ ర్తి, నింద్రునిగఁ జెప్పుచుండెద రెల్ల జనులు ॥ 126

(7,8) సీ॥ గ్రామాశ్వ గోవులఁ గాంచన రథములఁ బాలించుచున్ వారి పాదుకొల్పి
భాస్కరోషస్సులఁ బరఁగఁ బుట్టఁగఁ జేసి జలచోదకుండుగా జగతి వెలిఁగి
ప్రతిసైన్యములు పరస్పర సంగతిని గోరు పిలుపును నాలించి పేర్మి వెలిఁగి
యు త్తమో త్తమ మధ్య మోభయ శత్రుల యాహ్వాన మాలించి యతిశయించి
గీ॥ యేక[2] విధ రథముపై నుండు నిరువురైన,జనుల యహ్వానముల నన్ని చక్క వినుచు
వెలుఁగు వాఁ డింద్రుఁడే సుఁడీ! విపుల జగతి, నుండు జనులార! వాని గనుండు! మీరు॥ 127

1. నశ్వరంబైన (ప్రా.ప్ర.పా.) 2. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘు గణము ప్రయు క్త మైనది. వ.గో.కృ.

(9) ఉ॥ ఎవ్వఁడు లేకయున్న జయ మేమియుఁ గల్గదొ! యుద్ధభూమిలో
నెవ్వని బిల్చుచుండుదురొ! యేద్ధైర రక్షక లోకు లెల్ల నిం
కెవ్వఁడు సర్వలోకనుతి కెల్ల పదంబగునో! క్షయంబు లే
కెవ్వఁడు పర్వత క్షయము నెంతయుఁ జేసెనొ! వాఁడె యింద్రుఁడౌ ॥ 128

(10,11,12) సీ॥ వజ్రంబుఁ జేఁగొని బహుపాప గణములఁ గొట్టుచు శత్రులఁ గొట్టఁగల్గె
గర్వకారి మనుష్య గర్వంబు పోఁద్రోలి సిద్ధి వారికిఁ గల్గఁజేయకుండె
క్ష్మా ధరంబున నున్న శంబరు హతకుని నలువది యేండ్లకుఁ దెలియఁ గలిఁగె
బలమును బ్రకటించు నల యహి దనుజుని నంత మొందించుచు నధికుఁడయ్యె
గీ॥ సప్తరశ్మి విశిష్టుఁడై చతురుఁ డగుచు,నేడు నదులను బారించె నీప్సితముల
నిచ్చుచు జగము లెల్లను మెచ్చు లందు,వాఁడె యింద్రుండు జనులార! వానిఁ గనుఁడు! ॥ 129

(13) గీ॥ ఎవఁడు సోమపాయి? యెవఁడు వజ్ర ధరుండు?, యెవఁడు దృఢతనుండు? యింద్రుఁడతఁడె
అతని జూచి పర్వతాళి భయంపడు, తాము సత్కరించు ధరణి సభము ॥ 130

(14) క॥ స్తుతికరులఁ బాక కరులను. నతిసోమాభిషవ మిచ్చు యజమానతతిన్
మతితో సంరక్షించెడు, మతిమంతుని నింద్రుఁ డంద్రు మానవులారా! ॥ 131

గీ॥ స్తోత్ర మెవ్వని కభివృద్ధి శోభఁ జేయు,సోమ మెవ్వని కభివృద్ధి శోభ నిచ్చు
నన్న మెవ్వని కభివృద్ధి నందఁజేయు, వాఁడె యింద్రుఁడు జనులార! వానిఁ గనుఁడు! ॥ 132

(15) గీ॥ చరు పురోడాశ పాకముల్ కరముఁ జేయు, వారలకు సోమమును జేయు వారలకును
నన్న మిచ్చెడు వాఁడ వో యమరనాథ!, సత్యవంతుని గా నిన్నుఁ జాటు చుంద్రు ॥ 133

గీ॥ సత్యవంతుఁడ వీ వౌట శక్రదేవ!, వీర పుత్రులతోఁ గూడ వెలయుచుండి
మేము నిను సంస్తుతింతు మమేయ భక్తి, శత్రు సంహారకారకా! శక్రదేవ! ॥ 134

## సూక్తమ్—13

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—జగతీ, 13.త్రిష్టుప్.

(1) ఋతుర్జనిత్రీ తస్యా[1] అపస్పరి మక్షూ జాత[2] ఆవిశద్ యాసు వర్ధతే ।

తదాహనా[3] అభవత్ పిప్యుషీ పయోం ऽశోః పీయూషం ప్రథమం తదుక్థ్యమ్ ॥ 126

(2) సధ్రిమా యన్తి పరి బిభ్రతీః పయో విశ్వప్స్న్యాయ ప్ర భరన్త భోజనమ్ ।

సమానో[4] అధ్వా ప్రవతామనుష్యదే యస్తాకృణోః ప్రథమం సాస్యుక్థ్యః ॥ 127

(3) అన్వేకో వదతి యద్ దదాతి తద్ రూపా మినన్తదపా[5] ఏక ఈయతే ।

విశ్వా[6] ఏకస్య వినుదస్తితిక్షతే యస్తాకృణోః ప్రథమం సాస్యుక్థ్యః ॥ 128

(4) ప్రజాభ్యః పుష్టిం విభజంత[7] ఆసతే రయిమివ పృష్ఠం ప్రభవంతమాయతే ।

అసిన్వన్ దంష్ట్రైః పితురత్తి భోజనం యస్తాకృణోః ప్రథమం సాస్యుక్థ్యః ॥ 129

* ఋషి విశేష విషయములకై రెండవ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (647వ. పుట.) చూడనగును. వ.గో.కృ.

1. తస్యాऽ అప. 2. జాతऽఆవిశద్. 3. తదాహనాऽఅభవత్. 4. సమానోऽఅధ్వా. 5. దపాऽఏకऽఈయతే. 6. విశ్వాऽఏకస్య.

7. విభజంతऽఆసతే. (ప్రా.ప్ర.)

(5) అధా కృణోః పృథివీం సన్దృశే దివే యో ధౌతీనామహిహన్నారిణక్ పథః ।

తం త్వా స్తోమేభిరుదభిర్న వాజినం దేవం దేవా[1] అజనన్ త్సాస్యుక్థ్యః ॥ 130

(6) యో భోజనం చ దయసే చ వర్ధనమార్ద్రాదా శుష్కం మధుమద్ దుదోహిథ ।

స[2] శేవధిం ని దధిషే వివస్వతి విశ్వస్యైక[3] ఈశిషే సాస్యుక్థ్యః ॥ 131

(7) యః పుష్పిణీశ్చ ప్రస్వశ్చ ధర్మణాఽధి దానే వ్యవనీరధారయః ।

యశ్చాసమా[4] అజనో దిద్యుతో దివ[5] ఉరురూ[6]ర్వాగ్ం అభితః సాస్యుక్థ్యః ॥ 132

(8) యో నార్మరం సహవసుం నిహన్తవే పృక్షాయ చ దాసవేశాయ చావహః ।

ఊర్జయన్త్యా[7] అపరివిష్టమాస్యముతైవాద్య పురుకృత్ సాస్యుక్థ్యః ॥ 133

(9) శతం వా యస్య దశ సాకమాద్య[8] ఏకస్య శ్రుష్టౌ యద్ధ చోదమావిథ ।

అరజ్జౌ దస్యూన్ త్సమునబ్దభీతయే సుప్రావ్యో[9] అభవః సాస్యుక్థ్యః ॥ 134

1. దేవాఽఅజనన్,(వ్రా,ప్ర,) 2. సః శేవధిం (సా.వ్రా.ప్ర.) 3. విశ్వస్యైకఽఈశిషే, 4. సమాఽఅజనో. 5. దివఽఉరు (వ్రా.ప్ర.)

6. ఉరురూగ్ంర్వా (సా.మా.వ్రా.ప్ర.) 7. యన్త్యాఽఅపరి, 8. మాద్యఽఏకస్య, 9. సుప్రావ్యోఽఅభవః (వ్రా.ప్ర.)

(10) విశ్వేదను రోధనా అస్య పౌంస్యం దదురస్మై [1]దధిరే కృత్నవే ధనమ్ ।
షళస్తభ్నా విష్టిరః పఞ్చ సందృశః పరి పరో[2] అభవః సాస్యుక్థ్యః ॥ 135

(11) సుప్రవాచనం తవ వీర వీర్యం౧ యదేకేన క్రతునా విన్దసే వసు ।
జాతూష్ఠిరస్య ప్ర వయః సహస్వతో యా చకర్థ సేన్ద్ర విశ్వాస్యుక్థ్యః ॥ 136

(12) అరమయః సరపసస్తరాయ కం తుర్వీతయే చ వయ్యా[3]య చ స్రుతిమ్ ।
నీచా సన్తముదనయః పరావృజం ప్రాన్ధం శ్రోణం శ్రవయన్ త్సాస్యుక్థ్యః ॥ 137

(13) అస్మభ్యం తద్ వసో దానాయ రాధః సమర్థయస్వ బహు తే వసవ్యమ్ ।
ఇన్ద్ర యచ్చిత్రం శ్రవస్యా [4]అను ద్యూన్ బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 138

1. దధిరే (సా), 2. పరోఽభవః, 3. వయ్యాయ స్రుతిమ్, 4. శ్రవస్యాఽను. (వ్యా.ప్ర.)

## సూక్తము—13

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ ఘన మగు వర్ష కాలమును గాంచుచుఁ దల్లిగ సోమవల్లికల్
జననము నొంది తోయమున సారముతో నభివృద్ధిఁ జెంది తా
మనయము వెల్గుచుండెడును నట్టు లతా చయ జాత సారముల్
ఘన మగు హవ్య మయ్యెడును గర్మల రాయున కింద్రమూర్తికిన్ ॥ 135

(2) సీ॥ ఉదకవాహినులైన నదులు పరస్పర సమ్మిశితంబులై సాగుచుండుఁ
బ్రవహించు చుండెడుఁ బ్రబలముగా నాల్గు దిక్కులకుం జాలఁ బిక్కటిల్ల
నుదకాశ్రయంబైన నుదధికి సర్వోదకంబు భోజనమయి గ్రాలుచుండు
నిమ్నంబునకుఁ బోవు నీటి కంతకు నొక్క గంతవ్యమార్గంబుఁ గలుఁగుచుండు
గీ॥ నింద్రుఁడా! యిట్టి కృత్యము లెన్నొ! నీవు, పూర్వమునఁ జేసినాఁడవు పూజ్యమతిని
నట్టి కారణములచేత నఖిల నుతుల, కాశ్రయుండవు కావె? నీ వఖిలవంద్య! ॥ 136

(3) ఉ॥ ఒక్కఁడు దేవతోత్తముఁ డహో! యను నట్టు లొసంగు దానినే
యొక్కఁడు మానవోత్తముఁ డహో! యనునట్లు ప్రశంసఁ జేయు ని
కొక్కఁడు జంతు హింసలను నొయ్యనఁ జేయుచుఁ బోవు దాని వే
రొక్కఁడు మాన్పు నిట్టి పను లున్నవి నీయవి యో మహేంద్రుఁడా! ॥ 137

(4) చ॥ అతిథులకుం గృహస్థ గణ మర్థ మొసంగెడురీతి నింద్ర స
న్మతిఁగొని విత్త రాశులను మాన్య జనావళి కిచ్చుచుందు వా
యతిశయ కర్మకారి కడు నన్నము దంతములన్ భుజించు నీ
వితమగు కర్మ నీ దగుట వీరుఁడ! యోగ్యుఁడ వౌదు కాదొకో! ॥ 138

(5) చ॥ పుడమిని దర్శనీయముగఁ బోడిమితో నొనరించి మింటికై
తడఁబడకుండఁ బారునటు తప్పక చేసితి వాపగాతతిన్
వడగొను ఘోటకంబునకు వారులఁ దృప్తిని జేయునట్లుగా
కడు నిను మంత్రవాక్యములఁ గర్మల లోకులు దృప్తిఁ జేయరే! ॥ 139

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము క్రింది ఋషి కిచ్చిన ఫుట్‌నోట్ (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6,7) సీ॥ ధన దానమును జేయు ఘనభోజనం బిమ్ము! సస్యాది దోహన శక్తి నిమ్ము!
పరిచర్యలను జేయు పరిచారకుల కెల్ల నెస లేని యట్టుల ధనము నిమ్ము!
పుష్పఫలాదులఁ బొలు పొందు నోషధి రత్నంబులకు నెల్ల రక్ష నిమ్ము!
హానులఁ గొట్టుచు నరి హంతకుండవై యద్వితీయులమయి యలరుచుండు
గీ॥ మరి నిహంతక! యింద్ర! నీ వధికశక్తి, నొప్పి యుండుట స్తోత్ర యోగ్యుఁడవు! నీవు
సూర్య దీప్తిని బుట్టించి సొగసుఁ గంటి, వఖిల ప్రాణులఁ బుట్టించి యమరుచుంటి! ॥ 140

(8) గీ॥ హవ్యములఁ గోరి దస్యుల నడఁచి పెట్టి, స్వమర పుత్రుని సహవసు సమరమందుఁ
జంపి దంభోళి ధారను సరస దేశమందు దాన మొసర్చెను సమరభర్త ॥ 141

(9) గీ॥ అమరుఁడా! నీవు సుఖమును నందఁగోరి, దశ శతాశ్వంబులను నెల్లఁ దాల్చినావు!
రహిద భీతి నిమిత్తమై రజ్జు రహిత, దస్యు గణముల నతిశక్తిఁ ద్రచ్చినావు! ॥ 142

గీ॥ అద్వితీయుండ వగుదు వో! యమరనాథ!, సర్వప్రాప్యుండ వగుదు వో! శక్రదేవ!
అందుచే సంస్తవంబుల నధిగమించి, సకలయోగ్యుండ వగుదువు! చాతురిమను ॥ 143

(10) ఉ॥ ఘన మగు రోదస్వతిహారి,ననువర్తించుకొని యుండు యజమాన గణం
బెన లేని యన్న మొసఁగును, ధనమొసఁగును గర్మకారి దశ మింద్రునకున్ ॥ 144

గీ॥ పంచజనము ప్రీతి భావించి విస్తీర్ణ, భయ ప్రదేశ మెల్ల శక్తి నిలిపె
సకల లోక విమల సంస్తవ యోగ్యుఁడ, వైతి వింద్రదేవ! యమరవంద్య! ॥ 145

(11) గీ॥ శక్ర! నీ వీర్య మంతయు శ్లాఘనీయ, మమల కర్మల శత్రుల యర్థ మెల్లఁ
దెచ్చి యా పుచ్ఛులకు నన్న మిచ్చినాఁడ, వందుచే యోగ్యుఁడవు నీవె యమరనాథ! ॥ 146

(12) గీ॥ ప్రయ్యు తుర్వీతు లిద్దఱు పారునదుల. దాఁటు నట్టులఁ జేసితి మేటి శక్తి
నంధ పంగు పరావృజు నధికజలము, నుండి తీయుచు విఖ్యాతి నొందినావు ॥ 147

(13) చ॥ అమరుఁడ! నీవు మాకు సకలార్థ మొసంగిన వాఁడ వైనహో,
గ్రమముగ నట్టి విత్తమున గౌరవ భావము నొంది పిమ్మటన్
సమముగ యాగ కర్మలను జక్క నొనర్చుచుఁ బుత్ర పౌత్ర సం
ప్రమదముతోడ నొప్పి సుఖభాగ్యముతో నుతు లుచ్చరింపమే? ॥ 148

## సూక్తమ్—14

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) అధ్వర్యవో భరతేన్ద్రాయ సోమమామత్రేభిః సిఞ్చతా మద్యమన్ధః ।

కామీ హి వీరః సదమస్య పీతిం జుహోత వృష్ణే తదిదేష వష్టి ॥ 139

(2) అధ్వర్యవో యో[1] అపో వవ్రివాంసం వృత్రం జఘానాశన్యేవ వృక్షమ్ ।

తస్మా[2] ఏతం భరత తద్వశాగ్ం[3]య [4]ఏష ఇన్ద్రో అర్హతి పీతిమస్య ॥ 140

(3) అధ్వర్యవో యో దృభీకం జఘాన యో గా[5] ఉదాజదప హి వలం వః ।

తస్మా[6] ఏతమన్తరిక్షే న వాతమిన్ద్రం సో[7]మైరోర్ణుత జూర్న వస్త్రైః ॥ 141

(4) అధ్వర్యవో య[8] ఉరణం జఘాన నవ చఖ్వాంసం నవతిం చ బాహూన్ ।

యో[9] అర్బుదమవ నీచా బబాధే తమిన్ద్రం సోమస్య భృథే హినోత ॥ 142

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. యోఽఅపో, 2. తస్మాఽఏతం (వ్రా.ప్ర.), 3. తద్వశాయగ్ం (సా), 4. తద్వశాగ్ంయఽఏషఽఇన్ద్రోఽఅర్హతి, 5. యో గాః ఉదా, 6. తస్మాఽఏత, 7. సో మే. 8. యః ఉరణం, 9. యోః అర్బుద. (వ్రా.ప్ర.)

(5) అధ్వర్యవో యః స్వశ్నం జఘాన యః శుష్ణమశుషం యో వ్యంశమ్ ।

యః పిప్రుం నముచిం యో రుధిక్రాం తస్మా[1] ఇన్ద్రాయాన్ధసో జుహోత ॥ 143

(6) అధ్వర్యవో యః శతం శమ్బరస్య పురో బిభేదాశ్మనేవ పూర్వీః ।

యో వర్చినః శతమిన్ద్రః సహస్ర మపావపద్ భరతా సోమమస్మై ॥ 144

(7) అధ్వర్యవో యః శతమా సహస్రం భూమ్యా [2]ఉపస్థేఽవపజ్జఘన్వాన్ ।

కుత్సస్యాయోరతిథిగ్వస్య వీరాన్ న్యావృణగ్ [3]భరతా సోమమస్మై ॥ 145

(8) అధ్వర్యవో యన్నరః కామయాధ్వే శ్రుష్టీ వహన్తో నశథా తదిన్ద్రే ।

గభస్తిపూతం భరత శ్రుతాయేన్ద్రాయ సోమం యజ్యవో జుహోత ॥ 146

(9) అధ్వర్యవః కర్తనా శ్రుష్టిమస్మై వనే నిపూతం వన[4] ఉన్నయధ్వమ్ ।

జుషాణో హస్త్యమభి వావశే వ[5] ఇన్ద్రాయ సోమం మదిరం జుహోత ॥ 147

1. తస్మాఽఇన్ద్రా, 2. భూమ్యాఽఉపస్థే (ప్రా.ప్ర.), 3. భరతా (సా), 4. వనఽ ఉన్న, 5. హవ శేవఽఇన్ద్రాయ, (ప్రా.ప్ర.)

(10) అధ్వర్యవః పయసోధర్యథా గోః సోమేభిరీం పృణతా భోజమిన్ద్రమ్ ।
వేదాహమస్య నిభృతం మ[1] ఏతద్ దిత్సన్తం భూయో యజతశ్చికేత ॥ 148

(11) అధ్వర్యవో యో దివ్యస్య వస్వో యః పార్థివస్య క్షమ్యస్య రాజా ।
తమూర్దరం న పృణతా యవేనేన్ద్రం సోమేభిస్తదపో వో[2] అస్తు ॥ 149

(12) అస్మభ్యం తద్ వసో దానాయ రాధః సమర్థయస్వ బహు తే వసవ్యమ్ ।
ఇన్ద్ర యచ్చిత్రం శ్రవస్యా[3] అను ద్యూన్ బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 150

## సూక్తము—14

ఋషి—గృత్సమదుఁడు *

దేవత—ఇంద్రుఁడు

(1,2) సీ॥ అధ్వర్యులార! మీ రమరాధినాథున కఖిలసోమ రసంబు నందనిండు!
చమసపాత్రద్వార జ్వలనునకై మోద కాన్క సంపత్తుల నందనిండు!
కామితార్థం బిచ్చు కమనీయమూర్తి యౌ సోమపాయికి మధుసోమ మిండు!
ఘన వాహనుఁడు చాలఁ గామించుచున్నట్టి కమనీయ సోమము కలుఁగనిండు!
గీ॥ వృక్షమునువలెఁ బవిచేత వృత్రహతకు, బిలుకు మార్చిన వజ్రికి వలసినట్టి
సోమ రస దానముం జేసి సొగసు మీరఁ, గాంక్షితార్థంబు లొనఁగుఁడు! ఘనత మీర ॥ 149

1. మఽఏతద్, 2. వోఽఅస్తు. 3. వస్యాఽఅను. (ప్రా.ప్ర)

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడ నగును. వ.గో.కృ.

(3) చ॥ బలిమి దభీక దానవుని బట్టి వరించిన పిమ్మటన్ మహా
బలుని మథించి గో గణము బంధముఁ ద్రుంచిన యింద్రమూర్తికై
జలదము లుండుచోటఁ గడుఁ జక్కని వాయువు వ్యాప్తమైన య
ట్లల మదకారి సోమమును వ్యాప్తముగా నొసరింపుఁడీ! జనుల్ ॥ 150

గీ॥ వస్త్రములను జీర్ణవస్తువు నెట్టు లాచ్ఛాదితంబుఁ జేయ జనులు చనెద
రట్టు లింద్రదేవు నధికసోమమున నాచ్ఛాదితంబుఁ జేయుఁ డార్యులార! ॥ 151

†(4) గీ॥ నవ నవతి బాహువులతో ననంత శక్తి, నొప్పు శరణుని నర్పుచు నోలిఁ జంపి
నట్టి యింద్రునకై ప్రీతి నధికసోమ,రసము నొసఁగుఁడు! జనులార! వెసఁగడంగి ॥ 152

(5,6,7) సీ॥ శుష్ణుని స్కందంబు శోషిల్లఁగాఁ జేసి యశ్నుని వధియించి యమరినాఁడు!
పిప్రు రుధీకుల పీఁచంబులం గొట్టి దుష్టుఁడౌ నముచిని ద్రోలినాఁడు!
శంబరైకాధిక శతపట్టణంబులఁ గఠిన పవిన్ నేలఁ గల్పినాఁడు!
వర్చిరకునియొక్క వరలక్షపుత్రకు లవనిపైఁ బడునట్టు లడఁచినాఁడు!
గీ॥ శత సహస్రాసురలను[1] నెల్లఁ జంపి ఘనత,రాయు కుత్సల యోఘుల ననిపినాఁడు
కాన శత్రునికై సోమ మూని తెచ్చి, యిద్ధమతులార! భక్తితో నింపు! నేఁడు ॥ 153

(8) గీ॥ ఇంద్రునకు సోమ రసము నందీయ నున్న,సకల కామన లొడఁగూడు సత్వరముగ
హస్తశోధిత సోమంబు నంద నిత్తు,రధ్వర ప్రీతు లగువార లమరపతికి ॥ 154

† అరణుఁ డను నార్యశత్రువునకు 99 బాహువు లున్నట్లు వర్ణింపఁబడెను. కాని దీని యర్థము సరిగ సమన్వయించలేదు. కాని 99 బాహువులు కలవాఁ డనఁగా నపరిమిత శక్తి కలవాఁడని యర్థమై 99 బాహువు లున్న వాఁడను దృష్టితో నీయర్థము వ్రాయఁబడినదేమో? (నే.వేం.న.శా.)

గమనిక:— బహుబాహువులశక్తి దైవీయమైన యలౌకిక శక్తి-అస లధికముగా బాహువు లుండ వనుకొనుట పొరపాటు. మామూలు బాహువులకంటె మిన్నగా నధిక బాహువు లున్నను మంత్రౌషధ్యాదిశక్తులవల్ల దృశ్యమానము లగును. వ.గో.కృ.

1. ఈ తేటగీతి ప్రథమపాదమున నింద్రగణమునకు మారు చంద్రగణమైన "నహ" ము(రలనునెల్ల) బుద్ధిపూర్వముగఁ బ్రయుక్తమైనది. "శతసహస్రాసురగణముఁ జంపిఘనత" అని వ్రాయఁగల్గియుండియు శ్రీ నేమానివా రట్లు చేయకపోవుట విశేషము. వ.గో.కృ.

(9) క॥ జలశోధిత మగుసోమము, సులలితహ స్తముల, బట్టి శోభ దలిర్పన్
జెలువం బొప్పెడు నింద్రున,కెలమిని నందిండు ః మీర లిద్ధప్రతిభన్ ॥ 155

(10) గీ॥ ఆవు బొదుగుఁ బాల నమరియుండెడు నట్లు. శక్రుఁ డెపుడు సోమశ క్తితోడ
నుండు నటులఁ జేసి యుచిత భ క్తిని వానిఁ, గొలుచుచుండుమయ్య! కోవిదుండ ! ॥ 156

క॥ సోమప్రభావ మెరుఁగుచుః, నీమము గలవారి నెల్ల నిర్జరపతి తా
వేమరుఁ గనుఁగొనుచున్నది, కామితము నెల్లఁ గూర్చి గ్రాలెడునుండీః ॥ 157

(11) గీ॥ మూఁడు లోకములను మురియుచుండెడి ధన,రాశి కెల్ల హరియె రాజు కాన
సస్య గృహము యవల, జక్క నిండెడునట్లు, దివ్యరసముచేతఁ దీర్పుఁ డతని ॥ 158

(12) చ॥ అమరుఁడ! నీవు మాకు సకలార్థ మొసంగిన వాఁడ వై నచోఁ
గ్రమమున నట్టి వి త్తమున గౌరవభావము నొంది పిమ్మటన్
సమముగ యాగ కర్మలను జక్క నొనర్చుచుఁ బుత్ర పౌత్ర సం
ప్రమదముతోడ నొప్పి సుఖ భాగ్యముతో స్తుతు లుచ్చరింపమే ! ॥ 159

## సూ క్తమ్—15

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ప్ర ఘా న్వస్య మహతో మహాని సత్యా సత్యస్య కరణాని వోచమ్ ।

త్రికద్రుకేష్వపిబత్ సుతస్యాస్య మదే[1] అహిమిన్ద్రో జఘాన ॥ 151

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూ క్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. మదేఽ అహి. (వ్రా.ప్ర.)

(2) అవంశే ద్యామస్తభాయద్ బృహన్తమా రోదసీ[1] అపృణదన్తరిక్షమ్ ।

స ధారయత్ పృథివీం పప్రథచ్చ సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 152

(3) సద్మేవ ప్రాచో వి మిమాయ మానైర్వజ్రేణ ఖాన్యతృణన్నదీనామ్ ।

వృథాసృజత్ పథిభిర్దీర్ఘయాథైః సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 153

(4) స ప్రవో[3]ళ్హాన్ పరిగత్యా దభీతేర్విశ్వమధాగాయుధమిద్ధే [4]అగ్నౌ ।

సం గోభిరశ్వైరసృజద్ రథేభిః సోమస్య తా మద[2]ఇన్ద్రశ్చకార ॥ 154

(5) స[5] ఈం మహీం ధునిమేతోరరమ్ణాత్ సో[6] అస్నాతౄనపారయత్ స్వస్తి ।

త[7] ఉత్స్నాయ రయిమభి ప్ర తస్థుః సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 155

(6) సోదఞ్చం సిన్ధుమరిణాన్మహిత్వా వజ్రే[1]ణాన ఉషసః సం పిపేష ।

అజవసో జవినీభిర్వివృశ్చన్ త్సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 156

1. రోదసీsఅపృ, 2. మదsఇన్ద్ర, 3. ప్రవోళహ్యాన్, 4. మిద్ధేsఅగ్నౌ, 5. సsఈం, 6 సోsఅస్నా, 7, తsఉత్స్నాయ, 8. వజ్రేణేనs ఉషసః. (ప్రా.ప్ర.)

(7) స విద్వాగ్ం[1] అపగోహం కనీనామావిర్భవన్నుదతిష్ఠత్ పరావృక్ ।

ప్రతి శ్రోణః స్థాద్ వ్యగనగచష్ట సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 157

(8) భినద్ వలమఙ్గిరోభిర్గృణానో వి పర్వతస్య దృంహితాన్యైరత్ ।

రిణగ్రోధాంసి కృత్రిమాణ్యేషాం సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 158

(9) స్వప్నేనాభ్యుప్యా చుమురిం ధునిం చ జఘన్థ దస్యుం ప్ర దభీతిమావః ।

రమ్భీ చిదత్ర వివిదే హిరణ్యం సోమస్య తా మద[2] ఇన్ద్రశ్చకార ॥ 159

(10) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 160

---

1. గ్ంఽఅప, 2. మదఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

## సూక్తము—15

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ బలము కల్గు నేను బహు సత్య సంకల్పుఁ, డైన యింద్రు కీర్తి నతిశయముగ
సన్నుతింతు వాఁడు సరస త్రికద్రుక,సవనమందు సోమశక్తి నందె ॥ 160

గీ॥ సోమ పాన జనిత శోభాభివర్ధిత, హర్షజాత శక్తి నమరునట్టి
యింద్రుఁ డహిని జంపి యిద్ధ వజ్రంబునఁ,బ్రీతుఁ డయ్యె లోక భీతి మాన్పి ॥ 161

(2) సీ॥ అతివిశాలంబైన నాకాశవీథిని స్థంభితం బగునట్లు దాల్చుచుండె
దుస్సాధ్య మగునట్టి ద్యోలోకమును గూడఁ గదలకుండఁగ నతికట్టుచుండెఁ
గ్రాలు తేజస్సుతో గగనతలం బంతఁ గమనీయవిధమునఁ గప్పుచుండె
విస్తీర్ణ మైనట్లు విపులాతలం బెల్లఁ దద్దయు శక్తితోఁ దాల్చుచుండె
గీ॥ నిట్టి మన కర్మ లన్నియు నింద్రుఁ డొకఁడె, సోమ సంజాత హర్షోద్ధ శోభతోడఁ
జేయఁ గల్గుచు నుండెడుఁ జెన్ను మీర,నతని కార్యంబులకు నసాధ్యం బదేది? ॥ 162

(3) ఉ॥ సోమము గ్రోలుటన్‌వలన సోలుచు సొక్కుచు నింద్రుఁ డెంతయున్
సీమముతో గృహంబులను సేర్పునఁ గొల్చిన యట్లు దిక్కులన్
ప్రేమ దలిర్పఁ గొల్చి పవి పేర్మిని బట్టి సమస్త కుల్యమున్
భూమిని ద్రవ్వి యాపగలు పోయెడు నట్లులు నేసెఁ బ్రీతితోన్ ॥ 163

(4,5) సీ॥ అలదభీతిపురంబు లంత మొందించిన యదుల యాయుధముల నగ్ని గలిపి
పిదప "దభీతిని" బిలిచి యశ్వాదుల వానికి నెలమితో దాన మిచ్చి
ధుని నామ కాపగం గని తత్ప్రవాహంబు గమనార్థ మగునట్లు కలుఁగఁజేసి
నదిని దాఁటిన యట్టి నరులకు నర్థంబు లభియించు నట్టుల లక్ష్యముంచి
గీ॥ శక్రుఁ డెంతయు వెల్గొందెఁ జారు సోమ, జనితహర్షంబుచేతనె శక్తిఁ గలుఁగఁ
దఱచు సోమ రసంబును ద్రాగకున్న, శక్రుఁ డేమేనిఁ జేయంగ శక్తుఁ డగునె? ॥ 164

† ఋషి విషయ విశేషములకై ఆంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ సూక్తముక్రింది ఋషి విషయకమైన ఫుట్‌నోటు చూఁడనగును. వ.గో.కృ.

(6,7) సీ॥ మహిత సింధువు నైజ మహిమచే నుత్తర వాహినియైనట్లు పంపఁగలిఁగె :
దుర్బలసేనును దోస్సారమునఁ గొట్టి యా యుషోరథమును నడఁచఁగలిఁగె :
గదిలి పోయిన కన్యకల ఋషీశుల చెంత ప్రేమ నొప్పెడునట్లు పెట్టఁగలిఁగె :
కుంటి వానిని బుట్టు గ్రుడ్డి వానిని గూడ నన్ని కార్యములకు ననుపఁగలిఁగె :
గీ॥ నిట్టి కృత్యము లన్నియు నెన్నునట్లు, జరుపఁగలుఁగుటకై చారు సోమ జాత
హర్షమే కారణం బగు నమరపతికిఁ, గాని వేరొక హేతువు కలదె? చెపుమ : ॥ 165

(8,9) సీ॥ అంగిర స్తవముల నాలకించుచు దుష్ట బల దానవుని జంప మెలఁగునాఁడు :
గిరివరంబుల దృఢీకృత కవాటంబులు కించ లేకయె పెల్లగించునాఁడు :
ఘన ధుని సేనకుఁ గల్పించి నిద్రను వారిని జంపంగఁ జేరునాఁడు :
రాజర్షియైనట్టి రమ్య దభీతిని సంచితమతిని రక్షించునాఁడు :
గీ॥ సోమరసజాతహర్షమే శోభఁ దెచ్చె, నింద్రునకుఁ గాన నతఁడు సమిద్ధరసము
గ్రోలుచున్ సర్వకర్మలు కొఱువలేక,చేయఁగలుఁగుచు నున్నాఁడు సిద్ధి కలుఁగ ॥ 166

(10) చ॥ స్తుతికరులైన వారలకు సుందరకాంక్షిత మెల్లఁ దీర్చుచున్
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము మహేంద్ర : మా కస
మ్మతులగు వారి కీయకుము : మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతము పౌత్రులం బడసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమే ? ॥ 167

## సూక్తమ్—16

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—జగతీ, 9-త్రిష్టుప్

(1) ప్ర వః సతాం జ్యేష్ఠతమాయ సుష్టుతిమగ్నావివ సమిధానే హవిర్భరే ।

ఇన్ద్రమజుర్యం జరయన్తముక్షితం సనాద్ యువానమవసే హవామహే ॥ 161

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును. వ.గో.కృ.

(2) యస్మాదిన్ద్రాద్ బృహతః కిం చనేమృతే విశ్వాన్యస్మిన్ త్సంభృతాధి వీర్యా ।
జఠరే సోమం తన్వీఽ సహో మహో హస్తే వజ్రం భరతి శీర్షణి క్రతుమ్ ॥ 162

(3) న క్షోణీభ్యాం పరిభ్వే త[1] ఇన్ద్రియం న సముద్రైః పర్వతైరిన్ద్ర తే రథః ।
న తే వజ్రమన్వశ్నోతి కశ్చన యదాశుభిః పతసి యోజనా పురు ॥ 163

(4) విశ్వే హ్యస్మై యజతాయ ధృష్ణవే క్రతుం భరన్తి వృషభాయ సశ్చతే ।
వృషా యజస్వ హవిషా విదుష్టరః పిబేన్ద్ర సోమం వృషభేణ భానునా ॥ 164

(5) వృష్ణః కోశః పవతే మధ్వ[2] ఊర్మిర్వృషభాన్నాయ వృషభాయ పాతవే ।
వృషణాధ్వర్యూ వృషభాసో[3] అద్రయో వృషణం సోమం వృషభాయ సుష్వతి ॥ 165

(6) వృషా తే వజ్ర [4]ఉత తే వృషా రథో వృషణా హరీ వృషభాణ్యాయుధా ।
వృష్ణో మదస్య వృషభ త్వమీశిష[5] ఇన్ద్ర సోమస్య వృషభస్యతృష్ణుహి ॥ 166

1. తఽఇన్ద్రియం, 2. మధ్వఽఊర్మి, 3. వృషభాసోఽఅద్ర, 4. వజ్రఽఉత, 5. త్వమీశిషఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(7) ప్ర తే నావం న సమనే వచస్యువం బ్రహ్మణా యామి సవనేషు దాధృషిః ।

కువిన్నో[1] అస్య వచసో నిబోధిషదిన్ద్రముత్సం న వసునః సిచామహే ॥ 167

(8) పురా సంబాధాదభ్యా వవృత్స్వ నో ధేనుర్న వత్సం యవసస్య పిప్యుషీ ।

సకృత్సు తే సుమతిభిః శతక్రతో సం పత్నీభిర్న వృషణో నసీమహి ॥ 168

(9) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 169

## సూక్తము—16

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—ఇంద్రుఁడు

(1) క॥ ఉపకారములం గోరుచు, విపరీతంబైనయట్లు వెలుఁగ నలునకున్
విపులముగ హవ్య మొసఁగిన, నిపుణత సంతృప్తి నొందు నిర్జర పతియున్ ॥ 168

క॥ జర లేని యట్టి వానిం, గరము జరాదాత యగుచుఁ గదలెడు వానిం
దరుణ వయస్కుఁ జిరంతను, స్థిరముగఁ బిలిచెదము మేము చిర భక్తిమెయిన్ ॥ 169

(2) గీ॥ సరస సామర్థ్య సంభృత శక్రుఁ డెలమి,నుదరమున సోమరసమును నుంచుచుండె,
దనువున బలమ్ము తేజస్సుఁ దాల్చుచుండి, జ్ఞానమును వజ్రమును గూడఁ బూని యుండె ॥ 170

1. కువిన్నోకఅస్య (వ్రా.ప్ర.)

† ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ సూక్తము ఋషి విషయకమైన పుట్‌నోటు చూఁడనగును. వ.గో.కృ.

(3) చ॥ అతిశయశీఘ్రగామి యగు సశ్వము నెక్కి మహేంద్రుఁ డెంతయున్
ధృత గమనంబుతోఁ జనిన దివ్య నభంబు విశాల భూమియున్
గతిచెడి సంచరించుఁ గదః గ్రాలెడు తత్పవి నెట్టి వ్యక్తియేన్
యతనము నైనఁ గొట్టుటకు నాత్రతఁ జూపఁ గడంగునేః భువిన్ ॥ 171

(4) గీ॥ అభిమతార్థ మిచ్చు సమరనాథునకయి, జనులు యాగములను సలుపుచుండ్రి
ధీరః యిష్టి నీవు దివిజునకై చేయు, మింద్రః యగ్నితోడ నిటకు రమ్మః ॥ 172

(5) గీ॥ అఖిల మిచ్చెడు మరియును నభిమతార్థ, మొసఁగు సోమము నరులకు నొసఁగి బలము
బలదుఁ డైనట్టి యింద్రుని పానమునకుఁ,బొంగి పొరలుచు నుండెఁ దాఁ బూజ్యులారః ॥ 173

(6) క॥ నీ దగువజ్రము యానము, నీవగు హరి యుగ్మమింద్రః నీ యాయుధముల్
మోద మొసంగెడు నీవలె, సాదరభామున సకల సంపద నిడవేః ॥ 174

(7) చ॥ అరి గణ నాశకుండవయి యాడఁ దలంబడఁగొట్టు వాఁడవై
కరము వెలుంగు చుండవాకొః కర్మలలోన నుతిప్రపంచమున్
స్థిరముగ నాలకింపవాకొః నిన్నుల కూపము నీట నెట్లొ య
ట్లరమర లేక సోమ సురసావభృదం బొనరింతు మింద్రుఁడాః ॥ 175

(8) ఉ॥ గడ్డిని మేసి తృప్తిఁగొని గ్రాలెడు ధేనువు తర్ణకంబు నే
యడ్డులు లేక ద్రిప్పునటు నంత యనిష్టముఁ గొట్టుచుండు మో
దొడ్డహరిః సులోచనలు తూర్ణము యౌవనవంతు రీతిఁ బె
ర్వడ్డ మహాస్తవంబున నవారిత ప్రీతిని నిన్నుఁ బొందవేః ॥ 176

(9) చ॥ స్తుతికరు లైన వారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచున్
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము మహేంద్రః మా కస
మ్మతు లగు వారి కీయకుముః మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతముఁ బ్రౌతులన్ బడసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమేః ॥ 177

## సూక్తమ్—17

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—జగతీ, 8-9 త్రిష్టుప్.

(1) తదస్మై నవ్యమఙ్గిరస్వదర్చత శుష్మా యదస్య ప్రత్నథోదీరతే ।

విశ్వా యద్ గోత్రా సహసా పరీవృతా మదే సోమస్య దృంహితాన్యైరయత్ ॥ 170

(2) స భూతు యో హ ప్రథమాయ ధాయస[1] ఓజో మిమానో మహిమానమాతిరత్ ।

శూరో యో యుత్సు తన్వం పరివ్యత శీర్షణి ద్యాం మహినా ప్రత్యముఞ్చత ॥ 171

(3) అధాకృణోః ప్రథమం వీర్యం మహద్ యదస్యాగ్రే బ్రహ్మణా శుష్మమైరయః ।

రథేష్ఠేన హర్యశ్వేన విచ్యుతాః ప్ర జీరయః సిస్రతే సధ్ర్యక్ పృథక్ ॥ 172

(4) అధా యో విశ్వా భువనాభి మజ్మనేశానకృత్ ప్రవయా[2] అభ్యవర్ధత ।

ఆద్ రోదసీ జ్యోతిషా వహ్నిరాతనోత్ సీవ్యన్ తమాంసి దుధితా సమవ్యయత్ ॥ 173

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. ధాయసఽఓజో, 2. ప్రవయాఽఅభ్య. (వ్రా.ప్ర.)

(5) స ప్రాచీనాన్ పర్వతాన్ దృంహదోజసా ऽధరాచీనమకృణోదపామపః ।

అధారయత్ పృథివీం విశ్వధాయసమ స్తభ్నాన్మాయయా ద్యామవస్రసః ॥ 174

(6) సాస్మా[1] అరం బాహుభ్యాం యం పితాకృణోద్ విశ్వస్మాదా జనుషో వేదసస్పరి ।

యేనా పృథివ్యాం ని క్రివిం శయధ్యై వజ్రేణ హత్వ్యవృణక్ తువిష్వణిః ॥ 175

(7) అమాజూరివ పిత్రోః సచా సతీ సమానాదా సదసస్త్వామియే భగమ్ ।

కృధి ప్రకేతముప మాస్యా భర దద్ధి భాగం తన్వో౩ యేన మామహః ॥ 176

(8) భోజం త్వామిన్ద్ర వయం హువేమ దదిష్ట్వమిన్ద్రాపాంసి వాజాన్ ।

అవిడ్ఢీన్ద్ర చిత్రయా న ఊతీ కృధి వృషన్నిన్ద్ర వస్యసో నః ॥ 177

(9) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 178

1. సాస్మాऽఅరం (ప్రా.ప్ర.)



## సూక్తము—17

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—ఇంద్రుఁడు

(1) చ॥ ఘన మగు పూర్ణదీప్తి గతకాలము రీతి జనించుచుండుటన్
మనమున సోమహర్షమును మానుగఁ బుట్టుట నేచి పాక శా
సనుఁడు పయోదశత్రువుని శక్తిసహాయతఁ జంపె నందుచే
త ననల యంగిరస్సుల విధంబున వాని నుతింపకుందుమే? ॥ 178

(2) చ॥ బలమును జూఁపి సోమ రస పానముఁ జేయుచు నైజ వీర్యమున్
లలి నభివృద్ధిఁ జేయుచుఁ దొలంగక యుండిన పాకశాసనుం
డల ఘన యుద్ధకాలమున నన్ని విధంబులఁ బ్రీతుఁడౌచుఁ దా
నెలమి నభంబు శీర్షముపయిన్ ధరియించుచు నుండె వింతగన్ ॥ 179

(3) చ॥ ప్రియ మగు సంస్తవంబునకుఁ బ్రీతుఁడవై బల మెల్లఁ జూఁపుచున్
గుయవుని వంక శత్రువులఁ గొట్టుచు నైజ శరీర కాంతితో
నియమిత సోమ మెల్లెడల నేప్పునఁ ద్రావఁగ నెంచుచున్ మహా
జయ మహిమంబు లోకమునఁ జాటుచు నుంటివి నీవు శక్రుఁడా! ॥ 180

(4) ఉ॥ చక్కని యన్నముం గలిఁగి సర్వ జగత్తుఁ బెరస్కరించి తా
నొక్కఁడె నాయకుం డగు చహోఁయను నట్టులు వృద్ధిఁ బొంది యిం
పెక్కెడు నైజ తేజమున నెంతయు వెల్గుచు లోక మంతటం
జిక్కెడు నంధకారమును జెచ్చెరఁ గొట్టఁడె? యింద్రుఁ డెంతయున్ ॥ 181

(5) సీ॥ అటు నిటుఁ బరుగెత్తు నన్ని పర్వతముల నిశ్చలంబుగఁ దాను నిలిపియుండె
మేఘరాశిస్థిత మేదుర వారుల జారునట్టులు తాను జరిపియుండె
విశ్వధాత్రిగ నుండు విపులాతలం బంతఁ దాను బలంబునఁ దాల్చి యుండెఁ
బరమ ద్యులోకము ప్రజ్ఞాబలంబులఁ బతనమ్ము లేకుండఁ బట్టియుండె
గీ॥ సకల రక్షకుఁడై తాను సకలజీవ,రాశికం బెను విజ్ఞాన రాశి యగుచు
సర్వలోకము రక్షించు శక్రుఁ డెలమి, నంతటన్ వ్యాప్తిఁ జెందుచు నమరియుండె ॥ 182

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6) గీ॥ బహు యశఃపూర్ణ శక్రుఁడు బహుళమైన, నెఱుకచేఁ[1] ద్రిధికు దానవు నిద్ధవజ్ర
మూలమునఁ జంపి వానినిఁజాల మేమిఁ, జేయకయె[2] పుడమి సజ్జపైఁ జేర్చినాఁడు ॥ 183

(7) క॥ పుట్టినది మొదలు పితరుల, నట్టింటనె యున్న దుహిత నయముగఁ దా నా
† పుట్టింట వంతుఁ గోరిన,యట్టుల హరి! నిన్ను ధనము యాచింప మొకో! ॥ 184

గీ॥ ఇంత ధన మిచ్చెద నటంచు నిపుడె సకల,జనుల ముందఱఁ బ్రకటించి శక్ర! నీవు
దాని సంపాదనమునకై తత్క్షణంబు, పోయి గొనితెచ్చి మా కిమ్ము! పూర్ణమతిని ॥ 185

(8) మ॥ మముఁ బాలించెడు వాఁడ వౌదువు సుమా, మా పిల్పు నాలింపుమా!
యమలాన్నంబును గర్మ సంచయము మా కందించు నీ వేమియుం
గ్రమముం దప్పక మమ్ము యోగ్య ధనులం గావించి రక్షింపుమా!
సుమనోదేవుఁడ! కామితార్థదుఁడ! సంశోభిల్లు వాఁడా! హరీ! ॥ 186

(9) చ॥ స్తుతికరులైన వారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచుం
దత ధనవంతమై దనరు దక్షిణ నిమ్ము మహేంద్ర! మా కస
మ్మతు లగు వారి కీయకుము మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతము పౌత్రులన్ బడసి చక్కఁగ నిన్ను నుతింప కుందుమే? ॥ 187

## సూక్తమ్—18

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ప్రాతా రథో నవో యోజి సస్నిశ్చతుర్యుగస్త్రికశః సప్తరశ్మిః ।

దశారిత్రో మనుష్యః స్వర్షాః స[1] ఇష్టిభిర్మతిభీ రంహ్యో భూత్ ॥ 179

1. ఇక్కడ నింద్ర గణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

2. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

† అవివాహిత లగు కన్యకలు తమ పుట్టింట నుండునట్టి యాచార మార్యులనాఁడు కల దనుటకుఁ బ్రామాణికముగా నీఋక్కు చాలును. అట్టి కన్యలనుగాని వారి తల్లి దండ్రులనుగాని బహిష్కరించెడు నాచార మా నాఁడు లేదు. అది స్మృతుల నాఁడు ఋషులు కల్పించి యుందురు. ఈ విషయమై స్మృతి కారకుల మతముకంటె వేద మతమే లోక హితమైనది. (నే.వేం.న.రా.)

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. సకఇష్టి (వ్రా.ప్ర.)

(2) సాస్మా[1] అరం ప్రథమం స ద్వితీయ ముతో తృతీయం మనుషః సహోతా ।
అన్యస్యా గర్భమన్య[2] ఊః జనన్త సో అన్యేభిః సచతే జేన్యో వృషా ॥ 180

(3) హరీ ను కం రథ[3] ఇన్ద్రస్య యోజమాయై సూక్తేన వచసా నవేన ।
మో షు త్వామత్ర బహవో హి విప్రా ని రీరమన్ యజమానాసో[4] అన్యే ॥ 181

(4) ఆ ద్వాభ్యాం హరిభ్యామిన్ద్ర యాహ్యా చతుర్భిరా షడ్భిర్హూయమానః ।
ఆష్టాభిర్దశభిః సోమపేయమయం సుతః సుమఖ మా మృధస్కః ॥ 182

(5) ఆ వింశత్యా త్రింశతా యాహ్యర్వాజా చత్వారింశతా హరిభిర్యుజానః ।
ఆ పఞ్చాశతా సురథేభిరిన్ద్రా[5] ఽఽషష్ట్యా సప్తత్యా సోమపేయమ్ ॥ 183

(6) ఆశీత్యా నవత్యా యాహ్యర్వాజా శతేన హరిభిరుహ్యమానః ।
అయం హి తే శునహోత్రేషు సోమ[6] ఇన్ద్ర త్వాయా పరిషిక్తో మదాయ ॥ 184

1. సాస్మాఽఅరం, 2. గర్భమన్యఽఊఃజనన్త సోఽఅన్యేభిః, 3. రథఽఇన్ద్రస్య, 4. యజమానాసోఽఅన్యే, 5. సురథేభిరిన్ద్ర షష్ట్యా, 6. సోమఽఇన్ద్ర. (వ్రా.ప్ర.)

(7) మమ బ్రహ్మేన్ద్ర యాహ్యచ్ఛా విశ్వా హరీ ధురి ధిష్వా రథస్య ।

పురుత్రా హి విహవ్యో బభూథాస్మిఞ్ఛూర సవనే మాదయస్వ ॥ 185

(8) న మ[1] ఇన్ద్రేణ సఖ్యం వి యోషదస్మభ్యమస్య దక్షిణా దుహీత ।

ఉప జ్యేష్ఠే వరూథే గభస్తౌ ప్రాయేప్రాయే జిగీవాంసః స్యామ ॥ 186

(9) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 187

## సూక్తము—18

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ అఖిల సంస్తవ యోగ్యమౌ యజ్ఞమందు, సప్త విధమైన ఛందస్సు చక్కనైన
ప్రస్తర చతుష్టయము మఱి ప్రథిత సంస్తవ త్రయము పాత్ర దశకముఁ బరఁగుచుండు॥ 188

గీ॥ యజ్ఞ మఖిల జనంబుల కఖిల హితముఁ, గూర్చు స్వర్గ సుఖంబును గూర్చు మఱియుఁ,
సంస్తవముఁగూడఁ జక్కని [2]జన్నముననుఁ, బ్రథితమయి వెల్గుచుండును బ్రకృతియందు ॥ 189

1. మఽఇన్ద్రేణ· (ప్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును, వ.గో.కృ.

2. యిష్టిచేత (ప్రా.ప్ర.పా.) యతిభంగ దోషయుక్తము. వ.గో.కృ.

## అర్థాంతరము

ఉ॥ ఉన్నత మైన కాంతులను నొప్పి చతుర్యుగయుక్త మౌచుఁ బే
రెన్నికఁ గన్న పగ్గముల నేడిట వెల్గుచు మూఁడు సప్త్రులన్[1]
గ్రన్ననఁ గల్గి పార్శ్వదశకంబున నుండు రథం బుషస్సునన్
దిన్నఁగ మానవోత్తముల నెక్కొని పోవును నాక వీథికై ॥ 190

(2) చ॥ హరికి రచింపఁగాఁబడిన యజ్ఞ సుకర్మలు మానవాళికిం
గరము ఫలం బొసంగు శుభ కర్మ కరుల్ మృదువాక్య గర్భమున్
స్థిరముగఁ జేయుచుందు రిఁకఁ జేరుచు నుండు ఘనేష్టి కర్మ సు
స్థిరముగఁ నన్య దేవతల దివ్యజయంబు లొసంగు చెంతయున్ ॥ 191

(3) గీ॥ అభినవ స్తోత్రములతోడ నమరవిభుని, యరదమునకయి హరినామకాశ్వవితతి
యోజనముఁ జేయఁబడె నింక నుచితరీతి, సంస్తుతులు చేయువారలు చాలఁ గలరు ॥ 192

(4) గీ॥ హరులలోన నాలు గారైన నెనిమిది,యైన దశకమైన హరులనెక్కి—
సోమపానమునకు సొంపుగ రావయ్య!, శోభనార్థయుక్త! శుభకరుండ! ॥ 193

(5) క॥ ఇరువది, ముప్పది, నలువది, మరి యేఁబది, షష్టియైన మంచి హయములన్
యరదంబునకుం బూన్చుచుఁ, బరమదయా! రమ్ము సోమ పానముఁ జేయన్ ॥ 194

(6) గీ॥ హరి! యశీతి, నవతి హరులనో! శతసంఖ్య, నమరునట్టి హరుల యరదముననో!
యధివసించి మాకు నభిముఖముగ వచ్చి, యందుకొనుము సోమ మమరనాథ! ॥ 195

(7) క॥ హరి! మా స్తుతి నాలింపుచు, హరి నామము గల్గినట్టి యశ్వములను నీ
యరదమునకు ముం దిడుకొని, బిరబిర రారమ్ము! శత్రుభేది! మహేంద్రా! ॥ 196

గీ॥ బహుళసంఖ్యాక మైనట్టి పరమనుతులఁ, బిలుచుచున్నారు ని న్నింద్ర! పెద్ద లెల్ల
వారి యాహ్వాన మాలించి వారి యాగ,కర్మమునఁ బ్రీతుఁడవు కమ్ము! ధర్మ ముండు ॥ 197

(8) గీ॥ మాకు నింద్రునకుం గల్గు మైత్రి మాన్ప, శక్తుఁ డెవ్వాఁడు గలుఁగు నీ జగతిఁగాన
నభిమత ఫలంబు లిడు మాకు నమరనాథ!, యోగ్య దక్షిణతోడుత నుచిత రీతి ॥ 198

1. సప్త్రులు = కొరడాలు

క॥ హరి దక్షిణ యాపదలం, గరము నివారించుఁగాక! గడు శత్రుంబౌ
నరి యుద్ధ భూములందున్, స్థిర లాభము నిచ్చుఁగాక: సుస్థిరరీతిన్ ॥ 199

(9) చ॥ స్తుతిపరులైన వారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచుం
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము మహేంద్ర! మా కస
న్మతులగు వారి కీయకుము: మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతము పౌత్రులం బడిసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమే? ॥ 200

## సూక్తమ్—19

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః †

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్

(1) అపాయ్యస్యాన్ధసో మదాయ మనీషిణః సువానస్య ప్రయసః ।

యస్మిన్నిన్ద్రః ప్రదివి వావృధాన[1] ఓకో దధే బ్రహ్మణ్యన్తశ్చ నరః ॥ 188

(2) అస్య మన్దానో మధ్వో వజ్రహస్తోఽహిమిన్ద్రో[2] అర్ణోవృతం వివృశ్చత్ ।

ప్ర యద్ వయో న స్వసరాణ్యచ్ఛా ప్రయాంసి చ నదీనాం చక్రమన్త ॥ 189

(3) స మాహిన[3] ఇన్ద్రో అర్ణో అపాం ప్రైరయదహిహాచ్ఛా సముద్రమ్ ।

అజనయత్ సూర్యం విదద్ గా[4] అక్తునాహ్నాం వయునాని సాధత్ ॥ 190

† ఋషి విశేషవిషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. వావృధానఽఓకో, 2. మిన్ద్రోఽఅర్ణో, 3. మాహినఽఇన్ద్రోఽఅర్ణోఽఅపాంప్రైరయ, 4. గాఽఅక్తు. (ప్రా.ప్ర.)

(4) సో[1] అప్రతీని మనవే పురూణీన్ద్రో దాశాద్ దాశుషే హన్తి వృత్రమ్ ।

సద్యో యో నృభ్యో[2] అతసాయ్యో భూత్ పస్పృధానేభ్యః సూర్యస్య సాతౌ ॥ 191

(5) స సున్వత[3] ఇన్ద్రః సూర్యమా[4] ऽऽదేవో రిణఙ్మర్త్యాయ స్తవాన్ ।

ఆ యద్ రయిం గుహదవద్యమస్మై భరదంశం నైతశో దశస్యన్ ॥ 192

(6) స రన్ధయత్ సదివః సారథయే శుష్ణమశుషం కుయవం కుత్సాయ ।

దివోదాసాయ నవతిం చ నవేన్ద్రః పురో వ్యైరచ్ఛమ్బరస్య ॥ 193

(7) ఏవా త[5] ఇన్ద్రోచథమహేమ శ్రవస్యా న త్మనా వాజయన్తః ।

అశ్యామ తత్ సాప్తమాశుషాణా ననమో వధరదేవస్య పీయోః ॥ 194

(8) ఏవా తే గృత్సమదాః శూర మన్మావస్యవో న వయునాని తక్షుః ।

బ్రహ్మణ్యన్త[6] ఇన్ద్ర తే నవీయ[7] ఇషమూర్జం సుక్షితిం సుమ్నమస్యుః ॥ 195

1. సోऽప్రతీని, 2. నృభ్యోऽతసాయ్యో, 3. సున్వతऽఇన్ద్ర, 4. సూర్యమాదేవో, 5. ఏవా తऽఇన్ద్రో,
6. బ్రహ్మణ్యన్తऽఇన్ద్ర, 7. నవీయऽఇష, (వ్రా.ప్ర.)

(9) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।

శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 196

## సూక్తము—19

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ చెలఁగి సోమాభిషవమును జేయునట్టి, పండితుఁడు సోమరసమునుఁ బాక హరున
కధిక తుష్టిని గలిఁగింప నతిశయముగ, భక్షణ మొసర్చుచున్నాఁడు పరమ భక్తి ॥ 201

గీ॥ ఆ పురాతనాన్న మభివృద్ధిఁ జెందుచుఁ, బ్రతుకఁ జేయుచుండుఁ బాక హరుని
నట్టియన్న మహిమఁ బట్టియె ఋత్విజు, లెల్లనిలుచుచుండి రుల్ల మలర ॥ 202

(2) చ॥ మదకరసోమపానమును మానుగఁ జేయుచు నింద్రుఁ డెంతయున్
ముదమున వజ్రముం గొను చమూల్య పయోదము గట్టునట్టి దు
ర్మదము గలట్టి రాక్షసుని బ్రమందెడున ట్లొనరింప వారిఁ దా
నుదధికిఁ జేరెఁ బక్షిగణ మోలిఁ గులాయముఁ జేరు కై వడిన్ ॥ 203

(3) క॥ అరిహంత యైన యింద్రుఁడు, సరసం బగు జలము నెల్ల సంద్రంబునకున్
స్థిరముగఁ బోవం జేయుచుఁ, గరము ప్రకాశించుచుండెఁ గ్రాలు జగములన్ ॥ 204

గీ॥ పూజ్యశక్రుఁడు సూర్యుని బుట్టఁ జేసి,గో సమూహంబు ప్రీతితోఁ గూర్చుచుండె
బలకరంబైన [1]తేజమ్ము బలము వలనఁ, జిరమ దినముల వెల్గఁగాఁ జేయుచుండె ॥ 205

---

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (667వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. బలకరంబైన తేజోబలంబువలన (వ్రా.ప్ర.పా.) యతిభంగ దోషయుక్తము. వ.గో.కృ.

(4) ఉ॥ మానుగ హవ్య మీయఁ జను మర్త్యులకై హరివిత్త మెంతయున్
దానముఁ జేసి వృత్రుఁ డను దానవుఁ ద్రుంచి వెలుంగు సూర్య స
న్మానముఁగూర్చి భక్త జన మధ్య విరోధము పుట్టి యుండఁ దా
మాసక యట్టివేళ నభిమానము గల్గిన వారిఁ జేరఁడే? ॥ 206

(5) ఉ॥ ఏతశ మౌనివర్యుఁ డమరేశుని వేడఁగ నాతఁ డెంతయుం
బ్రీత మనస్కుఁడౌచుఁ గడుఁ బ్రీతిని వానికి నిచ్చె సూర్యునిన్
బూతుఁడు తండ్రి విత్తమును బుత్రున కిచ్చెడునట్టు లేతశ
ఖ్యాతుఁడు శక్ర దేవునకుఁ గాంక్షిత సోమ మొసంగె భక్తితోన్ ॥ 207

(6) క॥ తన రథమునకున్ సారథి, యనఁబడు కుత్సునకు తగిన యాయుధ మిడి తా
ననిలోఁ గుయవుని గొట్టిం,చెను శక్రుఁడు దీప్తి యుక్త చిత్తం బలరన్ ॥ 208

గీ॥ అల దివోదాస మౌనిని నాదరింప,శంబరుని నవనవతి విశాలపురము
లను మహేంద్రుఁడు గొట్టి విలాస గతిని, నేల మట్టము గావించె లీలతోడ ॥ 209

(7) ఉ॥ అన్నము నీయు మంచు నిను యాచనఁ జేయఁగ నెంచి ప్రీతి మే
మెన్నెదమయ్య! దేవపతి! యెంతయు భక్తిని నిన్నుఁ బొందుచున్
గ్రన్నన సఖ్య మొందెదము కావునఁ బీయుని జంప నెంచి నీ
కున్నటువంటి వజ్రమును నోపి గ్రహింపుము చిత్తశుద్ధితోన్ ॥ 210

(8) క॥ గమనాభిలాషి పథమును, సమముగఁ బ్రస్తుతము చేయఁ జాలు విధము గృ
త్స మద గణంబున్ నిన్నే, క్రమముగ నుతిఁ జేయుచుండెఁ గమనీయ బలా! ॥ 211

గీ॥ నూత నుండవైన పూత చరిత్ర! నీ, కీర్తనంబుఁ జేయు గృత్సమద గ
ణంబు గృహము సుఖ బలంబులు గోరదె?, వాని నీయవలదె? బల యుతుండ! ॥ 212

(9) చ॥ స్తుతిపరులైనవారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచున్
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము మహేంద్ర! మా కస
మ్మతులగు వారి కీయకుము మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతముఁ బౌత్రులం బడసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమే! ॥ 213

## సూక్తమ్—20

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః†

దేవతా—ఇన్ద్రః

ఛందః—త్రిష్టుప్, 3-విరాడ్రూపా

(1) వయం తే వయ[1] ఇన్ద్ర విద్ధి షు ణః ప్ర భరామహే వాజయుర్న రథమ్ ।

విపన్యవో దీధ్యతో మనీషా సుమ్నమియక్షన్తస్త్వావతో నౄన్ ॥ 197

(2) త్వం న[2] ఇన్ద్ర త్వాభిరూతీ త్వాయతో[3] అభిష్టిపాసి జనాన్ ।

త్వమినో దాశుషో వరూతేత్థాధీరభి యో నక్షతి త్వా ॥ 198

(3) స నో యువేన్ద్రో జోహూత్రః సఖా శివో నరామస్తు పాతా ।

యః శంసన్తం యః శశమానమూతీ పచన్తం చ స్తువన్తం చ ప్రణేషత్ ॥ 199

(4) తము స్తుష[4] ఇన్ద్రం తం గృణీషే యస్మిన్పురా వావృధుః శాశదుశ్చ ।

స వస్వః కామం పీపరదియానో బ్రహ్మణ్యతో నూతనస్యాయోః ॥ 200

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. వయఽఇన్ద్ర, 2. నఽఇన్ద్ర, 3. త్వాయతోఽఅభిష్టి, 4. తము స్తుషఽఇన్ద్రం. (వా.ప్ర.)

(5) సో[1] అఙ్గిరసాముచథా జుజుష్వాన్ బ్రహ్మా తూతోదిన్ద్రో గాతుమిష్ణన్ ।
ముష్ణన్నుషసః సూర్యేణ స్తవానశ్నస్య చిచ్ఛిశ్నథత్ పూర్వ్యాణి ॥ 201

(6) స హ శ్రుత [2]ఇన్ద్రో నామ దేవ[3] ఊర్ధ్వో భువన్మనుషే దస్మతమః ।
అవ ప్రియమర్శసానస్య సాహ్వాఞ్ఛిరో భరద్ దాసస్య స్వధావాన్ ॥ 202

(7) స వృత్రహేన్ద్రః కృష్ణయోనీః పురందరో దాసీరైరయద్ వి ।
అజనయన్ మనవే క్షామపశ్చ సత్రా శంసం యజమానస్య తూతోత్ ॥ 203

(8) తస్మై తవస్యమను దాయి సత్రేన్ద్రాయ దేవేభిరర్ణసాతౌ ।
ప్రతి యదస్య వజ్రం బాహ్వోర్ధుర్హత్వీ దస్యూన్ పుర[4] ఆయసీర్ని తారీత్ ॥ 204

(9) నూనం సా తే ప్రతి వరం జరిత్రే దుహీయదిన్ద్ర దక్షిణా మఘోనీ ।
శిక్షా స్తోతృభ్యో మాతి ధగ్భగో నో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 205

1. సోఽఙ్గిరస 2. శ్రుతఽఇన్ద్రో. 3. దేవఽఊర్ధ్వో. 4. పురఽఆయసీ (వా.ప్ర.)

సూక్తము—20

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—ఇంద్రుఁడు

(1) ఉ॥ అన్నముఁ గోరు యోధవరుఁ డాత్మ రథంబును ద్రోలు నట్టు లో
యన్న! మహేంద్ర! నీకుఁ గడు నన్నము నిచ్చెదమయ్య! కావునం
గ్రన్నన మాకు సౌఖ్యమును గల్పనఁ జేయుము సంస్తవంబులన్
నిన్ను నుతించుచుండెదము నిర్జర నాథ! కులావతంసమా! ॥ 214

(2,3) సీ॥ మాకు రక్షల నిచ్చి మమ్ముఁ బాలింపుము! శత్రు నివారక! శక్రదేవ!
శత్రువులను గొట్టి చారు హవ్యం బిమ్ము! శత్రు నివారక! శక్రదేవ!
పరిచర్యలన్ గొని బహుకర్మ నీయుము! శత్రు నివారక! శక్రదేవ!
యజ్ఞముఁ జేయించి యజ్ఞఫలం బిమ్ము! శత్రు నివారక! శక్రదేవ!
గీ॥ హవ్యపాకముఁ జేయుచు నఖిలనుతుల, నుచ్చరించెడు వారిని మెచ్చి వారి
కాశ్రయం బిచ్చినట్లైన నమరనాథ!, సకల కర్మలు సమకూడు జగతియందు ॥ 215

(4) క॥ హరి నేను సంస్తుతించెద, హరి వర్ధితుఁడయ్యె మొదట నరులఁ దునుముచున్
హరిని బ్రశంసించినచో, హరి నూతన యాగకరుల కర్థంబిడఁడే? ॥ 216

(5) చ॥ స్తుతమతి నంగిరో మునుల సూక్తములన్ ముద మొంది వారి సం
స్తుతులను సత్ఫలంబులుగ సొంపుఁ దలిర్పఁగఁ జేసి వారి కే
విధమునొ మంచి మార్గమును వెల్గఁగఁ జేయుచు నింద్రుఁ డెంతయున్
స్తుతులను నొందియుండెఁగద! సూనృత వాక్య పరంపరావశిన్ ॥ 217

గీ॥ సూర్యమూలకమున సుందరోషస్సును, నపహరించి నట్టి యశ్నుఁ జంపి
వాని పట్టణములు వరుసగా నశింపఁజేయు, నట్లు చేసి యుండె నమర విభుఁడు ॥ 218

(6) క॥ ద్యుతి కీర్తిమంతుఁ డతిశయ, మతిమంతుఁడు శత్రుభేది మనుజోన్ముఖుఁడై
సతత మనిష్ట మొనర్చుచు, బ్రతితుం డగు దాసు శిరసు పడఁజేసె భువిన్ ॥ 219

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూడఁదగును. వ.గో.కృ.

(7) గీ॥ కృష్ణయోని దాసుఁ గ్రిందను బడఁజేసి, పుడమి జలము రెండు వుట్టఁజేసి
పురుష వరుల కోర్కె పూరించి మిక్కిలి, వెలుఁగుచుండె దుష్ట వృత్రహంత॥ 220

(8) చ॥ కరమున వజ్ర ముంప జయ కాంక్షను శక్రుఁడు శత్రుమండలిన్
స్థిరముగ లోహ బద్ధమయి చెన్ను వహించెడు శత్రుమాలికా
పురములఁ గొట్టి యుండుటను బూర్ణ జలంబుల నందఁజేసి తాన్
బరమ బల ప్రదాత్రి యగు భాసుర భక్తము నీయకుండునే? ॥ 221

(9) చ॥ స్తుతిపరు లైన వారలకు సుందర కాంక్షిత మెల్లఁ దీర్చుచున్
దత ధనవంతమై తనరు దక్షిణ నిమ్ము! మహేంద్ర! మా కస
మ్మతు లగు వారి కీయకుము! మానుగ దక్షిణ మేము పుత్రులన్
సతతముఁ బౌత్రులం బడసి చక్కఁగ నిన్ను నుతింపకుందుమే? ॥ 222

## సూక్తమ్—21

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—జగతీ, 6-త్రిష్టుప్

(1) విశ్వజితే ధనజితే స్వర్జితే సత్రాజితే నృజిత [1]ఉర్వరాజితే।

అశ్వజితే గోజితే [2]అబ్జితే భరేన్ద్రాయ సోమం యజతాయ హర్యతమ్ ॥ 206

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. నృజితఽఉర్వరాజితే, 2, గోజితేఽఅబ్జితే, (వ్రా.ప్ర.)

(2) అభిభూ॑వే॑ఽభిభ॒ఙ్గాయ వన్వ॒తే ఽషా[1]ళ్హాయ సహ॑మానాయ వే॒ధసే ।

తువి॒గ్రయే॒ వహ్న॑యే దు॒ష్టరీ॑తవే స॒త్రాసా॒హే నమ॒[2] ఇన్ద్రా॑య వోచత ॥ 207

(3) స॒త్రా॒సా॒హో జన॑భ॒క్షో జ॑నంస॒హశ్చ్యవ॑నో యు॒ధ్మో[3] అను॒ జోష॑ముక్షి॒తః ।

వృ॒త॒ంచ॒యః సహు॑రిర్వి॒క్ష్వా॑రి॒త[4] ఇన్ద్ర॑స్య వోచం॒ ప్ర కృ॒తాని వీ॒ర్యా ॥ 208

(4) అ॒నా॒ను॒దో వృ॑ష॒భో దోధ॑తో వ॒ధో గమ్భీ॒ర[5] ఋ॒ష్వో అస॑మష్టకావ్యః ।

ర॒ధ్ర॒చో॒దః శ్నథ॑నో వీళి॒తస్పృ॒థురిన్ద్రః॑ సుయ॒జ్ఞ[6] ఉ॒ష॒సః॒ స్వ॑ర్జనత్ ॥ 209

(5) య॒జ్ఞేన॑ గా॒తుమ॒ప్తు॑రో వివి॒ద్రి॑రే ధియో॑ హిన్వా॒నా[7] ఉ॒శిజో॑ మ॒నీషిణః॑ ।

అ॒భి॒స్వరా॑ ని॒ష॒దా గా[8] అ॑వ॒స్యవ॑ ఇన్ద్రే॑ హిన్వా॒నా ద్రవి॑ణాన్యాశత ॥ 210

(6) ఇన్ద్ర॒ శ్రేష్ఠా॑ని॒ ద్రవి॑ణాని ధేహి చి॒త్తిం దక్ష॑స్య సుభ॒గత్వ॑మ॒స్మే ।

పోషం॑ ర॒యీణా॒మరి॑ష్టిం త॒నూనాం॑ స్వా॒ద్మానం॑ వా॒చః సు॑దిన॒త్వమహ్నా॑మ్ ॥ 211

1. వన్వ॒తేఽషా॑ళ్హాయ॒, 2. నమ॑ఽఇన్ద్రా॑య, 3. యు॒ధ్మోఽను॑, 4. క్ష్వా॑రి॒తఽఇన్ద్ర॑, 5. గమ్భీ॒రఽఋ॒ష్వోఽసమ॑, 6. య॒జ్ఞఽఉ॒ష॒సః॒ఽస్వ॑ర్జనత్, 7. హిన్వా॒నాఽఉ॒శిజో॑, 8. ని॒ష॒దా గా ఽఅ॑వ॒స్యవ॒ఽ ఇన్ద్రే॑, (ప్రా.ప్ర.)

## సూక్తము—21

ఋషి—గృత్సమదుఁడు†

దేవత—ఇంద్రుఁడు

(1) క॥ మనుజ జయి స్వర్గవిజయియు, ధన విజయియు వారి విజయి ధరణీ విజియున్
ఘనభూమి విజయి హరిజయి,యనఁ దగు గో విజయి నింద్రు నాహ్వానింతున్ ॥ 223

(2) గీ॥ సర్వసముఁడు సర్వ శత్రు తిరస్కారి, [1]జయ విధాతయైన సకలవోఢ
సకలభోగకారి సంపూర్ణ కంతుఁడౌ, శక్రదేవు నేను సంస్మరింతు ॥ 224

(3) క॥ బలవంతుఁడు భజనీయుఁడు, ఖలశత్రు విదారకుండు ఖల హింసకుఁడున్
బలయోద్ధ ప్రీతికరుఁడౌ, బలవద్ధరి [2]కర్మలెల్లఁ బలికెదను సుమా! ॥ 225

(4) సీ॥ అతులదానము లిచ్చు నఖిలార్థము లొసంగు గాంభీర్యమును జూపు ఖలులఁ ద్రుంచు
దర్శనీయుం డగు ధరఁ గల శత్రుల వధియించు హింసక వధలఁ జేయు
జనుల కుత్సాహంబు జనియింపఁగాఁ జేయుఁ గఠిన శత్రువులను గర్తరించు
జగముల వ్యాపించుఁ జారు రూపము నొందు నతిదృఢాంగముఁ గల్గు నతిశయించు
గీ॥ నట్టి యమరాధినాథుండు యజ్ఞయుక్తుఁ, డగు చుషస్సున సూర్యుని దగినయట్లు
పుట్టఁ జేయుచు నున్నాఁడు పూజ్యులార!, యింద్రమహిమల వర్ణింప నేరి తరము? ॥ 226

(5) చ॥ స్తుతిపరు లంగిరో మునులు సూక్తులఁ గల్గిన వార లౌచు దు
ర్మతి హృత గో ప్రసంగమును మాన్య మహేంద్రునిచే నెఱుంగుచున్
స్తుతియుతపూజలన్ జరిపి సుందరశక్రుని వేడి గో ధన
ప్రతతిని బొందఁ గల్గి రతిభద్ర పురస్సర సంతసంబుతోన్ ॥ 227

(6) గీ॥ ఉత్తమ ధనంబు మాకీయు ముచితమైన,దక్షణఖ్యాతి నందింపు ధరను మాకు
శక్ర! సౌభాగ్య మీయుము! సకల తనువు, కాచుచున్[3] దినము సుదినముగా నొనర్చు ॥ 228

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. "సర్వవిదాత్ముండు సకలవోఢ" (వ్రా.ప్ర.పా.) గణభంగ దోషయుక్తము. వ.గో.కృ. 2. కర్మలన్ని (వ్రా.ప్ర.పా.)
3. ఇక్కడ నింద్ర గణమునకు మారు "భల"ము ప్రయుక్త మైనది. వ.గో.కృ.

## సూక్తమ్—22

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః

ఛందః—1-అష్టిః; 2-3-అతిశక్వరీ; 4-అష్టిః అతిశక్వరీ వా

(1) త్రికద్రుకేషు మహిషో యవాశిరం తువిశుష్మస్తృపత్

సోమమపిబద్ విష్ణునాసుతం యథావశత్ ।

స[1] ఈం మమాద మహి కర్మ కర్తవే మహాముఱుం సైనం

సశ్చద్ దేవో దేవం సత్యమిన్ద్రం సత్య[2] ఇన్దుః ॥ 212

(2) అధ త్విషీమాగ్ం[3] అభ్యోజసా క్రివిం యుధాభవదా

రోదసీ[4] అపృణదస్య మజ్మనా ప్ర వావృధే ।

అధత్తాన్యం జఠరే ప్రేమరిచ్యత సైనం

సశ్చద్ దేవో దేవం సత్యమిన్ద్రం సత్య[2] ఇన్దుః ॥ 213

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. సఽఈం, 2. సత్యఽఇన్దుః, 3. త్విషీమాగ్ంఽఅభ్యో, 4, రోదసీఽఅపృణ దస్య, (వ్రా.ప్ర.)

(3) సాకం జాతః క్రతునా సాకమోజసా వవక్షిథ

సాకం వృద్ధో వీర్యైః సాసహిర్మృధో విచర్షణిః ।

దాతా రాధః స్తువతే కామ్యం వసు సైనం

సశ్చద్ దేవో దేవం సత్యమిన్ద్రం సత్య[1] ఇన్దుః ॥ 214

(4) తవ త్యన్నర్యం నృతోఽప[2] ఇన్ద్ర ప్రథమం

పూర్వ్యం దివి ప్రవాచ్యం కృతమ్ ।

యద్ దేవస్య శవసా ప్రారిణా[3] అసుం రిణన్నపః ।

భువద్ విశ్వమభ్యాదేవమోజసా విదాదూర్జం శతక్రతుర్విదాదిషమ్ ॥ 215

## సూక్తము—22

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—ఇంద్రుఁడు

(1) గీ॥ బహుళ బలశాలి దుర్మతి బల నిహంత, ఘన త్రికద్రుక* నామక కర్మలందు
సుష్టు యవ మిశ్రితం బగు సోమరసము, విష్ణువునుఁ గూడి గ్రోలఁడే? వివిధ గతుల ॥ 229

1. సత్యఽఽఇన్దుః. 2. నృతోఽపఽఇన్ద్ర. 3. ప్రారిణాఽఅసుం (వ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును. వ. గో. కృ.

* సంస్కృతాంధ్రములలో రెండింటను "త్రికద్రుక" "త్రికర్థుక" "త్రికర్ధుక" "త్రికద్దుక" శబ్దములు రూపాంతరములుగా నుపయుక్తము లైనవి. వ. గో. కృ.

గీ॥ అమిత తేజో విశిష్టుఁ డా యమరనాథుఁ, డమిత కార్యము సాధింప హర్షయుక్త
నిగ నొసర్చిన సోమము నిశ్చయముగ, సత్యముగ వెల్గి వ్యాపించు శక్రునందు ॥ 230

(2) సీ॥ సందీప్యమానుఁడై చక్కని బలముచేఁ గ్రిమిని యుద్ధములందుఁ గెంటు నట్టి
తేజఃకలనచేత దివి భువి నంతట సంపూర్ణముగఁ జేయఁ జాలినట్టి
సోమ బలావిష్ట సుందర తనువుతో వృద్ధిని బొందుచు వెలుఁగునట్టి
తా నొక భాగంబు ధరియించి యొక్కటి తెచ్చి దేవాళికి నిచ్చినట్టి
గీ॥ సత్యరూపము గల వాని శక్తివంతు, శక్రదేవుని వెలిఁగెడు సత్య సోమ
రసము వ్యాపించుచుండుట రహిఁ జెలంగ, దీప్తి యుతుఁడయ్యె జగముల దివిజవిభుఁడు ॥ 231

(3) గీ॥ పూజ్య యాగ బలంబులఁ బుట్టియుంట, సకలము వహించుచుంటివి శక్ర! నీవు
వీర్యబలములతో నీవు వృద్ధిఁబొంది, హింసఁ బెట్టుచు నున్నావు హింసకులను ॥ 232

గీ॥ సకల సాధక మగునట్లు సర్వవాంఛ,నీయ ధనము నొసంగుము నిర్జరేశ!
సత్యముగ వెల్గు సోమము సత్యదేవ!, యందముగ నున్న నిన్నెప్పుఁ జెందుఁగాక! ॥ 233

(4) చ॥ మనుజ హితంబుగాఁగ హరి! మానుగ నీ వొసరించి యున్న యా
ఘన మగు కర్మ యంతయును గ్రాలదె ఖస్థలి నాట్య కారకా!
నిను నుతియించు దివ్యులకు నీటి నొసంగుచు వారి జీవముల్
పనిగొని నిల్పినావుకద! పాకహరా! నిను నెన్న శక్యమే? ॥ 234

## అనువాకః—3 సూక్తమ్—23

### ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః †

### దేవతా—బృహస్పతిః; 1,5,9,11,17,19-బ్రహ్మణస్పతి

### ఛందః—జగతీ, 15,19-త్రిష్టుప్

(1) గణానాం త్వా గణపతిం హవామహే కవిం కవీనాముపమశ్రవస్తమమ్ ।

జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత[1] ఆ నః శృణ్వన్నూతిభిః సీద సాదనమ్ ॥ 216

† ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ సూక్తము ఋషి విషయకమైన ఫుట్ నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. స్పతకాఆనః, (ప్రా.ప్ర.)

(2) దేవాశ్చిత్ తే[1] అసుర్య ప్రచేతసో బృహస్పతే యజ్ఞియం భాగమానశుః ।
ఉస్రా[2] ఇవ సూర్యో జ్యోతిషా మహో విశ్వేషామిజ్జనితా బ్రహ్మణామసి ॥ 217

(3) ఆ విబాధ్యా పరిరాపస్తమాంసి చ జ్యోతిష్మన్తం రథమృతస్య తిష్ఠసి ।
బృహస్పతే భీమమమిత్రదమ్భనం రక్షోహణం గోత్రభిదం స్వర్విదమ్ ॥ 218

(4) సునీతిభిర్నయసి త్రాయసే జనం యస్తుభ్యం దాశాన్న తమంహో[3] అశ్నవత్ ।
బ్రహ్మద్విషస్తపనో మన్యుమీరసి బృహస్పతే మహి తత్ తే మహిత్వనమ్ ॥ 219

(5) న తమంహో న దురితం కుతశ్చన నారాతయస్తితిరుర్న ద్వయావినః ।
విశ్వా[4] ఇదస్మాద్ ధ్వరసో వి బాధసే యం సుగోపా రక్షసి బ్రహ్మణస్పతే ॥ 220

(6) త్వం నో గోపాః పథికృద్ విచక్షణస్తవ వ్రతాయ మతిభిర్జరామహే ।
బృహస్పతే యో నో[5] అభి హ్వరో దధే స్వా తం మర్మ[6]ర్తు దుచ్ఛునా హరస్వతీ ॥ 221

1. తేఽసుర్య, 2. ఉస్రాఽఇవ, 3. తమంహోఽశ్న, 4. విశ్వాఽఇదస్మాద్ 5. యోనోఽఅభి, 6. మమర్త్తు (వ్రా.ప్ర.)

(7) ఉత వా యో నో మర్చయాదనాగసో ऽరాతీవా మర్తః సానుకో వృకః ।

బృహస్పతే[1] అప తం వర్తయా పథః సుగం నో[2] అస్యై దేవవీతయే కృధి ॥ 222

(8) త్రాతారం త్వా తనూనాం హవామహే ऽవస్పర్తరధివక్తారమస్మయుమ్ ।

బృహస్పతే దేవనిదో ని బర్హయ మా దురేవా[3] ఉత్తరం సుమ్నమున్నశన్ ॥ 223

(9) త్వయా వయం[4] సువృధా బ్రహ్మణస్పతే స్పార్హా వసు మనుష్యా దదీమహి ।

యా నో దూరే తళితో యా[5] అరాతయో ऽభి సన్తి జమ్భయా తా[6] అనప్నసః ॥ 224

(10) త్వయా వయముత్తమం ధీమహే వయో బృహస్పతే పప్రిణా సస్నినా యుజా ।

మా నో దుఃశంసో[7] అభిదిప్సురీశత ప్ర సుశంసా మతిభిస్తారిషీమహి ॥ 225

(11) అనానుదో వృషభో జగ్మిరాహవం నిష్టప్తా శత్రుం పృతనాసు సాసహిః ।

అసి సత్య[8] ఋణయా బ్రహ్మణస్పత[9] ఉగ్రస్య చిద్ దమితా వీళుహర్షిణః ॥ 226

---

1. బృహస్పతేऽఅప, 2. నోऽఅస్యై, 3. దురేవాऽఉత్తరం, 4. వయ సువృధా, 5. యాऽఅరాతయో, 6. తాऽఅనప్నసః, 7. శంసోऽఅభి, 8. సత్యऽఋణయా, 9. బ్రహ్మణస్పతऽఉగ్ర. (వా.ప్ర.)

(12) అదేవేన మనసా యో రిషణ్యతి శాసాముగ్రో[1] మన్యమానో జిఘాంసతి ।

బృహస్పతే మా ప్రణక్ తస్య నో వధో ని కర్మ మన్యుం దురేవస్య శర్ధతః ॥ 227

(13) భరేషు హవ్యో నమసోపసద్యో గన్తా వాజేషు సనితా ధనంధనమ్ ।

విశ్వా[2] ఇదర్యో అభిదిప్స్వో[ ]మృధో బృహస్పతిర్వి వవర్హా రథాఁ[3] ఇవ ॥ 228

(14) తేజిష్ఠయా తపనీ రక్షసస్తప యే త్వా నిదే దధిరే దృష్టవీర్యమ్ ।

ఆవిస్తత్ కృష్వ యదసత్ త[4] ఉక్థ్యం బృహస్పతే వి పరిరాపో[5] అర్దయ ॥ 229

(15) బృహస్పతే[6] అతి యదర్యో[7] అర్హాద్ ద్యుమద్ విభాతి క్రతుమజ్జనేషు ।

యద్ దీదయచ్ఛవస[8]ఋతప్రజాత తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రమ్ ॥ 230

(16) మా నః స్తేనేభ్యో యే[9] అభి ద్రుహస్పదే నిరామిణో రిపవోఽన్నేషు జాగృధుః ।

ఆ దేవానామోహతే వి వ్రయో హృది బృహస్పతే న పరః సామ్నో విదుః ॥ 231

---

1. శాసాముగ్రో మన్యమానో, 2. విశ్వాఽఇదర్యోఽభిదిప్స్వః, 3. రథాఁఽఇవ, 4. తఽఉక్థ్యం, 5. పరిరాపోఽఅ

6. బృహస్పతేఽఅతి, 7. యదర్యోఽఅర్హాద్, 8. దీదయచ్ఛవసఽఋత, 9. యేఽఅభి, (ప్రా.ప్ర.)

(17) విశ్వేభ్యో హి త్వా భువనేభ్యస్పరి త్వష్టాజనత్ సామ్నః సామ్నః కవిః ।

స[1] ఋణచిదృణయా బ్రహ్మణస్పతిర్ద్రుహో హన్తా మహ[2] ఋతస్య ధర్తరి ॥ 232

(18) తవ శ్రియే వ్యజిహీత పర్వతో గవాం గోత్రముదసృజో యదఙ్గిరః ।

ఇన్ద్రేణ యుజా తమసా పరీవృతం బృహస్పతే నిరపామౌబ్జో[3] అర్ణవమ్ ॥ 233

(19) బ్రహ్మణస్పతే త్వమస్య యన్తా సూక్తస్య బోధి తనయం చ జిన్వ ।

విశ్వం తద్ భద్రం యదవన్తి దేవా బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 234

ఇతి

ద్వితీయోఽష్టకే షష్ఠోఽధ్యాయ

స్సమాప్తః

1. సఋణ, 2. మహఋతస్య, 3. నిరపామౌబ్జోఽఅర్ణవమ్. (వ్రా.ప్ర.)

## అనువాకము—3, సూక్తము—23

ఋషి--గృత్సమదుఁడు †

దేవత—బ్రహ్మణస్పతి—2,3,4,6-8,10,12-16,18—బృహస్పతి*

(1) గీ॥ గణములకు నెల్లఁ బతివౌట గణపతి వని, కవి సమూహంబులోపలఁ గవి వరుండ
వౌదు వని యెంచి నీ యన్న మధిగమింతు, బ్రహ్మణస్పతి! నీ వెంత వాఁడవయ్య! ॥ 235

గీ॥ సకల మంత్రములకు నీవు సామివయ్య!, జ్యేష్ఠ రాజువు గావయ్య? చిట్టియయ్య!
మా స్తవంబుల నేవేళ మరువకయ్య!, బ్రహ్మణస్పతి! నీ వెంత వాఁడవయ్య! ॥ 236

(2) గీ॥ ఓయి సూర్య! బృహస్పతి! యో మహాత్మ!, నీవు సద్యజ్ఞభాగము నిర్జరులకు
నీయ నది గ్రోలి వారలు నిశ్చయముగఁ, జారు వర్చస్సు నందిరి జ్ఞానవంత! ॥ 237

క॥ ఘన మగు జ్యోతి స్తతిచే, దినకరుఁ డెటు ఘృష్టి చయము దిశల కనుపునో
ఘన బ్రహ్మణస్పతీ! నీ, వును మంత్రము లట్లఁ జేయ [1]నుందువు ప్రీతిన్ ॥ 238

(3) గీ॥ నింద కాంధకార నిస్తుల సమితిని, దూర మేగునటులఁ ద్రోలి వేసి
యజ్ఞ బోధకుండ వగు బ్రహ్మణస్పతి!, కదిలి రావె! నీవు కర్మలకయి ॥ 239

---

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

* ద్వితీయ మండలములోని యీ 23వ సూక్తమునకు దేవత "బ్రహ్మణస్పతి" యని వ్రాతప్రతి 2వ సంపుటము 301వ పుటలో వ్రాయఁబడినది. కాని ఋషి దేవతల పట్టికలు గల 14b సంఖ్యగల సంపుటములో బ్రహ్మణస్పతి, బృహస్పతి యిరువురును దేవత లైనట్లు వ్రాయఁబడినది. సంస్కృతమూలములోఁ గూడ కొన్ని ఋక్కులకు బ్రహ్మణస్పతి దేవతగను మరికొన్ని ఋక్కులకు బృహస్పతి దేవతగను పేర్కొనఁబడినది. శ్రీ నేమానివారు తమ యాంధ్రానువాదపద్యములలో సంస్కృత మూలమున కనుగుణముగనే 1, 5, 9, 11, 17, 19 ఋక్కులకు బ్రహ్మణస్పతి, 2-4, 6-8, 10, 12-16, 18 ఋక్కులకు బృహస్పతి దేవతలుగ నుటంకించిరి. కొంద రాధునిక విమర్శకులు బ్రహ్మణస్పతియు, బృహస్పతియు నొక్కరే యని భావించిరి గాని యది సత్యసమ్మతము కానేరదు. (చూ. పీఠిక) వ.గో.కృ.

1. ఈ 238వ పద్యము నాల్గవపాదములో "పు-ఉ"లకు యతిమైత్రి పాటింపఁబడినది (చూ. పీఠిక) వ.గో.కృ.

గీ॥ భయము కలిఁగించు వాఁడవు పరమశత్రు, నాశకుండవు రాక్షస నాయకుండ
వమర పద మిచ్చు వాఁడవౌ నమల బ్రహ్మ,ణస్పతీ! యరద మెక్కి మాయంద మెక్కఁగ॥ 240

(4) చ॥ స్థిరమతి హవ్య దానములఁ జేసెడు వారల నీవు దీక్షతోఁ
బరమ కృపాన్వితుండవయి భవ్య పదంబునఁ బెట్టి కావుమా!
గురుతర మంత్ర శత్రులకుఁ గూర్పుము తాపము కొట్టి కోపముం
జిర మగు నీ మహత్వమును జెప్పఁగ శక్యమె? బ్రహ్మణస్పతీ! ॥ 241

(5,6) సీ॥ బ్రహ్మణస్పతీ! నీవు రక్షించుటంజేసి దురితంబు లన్నియుఁ దొలఁగిపోవు!
బ్రహ్మణస్పతీ! నీవు రక్షించుటంజేసి దుఃఖంబు లన్నియుఁ దూరిపోవు!
బ్రహ్మణస్పతీ! నీవు రక్షించుటంజేసి వంచక వర్గంబు పారిపోవు!
బ్రహ్మణస్పతీ! నీవు రక్షించుటంజేసి హింసక వర్గంబు లెగిరిపోవు!
గీ॥ బ్రహ్మణస్పతీ! నీవు మా ప్రాణములకు, రక్షకుండవు సర్వథ రక్షకుఁడవు
కుటిలు లందఱు దుర్బుద్ధిఁ గూడుకొనుచు, వెతలఁ బడుదురుఁగాక నేవిధమునైన ॥ 242

(7) గీ॥ గర్వితుండు సర్వకంటకుఁ డెవ్వఁడేని, మమ్ము హింసఁ బెట్ట మరలె నేని
నట్టి వ్యక్తి కెప్పు దండింపకుము సత్యపథము మాకు దానిఁ బదిలపరచు! ॥ 243

(8,9) సీ॥ మా యుపద్రవముల మన్నించుచున్ నీవు పుత్రులఁ గాపాడఁ బూనుమయ్య!
యిష్టవాక్యంబుల స్పష్టము పల్కుచు సుప్రసన్నత మమ్ముఁ జూడుమయ్య!
మా సదాహ్వానంపు మర్మ మాలించుచు దేవ నిందకులను గావకయ్య!
దుర్బుద్ధి గణముల దూరము ద్రోలుచు నట్టివారిని సౌఖ్యపెట్టకయ్య!
గీ॥ బ్రహ్మణస్పతీ! మము నీవు వర్ధితులుగఁ, జేసి యుండిన మనుజుల చెంతనుండి
ధనము నొందెద మెటులైన మొనసి నీవు, యజ్ఞహీనుల శత్రుల నడఁచుమయ్య! ॥ 244

(10) గీ॥ బ్రహ్మణస్పతీ! నీ విలఁ బావనుఁడవు, నీ సహాయంబుఁ బడయుచు నిశ్చయముగ
నన్న లాభంబు నొందుచు నమరఁగలము, కామితార్థ ప్రదాయక! ఘన యశుండ!॥ 245

గీ॥ మాకు నభిభవంబు మానకఁ జేసెడు, కలినుఁ దధిపుఁ డౌచుఁ గ్రాలఁగలఁడె?
పూజ్య! నుతులవలనఁ బుణ్యవంతుఁడనయి, యున్న విక్రమంబు నొందఁగలను ॥ 246

(11,12) సీ॥ అసమాన దాతయై యభిమతార్థం బిచ్చు బ్రహ్మణస్పతి నేను బ్రస్తుతింతు
జన్యంబునకుఁ బోయి శత్రువులం గొట్టు బ్రహ్మణస్పతి నేను బ్రస్తుతింతు
నాత్మాభిమానుల సంత మొందించెడు బ్రహ్మణస్పతి నేను బ్రస్తుతింతు
నాయుధ బాధల నడఁచి పెట్టిన యట్టి బ్రహ్మణస్పతి నేను బ్రస్తుతింతు
గీ॥ సత్య మగు బ్రహ్మణస్పతి సంస్తవములఁ, బ్రస్తుతించెదఁ గాన నా బ్రహ్మణస్ప
తి కడు వైరుల నెల్లరఁ దివిరి గొట్టి, యుగ్రుఁడై వెల్గుఁగాక! సమగ్రుఁ డగుచు ॥ 247

(13,14) సీ॥ అనులఁ బ్రవర్తించు నాహ్వానముల నెల్ల వినుటకు యోగ్యుఁడై వెలయుచున్న
పూజ్య నమస్కారపూర్వకోపాస్యుఁడై యా యోధనమునకు నరుఁగుచున్న
యభిభవేచ్ఛను నొప్పు నరి మండలంబును నరదంబులాగున నడఁచుచున్న
సంతాపదంబులౌ సకల హేతులతోడ దానవ గణములఁ ద్రచ్చుచున్న
గీ॥ బ్రహ్మణస్మతి వీర్యంబు ప్రథితులైన, దానవులు నిందఁ జేయంగఁ బూని యుండఁ
బూర్వ వీర్యంబు నంతయుఁ బ్రోగుఁజేసి, బ్రహ్మణస్పతి కొట్టఁడె? పరుల నెల్ల ॥ 248

(15) గీ॥ ఆర్య లెద్దానిఁ బూజింత్రు యజ్ఞయుతము, దీప్తి యుక్తమునై యేది తేజరిల్లు
నట్టి చిత్ర ధనంబు మా కందఁజేయు, మో బృహస్పతి! నీవు మా కోలిఁ గృపను ॥ 249

(16) సీ॥ ద్రోహంబుఁ జేయు విద్రోహుల పంక్తికి మమ్ము నర్పించుట మాను మీవు!
పరుల యన్నంబును భక్షించు వారికి మమ్ము నర్పించుట మాను మీవు!
బాధించుచున్నట్టి పరమశత్రువులకు మమ్ము నర్పించుట మాను మీవు!
నిర్జరసేవను నేర్వని వారికి మమ్ము నర్పించుట మాను మీవు!
గీ॥ తస్కరులు వారు ధర్మంబు నెఱుఁగఁబోరు, సామ సంస్తుతిఁ దెలియంగఁ జాల రెపుడుఁ
గాన మము వారి వశ్యులుగా నొనర్ప, కుండుమోయి! బృహస్పతి! యుండుమోయి! ॥ 250

(17) గీ॥ బ్రహ్మణస్పతీ! నిన్నల త్వష్ట సకల, సారవంతునిగాఁ జేయఁ జాలియుండెఁ
గావునన్[1] సకల సామాది కల్పనలను, నుచ్చరించుచు నున్నాఁడ నుచ్చగతిని ॥ 251

1. ఇక్కడ నింద్ర గణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

గీ॥ కర్మకరు లెల్ల యజ్ఞముల్ గలసి చేయ, నున్నచో బ్రహ్మణస్పతి! యుచితరీతిఁ
ద్వదృణంబును బరిశోధితంబుఁ జేయు, చున్నవాఁడవు నీ కృత్య మెన్నఁ దరమె? ॥ 252

(18) గీ॥ అద్రి యాల సమూహంబు నావరింప, బ్రహ్మణస్పతి! దానిని బైటఁ బెట్టి
వజ్ర సాహాయ్యమును బొంది వారి నెల్ల, జలనిధిఁ బోవు నట్టులు సలిపినావు! ॥ 253

(19) చ॥ సకల నియామకుండవయి చక్కని సూక్తి నెఱుంగు వాఁడవై
యకలుషమైన సంతతికి నత్యధికంబుగఁ బ్రీతిఁ జేసి యు
త్సుక లగు దైవభక్తులను [1]నున్నతివంతులఁ జేసి యున్నచో
సకలుష పుత్ర పౌత్రులను నార్యబృహస్పతి! నిన్ను వేడరే? ॥ 254

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తి ముక్తాయమాన
భగవత్పాదారాధక నేమాని వేంకట నరసింహశాస్త్రి విరచిత
కృతులలో శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు ద్వితీయాష్టకమున
షష్ఠాధ్యాయము సమాప్తము

---

1. ఈ 254వ పద్యము చంపకమాల మూఁడవ పాదములోఁ గేవల "ఉ"కార స్వరయతి పాటింపఁబడినది. వ.గో.కృ.

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా
## ద్వితీయం మండలమ్

ద్వితీయోఽష్టకః—సప్తమోఽధ్యాయః

### సూక్తమ్—24

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

† దేవతా—బ్రహ్మణస్పతిః; 1,10-బృహస్పతిః

12—ఇన్ద్రా బ్రహ్మణస్పతీ

ఛందః—జగతీ; 12,16-త్రిష్టుప్

(1) సేమామవిడ్ఢి ప్రభృతిం య[1] ఈశిషే ఽయా విధేమ నవయా మహా గిరా ।

యథా నో మీఢ్వాన్ త్స్తవతే సఖా తవ బృహస్పతే సీషధః సోత నో మతిమ్ ॥ 235

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూడ నగును. వ.గో.కృ.

† ద్వితీయమండలములోని 24వ సూక్తములోని ఋక్కులకు సంస్కృతమూలప్రతులలో 1, 10 ఋక్కులకు "బృహస్పతి" దేవతగను 12వ ఋక్కునకు "ఇన్ద్రా బ్రహ్మణస్పతులు" దేవతలుగను మిగిలిన వానికి "బ్రహ్మణస్పతి" దేవతగను పేర్కొనుట జరిగినది. కాని సాయనభాష్యములోను మాక్సుముల్లర్ ప్రతిలోను 1, 10 ఋక్కులకు "బృహస్పతి" దేవత యని ప్రత్యేకముగా పేర్కొనఁబడలేదు. 1, 10 ఋక్కుల భాష్యములో సాయనాచార్యులు "బృహస్పతి"యనియే వ్యాఖ్యానము వ్రాసిరి. కావున దేవతలను పేర్కొనుటలో బృహస్పతిని వ్రాయక పోవుట ప్రమాదభరితము కా నోపును. కాని బ్రహ్మణస్పతి, బృహస్పతులు లిరువురును విభిన్నులు గాని యొక్కరు కారు. (చూ. పీఠిక) వ.గో.కృ.

1. యఽఈశిషే. (వా.ప్ర.)

(2) యో నన్త్వాన్యనమన్న్యోజసోతాదర్దర్మ[1]న్యునా శమ్బరాణి వి ।
ప్రాచ్యావయదచ్యుతా బ్రహ్మణస్పతిరా చావిశద్ వసుమన్తం వి పర్వతమ్ ॥ 236

(3) తద్ దేవానాం దేవతమాయ కర్త్వమశ్రథ్నన్ దృ[2]ళ్హావ్రదన్త వీళితా ।
ఉద్ గా[3] ఆజదభినద్ బ్రహ్మణా వలమగూహత్ తమో వ్యచక్షయత్ స్వః ॥ 237

(4) అశ్మాస్యమవతం బ్రహ్మణస్పతిర్మధుధారమభి యమోజసాతృణత్ ।
తమేవ విశ్వే పపిరే స్వర్దృశో బహు సాకం సిసిచురుత్సముద్రిణమ్ ॥ 238

(5) సనా తా కా చిద్ [4]భువనా భవీత్వా మాద్భిః శరద్భిర్దురో వరన్త వః ।
అయతన్తా చరతో[5] అన్యదన్యదిద్ యా చకార వయునా బ్రహ్మణస్పతిః ॥ 239

(6) అభినక్షన్తో[6] అభి యే తమానశుర్నిధిం పణీనాం పరమం గుహా హితమ్ ।
తే విద్వాంసః ప్రతిచక్ష్యానృతా పునర్యత[7] ఉ ఆయన్ తదుదీయురావిశమ్ ॥ 240

1. దర్దర్మ. 2. దృళహా. 3. ఉద్గాऽఆజ (వా.ప్ర.) 4. భువనా (సా). 5. చరతోऽఅన్య 6. అక్షన్తోऽఅభి,
7. పునర్యతऽఉऽఆయన్. (వా.ప్ర.)

(7) ఋతావానః ప్రతిచక్ష్యానృతా పునరాత[1] అ తస్థుః కవయో మహస్పథః ।

తే బాహుభ్యాం ధమితమగ్నిమశ్మని నకిః[2] షో అస్త్యరణో జహుర్హితమ్ ॥ 241

(8) ఋతజ్యేన క్షిప్రేణ బ్రహ్మణస్పతిర్యత్ర వష్టి ప్ర తదశ్నోతి ధన్వనా ।

తస్య సాధ్వీరిషవో యాభిరస్యతి నృచక్షసో దృశయే కర్ణయోనయః ॥ 242

(9) స సంనయః స వినయః పురోహితః స సుష్టుతః స యుధి బ్రహ్మణస్పతిః ।

చాక్ష్మో యద్ వాజం భరతే మతీ ధనా[3] ऽऽదిత్ సూర్యస్తపతి తప్యతుర్వృథా ॥ 243

(10) విభు ప్రభు ప్రథమం మేహనావతో బృహస్పతేః సువిదత్రాణి రాధ్యా ।

ఇమా సాతాని వేన్యస్య వాజినో యేన జనా[4] ఉభయే భుఞ్జతే విశః ॥ 244

(11) యోऽవరే వృజనే విశ్వథా విభుర్మహాము రణ్వః శవసా వవక్షిథ ।

స దేవో దేవాన్ ప్రతి పప్రథే పృథు విశ్వేదు తా పరిభూర్బ్రహ్మణస్పతిః ॥ 245

---

1. రాతఽఆత, 2. నకి షోఽఅస్త్య. 3. ధనాదిత్. 4. జనాऽఉభయే, (ప్రా.ప్ర.)

(12) విశ్వం సత్యం మఘవానా యువోరిదాపశ్చన ప్ర మినన్తి వ్రతం వామ్ ।
అచ్ఛేన్ద్రాబ్రహ్మణస్పతీ హవిర్నో ఽన్నం యుజేవ వాజినా జిగాతమ్ ॥ 246

(13) ఉతాశిష్ఠా [1]అను శృణ్వన్తి వహ్నయః సభేయో విప్రో భరతే మతీ ధనా ।
వీళుద్వేషా[2] అను వశ ఋణమాదదిః స హ వాజీ సమిథే బ్రహ్మణస్పతిః ॥ 247

(14) బ్రహ్మణస్పతేరభవద్ యథావశం సత్యో మన్యుర్మహి కర్మా కరిష్యతః ।
యో గా[3] ఉదాజత్ స దివే వి చాభజన్ మహీవ రీతిః శవసాసరత్ పృథక్ ॥ 248

(15) బ్రహ్మణస్పతే సుయమస్య విశ్వహా రాయః స్యామ రథ్యో౩ వయస్వతః ।
వీరేషు వీరాగ్ం[4] ఉప పృఙ్ధి నస్త్వం యదీశానో బ్రహ్మణా వేషి మే హవమ్ ॥ 249

(16) బ్రహ్మణస్పతే త్వమస్య యన్తా సూక్తస్య బోధి తనయం చ జిన్వ ।
విశ్వం తద్ భద్రం యదవన్తి దేవా బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 250

1. ఉతాశిష్ఠాఽఅను, 2. వీళుద్వేషాఽ అనువశఽఋణ, 3. యో గాఽఉదాజత్, 4. వీరాగ్ంఽఉప. (వ్రా.ప్ర.)

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ద్వితీయ మండలము

ద్వితీయాష్టకము—సప్తమాధ్యాయము

### సూక్తము—24

ఋషి—గృత్సమదుఁడు*

దేవత—బ్రహ్మణస్పతి, 1,10—బృహస్పతి,

12—ఇన్ద్రాబ్రహ్మణస్పతులు †

(1) చ॥ సకల చరాచరంబులకుఁ జక్కని భర్తవు నీవు కాన మా
మక నుతులన్ గ్రహించి యసమాన కృపం [1]గయికొమ్ము సేవఁ బా
యక మదభీప్సితంబులను నన్నియుఁ దీర్పుము బ్రహ్మణస్పతీ!
సుకవులు నీకు బంధువులు చూడఁగఁ దత్స్తుతి నాలకింపుమా! ॥ 255

(2,3,4) సీ॥ అవమాన యోగ్యుల కవమానము నొనర్చె శంబర హతకుని జంపఁగలిఁగె
జల సమూహం బెల్ల సాగునట్టు లొనర్చె నావులుగల కొండ నరయఁ గలిఁగె
స్తంభితాగంబుల సమయింపఁగాఁ జేసె నున్నత గోవుల నుద్ధరించె
బహు మంత్రములతోడ బల దానవుని ద్రుంచె సంఘకారం బంత నవలఁ ద్రోలెఁ
గీ॥ బ్రస్తర విశేష దృఢ ముఖ భా విశిష్టుఁ, డౌ బృహస్పతి జలపూర్ణమైన నిన్ను
లంబి మేఘము వధియించి డంబు మీర, సూర్య రశ్మిల జలమయ శోభఁ దేల్చె॥ 256

(5) క॥ ప్రతిమాసమునం బింకం, బ్రతివత్సరమందు మిగుల ప్రజ్ఞానంబుం
బతవృష్టి మూలకంబున, వితతంబుగఁ జేయుచుండె విధి, ఋత్విజ్ఞులా! ॥ 257

---

* ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి విషయకమైన ఫుట్‌నోటు (657వ. పుట.) చూడఁదగును. వ.గో.కృ.

† దేవతల గురించిన విశేష విషయములకై సంస్కృత సూక్తము దేవతలకిచ్చిన ఫుట్‌నోటు (748వ పుట) చూడఁదగును. ఆంధ్రానువాదము వ్రాతప్రతి (2వ. సంపుటము 312వ. పుట) లోని 24వ సూక్తమునకు దేవత బ్రహ్మణస్పతిగా మాత్రమే వ్రాయుట జరిగినది. అయినను శ్రీ నేమానివారు బృహస్పతి-బ్రహ్మణస్పతులు విభిన్న దేవతలుగా 15b సంఖ్యగల గ్రంథములో స్వీయముగాఁ జేర్చినారు. కానియనువాద పద్యములలో బ్రహ్మణస్పతి—బృహస్పతి శబ్దములు పర్యాయ పదములుగాఁ బ్రయోగించిరి. (చూ. పీఠిక.) వ.గో.కృ. 1. గైకొమ్ము (వ్రా.ప్ర.పా.)

గీ॥ మంచి ప్రజ్ఞాన మంతయు మంత్రవిషయ, కంబుగాఁ జేయుచుండె నా ఘన బృహస్ప
తి మునివరులార! రోదసి ధీ ప్రయత్న, మునకు వ్యతిరేకముగ సుఖ మొసరఁజేయు! ॥ 258

(6) చ॥ వెతకుచు నాల్గు దిక్కులను వేయి విధంబుల నంగిరో మునుల్
తత ఫణి దుర్గ మధ్యమునఁ దప్పక చేరి ధనంబుఁ గొంచు స
న్మతిఁ బరికించి దానవుల మాయలఁ గొట్టుచు వేగ వార లే
వితమునఁ బోవుచుండెదరొ? వీరలు పోయెద రట్లు ఋత్విజుల్! ॥ 259

(7) గీ॥ సత్యము వచించు సర్వజ్ఞసమితి యంత, మాయఁ జూపెటి పథమున పరల నేగి
ధ్వంసకార్యగ్ని లేనట్టి ధరణి ధరము,పైని దానిని నిలిపిరి పరపు మతులు ॥ 260

(8) చ॥ సతతము సత్యరూప మగు జ్యావిలసద్ధను పూని బ్రహ్మణ
స్పతి మతి కోరు కోరికలు సాధ్యము లయ్యెడు వాని బాణ సం
తతు లతిజాగరూకములు దర్శన యోగ్యము లవ్వి పుట్టె న
ప్రతిహత దేవ కర్ణముల, భక్తులు చూఁచుటకై క్రమంబుగన్ ॥ 261

(9) చ॥ సకలపదార్థ బౌతములఁ జక్కఁగఁ గల్పుచు వేరు సేయుచున్
సకల నుతి ప్రపంచమును జల్లఁగ నందుచు యుద్ధ భూములం
బ్రకటనఁ జేయుచున్ మిగులఁ బ్రాభవ మంతయు. సూర్య రశ్మిఁ బా
యక వెలుఁగొందఁ జేయుచు బృహస్పతి యుండఁడె? సర్వవేళలన్ ॥ 262

(10,11) సీ॥ వృష్టిప్రదుండయి విస్తార ధనమును నలు దిక్కులకుఁ దాను నడపునట్టి
యన్నవంతుండయి యఖిలంబునకు ధన దానము నీయంగఁ బూనునట్టి
దేవ మానవులకు దివ్యబలంబున నిలఁ బెక్కు రక్షల నిచ్చునట్టి
సర్వతోవ్యాప్త మౌ సరస సంస్తవముల వీనుల విందుగా వినెడునట్టి
గీ॥ దివ్యులకుఁ బ్రతినిధి యంచు దిరుగునట్టి,జగములకు నెల్లఁ బతి యని జరుగునట్టి
మించి లోకము నంతట మెలఁగు నట్టి, బ్రహ్మణస్పతి వెలుఁగఁడే! ప్రకృతియందు ॥ 263

(12) గీ॥ బ్రహ్మణస్పతి! యింద్రుఁడా! ప్రకృతిలోన, మీరె ధనవంతులంచు ప్రీతి మెలఁగుచుండి
రధిక సత్యము గలవార లంబుచయము, మిమ్ము హింసింప నేరదు నమ్మ రేమి? ॥ 264

గీ॥ బ్రహ్మణస్పతి! యింద్రుడా! బలము గల్గు, నశ్వములు[1] రథమునకుఁ గట్టి యనుల మతిని
నిచ్చు హవ్యంబు నంతనుఁ బుచ్చుకొనఁగ, వచ్చి యుండుఁడు మే మెల్ల మెచ్చునటుల ॥ 265

1. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్త మైనది. ప.గో.కృ.

(13) చ॥ గతిగల యశ్వముల్ సుతులఁ గర్భములన్ వినుచుండె ఋత్విజుల్
స్తుతిపరు లౌచు హవ్యములఁ దోడ్తొ నొసంగుచు మంత్రి బ్రహ్మణ
స్పతియును వైరి బృందములఁ జంపుచు భక్త ఋణంబుఁ దీర్చుచున్
క్షితిపయి వెల్గుచుండెఁగడుఁ జెన్ను వహించెను యుద్ధ వీరుఁడై ॥ 266

(14) చ॥ ఘనుఁ డగు బ్రహ్మణస్పతి సుకార్యము చేయఁ దలంచియున్నచో
ననయము మంత్రమూలమున సర్వి ఘటిల్లును వాఁడె దీక్షతోఁ
గన్గొని గో సమూహమును గౌరవ రీతిని బైటఁబెట్టుఁ దా
వినయముతోడ నీయఁడఁటెః వేల్పుల మూకకుఁ బ్రౌఢ వీర్యమున్ ॥ 267

(15) గీ॥ నియమ యుక్తుల మగునట్లు నీవు మమ్ముఁ, జేసి ధనపతులుగఁ గూడఁ జేయవయ్యః
మాకుఁ బుత్రులఁ బౌత్రుల వీఁక నిచ్చి, యీశ్వరత్వంబు నొందు సర్వేశ్వరుండః ॥ 268

(16) చ॥ అఖిల చరాచరాళి వినియంతః బృహస్పతిః నీవు ప్రీతి మా
ముఖములనుండి వచ్చు నుతి మోదమునన్ విని రూఢ సంతతుల్
సుఖముగ నుండునట్లు మఱి సూక్తులఁ బల్కెడు న ట్లొనర్చినన్
సఖుఁడః ప్రభూత సంస్తవము సల్పమెః మేము భవన్నిమిత్తమై ॥ 269

## సూక్తమ్—25

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—బ్రహ్మణస్పతిః

ఛందః—జగతీ

(1) ఇన్ధానో[1] అగ్నిం వనవద్ వనుష్యతః కృతబ్రహ్మా శూశువద్ రాతహవ్య[2] ఇత్ ।

జాతేన జాతమతి స ప్ర సర్స్రృతే యంయం యుజం కృణుతే బ్రహ్మణస్పతిః ॥ 251

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూడఁదగును. వ.గో.కృ.

1. ఇన్ధానోఽఅగ్నిం. 2. రాతహవ్యఽఇత్. (వ్రా.ప్ర.)

(2) వీరేభిర్వీరాన్ వనవద్ వనుష్యతో గోభీ రయిం పప్రథద్ బోధతి త్మనా ।

తోకం చ తస్య తనయం చ వర్ధతే యంయం యుజం కృణుతే బ్రహ్మణస్పతిః ॥ 252

(3) సిన్ధుర్న క్షోదః శిమీవాగ్ం[1]ఋఘాయతో వృషేవ [2]వధ్రీగ్ంఃభి నష్టోజసా ।

అగ్నేరివ ప్రసితిర్నాహ వర్తవే యంయం యుజం కృణుతే బ్రహ్మణస్పతిః ॥ 253

(4) తస్మా[3] అర్షన్తి దివ్యా అసశ్చతః స సత్వభిః ప్రథమో గోషు గచ్ఛతి ।

అనిభృష్టతవిషిర్హన్త్యోజసా యంయం యుజం కృణుతే బ్రహ్మణస్పతిః ॥ 254

(5) తస్మా[4] ఇద్ విశ్వే ధునయన్త సిన్ధవో ఽచ్ఛిద్రా శర్మ దధిరే పురూణి ।

దేవానాం సుమ్నే సుభగః స[5] ఏధతే యంయం యుజం కృణుతే బ్రహ్మణస్పతిః ॥ 255

1. శిమీవాగ్ంఽఋఘయత్, 2. వధ్రీగ్ంఽరభి, 3. తస్మాఽఅర్షన్తి దివ్యాఽ అసశ్చతః, 4. తస్మాఽఇద్, 5. సః ఏధతే. (వ్రా.ప్ర.)

## సూక్తము—25

ఋషి—గృత్సమదుఁడు *

దేవత—బ్రహ్మణస్పతి

(1) చ॥ అనలుఁడు బ్రహ్మణస్పతిని సత్యధికంబుగ వెల్గఁ జేయు వాఁ
డనయము శత్రుహింసలను నంచఁడు వానిని సంస్తుతించు వాఁ
డనఘ సమృద్ధి లాభమును నంతయుఁ బొందును వాని భక్తులౌ
జను లిలఁ బుత్ర పౌత్రకులఁ జక్కఁగ మింతురు జీవితంబుతోన్ ॥ 270

(2) చ॥ ఇలను బృహస్పతిప్రవరుఁ డెంతయు భక్తుని హెచ్చరించుచో
బలము గలట్టి శత్రువులు, వానికి హింసలు పెట్ట నేర్తురే ?
పొలుపుగ వాఁడు గో ధనము పుత్రులఁ బౌత్రులచేత నొప్పి తా
సులలిత జీవితంబుఁ గొనుచున్ వసియింపఁడె? యెల్ల కాలమున్ ॥ 271

(3) చ॥ నది తన కూల దేశమును నాశము జేసెడునట్టు లెద్దు స
మ్మదమున నెద్దుఁ గొట్టునటు మాన్య బృహస్పతి భక్తుఁ డేమియుం
జెదరక శత్రు మండలిని జివ్వను వారిని సంహరించి స
మ్మదమున వెల్గుచుండఁడఁటె? మాన్యులు మెచ్చఁగ భూతలంబునన్ ॥ 272

గీ॥ బ్రహ్మణస్పతీ! సఖులను బ్రస్తుతించు, వార లెల్లరు వారింపఁబడుదు రెట్టు?
లకలుషంబుగ వెలిఁగెడు నగ్ని శిఖను, నెవ్వరైన నివారింప నేగఁగలరె? ॥ 273

(4,5) సీ॥ బ్రహ్మణస్పతి మిత్ర వరుల చెంగటను సత్స్వర్గీయజలములు సాగి వచ్చు
బ్రహ్మణస్పతి ముఖ్య పరిచారక గణంబు గో ధనంబులతోఁడఁ గూడుచుండు
బ్రహ్మణస్పతి నిత్య బలమున భక్తులు శత్రు సమూహంబుఁ జంపుచుంద్రు
బ్రహ్మణస్పతి సత్య భక్త లందఱు లావు బలముతో నెప్పుడు జెలఁగుచుంద్రు
గీ॥ బ్రహ్మణస్పతి గ్రహియించు వారికొఱకు, నేళ్ళు ప్రవహించు, నెంతయు నెసఁగు సుఖము
దేవదత్తసుఖంబులు తేజరిల్లు, సకల సౌభాగ్య గరిమంబు చాలఁగల్గు ॥ 274

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు ( 657వ పుట ) చూఁడనగును. వ.గో.కృ.

## సూక్తమ్—26

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవత—బ్రహ్మణస్పతిః

ఛందః—జగతీ

(1) ఋజురిచ్ఛంసో వనవద్ వనుష్యతో దేవయన్నిదదేవయన్తమభ్యసత్ ।

సుప్రావీరిద్ వనవత్ పృత్సు దుష్టరం యజ్వేదయజ్యోర్వి భజాతి భోజనమ్ ॥ 256

(2) యజస్వ వీర ప్ర విహి మనాయతో భద్రం మనః కృణుష్వ వృత్రతూర్యే ।

హవిష్కృణుష్వ సుభగో యథాససి బ్రహ్మణస్పతేరవ[1] ఆ వృణీమహే ॥ 257

(3) స[2] ఇజ్జనేన స విశా స జన్మనా స పుత్రైర్వాజం భరతే ధనా నృభిః ।

దేవానాం యః పితరమావివాసతి శ్రద్ధామనా హవిషా బ్రహ్మణస్పతిమ్ ॥ 258

(4) యో[3] అస్మై హవ్యైర్ఘృతవద్భిరవిధత్ ప్ర తం ప్రాచా నయతి బ్రహ్మణస్పతిః ।

ఉరుష్యతీమంహసో రక్షతీ రిషోంఽహోశ్చిదస్మా[4] ఉరుచక్రిరద్భుతః ॥ 295

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్ నోటు (657వ. పుట) చూడనగును. వ.గో.కృ.

1. బ్రహ్మణస్పతే రవఽ ఆ వృణీ, 2. సఽఇజ్జనేన, 3. యోఽఅస్మై, 4. దస్మాఽఉరు. (బ్రా.ప్ర.)

## సూక్తము—26

ఋషి—గృత్సమదుఁడు*

దేవత—బ్రహ్మణస్పతి

(1) గీ॥ బ్రహ్మణస్పతి నుతియించు వాఁడు శత్రు, సంచయము నంత బలమునఁ జంపఁగలఁడు
బ్రహ్మణస్పతిఁ దనియింపు వాఁడదేవ, కాంక్షలఁ దిరస్కరింపంగఁగలఁడు భువిని ॥ 275

గీ॥ బ్రహ్మణస్పతి నుత్తమ భక్తితోడఁ, దనుపువాఁ డెల్లశత్రులఁ దరుమువాఁడె
యఖిల యజ్ఞ పరాయణుఁ డౌచు యజ్వ, ధనము నుపయోగపరుచును దాత యగుచు ॥ 276

(2) సీ॥ బ్రహ్మణస్పతిఁ జాలఁ బ్రస్తుతింపుచు నీదు వీరశత్రులపైకి వెడలు మీవు
శత్రు బృందముతోడ సంగ్రామ మొనరింప దృఢ మనస్కుఁడ వౌచుఁ దిరుగు మీవు
బ్రహ్మణస్పతికయి బహుళ హవ్యంబుల సంగ్రహించుటకయి జరుగు మీవు
పూర్వ కార్యము లెల్లఁ బునరుక్తిఁ జేసిన నుత్తమంబగు ధన మొందు మీవు
గీ॥ బ్రహ్మణస్పతి రక్షలఁ బడయఁ గోరు, చున్నవారము మే మెల్ల నెన్నిచూడ
మాన్య నీవును దద్రక్ష మానకుండఁ, బడయు నట్టులు గోరుము పావనుండ ॥ 277

(3) గీ॥ దేవ పిత బ్రహ్మణస్పతిఁ దివిరి హవ్య, పూర్వకంబుగఁ బూజింపఁ బూను వాఁడు
వాని పుత్రులుఁ బౌత్రులు వాని లోక, మంతయును నన్న మొందును జింత లేక ॥ 278

(4) చ॥ ఘనమతి బ్రహ్మణస్పతికిఁ గమ్మని నేతులతోడ హవ్యముం
బనిగొని యిచ్చు మానవుఁడు ప్రాక్తన మార్గముఁ బట్టు పాపముల్
జెనకక యుండు, శత్రువులఁ జేరక యుందురు వాని, లేమియుం
గనుఁగొనకుండు వాని నుపకారము సాధన మౌను, వానికిన్ ॥ 279

* ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

## సూక్తమ్—27

ఋషిః—కూర్మో గార్త్సమదో, గృత్సమదో వా*

దేవతా—ఆదిత్యాః

ఛందః—త్రిష్టుప్

(1) ఇమా గిర[1] ఆదిత్యేభ్యో ఘృతస్నూః సనాద్ రాజభ్యో జుహ్వా జుహోమి ।

శృణోతు మిత్రో[2] అర్యమా భగో నస్తువిజాతో వరుణో దక్షో[3] అంశః ॥ 260

(2) ఇమం స్తోమం సక్రతవో మే[4] అద్య మిత్రో అర్యమా వరుణో జుషన్త ।

ఆదిత్యాసః శుచయో ధారపూతా[5] అవృజినా అనవద్యా అరిష్టాః ॥ 261

(3) త[6] ఆదిత్యాస ఉరవో గభీరా అదబ్ధాసో దిప్సన్తో భూర్యక్షాః ।

అన్తః పశ్యన్తి వృజినోత సాధు సర్వం రాజభ్యః పరమా చిదన్తి ॥ 262

(4) ధారయన్త[7] ఆదిత్యాసో జగత్ స్థా దేవా విశ్వస్య భువనస్య గోపాః ।

దీర్ఘాధియో రక్షమాణా[8] అసుర్యమృతావానశ్చయమానా ఋణాని ॥ 263

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. గిరఽఆదిత్యే, 2. మిత్రోఽఅర్యమా, 3. దక్షోఽఅంశః, 4, మేఽఅద్యమిత్రోఽఅర్యమా, 5. ధారపూతాఽఅవృజినాఽఅనవద్యాఽఅరిష్టాః, 6. తఽఆదిత్యాసఽ ఉరవో గభీరాఽఅదబ్ధాసో, 7. ధారయన్తఽఆదిత్యాసో, 8. రక్షమాణాఽఅసుర్యమృతావానశ్చయమానాఽఋణాని. (వ్రా.ప్ర.)

(5) విద్యామాదిత్యా[1] అవసో వో అస్య యదర్యమన్ భయ[2] ఆ చిన్మయోభు ।
యుష్మాకం మిత్రావరుణా ప్రణీతౌ పరి శ్వభ్రేవ దురితాని వృజ్యామ్ ॥ 264

(6) సుగో హి వో[3] అర్యమన్ మిత్ర పన్థా [4]అనృక్షరో వరుణ సాధురస్తి ।
తేనాదిత్యా[5] అధి వోచతా నో యచ్ఛతా నో దుష్పరిహన్తు శర్మ ॥ 265

(7) పిపర్తు నో[6] అదితీ రాజపుత్రా ఽతి ద్వేషాంస్యర్యమా సుగేభిః ।
బృహన్మిత్రస్య వరుణస్య శర్మోప స్యామ పురువీరా[7] అరిష్టాః ॥ 266

(8) తిస్రో భూమీర్ధారయన్ [8]త్రీఁరుత ద్యూన్ త్రీణి వ్రతా విదథే [9]అన్తరేషామ్ ।
ఋతేనాదిత్యా మహి వో మహిత్వం తదర్యమన్ వరుణ మిత్ర చారు ॥ 267

(9) త్రీ రోచనా దివ్యా ధారయన్త హిరణ్యయాః శుచయో ధారపూతాః ।
అస్వప్నజో[10] అనిమిషా అదబ్ధా ఉరుశంసా ఋజవే మర్త్యాయ ॥ 268

1. విద్యామాదిత్యాఽఅవసో వోఽఅస్య, 2. భయఽ ఆ చిన్మ, 3. హి వోఽఅర్య, 4. పన్థాఽఅనృక్షరో, 5. తేనాదిత్యాఽఅధి, 6. నోఽఅదితీ, 7. పురువీరాఽఅరిష్టాః, 8. త్రీఁఽరుత, 9. విదథేఽఅన్తరేషామ్, 10. అస్వప్నజోఽఅనిమిషాఽఅదబ్ధాఽఉరుశంసాఽ ఋజవే. (ప్రా.ప్ర.)

(10) త్వం విశ్వేషాం వరుణాసి రాజా యే చ దేవా[1] అసుర యే చ మర్తాః ।

శతం నో రాస్వ శరదో విచక్షేఽశ్యామాయూంషి సుధితాని పూర్వా ॥ 269

(11) న దక్షిణా వి చికితే న సవ్యా న ప్రాచీనమాదిత్యా నోత పశ్చా ।

పాక్యా చిద్ వసవో ధీర్యా చిద్ యుష్మానీతో[2] అభయం జ్యోతిరశ్యామ్ ॥ 270

(12) యో రాజభ్య[3] ఋతనిభ్యో దదాశ యం వర్ధయన్తి పుష్టయశ్చ నిత్యాః ।

స రేవాన్ యాతి ప్రథమో రథేన వసుదావా విదథేషు ప్రశస్తః ॥ 271

(13) శుచిరపః సూయవసా[4] అదబ్ధ ఉప క్షేతి వృద్ధవయాః సువీరః ।

నకిష్టం ఘ్నన్త్యన్తితో న దూరాద్ య[5] ఆదిత్యానాం భవతి ప్రణీతౌ ॥ 272

(14) అదితే మిత్ర వరుణోత మృళ యద్ వో వయం చకృమా కచ్చిదాగః ।

ఉర్వశ్యామభయం జ్యోతిరిన్ద్ర మా నో దీర్ఘా[4] అభి నశన్తమిస్రాః[5] ॥ 273

1. దేవాఽఅసుర, 2. యుష్మానీతోఽఅభయం, 3. రాజభ్యఽఋతనిభ్యో, 4. సూయవసాఽఅదబ్ధఽఉపక్షేతి, 5. యఽఆదిత్యా, 6. దీర్ఘాఽఅభి, 7. నశన్తమిస్రాః. (వా.ప్ర.)

(15) ఉభే[1] అస్మై పీపయతః సమీచీ దివో వృష్టిం సుభగో నామ పుష్యన్ ।
ఉభా క్షయావాజయన్ యాతి పృత్సూభావర్ధౌ భవతః సాధూ[2] అస్మై ॥ 274

(16) యా వో మాయా[3] అభిద్రుహే యజత్రాః పాశా[4] ఆదిత్యా రిపవే విచృత్తాః ।
అశ్వీవ తాగ్ం[5] అతి యేషం రథేనారిష్టా[6] ఉరావా శర్మన్ త్స్యామ ॥ 275

(17) మాహం మఘోనో వరుణ ప్రియస్య భూరిదావ్న[7] ఆ విదం శూనమాపేః ।
మా రాయో రాజన్ త్సుయమాదవ స్థాం బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 276

## సూక్తము—27

ఋషి—గృత్సమదుఁడు లేక గృత్సమదుని పుత్రుఁడు కూర్ముఁడు †

దేవత—ఆదిత్యగణము

(1) గీ॥ సజ్జుహూ మూలకంబున సంతతంబు, వెల్గు నాదిత్య గణముల వేడుచుందు
దాని నర్యమ మిత్రులు దక్ష వరుణ, భగులు వినుచుండెదరుగాకఁ! బరమ కృపను ॥ 280

1. ఉభేఽఅస్మై. 2. సాధూఽఅస్మై. 3. మాయాఽఅభి. 4. పాశాఽఆదిత్యా, 5. తాగ్ంఽఅతి, 6. రథేనారిష్టాఽఉరావా, 7. భూరిదావ్నఽఆవిదం (వ్రా.ప్ర.)

† గృత్సమద ఋషి విశేషములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట.) చూఁడనగును. ఈ సందర్భమున వ్రాతప్రతిలో (2వ. సంపుటము 319వ. పుట) గృత్సమదుఁడో! తత్పుత్రుఁడో! అనిమాత్రమే వ్రాయఁబడినది. గృత్సమద పుత్రుఁడైన కూర్మని నామము పేర్కొనఁబడలేదు. శ్రీనేమానివారు స్వయముగా వ్రాసిన ఋషి దేవతల పట్టికగల 15b సంపుటములో "కూర్మము, గృత్సమదుని పుత్రుఁడు లేక గృత్సమదుఁడు" అని వ్రాసిరి. "కూర్మము" అను "ము" వర్ణకాంత పురుషనామము "అరుణాచలము" "సింహాచలము" ఇత్యాది పురుషనామముల వంటిదిగా నెన్నఁనగును, మహద్వాచకములైన మిత్రాదులు "ము" వర్ణకాంతములు కాఁగా సమహద్వాచకములైన "అరుణాచల కూర్మాదులు" డుమంతము లైనవి, వ గో.కృ.

(2) గీ॥ దీప్తి మంతు లనుగ్రహ దీప్తి యుతులు, వృష్టి పూతులు హింసావివర్జితాత్ము
లైన మిత్రాదు లందఱుఁ బూని సకల, స్తోత్రముల నాలకింతురు సురుచిరముగ ॥ 281

(3) గీ॥ సకల గాంభీర్యయుతమును సకల దమన, కారి యాదిత్యగణ మెల్లఁ గ్రాలు, భూత
సమితి యంతస్సుఁ గనుచుండుఁ జాల దూర, వస్తువులు నికట[1] మందుండు వారి కెపుడు ॥ 282

(4) గీ॥ జంగమ స్థావరాత్మక జగతి సంతఁ, గరము నిలుపుచు నాదిత్య గణముకాచు!
యజ్ఞయుతమౌ నసూర్యము నధిగమించు, సత్యమయి[1] ఋణము శోధించు సరసమతిని ॥ 283

(5) గీ॥ యుష్మదీ యాశ్రయంబును నుచితరీతిఁ, గనుచు నుండెద మాదిత్య గణములార!
జయము లభియించినట్లైన జగతి యుష్మ. దీయమౌ నాశ్రయ సుఖంబుఁబాయకుండు! ॥ 284

గీ॥ అర్యముఁడ! మిత్ర! వరుణ! మి మ్మాశ్రయించి, నేను గర్తము చందము నిఖిల పాప
పుంజపరిహార మొసరింపఁ బూనుకొంటి, భావమున నెంతొ భక్తి తాత్పర్య మెసఁగ ॥ 285

(6) చ॥ వరణుఁడ! మిత్ర! యర్యముఁడ! వాసిని గాంచు భవత్పదంబు మే
మెరుఁగమె? యద్ది కంటక విహీనము సుందరమై వెలింగెడున్
స్థిరముగ మమ్ము నా పదముఁ జేర్చుచు మిష్ట వచస్సుఁ బల్కుచుం
బొరిపొరి సౌఖ్యమిం దదితి పుత్రకులార! దయా విశేషతన్ ॥ 286

(7) గీ॥ అదితి రాజమాత యరులను బరిమార్చి, దేశమందుఁ బ్రీతిఁ దిరుగుఁగాక!
సుఖపథంబు మాకుఁ జూపించి యర్యముఁ, డధిక సుఖము లిచ్చి యరుగుఁగాక! ॥ 287

గీ॥ అధిక వీర్య మహిమ నతిశయించుచునుండి, హింస పడక మే మహీనమిత్ర
వరుణ దేవతలకు వలసిన సుఖ లాభ, మందునట్లు చేయ నడుగఁగలము ॥ 288

(8) గీ॥ మూఁడు ద్యో లోకములు మరి మూఁడు భువనములను ధరియించుచున్నారు ముదముతోడ
నర్యముఁడు, [1]వరుణమిత్రులు యజ్ఞతలము, లందు వెలుఁగొందుచుండిరి యధిక మహిమ॥ 289

గీ॥ కర్మవశమున నాదిత్య గణ మహీన, మహిమ నుత్కృష్ట మగుచుండె రహిఁ జెలంగ
నర్యముఁడ! మిత్ర! వరణుఁడా! యధిక చారు, తర భవద్దివ్య తత్త్వంబు ధరణి వెలుఁగు ॥ 290

---

1. ఇక్కడఁ బంచ లఘుగణ మింద్రగణమునకు మారు ప్రయుక్తమైనది. వ.గో.కృ.

(9) సీ॥ ఆదిత్య గణము లత్యధిక తేజోనిధుల్ కనకభూషణములఁ గలుఁగువారు
నిద్రా విహీనులై నెగడొందఁబడు వార లనిమిషనేత్రులై యమరువారు
వృష్టిని గలిఁగింప వెడలుచుండెడు వార లొరులను బాధింపకుండువారు
సకల మానవ గణ స్తవయోగ్యు లగువారు సకలలోకములకు జరుగువార
గీ॥ లగుచు సన్మార్గ జనులకు నందఁజేయ, మూఁడు విధములఁ దేజస్సు మోద మలర
నేచి ధరియించుచున్నా రహీనవృత్తి, వారి వర్ణింపనగునె? యెవ్వారికైన ॥ 291

(10) †గీ॥ అసురవరుణుఁడ! నీవు మా కమరవరుఁడ. వైన మనుజుఁడ వైనను నధిపుఁడవుదు
కాన వత్సర శతము దీర్ఘాయు వొంద, గాఁజ మాపయి మేల్ దయా రసము చిల్కు! ॥ 292

(11) గీ॥ అమలమతి[1] నదితి పుత్రుల కధికహవ్య, మొసఁగు వాఁ డెల్లఁ బుష్టిని నొందఁగలఁడు
వాఁడె విఖ్యాతుఁడై యొప్పు వాఁడె దాత, వాఁడె యరదముపైఁ బోవుఁ జూఁడ నిష్టి ॥ 293

(12) చ॥ అదితి కుమార మండలిని నత్యధికంబుగ నాశ్రయించు వాఁ
డెద నతిభక్తుఁడై సుతుల నెందఱినేనియుఁ బొందు సస్యమున్
ముదమున నిచ్చుఁ బుష్టిఁగను మోదము నొందుచు శత్రువారమున్
గదనమునందుఁ ద్రుంచెడుసుగాక! సమీపమునన్ వసించుచున్ ॥ 294

† మనుజుల పరమాయువు శతవత్సరంబు లని ఋగ్వేదమునఁ గలదు. కాని పురాణములలో వర్ణింపఁబడినట్లు సహస్రవర్ష జీవులు ఋషు లుండినట్లు ప్రమాణము కాన రాదు. బృహజ్జాతకాది జ్యోతిష గ్రంథములందు మనుష్యుని పరమాయువు 120 సంవత్సరము లని నిర్ణయముకలదు. వేదోక్తపరమాయువునకు జ్యోతిషోక్తపరమాయువునకు భేద మెట్లుకలిఁగెనో విజ్ఞాను లూహింతురుగాక! (నే.వేం.న.శా.)

గమనిక:— శతవత్సరము లన్నది సామాన్యవాక్యము. "దీర్ఘాయు" శబ్దమును శ్రీ నేమానివారే ప్రయోగించిరి. దీర్ఘాయువు వంద సంవత్సరములకుఁ బరిమితము కాదు. ఈ శతసంవత్సరము లన్నది సామాన్యమానవులకు వర్తించు విషయము. అమృత సిద్ధి పొందిన మహర్షి తన యాయుర్దాయమును దనహస్తగతము చేసుకొనును గావున వెయ్యి సంవత్సరములు జీవించుటలో నాశ్చర్యము లేదు. అసలు జాతకము ప్రకారముగ నాయుర్దాయవిషయము చెప్పరాదన్నది ప్రాచీన జ్యోతిశ్శాస్త్రకర్తల సిద్ధాంతము. ఆయుర్దాయము కేవలము నొకజాతకునిజాతకముపైని మాత్రమే యాధారపడి యుండదు. భర్త యల్పాయుష్కుఁడైనను భార్యకు వైధవ్యయోగము లేకుండ సుమంగళియోగము ప్రబలముగా నున్నచో భర్త మృతి చెందక జీవించును. ఇదియేరీతి భార్య గొల్పాయుష్కురాలై యామెజాతకములో మరణయోగమున్నను భర్తజాతకములో సతీ మారక పూర్వక వియోగ దుఃఖము లేకుండ సార్థాంగి జీవనయోగము బలీయముగనున్నచో భార్య జీవించి తీరును. ఒకవేళ భర్తజాతకములోఁ బూర్ణాయుర్దాయము పట్టియు భార్యజాతకములో వైధవ్యయోగము ప్రబలముగానున్నచో భర్త మరణించితీరును. ఇట్లే భార్యజాతకములోఁ బూర్ణాయుర్దాయమున్నను భర్తజాతకములోఁ గళత్రమారకయోగము ప్రబలముగనున్నచో భార్య చనిపోయి తీరును. ఇవి మామూలుగా జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతములు. అసలు జ్యోతిశ్శాస్త్రమే యీరీతినుండ వేదజ్యోతిష్యముగురించి మాట్లాడుట మహర్షుల నాక్షేపించుట పొరపాటు కాఁగలదు. వ.గో.కృ.

1. ఇక్కడ నింద్రగణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

(13) క॥ వరుణుండు మిత్రుండు యదితీ!, కర మే మపరాధకలన గావించినచో
స్థిర మద్దానిని దయతోఁ, బరమార్జనఁ జేయుఁ డేము భక్తులముగదా! ॥ 295

†(14) గీ॥ [1]దీర్ఘమౌ తమిస్ర తిరముగ మిమ్ములఁ, దప్పకుండు నట్లు ధర్మదేవ!
భయ విహీనమైన భవ్యదీప్తిని మేము, పొందఁగలము ముదము నందఁగలము ॥ 296

(15) సీ॥ అదితి పుత్రుల దయ నందిన వారికి భూమ్యంతరిక్షముల్ పుష్టిఁ జేయు
నదితి పుత్రుల దయ నందిన వాఁ డెల్ల స్వర్గీయ జలములు చాలఁబొందు
నదితి పుత్రుల దయ నందిన వాఁ డెల్ల నధిక సమృద్ధి తా నందుచుండు
నదితి పుత్రుల దయ నందిన వాఁ డెల్ల జన్యమం దరులను సుండఁగల్గు
గీ॥ నుభయ లోకంబులను బొందు నుభయలోక ములను మంగళకరములై మోద మొసఁగు
సకల సౌభాగ్య గరిమంబుఁ జాల సంపఁ, బుత్రపౌత్రులఁ బ్రీతితోఁ బొందుచుండు ॥ 297

(16) చ॥ హితమతి మాయఁజేసి రతిహీనులఁ ద్రుంపఁగ దేవతోత్తముల్
సతతము దానిచే సకల శత్రు గణంబు నశించె నశ్వి యే
వితము నతిక్రమించునటు భీకర మాయ నతిక్రమించి నే
నతిసుఖ మందుచుండనొకొ? యా యమరాధిపు సేవ లందుకన్ ॥ 298

(17) గీ॥ జ్ఞాతి దారిద్ర్యమును నీవు ఖ్యాతిగల్గు, ధనుల ముందఱఁ దలఁపకు ధర్మబుద్ధిఁ
గరుణతో ధనము[2] నిచ్చిన వరుణ దేవ!, పుత్ర పౌత్రులతో నిన్నుఁ బొగడఁగలము ॥ 299

---

† ఋగ్వేదము ద్వితీయ మండలము 27వ సూక్తములో మొత్తము 17 ఋక్కులుండఁగా నాంధ్రానువాదములో నీ సూక్తమున 16 ఋక్కులు మాత్రమే యున్నట్లు పొరపాటుగ వ్రాయఁబడినది. "దీర్ఘమౌ తమిస్ర" ఇత్యాది పద్యము 14వ ఋక్కున కనువాదముకాఁగా 13వ ఋగ్భాగమునకే యనువాదమైనట్లును దరువాతి 297-298-299 సంఖ్యలుగల పద్యములు క్రమముగా 14-15-16 ఋగనువాదములైనట్లును బ్రమాదవశమున వ్రాయఁబడినది. (చూ-వ్రాతప్రతి. 2వ సంపుటము. 323-325 పుటలు) 297-298-299 పద్యములు క్రమముగా 15-16-17 ఋక్కుల కనువాదములు. ప.గో.కృ.

1. "దీర్ఘమౌ తమిస్ర" అనుటచే సూర్యోదయాస్తమయకాలము సుమారు మూఁడు మాసముల పర్యంత ముండును. పిమ్మట రాత్రి వచ్చును. ఈ రాత్రి గాఢాంధకారముతో మూఁడు నెలల పర్యంత ముండును. చీకటి వరుసగా సుమారు నూరుదినములుండుటచే నీ దీర్ఘరాత్రులు తాము మున్నెన్నఁడును నెరుంగకుండుటచే భయపడిరి. యాగాదులుచేసి యెప్పుడు తెల్లవారునా యని దైవమును బ్రార్థించుచుండిరి. ఈ కార్యకలాపముచేఁ దమిస్రలు దీర్ఘము లని మంత్రమున వర్ణింపఁబడినవి. ఆర్యు లార్యావర్తము విడిచి ఉత్తరధ్రువ ఖండమును జేరిన పిదపఁ దమిస్రలు దీర్ఘములను ననుభవ మార్యులకుఁ గలిగినట్లు తోచుచున్నది.
(నే.వేం.న.శా.)

2. ఇక్కడ "భల" మింద్రగణమునకు మారు ప్రయుక్తమైనది. ప.గో.కృ.

## సూక్తమ్—28

ఋషిః—కూర్మో గార్త్సమదో, గృత్సమదో వా*

దేవతా—వరుణః, 10—దుఃస్వప్న నాశనీ

ఛందః—త్రిష్టుప్

(1) ఇదం కవేరాదిత్యస్య స్వరాజో విశ్వాని సాన్త్యభ్యస్తు మహ్నా ।

అతి యో మన్ద్రో యజథాయ దేవః సుకీర్తిం భిక్షే వరుణస్య భూరేః ॥ 277

(2) తవ వ్రతే సుభగాసః స్యామ స్వాధ్యో వరుణ తుష్టువాంసః ।

ఉపాయన[1] ఉషసాం గోమతీనామగ్నయో న జరమాణా[2] అను ద్యూన్ ॥ 278

(3) తవ స్యామ పురువీరస్య శర్మన్నురుశంసస్య వరుణ ప్రణేతః ।

యూయం నః పుత్రా[3] అదితేరదబ్ధా అభి క్షమధ్వం యుజ్యాయ దేవాః ॥ 279

(4) ప్ర సీమాదిత్యో[4] అసృజద్ విధర్తాగ్ం ఋతం సిన్ధవో వరుణస్య యన్ని ।

న శ్రామ్యన్తి న వి ముచన్త్యేతే వయో న పప్తూ రఘుయా పరిజ్మన్ ॥ 280

* గృత్సమద ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి విషయకమైన ఫుట్‌నోటు (657వ, పుట.) చూడనగును. వ.గో.కృ.

1. ఉపాయనఽఉషసాం. 2. జరమాణాఽఅను ద్యూన్. 3. పుత్రాఽఅదితేరదబ్ధాఽ అభి. 4. ప్ర సీమాదిత్యోఽఅసృజద్. 5. విధర్గ్ంత్రా. (వ్రా.ప్ర.)

(5) వి మచ్ఛ్రథాయ రశనామివాగ[1] బుధ్యామ తే వరుణ ఖామృతస్య ।

మా తన్తుశ్ఛేది వయతో ధియం మే మా మాత్రా శార్యపసః పుర[2] బుతోః ॥ 281

(6) అపో సు మ్యక్ష వరుణ భియసం మత్ సమ్రాళృతావోऽను మా గృభాయ ।

దామేవ వత్సాద్ వి ముముగ్ధ్యంహో నహి త్వదారే నిమిషశ్చనేశే ॥ 282

(7) మా నో వధైర్వరుణ యే త[3] ఇష్టావేనః కృణ్వన్తమసుర[4] భ్రీణన్తి ।

మా జ్యోతిషః ప్రవసథాని గన్మ వి షూ మృధః శిశ్రథో జీవసే నః ॥ 283

(8) నమః పురా తే వరుణోత నూనముతాపరం తువిజాత బ్రవామ ।

త్వే[5] హి కం పర్వతే న శ్రితాన్యప్రచ్యుతాని దూళభ వ్రతాని ॥ 284

(9) పర[6] బుణా సావీరథ మత్కృతాని మాహం రాజన్నన్యకృతేన భోజమ్ ।

అవ్యుష్టా[7] ఇన్ను భూయసీరుషాస[8] ఆ నో జీవాన్ వరుణ తాసు శాధి ॥ 285

1. రశనామివాగs బుధ్యామ, 2. పురsబుతోః, 3. యే తs ఇష్టా, 4. కృణ్వన్తమసుర భ్రీణన్తి, 5. తే హి కం, 6. పరsబుణా, 7. అవ్యుష్టాs ఇన్ను, 8. భూయసీరుషాసs ఆ నో, (బ్రా.ప్ర.)

(10) యో మే రాజన్ యుజ్యో వా సఖా వా స్వప్నే భయం భీరవే మహ్యమాహ ।
స్తేనో వా యో దిప్సతి నో వృకో వా త్వం తస్మాద్ వరుణ పాహ్యస్మాన్ ॥ 286

(11) మాహం మఘోనో వరుణ ప్రియస్య భూరిదావ్న[1] ఆ విదం శూనమాపేః ।
మా రాయో రాజన్ త్సుయమాదవ స్థాం బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 287

## సూక్తము—28

ఋషి—కూర్ముఁడో గృత్సమదుఁడో †

దేవత—వరుణుఁడు

(1) క॥ వరుణునికై యీ హవ్యము, వరుణుఁడె భూతముల నెల్ల వారక ద్రొక్కున్
వరుణుఁడు హర్షం బొసఁగును, వరుణునకున్ నుతులఁ జేయ వాంఛింత్రుసుఁడీ! ॥ 300

(2) చ॥ వరుణుఁడ! నిన్ నుతించెదను బంధుర శక్తిని నీదు సేవలన్
జరుపుచు భాగ్య శాలినయి చక్కఁగ వెల్గె దుషస్సు వచ్చుచోఁ
బరమ కృపా విశిష్టుఁ డగు పావకు రీతి నుతించి దాని నే
సరమర లేక దీప్తి గని యందరిలో ఘనతన్ వహించెదన్ ॥

(3,4) సీ॥ జగముల రేఁడ! నిన్ జగతిలో నుతియించి యావాస సౌఖ్యంబు నందుచుందుఁ
డ్వాత్సఖ్యమును జేసి తప్పు లన్ని గతింప నాదిత్యులార! నే నలరుచుందు
వరుణుఁడా! నీవల్ల వలసిన వృష్టులు పల్మరు పుడమిపైఁ బడుచునుండుఁ
ద్వన్మహిమంబుచేఁ దప్పక నదు లెల్ల నంచితంబుగఁ బ్రవహించుచుండుఁ
గీ॥ గాన నా పగలన్నియుఁ గదలనిమ్ము, పాహినులు[1] మరలకుండఁగ వరలనిమ్ము!
విహగ సంఘమువలె నన్ను వెడలనిమ్ము, వరుణుఁడా! నన్నుఁ జిరముగ బ్రతుకనిమ్ము! ॥ 302

1. భూరిదావ్నఽఆవిదం. (ప్రా.ప్ర.)

† గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ. 1. ఇక్కడఁ బంచ లఘు గణ మింద్ర గణముగాఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ.

(5) గీ॥ దిట్ట మగు రజ్జువునువలెఁ దివిరి పాప, బంధనంబును భేదింపు వరుణ ! యిష్టి
వ్యయన కాలములన్ మేము వగను బొంద, కుండ నిష్ఫల జరిపింపు కార్మి మరల ॥ 303

(6) ఉ॥ చిన్నతనంబునుండి ననుఁ జెందిన పాపము రజ్జువున్‌వలెన్
దిన్నగఁ దెంపుమా వరుణ ! దిట్టవు నీవు గదయ్య! మా. భయం
బెట్టులొ ద్రోలు దూరముగ నే జనుఁడై నను నిన్ను వీడి చే
పట్టునె యాధిపత్యమును బంధుర సత్యముఁ బోలి భూషణా! ॥ 304

(7) గీ॥ యాగ హర్తల నీ వెట్టి యాయుధముల, బాధ పెట్టుచునున్నావొ? వరుణ ! యట్టి
యాయుధంబుల మా పైకి ననుపకయ్య!, దుష్ట శత్రుల దూరము ద్రోలుమయ్య! ॥ 305

(8) క॥ గిరివలె నీ వౌ కర్మను, సురుచిరముగ నాశ్రయించి శోభిలు నీకై
కరము "నమః" శబ్దంబును, వెరవున నుడివెదను మూఁడు వేళలయందున్ ॥ 306

(9,10) సీ॥ పూర్వమందు వసించు పురుషుల ఋణమును శోధింపుచుండుము శుభద వరుణ !
మేము చేయుచునున్న మిక్కిలి ఋణమును శోధించుచుండుము శుద్ధ వరుణ !
యన్యార్జితంబగు నర్థంబు నేఁ బొందకుండునట్టులు చేయుచుండు వరుణ !
సుఖకరోషస్సులు శోభిల్లు నట్టులు కరుణతో నొనరించు పరమ వరుణ !
గీ॥ పెక్కుషస్సులలో నేను బెరుగుచుండి, బ్రదుకునట్టు లొనర్పుము వరుణ దేవ !
జ్ఞాతి తస్కర వృకరాజ జాతివలన, భయము లేకుండఁ జేయుము వరుణ ! నీవు ॥ 307

(11) గీ॥ జ్ఞాతిదారిద్ర్యమును నీవు ఖ్యాతి కలుఁగ, ధనుల ముందఱ నాతోడఁ దలఁపకయ్య !
కరుణతో [1]ధనము నిచ్చిన వరుణ దేవ !, పుత్ర పౌత్రులతో నిన్నుఁ బొగడఁగలను ॥ 308

1. ఇక్కడ "ఖల" మింద్ర గణమునకు మారుగా నుపయుక్తమైనది. "ధనమిచ్చిన" యని ప్రయోగింపఁగల్గి యుండియు శ్రీనేమానివారు "ఖల"ముపయోగించుట విశేషము. వ.గో.కృ.

## సూక్తమ్—29

ఋషిః—కూర్మో గార్త్సమదో, గృత్సమదో వా*

దేవతా—విశ్వేదేవాః

ఛందః—త్రిష్టుప్

(1) ధృతవ్రతా[1] ఆదిత్యా ఇషిరా ఆరే మత్ కర్త రహసూరివాగః ।

శృణ్వతో వో వరుణ మిత్ర దేవా భద్రస్య విద్వాగ్ం[2] అవసే హువే వః ॥ 288

(2) యూయం దేవాః ప్రమతిర్యూయమోజో యూయం ద్వేషాంసి సనుతర్యుయోత ।

అభిక్షత్తారో[3] అభి చ క్షమధ్వమద్యా చ నో మృళయతాపరం చ ॥ 289

(3) కిమూ ను వః కృణవామాపరేణ కిం సనేన వసవ[4] ఆప్యేన ।

యూయం నో మిత్రావరుణాదితే చ స్వస్తిమిన్ద్రామరుతో దధాత ॥ 290

(4) హయే దేవా యూయమిదాపయః స్థ తే మృళత నాధమానాయ మహ్యమ్ ।

మా వో రథో మధ్య[5]మవాళ్ళృతే భూన్మా యుష్మావత్స్వాపిషు శ్రమిష్మ ॥ 291

---

* గృత్సమద ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. ధృతవ్రతాఽఆదిత్యాఽఇషిరాఽఆరే, 2. విద్వాగ్ంఽఅవసే, 3. అభిక్షత్తారోఽ అభి, 4. వసవఽ ఆప్యేన,

5. మధ్యమమవాళ్ళృతే. (వ్రా.ప్ర.)

(5) ప్ర వ[1] ఏకో మిమయ భూర్యాగో యన్మా పితేవ కితవం శశాస ।
ఆరే పాశా[2] ఆరే అఘాని దేవా మా మాధి పుత్రే విమివ గ్రభీష్ట ॥ 292

(6) అర్వాఞ్చో[3] అద్యా భవతా యజత్రా[4] ఆ వో హార్ది భయమానో వ్యయేయమ్ ।
త్రాధ్వం నో దేవా నిజురో వృకస్య త్రాధ్వం కర్తాదవపదో యజత్రాః ॥ 293

(7) మాహం మఘోనో వరుణ ప్రియస్య భూరిదావ్న[5] ఆ విదం శూనమాపేః ।
మా రాయో రాజన్ త్సుయమాదవ స్థాం బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 294

## సూక్తము—29

ఋషి—కూర్ముఁడో గృత్సమదుఁడో †

దేవత—విశ్వేదేవులు

(1) గీ॥ గుప్త ప్రసవిని గర్భంబు గూఢ దూర, దేశమం దుంచునట్టులు దివ్యతేజ!
యస్మదపరాధ శతముల నవలఁ ద్రోలి, చిరము కాపాడుచుండుము! శీఘ్రగమన! ॥ 309

గీ॥ మీ సుమంగళ కృత్యము మే మెరింగి, యుష్మ దవనంబుఁ గోరితి ముచిత రీతి
మిమ్ముఁ బిలుచుచునున్నాము మిత్ర! వరుణ!, మమ్ముఁ గాపాడుఁ డీరలు నెమ్మి మీర ॥ 310

(2) గీ॥ మీ బలంబును భక్తుల మిమ్ముఁ గూడఁ, దివిరి బాధించు వారిని దేవ గణమ!
దూరమందుండువారిఁగాఁ దొడరిచేసి, కాలములయందు సుఖములఁ గలుగఁజేయుఁడు! ॥ 311

1. ప్ర వఽ ఏకో, 2. పాశాఽ ఆరేఽఅఘాని, 2. అర్వాఞ్చోఽఽద్యా, 3. యజత్రాఽఆవో, 4. భూరిదావ్నఽఆవిదం. (వా.ప్ర.)

† గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూడఁదగును. వ.గో.కృ.

(3) గీ॥ ఇప్పుడో! యప్పుడో! గాని యెట్టి కార్య, సాధనంబును సరిపెట్టఁ జాలఁగలను
వసు సమూహమా! ప్రాప్తవ్య బహుళ కార్య, భంగి మీ కార్యసాధన పక్కిఁ గూర్తు ॥ 312

గీ॥ సర్వ మిత్త్రుఁడ! మిత్రుడా! సఖుఁడ! వరుణ!, మారుతమ! [1]యదితి! యింద్రుఁడా! మీరు మాకు
సర్వ మంగళములఁ జేసి సరసు లగుచు, మమ్ము రక్షింప రారేమి? నెమ్మితోడ ॥ 313

(4) ఉ॥ బందుగు లౌట మి మ్మిపుడు ప్రార్థనఁ జేయుచు నుంటిఁగాన నో
బందుగులార! నా పయిని[2]బర్వఁగ నిండు కృపా విశేషమున్
చిందులు ద్రొక్కు మీ రథము చేరుచునుండునుగాక నిష్ఫలన్
బొందక శ్రాంతి మీవలెను బోఁడిమి నుండెద బంధు రాజితోన్ ॥ 314

(5) ఉ॥ దేవగణంబ! మీ నడుమ దేవతనై చరియించి పాపమున్
బోవఁగఁ జేసికోఁగలను బుత్రునికై పిత బుద్ధిఁ జెప్పు న
ట్లేవిధినైన సూక్తులను నెంతయుఁ బ్రీతిని మాకుఁ జెప్పుచున్
వావిరి పాశ మూలమునఁ బాపము గొట్టుచునుండుఁ డెంతయేన్ ॥ 315

గీ॥ శాబకమువెంత, బక్షిని శక్తి గలుఁగు, వ్యాఘ్రుఁ డెట్టులు చంపునో! యట్లు మీరు
మమ్ము హింసింపకుండుఁడు! మాన్యులార!, మమ్ము బాధింపకుండుఁడు! మాన్యులార! ॥ 316

(6) ఉ॥ భీతుఁడ నైన నా కడకుఁ బేర్మిని మీ రరుదెంచి యున్నచో
ఖ్యాతి దలిర్ప మిమ్ములను గాంచుచు వేడెద దుష్టసంఘమున్
స్ఫీత వృకంబులన్ మిగులఁ జెందుటకై యటు కాన నో మహా
పూత చరిత్రులార! ననుఁ బూర్ణ మనస్సునఁ గావరాదఁటే? ॥ 317

(7) గీ॥ జ్ఞాతి దారిద్ర్యమును నీవు ఖ్యాతికలుఁగ, ధనుల ముందఱ నెప్పుడున్ దలఁపకయ్య!
కరుణతో [3]ధనము నిచ్చిన వరుణ! నేను, బుత్ర పౌత్రులతో నిన్నుఁ బొగడఁగలను ॥ 318

1. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్తమైనది. వ.గో.కృ. 2. నాపైని (వ్రా.ప్ర.పా.)
3. ఇక్కడ నింద్ర గణమునకు మారు "భల"ము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

## సూక్తమ్—30

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఇన్ద్రః, 6—ఇన్ద్రాసోమౌ, 8—(పూర్వార్ధర్చస్య)

సరస్వతీ, 9—బృహస్పతిః; 11—మరుతః

ఛందః—త్రిష్టుప్, 11—జగతీ

(1) ఋతం దేవాయ కృణ్వతే సవిత్ర[1] ఇన్ద్రాయాహిఘ్నే న రమన్త[2] ఆపః ।

అహరహర్యాత్యక్తురపాం కియాత్యా ప్రథమః సర్గ[3] ఆసామ్ ॥ 295

(2) యో వృత్రాయ సినమత్రాభరిష్యత్ ప్ర తం జనిత్రీ విదుష ఉవాచ ।

పథో రదన్తీరను జోషమస్మై దివేదివే ధునయో యన్త్యర్థమ్ ॥ 296

(3) ఊర్ధ్వో హ్యస్థాదధ్యన్తరిక్షే ఽధా వృత్రాయ ప్ర వధం జభార ।

మిహం వసాన[4] ఉప హీమదుద్రోత్ తిగ్మాయుధో అజయచ్ఛత్రుమిన్ద్రః ॥ 297

(4) బృహస్పతే తపుషాశ్నేవ విధ్య వృకద్వరసో[5] అసురస్య వీరాన్ ।

యథా జఘన్థ ధృషతా పురా చిదేవా జహి శత్రుమస్మాకమిన్ద్ర ॥ 298

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ. పుట) చూఁడ నగును. వ.గో.కృ.

1. సవిత్రఽఇన్ద్రాయ. 2. రమన్తఽఆపః, 3. సర్గఽఆసామ్, 4. వసానఽఉప, 5. అరస్తోఽఅసుర. (వ్రా.ప్ర.)

(5) అవ క్షిప దివో[1] అశ్మానముచ్చా యేన శత్రుం[2] మన్దసానో నిజూర్వాః ।

తోకస్య సాతౌ తనయస్య భూరేరస్మాగ్ం[3] అర్ధం కృణుతాదిన్ద్ర గోనామ్ ॥ 299

(6) ప్ర హి క్రతుం వృహథో యం వనుథో రధ్రస్య స్థో యజమానస్య చోదౌ ।

ఇన్ద్రాసోమా యువమస్మాగ్ం[4] అవిష్టమస్మిన్ భయస్థే కృణుతము లోకమ్ ॥ 300

(7) న మా తమన్న శ్రమన్నోత తన్ద్రన్న వోచామ మా సునోతేతి సోమమ్ ।

యో మే పృణాద్ యో దదద్ యో నిబోధాద్ యో మా సున్వన్తముప గోభిరాయత్ ॥ 301

(8) సరస్వతి త్వమస్మాగ్ం[5] అవిడ్ఢి మరుత్వతీ ధృషతీ జేషి శత్రూన్ ।

త్యం చిచ్ఛర్ధన్తం తవిషీయమాణమిన్ద్రో హన్తి వృషభం శణ్డికానామ్ ॥ 302

(9) యో నః సనుత్య[6] ఉత వా జిఘత్నురభిఖ్యాయ తం తిగితేన విధ్య ।

బృహస్పత[7] ఆయుధైర్జేషి శత్రూన్ ద్రుహే రీషన్తం పరిధేహి రాజన్ ॥ 303

1. దివోఽశ్మా (బ్రా.ప్ర.), 2. శత్రుం (సా.మా.,బ్రా.ప్ర.), 3. భూరేరస్మా గ్ంఽఅర్ధం, 4. యువమస్మాగ్ంఽఅవిష్ట, 5. త్వమస్మాగ్ంఽఅవిడ్ఢి, 6. సనుత్యఽఉత, 7. బృహస్పతఽఆయు ధైర్జేషి. (బ్రా.ప్ర.)

(10) అస్మాకేభిః సత్వభిః శూర శూరైర్వీర్యా కృధి యాని తే కర్త్వాని ।

జ్యోగభూవన్ననుధూపితాసో హత్వీ తేషామా భరా నో వసూని ॥ 304

(11) తం వః శర్ధం మారుతం సుమ్నయుర్గిరోప బ్రువే నమసా దైవ్యం జనమ్ ।

యథా రయిం సర్వవీరం నశామహా[1] అపత్యసాచం శ్రుత్యం దివేదివే ॥ 305

## సూక్తము—30

### ఋషి గృత్సమదుఁడు †

దేవత—1 - 5 ఇంద్రుఁడు, 6 - సోముఁడు, ఇంద్రుఁడు, 7 - ఇంద్రుఁడు

8 - సరస్వతి, ఇంద్రుఁడు. 9 - బృహస్పతి, 10 - ఇంద్రుఁడు, 11 - మరుద్గణము

(1) క॥ ద్యుతిమంతుం డరినాశకుఁ, డతివృష్టిదుఁడైన యింద్రు యాగంబునకై
తతవృష్టి కలుఁగుచున్ భువి, సతతము జల ముండుఁగాక! సకల జగమునన్ ॥ 319

(2) గీ॥ వృత్రహనన నిమిత్తమై వృత్రవైరి, కదితి యన్న ప్రదానంబు సమర్థఁజేసి
యమరనాథుని నుతియించె నతనికిసయి, నదులు పారుచునుండు నే యడటు లేక ॥ 320

(3) చ॥ గగనమునందు నున్నతిని గాంచుచు వృత్రుఁడు వస్తు జాతమున్
మగఁటిమి గప్ప దేవ పతి మానక వానిని ద్రుంచి యుండెఁ బెన్
పగఁగొని మేఘ మండలము వాసవు చెంతకు వచ్చి యుండఁగాఁ
దగునటు వాఁడు గొట్టె నల దానిని వజ్రము చేతఁ బూనుచున్ ॥ 321

1. నశామహాఽపత్య (వ్రా.ప్ర)

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూడదగును. ప.గో.కృ.

(4) ఉ॥ పూని వృకద్వలాసురుని వుత్రులఁ గొట్టితి వింద్రః వజ్రముం
బోని మహాయుధంబులను బూర్వము శత్రులఁ గొట్టునట్లుగా
హాసులఁ జేయువారలను నత్యధికంబగు వీర్య సంపదన్
బూనుచుఁ ద్రుంచుమా! యిపుడు పూర్ణ జయంబును బొందఁబోవుమా! ॥ 322

(5) చ॥ అమృతమువంటి పల్కులను నంబర వీథిని నిన్ను వేడఁగా
సమ మగు రాయివంటి దగు చక్కని వజ్రముఁ బూని దానితోఁ
గ్రమముగ శత్రుమండలిని గ్రందెడునట్టులు చేసి యుంటచే
నమరుఁడ: మేము సంతతిని నందెదమయ్య! భవత్కృపావిధిన్ ॥ 323

(6) క॥ మీకున్ యజమానులకుం, జీకాకుం బెట్టు శత్రుఁ జెండుచు నరులన్
దేకువునఁ గొట్టి మమ్ముం, జేకొనుఁడీ! యింద్రః సోమః చేయుఁ డభయమున్ ॥ 324

(7) సీ॥ ఇంద్రుఁడా! నీ సేవ హెచ్చగు క్లేశ కారణము కాకుండంగఁ గ్రాలవలదె?
యింద్రుఁడా! నీ సేవ హెచ్చగు శ్రాంతి కారణము గాకుండంగఁ గ్రాలవలదె?
యింద్రుఁడా! నీ సేవ హెచ్చగు మాంద్య కారణము గాకుండంగఁ గ్రాలవలదె?
యింద్రుఁడా! నీ సేవ హెచ్చగు సోమకారణ మైనయట్టులు గ్రాలవలదె?
గీ॥ హరిః యభీష్టము దీర్పుముః యాగ కర్మ, జరుగునట్టు లొనర్పుముః చక్కనైన
గో సమూహముతో నీవు గూడుకొనుచు, నభిషవంబునకున్ ముందు నరుఁగఁదెమ్ము! ॥ 325

(8) గీ॥ ఓ సరస్వతీ! రక్షించి యేలి మమ్ము, మారుతముతోడఁ గూడుచు మరువకుండ
శత్రువులఁ జంపి మాకయి శాంతి నిమ్ము!, షండిక గణంబుఁ జంపుము శక్ర! నీవు ॥ 326

(9) శా॥ నీ వంతర్హిత దేశగామి వగుచున్ నిత్యంబు మమ్ముం గడుం
జావన్ మోదెదు వారి నాయుధములన్ సంధించుచుం జేత వే
బోవం గొట్టుచు వైరులన్ దునుముచుం బూర్ణత్వముం బొంది సం
భావింపం దగు వజ్ర మెల్లెడలకుం బంపంగదే! యీశ్వరా! ॥ 327

(10) ఉ॥ శూరులతోడఁ గూడుకొని శూరుఁడ! తావక వీర కార్యముల్
నేరిమి మీరఁజేయుచును నెమ్మి వెలుంగుము! నీవు శత్రువున్
వీరముఁ జూపుచున్ మిగుల బింకము లాడుచు నున్నయట్టి యా
వీరులఁ జంపి తద్ధనముఁ బేర్మిని మాకు నొసంగరాదఁటే ! ॥ 328

(11) గీ॥ దివ్యమారుతమా ! భవద్దీప్తి కేను, స్తుతి నమస్కారశతముల నుతి నొనర్తు
దానిచే వీర యుతముగ ధనయయుతము, నైన ధన కీర్తులను నేను బూనఁగలను ॥ 329

## సూక్తమ్ —31

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—విశ్వేదేవాః

ఛందః—జగతీ; 7-త్రిష్టుప్

(1) అస్మాకం మిత్రావరుణావతం రథమాదిత్యై రుద్రైర్వసుభిః సచాభువా ।

ప్ర యద్ వయో న పప్తన్వస్మనస్పరి శ్రవస్యవో హృషీవన్తో వనర్షదః ॥ 306

(2) అధ స్మా న[1] ఉదవతా సజోషసో రథం దేవాసో[2] అభి విక్షు వాజయుమ్ ।

యదాశవః పద్యాభిస్తిత్రతో రజః పృథివ్యాః సానౌ జంఘనన్త పాణిభిః ॥ 307

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. అధ స్మా నంs ఉదవతా, 2. దేవాసోs అభి (వ్రా.ప్ర.)

(3) ఉత స్య న[1] ఇన్ద్రో విశ్వచర్షణిర్దివః శర్ధేన మారుతేన సుక్రతుః ।
అను ను స్థాత్యవృకాభిరూతిభీ రథం మహే సనయే వాజసాతయే ॥ 308

(4) ఉత స్య దేవో భువనస్య సక్షణిస్త్వష్టా గ్నాభిః సజోషా జూజువద్ రథమ్ ।
ఇళా భగో బృహద్దివోత రోదసీ పూషా పురంధిరశ్వినావధా పతీ ॥ 309

(5) ఉత త్యే దేవీ సుభగే మిథూదృశోషాసానక్తా జగతామపీజువా ।
స్తుషే యద్ వాం పృథివి నవ్యసా వచః స్థాతుశ్చ వయస్త్రివయా[2] ఉపస్తిరే ॥ 310

(6) ఉత వః శంసముశిజామివ శ్మస్యహిర్బుధ్న్యో[3]ఽజ ఏకపాదుత ।
త్రిత[4] ఋభుక్షాః సవితా చనో దధేఽపాం నపాదాశుహేమా ధియా శమి ॥ 311

(7) ఏతా వో వశ్మ్యుద్యతా యజత్రా[5] అతక్షన్నాయవో నవ్యసే సమ్ ।
శ్రవస్యవో వాజం చకానాః సప్తిర్న రథ్యో[6] అహ ధీతిమశ్యాః ॥ 312

1. ఉతస్యనఽఇన్ద్రో, 2. వయస్త్రివయాఽఉపస్తిరే, 3. శ్మస్యహిర్ బుధ్న్యఽజ. 4. త్రితఽఋభుక్షాః, 5. యజత్రాఽ అతక్ష, 6. రథ్యోఽఅహ. (వా.ప్ర.)

## సూక్తము—31

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—విశ్వేదేవతలు

(1) చ॥ వనగతమైన పక్షికులవారముకై వడి మా రథంబు తాఁ
బనివడి పోవు వే రయినపట్టును గూరిచి కాన రుద్రుఁడా!
ఘనుఁడగు రుద్రుతోడ మఱిఁ గ్రాలు వసుప్రకరంబుతోడ నీ
వనుకొనినట్లు కావవఁటె! యా యరదంబును సర్వరీతులన్ ॥ 330

(2) ఉ॥ అన్నము గోరి మా యరద మంతటఁ బోవుచునుండె దానికిం
దిన్నఁగఁ బాయఁగాఁబడిన తీరగు నశ్వగణంబు దెక్కలం
బన్నగ మార్గమంత బహు భంగుల దాఁటుచు నెత్తు భూములన్
గ్రన్నన నల్గఁ గొట్టెదను గాంచరె? మీరలు పండితోత్తముల్! ॥ 331

(3) చ॥ సకలముఁ జూచు దేవపతి సార మరుద్గణపంక్తితోడ నా
ప్రకటిత కర్మలన్నియును ప్రాభవ మొప్పఁగఁ జేయుచుండి పా
యక కడు దానమూలమున నన్న ధనాదుల నందఁజేయు మా
మక రథ యోగ్య కర్మలకు మానుగ నిచ్చు జయంబు పేర్మితోన్ ॥ 332

(4) గీ॥ దేవపత్నులతోఁ గూడి దివ్యకాంతి, సహితుఁడౌ త్వష్ట రోదసి చారు భగుఁడు
పూషదేవుఁ డిలాశ్వులు పూర్ణమతిని, యానము చలింపఁ జేయరే? యమలమతిని ॥ 333

(5) గీ॥ సుందర ద్యుతి సుభగము సుప్రసిద్ధ, మఖిల వస్తుప్రదర్శియౌ నా యుషస్సు
రాత్రి రూపము నరదంబు రాణ మిగులఁ, గదలు నట్టులు చేయుత! సదయు లగుచు ॥ 334

గీ॥ గగనదేవి! పుడమి! ఘను లగు మీ కిప్డు, నూత్న సూక్తితోడ నుతి నొనర్తు
స్థావరాన్నమంతఁ జక్కఁగఁ గలిఁగించి, యన్నములను మాకు నందనిండు! ॥ 335

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6) క॥ సతతము దేవగణంబా!, స్తుతులను జేయుటకు నేను జూ/చుచు నుంటిన్
స్తుతికామనముం జేయుము; వితత యశః కలితులార! విను/డీ; మీరల్ ॥ 336

గీ॥ త్రితు/ డహిర్బుధ్న్య సవితలు దిట్ట యైన, యేకపాత్తు ఋభుక్ష వహీన బుద్ధి
శీఘ్రగామ్యగ్ని దేవు/డున్ జెన్ను మిగుల, నుతులచే/ బ్రీతులగుదురు నూత్నఫక్కి ॥ 337

(7) గీ॥ విశ్వదేవగణంబ! మీ వివిధ నుతుల/, జేయు వానన గలదు నా చెంతనెపుడు
బలము నన్నంబు/ గోరెడు భక్తగణము, స్తుతుల/ జేయును మీకు నస్తోకమతిని ॥ 338

## సూక్తమ్—32

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—1 - ద్యావాపృథివీ; 2-3 ఇన్ద్రో త్వష్టా వా;

4 - 5 - రాకా; 6 - 7 - సినీవాలీ; 8 - లింగోక్తాః

ఛందః—జగతీ; 6 - 8—అనుష్టుప్

(1) అస్య మే ద్యావాపృథివీ[1] ఋతాయతో భూతమవిత్రీ వచసః సిషాసతః ।

యయోరాయుః ప్రతరం[2]తే ఇదం పుర ఉపస్తుతే వసూయుర్వాం మహోదధే ॥ 313

(2) మా నో గుహ్యా రిప[3] ఆయోరహన్ దభన్ మా న[4] ఆభ్యో రీరధో దుచ్ఛునాభ్య ।

మా నో వి యౌః సఖ్యా విద్ధి తస్య నః సుమ్నాయతా మనసా తత్ త్వేమహే ॥ 314

* గృత్సమద ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూ/డనగును. వ.గో.కృ.

1. ద్యావాపృథివీఽ ఋతాయతో, 2. తేఽఇదంపురఽఉపస్తుతే. 3. రిపఽఆయోరహన్. 4. మా నఽ ఆభ్యో. (వ్రా.ప్ర.)

(3) అహేళతా మనసా శ్రుష్టిమా వహ దుహానాం ధేనుం పిప్యుషీమసశ్చతమ్ ।

పద్యాభిరాశుం వచసా చ వాజినం త్వాం హినోమి పురుహూత విశ్వహా ॥ 315

(4) రాకామహం సుహవాం సుష్టుతీ హువే శృణోతు నః సుభగా బోధతు త్మనా ।

సీవ్యత్వపః సూచ్యాచ్ఛిద్యమానయా దదాతు వీరం శతదాయముక్థ్యమ్ ॥ 316

(5) యాస్తే రాకే సుమతయః సుపేశసో యాభిర్దదాసి దాశుషే వసూని ।

తాభిర్నో[1] అద్య సుమనా ఉపాగహి సహస్రపోషం సుభగే రరాణా ॥ 317

(6) సినీవాలి పృథుష్టుకే యా దేవానామసి స్వసా ।

జుషస్వ హవ్యమాహుతం ప్రజాం దేవి దిదిడ్ఢి నః ॥ 318

(7) యా సుబాహుః స్వఙ్గురిః సుషూమా బహుసూవరీ ।

తస్యై విశ్పత్న్యై హవిః సినీవాల్యై జుహోతన ॥ 319

1. తాభిర్నోఽద్య సుమనాఽఉపాగహి. (వ్రా.ప్ర.)

(8) యా గుంగూర్యా సినీవాలీ యా రాకా యా సరస్వతీ ।

ఇన్ద్రాణీమహ్వ[1] ఊతయే వరుణానీం స్వస్తయే ॥ 320

## సూక్తము—32

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—1-ద్యావా పృథువులు, 2, 3—ఇంద్రుఁడు లేక త్వష్ట‡, 4, 5—రాక 6, 7—సినీవాలి 8—ఆరుగురు దేవతలు

(1) ఉ॥ రోదసి! నిన్నుఁ బ్రీతముగ రూఢి నొనర్చిన వారి కెప్పుడున్
గాదనకుండ నాశ్రయము కమ్ము! విశేషము నీవు ప్రేమమై
సాదర మొప్ప సేయఁగల చక్కని యన్నము గోరి నిన్ను సం
వాదపురస్సర స్తుతుల వర్ణనఁ జేసెద నాలకింపుమా! ॥ 339

(2,3) సీ॥ పగలు రాత్రియు మమ్ముఁ బరగు ప్త సేసలు హింసింప లేవని యెరుగఁగలము!
కష్టదాయకమైన కఠినారి సేవకు వశులము కామని పలుకఁగలము!
బహుకాల సంప్రాప్త బంధుత మనలకు బెదఱకుండునటంచుఁ జెప్పఁగలము!
మా సుఖంబులఁ గోరి మా సఖ్యమును నీవు వీడటంచెదవని వేడఁగలము!
గీ॥ కాన నింద్రుఁడ! సుఖమును గలుఁగఁ జేయు, నట్టిదియు దుగ్ధవతియును సతిదృఢాంగి
యైన ధేనువు మా కీయ నరుగఁదేర, నిన్ను నుతియింపకుందుమె? సన్నుతాంగ! ॥ 340

1. ఇన్ద్రాణీమహ్వఽఊతయే. (వ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

‡ 2, 3 ఋక్కులకు దేవత ఇంద్రుఁడుగాని త్వష్టగాని యగునని సంస్కృత మూలములలోఁ గలదు. వ్రాతప్రతిలో (2వ సంపుటము 337 పుట) నొక్క యింద్రుఁడే దేవతయని వ్రాయఁబడినను ఋషిదేవతల పట్టికగల 15b సంఖ్యగల సంపుటములో శ్రీ నేమానివారు "ఇంద్రుఁడు లేక త్వష్ట" అని దేవతను స్పష్టముగానే వ్రాసిరి. వ.గో.కృ.

(4) చ॥ కరము నుతిప్రపంచమునఁ గ్రాలెడు రాకను నేను బిల్చుచో
సరమర లేక యామె శుభ మందుచుఁ బిల్పును నాలకించి మ
మ్మరయుచుఁ దీక్ష్ణ సూచికను నస్మదనంత కుకర్మ రాశులన్
స్థిరముగఁ గొట్టి పుత్రులను జేర్చుచునుండునుగాక! మా కిలన్ ॥ 341

(5) క॥ రాకం గరము నుతించుచు, [1]భీకరముగ ధనముఁగోరి వేడెద నుతులన్
రాక! ప్రసన్న మనస్సున, నాకలిత కృపాభిరామవై రమ్మిటకున్ ॥ 342

గీ॥ పరమసౌభాగ్యమతిరాక! భాసురాంగి!, వచ్చి మా కృత్యములనెల్ల మెచ్చి నీవు
పుష్టివర్ధనమును జేసి పూవుఁబోఁడి!, వెల్గుచుండుము! జగమున వివిధగతుల ॥ 343

(6) గీ॥ ఓ సినీవాలి! జన్మచే వాసిఁగాంచి, దేవతలకెల్ల భగినివై తేజరిల్లి
తీవు దత్తహవిస్సేవఁ దీర్చికొనుచు, మా యపత్యాభివృద్ధిని మరువకమ్మ! ॥ 344

†(7) గీ॥ ఆ సినీవాలి ప్రసవిత్రి యధికసుంద, రాంగుళి విశిష్ట శుభబాహ యఖిలలోక
పాలినియుఁగాన సఖులార! పరమభక్తి, నామె కీయుఁడు! హవ్యము నాదరమున ॥ 345

(8) గీ॥ ఎవతె గుంగు సినీవాలి? యెవతె రాక?, యెవతె యానొ సరస్వతి? యేపుగల్గు
నట్టి యింద్రాణి, వరుణాణి నాదరమున, నాశ్రయించెద సుఖమునకై దలంచి ॥ 346

---

1. ప్రాకటముగ (తొ.పా.) యతిభంగము. వ.గో.కృ.

† ఇక్కడ వ్రాతప్రతిలో (2వ సంపుటము 339వ పుట) నీ 32వ సూక్తమున 7 ఋక్కులు మాత్రమే యున్నట్లును 345-346 పద్యములు రెండును 7వ ఋక్కున కనువాదములై నట్లును వ్రాయఁబడియున్నది. ఇది సరికాదు. ఈ సూక్తమున మొత్త మెనిమిది ఋక్కులు ఋగ్వేద మూలమునఁగలవు. 345వ పద్య మేడవ ఋక్కునకును 346వ పద్య మెనిమిదవఋక్కునకును ననువాదములు. వ.గో.కృ.

## † సూక్తమ్—33

### ఋషిః—హిరణ్యగర్భః

### దేవతా—1-2 కుహూః, 3-4 అనుమతిః, 5-8 ధాతా.

### ఛందః—త్రిష్టుప్; 5-గాయత్రీ; 3,4,7-అనుష్టుప్

(1) కుహూమహం సువృతం విద్మనాపసమస్మిన్

యజ్ఞే సుహవాం జోహవీమి ।

సా నో దదాతు శ్రవణం పితృణాం

తస్యై తే దేవి హవిషా విధేమ ॥ 321

(2) కుహూర్దేవానామమృతస్య పత్నీ

హవ్యా నో అస్య హవిషః శృణోతు ।

సం దాశుషే కిరతు భూరి వామం

రాయస్పోషం యజమానే దధాతు ॥ 322

(3) అను నోఽద్యానుమతిర్యజ్ఞం దేవేషు మన్యతామ్ ।

అగ్నిశ్చ హవ్యవాహనో భవతం దాశుషే మయః ॥ 323

† ద్వితీయ మండలమందలి యీ 33వ సూక్తమును గొందఱు పరిశిష్టసూక్తముగా భావింపఁగా మఱి కొందఱు "ఖిల సూక్తము"గా నెన్నిరి. వేరొక కొందఱు దీనిని నధికపాఠమనఁగా నింకఁ గొందఱు ప్రక్షిప్తమనిరి. ఇతర శాఖా గత సూక్తమును నపేక్షావశమున స్వశాఖలోనికిఁ బరిగ్రహించుచో దానిని "ఖిల సూక్త" మందురు. ఏకానేక మంత్రములు పరిగృహీతములగుచో నవి "ఖిల మంత్రము" లనఁబడును. (చూ. 192వ సూక్తము ఫుట్‌నోటు, 646వ పుట.) వ.గో.కృ.

(4) అన్విదనుమతే త్వం మన్యాసై శం చ నస్కృధి ।

క్రత్వే దక్షాయ నో హిను ప్ర ణ ఆయూంషి తారిషత్ ॥ 324

(5) ధాతా దధాతు నో రయిమీశానో జగతస్పతిః ।

స నః పూర్ణేన వావనత్ ॥ 325

(6) ధాతా దదాతు దాశుషే వసూని

ప్రజాకామాయ మీఢుషే దురోణే ।

తస్మై దేవా అమృతాః సం

వ్యయన్తాం విశ్వే దేవాసో అదితిః సజోషాః ॥ 326

(7) ధాతా దదాతు దాశుషే ప్రాచీం జీవాతుమక్షితామ్ ।

వయం దేవస్య ధీమహి సుమతిం వాజినీవతః ॥ 327

(8) ధాతా ప్రజానాముత రాయ ఈశే

ధాతేదం విశ్వం భువనం జజాన ।

ధాతా కృష్టీరనిమిషాభిచష్టే

ధాత్ర ఇద్ధవ్యం ఘృతవజ్జుహోత ॥ 328

‡ సూక్తము—33

ఋషి—హిరణ్యగర్భుఁడు

దేవత—"కుహూ" నామకామృత సతి, అనుమతి, ధాత.

†(1) గీ॥ అమృతవల్లి కుహూ నామకామృతసతి, యజ్ఞ మంత్రాల వినిపించి వెలుఁగుఁగాతఁ!
బిత్రుదేవతల హవిస్సు పెలుచ నిచ్చి, గర్భగత హిరణ్యమ్మును గాచుఁగాత! ॥ 347

†(2) గీ॥ హవ్యవాహను రూపాన హవిసు లెల్ల, శ్రుతుల వినుచు నమృతపత్ని శుభము లెసఁగ
నల్ల యజమానునకుఁ గూర్చి యమలతృప్తి, భూరిసంపద లిచ్చుతఁ బొలుపు మీర ॥ 348

†(3) గీ॥ దేవతాతతి దివ్య యజ్ఞావశులను
ననుమతింపఁగ హవ్య వాహనుఁడు నగ్ని
దూతగాఁగ వెలుంగుచు దోషరహిత
మాన్య యజ్ఞ హవ్యాలను మంత్రములను
గొనుచుఁ బూత శక్తుల నెల్లఁ బొలుచుఁగాక! ॥ 349

†(4) క॥ హృద్గత మౌ మాన్య సుకృతి, సద్గతిగతి కృథి యనంగ సమ్మతి నీయన్
ముద్గల దక్షత్వమ్ము బ్బ, హద్గగనాయువు చెలంగ హాయి నొసఁగుతన్! ॥ 350

†(5) క॥ ధాతయె సృష్టిని జేయును, ధాతయె సంపద లొసఁగును ధాతయె పెంచున్
ధాత జగత్పతిగఁబితగఁ, ద్రాతగ నిలుచుచుఁ బ్రపూర్ణతన్ నెలకొన నౌ ॥ 351

†(6) మ॥ వసు రూపమ్ములఁ బొంది ధాత జన సంభారమ్ము భావించుచున్
పసి మీరంగను సర్వ మానవులఁ దా సంభావనం బొప్పఁగన్
బిస దేవావళి విశ్వ రూపమున సంప్రీతిన్ బ్రకాశించుచున్
బసఁ బూర్ణామృత వృష్టి వృద్ధి నదితి ప్లక్షమ్ము సిద్ధించుతన్ ! ॥ 352

†(7) క॥ లోకమ్ముల ధాతయె తగఁ, బ్రాకట ప్రాగ్దిగటమున రక్షించుచు సృ
ష్టికరణ మొనర్చుత! సుమ, తీకృతి జీవాతు దేవ ధీమహి వెలుఁగన్! ॥ 353

†(8) క॥ ప్రజలను ధాతయె నిలుపును, ప్రజాపతియె సర్వ లోక భాసుర విశ్వ
ప్రజతతి ధనముల నిచ్చును, యజనీయ ఘృతము విధాత హవిసును నందున్ ॥ 354

‡ ద్వితీయ మండలమందలి యీ 33వ సూక్తమునకు సంబంధించిన విశేషములకై సంస్కృతమూల సూక్తమున కిచ్చిన (784వ పుట) ఫుట్‌నోట్ చూఁచునది. వ.గో.కృ.

† రచయిత:-వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాలకృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

## అనువాకః—4 సూక్తమ్—34

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః *

దేవతా—రుద్రః

ఛందః—త్రిష్టుప్

(1) ఆ తే పితర్మరుతాం సుమ్నమేతు మా నః సూర్యస్య సందృశో యుయోథాః ।

అభి నో వీరో[1]అర్వతి క్షమేత ప్ర జాయేమహి రుద్ర ప్రజాభిః 329

(2) త్వాదత్తేభీ రుద్ర శంతమేభిః శతం హిమా[2] అశీయ భేషజేభిః ।

వ్యస్మత్ ద్వేషో వితరం వ్యంహో వ్యమీవాశ్చాతయస్వా విషూచీః ॥ 330

(3) శ్రేష్ఠో జాతస్య రుద్ర శ్రియాసి తవస్తమ స్తవసాం వజ్రబాహో ।

పర్షి ణః పారమంహసః స్వస్తి విశ్వా[3] అభీతీ రపసో యుయోధి ॥ 331

(4) మా త్వా రుద్ర చుక్రుధామా నమోభిర్మా దుష్టుతీ వృషభ మా సహూతీ ।

ఉన్నో వీరాగ్ం[4] అర్పయ భేషజేభిర్భిషక్తమం త్వా భిషజాం శృణోమి ॥ 332

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడ నగును. వ.గో.కృ.

1. వీరోऽ అర్వతి, 2 హిమాऽ అశీయ, 3. విశ్వాऽఅభీతీ, 4. వీరాగ్ంऽ అర్పయ, (వ్రా.ప్ర.)

(5) హవీమభిర్హవతే యో హవిర్భిరవ స్తోమేభీ రుద్రం దిషీయ ।

ఋదూదరః సుహవో మా నో అస్యై బభ్రుః సుశిప్రో రీరధన్మనాయై ॥ 333

(6) ఉన్మా మమన్ద వృషభో మరుత్వాన్ త్వక్షీయసా వయసా నాధమానమ్ ।

ఘృణీవ [1]చ్ఛాయామరపా అశీయాऽऽ వివాసేయం రుద్రస్య సుమ్నమ్ ॥ 334

(7) క్వస్య తే రుద్ర మృళయాకుర్హస్తో యో[2] అస్తి భేషజో జలాషః ।

అపభర్తా రపసో దైవ్యస్యాభీ ను మా వృషభ చక్షమీథాః ॥ 335

(8) ప్ర బభ్రవే వృషభాయ శ్వితీచే మహో మహీం సుష్టుతిమీరయామి ।

నమస్యా కల్మలీకినం నమోభిర్గృణీమసి త్వేషం రుద్రస్య నామ ॥ 336

(9) స్థిరేభిరంగైః పురురూప[3] ఉగ్రో బభ్రుః శుక్రేభిః పిపిశే హిరణ్యైః ।

ఈశానాదస్య భువనస్య భూరేర్న వా[4] ఉ యోషద్ రుద్రాదసుర్యమ్ ॥ 337

1. ఘృణీవ ఛాయామరపాऽఅశీయావివాసేయం. 2. యో ऽఅస్తి. 3. పురురూపऽఉగ్రో. 4. వాऽఉయోషాట్. (ప్రా.ప్ర.)

(10) అర్హన్ విభర్షి సాయకాని ధన్వార్హన్ నిష్కం యజతం విశ్వరూపమ్ ।

అర్హన్నిదం దయసే విశ్వమభ్వం న వా[1] ఓజీయో రుద్ర త్వదస్తి ॥ 338

(11) స్తుహి శ్రుతం గర్తసదం యువానం మృగం న భీమముపహత్నుముగ్రమ్ ।

మృళా జరిత్రే రుద్ర స్తవానో ऽన్యం తే[2] అస్మన్ని వపన్తు సేనాః ॥ 339

(12) కుమారశ్చిత్ పితరం వన్దమానం ప్రతి నానామ రుద్రోపయన్తమ్ ।

భూరేర్దాతారం సత్పతిం గృణీషే స్తుతస్త్వం భేషజా రాస్యస్మే ॥ 340

(13) యా వో భేషజా మరుతః శుచీని యా శంతమా వృషణో యా మయోభు ।

యాని మనురవృణీతా పితా నస్తా శం చ యోశ్చ రుద్రస్య వశ్మి ॥ 341

(14) పరి ణో హేతీ రుద్రస్య వృజ్యాః పరి త్వేషస్య దుర్మతిర్మహీ గాత్ ।

అవ స్థిరా మఘవద్భ్యస్తనుష్వ మీఢ్వస్తోకాయ తనయాయ మృళ ॥ 342

1 నవాऽ ఓజీయో, 2. తేऽఅస్మ (వ్రా.ప్ర.)

(15) ఏవా బభ్రో వృషభ చేకితాన యథా దేవ న హృణీషే న హంసి ।
హవనశ్రున్నో రుద్రేహ బోధి బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 343

## అనువాకము—4 సూక్తము—34

ఋషి—గృత్సమదుఁడు†

దేవత—రుద్రుఁడు

(1) గీ॥ ఓ మరుద్గణజనకుఁడా! యొనర నీవు, చేయు సుఖ మెల్ల మమ్ములఁ జెందుఁగాక!
సూర్య సందర్శనమునుండి సుంతయైన, మమ్ముఁ దప్పింపకుండుమో! మాన్యరుద్ర! ॥ 355

క॥ వీరు లగు మా సుపుత్రులఁ, జేరుచు మా శత్రువులను జక్కాఁడవలెన్
గూరిమి మాకున్ సంతతి, నేరుపుతో నిత్తుగాక! నిజముగ రుద్రా! ॥ 356

(2) గీ॥ మా కొసంగిన యోషధి మహిమవలన, శతపరిమితాబ్దములు నేను శక్తితోడ
బ్రతుకఁ గల్గుదు రుద్ర! మా పాపములను, వ్యాధిపుంజములను [1]నీవె యవలఁ గొట్టు! ॥ 357

(3) క॥ సకలైశ్వర్య శ్రేష్ఠుఁడ, వకళంక విశుద్ధ దేవుఁడవుదువు రుద్రా!
యిఁకఁ బాపాపరతీరము, నకుఁ జేర్పుము? నీవు నన్ను నయముగ వజ్రీ! ॥ 358

(4) క॥ అన్యాయ నమస్సులచే, నన్యాయ స్తుతులచేత నన్య దివిజులన్
ధన్యాత్ము లనుచు నెంచను, బుణ్యాత్ముఁడ! రుద్ర! నీవు పూనకు కినుకన్ ॥ 359

క॥ సర్వభిషగ్గణములలో, సర్వ శ్రేష్ఠుండ వనుచుఁ జాటన వింటిన్
సర్వవిధౌషధి! రుద్రుఁడ!, సర్వ సుతుల కెల్లఁ బుష్టిఁ జక్కఁగ నిమ్మా! ॥ 360

(5) గీ॥ హవ్య సమ్మిశ్రితాహ్వాన మాలకించు, రుద్రదేవుని సుతిచేత రూఢి కెక్క—
నపగతక్రోధునిగఁ జేతు నమరియుండి, సకల కాంక్షితముల వాఁడు సఖుల కొసఁగు! ॥ 361

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. వెడలఁగొట్టు (వ్రా.ప్ర.పా.) యతిభంగము, వ.గో.కృ.

గీ॥ కోమలోదకమును గల్గి కూర్మితోడ, శోభనాహ్వాన మాలించి శోభగల్గి
రుద్రదేవుఁడు న న్నతిరాధి కెక్కు,హనన వృత్తికి నంపక యమరుఁగాక॥ 362

(6,7) సీ॥ మారుత యుతుఁడైన మా రుద్రదేవుఁడు గీష్మాన్నమును మమ్ముఁ దృప్తిఁ జేయు!
రౌద్రత త్తవ్యక్తి భద్ర ఛాయసువలె నతిసుఖంబుల మాకు నందనిచ్చు!
పాపకూస్యం దొచు బహురీతిఁ దనదైన పరిచర్యఁ జేయంగఁ బంపఁ గలుఁగు!
నఖిలకాంక్షితముల నలరుచుండెడునట్లు మా ప్రార్థనంబుల మరువకుండు!
గీ॥ భైషజాలంకృతం బైన వాని కరము. సర్వ జనులకు సుఖదమై చాల నొప్పి
పావనాశకుఁ డైన భూపంపనుండు, పరిమ మిమ్ముల రక్షించుఁగాకఁ బ్రీతి॥ 363

(8) గీ॥ అర్జునుఁడు బభ్రువర్ణుఁ డనంత దాత, కాంతి యుక్తుఁడైన రుద్రుఁడు కరము నుతుల
యుక్తముగ నాలకింపఁగ నున్నయెడల, వాని సన్నుతిఁ జేయు మెంతేని భక్తి॥ 364

(9) గీ॥ దృఢశరీరుఁడు బహురూపి దీప్తరుక్మ. భూషణుఁడు బభ్రువర్ణుఁడు పూర్ణభువన
భర్తయౌ రుద్రుఁ డీపృథ్వీబలము నెల్ల, వేరుచేయక యుండుత! వేడ్కమీర॥ 365

(10,11) సీ॥ అర్చనార్హుఁడు రుద్రుఁ డధిక ధనుర్బాణధారియై జగమునఁ దనియుచుండు!
నర్చ నార్హుఁడు రుద్రుఁ డఖిలరూపుం దొచు పూర్ణ నిష్కంబులఁ బొందియుండు!
నర్చ నార్హుఁడు రుద్రుఁ డఖిలజగంబులఁ గాపాడఁగలఁ డను ఘనతఁగాంచు!
నర్చ నార్హుఁడు రుద్రుఁ డందఱికంటెఁ దా బలని స్తుతిని గల్గి వెలఁగుచుండుఁ!
గీ॥ గానఁ బ్రఖ్యాత యువకుఁడా! కవలివచ్చి. పశువువలె శత్రువులఁ జంపు భవ్యరుద్రు
సంస్తుతించినచో నీవు సరసనుతుల, నతఁడు సౌఖ్యంబొసంగుచు నరులఁగొట్టు!॥ 366

(12) క॥ జనకుం డాశీర్వాదం. బును జేసెడివేళ సుతుఁడు పూర్ణనమస్సున్
మనసార, జేయు విధమున, నొనరింతు నమస్సు నీకు నో రుద్రుండా!॥ 367

క॥ ధనదాత! పాలకుఁడ! నీ, వనయము సాధువుల కెల్ల నధిపతి వగుచున్
నిను సేవించిన వారికి, ఘన మగు నౌషధము నంతఁ గల్పింతువు సూ!॥ 368

(13) గీ॥ మాకు జనకుఁ డైన మనువు పొందినదియు, సుఖకరంబు మఱియు సుఖద మైన
నౌషధంబు మాకు నందింపరారె! యో, మారుతంబులార!, మాన్యులార!॥ 369

(14) ఉ॥ తావక హేతు లన్నియును దప్పక మమ్ముఁ బరిత్యజించుతన్!
దావక మైన దుష్టమతి తప్పక మమ్ముఁ బరిత్యజించుతన్!
నీవు కనద్దనుర్గణము నేర్పున దించుచు రుద్ర దేవుఁడా!
కావుము! పుత్రులన్ మములఁ గావుము! పౌత్రుల సౌఖ్య మిచ్చుచున్ ॥ 370

(15) గీ॥ బభ్రువర్ణుఁడు బహుదీప్త తనువు వాఁడు, సకల విషయంబులను మదిఁ జక్క నెరుఁగు
వాఁ డభీష్టము లిడువాఁడు భవ్యనుతులఁ, జెవులఁ బెట్టెడు రుద్రుఁడు చెలఁగుచుండె ॥ 371

గీ॥ మా పయిం గోప మూనకు మాన్యరుద్ర!, మమ్ము నశియింపఁ జేయకు మాన్యరుద్ర!
యట్టు లుండిన మే మెల్ల నమల యజ్ఞ, కర్మలం దెల్ల నిను వేడఁగలము సుమ్మ! ॥ 372

## సూక్తమ్—35

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—మరుత్

ఛందః—జగతీ, 15—త్రిష్టుప్

(1) ధారావరా మరుతో ధృష్ణ్వోజసో మృగా న భీమా స్తవిషీభిరర్చినః ।
అగ్నయో న శుశుచానా[1] ఋజీషిణో భృమిం ధమన్తో[2] అప గా అవృణ్వత ॥ 344

(2) ద్యావో న స్తృభిశ్చితయన్త ఖాదినో వ్యభ్రియా న ద్యుతయన్త వృష్టయః ।
రుద్రో యద్ వో మరుతో రుక్మవక్షసో వృషాజని పృశ్న్యాః శుక్ర[3] ఊధని ॥ 345

* గృత్సమద ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి విషయకమైన ఫుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. శుశుచానాఽఋజీషిణో, 2. ధమన్తోఽఅపగాఽఅవృణ్వత, 3. శుక్రఽఊధని. (వ్రా.ప్ర.)

(3) ఉక్షన్తే[1] అశ్వాగ్ం అత్యాగ్ం[2] ఇవాజిషు నదస్య కర్ణైస్తురయన్త[3] ఆశుభిః ।

హిరణ్యశిప్రా మరుతో దవిధ్వతః పృక్షం యాథ పృషతీభిః సమన్యవః ॥ 346

(4) పృక్షే తా విశ్వా భువనా వవక్షిరే మిత్రాయ వా సదమా జీరదానవః ।

పృషదశ్వాసో[4] అనవభ్రరాధస[5] ఋజిప్యాసో న వయునేషు ధూర్షదః ॥ 347

(5) ఇన్ధన్వభిర్ధేనుభీ రప్శదూధభిరధ్వస్మభిః పథిభిర్భ్రాజదృష్టయః ।

ఆ హంసాసో న స్వసరాణి గన్తన మధోర్మదాయ మరుతః సమన్యవః ॥ 348

(6) ఆ నో బ్రహ్మాణి మరుతః సమన్యవో నరాం న శంసః సవనాని గన్తన ।

అశ్వామివ పిప్యత ధేనుమూధని కర్తా ధియం జరిత్రే వాజపేశసమ్ ॥ 349

(7) తం నో దాత మరుతో వాజినం రథ[6] ఆపానం బ్రహ్మ చితయద్ దివేదివే ।

ఇషం స్తోతృభ్యో వృజనేషు కారవే సనిం మేధామరిష్టం దుష్టరం సహః ॥ 350

1. ఉక్షన్తేఽఅశ్వాగ్ం, 2. అత్యాగ్ంఽఇవాజిషు, 3. కర్ణైస్తురయన్తఽఆశుభిః, 4. పృషదశ్వాసోఽఅనవ, 5. రాధసఽఋజి, 6. రథఽఆపానం. (వా.ప్ర.)

(8) యద్[1] యుఞ్జతే మరుతో రుక్మవక్షసో ఽశ్వాన్ రథేషు భగ[2] ఆ సుదానవః ।

ధేనుర్న శిశ్వే స్వసరేషు పిన్వతే జనాయ రాతహవిషే మహీమిషమ్ ॥ 351

(9) యో నో మరుతో వృకతాతి మర్త్యో రిపుర్దధే వసవో రక్షతా రిషః ।

వర్తయత తపుషా చక్రియాభి తమవ రుద్రా[3] అశసో హన్తనా వధః ॥ 352

(10) చిత్రం తద్ వో మరుతో యామ చేకితే పృశ్న్యా యదూధరప్యాపయో దుహుః ।

యద్ వా నిదే నవమానస్య రుద్రియాస్త్రితం జరాయ జురతామదాభ్యాః ॥ 353

(11) తాన్ వో మహో మరుత[4] ఏవయావ్నో విష్ణోరేషస్య ప్రభృథే హవామహే ।

హిరణ్యవర్ణాన్ కకుహాన్ యతస్రుచో బ్రహ్మణ్యన్తః శంస్యం రాధ[5] ఈమహే ॥ 354

(12) తే దశగ్వాః ప్రథమా యజ్ఞమూహిరే తే నో హిన్వన్తూషసో వ్యుష్టిషు ।

ఉషా న రామీరరుణైరపోర్ణుతే మహో జ్యోతిషా శుచతా [6]గో అర్ణసా ॥ 355

1. యుద్యుఞ్జతే, 2. భగఽఆ సుదానవః, 3. రుద్రాఽఅశసో, 4. మరుతఽఏవ, 5. రాధఽఈమహే, 6. గోఽఅర్ణసా. (వ్రా.ప్ర.)

(13) తే క్షోణీభిరరుణేభిర్నాఞ్జిభీ రుద్రా[1] ఋతస్య సదనేషు వావృధుః ।
నిమేఘమానా[2] అత్యేన పాజసా సుశ్చన్ద్రం వర్ణం దధిరే సుపేశసమ్ ॥ 356

(14) తాగ్ం[3] ఇయానో మహి వరూథమూతయ[4] ఉప ఘేదేనా నమసా గృణీమసి ।
త్రితో న యాన్ పంచ హోతౄనభిష్టయ[5] ఆవవ ర్తదవరాం[6]చక్రియావసే ॥ 357

(15) యయా రధ్రం పారయథాత్యంహో యయా నిదో ముంచథ వన్దితారమ్ ।
అర్వాచీ సా మరుతో యా[7] వ ఊతిరో షు వాశ్రేవ సుమతిర్జిగాతు ॥ 358

## సూక్తము—35

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—మరుద్గణము

(1) సీ॥ అంబు ధారలచేత నంతరిక్షంబును నావృతంబుగఁజేయ నరుగువారు
తమ బలంబులచేతఁ దప్పక యస్యుల విజితులుగాఁజేయ వెడలువారు
హర్యక్షములఁబోలి యతిభయంకరు లౌచుఁ గల జగంబుల నెల్లఁ గప్పు వార
లగ్నిహోత్రునివలె నతిదీప్తి నందుచు జల పరిపూర్ణులై జరుగువారు
గీ॥ గమనకారి ఘనంబులు కలిఁగియున్న, బాధలం గొట్టి యటు నిటుఁ బంపి వాని
జలము పడునట్లు జేయంగఁ జాలువార, లౌ మరుత్తులు జగతిని నమరువారు ॥ 373

1. రుద్రాఽఋతస్య. 2. నిమేఘమానాఽఅత్యేన. 3. తాగ్ంఽఇయానో. 4. మూతయఽఉప. 5. భిష్టయఽఆవ. 6. వరాజ్వక్రియా. 7. యా వ ఽఊతిరో (వ్రా.ప్ర.)

† గృత్సమద ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు(657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(2,3) సీ॥ పెంపొంది యున్నట్టి పృశ్నిగర్భంబున ఘన రుద్రకరుణచేఁ గలుఁగువారు
నక్షత్ర సమితిచే నభము వెల్గెడు నట్టు లాభరణాదుల నమరువారు
శత్రు భక్షకులయి జలము కల్గించుచు విద్యుత్తువలెఁ జాల వెలయువారు
ప్రధన తురంగంబు భాతి లోకంబును సిక్త మౌనట్టులు చేయువార
గీ॥ లశ్వముల నెక్కి యంతట నరుగువారు, హేమ శిప్రములం గల్గి యిద్ధమైన
క్రోధమును బొంది చెట్లను గూల్చువార. లైన మారుతములు కడు నరుగుఁగాక! ॥ 374

(4) గీ॥ సన్మరుద్గణంబు సఖుని బోలుచు హవ్య,యుక్తనరునికొఱకు నుదకములను
నన్ని వేళలందు నతిశయింపగఁ దాము, మోయుచుంద్రు శక్తి పూర్ణు లగుచు ॥ 375

గీ॥ ఆ మరుత్తు లశ్వయంబులై దాతలై, యన్నయుతము లౌచు నమరియుండి
యకుటిలముగ వెడలు నశ్వంబువలె, బభ, వాహిగణము ముందు పఱఁగుచుండు ॥ 376

(5) ఉ॥ మారుత మెల్ల వేళల సమానపదంబున నాయుధాళులన్
మీరుచునుండి హంసవలె మేలగు దీప్త బలంబుతోఁ గడున్
మీరుచు విఘ్నముం దొఱఁగి మెచ్చెడు నట్టులు వచ్చుచుండుఁ దా
సారము గల్గు సోమములఁ జక్కఁగఁ గ్రోలుటకై స్వయంబుగన్ ॥ 377

(6) ఉ॥ వీరుల మధ్యకున్ వెడలు వేల్పుల రేని విధంబు మీర లో
వీరవరేణ్యులార! కడు వేగము సోమము గ్రోల వచ్చుచున్
సారవదశ్విసామ్యమును జక్కఁగ నొందిన ధేను సంతతిం
దీరుగ వృద్ధిఁ జేసి బహు దీక్షల నన్నము మా కొసంగుఁడీ! ॥ 378

(7) ఉ॥ అన్న విశిష్ట పుత్రకుల నందఁగఁ జేసినయప్డు మాకు నో
యెన్నిక గన్న మారుతమ! యెంతయు మిమ్ము నుతించు వారికిం
గ్రన్నన యుద్ధకాలములఁ గౌశల మక్షయ వీర్య సంపదల్
పన్నుగ నిచ్చుచున్ వివిధ బాధల నెట్టరె? మీరు వేడ్కమై ॥ 379

(8) గీ॥ లలి మరుద్గణవక్షస్థలంబులందు, స్వర్ణమయ భూషణంబులు చాలఁగలవు
మారుత మొసంగు దానము మానవులకు, సుఖకరంబని చెప్పుట చోద్య మగును! ॥ 380

ఉ॥ ఎప్పుడు మారుతంబు కడు హెచ్చగు యానము నశ్వ పంక్తితో
నొప్పెడునట్లుఁ జేయుఁ గడు నోపిక నప్పుడె యోగ్య ధేనువుల్
దప్పక తర్ణకంబులకుఁ దద్దయుఁ బాల నొసంగురీతి మార్
చెప్పక హవ్య దాతలకుఁ జేర్చెద రన్నము సంతసంబునన్ ॥ 381

(9) చ॥ వృకమువలెన్ మనుష్యులకు వేయి విధంబుల హింసఁజేయు నా
సకల కుశత్రు మండలి వశంబున నుంచకుఁ డస్మదాదులన్
బ్రకృతము వారు దిక్కులకుఁ బ్రాకకయుండెడునట్లు చేయుఁడో
సకల మరుద్గణంబ! మఱి చక్కని రుద్రులు వారిఁ గొట్టుతన్! ॥ 382

(10) గీ॥ పృశ్నియూధస్సు నెలమిని బితుకు నపుడు, కూర్మి భక్తుల శత్రులఁ గొట్టునపుడు
త్రితుని వైరి సమూహంబుఁ [1]ద్రెంచునపుడు, మారుతమ! నీ సుశక్తులు మరువఁగలమె?॥ 383

(11) గీ॥ సకల సోమరసముఁ జక్కగ సమకూర్చి, మిమ్ముఁ బిలుతు నెపుడు నెమ్మితోడ
స్రుక్కుఁ జేతఁ దాల్చి శుభమారుతమ! మాకు, ధరఁబ్రసిద్ధమైన ధనము నిమ్ము! ॥ 384

(12) గీ॥ ఆ దశగ్వ గణము యజ్ఞంబు వహియించు, కల్యకాంత యెలమిఁ గర్మలన్ని
చెలఁగునట్లు భువిని జేయించు మాచేతఁ, గల్యకాల మఖిలకర్మకారి! ॥ 385

క॥ పరమోష స్వంతటఁ దన, గిరణంబులఁ బంపి మిగులఁ గృష్ణనిశల సు
స్థిరముగఁ గొట్టెడి విధమున, స్థిరముగ మారుతము గొట్టు! చీఁకటి నంతన్ ॥ 386

(13) గీ॥ క్షోణి యను వీణ బంగారు శోభతోడ, వర్ధితంబయ్యె జల వాస వారిదమున
జలధరమునుండి బలమున జలముఁ దీసి, మారుతము[2] సకల లావణ్య మహిమ నందె ॥ 387

(14) గీ॥ మమ్ముఁ గాపాడుటకునయి మారుతమును, ధనము యాచించెదను నేను దగిన యటులఁ
ద్రితుఁ డభీష్టంబు నొందంగఁ దివిరి చక్ర, మూలమునఁ బంచ హోతల లీలఁ గొట్టె ॥ 388

(15) గీ॥ ఆశ్రయించు వారి యతిశయ పాపముల్, గొట్టి శత్రువులను గొట్టరారె!
మీ యనుగ్రహంబు మే లగు ధేనువు, భంగిఁ గలుఁగుఁగాక! భవ్యులార! ॥ 389

1. జంపునపుడు (వ్రా.ప్ర.పా.) యతిభంగము. 2. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచ లఘు గణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

## సూక్తమ్—36

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—అపాం నపాత్

ఛందః—త్రిష్టుప్

(1) ఉపేమసృక్షి వాజయుర్వచస్యాం చనో దధీత నాద్యో గిరో మే ।

అపాం నపాదాశుహేమా కువిత్ స సుపేశస్కరతి జోషిషద్ధి ॥ 359

(2) ఇమం స్వస్మై హృద[1] ఆ సుతష్టం మంత్రం వోచేమ కువిదస్య వేదత్ ।

అపాం నపాదసుర్యస్య మహ్నా విశ్వాన్యర్యో భువనా జజాన ॥ 360

(3) సమన్యా యన్త్యుప యన్త్యన్యాః సమానమూర్వం నద్యః పృణన్తి ।

తమూ శుచిం శుచయో దీదివాంసమపాం నపాతం పరి తస్థురాపః ॥ 361

(4) తమస్మేరా యువతయో యువానం మర్మృజ్యమానాః పరి యన్త్యాపః ।

స శుక్రేభిః శిక్వభీ రేవదస్మే దీదాయానిధ్మో ఘృతనిర్ణిగప్సు ॥ 362

† గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. హృదऽ ఆ. (వ్రా.ప్ర.)

(5) అస్మై తిస్రో[1] అవ్యథ్యాయ నారీర్దేవాయ దేవీర్దిధిషన్త్యన్నమ్ ।

కృతా[2] ఇవోప హి ప్రసర్స్రే[3] అప్సు స పీయూషం ధయతి పూర్వసూనామ్ ॥ 363

(6) అశ్వస్యాత్ర జనిమాస్య చ స్వర్ద్రుహో రిషః సంపృచః పాహి సూరీన్ ।

ఆమాసు పూర్షు పరో[4] అప్రమృష్యం నారాతయో వి నశన్నానృతాని ॥ 364

(7) స్వ[5] ఆ దమే సుదుఘా యస్య ధేనుః స్వధాం పీపాయ సుభ్వన్నమత్తి ।

సో[6] అపాం నపాదూర్జయన్నప్స్వ౧న్తర్వసుదేయాయ విధతే వి భాతి ॥ 365

(8) యో[7] అప్స్వా శుచినా దైవ్యేన[8] ఋతావాజస్ర ఉర్వియా విభాతి ।

వయా[9] ఇదన్యా భువనాన్యస్య ప్ర జాయన్తే వీరుధశ్చ ప్రజాభిః ॥ 366

(9) అపాం నపాదా హ్యస్థాదుపస్థం జిహ్మానామూర్ధ్వో విద్యుతం వసానః ।

తస్య జ్యేష్ఠం మహిమానం వహన్తీర్హిరణ్యవర్ణాః పరి యన్తి యహ్వీః ॥ 367

1. తిస్రోఽఅవ్య, 2. కృతాఽఇవో, 3. ప్రసర్స్రేఽఅప్సు, 4. పరోఽఅప్ర. 5. స్వఽ ఆ దమే, 6. సోఽఅపాం, 7. యోఽఅప్స్వా, 8. దైవ్యేనఽఋతావాజస్రఽఉర్వియా, 9. వయాఽఇదన్యా. (వ్రా.ప్ర.)

(10) హిరణ్యరూపః స హిరణ్యసందృగపాం నపాత్ సేదు హిరణ్యవర్ణః ।

హిరణ్యయాత్ పరి యోనేర్నిషద్యా హిరణ్యదా దదత్యన్నమస్మై ॥ 368

(11) తదస్యానీకముత చారు నామాపీచ్యం వర్ధతే నప్తురపామ్ ।

యమిన్ధతే యువతయః సమిత్థా హిరణ్యవర్ణం ఘృతమన్నమస్య ॥ 369

(12) అస్మై బహూనామవమాయ సఖ్యే యజ్ఞైర్విధేమ నమసా హవిర్భిః ।

సం సాను మార్జ్మి దిధిషామి బిల్మైర్దధామన్నైః పరి వన్ద[1] ఋగ్భిః ॥ 370

(13) స[2] ఈం వృషాజనయత్ తాసు గర్భం స[2] ఈం శిశుర్ధయతి తం రిహన్తి ।

సో[3] అపాం నపాదనభిమ్లాతవర్ణో ఽన్యస్యేవేహ తన్వా వివేష ॥ 371

(14) అస్మిన్ పదే పరమే తస్థివాంసమధ్వస్మభిర్విశ్వహా దీదివాంసమ్ ।

ఆపో నప్త్రే ఘృతమన్నం వహన్తీః స్వయమత్కైః పరి దీయన్తి యహ్వీః ॥ 372

1. వన్దఽఋగ్భిః, 2. సఽఈం, 3. సోఽఅపాం. (వ్రా.ప్ర.)

(15) ఆయాంసమగ్నే సుక్షితిం జనాయాయాంసము మఘవద్భ్యః సువృక్తిమ్ ।

విశ్వం తద్ భద్రం యదవన్తి దేవా బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 373

## సూక్తము 36

ఋషి—గృత్సమదుఁడు †

దేవత—అపాన్నపాత్తు

(1) గీ॥ తగ నపాన్నపాత్తు తగిన యన్నంబును, దాన మిచ్చి సొగసు తప్ప కిడును:
నేను వాని నుతుల నిరతముఁ జేయుచు, నన్న మభిలషింతు నాదరమున ॥ 390

(2) గీ॥ మే మపాన్నపాత్తు మే లగు మంత్రాళిఁ, జిత్త పూర్వకముగఁ జేరఁ బిలుతు
మతఁడు భువనములను నతిశయ మహిమచేఁ, బుట్టఁ జేయుచుండెఁ బూజ్యుఁ డగుచు ॥ 391

(3) గీ॥ జలము జలముతోడఁ గలసి నదీరూప, మంది బాడబాగ్ని నతిశయింపఁ
జేయు శుద్ధ జలము చెల్వగు నపాన్నపా, ద్దేవతాత్మఁ జుట్టి తేజరిల్లు: ॥ 392

(4) గీ॥ దర్పరహిత మౌచు ధర వెల్గు జలరాశి, యువక సామ్య మొంది యుచితరీతి
నా యపాన్నపాత్తు నంతట వేష్టించి, వెలుఁగుచుండె భువిని వివిధ గతుల ॥ 393

గీ॥ ఇంధనంబులు లేకుండ నిద్ధదేహ, ధారి యౌచు నపాన్నపాత్తమల ఘృతము
చందమున వెల్గి నీటిలోఁ జిక్కనుండి, యన్న మెంతయుఁ బ్రీతితో నందఁ జేయు ॥ 394

(5) గీ॥ దుఃఖరహితుఁ డైన దొడ్డ యపాన్నపా, త్తునకు నన్నమీయఁ దుష్టిఁగొనుచు
దేవతా త్రయంబు తేజరిల్లెడు నట్టి, యన్న మొంది శక్తి నందు నతఁడు ॥ 395

గీ॥ ఇల సరస్వతి భారతి జలములందుఁ, బుట్టు వస్తువువలె సాగి పోవుచుండ్రు:
జలములం బుట్టు సోమము చారు రూపుఁ, డౌచుఁ గ్రోలు నపాన్నపాత్తనెడువాఁడు ॥ 396

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6) చ॥ అమరు నపాన్నపాత్తు తగు నశ్వముఁ బుట్టఁగఁ జేసి భక్తులన్
క్రమముగఁ గాచు హింసకులఁ గారియఁ బెట్టు నసత్యవాది బృం
దములను జూడఁ బోఁడు ప్రథితంబుగ వారుల వర్తమానుఁడై
యమరఁగ హర్తలన్ దునిమి యన్ని విధంబులఁ గాచు నందఱిన్ ॥ 397

(7) ఉ॥ ఎవ్వఁడు వారి మధ్యమున నేద్దెర నుండునొ? ప్రీతి యుక్తుఁడై
యెవ్వని యాలు సౌఖ్యముగ నెంతయుఁ బాలు నొసంగుచుండునో?
యెవ్వఁడు హెచ్చు వీర్యమును నిచ్చి ధరన్ వెలుఁగొందువాఁడొ? దా
నవ్విధ మౌ నపాన్నపతి నన్నము భక్షణఁ జేయు దాతయై ॥ 398

(8) గీ॥ ఏకమూర్తి యగుచు నెంతయు వెలుఁగుచు, సత్యమూర్తి యగుచు శక్తి గనుచు
జలధి తేజముననె వెలువొందుచుండిన, భవ్యుఁడౌ నపాన్నపాత్తుఁ గనరె? ॥ 399

గీ॥ భవ్యుఁ డౌ నపాన్నపాత్తు సుశాఖలే, సర్వభూత సమితి సకల జగము
రమ్య పుష్ప ఫల విరాజిత మౌ నట్టి, వానివలనఁ బుట్టి వరలుచుండె ॥ 400

(9) చ॥ [1]అమరెడపాన్నపాత్తు కడు నంబుద మధ్యను నూర్ధ్వ వర్తియై
క్రమముగ మించుఁ గప్పుచును ఖస్థలి నెక్కుచు నుండు వానిదౌ
నమితమహత్తు లోకమున నంతటఁ గీర్తిదమై హిరణ్య రూ
పమగు నదీ స్వరూపమునఁ బారుచు నుండును జూడుఁడీ! జనుల్ 401

(10) గీ॥ ఆ హిరణ్యరూపుఁ డా హిరణ్యాకృతి, యా యపాన్నపాత్తమేయ మహిమ
నా హిరణ్యవర్ణుఁ డమలహవ్యదులకు, నతిహిరణ్య మిచ్చు నచటె నిలిచి ॥ 402

(11) చ॥ అమరు నపాన్నపాత్తు తను వందముగా విలసిల్లు నామమున్
విమల మగున్ ధరిత్రి యతివృద్ధిని బొందును వారి సంహతి
క్రమము హిరణ్యగర్భకుని ఖస్థలియందు వెలుంగఁ జేయు నా
యమితహిరణ్య వర్ణఘృత మన్నము వానికిఁ గూర్చి యెంతయున్ ॥ 403

1. అమరెడు + అపాన్నపాత్తు = అమరెడపాన్నపాత్తు—దుస్సంధి.

(12) సీ॥ అమరులలో నెల్ల నమరు నహాన్నపాత్రనువాని మిత్రునిగను దలంతు
దాని శ్రూషల వలసినట్టులు నేసి యజ్ఞహవ్యాదుల నంద నిత్తు
వానిదేశము నెల్ల వలసిన విధమునఁ బొంకంబుగా సమలంకరింతుఁ
గాష్ఠంబులను నన్నకలనల వానికి భక్తిపూర్వకముగఁ బట్టుకొందు
గీ॥ మంత్రములచేత వానిని మరువకుందు, హవ్యములచేత వానికి నర్చ లిడుదు
బహు నమస్కారములచేత వానిఁ గొలుతు, స్తుతులచే వాని కెప్పుడు నుతు లొనర్తు ॥ 404

(13,14) సీ॥ వారి మధ్యంబును జేరి గర్భముఁ గూర్చి సుతరూపమున జల శోభనంది
జలమునఁ దాను నాస్వాదింపఁగాఁబడి యన్య శరీరము నధిగమించి
యుత్కృష్టతలమునసుండి లోకంబును వెలుఁగొందఁజేసి తా వెలుఁగుచుండి
[1]తేజస్సుచే బాగఁ దేజరిల్లుచుఁ దాను బ్రతిదివసంబునఁ బ్రతిభ గాంచి
గీ॥ యా యహాన్నపాత్ర మేయసేచనరూప, ధర్మమందుచుండెఁ దనివి దీర
జలము వాని కన్నములఁ జాల ధరియించి, కడఁగి వానిఁ జుట్టఁగల్గుచుండె ॥ 405

(15) గీ॥ శోభనీయనివాసః యో సుందరాగ్ని !. పుత్ర లాభార్థమై నేను బూజ్యహిత క
రంబులగు స్తుతుల[2]చేతను డంబుమీర, నిన్నుఁ గొనియాడుచున్నాను నియత భక్తి ॥ 406

గీ॥ పుత్రపౌత్రులతోఁ గూడి పుణ్యయజ్ఞ, కర్మలను జేయునట్టులు ఘనులు దేవ
గణము లన్నియుఁ గళ్యాణ కలన నొసఁగి, సంతసింతురుగాక! మా సంస్తవముల ॥ 407

1. తేజస్సుచే బహు తేజరిల్లుచు (వ్రా.ప్ర.పా.)
2. ఇక్కడ నింద్ర గణమునకు మారు పంచలఘుగణము ప్రయుక్తమైనది. వ.గో.కృ.

## సూక్తమ్—37

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఋతు దేవతా—1—ఇన్ద్రో మధుశ్చ, 2—మరుతో మాధవశ్చ 3—త్వష్టా శుక్రశ్చ, 4—అగ్నిః శుచిశ్చ, 5—ఇన్ద్రో నభశ్చ, 6—మిత్రా వరుణో నభస్యశ్చ

ఛందః—జగతీ

(1) తుభ్యం హిన్వానో వసిష్ట గా[1] అపో ఽధుక్షన్ త్సీమవిభిరద్రిభిర్నరః ।
పిబేన్ద్ర స్వాహా ప్రహుతం వషట్కృతం హోత్రాదా సోమం ప్రథమో య[2] ఈశిషే ॥ 374

(2) యజ్ఞైః సంమిశ్లాః పృషతీభిరృష్టిభిర్యామఞ్ఛుభ్రాసో[3] అంజిషు ప్రియా ఉత ।
ఆసద్యా బర్హిర్భరతస్య సూనవః పోత్రాదా సోమం పిబతా దివో నరః ॥ 375

(3) అమేవ నః సుహవా[4] ఆ హి గన్తన ని బర్హిషి సదతనా రణిష్టన ।
అథా మన్దస్వ జుజుషాణో[5] అన్ధసస్త్వష్టర్దేవేభిర్జనిభిః సుమద్గణః ॥ 376

(4) ఆ వక్షి దేవాగ్ం[6] ఇహ విప్ర యక్షి చోశన్ హోతర్ని షదా యోనిషు త్రిషు ।
ప్రతి వీహి ప్రస్థితం సోమ్యం మధు పిబాగ్నీధ్రాత్ తవ భాగస్య తృప్ణుహి ॥ 377

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. గా ఽఅపో, 2. య ఽఈశిషే, 3. భ్రాసో ఽఅంజిషుప్రియా ఽఉత, 4. సుహవా ఽఆ, 5. జుజుషాణో ఽఅన్ధ, 6. దేవాగ్ం ఽఇహ (వ్రా.ప్ర.)

(5) ఏష స్య తే తన్వో నృమ్ణవర్ధనః సహ[1] ఓజః ప్రదివి బాహ్వోర్హితః ।
తుభ్యం సుతో మఘవన్ తుభ్యమాభృత స్త్వమస్య బ్రాహ్మణాదా తృపత్ పిబ ॥ 378

(6) జుషే[2]థాం యజ్ఞం బోధతం హవస్య మే సత్తో హోతా నివిదః పూర్వ్యా[3] అను ।
అచ్ఛా రాజానా నమ[4] ఏత్యావృతం ప్రశాస్త్రాదా పిబతం సోమ్యం మధు ॥ 379

ఇతి
ద్వితీయోऽష్టకే సప్తమోऽధ్యాయ
స్సమాప్తః

## సూక్తము—37

### ఋషి—గృత్సమదుఁడు †

దేవత— 1 - ఇంద్రుఁడు. మధువు, 2 - మరుద్గణము, మాధవుఁడు. 3 - త్వష్ట, శక్రుఁడు,
4 -అగ్ని, శుచి, 5- ఇంద్రుఁడు, నభస్సు, 6 - మిత్రా వరుణులు, నభస్యుఁడు

(1) *ఉ॥ నీకయి తీయఁగాఁబడిన నిర్మల సోమము నీరు కల్గుటన్
భాకర నేత్ర మండలము ప్రస్తర ఖండముతోడ దాని చీ
కాకును బొందకుండ సరిగా నొనరించిరి మేక వెంట్రుకల్
చేకొని పారవేసి రిఁకఁ జేరుము: నీవు మహేంద్ర ! యిష్టికిన్ ॥ 408

1. సహ ऽఓజః, 2. జుషేదాయజ్ఞం, 3. పూర్వ్యాం అను, 4. నమ ऽఏత్యా (వ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు (657వ పుట.) చూడ నగును. వ.గో.కృ.

* ఋగ్వేదము మూలము ద్వితీయమండలము 37వ సూక్తములోని 1వ ఋక్కునకు ననువాదముగా రచించిన "నీకై తీయఁగాఁబడిన" ఇత్యాది ఉత్పలమాలా పద్యమును శ్రీ నేమానివారు రచియించి యీపద్యమున "మేక వెంట్రుకల"ను సైతము పీకి

గీ॥ స్వాహ యను శబ్ద మూలానఁ బ్రహుత మగుచుఁ, దగు వషట్కృత సోమంబు ధన్యహోత
నగ్నితో[1] విడిచెఁ, గావున నద్ది నీవు, త్రావు మో యింద్ర! సర్వేశ! తనివితీర ॥ 409

అర్థాంతరము

†గీ॥ కిరణ రహితుఁడైన యరుణుండు ముద్దగా, నగ్ని రూపి యయ్యు నలరుచుండు
మేషగతుఁడు నౌచు మేష మస్తగతము, నొందినట్లు వెలుఁగు నుచ్చ నొంది ॥ 410

(2) ఉ॥ యాగ సమేధమానులయి యాగములన్ ధరియించు వారలై
భోగ విలాసులై భరత పుత్రకులై రథ మెక్కి వచ్చి యా
యాగము ముం దమర్పఁబడి యత్యధికంబుగ వెల్గు దర్భలన్
రాగమునన్ మరుద్గణములార! వసింపుఁడు! సోమ మానఁగన్ ॥ 411

(3) గీ॥ సుహవులార! మా సుసుందరసదనముఁ, జేరి కుశలపైనిఁ గూరుచుండుఁ
డటులె త్వష్టృదేవ యమరపత్నులఁ గూడి, యన్న మారగింప నరిగిరండు! ॥ 412

(4) మ॥ అనలా! నీవు సమస్తదేవతల నాహ్వానించుచున్ వారికై
ఘనయజ్ఞంబులఁజేసి హవ్య వితతిం గాంక్షించి స్థానత్రయం
బునఁ బ్రీతిన్ వసియించుచున్ మధువు సంపూర్ణంబుగా నానుచున్
గను మగ్నీధ్రుని చెంత సోమరసమున్ గళ్యాణ రూపుండవై ॥ 413

పారవేసి యా మేక మాంసమును నిష్టితో నింద్రునకు నైవేద్యముగ బెట్టినట్లు వ్రాసిరి. ఈ భావము నే భాష్యము ననుసరించి శ్రీ నేమానివారు వెల్లడించిరో తెలియదు. సాయనాచార్యులు సైతముఁ దమ భాష్యమున నీ భావమును వెల్లడింపలేదు. ఏది యేమైనను శ్రీ నేమానివారిచ్చిన యర్థము సరికాదు. ఇంద్రునకు సోమము నిడుట యెట్లున్నను మేషపరముగ నీ ఋక్కునకున్న యర్థమే వేరు. ఇక్కడి మేషము భూతలమునఁగల చతుష్పాద జంతువులలోని మేషము కాదు. ఆకాశ వీథిలోని మేషాది ద్వాదశరాశులలో గల మేషరాశి పరిగృహీతమగును. ఈ దృష్టితో నర్థాంతరముగ నే రచించిన 410వ పద్యము గ్రహింపవలయును. ఇందు దేవతా విషయకముగా సూర్యేంద్రుల కభిన్నత్వము కలదు. కిరణములు కాంతి గతములు కాని సూర్యబింబ గతములు కావు. ఇది ప్రాచీనాధునిక విజ్ఞాన సమ్మతము. వ.గో.కృ.

1. ఇంద్రగణమునకు మారుగా "భల" మిక్కడఁ బ్రయుక్తమైనది. వ.గో.కృ.

† రచయిత:- వాఙ్మయ మహోధ్యక్ష, డాక్టర్, వడ్లమూడి గోపాల కృష్ణయ్య. "కళా-ప్రపూర్ణ".

(5) గీ॥ సోమముం గ్రోలుటం జేసి నీమ మలర, శత్రు జాలము నెల్లను జంపి యట్టి
దానిచేఁ దృప్తి నొందుచుఁ దగిన ఋత్వి, జాళి ముందఱ సోమము గ్రోలు మింద్ర! ॥ 414

(6) శా॥ ఓ మిత్రా! వరుణా! మదీయ సవనం బోహో! యనం జాటరే!
సాముల్! మేము వచించు సంస్తవములం జక్కం జెవిం బెట్టరే!
యేమీ! చూఁచెద రేల నన్నమును? మీ రెంతైన నాసక్తితో
సోమంబుం జవిఁజూచి తృప్తిఁ గనరే! శోభాయమానాత్ములై ॥ 415

ఇయ్యది
శ్రీ భారద్వాజ గోత్ర శ్రీ వేంకటేశ్వర పౌత్ర
శ్రీ సంగమేశ్వరపుత్ర సీతాంబాగర్భశుక్తిముక్తాయమాన భగవత్పాదారాధక
నేమాని వేఙ్కట నరసింహశాస్త్రి విరచిత కృతులలో
శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహితయందు
ద్వితీయాష్టకమున సప్తమాధ్యాయము
సమాప్తము

---

# సమూల
# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత
# ఋగ్వేద-సంహితా

## ద్వితీయం మండలమ్

ద్వితీయోఽష్టకః—అష్టమోఽధ్యాయః

### సూక్తమ్—38

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—ఋతుదేవతా—1—4—ద్రవిణోదా ఋతవశ్చ, 5—అశ్వినో

ఋతవశ్చ, 6—అగ్నిః ఋతుశ్చ

ఛందః—జగతీ

(1) మన్దస్వ హోత్రాదను జోషమన్ధసో ఽధ్వర్యవః స పూర్ణాం వష్ట్యాసిచమ్ ।

తస్మా[1] ఏతం భరత తద్వశో దదిర్హోత్రాత్సోమం ద్రవిణోదః పిబ[2] ఋతుభిః ॥ 380

(2) యము పూర్వమహువే తమిదం హువే సేదు హవ్యో దదిర్యో నామ పత్యతే ।

అధ్వర్యుభిః ప్రస్థితం సోమ్యం మధు పోత్రాత్ సోమం ద్రవిణోదః [2]పిబ ఋతుభిః ॥ 381

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూఁడ నగును. వ.గో.కృ.

1. తస్మా ఽఏతం, 2. పిబ ఽఋతుభిః (ప్రా.ప్ర.)

(3) మేద్యన్తు తే వహ్నయో యేభిరీయసే ऽరిషణ్యన్ వీళయస్వా వనస్పతే ।

ఆయూయా ధృష్ణో అభిగూర్యా త్వం నేష్ట్రాత్ సోమం ద్రవిణోదః [1]పిబ ఋతుభిః ॥ 382

(4) అపాద్ధోత్రాదుత పోత్రాదమత్తోత నేష్ట్రాదజుషత ప్రయో హితమ్ ।

తురీయం పాత్రమమృక్తమమర్త్యం ద్రవిణోదాః పిబతు ద్రావిణోదసః ॥ 383

(5) అర్వాంచమద్య యయ్యం నృవాహణం [2]రథం యుంజాథామిహ వాం విమోచనమ్ ।

పృఙ్క్తం హవీంషి మధునా హి కం గతమథా సోమం పిబతం వాజినీవసూ ॥ 384

(6) జోష్యగ్నే సమిధం జోష్యాహుతిం జోషి బ్రహ్మ జన్యం జోషి సుష్టుతిమ్ ।

విశ్వేభిర్విశ్వాగ్ం[3] ఋతునా వసో మహ[4] ఉశన్ దేవాగ్ం ఉశతః పాయయా హవిః ॥ 385

---

1. పిబऽఋతుభిః, (వ్రా.ప్ర.) 2. రథం, (వ్రా.ప్ర.సా.మా.) 3. విశ్వాగ్ంऽఋతునా, 4. మహ ऽఉశన్ దేవాగ్ం ऽఉశతః (వ్రా.ప్ర.)

# శ్రీ మదాంధ్ర ఋగ్వేద సంహిత

## ద్వితీయ మండలము

ద్వితీయాష్టకము—అష్టమాధ్యాయము

### సూక్తము—38

ఋషి—గృత్సమదుఁడు †

*దేవత—1—4 ద్రవిణోదో దేవత, 5—అశ్వి ద్వయము, 6—అగ్ని

(1) క॥ ద్రవిణోదుఁడ! యన్నమునన్, స్తవమునఁ బ్రీతుండ వగుము, సరసాధ్వర్యుల్!
ద్రవిణోదుఁడు పూర్ణాహుతి, నవితథముగఁ గోరుచుండె నందింపరాకో! ॥ 416

క॥ ద్రవిణోదుఁడు పలదుం డగుఁ, బ్రవిమల సోమంబు నిండు వానికి మీరల్
ద్రవిణోదుఁడ! యజ్ఞంబున, నవసోమ రసంబు నాని నయముగఁ జనుమీ! ॥ 417

(2) ఉ॥ ఆ సమయంబునం దెవని నంచిత భక్తిని బిల్చియుంటినో!
యీ సమయంబునం దతనినే యతిభక్తిని బిల్చుచుంటి వాఁ
డే సమయంబునందయిన నెంతయు దాత సమస్త నేతయై
దోసము లేని పిల్పునకుఁ దుష్టుఁడె యా ద్రవిణోదుఁ డెప్పుడున్ ॥ 418

(3) క॥ నీ వెక్కి తిరుగు వాజికి, నీ వొనరింపుము సుపుష్టి నిత్యము దేవా!
చేవగల యో వనస్పతి!, నీ వొనరింపకుము : హింస నిశ్చయ మదియే! ॥ 419

గీ॥ ఘనవనస్పతీ! ధర్షణకారి! నీవు, నేష్టృయజ్ఞంబునకు వచ్చి నిశ్చయముగ
ఋత్విజులతోడఁ గూడుచు ఋద్ధసోమ, రసముఁ బానముఁ జేయుము : రాజుమాట్కి ॥ 420

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ. * ఆంధ్రానువాదము వ్రాతప్రతిలో (2వ సంపుటము 359వ పుట.) నీ 38వ. సూక్తమునకు దేవతలుగా ద్రవిణోదో దేవతాది దేవతలు వ్రాయఁబడియున్నది. కాని ఋషి దేవతల పట్టికగల 15b సంఖ్యగల సంపుటములో శ్రీ నేమానివారీ సూక్తమునకు "ఋతువులు" దేవతగా స్వయముగా వ్రాసిరి. ఈ సూక్తానువాద పద్యములలో ఋతు దేవత ప్రసక్తి లేదు. వ.గో.కృ.

(4) సీ॥ హోతృ యజ్ఞమునందుఁ బూత సోమ రసంబు త్రాగినయట్టి యా ధన్యుఁ డెవఁడొ!
పోతృ యజ్ఞమునందు పూత సోమరసంబుఁ జవిఁ జూచునట్టి యా సరసుఁ డెవఁడొ!
నేష్టృ యజ్ఞమునందు నెఱ దాత లిచ్చిన యన్నంబుఁ దినిన యా యధికుఁ డెవఁడొ!
యజమానులకు నెల్ల నధిక హేమము నిచ్చు దాతగా వెల్గు విఖ్యాతుఁ డెవఁడొ!
గీ॥ యట్టి ద్రవిణోదుఁ డెంతయు నధికుడైన, మానవులచేత శోధితం బైన యట్టి
మృత్యువారక మౌచుఁ దా మెఱయు నట్టి, నాలుగవ సోమ పాత్రను గ్రోలుఁగాక! ॥ 421

(5) క॥ ఏ రథము వాహనంబయి, చేరిచె మిము, సదనమునకు క్షేమశ్రీతో
నారథము నెక్కి యశ్వులు!, చేరుఁడు! మా యజ్ఞకర్మ చెంతకు మీరల్! ॥ 422

క॥ హవ్యం బాస్వాదింపుఁడు!, భవ్యాశ్విద్వయమ! మీరు భాసుర మగు నీ
హవ్యాది యుక్త సోమము!, దివ్యంబుగఁ గ్రోల రారె? దివిజులు మెచ్చన్ ॥ 423

(6) క॥ తుష్టుఁడవు నీవు సమిధలఁ, దుష్టుఁడవై వెలుఁగు నట్టి దొరవుగదా! నీ
కిష్ట మగు నుతులచేతం, దుష్టుఁడ వగుమయ్యా! యగ్ని! తూర్ణం బెపుడున్ ॥ 424

క॥ సకలావాసప్రదుఁడా!, యకలుష హవ్యాభిలాషి వగుచుననల! పా
యక దేవ గణముతోడన్, సకలం బగు సోమరసము సారముఁ గొనుమా! ॥ 425

## సూక్తమ్—39

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—సవితా

ఛందః—త్రిష్టుప్

(1) ఉదు ష్య దేవః సవితా సవాయ శశ్వత్తమం తదపా వహ్నిరస్థాత్ ।
నూనం దేవేభ్యో వి హి ధాతి రత్నమథాభజద్ వీతిహోత్రం స్వస్తౌ ॥ 386

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూడ నగును. వ.గో.కృ.

(2) విశ్వస్య హి శ్రుష్టయే దేవ[1] ఊర్ధ్వః ప్ర బాహవా పృథుపాణిః సిసర్తి ।

ఆపశ్చిదస్య వ్రత[2] ఆ నిమృగ్రా అయం చిద్ వాతో రమ తేపరిజ్మన్ ॥ 387

(3) ఆశుభిశ్చిద్యాన్ వి ముచాతి నూనమరీరమదతమానం చిదేతోః ।

అహ్యర్షూణాం చిన్న్యయాగ్ం[3] అవిష్యామను వ్రతం సవితుర్మోక్యాగాత్ ॥ 388

(4) పునః సమవ్యద్ వితతం వయన్తీ మధ్యా కర్తోర్న్యధాచ్ఛక్మ ధీరః ।

ఉత్ సంహా[4]యాస్థాద్ వ్యృతూగ్ంరదర్ధరరమతిః సవితా దేవ[5] ఆ గాత్ ॥ 389

(5) నానౌకాంసి దుర్యో విశ్వమాయుర్వి తిష్ఠతే ప్రభవః శోకో[6] అగ్నేః ।

జ్యేష్ఠం మాతా సూనవే భాగ[7]మాధా దన్వస్య కేతమిషితం సవిత్రా ॥ 390

(6) సమావవర్తి విష్ఠితో జిగీషుర్విశ్వేషాం కామశ్చరతామమాభూత్ ।

శశ్వాగ్ం[8] అపో వికృతం హిత్వ్యాగాదను వ్రతం సవితుర్దైవ్యస్య ॥ 391

---

1. దేవా ఽ ఊర్ధ్వః, 2. వ్రత ఽఆ నిమృగ్రాఽఅయం, 3. చిన్న్యయాగ్ం ఽఅవిష్యామను, 4. సంహయాస్థాద్, 5. దేవఽ ఆ, 6. శోకో ఽఅగ్నేః, 7. భాగా మాధా, 8. శశ్వాగ్ంఽ అపో. (వ్రా.ప్ర.)

(7) త్వయా హితమప్యమప్సు భాగం ధన్వాన్వా మృగయసో వి తస్థుః ।

వనాని విభ్యో నకిరస్య తాని వ్రతా దేవస్య సవితుర్మినన్తి ॥ 392

(8) యాద్రాధ్యంం వరుణో యోనిమప్యమనిశితం నిమిషి జర్భురాణః ।

విశ్వో మర్తాణ్డో వ్రజమా పశుర్గాత్ స్థశో జన్మాని సవితా వ్యాకః ॥ 393

(9) న యస్యేన్ద్రో వరుణో న మిత్రో వ్రతమర్యమా న మినన్తి రుద్రః ।

నారాతయస్తమిదం స్వస్తి హువే దేవం సవితారం నమోభిః ॥ 394

(10) భగం ధియం వాజయన్తః పురంధిం[1] నరాశంసో గ్నాస్పతిర్నో[2] అవ్యాః ।

ఆయే వామస్య సంగథే రయీణాం ప్రియా దేవస్య సవితుః స్యామ ॥ 395

(11) అస్మభ్యం తద్ దివో[3] అద్భ్యః పృథివ్యాస్త్వయా దత్తం కామ్యం రాధ[4] ఆగాత్ ।

శం యత్ స్తోతృభ్య[5] ఆపయే భవాత్యురుశంసాయ సవితర్జరిత్రే ॥ 396

1. పురంధి నరాశంసో, 2. గ్నాస్పతిర్నోऽఅవ్యాః, 3. దివోऽఅద్భ్యః 4. రాధऽఆగాత్, 5. స్తోతృభ్యऽ ఆపయే (వ్రా.ప్ర.)

## సూక్తము—39

### ఋషి--గృత్సమదుఁడు †

### దేవత—సవిత

(1) చ॥ ద్యుతి గలవాఁడు లోకములఁ దోరముగా వహియించువాఁడు తాఁ
ప్రతిదినమందుఁ బుట్టుచును ప్రార్థన లందెడువాఁడు భక్త సం
తతికి మహార్ఘ రత్నముల దాన మొసంగెడుసూర్యుఁ డెప్డు స
న్మతి గలవారి కెల్లఁ గడు మంగళముం గలిఁగించుఁగావుతన్‌! ॥ 426

(2) చ॥ సవిత విశాల హస్తములఁ జక్కఁగఁ గ్గలుచు లోకపుష్టికై
దవిలి జనించుచుండఁగదః తప్పక బాహువు లెల్లఁ జూఁపుచున్‌
వివిధము లైన కర్మలకు విస్తృత వారులఁ బుట్టఁ జేయుచున్‌
ప్రవిమల వాయు వెల్లెడలఁ బారెడునట్టు లొనర్చుచుండుతన్‌! ॥ 427

(3) చ॥ సవితృఁడు పోవుచున్‌ గగన చారు పథంబున శీఘ్రగాములన్‌
జవయుత రశ్మలన్‌ విడువఁ జయ్యన భూతము లన్ని మార్గముల్‌
దవులక విశ్రమించుఁ దమ దారులఁ బట్టక యుంద్రు లోకు లా
సవితృ సుకర్మ లన్నియును సాగిన వెంటనె రాత్రి వచ్చెడున్‌! ॥ 428

(4) క॥ చేల వ్యయముం జేసెడు, లోలాక్షుని బోలి రాత్రి లోకంబుల నా[1]
లీలా విలాస గరిమన్‌, స్థూలమ్ముగఁ గప్పుచుండెఁ జూఁడరె? సుజనుల్‌ ! ॥ 429

గీ॥ ప్రాజ్ఞుఁ డే కర్మ మొనరింపఁ బాదుకొనునొ!, యట్టి కర్మను జేయంగ నతఁడు మిగుల
సక్షముండైన దానిని జరుపకుండఁ, జేయఁగలఁ డొక్క రాత్రి యమేయ మహిమ ॥ 430

గీ॥ ఋతు విభాగంబుఁ జేసెడు మతిమతుండు, క్రాంతి లేకయె వెలిఁగెడు సవిత, మరల
నుదయ మొందఁగ భూతము లుచితగతిని, శయ్యల విడిచి పుచ్చును శాంతితోడ ॥ 431

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలములోని తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ. 1. రాతి రాలోకంబున్‌ (వ్రా.ప్ర.పా.) యతిభంగదోషయుక్తము.

(5) గీ॥ వహ్ని తేజస్సు యజమాన వాసతలము, లందు నుండెడు నన్నంబు నాశ్రయించు
సవితృ బోధక మైనట్టి సవనమందు, ప్రత్యుష స్సిచ్చు హవ్యము పావకునకు ॥ 432

(6) గీ॥ స్వర్గ గతుఁడైన సవితృని సత్యకర్మ, జరిపియే [1]జయముఁ గోరెడు జనుఁడు యుద్ధ
భూమికిం బోయి మరలను బూర్ణ జయముఁ, బొంది వచ్చుచునుండును భువనమందు ॥ 433

గీ॥ జంగము పదార్థ జాతము చారు గృహము, ల కభిముఖముగఁ బోవంగ నరుగుచుండు
కర్మ గత రూపములు చాలఁ గర్మములను, సగము సేయుచు విడుచును సవితవలన ॥ 434

(7) చ॥ గగనమునందు నే జలముఁ గల్పనఁ జేసితివో! మహాత్ముఁడా!
తగునటు దాని నే జనులు తప్పక పొందుచు నుందు రింక నీ
జగమునఁ బక్షి జాతులకుఁ జాలఁగ వృక్ష సమూహ మెంతయున్
సొగసును నిచ్చుచుండు నల సూర్యుని వృత్తము చోద్యమేకదా! ॥ 435

(8) క॥ పతి సవిత గ్రుంకి యుండఁగ, మతిమద్వరుణుండు జంగమంబుల కెల్లన్
హితకరుఁడు వాంఛనీయుం, డతిసుగమ నివాసములకు నరుఁగఁగఁ జేయున్! ॥ 436

గీ॥ సవిత సర్వ భూతజాత వాస స్థాన, ములను వేరుఁజేసి మెలఁగుచుండుఁ
గానఁ దప్తి పక్షి గణము నిజ స్థాన, ములకుఁ బోవుచుండు మోద మలర ॥ 437

(9) గీ॥ వరుణ రుద్ర మిత్ర వాసవార్యము లెల్ల, రెవని వ్రతము చెరుప నెరుఁగ లేరొ!
యట్టి సవితృ దేవు నఖిల కళ్యాణంబుఁ, గోరి పిలుచుచుంటిఁ గూర్మితోడ ॥ 438

(10) చ॥ సవిత సమస్త మానవుల సంస్తవ పాత్రుఁడు మాకు రక్షకుం
డవుచు వెలుంగు నే నతని నంతటఁ బూర్ణునిగా నొనర్తు నా
సవితృహితుండ నౌచుఁ గడుఁ జక్కని విత్తము గో గణంబులన్
భువిఁగనఁ గల్గదున్ సవిత పూజ్యుఁడు ధ్యేయుఁడు ప్రాజ్ఞుఁ డెంచఁగన్ ॥ 439

(11) గీ॥ నీ వొసంగు ధనము నిత్యము మా కిల, వచ్చుఁగాక! ముదము నిచ్చుఁగాక!
సవిత! నీదు ధనము సంస్తవకరులకు, నధిక శుభద మౌచు నమరుఁగాక! ॥ 440

1. ఇక్కడ నింద్ర గణమునకు మారు "భల"ము ప్రయుక్త మైనది. వ.గో.కృ.

## సూక్తమ్—40

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—అశ్వినౌ

ఛందః—త్రిష్టుప్

(1) గ్రావాణేవ తదిదర్థం జరేథే గృధ్రేవ వృక్షం నిధిమన్తమచ్ఛ ।

బ్రహ్మాణేవ విదథ[1] ఉక్థశాసా దూతేవ హవ్యా జన్యా పురుత్రా ॥ 397

(2) ప్రాతర్యావాణా రథ్యేవ వీరా ఽజేవ యమా వరమా సచేథే ।

మేనే[2] ఇవ తన్వాః శుమ్భమానే దంపతీవ క్రతువిదా జనేషు ॥ 398

(3) శృంగేవ నః ప్రథమా గన్తమర్వాక్ ఛఫావివ జర్భురాణా తరోభిః ।

చక్రవాకేవ ప్రతి వస్తోరుస్రా[3] ఽర్వాంచా యాతం రథ్యేవ శక్రా ॥ 399

(4) నావేవ నః పారయతం యుగేవ నభ్యేవ [4]న ఉపధీవ ప్రధీవ ।

శ్వానేవ నో[5] అరిషణ్యా తనూనాం ఖృగలేవ విస్రసః పాతమస్మాన్ ॥ 400

---

* గృత్సమద ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి విషయకమైన ఫుట్‌నోటు (857వ, పుట.) చూడనగును. వ.గో.కృ.

1. విదథఽ ఉక్థశాసా, 2. మేనేఽ ఇవ, 3. వస్తోరుస్రార్వాంచా, 4. నఽఉపధీవ, 5. నోఽఅరిషణ్యా (ప్రా.ప్ర.)

(5) వాతేవాజుర్యా నద్యేవ రీతిరక్షీ[1] ఇవ చక్షుషా యాతమర్వాక్ ।

హస్తావివ తన్వే౩ శంభవిష్ఠా పాదేవ నో నయతం వస్యో[2] అచ్ఛ ॥ 401

(6) ఓష్ఠావివ మధ్వాస్నే వదన్తా స్తనావివ పిప్యతం జీవసే నః ।

నాసేవ నస్తన్వో రక్షితారా కర్ణావివ సుశ్రుతా భూతమస్మే ॥ 402

(7) హస్తేవ శక్తిమభి సందదీ నః క్షామేవ నః సమజతం రజాంసి ।

ఇమా గిరో[3] అశ్వినా యుష్మయన్తీః క్ష్ణోత్రేణేవ స్వధితిం సం శిశీతమ్ ॥ 403

(8) ఏతాని వామశ్వినా వర్ధనాని బ్రహ్మ స్తోమం గృత్సమదాసో[4] అక్రన్ ।

తాని నరా జుజుషాణోప యాతం బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 404

1. రీతిరక్షీऽ ఇవ. 2. వస్యోऽ అచ్ఛ 3. గిరోऽ అశ్వినా. 4. గృత్సమదాసోऽ అక్రన్. (వ్రా.ప్ర.)

## సూక్తము—40

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—అశ్విద్వయము

(1,2) సీ॥ అశ్విద్వయమ! మీర లశ్మద్వయము మాట్కి శత్రువులకు బాధఁ జేయవలదె?
పక్షిద్వయము మహాపాదపంబుల నెల్లఁ బొందునట్టుల మమ్ముఁ బొందవలదె?
జనపథంబునఁ బోవు ఘనదూత లిరువురివలె జనస్తుతులను బడయవలదె?
ఋద్ధమ్ముగా నుచ్చరించెడు ఋత్విజు లిరువురుగతి నిష్టి కరుగవలదె?
గీ॥ కల్యకాలములం దెల్ల గమనకారు, లైన రథికులవలె మీర లమరవలదె?
యమల భాగములంబోలి యమజు లౌచు, నన్నమును నారగింపంగ నరుగవలదె? ॥ 441

గీ॥ సుందరీద్వయంబు శోభ నందుచు దంపతులనుబోలి కలసి మెల్గుచుండి
సకల సుజన కర్మ సంగతి నెఱిఁగెదు, నశ్వులార! మీర లరుగుఁడెండు ॥ 442

(3) సీ॥ పశుశృంగములమాట్కిఁ బశు ఖురంబులమాట్కి ధృతగమనంబునఁ దిరుగరారె!
చారు దినంబునఁ జక్రవాకద్వయ మేగుదెంచినయట్టు లెదుటఁ బడరె!
పడవవలెన్ మమ్ముఁ బారంబు నొందింప మీరు మా పజ్జను మెల్గరారె!
రథికద్వయము మహారామణీయకమును ననుసరించుచు మీర లరిగిరారె!
గీ॥ రథయుగము చందమున మఱి రథ సుచక్ర, నాభి ఫలకంబులంబోలి శోభ నొంది
యశ్వియుగ్మమ! మీర లత్యధికతుష్టి, భార మొందింప మమ్ములఁ జేరవలదె? ॥ 443

(4) క॥ శునకములఁబోలి మీరలు, ఘన మగు నశ్వద్వయంబ! కావరె? మమ్మున్
ఘన వర్ణములను బోలుచు, నొనరఁగ జరఁ గొట్టుచుండుఁ దోహో! యనఁగన్ ॥ 444

(5) సీ॥ హస్తద్వయము మాట్కి నక్షయు లగుదురు నదుల విధంబున నడువఁగలరు
పాదద్వయము మాట్కిఁ బరసుఖంబిచ్చెద రోష్ఠద్వయముమాట్కి నుచ్చరింత్రు
స్తనములం బోలుచు సరసజీవనముల కాధార మగుటకు నరుగుచుంద్రు
ముక్కులఁ బోలుచు ముదమునఁ దనువును గాపాడుచున్ మీరు ఘనతఁ గాంత్రు
గీ॥ చెవులఁ బోలుచు వాక్యముల్ చెవులఁ బెట్టఁ, గలరు కన్నులఁ బోలుచుఁ గానఁగలరు
రోదసిని బోలి యుదక స్వరూప మీయఁ, గలరు బాహువులంబోలి బలదు లహహ! ॥ 445

† ఋషి విశేషవిషయములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము 1వ. సూక్తము ఋషి కిచ్చిన పుట్నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

(6) గీ॥ అశ్వులార! యిట్టి యఖిల స్తవంబులు, మిమ్ముఁ బొందనుండ మీరు ప్రీతి
యంత్ర తీక్ష్ణమైన యసులవలెన్ వాని, తీక్ష్ణములగఁ జేయఁ దెన్ను గనుఁడు! ॥ 446

(7) గీ॥ అశ్వులార! మీకు నధికసంతోషంబు, కలుఁగ జేయ నెంచి గౌరవమున
గృత్సమౌనివరలు కీర్తించుచున్నారు, నుతుల మిమ్ము మంత్రతతులవలన ॥ 447

(8) క॥ నుతు లన్నియు మీ దయచే, సతతము జనియించుఁగాక! సత్య స్తుతులన్
సుతతతిఁ బౌత్రులఁ గూడుచు, నతిభక్తిం జేయఁగల్గుఁ డశ్విద్వయమా! ॥ 448

## సూక్తమ్—41

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః *

దేవతా—సోమాపూషణౌ, 6—(అన్త్యార్ధర్చస్య) అదితిః

ఛందః—త్రిష్టుప్

(1) సోమాపూషణా జననా రయీణాం జననా దివో జననా పృథివ్యాః ।
జాతౌ విశ్వస్య భువనస్య గోపౌ దేవా[1] అకృణ్వన్నమృతస్య నాభిమ్ ॥ 405

(2) ఇమౌ దేవౌ జాయమానౌ జుషన్తేమౌ తమాంసి గూహతామజుష్టా ।
ఆభ్యామిన్ద్రః పక్వమామాస్వన్తః సోమాపూషభ్యాం జనదుస్రియాసు ॥ 406

* గృత్సమద ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వా సూక్తము ఋషి విషయకమైన ఫుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును. వ.గో.కృ.

1. దేవాఃఅకృణ్వన్నమృతస్య. (వ్రా.ప్ర.)

(3) సోమాపూషణా రజసో విమానం సప్తచక్రం రథమవిశ్వమిన్వమ్ ।

విషూవృతం మనసా యుజ్యమానం తం జిన్వథో వృషణా పంచరశ్మిమ్ ॥ 407

(4) దివ్యఁన్యః సదనం చక్ర[1] ఉచ్చా పృథివ్యామన్యో[2] అధ్యన్తరిక్షే ।

తావస్మభ్యం పురువారం పురుక్షుం రాయస్పోషం వి ష్యతాం నాభిమస్మే ॥ 408

(5) విశ్వాన్యన్యో భువనా జజాన విశ్వమన్యో[3] అభిచక్షాణ ఏతి ।

సోమాపూషణావవతం ధియం మే యువాభ్యాం విశ్వాః పృతనా జయేమ ॥ 409

(6) ధియం పూషా జిన్వతు విశ్వమిన్వో రయిం సోమో రయిపతిర్దధాతు ।

అవతు దేవ్యదితిరనర్వా బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 410

1. చక్రఽ ఉచ్చా, 2. మనోఽ అధ్యన్తరిక్షే, 3. విశ్వమన్యోఽ అభిచక్షాణఽ ఏతి, (వ్రా.ప్ర.)

## సూక్తము—41

### ఋషి—గృత్సమదుఁడు †

### దేవత—సోముఁడు, పూష, 6 - ఉత్తరార్థమునకు - అదితి *

(1) క॥ ఘనుఁడవగు సోమ! పూషుఁడ!, ధనమునకున్ జనకు లీరు ధరణికి మీరే!
జనకులు ద్యో లోకమునకు, జనకులుగా వెలుఁగుచుంద్రు జగములు మెచ్చన్ ॥ 449

గీ॥ మీరు పుట్టుటచే సోమ! మెఱయు పూష!, సముదయ జగత్తు లన్నియు సంతసిల్లె
నమర గణములు మీకయి యమరత్వ, మందఁజేయంగ హేతువు లగుదురుగద! ॥ 450

(2) చ॥ జగమున సోమ పూషలు సుజన్మము నొందఁగ దేవ సంతతుల్
తగునటు వారలం దనిపె తద్దయుఁ జీఁకటులన్ హరింపరే!
మగఁటిమిఁ బూని వాసవుఁడు మానుగ గోవుల పాలఁ దీయఁడే!
సొగసగు సోమ పూషకుఁడు సొంపు నుతింపఁగ శక్యమేగదా! ॥ 451

(3) గీ॥ సకల జగములఁ గొలువంగఁ జాలునట్టి, సప్త రశ్మి విశిష్టమై జరుగునట్టి
తలఁచి నంతనె ధరణిపై మెలఁగునట్టి, రథము పంపుఁడు! మీరలు రాజులార! ॥ 452

గీ॥ విశ్వకర్తృకమై చాల వెలయునట్టి, యంతటన్ వర్తమానమై యలరునట్టి
పంచ రశ్మి విశిష్టమై పరగునట్టి, రథము పంపుఁడు మీరలు రాజులార! ॥ 453

(4,5) సీ॥ ఒకఁడు పూషుం డొచు నున్నత దివమునఁ గల గృహంబునఁ దాను మెలఁగుచుండు!
నొకఁడు సోముండయి సకల భూమ్యంతరిక్షంబునందు వసించి గ్రాలుచుండు!
నొకఁడు సోముండుగా నుత్పన్నుఁ డగుచుండి నంతయుఁ బుట్టంగ ననుపుచుండు!
నొకఁడు పూషుండయి యకళంకతన్ వెల్గి చోద్యమౌ జగమును జూఁచుచుండు!
గీ॥ నిరువురును గీర్తివంతులై కరము కర్మ. జాల సంరక్షకులు మహా చారుమతులు
పుత్ర పౌత్రులఁ గిలిఁగింపఁ బూనఁగలరు, సోమపూషలు మిక్కిలి సూక్ష్మమతులు ॥ 454

† ఋషి విషయ విశేషములకై యాంధ్రానువాదము ద్వితీయ మండలము తెలుగు 1వ సూక్తము ఋషి విషయకమైన పుట్‌నోటు (657వ. పుట.) చూఁడనగును వ.గో.కృ.

* ఈ సూక్త మందలి ఆరవ ఋక్కు నుత్తరార్ధమున నదితి దేవతగా సంస్కృత మూలమునను భాష్యములలోను జేర్కొనఁబడెను. ఆంధ్రానువాదములో (వ్రాతప్రతి. 8వ సంపుటము. 9వ. పుట) దేవతలను జేర్కొనుటలో నీ విషయము ప్రస్తావింపనే లేదు. కాని (455) పద్యమున నదితి దేవత ప్రసక్తి కలదు, శ్రీనేమానివారు స్వయముగా వ్రాసిన ఋషి దేవతల పట్టిక గల 15b సంపుటములో 40వ సూక్తమునకు సోముఁడు, పూష, అదితి దేవత లని సాధారణముగా వ్రాయఁబడెను. కావున నిట నదితి దేవతను జేర్చుట జరిగినది. వ.గో.కృ.

(6) గీ॥ పూషకర్మ తృప్తిఁ బొందించి ధనపతి, సోముఁ డధికధనము శోభ నొసఁగు
నదితి శత్రువులను నందఱ హరియించు. స్తుతుల నేను యజ్ఞతతు లొనర్తు ॥ 456

## సూక్తమ్—42

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—1-2-వాయుః; 3-ఇంద్రవాయూ: 4-6 మిత్రావరుణౌ; 7-9-అశ్వినౌ;

10-12-ఇన్ద్రః; 13-15 విశ్వే దేవాః: 16-18-సరస్వతీ;

19-21 ద్యావాపృథివ్యౌ హవిర్ధానే వాః (19 తృతీయపాదస్య అగ్నిర్వా)

ఛందః—గాయత్రీ; 13-17-అనుష్టుప్; 18-బృహతీ

(1) వాయో యే తే సహస్రిణో రథాసస్తేభిరా గహి ।
నియుత్వాన్ త్సోమపీతయే ॥ 411

(2) నియుత్వాన్ వాయవా గహ్యయం శుక్రో[1] అయామి తే ।
గన్తాసి సున్వతో గృహమ్ ॥ 412

(3) శుక్రస్యాద్య గవాశిర[2] ఇన్ద్రవాయూ నియుత్వతః ।
ఆ యాతం పిబతం నరా ॥ 413

---

† గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ. పుట) చూడఁదగును. వ.గో.కృ.

1. శుక్రోఽయామి, 2. శిరఽ ఇన్ద్రవాయూ, (బ్రా.ప్ర.)

(4) అయం వాం మిత్రావరుణా సుతః సోమ[1] ఋతావృధా ।

మమేదిహ శ్రుతం హవమ్ ॥ 414

(5) రాజానావనభిద్రుహా ధ్రువే సదస్యుత్తమే ।

సహస్రస్థూణ[2] ఆసాతే ॥ 415

(6) తా సమ్రాజా ఘృతాసుతీ[3] ఆదిత్యా దానునస్పతీ ।

సచేతే అనవహ్వరమ్ ॥ 416

(7) గోమదూ షు నాసత్యా[4] ఽశ్వావద్ యాతమశ్వినా ।

వర్తీ రుద్రా నృపాయ్యమ్ ॥ 417

(8) న యత్ పరో నాన్తర[5] ఆదధర్షద్ వృషణ్వసూ ।

దుఃశంసో మర్త్యో రిపుః ॥ 418

---

1. సోమఽఋతావృధా, 2. సహస్రస్థూణఽఆసాతే, 3. ఘృతాసుతీఽఆదిత్యా, 4. నాసత్యాఽశ్వావద్,

5. అన్తరఽఆదధర్షద్, (వా.ప్ర.)

(9) తా న[1] ఆ వోళ్హమశ్వినా రయిం పిశంగసందృశమ్ ।
ధిష్ణ్యా వరివోవిదమ్ ॥ 419

(10) ఇన్ద్రో[2] అంగ మహద్ భయమభీ షదప చుచ్యవత్ ।
స హి స్థిరో విచర్షణిః ॥ 420

(11) ఇన్ద్రశ్చ మృళయాతి నో న నః పశ్చాదఘం నశత్ ।
భద్రం భవాతి నః పురః ॥ 421

(12) ఇన్ద్ర[3] ఆశాభ్యస్పరి సర్వాభ్యో[4] అభయం కరత్ ।
జేతా శత్రూన్ విచర్షణిః ॥ 422

(13) విశ్వే దేవాస[5] ఆ గత శృణుతా మ[6] ఇమం హవమ్ ।
ఏదం బర్హిర్ని షీదత ॥ 423

1. నః ఆ వోళహ, 2. ఇన్ద్రోః అంగ, 3. ఇన్ద్రః ఆశాభ్యస్పరి, 4. సర్వాభ్యోః అభయం, 5. దేవాసః ఆ, 6. మః ఇమం (వ్రా.ప్ర.)

(14) తీవ్రో వో మధుమాగ్ం[1] అయం శునహోత్రేషు మత్సరః ।

ఏతం పిబత కామ్యమ్ ॥ 424

(15) ఇన్ద్రజ్యేష్ఠా మరుద్గణా దేవాసః పూషరాతయః ।

విశ్వే మమ శ్రుతా హవమ్ ॥ 425

(16) అమ్బితమే నదీతమే దేవితమే సరస్వతి ।

అప్రశస్తా[2] ఇవ స్మసి ప్రశస్తిమమ్బ నస్కృధి ॥ 426

(17) త్వే విశ్వా సరస్వతి శ్రితాయూంషి దేవ్యామ్ ।

శునహోత్రేషు మత్స్వ ప్రజాం దేవి దిదిడ్ఢి నః ॥ 427

(18) ఇమా బ్రహ్మ సరస్వతి జుషస్వ వాజినీవతి ।

యా తే మన్మ గృత్సమదా[3] ఋతావరి ప్రియా దేవేషు జుహ్వతి ॥ 428

(19) ప్రేతాం యజ్ఞస్య శంభువా యువామిదా వృణీమహే ।

అగ్నిం చ హవ్యవాహనమ్ ॥ 429

---

1. మధుమాగ్ం ఽయం, 2. అప్రశస్తా ఽ ఇవ, 3. గృత్సమదా ఽ ఋతా (వ్రా.ప్ర.)

(20) ద్యావా నః పృథివీ[1] ఇమం సిధ్రమద్య దివిస్పృశమ్ ।

యజ్ఞం దేవేషు యచ్ఛతామ్ ॥ 430

(21) ఆ వాముపస్థమద్రుహా దేవాః సీదన్తు యజ్ఞియాః ।

ఇహాద్య సోమపీతయే ॥ 431

## సూక్తము—42

### ఋషి—గృత్సమదుఁడు †

దేవత—1, 2—వాయువు, 3—ఇంద్ర వాయువులు, 4-5-6—మిత్రా వరుణులు,

7, 8, 9—అశ్విద్వయము, 10, 11, 12—ఇంద్రుఁడు. 13, 14, 15—విశ్వదేవగణము

16, 17, 18—సరస్వతి, 19, 20, 21—ద్యావాపృథివులు

(1,2,3 సీ॥ వాయు దేవుఁడనియుఁ ద్వరముతో వేలగు రథములపై నెక్కి రాణ రమ్మ!
4,5,6) వాయువా! దీప్తితో వర్ధిల్లుచున్ నీవు యజమానవ సతికి నహుగఁదెమ్ము!
గ్రాలు వాయువ! నియుద్గణముతో సరిగూడి గవ్యమిశ్రితమును గనఁగ రండు!
మిత్రావరుణులార! మేలగు సోమంబు గల చది వీక్షింపఁ గదలి రండు!
‡ గీ॥ శత్రుశూన్యులై స్తంభ శతకములను, వెలయు నట్టాలికలయందు విశ్రమించి
యకుటిలాచార యజమాన యజ్ఞకర్మ, లందుఁ జేసెడు సేవల నొంద రండు! ॥ 456

1. పృథివీః ఇమం (వ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ. సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

‡ స్తంభ శతాట్టాలికలు—ఆర్యులు దేశ ద్రిమ్మరులనియుఁ జిన్నచిన్న గుడిసెలలో నివసించువారనియు వ్రాసిన పాశ్చాత్యులీ శత స్తంభాట్టాలికల సంగతి మరచిరి కాఁబోలు. ఇట్టి ప్రాసాదములు గలవారు శ్రీమంతులు గాని దరిద్రులు కానేరరు. ఆ వేదార్యులెంత శిల్పులో యిట్టి గృహరాజ నిర్మాణమునుబట్టి దెలిసికొనఁదగును. (నే పేం.న.శా.)

(7) గీ॥ యజ్ఞ నేతలు దేనిని నందఁగలరొ?, యట్టి సోమము ధైస్వశ్వయుత మెసర్చి
యశ్వియుగ్మమ! రథముపై నద్ది యునిచి, వచ్చి మా సంస్తవంబుల మెచ్చుఁ డీరు॥ 457

(8) గీ॥ దూరమందు వసించెడు దుష్టుఁ డైనఁ, జెంత నుండెడు నట్టి యే చెనటియైన
నుపహరింపంగ లేనట్టి యర్థమెల్ల, నస్మదాదుల కీయుఁడో యశ్వులార! ॥ 458

(9) గీ॥ మతిమదశ్వులార! మాకు నానా రూప, మైన యట్టి ధనద మైనయట్టి
ధనము తెచ్చి మీరు తప్పక యిచ్చుచు, వెడలి పోవరాదె! వేల్పులార! ॥ 459

(10,11 సీ॥ అధికుఁడైన మహేంద్రుఁ డరిభయంబును గొట్టి స్థిరుఁ డౌచు శోభలఁ జెందఁగలుఁగు
12,13,14) నింద్రుండు సౌఖ్యము నిచ్చినచో మహా పాపముల్ మా వెంటఁ బడకనుండుఁ
బ్రజ్ఞ కల్గిన హరి పరులను నిర్జించి నిర్భయంబును జేయ నేర్వఁగలఁడు
విశ్వదేవత లంత విలసిల్లు ధర్భపై నధివసించుచు సౌఖ్య మందఁగలరు
గీ॥ వారు మదవంతులై రసవంతు లగుచు, గృత్సమద నికట మందున్న కీర్తనీయ
సోమమును గ్రోలి రమణీయ శోభఁజెంది, వెలయుచుందురు జగమున వివిధగతుల ॥ 460

(15) క॥ ఎవ్వరి కింద్రుం డిష్టుఁడొ?, యెవ్వరికిం బూషదేవుఁ డిచ్చునొ? ధన మిం
కెవ్వరు మంగళకరులో?, య వ్విధ దేవతల నెల్ల నాహ్వానింతున్ ॥ 461

(16) గీ॥ మాతృగణమున విఖ్యాత మాత వీవు!, దేవ గణములలోపల దేవి వీవు!
నదులలో నుత్తమోత్తమ నదివి నీవె!, యో సరస్వతి! యభివృద్ధి నొసఁగుమమ్మ! ॥ 462

గీ॥ అంతటంగల్గు నసమృద్ధి ననుసరించి, మెసవుచున్నాము మే మెల్ల మిగుల భక్తి
నో సరస్వతి! యభివృద్ధి నొసఁగునట్టి, సుస్వరూపము నొందు మస్తోక మతిని ॥ 463

(17,18) సీ॥ ద్యుతిమత్సరస్వతి! తోరంపు టన్నమ్ము ని న్నాశ్రయించుచు నెఱ వెలుంగు!
శునహోత్ర గణ మిచ్చు సోమంబుఁ జవిఁజూచి దీప్త రక్షక వౌచుఁ దృప్తినొందు!
పూజ్యులౌ పుత్రులఁ బూజ్యులౌ పౌత్రుల నస్మదాదుల కీయ నాత్మఁదలఁపు!
హవ్యాదులం బొంద నంతటం బోవుచు నన్నోదకంబుల నందనిమ్ము!
గీ॥ మాననీయచరిత్ర! యో మాన్యురాల!, దేవతాగణహితురాల! దివ్యతేజ!
యస్మదీయ స్తవంబుల నాలకించి, కర్మనంతయుఁ జూఁడంగఁ గదలి రమ్ము! ॥ 464

(19) గీ॥ రోదసీద్వయంబః మీ దయచేతనే, సవనకర్మ లెల్ల జరుగుచుండుః
హవ్యవాహః పిలుపు నాలింపఁగా వచ్చి, హవ్యములను నెల్ల నందుకొనుము ॥ 465

(20,21) గీ॥ రోదసీద్వయంబః మీ దయచేతనే, సాధ్య మగుచునుండు స్వర్గసుఖము
దివ్య గణముతోడఁ దివిరి మీరీ యిష్టి, విశ్రమింప రారెః వేల్పులారః ॥ 466

## సూక్తమ్—43

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—శకున్తః (కపింజలరూపీన్ద్రః)

ఛందః—త్రిష్టుప్

(1) కనిక్రదజ్జనుషం ప్రబ్రువాణ[1] ఇయర్తి వాచమరితేవ నావమ్ ।
సుమంగలశ్చ శకునే భవాసి మా త్వా కా చిదభిభా విశ్వ్యా విదత్ ॥ 432

(2) మా త్వా శ్యేన[2] ఉద్ వధీన్మా సుపర్ణో మా త్వా విదదిషుమాన్ వీరో[3] అస్తా ।
పిత్ర్యామను ప్రదిశం కనిక్రదత్ సుమంగలో భద్రవాదీ వదేహ ॥ 433

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్‌నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. ప్రబ్రువాణఽ ఇయర్తి, 2. శ్యేనాఽ ఉద్, 3. వీరోఽ అస్తా, (బ్రా.ప్ర.)

(3) అవ క్రన్ద దక్షిణతో గృహాణాం సుమంగలో భద్రవాదీ శకున్తే ।

మా నః స్తేన[1] ఈశత మాఘశంసో బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 434

## సూక్తము—43

ఋషి—గృత్సమదుఁడు†

దేవత—కపింజలరూపియగు నింద్రుఁడు

(1) చ॥ జరిగెడు కార్యముం దెలుపు శబ్దము మెల్లఁగ నుచ్చరించుచున్
సురుచిర కర్ణ ధారకుఁడు సుందర నౌకను ద్రోయునట్లు నీ
సరస వచో విలాసమును జల్లఁగఁ బంపెదవో కపింజలా!
స్థిర మగు మంగళంబు నినుఁ జేరుసుగాక! సమస్త దిక్కులన్ ॥ 467

(2) క॥ శ్యేనము సువర్ణ పక్షియుఁ, బూనికతో నిన్నుఁ జంపఁబూనవు శకునీ!
ధానుష్కుఁడు నినుఁ గొట్టఁడు, మానుగ శబ్దంబుఁ జేయ మఱవకు! పక్షీ! ॥ 468

(3) ఉ॥ మంగళ సూచకుండవయి మాకుఁ బ్రియంబును నీవు పల్కుచున్
రంగగు నింటి దక్షిణపు రమ్య దిశన్ వసియించియున్నచో
దొంగలు దుష్టకార్యకరధూర్తలు పక్షిరో! మమ్ము నేమి చే
యంగలవారు? మేము కడు యజ్ఞములన్ నుతులన్ వచింపమే! ॥ 469

1. స్తేనఈశత (బ్రా.ప్ర.)

† ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన ఫుట్‌నోటు (657వ పుట) చూడవలెను. వ.గో.కృ.

## సూక్తమ్—44

ఋషిః—గృత్సమద (ఆంగిరసః శౌనహోత్రః పశ్చాద్) భార్గవః శౌనకః*

దేవతా—శకున్తః (కపింజలరూపీన్ద్రః)

ఛందః—జగతీ; 2—అతిశక్వరీ, అష్టిర్వా

(1) ప్రదక్షిణిదభి గృణన్తి కారవో వయో వదన్త[1] ఋతుథా శకున్తయః ।
ఉభే వాచౌ వదతి సామగా[2] ఇవ గాయత్రం చ త్రైష్టుభం చాను రాజతి ॥ 435

(2) ఉద్గాతేవ శకునే సామ గాయసి బ్రహ్మపుత్ర[3] ఇవ సవనేషు శంససి ।
వృషేవ వాజీ శిశుమతీరపీత్యా సర్వతో నః శకునే భద్రమా వద
విశ్వతో నః శకునే పుణ్యమా వద ॥ 436

(3) ఆవదంస్త్వం శకునే భద్రమా వద తూష్ణీమాసీనః సుమతిం చికిద్ధి నః ।
యదుత్పతన్ వదసి కర్కరిర్యథా బృహద్ వదేమ విదథే సువీరాః ॥ 437

* గృత్సమద ఋషి విశేష విషయములకై ద్వితీయ మండలము తెలుఁగు 1వ సూక్తము ఋషి కిచ్చిన పుట్ నోటు (657వ పుట) చూఁడనగును. వ.గో.కృ.

1. వదన్తఽ ఋతు, 2. సామగాఽ ఇవ, 3. బ్రహ్మపుత్రఽఇవ (వా.ప్ర.)

†(4) భద్రం వద దక్షిణతో భద్రముత్తరతో వద ।

భద్రం పురస్తాన్నో వద భద్రం పశ్చాత్ కపింజల ॥ 438

*(5) భద్రమధస్తాన్నో వద భద్రముపరిష్టాన్నో వద ।

భద్రంభద్రం న ఆ వద భద్రం నః సర్వతో వద ॥ 439

*(6) భద్రం వద పుత్రైర్భద్రం వద గృహేషు చ ।

భద్రమస్మాకం నో వద భద్రం నో అభయం వద ॥ 440

(7) అసపత్నః పురస్తాన్నః శివం దక్షిణతస్కృధి ।

అభయం సతతం పశ్చాద్ భద్రముత్తరతో గృహే ॥ 441

(8) యౌవనాని మహాయసి జిగ్యుషామివ దుందుభిః ।

శకుంతక ప్రదక్షిణం శతపత్రాభి నో వద ॥ 442

† ద్వితీయ మండలమందలి యీ 44వ సూక్తమునఁ గొన్ని వ్రాతప్రతులలో 4 మొదలు 8 వరకుఁగల యైదు ఋక్కు అధికముగాఁ గలవు. ఈ ఋక్కులను బరిశిష్టములని కొందరు - ఖిల మంత్రములని కొందరు - అధిక పాఠములని మరి కొందరును నెంచఁగా వేరొకకొందరు ప్రక్షిప్తములుగా నెన్నిరి. కాని తొలుతఁ బరిగృహీతమైన యీ సూక్తమున మూఁడే మూఁడు ఋక్కులుండుట గమనార్హము. వ.గో.కృ.

* కొన్ని ప్రతులలో నీ 5-6 ఋక్కులు ముందువెనుకలుగా ననఁగా 5వ ఋక్కు 6వ ఋక్కుగను, 6వ ఋక్కు 5వ ఋక్కుగను వ్యత్యస్తములుగా నున్నవి. వ.గో.కృ.

